## కొడవటిగంటి కుటుంబరావు

## వ్యాసప్రపంచం - 6

# రాజకీయ వ్యాసాలు

కూర్పు

కృష్ణాబాయి, ప్రసాద్




విప్లవ రచయితల సంఘం
ఆంధ్రప్రదేశ్

**కొడవటిగంటి కుటుంబరావు**

వ్యాసప్రపంచం - 6

# రాజకీయ వ్యాసాలు



ప్రచురణ

**విప్లవ రచయితల సంఘం**

ఆంధ్రప్రదేశ్

మొదటి ముద్రణ

సెప్టెంబరు 2001

వెల 150/-

కవర్ డిజైన్

మోహన్

కంపోజింగ్

అనల

హైదరాబాద్

ముద్రణ

నాగేంద్ర ప్రెస్, విజయవాడ ఫోన్ 432077, 665827

సోల్ డిస్ట్రిబ్యూషన్

నవోదయ బుక్ హౌస్

కాచిగూడ,హైదరాబాద్

# కృతజ్ఞతలు

సారస్వత నికేతనం, వేటపాలెం
గౌతమి గ్రంధాలయం, రాజమండ్రి
భ్రమరాంబ గ్రంధాలయం, విజయవాడ
ఆంధ్రమహిళాసభ, మద్రాసు
ఆయా పత్రికల వారికి
కె వి ఆర్, వి సుబ్రహ్మణ్యం, కావలి
వెలగా వెంకటప్పయ్య, తెనాలి
లంకా సూర్యనారాయణ, గుంటూరు

| | |
|---|---|
| దాసరి సుబ్రహ్మణ్యం<br>కాకరాల | మద్రాసు |

కాత్యాయనీ విద్మహే, వరంగల్లు

| | |
|---|---|
| చలసాని ప్రసాదరావు<br>కేతు విశ్వనాథరెడ్డి<br>ఎన్ వేణుగోపాల్<br>శివలక్ష్మి<br>వసంతలక్ష్మి<br>బి జగన్<br>వాసిరెడ్డి వేణుగోపాల్ | హైదరాబాదు |
| ఆండ్ర శేషగిరిరావు<br>స్థానాపతి రుక్మిణమ్మ<br>అత్తలూరి నరసింహారావు<br>మసూనా | విశాఖపట్నం |

★ ఈ వ్యాసాల సేకరణలో ఎంతో ఓపికతో తోడ్పడిన సజ్జా వెంకటేశ్వర్లు, వేటపాలెం
★ సన్నిధానం నరసింహ శర్మ, రాజమండ్రి
★ కంపోజింగ్‌లో మాకు సహకరించిన అనల
★ ప్రెస్ కాపీ తయారీలో పూనిక వహించిన బి టి రామానుజం, ఐ సురేష్, విశాఖ విరసం వర్మ
★ కొడవటిగంటి వరూధిని గారి సౌజన్యానికి ప్రత్యేక కృతజ్ఞతలు

# కొకు వ్యాస ప్రపంచం

* 1) సైన్సు వ్యాసాలు - మొదటి ముద్రణ - జనవరి 1989
రెండవ ముద్రణ - జనవరి 1997

* 2) చరిత్ర వ్యాసాలు - అక్టోబర్ 1999

* 3) సంస్కృతి వ్యాసాలు - అక్టోబర్ 1999

* 4) సినిమా వ్యాసాలు 1, 2 భాగాలు - డిసెంబరు 2000

* 5) సాహిత్యవ్యాసాలు - మే 2001

* 6) రాజకీయ వ్యాసాలు - ఆగస్టు 2001

7) తాత్విక వ్యాసాలు

8) లేఖలు

---

* అచ్చు అయినవి

# రాజకీయాలు ఎవరికి ?

'రచయితలకి రాజకీయాలెందుకు ?' అనేవారు ఒకప్పుడు అసెంబ్లీ దర్బారులో ఆకుపచ్చని సీట్లు ఇబ్బడి ముబ్బడిగా రాగానే (అక్టోబరు '99) మన ముఖ్యమంత్రి నారాగారు 'అయిదేళ్ళదాకా ఇక రాజకీయాలు మాట్లాడన'ని సెలవిచ్చారు ఇలాంటివాళ్ళకి రాజకీయాలంటే 'దొంగనోట్లూ' 'దొంగఓట్లూ'ను అయితే సమాజంలో రాజకీయాలకి చాలా కీలకమైన స్థానం వుంది ఎందుకంటే మనది అక్షరాలా 'అసమ-దోపిడీ వర్గ' సమాజం విశ్వాసాలూ, ఆచారాలూ, చివరికి కళలు కూడా దీన్ని ఆశ్రయించే ఉంటాయి అందువలన ప్రతి ఒక్కరికీ రాజకీయ అవగాహన అవశ్యం ఉండాలి ఇందుకు రచయితలు మినహాయింపు కాదు

ఈ దేశం ఎవరిది ? ఇది ఆర్యావర్తమేనా ? ఆర్యులు ఇక్కడి వారేనా ? ఎక్కడినుంచి వచ్చారు ? 'హిందూ' అనే శబ్దం మధ్యయుగాలకి ముందు ఉందా ? ఇక్కడ ఎన్నిరకాల సంస్కృతులు విలసిల్లాయి ? జ్ఞానం, శీలం, ఏకత అనేవి ఏకశిలా సదృశాలా ? చారిత్రక సాంస్కృతిక రంగాల్లో జవాబులు రాబట్టవలసిన ఈ ప్రశ్నలు తాజాగా రాజకీయ రచ్చలోకి చొచ్చుకుని మరీ వచ్చాయి అందువలన రాజకీయాలు మరింత రంజుగా ఉంటున్నాయి ఈ ఉచ్చులోంచి ఇవాళ ఎవరం తప్పించుకోలేం సంస్కృతిని గతం అనే చేటతో చెరిగి, మతం అనే జల్లెడతో జల్లిస్తున్నారు ఇవాళ మన దేశంలో జరుగుతున్నవివే వీటన్నిటినీ ఇలా ఉంచితే, ఏ రాజకీయ వ్యవస్థకైనా అసలు పునాది ఆర్థికమే నంటుంది మార్క్సిజం కనక రాజకీయాలు, ఆర్థికం పడుగూ, పేకల్లా పెనవేసుకుపోతాయి ఈ రెంటినీ కలిపే చూడాలిగాని కృతకంగా విడదీయకూడదు ఒకవేళ అలా విడదీస్తే జీవితం మరింత దుర్గమారణ్యంగా కనిపిస్తుంది రాజకీయాలు నిత్యజీవితానికి సంబంధించినవి అందాకా ఎందుకు ? ఇవాళ తిండీ, బట్టా, ఇల్లు కూడా రాజకీయాలతోనే ముడివడి వున్నాయి ఉదాహరణకి 'నేటి రాజకీయాలు' (అధ్యాయం XI) లో 'తిండిగింజలూ - పెట్రోలూ' అనే వ్యాసం చదవండి 'అసలు అన్ని నాగరికతలకీ మూలమే తిండిగింజలు ఆహారధాన్యాలకు కీలకం అభివృద్ధి చెందిన దేశాలు పెట్రోలుకి కీలకం వెనకబడిన దేశాలు మానవజాతి 'మోటారుకార' నాగరికత ద్వారా తప్ప పురోగమించదని ఎక్కడాలేదు 'మోటారుకారు' నాగరికత వేలసంఖ్యలో బలి తీసుకుంటున్నది ' ఇలాంటి కీలకమైన అంశాలెన్నిటినో కొడవటిగంటి కుటుంబరావుగారు ఈ వ్యాసంలో విశ్లేషించారు ఇవాళ రాజకీయం కానిదంటూ ఏమీ మిగల్లేదు ఆ మాటకొస్తే మన పాలకులు మిగల్చలేదు వాళ్ళ లెక్కల ప్రకారమే మనదేశంలో ముప్పైశాతం దారిద్ర్యరేఖకి దిగువన ఉన్నారు

ఈ నేపథ్యం నుంచీ మాత్రమే ఈ వ్యాసాలు మనకి మరింత అర్థవంతంగా కనిపిస్తాయి ఇవి నాలుగు దశాబ్దాల పాటు ('41-'80) రాసినవి ఇందులోని మొట్టమొదటి వ్యాసం (8-10-'41) రాసేనాటికి రెండో ప్రపంచ యుద్ధం మొదలై రెండేళ్ళయింది రెండో ప్రపంచ యుద్ధానికి మూలం మొదటి ప్రపంచ యుద్ధమే ఏ

వర్సైల్సు శాంతిసంధితో మొదటి ప్రపంచయుద్ధం ముగిసిందని మురిసిపోయామో, ఆ శాంతి సంధిలోని షరతులే రెండో ప్రపంచ యుద్ధానికి దారితీశాయి

పాతసంధులు పాతిపెట్టుము

యుద్ధముల కవి ఉనికిపట్టులు

అని అందుకే అన్నాడు గురజాడ కనక రెండు ప్రపంచ యుద్ధాల మధ్య విరామ సమయాన్ని నిశితంగా పరిశీలించి, విశ్లేషించకపోతే మనకి రాజకీయ జీవనాడి దొరకదు

రాజకీయంగా 20వ శతాబ్దం లెనిన్‌ది ఈ యుగ స్వభావం సామ్రాజ్యవాదం సామ్రాజ్యవాదం అంటేనే యుద్ధం అని కూడా చెప్పాడు లెనిన్ అంతటితో ఆగలేదు ఈ సామ్రాజ్యవాదం ఏవో కొన్ని దేశాలు యాదృచ్ఛికంగా అవలంబించిన విధానం కాదనీ, పెట్టుబడిదారీ వ్యవస్థ అంచెలంచెలుగా ఈ అవసానదశకి చేరుకుందని రుజువు చేసినవాడు లెనిన్ ఇది రష్యా విప్లవానికి ముందు సంగతే సామ్రాజ్యవాద దేశాలు వలసల వేటలో పోటీపడ్డాయి

పోటీపడి కాటులాడ

పుడమి చాలలేదు

వాళ్ళకి

దీని ఫలితమే మొదటి ప్రపంచయుద్ధం గెలుపు ఇంగ్లండు, ఫ్రాన్సులది, చావుదెబ్బ తిన్నదేమో జర్మనీ అందుకనే వర్సైయిల్స్ శాంతిసంధి మీద దానిచేత మెడలు వంచి మరీ సంతకాలు చేయించారు ఇందువల్ల దీనిని 'Dictated Peace' నిర్దేశించిన శాంతి అన్నారు కొందరు చరిత్రకారులు ఈ ఒప్పందంలోని షరతుల ఫలితంగా ఇంగ్లండు, ఫ్రాన్సులకి పెద్ద మొత్తం అప్పు పడింది జర్మనీ ఆ అప్పు తీర్చడంకోసం అమెరికా దగ్గర మళ్ళీ అప్పు చేసింది జర్మనీ ఆర్థికవ్యవస్థ కోలుకోలేనంతగా ఛిన్నాభిన్నమై పోయింది ఈ దేశాలు ఇలా కొట్టుకుంటూంటే అటూ ఇటూ కూడా అప్పులిచ్చి వడ్డీగుంజి బాగా బలిసింది అమెరికా వీటన్నిటి ఫలితంగా ఆర్థిక సంక్షోభం - The Great Depression - ముంచుకొచ్చింది ఈ తాకిడి మనదేశానికి కూడా తగిలింది తన 'చదువు' నవలలో కుటుంబరావుగారు దీనిని మన కళ్ళక్కట్టారు ఆర్థిక సంక్షోభం వల్ల ఇంగ్లండు, ఫ్రాన్సులమీద జర్మనీలో పగ రగులుకుంది హిట్లరు కావాలని జాతి విద్వేషాన్ని రెచ్చగొట్టాడు తత్ఫలితంగా 1933 నాటికే జర్మనీకి హిట్లర్ నియంతయ్యాడు అంతకు ముందే ఇటలీలో ముసోలినీ గద్దె నెక్కాడు అప్పటిదాకా జర్మనీని అణగదొక్కిన ఇంగ్లండు ఫ్రాన్సులు, కోట్లకి పడగలెత్తిన అమెరికా కూడా ఫాసిజానికి పాలుపోసి పెంచాయి హిట్లరుతో కుమ్మక్కయి ఫాసిస్టు ఫ్రాంకోకి మద్దతిచ్చి, స్పెయిన్ అంతర్యుద్ధం లో రిపబ్లికన్ ప్రభుత్వాన్ని పొట్టన పెట్టుకున్నాయి సోవియట్ రష్యామీదకి హిట్లర్‌ని ఉసిగొల్పాయి ఈ పాపం పూర్తిగా 'ప్రజాస్వామ్య' దేశాలదే కాని హిట్లర్ అసలుకే ఎసరు పెట్టడానికి పూనుకున్నాడు ఇక అప్పుడు విధిలేక సెకండ్ ఫ్రంట్ ఓపెన్ చేసింది అమెరికా అక్షరాజ్యాలకి వ్యతిరేకంగా మిత్రరాజ్యాలు విజయం సాధించాయి ఈ విజయానికి ముఖ్య కారణాలు మూడు - రష్యా రక్త తర్పణం, అమెరికా ఆయుధ సామగ్రి,

ఇంగ్లీషువాళ్ళ ఊకదంపుడు ఉపన్యాసాలు కాని రెండో ప్రపంచయుద్ధం ముగిసిన మరుక్షణమే అంతర్జాతీయ ఘోరకలికి అంకురార్పణ జరిగింది ఎలాగంటే యూరప్‌లో ఓడిపోయిన ఫాసిజం అమెరికాకి వలస వెళ్లింది యుద్ధం ముగిశాక అంతర్జాతీయ రంగంలో ఇంగ్లాండుని తోసి రాజంది అమెరికా 'రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యం' అనేది రెండు ప్రపంచ యుద్ధాల మధ్యకాలంలోని సంగతి కాని ఆ తర్వాత బ్రిటిష్ సామ్రాజ్యవాద సింహం జూలు రాలిపోయింది తోక తెగిపోయింది కళ్ళు పూడిపోయాయి పళ్ళు వూడిపోయాయి భారత నావికా తిరుగుబాటుతో ఇక ఇక్కడ వాడి పప్పులుడకవని తేలిపోయింది అందుకని 'పంద్రాగస్టు' నాటకం ఆడాడు ఇంగ్లీషువాడు " మాయగాళ్ళల్లో కల్లా మాయగాడు అక్కడా అక్కడా చలాయించినట్టు ఇక్కడ కూడా కూలివెధవలు పెత్తనం చలాయిస్తారేమోనని అనుమానం తగిలింది అసలుకే మోసం వస్తుందేమోనని భయం కలిగింది వెంటనే సాటి షావుకార్లకి రాజ్యం అప్పజెప్పి చల్లగా తెరవెనక్కి జారుకున్నాడు గొప్ప మాయగాడు " అంటూ రావిశాస్త్రిగారు తెల్లవాడి మాయని తేటతెల్లం చేశారు (1961) మనదేశంలో ఎం ఎల్ పార్టీ పుట్టిన తర్వాత ఈ అంశం మళ్ళీ ఎజండా మీదకొచ్చింది దీనికే 'అధికార మార్పిడి' 'Transfer of Power' - అని పేరు పెట్టాడు చారుమజుందార్ ఈ బాణీలోనే పాడాడు చెరబండరాజు

ఆగష్టు పదిహేను మోసం గురించి చెప్పకపోతే
నాకు అన్నం సయించదు

ఇండియా నేలమీద ఇంగ్లాండుకి నూకలు చెల్లిపోయాయి అప్పుడు అశ్వరథ అంటూ రంగప్రవేశం చేసింది అమెరికా ఆ తర్వాత రెండేళ్ళకే అమెరికాకి చైనాలో చుక్కెదురయింది కొమింటాంగ్ పతనాన్నిగాని, జన చైనా ఆవిర్భావాన్ని గాని ఆపలేకపోయింది అమెరికా అదీగాక కొరియా యుద్ధం రగిలేనాటి వరకూ కూడా నెహ్రూగారు అమెరికా కొమ్మే కాసేవారు ట్రూమన్ స్వయంగా నెహ్రూగారికి కితాబు కూడా ఇచ్చాడు కొరియా యుద్ధంతో అమెరికా పస ఏమిటో బయటి ప్రపంచానికి తెలిసిపోయింది "అమెరికావాడు కొరియాతో తలగోక్కున్నాడ"ని చమత్కరించాడు శ్రీశ్రీ అప్పుడే నెహ్రూగారికీ కనువిప్పు కలిగింది ఆనాటినుంచీ నెహ్రూగారు రెండావుల దూడలాగా అమెరికా రష్యాల మధ్య నాటకమాడి తెలివిగా తన పబ్బం గడుపుకున్నారు తద్వారా ఈ దేశంలోని సంపన్న వర్గాలకి గట్టి పునాది ఏర్పరిచారు భార పరిశ్రమలన్నీ పబ్లిక్ సెక్టారు సామాన్యుల సొత్తుతో దీన్ని పెంచి పోషించారు భారీ పరిశ్రమలన్నీ ప్రైవేటు సెక్టారు ఇక్కడ లాభాలన్నీ షావుకార్లవి పబ్లిక్ సెక్టారుని దివాలా తీయించి చిట్టచివరికి వైట్ ఎలిఫెంట్‌గా తయారుచేశారు పరిశ్రమల (Consumer Industries) లోని లాభాలతో స్వదేశీ షావుకార్లు కోట్లకి పడగలెత్తారు గణాంక వివరాలు ఎక్కడైనా దొరుకుతాయి ఈ 'కుట్ర'ని కాళీపట్నం రామారావుగారు తన కథలో వెల్లడించారు (1972) ఆర్థికరంగంలో ఇలాంటి విధానాన్ని అవలంబించిన నెహ్రూగారు రాజకీయరంగంలో కూడా ఏమీ తక్కువ తినలేదు ఆయన వేసుకున్న ప్రజాస్వామ్యం ముసుగు కేరళలోని కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేయడంతో పటాపంచలై పోయింది ప్రజాతంత్రవాదులు చాలామంది నెహ్రూని తప్పు పట్టారు తనమీద వచ్చిన మచ్చని మాపు చేసుకోవడానికీ, భారత కమ్యూనిస్టుపార్టీ ప్రతిష్టని దెబ్బతీయడానికి

చైనాతో కావాలని తగవు తెచ్చుకున్నాడు ఈ తగవే ముదిరి ముదిరి సరిహద్దు యుద్ధానికి దారితీసింది అందాకా ఎందుకు ? అలనాడు తెలంగాణా పోరాటకాలంలో కూడా అంతే జరిగింది నైజాం నవాబు పీచమణచడానికే పోలీసు యాక్షన్‌కి దిగామని జనాన్ని నమ్మించి రైతాంగ విముక్తి ఉద్యమంమీద ఉక్కుపాదం మోపాడు నెహ్రూ ఎంతైనా మరి అపర చాణక్యుడు గద !

ఇరవయ్యో శతాబ్దం లెనిన్‌దని ఇంతకుముందే అనుకున్నాం సామ్రాజ్యవాదపు అనుపానులు ఆకళించుకుని, వాటిని విశదీకరించి, విశ్లేషించింది లెనినే అందుకే మార్క్సిజం - లెనినిజం అంటున్నాం అయితే ఆ సామ్రాజ్యవాదాన్ని ఎదిరించి, నిలిచి గెలిచింది చైనా దేశకాల పరిస్థితులకు నిర్దిష్టంగానూ, నిర్దుష్టంగాను కూడా మార్క్సిజాన్ని అన్వయించాలని ('నూతన ప్రజాస్వామ్యా'న్ని) సిద్ధాంతీకరించినవాడు మావో అందుకే మావో ఆలోచనా విధానం అని కూడా కలుపుతున్నాం అయితే సామ్రాజ్యవాదం అప్పుడు పేపర్ పులి, ఇప్పుడు - మరీ ముఖ్యంగా 1991 నాటి నుంచి- గ్లోబల్‌పులి

అయితే ఇరవయ్యో శతాబ్దంలోని అపజయాలని గురించి కూడా ఈ వ్యాసాల్లో కుటుంబరావుగారు ఎక్కువగానే రాశారు మావో లెక్కప్రకారం 1963 నాటికే రష్యాలో పెట్టుబడిదారీ విధానం పునరుద్ధరణ జరిగింది అయితే ఒకదేశంలో సోషలిజం సాధ్యమేనని రష్యా అనుభవమే నిరూపించింది దీనికి నాయకత్వం స్టాలిన్‌ది ఇక్కడే మంచిచెడ్డల్ని పరిశీలించవలసిన అవసరముంది ఉత్పత్తి శక్తులు (శ్రమజీవులు + సాధనాలు) కుందేలులా పరుగెడతాయి ఉత్పత్తి సంబంధాలు (మానవ సంబంధాలు + ఆస్తి సంబంధాలు) తాబేటినడక నడుస్తాయి ఏ సమాజంలోనైనా అటు ఉత్పత్తి శక్తులకీ, ఇటు ఉత్పత్తి సంబంధాలకి మధ్య సమన్వయం, సమతూకం ఉండాలి ఈ రెంటినీ కలిపి ఉత్పత్తి విధానం అంటాం సోషలిస్టు వ్యవస్థకి ఇదే కీలకం

రెండు ప్రపంచ యుద్ధాల మధ్య ఒకసారీ, రెండో ప్రపంచ యుద్ధం ముగిశాక మరోసారి కూడా రష్యాలో సోషలిజం నిర్మాణం జరిగిందని చూశాం అప్పటి ప్రపంచ పరిస్థితుల్ని కూడా మనం పూర్తిగా పరిగణనలోకి తీసుకోవలసి వుంటుంది మొదటి ప్రపంచయుద్ధం తర్వాత రష్యాలో సోషలిజం నిర్మాణం, ఎన్నెన్నో ఒత్తిళ్ళమధ్య కొనసాగవలసి వచ్చింది బోల్షివిక్ విప్లవ శిశువుని ఉయ్యాలలోనే హతమార్చాలని 14 పెట్టుబడిదారీ దేశాలు రష్యామీద పెద్ద పెట్టున దాడి చేశాయి కాని ఆ దాడిని తిప్పికొట్టగలిగింది రష్యా తీవ్రంగా కొనసాగిన అంతర్యుద్ధంలో తెల్ల బీభత్సానికి వ్యతిరేకంగా ఎర్రబీభత్సం అనివార్యం అయింది పెట్టుబడిదారీ ప్రపంచం ఆర్థిక సంక్షోభంలో కొట్టుమిట్టాడింది యూరప్ ఖండంలో ఫాసిజం పడగవిప్పింది అప్పుడు దేశదేశాల్లో స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకోసం, పౌరహక్కుల కోసం, మానవ హక్కులకోసం ప్రాణాలొడ్డి పోరాడింది కమ్యూనిస్టులే అంతేకాదు స్పెయిన్ అంతర్యుద్ధంలో, రిపబ్లికన్ ప్రభుత్వాన్ని నెత్తురుటేరుల్లో ముంచెత్తినప్పుడు ప్రపంచ వ్యాప్తంగా కమ్యూనిస్టు కవులూ, రచయితలూ, మేధావులూ, కళాకారులు తమ ప్రాణాలు తృణప్రాయంగా త్యాగం చేశారు ఇది రక్తాక్షరాల చరిత్ర సోషలిజం నిర్మాణానికి తొలిదశలోని నేపథ్యం ఇదీ అందువలన కొన్ని పొరపాట్లు దొర్లి వుండవచ్చు ఇది చారిత్రక అనివార్యత

రెండో ప్రపంచయుద్ధం ముగిశాక సోషలిజం పునర్నిర్మాణం జరిగింది ఇక్కడ దీని ప్రధాన లక్షణం వేగం ఈ వేగంవల్ల వర్గాలు మళ్ళీ మొలకెత్తాయేమోనని ఒక అభిప్రాయం దీన్ని సొంతం కొట్టిపారవేయలేం స్టాలిన్ మరణానంతరం, మరీ ముఖ్యంగా రష్యన్ కమ్యూనిస్టు పార్టీ 20వ కాంగ్రెసు తర్వాత అవలంబించిన రాజకీయ ఆర్థిక విధానాలు పెట్టుబడిదారీ విధానానికి దారితీశాయి ఈ లోపాలని సవరించి సోషలిజాన్ని సవ్యమైన పునాదిమీద నిర్మించే విశిష్ట ప్రయత్నమే చైనా సాంస్కృతిక విప్లవం అయిదువేల ఏళ్ళుగా 'వర్గసమాజం' మానవజాతిని పట్టి పీడిస్తున్న పెద్ద రోగం అందుకే శ్రీశ్రీ

యాభై శతాబ్దాల రోగం
ఇంతట్లోనే ఎలాగపోవడం ?

అన్నాడు ఈ రోగకారక క్రిములు పాతకాలపు భావాలు, సంస్కృతి, ఆచారాలూ, అలవాట్లూను కనక మానవ సమాజం మొత్తానికి కాయకల్ప చికిత్స చెయ్యాలి అందుకు ఒక సాంస్కృతిక విప్లవం మాత్రమే చాలదని అనుభవపూర్వకంగా చెప్పాడు మావో అందుకే కమ్యూనిస్టులు సొంతం కాడికింద పారెయ్యరు పైగా " All history is nothing but a continuous transformation of human nature" అన్నాడు మార్క్స్ - మానవ స్వభావాన్ని నిరంతరం పరివర్తన చెందించడమే చరిత్ర చరిత్ర యావత్తూ అంతే మరేం కాదు 'చారిత్రక విభాతసంధ్యల మానవ కథ వికాసం' కూడా అదే గడచిన శతాబ్దంలో రాజకీయ శక్తుల ప్రాబల్యం విపరీతంగా పెరిగింది అందుకే రాజకీయాలు మినహాయించి చూస్తే మనకి చరిత్ర అవగాహన కాదు కుటుంబరావుగారి రాజకీయ వ్యాసాలు ఏదో ఒక మేరకి ఆ లోటు తీరుస్తున్నాయని నమ్ముతున్నాం

ఈ వ్యాసాల నేపథ్యాన్నీ, తరువాయి పరిణామాల్ని అర్థం చేసుకోడానికి తోడ్పడుతుందని చిట్టచివర్లో కాలక్రమణిక పొందుపరుస్తున్నాం

రెండో ప్రపంచ యుద్ధం ముగిసాక ఫాసిజం అమెరికాకి వలస వెళ్ళిందని పరిశీలించారు కుటుంబరావుగారు దేశ, దేశాల ఆంతరంగిక వ్యవహారాల్లో జోక్యం చేసుకొని, అక్కడ కీలుబొమ్మ ప్రభుత్వాలని ఏర్పాటు చేసింది ఇది అమెరికాకు పరిపాటయింది ఒక వ్యసనంగా మారింది తద్వారా తన పబ్బం గడుపుకొని, తన ఆధిపత్యం పెంచుకొంది ప్రపంచ పోలీసుగా మారింది అక్కడితో ఆగలేదు టెర్రరిజాన్నీ, ఫండమెంటలిజాన్ని పెంచి పోషించి తానే టెర్రరిస్టు రాజ్యమయి కూర్చుంది కువాయిట్ మీద కాలు దువ్విందనే వంకతో పదేళ్ళ క్రితం ఇరాక్ మీద దండెత్తింది సెప్టెంబరు 11 ని సాకుగా తీసుకుని, ఇప్పుడు ఆఫ్ఘనిస్థాన్ మీద విరుచుకు పడిందీ మట్టికాళ్ళ మహారాక్షసి దీనివి చావు తెలివి తేటలు వీటిని పసిగట్టి, దీని ఆట కట్టిస్తారు ప్రజలు

10-10-2001

కృష్ణాబాయి, ప్రసాద్

# చదరంగం రణరంగం

## V ప్రపంచ రాజకీయాలు

## VI దేశ రాజకీయాలు

# 1.ఇవాళ

వాణిజ్య యుగమనే గౌరవనామధేయంతో వ్యవహరించబడుతున్న ఈ యుగం నిజమాలోచిస్తే, భిక్షుకయుగ మనాలి ఇది స్వాతంత్ర్య యుగమనీ, ప్రజాపరిపాలనా, వోట్లూ, వాణిజ్యంలో పోటీ, స్థానిక పరిపాలనా, మొదలైనవన్నీ పెట్టుబడిదారీవల్లనే వచ్చినవనీ, దేశంలో ఉన్నసమస్త విధాలసంపదా ఒక చక్రవర్తిదో, రాజుదో, జమీందారులదో అయిన సమయంలో ప్రతివ్యక్తీ ఆర్థికదాస్యుడే నని మనం పొరపాటుపడుతున్నాం కాని నిజం ఆలోచిస్తే, ఇది అసత్యమని సులభంగా తెలుసుకోవచ్చును మన పురాణాలూ అవీ చెప్పేది నిజమైనట్టయితే, ఈ పెట్టుబడిదారీ లేకుండా సకల సంపదలూ పాలకుడి సొత్తయి ఉన్న రోజుల్లో భిక్షుక సమస్య ఉన్నట్టు కనిపించదు పరిగ్రహం ఒక హక్కుకింద ఉండేది అదిన్నీ బ్రాహ్మలే అనుభవిస్తూ ఉండేవారు ఈ అధికారం బ్రాహ్మణేతరుల కుండేది కాదు అయితే, మరి ఆ కాలంలో దరిద్రులుండేవారుకారా? ఉంటే వారు చెయ్యిచాచకుండా ఎట్లా బతికారు? ఈ ప్రశ్నలకు సమాధానాలివ్వటం మనవిధికాదు ఆ కాలంలో దరిద్రులెవరైనా ఉంటే, వారిని ధనికులు చెయ్యిచాచనివ్వకుండా పోషించారనుకోవాలి ఒకవేళ ఆ దరిద్రులను పోషించినవారు లేనట్టయితే వారు దారిద్ర్యంతో మాడి చావనైనా చచ్చారుకాని, చెయ్యిచాచలేదు–ఎవడైనా దౌర్భాగ్యుడు ధర్మహానికి కూడా వెరవకుండా యాచనమొదలు పెడితే, వాణ్ణి ధర్మరక్షకుడైన రాజు తక్షణమే కొరత వేశాడనుకోవాలి

ఎట్లాగయినా చూడండి, పెట్టుబడిదారీ లేక మునుపు భిక్షుక సమస్య లేదు ఒకప్పుడు ప్రతి గ్రహమనే గొప్ప పేరుతో బతికిన వ్యాపకం–అగ్రవర్ణుల అధీనంలోనే ఉండి అదొక హక్కుగా పరిగణించబడిన సత్కర్మ–ఈనాడు పెట్టుబడిదారీ పాలబడి, పరమహేయమైన భిక్షుక సమస్య అనిపించుకుంటున్నది కాలగతి! హరిశ్చంద్రుడంతటి వాడికీ తప్పలేదు కష్టాలు

ఇది ఒక సమస్య కావటం కూడా దీనియెడల మనకు గల సహృదయతాభావాన్ని వ్యక్తీకరిస్తున్నది మన కిష్టమైనన్నాళ్ళూ ఏపనయినా నిశ్చింతగా చేసేసి, అది చేయటం మన కిష్టం లేకపోగానే దానికి సమస్య అనిపేరు పెట్టి దాన్ని గురించి పత్రికలకు వ్యాసాలు రాయటమూ, ఎసెంబ్లీలో బిల్లులు ప్రవేశపెట్టటమూ చేస్తాము ఒకప్పుడు భార్యలు చచ్చిపోయిన భర్తలతో సహగమనం చేసి నిశ్చింతగా వీరస్వర్గం–లేక, సహగమనం చేసిన స్త్రీలు పొందే మరే ఇతర స్వర్గమో–చూరగొన్నారు ఇంతలో ఏ అమ్మకో వీరస్వర్గం రుచించలేదు ఆవిడ కాస్తా సహగమనం ఒక సమస్య అని ఘట్టిగా వాదిస్తూ ఏపత్రికా సంపాదకుడికో రాసేసింది అటుపిమ్మట ఎసెంబ్లీలో పెద్దలంతా చేరి సహగమనరద్దుబిల్లు ప్రవేశపెట్టి, వోట్లు కాన్వాస్ చేశారు సహగమన సమస్య పరిష్కారం కూడా అయింది–ఒకప్పుడు పాతివ్రత్య ధర్మంగా పరిగణించబడిన సహగమనం! బాల్యవివాహాలు కూడా అంతే ఎనిమిదేళ్ళు నిండక పూర్వం కుమార్తెకు వివాహం చేస్తేనే తండ్రికి కన్యాదాన ఫలం దక్కుతుందనీ, కన్యాదాన ఫలం దక్కని తండ్రి అదేదోలోకానికి పోతాడని నమ్మి, మొన్న మొన్నటిదాకా పిల్లల్ని– ఆడపిల్లల్ని– చిన్నతనంలోనే పెళ్ళికూతుర్ని చేసి, వాళ్ళేడవకుండా గిలక్కాయలూ అవీ ముందుపడేసి పల్లకీ

ఎక్కించాం. క్రమంగా కొంతమందికి ఈ పని చెయ్యటం అసహ్యమయింది. కన్యాదానం చేసిన తండ్రులు వెళ్ళేలోకం మోటయింది. వెంటనే బాల్యవివాహ సమస్య గురించి చర్చలు బయలుదేరినై. ఎవరో పెద్ద మనిషి ఈ సమస్యను గురించి ఎసెంబ్లీలో ఒకబిల్లు ప్రవేశపెట్టి వోట్లు వేయించుకున్నాడు. బాల్యవివాహ సమస్య పరిష్కారమయింది- కన్యాదాన ఫలాపేక్ష వెనకపడింది.

భిక్షుక సమస్య అయినా ఇంతే. లేనివాళ్ళు కలవాళ్ళ దగ్గిరికి వెళ్ళి అడగటమూ, వాళ్ళివ్వటమూ ఒకప్పుడు ధర్మంగా ఉండేది. ధార్మిక బుద్ధి ఉండటం ఎక్కువయిన విషయం అనుకుంటుండే వాళ్ళు జనం. ధర్మం చేసినవాళ్ళు సామాన్యంగా ఏమీ బదులుకోరేవారు కారు. ఆశాపరులు ధర్మంద్వారా ఉత్తమ లోకాలాశించినా, ఇతరులు అది తమవిధిగా భావించేవారు. అప్పట్లో ఈ ధర్మచింతన ఎంతగా ఉండేదంటే, లేనివాడైనా అభ్యాగతికి ఉన్నంతలోనే ధర్మం చేసేవాడు.

కాని, పెట్టుబడిదారీ రాగానే బదులు వాంఛించే మనస్తత్వం ఏర్పడింది. మనం అవతలవాడికి ఒక కాసిస్తే, దానికిగాను మనం తిరిగి పుచ్చుకునేది ఏమీ లేకపోవడం అన్యాయం అనిపించింది. ధర్మానికిగాను ఇచ్చేదానికి తప్ప ఇతరత్రా మనం ఖర్చుచేసే ప్రతికాసుకూ ఏదో ప్రతిఫలం కనిపిస్తూఉండె, ఆఖరుకు ఏమీ చెయ్యకుండా బాంకులో భద్రంగా దాచిన డబ్బుక్కూడా నూటికి నాలుగూ, అయిదూ చొప్పున ప్రతిఫలం దక్కుతూ ఉండె, అటువంటప్పుడు "ధర్మం, ధర్మం" అంటూ డబ్బుపోగొట్టుకోవటం ఎవరికిష్టం ఉంటుంది గనకా? ధర్మం అంటే విధిగా చెయ్యదగినది. లేనివాడికి ఒకకానీ ఇవ్వటం విధిగా ఇవ్వవలసినది కాదే, పెట్టుబడిదారీ నిర్మించినశాసనంలో అటువంటి సూత్రం ఎక్కడా లేదే! అంచేత దీనిని ధర్మం అనటం మానేసి, దానం అన్నారు. ధర్మం తప్పనిసరిగా భావించి చేసేదయితే, దానం మంచితనం కొద్దీ, ఔదార్యం కొద్దీ చేసేది. ఎవడైనా ఎవడికైనా ధర్మంచేస్తే, దాన్ని గురించి చెప్పుకోవలసిన అవసరం లేదు. కాని, అదే దానమైతే దాన్ని గురించి చెప్పుకోవచ్చు. పత్రికల్లో రాసుకోవచ్చు. ఓపిక ఉంటే దాతల ఫోటోలు కూడా అచ్చొత్తించుకోవచ్చు.

కాని, రానురాను మనం చేసేదానాలు ఇటువంటి ప్రతిఫలం కూడా ఇవ్వటం మానుకున్నై. పెద్ద దానం చేస్తే దాని గురించి ఎవరైనా చెప్పుకుంటారు, ఫోటోలు పత్రికల్లో వేస్తారు. కాని, ఇంపీరియలు బాంకు గేటు దగ్గిర ఒక బిచ్చగాడు నన్నటకాయించి, నా జేబులో ఉన్న అణాముక్కానీలో ఒకకానీ పుచ్చుకుంటే దాన్ని గురించి ఎవరు చెప్పుకుంటారు? నాఫోటో ఏపత్రిక వేస్తుంది? అదీకాక, ఆకానీ నేను వాడికిచ్చినా మానినా లోకం నన్ను ఒకటిగానే చూసినప్పుడు, నేనాకాని ఇచ్చుకోకపోతే మాత్రమేం?

అంచేత మనకు చిల్లర దానాలమీద రాను రాను అసహ్యం పుట్టింది. ఈ చిల్లర దానాలు స్వీకరించేవాళ్ళు మన దృష్టిలో భిక్షుకులయి పోయినారు. భిక్షుక సమస్యను గురించి పత్రికలకు రాస్తున్నాం, వాటిని గురించి బిల్లులు ప్రవేశపెడుతున్నాం. ఎప్పుడో మనం భిక్షుక సమస్యలేకుండా కూడా చెయ్యగలుగుతాం-దారిద్ర్య సమస్య దక్కి ఉండగానే! సందేహం లేదు.

సోషలిస్టులకు మల్లే మనకు భిక్షుక సమస్యమీద సూత్రపూర్వకమైన ఏవగింపుందనా? ఒక్కనాటికి కాదు (దరిద్రుడి దారిద్ర్యాన్ని చిల్లరదానాలతో ఉపశమింపజేసి, వాడు విప్లవోన్ముఖుడు

కాకుండా చేస్తున్నామని సోషలిస్టు వాదం ) మనకటువంటి అభ్యంతరం లేదు ఇప్పటికైనా మన ఇంటి చుట్టూతా ప్రతిరోజూ తిరుగుతూ, అధమం ఒక్క వెయ్యికయినా మనజీవితం భీమా చెయ్యమని చంపుతూండే ఇన్సూరెన్సు ఏజెంటుమీద మనం బిల్లులు ప్రవేశపెట్టం, రోడ్డువెంట మనం పోతుంటే, "ఏం కావాలి, స్వామీ? రాండీ! దయచెయ్యండీ?" అనే దుకాణదారు గుమాస్తా మీద మనం బిల్లులు ప్రవేశ పెట్టం కాఫీ హోటల్‌లో తిని బయటకు వస్తుంటే బల్లమీద వేలుతో కొట్టి, మనని ఆకర్షించటానికి ప్రయత్నించే కిళ్ళీ కొట్టు వాడిమీద బిల్లులు ప్రవేశపెట్టం వీధిలో అడుగు పెట్టగానే మొహాన కొట్టినట్టు ప్రత్యక్ష మయ్యే భయంకరమైన దెయ్యపు బ్యానర్లు గోడలమీద ఎక్కించిన సినిమా ప్రొడ్యూసర్‌లను మనం అంతగా నిరసించం మనజేబులో ఉన్న డబ్బులు తమ జేబుల్లోకి రావాలని అనేక వేల ప్రయత్నాలు నిత్యమూ చేసే అనేక వేల మంది వ్యక్తుల మీద మనం చట్టప్రయోగం చెయ్యం కాఫీ హోటలు బయట, బస్టాపుల దగ్గర మనని నిలవేసి, ఒక దమ్మిడీ అడిగి లేదని అబద్ధాలాడించే బిచ్చగాడితోనే మనకు పేచీ

అందుకనే, ఆ బిచ్చగాణ్ణి గురించి మనం అల్లరి చేయటమూ, హైరానా పడటమూ, బిల్లులు ప్రవేశపెట్టటమూనూ అయితే పంఘంలో ఇన్ని రకాల బిచ్చగాళ్ళుండగా ఈ ఒక్కడికోసమే మనం ఇంత ఆందోళన పడటం దేనికి? ఈ బిచ్చగాడు బట్టల దుకాణం వారికన్నా ఎక్కువ బాధిస్తాడనా? భీమా ఏజెంటుకన్నా మన దగ్గరనుంచి ఎక్కువ ఆశిస్తాడనా? ఏదీలేదు కాని మిగిలిన బిచ్చగాళ్ళు మనకేదో ప్రత్యుపకారం చేస్తున్నట్లు నటిస్తారు, ఈ బిచ్చగాడికది తెలియదు మన కడుపున–మనభార్యల కడుపునైనా కాదు!–నలుగురు కొమాళ్ళు కలగాలని ఆశీర్వదించటం తప్ప, మనకీబిచ్చగాడేమీ చెయ్యడు వీడికి పెట్టుబడిదారీ తత్వం తెలియదు మన మూడోకంటి వేడికి గురి కాకుండా ఉండాలంటే, ఈ బిచ్చగాడు ఆ రహస్యం తెలుసుకోవాలి పెట్టుబడిదారీలో పాశ్చాత్యులు చెయ్యి తిరిగిన వాళ్ళు కనుక అక్కడి బిచ్చగాళ్ళు అది నేర్చుకున్నారు వాళ్ళు ఊరికే పిల్లల్ని వాగ్దానం చేసి చేయి చాచరు! (సంతాన నిగ్రహం విరివిగా అభ్యసించే అక్కడి వనితామణులు అటువంటి ఆశీర్వచనం చేసిన వాణ్ణి పట్టుకుని దవడ పగుల గొడతారు) ఏ నిప్పుపెట్టెలో అమ్ముకుంటున్నట్టు నటిస్తారు

భిక్షుక సమస్యకూ, పెట్టుబడిదారీకి సంబంధం ఉందనటం అతిశయోక్తి అని ఒక్కనాటికైనా అనుకోకండి మనది దరిద్రదేశం అనుకుంటాం కాని వాణిజ్యంలో పైకి వచ్చిన దేశాల్లో ఈ సమస్య మనదేశంలో కంటే ముందే తీవ్రరూపం ధరించటమేకాక, ఎప్పుడో పరిష్కారం కూడా అయిపోయింది అక్కడి బిచ్చగాళ్ళంతా హోటల్ వెయిటర్లుగానూ, లిఫ్ట్ ఎటెండెంట్లుగాను ఇంకా లక్ష ఇతర వృత్తుల్లోనూ చేరిపోయి జీతాలు సంపాదించటమేగాక టిప్పుల ద్వారా మన బిచ్చగాళ్ళు సంపాయించే దానికి ఎన్నో వందల రెట్లు ఎక్కువ సంపాదిస్తున్నారు

ఇంతకూ చెప్పవచ్చిందేమిటంటే మన దేశ ప్రజలు కూడా ఇందులో ఉన్న ఆర్థిక తబిసీళ్ళు గ్రహించి వ్యాపార పద్ధతులు తెలుసుకుంటే బిచ్చగాళ్ళ సమస్య పరిష్కరించి, వాళ్ళు యాచన ద్వారా మరింత సంపాదించేటట్టు చేసే అవకాశం మనకు బాగా లభిస్తుంది

ఆంధ్రపత్రిక దినపత్రిక 8-10-1941

# 2. వ్యాపార పద్ధతులు

బ్రహ్మదేవుడు నాలుగు వర్ణాలు సృష్టించాడు వైదీకులూ, క్షత్రియులూ, వైశ్యులూ, శూద్రులూ అసలు బ్రాహ్మణులంతా వైదీకులే ఇతర వర్ణాలవారు తమ వర్ణపు హద్దులను మీరకుండా కాపలా కాచింది వీరే మొదట తమ హద్దులను మీరి, ఇతర వర్ణాలవారితో పోటీచేసింది కూడా వీరే వీరు రాజకీయాలలో ప్రవేశించి, నియోగులని పేరుపెట్టుకుని, రాజ్యాలేలటంలో క్షత్రియుణ్ణి మించి, రాజుల్ని నామమాత్రులుగా చేసి వదిలి పెట్టారు క్షత్రియులు పరశురామప్రీతి అయి, పాశ్చాత్యుల ధర్మాన ప్రజా ప్రభుత్వాలూ, అవీ వచ్చి, పెట్టుబడిదారీధర్మాన వ్యాపారస్తులే నిజమైన పాలకులయి, వైశ్యయుగం వచ్చినాక వీరు కోమటి గుమాస్తాలయి ఎంతెంత పలుకుబడి సంపాదించిందీ మన కందరికీ తెలిసిన విషయమే

బ్రాహ్మల్లో వైదీకులూ, నియోగులూ ఉన్నట్టే వ్యాపారులుకూడా ఉండటం గమనించదగిన విషయం (ఇంతకంటెకూడా గమనించ దగిన విషయం బ్రాహ్మలిప్పటివరకూ శూద్రులతో పోటీచేసి ఉండకపోవటం శూద్రయుగం వచ్చేటప్పటికి అది కూడా జరుగుతుందనే భావించవచ్చు

"స్వధర్మేనిధనం శ్రేయంః, పరధర్మో భయావహః" అని సూక్తి బ్రాహ్మల్లో నియోగులూ, వ్యాపారులూ ఉన్నారు గనుకనే మన రాజకీయాలూ, ఆర్థికమూ ఇంత శోభాయమానంగా ఉందేమో మరి!

పర్యవసానం ఏమంటే, తెలుగు వాళ్ళకు వ్యాపారదృష్టి లేదు–వ్యాపారులక్కూడా తెలుగుదేశంలో ఏదో ఒకవిధమైన వర్తకం లేదనికాదు బట్టలకొట్లూ, ఫాన్సీస్టోర్సూ మొదలైనవి లేకపోలేదు అయితే, అందులో ఆటే వ్యాపారసరళీ లేదు ఆ వస్తువులు ఎక్కడో ఎవరో తయారు చేస్తారు వాటిని కొని రూపాయిమీద ఏఅణో, బేడో లాభం వేసుకుని అమ్మటమూ, గిట్టుబాటయి నంత కాలమూ నడపటమూ, లేని పక్షంలో వ్యాపారం విరమించుకోవటమూనూ వీరు చేసే ప్రతి రూపాయి వ్యాపారంలోనూ పధ్నాలుగు పదిహేనణాల డబ్బులు ఏ అహ్మదాబాదో, బొంబాయో, రంగూనో, జపానో, చైనానో, అమెరికావో, ఇంగ్లాండో వెళితే, మిగతా అణా, రెండణాల డబ్బులు కాస్సేపు తెలుగు పొలిమేర లోనే తారట్లాడి, ఏ సిగిరెట్టు పొగరూపంలోనో, స్పెన్సరు రెస్టారెంటు ద్వారానో అవికూడా మిగిలిన డబ్బులను వెతుక్కుంటూ పై దేశాలకు చక్కాపోతై

ఇటువంటి వ్యాపారం కంటె నన్నడిగితే ఏపచారీదుకాణమో, చిల్లర వెచ్చాల అంగడో చాలామటుకు నయం పచారీ దుకాణాల్లో కూడా హెచ్చుభాగం–నిజంగా ఖరీదైన వస్తువులు–పైనుంచి తెప్పించేవే కురాసానివామంటే, సునాముఖి ఆకంటే, పిప్పలీ, శొంఠీ మొదలైన వంటే– అవి దేశీయమైనవే వాటికి గాను మనం పుచ్చుకునే డబ్బులు కొంతకాలమైనా మన ఆవరణలో ఉంటై చిల్లరవెచ్చాల అంగడి చెప్పనే అక్కర్లేదు ఉప్పూ, పప్పూ, చింతపండూ, మిరపకాయలూ, ఉల్లిపాయలూ, ధనియాలూ మొదలైన వన్నీ మన దేశపువే అయితే మనదేశపు వనిపించుకున్న వన్నీ ముడిపదార్థాలే ముడిలేని పదార్థాలు మన దేశంలో తయారుకావు! చివరకు మన దేశంలో తయారుచేసే సినిమా చిత్రాలలో కూడా తగుమాత్రం ముడి ఉండితీరుతుంది

ఇది ఇట్లా జరగటంలో వింత ఏమీలేదు ఎందుచేతనంటే - ఒక్కసారి చరిత్ర యావత్తూ తిరగేద్దాం

బ్రాహ్మణరక్తమూ, బ్రాహ్మణ తేజస్సూ బ్రాహ్మణత్వమూ మిగిలిన కులాల్లో కూడా ప్రవేశ పెట్టాలని సదుద్దేశంతో పూర్వం ఎప్పుడో ఒక చట్టం ఏర్పాటు చేశారు ఆ చట్టం ప్రకారం బ్రాహ్మణుడైనవాడు మిగిలిన అన్ని కులాల స్త్రీలను పెళ్ళాడి పిల్లల్ని కనవచ్చును ఈ చట్టం కొంత కాలమైనా అమలులో ఉండి ఉండాలి మిగిలిన కులాల ఆడవారికి ఈ విధంగా వర్ణ భ్రష్టులు కావటం ఇష్టం లేకపోవటం వల్లనో, ఉపాదానంతో ఇంతింతమంది భార్యలను పోషించటం బ్రాహ్మడికి దుర్ఘటం కావటంవల్లనో ఈ చట్టం కాస్తా కాలక్రమాన సంక్షేపించుకుని ఊరుకుంది కాని, ప్రమాదం జరిగిపోయింది బ్రాహ్మణత్వం సంఘమంతా అప్పటికే వ్యాపించింది ఈ సంగతి కనిపెట్టే కొద్దికాలంక్రితం దుగ్గిరాల గోపాలకృష్ణయ్యవంటి బుద్ధిమంతులు బ్రాహ్మణత్వం అందరికీ ఇప్పించటానికి ప్రయత్నాలు కూడా చేశారు

ఇక బ్రాహ్మణత్వం ఎటువంటిదయ్యా అంటే, యజనయాజ నాధ్యయనాధ్యాప నదాన ప్రతిగ్రహ క్రయవిక్రయాదికర్మలతో కూడుకున్నది ఇందులో వస్తునిర్మాణం ఎక్కడా లేదే! అది శూద్రకర్మ ఆఖరుకు వడ్లుదంచి బియ్యం చేసుకోవటానికి కూడా బ్రాహ్మణుడు ఒప్పడు అందుకనే ఒకప్పుడు బ్రాహ్మణులు ఉపాదానానికి బయలుదేరితే ముడివడ్లు పెడతారేమోనని, శూద్రులు వడ్లుదంచుకునేచోటికి వెళ్ళి, దంపటంలో చెదిరి పడిన గింజలు పోగుచేసుకొచ్చేవారట

బ్రాహ్మణవర్తకం అనాదిగా మనజాతి అంతటిలోనూ జీర్ణించి ఉండటమే కాకుండా, బ్రాహ్మణతత్వం మతరూపంలోకూడా మనందరి ఆత్మలకూ పట్టిఉండటమేకాకుండా, రాజకీయాలలోనూ వ్యాపారంలోనూ మనజాతికి బ్రాహ్మలు పెట్టిన వొరవడే అయిఉండటాన మన జాతి శూద్రకర్మ అయిన వస్తునిర్మాణం మనవల్ల సాధ్యం కాదు

మనది బానిసదేశం, బానిసజాతి, రాజకీయ-ఆర్థిక-భావదాస్యాలు మనని పీడిస్తున్నవని అంటున్నామా, అయినప్పటికీ, మనం వస్తునిర్మాణం చెయ్యటానికి నిరాకరించి బానిసత్వం మనని అంటలేదని నిరూపిస్తున్నాం (గ్రీసులోనూ, బానిసలున్న ఇతరదేశాల్లోనూ వస్తు నిర్మాణమంతా బానిసలే చేసేవారట )

ముడిపదార్థాలమ్ముకోవటంలోగాని, తయారయిన వస్తువులు కొని తిరిగి అమ్ముకోవటంలో గాని అటే లాభం లేదు నిజమైన లాభం ముడి పదార్థాలనించి వస్తువులు తయారు చేసుకోవటంలో ఉంది దురదృష్టవశాత్తూ ఇది శూద్రకర్మ అయిపోయింది అది చెయ్యటం మన చిత్తప్రవృత్తులకు విషతుల్యం

ఇందువల్ల మనం ఆర్థికంగా దెబ్బతింటున్నామన్నమాటేగాని, ఆధ్యాత్మికంగా చూస్తే ఇందువల్ల మనజాతి యొక్క ఘనత చాలా బయటపడుతున్నది "మన ఇంటోపనిచేసే ఆసిరిగాడు వొక సర్వెంట్" అని వెంకటేశంబావ బుచ్చమ్మ వొదినెతో అననే అన్నాడు పనిచెయ్యటమంటే కూలీ చెయ్యటమన్నమాట అందుకనే మనకు నౌకరీలుకూడా లేవు మనదేశంలో ఉన్న ఉద్యోగాలు ఏ అరవలచేతైనా చేయించేస్తాం మనకు కావలసిన సకల విధవస్తువులూ పై

వాళ్ళేచేసి ఇస్తారు ఈ విధంగా మనకూలీలను మనం ప్రపంచమంతటా ఏర్పాటుచేసి ఉన్నాం తెలుగు వాడికి సేవచెయ్యని జాతిగాని దేశంగాని లేదు వెధవ అశాశ్వతమైన, తుచ్ఛమైన, పాపపూరితమైన డబ్బుకోసం మనదేశంలో ఉన్న ఇతర రాష్ట్రాలవారు తమవస్తుసామగ్రిని తామే చేసుకోవటం మొదలుపెట్టి, తమ బానిసత్వాన్ని ధ్రువపరుచు కుంటున్నారు చూడండి తెలుగు జెండా ఇప్పటికీ ఎంత ఎత్తున, ఎంత గర్వంగా ఎగురుతున్నదో!

ఆంధ్రప్రశస్తి రాసిన శ్రీవిశ్వనాధసత్యనారాయణగారు ఈ విషయమై ఒక్కముక్క చేర్చి ఉండకపోవటం శోచనీయం!

సంపదను సృష్టించకపోవటం విషయమై నేను మనవారిని తప్పుపట్టనుగాని, మనవాళ్ళ వ్యాపార పద్ధతులు ఉండదగినంత బాగా లేనందుకు కొంతవరకు తప్పుపడతాను

చూడండి, స్వంతాన నడిపే దుకాణాలూ అవీ అటుంచి, ఒకటి రెండు వేల పెట్టుబడితో నడిపే పెద్ద పెద్ద జాయింటు స్టాకుకంపెనీలలో షేర్లన్నీ ఒకేకులంవారికీ ఒకేగోత్రంవారికీ ఇవ్వటం ధర్మమే అయినప్పటికీ, కొన్ని షేర్లన్నా కులేతరులకూ గోత్రేతరులకూ అమ్మకపోతే మెజారిటీ అంటూ ఒకటి ఉండి అందులో ఐకమత్యం ఏర్పడదు వాటాదార్లందరూ కులాభిమానం వల్లా, గోత్రాభిమానం వల్లా వాటాలు కొన్నప్పుడు ఆ అభిమానానికి ఆరిపోకుండా ఉండే అవకాశం ఇవ్వకపోతే ఎట్లా? కులాభిమానమన్నా గోత్రాభిమానమన్నా ఏమిటీ, ఇతర కులగోత్రాల వారిమీద ద్వేషమేగా? ద్వేషించేటందుకు ఇతరకుల గోత్రాల వారిని కూడా కొద్దిమందిని నామకహా కంపెనీలో చేర్చకపోతే, కంపెనీ చప్పగా చల్లారిపోతుంది ఇది గమనించరు మన జాయింటు స్టాకు కంపెనీలవారు అందువల్ల మనవ్యాపారం పైకి రావటం లేదు

మనవాళ్ళు ప్రారంభించే పెద్ద పెద్ద కంపెనీలలో ఇంకోపొరపాటుకూడా కనిపిస్తుంది మనం కంపెనీలు పెట్టవలసిన వాళ్ళమేగానీ, కంపెనీకి సంబంధించిన నౌకరీ చాకిరీలు పైజాతుల వాళ్ళచేత చేయించుకోవటం యుక్తం ఆపని మనకు తెలీదనికాదు-అసలు తెలీకపోవటమే ఒకగొప్ప-పైగా, పనిచెయ్యటానికి మనం నియోగించేవాడికి ఏం చెయ్యవలసిందీ మనమే చెబుతాం కనక, మనకు తెలీదని ఎవడూ అనలేడు ఒకరిదాకా ఎందుకు మనమే అనుకోలేం!

మనకంపెనీ తరఫున పనిచెయ్యటానికి మనం నియోగిస్తామే, ఆ మనిషి మన చెప్పుచేతల్లో ఉండటమూ, మన గొప్పతనం గ్రహించటమూ ప్రధానంగాని, వాడిద్వారా కంపెనీ ఒక్క దెబ్బన పైకి రావటం అంత ముఖ్యమైన విషయం కాదు అది ఒక విధంగా ప్రమాదం కూడానూ వాడివల్ల అంత లాభం ఉంటే వాడు దక్కనూదక్కడు, వాడు వెళ్ళిపోయిన తరవాత కంపెనీకి మొదట ఉన్నపేరుకూడా పోతుంది, వాడు పోనిపక్షంలో ఎక్కువజీతం అడుగుతాడు మనం కంపెనీ పెట్టటం పెద్ద పెద్దలాభాలు తీసిదేశం కొల్లగొట్టటానికా? దేశసేవచెయ్యటానికి గాని! ఆ విషయం ప్రాస్పెక్టసులో స్పష్టంగా రాస్తామే!

మన జాయింటుస్టాకు కంపెనీలు, పెద్ద పెద్ద లాభాలు తీయక పోవటమూ, వాడి అండ చూసుకుని ఎవడూ గొప్పవాడై కూచోకపోవటమూ చాలా తృప్తికరంగానే ఉందని చెప్పాలి

మనదేశంలో పెట్టుబడిదారీ ఇంకా బాగా అభివృద్ధి కావటం లేదనీ, అందువల్ల మనం ఆర్థికంగా వెనకబడి ఉన్నామనీ నసపెడుతున్నవాళ్ళు కొంతమంది ఉన్నారు కాని, వీళ్ళమాటలు మనం పాటించరాదు ధనం పాపహేతువు పెట్టుబడిదారీ క్రమేణా రాజ్యకాంక్షా, ఫాసిజమూ తెచ్చిపెడుతుంది ఈ రెండూ పాశ్చాత్యులను ఎంత బాధిస్తున్నదీ మనం చూస్తూనే ఉన్నాంగా! ఆకారణంచేత మన వ్యాపారం మరీ అభివృద్ధి కావటం కన్న బొత్తిగా అడుగంటిపోయినా మంచిదే కంపెనీలు దివాలా ఎత్తినప్పుడు వాటి తాలూకు పెట్టుబడి దేశందాటి పోదు సొమ్ము సొమ్ములో ఉంటుంది

ఆంధ్రపత్రిక, దినపత్రిక, 15-10-1941

## 3. దారిద్ర్యోద్యమం

దారిద్ర్యం రకరకాలుగా ఉంటుంది–భావ దారిద్ర్యమూ, విద్యాదారిద్ర్యమూ, అదృష్ట దారిద్ర్యమూ ఇత్యాది ఆర్థిక దారిద్ర్యం అన్ని దారిద్ర్యాలకూ మణిపూసవంటిది రోజువారీ ప్రయోగంలో దారిద్ర్యమంటే ఆర్థిక దారిద్ర్యమే కూడానూ

దారిద్ర్యం ఆధ్యాత్మికంగా చాలా కోరదగినదిగా కనిపిస్తుంది అటువంటి విషయాల్లో చాలా విజ్ఞానం కల యేసుక్రీస్తు స్వర్గం బీదవారిదే నన్నట్టు చెబుతారు యేసుక్రీస్తు తరవాత యేసుక్రీస్తంతవాడు టాల్‌స్టాయి కూడా పెద్ద జమీందారీ వదిలేసి, దరిద్రుడుగా తిరిగి ఆఖరుకు దిక్కులేని చావు చచ్చాడు, ఎక్కడో రైలు స్టేషనులో

అమెరికాలో కొందరు కోటీశ్వరులు చింకిగుడ్డలు కట్టుకుని, ఎవరూ గుర్తుపట్టకుండా వేషం మార్చుకుని, వీధులంబడి అడుక్కుతింటూ, రోజుల తరబడి పార్కు బెంచీలమీద నివసిస్తారుట

ఇంకొకరి చెమట కొల్లగొట్టకుండా, స్వప్రయోజకత్వంవల్ల కోటీశ్వరు డెవడూ కాలేడు గనక, ఇతరుల చెమట కొల్లగొట్టేటందుకు కోటీశ్వరుడైన వాడి కింద చాలామంది ఆరితేరిన వారుంటారు గనక, తను బిచ్చం ఎత్తి సంపాదించగలది ఏమైనా ఉంటే ఎందుకు పోనివ్వాలనే ఉద్దేశంతో పైన చెప్పినవిధంగా కోటీశ్వరులు బిచ్చగాళ్ళల్లే తిరుగుతారని కిట్టనివాళ్ళంటారు

అమెరికాలో అయినప్పటికీ కోటీశ్వరులంతా బిచ్చ మెత్తుతారా? బిచ్చగాళ్ళతో సానుభూతి కలవారే అట్లా చేస్తారని సహృదయుల తలంపు

ఆడది మగవాణ్ణి ఆకర్షించినట్టు, బిచ్చగాళ్ళ జీవితం అవతలికొసను ఉన్న కోటీశ్వరులను ఆకర్షిస్తుందని వైజ్ఞానికుల వాదం

క్రియకు తేలే దేమిటంటే–దారిద్ర్యం బహు చెడ్డది దీని వల్ల మనిషి ఐహికంగా చాలా దుర్బలుడైపోతాడు దరిద్రుడికి ఇంట భార్య నెదిరించే శక్తిగాని, బయట యుద్ధంలో శత్రువు నెదిరించే శక్తిగాని తగ్గిపోతుంది

ఈ దారిద్ర్యంలో కూడా రెండు మూడు రకాలున్నై డబ్బులేని దారిద్ర్యం ఒకటి, డబ్బులున్నప్పటికీ దాంతో కొనదగిన వస్తువులు లేక పోవటం మరొకటి

తెలుగువాళ్ళు డబ్బు విషయంలో దరిద్రులన వలసిన అవసరం లేదు-పన్నుల ద్వారానూ, యుద్ధవిరాళాల ద్వారానూ అరవవాళ్ళకంటె మనవాళ్ళే హెచ్చుగా ఇస్తున్నట్టు కనిపిస్తుంది

అయితే మనకు హెచ్చుగా ఉన్నది వస్తు దారిద్ర్యం ఆంధ్రులకు కావలసిన వస్తువు లేవీ ఆంధ్రదేశంలో తయారు కావు వర్తక పరిశ్రమాదుల్లో వెనకబడి ఉన్న దేశాలు వ్యవసాయంలో ముందుకు పొడుచుకురావటం కద్దు అయితే, మనకా జబ్బు కూడా లేదు మన దేశంలో రంగూను బియ్యం నిక్షేపమల్లే అమ్ముడుపోతుంది ఎన్ని పుట్లు రంగూనుబియ్యం దిగినా మనదేశంలో ఏదోమూల క్షామంతో జనం బాధపడుతూనే ఉంటారు

భగవంతుడు మనని ఒకకంట కనిపెట్టిఉన్నాడని చెప్పాలి ఈ దారిద్ర్యానికి తోడు మనకు భగవంతుడు ఆలోచించటానికి బుర్రకూడా ఇచ్చి ఉన్నట్టుఉంటే మనం బాధపడిపోదుం మృగాలు (లేక, పశువులు) ఆటే ఆలోచించవుగనకే వాటికి బాధ తక్కువ ఏ రాయలసీమలోనో కరువొచ్చి జనం నల్లులుమాడినట్టు మాడి చస్తున్నారని తెలియగానే, మనం భావరహితమైన మొహాలతో కాస్సేపాలోచించి, "అట్లాగా, పాపం!"అని మళ్ళీ స్పృహతెచ్చుకుని, "డైమనురాణీ నాదీ!" అంటాం ఉద్రేకంతో

ఇంకా అరవలు సుగంధముక్కుపొడి అనీ, నంజన్గూడు పళ్ళొడీ అనీ ఏవేవో తయారు చేస్తూ ఉంటారు మన కటువంటిదేమీ లేదు మన వాళ్ళు కూడా సహాయనిరాకరణ సత్యాగ్రహోద్యమాల్లో కళ్ళు తెరిచినవారై గుంటూరు జిల్లానుండి నేతి, వెన్న వ్యాపారాలూ, సామర్లకోట ప్రాంతాలనుండి నూనెవ్యాపారమూ చెయ్యటానికి ప్రయత్నించారు వెనక చాతగాని అవుపోసన చెయ్యబోతే మూతి మీసాలు తెగకాలినట్టు, నెయ్యి-వెన్న వ్యాపారం పెట్టి మంచిగ్రాడ్యుయేటుని చూసి మద్రాసు పంపితే, వాడు నాలుగురోజులపాటు చరచరా ఆర్డర్లుబుక్ చెయ్యటమూ పంపటమూ, ఆ ఆర్డర్లు మీట్ చెయ్యటానికి అవతల వెన్నగాని, నెయ్యిగాని, ఆఖరుకు డబ్బాలుగాని సమయానికి సరఫరా కాకపోవటమూ, ఆ ఇంతటి ఆర్డర్లు బుక్ చెయ్యటానికి వచ్చినవాడు తను ఎడ్వాన్సు కింద పుచ్చుకున్న నాలుగురాళ్ళూ గది అద్దెకిందా, కాఫీహోటలు, కిల్లీకొట్టూ ఖాతాకింద పంచేసి, ఎరిగినవాడి దగ్గిర రైలు చార్జీ అప్పుచేసి కొంపకు బయల్దేరుతాడు

సామర్లకోట ప్రాంతపు నూనె పరిశ్రమకు కూడా దాదాపు ఇదే జరుగుతుంది

ప్రతి చిన్న వస్తువుకూ డబ్బుదర్శించుకునే తెలుగువాళ్ళ దగ్గిర ఇంకా డబ్బెట్లా ఉందనేది ఆశ్చర్యకరమైన విషయమే

ఇది మనదేశంలోనే తయారై మనదేశం లోనే అమ్ముడుపోయే సరుకులవల్ల సాధ్యమవుతూ ఉండాలి వడ్లూ, ఇతరధాన్యాలూ పండించేవాళ్ళూ, వాటి తాలూకు క్రయధనాన్నిపొందేవాళ్ళూ, చాకలి, మంగలి, తాపీ, కూలి వగైరావాళ్ళూ అధికంగా నాగరికతల వాళ్ళు కానప్పుడు దేశంలో డబ్బుకరువు వుండేది కాదు

కాని, ఇప్పుడు నాగరికత హెచ్చయింది అనగా, మోతుబరులంతా పట్టణాలు చేరారు పట్టణాలంటే విదేశాలకు డబ్బు ఎగుమతి చేసేకేంద్రాలన్నమాటగదా ఇప్పుడు మన డబ్బు రెక్కలు కట్టుకు పైదేశాలకు ఎగిరిపోతూ ఉంది

ఒకవేళ మన మోతుబరులు పట్టణాలకు చేరకపోయినా వారిపిల్లలుమాత్రం చదువుసంధ్యలకూ, గుర్రప్పందాలకూ, ఏమీ లేకపోతే ఒట్టిపుణ్యానికి పట్టణాలు చేరి మన ఆర్థిక సంపదను క్షీణింపజేసి ఆధ్యాత్మిక సంపదను వృద్ధి చేస్తున్నారు

మనవాళ్ళు, సినిమాల ధర్మమా అంటూ, ప్రారంభించిన పరిశ్రమా ఈ ఆర్థికక్షయా ఉద్యమాన్నికెంతయినా బలం ఇస్తున్నది నలుగురాసామీలుచేరి, ఓ సినిమాకంపెనీ పెట్టటమూ, ఏనలభై యాభైవేలో తేవటమూ, దాంతో ఒకలక్ష రూపాయల సినిమా తియ్యటానికి ప్రయత్నించటమూ, పిక్చరుగాని పెట్టినడబ్బుగాని ఐపూఅంతూ లేకపోటమూ, ఒకవేళ పిక్చరు కనిపించినా, డబ్బు కనిపించకపోవటమూ

ఇట్లా కనిపించకుండా పోయిన డబ్బులో ప్రతిదమ్మిడీ కూడా మనకు కాకుండా పొయ్యేదేనని ఘట్టిగా నమ్మండి ఏమంటే ఈ ప్రయత్నాలు సామాన్యంగా మద్రాసులోనే జరుగుతై అందుచేత మద్రాసు ఇళ్ళ అద్దెకిందా, మద్రాసు టోక్యోలకిందా, అరవహోటళ్ళకిందా, రాఫిలిం కిందా డబ్బు ఖర్చయిపోతుంది నటీనటుల కింద కొంత సొమ్ము ఖర్చయేమాట నిజమేకాని, ఈ నటీనటులు సామాన్యంగా మద్రాసులో నివసించే వారే అయి ఉంటారు ఒకవేళ మద్రాసులో నివసించని వారయినప్పటికీ ఇట్లా దొరికిన డబ్బు అయిపోయే వరకూ మద్రాసులోనే తిష్టవేసి, మరో ఛాన్సుకోసం చూస్తూ ఉంటారు

ఇందుకనే తెలుగునాట రెండు మూడు స్టూడియోలైనా తగలెడితే ఈ దివాలాఖోరు కంపెనీలవల్ల జాతికి ఆర్థిక నష్టం ఉండకపోతుందేమోనని కొందరు బుద్ధిమంతుల ఏడుపు

సామాన్యంగా పరిశ్రమలను ప్రభుత్వాలు ప్రోత్సహించే దెందుకంటే, దేశంలో ఉన్న డబ్బు చిల్లర మల్లర వస్తువుల కింద పోకుండా ఉండటానికీ, వీలయితే పైదేశం వాళ్ళ డబ్బు దేశంలోకి దించటానికీనూ అయితే మనవాళ్ళు పరిశ్రమలు ప్రారంభించింది మాత్రం కేవలమూ ఇక్కడ ఘనీభవించి ఉన్న డబ్బు పైదేశాలకు పంపటానికి మాత్రమే

దీన్ని బట్టి ఆంధ్రులకు స్వలాభాపేక్షగాని రాజ్యకాంక్షగాని లేదని తేలుతూనే ఉంది ఇందుకు మనని తప్పుపట్టే గుండె ఎవడికుందీ?

కొంచెం ఆలోచిస్తే మన ఆంధ్రులం ఒక అఖండమైన అద్వితీయమైన దారిద్ర్యోద్యమం నడుపుతున్నామని స్పష్టమవుతుంది

మనం ప్రభుత్వానికి పన్నులరూపేణా ఇచ్చేదాని కంటె జీతాల రూపంగా ప్రభుత్వం నుంచి పుచ్చుకునేది తప్పకుండా తక్కువేఐ ఉంటుంది మన ఎగుమతుల సంగతి ఆటే చెప్పుకునేదేమీ లేదని అందరికీ తెలుసుకదా, ప్రతి దిగుమతీ మన డబ్బును హరించేదే నయిపోయె

వినోదాలు మొదలైన వాటికింద కూడా మనం సంపాదించే దాని కన్న ఖర్చు చేసేద జాస్తి ఐపోయె

మనం మార్వాడీలమోస్తరుగా పైదేశాలకు వెళ్ళి అక్కడ వడ్డీవ్యాపారం చేసి డబ్బుకు డబ్బు పుట్టించలేమాయె

మనలో ఖర్చుకుమించిన ఆదాయం గలవారే బహుకొద్ది ఆకొద్దిమందిలో డబ్బు పాతరవేసేవాళ్ళు జాస్తి, పాతర వెయ్యటమంటే అది చాలా రకాలుగా ఉంటుంది ఎక్కువమంది

బంగారం కొంటారు బంగారం తెలుగు దేశపు పంటకాదని వేరే చెప్పనక్కర్లేదుగదా! కొద్దిమంది తమ దగ్గిర మిగిలే డబ్బు బాంకుల్లో వేస్తారు మన దేశంలో బాంకులు రాష్ట్రీయ పరిశ్రమలతో ఆటే సంపర్కం పెట్టుకోనిమాటా, సంపర్కం పెట్టుకోవటానికి మన తెలుగు వాళ్ళకు పరిశ్రమలు లేనిమాటా అందరికీ తెలిసిందేకదా! మరికొందరు ఇళ్ళు కట్టిస్తారు ఇళ్ళు ఫ్యాక్టరీలమోస్తరుగా సంపదను వృద్ధిచేసే సంస్థలు కావుగదా! ఇంకా కొందరు బుద్ధిమంతులు తమ దగ్గిర మిగిలే డబ్బును బొత్తులుగా పేర్చి, ప్రతి పర్వదినంనాడూ దులిపి అడుగు నుంచి చెదలు పట్టటంలేదని మాత్రం నిరూపణ చేసుకుంటూ కాలక్షేపం చేస్తారు

మనిషి డబ్బుతినడు, డబ్బుకట్టడు, డబ్బుతో ఎండాకాలమప్పుడు విసురుకోడు డబ్బు సంపదను సృష్టించటానికి-అనగా తినేవి, తాగేవీ, కట్టుకునేవీ, కప్పుకునేవీ, విసురుకునేవీ సృష్టించటానికి-ఒక సాధనం డబ్బు పరిశ్రమల్లోకి ప్రవహించిన కొద్దీ సంపద విరివిగా సృష్టి అవుతుంది డబ్బు చేతులు మారిన కొద్దీ సంపద నలుగురికీ అందుతుంది సంపన్నుల ఇనపపెట్టెల్లో ఉండే డబ్బు, అక్కణ్ణించి కదిలేవరకూ, దమ్మిడీ విలవచెయ్యదు అందుచేత అదీ ఒక దారిద్ర్య హేతువే

అంతమాత్రానికి మనం డబ్బు నిలవచేసే వారిని తప్పుపట్టరాదు ఎందుచేతనంటే ప్రస్తుతం మనం పరిశ్రమల పేరిట ప్రారంభిస్తున్నవి మన దారిద్ర్యోద్యమానికి చేయూత నిస్తున్నవేగాని, దారిద్ర్యాన్ని నిర్మూలించటానికి సాయపట్టంలేదు గనక, పరిశ్రమల్లో డబ్బు పెట్టి దారిద్ర్య దేవతను ఉపాసించినా, డబ్బును ఇనప్పెట్టెలో పెట్టి దారిద్ర్యదేవతను ఉపాసన చేసినా దేశానికి ఒకటే ఫలితం- వ్యక్తికి మాత్రం దానికన్న ఇదే లక్షరెట్లు క్షేమకరం

ఈ పరిస్థితికి ప్రస్తుతంలో మార్పుకలిగే సాధనాలుగాని అవకాశాలుగాని ఏమీ కనిపించటం లేదు గనక, మనం మరికొన్ని తరాలపాటు దరిద్రనారాయణపాదపద్మాల దగ్గిరే ఉండగలుగుతామని రూఢిచేసుకోవచ్చును

ఆంధ్రపత్రిక, దినపత్రిక, 22-10-1941

# 4. వీరపూజ

"తెలుగువాళ్ళకు వీరపూజ లేదు అంచాతనే తెలుగుజాతి ఇట్లా ఉంది!" ఇది ముమ్మాటికీ నిజం

అయితే, కొందరు మాతృద్రోహులు, "మనలో వీరులెవరున్నారు గనకా?" అని అడుగుతారు అదే, అదే వీరపూజ లేకపోవట మంటే?

"దైవభక్తి కలిగిఉండరా, నాయనా," అంటే, దేవుడేడీ అనటమూ, సంధ్య అతిక్రమించిందిగదా అని సంధ్యావందనం మానటమూ ఎటువంటిదో వీరుల్లేరని వీరపూజ మానటం కూడా అటువంటిదే

మునసబుగిరీ మోస్తరుగానే వీరపదవి కూడానూ, దాన్ని మనం తగుమనిషిని చూసి అంటగట్టాలి

"నిన్నటివరకూ బాగానే ఉన్నవాణ్ణి తెచ్చి ఇవాళ వీరుణ్ణి చేస్తే, వాడు కాస్తా శివం పెరిగి

మన నెత్తినే నాట్యమాడతాడే!" అనుకోరాదు మననెత్తిన నాట్యమాడేవాడొకడుండటం మనకెంతో ఆరోగ్యమనేగా, వీరపూజ కావాలనటం

"అయితే మటుకు మనం అటువంటి పదవిని చేచేతులా సాటివాడి కంటగట్టటమా?" అంటే తప్పదుమరి మనదగ్గిరే లంచాలు గుంజగలందులకు మనం చైర్మనులను ఎన్నుకోవటంలా?

"పోనీ ఆ వీరుడు కాదగినవాడెవడో తనంతట తానే వీరుడై కూర్చుంటే ఆమీద మనం వాణ్ణి పూజించవచ్చుగా!" అంటే, అందులో ఒక చిన్న రహస్యం ఉంది మళ్ళీ దీన్నిపైకి అనెయ్యకండి-అసలు వీరుడంటూ ఎవడూలేడు మనం ఎవణ్ణో ఒకణ్ణి కత్తితో భుజంమీద తట్టి, "ఇక లేవండి, వీరుడుగారూ" అనేదాకా వీరుడనేవాడు లేనేలేడు అంతా అనుకోవటంలోనే ఉందని భమిడిపాటివారు మనకు చాలారోజులుగా చెబుతున్న విషయమేగా!

"ఒకప్పుడు మనదేశంలో వీరులుండేవాళ్ళు కాబోలు అప్పుడూ ఈ అనుకోవటమే అమల్లో ఉండేదా?" అని మీరు నన్నడగనూవచ్చు, నేను చెప్పనూవచ్చు

ఆ, అప్పుడూ అనుకోవటమే అయితే, అప్పటికాలంలో జనసామాన్యానికి ఈ అనుకోవటమనేది చాలా సులభసాధ్యంగా ఉండేది అవి చాలా మంచిరోజులు గనక, ఆనాటి జనం ఏది అనుకోమంటే అది చప్పున అనుకుని ఊరుకునేవాళ్ళు ఆరోజుల్లో ఈ డెమొక్రసీ ఎక్కడిది? ఈ వోట్లూ, ఎన్నికలూ ఎక్కడివి? హాయిగా ఒకడు చెప్పటమూ పదిమంది వినటమూనూ, 'చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః' అని ఆ యొక్క శ్రీకృష్ణ పరమాత్ములవారు అన్నప్పటికీ, ఎవరి గుణకర్మల ప్రకారం వారు తమ తమ కులాలు నిర్ణయించుకోవటం మొదలు పెడితే, స్వయం నిర్ణయజాడ్యం ప్రబలుతుందని పుటకతోనే కులం నిర్ణయించే వాళ్ళు అప్పుడు పుట్టిన వాణ్ణి పట్టుకుని, "నువు శూద్రుడివిరా, బాబూ!" అనేస్తే వాడు కాదన లేడుగా! వాడి కర్మ ఏమిటో అప్పుడే తేల్చేస్తే వాడిగుణం దానంతట అదే తేలిఊరుకుంటుంది, జీలుగబెండల్లే! అట్లా మనుష్యులను హద్దుపద్దుల్లో ఉంచి, ధర్మదేవతను ఒంగోబెట్టి నాలుగుకాళ్ళమీద నడిపించిన రోజులవి!

ఇవాళంటే, డెమొక్రసీ, మైనారిటీ హక్కులూ, మన ఉరితాళ్ళు మనం స్వయంగా అల్లుకోవటమూ, మన చెంపలు మన చేత్తోనే వాయించుకోవటమూ, మళ్ళీ మాట్లాడితే సోషలిజం అనటమూ, విప్లవం తెస్తామనటమూనూ, ధర్మదేవతను వీళ్ళు ఒంటికాలుమీద శివతాండవం చేయిస్తామనే మచ్చుగాని మరోటి కాదు

దీనికి విరుగుడు వీరపూజ వీరపూజ బట్టేకదా నాజీలిట్లా చెలరేగుతున్నారు? వీరులు విరివిగా పండిన యుగంలో జనసామాన్యం వీరుణ్ణి వీరుడనుకోవటం సులభసాధ్యం కావటానికి మరొక కారణం కూడా ఉండేది ఎవడన్నా అట్లా అనుకోవటానికి నిరాకరిస్తే వాడి డిప్ప ఎగరగొట్టేవాడు వీరుడు

ఈనాడు మనం ఎవణ్నైనా తిడితే వాడు కాకిలాగా ఊరంతా తిరిగి నలుగురితోనూ చెప్పుకుని ఏడుస్తాడు, లేదా కోపాన్నీ, శోకాన్నీ మందు మింగినట్టుమింగి, మరిచిపోవటానికి ప్రయత్నిస్తాడు అంతేతప్ప మరేమీ జరగదు

ఇటువంటి కారణాలచేత అసలు వీరుడని పేరుపెట్టటానికి కూడా ఈ దిక్కుమాలిన యుగంలో మనిషి దొరికి ఏడవడు

అందుచేత మనం వీరుడి అర్హత నిర్ణయించటానికి కొత్త పంథా తొక్కాలి ఈ పంథా నిర్ణయించటానికి పూర్వం ఒక దేవరహస్యం తెలుసుకోవటం అవసరం దీన్ని అదివరకు ఏ మునీశ్వరుడూ ఏ పురాణంలోనూ ఏ జిజ్ఞాసువుకూ చెప్పిఉండలేదు

మానవుణ్ణి ప్రబలంగా ప్రేరేపించేది ఆత్మప్రాణరక్షణాసక్తి అని ఒక 'బడి' ఉంది మా ఇంటిపక్క కోమటి మందు తీసుకుంటే డబ్బు ఖర్చవుతుందని, కాణీ ఖర్చులేకుండా ఊరికే–ముఫత్‌గా–జ్వరంతో చచ్చిపోయిన తరువాత, ఆ బడివాళ్ళు ఏమీ తెలియని వాళ్ళని తేలిపోయింది, ఆ కోమటి ప్రాణమల్లేనే

ఆక్షణంలోనే మనిషిని బలవత్తరంగా ప్రేరేపించేది డబ్బని కూడా తేలిపోయింది ఇది రెండో 'బడి'

అయితే–ఇక్కడ కూడా ఒక చిక్కొచ్చింది–ఒకానొక రచయిత, తనకు సెంటు ఆస్తిగాని, కాణీ రాబడిగానీ లేకపోయినప్పటికీ భార్యాబిడ్డల భ్రమకూడా లేకుండా పొద్దస్తమానమూ కూర్చుని వ్యాసాదులు రాయటమే కాకుండా వాటిని పత్రికలకు పంపేటప్పుడు, "అయ్యా నేను చాలా బీదవాణ్ణి, నిరుద్యోగినీ, జీవితమంతా భాషాసేవ చేస్తున్నవాణ్ణి కనక నా యీ అమూల్యవ్యాసాన్ని తమ అమూల్యపత్రికలో అమోఘంగా ప్రకటించి నన్ను ధన్యుణ్ణి చేస్తూ, ఆచేత్తోనే నాపేరూ, నా వ్యాసంపేరూ, నా వ్యాసమూ కూడా కాస్త మంచిచోట రవంత పెద్ద టైపులో వేయించినట్టయితే, నేను తమ పత్రిక తాలూకూ ప్రతి సంచికకు ఇదే విధంగా రాస్తూ ఉండగలవాడను" అని రాసే సంగతిన్నీ, మరొకానొక రచయిత–వెనకటి వాడికంటే మరికాస్త గొప్పవాడు–తనకే గడవనప్పటికీ, తనను మెచ్చుకునే వాళ్ళను ఒక్కక్షణం విడిచి తాళలేని కారణంచేత తల తాకట్టుపెట్టి అయినా సరే డబ్బుతెచ్చి, వాళ్ళను మేపుతూ ఉండే సంగతిన్నీ తెలిసిన తరవాత రెండో 'బడి' వాళ్ళు కూడా పప్పులో కాలు వేశారనే అనిపిస్తున్నది

పై రెండు బళ్ళ వాళ్ళనూ చంపి పుట్టింది మూడో 'బడి' అదేమంటుందంటే, మనిషికి కావలసింది ప్రాణమూ కాదు, డబ్బూకాదు, మెప్పు అంటుంది నేను కూడా ఈ బడిలో వాణ్ణే

అగ్రవర్ణం వాళ్ళనిపించుకోవటానికి బ్రాహ్మణులు ఆస్తులుపాస్తులూ లేకుండా, అడుక్కుతింటూ, అవసరమైతే అడవుల్లోకి పోయి ముక్కుమూసుక్కూచోలా?

దాపరికం ఏమీ లేకుండా క్షత్రియ యుగంలో గొప్ప వాళ్ళను పొగిడి, బట్రాజులు మాన్యాలు సంపాదించుకోలా?

ఈనాడు మాత్రం పుస్తకాలంకితాలిచ్చిన వారికి అచ్చు ఖర్చులు దక్కటంలా?

పేరు పత్రికలో పడుతుందనే ఆశమీద ఎంత మంది కాంగ్రెసువాళ్ళు జైలుకు పోలా? ఎంత మంది సత్యాగ్రహం చెయ్యబోతూ ముందుగానే కొత్తగా కొన్న ఖద్దరు గుడ్డలతో ఫోటో తీయించుకుని పత్రికలకు పంపించలా?

ప్రేమ ఇంత గొప్పదెట్లా అయింది అదీ ఒక విధమైన మెప్పుగనకనేగా? మనం ఒక మనిషిని ప్రత్యేకించి ప్రేమించామంటే అంతకంటే మన దృష్టిలో మంచి మనిషి ప్రపంచంలో లేడని రుజువు చేశామన్నమాట

మానవుడిగా అన్నిటికన్నా అర్జంటుగా కావలసింది మెప్పు అది అపరిమితంగా కావలసినవాడు వీరుడు, కనీసం వీరుడు కాతగినవాడు

ఎందుకంటే కేవలము కీర్తి దాహంతోనే వీరుడైపొయ్యేటట్టుంటే అందరమూ వీరులమే అట్లాకాదు మనం వీరుణ్ణి మెచ్చుకుంటే మనకు ప్రతిఫలం ఏదో వీరుడి వల్ల ముట్టేట్టుండాలి వాడు మనని మళ్ళీ తెగ మెచ్చుకుంటానంటే లాభం లేదు ఇస్తివాయనం, పుచ్చుకుంటి వాయనం పైగా ఆ లెక్కన ప్రపంచమంతా ఒక పెద్ద మ్యూచువల్ ఎడ్మిరేషన్ సొసైటీ అయిపోతుంది చిన్న ఎడ్మిరేషన్ సొసైటీలతోనే ఛస్తున్నాం!

ఇట్లా ప్రతిఫలం కోరటానికి కారణం ఇది వాణిజ్యయుగం కావటం మాత్రమేననుకోకండి వెనక కూడా ఎవణ్ణో పట్టుకుని, "ఆహా! నీ దుంపతెగ! ఎంత వీరుడివి నువ్వు!" అంటే వాడు శివమెత్తి, అమాంతం విరోధి సైన్యంలో చొరబడి క్షణంలో చచ్చి ఊరుకునేవాడు కాళిదాసు వచ్చిభోజుడి మీద నాలుగు శ్లోకాలు చదవగానే భోజుడు కాళిదాసుకు నాలుగు దిక్కులూ ఇచ్చి ఊరుకున్నాడు అట్లా ఏదో ప్రతిఫలం ఉండాలి కాకపోతే, ఇది వాణిజ్యయుగం అయిన మాట అబద్ధం కాదు గనక, ఆ వీరుడు మనకిచ్చే ప్రతిఫలం డబ్బురూపంగా ఉంటే బాగుంటుంది

కనక, మనం వీరులుగా ఎన్నుకునేవాళ్ళు జమీందార్లవంటి వాళ్ళయి ఉండాలి

ఈ ముక్క చాలా మందికి కోపం తెప్పించవచ్చు వీరపూజ అంటే డబ్బున్న జమీందార్లవంటి వాళ్ళను మెచ్చుకుని వాళ్ళ డబ్బు ప్రతిఫలంగా పుచ్చుకోవటమా అని కొందరికి ఆగ్రహం రావచ్చు

అందులో తప్పేమీలేదే! డబ్బుకోసం కాకపోతే ఈ వీరపూజ మరి దేనికి? మనజాతిపైకి రావటమంటే ఇంకేమిటనుకున్నారు? ఒక్క డబ్బులో కాకపోతే ఇంక మనం దేన్లోతక్కువ? మనలో లావాటివాళ్ళు లేరా, పొడుగాటి వాళ్ళు లేరా, పొగరుబోతులు లేరా, మనం మన పుస్తకాలనూ సినిమాలనూ ఎవరికన్న తక్కువ విమర్శిస్తామని? మనం ఆఖరుకు ఖద్దరు కట్టటంలోనూ, యుద్ధనిధికి డబ్బివ్వటంలోను కూడా ఎవరికీ తీసిపోమే! ఏమిటి మనజాతికి వచ్చిన లోటు? ఒక్కడబ్బే మనకు తక్కువయింది

సంపన్నులుగా చూసి వీరపూజ చెయ్యమనంటే మీ కాగ్రహం కలగవచ్చునుగాని, మనం నిత్యమూ చేస్తున్న దేమిటి? "ఇదుగో, మనమూ మనమూ ఒక కులం వాళ్ళం మనమంతా కలిసి చెయ్యకపోతే పరాయివాళ్ళు వస్తారా ఏమిటి? లేవండి, ఇంకా చూస్తారేం? తలా పదివేలూ వెయ్యండి చిచ్చుబుడ్డివంటి సినిమాతీతాం, లేదా దివిటీ ఆరినట్టు దివాలా తీతాం!" అంటే అందులో వీరపూజలేదూ?

ఆంధ్రపత్రిక దినపత్రిక 29-10-1941

# 5. కులాభిమానాలు

కులాభిమానం మహాచెడ్డది దాన్ని ఎవరున్నూ ఏ మాత్రమూ అంగీకరించరాదు దానివల్ల నాగరికతకూ, సంఘానికీ, ప్రపంచానికీ ఎంతో ముప్పుంది

శాస్త్రరీత్యా చూస్తే కులాభిమానం అనేది స్వభావరీత్యా కలిగే ప్రేరేపణే గాని సంస్కారం వల్ల కలిగేది కాదు ఒక కాకి చస్తే పదికాకులు పోగై కాకిగోల చేస్తై అది ఘనమా? మానవుడు స్వార్థత్యాగం చెయ్యాలిగాని స్వాభిమానం చూపించరాదు స్వాభిమానం బయటపెట్టుకోవటమే బర్బరత్వమయితే దాన్ని డప్పు బజాయించటం విషయమై ఏమనాలి?

అదీకాక, ఇంకో తిరుగుడు కూడా గమనించండి ఎవడిమటుకు వాడికి ఒక కులమే ఉండుకుంటుంది అటువంటి సందర్భంలో అభిమానాలు పెచ్చుపెరగనిస్తే అల్పసంఖ్యాకులయిన కులాలు బతగ్గలవా? ప్రతికులానికీ మిగిలిన కులాలన్నీ శత్రువులై కూచుని సంఘంలో బాలెన్స్ ఆఫ్ పవర్ లేకుండా పోతుంది అంటే ఏమిటో నాకు సరీగా తెలీదు కాని తెలీనంతమాత్రం చేత బుర్రకు తట్టేమాట పైకి రానీయకపోవటం ఆత్మద్రోహం అనిపించుకుంటుంది

అయితే కొందరు మోతుబరులేమంటున్నారంటే కులాభిమానానికీ కులవైషమ్యాలకీ సంబంధం లేదు, ఇతరకులాలను ద్వేషించకుండానే మన కులాన్ని మనం అభిమానించ వచ్చునంటున్నారు ఇది కేవలమూ అర్థంలేని ముక్క ఇతరకులాలని ద్వేషించకుండా కులాభిమానం ఎట్లా ఉంటుంది? నా చిన్న తనంలో నే నెరిగిన ముసలమ్మ ఒకావిడ ఉండేది ఆవిడకు ఇద్దరు మనుమలుండేవాళ్ళు అందుట్లో ఒకడిమీద ఆవిడకు చాలా ప్రేమ అంచేత ఆవిడ రెండోవాణ్ణి బాగా తిట్టేది ఆవిడ ప్రవర్తననూ శాస్త్రరీత్యా పరిశోధించినట్టయితే ఆవిడ తన ప్రేమను తన ప్రియమనమడిమీద చూపించే టందుకు ఇంకో సాధనం లేదని తెలుస్తుంది

ఇది నిజంకూడానూ "కమ్మవారి మీటింగులన్నీ కాలవ లొచ్చేదాకానే!" అని మా ప్రాంతాల ఒక సామెత ఉంది అంటే ఏమిటన్నమాట? నేను పైన చెప్పిన ఉదాహరణలో ముసలమ్మ మనుమల్లో ఆవిడ కిష్టుడిగాని వాడు నాలుగురోజుల పాటు ఊరికిపోతే ఆ ముసలమ్మకి తన కిష్టుడు (క్షమించాలి! వాడిపేరు కిష్టుడుకాదు)–తన కిష్టుడైన వాడి ప్రవర్తన ఆవిడకు దాదాపూ దుర్భరంగా పరిణమించేది అట్లాగే కులాభిమానమున్నూ, "నువ్వు ఇతర కులాల జోలికి పోకుండా నీకులాన్ని మటుకే తెగమెచ్చుకో!" అంటే చచ్చామే "నేలమీద చెయ్యి ఆనించకుండా లేచి నిలబడు!" అని స్థూలకాయుణ్ణి ఆజ్ఞాపించినట్టే!

ఇంతెందుకు? పదిరోజులు బోధివృక్షంకింద కూర్చుని నిద్రాహారాలు మాని తదేకధ్యానంగా ఆలోచించి చెప్పండి, కులాభిమానం అనేది ఇతరకులాల్ని తిట్టటానిక్కాకపోతే ఇంకెందుకైనా పనికొస్తుందేమో!

సర్వసముడైన ఆ యొక్క సర్వాంతర్యామి మనుష్యులందర్నీ తన దేహంలో ఒక ప్రాంతం నించే పుట్టించక అనేక ప్రాంతాలనించి పుట్టించి నాలుగుకులాలను నిర్మించిందెందుకు?

కులాభిమానాలంటూ పుట్టి అవి కులవైషమ్యాలుగా పరిణమించి వాటిని నిగ్రహించుకునే ప్రయత్నంలో మానవుడు తన సాయుజ్యం పొందగలందులకు మాత్రమే అంతా ఒకటేకులం అయితే కులద్వేషాలుండవు కులవిద్వేషం లేకపోతే కులాభిమానం ఎక్కడిదీ? అప్పుడందరూ సులభంగా బ్రహ్మైక్యం పొందగలిగేవాళ్ళు

అయితే భగవానుడు తన సృష్టిలో అనాలోచనతో కూడుకున్న పనులు చేశాడుమరి, అందుకనే మానవుడు భగవత్సృష్టిపైన పెరగవలసి వచ్చింది నాలుగు కులాలే అయినందువల్ల ప్రతి కులానికీ ద్వేషించటానికి మూడుకులాలే అయిపోయినై ఆమాత్రపు కుల వైషమ్యాన్ని ఆది మానవులు బహు సులభంగా జయించి బ్రహ్మసాయుజ్యం చెందగలిగారు ఇది కృతయుగం నాటి వృత్తాంతం

అందుకని మానవుడు ఆత్మపరీక్షార్థం కులాల సంఖ్య హెచ్చుచేసి చూసుకున్నాడు నాలుగు కులాలే ఉంటే మిగిలిన కులాలు ఎట్లా సృష్టి అయినవని కొందరు లెక్కలురానివాళ్ళు సందేహించవచ్చు అది వర్ణసాంకర్యంద్వారా జరిగి ఉండవచ్చును లేదా మొదటికులాలు గుణ కర్మల విభజన ననుసరించి ఏర్పడ్డట్టు రెండవ విడత కులనిర్మాణం కళలూ మొదలైనవాటికి చెందిన అభిరుచుల తేడానుబట్టి ఏర్పాటుఅయి ఉండవచ్చును కవుల్లోనే సనాతనులూ, భావుకులూ (లేక, అన్నగార్లూ), అతివాస్తవికులూ ఏర్పడ్డట్టు

ఇటువంటి విభజనవల్ల హాయిగా మన చిత్తం వచ్చినన్ని కులాలు ఏర్పడినై ఇప్పుడు కుల వైషమ్యాలకు కావలిసినంత అవకాశం ఆత్మపరీక్ష చేసుకోవటానికి బోలెడంత వీలు

(అయితే మరి కులాభిమాన మంటే కుల విద్వేషమే కదా, దానివల్ల పరమాత్మ ఆదిలో చేసిన ఏర్పాటు మరింత విస్తృతమయింది కదా, కులాభిమానం కూడదని ఎందుకన్నానని నన్నుమీరు ప్రశ్నించవచ్చును దానికి సమాధానం ఆఖరుకుగాని చెప్పను )

కులాభిమానం గురించి ఇప్పుడు మనం తేల్చుకున్న విషయం ఏమిటంటే, మనకులాన్ని మనం అభిమానించుకోవటానికి సాధనం ఇతరకులాలను ద్వేషించటమేనని అయితే మరి కులాభిమానం కకూడదన్నామే, ఇతర కులాలను ద్వేషించటం కూడా కూడదన్నమాటేగా? అవును పోనీ మనకులాన్ని మనం ద్వేషించుకుని ఇతర కులాల్ని మెచ్చుకుంటే కుదురుతుందా?

ఇది చాలా గొప్ప ప్రశ్న ఇది కురుక్షేత్ర సంగ్రామానంతరం ధర్మరాజులవారు భీష్ములవారిని అడిగి ఉండదగినంత ప్రశ్న అడిగి ఉంటాడనే నాసందేహమున్నూ తొందరలో వ్యాసయోగీంద్రుడు దాన్ని భారతంలో ఇతర ధర్మ సూక్ష్మతలతో పాటు చేర్చటం మరిచాడు

ఈ ధర్మసూక్ష్మత సుబోధకంగా ఉండేటందుకు మరొక చిన్నకథ చెబుతాను నా చిన్న తనంలో ఒక వితంతువు కిద్దరు కొడుకు లుండేవాళ్ళు ఆచుట్టుపక్కల ఉండే అమ్మలంతా ఆవిణ్ణి తెగ మెచ్చుకునేవాళ్ళు ఆవిడపిల్లలకి పెట్టినప్పుడు ఎట్లా పెడుతుందో వాళ్ళని కొట్టేటప్పుడట్లాగే కొడుతుందని, ఆకారణం చేతనో ఏమో ఆవిడ పిల్లలిద్దర్నీ ప్రొద్దానికీ చెండుకు తినేది వాళ్ళు తప్పుచేసినప్పుడు శిక్షించటం తప్ప వాళ్ళమీద తన ప్రేమ వెల్లడించటానికి ఆవిడకు అవకాశంలేదు పెట్టుపోతలు డ్యూటీవంటివి పిల్లల్ని ముద్దుచేస్తేనేమో చెడిపోతారాయె,

ముద్దు చెయ్యటం ఆవిడకు ఏ కోశానా చాతకాదు ఙకూడానాయె! అంచేత ఆవిడ పిల్లలు తప్పుచేసినప్పుడు ప్రేమకొద్దీ కొట్టేది (ఆవిణ్ణి భర్త బతికున్నన్నాళ్ళూ అట్లాగే ఆపేక్షతో చంపుకుతిన్నాడని ప్రతీతి ) అయితే కొంతకాలానికి ఆవిడ పెద్దకొడుకు వీధుల్లో బీడీలూ అవీ బాహాటంగా కాల్చటం నేర్చుకుని ఒకనాడావిడతనను కొట్టవచ్చేటప్పటికి వాడే ఆవిణ్ణి కొట్టి ఊరుకున్నాడు ఆనాటినుంచీ ఆవిడకు పెద్దవాడిమీద మనస్సు విరిగి వాణ్ణి కొట్టటం మానెయ్యటమేకాక ఆ ఆపేక్షయావత్తూ చిన్న కొడుకుమీదనే కేంద్రీకరించుకుని వాణ్ణి చెయ్యని తప్పులక్కూడా చితగ్గొట్ట సాగింది

చెప్పొచ్చిందేమిటంటే, మనం మనజాతిని తిట్టుకున్నంతమాత్రాన అభిమానం లేదని ఏమాత్రమూ రుజువు కాదు సరేకదా సూక్ష్మబుద్ధులు గల వాళ్ళు ఆద్వేషమే అభిమానమని రుజువు చెయ్యగలరు బెర్నార్డుషా విషయంలోకూడా ఇదే బయటపడ్డది–ఆయన ఇంతకాలమూ ఇంగ్లీషు జాతిని దుమ్మెత్తి పోసింది దేనికంటే షాకు ఇంగ్లీషు జాతిమీద ప్రేమగనకే

అందుకని మనకులాన్ని మనం తిట్టుకోవటం కూడా కులాభిమానమే అవుతుంది ఇతరకులాన్ని మెచ్చుకోవటంకూడా అంతే పొరుగింటి పుల్లకూర రుచి అనే సామెత సార్థకం చెయ్యటమే కాకుండా, ఇతరకులాన్ని మనం మెచ్చుకుని పాడుచేస్తున్నవాళ్ళమున్నూ, వారి క్రోధానికి వెరిచి వారిని మంచిచేసుకుంటున్నవాళ్ళమున్నూ అవుతున్నాం ఇది ధీరోదాత్త లక్షణం కాదు

కులాభిమానా లెందుకు కూడవో ఇప్పుడు తేల్చి చెబుతాను దీనికి కారణం చెబితే చాలా ఉన్నవిగాని ఇక్కడ సంగ్రహంగా ముఖ్యమైనవే చర్చింతాం

మొదటి సంగతి, కులాభిమానం సంకెల వంటిది కులాభిమానం పాటించేవాడు విద్వేషాన్ని స్వేచ్ఛగా పోనివ్వలేడు స్థూలంగా ఇతరకులాలను ద్వేషించవలసిందేగాని విరివైన వ్యక్తి ద్వేషాన్ని సూక్ష్మంగా ఉపాసన చెయ్యలేడు వ్యక్తి ద్వేషానికి దిగితే పరాయివాణ్ణి ద్వేషించటంకంటె ఐనవాణ్ణి ద్వేషించటమే చాలా సులువైనది కులాభిమానాలు పెట్టుక్కూచుంటే వ్యక్తిద్వేషం రాణింపుకు రాదు

బ్రాహ్మణయుగంలో కులాలు నాలుగే ఉంచి ద్వేషాన్ని అరికట్టి చంపుకుతిన్నారు మధ్యకాలంలో కులాలూ, శాఖలూ పెంచి ద్వేషానికి కాళ్ళూ చేతులూ ఆడేటట్టు చేశారు కాని ఈ స్వేచ్ఛ కూడా ఈకాలానికి చాలదు ప్రతి వాడికీ వోటు కావాలనే ఈకాలంలో కులాభిమానాలని పెట్టి మన హృదయాల్లో ఉండే ద్వేషాన్ని అరికట్టటం అన్యాయం

రెండోవిషయం ఇంకా ముఖ్యమైనది అదేమిటంటే ఇప్పుడున్న కులాలవిభజన సంఘతత్వరీత్యా సరిఐనది కాదు ఒక కులంలోనే – మళ్ళీ మాట్లాడితే ఒక కొంపలోనే, ఒక చూరుకిందే–జమీందారీతత్వమూ, బూర్జువాతత్వమూ, పెటీబూర్జువాతత్వమూ, ప్రోలిటేరియన్ తత్వమూ వివిధ పాళ్ళలో కలిసి ఉంటై (ఎం ఎన్ రాయిగారి వర్గసంబంధాలు చదివితే ఇది స్పష్టంగా తెలుస్తుంది ) ఈ రకరకాల తత్వాలు పరస్పర సంఘర్షణలేకుండా అవిచ్ఛిన్నంగా సాగితేగాని పరిణామంలేదు దానికి కులాభిమానం అర్థంలేని ప్రతిబంధకం అవుతున్నదిగాని మరొకటికాదు

పోనీ రాయిగారు చెప్పిన వర్గాలే ఉండనిచ్చి కులాలు తీసేసి వర్గాభిమానం పెంపు చెయ్యరాదా అని అడగవచ్చును కాని అది కూడా కూడనిపనే మానవజాతిని వ్యక్తులుగా చీల్చే ప్రయత్నం చూడవలసిందేగాని సమాజాలుగా చీల్చేపని చూడరాదు ఇకులాలూ, శాఖలూ, మతాలూ, వర్గాలూ–ఇంకా ఏదైనా కొత్త విభజనలు అవకాశం ఉందేమో చూడాలిగాని ఉన్నవి తీసెయ్యరాదు ఇట్లా విభజన చేసుకుపోగాపోగా పరిణామం ఏమంటే ప్రపంచంలో ఉండే ప్రతివ్యక్తీ ప్రతి ఇతర వ్యక్తినీ మనసారా ద్వేషించే ఏర్పాటు జరగవచ్చును

ఈ ద్వేషంవల్ల ఉండే ఆధ్యాత్మిక ప్రయోజనం ముందే చెప్పాను దీనివల్ల ఐహికమైన ప్రయోజనం కూడా ఉంది ద్వేషం మన వ్యక్తిత్వాన్ని పెంచుతుంది–ప్రేమ దాన్ని చంపినట్టే ప్రేమ ప్రతిఫలాన్ని కోరుతుందిగాని ద్వేషం దానికదే ప్రతిఫలం

ఆంధ్రపత్రిక దినపత్రిక, 12-11-1941

# 1. ఆంధ్రత్వం

మన తెలుగువాళ్ళు బల్లులల్లే తయారవుతున్నారు బల్లులంటే, మన గోడలమీద రాత్రిళ్ళు పురుగుల్ని వేటాడి తెల్లారగానే కళ్ళవుపించక మన తలుపుల సందున పడి చచ్చే బల్లులు కావు, తొంభయ్యేసి అడుగుల నిడివిగలదయ్యపు బల్లులు

పదికోట్ల సంవత్సరాల క్రితం వాటిదే రాజ్యం నాలుగు బల్లు లొకచోట అన్‌లాఫుల్ ఎసెంబ్లీ అయినప్పుడల్లా, సృష్టిలో బల్లులనేవి ఏ విధంగా సమగ్ర పరిణామం చెందిన జంతువులో చర్చింప బడుతూ ఉండేది

"మనం చేపల్లోనించే వచ్చామని ఘట్టి దాఖలా అవుపిస్తోంది!" అని ఏ చదువుకున్న బల్లిగాని అంటే మిగతా బల్లులు అమాంతం దానితోక కొరికివేసేవి

కొన్ని ముసలిబల్లులు బోసినోళ్ళేసుకుని వొట్టి అర్థంలేని కబుర్లు చెప్పేవి "మనం ఏ బల్లులం? ఏం కద? మా ముత్తాతగారి పెదతాతగార్ని చూడవలసింది ఆయన తోకే ఉండేది పన్నెండు యోజనాలు పౌర్ణమి వెన్నెట్లో ఆయన ఆడబల్లులతో కలిసి ఆడుకుంటుంటే వాళ్ళంతా కలిసి తీసే పరుగులకు పర్వతాలు దద్దరిల్లేవిట!"

"మనం రోజు రోజుకూ సైజులో పెరుగుతున్నామని ఘట్టి దాఖలా ఉంది వెనక చచ్చి పోయిన అస్థిపంజరాలు చూస్తే–" అని చదువుకున్న బల్లి ప్రారంభించేది కాని చదువుకున్న వాడి మాట వినేదెవరు?

విన్నావినకపోయినా చదువుకున్నబల్లి చదువుకున్న బల్లే! అధమం డెబ్భైఅయిదడుగులన్నా లేని బల్లిలో తగుమాత్రం "బల్లిత్వం" లేనట్టే భావించ బడుతూండేది 65 అడుగుల పై చిల్లర ఉన్నవన్నీ బ్రాహ్మణ బల్లులుగా భావించబడుతూ ఉండేవి ఓ వేళ ఖర్మం జాలక ఏ 30 అడుగుల బల్లో బ్రాహ్మణ దంపతులకి జన్మించినా జన్మతహా అది బ్రాహ్మణ బల్లే అయేది మరి

"మనలో బల్లిత్వం సమగ్రంగా ఉన్నంతవరకూ మన నెవరూ జయించలేరు," అని బల్లి జాతీయ వాదులంటూ ఉండేవారు

"సృష్టిలో బల్లులకన్న పెద్ద జంతువు లుండటానికి వీల్లేదని ఘట్టి దాఖలా ఉంది," అని చదువు కున్న బల్లులంటూ ఉండేవి

ఇంతకూ నీతేమిటంటే ఆఖరుకు బల్లుల అధః పతనానికి కారణమైంది ముదిరిపోయిన బల్లిత్వమే ఎంచేతంటె తొంభయ్యేసి అడుగుల బల్లులు పుట్టుకొచ్చి, "మేం సూపర్ బల్లులం," అన్నాయి (సూపర్ వంకాయలల్లే) మిగతా తక్కువ సైజు (75 అడుగులు మాత్రమే) గల బల్లులన్నీ తమకు బానిసలని, తాముమటుకు సాక్షాత్తు దేముడి కొడుకులనీ వాదించినై అది రుజువు చెయ్యటానికి గాను ఆ చుట్టు ప్రక్కల ఉన్న చెట్లూ చామలూ అన్నీ వేళ్ళతో సహా నమిలి వేసినై (ఆర్యబల్లులు శాకాహారులు ) పర్యవసానం ఏమిటంటే బల్లుల వైభోగం అంతమయి ఈ నాటికి మనకీ నాలుగంగుళాల బల్లులే మిగిలినై

* * *

తెలుగు వాళ్లకి తెలుగుతనం లేదు లేదని నలుగురూ అంటే నేనూ నిజమేననుకున్నాను పైదేశాలు తిరిగి, అక్కడ హిందీపేర్లు పెట్టుకుని, ఇంటో కూడా హిందీయే మాట్లాడుతూ, తెలుగు జాతి పేరెత్తితే తిట్టిపోస్తూ తెలుగు కళల్ని గురించి తమకుగల అపార అజ్ఞానానికి పట్టలేకుండా గర్విస్తూఉండే సూపర్ బల్లుల్ని- పొరపాటు, సూపర్ తెలుగువారిని చూస్తూంటే, వాళ్లల్లో తెలుగుతనం లోపించలేదనీ, మీద మిక్కిలి ముదిరిందని తెలుసుకున్న వాణ్ణి అయినాను

ఆనందవాణి 11-6-1944

# 2. స్త్రీత్వం

తొలి ప్రాణుల్లో ఆడామగా వివక్షత ఉండేది కాదు అవి సూక్ష్మశరీరాలుగా ఉండి కొద్దిపాటి అంగాలు కలిగి ఉండేవి అవి పెరిగి పెరిగి చివరకు రెండుగా చీలిపోయేవి పరిణామంలో ప్రాణుల శరీరాలు పెద్దవై అంగాల సంఖ్య జాస్తీ అవుతూన్న కొద్దీ స్త్రీ పురుష వివక్ష ఏర్పడింది

ఆడామగా వ్యత్యాసం కేవలమూ జీవరాసుల ప్రచారాలకే ఉపకరిస్తూ వచ్చింది ప్రకృతి అనే విధికి కట్టుబడిన జంతుజాలం తగిన ఋతువులో సంసారంచేసి తద్వారా తమతమ జాతులను పెంపొందించుకునేవి సంగమించటం ఓ సరదా అనే సంగతి వాటికి తెలీనుకూడా తెలీదు పైగా అది వాటికి ఓ పెద్దశ్రమతో కూడిన పని కొన్ని జంతువులు రకరకాల రంగులు ధరించీ మరికొన్ని రకరకాల మోతలు చేసీ, ఇంకాకొన్ని రకరకాల నృత్యాలు చేసీ నానా హైరానా పడేవి ఈ హైరానా కూడా మగ జంతువులే జాస్తిగా పడేవి "నేనీ శ్రమంతా పడలేను హాయిగా బ్రహ్మచారిగా ఉండి పోతే ఇంత పరమైనా ఉంటుంది!" అని ఆలోచనే వాటికొచ్చేది కాదు

ఇంక మనిషి దగ్గిరకొచ్చేటప్పటికి ఆర్థిక సమస్యకే ప్రాధాన్యం వచ్చింది మొదట్లో ఉంటూవచ్చిన ఆడవారసత్వాన్ని మేనరికపు పెళ్ళిళ్ళ ద్వారా మగ వారసత్వంలోకి మార్చుకుని ఆడదాన్ని మగవాడు పూర్తిగా దోపిడి విధానానికి గురిచేసి, తన భార్య కన్న పిల్లలకి తన ఇంటి పేరు పెట్టటం ప్రారంభించినాక మగవాడు ఆడదాన్ని ఆకర్షించటానికి అట్టే శరీర శ్రమ పడనవసరం లేకపోయింది ఆడదే తన అన్న వస్త్రాలకు గాను మగవాణ్ణి ఆకర్షించేటందుకు నానా శ్రమలూ పడటం అవసరమయింది పిల్లలూ ఆర్థిక సమస్యే గనక మైథునం పిల్లల్ని కనటానికి గాక వినోదార్థంగా పరిణమించింది

అయితే అదృష్ట వశాత్తూ ఇది ఇక్కడితో ఆగిపోలేదు దోపిడి విధానమనేది మగవాడు ఆడదాని మీద ప్రయోగించి దాచి పెట్టిన అస్త్రం కాదు అది ఇంకా ప్రయోగం అవుతూనే ఉంది రానురాను అధిక సంఖ్యాకులైన మగాళ్లు ఆర్థికంగా ఆడాళ్ళల్లో చేరిపోతున్నారు అందుచేత ఆమె తన ఆర్థిక సమస్యలు పరిష్కారం కావటానికి మగవాడి మీద ఆధారపడి లాభంలేదని తెలుసుకుంటున్నది

ఈ పరిస్థితి ముదిరిన కొద్దీ మగవాడినుంచి విముక్తి పొందటానికి ఆడదానికి- అనగూడదు కాని-రెండు సాధనాలున్నై మొదటిది మగవాణ్ణి దూరంగా ఉంచేటందుకు రెండోది దగ్గిరికొచ్చిన మగాణ్ణి నిరుత్సాహ పరిచేటందుకు!

రాను రాను మాతృత్వం నశిస్తూ వస్తున్నది దీన్ని గురించి అపోహలున్నై మాతృత్వం లేకపోవటం స్త్రీత్వానికి లోపమనుకోవటం పొరపాటు మనం రాను రాను ఇన్‌స్టింక్ట్స్ మీద బతకటం తగ్గించి జ్ఞానం మీద బతకటం నేరుస్తున్నాం ఒక వేళ మాతృత్వం లేకపోవటం ఆడదాన్లో లోపమే అనుకున్నా అది ఆడవాళ్ళ తప్పెన్నటికీ కాదు ఎందుకంటే, సృష్టిలో మగప్రాణుల్ని ఆకర్షించే భారం మీదేసుకున్న ఆడ ప్రాణులేవైతే ఉన్నాయో అవి పిల్లల్ని పెంచే భారం మగప్రాణుల మీదనే వేస్తున్నట్టు సైన్సు పుస్తకాలు ఘోషిస్తున్నై (ఘోషించటం పుస్తకాలకుండే దురలవాటు)

ఆడవాళ్ళల్లో కలుగుతున్న ఈ ఏర్పాటు కనుగుణ్యంగా రాను రాను మగ ప్రాణులు రోజూ గడ్డాలు గీక్కోవటమూ, అందమైన దుస్తులు ధరించటమూ, ఖరీదైన కేశ లేపనాలతో జుట్టు నున్నగా నిగనిగలాడేట్టు దువ్వుకోవటమూ, జేబులో చిన్న అద్దాలూ దువ్వెనలూ మొయ్యటమూ నేరుస్తున్నారు

ఇది చాలా శుభ శకునం మానవజాతికి, ఎందుచేతనంటే ఈ విధంగా నన్నా మనం ఇతర జంతువుల్లో గౌరవనీయమైన స్థానం సంపాదించి ప్రకృతి నిర్దేశాను సారం జీవించి, మనకంటె ఉత్తమమైన మృగం సృష్టి అయేదాకానైనా మానవుడిదే సృష్టిలో అగ్రస్థానం అని చెప్పుకునే అవకాశం ఉంటుంది లేనట్టయితే మానవజాతి అంతులేని "ఏరియా"* వ్యాధుల వాతపడి నిర్మూల మైపోవటం జరగొచ్చు

ఆనందవాణి 18-6-1944

## 3. భగవత్స్వరూపం

మన అదృష్టంవల్ల భగవంతుడి తాలూకు అవతారాలు పది దక్కినై కాని ఆ పదింటి తోనూ భగవంతుడు అవతారాలు చాలించాడనుకోవటం పొరపాటు ఎందుచేతనంటే ఎనిమిదో అవతారమైన శ్రీకృష్ణావతారంలో భగవంతుడు ఆ యొక్క అర్జునుడితో చంధోబద్ధంగా, యదాయదాహి ధర్మస్య వగైరా, వగైరా అని చెప్పిన లెక్క ప్రకారం ధర్మహాని జరిగినప్పుడల్లా అవతరించక తప్పేది లేదు కల్క్యవతారంతో మనుష్యులు శాశ్వతంగా ధర్మపరులై పోరు గనక భగవంతుడిటీవల చాలా అవతారాలెత్తాడు అయితే వాటిని గురించి రాయటానికి మహానుభావుడు వ్యాసులవారు లేక పోవటం మూలాన వాటి తాలూకు రికార్డులేక పోయింది ఈ లోపం తీర్చటానికి భగవంతుడి లేటెస్టు అవతారం గురించి ఇక్కడ మహాటూకీగా రాస్తున్నాను

ఇది పందొమ్మిదో అవతారమా ఇరవై ఒకటో అవతారమా అనేది ప్రస్తుతం తీవ్రంగా చర్చించబడుతూంది అవతారాల లెక్కలోంచి గుంటూరు మస్తాను సాయిబును తీసేసి, వివేకానంద స్వామినీ రామకృష్ణ పరమహంసనూ నరనారాయణులుగా ఎంచి ఒకే అవతారంగా లెక్కేస్తే ఇప్పుడు నేను రాయబోయే "హారీ దాదా" పందొమ్మిదో అవతారం అవుతాడు కాని ఈ విధంగా అవతారాల సంఖ్యను సంక్షేపించటాని కాక్షేపణ గలవాళ్లిది ఇరవయ్యొకటో అవతారమని బల్లగుద్ది చెబుతున్నారు ఇది ఇక్కడ మనకప్రస్తుతం

---

* మెదడు పైభాగాన్ని 'ఏరియా' అంటారు

"హారీ దాదా" జోలాధారా బొందో పాధ్ధాయ్‌యొక్క పన్నెండో కుమారుడు ఈయన మూడేళ్ళ వయసులోనే చాలా ఉపద్రవమైన శక్తి సామర్థ్యాలు కనబరిచాడు ఈ వయసులోనే ఆయన ఒక్కొక్క తడవ పదేసి దినాలపాటు మలవిసర్జన చేసేవాడు కాదనీ, ఒకటి రెండు రోజులు సహితం ఆహారం స్వీకరించక తదేక యోగసమాధిలో ఉండి పొయ్యేవాడనీ చెబుతారు అంత చిన్నతనంలో కూడా ఆయనకు తాగుడుగాని, ధూమపానంగాని, పరస్త్రీ గమనంగాని తదితర దురలవాట్లుగాని లేవని ఘట్టి దాఖలా ఉంది

ఒకసారి దాదాగారు కలలో తల్లికి కనిపించి, "అమ్మా నేను నీ కొడుకునై పుట్టాను" అని అన్నాడట ఆమె వెంటనే కలలో నుండి లేచి కొడుకు పాదాలు కళ్ల కద్దుకున్నదయింది

మరొక సారి దాదాగారు తన తల్లితో, "నాకు తండ్రి ఎవరు?" అని అడిగారట అంత చిన్న వయసులోనే ఆయన తాను భగవంతుణ్ణని ప్రపంచానికి కోడి అయికూశాడన్నమాట

పదియేళ్లయినా రాకపూర్వమే దాదా గారు నాలుగో క్లాసు కుర్రాళ్లను మించిన జ్ఞానం ఇంగ్లీషులోనూ గణితంలోనూ ప్రదర్శించటం చూసి ఆయన ఉపాధ్యాయులేగాక జిల్లా కోర్టు ప్లీడర్లూ, వాళ్ళ గుమాస్తాలూ మొదలైన భక్తులచ్చెరువు చెందారు

ఈయన లక్ష్మి అవతారమైన రోజునే దేవిని పెళ్ళాడి, వారం రోజులు ఏకదమ్మున మరొకంటికి కనిపించకుండా అత్తవారింట కూర్చున్నట్టు చెబుతారు ఆ తరవాత కూడా ఆయన భార్య రహితంగా ఒక్క ఫొటోకూడా తీయించుకోలేదు

ఈ మధ్యను కొందరు భక్తులు చందా వేసుకుని ఓ లక్ష రూపాయల ఖరీదుచేసే గుడి ఒకటి ఆయన పేర కట్టింతామనుకోగా దాదాగారు సమ్మతించక తనవంటి సామాన్యపు అవతారానికి గుడి కూడదనీ, అది రామకృష్ణావతారాలకే చెల్లిందనీ, తను ఈ విషయంలో కూర్మవరాహావతారాలతో సాటి వాడనీ చెప్పి, ఆ లక్షా తాను స్వీకరించి భక్తులకు జన్మరాహిత్యం ఇచ్చే శాడు (ఇంకా కొందరికి జన్మరాహిత్యం ఇంకా సంప్రాప్తం కాలేదు )

దాదాగారి భావం దురూహ్యం కాదు, ఇది స్వయం సహాయక యుగం వెనక వేటికిగాను ఇల్లు దాటి పోతూ వచ్చామో అవన్నీ ఇప్పుడింట్లోనే చేసుకుంటున్నాం క్షౌరమూ, బట్ట ఇస్త్రీ, వ్యాధిచికిత్సలూ మొదలైనవి గృహపరిశ్రమ లవుతున్నై భగవధ్యానం కూడా అంతే దాదాగారి పరం ఇంటో పెట్టుకుని ఆయన నామసంకీర్తన చేసేవారు దబ్బున తరించిపోతారు ఫొటో వెల భక్తులకు రెండు రూపాయలు మాత్రమే

ఆనందవాణి,వారపత్రిక 9-7-1944

# 4. వైద్యం

వెనక నాటు వైద్యులుండేవాళ్ళు వాళ్ళు రోగిని మణికట్టు దగ్గర మూడు వేళ్ళతో ముట్టుకుని రోగ నిదానం చేసేవారు పాపం, వాళ్ళకి 'ఎనాటమీ' ఏమిటో, ఫిజియాలజీ ఏమిటో, రక్త పరీక్షలేమిటో ఏమీ తెలీవు వాళ్ళు రోగం జోలికి గాని రోగలక్షణాల జోలికి గాని వెళ్ళేవాళ్ళు గారు "దగ్గుగా ఉంటుంది, నాయనా! రాత్రిళ్ళు నిద్దర పట్టి చావదు! ఒళ్ళంతా తీపులు" అని రోగి చెబితే, "పోతుంది లేవమ్మా! ఉండదూ మరీ" అంటూ సమాధానాలు చెప్పేవాళ్ళు

వాళ్లు వాడే మందులు కూడా మామూలుగా మూలికలే జాస్తిగా వాడేవాళ్ళు మూలికల్లో శరీరానికి అవసరమైన ద్రవ్యాలు శరీరంలో హరించే స్వరూపంలో ఉంటై మామూలు చిల్లర వ్యాధులకి ఏ పిప్పళ్ళో, జీలకర్రో, వామో, కరివేపాకో, శొంటో, మిరియాలో వాడేవాళ్ళు కాస్త మంచాన పడ్డ రోగికి కుప్పెకట్లు వాడేవాళ్ళు, దీర్ఘ వ్యాధులకు భస్మాలూ అవీ వాడేవాళ్ళు ప్రమాదిస్తే రసవిష గంధకాదులు వాడేవాళ్ళు

ఆహారం ఇవ్వటం దగ్గిర కొస్తే "లంఘనం పరమౌషధం' అన్నం కోసం ఏడిస్తే కాని పెట్టకండి" అనే వాళ్ళు ఇప్పుడు వైద్యమంటే ఇదంతా ఏమీలేదు ఐదేళ్ళు పడిచదవాలి ఫిజిక్సూ, కెమిస్ట్రీ, జువాలజీ, బోటనీ మొదలైన శాస్త్రాలన్నీ అవగాహన చేసుకోవాలి రక్తమూ, అల్పాచమానమూ, కళ్లె మొదలైన వన్నీ భూతద్దాల్లోంచి చూడాలి మందులు పొట్టలోకి పోయి పని చేయక పోతే రక్తంలోకైనా ఎక్కించి తీరాలి ధర్మామీటర్లు పెట్టి రక్తం వేడి కొలవాలి నాడిని గడియారంతో కొలవాలి దూషులు చెయ్యాలి, ఎనిమాలు చెయ్యాలి రోగి ఆహారం వమనం చేసుకునే పక్షంలో ఆహారాన్ని చేతుల్లోకో ఆసనంలోకో ఎక్కించాలి గాని విడవరాదు

"ఫలానాచోట నెప్పిగా ఉందండీ, డాక్టరు గారూ!" అంటే, అన్నదే వ్యవధానంగా ఆ ప్రదేశమంతా వొత్తి చూస్తాడు, ఆడదయేది, మగవాడయేది! మంచి నీళ్ళు కూడా ఇమట్టంలేదంటే అది కట్టేటందుకు విషం లాంటి మందు పావుగంట కోసారి పొట్టలో పోస్తాడు వమనం చేసుకుంటే, మందుపని చెయ్యక్కర్లేదా అని కోప్పడతాడు

ఈనాటి దౌర్భాగ్య దామోదర డాక్టర్ను చూస్తూ ఉంటే, "వీడికి శరీరం తాలూకు భాషేమన్నా తెలుసునా?" అనిపిస్తుంది "శరీరం నన్ను ముట్టుకోకో!" అంటుంటే పొట్ట "నాకు బరువేమీ వొద్దో!" అంటుంటే వీడు వినిపించుకోడేమా అని పిస్తుంది కాని అది వాడి తప్పు కాదు వాడి జ్ఞానం యావత్తూ శవాలను కోసీ, రోగానికి లొంగిపోయిన శరీరాలను పరీక్షించి నేర్చుకున్నది ఆరోగ్యంగా ఉన్న శరీరాలు రోగాన్ని తీవ్రంగా ఎదుర్కొనే దశలో ఏ భాష మాట్లాడుతాయో, పాపం, వాడేమెరుగూ?

ఏ లక్షణాలు చూసి నాటు వైద్యుడు, "రోగానికా లక్షణాలుండవా ఏమిటీ?" అంటాడో ఆ లక్షణాలను మన చదువుకున్న నిర్భాగ్యుడు అణిచిపెట్టి, వాటిని ఎదుర్కొనే శక్తి రోగికి లేకుండా చేసి తన చేతపడ్డ నాలుగోరోజుకే రోగిని దీర్ఘరోగిగా మార్చి వారం తిరక్క మునుపే ముంచెయ్యగలడు

నాటు వైద్యుణ్ణి ఇదేమి రోగమని అడగ్గలం, వాడు చెప్పగలడు వాడు చెప్పిన దాన్ని బట్టి మనం ఈ రోగం నయం కావడానికి ఇంతకాలం పడుతుంది, ఇది నయ మయే అవకాశాలీ పాటి ఉన్నై అని ఊహించవచ్చు అకస్మిక మరణాలూ, విడ్డూరపు చావులూ ఉండవు కాని ఈ చదువుకున్న వైద్యులతో అట్లాకాదు ఇవాళ్ల మీ దగ్గిరకూచుని నవ్వుతూ కబుర్లు చెప్పిన భార్య వారం తిరగొచ్చేటప్పటికల్లా మీ ఎదట ఇంత బూడిద అయిపోవచ్చు నామాట నమ్మండి

ఆనందవాణి వారపత్రిక 16-7-1944

# 5. మానవత్వం

మనిషి చాలా గొప్పవాడు సృష్టిలోకల్లా ఉన్నతమైన ప్రాణి మృగాలన్నిటినీ మించిన మృగం ఆ మాట కొస్తే అసలు మృగమే కాదు ఎందుకంటే మృగాలకు లేని బుద్ధి ఒకటి మానవుడికున్నది దాంతో మానవుడు జ్ఞానార్జన చేసి దూరాన్ని నిర్మూలించాడు పదార్థాన్ని లోబరుచుకున్నాడు

ప్రపంచంలో ఉన్న మనుషులంతా ఒకటి కాగలరు– ఇంకే జాతిమృగాలూ ఈ పని చెయ్యలేవు ప్రపంచంలో ఉన్న అందరు మానవులకూ అవసరమైన భౌతిక సంపద సృష్టించేటందుకు సాధనాలున్నై

కాని ఏం ప్రయోజనం?

పశుత్వం మానవుణ్ణి తనవశం చేసుకుంది

"మేం మీ అందరికన్నా ఎక్కువగా పుట్టాం! మాలో ఎక్కువైన రక్తం ప్రవహిస్తున్నది" అంటారు కొందరు జాతి కుక్కలు వాళ్ళ శునకత్వం అంతర్జాతీయ రాజకీయవ్యవస్థని తారుమారు చేస్తుంది

అగ్రవర్ణాలూ, శ్వేతవర్ణాలూ పశుత్వాన్ని ప్రకోపింప జేస్తున్నై

లోభత్వమూ, అధికార మదమూ, స్వార్థమూ చట్ట సమ్మతంగా విజృంభిస్తూ ఉన్నై

సంపద అభివృద్ధి అయినకొద్దీ దారిద్ర్యం మీరిపోయి, అధిక సంఖ్యాకులు అన్నవస్త్రాల కోసం అరణ్య మృగాల వైఖరి అవలంబించవలసి వస్తూఉంది

కలవాడి కాపీనం సన్నిపాతజ్వరంవాడి ప్రలాపం కిందికి దిగుతూ ఉంది

ఈ పరిస్థితికి నేనేమీ అభ్యంతరం చెప్పను ఎటువంటి సాంఘిక వ్యవస్థకూడా దాని సహజ పరిణామాన్ని అదే నిర్ణయించుకుంటుంది

కాని ఈ వాతావరణంలో సహితం మానవత్వ మనేది ఎందుకింకా చావకుండా వ్యాప్తి చెందుతున్నది? ప్రేమించదగిన మనుష్యులింకా ఈ ప్రపంచంలో ఎందుకున్నారు? ఒకరికోసం ఒకరం ఇంకా సహజ ప్రేరణ లెందుకు నిగ్రహించు కుంటున్నాం? ఒకరి కోసం ఒకరం ఇంకా ఎట్లా బాధపడ గలుగుతున్నాం? పాతికేళ్ళ క్రితం అదృశ్యులైనవారికోసం కూడా మానవ హృదయం బాధపడ గలిగేటంతగా కాలాన్ని ఎట్లా ఇంకా జయించ గలుగుతున్నది? భౌతికావసరాలను మానసికావేదన లెందుకు అణగదొక్క గలుగుతూ ఉన్నై?

ఈ ప్రపంచంలో కూడా ఇంకా లక్షాధికారి కోటీశ్వరుడు కావటంకంటె దరిద్రులైన భార్యా భర్తలు తమ ప్రేమతో దారిద్ర్యాన్ని ఎదురీదటానికి విఫల ప్రయత్నం చెయ్యటం ఎక్కువైన సంగతా?

ఈ వాతావరణంలో కూడా ఒక ఫయాజ్ ఖాన్ 'వందే నందకుమారం' అని పాడితే హిందువులు ముగ్ధులై పోవటం ముఖ్యమైన విషయమూ? మానవత్వాన్ని దిగమింగే శక్తులు విజృంభిస్తున్న కొద్దీ ఈ మానవత్వం ఇంత నిక్కిపైకి పొడుచుకోస్తుంది దేనికి?

ఆనందవాణి, వారపత్రిక, 23-7-1944

# 6. సౌందర్యోపాసన

ఇప్పుడున్నంతగా వెనక అందానికి చలామణి ఉండేది కాదు ఎవరన్నా అందమైన వాళ్ళుంటే వాళ్ళ అందాన్ని గురించి చెప్పుకునే వాళ్లు అందాన్ని గౌరవించటం తప్ప అప్పటి వాళ్ళ కింకేమీ తెలిసేదికాదు అందగత్తెకి అనాకారి మొగుడు గాని అందగాడికి అనాకారి పెళ్ళాంగాని జతపడితే కాకి ముక్కుకు దొండపండనే సామెత స్మరించుకుని అంతతో పోనిచ్చేవాళ్ళు అంతేగాని అందానికి సాంఘిక మైన విలువేమీ ఉండేదికాదు

ఇప్పుడట్లా గాదు అందం ప్రత్యేకతల్లో ఒకటి దానికి ఓ విధమైన చలామణి ఉంది

"అబ్బాయికి ఆస్తిపాస్తులున్నాయా?"

"తగుమాత్రం"

"చదువు సంధ్యలు?"

"తగుమాత్రం"

"అందచందాలు?"

"అవే కాస్త–"

సంబంధం వెనక్కు పోతుంది

"మంచి పిక్చరోయ్ "

"స్టారెవరో?"

"గిలకల రాణి "

"పాడుతుందటనా?"

"ఏంపాటలే!"

"నటన?"

"షుమారు"

"సెక్స్ అప్పీల్?"

"అడిగావ్?"

సినిమా ప్రోగ్రాం ఖరారు

సౌందర్యోపాసన విషయంలో ఆడమ్మాయిలు మొగబ్బాయిలతో చాలా తీవ్రంగా పోటీ చేస్తున్నారని చెప్పాలి

మగవాళ్ళు ఆడవాళ్ళ అందం చూస్తున్నా మనుకుంటున్నప్పుడు కేవలమూ అంగసౌష్టవం మాత్రమే చూస్తూంటారు (చలంగారు మన కుర్రకారుకు నేర్పిన విద్యకు ఫలితం కాబోలు!) కాని అడమ్మాయిలు సౌందర్యం విషయం చాలా లోతుగా వెళ్ళటం కనిపిస్తూ ఉంది వాళ్ళెక్కిన బస్సు కండక్టరుగాని, వాళ్ళకు టిక్కెట్టిచ్చిన బుకింగ్ క్లర్కులుగాని, అ టిక్కెట్లు వసూలుచేసే టిక్కెట్టు కలెక్టర్లుగాని, వాళ్ళు బేరం చేసిన షాపులు అసిస్టెంట్లుగాని అందంగా ఉన్నప్పుడు వాళ్ళు పొందే వేదన చూసే వాళ్ళకే చాలా కష్టంగా ఉంటుంది

బట్టలు వేయించుకోటానికి ఇంటికొచ్చే ముసలి చాకలివాడు సహితం అనాకారిగా ఉన్నందుకు వారం వారమూ, వాణ్ణి చూసినప్పుడల్లా, వేదనపడే ఆధునిక అమ్మాయిలున్నారు

ఇప్పటి వాళ్లంతగా వెనకటి వాళ్ళు సౌందర్యో పాసకులు కాకపోవటానికి కొక కారణం కనిపిస్తూ ఉంది నాగరికత అనగా ఏమిటో తెలీని ఆ రోజుల్లో నూటికిద్దరో ముగ్గురో అందగాళ్ళుండేవాళ్ళు ఏడెనిమిదిమంది బొత్తిగా అనాకారి వాళ్ళుండే వాళ్ళు మిగిలిన తొంభైమందిని గురించీ ఏమనుకోటానికి ఉండేది కాదు అదీకాక అందం భగవంతుడిస్తే కద్దు, లేకపోతే లేదు అందుచేత అప్పటివాళ్లు అందంకన్న ఆరోగ్యం గురించి అధికంగా తాపత్రయ పడేవాళ్ళు పైన చెప్పిన తొంభైమందికీ ఆరోగ్యమే అలంకారంగా ఉంటూ ఉండేది

ఇప్పుడట్లా కాదు ఇప్పుడందం బాజార్లో డబ్బీల్లో అమ్ముతుంది నామాటలో నమ్మకం లేకపోతే ప్రకటనలు చూడండి అనేక పూతలు మిమ్మల్ని – కనీసం మీ మొహాల్ని – తెల్లగా, నున్నగా, నిష్కళంకంగా, నవనవలాడేట్టు చెయ్యటానికి సిద్ధంగా ఉన్నై అనేక మందులు మీ కురులు పెంచి నిగనిగ లాడేట్టు చెయ్యటానికి సిద్ధంగా ఉన్నై అనేక మిల్లుల బట్టలు మీ సౌందర్యాన్ని పెంపు చెయ్యటానికి సిద్ధంగా ఉన్నై ఈ నాగరికత ఇంకొంచెం పెరిగినాక ప్రకటనలు మీ జీవితాన్ని మరింత మధురంగా చెయ్యనున్నై అదెట్లాగంటే, మీ భార్య అందంగా లేకపోయినా, మీ భార్య వొంటిమీద రోమాలున్నట్టుగాని, ఆవిడకు చెమట పట్టుతుందని మీకు దాఖలా ఉన్నా మీరావిణ్ణి విసర్జించి ఇతర ఆడవాళ్ల వెంట పడమని సూచించుతై మీరా సూచన అందుకుని మీ భార్యను తప్పించుకు తిరగటం నేర్చిన తరవాత ఈ ప్రకటనలే మీ భార్యను కొన్ని మందులద్వారా ఆదర్శప్రాయమైన అందగత్తెనుగా చేసి మళ్ళీ మీ ఇద్దర్నీ కలిపేస్తయ్! ప్రకటనలలో మీ జీవితం తాలూకు బొమ్మలన్నీ ఉంటై ఆఖరు బొమ్మలో మీరు మీ భార్యా కావిలించుకొని ముద్దు పెట్టుకోటం చిత్రించబడుతుంది మీ కథ, హరిశ్చంద్రాదుల కథలకన్నా ప్రచారంగడించి అన్ని పత్రికల్లోను అన్ని భాషల్లోనూ ప్రకటితమవుతుంది

సౌందర్యం ఇంతగా ప్రచారం కావటానికి సినిమాలు కూడా యధాశక్తి తంటాలు పడుతూ ఉన్నై

అయితే, ఇప్పటి ఈ పులుముళ్ళ సౌందర్యం కృత్రిమ సౌందర్యమని కొందరు చాదస్తులు అభ్యంతరం చెప్పొచ్చు కాని దీనికి చెప్పుపుచ్చుకొని కొట్టినట్టు సమాధానం ఉంది అదేమిటంటే సౌందర్యం సౌందర్యం కోసమే అందమైన మూతి చూడగానే ముద్దు పెట్టుకో బుద్ధి పుట్టే వాళ్ళు లిప్‌స్టిక్ చూసి భయపడాలిగాని అందాన్ని కళ్ళతో గ్రోలదలచిన వాడికి పులుముళ్లు అడ్డం రావే!

వెనకటి ప్రబంధ నాయకులు నాగరికతలేక అందగత్తె అయిన నాయికను చూడగానే ఆ అందాన్ని అనుభవించటం కోసం తహతహలాడి మదనజ్వరం తెచ్చుకునేవాళ్లు ఇప్పటి నాయకులు అట్లా కాదు క్షయతో తీసుకుంటున్న మనిషి తాలూకు అందం కేసి ఆకలిగా చూసిన ఆధునిక అబ్బాయిలను నేను స్వయంగా ఎరుగుదును

ఈ పద్ధతులమీద సౌందర్య పిపాస భారతీయుల్లో అభివృద్ధి చెందాలేగాని మనకు స్వాతంత్ర్యమూ దారిద్ర్యమూ సమస్యలు లేకుండా పోవా?

ఆనందవాణి, వారపత్రిక 30-7-1944

# 7. స్థయిర్యం

దౌర్జన్యాన్నీ, బాధనీ, కష్టాలనీ ఎదుర్కొనే శక్తి – "మొరాల్" – ఇది దైనిక జీవితంలో అంతకంతకీ మందగిస్తున్నది

జీవితంలో ఉన్న బాధా, కష్టాలూ అనివార్య మైనవి కావనే జ్ఞానం వ్యాపించి మనుష్యులు నాజూకు తేలుతున్నారు కాని వాటిని తగ్గించుకునే టందుకుగాని, పూర్తిగా నివారించుకునేటందుకు గాని ప్రయత్నం జరిగే సూచనల్లేవు

ఈ లోపుగా దౌర్జన్యమూ, బాధా, కష్టాలూ పెరిగిపోతున్నై వాటికి తట్టుకునే స్థయిర్యంమటుకు తగ్గిపోతున్నది

దీనికి తార్కాణం, నానాటికీ ఎక్కువవుతున్న నరాల జబ్బులూ, వాటిని అంటిపెట్టుకుని పెరుగుతున్న నరాల జబ్బుల మందుల సంఖ్యా, కవిత్వమూ, రచనల్లో కనిపించే చిరాకూ, సంఘంలో కనిపించే భయమూ అస్థిమితా వగైరా

వెనకటి వాళ్ళని జబ్బులూ, చావులూ, నష్టాలూ ఇంతగా బాధించకపోవటానిక్కారణం వాళ్ల కుండిన భౌతిక వాతావరణపు పోటీలు తమ జీవితంలో ఓ ప్రళయమైన మార్పు గలిగినా వాళ్ల చుట్టూ ఉన్న మారని వాతావరణం వారిని నిలపెట్టేది, వాళ్ళు త్వరలోనే మళ్ళా ప్రపంచంలో పడగలిగేవాళ్ళు ఇళ్ళూ వాకిళ్ళూ, గొడ్డూ గోదా, చుట్టపక్కాలూ అంతా ఎప్పటిమాదిరిగానే కనిపించేవి సానుభూతీ అనునయింపూ అందుబాటులో ఉండేవి

భౌతిక వాతావరణపు పోటీలేగాక మానసికంగా కూడా వాళ్ళు కొంతమట్టుకు వేదాంతమూ, మూఢవిశ్వాసాలూ అవలంబించి కష్టాల నెదుర్కోగలిగేవాళ్ళు

ఈ రెండు విధాల ఆధారాలూ క్రమంగా మనకి ఎడమైపోతున్నాయి సాంఘిక వాతావరణం డబ్బుకు లోకువైపోయింది సంఘంలో మనకుండే స్థానాన్ని నిర్ణయించే భారం డబ్బుమీద వేసేశాం

సానుభూతీ, స్నేహభావమూ మొదలైన వాటికి విలువ తగ్గి ఖ్యాతికీ, హోదాకీ ప్రాముఖ్యం వచ్చేసింది, మన తోడబుట్టిన వాళ్ళుకూడా మన ఆర్థిక వైభవాన్ని గుర్తించి తీరాలనేది పట్టుకుంది మనల్ని లేదా డబ్బుకోసం మనం వందల మైళ్ళూ వేలమైళ్ళూ పోవలసిన స్థితి పుట్టింది నెలకు పాతిక రూపాయల సంపాదనకోసం 800 మైళ్ళు పోయిన ప్రాణుల్ని నేను స్వయంగా ఎరుగుదును ఇందువల్ల డబ్బుకోసం భౌతిక సాంఘిక వాతావరణం కాస్తా పోగొట్టుకొనటం జరుగుతున్నది

ఇక మానసికంగా మనం ఎస్కేపిస్టుగా తయారయి ఆనందంకోసం సినిమాలు చూడటమూ, అనుక్షణమూ మరో ప్రపంచంలో మానసికంగా విహరించటమూ నేర్చుకున్నాం

మనకి జబ్బు మనుష్యుల్ని చూడటానికి భయం, శవాల్ని చూడటానికి భయం, ఆప్తుల్ని కోల్పోయినవాణ్ణి వెళ్ళి పరామర్శించటానికి భయం

అదృష్టవశాత్తూ పెట్టుబడిదారీ మన కీవిషయంలో తోడ్పడటానికి సిద్ధంగా ఉంది జబ్బు వాళ్లనీ గర్భిణులనీ ఏ ఆసుప్రతికో పంపెయ్యండి మనం లేని లోటు తీర్చటానికి నర్సులున్నారు

ఆడపిల్లలకి గర్భధారణ అంటే భయం. దానికీ పెట్టుబడిదారీ దయవల్ల విరుగుడుంది. పత్రికల్లో ప్రకటనలు చదవండి.

కొందరమ్మాయిలకి అంటు గిన్నెలు చూస్తేనూ, చీపురుకట్టలు చూస్తేనూ కూడా భయమే. ఫరవాలేదు, పని మనుషులున్నారు.

కాని ఈ నర్సులూ, ఈ వంట వాళ్ళూ, ఈ పని వాళ్ళూ – వీళ్ళ సంగతేమిటి? పెట్టుబడిదారీ వీళ్లకేం సహాయం చేస్తుంది? ఏమీలేదు. కాని పెట్టుబడిదారీ మొదలు తెగిన మానల్లే విరిగి పడిపోతే మనమంతా భయంచేత ఆవులించి ప్రాణాలు వదిలిన తరవాత ఈ స్థిరాత్ములు ప్రపంచమంతా కసువూడ్చి హాయిగా జీవించ గలుగుతారేమో!

ఆనందవాణి, వారపత్రిక, 6-8-1944

# 1. రష్యాపై చిల్లర దండయాత్రలు

(రష్యామీదికి దండెత్తిన హిట్లరు ముక్కుపగిలి ఇంటిదారి పట్టాడు ఇది భరించలేక నాటు హిట్లర్లు రష్యామీద చిల్లర దండయాత్రలు సాగించారు ఇంకా సాగించనున్నారు వారికి చేయూతగా నేనూ రెండు ముక్కలు రాద్దామని ) విన్నారా? రష్యా అంటే ఏమిటో, ఏమిటో, ఏమిటో అనుకున్నామా అన్నీ వొట్టిదేట! అంత ఇదేమీ లేదుట!

సోషలిజం, సోవియటిజం అన్నారా? అక్కడ కూడా మనమాదిరిగానే కాళ్ళమీదే నడుస్తారుట బుర్రలు కిందకి పెట్టి నడవరుట!

ఇదిగో, ఇక్కడ స్వేచ్ఛాప్రణయం కూడా లేదుట! వాళ్ళూ పెళ్లిళ్లాడి పిల్లల్ని కంటారుట! గర్భస్రావాలూ అవీ అట్టేలేవుట! అదేం ఆదర్శదేశమండీ? తెలీకడుగుతానూ! మనవంటి సంస్కార ప్రియులం అయిదునిమిషాల పెళ్ళిళ్ళు తప్ప ఆమోదిస్తామా?

అయిందా? ఆ రష్యాలో అందరికీ సమానంగా జీతాలివ్వరుట ఎక్కువ పనికి ఎక్కువా తక్కువ పనికి తక్కువా ఇస్తారుట ఇదేగామాలు సామ్యవాదమంటే! మన దేశంలోనే నయం! పదెకరాలుంటే ఈ యుద్ధం రోజుల్లో హాయిగా కాలిమీద కాలేసుకుని కడుపులో చల్ల కదలకుండా కూచోవచ్చు

చెప్పుకుంటే సిగ్గుచేటు, రష్యాదేశంవాళ్ళు కూడా గుండుదెబ్బలకి చస్తారుట! యుద్ధంలోకి పోవటమంటే వాళ్ళకీ భయమేట! వాళ్ళల్లో కూడా జర్మనీ దెబ్బకి తట్టుకోలేక పారి పోయినవాళ్ళున్నారుట ఎట్లా అయినా ఆ జర్మనీ వాడి దెబ్బ వేరండీ! ఇటువంటి రష్యావాళ్ళు ఆఖరుకు ఎట్లా గెలిచారని మనకో సందేహం రావచ్చు నా అభిప్రాయం ఏమంటే ఆ స్టాలినున్నాడే, వాడు కాస్తా సైనికుల్ని భయపెట్టి ఉంటాడు, పారిపోయి వచ్చారంటే చంపుతారని అందుచేత వాళ్లు యుద్ధం గెలిచివుండాలి అయినా అప్పుడే రష్యా సంగతి అయిందిట్లే?

ఇంకో సంగతి విన్నారో లేదో, రష్యాలో ఫాక్టరీలలో అపరిమితంగా పనిచేస్తారుట పనివాళ్ళు సమ్మెలూ అవీ చెయ్యరుట పాపం! ఆ పనివాళ్ళను తలుచుకుంటే కడుపు తరుక్కుపోతుంది సోషలిజం అంటే ఇదేనా? రోజూ ఒక జనరల్ స్ట్రయికయినా లేకపోతే అదేం సోషలిజం?

అన్నిటికన్నా –హోహ్హొహ్హో! నవ్వొచ్చేదేమిటీ, రష్యాలో కూడా జనం దేముళ్ళకి దణ్ణాలు పెట్టవచ్చుట! అక్కడకూడా దేశాభిమానమూ, దేశభక్తీ అన్నీ ఉన్నైట! ఇదంతా చూస్తే రష్యాలో కూడా ఫాసిజం బాగా ఉన్నట్టు మనం ఊహించుకోవాలి

నేనొక్క రహస్యం చెబుతున్నా వినండీ! బాగా యుద్ధం చెయ్యగల దేశం ఏదైనప్పటికి అది ఫాసిస్టు దేశమే అనుకోండి!

అన్నట్టు రష్యాలో కూడా సినిమాలూ, పుస్తకాలూ, పత్రికలూ, చిత్రకళా, పాటలూ, ఆటలూ, నగలూ, అందమైన దుస్తులూ, ఆడవాళ్ళ నోళ్ళకీ గోళ్ళకీ పూతలూ – అన్నీ ఉన్నై సోషలిస్టులకివన్నీ ఎందుకో!

త్వరలోనే రష్యాలో పెట్టుబడి విధానమూ, వడ్డీ వ్యాపారాలూ, అన్నీ రాబోతున్నట్టు రూఢిగా తెలుస్తున్నది ఇప్పటికే వచ్చేసికూడా ఉండొచ్చు వాళ్ళకి సామ్రాజ్య కాంక్ష పోతున్నది వాళ్ళు

మన మాదిరిగా అహింసనూ సత్యాగ్రహాన్నీ ఒప్పుకోరు కనకనే వాళ్ళింత తీవ్రంగా యుద్ధం చేస్తున్నారు

* * *

కాని నాకొకటే సందేహం ఇటువంటి చెత్తంతా రాసేవాళ్లేమని రాస్తున్నారు చదివేవాళ్లేమని చదువుతున్నారు

ఆనందవాణి 27-8-1944

# 2. మూడో ప్రపంచ మహాసంగ్రామం

ఈ రెండో ప్రపంచ మహాసంగ్రామం అయిపోవొస్తున్న కారణం చేత మూడో ప్రపంచ మహాసంగ్రామం రాకుండా ఆపుదల చేయ్యటానికి సూచనలు బయల్దేరుతూ ఉన్నై ఇందుకొరకు గాను పెద్దవాళ్లు పెద్ద ఆలోచనలు చేస్తుంటే చిన్నవాళ్లు తమ చిన్న తలకాయలతో చిన్న ఆలోచనలు చేస్తూన్నారు జనసామాన్యాని కెక్కువ ప్రమాదించేవి ఈ చిల్లర దండయాత్రలే

ఒకాయన చెబుతున్నాడు యుద్ధాలనిచూసి అసహ్యించుకుని లాభంలేదుట అవి జరగకూడదని మానవజాతి తీర్మానించుకొనాలిట (మానవజాతి అనుమతితో యుద్ధాలు జరుగుతూన్నట్టు!)

అసలీ తప్పంతా చరిత్రకారులిదట వాళ్ళు అలెగ్జాండరు, నెపోలియన్ మొదలయిన ప్రసిద్ధ సేనానులను పైకెత్తారుట అందుచేతనే యుద్ధాలు జరిగే అవకాశం జరుగుతున్నదిట (యుద్ధం చెయ్యటం చాతగాక, రణరంగంనించి పారిపోని సేనానులని వెయ్యాలని ఈయన తాత్పర్యమేమో!)

అసలు మూడోప్రపంచయుద్ధం గురించి మాట్లాడే ప్రతివాడూ ఆ యుద్ధాన్ని కాస్త కాస్త నిజం చేస్తున్నట్టు (ఈయనయొక్క ఎస్కేపిస్టు తత్వం ఇందులో బయట పడుతున్నది )

ఇటువంటి రాతగాళ్ళకవకాశం ఇస్తే ఇంకా ఎంత వింత విషయాలైనా చెబుతారు యుద్ధ శాస్త్రం నిర్మూలించమంటారు, నూతన యంత్రాలు నిర్మించే శాస్త్రపరిశోధకుల్ని ఖూనీ చేసెయ్యమంటారు యుద్ధ సైనికుల్ని-బతికొచ్చిన వాళ్ళని-వెలివెయ్యమంటారు

వీళ్ళకి వ్యాధేమిటో, వ్యాధి లక్షణాలేవో కూడా విమర్శగా తెలీదు తుపాకులు పేలిస్తేనే వీళ్ళప్రాణానికి యుద్ధం హిట్లరుమాదిరిగా దబాయింపుతో దేశా లాక్రమించుకుంటే అది యుద్ధం కాదు జీవితంలోనే ఘర్షణ ఉందని ఈ "సంస్కారులు" గమనించరు

ప్రత్యేక దేశాలు యుద్ధానికి ఆయత్తంకాకుండా ఆపే అంతర్జాతీయ సాధనం లేనప్పుడు యుద్ధం మొదలు కాకుండా చెయ్యటం ఎవరితరం? ఒక దేశం దుర్మార్గంగా మరోదేశంమీదికి వచ్చినప్పుడా రెండో దేశస్తులు ఆత్మరక్షణార్థం యుద్ధం చెయ్యటంలో తప్పేమిటి? యుద్ధ శాస్త్రంలో నైపుణ్యమూ, మంచి నాయకత్వమూ దేశాలదోపిడికే గాక దేశరక్షణకూ వినియోగపడతై

ఏదేశస్తులాదేశపు సేనానులను గొప్ప చేసుకోవటంలో తప్పేమీలేదు ప్రతికక్షుల చాకచక్యాన్ని మెచ్చుకోవటంలో తప్పులేదు

దేశభక్తి నినాదం దోపిడి సాధనం కానటువంటి రష్యాదేశంలో ప్రజలు దేశభక్తితో పోట్లాడితే అదిసాధ్యంకాని దేశాల్లో కూటికోసం ప్రాణాలు త్యాగం చేసేవాళ్ళూ దేశభక్తి నినాదానికీ దోపిడికీ గురి అయ్యేవాళ్ళూ ఉండకపోరు అంతమాత్రం చేత వాళ్ళని వెలివెయ్య నక్కర్లేదు వాళ్లని చూసి కూడా జాలిపడవచ్చు, అభిమానించవచ్చు

ఉపదేశాలవల్ల యుద్ధా లాగటం కలలో వార్త స్వార్ధానికి విరుద్ధంగా ఎన్నిమతాలు ఎందరు ప్రవక్తల ద్వారా ప్రచారం చెయ్యలేదు, బుద్ధుడు మొదలు గాంధీజీవరకూ 'ప్రేమ'ను ప్రచారం చేసినవాళ్ళెంతమంది లేరు? కాని ఏం ప్రయోజనం?

జీవిత వ్యవస్థలో –పరిపాలన లోనూ న్యాయచట్టాలలోనూ– స్వార్ధం రహితం కావాలి దోపిడి విధానం పోవాలి యుద్ధాలవల్ల లాభం పొందే వర్గం ఒకటీ, నష్టం పొందే వర్గం మరొకటీ కావటం అంతం కావాలి అప్పుడే యుద్ధాలకర్ధం లేకుండా పోతుంది యుద్ధాలు జరగటానికి కారణం చరిత్ర కారులనీ, హిస్టరీమాస్టర్లనీ అనుకున్నంత కాలమూ యుద్ధాలకేమీ లోటుండదు

ఆనందవాణి 10-9-44

# 3. యుద్ధాలకి బదులు...

ఏదో, దేవుడి పెళ్లికంతా పెద్దలే గనక, భావి ప్రపంచశాంతిని గురించి అనేక చిన్న పెద్దలు రకరకాల సూచనలు చేస్తూన్న యీ సమయంలో, మా వూరి బుడ్డకాలన గట్టుకింద ఓనాటి తెల్లారు ఝామున సమావేశమై మావూరి పెద్దలైన ఉమ్మయ్యా, జగ్గయ్యా, తిమ్మయ్యా, పురుషోత్తం మొదలైనవారు చేసి నాకు అందించిన తీర్మానాలివి

(ఈ తీర్మానాలను మొదట్లో నిర్దాక్షిణ్యంగా సెన్సారు చేసిపారేశానుగాని, రోజు రోజూ సముద్రాలు దాటి మన దేశంలో వచ్చి పడుతున్న అనేక సూచనలు పత్రికల్లో చదువుతున్న కొద్దీ మా బుడ్డకాలవ తీర్మానం నే ననుకున్నంత పిచ్చిగా లేదేమో అనే సందేహం కలిగి దాన్ని ఇప్పుడు ప్రకటనకు విడుదల చేస్తూన్నాను )

(1) యుద్ధాలు చాలా అసహ్యకర మైనవి వాటివల్ల ఏ ప్రయోజనమూ లేదు ఎందుకంటే యుద్ధంలో ఇన్ని కోట్లమందీ చచ్చిన తరువాత అసలు యుద్ధముద్దాయీలను మళ్ళీ వెతికి పట్టుకుని వేరే పని పెట్టుకుని ఉరి తియ్యాలి ఇంతా అయిన తరవాత యుద్ధరుణాలు మూలవ్యాధిలాగా (మాపురుషోత్తం సూచన) పట్టుకుని ఓడిపోయిన దేశాల్లో బతికున్న వాళ్ళను తరతరాలా పీడించి, వాళ్ళు మళ్ళీ యుద్ధానికి తయారయేదాకా వదలవు ఇది సంవత్సరాల కొద్ది ఆపరేషను (జగ్గయ్య)

ఇంక గెలిచిన దేశాల్లో చచ్చినవాళ్లు చావగా మిగిలినవాళ్ళు చంకలు గుద్దుకోవటం సొంతం కాక మునుపే గెలిచినదేశం తాలూకు డబ్బంతా రాబోయే యుద్ధానికి తయారవుతున్న దేశాలకు ఎగుమతి కావటం మొదలు పెడుతుంది అంతటితో ఆర్ధిక సమస్యలు పెరిగి, నిరుద్యోగం ప్రబలి, వచ్చే యుద్ధంలో చావవలసిన జనాభా కాస్తా సిద్ధమవుతుంది

(2) యుద్ధాలింతటితో ఖచ్చితంగా అయిపోవాలి

"బాగానే ఉంది గాని, మనుష్యప్రకృతి మనం ఎరుగుదుముకదా, ఇటువంటి మనుషులు యుద్ధాలు లేకుండా సుఖంగా ఉండగలరా?" అనేది ప్రశ్న

అవును, దుర్మార్గులుంటారు కొందరికి చుట్ట అంటించకపోతే విరేచనం కానట్టు (ఉమ్మయ్య) యుద్ధాలు మానేస్తే కొందరికి నిద్రాహారాలుండవు అయితే ఇటువంటి వాళ్ళ కష్టసుఖాలు గమనించి ఈ కింది సూచన చెయ్యటమయింది (చూ పేరా3)

(3) ముందుముందు జరగబోయే యుద్ధాలలో మనం వాటిని జరగనిస్తే - మాటే అనుకోండి దాదాపు అన్ని దేశాలూ పాల్గొంటై ప్రతిఒక్క దేశంలోనూ, యుద్ధంలో అది ఓడిపోయే పక్షంలో, యుద్ధ కారకులు లేక యుద్ధముద్దాయిలకింద పట్టుబడే పెద్దలు కొందరుంటారు (అదృష్టం బాగుండి ఆ దేశం గెలిస్తే వాళ్లే జడ్జీలుగా కూచుని యుద్ధ ముద్దాయిలమీద తీర్పు చెబుతారు ) అందులో తప్పేమీ లేదు న్యాయం ఏ పక్షాన ఉన్నదీ గెలుపుద్వారా తప్ప రుజువు కాదు ఈ సంగతి కావలిస్తే భగవద్గీతలో కూడా చెప్పబడిఉందని నేను రుజువు చెయ్యగలను అది అట్లా ఉంచండి

కాలం కలిసిరాకపోతే యుద్ధ ముద్దాయిలకింద జమ అయే పెద్ద లెవరెవరైతే ఉన్నారో వాళ్ళు ఏటా ఇతర దేశాల్లో ఉన్న యుద్ధ ముద్దాయిల జాబితాలు - అంటే, రాబోయే యుద్ధానికి పురోగాములు కాదగినవాళ్ళ జాబితాలు - తయారు చేయడమూ, వాళ్లని రహస్యంగా హత్య చేయించటమూ జరిగితే యుద్ధాలు రావు

(4) దీనివల్ల యుద్ధాలంతం కావటమేకాక ఇతర లాభాలు చాలా ఉన్నవనికూడా జగ్గయాదులు కనిపెట్టారు

(1) యుద్ధంలో చచ్చే ప్రతి ఒక్క మనిషికీ అయే ఖర్చు రానురాను చాలా జాస్తి అవుతున్నట్టు రూఢి దాఖలా ఉంది ఈ యుద్ధంలో పుర్రెకుషుమారు రెండు లక్షల రూపాయ లయినట్టు విన్నాను కాని ఇది ఇన్ ప్లేషను రాక పూర్వమని నా నమ్మకం ఇటీవల పుర్రెల ఖరీదు ఇంకా పెరిగి ఉండాలి (ఈ ఖర్చు భారతీయ పుర్రెలకు వర్తించదు భారతీయులు అతి చౌకగా, చాలా లాభాన కూడా చచ్చినట్టు భావించవలసి ఉంది )

అవునా? అటువంటప్పుడు కొద్ది మంది యుద్ధ ముద్దాయిలని చంపటానికి ఇంత ఖర్చుండదు పుర్రెకు ఏ పదివేలో ఇచ్చుకుంటే సరిపోవచ్చు

మరో విశేషం ఏమిటంటే యుద్ధంలేని పక్షంలో యుద్ధముద్దాయిల జాబితా లింత పొడుగూ ఉండవు ఇప్పటికి జాబితాలలో కాలానికి కట్టు పడి మానాభిమానాలు విసర్జించిన అప్రయోజకులు మన అందరిలాటివాళ్లే - కొందరున్నారు యుద్ధాలను పైన చెప్పిన సూచన ప్రకారం అరికట్టే పక్షంలో ఇంత మంది ముద్దాయి లుండరు

షరా ఈ జాబితాలు అసమగ్రంగా ఉండి, అందులో కేవలమూ ఏమరుపాటునమాత్రమే కొందరు ముద్దాయిల పేర్లు చేర్చకపోవటం జరుగుతే జరగవచ్చు (పురుషోత్తం ప్రకటించిన భయం ) కాని అదంత ఎక్కువ చెయ్యవలసిన ప్రమాదం కాదు అటువంటివి యుద్ధ యుగంలోకూడా జరగటం కద్దు కనక దాన్ని పాటించవలసిన పనిలేదు

అంతా బాగానే ఉంది కాని ఈ హత్యలు చెయ్యటానికి ఒడిగట్టే దెవరనేది గడ్డు ప్రశ్న

నలుగురితో పాటు నారాయణా అని సైనికులుగా చేరి కొద్ది జీతం మీదనైనా సరే, శత్రువును చంపి రమ్మంటేనూ, ఆడవాళ్ళమీదా పిల్లలమీదా అగ్ని వర్షం కురిపించి రమ్మన్నా, పొయ్యేవాళ్ళుంటారుగాని, "దేశంకోసం, స్వాతంత్ర్యంకోసం, యుద్ధాల ఆపుదల కోసం, సత్యం కోసం , ధర్మం కోసం , పెట్టుబడిదారీకోసం ఫలాని దేశంలో వున్న యుద్ధముద్దాయీని చంపిరా, రానూపోనూ, మూడు ఫస్టుక్లాసులూ, భత్తాలూ ఇచ్చి ఓ పదివేలిచ్చుకుంటాం నీ రుణం ఉంచుకోంలే!" అంటే వినేవాళ్ళు దొరక్కపోవచ్చు కార్యం సానుకూలం చేసుకొచ్చిన వాళ్ళకి ఏ క్రాసులో తగలేస్తే కొంత ప్రోత్సాహకరమైన ఫలితాలు కనిపించవచ్చు కాని ఈ సమస్య పరిష్కారం కావటానికి దివ్యమైన ఉపాయం వేరే వుంది

అదేమిటంటే, హత్య చెయ్యటం వృత్తిగాగల వాళ్ళని దీనికి నియమించటం

ప్రతి దేశంలోనూ అనేక వందలమంది హంతకులున్నారు వాళ్ళని, నిష్కారణంగా, న్యాయం పేరిట ఉరితీసి తీరా లక్షల సంఖ్యలో హంతకులు కావలసివచ్చే సరికి నానా అగచాట్లూ పడి, జనసామాన్యాన్ని పట్టుకొచ్చి ఇసుక బస్తాలమీద వాళ్లకి అభ్యాసం ఇచ్చి క్షోభపడుతున్నాం

కాని ఈ హంతకులని మరల సద్వినియోగ పరిస్తే వీళ్ళు మన యుద్ధ సమస్య పరిష్కరించటమే గాక కాలక్రమాన దేశకల్యాణం చేకూర్చి మనకు సామ్రాజ్యాలుకూడా నెత్తురుచుక్క- యుద్ధముద్దాయీల దుష్టరక్తం తప్ప -రాలకుండా సంపాదించి పెడతారు

* * *

పైన చేసిన సూచనల్లో ఏదన్నా సందుగాని, పొరగాని, లోటుగాని, తభావతుగాని ఏమైనా ఉందా అని చాలా యోచించాను కాని, నాకేమీ కనిపించటం లేదు సరేకదా కొందరు కొందరు చేస్తున్న ఇతర సూచనలకన్న ఇవే చాలా బాగున్నవని కనిపిస్తున్నది అయినా వీటిని గురించి జాగ్రత్తగా పరిశీలన చేసి వాటిలో గల మంచి చెడ్డలు నిర్ణయించే బాధ్యత ప్రపంచానికి వదిలేస్తున్నాను

ఉమ్మయ్యా, జగ్గయ్యా, తిమ్మయ్యా, పురుషోత్తమూ మా వూరివాళ్ళు రాబోయే శాంతి సమావేశంలో ఈ సూచనలకు ప్రాధాన్యం ఇవ్వబడి మా వాళ్ళు పైకొస్తే నాకవే పదివేలు!

ఆనందవాణి, వారపత్రిక 5-11-1944

# 4. మానాభిమానాలూ, మర్యాదలూ....

మానాభిమానాలూ, మర్యాదలూ బూర్జువా సంస్కారానికి చెందినవనే భ్రమ కొద్దిమందికున్నది కాని ఇది నిజం కాదని వేరే చెప్పనక్కర్లేదు ఎంత చెడి బతికినవాడు కూడా ఏదో విషయంలో ఆత్మ గౌరవంకోసం ఇతర ప్రయోజనాలని త్యాగం చేస్తాడు ఏ ప్రయోజనం కోసం కానివ్వండి ఆత్మగౌరవాన్ని త్యాగం చేసినవాణ్ణి మనం నిజంగా అర్థం చేసుకోలేక పోతాం వాణ్ణి వింతగా చూస్తాం తనని చూసి ఎవరేమనుకుంటున్నారో విచారించటం మానేసి బహిరంగంగా ఓ ఆడదానికోసం తారాడేవాణ్ణి కుక్కల్లే తిరుగుతున్నాడంటాం కుక్కకంటే ఉత్తమ జీవికి ఏ మాత్రమో మానాభిమాన మర్యాద లుంటాయని మన విశ్వాసం

కాని ఈ విశ్వాసం గురించి తెలుసుకోగలిగితే ఆత్మగౌరవం గల కుక్కలు చాలా ఖేదిస్తయ్ ఎందుచేతనంటే ఈ విషయంలో ఽకుక్కలకన్న నీచులైన మనుషులున్నారు వాళ్ళెవరంటే – పొట్టకోసం భిక్షాటన చేసేవాళ్లు కారు, బేడీలు తగిలించుకోవటానికి సిద్ధపడి దొంగతనాలు చేసేవాళ్ళూ కారు, చాటుగా భార్యల చేత లంజరికం చేయించేవాళ్ళూ కారు – తక్కువ వర్గాలకు చెందినవాళ్ళెవళ్ళూ కానేకారు తీరా విచారిస్తే కుక్కలకంటే హీనులు పెద్ద మనుషులే, డబ్బుగల వాళ్ళే, సామ్రాజ్యాలేలే వాళ్ళే!

అసలు ముందు కుక్కలకి చుట్టుకున్న అపఖ్యాతి గురించి కొంచెం విచారింతాం అంటే ఆలోచించగా కుక్కలకీ అపఖ్యాతి నిష్కారణంగా దాపరించినట్టు తోస్తుంది మొదటి సంగతి, కుక్కలెన్నడూ ఆటే పెద్దమనిషి తరహా నటించటానికి ప్రయత్నించవు తినే వస్తువు కనిపించగానే కుక్క కళ్ళు పెద్దవిచేసి నోట చొంగ ఊరుతో ఆ పదార్థాని కేసి పరిగెత్తుకుంటూ వస్తుంది తీరా తినబోయే సమయాని క్కాస్తా ఎవడు, ఛీ! ఛీ!" అన్నా అనుమానంతో ఆగి దిక్కులు చూస్తుంది కారణం – నిష్కారణంగా "ఛీ, కుక్కా!" అనిపించుకోవటం దానికీ ఇష్టంలేదు

కర్రపెట్టి కొడుతున్నా కంచంలో అన్నం కాజేసుకు పొయ్యే కుక్కలు లేవని కాదు ఆ కుక్కల ఆవశ్యకత అంత ప్రబలంగానైనా ఉండాలి, లేదా వాటికి మనుషుల్ని గురించి కనువిప్పయినా కలిగి ఉండాలని మనం ఊహించుకోవచ్చు

ఆ విధంగానే వాటి రుతువుల్లో మగకుక్కలు ఆడకుక్క కనిపించగానే అటుకేసి పరిగెత్తుతాయంటే మనం వాటితో సానుభూతి చూపవచ్చు ఎంచేతనంటే అవి తగినంత కామప్రేరణ లేకుండా ఆ పని చెయ్యవు గనకనూ, అటువేపు వెళ్ళటంలో తమ ఉద్దేశం మరొహటయినట్టు నటించవు గనకనున్నూ

చెప్పొచ్చిందేమిటంటే, ఆవశ్యకత యొక్క ప్రాబల్యాన్ని బుద్ధిగలవాడెవడూ కాదనలేడు

హెడ్మాస్టరుగారు సహితం శిరోభారంతో బాధపడుతున్న సమయంలో మూలిగినట్టయితే విద్యార్థుల దృష్టిలో లోకువై పోవలసిన అవసరం ఉండదు అటువంటి ప్రబలమైన అవసరాలను కప్పిపెట్టి దొంగ నటనలకు పాల్పడవలసిన అవసరమున్నూ ఉండదు

ఆఖరు సంగతేమిటంటే, ఆడవాళ్ల చుట్టూ కుక్కల్లే తిరుగుతున్నా డనిపించుకునేవాడు ఏ పదెకరాల ఆసామీగాని, మంచి రాబడిగల డాక్టరో ప్లీడరోగాని అవుతాడుగాని కూలి చేసుకుని కుక్క మాదిరిగానే జీవిస్తున్నవాడు కానేకాడు!

ఎటువంటి ఆవశ్యకతా లేకుండా మాన మర్యాదలు లేకుండా ప్రవర్తించటం పెద్ద మనషులకి తప్ప తెలీదు

అసలే పది పదిహేను లక్షల రూపాయలు తీసుకుంటూ మరో పది పదిహేను లక్షలైనా సంపాదించే ఉద్దేశంతో ఏదో పరిశ్రమ సాగించి అందులో అనేక వందలమంది కూలీలచేత చమటోడ్చి పని చేయించి వాళ్లందరూ తన కార్జించి పెట్టే డబ్బులో కొంత భాగం తన జేబులో వేసుకుని, వాళ్ళు ఓ రెండణాలు డబ్బు లెక్కువ అడిగితే వాళ్ళని ఉద్యోగంలోనించి పీకేసి, లేదా లాకౌట్ చేసి, వాళ్లకి సహాయం వొచ్చినవాళ్లందరిమీదా శాసనాలు చేసి సమ్మెచేసే వాళ్ళని కొట్టించటానికి పోలీసుల్ని తెచ్చి, ఫాక్టరీలో ఎవడి చెయ్యిగాని కాలుగాని విరిగితే వాడికి ప్రతిఫలం ఎగెయ్యటానికి నానా అగచాట్లూ పడి, అదే మరోడు తన కెటువంటి శ్రమా ఇవ్వకుండా తన జేబు కత్తిరించి నట్టయితే వాణ్ణి జైలుకు పంపి–ఇదంతా చెయ్యటం కుక్కలవల్ల కాదు ఒక వేళ కుక్క లింతపని చేసే స్థితికి వచ్చినా, ఇటువంటి దౌర్భాగ్యపు పనులు చేస్తున్నందువల్ల తమవల్ల దేశకల్యాణం సాగిపోతున్నదనీ, తామే దేశమనీ ప్రచారం చెయ్యటం వాటికి మించిన పని!

ఈ పెద్ద మనుషులకి లక్షలమీద విముఖత్వం పుట్టి కోట్లమీదికి వాంఛ మళ్ళినప్పుడు పై దేశాల కెగబాకుతారు "అబ్బాయీ నువు మా యింటికి రాకు" అన్న తరువాత మాన మర్యాదలు గలవాడు మళ్లా మొహం చూపించడు నిజమైన మాన మర్యాదలు గల వాడసలందాకా రానివ్వడు ఎంతో ఏమరుపాటున తప్ప ఈ ప్రపంచాలేలే వాళ్ళట్లా కాదు "మీ దుంపతెగా మీరు మాకొద్దుపోండ్రా" అంటే కూడా పోరు "మిమ్మల్ని మేం సంరక్షిస్తాం మీకు ఉపకారం చేస్తాం" అని కూడా అంటారుగాని పోరు

వీళ్లు తమ జాతి గౌరవం గురించి మాట్లాడేది అసలే అబద్ధం హిట్లరు తన జాతియొక్క గొప్ప తనం గురించి భట్రాజులచేత తెగ పొగిడించాడు యూరపులో అన్ని దేశాలూ అనుజ్ఞ లేకుండా ప్రవేశించటానికి ప్రయత్నించాడు ఆఖరుకు తన్ని తగిల్తేగాని కదల్లేదు

కొట్టుతున్నా కంచంలో కలబడే కుక్కలు కూడా దెబ్బల బాధకీ ఆకలి బాధకీ అంచనా కట్టి ఎక్కువైన దానికి తప్ప లొంగవు హిట్లరు కుక్కలట్లా కాదు కండ చీమలల్లే పీకితే తునిగి రెండువుతైగాని పట్టు విడవలేవు "ఛీ, కుక్కా", అంటే ఆగటమనేది తలవటానికే లేదు

మానవ జాతుల కీ"కుక్క' బుద్ధి అంతంకావాలి కొడితేగాని పై దేశాలు వదిలిపోని మనస్తత్వం మారిపోతేగాని యుద్ధాల అవశ్యకత తొలగిపోదు అప్పుడుగాని నిజమైన మానవత్వం పెంపుకాదు "మాకు యుద్ధమంటే ఇష్టంలేదు" అని అందరూ పైకి అనవచ్చును కాని శాంతి ప్రియత్వానికి రుజువు యుద్ధాలు మొదలుపెట్టటానికి సంశయించటం ఒకటే కాదు–అట్లా అయినట్టయితే 1939లో ఇంగ్లండులో చేంబర్లేనుకంటే శాంతి ప్రియుడే లేదు

శాంతి ప్రియత్వానికి నిజమైన చిహ్నం అవతలవాళ్లు ఆయుధాలు పట్టవలసిన ఆవశ్యకత కలిగించటం అదే మానవత్వానికి పునాది వెయ్యటం

ముందు ముందు యుద్ధాలు జరిగేదీ లేనిదీ మానవ జాతులు కుక్కబుద్ధి మార్చుకోవటాన్ని బట్టి ఉంటుంది అదృష్ట వశాత్తూ ఈ యుద్ధంలో విజయం పొందుతూన్న మిత్రమండలి దేశాలు మాన మర్యాదలు గల జాతులతో కూడుకున్నవి కుక్క బుద్ధి ఈ దేశాలలో కూడా అంతో యింతో ఇంకా పొడచూపుతున్నప్పటికీ, అది వ్యక్తుల వెంట ఉన్నదిగాని జర్మనీ జపాను దేశాలలోలాగా జాతుల వెంటలేదు బ్రిటనుకు సామ్రాజ్య కాంక్షా, అమెరికాకు వ్యాపార కాంక్షా ప్రబలంగా ఉన్నప్పటికీ ఈ దేశాల తాలూకు జనసామాన్యానికి మానమర్యాదల మీద ప్రీతి చాలా హెచ్చు అందుచేత యుద్ధానంతర కాలంలో ఈ దేశాలలో ప్రజాశక్తి విజృంభించిన పక్షంలో యుద్ధాలంతం కావటానికీ, స్వాతంత్ర్యమూ మానవత్వమూ వృద్ధిలోకి రావటానికీ సందేహంలేదు అప్పుడు మాన మర్యాదలు గల దేశాలు కుక్కల్ని వాటి "బుద్ధి" వంక పెట్టి నిందించటం మాని, వాటిని అనుకరించి , మానవత్వాన్ని కుక్కలకన్న హీనులైనవాళ్ళు కొల్లగొట్టకుండా కాపలాకాయటానికికూడా నడుములు కట్టవచ్చును

ఆనందవాణి, వారపత్రిక 9-11-1944

# 5. గుర్రాలు

సృష్టిలో పనికిమాలిన వస్తువులేదు ఎంతమాత్రమూ పనికి మాలని వస్తువుల్లో గుర్రం ఒకటి "మై కింగ్‌డమ్ ఫర్ ఎ హార్స్" ఒక్క గుర్రాన్నిస్తే నా రాజ్యమంత ఇచ్చేస్తానన్నాడొకడు వాడి రాజ్యంలో గుర్రాల్లేవు కాబోలు అదీ కాక వాడిరాజ్యం కూడా అట్టే పెద్దది కాకపోవచ్చు పెద్దది అయితే ఓ గుర్రమన్నా లేకుండా ఉంటుందా?

ఒక్క గుర్రానికే రాజ్యం ధారపోస్తానన్న వాడు గుర్రం విలువ బాగా పసికట్టాడు వాడికి రేసులమర్మం కూడా తప్పక తెలిసుండాలి 'కలమా, కత్తియా' అంటే కత్తియే అన్నట్టు 'రాజ్యమా, గుర్రమా?' అంటే తప్పకుండా గుర్రమే అంచేత రెండూ ఉంటే కాదనాలని ఎక్కడుంది? ఈనాటి మహారాజులకి బలం గుర్రాలే!

వెనకటి మహారాజులు గుర్రాలమీద ఎక్కి స్వారీ చేసే వాళ్ళు యుద్ధరంగానికి వెళ్ళేవాళ్ళు కాలంమారి, సంఘం పరిణామం చెంది ఈ కాలపు మహారాజులు యెక్కటానికి రోల్సు రాయిసులుంచుకుని నిక్షేపంగా గుర్రాల్ని పరిగెత్తిస్తున్నారు, లక్షలార్జిస్తున్నారు, చేదా?

సంవత్సరానికి లక్షరూపాయల ఆదాయం కూడాలేని రాజ్యాలు గెలిచేటందుకు వెనకటి మహారాజులు యెన్నో గుర్రాలను యుద్ధరంగంలో బలిచేసి హైరాన పడేవాళ్ళు ఇప్పుడు మంచి గుర్రాలు నాలుగుంటే ఏటా ఒక లక్షరూపాయలు పెడతై

ప్రపంచమంతా సోషలిజం గురించీ, రష్యా గురించీ మాట్లాడుతుంటే మనకీ మహారాజుల గొడవా, వాళ్ళ గుర్రాల గొడవా దేనికని సందేహం గలకవచ్చు అదే మనవి చేస్తున్నాను ఇక్కడ సోషలిజం కూడా ఉంది ఆమహారాజుల గుర్రాలు మన గుర్రాలే అవి మనకూ డబ్బిస్తాయి

"ఏమోయ్ నువు దేనిమీద వేస్తున్నావ్?"
"త్రివేణి మీద వేద్దామనుకుంటున్నానోయ్"
"ఇంకేం! వెయ్యి!అది నాగుర్రమే"
మన జీవితంలో సోషలిజం ప్రాబంభమయిందే గుర్రాల దగ్గర అని నేను ప్రపంచానికి ఢంకా బజాయించి చెబుతున్నాను ఈ స్పిరిట్ క్రమంగా వ్యాపిస్తే ఈ కింది సంభాషణలుకూడా జీవితంలో సాధ్యమవుతై
"ఏమండీ, తమ రీపూట ఎక్కడ దేవతార్చన తల పెట్టారు?"
"అదుగో ఆ కనిపించే మూండతస్తుల మేడలో అడుగుదామనుకుంటున్నాను "
"మరేం? తప్పక దయచెయ్యండీ అది మనిల్లే "
మన దేశంలో ఇంకా అంత సోషలిజం రాలేదు కాని ఉన్న దాన్ని సద్వినియోగం ఎందుకు చెయ్యరాదూ? అంచేత గుర్రాలు పరిగెత్తేచోటికి పోదాం పదండి
రోజుకిన్ని రేసులని ఉంటై ప్రతి రేసులోనూ కొన్ని గుర్రాలు పరుగెత్తుతై పరిగెత్తబోయే గుర్రాలు ముందుగా మనకు చూపిస్తారు అశ్వలక్షణం తెలిసినవాళ్ళు – నలమహారాజులు– వెంటనే గెలవబోయే గుర్రాన్ని పసిగట్టేస్తారు
అందుకని అశ్వలక్షణాలమీద గ్రంధాలు కొని చదవటం మొదలుపెట్టేరు ఎంచేతనంటే ఈ నాటి పందాల్లో గెల్చే గుర్రాలమీద ఎక్కువ బరువువేసి వాటిని గెలవ నీకుండా చేసే ఆచారంఉంది అందుచేత నలమహారాజు ఈనాటి రేసులకు వెళ్ళాడో పాచిక లవసరం లేకుండానే తిరుక్షవరమై మళ్ళీ అడవులపాలు కావాలిసొస్తుంది
పోతే గెలిచే గుర్రాన్ని నిర్ణయించేటందుకు జాకీల పేర్లుంటై కొందరు బుద్ధిమంతులు తమకు నచ్చిన జాకీని పట్టుకుని గెలిచేదాకా వాడిమీద డబ్బు కుమ్మరిస్తూ ఉంటారు వీళ్లు ఓవందో రెండొందలో పోగొట్టుకున్న తరవాత పదో పన్నెండో తప్పక సంపాయిస్తారు
గుర్రాలమీద అంకెలుంటై వీటివల్ల లాభం ఏమిటంటే గుర్రం పేరుకు బదులుగా దాని అంకెమీద మనం డబ్బు వెయ్యవచ్చు గెలిచిన గుర్రం అంకె బోర్డు మీద పెడతారు
కాని ఈ అంకెలవల్ల మరో పరమ ప్రయోజనం ఉంది న్యూమరాలజీ అనే శాస్త్రం ద్వారా ఏ అంకెబోర్డుమీద కెక్కుతుందో తెలుసుకోవచ్చు అయితే ఈ న్యూమరాలజీ అనే శాస్త్రం ఇంకా చాలా బాల్యదశలో ఉంది అంచేత దీనివల్ల ప్రజలకి కలగదగినంత ప్రయోజనం కలక్కుండా ఉంటున్నది
దీని వైనం నాకు బాగా తెలీదు నేను గ్రహించినంత వరకు సంగ్రహంగా చెబుతాను ఇందులో చాలా పద్ధతులున్నై
(1) ఆరోజు (అనగా రేసు జరిగే రోజు) తారీకు తీసుకొండి, నెల తీసుకోండి, సంవత్సరం తీసుకోండి, రేసుసంఖ్య తీసుకోండి, గుర్రం అంకె తీసుకోండి, దాని మీద ఉండే బరువు తీసుకోండి, వాటికేసి కాస్సేపు చూసి మీ యిష్టం వచ్చిన అంకె ఒకటి మనస్సులో అనుకుని దానిమీద టిక్కెట్టుకొనండి, అది రాదు
(2) మీ పేరులో ఉన్న అక్షరాల సంఖ్యకు ఏ గుర్రం సంఖ్య సరిపోతుందో చూడండి దాని

బరువు సంఖ్యకు మళ్లీ ఏ గుర్రం అక్షరాల సంఖ్య సరిపోతుందో చూడండి దాని బరువు సంఖ్య చూసి దానికి తిథి సంఖ్య కలిపి ఆ సంఖ్యమీద డబ్బు వెయ్యండి, అది రాదు

(3) మీరు రేసుకు బయల్దేరేటప్పుడు ఏ బస్సు ఎక్కుతారో, బండీఎక్కుతారో, రైలెక్కుతారో అన్నిటి సంఖ్యలూ కలిపి ఆ వొచ్చిన మొత్తానికి ఆయా రేసుల్లో పరిగెత్తే గుర్రాల సంఖ్యలుకలుపుకుంటూ, అట్లా వచ్చిన సంఖ్యలమీద డబ్బు వేస్తూ వెళ్లండి అవేవీ రావు

షరా అన్ని సంఖ్యలనూ ఏక సంఖ్యకింద మార్చుకునేది

ఈ విధంగా న్యూమరాలజీ పద్ధతులు చాలా ఉన్నాయి కాని అవన్నీ చెబితే మీ కెట్లాగూ జ్ఞాపకం ఉండదు

రేసులో డబ్బు వేసేటందుకు ఇంకా చాలా పద్ధతులున్నై అవి కూడా సంగ్రహంగా చెబుతాను

ఏ ఒకటో నంబరో రెండో నంబరో పట్టుకుని అది గెలిచేదాకా ఆడటం, ఇది చాలా సులభంగా కనిపించవచ్చు కాని నిజంగా తేలికకాదు, ఎందుకంటే ఇది పోయిన రెట్టింపు వడ్లగింజల లెక్క ఆ విధంగా అడుతూ పాడుతూ ఎప్పుడో మన నంబరు వచ్చినప్పుడు అదిచ్చే డబ్బుతో నష్టమంతా పూడుతుంది, లాభం మాట దేవుడెరుగు

మన డబ్బు మన దగ్గిరే ఉండటానికి ఇంత హైరానా దేనికని కొందరనవచ్చు ఇది చాలా పొరబాటు మన డబ్బు మనకొస్తే చాలుననే సూత్రంమీద సినిమాలు తియ్యటం లాంటి ఎంతేసి మహత్తర, హైరాన జనకకార్యాలు జరుగుతున్నాయో తెలిసిన వాళ్ళు అలాంటి పొరబాటు పడరు

ఈ పద్ధతికి నేనూ ఒప్పుకోను నా అభ్యంతరం ఏమిటంటే ఈ పద్ధతి పని చేయాలంటే పెట్టుబడి కొంత కావాలి అంత డబ్బే ఉంటే నేనయితే ఓ గుర్రాన్నే కొనేస్తాను

కొంతమంది టోటు చూసి టిక్కెట్టు కొంటారు ఇందులో రహస్యం ఏమిటంటే యెక్కువ టిక్కెట్లున్న గుర్రం గెలిస్తే తక్కువ డబ్బిస్తుంది తక్కువ టిక్కెటున్న గుర్రం గెలిస్తే ఎక్కువ డబ్బిస్తుంది తక్కువ డబ్బుతో సంతృప్తి పడేవాడు ఎక్కువ టిక్కెటున్న గుర్రంమీద కాసి పోగొట్టుకుంటాడు చాలా డబ్బు కావలసిన వాడు ఎవరూ కోరని గుర్రం మీద వేసి పోగొట్టుకుంటాడు రెండు పద్ధతులూ మంచివే

రేసింగు యొక్క అసలు మర్మం తెలిసిన పెద్ద మనిషి ఒకతనున్నాడు అతన్ని గురించి చెప్పి, ఈ ముచ్చట ముగిస్తాను

అతను ప్రతిరేసులోనూ రెండేసి గుర్రాల పేరు తెలుసుకుని రేసుకు పోయి హాయిగా కూచుని చూస్తాడు గెలిచిన గుర్రాలు గుర్తుపెట్టుకుంటాడు ఇంటికివచ్చేటప్పుడు ఎరిగిన వాళ్ళు కనిపించి ఏమయిందని అడిగితే "నా గుర్రానికి పెండు ప్లేసులొచ్చినై ఫరవాలేదు నాడబ్బు నాకుంది" అంటాడు

మిగిలిన వాళ్ళంతా అతన్ని చూసి అసూయపడతారు

రూపవాణి మాసపత్రిక, ఏప్రిల్ 1945

# 6. స్వయం జ్యోతులూ, పరంజ్యోతులూ

ఆకాశంలో మనం చూసే చుక్కల్లో చాలా భాగం స్వయంజ్యోతులు వాటి కాంతి చేతనే అవి మనకి కనిపిస్తాయి మరి కొన్ని స్వయంజ్యోతులు కాకుండానే కనిపిస్తాయి సూర్యుడు స్వయంజ్యోతి చంద్రుడు స్వయంజ్యోతి కాదు, అతగాడిమీద పడ్డ సూర్యకాంతి మనకు కనిపిస్తేనే గాని చంద్రుడు మనకు కనిపించడు మిగిలిన గ్రహాలుకూడా ఇంతే వీటిని మాటవరసకి పరంజ్యోతులందాం

గ్రహాల్లాగే మనుష్యగ్రహాలున్నూ, మనుష్య ప్రపంచంలో స్వయంజ్యోతులు తక్కువా పరంజ్యోతులు జాస్తీనూ బాగా పైకివచ్చిన, పెట్టుబడి దారీ సంస్కారంగల దేశాల్లోనే 60 మందిలో 5గురు మాత్రమే స్వయంజ్యోతులున్నారని ఒక అంచనా ఉంది వెనకబడిఉన్న మనవంటివాళ్లల్లో ఇంకా తక్కువే ఉంటారు మిగతా వాళ్ళంతా పరంజ్యోతులే

ఉమ్మడిజీవితంలో స్వయం – పరంజ్యోతుల చుట్టరికం యెట్లా ఉంటుందంటే వీళ్ళు చెబుతారు, వాళ్ళు వింటారు, వీళ్ళు దారితీస్తారు, వాళ్ళు వెంటనడుస్తారు, వీళ్ళు అభిప్రాయాలు సృష్టిస్తారు, వాళ్ళు వాటిని ప్రచారం చేస్తారు, వాళ్ళూ గోతుల్లో పడతారు – ఈ విధంగా నడుస్తుంది జీవితం

మిగిలిన కులాలూ, వర్గాలూ, కక్షలూ, విభజనలూ కృత్రిమమైనవి కావచ్చుగాని, ఈ విభజన మటుకు యధార్థమైనది మానవ ప్రయత్నంవల్ల సాధించగలిగిందల్లా ఏమంటే సంఘంలో ఉండే స్వయంజ్యోతుల సంఖ్య పెంచవచ్చు, తగ్గించవచ్చు రష్యాలో వీళ్ళ సంఖ్య పెరిగినట్టు కనిపిస్తుంది అదే విధంగా జర్మనీలో పరంజ్యోతుల సంఖ్య పెరిగినట్టు కనిపిస్తుంది

మనిషి స్వయంజ్యోతిగా ఉండటమే చాలా ఘనమనీ పరంజ్యోతిగా ఉండటం లోపమనీ అనుకో నవసరంలేదు ఈ విషయంలో వ్యక్తుల స్థితికి కారణభూతమైనది వాతావరణమే కాని మొత్తం మీద సంఘంలో యెన్నిపాళ్ళు అధికంగా స్వయంజ్యోతులుంటే ఉమ్మడిగా సంఘానికి అంత నిజమైన బలం

హిట్లరు తన జాతికి చాలా బలం చేకూర్చినట్టు ఇప్పటికీ నమ్మేవాళ్లున్నారు కాని హిట్లరు సాధించినది నిజమైన బలం కాదు పదినిమిషాలు యెండకు నిలబడలేని మంచుకొండలు ఉక్కుతోచేసిన నావలను ముంచుతాయి అంతమాత్రానికి ఉక్కు కన్న మంచు బలమయిందని అనం తన సంఘంలో నించి వేడి తీసేసి మంచు కొండవంటి జాతిని తయారుచేశాడు హిట్లరు ఎన్నోగ్రంథాలు తగలేసి, ఎంతో సత్యాన్ని బూడిదలోకలిపి, ఎంతో మంది స్వయంజ్యోతులని దూరంచేసి మిగిలిన సమాజాన్ని రిఫ్రిజరేటరులో ఎన్నో ఏళ్ళుంచి హిట్లరు ఆధునిక జర్మనీని తయారుచేశాడు ఆ మంచుగడ్డ సమయంవస్తే ఇనుము కాలి కాంతి వెదజల్లినట్టు వెదజల్లదు, పై పెచ్చుకరిగి, ప్రవాహాలై, మడుగులుకట్టి చుట్టుపట్ల స్తలాన్ని ముంచి బురదచేస్తుంది, లేదా మరీ వేడిజాస్తి అయితే ఆవిరి అయి ఎగిరి పోతుంది

రేపు మిత్రమండలి రాజ్యాలవారు జర్మనీని ఆక్రమించుకుని ఎదుర్కోవలసిన సమస్య ఇదే "దూకు!" అనగానే, "ఎందుకు? ఎక్కడ" అనకుండా దూకిన పరంజ్యోతులను స్వయంజ్యోతులు చెయ్యటం సామాన్యమైన పనికాదు ఇతర జాతులవాళ్ళూ మనుషులేననీ,

సామాన్యమానవుల ఆదర్శం ప్రపంచాన్ని ఏలటం కానవసరంలేదనీ, మన సంస్కారం ఇతర్లకు అందించి ఇతర్ల సంస్కారం అందుకుని మానవజాతిలో ఏర్పడ్డ వ్యత్యాసాలు క్రమంగా రహితం చేసుకోవటమే నిజమైన ప్రగతికి మార్గమనీ నమ్మిన జర్మనులు లేనే లేరనుకోవటం కొంచెం కష్టంగానే ఉంటుందిగాని వాళ్ల జాడ ఎక్కడా కనిపించదు వాళ్లు కనిపించిన రోజున జర్మనీ దేశం యొక్క పునరుజ్జీవానికి పునాది ఏర్పడుతుంది

విప్లవాలూ, యుద్ధాలూ, సంక్షోభాలూ కలిగినప్పుడు సంఘంలో కలిగేమార్పులు చాలా ఉంటాయి వాటిలో ఒకటి ఏమంటే స్వయంజ్యోతులు కొందరు కొడిగట్టి పరంజ్యోతుల జాబితాలో చేరిపోవటం ఇటువంటిమార్పు మన దేశంలో కలిగినట్టు కనిపిస్తుంది ఒక నాడు స్వయంజ్యోతుల కూటమిగా ఉన్న కాంగ్రెస్‌లోనే ఈనాడు పరంజ్యోతుల సంఖ్య హెచ్చుగా కనిపిస్తుంది రష్యామీదా, సోషలిజంమీదా, కమ్యూనిజంమీదా, రకరకాల అభ్యుదయంమీదా దుష్ప్రచారాలు చెయ్యటానికి సిద్ధంగా ఉన్న పరంజ్యోతులీనాడు కోట్ల సంఖ్యలో వున్నట్టు కనిపిస్తుంది ఇటువంటి ప్రచారం చేసేవాళ్ళకు తాము పెట్టుబడిదారీనీ, దాస్యాన్నీ, ఫాసిజమునూ, సామ్రాజ్యతత్వాన్నీ ప్రచారంచేస్తున్నట్టు తెలీదు వీరిలో చాలామంది స్వాతంత్ర్యవాదులూ, దేశభక్తులూనూ ఏసు క్రీస్తు చెప్పిన సూత్రాన్ని వీళ్ళు వేళాకోళంగా అమల్లోపెట్టి తమ ఎడంచేయి చేస్తున్నది కుడిచేతికి తెలియనీయకుండా, తమ ఆశయాలకు సంబంధంలేని మనస్తత్వాన్ని ప్రకటిస్తూ, ఎవరిచేతిలోనో కీలుబొమ్మలై ఆడుతున్నారు మరోడి చేతిలో కీలుబొమ్మగా ఆడటం పరంజ్యోతిగాడి ప్రధాన లక్షణం

దేశంలో పరంజ్యోతుల అభివృద్ధిని సూచించే లక్షణాలు సాహిత్యంలోనే ఎన్నో కనిపిస్తూ ఉన్నాయి ఒకపత్రిక ఒకే సంచికలో రష్యాలో జరిగిన అద్భుత పరిణామాన్ని మెచ్చుకుంటూ మరోపేజీలో రష్యావల్ల ప్రపంచానికి రానున్న ముప్పునుగురించి గాభరాగా రాస్తుంది దీన్ని నిష్పక్షపాత బుద్ధి అనవచ్చు, పాముినాలుకలనుకోవచ్చు కాని ఇది యథార్థంగా పరంజ్యోతి లక్షణం

పోలండును గురించి పనికిమాలిన చెత్తదాదాపు 30 పుస్తకాలు అచ్చువేయించి అమ్మలేక ఊరికే పంచి పెట్టారు ఈ చెత్తయొక్క ఉద్దేశం మరో యుద్ధానికి బీజాలు వెయ్యటం తప్ప మరోటి కాదు ఈ బీజాలు మన దేశంలో ఎందుకు వెయ్యాలో, అందుకోసం వృధాగా ఇంత డబ్బెందుకు ఖర్చు చెయ్యాలో ఊహించటం కష్టం కాని పూర్తిగా అసాధ్యం కాదు పోలండు కెంతదూరంలో వున్నా మనలో పరంజ్యోతులు చాలా జాస్తిగా వున్నారనీ, ఈ బీజాల కిది మంచి క్షేత్రమనీ కొందరు నమ్మి వుండాలి వారి నమ్మకం మనకు అవమానకరమైన సంగతి ఇంగ్లండులోవున్న ఎమిగ్రీపోలిషు ప్రభుత్వానికి నిలవనీడలేకుండా పోయినా దాని బీజాలయిన సాహిత్యం మటుకు మనను వెంటాడుతూనే వుంటుంది

మన దేశంలో ఈ హేయమైన పరంజ్యోతిత్వంలో నించి బయటపడి, "ఏమిటి?" "ఎందుకు?" అని అడగటం నేర్చుకుంటే దేశానికీ, భావికీ చాలా మంచిదనుకుంటున్నాను

ఆనందవాణి, వారపత్రిక, 15-4-1945

# 7. సాంకేతిక శిక్షణ

ఆధునికయుగంలో సాంకేతికవిజ్ఞానం ప్రశస్తమయినది ఎందరు మహాకవులు పురాణాలు రాయనివ్వండి, కవి కిశోరాలు గానం చెయ్యనివ్వండి, కథక చక్రవర్తులు కథలల్ల నివ్వండి, రాజకీయవేత్తలు ఎలెక్షన్లలో నిలబడి ఓడిపోనివ్వండి, సాంకేతిక జ్ఞానం ఉత్పత్తి కానట్టయితే దేశానికి సంపదలేదు ఆత్మసమృద్ధి లేకపోతే పరువు ప్రఖ్యాతులు లేవు

అందుచేత దేశంలో సాంకేతిక విజ్ఞానం సంపాదించటానికి అనివార్యంగా పుస్తకాలు చదవాలి ఆపైన ఫ్యాక్టరీలో అనుభవం కూడా సంపాదించాలి కాని ఏ పుస్తకాలూ చదవకుండానే మన ఇష్టంవచ్చిన ఫ్యాక్టరీలో ప్రవేశించి అమాంతం ఒక ఫోర్మను అయిపోవ టానికి ఒక సులభమైన సాంకేతిక మార్గం ఉంది దాన్ని గురించి సంగ్రహంగా చెబుతాను

సాంకేతిక శిక్షణ పొంది ఫోర్మను కాదలచినవాడు మొట్టమొదట తెలుసుకోవలసి అంశం, ఫ్యాక్టరీ పని వాళ్ళు వొట్టి దొంగవెధవలని ఇది రుజువు చెయ్యాలంటే గ్రంథాలు పడుతుంది మొదటి సంగతి, పని వాళ్ళు, వాళ్ళ జీతాలేకాక, వాళ్ళ పైనుండే సూపరు వైజర్ల జీతాలు, ఫోర్మనుల జీతాలు, మేనేజర్ల జీతాలూ, సూపరింటెండెంట్ల జీతాలూ, మానేజింగ్ డైరెక్టర్ల జీతాలూ, కంపెనీలో వాటాలు కొన్న వాళ్ళ లాభాలూ, కూడా సంపాదించిపెడతారు ఇటువంటి అవక తవక పన్లు చాలా చేస్తారు కనకనే వాళ్ళు దొంగవెధవలయ్యారు

పనివాళ్ళంతా ఒళ్ళు దాచుకోకుండా పని చేస్తే ఫోర్మనులకి అంత శీఘ్రంగా జీతం పెంపకం అవుతుంది వాళ్ళతో సాధ్యమైనంత మంచిగా ఉంటూ, వాళ్ళకి విశేషం విశ్రాంతి లేకుండా చూస్తూ, వాళ్ళను పై అధికార్లకి పట్టిస్తూ ఉండటం సాంకేతిక విజ్ఞానం తాలూకు ప్రధానాంశాలు

ఫ్యాక్టరీలో జరిగే పనిని గురించి పుస్తకాలు చదివి ఏమీలాభంలేదు ఎట్లాగూ పుస్తకాలలో రాసిన దానికీ ఫ్యాక్టరీలో జరిగే దానికీ ఏమీ సంబంధం ఉండదు

ఫోర్మను నేర్పుగల వాడయితే పనియావత్తూ పనివాళ్ళను చూసి నేర్చుకోవచ్చు ఈ సంగతి పనివాళ్ళ కెట్లాగూ తెలుసు గనక దాచటానికి ప్రయత్నించ నవసరంకూడా లేదు

పైనుంచి ఫోర్మను తరుముతుంటే ఎంత నిర్లక్ష్యంగల పనివాడైనా అంతో ఇంతో పని వేగంగా చేసి తీరుతాడు పనివాళ్ళు ఎంత కష్టపడుతున్నప్పటికీ ఫోర్మను కించిత్తయినా అలసిపోడు ఇంత సామాన్యమైన సాంకేతిక రహస్యాలు కూడా తెలియని ఫోర్మను లుంటారు వాళ్ళు పైకి రాలేరు

ఫాక్టరీ యజమానులు పనివాళ్ళ చెమట వోగు చేసి సంపాదించిన ఉప్పుతినేవాడు గనక ఫోర్మను పాటించవలసిన ధర్మాలు కొన్ని ఉన్నై

పనివాళ్ళు పనిముట్లు విరగ్గొట్టకుండా చూడాలి మీ రెప్పుడైనా గమనించండి అదేం ఖర్మమో, పనిముట్లు ఎప్పుడూ పనివాళ్ళు చేతుల్లోనే విరుగుతై! పొరపాటున కూడా ఊరికే ఉన్నప్పుడుగాని, ఫోర్మను చేతిలోగాని విరగవు ఫోర్మను పనిముట్లు ముట్టుకో నవసరం లేకపోవటం అదృష్టం అనాలి లేకపోతే పనివాళ్ళు నేరం ఫోర్మను మీదిక్కూడా తొయ్యగలరు దొంగ వెధవలు! ఒక్కో సమయంలో, ఎన్నో ఏళ్ళుగా పని చేస్తూ ఉండిన పనిముట్టు కూడా

పనివాడి చేతిలో విరిగి ఊరుకుంటుంది! అంటువంటప్పుడు ఉప్పుతినే ఫోర్మను అయినవాడు ఆ పనిముట్టు ఎవడి చేతిలో విరిగిందో కనిపెట్టి దాని ఖరీదు వాడి జీతంలోనుంచి విరగగొయ్యాలి, అధమం వాడికి జుర్మానా అయినా తగిలించాలి

పోతే మధ్య మధ్య పనివాళ్ళు డబ్బులు చాలవంటూ ఉంటారు ఇది వాళ్ళకున్న జబ్బే, మనవంటి చదువుకున్న వాళ్ళమే రెండొందలతో తృప్తిపడుతుంటే వాడికి రోజుకు రూపాయి యిచ్చినా చాలదంటాడు ఒకరిద్దరు జీతాలు పెంచమంటే నోరు మూసుకోమనవచ్చుగాని ఖాతాలో ఉన్న జనమంతా జీతాలు పెంచమని అలజడి చేస్తున్నప్పుడు సాంకేతిక ప్రవీణుడైన ఫోర్మను వాళ్ళని నోరు మూసుకోమని ప్రయోజనం లేదు కాలవైపరీత్యం కొద్దీ పనివాళ్ళకు యూనియనులూ అవీ ఉండటంచేత వాళ్ళు సమ్మెలూ చట్టుబండలూ చెయ్యగల్రు అందుచేత ఉప్పు తినే ఫోర్మను అయినవాడు తన సాంకేతిక విజ్ఞానమంతా వినియోగ పరిచి అతి తెలివిగా ప్రవర్తించాలి ఈ సందర్భంలో వాళ్ళకి అన్ని రకాల వాగ్దానాలూ చెయ్యాలి జరిగే పని ఎప్పటికి పూర్తి అయి, పనివాళ్ళను తగ్గించే పరిస్థితి ఎప్పటి కేర్పడేది సాంకేతికంగా నిర్ణయించి అంత దాకా పనివాళ్ళని మభ్యపెట్టుతూ వెళ్ళాలి

ఫోర్మను పనివాళ్ళకి చెయ్యగల ఉపకారం బోలెడంత ఉంది పనివాళ్ళంతా దొంగ వెధవలన నవసరంలేదు వాళ్ళలోనూ మంచివాళ్ళుంటారు అటువంటి వాళ్ళకి పనికాస్త తగ్గించో, కూలి డబ్బులు అణా పెంచో మంచి చేసుకున్నట్టయితే వాళ్ళు చెప్పినట్టు విని మిగిలిన పనివాళ్ళను పట్టిస్తూ ఉంటారు ముఖ్యంగా పని వాళ్ళలో ఇతర లక్షణాలు కూడా ఫోర్మను తెలుసుకోవాలి భార్యా బిడ్డలని గురించీ, తన పొట్ట గురించి వాళ్ళ పొట్టల గురించీ అవి నిండటానికి అయ్యే ఖర్చు గురించి ఆలోచించని వాళ్ళూ, చెమట బాగా ఓడ్చి యజమానులకి ఉప్పుచేసి పెట్టేవాళ్ళూ మంచి పనివాళ్ళ కిందికి వస్తారు వీళ్ళ జీతాలు పెంచి, ఫోర్మను వాళ్ళని చప్పున పాడుచెయ్యక, ఆరు నెల్లకో సంవత్సరానికో వాళ్ళ రోజు కూలి ఒక అణా మించకుండా పెంచుతూ తనకు వాళ్ళమీద అనుగ్రహం ఉన్నట్టు మాత్రం తెలియజేస్తూ, పని భారంమటుకు వాళ్ళమీద వేసి జీతం పెంచే భారం తనమీద వేసుకుని ఫోర్మను సాంకేతిక ప్రావీణ్యత ప్రకటించాలి

రూపవాణి మాసపత్రిక, జూన్ 1945

# 1. బాతాఖానీ

సినిమాకి బ్రహ్మదేవుడి శాపం ఉంది వాల్మీకి రాసిన రామాయణం లగాయతు ఏ కథ అయినా తీసుకోండి, ఏ పాత్రఅయినా తీసుకోండి, మారకుండా తెరకెక్కటానికి వీల్లేదు

చారిత్రక పురుషుల్ని గురించి తీసే చిత్రాలకు కూడా ఈ గతి తప్పదు జీవన్ముక్తులైన కవులు తెరమీద భక్తులవుతారు, వేదాంతులు సంతులవుతారు, భోగులు యోగులౌతారు

ఇటువంటి మహాపురుషుల జీవితాలను సినిమా కెక్కించటంలో జరిగే కథాపరివర్తనను సమర్థించటానికి గాను నిర్మాతలు "ఈ చిత్రంలో చారిత్రకమైన సత్యం పాటించబడలేదు" అని ముందుగా హెచ్చరించటం రివాజుగా ఉంది

చారిత్రకమైన సత్యాన్ని పాటించకుండా సినిమా తీసేవారు చారిత్రక పురుషుల కథలు తీసుకోవటం దేనికంటారూ? బాగా చెప్పారు! నా అభిప్రాయమూ అదే

(తా క ముందు ముందు నిర్మించబోయే కొన్ని చిత్రాల పేర్లు 'యోగిగాంధీ', 'భక్తనెహ్రూ' 'సంత్‌పటేల్')

***

గొప్ప వాళ్ళక్కూడా కొన్ని జబ్బులుంటాయి వాళ్ళకోసరం సన్మాన సభలూ, సానుభూతి సభలూ, స్మారకసభలూ చేసేటప్పుడా విషయాలు స్మరించం ఎంచేతంటే గొప్పవాణ్ణి ప్రపంచానికి నిర్దుష్టంగా ప్రదర్శించటం మనవిధి ఈ ముక్క గొప్ప వాళ్ళకు సంబంధించిన తైల చిత్రాలకు కూడా సులువుగా వర్తిస్తుంది

స్వర్గీయ రాఘవాచారి గారికి ఒక కళంకం ఉండేది ఈ కళంకం బయట పెట్టటానికి నాకెంతో సిగ్గుగా ఉంది అయితే ఇది సన్మాన సభా, స్మారక సభా కాదు గనక, బయట పెట్టక తప్పదు రాఘవాచార్లుగారికి పైకి కనబడే టట్టు జేబరుమాలు ధరించటం అసహ్యం అదీకాక - మళ్ళీ ఎక్కడైన్నా అనేరు - ఆయన కళ్ళు మరీ పెద్దవి, ఆయన కొలిచినట్టు నడినెత్తిన పాపట తీసుకునేవారు

ఆంధ్ర మహాసభవారు శ్రీనివాసయ్యంగారి చేత ఆవిష్కరింపజేసిన "రాగన్న" గారి తైల చిత్రంలో ఈ లోపాలన్నీ సవరించబడినై ఇది చాలా ముదావహం

(షరా ఇంకా బతికున్న గొప్పవాళ్ళు ఇప్పుడే మేలుకుని తమ తదనంతరం తమ చిత్రాలు వేయబోయే ఆర్టిస్టుల పరిచయం చేసుకుని తమ విషయాలన్నీ వారు తెలుసుకునే అవకాశం ఇవ్వటం మంచిది ఆర్టిస్టులు తమంతట తామై చచ్చిపోయిన వారి విషయం పూర్తిగా తెలుసుకుని చిత్రాలు గీయటం పొసగదు ఇక్కడ కూడా చారిత్రకమైన సత్యాలు పాటించబడవు )

డబ్బు హాలాహలం ఇదివరకల్లా అది ప్రపంచ మంతటా స్వేచ్ఛావిహారం చేసి అందర్నీ కాల్చుకు తినేది అయితే ప్రజా మంత్రులు పరమేశ్వరుడల్లే వచ్చి ఈ హాలాహలాన్ని పుక్కిట పట్టారు ఇప్పుడందుచేత డబ్బుతో ఏదీ కాదు

మాట వరసకు మనకొక మోటారు కావాలంటే కొనటానికి లేదు డబ్బున్నా సరే ఇప్పుడు కారుకొనాలంటే పర్మిటుండాలి పర్మిట్లు చీకట్లో అమ్ముడవుతున్నాయనే వదంతి నమ్మకండి – అది ప్రభుత్వ విరోధులు చేసే దుష్ప్రచారం (లేక, యదార్థమా?)

ఏమైనా ఈ కారు పర్మిటు సంపాదించాలంటే కొంత పలుకుబడి కావాలి అటువంటి పలుకుబడి గల ఒక పెద్దమనిషి కారొకటి సంపాదించాడు కారుంటే డ్రైవరుండాలి డ్రైవరుకేం భాగ్యం? వాణ్ణి కూడా సంపాదించాడు ఈ పెద్దమనిషి కారులో వెళ్ళేటప్పుడు హాయిగా వెనక సీటులో కూచోక డ్రైవరు పక్కనే కూచుంటాడు కారణమేమిటా అని అడగ్గా ఒక చిన్న ధర్మ సూక్ష్మం బయటపడింది, డ్రైవరు సీటు కొంచెం తక్కువ వర్గానికి చెందిందట తాను కూడా డ్రైవరుతో సమానమేనని రుజువు చెయ్యటానికి గాను ఈ కారు గలాయన డ్రైవరు కూచునే ముందుసీటులో కూర్చుంటున్నాడట

అయితే చిక్కొచ్చింది ఒక నాడు ఈయన ఆఫీసుబోయిని కూడా కారెక్కించవలసి వచ్చింది వాణ్ణి వెనక కూచోపెడితే వాడికి డ్రైవరుకన్న హెచ్చు గౌరవం ఇచ్చినట్టవుతుంది పోనీ బోయిని ముందు కూచోబెట్టి తాను వెనక కూచుంటే వాళ్ళిద్దరికన్నా తాను ఒకడే ఎక్కువైనట్టవుతుంది ఒక్కడ్రైవరు కన్న కూడా తాను, సంపాదనలోనూ, చదువు సంధ్యల్లోనూ, అధికారంలోనూ తప్ప, ఎక్కువ కానప్పుడు, ఇద్దరి కన్నా ఎక్కువ కావటం ఎట్లా సాధ్యమవుతుందీ? ఈ సమస్య ఆ పెద్దమనిషిని బాధించిందట

(షరా 1 డబ్బు గలవాళ్ళు లేనివాళ్ళకి గౌరవం ఇవ్వదలిస్తే డబ్బిస్తారుగాక

షరా 2 ఆధ్యాత్మిక సామ్యవాదులు వర్గవైషమ్యాలు లేని సీట్లుగల కారు కొంటారుగాక)

ఇటీవల ఒక మాసపత్రిక దేశనాయకుల మీద పత్రికల 'మూఢ' భక్తిని వ్యంగ్యంగా చిత్రించింది కాంగ్రెస్ మీద ఇటువంటి భక్తిగల వారున్నారనేది కూడా ఇటీవల రుజువయింది మద్రాసు రాష్ట్రంలో 'చరిత్ర నిర్మాణం' చెయ్యటానికి కంకణం కట్టుకున్న ఒక పత్రిక సంపాదకీయంలో ఈ అమూల్యమైన భావం ప్రకటించబడింది

మద్రాసు కౌన్సిలులోనూ ఎసెంబ్లీలోనూ కాంగ్రెస్ వర్గంలో నుంచి ప్రభుత్వ ప్రాతికూల్యం రావాలి ఇటువంటి ప్రతికూల పక్షం సరిగా పనిచేస్తే కాంగ్రెస్‌లో కుళ్ళు కడిగేస్తుంది కాంగ్రెస్ వర్గంలో కుళ్ళు కడిగి వెయ్యటమేకాదు, ఈ ప్రతికూలపక్షం కాంగ్రెస్‌నే దుంపనాశనం చెయ్యాలి స్వరాజ్యం వస్తున్నది గనక కాంగ్రెస్‌తో పనిలేదు

ఈ భావానికప్పుడే అభినందనల వర్షం కూడా కురిసింది అయితే ఒక సందేహం కాంగ్రెస్‌ను నిర్మూలం చేసేవారు కాంగ్రెస్‌లో కుళ్ళు కడగటం దేనికీ?

(హెచ్చరిక బురఖాల్లో నుంచి తొంగి చూసే దేశభక్తులు సైకియాట్రిస్టుల దగ్గరికి వెళ్ళి రావటం మంచిది)

ఆనందవాణి, వారపత్రిక, 20-4-1947

# 2. కొన్ని కొత్త వ్యాధులు

ఈ మధ్య మనదేశాన్ని అనేక కొత్త వ్యాధులు ఆవరించటం మూలంగా ప్రజానష్టమూ, సాంఘిక పీడా జాస్తి అయినట్టు పత్రికలద్వారా మనకి తెలుస్తున్నది ఈ వ్యాధులు కొన్ని అనాదిగా వస్తున్నవే, మరికొన్ని సరికొత్తవీనూ, వీటిని గురించి ఆరోగ్యశాఖవారుగాని, పరిశోధకులుగాని తగుశ్రద్ధతో అన్వేషణలు సాగిస్తున్నట్లు కనుపించదు

మలేరియా, ప్లేగూ, కలరా, మహామారి మొదలైన అంటు వ్యాధులను నానారకాల క్రిమి విధ్వంసులతోనూ ఎదుర్కొంటాం రోగ కారణాలను నిర్మొహమాటంగా నాశనం చేస్తాం అటువంటి శ్రద్ధే ఈ రోగాల విషయంలో కూడా తీసుకోవలసి ఉంది

వెనుకటిరోజుల్లో – అంటే శ్రీరామ చంద్రమూర్తివారు పదవిలో ఉండగా – ఓ బ్రాహ్మణుడు చచ్చిపోయిన తన కొడుకును తెచ్చి రాముడి ముందు పెట్టి, "వీడెందుకు చనిపోయినాడు ముందు విచారించు" అని పురమా యించాడుట ఆ విధంగానే మనం కూడా మన పాలకులదగ్గరికి వెళ్ళి, "ఈ వ్యాధులెందుకు వ్యాపించాయో విచారించండి" అని అడగవలసి ఉంది

ఇటీవల గాజుల్లంకలో "ప్రజారక్షణ చట్టం" వచ్చి చాలామంది స్త్రీపురుషులు క్షణాల మీద చచ్చారు ఇది చాలా తీవ్రతరమైన వ్యాధిగా కనిపిస్తుంది దీనికి మూలకారణమైన క్రిములేవో, వాటిని ఏ విధంగా విధ్వంసం చెయ్యాలో ఎవరూ నిర్ణయించినట్లు కనబడదు ఈ జబ్బు అధికంగా బీదసాదలనే ఎత్తుకుపోతున్నప్పటికీ ఇతరులను పూర్తిగా వదిలేస్తున్నట్టు కనబడదు

కమ్యూనిస్టు వ్యతిరేకతావ్యాధి సర్వత్రా వ్యాపించి ఉంది ఇది మనుషులను చంపుకు తినడం లేదుగాని చాలా అవలక్షణాలు కల్పిస్తున్నది ఇప్పటి వరకూ ఈ వ్యాధిగురించి జరిగిన పరిశోధనలు ఒక రకమైన సాక్ష్యం ఇవ్వకుండా ఉన్నాయి కొందరు ఈ వ్యాధి ఒక తరగతి ఫోబియా అనీ, ఒక విధమైన వైరస్ వల్ల ఇది కలుగుతున్నదనీ అభిప్రాయ పడుతున్నారు దీనికి కొంద ఆధారం కనబడుతుంది ఈ వ్యాధి సంక్రమించిన వారు కమ్యూనిజం అనగానే వ్యాధిలక్షణాలు ప్రకటిస్తారు అసందర్భంగా మాట్లాడుతారు, రక్తపుపోటు కలుగుతుంది వారికి సర్వత్రా కమ్యూనిజమే కనిపిస్తుంది ఎక్కడ ఏ సమ్మె జరిగినా, ఎక్కడ నాలుగు చుక్కల వాన ఎక్కువ కురిసినా, ఎక్కడ ఎండలు జాస్తిగా వచ్చినా వారి ఆలోచనలో అనుమానాలూ కమ్యూనిజంకేసి వెళతాయి

హెన్రీవాలస్ అనే వైద్యుడు కమ్యూనిస్టు వ్యతిరేకత ఒక విధమైన హిస్టీరియా అనీ, అది కేవలమూ నరాల దౌర్బల్యం వల్లనే ఏర్పడుతుందనీ నిర్ణయిస్తున్నాడు మరికొందరు పరిశోధకులు, ఈ వ్యాధి అతి సూక్ష్మ క్రిములవల్ల వ్యాప్తమవుతున్నదని అభిప్రాయపడు తున్నారు

ఈ వ్యాధికి చికిత్స ఉందని చెప్పలేం కాని దీనికి కొంత ఉపశాంతి చికిత్స లేకపోలేదు ఈ వ్యాధి సోకినవారు కమ్యూనిస్టులనూ వారి అభిమానులనూ విసర్జించేది కొన్ని అమెరికన్ పత్రికలూ, మరికొన్ని బ్రిటిషు పత్రికలు తెప్పించుకుని అందులో ఉండే రష్యామీది విషప్రచారం గంటకొకసారి పెద్ద చెంచాడు సేవించేది దీనికి దేశావాళీ మందులు కూడా ఉన్నాయి కాని అవి ముదిరిపోయిన కేసులకు పని చెయ్యకుండా ఉన్నాయి

విద్వేషం అనే వ్యాధి మన సంచితం మన సాంప్రదాయం, మన జన్మహక్కు జపాను వాళ్ళకి బెరిబెరీ ఎట్లాగో మనకు విద్వేషమూ అంతే అందుచేత కొద్ది మోతాదులో ఇది మనని వేధించదు దీని ప్రాథమిక దశ తాలూకు లక్షణాలు సాటివాడు బాగు పడితే ఏడవటమూ, వాడిమీద క్షుద్రప్రచారము సాగించటమూను, ఈ స్థితిలో ఇది ఏమాత్రమూ అపాయకరం కాదు పైగా ఆయువు పెంచుతుంది తీవ్రదశలో– కాంప్లికేషన్సు వచ్చిన మీదట– ఇది నిజంగా ప్రమాదకరమే ప్రస్తుతం మన దేశపు నాగరికప్రాంతాల్లో – అస్సాము, బెంగాలు, బీహారు, పంజాబు ప్రాంతాల్లో – ఇది తీవ్ర రూపంలో మనుషుల్ని కాల్చుకుతింటున్నది ఇది ఒక తరగతి హోమిసైడల్ మేనియా అనవచ్చు ఈ వ్యాధి సంక్రమించగానే ఆగర్భ శత్రువులల్లే కన్పిస్తారు దీనికి కూడా క్రిములే కారణమనీ, ఈ క్రిములు పత్రికల ద్వారా ప్రచారం అవుతున్నాయనీ గాలిలో కూడా ఇవి ఎగిరి రాగలవనీ అనుకోవడానికి ఆధారం ఉంది

ఈ వ్యాధుల జాబితా ఇంత తేలికలో పూర్తయేది కాదు దీనిని గురించి ప్రజాభిప్రాయమూ, పెద్దల ఆలోచనా రేపటానికే ఈ మూడుముక్కలూ రాశాను ఈ వ్యాధుల సమగ్ర జాబితా తయారుచెయ్యటమూ, వాటిని గురించి శాస్త్రీయంగా పరిశోధనలుచెయ్యటం అభిజ్ఞులపని

ఆనందవాణి, వారపత్రిక 4-5-1947

## 3. ప్రవర్తన

ప్రవర్తనా, దుష్ప్రవర్తనా అనేదాన్ని గురించి మనందరికి స్పష్టమైన అభిప్రాయాలున్నై కొన్ని నీతినియమాలు దేశకాలపాత్ర విచక్షణ లేకుండా అందరూ పాటించాలని మనం అభిప్రాయపడతాం చాటుగా పొడిచి చంపటం ద్రోహం నమ్మినవాణ్ణి మోసం చెయ్యటం ద్రోహం మరొకడు ఇబ్బందిలో ఉంటే మనం సులభంగా చెయ్యగలిగి ఉన్న సహాయం చెయ్యకపోవటం ద్రోహం మరొకడిసొత్తు కాజెయ్యటం ద్రోహం ఈ విశ్వాసాలు సర్వత్రా, అన్ని దేశాలవారూ, అన్ని జాతులవారూ, ఏకాలంలోనైనా పాటించవలసిందేనని మనం అభిప్రాయపడతాం ఈ అభిప్రాయాలమీద మనం నిలబడతామా అంటే అది వేరే కథ, అయితే నిలబడటం లేదని మనం ఒక్కనాటికి ఒప్పుకోం యుద్ధంలో శత్రువును ఎదురుగా చంపినా, చాటుగా చంపినా కూడా ఒప్పుకుంటాం, కాని యుద్ధపరిస్థితులు వేరూ– మనిషికి వర్తించే నీతి శత్రువుపట్ల వర్తించదు! రాముడు వాలిని చంపినందుకు తప్పుపట్టం, ఏమంటే రాముడు దేముడు! మన రాజకీయవేత్తలు తమను నమ్మి ఎన్నుకున్న ప్రజల్ని మోసం చేస్తే అంత పట్టించుకోం, రాజకీయతంత్రం జీవిత నీతిసూత్రాలకు అతీతం! పెట్టుబడిదార్లు శ్రామికుల శ్రమఫలితం కాజేస్తుంటే మనం ఇబ్బందిపడం, వాళ్ళకంతే కావాలి, సంఘాలు పెట్టి సమ్మెలు చేస్తారా?

ఈ విధంగా మనం సరిపెట్టుకుపోతాం తప్ప మన నైతిక విశ్వాసాలను మాత్రం కోల్పోము ఇంకా లోతుగా ఆలోచిస్తే ఈ నీతిసూత్రాలను మనం ఆచరణలో ఎన్నడూ పాటించమనీ ఆదర్శంలో ఎప్పుడూ పాటించమనీ కూడా తెలుస్తుంది

ఉదాహరణకు గాంధీజీ ప్రబోధించిన సత్యాహింసలు తీసుకుందాం వీటిని ఏ కాంగ్రెసువాది కూడా ఎన్నడూ త్రికరణశుద్ధిగా ఆచరణలో పెట్టలేదని చెప్పొచ్చు ఎందుకంటే వాటిని

ఆచరణలో పెట్టగలిగితే గాంధీజీ అంతవాడు కావచ్చు అయితే వాటిని అందరూ ఆచరణలో పెట్టిందీ లేనిదీ పబ్లిగ్గా ఎన్నడూ రుజువుకు రాలేదు అట్లా రుజువుకు వచ్చే సమయానికి అవి అందరికీ ఆచరణయోగ్యం కావని కొందరు అంగీకరించారు కాని అప్పటికీ అధికసంఖ్యాకులు వాటిని ఉల్లంఘించవలసి వచ్చినప్పుడు మనస్సును మభ్యపెట్టుకుంటూ వాటియందు విశ్వాసం ఏ మాత్రమూ చెడనట్టే ప్రవర్తించుతున్నారు

ఇప్పుడు ప్రవర్తనను గురించి ఆదర్శాభిప్రాయాలు గలవాళ్ళని గురించి అనుకున్నాం ఇటువంటి ఆదర్శాభిప్రాయాలు ఏ విధంగా ప్రచారంలోకి వచ్చిందీ వాటిని ఆచరణలో పెడితే ఏమి జరిగేదీ ముందు ముందు తెలుసుకుందాం

ప్రవర్తనను గురించి మరోదృష్టి కూడా ఉంది అదేమంటే, అసలు నీతీ అవినీతీ అంటూ లేవనీ, అవన్నీ ఎవరో స్వార్థం కోసం ఏర్పాటుచేశారనీ, సంస్కారి అయినవాడు నీతినియమాలను ప్రతిఘటించాలనీనూ ఇది అరాచకవాదం ఈ అరాచకవాదానికి బలమేమిటంటే సాంఘికవ్యవస్థను గురించి బొత్తిగా ఏమీ తెలీకపోవటమూ, వ్యక్తిస్వాతంత్ర్యం గురించి అనేక అర్థంలేని భావాలుండటమూనూ

అన్నిరకాల నీతి నియమాలూ దురాచారాలే ననీ, వెనకటి కాలాల్లో సహగమనం వంటి దురాచారాలను పరిష్కరించినట్టుగానే, ఈ యుగంలో కూడా పెళ్ళిళ్ళూ, పిల్లల్ని కనటమూ, మొగుడు పెళ్ళాలు ఒకరితో ఒకరు నియమంగా కాపరం చెయ్యటమూ, మనుషులు 'పరస్త్రీ, పర పురుషుడు' అనే విచక్షణతో ప్రవర్తించటమూ, మొదలయిన దురాచారాలు రూపుమాపవచ్చుననీ వీరి నమ్మకం మనుషులు మూఢులు కావటం చేతనే ఈ దురాచారాలను పాటిస్తున్నారని వీరు భావించి దానికి తగ్గట్టుగా ప్రచారం చేస్తారు

ఆదర్శవాదానికీ అరాచకవాదానికీ ఒక్క సామ్యం మటుకు కనిపిస్తుంది ఈ రెండురకాల సిద్ధాంతాలవారూ ప్రవర్తనను జీవితంనుంచి వేరుచేసి చూస్తారు నీతినియమాలను కూడా జీవితావసరాలనుంచి వేరుచేసి చూస్తారు జీవితానికీ, ఆచారవ్యవహారాలకూ, నీతి నియమాలకూ మానవ ప్రవర్తనకూ గల సన్నిహిత సంబంధాలు తెలుసుకుంటే అనేకమైన అపోహాలు పోతై

ఆచార వ్యవహారాలు జీవిత విధానానికి దూరమైపోవని గానీ, నీతినియమాలు జీవితంతోపాటు సవ్యంగా మారుతుంటాయని గాని, మనుష్యప్రవర్తనలో స్వతస్సిద్ధంగా మంచిచెడ్డలుండవని గాని మనం ఒక్కనాటికి భావించరాదు ఏ సంఘంలో కూడా జీవితవిధానం మారినంత వేగం నీతినియమాలు మారవు మనిషి ప్రవర్తన నీతినియమాలకు అనుక్షణమూ కట్టుబడీ ఉండదు అందుచేత మనం ఆచారవ్యవహారాలనూ, నీతి నియమాలనూ, వ్యక్తుల ప్రవర్తననూ– ప్రత్యేకించి సాంఘిక ప్రవర్తనను– విమర్శించుకుంటూ ఉండకతప్పదు

అయితే ఈ విమర్శ సామాన్యంగా మన సంస్కారానికి అనుగుణ్యంగా జరుగుతూ ఉంటుంది బెంగాలీ బ్రాహ్మణులు చేపలు తింటారని మనదేశపు బ్రాహ్మణులు తప్పుపడతారు కాని బెంగాలులో కొన్నిప్రాంతాలలో కొన్ని మాసాలపాటు చేపలు తప్ప యితర కూరలు దొరకవు అ విధంగానే మనం బీదసాదలను తప్పుపట్టవచ్చు, వాళ్ళు అనారోగ్యంగా ఉంటారు, అంటువ్యాధులు వాళ్ళమూలంగానే వ్యాపిస్తాయి వాళ్ళు మంచి ఆహారం తినరు తగినంత పళ్ళూ పాలూ భోంచెయ్యరు మంచి ఇళ్ళలో నివసించరు

ఇటువంటి సంస్కరణ జయప్రదంగా సాగదు ఒక్కోసారి హాస్యాస్పదంగా కూడా పరిణమిస్తుంది కారణమేమంటే మనుష్యుల ఆచారవ్యవహారాలకూ, నీతినియమాలకూ, సాంఘిక ప్రవర్తనకూ నిజమైన పునాది ఆ మనుష్యుల భౌతికజీవితం– ఎక్కడో ఉండి విమర్శించేవారి సంస్కారం కాదు

సంస్కారానికి విలువ లేదన్నా అది తప్పే అవుతుంది దారిద్ర్యం కూడా సాంఘిక దుష్ప్రవర్తనే అనే జ్ఞానం కలిగినాక ఆ సంఘశ్రేయస్సుకు వినియోగపరచకపోవటం తప్పే ఇతర జ్ఞానం కూడా ఇంతే

అయితే జ్ఞానసంస్కారాల ద్వారా సాంఘిక ప్రవర్తనము మార్పు తీసుకురాగోరేవారికి చాలా అంతరాయాలు కనిపిస్తాయి తీగె కదిలిస్తే పాదంతా కదులుతుంది దరిద్రం సాంఘిక దుష్ప్రవర్తన అని గట్టిగా నమ్మినవాడు దరిద్రాన్ని అంతం చెయ్యటానికి సాంఘికవిప్లవం కంటె తక్కువ సాధనమూ సులభోపాయమూ లేదని వెంటనే గుర్తిస్తాడు సంఘంలో చలామణీ అయే నీతినియమాలూ, ఆచారవ్యవహారాలూ మాత్రమే కాక సాంఘికవ్యవస్థ యావత్తూ –సాంఘికభౌతిక పరిస్థితి అంతా – అధికసంఖ్యాకుల దారిద్ర్యానికి అనుకూలంగా ఉందని స్పష్టమవుతుంది సాంఘిక వ్యవస్థలో సరిఅయిన విప్లవం తీసుకురావటానికి దారిద్ర్యం సాంఘిక దుష్ప్రవర్తన అనే జ్ఞానం చాలుతుందా? చాలదు

ఒకవేళ మనకు సంఘంలో కొంత పలుకుబడి ఉందనుకుందాం మనం చెబితే పదిమందీ వింటారు అందుచేత చెప్పిచూద్దాం క్రమంగా మన సంస్కారం ప్రచారమయితే అవసరమైన మార్పు దానంతట అదే రాకపోతుందా? ఈ భాగ్యానికి విప్లవాలెందుకు?

గాంధీజీ ఇటువంటి ప్రబోధం చేశాడు అహింసా సిద్ధాంతాన్ని అందరూ విన్నారు అందరూ దాన్ని నమ్మారు ఫలితం ఏమిటి? కార్మికులు చేసే సమ్మెలు ప్రజలకు హింసాయుతంగా కనిపించినై పెట్టుబడిదారుల దుర్మార్గం ఎవరూ చూడలేదు ఎందుచేతనంటే లక్షలకు లక్షలు లాభాలు చేసుకునే ఫ్యాక్టరీలో పనిచేసేవాళ్ళు వర్ణనాతీతమైన హింసలు పడి తిండికీ గుడ్డకూ మాడుతుంటే అందులో వార్తావిశేషం లేదు, అదే ఫ్యాక్టరీలో సమ్మె జరిగితే అది వార్త దాన్ని గురించి సంస్కార్లంతా నిరసన చూపిస్తారు గాంధీ అహింసాతత్వం ఈ 'తుచ్ఛ కార్మికులకు' అంటకపోవడం స్పష్టంగా కనిపిస్తుంది ఈ సంస్కారప్రచారం జీవితవిధానంలో మార్పు తీసుకురాదు, నీతినియమాలు మార్చదు, ఆచారవ్యవహారాలను సంస్కరించదు అనాథ ప్రజను మరింత అనాథలు చేస్తుంది

ఆనందవాణి వారపత్రిక, 18-5-1947

# 4. నీతినియమాలు

ఒకనాటి సమాజంలో ఆదర్శనీతి ఉండేదికాదు ఉన్న నీతినియమాలు అనుల్లంఘనీయంగా ఉండేవి వాటిని అతిక్రమించినవారిని చాలా తీవ్రంగా దండించటమో, చంపెయ్యటమో, సంఘంలో నుంచి వెళ్ళగొట్టటమో జరిగేది నీతినియమాలను సంఘంలో ప్రతివాడూ పాటించేవాడు ఎందుచేతనంటే మిగిలిన సంఘమంతా ఆ నీతినియమాలను బలపరిచేది ఎవడైనా ఒక నియమాన్ని ఉల్లంఘించినట్టయితే వాడికి శిక్ష ఇవ్వటం గురించి రెండు అభిప్రాయాలుండేవి కావు

ఇవి ఎటువంటి సంఘాలు? వీటి నాగరికత ఏపాటిది? మన ఆదర్శ నైతిక సిద్ధాంతాలతో పోల్చి చూస్తే వీరి నీతినియమాలు చాలా అనాగరికంగా కనిపిస్తాయి వాళ్ళు అడివిముండాకొడుకులు గనక చిన్న తప్పులను- అంటే, మన దృష్టిలో చిన్నతప్పులకు- అంత క్రూరంగా- మళ్ళీ మనదృష్టిలోనే- హింసించేవారనిపిస్తుంది

ఈ సంఘాలు అనాగరికమైన బర్బరసంఘాలనటానికి సందేహం లేదు కాని ఆ బర్బరత్వమూ, అనాగరికతా ఆ సంఘాల నీతినియమాల్లో లేదు- వాటి వెనక ఉండిన జీవితవిధానంలో మాత్రమే ఉండింది

ఎందుచేతనంటే ఆనాటి సంఘంలో నీతినియమాలకు ప్రత్యక్ష ప్రయోజనం ఉండేది వాటికీ వారి జీవితపథాలకూ అవినాభావ సంబంధం ఉండేది ఎవరైనా ఒక నియమాన్ని ఉల్లంఘిస్తే దాని దుష్ఫలితం సంఘంలో ఉన్న అందరికీ కలిగేది

ఆనాటి సంఘాలలో వర్గభేదాలు లేవు అయితే అప్పట్లో కూడా జీవితం నిలకడగా ఉండలేదు పరిస్థితులు మారేవి ఒక్కొక్క నియమం క్రమంగా సంఘానికి ఉపకరించటం మానుకునేది సంఘంలో ఉన్న వ్యక్తులు క్రమంగా ఆ నియమాన్ని చాటుచాటుగా ఉల్లంఘించసాగేవారు కాలక్రమాన అటువంటి నియమం జారిపోయేది

సంఘంలో వర్గవ్యవస్థ ఏర్పడినాక నీతినియమాలకి ప్రాముఖ్యం తగ్గటమే గాక, వాటి గురించి సంఘం యొక్క వైఖరిలో కూడా మార్పు కలిగింది సాంఘికవ్యవస్థ కొన్ని వర్గాలకనుకూలంగానూ, కొన్నివర్గాలకు ప్రతికూలంగానూ ఏర్పాటై, ఆచారవ్యవహారాలూ, నీతినియమాలూ, వాటిని అమలుజరిపే న్యాయచట్టమూ, పై వర్గాలకనుకూలంగా ఏర్పడేసరికి ప్రవర్తనగురించి సంఘప్రజలలో దృష్టిభేదాలేర్పడినై

పై వర్గంవాళ్ళు తమ లాభాలకోసం ఏర్పరిచిన నీతినియమాలను గురించి కిందివర్గాల వాళ్ళు పెద్ద ఉత్సాహం చూపలేకపోయినారు వర్గరహిత సమాజంలో నీతినియమోల్లంఘన చేసిన వాడు సంఘద్రోహి అనే విషయమై రెండభిప్రాయాలుండేవి కావు ఇప్పుడు నీతినియమాలను ఉల్లంఘించినవాడు సంఘద్రోహి కావచ్చు విప్లవవాది కావచ్చు

ప్రవర్తన గురించిన ఈ ద్వంద్వదృష్టి సంఘంలో ఒక విచిత్రపరివర్తన తీసుకురాసాగింది మొదటి సంగతి, ప్రవర్తనను గురించి కేవలమూ విశ్వాసాలే కాక వైజ్ఞానిక దృష్టి కూడా పెరిగిరాసాగింది సంఘంలో కొందరు బుద్ధిమంతులైనా వర్గప్రయోజనాలకు అతీతంగా పెరిగి ప్రవర్తనను గురించి తమ న్యాయనిర్ణయాలివ్వటం జరిగింది ఈ వైజ్ఞానికదృష్టి వర్గసమాజంలో ముసలమని చెప్పవచ్చు ఈ ముసలం క్రమంగా పెరుగుతున్నది గాని తరగటంలేదు ఎందుచేతనంటే కిందివర్గాలవాళ్ళు పై వర్గాలమీద విప్లవం చెయ్యటానికి ప్రయత్నించినప్పుడల్లా పైవర్గంలో వాళ్ళు కొందరు సత్యం పేరిటనో, ధర్మం పేరిటనో, న్యాయం పేరిటనో, విజ్ఞానం పేరిటనో విప్లవానికి అనుకూలంగా పనిచేస్తూ వచ్చారు ఈ మార్పు వెంటనే మరోమార్పు కూడా జరిగింది అదేమిటంటే మనుష్యుల దుష్ప్రవర్తన దండించేభారం సంఘంమీది నుంచి తొలగిపోయి నీతినియమాలు ఏర్పాటుచేసే వర్గం మీదనే పడింది చట్టశాసనాలూ, న్యాయస్థానాలూ, పోలీసులూ ఏర్పాటయినారు ఇవన్నీ మొత్తంమీద అధికారం చలాయించే వర్గాల ఉపకరణాలుగా పరిణమించటం వల్ల ఇతరవర్గాలకు వీటిమీద ఆదరగౌరవాలుండేవి కావు

వర్గసంఘర్షణ పెరిగినకొద్దీ దోపిడీద్వారా అధికారబలం అమలుజరుపుతూ వచ్చిన వర్గాలు ఆత్మరక్షణకు ఇతర సాధనాలను కూడా ఏర్పరచుకోకపోలేదు సంస్కారమూ, మతమూ, నాగరికతా, కళలూ మొదలైనవాటిని దోపిడీసాధనాలుగా వినియోగపరచటానికి పై వర్గాలు చాలావరకు జయప్రదంగానే కృషిచేసినై ఆఖరుకు విజ్ఞానాన్ని కూడా దోపిడీ సాధనంగా వినియోగపరచటానికి వర్గాలు ప్రయత్నించినై

అనాథలనూ, దరిద్రులనూ విప్లవోన్ముఖులను చేయటానికి బయల్దేరిన క్రైస్తవమతం క్రీస్తు అనంతరం పది శతాబ్దులకాలంలో దివ్యమైన దోపిడీసాధనంగా మార్చబడింది ఈనాడు పావలా కాంగ్రెసుమెంబరుకు 'కాంగ్రెసుసంస్థ నాది' అనుకునే అవకాశం ఎంత ఉందో, మధ్యయుగంలో క్రైస్తవులకు, 'ఈ క్రైస్తవమతం మాది' అనుకునేటందుకంతకన్నా చాలా తక్కువ అవకాశాలుండినై మరో పది శతాబ్దులకు ఈ క్రైస్తవమతమే ఫాసిస్టులకు అండగా నిలబడింది

రహస్యమేమంటే మతం గాని, సంస్కారంగాని తమంతట తాము సంఘంలో ఉండే, వర్గవిభేదాలను చదునుచేసి దోపిడీవిధానాన్ని అంతమొందించలేవు పైపెచ్చు ఇవి దోపిడీ సాధనాలుగా కూడా ఉపయోగపడతై అందుచేత విప్లవవాదులు వీటిమీద ఎక్కువ ఆధారపడరు

అంతమాత్రానకే ఈ మతాలూ, కళలూ, సంస్కారమూ విప్లవానికీ అభ్యుదయానికీ ఉపకరించవనటానికి వీల్లేదు దోపిడీవిధానాన్ని కూలదోసే బీజాలు దోపిడీ సాధనాలన్నిటి వెంటా ఉంటాయి అవే ఈ మతంలోనూ, కళల్లోనూ కూడా ఉంటై వీటిని ఆయా సంస్కారులు ఎప్పటికైనా గుర్తించటం జరుగుతుంది

ఎందుచేతనంటే ఆధునికమానవుడికి ప్రవర్తన గురించి ఆదర్శదృష్టి కల్పించినవి ఈ మతాలే, ఈ సంస్కారాలే, ఈ కళలే వీటిని నిండువిశ్వాసంతో ఆరాధించేవారికి ఎప్పటికైనా వీటి ఆరాధనలో వైఫల్యం గోచరించకతప్పదు "డీన్ ఆఫ్ కాంటర్బరీ" తన మత విశ్వాసాల నుంచి వర్గదోపిడీ చూసి తెలుసుకోగలిగాడు ఇదే అనుభవం అనేకమంది శాస్త్రవేత్తలకూ, కళాకారులకూ, కవులకూ కలిగింది ఎనిమిదిగంటల కాయకష్టానికి యంత్రయుగంలో కూడా పట్టెడన్నం విలువలేక శ్రామికులు విప్లవోన్ముఖులవుతుంటే, సంస్కారం గలవారు తాము ఆరాధించే సంస్కారంతో తమ ఆదర్శాలను సమన్వయించలేక విప్లవపథం తొక్కుతున్నారు

ఆనందవాణి, వారపత్రిక, 25-5-1947

## 5. వర్గచైతన్యం

సాంఘిక ప్రవర్తనను గురించీ, ఈ విశాలవిశ్వంలో అన్ని దేశాలకూ, జాతులకూ చెందిన వివిధ నరమానవులు పాటించవలసిన నీతినియమాలను గురించీ, ఆదర్శదృష్టి తెచ్చిపెట్టుకోగలిగిన మధ్యతరగతి యధార్థజీవితాన్ని గురించీ, దాని అవసరాలను గురించీ తెలుసుకునే సంస్కారం లేని స్థితిలో ఎందుకున్నది?

ఈ ప్రశ్నకు బోలెడంత సమాధానం కనిపిస్తుంది

యధార్థ పరిస్థితులకు అతీతంగా వెళ్ళి ఆదర్శాలను గురించి ఆలోచించటమే మధ్యతరగతి సంస్కారానికి పునాది ఈ ఆదర్శాలను అమలుజరపాలంటే యధార్థపరిస్థితుల నెదుర్కొని

మధ్యతరగతి వర్గచైతన్యం పొందాలి  అటువంటి పరిస్థితిలో ఆదర్శాలకు స్వస్తిచెప్పవలిసి వచ్చింది  మధ్యతరగతి విప్లవోన్ముఖమైనప్పుడిదే జరుగుతుంది  మనం ఇప్పుడు విప్లవచైతన్యం లేని మధ్యతరగతి గురించి ఆలోచిస్తున్నాం

మధ్యతరగతి సంస్కారం తాలూకు ఉపాంగాలకు కూడా యదార్ధ పరిస్థితులతో సంబంధం లేదు  ఈ గాలిలో సాముకు ఆధారభూతంగా ఉన్న విశేషాలు మనం సులభంగా తెలుసుకోవచ్చు

ముందు శాస్త్రవిజ్ఞానం తీసుకుందాం  మన ఈనాటి నాగరికతకు వెన్నెముక శాస్త్ర పరిజ్ఞానం  మన ఆయురారోగ్యానందాభివృద్ధులన్నీ శాస్త్రపరిజ్ఞానం మీదే ఆధారపడి ఉన్నై ఈ శాస్త్రపరిజ్ఞానాన్ని హెచ్చుగా పరిశోధనల ద్వారా అభివృద్ధి పొందించే తరగతి మధ్యతరగతే కాని జ్ఞానసేకరణ గురించి మధ్యతరగతి సంస్కారం దృష్టి ఏమిటి?  శోధకుడు 'ప్యూర్ సైన్స్'(పచ్చి శాస్త్రం) మీద తన దృష్టి కేంద్రీకరించాలి  తన పరిశోధనలవల్ల ప్రయోజనం గురించి ఆలోచించరాదు  శాస్త్రసంబంధమైన కొత్తసూత్రాలు కనిపెట్టేవాళ్ళకన్న పాతసూత్రాలనుంచి కొత్త ప్రయోజనాలు కనిపెట్టేవాళ్ళు తక్కువ తరగతి శాస్త్రజ్ఞులుగా ఎంచబడుతున్నారు

ఇక్కడ ఒక్కముక్క మనం తెలుసుకోవాలి  వర్గరహితమూ, దోపిడీవిధానం లేనిదీ అయిన సమాజంలో ఇటువంటి విశ్వాసంవల్ల ప్రజలకు అపకారం లేదు  ఎందుకంటే ఆధునికయుగంలో శాస్త్రపరిజ్ఞానానికి దానివల్ల సాధించే ప్రయోజనాలకీ చాలా పెద్ద ఎడం ఉంది  అంధకారయుగంలో ప్రకృతిని పరిశోధించిన ఆదిమమానవుడు తన ప్రయోజనాలను దాటి ఆటే దూరం  వెళ్ళేవాడు కాదు  ఈనాడది పొసగదు  ఒక్కోసారి పరిశోధనకూ దాని ఉపయోగానికీ మధ్య అనేక దశాబ్దాల కాలమూ, అనేకవేలమంది కృషీ అడ్డం ఉంటుంది  కాని వర్గయుత సమాజంలో పచ్చి శాస్త్రానికి అధికమైన విలువ ఉండటం వల్ల అధికారం సాగించే వర్గానికి శాస్త్రపరిశోధనల తాలూకు లాభం దక్కుతున్నది  జనసామాన్యానికి దాని ఫలితం దక్కకపోగా అనర్థం కూడా కలుగుతున్నది  సంఘంలో కొద్దిమంది శాస్త్రజ్ఞానాన్ని కొనుక్కుని, చాతనయితే దానిని పెట్టుబడిద్వారా పారిశ్రామికంగా స్వలాభాలకు ఉపయోగించుకుని, సాధ్యం కాని పక్షంలో కొత్తనిర్మాణాన్ని అణచివేసే స్థితిలో కూడా ఉన్నారు  ఇటీవల పరమాణుశక్తి  తాలూకు రాజకీయాలన్నీ తెలుసుకున్న వారికి సంగతి చాలావరకు బోధపడుతుంది  పరమాణుశక్తి గురించి అనేక దేశాలలోని అనేకవేలమంది శాస్త్రజ్ఞులు పరిశోధనలు చేశారు  ఒకరికొకరు సహాయపడ్డారు  ఒకరికి మరొకరు ఇచ్చిపుచ్చుకున్నారు  తీరా ఈ పరిశోధనలు ఒక ఒడ్డుపట్టే సమయానికి అమెరికా ప్రభుత్వం ఈ పరిశోధనల చుట్టూ గిరిగీసి వీటిని పెరగనీకుండా ఆంక్షలు పెట్టింది  తుచ్ఛమైన పరమాణువుబాంబు తప్ప ఇంకేమీ బయటికి రాలేదు  పరమాణువులో ప్రజాసామాన్యానికి అనేకవిధాల ఉపయోగించే అద్భుతశక్తులన్నీ  ఉన్నాయి  వాటి పరిశోధనల గురించి అమెరికా ప్రభుత్వానికి విచారం లేదు  అమెరికా ప్రభుత్వానికి కావలిసింది బాంబురహస్యం తనచేతిలో ఉండటం ఇది పరమాణువు పరిశోధనలు చేసినవారి ఆశయం కాదు, ఏ దేశపు ప్రజల ఆశయమూ కాదు

ఈనాటి శాస్త్రపరిశోధకులలో ఎందరో అపూర్వమేధావులున్నారు , అపూర్వ వ్యక్తులున్నారు వీరీ పరిస్థితుల్ని మార్చలేరా? శాస్త్రపరిశోధనలకు పెట్టుబడిదారీ దోపిడీనుంచి విముక్తి ఇవ్వలేరా? ఇవ్వగలరు గాని సులభసాధ్యం కాదు  శాస్త్రపరిశోధనల ఫలితాలు చాలా ఖరీదైన

యంత్రాలద్వారా తప్ప ప్రజలకందవు శాస్త్రపరిశోధనలు సాగించే సరంజామా కూడా ఖరీదైనది అందుకనే పరిశోధనకు ముందూ వెనకా కూడా పెట్టుబడిదారీ గోడలున్నై ప్రభుత్వాలు నడిపే పరిశోధనలు కూడా ప్రభుత్వాలను నడిపే పెట్టుబడిదార్ల చేతుల్లో ఉన్నై అందుకనే ఒక ప్రఖ్యాత శాస్త్రజ్ఞుడు "పరమాణువు పరిశోధనల్లో రాజకీయాలు ప్రవేశించినై రాజకీయాల్లోకి పరమాణువు పరిశోధనలు ప్రవేశించినై" అని చెబుతూ, శాస్త్రజ్ఞులు రాజకీయాలకు ఎడంగా ఉండటం క్షేమం కాదనీ, పరిశోధనల మీద దోపిడీవర్గాలను ఆంక్షలు పెట్టనివ్వటం శాస్త్రానికి క్షేమం కాదనీ హెచ్చరించాడు ప్రపంచమంతటా శాస్త్రజ్ఞులు మేలుకుని వర్గచైతన్యం తెచ్చుకుంటున్నారు ఇది పెట్టుబడిదారీ వర్గానికీ, అభ్యుదయ నిరోధకులకీ గుండెలో గుండు రాజకీయ చక్రాన్ని వీరు నిరంకుశంగా తిప్పేరోజులయిపోయినై

ఇటువంటి మార్పే మధ్యతరగతికి సంబంధించిన కళాకారుల్లో కూడా కలుగుతున్నది ఈ తరగతిలో వర్గజాగృతి లేనంతకాలమూ దోపిడీవర్గం ప్రజలకీ కళాకారులకీ మధ్య నిలబడి కళ కళ కోసమేననే సంస్కారాన్ని ప్రచారం చెయ్యగలిగింది అచ్చుయంత్రాలూ, నాటకశాలలూ, సినిమా స్టూడియోలు పెట్టుబడిదార్ల చేతిలో ఉండటం వల్ల ఆ యంత్రాలమీద పనిచేసే వాళ్ళెంతగా దోపిడి అవుతున్నారో కళలు కూడా అంతగా దోపిడీ అవుతున్నవనే జ్ఞానం కళాకారుల్లో కలుగుతున్నది ఇక్కడ కూడా మధ్యతరగతి ఆదర్శసంస్కారం వెనక్కుతగ్గి వర్గచైతన్యం ముందుకొస్తున్నది

ఆఖరుకు రాజకీయాల విషయంలో కూడా నిన్న మొన్నటివరకూ మధ్యతరగతి ఆదర్శదృష్టితోనే ఉంటూవచ్చింది ఈ మధ్యతరగతి ఆదర్శదృష్టి తాలూకు మూర్తీభవించిన అవతారం గాంధీమహాత్ముడు రాజకీయవాదులంతా ఆదర్శప్రాయంగా ఉండాలి ఆదర్శాలు వెంట్రుకవాసి అటూ ఇటూ వెళ్ళకూడదు రాజకీయాలకు వ్యక్తుల అంతరాత్మే మార్గదర్శి రాజకీయాలలో వర్గవిభేదాలకు తావులేదు

ఇటువంటి విశ్వాసాల ఫలితంగా మన మధ్యతరగతి రాజకీయాలలో యధార్థదృష్టిని పాటించలేదు ప్రజాస్వామ్యమంటే క్రియకు ప్రతివాడూ రాజకీయాల్లో పాల్గొనే అధికారమే అయినప్పటికీ మధ్యతరగతి రాజకీయాలను గురించి ఆదర్శదృష్టి తప్ప మరోటి తెచ్చిపెట్టుకోలేదు ఈనాడు కూడా సంభాషణ రాజకీయాల్లోకి మళ్ళితే ఖంగారుపడేవారున్నారు కమ్యూనిస్టులూ, సోషలిస్టులూ మొదలైనవాళ్ళు వర్గచైతన్యంతో రాజకీయాలు నడపటం మనదేశంలో మధ్యతరగతికి నచ్చక వారిని ప్రతిఘటించేందుకు రాజకీయాలలో ప్రవేశించారు దిగితేగాని లోతు తెలియదు ఈ విధంగా రాజకీయాల్లో దిగి అయిదారునెలల్లో వర్గచైతన్యం పొందినవారనేకమంది ఉన్నారు రాజకీయాలను గురించి మధ్యతరగతికి యధార్థదృష్టి లేనంతకాలమూ దోపిడీవర్గాలకు అనుకూలించింది ఇక్కడ కూడా మధ్యతరగతి మేలుకుంటున్నది

వర్గచైతన్యంతో కూడిన సాంఘిక ప్రవర్తనకు ఆదర్శ నీతినియమాలు అతకవు ఈ విషయం మధ్యతరగతి గుర్తించుతున్నకొద్దీ వర్గాలు నిర్మూలనం కావటానికి అనుకూల పరిస్థితులేర్పడతై

ఆనందవాణి, వారపత్రిక, 1-6-1947

# 6. సౌందర్యం

కొందరు కళావేత్తల చేతిలో ఈమాట అణువుబాంబు కళను గురించి శాస్త్రీయంగానూ, సంఘపరంగానూ, అభ్యుదయపరంగానూ ఆలోచించటానికి ప్రయత్నించేవారిమీద ఈ కళావేత్తలు సౌందర్యమనే మాట ప్రయోగించి వారి వాదనలన్నీ మరపట్టేస్తారు

"కళ ఏమిటీ? సౌందర్యసాధన సౌందర్యం ఏమిటీ? అవాఙ్మానసగోచరమైన బ్రహ్మపదార్థం కేవలమూ పూర్వజన్మ సంస్కారం కలవారికీ, అదృష్టవంతులకీ, గొప్పవాళ్ళకీ మటుకే దాని స్వరూపం తెలుస్తుంది "

ఇదీ కొందరి సిద్ధాంతం

అయితే సౌందర్యం అయోమయమైనదేనా? దాన్ని గురించి మనలాటి మానవమాత్రులు తెలుసుకునేటందుకు లేదా?

చాలా ఉంది

నిజానికి సౌందర్యం గురించి మనం తెలుసుకోలేనిదేమీ లేదు

సౌందర్యాన్ని గురించి మనం తెలుసుకోవలిసిన ప్రధానవిషయమేమిటంటే దానికి ప్రయోజనంతో సన్నిహితసంబంధం ఉంది

దైనికజీవితంలో మనం ఈ మాటను ప్రయోజనానికి అతీతంగా ఎన్నడూ వాడనేవాడం అందమైన ఆవు అన్నా, చక్కని వంకాయలన్నా, పువ్వులాంటి అన్నమన్నా అందులో అంతరార్థమేమిటో మనకు తెలుసు– అత్యధికమైన ప్రయోజనం కలదని ఇదే ఇంకా సంగ్రహంగా చెప్పాలంటే, నయనేంద్రియం ద్వారా గ్రాహ్యమైన ప్రయోజనం తాలూకు బాహ్యలక్షణాల సముదాయమే సౌందర్యం

మానవ సౌందర్యం కూడా ఇటువంటిదే ఉత్తమమైన ఆరోగ్యమూ, కామసంతృప్తి కలిగించే లక్షణాలూ, దార్ఢ్యమూ, ఇవి కలిగిన దేహాలలోనే మనం సౌందర్యం చూస్తాం సౌందర్యం అవాఙ్మానసగోచరమనేవాళ్ళు సహితం చప్పిదవడలూ, లోతుకుపోయిన కళ్ళూ, ఎండిపోయిన అవయవాలూ కలిగి రోగగ్రస్తమై, శక్తిరహితమైన శరీరాల్లో అందం చూడటానికి ప్రయత్నించరు

భావసౌందర్యం కూడా ఇటువంటిదే అనేక సామెతల్లో సౌందర్యం ఉంది శాస్త్రపరిశోధకులు చేసే సిద్ధాంతాలలో అందం ఉంది ఒక గణితశాస్త్రజ్ఞుడు తాను నిర్మించిన సూత్రాలలో ఉన్న సౌందర్యం చూసి వాటిలోని సత్యాన్ని కూడా శంకించాడుట ఇటువంటి భావసౌందర్యం మన అందరికీ వెంటనే కనిపించదేమని అడగవచ్చు ఆ ప్రశ్నకు సమాధానం తెలుసుకుంటూనే సౌందర్యం యొక్క తత్వం తెలుసుకోవచ్చు

ఎండ్రకాయల్లో సౌందర్యం ఏమిటో అవి తినేవాళ్ళకి గాని తెలీదు సాంఘికాభ్యుదయకాంక్ష లేనివారికి గురజాడ రాసిన "దేశమును ప్రేమించు" అనే గీతం లోని సౌందర్యం బోధపడదు శాస్త్రసిద్ధాంతాల సౌందర్యం పరిశోధకుడికి గాని తెలియదు ఎందులో సౌందర్యం గ్రహించాలన్నా అందులో ప్రయోజనం కూడా సమగ్రంగా గుర్తించగలిగి ఉండాలి 'మిల్ీ' చేసిన సిద్ధాంతాలలో మార్క్సిస్టులు సౌందర్యం చూడగలిగారు

అయితే సౌందర్యాన్ని గుర్తించేశక్తి కేవలమూ మనకు వ్యక్తిగతంగానే ఉండిపోవటం లేదు రకరకాల సౌందర్యం గురించి మనం సాంప్రదాయసిద్ధమైన అభిప్రాయాలామోదిస్తూ వస్తున్నాం ఆడదానికి విశాలమైన కళ్ళూ, నిగనిగలాడే దీర్ఘకేశాలూ, ఎత్తయిన రొమ్మూ, పిరుదులూ, సన్నని నడుమూ ఉండటం అందం ఇది ఆచారం - సత్యం కూడాను

అయితే వ్యక్తిగతమైన అభిప్రాయాలు ఆచారాన్ని పాటించవు మన ఆప్తస్నేహితుడి మొహం ఎంత అనాకారిగా ఉన్నా మనకందులో అందం కనిపిస్తుంది తల్లిమొహంలో సంప్రదాయసిద్ధమైన సౌందర్యం ఉందా లేదా అని ఎవడూ చూడడు కాని సాంఘిక ప్రయోజనాలను నిర్ణయించటానికి సంప్రదాయసిద్ధమైన అభిప్రాయాలే ఉపకరిస్తాయి

దురదృష్టవశాత్తూ వర్గవిభజన సౌందర్యారాధనలో కూడా వర్గభేదం తెచ్చిపెట్టింది వర్గప్రయోజనాలను పురస్కరించుకుని సౌందర్యాన్ని గురించి భిన్నాభిప్రాయాలేర్పడ్డాయి శ్రామికవర్గం వాడు బాగా పనిచెయ్యగల బలిష్టురాలైన యువతిలో సౌందర్యం చూస్తే ధనికవర్గం వాడు సన్నగా, నాజూకుగా, ముట్టుకుంటే కందిపోయేటట్టుండే ఉత్సవవిగ్రహంలో సౌందర్యం చూస్తాడు వర్గదోపిడీ విధానం 'అబల'లో సౌందర్యం చూస్తుంది

ఈ ఉన్నతవర్గాలలో ఏ వర్గం సౌందర్యాన్ని ఎక్కువ సజీవంగా ఉంచుతున్నదంటే సౌందర్యాన్ని భౌతికవాదానికెడంగా ఉంచని వర్గమే అనాలి ఇతర వర్గాలవారు సౌందర్యాన్ని నిష్ప్రయోజనం చేశారు, తమ సంస్కారాన్ని ప్రచారం చెయ్యటానికి పబ్లిసిటీ స్టంటుగా వినియోగించారు, ఆఖరుకు సౌందర్యాన్ని అవాఙ్మానసగోచరమూ, అయోమయమూ కూడా చేసేశారు ఇక మిగిల్చిందేమిటి?

కళలను సౌందర్యసాధనాలుగా ఉంచదలిచిన అభ్యుదయపరులు సౌందర్యాన్ని సజీవంగా ఉంచే పద్ధతిలోనే కళలు సృష్టించాలి ఇటువంటి కళలు ఎంత విజ్ఞానయుతంగా ఉన్నాసరే ప్రజాసామాన్యానికి ఉపకరించే అభ్యుదయకళలుగా విరాజిల్లుతాయి

ఆనందవాణి, వారపత్రిక, 15-6-1947

## 7. ఆనందం

ఆనందోపలబ్ధి కోసమే కళాసృష్టి అనే సిద్ధాంతాన్ని కూడా కొందరు అభ్యుదయ నిరోధకులు ప్రజలను మభ్యపెట్టటానికి వినియోగపరుస్తున్నారు ఆనందమనేదాన్ని గురించి స్పష్టమైన అభిప్రాయాలు లేక ప్రజలు మభ్యపడుతున్నారు వాళ్ళ తప్పులేదు ఒకవంక వేదాంతులు ఆనందమంటే అలౌకికమైనదిగా నిర్వచిస్తున్నారు మరోవంక నిత్యజీవితంలో ప్రతి అల్పసుఖమూ ఆనందంగా వర్ణించబడుతున్నది

అసలు ఆనందమనేది ఏమిటి?

పశుప్రకృతికి కష్టసుఖాలూ, సుఖ దుఃఖాలూ మాత్రమే ఉన్నాయి ఇతర జంతువులకు ఆనందం లేదు ఆనందం సాంఘిక వ్యాపారం ద్వారా తప్ప లభ్యం కాదని రుజువుచెయ్యవచ్చు జీవితానికి ప్రతిబంధకాలుగా ఉండే కారణాలను నిర్మూలించి జీవితావసరాలు లభ్యం

చేసుకోవటానికి జయప్రదమైన ఏర్పాట్లు చేసుకోవటం ద్వారా మనుషులకానందం లభిస్తున్నది ఇళ్ళు కట్టుకోవటంలోనూ, పొలాలు సాగుచేసుకోవటంలోనూ, పంటకాలవలు తవ్వుకోవటం లోనూ, కొత్త పరిశ్రమలు స్థాపించుకోవటంలోనూ, స్వపరిపాలన సాధించుకొనటం లోనూ, దాస్యం నుంచి విముక్తిచెందటంలోనూ, శత్రువులను జయించటంలోనూ, అభివృద్ధికరమైన రాజ్యాంగం నిర్మించుకోవటంలోనూ ఆనందం ఉంది

ఆనందం కష్టమూ కాదు, సుఖమూ కాదు దాని కోసం కష్టాలు పడటంలో కూడా ఆనందం ఉంది ప్రకృతిని ఎంతవరకు జయించి, జీవితమార్గాలనెంతవరకు హస్తగతం చేసుకుంటామో అంతవరకూ మనకానందం ఉంది విధి చేతి కీలుబొమ్మలకానందం లేదు

భావప్రపంచంలో కళలు ఈ ఆనందాన్నే ఇవ్వగలవు– ఇవ్వాలి మానవుడి సాంఘికాశయాలకున్న అంతరాయాలను చిత్రించి వాటిని జయించేమార్గాలు సూచించి కళలు ఆనందమిస్తాయి ఒక ఆదర్శంకోసమో, ఒక సాంఘికన్యాయంకోసమో, ఒక హక్కుకోసమో కష్టాలుపడ్డవారి జీవితాలు మనకానందమిస్తాయి వాటికోసం పోరాడి జయించినవారి జీవితాలు కూడా మనకానందమిస్తాయి

కావ్యాలు రసాత్మకాలన్నారు పెద్దలు రసమంటే కేవలమూ భావం కాదు భావాలను సులభంగా రేపెట్టవచ్చు పచ్చిశృంగారమూ, పచ్చి ఒకరుణా, పచ్చి బీభత్సమూ చిత్రించవచ్చు సాంఘికజీవి ఈ భావాలద్వారా ఆనందం సంపాదించగలిగితేనే ఆ భావాలు రసాలవుతాయి పరిత యొక్క జీవితనిర్మాణానికి పనికివచ్చే బీజాలు ఆ భావాలలో ఉంటేనే ఆనందం కలుగుతుంది

ఆనందం చైతన్యాన్ని చంపుతుందనే అభిప్రాయం కేవలమూ పొరపాటు సాంఘికచైతన్యం ఆనందంతో తప్ప సరిగా కలగదు స్వాతంత్ర్యవీరులు ఆనందంతో సమరానికి పోవటంలోనూ, మామూలు సైనికులు పై అధికారి ఆజ్ఞలను శిరసావహించి పోవటంలోనూ, ఎంతో తేడా ఉంది దొంగలు జైళ్ళకు పోవటంలోనూ, దేశభక్తులు జైళ్ళకు పోవటంలోనూ ఉండే తేడా ఆనందంతో సంబంధించినదే నాలుగు డబ్బులకోసం కళాసృష్టి చెయ్యటంలోనూ, అభ్యుదయం కోసం కళాశక్తిని వినియోగపరచటంలోనూ ఎంతైనా తేడా ఉంది

అయితే ఆనందం అన్నివర్గాలకూ ఒకటి కాదు ధనికవర్గాలకు డబ్బు ఆనందసాధనం ఒక చదరపు గజం పొలం దున్ననవసరం లేకుండా, ఒక చిన్న మేకు కూడా సృష్టించనవసరంలేకుండా, డబ్బుసహాయంతో వారు తమ అవసరాలన్నిటినీ హస్తగతం చేసుకుంటారు డబ్బు సంపాదించటంలో వారికానందం ఉండటంలో ఆశ్చర్యం లేదు మామూలు మనిషికే ఉద్యోగం సంపాదించటంలో ఆనందం ఉంటుంది

సంఘంలో ఉండే వివిధ వర్గాలమధ్య ఘర్షణ ఉన్నప్పుడు ఒకరికానందప్రదమైనది మరొకరికి ఆనందప్రదం కాదు ఒక పరిశ్రమలో పోటీచేస్తున్న పెట్టుబడిదార్లంతా ఒక కూడలి అయి పోటీపద్ధతి మానేసి, ఉత్పత్తి నిగ్రహించి, ధరలు పెంచటానికి తీర్మానించు కున్నప్పుడు వారికానందం కలుగుతుంది కాని మిగతావర్గాలవారికి కలిగేది ఆవేదనే

ధనికవర్గం పొందే ఆనందం దాదాపు యావత్తూ డబ్బుద్వారా లభ్యమయేదిగా ఉంటుంది పీడితవర్గం తాలూకు ఆనందం విప్లవం ద్వారా లభ్యమయేదిగా ఉంటుంది పోతే మధ్యతరగతి విషమస్థితిలో ఉంటుంది దాని అవసరాలు కిందివర్గంతో సంబంధం కలవిగానూ, అలవాట్లు పైవర్గంతో గలవిగానూ ఉంటాయి

ఈ వర్గాలలో ఏ వర్గం యొక్క ఆనందంకోసం కళాసృష్టి కావాలనే ప్రశ్న కలగకతప్పదు అభ్యుదయపరులు అతివిశాలమైన పీడితవర్గం కోసమే కళాసృష్టి జరగాలని నమ్ముతున్నారు వీరి అభిప్రాయం సరిఅయినదని సులభంగా రుజువు చేయవచ్చు అంతేగాక ఇంకోవిధంగా సృష్టించబడ్డ కళ ఆనందం ఇవ్వలేదని కూడా రుజువు చేయవచ్చు

ధనికవర్గం శాస్త్రీయమైన సాంఘిక పరిణామాన్ని ఆమోదించదు అందుచేత ఆ వర్గం దృష్టిలో అభ్యుదయం లేదు సంఘంలో ఇక మార్పులు రాకుండా ఉండటమే వారి ఆశయం మార్పులేనిచోట పరిణామమూ, అభ్యుదయమూ అంటూ ఉండదు అందుచేత ఈ వర్గానికి కళలు సుఖప్రదంగా ఉండాలిగాని ఆనందప్రదాలుగా ఉండరాదు ఈ వర్గాన్ని నిర్వచించమంటే "కళ కళ కోసమే"ననీ, "కళ నిష్ప్రయోజనమైనద"నీ చెబుతుంది

మరో విషయమేమిటంటే సాంఘికంగా ఇది అంతరించిపోతున్న వర్గం మానవ సమాజంలో ఒకప్పుడిది ఈ స్వరూపంలో లేదు మరికొంత కాలానికది ప్రపంచంలో ఎక్కడా ఉండదు ఆరోవంతు భూభాగమైన రష్యాలో ఇది లేదు

మధ్యతరగతి అధికంగా ఈ వర్గం మీదనే ఆధారపడి ఉండి దీనికన్న కూడా వేగంగా మారుతూ వస్తున్నది క్రమంగా దీని బలం మన కళ్ళ ఎదటే క్షీణించి, ఇందులోనుంచి అధికసంఖ్యాకులు శ్రామికవర్గంగా మారిపోతున్నారు

పోతే సాంఘికపరిణామమూ, అభ్యుదయమూ తప్పనిసరిగా శ్రామికవర్గంతో సన్నిహితసంబంధం కలిగి ఉన్నాయి ఈ వర్గంలోంచే రాజకీయచైతన్యం వస్తున్నదని అన్ని రకాల రాజకీయ దృక్పథాలవారూ ఆమోదించి ఉన్నారు రాజకీయ చైతన్యం సాంఘికచైతన్యం తాలూకు మొన

ఈ వర్గానికి ఆనందసాధనం సాంఘికచైతన్యం తప్ప మరొకటి లేదు ఆ చైతన్యాన్ని బలపరిచే కళలు ఆనందమిస్తాయి అటువంటి కళలే అభ్యుదయానికీ సాంఘిక పరిణామానికీ తోడ్పడతాయి

ఈ సత్యాన్ని గుర్తించని కళలు చుక్కానిలేని పడవలల్లే రకరకాల గమ్యస్థానాలకు చేరుకుంటాయి ఆనందోపలబ్ధికే కళ సృష్టి అంటూ ఈ కళలను బలపరిచేవారు కూడా చివరకు, ఆనందమంటే ఏమిటంటే అనిర్వాచ్యమనీ, అగమ్యగోచరమనీ చెప్పవలసిన గతి పడుతుంది

ఆనందవాణి, వారపత్రిక, 22-6-1947

# 8. స్వరాజ్యం వస్తే...

కూటికోసం కోటివిద్యలన్నారు అయితే ఈ కోటిలోనూ తొంభైలక్షలు విద్యలు కానేకావు, రోగాలు బిచ్చగాళ్ళు తమ పిల్లలకు అంగవైకల్యం కల్పించటమూ, కళ్ళు పొడిచెయ్యటమూ మొదలైనవి చేసి వారికి బతుకుతెరువు ఏర్పాటుచేస్తారు కొందరికి పూర్వజన్మసుకృతం వల్ల వాటంతట అవే కొన్ని భయంకరమైన వ్యాధులు సంభవిస్తాయి బిచ్చగాడికి గండమాలా, కుష్టూ, , బుడ్డా, కాలువాపూ మొదలైనవి సంభవించినాయా, వాడి జన్మ తరించిందే వాడికవే బతుకుతెరువు పచ్చబట్టలు కట్టుకుని, చేతిలో వెంకటేశ్వరస్వామి పళ్ళెం పట్టుకొచ్చేవాళ్ళకి చిల్లరడబ్బులెంత ఖాయంగా పడతాయో, ఈ రోగాలు గలవాళ్ళకి అంత ఖాయంగానూ పడతాయి

ఇటువంటి బిచ్చగాళ్ళకు డబ్బిచ్చేవాళ్ళలో చాలారకాల మనస్తత్వాలుంటాయి కొందరు పుణ్యం కోసం డబ్బిస్తారు వాళ్ళకి డబ్బిస్తే ఏడుతరాల వరకూ తమకారోగాలు రావని వారి విశ్వాసం మరికొందరు తమకటువంటి రోగాలు లేవు కదా అనే అతిశయంతో డబ్బిస్తారు (ఇది గొప్ప వాడు చిన్నవాణ్ణి వీపు తట్టే మనస్తత్వం ) ఇంకా కొందరు ఈ బిచ్చగాళ్ళ భయంకరస్థితికి తామే కారకులమనే “గిల్టు కాంప్లెక్సు”తో ధర్మం చేస్తారు

మన భారతదేశ పరిస్థితి చాలాకాలంగా ఇట్లా ఉంటూ వస్తున్నది మన దాస్యమూ, దారిద్ర్యమూ మనకు గొప్ప అండగా ఉంటూ వచ్చాయి “గోచిపాతకన్న దరిద్రమేమిటి? ఖరీదైన బాంబులు మనమీద ఎవరు వేస్తారు?” అన్నవాళ్ళ జోస్యం ఫలించినట్టే కనపడింది (ఇది మిడతంభొట్లు జోస్యమే అనుకోండి ) పై దేశాలవాళ్ళు “అయ్యో పాపం భారతదేశం!” అనటానికి వీలుగా ఉండింది మననీ స్థితికి తెచ్చిన బ్రిటిషువారిలోనే కొందరికైనా “గిల్టుకాంప్లెక్సు” పట్టుకొని “మనం భారతదేశానికి ఇదివరలో చాలా అన్యాయం చేశాం ఇకనైనా త్వరలో స్వాతంత్ర్యం ఇవ్వాలి” అనటం జరిగింది

రేపు మనకు స్వరాజ్యం రాబోతున్నది అంటే మన కూటి విద్య కాస్తా కూలిపోతున్నదన్నమాట ఇక మనని గురించి అంతర్జాతీయవేదికలమీద ఎవరు చెబుతారు? మనని చూసి ఎవరు జాలిపడతారు? మనమీద బాంబులు వెయ్యటం పెట్రోలు దండగ అని ఎవరనుకుంటారు?

ఈ భయంతోటే మనవాళ్ళు జాగర్తపడుతున్నారు మనకీ దాస్యమూ, బిచ్చగాడి మనస్తత్వమూ పోగూడదు, అందుకుగాను మన లీగువారు, సంస్థానాధీశ్వరులూ సిద్ధంగా ఉన్నారు నాలుగుకాలాలపాటు బ్రిటిషువారి ‘ముష్టి’ మీద ఆధారపడటానికి వారు ప్రయత్నాలు చేసుకుంటున్నారు బ్రిటిషువారియ్యబోయే స్వాతంత్ర్యం ఒక ఎంగిలాకు కింద భావించి అందులో వాటాలకోసం పరస్పరం యుద్ధం చెయ్యటానికి తయారుగా ఉన్నారు

మన కాంగ్రెసునాయకులు ఇంకోవిధంగా కీర్తి నిలబెడుతున్నారు ప్రజాప్రభుత్వానికీ గవర్నరు సలహాదార్ల ప్రభుత్వానికీ మధ్య మాసికరాకుండా పరిపాలిస్తున్నారు ఇంకా గవర్నర్ల ప్రభుత్వంలోనే పౌరహక్కులు బాగా ఉన్నాయనిపించటానికి కూడా ప్రయత్నిస్తున్నారు (స్వతంత్రులైన గవర్నర్ల పరిపాలనకూ, బానిస ప్రతినిధుల పరిపాలనకూ ఆ మాత్రం తేడా ఉండాలి చూడండి )

కాంగ్రెసు ప్రభుత్వంలో ప్రజారక్షణచట్టం ఒకటి వచ్చి అందరిపౌరహక్కులూ కాజేసింది పోలీసుల ఖర్చు జాస్తి చేయబడింది శాంతిభద్రతలకు తుపాకులూ, మరఫిరంగులూ మరింత స్వేచ్ఛగా ఉపయోగించబడుతున్నాయి జమీందార్ల దౌష్ట్యానికి పోలీసుమద్దత్తు ఇవ్వబడుతున్నది దొంగమార్కెటు దొరమార్కెటయింది, చీకటి వ్యాపారులు వెలుగులోకి వచ్చారు పిల్లి గుడ్డిదైతే ఎలుకలేమో చేశాయిట! ఆ మధ్య కొబ్బరినూనె కంట్రోలు పోగా, ప్రజలకు కొబ్బరినూనె అందకుండా పోయింది అప్పుడు కంట్రోలు మళ్ళీ తిరిగివచ్చింది అందువల్ల ఎవరికేం నష్టం జరిగిందో తెలీదు మళ్ళీ కంట్రోలు వెళ్ళిపోతున్నది గుడ్డల రేషనింగు ఎత్తివేస్తారనీ, ఆ మీదట మనం చెట్టుబెరళ్ళూ అరిటాకులూ ధరించవచ్చుననీ పుకారుగా ఉంది కాలేజీ విద్యార్థుల జీతాలు రూపాయికి పావలా చొప్పున పెంచారు

పౌరహక్కుల మాట ఎట్లా ఉన్నా మనకు బానిసహక్కులు కొన్ని సంక్రమించాయి అవేవంటే, సమ్మెలు చేసే అధికారంకోసమూ, మీటింగులు పెట్టే అధికారం కోసమూ, తుపాకుల వాతపడే హక్కు, బలవంతుడు బలహీనుణ్ణీ, అధికారి అనధికార్లనీ, భాగ్యవంతుడు బీదల్నీ దోచుకునే హక్కు, ప్రజల హక్కులను తగ్గిస్తూ శాంతిభద్రతలను నెలకొల్పే హక్కు! ఈ హక్కులు స్వాతంత్ర్యం ఎరిగిన దేశాల్లో కనిపించవు ఫాసిస్టుదేశాల్లోనూ, బానిసదేశాల్లోనూ చలామణీలో ఉంటాయి

మనదేశానికి స్వాతంత్ర్యభయం ఏ మాత్రమూ లేదు

ఆనందవాణి, 29-6-1947

## 9. అజ్ఞానం

వెలుగు లేకపోతే చీకటి డబ్బు లేకపోతే దరిద్రం జ్ఞానం లేకపోతే అజ్ఞానం

చీకటి చూస్తాం దరిద్రం కూడా చూస్తాం అజ్ఞానం ఎవరికీ కనిపించదు ఎందుచేత నంటే అజ్ఞానమనేది ప్రత్యక్షంగా కనిపించటానికి వీలులేనిది

మాటవరసకి, గాఢాంధకారంలో ఒక అద్దం ఉందనుకుందాం అది చీకటిని ప్రతిఫలింపజేసే ప్రయత్నంలో అద్దమే అదృశ్యమైపోతుంది అజ్ఞానాన్ని ప్రతిఫలింపజేసే ప్రయత్నంలో బుద్ధికూడా అదృశ్యమైపోతుంది

అయితే మరి మనం చీకటిని ఎట్లా గ్రహించగలుగుతున్నాం? కళ్ళు కాక ఇతర జ్ఞానేంద్రియాలూ,బుద్ధీ మనకున్నాయి గనక చీకటిని గురించి మనం తెలుసుకోగలుగుతున్నాం గదిలో దీపం ఆర్పేసి గది మాయమయిందనుకోం చీకటిగా ఉన్న గదిలో కదలటానికి ప్రయత్నించగానే మన మోకాళ్ళకు తెలుస్తుంది, గది మాయం కాలేదని అదే అమావాస్యనాటి చంద్రుడయితే, మాయమే అవుతాడు అమావాస్య చంద్రుడు పట్టపగలే ఉదయించి సూర్యుడితోబాటు అస్తమించుతాడని మనం బుద్ధిచేత గ్రహించవలిసిందే

కాని అద్దానికి లేని శక్తి బుద్ధికి ఒకటి ఉంది అదేమిటంటే తన్నుతాను ప్రతిఫలించుకునే శక్తి ఈ శక్తిచేత మనం ఇతరుల జ్ఞానం యొక్క పరిమితిని గ్రహించటానికి ప్రయత్నించవచ్చు కాని మన ఊహ రుజువుచెయ్యటానికి ప్రయత్నించటంలో అవతలి మనిషి జ్ఞానపరిమితి మారిపోతుంది అందుచేత తనను తాను ప్రతిఫలించుకునే శక్తి బుద్ధికి ఉన్నప్పటికీ, తన

జ్ఞాన పరిమితి గాని మరొకరి జ్ఞానపరిమితి గాని కొలవటానికి ప్రయత్నించటంలో అజ్ఞానపరిమితిని బుద్ధి మార్పు చేసేస్తుంది లేదా, ఆ ప్రయత్నంలో పూర్తిగా విఫలమవుతుంది

కేవల అజ్ఞానం మనని జీవితంలో ఎన్నడూ జాస్తిగా బాధించదు మనని బాధించి సమస్యలు తెచ్చిపెట్టేది కుజ్ఞానం సామాన్యంగా కుజ్ఞానాన్నే మనం అజ్ఞానమంటాం కుజ్ఞానం యొక్క స్వరూపం సులభంగా మార్పు చెందదు తన్ను తాను ప్రతిఫలించుకునే బుద్ధి శక్తిని కుజ్ఞానం కొంతవరకు పాడుచేస్తుంది ఈ విషయంలో కుజ్ఞానం అద్దంమీద చేరిన మురికిలాగా పనిచేస్తుంది

సాంఘిక, రాజకీయ, కళాసమస్యలకు చెందిన కుజ్ఞానం జాతిని కుంగదీస్తుంది అటువంటి కుజ్ఞానాన్ని ప్రచారం చేయటం కొందరికి లాభసాటిగా ఉంటుంది వీరు కుజ్ఞానాన్ని ప్రచారం చెయ్యటమే గాక అది మనుష్యుల బుర్రలకు పట్టుకునేటందుకు అవసరమైన జిగురు కూడా తామే సప్లయి చేస్తారు

కుజ్ఞానాన్ని మనుషుల బుర్రల్లో బాగా నాటటానికి ఉద్రేకాలు ఉపకరిస్తాయి హిట్లరు జర్మను జాతిని అధోగతికి లాగటానికి బహిరంగంగా ఏడిచాడు, రంకెలు పెట్టాడు, ఘాటయిన పదజాలం ప్రయోగించాడు బుద్ధికి వితర్కించే అవకాశం ఇస్తే ప్రజలలో కుజ్ఞానం నాటుకోదు అందుచేత కుజ్ఞానం ప్రచారంచేసే వాళ్ళు కొన్ని బలమైన విశ్వాసాలను మాత్రమే ప్రజలమీద వదులుతారు వాటిని గురించి వితర్కించటానికీ, చర్చించటానికీ వీళ్ళు కల్పించరు కుజ్ఞానాన్ని ప్రచారం చేసే పద్ధతులన్నీ హిట్లరు తన భగవద్గీతలో రాసిపెట్టాడు

సంఘంలో కుజ్ఞానం ఎంత వ్యాపించిఉందో తెలుసుకోవటానికి కొన్ని పద్ధతులున్నాయి సంఘానికిగాని, రాజకీయాలకు గాని, కళలకు గాని సంబంధించిన విశ్వాసాలను ప్రకటించేవాళ్ళను వాదనలోకి దింపినట్టయితే వాళ్ళు చివరల్లా వాదించరు వాళ్ళు చెప్పినా మనకర్థం కాదనో, వారి విశ్వాసాలను ప్రతిఘటించటం వల్ల వారి వ్యక్తుల కవమానం చేస్తున్నామనో, ఎవరి అభిప్రాయాలు వాళ్ళకెక్కువనో తేల్చేసి ఊరుకుంటారు నిజం తెలుసుకోవటానికి వ్యక్తిస్వాతంత్ర్యమో, అధికసంఖ్యాకుల బుద్ధిహీనతో అంతరాయంగా ఉన్న సమాజంలోనూ, సత్యాన్ని లారీలతోటీ, ఆర్డినెన్సులతోటీ, పోలీసు తుపాకులతోటీ ప్రచారం చెయ్యవలసిన అవసరంగల సమాజంలోనూ కుజ్ఞానం వ్యాపిస్తున్నదని మనం సులభంగా గ్రహించవచ్చు

ఆనందవాణి వారపత్రిక 6-7-1947

## 10. నాకు బాగా నచ్చిన వృత్తి ఒక్కటే కనిపిస్తూంది...

స్వరాజ్యం వచ్చేస్తున్నది మన మొహం మనం తెస్తామా ఏమిటి? ధర్మాత్ములు ఆ క్రిప్సూ, ఆ ఆట్లీ, ఆ మౌంట్‌బాటన్ మొదలైనవాళ్ళున్నారు గనక, మనం వద్దురా బాబూ, అంటున్నా వినకుండా మనకు స్వరాజ్యం ఇచ్చే తీరాలంటున్నారు, మనం పుచ్చుకునే తీరాలి విధి లేదు, గత్యంతరం అసలే లేదు

అంచేత స్వరాజ్యం వచ్చేస్తున్నది వచ్చిందే అనుకోండి ఒక్క సంవత్సరం కళ్ళుమూసి తెరిచేలోపుగా చక్కావచ్చేసి ఎదురుగా నిలబడి ఉంటుందన్నమాట ఘట్టిగా ఓ సభ ఏర్పాటుచేసి, ఆహ్వానసంఘం కుదిర్చి, ఆహ్వానసంఘాధ్యక్షుణ్ణీ తదితరుల్నీ ఎన్నుకుని ఈ రాబోతున్న స్వరాజ్యాన్ని సన్మానింటేటందుక్కూడా వ్యవధి లేదన్నమాట ఎంచేతనంటే దొంగవ్యాపారస్తులంతా తలా ఓ కాపు కాసినా మామూలు మహాసభల్లాంటివి కూడా తృప్తికరంగా ఏర్పాటవకుండా ఉన్నాయి నెలరోజులు టైమున్నా తొక్కిసలాటవుతున్నది స్వరాజ్యానికి ఆహ్వానం ఇవ్వటమంటే మాటలా?

అయితే నన్ను వేధిస్తున్న సమస్య స్వరాజ్యానికి సన్మానసభలు ఏర్పాటుచేయించటం కాదు–నా స్వార్థం, నా ముక్తి, నా ఆర్థికసమస్య, నా ఉద్యోగసమస్య ఎట్లా పరిష్కరించుకోవటమా అని ఇప్పటినుంచీ ఒక ప్రణాళికా, ఒక కార్యక్రమం మీదుగా నడిస్తేనే గాని స్వరాజ్యం వచ్చేసరికి దాని పూర్తి ఫలితం దక్కించుకునే స్థితిలో ఉండనేమోనని నా బెంగ

ఇంతవరకూ అంటే దేశం పరాధీనంగా ఉండి నా వంటి బుద్ధిమంతులెక్కిరావటానికి వీల్లేకపోయింది ఇకముందు వైస్రాయి దగ్గిర్నుంచీ ప్రభుత్వశాఖల్లో డవాలీ బంట్రోతు దాకా అంతా మనవాళ్ళే గనక ఇంత ఇబ్బంది ఉండదు

మీరు గమనించారో లేదో, పెద్దైత్తే వేస్తున్నాను వైస్రాయిగా ఎవరుంటారో చెప్పలేను గాని నాకు తెలిసిన పెద్ద పేర్లు కొన్ని తీసుకుని వాళ్ళకి నేనెంత దగ్గిరిగా ఉన్నానా అని ఆలోచిస్తున్నాను జవహర్లాలు నెహ్రూను బాగా ఎరిగిన ఒక మనిషిని నేను బాగా ఎరుగుదును గాంధీని బాగా ఎరిగిన వారిని బాగా ఎరిగినవారొకరు నాకు బాగా తెలుసు, వల్లభభాయిపటేలుతో లంకె అందటం లేదు నాకూ పటేలుకూ మధ్య మహా ఉంటే ముగ్గురుంటారు అంతకంటే ఉండరు ఈ కారణం చేత స్వతంత్రభారతంలో నేను బొత్తిగా అసహాయుణ్ణి అయిపోతానని తోచదు

అయినా కీడెంచి మేలెంచమన్నాడు ఈ తోవ మూసే ఉందే అనుకుందాం స్వరాజ్యం వచ్చినాక కాంగ్రెసు పలుకుబడి ఎట్లా ఉండబొయ్యేదీ ఎవరు చూశారు కాంగ్రెసులో ఉన్న దేశభక్తుల్లో కొందరు కైలాసానికి వెళ్ళి తపస్సు చేసుకోవచ్చు, మిగతావాళ్ళు బాంకులు తెరవొచ్చు ఏ టాటా, బిర్లా, డాల్మియా, సింఘానియా ఏజెంట్లో పదవులాక్రమించుకోవచ్చు వీళ్ళకీ మనకీ మధ్య సహారా ఎడారి తప్ప చక్కని హైరోడ్డనేది కనిపించటం లేదు

ఈ వ్యాపారస్థులు దేశానికి నాయకులే కావటం తటస్థించితే మనం కూడా వ్యాపారంలో ఉద్యోగం చూసుకోవటం బుద్ధికి లక్షణం మనకు సొంతాన వ్యాపారం పెట్టి సాగించే తాహతు లేదు విడోస్ అండ్ ఆర్ఫన్స్ లిమిటెడ్ పెట్టి సాగించినా ఈ ఐరావతాలు మనని మట్టం

చేసేస్తాయి గాని మరొకటి కాదు  అమ్మటం కొనటం ఉద్యోగం మనకు తెలిసిచావదు అమ్మబోతే అడివీ, కొనబోతే కొరివీ అనే సామెత మనబోటివాళ్ళను గురించే చెబుతారు పరిశ్రమల్లో చేరి పనిచెయ్యటానికి పరిజ్ఞానం లేదు  మనం చదివిన డికెన్సు, షా, వెల్సు, టాల్‌స్టాయి మొదలైన వాళ్ళ పుస్తకాల్లో ఉండే జ్ఞానంతో పిండిమర కూడా ఆడదు  అందుచేత మనకున్నదల్లా ఈ లైనులో ఒకే ఒక  ఉద్యోగం   సమ్మెలు భగ్నం చేసే పని

ఇది నెమ్మదిగా ఉండే ఉద్యోగం కాదు, మనకు తెలుసు  కూలివాళ్ళు చెడ్డగడుసుమీరి పోతున్నారు  వస్తువులకు ధర యావత్తూ కూలివల్లే ఏర్పడుతున్నదని వాళ్ళు తెలుసుకుంటున్నారు కాని కూలి దోపిడీ చెయ్యడంలో, దీని తస్సగొయ్యా, మంచి డబ్బుంది  పారిశ్రామిక పెట్టుబడిదార్లను చూడండి  సమ్మెలు భగ్నం చేసేవాళ్ళకందులో ఓ తృణం వచ్చినా హాయిగా వెళ్ళిపోతుంది  ప్రాణాపాయమంటారూ, జాతస్యహీ ధృవం మృత్యుః, స్వతంత్రభారతంలో కూడా దేశభక్తుడైనవాడు దెబ్బకు వెరిస్తే ఎట్లా?

ఇక్కడ కూడా మనం కీడెంచి మేలెంచటం మంచిది  సమ్మెలు భగ్నం చెయ్యటానికి శిఫార్సులు కావాలని కాదు, కాని ఇక్కడ కూడా కాంపిటీషను జాస్తి  సోషలిస్టుపార్టీ లోనుంచీ కమ్యూనిస్టు పార్టీలోనుంచీ జారిపోయినవాళ్ళంతా చక్కగా డబ్బు చేసుకుంటున్నారు  పరాధీనతలో ఉండగానే, మన పరిశ్రమలు గట్టిగా తల ఎత్తకమునుపే, ఈ వృత్తికి మార్చుపుస్తకాలు చదివినవాళ్ళు సహితం ఎగబడుతుంటే రేపు స్వతంత్రభారతంలో పారిశ్రామిక పాలన సాగితే సమ్మెలు భగ్నం చేసే ఉద్యోగాలకూ, ప్రజల్ని మభ్యపెట్టే ఉద్యోగాలకీ ఎంత పోటీ ఉండొచ్చు  పంచాయతీబోర్డుల దగ్గర్నుంచీ ప్రభుత్వపరిపాలనా సంస్థల వరకూ రాజకీయాలలో అద్భుతమైన అనుభవం గడించి, బ్రహ్మని తిమ్మి, తిమ్మిని బ్రహ్మి చెయ్యటంలో సిద్ధహస్తులై కూడా జాగాలు దొరక్క ఈ ఉద్యోగాలకెగబాకే వారెంతమంది ఉండొచ్చు  కనక ఇక్కడ కూడా  మనకు నిశ్చింతగా ఉద్యోగం దొరుకుతుందనే నమ్మకం లేదు

పోనీ కూలిపనే చేసుకుందామంటే, అందులో మాత్రం ఏం సుఖం ఏడిచిందీ?  వెట్టిచాకిరీ, తిండికి చాలని కూలీను  సమ్మె చేస్తే తప్ప కూలి ఓ అణా కూడా పెరగదు  సమ్మెచేస్తే పోలీసుల్ని పిలిపించి కాల్పిస్తారు  కూలీలు సమ్మె చేశారనగానే భరించరాని ఆగ్రహం వచ్చి పరవళ్ళు తొక్కేవారికి, కూలీలను కాల్చిచంపారంటే చీమకుట్టినట్టన్నా ఉండదు  అదంతా కాక కూలిపని చేసుకోవటానికి ఇప్పట్నుంచీ ప్లానులు దేనికి, పాడు!  ముష్టెత్తుకోవటానికి ప్రణాళికలెందుకూ?  కూలికోసం ఎత్తేది ముష్టేగా?

ముష్టి అంటే జ్ఞాపకం వచ్చింది  ముష్టి కూడా వృత్తే  కొన్ని కొన్నిరకాల ముష్టీ చాలా ఉపాయంగానే ఉంటుంది  ముష్టెత్తటానికి మానాభిమానాలు తప్ప అడ్డొచ్చేదేమీ లేదు  కాని స్వతంత్రభారతంలో బహుశా ముష్టివాళ్ళకి ముప్పొంటుంది  అందరూ ముష్టెత్తుకుంటే పరిశ్రమలు ఎట్లా నడుస్తాయి? ఆఫ్రికాలో లాగా ఏదోవంక మీద అనుమానంగా కనిపించినవాణ్ణల్లా జైల్లోతోసి వాడిచేత జీతంలేకుండా పరిశ్రమల్లో పనిచేయిస్తే తప్ప గిట్టుబాటుగా ఉండదు  అందుచేత బహుశా ముష్టివాళ్ళకి స్వతంత్రభారతంలో ముక్తి ఉండదు

అయితే ముష్టిలో వీరముష్టి చాలా రకాలుంది  గాయకులూ, చిత్రకారులూ, సాహితీపరులూ మొదలైన కళోపాసకులు అదోరకం ముష్టివాళ్ళు  పారిశ్రామికయుగంలో కళోపాసకుడంటూ

ఉండి వాడు కళవల్ల బతకటం ఉండదు జమీందారీవిధానంలో కళోపాసన సాధ్యమవుతుంది అంటే కళల్లో కృషిచేసేవాడు కళ మీద బతకనవసరం లేకుండా ఇతరత్రా ఆదాయం కలిగి ఉండి తన సంస్కారానికి అనుగుణంగా కళలని ఆరాధిస్తాడు నన్నయభట్టూ, తిక్కన సోమయాజీ, అల్లసాని పెద్దనా మొదలైనవాళ్ళు తమ రచనలను ఆనందంతో చేశారని మనకు ధైర్యం ఉంటుంది అదే పారిశ్రామికయుగం దగ్గిరికి వచ్చేసరికి కళాకారుడు తనకోసం కాక తనను పోషించేవారి కోసం కళలు సృష్టించాలి- కళ మీద బతకాలంటే, పారిశ్రామిక అభివృద్ధి సాగినకొద్దీ ఇతరత్రా బతుకుతెరువు చూసుకునే శక్తి కళారాధకుడికి నశిస్తుంది ఒక్క సోషలిస్టు వ్యవస్థలోనే కళారాధకుడు ప్రీతితో కళలు సృష్టించడమూ, దానిమీద ఆధారపడి జీవించటమూ- ఈ రెండూ సాధ్యమవుతాయి (ఇది కూడా రష్యాలో లేదనేవారున్నారు కాని వారు సహితం పారిశ్రామికయుగంలో కళాస్రష్టలు తమ తృప్తికోసం కళాసృష్టి చేస్తూ కళమీద జీవనోపాధి నిర్మించుకోవచ్చునని వాదించబోరు )

కాని, ఇన్ని అనుకున్నప్పటికీ, నాకు బాగా నచ్చినవృత్తి ఒక్కటే కనిపిస్తోంది స్వతంత్రభారతంలో దానికి తిరుగుండదు, దానికి సాటి ఉండదు మన పాతసంస్కారం చూసినా, మన ప్రస్తుత స్థితి చూచినా, మన భావి ఊహించినా ఇంతకంటే మంచి వృత్తి ఉండదు అదేమిటంటే, దేవుడైపోవటం

మనదేశంలో తిండికొరతా, బట్టకొరతా, ఆరోగ్యం కొరతా, ఆయుష్యం కొరతా, జ్ఞానం కొరతా, వివేకం కొరతా- ఎన్నో కొరతలున్నాయి కాని, ఇవేవీ దేవుళ్ళ కొరతతో సాటిరావు మనకు మూడుకోట్ల దేవతలున్నారు, త్రిమూర్తులున్నారు, వాళ్ళ చుట్టాలున్నారు, ఇంకా అంకమ్మా పోలేరమ్మా మొదలైన చిల్లరదేవతలు లక్షలాదిగా ఉన్నారు కాని ఈ దేవుళ్ళు చాలరు మన సాకారపూజ రాళ్ళూ రప్పలూ మొదలైనవాటితో తృప్తిపడక మనుషుల్ని వెతుక్కుంటున్నది రెండువేదాంతం ముక్కలు చెప్పినవాళ్ళంతా మనకు ప్రత్యక్షదైవాలు దేవుడి వృత్తి లాభసాటిగా ఉంది ఇప్పటి దేవుళ్ళు కాఫీలు తాగొచ్చు, సిగరెట్లు కాల్చొచ్చు, నల్లమందు వేసుకోవచ్చు, బాంకులో డబ్బు దాచుకోవచ్చు మామూలు మనుషులు చేసేపనులూ, చెయ్యటానికి వెరిచేపనులు కూడా చెయ్యొచ్చు ఇప్పటికే ప్రత్యక్ష దేవుళ్ళకి తాకిడీ చాలా హెచ్చుగా ఉంది ఇప్పటిసంఖ్య మూడింతలైనప్పటికీ ఉన్న డిమాండుకు సరిపోదు

దేవుడు వృత్తి జయప్రదంగా చెయ్యటానికి కొంత నేర్పు అవసరం కాని దీనికి బడి పెట్టి నేర్పటం ఇప్పుడు పొసగదు జర్నలిజం మోస్తరుగా ఇది బళ్ళో చదివేకంటే ప్రత్యక్షానుభవం వల్ల బాగా అబ్బుతుంది వెనక మా వూరొచ్చిన ఒకానొక దేవుడు తన్నులు తిని వెళ్ళాడు కనక దేవుడి వృత్తిలో కూడా కష్టనిష్టూరాలు తప్పవు కాని ఈ కష్టనిష్టూరాలు అన్ని వృత్తుల్లోనూ ఉండేవే గనక ఆ విషయం అంతగా అనుకోనవసరం లేదు, ఇతర ఉద్యోగాలకు పాతరికార్డు చూసినట్టు దేవుడి వృత్తిలో పాతరికార్డు చూడరు

స్వతంత్రభారతంలో ఈ దేవుడువృత్తికి చలామణీ హెచ్చుతుందా తగ్గుతుందా అని సమస్య ఇప్పటి లక్షణాలు చూస్తే, హెచ్చేటట్టు కనిపిస్తుంది ఎంచేతనంటే ఉన్న దేవుళ్ళను అధికంగా పేట్రనైజు చేస్తున్నవాళ్ళు ధనికవర్గం వారే ధనికవర్గం వారు దేవుళ్ళను ప్రోత్సహించటంలో

రెండురకాల అంతరార్థం ఉంది ధనికులు డబ్బుకోసమే బతుకుతున్నారనే భ్రమ నలుగురికీ కలగకుండా ఉండటం ఒకటీ, దేవుళ్ళనాశ్రయించే వాళ్ళకి కలిసొస్తుందనే భ్రమ బీదసాదలకు కలిగించటం మరోటీనూ దేవుళ్ళతో ధనికులకున్న ఈ అవసరం స్వతంత్రభారతంలో హెచ్చుతుంది గాని తగ్గదు

నామటుకు నేను దేవుడు వృత్తి తురుఫాసు కింద పెట్టుకున్నాను ఇంకేదీ పారని పక్షంలో నేను కూడా ఓ దేవుణ్ణయిపోయి హాయిగా కాలక్షేపం చేసుకుంటాను నన్నడిగితే అంతకంటె రొష్టులేని ఉద్యోగం ఉండదు దేవుడికేమీ అక్కర్లేదు గనక అన్నీ ఇస్తారు మామూలు మనుష్యుల స్వభావంలో ఉండే ఈ విచిత్రగుణం కనిపెట్టినవాడు దేవుడివృత్తి ఉంటూ ఉండగా మరోవృత్తిలో వృధాగా మగ్గిపోవటానికి ఒప్పుకుంటాడా?

ఆనందవాణి వారపత్రిక, 1947

## 11. దోపిడి చేద్దామా?

కావలిస్తే చెప్పండి రోజులు చాలా బాగున్నై, దోపిడి చెయ్యటానికి

పోలీసులా? ఇది పోలీసులు పట్టుకునే దోపిడికాదు పోలీసులూ, న్యాయచట్టాలూ, అన్నీ మనవే

ప్రపంచమా? ఒప్పుకోవటమా? బ్రహ్మరథం పట్టదూ? ప్రపంచం అనుమతితోనే ఈ దోపిడి పెద్దరకం దోపిడి ఎప్పుడూ ప్రపంచం అనుమతితోనే జరుగుతుంది కొద్దిమంది మనకు ప్రతికక్షులుంటారు వాళ్ళలో రెండురకాలుండటం వల్ల మనం ప్రపంచానికి సులభంగా మస్కా వెయ్యవచ్చు కొందరు మనని చూసి ఓర్చలేక మనమీద విరుద్ధప్రచారం చేస్తారు, మరి కొందరు సత్యమూ ధర్మమూ అనే పిచ్చివాళ్ళుంటారు అందుచేత మనని విమర్శించేవాళ్ళలో అభిప్రాయభేదాలుంటై, అదే వాళ్ళ దౌర్బల్యం మన ఏకీభావమే మన బలం

నిజం ఎప్పటికైనా బయలుపడకపోతుందా అనా? పడదు, నాకో స్నేహితుడున్నాడు వాడు నిజమైన విషయాలు వందపుస్తకాల్లో చదివినా నమ్మలేడు ఏ పెట్టుబడిదార్లో నియోగించిన ఒక త్రాష్టుడు ఒక్క అబద్ధపు కూతకూస్తే అది పట్టుకుని ఊరంతా తిరుగుతాడు ప్రపంచం నిండా నా స్నేహితుడంటివాళ్ళు జాస్తి వాళ్ళంతా మన స్నేహితులే!

ధర్మమూ, నీతీ మొదలైనవి కూడా నిజంలాటివే వాటిల్లో ఎవరికీ నిజంగా విశ్వాసం లేదు నిజమైన ఖ్యాతి యేసుక్రీస్తులదీ కాదు మహాత్మాగాంధీలదీ కాదు ప్రపంచాన్ని దోపిడి చేసేవాళ్ళదే అంటే ధర్మం గురించీ నీతినిగురించి చెప్పేవాళ్ళు కూడా ఉండాలి వాళ్ళున్నంతసేపూ మామూలు మానవమాత్రులు ఆ ధర్మం గురించీ నీతిని గురించీ ఆలోచించరు వాళ్ళకళ్ళు మనవంటివాళ్ళ విజృంభణ మీదే ఉంటై జనసామాన్యానికి స్వతహాగా ధర్మంలోనూ నీతిలోనూ విశ్వాసం కుదిరితే మన ఆటలేం సాగుతైగనకా!

మనం ముందుగా మనుషుల మతులు పోగొట్టాలి అవి సరిగా ఉన్నంతకాలమూ వాళ్ళు సత్యమనీ న్యాయమనీ ఏమేమిటో ఆలోచిస్తూ ఉంటారు మనుషుల మతులు పోగొట్టి వాళ్ళను పశువులల్లే చెయ్యాలి భయమూ, ఆశా, కోపమూ, దుఃఖమూ, ఉన్మాదమూ, పారవశ్యమూ ప్రజలకి మప్పాలి దేన్ని చూసి భయం, దేనిమీద కోపం అని అడక్కండి

దేనిమీదైనా ఫరవాలేదు చేతికి ఏది అందితే దాన్ని మనం ఉపయోగించు కోవచ్చు ఈ పద్ధతి మీద కొంతకాలం కొందరు ప్రజలను తయారు చేశామంటే వాళ్ళు వొట్టి వెధవలల్లే అయిపోయి వాళ్ళకి నిజమేమిటో, అబద్ధమేమిటో, న్యాయమేదో అన్యాయమేదో తెలీకుండా పోతుంది

మన ఉపన్యాసాల్లో రాను రాను వాక్యాలు తగ్గి పొడిమాటలు కూడా తగ్గి వొట్టి రంకెలు జాస్తిగా ఉంటై మన రంకెలకు ప్రజలెప్పుడైతే ప్రతిధ్వనులివ్వటం మొదలుపెడతారో అప్పుడు వాళ్ళు మనచేతుల్లో చిక్కినట్టే ఇక వాళ్ళు మంచినీళ్ళు కూడా అడక్కుండా ఎక్కడికైనా సరే పోయి చచ్చి ఊరుకుంటారు – మనకోసం!

* * *

ముందు మనుషుల తలకాయలు దోచింతరవాత వాళ్ళజేబులు దోచటానికి మనం సిద్ధంగా ఉంటాం

మీకు తెలుసో తెలీదో గాని జేబులు దోచటం చాలా సులభం జేబులు దోచటంలో ప్రధానసూత్రం డబ్బు మన సొంతం చేసుకోవటం కానే కాదు జనాన్ని వెధవల్ని చేసి రాజకీయంగా మనమే అధికారవర్గం అయింతరవాత, కావలిస్తే, డబ్బంతా మన చేతిమీదిగానే తిరుగుతుంది, కాని అందువల్ల ఏమీ లాభంలేదు

అసలైన దోపిడి ఏమంటే డబ్బు కొంత పనివాళ్ళకిచ్చి వాళ్ళచేత అన్నిరకాల వస్తువులూ చేయించుకుని అందులో కొద్దిభాగం మాత్రమే వాళ్ళకు తిరిగి అమ్మితే ఒక రౌండు తిరిగేటప్పటికి మన దగ్గిర మొదట ఉన్న డబ్బంతా ఉండటమే కాక వాళ్ళు తయారుచేసిన వస్తువుల్లో ఎక్కువభాగం కూడా మన చేతుల్లోనే ఉండాలి

ఇందులో ఉండే ఆర్థికసూత్రం ఏమంటే, మనం కొనే వస్తువుల ధరలు మాత్రం అందులో ఇమిడిఉన్న కూలిమీద ఆధారపడినప్పటికీ, కూలి ధర మాత్రం వస్తువుల ధరల మీద ఆధారపడి ఉండరాదు దీన్నే మనం ఆర్థికశాస్త్రరీత్యా విపులీకరించి రాస్తే అది చచ్చినా ఎవడికీ అర్థం కాక ప్రపంచానికి మన దోపిడి అమితసవ్యంగానూ న్యాయంగానూ ఉంటుంది వస్తువుల ధరలు కూలిమీద ఆధారపడితే – డబ్బనేది చేసినపనికి రసీదయితే – పాటకవర్గంలో కొద్ది డబ్బే ఉండి ఎన్నడూ పనిచెయ్యనివాళ్ళ దగ్గిర ఎక్కువ డబ్బెందుకుంటున్నదీ ఎవరికీ అర్థం కాక వస్తువుల ధరల్లో కూలి కాక ఇంకేమిటో కూడా ఉందని ప్రజలు గ్రహించుకుంటారు అది మరేమీ కాదు మన దోపిడి! ఆ సంగతి మనం ఆర్థికశాస్త్రాల్లో రాయొద్దు కావలిస్తే వస్తువులధరల్లో వడ్డీ, పన్నూ, తరుగుదలా, కొంచెంగా కులతత్వమూ, కాస్త దబాయింపూ, ఒక్కపిసరు అదృష్టమూ వగైరా వగైరా కూడా చేరిఉన్నట్టు మనం బుద్ధిమంతులచేత రాయింపించవచ్చు ఇటువంటి రాతలు మనస్ఫూర్తిగా రాసేవాళ్ళున్నారు

* * *

దోపిడి గురించి ముఖ్యంగా మనం తెలుసుకోవలిసిందేమిటంటే – వారసత్వం

ఇంకోరి కష్టం మీద జీవించటమే దోపిడి అని చాలామంది పిచ్చివాళ్ళనుకుంటారు ఇది నిజం కాదు పసిపిల్లలూ, ముసలాళ్ళూ, రోగులూ, జైళ్ళల్లో ఉన్నవాళ్ళూ సామాన్యంగా ఇట్లా జీవిస్తూనే ఉన్నారు కాని వాళ్ళు బావుకుని ఏడిచిందేమిటి?

"నేను బ్రాహ్మణ్ణి– అన్నట్టు, నా కొడుకూ బ్రాహ్మడే ఆ మాటకొస్తే వాడికొడుకూ బ్రాహ్మడే!" అంటే తప్పు నిజమైన దోపిడి సాగదు

వెనకటిరోజుల్లో జననమరణ లెఖ్ఖల్లేవు గనక బ్రహ్మదగ్గిర్నించీ కులాలు ఏర్పడ్డట్టు నటించటానికి వీలయింది ఇప్పటికులాలు ఏ మూడుతరాలో వెనక్కెళ్ళితే చాలు అయితే ఈ జాతికులతత్వంలో మనం ఏ సూత్రం ఇమిడిస్తే అదే ఇముడుతుంది కనక, ఈ ఉద్యమంలో చేరదలచిన వాళ్ళందరికీ వర్తించేట్టు ఏదో ఒక జాతిని నిర్వచించవచ్చు కొన్ని బొంకులు బొంకినా– అవి నలుగురికీ తెలిసినా– ఆట్టే ఫరవాలేదు సిగ్గూ బిడియాలు పెట్టుకుంటే ప్రపంచాన్ని దోచటం సాధ్యమవుతుందా?

"నా డబ్బు నా కొడుకుల్దే" అనటం మరోరకం వారసత్వం కాని ఇది నా అభిప్రాయంలో ఆట్టే మంచి వారసత్వంకాదు రెండుతరాల్లో డబ్బు క్షీణిస్తుంది ఎంతమందికి పంచినా క్షీణించనిది కులమూ, జాతీనూ

* * *

దోపిడికి పూనుకోగానే లాభంలేదు అందులో కొన్ని కష్టసుఖాలు తెలుసుకోవాలి మరి

మొదటి చిక్కు మన పరిపాలనలోనే వస్తుంది ఎందుచేతనంటే, మనం దోస్తున్న కొద్దీ మన మూఢప్రజలు దరిద్రులైపోతూ ఉంటారు దరిద్రం వాళ్ళు భరించలేని స్థితికి వచ్చినప్పుడు వాళ్ళు మనని మరిచిపోయి తమను గురించి ఆలోచించటం మొదలుపెట్టవచ్చు ఇందువల్ల చాలా ప్రమాదం ఉంది

వాళ్ళకీ మనకీ మధ్య ఓ చిన్న గోడ ఉండకపోతే వాళ్ళు మనమీద ఎప్పటికన్నా విరుచుకుపడవచ్చు అందుచేత మనకొక మధ్యమతరగతి– ఈ మధ్యమతరగతి మన సంస్కారం – అంటే మనని మెచ్చుకునేశక్తి – కలదై ఉండాలి మన డబ్బు కూడా కొంత వాళ్ళకు పారేస్తూ ఉండాలి జనసామాన్యంతో మనకు చిక్కొచ్చే పరిస్థితులు కనిపించినప్పుడల్లా మనం మధ్యమతరగతికి కొంత'విజయం' పారేస్తుంటే మన దోపిడి అవిచ్ఛిన్నంగా సాగుతుంది

కాని అప్పటికీ చిక్కు రావచ్చు అనగా మధ్యమతరగతిలో మనమీద ద్వేషం ప్రబలవచ్చు– మరి వాళ్ళను కూడా మనం దోస్తూనే ఉంటాంగా!

అటువంటప్పుడు మనం పక్కదేశాలమీద తగూపెట్టుకుని ఓ యుద్ధం ఏర్పాటుచేస్తే తాత్కాలికంగా అందరికోపమూ 'శత్రువు' మీదికి తిరుగుతుంది

యుద్ధాలవల్ల మనకి చాలా లాభాలున్నై. దేశభక్తి పెంపొంది మనలో ఐకమత్యం కలుగుతుంది, ఒకటి (ఎవడన్నా అతి తెలివిగలవాడు ఐకమత్యం ఫాసిస్టునినాదం అన్నాడో, దేశం కాస్తా మట్టిగొట్టుకుపోతుంది వాళ్ళతో మనమూ పోతాం )

రెండో లాభం ఏమిటంటే మధ్యతరగతి వాళ్ళ పరిశ్రమలు మూలబడి మనకు అధికంగా లాభం కలిగించే పరిశ్రమలు జోరుగా సాగుతై

మరోలాభం ఏమిటంటే యుద్ధఖర్చుకోసం దేశానికి (అప్పుడు దేశమంటే మనం కాము!) మనమే అప్పుపెట్టి దానిమీది వడ్డీతో హాయిగా కాలక్షేపం చెయ్యొచ్చు

మన ప్రజల్లో దారిద్ర్యం గురించి ఆందోళన బయల్దేరినప్పుడల్లా – నిరుద్యోగ సమస్య తీవ్రమైనప్పుడల్లా– "మిగిలిన దేశాలకి సామ్రాజ్యాలుండటం మూలాన దేశసంపదలు వృద్ధిపొందినై మన దేశం కూడా పైకి రావాలంటే మనకు సామ్రాజ్యం కావాలి" అని చెప్పి యుద్ధంలో దించవచ్చు

దేశంలో ఉన్నది సవ్యంగా పంచితే ఎంతెంతవస్తుందో అందులో మూడోవంతివ్వటానికి గాను మనం మన ప్రజలచేత మూడు భయంకరమైన యుద్ధాలు చేయించవచ్చు

(యుద్ధాలవల్ల ఐదోలాభం ఏమిటంటే చాలామంది నిరుద్యోగులకు విముక్తి కలుగుతుంది )

* * *

దోపిడిలో ఉన్న చమత్కారం ఏమిటంటే, అది విజృంభించిన కొద్దీ దేన్నిగురించీ జనం నిజం తెలుసుకోలేరు

దేశమే ఉందనుకోండి ఒకవిధంగా చూస్తే మనమే దేశమల్లే కనిపిస్తాం మరోవిధంగా చూస్తే మనకు దేశం బహిర్గతంగా ఉన్నట్టు కనిపిస్తుంది

దేశసంపద పైకి ఎగుమతి ఐన కొద్దీ, దేశంలో దరిద్రం హెచ్చినకొద్దీ నిరుద్యోగుల సంఖ్య పెరిగినకొద్దీ, దేశాభ్యుదయం పెరుగుతుంది

సంపద అతిగా సృష్టికావటం వల్ల కాటకాలు కలుగుతై

ఈ విరుద్ధాల మధ్య మన సంస్కారం పెరుగుతుంది అందుచేత మనుషులకు మతులు మతుల్లో ఉండవు వాళ్ళ హృదయాలు కూడా పల్లటీ కొడతై

ఎందుకంటే వాళ్ళు దేశభక్తి వాతపడ్డప్పుడల్లా అధోగతికి పోతారు అందుకని దేశభక్తిని తెంచుకోలేరు ఒకవేళ తెంచుకున్నారా, వాళ్ళ హృదయాలు ఎండిపోయి నిర్వీర్యులుగా తయారవుతారు

ఆఖరుకు వాళ్ళ ప్రేమలు కూడా ప్రతిబంధకాలుగానే తయారవుతై మనం దోచుకునే డబ్బుకోసం వాళ్ళు ప్రేమలు కూడా ఎండబెట్టుకుంటారు ఆఖరుకు వాళ్ళు ప్రేమ అనేమాట వింటేనే శివ శివా అని చెవులు మూసుకుంటారు లేదా వెకిలినవ్వు నవ్వుతారు

మన ప్రయోజకత్వం సాగినకొద్దీ వాళ్ళ కవిత్వంలో కపాలాలూ, అస్తిపంజరాలూ, కరుడుగట్టిన నెత్తురుముద్దలూ, భ్రూణహత్య వాతపడ్డ శిశువులూ, పల్లేరురహదార్లూ, బ్రహ్మజెముడు కంచెలో పొత్తిళ్ళగుడ్డలూ, దుర్గంధమూ పెరుగుతై ఈ దశ వచ్చిన తరవాత వాళ్ళ మనస్తత్వం కొడిగట్టినట్టు మనం భావించుకోవచ్చు అది – వాళ్ళ అసమర్ధతకి ఆఖరుదశ కనక –ఏమిటి? చెప్పండి!– చేద్దామా దోపిడి?

ఆనందవాణి, వారపత్రిక, 1947

# 1.కృత్యాంతం

అందరూ కృత్యాది గురించే మాట్లాడుతారుగాని కృత్యాంతం గురించి ఎవరూ చెప్పరు నిజానికి కృత్యాది కంటే కృత్యాంతమే చిక్కులతో కూడుకున్నది కృత్యానికేముంది? ఏ రాజరాజో మంచిరోజు చూసి 'మహానుభావా ఓ గొప్పపురాణం రాసి నాపేర అంకితం పెడుదూ!" అన్నా, ఏ శ్రీరామ చంద్రమూర్తో కనిపించి తనపేర ఓ ఉద్గ్రంధం ప్రారంభించమన్నా, ఏ జిల్లా బోర్డు ప్రెసిడెంటో ఓ నూట పదహార్లు తగలేస్తానన్నా కృతి ప్రారంభమయినట్టే, ఘంటం మంగలాడిచేత పదును పెట్టించటమూ, అబ్బాయిని తాడి చెట్టు ఎక్కించటమూ తరవాయిగా కాని కృత్యాంతం అట్లాకాదే "దాంతగలేసింరి, ఇంకో రెండు వేల పద్యాలు రాసి మరీ ముగిద్దాంలే!" అనిపిస్తుంది "చిత్తులోనే పధ్నాలుగొందల పేజీలుందిగా అచ్చులో వెయ్యిన్నూట పదహార్లు అవుతుందా? అని సందేహం కలుగుతుంది ప్రవరాఖ్యుడితో ఆఖరయిన మనుచరిత్రని పెద్దన్నగారు సాగదీశాడని అనుకునేవాళ్ళు లేక పోలేదు కొందరు పుస్తకమంతా రాసేసి అచ్చుకూడా అయిపోయి తీరా అట్ట కంపోజింగు జరుగుతుండగా చప్పున పుస్తకం పూర్తి కాలేదని తోచి ఆ అట్టమీద "మొదటి భాగము" అని తగిలించేస్తారు ఎన్నేళ్ళకీ రెండో భాగం రాకపోవటం చూసి మనం నిరుత్సాహ పడతాం మరికొందరు దుర్మార్గులు రెండో భాగం అచ్చువెయ్యనే వేస్తారు అయితే వీళ్ళు తగని గడుసువాళ్ళు ఎందుకంటే "మొదటి భాగము అచ్చయిన పుస్తకం తాలూకు రెండో భాగం కోసం ఎదురు చూస్తాం గాని రెండో భాగం అచ్చయిన పుస్తకం తాలూకు మూడోభాగం కోసం ఎదురుచూడం మూడోభాగం రావచ్చు, రాకపోవచ్చు దాని తాలూకు కృత్యాంతం గురించి చచ్చినా మనకు తెలీదు మన ఆధునికుల్లో కొంతమంది కృత్యాంతం గురించి చాలా ఆత్మ నిగ్రహం ప్రకటించారు వాళ్ళ పద్యాల్లో కొన్ని పాద మధ్యమంలో ఖండితంగా ఆగిపోతై అందుకనే వాటిని 'ఖండకావ్యా' లంటారని కొందరు పొరబడ్డారుకూడాను కృత్యాంతావస్థ సాహిత్యంలోనే ఉంటుందనుకో నవసరంలేదు ఎల్లయ్యా మల్లయ్యా చదరంగం ఆటక్కూచుంటారు "తొందరగా ఇంటికి పోవాలి, సరిగా మూడాటలేద్దాం" అంటాడు ఎల్లయ్య సరే అంటాడు మల్లయ్య మొదటాట ఎల్లయ్య గెలుస్తాడు రెండోఆట మల్లయ్య కాజేస్తాడు మూడోఆట ఎల్లయ్య ఊడబెరుక్కుని వెళ్ళటానికి ఆయత్తమవుతాడు ఇంకొక్క ఆటవేసి అట్లాగే లేద్దామంటాడు మల్లయ్య అదీ ఎల్లయ్యదే అవుతుంది ఇంకొక్కఆట అంటాడు మల్లయ్య అది కాస్త మల్లయ్యది అయి ఊరుకుంటుంది "అయిన ఆలస్యం కానే అయింది, మరోటి తగిలించు" అంటాడు ఎల్లయ్య– తన గెలుపుతో ఆట ఆఖరు చేద్దామనే ప్రయత్నంలో కృత్యాంతం నిర్ణయించలేక పోతారు ఎల్లయ్య మల్లయ్యలు పోకరాడే వాళ్ళూ, తాగటానికి వెళ్ళేవాళ్ళూ, గుర్రప్పందాలకు పొయ్యేవాళ్ళూ కృత్యాదికంటే కృత్యాంతం ఎంత క్లిష్టమయినదో కావలసినంతగా రుజువు చెయ్యగలరు

యుద్ధాలలో కూడా కృత్యాంతం చెడ్డ చిక్కయిన విషయం యుద్ధాలు మొదలుపెట్టటం చాలా సులభం ఎవరికో హిట్లరు మీసాలు చూసి గుండె తరుక్కుపోతుంది (ఆస్ట్రియా, జెకోస్లోవేకియాలు అంత గుండె తరుక్కుపోయే విషయాలుగావుకాని పోలండు! అమ్మో!) లేదా,

అకస్మాత్తుగా స్వాతంత్ర్యం మీదా, న్యాయం మీదా, అవ్యాజానురాగం పుట్టుకొస్తుంది యుద్ధమంటారు! పెళ్ళిళ్ళు చేయటమన్నా, ఇళ్ళు కట్టించటమన్నా, పని మనుషుల్ని చూసుకోవాలి, తాడూ కోలా వెతుక్కోవాలి బోలెడంత యాతన యుద్ధం మహత్కార్యం గనక ఉపక్రమించేస్తే మిగిలిన ఏర్పాట్లన్నీ వాటంతట అవే జరుగుతై అందరూ తలా ఒక చెయ్యి వేస్తారు కొందరు పనిలేక కుడిచి కూర్చున్న మచ్చు అడపాదడపా, "ఈ యుద్ధందేనికీ? ఇది సాగించటంలో మీ ఆదర్శాలేమిటీ? ఈ ఆదర్శాలు మీ దగ్గర కనిపించవేం?" అని అడ్డు పుల్లలు వేస్తూవుంటారనుకోండి అంత మాత్రంచేత యుద్ధం ఆగిపోయేదిలేదు ఆగిపోవటమేమిటి? అక్కడే గదావున్న చిక్కంతా? అదే ఎవరూ నిర్ణయించలేని సంగతి పంచాంగాలు తిరగేస్తారు న్యూమరాలజీలు చూస్తారు ఫలానిరోజుకు యుద్ధం అయిపోతుందని పందాలు వేసుకుంటారు ఎన్ని చేసినా అది ఆగదు ఇంత మందికి దాన్ని ఎక్కడో ఒకచోట ఆపాలనే ఉంటుంది కాని ఆది, బ్రేకు చెడిపోయిన యంత్రం మాదిరిగా పోతూనే వుంటుంది అయితే యుద్ధం అసలు ఆగనే ఆగదా అంటే ఆగుతుంది కాని దాన్ని ఆపిన కీర్తి కాస్తా ఓడిపోయిన వాళ్ళకు దక్కుతుంది ఎందుకంటే పలాని క్షణాన యుద్ధం ఆపుదామని నిర్ణయించి అనుకున్న ప్రకారం ఆపగల చాకచక్యం వాళ్ళకేవుంది సరిగా గడియారం ప్రకారం వాళ్ళు తెల్ల బావుటా ఎత్తెయ్యగల్రు అందుకనే ఈ విధంగా ఆగిపోయిన యుద్ధంచివర "సంపూర్ణం" అని రాసెయ్యక, "ప్రపంచ సంగ్రామం తాలూకు మొదటి సంపుటం సంపూర్ణం" అని రాస్తారు అంటే రెండో సంపుటం రావచ్చు కిందటి యుద్ధ సంపుటి అచ్చులో ఉండగా ఇదే ఆఖరుకావ్యం అన్న వాళ్ళే ఆ యుద్ధంలో గెలిచారు అయినా రెండో సంపుటం రానే వచ్చింది ఈ సారికూడా ఇది ఆఖరన్నవాళ్ళే గెలుస్తున్నారు కాని మూడోసంపుటం రాదని చెప్పలేం కారణం పైనే మనవి చేశాను ఓడిన వాళ్ళు నిర్ణయించే కృత్యాంతం గెలిచిన వాళ్ళ కెట్లా ఆమోదకరమవుతుంది? గెలిచినవాళ్ళ దగ్గిర బోలెడంత కాగితమూ, సిరా, కలాలూ, పాళీలూ మిగిలిపోతై పైగా ఈ మహాకావ్యం సమయానికి అనుకున్నవిధంగా నడిచి ఉండదు– అంటే గెలిచినవాళ్ళు అనుకున్నవిధంగా ఇందులో చావగూడని పాత్రలు చచ్చి ఉంటై చావవలసినవి బతికి ఉంటై కథ అనుకున్నట్టు నడిచిఉండదు కథకు కావలసిన పరిమాణం తెప్పించగలందులకూ, ఉన్న కాగితాలూ, కలాలూ, పాళీలూ వగైరా వృథాపోకుండానూ, కృత్యాంతం నిర్ణయించేది ఓడిపోయే వాళ్ళయితే తెల్లబావుటాలు కాదని నిరూపించేటందుకు ఎదురుచూడండి ప్రపంచ మహాసంగ్రామం సంపుటం 3

డంకా, మాసపత్రిక మార్చి 1945

# 2.కాలధర్మం

మానవుణ్ణి కాలం కనిపెట్టి ఉంది మానవుడు కూడా కాలాన్ని కనిపెట్టివున్నాడు కాలధర్మం గుర్తించలేని మానవుడు పైకిరాలేడు కాలనిర్ణయానికి విరుద్ధంగా వెళ్ళటానికి ప్రయత్నించే మానవుడు అవమానం పాలవుతాడు కాలధర్మమంటే ఇంగ్లీషులో హిస్టారిక్ డిటర్మినిజమ్ అనీ, కాలనిర్ణయ మంటే హిస్టారిక్ నెసిసిటీ అనీ అనుకోవచ్చు

మానవుడి మీద కాలానికి ప్రభావం ఉన్నట్లే మానవుడికి కూడా కాలంమీద కొంత ప్రభావం వుంది కాలధర్మాన్ని ఽగుర్తించి మానవుడు ఆ ధర్మాన్ని మార్చేస్తాడు- కాల ధర్మాన్ని తృణీకరించికాదు, తనకు అనుకూలంగా వినియోగపరచుకుని

కాలధర్మాన్ని వినియోగ పరచుకోవటమంటే ఒక మహత్తరమైన దైవిక శక్తిని – ఏ పేలుడు మందూ, అణుశక్తీపోటీ చెయ్యలేని అద్భుత శక్తిని- ఉపయోగ పరచటమన్నమాట ఇది మన పక్షాన ఉన్నప్పుడు గోటితో కొండనెత్తవచ్చు, పదిమందిమి కలిసి పదివేలమందిని నిగ్రహించవచ్చు, అణు-బాంబులను పేలకుండా చేయవచ్చు, సత్యాగ్రహంతో స్వరాజ్యం సాధించవచ్చు

ఇంత మహత్తర శక్తిని కావాలనుకున్నప్పుడే వినియోగించుకోవచ్చు ననటానికి లేదు, దాన్ని వినియోగిస్తే ఎంతలాభంవుందో, వినియోగించకపోతే దాని కన్నిరెట్లు అపాయం కూడా వుంది ఈ సంగతి స్పష్టంగా గ్రహించిన వాడెవడూ కాలధర్మం గుర్తించటానికి ఉపేక్ష చేయడు

అయితే జీవితంలో నిత్యమూ కనిపించే సంఘర్షణా, బాధా, నష్టమూ చూస్తే కాలధర్మం తెలిసినవారు ప్రపంచంలో ఎంతమంది ఉన్నారని సందేహం కలుగుతుంది జీవితంలో సంఘర్షణ ఉండరాదని కాదు, కాలధర్మంలో మార్పు కలిగినప్పుడల్లా సంఘర్షణ ఉంటూనే ఉంటుంది కాని కాలనిర్ణయానికి అనుకూలంగా కొందరూ, ప్రతి కూలంగా కొందరూ సంఘర్షణ పడ్డప్పుడు సంఘర్షణ త్వరలో తేలిపోతుంది ఎక్కువ బాధా, నష్టమూ కలగవు

కాలనిర్ణయానికి విరుద్ధంగా పోరాడే వారు ఎప్పుడూ ఉంటారు వారికి ధర్మం తెలియదనటానికి వీల్లేదు కాని ఆ కాలధర్మం వారి స్వార్ధానికి అపహరించే పరిస్థితిలో, వారు పోరాడి తీరుతారు పెట్టుబడిదారీ నాగరికతను నిరోధించేప్పుడు జమీందారీ వర్గంవారూ, ప్రజాస్వామ్యాన్ని నిగ్రహించేటప్పుడు పెట్టుబడిదారులూ పోరాడి తీరుతారు

ఈ విధంగా కాలనిర్ణయాన్ని ఎదిరించి పోరేవారిని కాలధర్మం తెలుసుకుని మనం సులభంగా గుర్తించవచ్చు, ఎందుకంటే వారు తమ విజయంకోసం కాలధర్మాన్ని ఆశ్రయించుకున్న నినాదాలుకొన్ని తప్పనిసరిగా వాడుతారు- అయితే వాటిని అక్రమంగా వాడతారు సక్రమంగా వాడితే అవి వారికీ ఉపకరించవు సామ్రాజ్యవాదులు చిన్న రాజ్యాల హక్కుల్ని గురించి బల్లగుద్ది వాదించేటప్పుడూ, పెట్టుబడీదారీ వర్గంవాళ్ళు ఆర్ధిక ప్రణాళికలను గురించి చర్చించటానికి మార్చు ఛాయాచిత్రాన్ని వినియోగపరచినప్పుడూ, విద్రోహకులు కూడా కాలధర్మం గుర్తించగలరని మనం తెలుసుకుంటాం కాలనిర్ణయం తమకు అనుకూలంగా ఉందని ప్రజలను మభ్యపెట్టటమే విద్రోహకులకు కావలసింది

ఇటువంటి ప్రయత్నాలు సఫలమవుతాయా? దురదృష్టవశాత్తూ అవుతాయి. ప్రపంచంలో అధికసంఖ్యాకులకు కాలజ్ఞానం లేనంతవరకూ కాలనిర్ణయానికి విరుద్ధంగా పోరాడేమూఢులూ, సరి అయిన నిర్ణయానికి రాలేని కర్తవ్యతావిమూఢులూ, అభివృద్ధి నిరోధకులూ ఉంటూనే ఉంటారు. ప్రపంచంలో బాధా, నష్టమూ, పెంపొందించేది ఈ తరగతి వారే. ఉదాహరణలు చాలా దొరుకుతాయి. హిట్లరు మీద సకాలంలో యుద్ధం ప్రకటించలేకపోయిన బ్రిటిషు టోరీ ప్రభుత్వమూ, అమెరికాను ధిక్కరించటానికీనాడు తటపటాయిస్తున్న లేబరు ప్రభుత్వమూ దీనికి నిదర్శనాలు.

చారిత్రకావశ్యకత అనబడే కాలనిర్ణయాన్ని స్పష్టంగా గుర్తించలేని వారిదెప్పుడూ సంధిగ్ధస్థితే. సంధిగ్ధావస్థ ప్రభుత్వాలకే కలుగుతున్నప్పుడు ప్రజాసామాన్యానికి కలగటంలో ఆశ్చర్యం లేదు. కాని జనసామాన్యానికి కాలతత్వం బోధపడటం చాలా కష్టం. దానికి తోడువారిని మభ్యపెట్టడానికి అనేక ప్రయత్నాలు జరుగుతాయి. అటువంటి పరిస్థితులలో కాలనిర్ణయం ప్రజలకు అర్థంకావటం ఎట్లా?

సాంఘిక జీవిత తత్వమూ, ప్రపంచ జ్ఞానమూ కాల నిర్ణయాన్ని గుర్తించటానికి రెండు పెద్ద సాధనాలు ఇవి కూడా కష్టపడితేగాని లభ్యమయేవికావు. ఈ రెంటికన్నా సూక్ష్మోపాయం ఒకటి ఉన్నది. అదేమంటే జీవిత సంఘర్షణను చూసి కాలనిర్ణయం తెలుసుకోవడం.

జీవితంలో జరిగే సంఘర్షణను నిష్పాక్షికంగా చూస్తే అందులో కొన్ని విడ్డూరాలు కనిపిస్తాయి. పిచ్చుకలమీద బ్రహ్మాస్త్రాలు వేయటమూ, సమస్యలకున్న పరిష్కారమార్గాలు హేయంగా పరిణమించటమూ, మొదలైన వాటిని బట్టి మనం కాలనిర్ణయం గుర్తించవచ్చు. అమెరికాలోనూ,-దక్షిణ ఆఫ్రికాలోనూ ప్రభుత్వాలు అధఃపతితులై ఉన్న నీగ్రోలమీదా, దేశీయులమీదా దారుణ హత్యాకాండలు జరపటం ఎందుకు జరుగుతుంది? నిరాయుధులైన పాకీవాళ్ళమీదా, కార్మికులమీదా పోలీసులు అత్యాచారాల నెందుకు చేయవలసి వస్తుంది? హైద్రాబాదులో ఉన్న రాజకీయ శక్తులన్నీ రైతులమీద ఎందుకు కేంద్రీకరించవలసి వస్తుంది? కమ్యూనిస్టులు తీసుకురాబోయే అరాచక పరిస్థితుల్ని ప్రతిఘటించటానికి ప్రజా రక్షణ చట్టంలాంటి తుచ్ఛశాసనం ఎందుకు చెయ్యవలసి వస్తుంది? అన్నిటికీ ఒకటే సమాధానం. పాలకవర్గానికి కాల నిర్ణయం ప్రతికూలంగా ఉందిగనుక!

పిచ్చుక పక్షాన కాల నిర్ణయం ఉన్నప్పుడు బ్రహ్మాస్త్రమే వెయ్యవలసి వస్తుంది. కాని మొదటనే చెప్పినట్టు మానవుడికి కాలనిర్ణయం గుర్తించే శక్తి వుంటే బ్రహ్మాస్త్రంకూడా పారదు. మానవుడికి కాలజ్ఞానం లేకపోతే పదిమంది లాభాల కోసం లక్షలమంది పోరాడటం జరుగుతుంది.

నవయుగ, మాసపత్రిక, నవంబరు 1947.

# 3. అమెరికావాళ్ళ దేవుడు

అమెరికాలో ఆకాశ సౌధాలకూ, నీగ్రో విద్వేషానికీ, వ్యక్తి వ్యాపారస్వాతంత్ర్యానికీ ఎంత లోతైన పునాదులున్నాయో దేవుడికి కూడా అంత లోతైన పునాది ఉంది అమెరికను పత్రికలు తరచూ చదివేవాళ్ళకు రష్యా వ్యతిరేక ప్రచారానికి ఏ మాత్రమూ తగ్గని దేవుడి ప్రచారం కనిపిస్తుంది వ్యాపారచింతవల్ల అన్నం తినటానిక్కూడా శక్తిగాని, వ్యవధిగాని లేని కోటీశ్వరులు దేవుడి ప్రచారం కోసం డబ్బిస్తారు పత్రికాధిపతులు దేవుడిమీద సంపాదకీయాలు ప్రచురిస్తారు, రాజకీయ నాయకులు దేవుడుపై రేడియో ప్రసారాలు చేస్తారు అమెరికాను ఆర్థికంగానూ, రాజకీయంగానూ ఉన్నత స్థితిలో ఉంచుతున్నది డాలరా, దేవుడా అని సందేహం కలక్కపోదు

మొన్న క్రిష్టమస్ పండుగరోజున ట్రూమన్ అమెరికా కంతటికీక్రిష్టమస్ సందేశం చెబుతూ– ఆకస్మికంగా తాను బాలుడైపోయి, అమెరికా వాళ్ళందర్నీ పసిపాపలుగా భావించాడు అందరి హృదయాలలోనూ ప్రేమా, అందరి ఆత్మలలోనూ శాంతీ ఉన్నట్టు ఊహించి యేసుబాలుడితో ఆటలాడుతున్నాడు అసలే పండుగ దినం అర్ధరాత్రి పన్నెండు గంటలదాకా ఆనంద పారవశ్యంలో ఓలలాడిన అమెరికనులు ఆపాటి "చిలిపితనం" లో పడటంలో ఆశ్చర్యంలేదు

ఈ ట్రూమనే అదేరోజున ప్రపంచ ప్రజలకు మరో ముక్కచెప్పాడు– దేవుణ్ణి అన్వేషించటం తప్ప శాంతిమార్గం లేదన్నాడు ఈ మాట అన్న తరువాత అమెరికావారి దేవుణ్ణి గురించి మనం కొంత భయపడవలసి ఉంది ఎందుచేతనంటే, ప్రపంచ శాంతివంటి అవసర పదార్థం దేవుడి చేతిలో ఉంటే మనం హతాశులమే! దేవుడంటే ఎవరికీ అభ్యంతరం లేదు ఎప్పుడైతే పరిస్థితులు విషమించి ప్రయత్నాలన్నీ విఫలమవుతాయో, అప్పుడు, ఎటువంటి నాస్తికుడు కూడా ఏదో పరాశక్తిని విజయం అర్థిస్తాడు లావొక్కింత కూడా లేకుండాపోయి ప్రాణంబులు రావుల్ తప్పే స్థితిలో దేవుణ్ణి సంస్మరించటం జరుగుతుంది ఈ లోపుగా "దేవుడి కేసి తిరగటం" ఆత్మవంచనో, పరవంచనో అవుతుంది పొలాలు చేసే రైతులను గూబలు మెలేసి ధాన్యం వసూలుచేసి మన "అనుదినమైన రొట్టె" కోసం భగవంతుణ్ణి ప్రార్థించటమనేది భగవంతుడికి గాని మనకుగాని ఆటే కీర్తిదాయకమైన పద్ధతికాదు

దేవుణ్ణి అట్లా వినియోగించటం ఆరంభిస్తే మన ప్రయోజనా లన్నిటినీ సాటి మానవుడి కృషితో తీర్చుకుంటూ కృతజ్ఞత మాత్రం భగవంతుడికే చూపటం జరిగి, మనం మానవద్రోహం చేసిన వాళ్ళమవుతాం

ప్రపంచశాంతి చేకూరాలంటే చెయ్యదగిన పనులు బోలెడున్నాయి ప్రపంచమంతటా జరిగే శాంతి సభలలో అనేక సూచనలు వెలువడుతున్నాయి ట్రూమన్ ఈ సూచనలన్నీ తోసి రాజని, దేవుడికేసి తిరగమనటం అనుమానాలకు దారితీస్తున్నది నేనే మంచాన పడివుంటే, మందులో విశ్వాసంగల వైద్యుణ్ణి చికిత్సకు ఎన్నుకుంటాను గాని, దేవుడిలో విశ్వాసం గల వైద్యుణ్ణి ఎన్నుకోవటానికి వెనకాడతాను బుద్ధి గలవాడెవడైనా నామాదిరిగానే చేస్తాడనికూడా నావిశ్వాసం

ఇంకొక విధంగా చూసినా మనం అమెరికా వాళ్ళ దేవుణ్ణిచూసి భయపడవలసిందే అమెరికా ఉత్పత్తి సరుకులకు ప్రసిద్ధి అక్కడ అతి విచిత్రమయిన ప్రయోజనాలుగల సరుకులూ, జ్ఞానమూ ఉత్పత్తిచేయబడి, వింత వింత ఆకర్షణలతో ప్రచారం చేయబడి, లాభాలకు విక్రయించబడతాయి అక్కడ మన దేశంలోలాగా మూఢ విశ్వాసాలు లేవు కనుక తాయెత్తులు అమ్మరు, కాని "మీ సంపాదనను రెండు మాసాలలో రెట్టింపు చేయగల" నెక్ టైలూ, " మీరు ప్రేమించే పురుషుణ్ణి అవలీలగా వశీకరణ చేసుకునే" టూత్ పేస్టులూ, "మీప్రియురాలికి ఆనందపారవశ్యం చేకూర్చే" షేవింగు పేస్టులూ అమ్ముతారు స్నేహితుల్ని సంపాదించి తద్వారా కోటీశ్వరులు కావటానికి పుస్తకాలున్నాయి (దారిద్ర్యానికి పెట్టుబడే కారణ మనుకునేరు!)

అమెరికాలో అసాధారణమైన వాడుక సరుకులు ఉత్పత్తి కావటమేగాక ఇంకే దేశం వారూ ఊహించలేనంతగా ప్రచారం చేయబడతాయి 5 సెంట్లు ఖరీదుచేసే 'కోకా కోలా" (వెనక 3 సెంట్లు) ప్రచారం చెయ్యటానికి అనేక కోట్ల డాలర్లు ఏటా ఖర్చవుతాయి

అమెరికా ఉత్పత్తి చేసి ప్రచారంచేసే సరుకుల్లో దేవుడుకూడా ఒకటి "అట్లా అయితే ఇతర అమెరికా వాడుక సరుకులల్లేనే అమెరికను దేవుడుకూడా వాంఛనీయ పదార్థమే గదా" అనవచ్చు కాని ఇందులో తిరుగుడేమంటే ప్రపంచంలోని అన్నిదేశాలూ అమెరికను సరుకులమీద ఆధారపడవలసిన దుస్థితి అమెరికను వస్తువులను బహిష్కరిస్తేనేగాని అంతో ఇంతో సర్దుబడి కావటంలేదు అంచేతనే బ్రిటనూ, బ్రిటను వెనువెంట మనమూ అమెరికా వస్తువులను అంతదూరాన ఉంచుతున్నాం

ఇంకొక ముఖ్యవిషయ మేమిటంటే అమెరికాలో దేవుడు ప్రత్యక్షంగానే ఉన్నాడు అణువుకన్న చిన్నదీ, మహత్తుకంటె పెద్దదీ భగవంతుడైతే, ఈ రెండు స్వరూపాలూ అమెరికాలో సాక్షాత్కారం పొంది ఉన్నాయి అమెరికాలో అణువులో దాగి ఉండే శక్తికూడా బహిర్గతం చేయబడుతుంది ఈ శక్తి అణువును చీల్చడంవల్ల లభ్యమయేది కనక అణువుకన్న చిన్నదే అనాలి రెండోవేపు డాలరున్నది- అన్నిటికన్నా పెద్దది, అన్నిటినీ కొనగలిగినది డాలరు ఇదివరకే అనేక దేశాలలోని నౌకాస్థావరాలనూ, యుద్ధ స్థావరాలనూ కొని ఉన్నది ఇది ప్రపంచాన్నంతా కొనటమేకాక, చంద్రమండలాన్నీ తదితర ఖగోళాలనూ కొనగలదని అమెరికను డాలరుదార్లు విశ్వసిస్తున్నారు

అమెరికాలో ఈ రెండు ప్రత్యక్ష స్వరూపాలలోనూ సాక్షాత్కరిస్తున్న దేవుడు శాంతి సాధించే దేవుడా, అశాంతి సాధించే దేవుడా అన్న దాన్ని గురించి అమెరికావాళ్ళ మాటలు మనం విశ్వసించరాదు రోజూ "కోకాకోలా" తాగి కోటీశ్వరుడు కావచ్చునంటే వెంటనే ఎవరు నమ్ముతారు గనకా?

ఒకవేళ అమెరికావాళ్ళు అణుశక్తిని గురించీ, డాలరును గురించీ చెప్పేది నమ్మదామనుకున్నా, వాళ్ళ నోటివెంట భయోత్పాతం కలిగించే మాటలూ వెలువడుతున్నాయి వాళ్ళు ఇకముందు తయారుచేయబోయే అణువు బాంబులు హిరోషిమామీద వేసిన బాంబుకంటే వెయ్యిరెట్లు వినాశనకారిగా ఉంటాయిట!

ముందుమాట ఏమైనా, ఇప్పటికే అమెరికా వాళ్ళ అణు శక్తి హిరోషిమా, నాగసాకీ నగరాల రక్తంతోనూ, అమెరికను డాలర్లు చైనావాళ్ళ రక్తంతోనూ తడిసి ముద్దగట్టి ఉన్నాయి ఇవే అమెరికాదేవుడి ప్రత్యక్ష స్వరూపాలయితే ఈ దేవుడు క్షుద్రదేవుడనటానికి సందేహం లేదు ఈ దేవుడు శాంతినివ్వలేదు సరికదా రక్తబలి కోరుతాడు అమెరికను డాలరు దేవుడు ఇదివరకే అమెరికా బ్రిటను సఖ్యానికి అడ్డుగోడలు కట్టి, ఒకవంక ప్రపంచమంతటా సరుకుల ఉత్పత్తి హెచ్చే సమయంలో–దారిద్ర్యాన్ని శరణుకోరవలసిన దౌర్భాగ్యస్థితి బ్రిటనుకు కల్పించాడు

అయినా చెప్పలేం డాలరు దేవుడు దోపిడీ దేశాలమధ్య తెచ్చిపెడుతున్న గోడలే చివరకు ప్రపంచశాంతికి దారితీస్తాయేమో దేవత్వం అన్న తరవాత – అమెరికను సరుకైనా సరే– ఊరికే పోతుందా?

తెలుగుస్వతంత్ర, వారపత్రిక, 30-12-1949

# 4. ఇంగ్లాండులో లేబరు పార్టీ గెలిచిందా?

బ్రిటను ఎన్నికలలో లేబరు పక్షానికి నామమాత్ర విజయం లభించింది గత అయిదు సంవత్సరాలూ లేబరు ప్రభుత్వానికి ప్రతిపక్షంగా ఉండిన కన్సర్వేటివులు దాదాపు లేబరు పక్షంతో సమంగా ఎన్నికలలో విజయం సాధించారు

ఈ ఫలితం చూసి ఎవరూ ఆశ్చర్యపరడనవసరం లేదు బ్రిటిషు వోటర్లు లేబరు, కన్సర్వేటివు పక్షాల మధ్య తేడా గమనించలేకపోయి ఉండవచ్చు బెవిను అనుసరించిన విదేశవిధానం పూర్తిగా కన్సర్వేటివుల ఆమోదాన్ని పొందుతూ వచ్చింది అట్లాంటికు ఒడంబడిక విషయంలో గాని, పశ్చిమయూరపు సమాఖ్య విషయంలోగాని, ఐక్యరాజ్య సమితిలో గాని బ్రిటిషు ప్రభుత్వం నిర్వహించిన పాత్ర కన్సర్వేటివు ప్రభుత్వానికి సహితం "అవమానం" కలిగించలేనిది ఆఖరుకు "ఎర్రచైనా"ను గుర్తించటం విషయంలో కూడా లేబరు ప్రభుత్వం విప్లవయుతంగా ప్రవర్తించలేదు చైనా ఎర్ర బడ్డ సంగతి గుర్తించక తప్పనప్పుడు వెనకాడటం దేనికీ? చైనా ఎంత ఎర్రబడ్డా రష్యా కంటె ఎర్రబడగలదా? రష్యాను బ్రిటను గుర్తించటం లేదా? పైపెచ్చు చైనాను గుర్తించటంవల్ల బ్రిటిషు ధనికవర్గానికి ఏమాత్రమైనా లాభం ఉండవచ్చు అన్నిటికన్నా ముఖ్యమైన విషయమేమంటే, చైనాలోని కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని గుర్తించినంత మాత్రాన బ్రిటను అంతర్జాతీయ రంగంలో కమ్యూనిస్టు వ్యతిరేక రాజకీయాలు అవలంబించటానికి గాని, ఆ రాజకీయాల కొరకు యావచ్ఛక్తులూ ధారపోసే అమెరికాతో చేతులు కలపటానికి గానీ అభ్యంతరం లేదు

ఒక్కముక్కలో చెప్పాలంటే గత అయిదేళ్ళలోనూ బ్రిటను అవలంబించిన విదేశవిధానం చూసినట్టయితే బ్రిటనులో ఉన్నది కన్సర్వేటివు ప్రభుత్వం కాదనుకోవటానికి ఆధారాలు లేవు అణుశక్తిని అంతర్జాతీయంగా కంట్రోలు చెయ్యటం గురించీ, యుద్ధప్రమాదం తప్పించటానికి రష్యాతో నేరుగా సంప్రతిస్తామని చర్చిలు ఒక "కోత" కొయ్యగానే వెలువడిన వ్యాఖ్యానాలలో ఒకటేమిటంటే విదేశాంగ విధానం గురించి లేబరు కన్సర్వేటివు పక్షాల మధ్య వచ్చిన సామరస్యాన్ని చర్చిలు పాడుచేస్తున్నాడని! దీన్ని బట్టి, రష్యా సహకారంతో ప్రపంచశాంతి సాధించటం బ్రిటిషు లేబరు ప్రభుత్వానికి ఎంత అయిష్టమో మనం ఊహించవచ్చు

పరిశ్రమలు జాతీయం చేయటంలాంటి విషయాలలో లేబరు పక్షానికి కన్సర్వేటివు పక్షానికి తేడాలున్నమాట నిజమేగాని అపాటి తేడాలు ప్రజలకూ లేబరు ప్రభుత్వానికీ మధ్య లేకపోలేదు లేబరు పక్షంవారు అవలంబించిన ఆర్థిక విధానాలు ప్రజల పరిస్థితులను అభివృద్ధిపరచకపోగా, డివాల్యుయేషన్‌తో కార్మికుల వేతనాల కొనుగోలు శక్తి క్షీణించింది కూడాను లేబరు ప్రభుత్వంవారు అవలంబించిన ఆర్థిక విధానాల దుష్ఫలితాలు దాగవనే అనుమానంతోనే ఇంత తొందరపడి యెన్నికలు ఏర్పాటు చేశారనికూడా ఆరోపించబడింది దీనితోబాటే మరి రెండు ఆరోపణలుకూడా చేయబడ్డాయి ఒకటి, ఫిబ్రవరి ఆఖరువారంలో ఎన్నికలు ప్రకటించి లేబరు ప్రభుత్వంవారు ఫిబ్రవరి మొదటివారంలో కన్సర్వేటివు పార్టీ మహాసభ పడకుండా చేశారని, రెండు, బడ్జెటు సమావేశానికి ముందే యెన్నికలు జరిపి బడ్జెటుమీద ప్రజలకు కలిగే భారాలవల్ల ఎన్నికలలో తమకు అపకారం జరగకుండా చేసుకోవటానికి ప్రయత్నించారనీనూ!

ఎన్నికలు జరపటానికి లేబరు ప్రభుత్వం పడ్డతొందరచూస్తే ఆరోపణలలో యధార్థం ఉన్నట్టు స్పష్టమవుతుంది లేబరు పక్షంవారు తమ్ము తాము నమ్మలేని పక్షంలో ప్రజలు లేబరుపక్షాన్ని నమ్మవలసిన ఆగత్యంలేదు

ఒక విధంగా లేబరుపక్షం పదవిలో ఉండగానే అపజయం పొందింది ఇప్పుడు ఆ పక్షానికి యెన్నికలలో లభించిన విజయంకూడా కన్సర్వేటివు పక్షం యొక్క విజయమే అనాలి ఎందుచేతనంటే ప్రపంచాన్ని సంక్షోభపెట్టే రెండు సమస్యలనుగురించి లేబరుపక్షం విప్లవ యుతమైన మార్గాలు అనుసరించ లేకపోయింది మొదటిది ఆర్థికసమస్య, రెండవది శాంతి సమస్య

యుద్ధం అయిపోయిన నాటినుంచీ పెట్టుబడిదారీ దేశాలలోని ఆర్థిక వ్యవస్థలోని వైషమ్యం తీవ్రతరం కాసాగింది పెట్టుబడిదార్ల అధీనంలో ఉన్న ఉత్పత్తి యంత్రాలు నిరుద్యోగాన్ని పారదోల లేవనీ, వస్తువుల కొరతని నిర్మూలించలేవనీ, కృత్రిమ దారిద్ర్యాన్ని కలిగిస్తాయనీ తేలిపోయింది ఇది విస్పష్టంగా గుర్తించినంత వరకు లేబరు పక్షంవారు ప్రశంసార్హులే అందుచేతనే వారు 1945 ఎన్నికలలో ముఖ్యపరిశ్రమలను జాతీయం చేస్తామని వాగ్దానాలు చేసి ప్రభుత్వంలోకి వచ్చారు పెట్టుబడిదారీకి అనుబంధమైన సామ్రాజ్యాన్ని కూడా వదలటానికి వారు సంసిద్ధులైనారు కాని ఈ పద్ధతులను తీరా అమలు జరపటం ఆరంభించేసరికి ఎన్నికల వాగ్దానాలు బలవంతంగా చెల్లిస్తున్నట్లు ప్రవర్తించారు గాని, ఒక విస్పష్టమైన ఆదర్శం ఉన్నవాళ్ళులాగా కనపడలేదు ప్రపంచంలోని వివిధ దేశాలలో ప్రజల శక్తులను అణచటానికి జరిగే కుట్రలన్నిటిలోనూ బ్రిటిషు విదేశాంగ శాఖకు సంబంధమున్నది

బ్రిటిషు లేబరు ప్రభుత్వానికి నిజమైన ఆదర్శాలు లేవనీ, సామ్రాజ్యవాదులు అవలంబించ వలసిన రాజకీయపు కుట్రలనే ఈ ప్రభుత్వం అవలంబించిందనీ వేరే రుజువు చెయ్యనవసరం లేదు ఐక్యరాజ్యసమితిలో బ్రిటను ఏ సమస్యపై ఎవరెవరితో కలిసి వోటుచేసిందీ చూస్తే ఇది రుజువవుతుంది ఆఖరుకు జాతీయ చైనా ప్రతినిధిని గురించి కూడా బ్రిటను తటస్థంగా ఊరుకున్నది! బ్రిటను కమ్యూనిస్టు చైనాను గుర్తించ సిద్ధంగానే ఉన్నదిగాని, ఐక్యరాజ్యసమితిలో చైనా ప్రతినిధి ఎవ్వరన్న విషయమై బ్రిటనుకు ఎట్టి అభిప్రాయమూలేదు!

బ్రిటిష లేబరు ప్రభుత్వంవారు కామన్వెల్తు గురించి చాలా గొప్పగా చెప్పుకున్నారు ఈ కామన్వెల్తులో ఏ రెండు దేశాలకూ సంపూర్ణమైన సఖ్యం లేకపోగా కామన్వెల్తు దేశాలలోఉండే ప్రభుత్వాలు ఒకదానికొకటి పోలవు కామన్వెల్తు ప్రస్తుతం యుద్ధోన్మాదుల ప్రతినిధిగా ఉన్నది ఒక్క ఇండియా మినహాయిస్తే శాంతి కావాలని గట్టిగా అనేవాళ్లు కూడాలేరు ప్రపంచ శాంతికి ప్రాతిపదిక ఏమిటో ఇండియా కూడా చెప్పలేకుండా ఉన్నది

ఇటువంటి పరిస్థితులలో బ్రిటిష ప్రజలు ఎన్నికలలో లేబరూ, కన్సర్వేటివూ, ఒకటేననీ రుజువు చెయ్యటానికి ఇద్దరికీ సమంగా వోట్లిచ్చారు బ్రిటనులో ప్రజాస్వామికం ఒకేరంగు గల రెండు అసమర్థపు పక్షాలమధ్య పోటీగా తయారయింది

తెలుగుస్వతంత్ర వారపత్రిక 10-3-1950

# 5. ప్రొఫెసర్ జోలియో క్యూరీ

కిందటివారం ఫ్రెంచి ప్రభుత్వం ప్రొఫెసరు జోలియో క్యూరీని ఫ్రెంచి ఎటామిక్ ఎనర్జీ హై కమిషనరు పదవినుండి తొలగించింది ఆయన గొప్ప శాస్త్రజ్ఞుడు– గొప్ప అణు పరిశోధనలు చేసి భార్యాసమేతంగా నోబెల్ బహుమానం తెచ్చుకున్నాడు గొప్ప దేశ భక్తుడు–నాజీలు ఫ్రాన్సును ఆక్రమించిన కాలంలో ఫ్రాన్సునుంచి పారిపోవటానికి బదులు, రహస్య నిరోధకశక్తులతో కలిసి పనిచేస్తూ లండనుకు ఎన్నో రహస్యాలను అందచేశాడు కాని కమ్యూనిస్టు– "రష్యా మీద యుద్ధం సాగించేందుకు ఒక్క శాస్త్రరహస్యం కూడా అందించం", అన్నాడు అందుకని ప్రపంచంలోని గొప్ప అణుశాస్త్ర వేత్తలలో ఒకణ్ణి ఫ్రెంచిప్రభుత్వం అణుశక్తి పరిశోధనలు సాగించే ఉద్యోగంనుండి తొలగించింది ఫ్రాన్సు ప్రజాస్వామిక దేశం అమెరికా మరొక ప్రజాస్వామిక దేశం ప్రొఫెసరు జోలియో క్యూరీని ఆ పదవినుండి తొలగించినందుకు అమెరికా హర్షించింది

ఈ శాస్త్రజ్ఞుడి పై ఇతర ఆరోపణలు కూడా ఉన్నట్లు కిందటివారం వెలువడిన వార్తలవల్ల తెలుస్తున్నది ఈ ప్రొఫెసరుగారు స్టాలిన్ జన్మదినోత్సవాలప్పుడు మాస్కో వెళ్ళి మూడు వారాలపాటు సోవియెట్ శాస్త్రజ్ఞుల అతిథిగా ఉండివచ్చాడు అంతేగాక, ఇటీవల ఫ్రెంచి కమ్యూనిస్టుల మహాసభలో పాల్గొని వారు ప్రకటించిన కార్యక్రమాలతో పూర్తిగా ఏకీభవించాడు ఈ సంఘటనను గురించి ప్రపంచ మేధావులు నేర్చుకోదగిన దేమిటని ఆలోచించటం అనుచితం కాదు ఎందుచేతనంటే ఒక జగత్ప్రసిద్ధి గల శాస్త్రజ్ఞుడూ, ప్రపంచాన్ని ఉద్రూతలూగిస్తున్న రెండు రాజకీయ సిద్ధాంతాలూ, ఇందులో సంబంధం కలిగి ఉన్నాయి అమెరికా ప్రేరణ మీదనే– మార్షలు సహాయం బిగిస్తామని బెదిరించగా ఫ్రాన్సు జూలియో క్యూరీకి ఉద్వాసన చెప్పిందని అరోపణ కూడా జరిగింది

ముందుగా మనం ఒకటి ఒప్పుకోవాలి ఎంతటి మహానుభావుడైనా దేశ ద్రోహానికి పూనుకున్న వాణ్ణి ప్రభుత్వం సహించరాదు జోలియో క్యూరీ మీది ఆరోపణలలో అటువంటిది ఉన్నట్టు కనపడదు ఆయన కమ్యూనిస్టు కావటం ఒక కొత్త నేరం కాదు ఎందుకంటే

1942 నుంచీ ఆయన కమ్యూనిస్టు పార్టీ సభ్యుడే ఫ్రాన్సుకు సంబంధించిన రహస్య వార్తలను యుద్ధకాలంలో బ్రిటనుకు అందించిన నాటికీ ఆయన కమ్యూనిస్టే 1945లో ఎటామిక్ ఎనర్జీ హైకమీషనరుగా నియమించబడ్డ నాటికీ కమ్యూనిస్టే కాగా ఈయన మాస్కోలో మూడు వారాలపాటు సోవియెట్ శాస్త్రవేత్తల అతిథిగా ఉండటం ఒక నేరంగా భావించబడినట్టున్నది అట్లా అయితే రష్యామీద యుద్ధానికి పనికివచ్చే రహస్యాలను బయటపెట్టమని చెప్పటంకూడా ద్రోహమే కాని దీనినిబట్టి ఫ్రాన్సు రష్యాను శత్రు దేశంగా భావిస్తున్నట్టూ, రష్యాపై యుద్ధం తలపెడుతున్నట్టూ విదిత మవుతున్నది

ప్రస్తుతం ఈ మాట అంటున్నది కమ్యూనిస్టులూ, కమ్యూనిస్టు దేశాలవారూ మాత్రమే 'ప్రజాస్వామిక' దేశాలవారు– నిజం ఏమయినప్పటికీ–పైకి, రష్యాయే ప్రపంచాన్ని జయించ ప్రయత్నిస్తున్నదనీ, రష్యానుంచి పెట్టుబడిదారీ 'ప్రజాస్వామిక' దేశాలకు ముప్పున్నదనీ, ఈ 'ప్రజాస్వామిక' దేశాలు ప్రజల నోట దుమ్ముకొట్టి భారీ మొత్తాలను ఆయుధాల కింద వినియోగించడం 'రక్షణ' నిమిత్తమనీ, అట్లాంటిక్ ఒడంబడిక కేవలం రక్షణ ఒడంబడిక అనీ, అమెరికా మారణాస్త్రాలు తయారుచేస్తున్నది ఈ దేశాల 'రక్షణ' నిమిత్తమేననీ, అమెరికా అడ్డమైన దేశాలన్నిటిలోనూ వివిధ యుద్ధ స్థావరాలు ఏర్పాటు చేసుకుంటున్నది కూడా 'రక్షణ' నిమిత్తమేననీ చెబుతున్నారు

ఇదంతా అసత్యమనీ, రష్యాచేసే ప్రచారంలోనే నిజం ఉండవచ్చుననీ ప్రపంచ ప్రజలు అనుమానించడానికి ఫ్రాన్సు తీసుకున్న ఈ చర్యగొప్ప అవకాశం కలిగించింది ఎందుచేతనంటే, ఫ్రెంచి అణుశక్తి కమిషనుయొక్క ఆశయం ఫ్రాన్సు రక్షణేఅయితే దానికి ఈ కమ్యూనిస్టు ప్రొఫెసరు సాయపడడనటానికి ఎట్టిఆధారమూలేదు, ఒకప్పుడు ఫ్రాన్సును నియంతృత్వంనుంచి రక్షించటానికిగాను అపార కృషిచేసి ఉన్నాడు

ఈయన మాస్కోలో మూడువారాలపాటు సోవియట్ శాస్త్రజ్ఞులకు అతిథిగా ఉండడంవల్ల ఉంటే ఫ్రాన్సుకు లాభం ఉంటుంది గాని నష్టం లేదు, ఫ్రాన్సు కోరేది ఆత్మరక్షణే అయితే ఏమంటే, సోవియట్ శాస్త్రవేత్తలు తమకు తెలిసిన అణురహస్యాలు ఈయనకు చెప్పే అవకాశం ఉన్నది అణుశాస్త్రం రష్యాకున్నది, ఫ్రాన్సుకింకాలేదు ఆ కారణంచేత సోవియటు శాస్త్రజ్ఞులకు జోలియోక్యూరీ ఎరగని అణు సంబంధమైన విషయాలు తెలిపే అవకాశం ఉంది ఆ రహస్యాలు జోలియోక్యూరీకి ఒక వేళ సోవియట్ శాస్త్రవేత్తలు తెలుపకపోతే ఫ్రాన్సుకు నష్టం ఉండదు, తెలిపి ఉన్నట్టయితే ఫ్రాన్సు రక్షణకు అవి ఉపకరించే అవకాశం ఉన్నది కాని ఈ విషయంలో ఫ్రెంచి అధికారులు ఏమీ శ్రద్ధ చూపలేదు కారణం ఫ్రాన్సుకు ఎవరినుంచీ ప్రమాదంలేదని వాళ్లెరుగుదురు ఫ్రాన్సుకు కావలసింది అమెరికా ప్రాపకం అమెరికాకు కావలిసింది ప్రపంచయుద్ధం ద్వారా ప్రపంచాధిపత్యం

యుద్ధోన్మాదులను అరికట్టమని ప్రపంచ ప్రజలకు కమ్యూనిస్టురాజ్యాలు చేసే హెచ్చరికను అమెరికా, బ్రిటను, ఫ్రాన్సు వగైరా దేశాలు చేసే చర్యలు వాస్తవంచేస్తున్నాయి గాని అసత్యం చెయ్యలేకుండా ఉన్నాయి

ఒకవంక రష్యాసాగించే 'పెట్టుబడి దారీ ప్రజాస్వామ్య వ్యతిరేక ప్రచారం' లోని వాస్తవం ఈ విధంగా బయటబడుతుంటే, మరొక వంక ఇదే పెట్టుబడిగారీ ప్రజాస్వామిక దేశాల 'కమ్యూనిస్టు వ్యతిరేక చర్యలు' వెర్రితలలు వేస్తున్నాయి అమెరికాలో కమ్యూనిస్టు విచారణలు 'వైట్ హౌస్'లోకి చొచ్చుకు పోయాయి ట్రూమన్, డీన్ ఆచిసన్, జెసప్ మొదలైనవాళ్లు కూడా కమ్యూనిస్టు అనుమానితుల జాబితాలోకి క్రమంగా ఎక్కుతున్నారు ఈవిచారణలకు తలా తోకా ఉండటంలేదు డీన్ ఆచిసన్ వంటి బాధ్యత గలవారే నీలివార్తల ప్రచారానికి దిగవలసిన ఖర్మం పట్టింది ఈ పెద్దమనిషి కొద్ది రోజుల క్రితం మే మాసంలో బెర్లినులో రష్యాకూ పశ్చిమ రాజ్యాలకూ టాంకులతోనూ, ఫిరంగులతోనూ యుద్ధం వస్తుందని జోస్యం చెప్పాడు ఈ జోస్యాన్ని బెర్లినులోని ఫ్రెంచి అధికారులు వెటకారం చేశారు

ఈ యేడు లండనులో మే దినోత్సవాలు నిషేధించబడ్డాయి

విక్టోరియాలో కమ్యూనిస్టుల రహస్యాలను ఆరా తీయటానికి పెద్ద రాయల్ కమీషన్ ఏర్పాటు చేస్తే వారు చాలా నెలలు కృషి చేసి వాల్మీకి రామాయణ మంత రిపోర్టు తయారుచేసి కమ్యూనిస్టులు బాహాటంగా చెబుతున్న విషయాలనే నివేదించినట్టు వార్తలు చదవగా తెలుస్తున్నదిః 'కమ్యూనిస్టులు సమ్మెలు సాగిస్తున్నారు శ్రామికుల స్థితి బాగుపడటానికి ఈ పని చేస్తున్నామంటున్నారు 1943 తరవాత వారికి పైనుంచి ఉత్తరువులు వస్తున్నట్టుగాని, డబ్బువస్తున్నట్టు గాని ఏమీ సాక్ష్యంలేదు వాళ్లు పెట్టుబడిదారీ వ్యవస్థను కూలదోసి కమ్యూనిజం స్థాపించటం తమలక్ష్యంగా పెట్టుకున్నారు' -ఇదీ రాయల్ కమిషను నివేదిక సారాంశం ఈ నివేదిక సాధించటానికి కాణీఖర్చు చేసినా ప్రజల సొత్తు వృథాచెయ్యటమే

"ప్రజాస్వామిక" దేశాలని చెప్పుకుంటూ, రష్యా మొదలైన దేశాలపై యుద్ధానికి బాహాటంగా ప్రయత్నాలు సాగించి ప్రజలకు ఉపయోగించవలసిన ధనాన్ని ధారపోస్తూ, కమ్యూనిస్టు వ్యతిరేక చర్యల పేర హాస్యాస్పదమైన విధానాలు అవలంబిస్తూ, ఈ హేయమైన నాటకాన్ని పెట్టుబడిదారీ దేశాలు ఎంతకాలం ఆడతాయో, ప్రజలకు కమ్యూనిజం పట్ల నానాటికీ హెచ్చిపోయే అభిమానాన్ని తమవైపు మళ్ళించుకొనటానికి ప్రయత్నాలెప్పుడు ప్రారంభిస్తాయో తెలియదు పెట్టుబడిదారీ వ్యవస్థలో నిజంగా ప్రజాక్షేమానికి తావే లేనిపక్షాన ఆ సంగతి ప్రజలు ఎంత తొందరగా గ్రహించితే అంత మంచిది పెట్టుబడిదారీ ప్రజాస్వామికంలో ప్రజల ఒభ్యుదయానికి తావున్నట్టయితే దాన్ని గురించి కూడా ప్రజలకు్ఎంత త్వరగా నిదర్శనం చూపితే అంతమంచిది

తెలుగు స్వతంత్ర, 5-5-1950

# 6. ఆశియా దేశాలు: యూరప్ రాజకీయాలు

లండనులో బ్రిటిషు, అమెరికను, ఫ్రెంచి దేశాల విదేశీయ శాఖాధిపతులు సమావేశం కాబోతున్నారు ఇది చాలా ముఖ్యమైన సమావేశం దీనికని బయలుదేరుతూ అమెరికా ప్రభుత్వ శాఖా కార్యదర్శి డీన్ ఆచిసన్ వాషింగ్టనులో ఒక ప్రకటన చేశాడు యావత్ప్రపంచ కమ్యూనిస్టు ప్రమాదాన్ని "స్వతంత్ర" దేశాలు ఎదుర్కో గలందుకై "పశ్చిమ" రాజ్యాలవారు తమ రాజకీయ, ఆర్థిక, సైనిక విధానాలను కూడగట్టుకోవాలని ఆయన అన్నాడు యావత్ప్రపంచం, స్వతంత్ర దేశాలూ, పశ్చిమరాజ్యాలూ వెరశి మూడు వర్గాలయాయి అప్పటికే పశ్చిమ రాజ్యాల నాయకత్వం కింద స్వతంత్ర దేశాలన్నిటినీ నడిపించి, ప్రపంచాన్ని ఉద్ధరించటం– ముఖ్యంగా కమ్యూనిస్టు ప్రమాదం నుంచి ఉద్ధరించటం– డీన్ ఆచిసన్, షుమాన్, బెవిన్‌ల అంతర్జాతీయ కార్యక్రమం

ఇదే సమయంలో ఈ అగ్రనాయకులు అట్లాంటికు "రక్షణ" ఒడంబడికను బలపరచటంలో నిమగ్నులై ఉన్నారు రష్యా, తూర్పు యూరపు, చైనా దేశాలు "స్వతంత్ర" దేశాలమీదికి దండెత్తిపోతే ఈఒడంబడిక మూజువాణీగా ఉంటుంది ప్రత్యక్షంగా కమ్యూనిస్టు అయిపోయిన రష్యా, చైనాలను ఉద్ధరించే అవకాశం పశ్చిమరాజ్యాల కుండదు పోతే కమ్యూనిస్టు గాలిసోకిన దేశాలను ఉద్ధరించే కార్యక్రమం ఉంటుంది ప్రస్తుతం అదే అమలుజరుగుతున్నది ఆసియా దేశాలన్నీ ఈ జాబితాలోవే చైనా ఒకటి "చికిత్స"కు తిరగబడి తప్పించుకు పోయింది అనేక దేశాలప్పుడే చైనాను రష్యాతో జమకట్టి దాన్ని కూడా ఒక "స్వతంత్ర" రాజ్యంగా గుర్తించాయి

కమ్యూనిస్టు 'వ్యాధి' తీవ్రంగా ఉన్న దేశాలు ఇండోచైనా, మలయా, బర్మా మొదలైనవి ఇండియా, పాకిస్తాను, సింహళాలలో ఈ ప్రమాదం అంతగా లేదు

ఇండోచైనాను రక్షించే భారం ఫ్రాన్సూ, మలయాను రక్షించే భారం బ్రిటనూ, బర్మాను రక్షించే భారం బర్మా పంచుకున్నాయి వీటిలో ఫ్రాన్సు పనే నగుబాట్లుగా ఉంది ఫ్రాన్సు ఇండోచైనా ప్రజలమీద యుద్ధం సాగిస్తున్నదనే ముక్క అందరికీ తెలుసునుగాని ఏసిద్ధాంతం మీద ఫ్రాన్సు పనిచేస్తున్నదో ఎవరికీ స్పష్టంగా తెలీదు

'నువు ఈ బావోడైని ఎందుకు తెచ్చి పెట్టావు? ఇదే నీ చిక్కు లన్నిటికీ అనర్థమయింది నేను చూడు ఇండియా, బర్మాల జాతీయోద్యమాలను ఎట్లా గౌరవించి కమ్యూనిస్టు సమస్య లేకుండా చేశానో? నువు నీ బలాన్ని తీసుకుపోయి ఇండో చైనాలో మీదుగట్టి కూచుంటివి దీని మూలంగా అసలే బలహీనంగా ఉన్న పశ్చిమ యూరపు రక్షణ బలాలు మరింత బలహీనమై పోయాయి అందుచేతనే మనం ఘాటైన అట్లాంటికు విధానం అనుసరించలేకుండా ఉంటిమి' అని బ్రిటను ఫ్రాన్సును ఎత్తి పొడవచ్చు

కాని, పాపం, ఫ్రాన్సు ఏం చెయ్యాలి? బ్రిటను కమ్యూనిస్టులను నిరోధించే జాతీయ వాదులకు స్వాతంత్ర్యాన్ని ఇచ్చి కూర్చున్నది కాని ఫ్రాన్సుకా అవకాశం లేదు ఇండోచైనా జాతీయోద్యమనాయకుడు డాక్టర్ హోచిమిన్ కమ్యూనిస్టు అయి కూచున్నాడు బావోడైని

పెట్టటం ఎంత అవివేకమైన పని అయినా దాని ద్వారా ఫ్రాన్సు ఒకటి రుజువు చేసింది– ఇండోచైనా జాతీయవాదం కమ్యూనిజం నుంచి ఊడిరాదని, ఇండియాలో కాంగ్రెసు పాకిస్తానులో ముస్లింలీగూ 1946 నాటికి కమ్యూనిస్టులై ఉంటే బ్రిటనుగతి ఏమై ఉండును?

ప్రత్యక్షంగా చైనాలో అమెరికా గతి ఏమయింది? చైనా జాతీయోద్యమానికి పితామహు డనదగిన జంగ్‌కైషేక్‌ను అమెరికా తన వశం చేసుకుని, కమ్యూనిస్టులను అణచటానికిగాను ఆయనమీద కోట్లకు కోట్లు కుమ్మరించింది ఈ ఏర్పాటు జరిగిన క్షణంనుంచీ జంగ్ కైషేక్ జాతీయోద్యమానికి స్వస్తిచెప్పేశాడు అమెరికనులు కోమింటాంగును చైనా జాతీయవాదులని పేరుపెడితే అది సార్ధక నామం కాలేదు జాతీయోద్యమాన్ని నడిపే ఘనతను యం యన్ రాయి, లూయిఫిషర్ మొదలైన రాజకీయ వేత్తలు కమ్యూనిస్టులకు అంటగట్టారు మార్క్సిస్టు సూత్రాలను విసర్జించని రష్యాతో ఇంకా సోషలిస్టుదశకి చేరుకోని చైనా 30 ఏళ్ళ ఒడంబడిక చేసుకుంది అమెరికా నాయకత్వంగల, పశ్చిమ రాజ్యాల కుమ్మక్కుగల 'స్వతంత్ర' దేశాలకు రష్యా చైనాలలో ఉన్నది మార్క్సిజమా అని పట్టలేదు అది కమ్యూనిజం కాదన్నా కూడా వారికి తృప్తిలేదు వాళ్ళకు కావలసిందల్లా ఈ కమ్యూనిస్టు దేశాలలో పెట్టుబడిదార్ల పెత్తనం లేదు, పెట్టుబడిదారీ విధానం అంతకన్నాలేదు కావలిస్తే రష్యా చైనాలలో ఉన్నది 'సామ్రాజ్య'వాదమని అనటానికి కూడా వాళ్ళు సిద్ధంగా ఉన్నారు కాని ఈ సామ్రాజ్యవాదాన్ని పెట్టుబడిదారీ వ్యతిరేకులు వ్యాప్తిచెయ్యటం వారికి యిష్టంలేదు

బ్రిటను ఫ్రాన్సును ఇండోచైనా విషయంలో నిందించవచ్చు కాని మలయా విషయంలో బ్రిటను ఏం సంజాయిషీ చెప్పుకొంటుంది "నేను మలయాలోనుంచి, నూరారయేది ఆరు నూరయేది, తొలగిపోను మలయాకు స్వాతంత్ర్యార్హత వచ్చేవరకూ అక్కడే ఉంటాను మలయాను ఉద్ధరించటానికి నేను సాగించిన పని విజయవంతంగా ఒక దరిచేర్చి తీరుతాను మలయా స్వాతంత్ర్యార్హం కావటానికి 10, 20 ఏళ్ళు పట్టవచ్చు" అంటున్నది బ్రిటను ఈ మాటలు విని మలయా స్వాతంత్ర్య కాముకులంతా ఆనందంతో వెల్లికిల పడతారని బ్రిటను విశ్వాసమై వుండాలి

ఆచిసన్, షుమాన్, బెవిన్‌లు లండనులో సమావేశమై ప్రపంచ రాజకీయాలకు తక్కువ మాట్లాడరని "డెయిలీ హెరాల్డ్" రాజకీయ విలేఖరి రాశాడు

కాని ఈ వార్త విని ఆసియాదేశాలు హర్షించడానికి లేదు ఎందుకంటే ఈ "పశ్చిమ" "స్వతంత్ర" రాజ్యాలు అనేక కారణాల వల్ల ఆసియాను ఆకర్షించలేవు

1 ఆసియా జాతీయోద్యమాల పట్ల ఈ దేశాలకు నిజమైన అభిమానం లేదు

2 ఆసియా ఆర్ధికంగా వెనకబడి ఉండటం వీటికి చాలా లాభం

3 ఈ దేశాలు ఆర్ధికంగా తమలో తాము బిచ్చగాళ్ళలాగా కీచులాడుకుంటూ, ఆసియా దేశాలవిషయం మాట్లాడినప్పుడు "స్వాతంత్ర్య" మనీ, "కమ్యూనిస్టు" ప్రమాదమనీ సిద్ధాంతాలు చెబుతారు (ఇండో చైనాలో కమ్యూనిజం విజయం పొందితే ఆగ్నేయాసియాను ఊడ్చిపెట్టేస్తుందట ఇది అర్థంలేనిమాట ప్రతిదేశంలోనూ కమ్యూనిస్టు ఉద్యమా లున్నాయి బ్రిటను, అమెరికా, ఫ్రాన్సులు కమ్యూనిజమును ఎదుర్కొంటున్నాయి ఏయే దేశాలలో జాతీయశక్తులూ, ప్రజాశక్తులూ కమ్యూనిజం వేపు మొగ్గితే ఆ దేశాలలో అది పైచెయ్యి

ఆవుతున్నది అంతేగాని కమ్యూనిస్టులు వెనకటి పిండారీల్లాగా దేశాన్ని తుడుచిపెట్టుకు రావటం లేదు ఆర్థికంగా వెనకబడిన దేశాలు మరింతగా కమ్యూనిజమును ఆశ్రయిస్తున్నాయి ఆ విధంగా పశ్చిమ రాజ్యాలవారి కాలుసోకిన చోట్లనే కమ్యూనిజం పైచెయ్యి అవుతున్నది వాళ్లు ఉపేక్షించిన దేశాలలో కమ్యూనిజం తీవ్రం కావటంలేదు )

4 ప్రపంచ ప్రజలకు యుద్ధం అక్కర్లేదని పశ్చిమరాజ్య నాయకులు సరిగా తెలుసుకోవటం లేదు ఆసియా ప్రజలు మరింత యుద్ధవిముఖులు వీరికి తెల్లవాళ్ళమీద ఆవగింజంత విశ్వాసం లేదు వాళ్ళకోసం జరిగే యుద్ధాలను అసలే సహించరు పశ్చిమ రాజ్యాల వారు తమ యుద్ధ యత్నాలను "రక్షణ" యత్నాలన్నంత మాత్రాన వీరి శాంతి కాముకత్వాన్ని ఎవరూ విశ్వసించరు అక్కడక్కడ ఇంకా సామ్రాజ్యవాదాన్ని అమలు చేస్తూనే సోషలిస్టు మతం పుచ్చుకుని కార్మికుల స్వర్గం నిర్మించిన బ్రిటిషు లేబరుప్రభుత్వం వారు బ్రిటిషు కార్మికులమీద తమ అభిమానం చూపడానికాబోలు మే 7న లండనులో మేదినోత్సవాలు నిషేధించారు అంతకు పూర్వం ఫాసిస్టు మోస్లే ప్రదర్శనలు నిషేధించటానికి అమలు చేసిన ఉత్తరువును బ్రిటిషు కార్మికుల నిమిత్తం విస్తరించారు 'శాంతి కావాలి' 'యుద్ధోన్మాదులను అణచండి' అంటూ కార్మికులు బేనర్లు పట్టుకుని ఊరేగింపు బయలుదేరితే, 'సోషలిస్టు' బ్రిటిషు పోలీసులు ఆ బేనర్లు లాక్కుని చించి పారేసి, కర్రలను విరిచేశారు

ఇటువంటి పరిస్థితిలో పశ్చిమ రాజ్యాలు ప్రపంచాన్ని 'ఉద్ధరించే' పనినుండి విరమించుకుని తాము ప్రపంచానికి ఏయే మేళ్ళు చేయదలిచారో ఆ మేళ్ళు తమదేశాలకే చేకూరేలాగు చేస్తే మంచిది అమెరికా, బ్రిటనులలో, ప్రజాస్వామికం అమలు జరుగుతున్న దన్నసంగతి ఆ రోజు కారోజు శంకించ వలసి వస్తున్నది ఎందుకంటే నిన్నకాక మొన్న ఎన్నికలలో గెలిచిన బ్రిటిషు లేబరు పక్షమూ, అమెరికను డెమోక్రాటికు పక్షమూ ప్రతి పక్షుల చేతిలో చచ్చే దెబ్బలు తింటున్నాయి అమెరికాస్టేటు డిపార్టుమెంటులో ఒకవంక రిపబ్లికనులు దొడ్డిదారిన జొరబడుతున్నారు, మరో దారిన మెకార్థర్ వంటి రిపబ్లికనులు స్టేటు డిపార్టుమెంటును రొచ్చులోకి ఈడ్చేస్తున్నారు అట్లాగే బ్రిటనులో ఒకవంక కన్సర్వేటివులు ప్రభుత్వాన్ని మూడేసి చెరువుల నీళ్ళు తాగిస్తూనే ఉన్నారు ఇంకొకవంక మే దినోత్సవాన కార్మికులు ఊరేగరాని రోజున- ఫాసిస్టుమోస్లే* బహిరంగ సభలో ఉపన్యసించాడు అతన్ని ఎవరూ ఏమీ చెయ్యకుండా కాబోలు 200 మంది 'సోషలిస్టు' పోలీసులు అక్కడ ఉంచబడ్డారు వాళ్ళు సభమీద గుర్రాలను తోలలేదు, ఫాసిస్టు మోస్లీ నినాదాలను చించి చెండాడనూలేదు

ఈ బ్రిటను అమెరికాకు పక్క తాళం వేస్తూ ఆసియా దేశాలకు స్వాతంత్ర్యమూ, అభ్యుదయమూ చేకూర్చుతుందంటే ఆసియాలో ఎవరూ నమ్మరు ఇండియా మొదలైన దేశాలు ఆహారంకోసం అలమటిస్తుండగా అమెరికా ఆహార పదార్థాలు కిరసనాయలు పోసి తగలబెడుతున్న సంగతి ఆసియాలో అందరికీ తెలుసు

తెలుగుస్వతంత్ర, వారపత్రిక 12-5-1950

---

* మోస్లే (1886-1980) బ్రిటిష్ రాజకీయవేత్త బ్రిటిష్ యూనియన్ ఆఫ్ ఫాసిస్ట్ స్థాపకుడు

# 7. శాంతిప్రసంగాలు

ఈ మధ్య పండిత జవహర్‌లాల్ నెహ్రూ ఐక్యరాజ్య విద్యార్థుల సమావేశానికి అంకురార్పణ చేస్తూ ప్రపంచ శాంతి విషయం కొంత ప్రస్తావన చేశాడు అందులో కొంత భాగము ఆయన శాంతికాముకత్వాన్ని ప్రశంసనీయంగా చాటుతూ ఉన్నది గాని మిగిలినది ఆకుకు అందకుండా, పోకకు పొందకుండా ఉంది

యుద్ధం వస్తుందో రాదో చెప్పలేను రాదని నా ఆశ యుద్ధమే వస్తే ప్రజలు తల్లడిల్లిపోతారు యుద్ధంలో గెలిచేవాళ్ళతో సహా అంతులేని బాధలకు లోనవుతారు ఏ ఆర్థిక, సాంఘిక సిద్ధాంతాలు సమస్యలను పరిష్కరించగలవో అవే చివరకు నిలబడతాయి మిగిలినవన్నీ తుడిచిపెట్టుకపోతాయి చివరికి నెగ్గేది ఒక ఆర్థిక, తాత్విక సిద్ధాంతానికి అనుగుణంగా ఉండే వ్యవస్థ కాదు సమస్యలను పరిష్కరించే వ్యవస్థే, అన్నాడు నెహ్రూ

ఇందులో నెహ్రూ శాంతి కాముకత్వం – కనీసం యుద్ధ విముఖత్వం– కనిపిస్తుంది కాని నిజమైన శాంతి కాముకులకు ఈ మాటలు ఇవ్వదగిన ధైర్యాన్ని ఇవ్వవు యుద్ధం వల్ల కలిగే ప్రమాదాన్ని ఇంతస్పష్టంగా చెప్పే నెహ్రూ యుద్ధం గురించి ఇంత తటస్థంగా ఎందుకు మాట్లాడుతాడు? యుద్ధానికి ప్రేరకు లెవరో, యుద్ధం వల్ల ఎవరి పబ్బం గడుస్తుందో, ఎవరు శాంతి కోరుతున్నారో, ఎవరు యదార్థమైన శాంతి ఉద్యమం నడుపుతున్నారో, యుద్ధోద్ధతి శక్తులూ, యుద్ధవ్యతిరేక శక్తులూ ఏయే ప్రమాణాలలో ఉన్నాయో, యింత భయంకరమైన యుద్ధం రాకుండా చెయ్యాలంటే మామూలు మనుష్య మాత్రులు– వేదికలపై ఉపన్యసించలేని వాళ్ళు ఏం చెయ్యాలో నెహ్రూ చెప్పడేం? అనిపిస్తుంది

ఇదిచాలా అవసరం దీనికి చాలా కారణాలున్నాయి

1 'అనుకోడాలు పనికిరోవోయ్ బావా' అని గిరీశం చెప్పనే చెప్పాడు అందుచేత 'యుద్ధం అతిహేయమైనది ఓ శాంతి శ్శాంతి శ్శాంతిః' అని అనుకుంటే శాంతి రాదు ఒకవరస యుద్ధాతురులు ప్రపంచాన్ని నిర్మూలించటానికి కోట్లకుకోట్లు వ్యయం చేస్తున్నారు అంతర్జాతీయ కుట్రలు పన్నుతున్నారు ప్రపంచ ప్రజలకు మతి పోయేటట్లు యుద్ధ జ్వరమూ, యుద్ధ భీతీ, అసత్య ప్రచారాలూ, కుళ్లు రాజకీయాలూ, సాగిస్తున్నారు ఈ యుద్ధ యత్నానికి అసంఖ్యాక ప్రజల జీవన ప్రమాణాలనూ, యోగక్షేమాలనూ, అభ్యుదయాన్నీ, ప్రాణాలనూ, రక్తాన్నీ బలిచేస్తున్నారు చేయనున్నారు ఇది బ్రహ్మాండమైన కృషి, దీన్ని శుష్క కోరికలు అడ్డలేవు బ్రహ్మాస్త్రాన్ని పిచ్చుక ఎక్కడైనా అడ్డుతుందా?

2 సామాన్య ప్రజలకు అంతర్జాతీయ వ్యవహారాలు అంతుబట్టవు నిజంగా యుద్ధ ప్రేరేపకులెవరో, ఎవరి రాజకీయ ఆశయాలు యుద్ధానికి సుముఖంగా ఉన్నాయో, ఎవరి రాజకీయ భవితవ్యం శాంతిపై ఆధారపడిఉందో వాళ్ళకు స్పష్టంగా తెలియదు వాళ్ళకు తెలిసిందల్లా రష్యా, అమెరికాలు రెండూ అమిత శక్తివంతంగా ఉన్నవనీ, యుద్ధం వస్తే ఈ రెంటికీ మధ్యే వస్తుందనీను కేవలం ప్రచారమే చూస్తే రష్యా ప్రపంచాన్ని మింగజూస్తున్నదని, అమెరికా ఆలోచించటం కనిపిస్తున్నది అమెరికా ప్రపంచాన్ని మింగజూస్తున్నదని రష్యా

అనటం కూడ కనిపిస్తున్నది ఇందులో ఏది నిజం? రెండూ నిజమేనని నమ్మేవారున్నారు వెనక తన అంతర్జాతీయ వైఖరిని వివరిస్తూ నెహ్రూ 'మేము ఏ పక్షానికి చెందం' అని ఉండటం ఇటువంటి వారి విశ్వాసాన్ని బలపరుస్తున్నది నిజంగానే రష్యా అమెరికాలు రెండూ యుద్ధానికి ఆయత్తమవుతూ, దాదాపు సగం ప్రపంచం రష్యా వేపూ, మిగిలిన సగం ప్రపంచం అమెరికావేపూ అయితే, ఆయుద్ధాన్ని ఆపగల నాధుడెవడు? నెహ్రూ మూడోపక్షం ఆయుద్ధాన్ని ఒక్కగంట వాయిదా వేయటానికి తీసుకోగల చర్య ఏమిటి? ఈ సంగతి నెహ్రూ స్పష్టం చెయ్యవలసిన అవసరం ఉంది

3 ఈ నాడు ప్రపంచంలో అచ్చంగా యుద్ధయత్నాలే జరగటం లేదు శాంతి యత్నాలు కూడా సాగుతున్నాయి దేశీయాదాయంలో నూరింట 70 పాళ్ళకు పైగా 'రక్షణ ఖర్చు' చేస్తూ అడగని వాడిది పాపంగా ఆయుధాలందజేస్తున్న అమెరికా కూడా రష్యా ఏక్షణాన అయినా పడటానికి సిద్ధంగా ఉన్నదనే 'బూచి' చూపెడుతూనే ఉందిగాని బహిరంగంగా 'మేం ప్రపంచాన్ని కమ్యూనిజం విపత్తునుంచి రక్షించటానికి యుద్ధవిపత్తులో ముంచెత్తుతాం' అనటం లేదు కొద్దిమంది యుద్ధాతురులైన అమెరికా, కెనడా రాజకీయవేత్తలు మినహాయిస్తే మిగిలిన వాళ్లు ప్రజల యుద్ధ విముఖత్వానికి తల ఒగ్గుతూనే ఉన్నారు ఆ కొద్దిమంది మాత్రం 'ఇంకా చూస్తారెందుకు? రష్యా చెయ్యి కదిపేలోపుగా చితక బొడుద్దాం' అని అరుస్తున్నారు

మరోవంక రష్యా తీవ్రమైన శాంతి ప్రచారం సాగిస్తున్నది ఈ ప్రచారం వృధాపోవటం లేదు అనేకదేశాలలో శాంతి ప్రమాణాలపై కోట్లాది ప్రజలు సంతకాలు చేస్తున్నారు కార్మికులు అమెరికాలో ఆయుధాలు ఎక్కించటానికి, దించటానికి మొరాయిస్తున్నారు సత్యాగ్రహం చేస్తున్నారు వారిని మభ్యపెట్టడానికి ఆయుధాల పెట్టెలు అరటి పళ్ళ పెట్టెలని కూడా "శాంతి కాముకు"లైన అమెరికా మంత్రులు అసత్యాలు చెప్పవలసి వస్తున్నది కొద్దిరోజుల క్రితం అమెరికాలో ఒక ఆయుధ నౌక అంటుకున్న సంగతి గురించి మాట్లాడుతూ నెహ్రూ పత్రికా ప్రతినిధులతో గోష్టిలో 'ఆయుధ రవాణాలను గురించి అతిగా ప్రసంగించటం ప్రజలను ఆందోళన పరుస్తుంది' అనికూడ అన్నారు

పై కారణాలన్నింటినీ చూస్తే నెహ్రూ యుద్ధం గురించీ, యుద్ధ కారణాలను గురించీ, యుద్ధ నివారణోపాయాలను గురించీ వివరంగా మాట్లాడి ఉండటం చాలా లాభించేదని స్పష్ట మవుతున్నది, నెహ్రూ 'వీధిలో మనిషి' కాడు ఆయనకు అన్ని దేశాలలోనూ రాయబారులున్నారు ఆయనకు అంతర్జాతీయ ధోరణులు తెలుసును ఆయన ?' వీధిలో మనుషు'ల్లాగ వార్తలకు కేవలం రాయిటరు మీదా ప్రెస్‌ట్రస్టు మీదా ఆధారపడనవసరం లేదు పైకి శాంతి సంతకాలు చేస్తూ నిజంగా యుద్ధానికి సకల సన్నాహాలు చేస్తున్నదీ ప్రపంచ యుద్ధం ద్వారా తప్ప తన ఆర్థిక రాజకీయ సమస్యలను పరిష్కారం చేసుకోలేని స్థితిలో ఉన్నదీ రష్యాయేనని తోస్తే ఆ విషయాన్నిబయట పెట్టి నెహ్రూ ఇండియాలోని శ్రామిక వర్గానికీ, శాంతికాముక ప్రజానీకానికీ ఎంతో పెద్దమేలు చేకూర్చిన వాడు కావచ్చు ఒకవేళ అమెరికాయే యుద్ధపీడ తెచ్చి పెట్టి ఉన్నట్లయితే ఆ విషయాన్ని బయట పెట్టి కూడా నెహ్రూ శాంతియత్నాలకు సహాయం చేసియుండవచ్చు

ఆయన ఏదీ చెయ్యకపోవటంలో రాజకీయ 'డిప్లోమసీ' కనిపిస్తున్నదేమోగాని యథార్థమైన శాంతి కాముకత్వం కనిపించటం లేదు  అయితే 'డిప్లోమసీ' లో ఉన్న చిక్కేమిటంటే సిగ్గుపడే జవరాలి మౌనంలాగా ఈ 'డిప్లోమసీ తన అంతరార్థాన్ని తానే బయట పెట్టుకుంటూ ఉంటుంది

నెహ్రూ 'డిప్లోమసీ' ద్వారా నిజం గ్రహించలేని బుద్ధిమంతులు ఎక్కువమంది ఉంటారా?

తెలుగు స్వతంత్ర, 26-5-1950

# 8. "శాంతిప్రసంగాలు" ప్రతి విమర్శ

'తెలుగు స్వతంత్ర' మే 26 పై శీర్షిక కింద నేను రాసిన వ్యాసాన్ని వివరిస్తూ 'సత్యాన్వేషి' జూన్ 9 సంచికలో కొన్ని అభిప్రాయాలు వెలిబుచ్చారు  ముందుగానే 'రచయిత (నేను) శాంతి ప్రచారం చేస్తున్నారా లేక ఒక పక్షానికి అనుకూల ప్రచారం చేసి పెడుతున్నారా' అనే సందేహం వెలిబుచ్చారు  'సత్యాన్వేషి' లాగానే నాకు కూడా కావలసింది సత్యమేగాని ఒకరికి ప్రచారం చేసి పెట్టవలసిన అగత్యం నాకేమి లేదని మనవి చేస్తున్నాను  అయితే నేను రష్యా శాంతి కోరుతున్నదని నమ్ముతున్నాను, 'సత్యాన్వేషి' అది నమ్మటం లేదు

నెహ్రూ శాంతి కాముకత్వం చూపారు గాని శాంతి మార్గాలు వివరించ లేదని నేను తప్పు పట్టాను  అటు అమెరికా అనుగ్రహాన్ని చెడగొట్టుకోకుండా ఇటు రష్యా ఆగ్రహానికి గురికాకుండా విదేశాంగ విధానాన్ని నడపాలని ప్రయత్నించే నెహ్రూగారి ప్రసంగంలో డిప్లోమసీ కనిపించటంలో ఆశ్చర్యమేమీ లేదు  అని సత్యాన్వేషి అంటున్నారు  ఆయన దృష్టిలో నెహ్రూ శాంతి యత్నాలు సాగించేకన్నా 'డిప్లోమసీ" ద్వారా అమెరికా అనుగ్రహాన్ని చెడగొట్టుకోకుండా ఉండడమూ, రష్యా ఆగ్రహానికి గురికాకుండా ఉండడమూ ముఖ్యమని తోస్తున్నది  ఇది 'బానిస వాదం' దీనివల్ల నెహ్రూకు 'సత్యాన్వేషి' న్యాయం చేయటం లేదు  అమెరికా అనుగ్రహాన్ని సంపాదించ గోరితే నెహ్రూ అమెరికా వెళ్లి లియాఖతాలీ భాషే మాట్లాడి ఉండవచ్చు  అదీకాక ఆయన ఇండోనేషియా పార్లమెంటులో మాట్లాడుతూ, 'శాంతి కోరిన మాత్రాన లాభంలేదు, శాంతిని బలపరచే చర్యలు సాగించాలి', అన్నారు  శాంతి కోరిన మాత్రం చేత చాలదన్నంత వరకైనా న్యాయాన్ని నెహ్రూ సమర్థిస్తున్నారని నేననుకుంటున్నాను

శాంతికోసం ఎటువంటి కృషి సాగించాలన్న విషయం నెహ్రూ వివరించ నందుకు 'సత్యాన్వేషి'కి చింత ఎందుకు లేదో ఆయన వెలిబుచ్చిన అభిప్రాయాలే వ్యక్తంచేస్తున్నాయి  శాంతి ప్రియులందరూ 'రష్యావిప్లవంలో" చేరాలని నేనంటున్నానని 'సత్యాన్వేషి' భావం  దీనికి అర్థం లేదు  రష్యా పక్షంలో చేరటమంటే ఏమిటి? శాంతికోసం రష్యా ప్రయత్నాలు చేస్తే శాంతికాముకులు వాటిని చాతనయిన విధంగా బలపరచవచ్చు  అది రష్యా పక్షంలో చేరటమవుతుందా? పెకింగులో కొత్తగా నియమించబడిన మనరాయబారి పదవీ స్వీకారం చేస్తూ ఇండియా చైనాలు కలసి ఆసియాలోనూ, ప్రపంచమంతటా శాంతినెలకొల్పేటందుకు కృషి చేయాలన్న ఆశ ప్రకటించాడు

అంటే ఇండియా చైనాలో చేరడ మవుతుందా? 'సత్యాన్వేషి'– నాశాంతి ప్రచారాన్ని సందేహిస్తూనే – రష్యా చేసే శాంతి యత్నాలను బలపరచటం రష్యాతో చేరిపోవటం కింద జమకట్టటం భావ్యంగా కనిపించటం లేదు

రష్యాకు కావలసింది శాంతి అనీ అమెరికాకు కావలసింది యుద్ధమనీ నమ్మటానికి 'సత్యాన్వేషి'కి ఏమీ ఆధారాలు కనిపించలేదు అందుచేతనే 'నేడు రష్యాలో అమెరికాలలో ఏదీ యుద్ధాన్ని అవసరంగా కావాలని తెచ్చి పెట్టుకోదు' అని అంటున్నారు కాని అమెరికా విదేశాంగశాఖలో ఆరితేరి రష్యా విరుద్ధ ప్రచారానికి కూడా తీవ్రంగా గురి అయిన జార్జి ఎఫ్ లెన్నాన్, 'ఇతర దేశాలలోని పెట్టుబడిదారీని రష్యా ఆయుధాలతో కూలదోయటం స్టాలిను సిద్ధాంతాలకు అననుకూలమే కాక అనుచితం కూడా' నంటూ కొద్ది మాసాల క్రితం రాశాడు (ఈ వ్యాసం మార్చి 3 హిందూ పత్రికలో ప్రచురితమయింది) ఈ వ్యాసంలో ఈయన ప్రకటించిన భావాలు అమెరికా వైఖరిని ప్రతిబింబిస్తవని భావించవచ్చునని తెలుపబడింది

లెన్నాన్ తన అభిప్రాయాన్ని సమర్ధించుతూ చెప్పిన కారణాలు ప్రపంచానికంతకూ తెలిసినవే

పెట్టుబడిదారీ విధానం అంతర్గత వైషమ్యంలో దానంతట అదే మారిపోతున్నదని కమ్యూనిస్టు సిద్ధాంతం ఈ పతనాన్ని ప్రోత్సహించటానికి రష్యాకు అభ్యంతరం లేదు కాని ఆ పతనాన్ని సాగించే బాధ్యత స్థానిక కమ్యూనిస్టు పార్టీలకు వదల బడుతుంది పెట్టుబడిదారీ పతనం ద్వారా జననం పొందే సోషలిస్టు వ్యవస్థకు రష్యా 'మంత్రసాని' తనం మాత్రమే చేస్తుంది ప్రపంచవిప్లవ నినాదం పోయి ఒక్కదేశం లోనే సోషలిజం సాధ్యమన్న సిద్ధాంతం అవలంబించి రష్యాతన విప్లవానంతర పునర్నిర్మాణమంతా సాగించి, రష్యా దృష్టిలో నయినా విజయం సాధించి, ఆ సిద్ధాంతాన్ని నమ్ముకునే సోషలిస్టు దేశాలూ పెట్టుబడిదారీ దేశాలూ కలసి మనవచ్చునని రష్యా అంటున్నది ప్రతి ఒక్క దేశంలోనూ సోషలిజం సాధ్యమన్న సిద్ధాంతమే నేటి రష్యా ఉనికికి, దాని విదేశాంగ విధానానికీ తల్లివేరని చెప్పవచ్చు అంతర్జాతీయ పెట్టుబడిదారీ దేశాలు పరస్పర సహాయం చేసుకున్నట్టే సోషలిజం అవలంబించిన దేశాలు కూడా పరస్పరం బలపరుచుకోవచ్చు

రష్యా వైఖరిని అమెరికా సామ్రాజ్య విధానంతో సమంచేసేశారు 'సత్యాన్వేషి' అమెరికా రష్యాలు రెండూ ఇతరదేశాల మీద ఆధిపత్యానికే చూస్తున్నాయని ఆయన చెప్పారు అమెరికా తన ఆధిపత్యంకింద ఉండాలని చేసే ప్రయత్నాన్ని బ్రిటను, ఫ్రాన్సు వగైరా దేశాలు బలపరుస్తాయా? ఎందుకు బలపరచాలి? ఒకవైపు పెట్టుబడి దారీని నెగ్గించాలని అమెరికా, కమ్యూనిజంను నెగ్గించాలని రష్యా చూస్తున్నవన్నప్పటికీ ప్రపంచ యుద్ధం అవసరం లేకుండా తన కోరిక సిద్ధిస్తుందని ఆశగల రష్యా యుద్ధానికి ఒడిగడుతుందా? వివిధ దేశాలను ఆయుధాలతో కొని ఆదేశాల జాతీయ పోరాటాలను అణగదొక్కిస్తున్న అమెరికా యుద్ధానికి ఒడిగడుతుందా? ఇతర దేశాలలోని పార్టీలు అమెరికాకు పూర్తిగా ఎందుకు బద్ధమై ఉండాలి? పెట్టుబడిదారీ తత్వాన్ని బలపరచాలని, పెట్టుబడిదారీ వర్గాలకుంటుంది మిగిలిన అధిక సంఖ్యాకులు పెట్టుబడిదారీ విజయరణంలో చచ్చి వీరస్వర్గమలంకరించాలని ఎందుకు కోరుతారు

కమ్యూనిజమునకు ఆధారం దారిద్ర్యమేననీ ప్రజల నిరుద్యోగ సమస్యేననీ అనేకవేల మంది నెత్తినోరు బాదుకుని చెబుతున్నారు అమెరికా దారిద్ర్యాన్ని నిరుద్యోగాన్నీ పెంచటం లేదా? అమెరికా సహాయం పొందే దేశాలలో ఆదాయంలో సగానికి సగం "రక్షణ" కింద పోవటం చేత

ప్రజలు కటకట పడటం లేదా? ఇందువల్ల ప్రజలలో కమ్యూనిస్టు ప్రభావం హెచ్చితే దానికి పూచీ ఎవరు?

రష్యాకూడా తన ఆధాయంలో సగానికి పైగా యుద్ధ ఖర్చుకింద వినియోగిస్తున్నదని, 'సత్యాన్వేషి' చెబుతున్నారు అమెరికా ఆర్థిక రాజకీయ సిద్ధాంతాలు యుద్ధానికి దారితీసే వని రష్యా భావించినప్పుడు రక్షణ ప్రయత్నంమీద ఉండటం తప్పులేదు 'తాను బలవంతంగా ఉన్నట్టు కనబడితే రష్యా వెనుకాడుతుందేమో ననే ఆశతో (అమెరికా) ఆటంబాంబులను హైడ్రోజన్ బాంబులను గురించి ఆర్భాటం ప్రారంభించింది' అన్నమాటకు ఆవగింజంత ఆధారంలేక పోగా లెన్నాన్ చెప్పిన దానికిది కేవలం విరుద్ధంగా ఉన్నది ఆటంబాంబులూ, హైడ్రోజన్ బాంబులూ చెయ్యటానికి అమెరికా ప్రజల సొత్తు కోట్లకొద్దీ వ్యయమవుతున్నది దీనిమీద లాభాలు ముట్టేవారున్నారు ఈ ఆర్భాట మంతా దేనికో వారు బాగా ఎరుగుదురు

మేరీ బన్నర్ అనే అమెరికను యువతి ట్రూమన్‌కు ఉత్తరం రాస్తూ '32 సంవత్సరాల సోవియట్ పాలనలో రష్యాదురాక్రమణ చేసిన నిదర్శనమేది? పైపెచ్చు బెదిరింపులూ ప్రగల్భాలూ చేస్తున్నది అమెరికనులే అన్నది

అణుశక్తి కంట్రోలు విషయమై అమెరికా ప్రతిపాదనను రష్యా తిరస్కరించిందన్న నెపంతో రష్యా యుద్ధానికి కాలుదువ్వుతున్నదని ప్రచారం సాగించారు అమెరికా ప్రతిపాదనను గురించి "సన్‌టైమ్స్' అనే చికాగో పత్రిక ఈ విధంగా సంపాదకీయం రాసిందంట మన అణువు ఫ్యాక్టరీలను రష్యాతో కూడిన అంతర్జాతీయ నిర్వహణకు వదిలి పెడుతూ ప్లాను తయారు చేసి సెనేటు ముందు పెడితే ఎంతకోలాహలం చెలరేగుతుందో ఊహించుకోవచ్చు

అమెరికా సెనెటు ఆమోదిస్తుందని ఎవరూ విశ్వసించలేని పధకాన్ని రష్యా నిరాకరించిందని అమెరికా ఆక్షేపణ! అమెరికాలో బయట పడే గుట్టు అచ్చుగా అమెరికాకు వ్యతిరేకంగా ఉండక రష్యాకు అనుకూలంగా ఉంటున్నదని 'సత్యాన్వేషి' గ్రహించాలి

ఇంతకూ 'సత్యాన్వేషి' ఒక్క విషయం గ్రహించాలని నాప్రార్ధన ప్రతిశాంతి కాముకుడూ తన దేశాన్ని తన దేశ స్వాతంత్ర్యాన్నీ ఇంకొకరికి కైంకర్యం చెయ్యటానికి సిద్ధంగా ఉంటాడనే భ్రమ సరి అయినది కాదు జాతీయ స్వాతంత్ర్యానికీ శాంతికీ అవినాభావ సంబంధ మున్నది తన స్వాతంత్ర్యం దక్కాలనీ తన జాతి జీవితం బాగుపడాలనీ అనుకొనేవాడే శాంతికోసం కృషి చేయగలడు పరభృతం తన స్వాతంత్ర్యంతో బాటే శాంతికి ఇన్ని నీళ్లు వొదిలేస్తాడు శాంతి కోసరం జరిగే సమష్టి కృషిలో శాంతి కాముకులందరూ చేతులు కలపటంలో తప్పులేదు యుద్ధం కోరే వాళ్లే శాంతికోరే వాళ్ళకంటే ముందుగా స్వాతంత్ర్యాన్ని కోల్పోతారని నేటి చరిత్ర రుజువు చేస్తున్నది

'సత్యాన్వేషి' అంచనా ప్రకారం యుద్ధమనేది అమెరికా రష్యాల మధ్య లేక పెట్టుబడిదారీ సామ్యవాదాల మధ్య జరిగే ఒక చదరంగం లాంటిది తూర్పుగా తిరిగి దణ్ణం పెట్టడం తప్ప శాంతికాముకులు చేయదగినదేమీ లేదు కోట్లాది ప్రజలచేత శాంతిప్రమాణాలపై సంతకాలు చేయించటమే' రష్యాచేస్తున్న శాంతి ప్రయత్నంగా ఆయనకు తోస్తున్నది కార్మికులు ఆయుధాలు దించనిరారించటం మాటేమిటి? 'రష్యాకు వ్యతిరేకంగా ఉన్నరాజ్యాలను బలహీన పరిచేటందుకు

కమ్యూనిస్టులు వేసే శతకోటి యెత్తులలో ఇది ఒకటి', అంటే అమెరికా ఆయుధాలు సంపాదించి ఈ రాజ్యాలు బలవడుతుంటే, ఆయుధ రవాణాలను ప్రతిఘటించి, వాటిని బలహీనపరిచేటందుకు కమ్యూనిస్టులు ఎత్తులువేస్తున్నారన్న మాట! ఈ కమ్యూనిస్టులు సాగించే సమ్మెలను భగ్నం చేస్తున్న ఫ్రీట్రేడు యూనియను మురాల వారంతా దేశ భక్తులన్నమాట! 'సత్యాన్వేషి' పైకి అమెరికా రష్యాలు రెంటిపైనా యుద్ధనేరం మోపుతున్నా, ఎక్కడ లేని ఎవరూ నిర్వచించని మూడోపక్షం చూపడం పైనే ప్రపంచశాంతి ఆధారపడి యున్నది' అంటున్న ఆయన ధోరణి అమెరికాను పెట్టుబడిదారి సామ్రాజ్యవాదాన్నీ, ఇటలీ మొదలైన దేశాలలో ఫాసిస్టులు నిర్వహించే కార్మికోద్యమాలనూ బలపరుస్తున్నట్టు స్పష్టంగా కనిపిస్తున్నది

ఎవరో ఒకరి అండను చేరి వారికి స్వాతంత్ర్యం అర్పించకుండా శాంతి యత్నాలు సాగించవచ్చు ప్రతి దేశంలోనూ శాంతియత్నాలు సాగవచ్చు శాంతికాముకులు ఆత్మరక్షణకు ఆయుధాలు ఉత్పత్తి చేసుకున్నా తప్పులేదు కాని శాంతి అచ్చగా ఆయుధాలమీద ఆధారపడదు ఇండోనేషియాలో నెహ్రూ చెప్పినట్లు ప్రజల జీవన ప్రమాణాలు బాగా పెరగాలి ప్రజాజీవితం వృద్ధి కావాలి ఆ విధంగా జీవిత ప్రమాణాలను అనుక్షణం వృద్ధి చేసుకొనే ప్రజలు శాంతిని దక్కించ గలుగుతారు చైనాగాని తూర్పు యూరపు దేశాలుగానీ రష్యాకు దాసోహం అన్నందుచేత రష్యాపక్షాన్ని బలపరచలేవు ఆదేశాలలోని ప్రజా జీవితంలో అభివృద్ధి శక్తులు బలంగా ఉన్నంత వరకే అవి శాంతిని రక్షించ గలవు అమెరికా దోపిడి అంతరిస్తే పశ్చిమ యూరపు దేశాలుకూడా ఎవరిపక్షమూ కానవసరం లేకుండానే ప్రజాజీవితాలను పెంపొందించి శాంతిని కాపాడగలవు కాని ఆ విధానం పశ్చిమ దేశాలలోని పెట్టుబడిదార్లకు అనుకూలించదు ఆదేశాలలో వారి పెత్తనం ఉన్నంత వరకూ ఆదేశాలకే కాక ప్రపంచానికే యుద్ధభయం ఉన్నది కనుకనే యుద్ధ శక్తులను అమెరికాక కూడగట్టటానికి ప్రయత్నిస్తున్నట్టే శాంతిశక్తులను కూడా కూడగట్టి యుద్ధ ప్రమాదాన్ని అదుపులో ఉంచవలసిన అవసరం ఉన్నది

తెలుగుస్వతంత్ర, వారపత్రిక, 16-6-1950

## 9. ఆధ్యాత్మిక శాంతి

పైన నీలి ఆకాశంలో తెల్లని శరన్మేఘాలు, నదిలో పడవల్లాగా మందంగా కదులుతూ దూరాన నీలికొండల పంక్తి సమీపంలో గలగలా శబ్దం చేస్తూ రాళ్లను ఒరుసు కుంటూ ప్రవహించే సెలయేరు చుట్టుగా ఏపుగా పెరిగిన చెట్లూ, వాటిని గాఢంగా పెనవేసుకున్న లతలు, గాలిలో తేలి వచ్చే వనపుష్ప సౌరభం ఒక పెద్ద చెట్టుకింద పచ్చికమేస్తూ కొన్ని ఆవులు, సెలయేట్లో నిర్మలోదకం తాగుతూ మరికొన్ని ఆవులు, ఒక పక్కగా ఒక నున్నని రాతినానుకొని కూర్చుని, పిల్లన గ్రోవి వాయిస్తూ నిష్పూచీగా ఒక గొల్ల పిల్లవాడు

ఆ దృశ్యాన్ని తమ మనసులో చిత్రించుకొని జమిందారీ వ్యవస్థకు చెందిన కవులు అపరిమితమైన ఆధ్యాత్మికానందాన్ని పొందేవారు ఇటువంటి ఆనందాన్ని అనుభవించే హక్కు వారికున్నదా అన్నది వేరే విషయం ఈ ఆధ్యాత్మికానందాన్ని జీవిత సత్యంతో సమన్వయించే మార్గమేదన్నా ఉన్నదా అనేది తెల్సుకోవాలి

పైన చెప్పిన దృశ్యంలో ఉదహరించిన గొల్లపిల్లవాడికి చాలా ఆధ్యాత్మిక శాంతి ఉండవచ్చు ఏ పూరిగుడిసెలోనో కటిక దరిద్రం అనుభవిస్తూ, పొట్టకు చాలీ చాలకుండా తిండితింటూ, ధనికులచేత మొట్టికాయలు తింటూ, ఎండ కెందుతూ, వానలకు తడుస్తూ, అతి హేయమైన జీవితం గడుపుతూ కూడా, తనకింతే ప్రాప్తమని, ఏ భగవంతుడో తనకీ జీవితం ప్రసాదించాడనీ మనస్ఫూర్తిగా నమ్మి చీకూచింతా లేకుండా వాడు జీవితం వెళ్ళబుచ్చవచ్చు వాడికా విధంగా ఆధ్యాత్మిక శాంతి పొందే అధికారం ఉందా అన్నది ఇంకొక ప్రశ్న

వ్యక్తిగతంగా ఆధ్యాత్మిక శాంతి సంపాదించుకొనే అధికారం ప్రతివాడికీ ఉండవచ్చు కాని ఒక్కొక్క సారి సాంఘిక పరిణామం ఈ అధికారాన్ని నిషేధిస్తుంది 1920 లో గాంధీజీ అనేక కోట్లమంది భారతీయుల ఆధ్యాత్మిక శాంతికి భంగం కలిగించాడు ఈ కోట్లమంది భారతీయులు తమ రాజకీయ-సాంఘిక స్థితిని గురించి తాత్విక దృష్టితో కూడిన నిర్మాణంలో ఉండిపోయారు కానీ గాంధీజీ అదంతా ఒక్కసారిగా వదల గొట్టారు ఆతర్వాత వ్యక్తులైన భారతీయులకు ఆధ్యాత్మిక శాంతి పొందే అర్హత లేకుండా పోయింది దాన్ని ఆశ్రయించిన వాళ్లు నైతికంగా సంఘ ద్రోహులైనారు

అనేక ఆర్థిక సత్యాలను కనుగొన్నప్పటికీ సాంఘిక విప్లవ సత్యాన్ని గ్రహించని హెన్రీజార్జి అనే అమెరికను ఆర్థికవేత్త పేదసమస్య పరిష్కరించే ఉపాయం లేని పరిస్థితిలో వారికి తమ జీవితం గురించి యదార్థం చెప్పటం క్రూరమని భావించాడు నిజమే మంటే ఏ సత్యాన్ని గాని తెలుసుకుంటే గాని దానిలో మార్పు సాధించలేం ఈ మార్పు సాధించే విధానానికీ ఆధ్యాత్మిక శాంతికీ పొసగదు గాంధీజీ భారతీయుల ఆధ్యాత్మిక శాంతిని భంగపరచకుండా ఉంటే మన జాతీయ సమస్య మారి ఉండేది కాదని స్థూలంగా గ్రహించవచ్చు (ఆధ్యాత్మిక శాంతి అనే మాటను ఎటువంటి ప్రత్యేకార్థంలోనూ వాడటం లేదు)

జీవిత సమస్యలతో తలపడే వాళ్లు ఆధ్యాత్మిక శాంతికోసం తాపత్రయ పడరు జీవిత సత్యాన్ని ఎదుర్కోలేని వారూ, జీవిత సంఘర్షణ నుంచి పారిపోగోరేవారూ దీనికోసం అన్వేషణ ఆరంభిస్తారు వారికిది కొన్ని ప్రత్యేక పరిస్థితులలో లభిస్తుంది ఆ పరిస్థితులకు సంఘంలో నైతికంగా స్థానం ఉన్నదా అనేది మరొక ప్రశ్న

జైళ్ళలో 5 లేక 10 ఏళ్లు ఖైదు అనుభవించిన కాన్విక్టులు బయట ఉండే అనేక మంది కంటే చాలా మంచి వాళ్ళుగా కనిపిస్తారు అని పండిత నెహ్రూ ఇటీవల ఒక సందర్భంలో అన్నాడు ఇందులో వింత ఏమీలేదు పరిమిత మైన వ్యక్తిగతమైన జీవితాశయాలు గల వారికి ఖైదు శిక్ష ఒక విధమైన ఆధ్యాత్మిక శాంతి చేకూర్చుతుంది అది విధిలాగా దాటరానిది దానితో తలపడే అవసరం ఖైదీకి లేదు ఖైదీ అవసరాలు ఖైదీ చూసుకోనవసరం లేదు ఎంత పరిమితంగానైనా ఆ అవసరాలు జైలు అధికార్లు చూస్తారు ఖైదీ నిత్య కర్మను కూడా వారే ఏర్పాటు చేస్తారు జైలులో పడక పూర్వం తాను తినే ప్రతి మెతుకు తానే సంపాదించుకొని తన దినకృత్యాలకు తానే బాధ్యత వహించ వల్సిన ఖైదీ జైలులోకి పోగానే తనను సంక్షోభపెట్టే ఈ సమస్య నుండి విముక్తుడౌతాడు చాలా వరకు పరిస్థితుల ప్రోద్బలం వల్లనే మనుష్యులు నేరాలు చేసి ఖైదు చేయబడతారని కూడా అదే సందర్భంలో నెహ్రూ అన్నాడు ఇందులో

అతిశయోక్తిలేదు  కనక పరిస్థితుల ప్రోద్బలం వల్ల జైలుకు పోయిన నేరస్తుడు 5 లేక 10 సంవత్సరాల కాలం జైలులో ఉండి బయట వాళ్ళకన్నా మంచివాడుగా తయారవుతాడంటే కొద్దిమందికైనా జీవిత పరిస్థితులకన్నా జైలు పరిస్థితులే బాగున్నవని తేలుతుంది  ఆ కారణం చేత జైలును జీవితం కంటే మంచి దంటామా? బయట జీవితం లేకపోతే జైలులేదు  బయట జీవితమూ దానికి సంబంధించిన ప్రభుత్వమూ, పోలీసులూ, ప్రభుత్వాదాయమూ,న్యాయస్థానాలూ ఉండబట్టే జైళ్ళున్నాయి  కాకపోతే 'కొందరు బుద్ధిమంతులు జైలుకన్నా హేయంగా ఉన్న జీవితాన్ని మార్చితేనేం'? అనవచ్చు అది వేరే సమస్య

ప్రతిదేశంలోనూ జైళ్లు కలిగించే అధ్యాత్మిక శాంతినే కొన్ని దేశాలలో ఫాసిజం చూపిస్తుంది 'మీరు జీవిత సమస్యలను గురించి స్వతంత్రంగా ఆలోచించకండి  దాన్ని గురించి మధనపడే భారం మాకు వదలండి  మీరు మేము చెప్పినట్లుచెయ్యండి  ఎందుకని ప్రశ్నించకండి జీవితాన్ని మేం స్వర్గతుల్యంగా చేసేస్తాం' అంటారు ఫాసిస్టులు  ఫాసిస్టులను అనుసరించటం ఒక విధంగా తేలిక  ఏ సిద్ధాంతాలనూ అర్థంచేసుకోనవసరం లేదు  మనస్సుకు బీగం వేసెయ్యటమూ, నాయకులచేతి పనిముట్లయిపోవటమూ, ప్రాణాలర్పించమన్నా అర్పించటమూనూ! ఈ ఆధ్యాత్మిక శాంతికోసం ఎన్నవేల మంది తమ ప్రాణాలను అవలీలగా బలిచేస్తారో ఫాసిస్టులుగ్రహించినట్టు మరెవ్వరూ గ్రహించలేరు

ఆధ్యాత్మిక శాంతి సంపాదించటానికి మన దేశంలో ఇంకొక రకం సంస్థలున్నాయి  అవి ఆశ్రమాలు, ఈ ఆశ్రమాలను సన్యాసులూ, బైరాగులూ, యోగులూ, రుషులూ స్థాపిస్తారు వ్యవస్థాపకులను 'రాజకీయంగా' ఉపయోగించ దలచిన ధనికులూ, అంతో ఇంతో సంపాదించి వెనుక వేసుకొని తమ జీవితమంతా సంఘద్రోహం చేశామనే ఆరాటాన్ని వదలుగొట్టుకోవటానికి ఆరాటపడే మధ్యతరగతి వాళ్ళూ ఈ ఆశ్రమాల కోసం కనకవర్షం కురిపిస్తారు  ఈ ఆవరణంలో వస్తు సమృద్ధి ఉంటుంది  వీటిలో ప్రభుత్వం పరిపాలించదనే చెప్పచ్చు  దొంగమార్కెటు లోనుంచే సమస్తమూ వచ్చి పడుతుంది  మనస్సును క్షాళనం చేసుకోవటానికి వచ్చిన వాళ్ల కిక్కడ ఎక్కడలేని శాంతి కనిపిస్తుంది  ఇక్కడ ఉన్నంత కాలమూ వారికి ప్రాపంచిక సమస్యలుండవు, రెండు పూటలా తిండిదొరకుతుంది  టిఫినూ, కాఫీకూడా దొరకవచ్చు  వైరాలు, వైషమ్యాలూ ఉండవు  బాధించే వ్యత్యాసాలుండవు ఇక్కడికి వచ్చేవారు ఎల్లకాలమూ ఇక్కడే ఉండిపోలేరు  కొన్నాళ్ళుండి తిరిగి వెళ్లిపోతారు  కాని ఇక్కడ గడిపిన నాలుగు రోజులూ వారికి మరుపురావు  ఆశ్రమంలో ఏదో మహత్తున్నదనుకుంటారు  ఈ మహత్తు నాలుగు రోజులు పాటు పెళ్ళివారి ఇళ్ళల్లో కూడా ఉంటుంది – పెళ్ళివారింత కలవారైతే

చెప్పవచ్చిందేమంటే జీవితమంతా ఆశ్రమంలాగా చేసి అంతులేని సంపద అందుబాటులో ఉంచి వ్యక్తి వైషమ్యాలూ, వర్గవైషమ్యాలూ లేకుండా చేస్తే ఆ ఆశ్రమంలో పొందే శాంతి జీవితంలో ఏ మూలనైనా పొందవచ్చు  కాని మనం జ్ఞాపకం ఉంచుకోవలసిందేమంటే ఈ ఆశ్రమాలకు ఆధ్యాత్మిక శాంతినిచ్చే శక్తి బయట జీవితంలో నుంచి  అందులోని ధనికుల ద్వారా వస్తున్నది  అందుచేత బయటి జీవితం వాస్తవం, ఆశ్రమాలు కృత్రిమం  ఇటువంటి ఆధ్యాత్మిక శాంతిని బుద్ధిమంతులు శ్లాఘించరాదు  జీవితం సంఘర్షణతో కూడుకొన్నది

నిజమైన మానవ ధర్మం ఈ సంఘర్షణలలో జయించి జీవితాన్ని ఒక్కొక్క అడుగే ముందుకు జరుపుకుంటూ పోవటం అంతేగాని జమిందారీ యుగపు కవులులాగా కృత్రిమ ఆధ్యాత్మిక శాంతిని ఆరాధించటం కాదు, దొంగ సన్యాసుల్లాగా కృత్రిమ శాంతిని ప్రజలకు ఆశ పెట్టటమూకాదు

తెలుగుస్వతంత్ర, వారపత్రిక 2-6-1950

# 10. ఏవి ప్రజాస్వామికాలు

'ప్రజాస్వామికాన్ని' రష్యాబారినుండి రక్షించటానికి 122 కోట్ల డాలర్లు వివిధ 'స్వతంత్ర' దేశాలకు ఆయుధ సహాయ రూపేణా మంజూరు చెయ్యమని ట్రూమన్ అమెరికను కాంగ్రెసును అర్థించాడు

ఇవాళ 'ప్రజాస్వామికం' అన్నమాట నానార్థాలతో విలసిల్లుతున్నది రాజరికాన్ని గుర్తించే దేశాలూ, గుర్తించని దేశాలూ, ప్రజలకు ఎన్నికల హక్కు ఉన్నదేశాలూ, లేని దేశాలూ, ప్రజాస్వామ్యాలు గల దేశాలూ, లేని దేశాలూ, జాతి భేదం పాటించే దేశాలూ, పాటించని దేశాలూ, అమెరికా నుంచి ఆయుధాలు పొందే స్వతంత్ర 'ప్రజాస్వామిక' దేశాల జాబితాలో ఉన్నాయి

అమెరికా లెక్క ప్రకారం 'స్వతంత్ర ప్రజాస్వామికం' గల చంగ్-కై-షేక్ అమెరికానుంచి ఆయుధ సహాయం చాలా పొంది, ప్రస్తుతం తెరమరుగై ఉన్నాడు ఇంకా తెర మరుగు కాకుండా అమెరికానుంచి ఆయుధ సహాయం పొందటానికి అర్హత సంపాదించి ఉన్నస్వతంత్ర ప్రజాస్వామిక, ప్రభుత్వాలలో బావోదై వియత్నాం ప్రభుత్వం ఒకటి

బావోదై ప్రభుత్వం గురించి నార్మన్ లూయిస్ సేకరించిన కొన్ని విషయాలు జూన్ 5 "హిందూ" పత్రిక ప్రకటించింది గత ప్రపంచ యుద్ధంలో, ఫ్రాన్సు పతనం అనంతరం జపానువారు నిరాఘాటంగా ఇండోచైనాలో ప్రవేశించారు వారి ఆక్రమణ వల్ల ఫ్రాన్సుకు ఆవగింజంత నష్టం జరుగలేదు జపాను వారు ఇండోచైనాలోని విప్లవ నాయకులను ఫ్రెంచివారికి పట్టి ఇచ్చారు జపాను వారు పోలీసుల వలె రక్షించగా ఫ్రెంచివారు నిశ్చింతగా ఇండోచైనా దోపిడి సాగించగలిగారు జపాను వారేదో తమ్ము ఉద్ధరిస్తారన్న ఆశ ప్రజలకు మొదట్లో ఉండినా అదికాల క్రమాన అంతరించింది ఆసియా ఐక్యతను గురించి ప్రచారం చేసిన జపానువారు, ఫ్రెంచివారితో లాలూచీ కావటమే దీనికి కారణం 1942లో జపాను ఫాసిస్టు శక్తులను ప్రతిఘటించటానికి ఇండోచైనాలోని వియత్మిన్ ఉద్యమం ప్రారంభమయింది

1945 మార్చిలో జపానువారు, తమ శక్తి ఉడిగిపోతూ ఉండటం గ్రహించి, ఫ్రెంచివారిని నిర్బంధంలో ఉంచి తమ చెప్పు చేతలలో ఉండే బావోదైకి పట్టం కట్టారు జపానువారు ఓడిపోవటానికి ఎంతోకాలం పట్టలేదు 1945 ఆగస్టులో బావోదై తన ఆధిపత్యానికి నీళ్లు విడుస్తూ, వియత్మిన్ రిపబ్లికు చిరకాలం వర్ధిల్లు గాక అని దీవించి వెళ్ళాడు హోచిమిన్ అధ్యక్షత కింద ఏర్పరచిన ఈ రిపబ్లికు ప్రభుత్వంలో 300 మంది ప్రతినిధులున్నా వారిలో కమ్యూనిస్టులు 10 మంది మాత్రమే

ఆనాటి జపానువారి కీలుబొమ్మనే ఈనాడు ఫ్రెంచివారు తెచ్చి వియత్నాం ప్రజల నెత్తిన ఎక్కించారు  వియత్నమీయులు బావొదైని ద్వేషిస్తారంటే ఆశ్చర్యం ఏమీలేదు  ఇండోచైనాలో ఏనాడో అంతమైన తమ అధికారాన్ని ఫ్రెంచివారు సాయుధంగా తిరిగి సంపాదించుకొనటానికి ఉపక్రమించారు  1945 సెప్టెంబరులో ఫ్రెంచి బలాలు, బ్రిటిషు బలాలను వెంటబెట్టుకొని సైగాన్‌లో దిగాయి  మరికొంత కాలానికి చాంగ్‌కైషేక్ మరికొన్ని ఫ్రెంచి బలాలను చైనా సరిహద్దు మీదుగా టోన్కిన్ చేరనిచ్చాడు  ఇండోచైనాలో ఫ్రెంచివారు నాలుగున్నర ఏళ్ళనుంచీ యుద్ధం చేస్తున్నారు  ఈ యుద్ధం కిందవారు రోజుకు 10 లక్షల డాలర్లు ఖర్చు చేస్తున్నారు  ఇప్పటికి లక్షా ఇరవై వేలమంది సైనికులు ఈ యుద్ధంలో బలి అయినారు  వియత్నాంలో అయిదో వంతు ప్రదేశం మాత్రం ఫ్రెంచివారి ఆధీనమయింది, కాని ఎక్కడా భద్రత లేదు

ఈ ఫ్రెంచి వారి కీలుబొమ్మ బావొదై  ఇతని ప్రభుత్వం కూడా ఒక ‘ స్వతంత్ర ప్రజాస్వామిక’ ప్రభుత్వమే  ఈ ప్రభుత్వానికి అమెరికా ఈ యేడు ఏడున్నర కోట్ల డాలర్ల  ఖరీదు గల ఆయుధాలు ఇవ్వటానికి సిద్ధపడింది

అమెరికా గుర్తించే ప్రజా స్వామికం ఏది? ఈ ప్రశ్నకు అందరూ సమాధానం తెలుసుకోవాలి ఎందుచేతనంటే దాని మీద ప్రపంచ శాంతి ఆధారపడి ఉన్నది  అమెరికాకు డాలర్లు ఎక్కువగా ఉండి తన ఇష్టమైన వారికి ఇవ్వవచ్చు  కాని ఈ ఇవ్వడంలో ప్రపంచ శాంతికి భంగం కలుగు తుందంటే, ప్రపంచం అమెరికాను ప్రతిఘటించవలసిన అవసరం వుంది  చాంగ్‌కైషేక్‌కు 600 కోట్ల డాలర్లు సహాయం ఇచ్చి అమెరికా చైనాను రక్తంలో ముంచెత్తటమే కాక, చాంగ్‌కైషేక్ ప్రతినిధులే చైనా ప్రతినిధులని మొండి పట్టుపట్టి ఐక్యరాజ్యసమితిలోంచి రష్యా ఒక్కొక్క అడుగే నిష్క్రమించేటట్టు చేసి అశాంతిని రెచ్చగొట్టి, మీదుమిక్కిలి ‘ప్రపంచ శాంతికోసం ఐక్యరాజ్య సమితిని నమ్ముకుని లాభం లేదని తేలిపోయింది ’ అంటున్నది

ఈ ధనిక చక్రవర్తులు ‘స్వాతంత్ర్య’ మన్నా ‘ప్రజాస్వామిక’ మన్నా, మనం తన్మయత్వం చెందరాదు  వీరి ప్రజాస్వామికం యొక్క ఆర్థిక స్వరూపం ఎటువంటిదో ఆలోచించాలి  అదికూడా వారే బయట పెడుతారు  దాపరికాలేమీ లేవు

ఆగ్నేయాసియాను కమ్యునిజం నుంచి రక్షించితీరాలి  ఎందుచేత? ఒక అమెరికను ధనిక వర్గ ప్రతినిధి సమాధానం చెప్పాడు  ‘ఈ ప్రాంతమంతా రష్యాకిందికి పోయి ఇక్కడి ముడి పదార్థాల కోసం మనం స్టాలినుతో బేరాలాడవలసివస్తే ఏమవుతుంది?’

1950లో ఉత్తర అట్లాంటిక్కుఒడంబడిక సభ్యులకు 100 కోట్ల డాలర్లు ఆయుధాలివ్వాలి దేనికి? దానికి ఒక మహానుభావుడు సమాధానం చెప్పాడు  ‘ఈసారి యుద్ధం వస్తే మనం ఒక్క సైనికుణ్ణి కూడా పోగొట్టుకోకుండా యుద్ధం గెలిచే మార్గాలున్నాయి ’  పోతే అట్లాంటికు ఒడంబడిక దేశాల సైనికులే పోతారు

ఒక కెనడా పత్రిక రాసింది  ‘నెహ్రూ తటస్థంగా ఉండాలని చూస్తున్నాడు  లియాఖతలీ స్పష్టంగా రష్యాకు విరుద్ధంగా, మన పక్షాన ఉంటానని చెబుతున్నాడు  కామన్ వెల్తు రాజ్యాలన్నిటిలోకి రష్యాతో చేరిన సరిహద్దు గల దేశం పాకిస్తాను  పాకిస్తానుకి తక్షణ ఆయుధాల సహాయం జరగాలి

అమెరికాలో అనేక లక్షలమంది నిరుద్యోగులుండగా 'డోల్స్' ఇవ్వటం కూడా మానేసి బంగాళ దుంపలు కిరసనాయిలు పోసి కాల్చడం ప్రజాస్వామికం! అమెరికాలో నీగ్రోలను కుక్కలు ప్రవేశించే చోట్ల కూడా ప్రవేశించనీయక పోవటం స్వాతంత్ర్యం! నెహ్రూ రష్యావిముఖత్వం గాని అమెరికా ప్రియత్వంగాని ప్రకటించక పోవటం 'స్వాతంత్ర్యం' కాదు ప్రజాస్వామికం కాదు 300 మందిలో పదిమంది సభ్యులే కమ్యునిష్టులైన హోచిమన్ ప్రభుత్వం వియత్నామీయులంతా బలపరిచినా సరే, అది స్వతంత్రం కాదు ప్రజాస్వామికం కాదు

చిత్రమేమిటంటే తాను దోపిడీ చేయదలచిన దేశాలు మాత్రమే రష్యాదురాక్రమణకు గురి అవుతాయని అమెరికా అంటుంది ఆదేశాల ప్రజలు శాంతి కాముకులనీ స్వాతంత్ర్య ప్రియులనీ, ఎవరి దురాక్రమణనూ సహించరనీ, అమెరికా అవలంబించే ప్రజాస్వామికం నుంచీ ఆరాధించే స్వాతంత్ర్యం నుంచీ విముక్తి పొందిన దేశాలు, మనస్ఫూర్తిగా రష్యాతో సత్సంబంధాలు పెట్టుకుంటున్నవనీ, అమెరికా ఎంత త్వరగా తెలుసుకుంటే ప్రపంచశాంతికి అంతమంచిది తన ప్రపంచ ఆధిపత్యవాంఛను కప్పిపుచ్చటానికి గాను అమెరికా 'రష్యను కమ్యూనిజము ప్రపంచాన్ని కబళించేస్తున్నది!' అని ఎంత అట్టహాసం చేసినా, సత్యం మరొక విధంగా బయటపడుతున్నది ఆస్ట్రేలియా కమ్యునిస్టులకు పైనుంచి డబ్బుగాని, ఉత్తరువులుగాని రావటం లేదని తేలింది ఇటీవల మలయావచ్చి అక్కడి పరిస్థితులను చూసిన ఇద్దరు బ్రిటిష మంత్రులు మలయా కమ్యూనిస్టులు 'సొంతానే' పని చేస్తున్నారని ప్రకటించారు

కాని ఒకటి నిజం ఆస్ట్రేలియా లోగాని మలయాలోగాని కమ్యూనిస్టులకు విజయం లభిస్తే ఆ దేశాలు రష్యాలో జరిగే ప్రజాస్వామికాన్నే బుద్ధి పూర్వకంగా ఆశ్రయిస్తాయి తప్పెవరిది? అమెరికా గుర్తించే ప్రజాస్వామికం యొక్క ఆర్థిక స్వరూపాన్ని, జనసామాన్యం తమ విరోధులకు కూడా కోరదు ప్రజాస్వామికం ఏలేవారికీ, ప్రజలకూ మధ్యగల అభిమానం వల్ల బలపడుతుంది గాని, అమెరికా పంపించే ఆయుధాలతో ఒక్కనాటికీ కాదు

తెలుగుస్వతంత్ర, వారపత్రిక, 9-6-1950

## 11. ప్రకృతి దారిద్ర్యం: మానవ దారిద్ర్యం

ఏ సమస్యనైనా పరిష్కరించాలంటే ఆ సమస్యయొక్క స్వరూపాన్ని గురించి అవగాహన చేసుకోవాలి అటువంటిదే దారిద్ర్య సమస్యకూడానూ దారిద్ర్యమంటే లేమి ఆఅర్థముతోనే అనేక లక్షల మంది నిత్యమూ ఆమాటను వాడుతున్నారు కాని వారందరు లేమి అనేదాన్ని ఒక దృష్టితో చూడటం లేదు మరి దారిద్ర్యాన్ని వర్తమాన సాంఘిక చారిత్రక దృష్టితో చూడగల వాడే దారిద్ర్య సమస్యా పరిష్కారానికి సరి అయిన మార్గం సూచించగలుగుతాడు

కలిమి అనేదానికి ఆదర్శ ప్రమాణాలు లేవు అరణ్యయుగం నాటి మానవుణ్ణి మనం ఈనాడు ఊహించుకొంటే మనకు వాడు పరమ దరిద్రుడుగా తోస్తాడు చెట్లమీద కాపురం, కందమూలాలు తిని బ్రతకటం, రాతిపనిముట్లులూ. వాడి [illegible] దారిద్ర్యాన్ని మనం ఈనాడు ఊహించుకోలేం కాని వాడి దారిద్ర్యం మనలాంటిది కాదు. వాడి దారిద్యానికి అవధులు ప్రకృతి కల్పించింది వాడికి ఒకచోట ఆహారం దొరకకపోతే యదేచ్ఛగా ఇంకొకచోటికి వెళ్ళేవాడు.

ఒక దుంప కాకపోతే మరొక దుంప తినేవాడు  అడవిలో దుంపలుండి వాటిని తవ్వే శక్తి వాడికున్నంత కాలమూ వాడు చావలేడు  కాని ఈ నాటి దరిద్రుడి శ్రమ శక్తిని కొనే వాడుంటాడనే గ్యారంటీ లేదు  అడవులన్నీ ఎవరో ఒకరి స్వంత ఆస్థి కావటం వల్ల ఈ దరిద్రుడు యదేచ్ఛగా అడవుల్లో కందమూలాలు దోచుకోవడానికైనా నోచడు  ఒకవేళ ఆనిర్భాగ్యుడికి పని దొరికినా తాను సంపాదించే డబ్బులతో నిజంగా కడుపు నిండా తినలేడు  దారిద్ర్య బాధలకు తట్టుకోలేక తన పిల్లల్ని రైలుకిందకు తోసి తాను రైలు కింద పడేటంత దరిద్రులు గల ఈనాటి దారిద్ర్యాన్ని ఆడివి మనిషి ఎరగడు  ఈనాటి దారిద్ర్యానికి ఆధార భూతంగాఉన్న సాంఘిక–చారిత్రక కారణాలు అడవి మనిషికి లేవు

ఈవాళ మనం ఏవైతే జాతీయ సంపద అనుకొంటున్నామో ఆ ఉక్కు, బొగ్గు, నూనె, విద్యుచ్ఛక్తి ఎటువంటిదో కూడా ఎరగకుండా అనేక తరాల మానవులు దారిద్ర్య ఐశ్వర్యాలు అనుభవించి దాటిపోయినారు  ఒకప్పుడు అమెరికాలో ఉప్పుకోసం తవ్వుకుంటే నూనె పడితే మనుష్యులు చీదరించుకొనే వారట! అటువంటి వ్యక్తులు 'అయ్యోఇది లేకపోవటం చేత మనసంపదకు లోటు కలిగెనే!' అనుకొనే అవకాశం లేదు  అయినా వాళ్ళ దారిద్ర్య ప్రమాణాలూ, ఐశ్వర్య ప్రమాణాలూ వారికుండేవి

లివరు ఇంజెక్షన్లూ, సల్ఫాడ్రగ్గులూ, పెనిసిలిన్ మొదలైన ఆధునిక ఔషధాలు లేక మన కిందటితరం వారు కూడా కొన్ని వ్యాధులతో మరణించారు  ఇటువంటి ఔషధాలతో అవే వ్యాధులకు మనం చికిత్స చేసుకోగలుగుతున్నాం  అంతమాత్రం చేత ఈతరంవారంతా ఆతరం వారందరికన్నా సంపన్నులైపోవటం లేదు  ఈనాడీ వ్యాధులతో బాధపడేవారి సంఖ్య హెచ్చుటమే కాక వాటిని చికిత్స చేసుకొనే అశక్తత అధిక సంఖ్యాకులకు అట్లానే ఉండి పోయింది

ప్రకృతి రకరకాల ముడి పదార్థాలను తయారు చేసి ఉంచింది, దాచి వుంచింది  ఇంకా తయారు చేస్తున్నది  మానవుడి జ్ఞానము శ్రమ ఒకదానికొకటి తోడ్పడి ప్రకృతి నుంచి సంపద లభిస్తున్నది  గత చరిత్రను చూసి ఈనాటి మానవుడు, "అహో నేనెంత నాగరికుణ్ణి! ఎన్ని రకాల సంపద సృష్టించాను!" అని విర్రవీగవచ్చు  కాని ఈ మానవుడే రాగల చరిత్రను కొంచెమైనా ఊహించుకోగలిగితే సంపదను సృష్టించడంలో తానింకా ఎంత హేయమైన స్థితిలో ఉన్నదీ ఊహించ గలుగుతాడు

అడవి మనిషిని అధిగమించి మనం చాలా దూరం వచ్చేశామను కున్నప్పటికీ ఇంకా అనేక విధాల మనం అడవి మనిషి తత్వాన్నే అనుసరిస్తున్నాం  అడవి మనిషి తాను తిన తగిన దుంపలను కనిపెట్టి వాటి సమీపంలో చేరేవాడు  వాడి సమాజం వాటి నాశ్రయించుకొని అభివృద్ధి అయేది  అవి లభించని ప్రాంతాలను వాడు విసర్జించే వాడు  ఏ అడవి పందులో వచ్చి వాటిని తవ్వుకు తినకుండా, వాడు వాటిని కాపలా కాసే వాడేమో కూడాను  ఈ దుంపలు అయిపోతే ముందు తరాల వాళ్లు పాపం ఏం కాను? అని వాడు విచారించి కూడా ఉండవచ్చు

ప్రస్తుతం మనం అదే చేస్తున్నాం  గనుల్లో ఉండే బొగ్గు, నూనె తవ్వుకొచ్చి ఉపయోగించు కొంటున్నాం  ఇంకా రెండు వేల ఏళ్లకు బొగ్గంతా అయిపోతుంది  ఈ లోపుగానే నూనంతా అయిపోతుంది  ఇంకో అయిదారువేల ఏళ్లకి ఇనుమంతా అయిపోతుంది  ఈ విధంగా అంచనాలు వేస్తున్నాం

అడవి మనిషితో ఆరంభమైన శ్రామిక యుగం ఇంకా అంతం కాలేదు అది ఇంకా మనని వెంటాడే వస్తున్నది ఇది త్వరలో అంతమై బుద్ధియుగం ఆరంభమవుతుందన్న జ్ఞానం మనకు లేదు అందుచేతనే మనం ముడి పదార్థాలు తీసుకురావటానికి, అసంఖ్యాకుల శ్రమ ఫలితం మీద సంపన్నులం కావటానికీ సిగ్గుపడం ఇతరుల శ్రమ ఫలితాన్ని దోచటానికే ప్రధానంగా వ్యక్తిత్వాలేర్పడ్డాయి ఈ వ్యక్తి స్వత్వాలు మన శాస్త్రజ్ఞుల రెక్కలను కట్టివేస్తున్నాయి, మన రాజకీయ వాదులచేత పిచ్చి పేలాపనలు పేలిస్తున్నాయి అంతర్జాతీయ దోపిడీ గాళ్లను యుద్ధానికి ప్రేరేపిస్తున్నాయి వ్యక్తి స్వత్వాలను 'ఛీ!' అన్నవాడల్లా కమ్యునిస్టు, రష్యా భక్తుడు, వాడిపట్ల ఎవరూ న్యాయమూ, ధర్మమూ, దయా చూపనవసరం లేదు వ్యక్తి స్వత్వాలు కార్మిక యుగాన్ని అంతం కానివ్వవనీ దారిద్ర్యంలో యివే ఒక విపరీత పరిణామాన్ని తెచ్చిపెట్టాయనీ ఎవరూ ఆలోచించటం లేదు మనం ఆలోచించుదాం

వ్యక్తి స్వత్వం లేకపోతే వ్యక్తి దారిద్ర్యమంటూ లేదు అరణ్యయుగం నాటి మనిషి తోళ్లూ, చెట్టు బెరళ్లూ కట్టుకున్నాడంటే ఆనాడెవరికీ బట్టలులేవు మనకిందటి తరంవారు పెనిసిలిన్ ఎరగరంటే వారిలో ఎవరూ ఎరగరు ఇప్పటికీ అనేక గ్రామాలలో కంకరరోడ్లు లేవు అక్కడ వానాకాలంలో ధనికులూ, దరిద్రులూ కూడా బురదలో నడుస్తారు ఇటువంటి దారిద్ర్యం సామాజికమైనది వ్యక్తి స్వత్వాలతో దానికి సంబంధం లేదు ఒకప్పుడు వానలు కురవక పొలాలుపండక కరువొచ్చేది జనం తిండిలేక చచ్చేవారు

ఈనాటి దారిద్ర్యం అటువంటిదికాదు ఒకవేళ అటువంటి దారిద్ర్యం ఉన్నా ఆ దారిద్ర్యాన్ని నిర్మూలించటానికి సామాజిక ఏర్పాట్లున్నాయి ఏ దేశంలోనైనా కరువొస్తే మరోదేశం నుంచి విమానాల్లో ధాన్యం చేరవేయవచ్చు భూమి మీద ఏమూలనుంచీ ఏ మూలకైనా రెండురోజుల్లో పోయే అవకాశాలేర్పడ్డ తరవాత, ఏ మూల వార్తలైనా మరోమూలకు క్షణంలో అందే రేడియో ఉన్నతర్వాత సామాజిక దారిద్ర్యమన్న దానికి అటే అర్థంలేదు

ఈనాటి దారిద్ర్యం కేవలం వ్యక్తిగతమైనది వ్యక్తి స్వత్వజనితమైనది బట్టల మిల్లులో పనిచేసే వాడి వస్త్రహైన్యమూ, పొలాలు దున్నేవాడి క్షుద్బాధా, ఈ నాటి దారిద్ర్యానికి ప్రత్యేక నిదర్శనాలు సంపద జాస్తిగా ఉత్పత్తి అయి కాటకాలు వస్తాయి నిరుద్యోగం ఏర్పడుతుంది లక్షలాది ప్రజలు మాడిచస్తారు ఈనాటి దారిద్ర్యం యొక్క అసలుస్వరూపం అదే కొత్త పొలాలను సాగులోకి తీసుకొని రావలసిన నదీజలాలు వరదలు వచ్చి ఉన్న పొలాలను ముంచెత్తేస్తాయి ఆనకట్టలూ, ప్రాజెక్టులు, కట్టవలసిన జనం ఆకలికి మాడుతుంటారు సంపదను సృష్టించుకొని వ్యక్తి స్వత్వాలను అదుపులోకి తీసుకు రావలసిన దరిద్ర దేశాలు లేని సంపదను ఉన్నవ్యక్తి స్వత్వాలనూ రక్షించుకొనేటందుకు ప్రజాద్రవ్యాన్ని రక్షణ ఖర్చుకింద ధారపోసేస్తారు అదీ ఈనాటి దారిద్ర్యం

ఎప్పటికైనా ఇది అంతం కాక తప్పదు ఇది అంతమైతేగాని మనిషి పురోగమించడని గుర్తించిన మేధావులీనాడు అసంఖ్యాకులున్నారు కాని ప్రస్తుతం వాళ్లకుండతగినంత పలుకుబడిలేదు వారు ప్రపంచ శాంతికోసం కృషి చెయ్యగలరు గాని యుద్ధాలు తీసుకు వచ్చేవారంత శక్తిమంతులుగా లేరు కాని పోను పోను మానవజాతి వీరిభాషే అర్థం చేసుకుంటుంది అందుచేత ఈ స్థితి మారక తప్పదు

వ్యక్తిత్వ వాదులీలోపుగా తమ భాష తాము మాట్లాడుతున్నారు  మన దారిద్ర్యానికి ప్రకృతి దారిద్ర్యం కారణంగా చెబుతున్నారు  'వెనుక బడిన దేశాల్లో జనం జాస్తిగా ఉన్నారు  వీరు భూమి మీదపడి  తింటున్నారు  భూసారం వీరిని భరించలేదు  అంటు వ్యాధులవల్ల వీరు లక్షల సంఖ్యలో చావటం వీరికి కనపడని మేలు చేస్తున్నది  ఇండియాలో గర్భనిరోధనా కేంద్రాలు పెడితే ఇండియా సమస్య పరిష్కారమవుతుంది', ఇటువంటి సిద్ధాంతాలు చెబుతున్నారు ఇండియాలో ఏటా వరదలు వస్తాయి  వీలయిన చోటనల్లా ప్రాజెక్టులు కడితే  అనేక లక్షల ఎకరాలు సాగులోకి వస్తాయి  అంతులేని విద్యుచ్ఛక్తి ఉత్పత్తి అవుతుంది  ఇండియా జనాభా రెండింతలయినా తిండికి కరువు లేకుండా చేసుకోవచ్చు  వ్యక్తిస్వత్వాలు సడలించినట్లయితే ఎడారులను పొలాలు చెయ్యవచ్చు  భూసారం సముద్రం పాలుకాకుండా చెయ్యవచ్చు  నదులను మన ఇష్టం వచ్చినచోట ప్రవహింప జేయవచ్చు  గాలినుంచి నీటినుంచి సంపదను పిండవచ్చు కాని వ్యక్తిస్వత్వవాదులీ విషయాలు చెప్పరు  ఎన్ని రకాల పరిశోధనలను వారు కొనుక్కొని అణచివేస్తున్నారో చెప్పరు  ప్రకృతిని మానవుడికి అనుకూలంగా మార్చడానికి అణుశక్తి ఎంతో ఉపయోగిస్తుంది  ఆ అణుశక్తిని వ్యక్తి స్వత్వవాదులు బొగ్గుకు బదులూ నూనెకు బదులూ వినియోగించటానికెందుకు పరిశోధనలు చెయ్యరో చెప్పరు  దాన్ని వారు యుద్ధ సాధనం గానే ఉపయోగిస్తారు  వారికి కావలసింది అణుశక్తి ద్వారా శ్రామిక యుగం పెంపొందటమే కాని అంతం కావటం కాదు  వారు వ్యక్తి దారిద్ర్యాన్ని ఒక్కనాటికి అంతం చెయ్యరు  అది అంతంకాకుండా ఉండటానికి కావలిస్తే యుద్ధాలు చేస్తారు  వీరిప్పటికి వంద ఏళ్ళ నుంచీ ప్రపంచం మీద పెత్తనం చలాయిస్తున్నారు  ఇంకో వెయ్యేళ్లు పెత్తనం చలాయించినా ఏదోమూల బరువులెత్తేవాళ్ళు, బళ్ళు లాగేవాళ్ళూ, కండలు కరిగేటట్టు పనిచేసినా అడవి మనిషి ఆనందం కూడా లభ్యం కానివాళ్ళూ,  తమ శ్రమ శక్తిని ఏకాడికీ అమ్ముకోలేని వాళ్ళూ ఉంటూనే ఉంటారు  అడవి మనిషి కూడా అర్థం చేసుకోలేని వ్యక్తిదారిద్ర్యాన్ని తెచ్చిపెట్టే వ్యక్తి స్వత్వాలు ప్రపంచం మారణంకోసం బహిరంగ సన్నాహాలు చెయ్యగలుగుతున్నాయంటే మేధాజీవిగా మానవుడు ఎంత ముందుకు వచ్చిందీ మనం ఊహించవచ్చు

తెలుగు స్వతంత్ర, వారపత్రిక, 30-6-1950

## 12. కొరియా యుద్ధం: తెరవెనుక సత్యాలు

జూన్ 25తేది ఆదివారం తెల్లవారు జామున ఉత్తర కొరియా సేనలు సరిహద్దు మీదుగా దక్షిణ కొరియా మీదికి నడిచాయి  ఉత్తర కొరియాకు టాంకులున్నాయి  విమానాలున్నాయి ఫిరంగులున్నాయి  దాదాపు రెండు లక్షల సేన ఉన్నది  దక్షణ కొరియాకు ఒక లక్ష సేన ఉన్నదేమో, ఇంకేమీ లేదు  దాన్ని యుద్ధం అనటానికి వీల్లేదు  ఉత్తర కొరియా సేనలు ఇంచుమించు నిరాఘాటంగా నడచివచ్చాయి

ఉత్తర కొరియా దక్షిణ కొరియా సేనలు తమ సరిహద్దుల్లోకి వెళ్లిపోవాలనీ, యుద్ధం నిలుపు కావాలనీ, ఐక్యరాజ్య సమితిలో సభ్యత్వం గల దేశాలు ఈ తీర్మానాన్ని అమలు జరిగేటట్టు చూడాలనీ సెక్యూరిటీ కౌన్సిల్ తీర్మానించింది

కొరియాకు సమితిలో సభ్యత్వం లేదు సెక్యూరిటీ కౌన్సిల్ తీర్మానించినప్పుడు రష్యాలేదు చైనా ప్రతినిధిగా చాంగ్‌కైషేక్ మనిషి ఉన్నాడు

మరి రెండు రోజులకు 27వ తేదీన-సెక్యూరిటీ కౌన్సిల్ మరో తీర్మానం చేసింది ఐక్యరాజ్య సభ్య దేశాలు దక్షిణ కొరియాకు సైనిక సహాయం చెయ్యాలనీ! ఈ తీర్మానం అమెరికా ప్రవేశ పెట్టింది ఇది ఇంకా నెగ్గక మునుపే అమెరికా సహాయం పంపింది అమెరికా సహాయం పంపాలని చేసిన నిర్ణయాన్ని, సెక్యూరిటీ కౌన్సిల్ ఆమోదించినది మాత్రమే అయింది

ఆక్షణం నుంచి ఐక్యరాజ్యసమితి వ్యక్తిత్వం లేదు అది అమెరికా బంటుగా మాత్రమే వ్యవహరిస్తున్నది వివిధ దేశాలవారు ఐక్యరాజ్య సమితికి పంపే సహాయాన్ని ఐక్యరాజ్య సమితి అమెరికాకు వప్పగిస్తుంది ట్రిగ్వీలీ (ఐక్యరాజ్య ప్రధాన కార్యదర్శి) ఒక కార్య వర్గాన్ని ఏర్పాటు చేశాడు వీరు చేసే పని ఏమిటి? వివిధ రాజ్యాలు చేసే సహాయాన్ని అమెరికా యుద్ధావసరాలకు సమన్వయించటమే! యుద్ధ తంత్రాన్ని అమెరికాకు ఐక్యరాజ్యసమితి ఆదేశిస్తుందా? ఆదేశించదు సరికదా, అమెరికా యుద్ధ తంత్రానికి ఏ విధంగా అడ్డుకూడా రాదు కొరియా యుద్ధంలో పాల్గొనే నావలకూ, విమానాలకూ, మనుషులకూ ఐక్యరాజ్య జెండాలు కూడా తగిలించడానికి నిర్ణయం జరిగింది

సెక్యూరిటీ కౌన్సిల్ తీర్మానాలను అనేక దేశాలు ఆమోదించాయి వాటిలో బ్రిటన్ కూడా ఉన్నది "ఉత్తర కొరియా దక్షిణ కొరియా మీద పడితే మధ్య మనకేమనేవాళ్ళున్నారు 18 ఏళ్ళక్రితం జపాను మంచూరియా మీద పడ్డప్పుడిట్లాగే అన్నారు " అన్నాడు బ్రిటిషు లేబరు నాయకుడు మోరిజన్ ఈ పోలికను ఎవరో విశ్వసిస్తారనుకోక పోతే మోరిజన్ ఉపయోగించి ఉండడు

'దక్షిణ కొరియాలో యుద్ధం ఆపటం తప్ప మాకింకో ఆలోచనే లేదు మూడో ప్రపంచ యుద్ధం ఆపటానికి మేం కొరియా యుద్ధంలోకి ఉరుకుతున్నాం ' అని అమెరికనులు

కొరియా యుద్ధాన్ని ఆపటానికిగాను అమెరికావాళ్ళు చాలా మంచి బందోబస్తులు చేశారు పసిఫికు నిండా నౌకలు పేర్చారు ఫార్మోజాకూ చైనా తీరానికి మధ్య ఒక నౌకాదళం పేర్చారు అదృష్టవశాత్తు ఆసమయానికే పసిఫిక్‌లో బ్రిటిషు నౌకాదళాలు కూడా ఉన్నాయి

జూలై 1న డుల్స్ చెప్పాడు 'నన్నడిగితే దక్షిణ కొరియాలో ఏర్పాటయిన ఆశాజనకమైన ఆకర్షవంతమైన ప్రజాస్వామికం చూసి ఉత్తర కొరియాకు కళ్ళు కుట్టాయి అందుకే వాళ్ళు దక్షణ కొరియాపై దాడిచేశారు '

ఎవరో అబద్ధం ఆడారు ఆంద్రూరాత్ కొరియాను గురించి రాస్తూ దక్షిణ కొరియాలో బీభత్సమూ, పైశాచికమూ తాండవం చేస్తున్నాయని చెప్పాడు దక్షిణ కొరియా అధ్యక్షుడు సింగ్మన్‌రీ, అతని అనుచరులూ ప్రజాప్రతినిధులు కారు వాళ్ళు ప్రజలపై అమానుష హింసలు సాగించారు వారు ఒకప్పుడు జపానుతో చేతులు కలిపినారు జపాను దగ్గిర ప్రాణహింస సమగ్రంగా నేర్చుకున్న వారు

రాత్ పక్షపాతంగా రాయలేదు ఉత్తర దక్షిణ కొరియాలు రెండూ పోలీసు రాజ్యాలే రెంటిలోనూ ఏకపక్ష ప్రభుత్వమే అయితే ఒక పక్షాన-ఉత్తరాన-అనేక సంస్కరణలు జరిగాయి

రెండో పక్షాన లేవు ఉత్తరాన జీవితం పెరిగింది దక్షిణాన జీవితం విచ్ఛిన్నం అయింది ఉత్తర కొరియా రష్యాకు భృత్యురాలు, దక్షిణ కొరియా అమెరికాకు బానిస

ఆంఢ్రూరాత్ కొన్ని సంశయాలు తీర్చలేదు ఉత్తర కొరియాలో ప్రజలలో ఐక్యత ఉన్నది దక్షిణ కొరియాలో లేదు రష్యా ఉత్తర కొరియాను నమ్మి ఆయుధాలిచ్చింది దక్షిణ కొరియాకు అమెరికా ఇవ్వలేదు ఆయుధాలిస్తే దక్షిణ కొరియా ఉత్తర కొరియా మీద పడుతుందని అమెరికా భయపడుతుందన్నాడు రాత్! ఇది అమెరికా శాంతి సూత్రాలకు విరుద్ధం రష్యా యుద్ధానికి దిగకుండా జేసి ప్రపంచశాంతిని కాపాడటానికి ముందు అణువు బాంబులూ, ఇప్పుడు హైడ్రోజన్ బాంబూ ఉండగలందులకు ప్రబలమైన యుద్ధ శక్తిగల ఉత్తర కొరియా పక్కనే దక్షిణ కొరియాను నిరాయుధంగా వదులుతుందా? అట్లా అయితే కొరియా యుద్ధానికి ప్రథమ కారణం తానే అని అమెరికా అంగీకరిస్తే బాగుంటుందిగా!

సెక్యూరిటీ కౌన్సిల్‌లో అమెరికా నెగ్గించిన తీర్మానాన్ని, అదే ధోరణిలో అమెరికా సాగించిన యుద్ధ చర్యనూ అందరూ ఆమోదించలేదు కొరియాలో అమెరికా దురాక్రమణ చేసిందని రష్యా అన్నది అయితే రష్యా ఆమాట అంటుందని అందరికీ తెలుసు

కాని దాదాపు అమాటే చికాగో ట్రిబ్యూన్ పత్రికా అన్నది చికాగో ట్రిబ్యూన్ రష్యను పత్రిక కాదు

ఈజిప్టు అమెరికా తీర్మానాన్ని ఆమోదించలేదు అందుకై ఈజిప్టును బ్రిటను ప్రతినిధి విమర్శించగా ఈజిప్టు ప్రతినిధి సెక్యూరిటీ కౌన్సిల్‌లో, 'మాకు కావలసింది శాంతి మాకు జయించేటందుకు దేశాలు లేవు మేం ప్రపంచాధిపత్యాని కెగబాకటం లేదు!' అనికూడ ఎత్తి పొడిచాడు

రాజకీయ వేత్తల మాట ఎట్లా ఉన్నా సామాన్య ప్రజానీకానికి కొరియా హడావుడి గురించి అనేక సందేహాలు కలక్క మానవు

మొదటి సందేహంః చాంగ్‌కైషేక్ కూ చైనా కమ్యునిస్టులకూ చచ్చే యుద్ధం అయింది హాలండు ఇండోనేషియా మీద, ఇండోచైనా మీద ఫ్రాన్స్, మలయామీద బ్రిటను యుద్ధం సాగించటం జరిగింది ఇవిసామ్రాజ్యదేశాలకూ వలసలకూ మధ్య జరిగిన యుద్ధాలు, ఆక్రమ యుద్ధాలు ఎందు చేతనంటే గత యుద్ధంలో ఈ సామ్రాజ్య దేశాలు ఈ వలసలను ఫాసిస్టుల నోట పెట్టిపోగా వలసలు ఫాసిస్టులతో పోరాడి తమకు తామై బయట పడ్డాయి యుద్ధం ఆగిపోగానే ఈ సామ్రాజ్య దేశాలు సైనిక సహాయంతో ఈ వలసల మీదికి మళ్లీ వచ్చిపడ్డాయి అమెరికా అభ్యంతరం చెప్పలేదు ఇజ్రేలుకూ అరబ్బు రాజ్యాలకూ పాలస్తీనాలో యుద్ధం జరిగింది అమెరికా ససైన్యంగా వచ్చి చెయ్యిచేసుకో లేదు కొరియా యుద్ధం వీటి కన్న ఏవిధంగా ఎక్కువయింది? ఆ యుద్ధాలవల్ల రాని ప్రపంచ సంగ్రామం కొరియా యుద్ధం వల్ల వస్తుందని అమెరికా అనటానికి గల ఆధారమేమిటి?

రెండో సంగతిః అమెరికా దక్షిణ కొరియా ప్రభుత్వాన్ని సమర్థించుతూ రావటంలో గల రాజకీయ సూత్రమేమిటి? సింగ్మన్‌రీ ప్రభుత్వం అమెరికా ఆరాధించే 'స్వతంత్ర' ప్రభుత్వాలకు తార్కాణమా? అమెరికా ప్రపంచమంతటా స్థాపిస్తానంటున్నది సింగ్మన్‌రీల వంటి ఫాసిస్టు

కిరాతకులనేనా? ఒకవేళ దక్షిణ కొరియాయే ఉత్తర కొరియా మీద దాడి చేసి ఉంటే అమెరికా ఉత్తర కొరియా పక్షాన ఇట్లాగే జోక్యం కలిగించుకొని ఉండేది అనుకునే దేశం నేటి ప్రపంచంలో ఏ మూలనన్నా ఉన్నట్టు ఎవరైనా ఊహించుకోగలరా?

ఉత్తర కొరియాలో ఉన్న ప్రభుత్వం రష్యా ఏర్పాటు చేసి వెళ్లినది కనకా, అది తల ఎత్తింది కనకా దాన్ని అమెరికా ఏ కర్రతో కొట్టినా ఎటువంటి రాజకీయ నీతికి, అంతర్జాతీయ నీతికీ భంగమంటూ ఉండటానికి అవకాశమే లేదని ప్రజలు సరిపెట్టుకోవలసి వస్తున్నది అటువంటప్పుడు అమెరికా–ఉరుము ఉరిమి మంగలం మీద పడ్డట్టు కొరియామీద పడకపోతే రష్యామీదనే ఎందుకు పడరాదు? దక్షిణ కొరియాలో యుద్ధం ఆపటానికి గాని అమెరికా ఉత్తర కొరియా మీద బాంబులు వెయ్యటమూ, ఫార్మోజాను తననౌకలతో చైనా కమ్యూనిస్టుల నుండి రక్షించటమూ సక్రమమైతే రష్యామీద దాడిచేయటం ఒకటే సక్రమం కాకపోయిందా?

అమెరికా కొరియాలో అడ్డుతగలకపోతే ఉత్తర దక్షిణ కొరియాల మధ్య జరిగే యుద్ధం ప్రపంచయుద్ధానికి దారితీసి ఉండేదేనని ప్రపంచంలో ఎవరూ నమ్మరు కాని ఈ కొరియా యుద్ధం అమెరికా యుద్ధోన్మాదాన్నీ, రాజకీయ ఆదర్శాలనూ నగ్నంగా బయటపెట్టింది ఇప్పుడున్న ఐక్యరాజ్య సమితి ప్రత్యక్షంగా అమెరికా కాలికింది పీచుగా తయారై తనకుండవలసిన అంతర్జాతీయ ఖ్యాతిని పూర్తిగా పోగొట్టుకున్నది అమెరికా ఈ పని చేసిన మీదట ఉత్తర కొరియా దక్షిణ కొరియా మీదికి నడవటం న్యాయమా, అన్యాయమా, క్రమమా, అక్రమమా, అన్న ప్రశ్నకు తావులేకుండా పోయింది ఇదే అమెరికా సాధించిన మహత్తరమైన 'ఫలితం' అమెరికా వెనక వేనుకు వస్తున్న దక్షిణ కొరియా ప్రభుత్వం ఏ సిద్ధాంతం ప్రకారమూ రక్షించ బడదగిన ప్రభుత్వం కాదు

తెలుగుస్వతంత్ర, వారపత్రిక 7-7-1950

# 13. చైనా ఉదాహరణ

రెండవ ప్రపంచ యుద్ధం తరవాత స్వాతంత్ర్యం సంపాదించిన దేశాలకు, నిర్దిష్ట ఆర్థిక విధానం తప్ప గత్యంతరం లేదు ఒక కారణం యుద్ధంలో జర్మనీ, ఇటలీ, జపానులే కాక సామ్రాజ్య వాదమూ, దానికి ఆధార భూతమైన పెట్టుబడిదారీ విధానమూ కూడా ఓడి పోయాయి నిజమే, ఒకనాడు పారిశ్రామిక విప్లవాలు చేసిన దేశాలలో, పెట్టుబడిదార్ల లాభాలకూ జాతీయాభివృద్ధికీ అవినాభావ సంబంధం ఉన్నట్టు భ్రమ కలిగింది కాని 1945 అనంతరం ఈ భ్రమకు అవకాశం లేదు అంతర్జాతీయంగా పెట్టుబడి దారీ విధానానికి గత్యంతరం లేకనే, రెండవ ప్రపంచ యుద్ధం వచ్చింది అందులో పెట్టుబడిదారీ విధానం తాత్వికంగా అపజయం పొందబట్టే బ్రిటను ఫ్రాన్సు మొదలైన పారిశ్రామిక దేశాలలో, అది సోషలిజం వెనక తలదాచుకోవలసి వచ్చింది ఒక్క అమెరికాలో తప్ప, ఇంకెక్కడా పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ దెబ్బతినకుండా ఉండలేదు

సామ్రాజ్యవాదం నుంచి విముక్తి పొందిన దేశాలు, పెట్టుబడిదారీ విధానంలో జాతీయ పునర్నిర్మాణం సాగించుదామను కోవడం, కొరివితో తలగోక్కోవటమే ఎందుకంటే

పెట్టుబడిదార్లకు అచ్చుపోసి వదిలితే మరుక్షణం వాళ్ళు అంతర్జాతీయ పెట్టుబడి దారితో చేతులు కలిపి దేశాన్ని ఇతర దేశాలకు అమ్మి జాతీయోద్యమానికి ద్రోహం చేస్తారు అంతర్జాతీయ పెట్టుబడిదారీ ప్రాణం మీదికి వస్తే మరో ప్రపంచ యుద్ధానికి పునాదులు నిర్మిస్తారు అట్లాంటిక్ ఒడంబడికలో చేరిన దేశాలు అమెరికాకు ఎట్లా అమ్ముడుపోయి, దేశ క్షేమాల గొడవ ఏమీ లేకుండా ఎట్లా యుద్ధ యత్నాలకు దిగిందీ మనం ఇవాళ ప్రత్యక్షంగా చూస్తున్నాం సోషలిస్టు ప్రభుత్వాన్ననీ, సామ్రాజ్యవాదానికి స్వస్తి చెప్పాననీ, చెప్పుకునే బ్రిటను, తనకెట్టి యుద్ధ భయమూ లేకపోయినా, అమెరికాకు చేతులు మోడ్చి యుద్ధ ప్రయత్నాలలో మునిగింది బ్రిటను మీద అణు బాంబులు పడితే ప్రజలు ఎట్లా రక్షణలు ఆశ్రయించాలో తెలుపుతూ, కరపత్రాలు ప్రచురింపబడుతున్నాయి ఇంత కంటే హేయమైన పరిస్థితి ఉండబోదు కాని పైకి సోషలిస్టు విధానమని చెబుతూ, పెట్టుబడిదార్ల స్వేచ్ఛకు సౌకర్యాలు కల్పించే బ్రిటిషు ప్రభుత్వం అమెరికాతో పాటు " ఉరిపెట్టుకోక" తప్పదు

పెట్టుబడిదారీ విధానానికి స్వస్తి చెప్పి, నిర్దిష్ట ఆర్థిక విధానాన్ని అనుసరించి, జాతీయ నిర్మాణం సాగించే దేశాలలో ప్రజాస్వామికం లేదంటున్నారు అవిరష్యా ఆశ్రిత దేశాలంటున్నారు అమెరికా పెట్టుబడిదారీ దేశాలను యుద్ధంలో ముంచితే, రష్యా సోషలిస్టు దేశాలను యుద్ధంలో ముంచుతుందంటున్నారు ఇదంతా నిజమే అనుకున్నా, నిర్దిష్ట ఆర్థిక విధానం అవలంబించిన దేశాలలోనే అభివృద్ధి కనిపిస్తున్నది చైనాలో ఒక మూల ఉండిన కమ్యూనిస్టులను, చాంగ్‌కైషేక్ ప్రభుత్వం, 600 కోట్ల అమెరికను డాలర్ల సహాయంతో గెలవలేక పోయింది ఉత్తర కొరియా దాడికి, సింగ్మన్‌రీ ప్రభుత్వం తట్టుకోలేక పోయింది అమెరికా ముగ్గులోకి దిగి చావు దెబ్బలు తింటున్నది ఈ ప్రభుత్వాలకు ప్రజల సహకారం ఉన్నట్టు స్పష్టం

చాంగ్-కై-షేక్, సింగ్మన్‌రీలు క్షుద్రులనీ, హేయమైన, బాధ్యతా రహితమైన పరిపాలన సాగించారనీ, అందుచేత వారి ప్రభుత్వాలు బలహీనమైన వనీ చెప్పి లాభం లేదు ఈ ప్రభుత్వాలనే అమెరికా బలపరుస్తున్నది వీటికే ధన సహాయం చేస్తున్నది వీటికోసమే అమెరికను యువకులను ఆహుతి చేస్తున్నది

ఒక్కచైనా, కొరియాలలోనే కాదు నిర్దిష్ట ఆర్థిక విధానాన్ని ప్రతిఘటించే దేశాలన్నిటి రక్షణకూ, అమెరికా అంతులేని సహాయం చేస్తున్నది పెట్టుబడిదారీ విధానమే ప్రజాస్వామిక విధానమై, అమెరికా సహాయం లేక పెట్టుబడిదారీ దేశాలు బ్రతకలేని పక్షాన ప్రజాస్వామిక మనే మాటకు అర్థమేముంటుంది? ఒక్క ముక్కలో అమెరికా అనుసరించే నైతిక రాజకీయ సిద్ధాంతా లేవి?

ఈవాళ చైనా పునర్నిర్మాణం ఎట్లా సాగుతున్నదీ తెలుసు కోవటం చాలా ఉపయోగం కేంద్ర చైనా ప్రజా ప్రభుత్వం ఏర్పడిన ఈ ఏడాది లోపుగా, అంతులేని సంస్కరణలు జరిగాయి వీటికి పునాది, మంచూరియాలో జరిగిన భూసంస్కరణలు

మంచూరియాలో నాలుగేళ్ళపాటు ప్రజాస్వామిక ప్రభుత్వం నడిచి నందుకు ఫలితంగా అక్కడ రెండుకోట్ల మంది రైతులకు పొలాలు, వ్యవసాయపు పనిముట్లూ, పశువులు, మొదలైనవి ఇవ్వబడ్డాయి ఆయేటికాయేడు సేద్యం జరిగే భూముల విస్తీర్ణంతో బాటు పంటలు కూడ

హెచ్చాయి  ఈయేడు 180 లక్షల హెక్టార్ల భూమి సాగులోకి కొత్తగా తీసుకురాబడుతున్నది రెండేళ్లనుంచి భూమి శిస్తు తగ్గించబడుతున్నది  దీనితోపాటు పారిశ్రామిక వస్తువుల ధరలు తగ్గటంచేత రైతుల జీవన ప్రమాణం హెచ్చుతున్నది  దీనికి నిదర్శనంగా వారు 1947లో కొన్న బట్టకు నాలుగింతలు 1949లో కొన్నారు  చైనా ప్రభుత్వం పారిశ్రామికాభివృద్ధికి భూసంస్కరణలను ఆధారంగా ఉపయోగించింది  చైనా మొత్తంలో మంచూరియా తొమ్మిదో వంతు లేదు  అక్కడి జనాభా చైనాజనాభాలో 16రోవంతు లేదు  అయినా మంచూరియా ఆధారంతో, చైనా అంతటినీ అభివృద్ధి పరచడానికి ఏర్పడింది  చైనా అభివృద్ధికి అతిప్రధానమైనది, దేశమంతటా ఒకే విధమైన, ఆర్థిక, రాజకీయ, వ్యవస్థ ఏర్పడటం ఇది వరలో జమిందారీ వ్యవస్థ ఉండి ఇది సాధ్యం కాలేదు

భూసంస్కరణల విషయంలో చైనా ప్రభుత్వం అవలంబించిన విధానం, రైతులు కాని భూస్వాములను రద్దు చెయ్యడమే  అదనపు భూములుంటే తప్ప పెద్ద రైతుల జోలికి కూడా ప్రభుత్వం పోదు  యుద్ధకాలంలో పెద్దరైతులు కొందరు కోమింటాంగ్ పక్షాన పోరాడి ఉండటం చేత రైతులు వారి పొలాలు పంచుకోవటం జరిగింది  కాని 1947 అక్టోబరులో ప్రచురింపబడిన భూవిధానంలో, పెద్దరైతులకూ, భూస్వాములకూ తేడా విస్పష్టం చేయబడింది  దీనివల్ల యుద్ధ పరిస్థితిలోనూ, రాజకీయ పరిస్థితిలోనూ చాలా మార్పు కలిగింది

ఈ విధానం అనుసరించటం వల్ల భూస్వాములు ఇతర వర్గాలనుంచి వేరుపడటమే కాక వ్యవసాయంలో పాలున్నవారందరికీ భూమిలభించినది  భూస్వాముల భూమీ, పశువులూ, వ్యవసాయ పరికరాలూ, అదనపు ధాన్యమూ ప్రభుత్వపరమైనాయి  దేవస్థానాల కిందా విద్యాలయాలకిందా ఉన్న భూములు కూడా స్వాధీన పరుచుకోబడ్డాయి  కానిఇతర ఆధారం లేక వ్యవసాయం చేయటానికి సిద్ధంగా ఉన్న భూస్వాములకు, మత గురువులకూ గ్రామసీమల్లో పొలాలివ్వడానికి వీలు కలిగించబడింది  ఈ విధంలోగా పొలం దున్నేవాడిమీద పెత్తందారు లేకుండా చేయబడింది  దానితో బాటే కొన్ని భూముల ప్రభుత్వ వ్యవసాయం సాగింది భూములు అమ్మటానికీ, కవులుకివ్వటానికీ లేకుండ చెయ్యటం వల్ల భూమికొద్ది మందిచేతిలోకి తిరిగి పోవటం అసాధ్యం చేయబడింది

దేశీయ ఆర్థిక పునాదికి మావో-సే-టుంగ్ మూడు ప్రధాన సూత్రాలు చెప్పాడు భూసంస్కరణలు పూర్తి చెయ్యటం, పారిశ్రామిక వ్యవసాయోత్పత్తులను సమన్వయించటం, ప్రభుత్వ వ్యయం తగ్గించటం

నిర్దిష్ట కార్యక్రమం ప్రకారం నడుస్తుంటేనే ఈ మూడు ప్రధాన సూత్రాలూ అమలు చెయ్యటానికి మూడేళ్లు పడుతుందని చైనా ప్రభుత్వం అంచనా

ఈ సూత్రాలను అమలు చెయ్యటానికి ఏ అడ్డంకులు లేని రాజకీయ విధానాలను, చైనా అనుసరిస్తున్నది  పూర్వం రష్యా ఆధారపడినట్లుగా చైనా పెట్టుబడిదారీ దేశాలను నమ్ముకుని నీటిలోకి దిగటం లేదు  చైనా రష్యాలకు మధ్యజరిగిన ఒడంబడికవల్ల రష్యానుంచి చైనాకు అవసరమైన యంత్ర సామాగ్రి వగైరా లభిస్తున్నది  రెండవ ప్రపంచ యుద్ధానికి పూర్వం పెట్టుబడిదారీ దేశాలన్నీ ఇచ్చిన యంత్ర సామాగ్రి అప్పుగా లభిస్తుందని అంచనా కట్టబడింది

కోమిటాంగ్ వారు ధ్వంసం చేసిన మంచూరియా పరిశ్రమలన్నీ బాగు చేయబడ్డాయి అక్కడి పారిశ్రామికోత్పత్తి మేఘాల మీద పరుగెత్తు తున్నది ఈ యేడు ప్రభుత్వం పరిశ్రమలకు గాను ఖర్చు చేసే దానిలో నూరింట 85 వంతులు భారీ పరిశ్రమలకు వినియోగిస్తున్నారు కిందటేడు జరిగిన పారిశ్రామికోత్పత్తికి దాదాపు రెట్టింపు ఈ యేడు జరుగుతున్నది యంత్ర పరికరాలూ, ఉక్కూ మొదలైన వాటి ఉత్పత్తి మూడున్నర రెట్లుంటుంది ఈయేటి ఉత్పత్తి ప్రణాళికను మించి ఉత్పత్తి సాగుతోంది మంచూరియాలో నిరుద్యోగం లేకుండా పోవటమేకాక చైనా ఇతర ప్రాంతాల నుండి కార్మికులూ, నిపుణులూ మంచూరియా చేరుతున్నారు 1949లో మంచూరియాకు పైనుంచి దాదాపు రెండున్నర లక్షలమంది వచ్చారు ఈయేడు మూడు మాసాలు గడవక పూర్వమే, ఇంకా అంతమంది పైనుంచి వచ్చారు కార్మికుల వేతనాలు ఆనెల కానెల హెచ్చు తున్నాయి పదార్థాల ధరలు తగ్గుతున్నాయి ముఖ్యంగా ఆహార ధరలు నిలబడ్డాయి కొన్నిచోట్ల కొద్దిగా తగ్గాయి కూడానూ, పోస్టు ధరలూ, రైలు ధరలూ తగ్గాయి అమెరికా డాలరు ధరతో చైనా కరన్సీ ధర నూటికి 11 వంతులు పెరిగింది!

చైనాలో అమలు జరిగే విధానాలు జూస్తే మన దేశంలో మూడు సంవత్సరాల స్వయం పరిపాలన ఏ సమస్యనూ ఎందుకు పరిష్కరించలేక పోయిందో, అర్థమవుతుంది ఆహార సమస్యతో సతమతమవుతూ కూడా మనం సరి అయిన భూసంస్కరణలు ఆరంభించలేకపోయాం దున్నే వాడి పైనున్నవాణ్ణి తొలగించలేదు వ్యవసాయం చెయ్యనివాణ్ణి భూమి మీదినుంచి వెళ్ళగొట్టలేదు

భూసంస్కరణల పునాది మీద మన ఆర్థిక వ్యవస్థ నిలబడాలన్న ప్రయత్నం జరగలేదు అందుచేత పారిశ్రామికోత్పత్తికీ వ్యవసాయోత్పత్తికీ సమన్వయం లేదు భూస్వాములు భూమిని ఆధీనంలో ఉంచుకోవటంతో బాటు మిల్లుల వాళ్లూ దొంగ వ్యాపారస్తులూ ధాన్యంపై అధికారం సంపాదించి వర్ణనాతీతమైన ఆహారదుస్థితి కలిగించారు ఈ దుస్థితిని తొలగించటానికి ప్రభుత్వం ఎన్ని "రాళ్లు" విసరినా తగలవలసిన వాళ్ళకు తగలక, ప్రజలకు తగులు తున్నాయి

మనరాజకీయ విధానం, పెట్టుబడిదారీ దేశాలను మన నెత్తి మీదికి తెస్తున్నది బ్రిటను మనకు బోలెడంత బాకీ ఉన్నదికాని యంత్ర సామగ్రి ఇవ్వదు పునాదిలో భూసంస్కరణలు లేక ఉన్న యంత్ర సామగ్రి కూడ పూర్తిగా పనిచెయ్యటం లేదు యంత్రోత్పత్తి సరుకులకోసం మనం ఎన్నిశతాబ్దాల పాటు పైదేశాలమీద ఆధారపడి ఉన్నా ఉండవచ్చు

ముందుగా కాంగ్రెసు ప్రభుత్వం వైఖరిలో విప్లవయుతమైన మార్పులు రావలసి ఉంది ఆపైన స్వర్గం వెంటనే ఏర్పడుతుందని కాదు కాని ప్రజాశక్తులు అప్పుడు కాని కలసిరావు నిజమైన జాతీయ నిర్మాణానికి పునాది ఆవిధంగా గాని ఏర్పడదు మన ప్రభుత్వం తనకున్న కష్టాలు ఆలోచించటం మాని వాటిని ప్రజలతో పంచుకోవటం ప్రారంభించాలి నిన్నటివరకు చైనా కమ్యూనిస్టులు యుద్ధం సాగిస్తూనే సంస్కరణలు ప్రవేశపెట్టారు ఉత్తర కొరియన్లు తాము ఆక్రమించిన ప్రాంతాలలో సంస్కరణలు ప్రవేశ పెట్టుతున్నారు మన ప్రభుత్వం ఈ పని చెయ్యలేకపోతే, ప్రజలు, చెయ్యగల ప్రభుత్వాన్ని ఎన్నుకుంటారు

తెలుగు స్వతంత్ర వార పత్రిక, 25-8-1950

# 14. యుద్ధ సన్నాహాలు

ఉత్తర అట్లాంటిక్ ఒడంబడికలో చేరిన ఒక్కొక్క దేశమే అమెరికా అదేశాల్ని శిరసావహించి యుద్ధ సన్నాహం ఆరంభించింది

బ్రిటను, ఫ్రాన్సు, బెల్జియం, లగ్జెంబర్గు మొదలైన దేశాలలో నిర్బంధ సైనిక సేవాకాలం విస్తరించబడింది బ్రిటనులో సైనికుల జీతాలు కూడా హెచ్చించ బడ్డాయి అసలే బ్రిటనులో కార్మికుల జీవనప్రమాణం అధ్వాన్నంగా వుంది ఈ 'నూతన' సైనిక విధానం మూలంగా బ్రిటనుకు ఆర్థికంగా చిక్కులుంటాయని బ్రిటుషు ప్రధాని అట్లీ ఒప్పుకున్నాడు

ఇదే సైనిక విధానాన్ని ఇతర పశ్చిమ యూరపురాజ్యాలు అవలంబిస్తున్నప్పుడు దానిని బ్రిటను యొక్క 'నూతన' సైనిక విధానం అనటంలో స్వారస్యం అటే లేదు

ఈ నూతన సైనిక విధానం కేవలం ఆమెరికా నిర్ణయించింది

అమెరికా యుద్ధనిర్ణాయకులు డీన్ ఆచిసన్, లూయీ జాన్సన్, మార్షల్ విశ్వదాత హారిమన్ కలిసి సెనేట్ కమిటీని నాలుగు గంటల పాటు ఊదరబెట్టి, ట్రూమన్ యుద్ధ ఖర్చు కింద అడిగే 400 కోట్లూ ఇప్పించమంటూ 'మన' యుద్ధ యత్నాలు కమ్యూనిస్టు దేశాల, దురాక్రమణ సామర్థ్యానికి అనుగుణంగా లేకపోతే శాంతికి ప్రమాదం జరుగుతుందన్నారు, ఈలెక్కన చూస్తే సర్వత్రానిర్బంధ సైనిక సమీకరణకంటే తక్కువ యత్నం చాలదని కూడా అన్నారు

అందుచేత నిర్బంధ సైనిక సమీకరణ విధానం అమెరికా అంచనాలలోదేనని తెలిపోతున్నది కాని ఈ నిర్బంధ సైనిక సమీకరణ విధానం బ్రిటను, ఫ్రాన్సు వగైరా దేశాలతో పాటు అమెరికాలో కూడా జరుగుతుందని అమెరికనులు అపోహ పడగలరు అందుకని అధ్యక్షుడు ట్రూమన్, ఈ నిర్బంధ సైనిక విధానం అమెరికాలో అమలు జరగదని స్పష్టంచేశాడు దానికి సంబంధించిన చట్టం ఒకవేళ తయారు చేసినా అది అమలు జరగటానికి చాలాకాలం పడుతుందిట అటువంటి చట్టం అమలుచేయవలసిన అవసరం కలగ లేదుట కలిగిందని డీస్ ఆచిసన్ అంటున్నాడు కాని ఇద్దరి మాటలకూ వైరుధ్యం లేదు అమెరికాలో నిర్బంధ సైనిక విధానం, అమెరికాలో అమలు జరగవలసిన ఆవశ్యకత కలగలేదు యూరపులోని 'స్వతంత్ర్య ప్రజాస్వామిక' దేశాలలో అమలు జరగవలసిన ఆవశ్యకత చాలా హెచ్చుగా కలిగింది

అమెరికా నిర్ణయించిన 'నూతన' బ్రిటిషు సైనిక విధానంలోని ఆంతర్యమేమిటంటే అట్లాంటికు ఒడంబడిక దేశాలు రానున్న యుద్ధానికి సమిధలు ఇచ్చుకుంటే అమెరికా నిప్పుపుల్లలు సరఫరా చేస్తుంది

అమెరికా ఇంకా శాంతి గురించీ, దురాక్రమణ గురించీ మాట్లాడుతూ ఉండటం గమనించదగ్గ విషయం అయితే ఇప్పుడు అమెరికా వాడే పదజాలానికి కొత్త నిఘంటువు ఒకటి అవసరం

దక్షిణ కొరియాలో ఉత్తర కొరియనులు చేసినది దురాక్రమణ అమెరికా చేసినది దురాక్రమణ కాదు ఉత్తర కొరియనులు చేసినది శాంతిభంగ చర్య అమెరికనులు చేస్తున్నది శాంతిభంగ చర్యకాదు

ఏ దేశంలో కమ్యూనిస్టులకూ, కమ్యూనిస్టు వ్యతిరేకులకూ సంఘర్షణ జరిగినా అది శాంతి భంగ చర్య-కమ్యూనిస్టులు జపానులో సమ్మె నడిపించినప్పటికీ అది ప్రపంచ శాంతికి ప్రమాదకరమే కాని జపానులో కమ్యూనిస్టుల్ని వేటాడటం శాంతిస్థాపన చర్య ఎక్కడా కనీ వినని ఎత్తున టోక్యోలోనూ, ఇతరచోట్లా కమ్యూనిస్టు వేట సాగుతున్నట్లు ప్రెస్ ట్రస్ట్ విలేఖరి టోక్యోనుంచి రాశాడు అమెరికా వందల కొద్దీ కోట్లు కుమ్మరించి 'స్వతంత్ర' దేశాలకు మారణాయుధాలిచ్చి, నిర్బంధ సైనిక సమీకరణ సాగించటం శాంతిభంగ చర్యకాదు యుద్ధ ప్రయత్నం మూలంగా ఈ 'స్వతంత్ర' దేశాలన్నిటిలోనూ ఇన్‌ఫ్లేషన్ మొదలైన ఆర్థిక పీడలు తెచ్చిపెట్టడం శాంతిభంగ చర్యకాదు

ప్రస్తుతం అమెరికా మార్కు ప్రజాస్వామికం వాడే రాజకీయ పరిభాష ఈ ధోరణిలో ఉన్నది ఈ పరిభాష అమెరికా ప్రభుత్వం యొక్క చేతలకు ఎక్కడా తీసిపోదు స్టేట్ డిపార్టుమెంటు చేత అసమర్థుడనీ, అవినీతిపరుడనీ అనిపించుకున్న చాంగ్‌కైషేక్, చైనాలో మంచినీళ్ళు ఇప్పించలేని కొమింటాంగు ప్రభుత్వం చైనా ప్రభుత్వంగా ఇప్పటికీ అమెరికాలో గుర్తించబడుతున్నది మానవుల జాబితాలో నుంచి ఏనాడో కొట్టివేయబడిన సింగ్మెన్‌రీ అమెరికాకు మరొక ఆప్తుడు ఆ పెద్దమనిషి దక్షిణ కొరియాలో సాగించిన పైశాచిక పరిపాలనవల్ల అమెరికా ఆరాధించే శాంతికి చిన్నమెత్తు నష్టం కలగలేదు

అమెరికా యుద్ధోన్మాదు లిప్పుడు రష్యా పశ్చిమ యూరపు దేశాలపై దండెత్తి వస్తుందన్న ఆందోళన మానేశారు ఆ ప్రచారం పారదు ఇప్పుడు అమెరికా ఆయత్తమవుతున్నది రష్యా దాడి ఎదుర్కోవటానికి కాదు కొరియా లాగే మరే పీడిత దేశంలోనైనా కమ్యూనిస్టులకూ, కమ్యూనిస్టు వ్యతిరేకులకూ సంఘర్షణవస్తే దాన్ని దురాక్రమణ అని, అక్కడ బలప్రయోగం చెయ్యటానికి మలయాలో బ్రిటిషువారు నెలకొల్ప యత్నిస్తున్న శాంతీ, ఇండో చైనాలో ఫ్రెంచివారు నెలకొల్పుతున్న శాంతీ ఎటువంటిదో ప్రపంచానికి తెలిసే ఉన్నది

స్వాతంత్ర్యకాముకులైన మలయనులూ, వియత్నామీయులూ కూడా సామ్రాజ్యవాదులకు ఎదురు తిరిగి పోరాడటం దురాక్రమణ చర్యా, శాంతి భంగచర్యా అయితే అమెరికా యుద్ధ ప్రయత్నాలు చెయ్యవలసిందే ఎందుకంటే ఇటువంటి దురాక్రమణ ఇంకా ఎన్నోచోట్ల జరుగుతుంది రేపు పొద్దున సూర్యుడు ఉదయించకపోవటం ఎంత అసంభవమో, పీడిత ప్రజలు తమ స్వాతంత్ర్యంకోసమూ, తమకు అనుకూలమైన ఆర్థిక-సాంఘిక-రాజకీయ వ్యవస్థ కోసమూ పోరాడకుండా ఉండటం అంత అసంభవం సింగ్మెన్‌రీలతో అమెరికా ప్రజాస్వామిక దేవుడు సంతృప్తి పడతాడేమోగాని ప్రజల దేవుడు సంతృప్తిపడడు ఈ ప్రజాస్వాతంత్ర్యాలు కమ్యూనిస్టుల ఆధ్వర్యంకింద జరిగినప్పుడల్లా అది రష్యా సాగిస్తున్న యుద్ధమేననటానికి అమెరికా జంకదు

అందుకనే రష్యా, రష్యాతో సంబంధంగల దేశాలపై ప్రపంచయుద్ధం సాగించటానికి అమెరికా ధ్వజమెత్తింది సెనేటర్ టైడింగ్స్ కొన్ని లెక్కలు చూపుతూ, ఈ విషయం స్పష్టం చేశాడు రూజువెల్టు 1940లో అమెరికాలో యుద్ధసన్నాహాలు సాగించిన నాటిపరిస్థితిననీ ఇప్పటి పరిస్థితినీ ఆయన పోల్చాడు ఆనాడు 80 లక్షల మందికి ఉద్యోగాలు లేవు ఈనాడు 30 లక్షల మందే అమెరికాలో నిరుద్యోగులు ప్రస్తుతం అమెరికను కార్మికులు వారానికి 40 గంటలు

పనిచేస్తున్నారు దేశ రక్షణార్థం ఇంకా ఎక్కువ గంటలు పని చెయ్యటానికి వారు సిద్ధంగా ఉంటారు యుద్ధకాలంలో పనిచేసిన అనేక మంది స్త్రీలు మళ్లా పనిలోకి వస్తారు ఈ విధంగా బ్రైడింగ్స్ ప్రస్తుత యుద్ధయత్నాన్ని గురించి పగటి కలలు కన్నాడు

అమెరికా రక్షణ ఎట్లా ఉంటుందో కొరియా యుద్ధాన్ని బట్టి తెలుసుకున్న అమెరికనులు బ్రైడింగ్స్ అనుకున్నంత ఉత్సాహంతో యుద్ధ యత్నాలకు దిగక పోవచ్చు ఇకముందు అమెరికా చేయబోయే యుద్ధం ప్రస్తుతం కొరియాలో చేస్తున్న యుద్ధానికి ఆటే భిన్నంగా వుండదు కొరియా యుద్ధం చేసే సైనికులు ఆ యుద్ధం గురించి ఏమనుకుంటున్నదీ ప్రపంచాని కంతకు తెలుస్తున్నప్పుడు అమెరికా ప్రజలకు తెలియక పోతుందన్న అనుమానానికీ తావులేదు

అట్లాంటిక్ ఒడంబడిక సంతకాలు పెట్టిన వారికి ఉన్నంతగా యుద్ధం చెయ్యాలన్న ఆసక్తి ఆ దేశ ప్రజలకు లేదు ఆరు మాసాలనుంచీ సైన్యంలో చేరేవారి సంఖ్య తగ్గుతున్నదని బ్రిటిషు ప్రధాని అట్లీ చెప్పాడు అమెరికా మార్కు శాంతి కాముకులు చేసే కృషి తీవ్రమవుతున్న కొద్దీ సైన్యంలో చేరటానికి ప్రజలకు గల ఆసక్తి తగ్గుతుందిగాని హెచ్చదు అందుచేత యుద్ధోన్మాదుల 'కాగితపు అంచనాలు' ఆచరణలో ఫలిస్తాయనుకోవటానికి లేదు

కాని యుద్ధంతప్ప మార్గాంతరం లేని అమెరికా, అమెరికాతప్ప దారిలేని పశ్చిమ యూరపు రాజ్యాలూ తెగబడి యుద్ధానికి దూకవచ్చు ఈపని జరిగితే మొట్టమొదట ఫ్రాన్సు చావు దెబ్బ తింటుంది ఆ తరవాత ప్రతి పశ్చిమ యూరపు దేశంలోనూ 'సెకండ్ ఫ్రంట్' తయారవుతుంది అప్పుడుగాని అమెరికా కాపాడే శాంతి పరాకాష్ఠ అందుకోదు

తెలుగు స్వతంత్ర వారపత్రిక 8-9-1950

## 15. జర్మనీః మరొక కొరియా?

ఆసియాలో కొరియా లాగే యూరపులో జర్మనీ కూడా కృత్రిమంగా విభజింపబడింది తూర్పు జర్మనీ రష్యా ఆక్రమణ కింద ఉండటమూ, పశ్చిమ జర్మనీ, అమెరికా, బ్రిటను ఫ్రాన్సులకింద ఉండటమూ జరిగినందున జర్మనీ ఐక్యతకు అవకాశాలు లేకుండా పోయాయి అయితే జర్మనీ విషయంలో ఆ దేశపు ఐక్యతకు ఆంగ్లో అమెరికనులు కొత్తగా అవాంతరాలు కలిగించినారనటానికి లేదు ఎందుచేతనంటే జర్మనీ ఐక్యతలో ఎన్నడూ ప్రజాశక్తులకు స్థానం ఉండిఉండలేదు జర్మనీ ఐక్యతను ఇంత కాలమూ పట్టుకొని వస్తున్నది యుద్ధోన్మాద వర్గాలవారూ, జాతీయదురహంకారులూ, ధనిక వర్గంవారూ, ఫాసిస్టులూనూ, పశ్చిమ జర్మనీలో ఈ దుష్టశక్తులన్నీ ఆంగ్లో అమెరికను ఆక్రమణ దారులచేత భద్రంగా కాపాడబడ్డాయి రహస్యంగానూ బహిరంగంగానూ కూడా పెంపొందించబడ్డాయి జర్మనీ జాతీయ స్వరూపంలో ఏదైనా మార్పు జరిగితే ఆమార్పు సోవియట్ బలాలు ఆక్రమించిన తూర్పు జర్మనీలోనే జరిగింది ఇక్కడ రష్యను సిద్ధాంతాలకు అనుకూలంగా ప్రజాశక్తులు ప్రబలం చేయబడ్డాయి కార్మికులూ, వారి పార్టీ అయిన కమ్యూనిస్టు పార్టీ చేరి దాదాపు 13 మాసాల క్రితం ఒక రిపబ్లికు స్థాపించారు ఈ ప్రభుత్వం జర్మను ప్రజల ఏకీకరణకు ఉపకరించే ఆర్థిక, రాజకీయ సిద్ధాంతాలపైన ఏర్పాటు చేయబడింది

తూర్పు జర్మనీ ఇప్పుడు జర్మను ప్రజలకొక ప్రత్యక్ష ప్రబోధనంగా ఉన్నది  అది తెలిపే నీతి ఏమంటేః "అదివరకు జర్మనీ చవిచూసిన ఐక్యత నామమాత్రమైనది  అది దుష్టవర్గాల, ప్రతీపశక్తుల లాభంకొరకే ప్రచారం చెయ్యబడింది  అందుచేతనే జర్మనీ ఇన్నిదెబ్బలు తిని ఆఖరుకు హిట్లరు పతనానంతరం రూపు మాసిపోయే స్థితికి కూడా వచ్చింది  జర్మను ప్రజలు శాంతినీ, ప్రజాస్వామికాన్ని కోరినట్లయితే, నిజమైన ఐక్యత కోరినట్లయితే వారు ముందు ప్రతీపశక్తులను ధ్వంసంచేసి తూర్పుజర్మను రిపబ్లికు తొక్కిన  రాజకీయ మార్గాన్ని తొక్కి రష్యాను అర్థంచేసుకొని, రష్యాతో సహకరించాలి "

ఈ సందేశం అనేకమంది జర్మనులను ఆకర్షిస్తున్నదనటానికి సందేహం లేదు  సామాన్య జర్మను పౌరులు రష్యాను ఆదరంతో చూడటానికి తగిన కారణం లేకపోలేదు  ప్రపంచ యుద్ధంలో ఫాసిజమును ఓడించిన మరుక్షణమే రష్యా తనకు జర్మను ప్రజలలో అపారమైన విశ్వాసం ఉన్నట్లు ప్రకటించింది  జర్మనీని ఏకం చెయ్యటానికి జరిగిన పాట్స్‌డామ్ ఒప్పందాన్ని రష్యాకతూచా తప్పకుండా అమలు జరిపినట్టు మిగిలిన మిత్ర దేశాలు అమలు జరపలేదు  ముఖ్యంగా అమెరికనులు జర్మనీని ఆక్రమించిన నాటినుండీ దొంగ వ్యాపారస్తులనూ, పాతనాణాలనూ ప్రోత్సహించారు  ఖైదీలుగా ఉండిన నాజీలను బయటికి తీశారు  రహస్య నాజీకూటాలను తిరిగి ఏర్పాటుచేసి, నిర్మొహమాటంగా హిట్లరు అభివందనాలు చేసేవాళ్ల ముఠాల ఫోటోలు తమ పత్రికల్లో ప్రకటించారు  యుద్ధ సమయంలో యుద్ధావసరాలు పాటించకుండా జర్మనీ పరిశ్రమలపై  బాంబుల వర్షాలు కురిపించటమే కాక, తరవాతకూడా జర్మను పరిశ్రమలను–యుద్ధేతర పరిశ్రమలను–సంక్షేపిస్తూ వచ్చారు  ఒకవంక పారిశ్రామికంగా జర్మనీని వంగ దీయటంలో వారి ఉద్దేశ్యం, జర్మనీని–పశ్చిమ జర్మనీని ఆర్థికంగా అమెరికా బానిసగా ఉంచి, దాని యుద్ధశక్తిని తమకు అనుకూలంగా వాడుకోవటమే  ఈ ఆశయాలను పురస్కరించుకునే బ్రిటిషు, ఫ్రెంచి ఆక్రమిత పశ్చిమ జర్మనీ ప్రాంతాలు అమెరికను ఆక్రమిత ప్రాంతాలతో చేరటమూ, కాలక్రమాన బాన్ ప్రభుత్వం ఏర్పాటు కావడమూ జరిగింది

అమెరికా, బ్రిటను, ఫ్రాన్సులు అనుసరించిన ఈ విధానం జర్మనీకి శాంతిచేకూర్చేదికాదన్న విషయం ఎవరికన్నా సందేహం ఉంటే అది కాలక్రమాన తీరిపోసాగింది  బిస్మార్కు నాటి నుంచి జర్మనీ ఎటువంటి ప్రమాదాలకు గురిఅవుతూ వచ్చిందో అటువంటి ప్రమాదమే అంటే, జర్మనులు మరొక యుద్ధానికి బలిఅయే పరిస్థితి–ఇటీవల రూపం పొందసాగింది  జర్మనీ తిరిగి ఆస్త్రధారణ చెయ్యాలనీ, సమిష్టియూరపు రక్షణబలాలలో జర్మనులు పాల్గొనాలనీ అట్లాంటిక్ ఒడంబడిక నాయకులు నిర్ణయించారు  అయితే ఈ నిర్ణయం పశ్చిమ యూరపు ప్రజలు సహించేది కాని కారణం చేత దీనికై బహిరంగ యత్నాలుచేసి, జర్మనీని యుద్ధపు కాళ్లమీద నిలబెట్టే నిర్ణయాలు చేయటానికి లేకుండా ఉంది

"జర్మను బలాలు సమష్టి బలాలలో అంతర్భాగంగా ఉమ్మడి నాయకత్వం కింద ఉంటాయి గాని వాటికి ప్రత్యేకత ఉండదు  అందుచేత జర్మను బలాల పునర్నిర్మాణానికి ఫ్రాన్సు అభ్యంతరం చెప్పక్కర్లేదు" అని ఆచిసన్ చెప్పిచూశాడు  అయినా బహిరంగ నిర్ణయానికి అవకాశం లేకపోయింది  బహిరంగ నిర్ణయం జరగని మాత్రంచేత అమెరికా మొదలైన అట్లాంటిక్ ఒడంబడిక రాజ్యాలు జర్మను ప్రజలను ప్రపంచయుద్ధ హోమానికి సమిధలుగా తయారుచేయటానికి అభ్యంతరం ఉన్నదనికాదు  కాని ఆచిసన్ చెప్పిన మాట జర్మను ప్రజలకు

ఉత్సాహం కలిగించవలసిన అవసరం లేదు జాతీయదురహంకార ప్రేరితులై ప్రపంచయుద్ధాలు తెచ్చిపెట్టుకొని సర్వనాశనమైనందుకే పశ్చాత్తాపపడే జర్మనులు డాలర్లకోసం చావటానికి ఉత్సాహపడవలసిన ఆగత్యం కనపడదు

కనకనే పశ్చిమ జర్మనీలో లక్షలాది యువతీయువకులు శాంతి ప్రదర్శనాలు చేయటానికి ప్రయత్నించటమూ, పోలీసు బలాలు వారిని చావగొట్టి చెదరగొట్టటమూ జరిగింది తూర్పు, పశ్చిమ జర్మనీలలోని జీవితంలో గల తారతమ్యాన్ని ప్రజలు గ్రహించకుండా పోలీసు దెబ్బలు ఆపలేవు

రష్యా సహాయంతో తూర్పు జర్మనీ తన రెండేళ్ళ పునరావాస ఆర్థిక కార్యక్రమాన్ని ఏణ్ణర్థంలో పూర్తి చేసింది అక్కడ పారిశ్రామిక ఉత్పత్తి పెరుగుతున్నది నిరుద్యోగం శాశ్వతంగా నిర్మూలించబడింది దీనికి ప్రతిగా పశ్చిమ జర్మనీలో సుమారు 30 లక్షల మందికి పనులులేవు రష్యా తాను బలపరిచే ప్రభుత్వం యొక్క పరిహారం సగానికి సగం తగ్గించి మిగిలినది ఇవ్వటానికి ఇంకా ఎక్కువ గడువిస్తే, అమెరికనులు, బ్రిటిషువారూ తమ ఆక్రమణ ఖర్చులు పెంచుతూ, యుద్ధయత్నాలతో జర్మనులను ఆర్థికంగా మరింత అణచటానికి పునాదులు వేస్తున్నారు

ఇటువంటి పరిస్థితులలో పశ్చిమ జర్మనీలో సైనిక బలాలు ఆయత్తం చెయ్యటానికి అమెరికా వారు చేస్తున్న చాటుమాటు యత్నాలు ఫలించటంలేదంటే ఆశ్చర్యపడ నవసరం లేదు నిరుద్యోగులుగా ఉన్న జర్మనులు సయితం ఆయుధాలు ధరించి ఈ బలాలలో ప్రవేశించ నిరాకరిస్తున్నట్లు చెప్పబడుతున్నది జర్మనులు ఉత్సాహంగా ఆయుధధారణ చేస్తారని అమెరికా భావించటం భ్రమ అని న్యూయార్కు హెరాల్డు ట్రిబ్యూను విలేఖరి రాశాడు అదేవిధంగా, బ్రిటిషు రక్షణ శాఖామంత్రి షిన్వెల్ కామన్సు సభలో మాట్లాడుతూ, యూరపు బలాల్లో చేరటానికి జర్మనులు ఉబలాట పడుతున్నారని చర్చిలు భ్రమపడుతున్నాడన్నాడు

ఇంతకూ అమెరికన్లు యుద్ధం తెచ్చి పెడదామన్న తాపత్రయం కొద్దీ సాగించే ఈ దురన్యాయానికి ఆధారం ఏమిటి? రష్యా పశ్చిమ యూరపుపై దాడి చేస్తుందని! ఈ “బూచి”ని ట్రూమన్, ఆచిసన్, అట్లీ, చర్చిల్ మొదలైన వారు ఎంత ప్రయత్నించినా ప్రజలలో నమ్మకం కలిగేటట్టు ప్రచారం చెయ్యలేకుండా ఉన్నారు దీనికి కారణం లేకపోలేదు ఇవాళ యుద్ధం చెయ్యటానికి రష్యా, రష్యా అనుచర దేశాలకున్న బలాలు, అమెరికా మొదలైన దేశాలకు లేవు ఇది సర్వత్రా ఆమోదించబడిన మాటే రష్యా ఒకవంక బహిరంగంగా పెద్ద ఎత్తున శాంతి ప్రచారం సాగిస్తున్నది పెట్టుబడిదారీ దేశాలతో తనకు గల రాజకీయ విభేదాలను బట్టి వాటిపై రష్యా యుద్ధమే తలపెడితే ఇవాళనే రష్యా దాడి సాగించవచ్చు కాని రష్యా ఆపని చెయ్యదని ఎరిగిఉండి యుద్ధోన్మాదులు క్రమంగా తమ బలాలు కూడగట్టుకుని ఏనాడు రష్యాపై పడగలమన్న ధైర్యం చిక్కితే ఆనాడు పడటానికి తహతహలాడుతూ, రష్యాయే దాడి చెయ్యటానికి సిద్ధంగా ఉన్నదని ప్రచారం చేస్తున్నారు కాని యుద్ధోన్మాదుల యుద్ధ ప్రయత్నాలు ఎప్పటికీ కొనసాగవు ఎందుకంటే ప్రజలు యుద్ధోన్మాదులు కారు యుద్ధంవల్ల వారు లాభాలుపొందరు యుద్ధంవల్ల వారి జీవితం పది అడుగులు వెనక్కు వేస్తుందేగాని ఒక్క అడుగుకూడా ముందుకు వెయ్యదు ఈలోపుగా అమెరికా చేసే యుద్ధయత్నాలు ఒకందుకు పనికివస్తాయి అమెరికా అవలంబిస్తున్న అంతర్జాతీయ రాజకీయాల ఫలితంగా ఐక్యతను కోల్పోయిన కొరియాలాటి

దేశాలు ఏకం కావటానికి సాయుధ సంఘర్షణలు జరిగితీరుతాయి  అప్పుడు ప్రజాస్వామికం వంకపెట్టి సింగ్మన్‌రీ లాటి ప్రజాద్రోహుల తరఫున అమెరికా దారుణ హింసాకాండ సాగించ గలదు  అమెరికా ఇటువంటి రాజకీయాలు అవలంబించగల స్థితిలో ఉండటమూ, బ్రిటను, ఫ్రాన్సు, బెల్జియం, నార్వే మొదలైన దేశాలు అమెరికాకు పక్కతాళం వెయ్యవలసిన దుర్గతి కలగటమూ ప్రజాస్వామిక శక్తుల విజయాన్ని, క్షేమాన్ని సూచించదుః ప్రజాస్వామిక శక్తుల దౌర్భాగ్య స్థితిని మాత్రమే సూచిస్తుంది  అమెరికా చర్యలు ఆసియాలో నెహ్రూవంటి శాంతి కాముల సద్భావాన్ని కోల్పోయి అక్కడి ప్రజల ఆగ్రహాన్ని సంపాదించుకుంటున్నాయి యుద్ధోన్మాదులు తాము అనుసరించే రాజకీయ విధానాల ద్వారా ప్రజలకు ఏవిధంగా దూరమవుతున్నారో, రష్యా తనుఅనుసరించే రాజకీయ విధానాల వల్ల ప్రపంచ ప్రజలకు అంతసన్నిహితమవుతున్న దనటానికి సందేహం లేదు  కమ్యూనిజం అవలంబించని అనేక దేశాలతో రష్యా రాయబార సంబంధాలు కలిగి ఉన్నది  కాని అమెరికా లాగ రష్యా ఏదేశం పీకనొక్కుతున్నట్టు ఒక్క నిదర్శనమైనా లేదు  అది అమెరికా ప్రజాస్వామికంలో మాత్రమే గల విశిష్టత

తెలుగు స్వతంత్ర, వారపత్రిక, 3-11-1950

# 16. పోర్టోరికో

నవంబరు 1 బుధవారంనాడు ముగ్గురు పోర్టోరికన్ జాతీయవాదులు అమెరికా అధ్యక్షుడు ట్రూమన్‌ను హత్యచెయ్యటానికి ప్రయత్నించారు  వారి ప్రయత్నం ఫలించలేదు  కాని పోర్టోరికో జాతీయోద్యమం గురించి ప్రపంచం తెలుసుకోవలసిన అవసరం ఒకటి ఏర్పడింది

అంతకు రెండు రోజుల వెనుక పోర్టోరికో దీవిలో ప్రభుత్వంమీద సాయుధ తిరుగుబాటు జరిగింది  ఆ తిరుగుబాటులో 26గురు చచ్చారు  దాదాపు 50 మంది గాయపడ్డారు

తిరుగుబాటు అణచివేయబడింది  92మంది తిరుగుబాటుదార్లు అరెస్టు చేయబడ్డారు వీరిలో జాతీయోద్యమ నాయకుడు పీడ్రోఆల్బినో కాంపోస్, కమ్యూనిస్టు నాయకులూ కార్మిక నాయకులూ మొదలైనవారనేకమంది ఉన్నారు

ట్రూమన్ హత్యాప్రయత్నం జరిగిన మర్నాడే హవానాలోని విశ్వవిద్యాలయ విద్యార్థులు సభచేసి పోర్టోరికో స్వాతంత్ర్య వాంఛను బలపరుస్తూ తీర్మానించారు  ఆరోజునే పోర్టోరికో జాతీయవాదులు ఐక్యరాజ్య ప్రధాన కార్యదర్శికి ఒక విజ్ఞాపన సమర్పించుతూ, పోర్టోరికో సమస్య అమెరికా ఆంతరంగిక సమస్య కాదు  అది స్వతంత్రంగా ఉన్న అమెరికా వలస అనీ, దానిని ఐక్యరాజ్య సమితి విచారించాలనీ అన్నారు

పోర్టోరికో గత చరిత్రకు సంబంధించిన ప్రధానాంశాలు పత్రికలలో రానేవచ్చాయి  అది 500 చదరపు మైళ్ళ వైశాల్యంగల దీవి  ఇందులో 21 లక్షలమంది ప్రజలున్నారు  చదరపు మైలుకు 580 మంది చొప్పున జన సాంద్రత ఉన్న పేదదేశం  ఇక్కడి భూమిలో సగం మాత్రమే సాగుకింద ఉన్నది  ఇక్కడ అధికం పండే పంటలు పొగాకూ, చక్కెరా  ఇక్కడి వాణిజ్యంలో నూటికి 90 పాళ్ళు అమెరికాతోనే జరుగుతున్నది

1898లగాయతు పోర్టోరికో అమెరికా ఏలుబడి కింద ఉన్నది  1940లో అమెరికా పోర్టోరికోకు ప్రజా ప్రభుత్వమంటూ ఏర్పాటు చేసింది  ప్రస్తుతం పోర్టోరికో పౌరులకు అమెరికా పౌరసత్వం ఉన్నదిగాని పౌరసత్వాలు లేవు  అక్కడి ప్రజలు ఈ కల్లబొల్లి ప్రజాస్వామికాన్ని ఆమోదించక సంపూర్ణ స్వాతంత్ర్యం కోరుతున్నారు  ముఖ్యంగా ఆర్థికంగా అమెరికాచేత పీల్చి పిప్పి చేయబడటం వారి కెంత మాత్రమూ ఇష్టంలేదు  పోర్టోరికో ఆర్థిక దుస్థితిని గురించి ఎవరికీ రెండు అభిప్రాయాలులేవు  52 సంవత్సరాలుగా అమెరికా కబంధ హస్తం పోర్టోరికోను పిండేసింది  ఏడాదికి 55 వేల చొప్పున పెరిగే పోర్టోరికో జనాభాను అక్కడి ఆర్థిక వ్యవస్థ ఎంత మాత్రమూ భరించలేదు

పోర్టోరికో ప్రజలు రాజకీయంగా అజ్ఞానులు కారు  గత యుద్ధంలో ప్రజాస్వామిక శక్తులను గెలిపించటానికి 8 లక్షల మంది పోర్టోరికనులు ఫాసిస్టులకు వ్యతిరేకంగా పోరాడారు  తమ ఆర్థిక దుస్థితికి కారణం అమెరికాయేనని వారు పూర్తిగా గ్రహించి ఈనాడు సంపూర్ణ స్వాతంత్ర్యం కోరుతున్నారు  అమెరికా నిరాకరించే పక్షాన సాయుధంగా తిరుగుబాటు చేయటానికి వారు సిద్ధంగా ఉన్నారని ఇటీవలి సంఘటనలు రుజువు చేశాయి

ఈ సాయుధ విప్లవ బీజానికి కమ్యూనిస్టులే కారణమని ఎవరైనా వాదించవచ్చు ఎందుచేతనంటే ప్రస్తుతం విప్లవ జాతీయ వాదులూ, కమ్యూనిస్టులూ పోర్టోరికో స్వాతంత్ర్యం కొరకు కలిసి కృషిచేస్తున్నారు  ఈ వంకపెట్టి పోర్టోరికో జాతీయోద్యమం మీద నీళ్ళు చల్లటానికి లేదు  పోర్టోరికో జాతీయోద్యమాన్ని కమ్యూనిస్టుల వైపు తిప్పినది అమెరికా ఆ దీవిపట్ల అవలంబించిన సామ్రాజ్యవాదమే అనటానికి ఒక్క నిదర్శనం చాలు

ప్రస్తుతం పోర్టోరికోకు గవర్నరు లూయిమునోజ్ మారిస్ అనే ఆయన  ఈయన పరిపాలనపైనే మొన్న సాయుధ విప్లవం జరిగింది  ఈయన కిందటేడు జనవరిలోనే గవర్నరుగా ఎన్నుకోబడ్డాడు  కాని ఈ మనిషే 1946మే నెలలో అమెరికను పత్రికలలో పోర్టోరికో స్వాతంత్ర్య సమస్యను గురించి కొన్ని విషయాలు రాశాడు  అప్పట్లో ఆయన పోర్టోరికన్ సెనేటుకు అధ్యక్షుడుగా ఉంటుండే వాడు  ఆయన ప్రకటించిన భావాలివి

"అమెరికా పోర్టోరికోకు స్వాతంత్ర్య మిస్తుందా లేక, నిష్కారణంగా, వలస విధానం అవలంబించే సామ్రాజ్యమనే మాటకు గురి అవుతుందా? అమెరికా వలసగా ఉండటం పోర్టోరికనులకు ఎంతమాత్రం ఇష్టంలేదు  పోర్టోరికోకు అమెరికాతో స్వేచ్ఛావాణిజ్యం ఉన్నపాపంచేతనూ, పోర్టోరికో అమెరికానుంచి ఫెడరల్‌సహాయం (సుమారు 150 లక్షల డాలర్లు) పొంది ఉండటంచేతనూ అమెరికా స్వాతంత్ర్యం ఇవ్వ నిరాకరిస్తున్నది  పోర్టోరికో అమెరికాతో స్వేచ్ఛావాణిజ్యం జరుపుకోక గతిలేని స్థితిలో ఉన్నదంటే దానికి కారణం అమెరికా (1946 నాటికి) 47 ఏళ్ళుగా అనుసరించుతూ వచ్చిన విధానమే  నిజానికి పోర్టోరికోకు అమెరికా స్వాతంత్ర్యం ఇవ్వటం ఉభయ దేశాల ఆదర్శాలకూ అనుసరణీయం  ఎందుకంటే పోర్టోరికో ప్రజలు శాంతి కాముకులుః అమెరికాకు వలస దేశాలవల్ల లాభంలేదు  పోర్టోరికోకు స్వాతంత్ర్యం ఇవ్వటంవల్ల, పరోక్షంగా ఉన్న కొద్ది అమెరికను కంపెనీలకు నష్టం రావచ్చుగాని, అమెరికా ప్రజల జీవన ప్రమాణాలకు ఎట్టి దెబ్బ తగలదు  పోర్టోరికోకు కొత్త గవర్నరును నియమిస్తామనీ,

అతడు పోర్టోరికోలో జన్మించినవాడుగానే ఉంటాడనీ వాగ్దానం చేశారు కాని ప్రజాభిమతాన్ని బట్టి పాలించనివాడు పోర్టోరికన్ అయేకన్నా, ప్రజల ఇష్టప్రకారం పాలించే చైనావాడైనా మాకు సమ్మతమే మీరుమాకు చావు షరతుగాబెట్టి స్వాతంత్ర్యం ఇచ్చేకన్నా మాకు స్వాతంత్ర్యం ఇచ్చి మా స్నేహం పుచ్చుకోండి"

ఇదంతా మితవాద ధోరణిలో ఉన్నప్పటికీ మారిన్ అనాడు పోర్టోరికో స్వాతంత్ర్యాన్ని కోరుతూనే మాట్లాడాడు అమెరికా ప్రభుత్వం "పరోక్షంగా ఉన్న కొద్ది అమెరికను కంపెనీల"కు అనుకూలించే రాజకీయ విధానాన్నే పోర్టోరికోలో అమలు జరుపుతున్నదిగాని, అమెరికా ప్రజల దృష్టినుంచీ, సామ్రాజ్య వ్యతిరేక దృష్టి నుంచీ విధానాలు అమలు చేయటం లేదని ఆయన గ్రహించలేదు అమెరికా పాలకులకు కావలసింది పోర్టోరికో ప్రజల మైత్రి కాదనీ వారు తయారుచేసే ముడి పదార్థాలను దోచుకొనటమేననీ కూడా ఆయన గుర్తించలేదు 47 ఏళ్ళుగా అమెరికా పోర్టోరికోను ఆర్థికంగా నిర్వీర్య పరచినది పోర్టోరికో స్వాతంత్ర్యం కావాలన్ననాడు, స్వేచ్ఛావాణిజ్యం నిలిపేస్తామని మెడకు ఉచ్చువేసి బెదిరించటానికేనని కూడా ఆయన గుర్తించలేదు అందుకే ఆయన ఈనాడు స్వాతంత్ర్య నినాదాన్ని విడిచిపుచ్చి కమ్యూనిస్టు వ్యతిరేక నినాదాన్ని చేపట్టాడు ఈలోగా పోర్టోరికో జాతీయ స్వాతంత్ర్య సమరం కమ్యూనిస్టులతోనూ, కార్మికులతోనూ చెయ్యి కలిపింది

అమెరికా ఇటీవల ఫ్రెంచి సామ్రాజ్యవాదాన్ని చాలా విమర్శించి ఉన్నది ఇది కల్లబొల్లి విమర్శ అనీ, అటువంటి విధానాలను అనుసరించటానికి అమెరికాకు ఎంతమాత్రమూ అభ్యంతరంలేదనీ పోర్టోరికో అక్షరాలా రుజువు చేస్తున్నది

అమెరికా ఇవాళ ప్రపంచంలో ఎక్కడ కమ్యూనిజం తల ఎత్తినా చిత్రవధ చెయ్యటానికి ప్రపంచంలో గల దుష్టశక్తులన్నిటినీ, (మచ్చుకు చంగ్ కేషేక్, సింగ్మన్‌రీ, బావోడై, ఫ్రాంకో, ష్లాస్టిరాన్, అడినావర్ వగైరాలను) కూడగట్టుతున్నది కాని జాతీయ ప్రజోద్యమాలు గత్యంతరంలేక కమ్యూనిజమును ఆశ్లేషించేటట్టు చేస్తున్నది, అమెరికా మార్కు పెట్టుబడిదారీ ప్రజాస్వామ్యమేనని కూడా పోర్టోరికో రుజువు చేస్తున్నది

ఒకవిధంగా చూస్తే అమెరికాననవలసిన పనిలేదు ఈనాడు పెట్టుబడిదారీ సామ్రాజ్య విధానాన్ని అనుసరించక బతకలేదు దానిని ప్రతిఘటించటానికి ప్రజాశక్తులు సోషలిస్టు ఆర్థిక వ్యవస్థలను ఆశ్రయించక దారిలేదు

తెలుగు స్వతంత్ర, వారపత్రిక, 10-11-1950

## 17. రావలసిన మార్పు

ఏదో మహా నాటకానికి నాంది ప్రస్తావనలు జరుగుతున్నాయి శాంతికి మహా విపత్తు ప్రాప్తం కానున్నదన్న సూచనలు అన్నివేపులనుండీ పొడజూపుతున్నాయి అమెరికా, పశ్చిమ యూరపు రాజ్యాలు "శాంతిని రక్షించటానికి" అంతులేని అణ్వస్త్రాలనూ, యుద్ధ పరికరాలనూ తయారు చేస్తున్నాయి, ఒకసారి – పుష్కరమైనా గడవక పూర్వమే – ప్రపంచ శాంతిని భస్మీపటలం చేసిన జపాను, జర్మనీ, స్పెయిను వగైరా దేశాలలోని ఫాసిస్టు దుష్టశక్తులను యుద్ధోన్ముఖం

చేస్తున్నాయి అమెరికాలో "విషమ పరిస్థితి" ప్రకటించబడింది, 1952 తరవాతగాని దెబ్బకొట్టే శక్తి సంపాదించలేదని అంచనా వేయబడ్డ రష్యా ప్రభృతిదేశాలు నాశనం చెయ్యబొయ్యే ప్రజాస్వామ్యాలకు ఇవాళే స్వస్తి చెప్పబడింది రెండో పక్షాన "శాంతిని రక్షించటానికి" రష్యా మొదలైన దేశాల ప్రోత్సాహంతో ప్రపంచమంతటా స్టాక్‌హోం విజ్ఞప్తిపై అనేక కోట్ల సంతకాలు తీసుకోబడుతున్నాయి

ప్రపంచ శాంతి ప్రమాద స్థితిలో ఉన్నదని "ఉభయ" పక్షాలూ ఈ విధంగా గుర్తిస్తున్నాయి కాకపోతే అపరిష్కృతంగా ఉన్న సమస్య ఏమంటేః "యుద్ధం నివార్యమా, అనివార్యమా?" అన్నది ఉభయ పక్షాలూ యుద్ధాన్నే కోరుతూ పైకి శాంతి ప్రవచనాలు చెబుతున్న పక్షాన యుద్ధం అనివార్యమే అట్లా కాని పక్షంలో ప్రపంచంలో కనీసం ఒకపక్షం శాంతికోసమూ, మరొక పక్షం యుద్ధం కోసమూ ప్రయత్నిస్తున్నదనీ, ఏ పక్షం ఎక్కువ శక్తి యుతమైతే ఆపక్షం భవితవ్యాన్ని నిర్ణయిస్తుందని మనం భావించాలి

కామన్వెల్తు ప్రధానుల సమావేశానికి వెళ్లిన నెహ్రూ, సమావేశానంతరం బహిరంగంగా చెప్పిన మాటలలో ఆశాజనకమైన ముక్క ఒకటి అన్నాడు అదేమిటంటేః యుద్ధం అనివార్యం అని భావించనవసరం ఇంకా లేదని నెహ్రూ శాంతికోసం శాయశక్తులా కృషి చేస్తున్నవాడు, అంతర్జాతీయ రాజకీయపు లగువు బిగువులతో సన్నిహిత సంబంధం కలవాడు ప్రపంచంలోని శాంతి శక్తులకంటె యుద్ధ శక్తులు ప్రబలంగా లేవని ఆయన విశ్వసించకపోతే ఆ భావం వెలువరచదగిన అవకాశం లేదు

నెహ్రూ చెప్పినట్టు అచ్చుగా మారణ యంత్రాలు నిర్మాణం చేసినంత మాత్రాన యుద్ధం రాదు ఇంకా అనేక ఇతర విషయాలు ఆ శాంతికి అనుకూలంగా ఉంటేనే యుద్ధం వస్తుంది ఆర్థిక, దుస్థితీ, బలయుతమైన దేశాలు బక్క దేశాలపై రాజకీయంగా ఒత్తిడి తెచ్చే అవకాశాలూ, వివిధ దేశాలలోని అంతరంగిక సంఘర్షణలూ అశాంతి ప్రియులకు అనుకూలిస్తాయి రెండు శతాబ్దాలపాటు సామ్రాజ్యవాదులు ప్రపంచంలోని ప్రతి బలహీన దేశాన్నీ విభజించి ఎట్లా ఉంచారో, రాజకీయ దాస్యం ఏవిధంగా అంటగట్టారో, అభ్యుదయ నిరోధక శక్తులను ప్రోత్సహించి జాతీయ శక్తులను ఏవిధంగా ఖైదు చేశారో, అయుధాలుకూడా ధరించకుండా ప్రజలు స్వాతంత్ర్య వాంఛ ప్రకటించినప్పటికీ అటువంటి ప్రజలపై లారీలు, తుపాకులూ ఎట్లా ప్రయోగించారో మనం కళ్లారా చూశాం

అమెరికా, బ్రిటను వగైరా దేశాలు తమ సామ్రాజ్యాలను ఏదో రూపంలో నిలబెట్టు కోవటానికి రెండు ప్రపంచ యుద్ధాలు చేసి ఉండటమేకాక, తాము సామ్రాజ్యవాదాన్ని విడనాడుకోలేక, విడనాడుకున్నట్టు ప్రజలకు రుజువు చెయ్యలేక రష్యాది కూడా సామ్రాజ్యవాదమే నంటున్నారు 1917 లగాయతు రష్యా తూర్పు యూరపుదేశాలనూ, చైనానూ, ఇండో-చైనాలో హోచిమిన్‌నూ, తూర్పుజర్మనీనీ, ఉత్తర కొరియాలో కిమిల్ సుంగ్‌నూ తన బానిసలుగా చేసుకుని తన సామ్రాజ్యాన్ని విస్తరిస్తున్నదే అనుకోమంటే, ఈ దేశాలపై యుద్ధం చెయ్యకుండా, ఈదేశాల ఆర్థిక వ్యవస్థను పైకిరానిస్తూ, దేశాలలో చీలికలు ఏర్పరచకుండా సామ్రాజ్య విస్తరణ ఎట్లాచేస్తున్న దన్న సందేహం కలిగి తీరుతుంది

నెహ్రూ తన లండన్ ప్రసంగంలో ఏ ఒక్కదేశానికీ యుద్ధం ఇష్టంలేదన్నప్పటికీ, పైకి శాంతి ప్రసంగాలు చేస్తూ అస్త్రనిర్మాణం సాగించే వారికి చెంపపెట్టుపెట్టాడు ఈ మాటకు అట్లీ, ట్రూమన్, షూమాన్ మొదలైనవారు చెంపలు తడివి చూసుకుని ఉండాలి ఇంత ఘాటుగా కాకపోయినా, చైనా వ్యతిరేకంగా వున్న కామన్వెల్తుదేశాల ఉపయోగార్థం నెహ్రు నవ ఆసియా పరిణామ ప్రాముఖ్యాన్ని గురించీ, దూరప్రాచ్య అంతర్జాతీయ సమస్యా పరిష్కారం జరగాలంటే చైనా వహించవలసిన ప్రధాన పాత్ర గురించీ విస్పష్టంగా చెప్పాడు

పరస్పరదూషణే అంతర్జాతీయ వైమనస్యాలను రెచ్చగొట్టుతున్నదని వాదించే నెహ్రూ శాంతి విద్రోహులను పేర్కొనక పోయినప్పటికీ ఆయన ప్రసంగం శాంతి విద్రోహులను పట్టి ఇవ్వటమేకాక శాంతి, యుద్ధాల మధ్య ఆయన తన బరువు ఏపక్షాన వేస్తున్నదీకూడా సుస్పష్టమవుతున్నది

ఐతే నెహ్రూ ఒక్కడూ శాంతికి పూర్తి దోహదం చెయ్యగలడా? చెయ్యలేకపోవచ్చు కాని ఇండియాలో శాంతి కనుగుణమైన మార్పులు–రాజకీయ మార్పులు–జరిగితే ఈ మహత్తరమైన దేశం యుద్ధశక్తులను చెల్లాచెదరు చేయవచ్చు ఇండియా చైనాలు ఆసియా అభ్యుదయం నిమిత్తమై చేతులుకలిపితే అవి సాధించలేని విజయం ఉండదని నెహ్రూ అనేక పర్యాయాలు చెప్పాడు ఇవాళ చైనా అజేయమని శత్రువర్గాలచేతనే అనిపించుకుంటున్నది రేపు ఇండియాకూడా అజేయమని అనిపించుకోవచ్చు– కొన్ని రాజకీయ పరిణామాలు ఈ దేశంలో జరగాలేగాని

ఏమిటీ పరిణామాలు?

చారిత్రకంగా మనదేశం ఎట్లా ఉన్నది? దేశంలోని శక్తులమధ్య ఎటువంటి పారస్పర్యం ఉన్నది? ఈ విషయం స్థూలంగా తెలుసుకుంటే వివిధ రాజకీయ పార్టీలు అవలంబించ వలసిన వైఖరికూడా తెలుస్తుంది

1947 ఆగస్టు 15 నుంచీ మనపైనుంచి సామ్రాజ్యవాదుల అంకుశం తొలగిపోయింది అంతమాత్రాన మనపై వారి ప్రభావం తగ్గిందనటానికి వీలులేదు కాని మన దేశమంతా ఏకమై దేశంలో ఏరకం ఆర్థిక, రాజకీయ, సాంఘిక వ్యవస్థ ఏర్పరచుకున్నా బ్రిటనుకాదనే స్థితిలో లేదు

అంతవరకు మనం పూర్తిగా స్వతంత్రులమే ఇంట కపట సామ్యవాదమూ, బయట ప్రచ్ఛన్న సామ్రాజ్య వాదమూ అవలంబించే బ్రిటను మలయాలో లాగా తన సైన్యాలను ఈ దేశానికి పంపి ఇక్కడ జరగగల సాంఘిక, ఆర్థిక, రాజకీయ పరిణామాలను ప్రతిఘటించలేదు కాని ఆర్థికంగా ఇండియా బ్రిటనుపై ఆధారపడి ఉన్నది బ్రిటిషు పెట్టుబడిదార్లు మనదేశాన్ని అంటిపెట్టుకునే ఉన్నారు పూర్వం లేనిది ఇప్పుడు కొన్ని భారతీయ ధనికవర్గాలు బ్రిటిషు పెట్టుబడిదార్లతో వ్యాపార "దాంపత్యాలు" కూడా ఏర్పాటు చేసుకుని ఉన్నారు ప్రస్తుతం దేశాన్ని పరిపాలించే కాంగ్రెసు వర్గాలలో ఈ ధనిక వర్గాల పలుకుబడి జాస్తిగా ఉన్నంత కాలమూ బ్రిటను పరోక్షంగా ఇక్కడ తన సామ్రాజ్యవాదాన్ని సాగించుకు తీరుతుంది

ఇక్కడ మరొక ప్రమాదాన్ని కూడా స్మరించ వలసి ఉన్నది ఇండియా కామన్వెల్తు లో ఉన్నందున చాలా మంది విమర్శించారు అయితే ఇందువల్ల అపాయం ఉన్నదని నెహ్రూను ఎవరూ నమ్మించలేక పోయినారు దానికి కారణం లేకపోలేదు కామన్వెల్తు దేశాలన్నీ కలిసి ఇండియాకు విరుద్ధమైన నిర్ణయం ఏమి చేసినా ఇండియా ఆ నిర్ణయాన్ని శిరసావహించనవసరం లేదు మాట వరసకు రేపు ప్రపంచయుద్ధమేవస్తే అందులో ఇతర కామన్వెల్తు దేశాలన్నీ యుద్ధంచేసినప్పటికీ ఇండియా తటస్థంగా వుండే అవకాశం ఉన్నది కాని బ్రిటిషు సామ్రాజ్యవాదులతో భారతీయ ధనిక వర్గాలకూ వారిద్వారా ఇండియాలోని కాంగ్రెసు ప్రభుత్వానికీ గల సంబంధాలు దేశానికి చాలా ఆపాయకరమైనవి

ఈ సంబంధాలు కారణంగా ఇండియా తనకు సంబంధం లేని ఏ యుద్ధంలోనైనా దిగవచ్చు అమెరికాతో సంబంధాలు పెట్టుకున్న కారణంచేత బ్రిటను, అమెరికా తలపెట్టిన ఏ యుద్ధంలోనైనా దిగితీరవలసిన స్థితిలో ఉన్నదని ప్రతి అమెరికను పత్రికా బాహాటంగా అంటున్నది అటువంటి బ్రిటనుతో తెగని సంబంధాలు కాంగ్రెసు ప్రభుత్వాని కుండటం ప్రపంచశాంతికీ, ఇండియా క్షేమానికీ చాలా ప్రమాదకరం

ప్రస్తుతం అమెరికా ఇండియాచుట్టూ తన యుద్ధస్థావరాలు నిర్మిస్తున్నది ఇండియాలోని అమెరికను ప్రతినిధులు అతి ఏహ్యమైన విధ్వంసక పాత్ర నిర్వహిస్తూ దేశానికి ముప్పుతెచ్చిపెట్ట చూస్తున్నారనటానికి సందేహం లేదు ఇదంతా చూసి కొన్ని వామపక్షాలు కాంగ్రెసును సామ్రాజ్యవాదుల ఏజెంట్లుగానూ, నెహ్రూను విద్రోహిగానూ విమర్శించి వ్యాఖ్యానిస్తున్నాయి ఇది చాలా పెద్ద పొరపాటు ఇవాళ కాంగ్రెసు అగ్రవర్గాలలో పాలూ విషమూ సమ్మిళితమై ఉన్నది కాంగ్రెసు హీనవర్గాలలో అధికారాలకొరకు కీచులాటలూ, అల్పమైన అవినీతి, ధన అధికారకాంక్షా తప్ప ఇంకేమీ లేదు ప్రపంచ శాంతికోసం తహతహలాడే నెహ్రూ సరసనే పచ్చి అమెరికా భృత్యులున్నారు కాంగ్రెసు ఐక్యత కోసం నెహ్రూ ఈ వర్గాలను వేరు చేసుకోలేకుండా ఉన్నాడు ఇదే ఇతర కాంగ్రెసు అభ్యుదయ కాముకులకూ వర్తిస్తుంధి

ప్రస్తుతం కాంగ్రెసు వర్గాన్ని ఆవహించి ఉన్న ఈ "వాతాన్ని" విధ్వంసం చేయటానికి రెండు పరిణామాలుఅవసరం అందులో ఒకటి ఏ యుద్ధంలాంటి విపత్తో వచ్చిపడి తలవాకిలి తలుపు తట్టడం కిందటిసారి యుద్ధం వచ్చినప్పుడు కాంగ్రెసులో ఉన్నపాలూ, విషమూ వేరువేరై ఫాసిస్టు హితులెవరో, స్వాతంత్ర కాముకు లెవరో తెలిసిపోయింది కాని అప్పుడు అభ్యుదయవాదులు కొద్దిపాటి విజయం సంపాదించారు ఈసారి ఇటువంటి విభజన ఈ కారణంగా జరిగితే కాంగ్రెసు అగ్రనాయకులలో శాశ్వతమైన చీలిక ఏర్పడి తీరుతుంది కాని ఈ లోపుగా జరగవలసినది రెండో పరిణామం అదేమిటంటే ఇండియాలోని శాంతికాముక రాజకీయవర్గాలు కలవటం

ఈ వర్గాలు నిజంగా ఏకమై శాంతి కార్యక్రమాన్ని విజయవంతంగా కొనసాగించాలంటే ఒకవిధమైన అతివాదాన్ని మానాలి ఇండియా ఇంకా రాజకీయ బంధాల్లోనే ఉన్నదనీ, కాంగ్రెసు నాయకత్వం పైనుంచి కిందకి కుళ్ళి పోయిందనీ, కాంగ్రెసు ప్రభుత్వం యుద్ధోన్మాదులతో ఏనాడో చేతులు కలిపిందనీ, కార్మికవర్గాలు సాయుధపోరాటం సాగించి కాంగ్రెసు ప్రభుత్వాన్ని

పడగొట్టటం ఒకటే దేశముక్తికి మార్గమనీ వీరు సిద్ధాంతాలు చేయటం మానాలి కాంగ్రెసు వర్గాలలో ఎట్టి చీలికలూలేకుండా పోవటమూ, లేదా కాంగ్రెసు నుంచి అభ్యుదయ కాముకులందరూ నిష్క్రమించి వచ్చి ప్రజాద్రోహుల కూటంగా అది తయారు కావటమూ, సామ్రాజ్యవాదులతో చేతులు కలిపి వారి ఏజెంట్లుగా పనిచేసే ధనిక వర్గాలకూ కాంగ్రెసు వర్గాలకూ అవినాభావ సంబంధం ఏర్పడటమూ, దేశమంతటా ఫాసిస్టు-దుష్పరిపాలన ఏర్పడటమూ, సామ్రాజ్యవాదులకు దేశాన్ని శాసించే అధికారాలు చేజిక్కటమూ తటస్థించే పరిస్థితిలో సాయుధ విప్లవం తప్పనిసరి దేశమంతటా ఇట్టి పరిస్థితి ఏర్పడిందని చెప్పటానికి అవకాశంలేదు కాంగ్రెసు ప్రభుత్వంకింద ఉన్నత న్యాయస్థానాలు ప్రభుత్వ శాసనాలను అక్రమంగా నిర్ణయించటం జరుగుతున్నది కాంగ్రెసు ప్రభుత్వం ఫాసిస్టు శక్తులను పూర్తిగా నాశనం చెయ్యలేకపోయినా వాటితో కొంత సంఘర్షణ జరుపుతూ ఉండటం కనిపిస్తున్నది ఇండియా సామ్రాజ్యవాదుల అడుగులకు మడుగులొత్తక పోవటం కనిపిస్తున్నది నెహ్రూ ఐక్యరాజ్య సమితిలో చైనానూ, ఇతరత్రా ప్రపంచ శాంతినీ బలపరచటం కనిపిస్తున్నది అన్నిటికన్నా కొట్టవచ్చినట్టుగా శాంతి కాముక రాజకీయపక్షాలు అధిక సంఖ్యాకులైన ప్రజలను రాజకీయ, ఆర్థిక రంగాలలో తమపక్షం చేసుకోలేకపోవటమూ, వారు చేసే రాజకీయ ప్రచారాన్ని ప్రజలు పూర్తిగా విశ్వసించకపోవటమూ, అక్కడక్కడా జరిగే సాయుధ విప్లవాలకు ప్రజల అండపూర్తిగా లభించకపోవటమూ కనిపిస్తున్నది దీనికి కారణం ప్రజలకు కాంగ్రెసుపైగల భ్రమ అనుకోవటానికి ఏమీ ఆధారం లేదు సామాన్య ప్రజలకీనాడు కాంగ్రెసులో గొప్ప విశ్వాసం గాని, దానిపై ఆశగాని లేదు కాని వారికి వామ పక్షాల పట్ల విశ్వాసం లేకపోవటం గమనించదగినది వామపక్ష సిద్ధాంతాలు వారికి నచ్చకకాదు, ప్రజలలో శాంతివాంఛ లేకఅంతకంటే కాదు వామపక్షాలు శాంతి కార్యక్రమం ఏది తలపెట్టినా వారికి విజయం తప్పక లభిస్తుంది

ఈ కారణాలన్నీ చూస్తే వామపక్షాలు ఈనాడు చేయవలసిన పని అచ్చగా కాంగ్రెసును విమర్శించటం మాత్రమే కాదు అవి ఆత్మవిమర్శ కూడా చేసుకోవాలి ప్రస్తుతప్రపంచ పరిస్థితిని బట్టి శాంతిని ప్రధానంగా పెట్టుకొని దానికొరకు తమ శక్తులను కూడగట్టి, దానికి అనుకూలించే రాజకీయ విధానాలను ప్రచారం చేసినట్లయితే కాంగ్రెసు ప్రభుత్వంలోని శాంతికాముక వర్గాలను మరింత బలపరచటానికీ, ప్రజలలో చైతన్యం కలిగించటానికీ ఎంతైనా వీలుంటుంది కాంగ్రెసులో అంతర్గతంగా మంచిశక్తులూ, దుష్టశక్తులూ ఒకేసారి ద్యోతకం కావటం చూస్తూ ఉపలక్షించటం ఎంత తప్పో శాంతి కాముక శక్తులను ఏకముఖం చేయకుండా స్వల్ప విషయాలను గురించి వివిధ శాంతికాముక వర్గాలు కీచులాడుకోవటం కూడా అంతే తప్పు యుద్ధోన్మాదులను వేరు చెయ్యటం కంటే ఈనాడు ఉత్తమమైన దేశీయ రాజకీయాశయం లేదు ఇదే ప్రస్తుతం మనదేశంలో రావలసిన మార్పు

తెలుగు స్వతంత్ర వారపత్రిక 19-1-1951

# 18. అమెరికా విదేశాంగ నీతి

అమెరికాకూ పశ్చిమ యూరపు రాజ్యాలకూ బెడుస్తుందా? అటువంటి అవకాశం బొత్తిగా లేకపోలేదు

నయాన్నో భయాన్నో ఐక్యరాజ్యసమితిచేత చైనాను దురాక్రమణదారుగా ప్రకటింప చేయాలని అమెరికా చాలా రోజులుగా చేస్తున్న ప్రయత్నం కొనసాగటం లేదు

అమెరికా కోరిన ఈ కోరిక, ఏమంత గొప్పదికాదు అమెరికా సాటి రాజ్యాలను చైనాతో యుద్ధానికి రమ్మనటం లేదు తాను చైనాతో యుద్ధం చేస్తాననటం లేదు ఊరికే, "కొరియాలో చైనా దురాక్రమణ చేసిందని ప్రకటించండి ఆర్థిక ఆంక్షలు ప్రయోగించండి" అంటున్నది కొద్దిపాటి దేశాలు-దక్షిణ అమెరికా దేశాలూ, హాలండూ-తప్ప మిగిలినవి అమెరికా కోరిక చెల్లించటానికి ముందుకు రాకుండా ఉన్నాయి

ఏడు మాసాల క్రితం ఉత్తర కొరియాను దురాక్రమణదారుగా భద్రతామండలిచేత అమెరికా ప్రకటించగలగటమే గాక, సాయుధ జోక్యానికి కూడా సమ్మతింప జేసింది ఈఏడు మాసాలలో అమెరికా అంతర్జాతీయ పలుకుబడిలో కలిగిన మార్పు వివరంగా తెలుసుకోదగినది ఈతేడాలు ముందు స్థూలంగా పరిశీలించుదాం

ఏడు మాసాల క్రితంః మజ్జిగలో చల్ల కలిసినట్టు దక్షిణ కొరియాలో ఉత్తర కొరియా సేనలు కనిపించాయి అమెరికా తనబలాలను జపానునుంచి దక్షిణ కొరియాకు పంపిన కొన్ని గంటలకు ఐక్యరాజ్యసమితిలో, అందులోనూ భద్రతామండలిలో, అమెరికా ఉత్తర కొరియాకు విరుద్ధంగా తీర్మానం ప్రవేశ పెట్టింది తీర్మానం నెగ్గింది

ఇవాళ దక్షిణ కొరియాలో చైనా బలాలు కనిపిస్తున్నాయి అమెరికా చైనాపై బలాలను దింపడం చెయ్యలేదు చైనా దురాక్రమణ దారని ప్రకటించమని ఐక్యరాజ్య సమితిని, అందులోనూ, పొలిటికల్ కమిటీని అడుగుతున్నది జవాబు రావటం లేదు

ఈ మార్పుకు కారణం ఏమిటి?

ఒక్క ముక్కలో చెప్పాలంటే అమెరికా ఈ ఏడు మాసాలలోనూ బహిరంగంగా సభ్యతను కోల్పోయింది కొరియా యుద్ధం కొరియా శాంతికి దారితీయటానికి వీలులేకుండా అమెరికా ప్రవర్తించింది ఈ యుద్ధంలో అంతర్జాతీయ నిబంధన లన్నిటినీ ఉల్లంఘించింది అమెరికను విమానాలు సాగించిన సంహార కార్యక్రమం సభ్య ప్రపంచాన్ని జుగుప్సకు గురిచేసింది ఐక్యరాజ్య సమితిని అడ్డం పెట్టుకుని యేహ్యమైన చర్యలు చేయించిన జనరల్ మెకార్థర్ దుర్జనత్వంతో బాటు అశక్తత కూడా ప్రదర్శించాడు దుర్జన1త్వంతో కొట్టుకు రాదలిచేవాడు హిట్లరులాగే అపారమైన శక్తి సామర్థ్యాల ఆభాస అయినా కలిగించగలిగి ఉండాలి

మెకార్థర్ కురిపింపచేసిన అగ్ని వర్షాలనేకాక, మెకార్థర్ వ్యూహాలను కూడా ప్రపంచ యుద్ధకోవిదులు ఘాటుగా విమర్శిస్తూ వచ్చారు

ఈఏడు నెలల కాలంలోనూ అమెరికా అరలక్ష సైనికులనూ, కొన్ని కోట్ల డాలర్లనూ కోల్పోవటమేగాక ఏడు నెల్ల కిందట కొరియాలో ఏస్థితిలో ఉన్నదో అంతకంటే హీనస్థితిలో

ఉన్నది అమెరికా ఇంకొక పొరపాటు కూడా చేసింది కొరియా కోసరం పెద్ద ఎత్తున యుద్ధయత్నాలు సాగిస్తూ, కొరియా ముఖ్యంకానట్లూ, యూరపును రక్షించటానికీ, పశ్చిమ రాజ్యాలను బలపరచటానికీ ఈయత్నాలు సాగిస్తున్నట్టు నటించింది రష్యాను శాశ్వతంగా నాశనం చెయ్యటానికిగాను ఎంత త్యాగమైనా చెయ్యటానికి సిద్ధంగా ఉన్న పశ్చిమ రాజ్యాలు చైనాకు తమ సర్వశక్తులూ ధారపోయ్యటానికి సిద్ధంగా లేవు ఇవాళ అమెరికా మాటవిని ఈ రాజ్యాలు చైనాను దురాక్రమణదారుగా ప్రకటిస్తే సరిగా ఈపనే చెయ్యవలిసి రావచ్చు ఒంటరిగా అమెరికా చైనాపైకి లంఘించటానికి వెరుస్తున్నదని గుడ్డివాళ్లకు కూడా అర్ధమౌతూనే ఉన్నది

అమెరికాను గురించి పశ్చిమ రాజ్యాలు ధైర్యంతో ఉండలేకపోవటానికి మరొక కారణం కూడా ఉన్నది అమెరికా విదేశవైఖరి డెమోక్రాట్, రిపబ్లికన్ పార్టీల సమిష్టివైఖరి అనే నటన పటాపంచలయింది ఈఏడునెల్ల కాలంలోనూ, అమెరికా విదేశాంగ శాఖకూ, మెకార్థర్‌కూ ఉండే విభేదాలూ, రిపబ్లికన్‌లకూ, డెమోక్రాట్‌లకూ ఉండే విభేదాలూ ఎన్నోసార్లు స్పష్టమైనాయి సెనెటర్ టాఫ్ట్, హూవర్ మొదలైన వాళ్లు ఇటీవల తాము చేసిన ప్రసంగాలలో ఈ విషయం మరింత విస్పష్టం చేశారు "కొరియా యుద్ధం ఘోరమైన పొరపాటు పశ్చిమ యూరప్ రాజ్యాలు తమ్ముతాము రక్షించుకునే స్థితిలో లేకపోతే మనం రక్షించరాదు ("నువ్వు ఈదలేకపోతే నేను రక్షించను") కొరియాపై ప్రకటిత యుద్ధం కన్న చైనా మీద ప్రకటిత యుద్ధం సాగించటం మంచిది"– ఇటువంటి భావాలను రిపబ్లికన్ అగ్రనాయకులు ప్రకటించారు ఏడునెల్ల క్రితం కన్న ఇప్పుడు అమెరికాలో రిపబ్లికనులకు హెచ్చుపలుకుబడి ఉందిగాని తక్కువ పలుకుబడి లేదు!

దూర ప్రాచ్యాన్ని గురించి తనకు ఒక నిర్దిష్టమైన విధానం ఉన్నట్టు అమెరికా రుజువు చేసుకోలేకపోగా, దూరప్రాచ్యాన్ని అంటిపెట్టుకుని ఉండటంలో స్వార్థం తప్ప వేరు సిద్ధాంతాలేమీ లేవని డగ్లస్ మెకార్థర్ బయట పెట్టటమూ, ఈభయంకర సత్యాన్ని కప్పిపెట్టటానికి అమెరికా అధ్యక్షుడు వ్యర్థప్రయత్నం చెయ్యటమూ కూడా జరిగింది

ఒక్క మెకార్థరేగాక అమెరికాలోని ఉన్నతాధికారులు చాలామంది, తమబలానికి ఎదురు లేదన్న ధీమాతో, ఇతర దేశాలను ఆజ్ఞాపించే స్థితిలో ఉన్నామనే అహంకారంతో, ఇటు వంటి "నగ్న" ప్రకటనలు చాలా చేశారు

అమెరికా పాలకవర్గంవారు ప్రపంచాన్ని దిగమింగటానికి యత్నిస్తున్నారన్న విషయం దాగకుండా బట్టబయలు కావటానికి ప్రధాన కారణం, అమెరికాలో ఇంకా చలామణీ అవుతున్న ప్రజాస్వామిక విధానాలూ, వ్యక్తి వాక్స్వాతంత్ర్యాలూనూ ప్రపంచాధిపత్యానికి గాలంవేసే వాళ్ళు అవలంబించదగిన ఫాసిస్టువిధానాన్ని అమెరికాలోని యుద్ధోన్మాదులు అమెరికాలో అవలంబించగలరనేది చాలా హాస్యాస్పదం అటువంటి పరిస్థితికి ఉపోద్ఘాతంగా ట్రూమన్ తీవ్ర పరిస్థితి ప్రకటించాడు గాని అమెరికన్ పత్రికలు ఇప్పటికి కూడా ఈదేశాలను ఎట్లా వంచించాలో బాహాటంగా చర్చిస్తున్నాయి ఫ్రాన్సు జర్మనీ విషయంలో తోక జాడిస్తున్నది ఫ్రాన్సును బెదిరించి మార్షల్ సహాయం తెగగోస్తామని చెప్పాడు టర్కీ సేనలు కొరియాలో

సర్వనాశనం కావడం వల్ల టర్కీలో–యుద్ధతంత్రరీత్యా మనకి చాలా అవసరమైన మధ్యప్రాచ్యంలో మన పరపతి దెబ్బతింటున్నది, వాళ్ళని దువ్వాలి ఈరకం రాతలు ప్రపంచ ప్రజల ఆదరాభిమానాలను చూరగొనేవి కావు ఉత్తర అట్లాంటిక్ కూటంలో చేరిన దేశాల అధికారులు తమ ప్రజలను మభ్యపెట్టటానికి తోడ్పడకపోగా అమెరికా వారి ఆగ్రహాన్ని సంపాదిస్తున్నది

అన్నిటికన్నా కూడా మించిన పొరపాటు ఐక్యరాజ్యసమితిలోనే అమెరికా చేస్తున్నది– ఐక్యరాజ్యసమితికే ఎసరుపెట్టడం పశ్చిమయూరపు దేశాలదృష్టిలో ఇది చాలా పెద్దపొరపాటు

ఐక్యరాజ్య సమితిని అడ్డంపెట్టుకుని, అందులో తన ఉపగ్రహాలతో తన కిష్టమైన నిర్ణయాలు చేయిస్తూ అమెరికా ఏ నాటకం ఆడించినా పశ్చిమ యూరపు రాజ్యాలకు అభ్యంతరంలేదు

ఐక్యరాజ్య భద్రతామండలిలోకి రష్యా తిరిగి వచ్చి వీటో ప్రయోగించటం మొదలు పెట్టిన తరవాత భద్రతామండలి నిర్ణయాధికారాన్ని సర్వప్రతినిధి సభకు బదలాయించటానికీ ఈ విధంగా ప్రచ్ఛన్నంగా ఐక్యరాజ్య సమితి సూత్రాలకు గొయ్యి తవ్వటానికీ అమెరికా ఎత్తు వేసినప్పుడు కూడా పశ్చిమ యూరపు రాజ్యాలు తోడ్పడ్డాయి కాని ఐక్యరాజ్య సమితిలో రష్యా ఉండగా అమెరికా భద్రతా మండలిని ఏవిధంగానూ ఉపయోగించలేని పరిస్థితి రావటం అమెరికా దౌర్బల్యానికి ప్రత్యక్ష నిదర్శనంగా పరిణమిస్తున్నది ఐక్యరాజ్యసమితికి గొయ్యి తవ్వుతున్నది రష్యాయేనన్న ప్రచారం విరివిగా సాగించటానికి అవకాశమే లేకుండాపోతున్నది భారత పార్లమెంటులో నెహ్రూ చాలాసార్లు చెప్పినట్టు, ఎంత అక్రమంగా కనిపించినప్పటికీ వీటో లేకపోతే ఐక్యరాజ్య సమితి వృధా ఈ వీటోను తప్పించు కోవటానికి అష్టకష్టాలు పడే అమెరికా ఐక్యరాజ్యసమితి ఆశయాలకు అనుగుణంగా ప్రవర్తించలేదని రోజురోజుకూ మరింత బాగా రుజువవుతున్నది

ఈమాటనే బాధ్యతారహితులైన అమెరికను రాజకీయనాయకులు బహిరంగంగా అంటున్నారు "అమెరికా ఐక్యరాజ్య సమితి నుంచి బయటికి రావాలి," అని వీరి నినాదం ఆమెరికా విదేశాంగ శాఖ ఐక్యరాజ్యసమితిలో వేస్తున్న పిల్లిమొగ్గలు వీరికి విసుగెత్తిస్తున్నాయి

చైనా దురాక్రమణదారని ఐక్యరాజ్యదేశాలు ప్రకటించాలని అమెరికా పొలిటికల్ కమిటీలో ప్రతిపాదించాలంటూ అమెరికన్ కాంగ్రెసులో ఒక తీర్మానం ఉభయరాజకీయ పార్టీల తరఫున ప్రవేశపెట్టబడి నెగ్గింది కాని గమనించదగిన విషయమేమంటే ఈ తీర్మానాన్ని వ్యతిరేకించిన రిపబ్లికన్ సభ్యులు కొందరున్నారు ఉభయ రాజకీయ పార్టీలకూ విదేశాంగ విధానంలో అభిప్రాయభేదం లేదని ఈ ప్రతిపాదన రుజువుచేస్తున్నదనే అబద్ధం మళ్లీ పునరుద్ఘాటించబడింది

పొలిటికల్ కమిటీలో అమెరికా ప్రతినిధి, చైనాను కొరియాలో దురాక్రమణదారని ప్రకటించి చైనాపై ఆంక్షలు ప్రయోగించాలని ప్రతిపాదించగానే అనేకమంది సభ్యులకు ఇది చర్వితచర్వణమని స్ఫురించి ఉండాలి 1935 లో నానారాజ్య సమితిలో ఇటువంటి తీర్మానమే ఇటలీపై తీసుకురాబడింది దాని ఫలితాలను ప్రపంచమంతా తెలుసుకున్నది అప్పటి తీర్మానం ఇటలీకి లాభించింది ఇప్పటి తీర్మానం చైనాకు లాభిస్తుందేమోనన్న భయంకూడా కొందరికి ఉండవచ్చు కాని నానారాజ్యసమితి ఏ దారినపోయి నశించిందో, ఐక్యరాజ్యసమితిని ఆ దారే పట్టించటానికి అమెరికా తహతహ లాడుతున్నది

పర్యవసానంః నెహ్రూ ఫ్రాన్సు వెళ్ళాడు ఫ్రెంచి ప్రధానితోనూ, విదేశాంగ మంత్రితోనూ మాట్లాడాడు చైనాను దురాక్రమణదారుగా ప్రకటించనవసరంలేదనీ, రాయబారాలతో చైనాతో రాజీ కుదరవచ్చుననీ వాళ్లు అంగీకరించారు ఐక్యరాజ్య యుద్ధవిరమణ ప్రతిపాదనలను తోసివేస్తూ చైనాచేసిన శాంతి ప్రతిపాదనలు సబబుగానే ఉన్నట్లు పశ్చిమ వర్గాలవారు భావిస్తున్నారని లండను నుంచి ఒకవార్త

ఈ విధంగా చెయ్యి దాటిపోయే పశ్చిమ యూరపు రాజ్యాలనుగురించి అమెరికా ఏం చెయ్యనున్నది?

తెలుగుస్వతంత్ర వారపత్రిక, 26-1-1951

## 19. పతనమైన ఐక్యరాజ్యసమితి

ఐక్యరాజ్య సమితి నైతికంగానూ, రాజకీయంగానూ పతనమయింది అమెరికా ఒత్తిడి ఫలించి కమ్యూనిస్టు చైనా కొరియాలో దురాక్రమణ చేసినట్టు తీర్మానం జరగటమే దీనికి తార్కాణం అయితే ఈ పతనం ఇవాళే జరగలేదు చాలాకాలం క్రితమే భారత పార్లమెంటులో నెహ్రూ ఇండియా విదేశాంగ విధానం గురించి మాట్లాడుతూ, ఫ్రాంక్లిన్ డిలోనో రూజువెల్టు ఐక్యరాజ్యసమితి ఆదర్శాలను ఏ విధంగా నిర్ణయించాడో, వాటికి ఎటువంటి గతి పట్టిందో సవిస్తరంగా చెప్పాడు నెహ్రూ అంచనాప్రకారం కొరియా సంఘటనకు పూర్వమే ఐక్యరాజ్యసమితి తన ఆదర్శాలకు ఎడమైపోయి ఉంది నెహ్రూ అట్లాభావించటంలో వింత ఏమీలేదు 47 కోట్లకు పైగా ఉన్న చైనా ప్రజకు ఐక్యరాజ్యసమితిలో ఉండిన ప్రతినిధి వారి గర్భశత్రువు పైగా చైనా అగ్రప్రపంచంలో ఒకటి అంటే చైనా పూర్తి సమ్మతి లేకుండా ఐక్యరాజ్య సమితి ఎట్టి నిర్ణయమూ చెయ్యటానికి లేదు ఈ హక్కు చైనాతోబాటు అమెరికా, రష్యా, బ్రిటను, ఫ్రాన్సులు మాత్రమే కలిగి ఉన్నాయి ఇటువంటి గొప్ప అంతర్జాతీయ హక్కును చైనా ప్రజల ప్రతినిధికాక చాంగ్‌కైషేక్ ప్రతినిధి అనుభవిస్తూ వచ్చాడు ఈ పరిస్థితి సహించలేక రష్యా ఐక్యరాజ్య సంస్థలో చాలావాటిని బహిష్కరించింది, ఇందువల్ల భద్రతామండలిలో రెండు అగ్రదేశాలూ, ప్రపంచజనాభాలో ఒక పెద్ద మొత్తానికి చెందిన ప్రతినిధులూ లేకుండా పోవటం జరిగింది ఇక మిగిలిన మూడు దేశాలలోనైనా బ్రిటను చైనాను గుర్తించి అమెరికాచేత ఐక్యరాజ్యసమితిలో చైనాకు స్థానం ఇప్పించటానికి యత్నిస్తున్న దేశమే ఫ్రాన్సు చైనాను గుర్తించకపోవటానికి అమెరికా ఒత్తిడి తప్ప మరోకారణం ఎంతమాత్రమూలేదు

అటువంటి పరిస్థితిలో భారత ప్రధాని నెహ్రూ ఐక్యరాజ్యసమితిని గురించి నిరాశాయుతంగా మాట్లాడాడు యుద్ధానంతరం ప్రపంచ ప్రజల ఆశలన్నిటికీ ఆశయంగా కనిపించిన ఐక్యరాజ్యసమితి ఈ క్షీణదశకు రావటానికి ఫలానివారు కారణమని నెహ్రూ తననోటిమీదుగా అనలేదు అయినప్పటికీ ఐక్యరాజ్యసమితి ప్రాథమికసిద్ధాంతాలను పడగొట్టటంలో అమెరికా నిర్వహించిన పాత్ర లోకానికి ఎప్పటికప్పుడు వెల్లడి అవుతూనే వచ్చింది నిజానికి రష్యా మాటిమాటికీ వీటోని ప్రయోగించి భద్రతామండలి కార్యక్రమాన్ని సాగనివ్వకుండా ఉన్నదని అమెరికా చాలా పర్యాయాలు విమర్శించింది కాని అమెరికాకు ఐక్యరాజ్యసమితి ప్రాథమిక సూత్రాలపట్ల విశ్వాసం ఉంటే రష్యా వీటోను విమర్శించి ఉండవలసిన అవసరంలేదు రష్యాను

వెలివెయ్యటానికి అమెరికా వీటో అని పేరు పెట్టినప్పటికీ అగ్రరాజ్య ఏకగ్రీవాభిప్రాయం ఐక్యరాజ్యసమితి ఆశయాలకు పునాది అని చెప్పవచ్చు నెహ్రూ ఈ ప్రసంగంలోనే ఈ సూత్రాన్ని పూర్తిగా సమర్ధించాడు

ఈ సూత్రంలో అంతరార్థం ఏమిటి? రెండవ ప్రపంచయుద్ధంతో సంక్షోభించిపోయిన ప్రపంచ రాజ్యాలు ఇకమీదట ఇటువంటి ప్రపంచవిపత్తు కలగరాదనే ఉద్దేశంతో, వివిధ దేశాల మధ్య గల రాజకీయాభిప్రాయాలు చర్చల ద్వారా పరిష్కారం కావాలన్న ఆశయంతో ఈ సంస్థను ఏర్పాటుచేశాయి అయితే మరి అగ్రరాజ్యాల మధ్య ఏకాభిప్రాయం యొక్క ఆవశ్యకత ఏమిటి? అగ్రరాజ్యాలలో ఏ ఒకటి యుద్ధం తెచ్చిపెట్ట దలచినా ఇతర దేశాలు దానిని వారించలేవు అగ్రరాజ్యాలన్నీ ఏకగ్రీవంగా శాంతి కోరనిపక్షాన ఈ సమితి ఆశయాలు ఎట్లాగూ వృధాయే అటువంటప్పుడు కొన్ని అగ్రరాజ్యాలు ఏకమై మిగిలిన వాటిని ఓడించి అగ్రరాజ్యాల మధ్య శాశ్వతమైన చీలికలు తీసుకురాకుండా ఈ ఏకాభిప్రాయ సూత్రం ప్రవేశపెట్టబడింది ఏ విపరీత పరిస్థితి రాకుండా ఉండగలందులకు ఏకాభిప్రాయ సూత్రం ఏర్పాటయిందో, ఆ విపరీత పరిస్థితి యుద్ధానంతరమే ఏర్పడి రష్యాకు ప్రతిగా అమెరికా, బ్రిటను, ఫ్రాన్సులు ఒకటి కాసాగాయి ఈ కూటం ఫలితమే పశ్చిమ జర్మనీలో అమెరికా అధీనంలో ట్రైజూనియా ఏర్పడటం (అమెరికా, బ్రిటను, ఫ్రాన్సు దేశాల బలాల ఆక్రమణకింద ఉన్న పశ్చిమ జర్మనీ ప్రాంతాలు ఏకం అయాయి) యుద్ధకాలంలో జరిగిన యాల్టా, కయిరో, పాట్స్‌డామ్ ఒప్పందాలు మొదలుకొని ప్రతి రాజకీయ విషయంలోనూ రష్యాది ఒకదారి అయితే అమెరికా, బ్రిటను, ఫ్రాన్సులది మరొకదారి కాసాగింది ఈ కూటం ఫలితంగా, భద్రతా మండలిలో అమెరికా ప్రేరణతో బ్రిటను, ఫ్రాన్సుల అనుమతితో తీసుకురాబడిన అనేక ప్రతిపాదనలకు రష్యా తన అసమ్మతి ప్రకటించడం జరిగింది

ఐక్యరాజ్యసమితిని ఏ అగ్రరాజ్య సమితి విచ్ఛిన్నం చేయజూచినా దానికి ఒకే ఒక కారణం ఉండే అవకాశం ఉంది అది యుద్ధవాంఛ అంతర్జాతీయ విభేదాలను యుద్ధంతో కాక చర్చలతో పరిష్కారం చేసుకోగోరే శాంతికాముక దేశం ఏదీ ఐక్యరాజ్య సమితికి ఎసరుపెట్టదుః ఐక్యరాజ్య నియమావళిని తప్పుపట్టదుః ఐక్యరాజ్యసమితిని తన రాజకీయ రధానికి అంటగట్టదుః ఐక్యరాజ్య సమితిపై తన ఒత్తిడి ప్రయోగించి విజయాలు సాధించదు ఇది సిద్ధాంతం ఇటువంటి పనులన్నీ అమెరికా చేసింది తమ అక్కర చూసుకుంటూ బ్రిటను ఫ్రాన్సు దేశాలు ఈ కార్యకలాపంలో అమెరికాకు ప్రక్కతాళం వేశాయి తమ ప్రకటిత విశ్వాసాలకు అమెరికా ధోరణి విరుద్ధంగానూ, విపరీతంగానూ ఉన్నప్పుడు కూడా ఇవి అమెరికాను ప్రతిఘటించలేక, చైనాను దురాక్రమణదారుగా ప్రకటించడం విషయంలోలాగ తమ అసమర్ధతను చాటుకున్నాయి అరవైదేశాలు, అందులో అయిదు అగ్రదేశాలు, గల ఐక్యరాజ్యసమితిలో ఒక అగ్రదేశానికి ప్రాతినిధ్యం లేదు మిగిలిన నాలుగింటిలో మూడు ఒకే పక్షంః అందులోనూ రెండు దేశాలు మూడోదాని చేతి కీలుబొమ్మలు! ఈ పరిస్థితిలో ఐక్యరాజ్య సమితి తన ఆశయాలను సాగించుకొనటం అసంభవం అమెరికా యుద్ధం కోరుతున్నదని నిదర్శనమేమిటి? రష్యాతో సరిసమానంగా అమెరికా శాంతికోసం ప్రతిపనీ చేస్తున్నానని చెబుతున్నది శాంతికి ప్రమాదం రష్యానుంచే వస్తుందని కూడా అమెరికా అంటున్నది ఈ "శాంతి" కోసం రష్యా ఏమి

త్యాగాలు చేస్తున్నదీ, ప్రపంచానికి తెలీదు అమెరికామటుకు కోట్లకొద్ది డాలర్లు "శాంతి" కోసం ధారపోస్తున్నది తిండికి కూడా సరిగాలేని పశ్చిమయూరపు రాజ్యాలచేత కోట్లకొద్దీ "రక్షణ" కింద ఖర్చు చేయిస్తున్నది ఇటు అమెరికా ప్రజలూ, అటు పశ్చిమ యూరపు ప్రజలూ అంతులేని ఆర్థిక చిక్కులకు లోనై నానాబాధలూ పడుతున్నారు దీనిమాటేమిటి?

ఇక్కడా ఐక్యరాజ్యసమితే సరిఅయిన గీటురాయి యుద్ధభయం ఎవరికైనా ఉండవచ్చు రష్యన్ కమ్యూనిజం అమాంతం పెట్టుబడిదారీ మీద విరుచుకుపడి మింగేస్తుందన్న భయం పెట్టుబడిదారీ దేశాలకు మహరాజుగా ఉండవచ్చు కాని యుద్ధభయం ఉన్న దేశాలు తమ భయకారణాలను గురించి చర్చించుకోవటానికి ఐక్యరాజ్యసమితి ఉన్నది అమెరికా తనకుగల యుద్ధ భయాన్ని గురించి సమితిలో ఎప్పుడు చర్చించింది? చర్చించటానికి ఏం ప్రయత్నం చేసింది? ఏమీలేదు పైపెచ్చు అమెరికా ఉత్తర అట్లాంటిక్ ఒడంబడిక ఏర్పాటుచేసింది దాన్ని ప్రాంతీయ రక్షణ అనీ, అది అచ్చగా ఐక్యరాజ్య నిబంధనల ననుసరించే జరిగిందనీ అన్నారు కాని ఇవాళ అది రక్షణ ఒడంబడికఅని నమ్మే మూఢుడెవడూ లేడు

అమెరికా శాంతికోరే దేశమైతే చాలా ప్రశ్నలు పుట్టుకొస్తాయి అయిదేళ్ల క్రితం ప్రపంచాన్ని భయంకరమైన యుద్ధంలో ముంచి చివరకు ఓడిపోయిన జర్మనీ జపానులను తిరిగి అమెరికా ఎందుకు యుద్ధోన్ముఖులను చేస్తున్నదీ? నాజీల బాంబులకు చచ్చినవారి పిల్లలింకా బతికున్నారు, వారిచేత చచ్చిన పిల్లల తలిదండ్రులు బతికివున్నారు బ్రిటను, ఫ్రాన్సులు జర్మనీ సాయుధమవుతుందంటే వణుకుతున్నాయి పశ్చిమ జర్మనీలోనే యుద్ధ విముఖులు ప్రదర్శనలు చేస్తున్నారు ఇటువంటిస్థితిలో అమెరికా యుద్ధ ప్రయత్నాలు ఇంత చురుకుగా ఎందుకు సాగిస్తున్నది? ఆకస్మికంగా అమెరికా బలపరిచే ప్రజాస్వామికానికి ఫ్రాంకో ఫాసిస్టు హంతకుడు సంరక్షకుడు కావటమూ, అతడికి అమెరికా కోట్లకొద్దీ అప్పుపెట్టటమూ ఎట్లా తటస్థించింది? టిటోకు అమెరికా ఇటీవల 380 లక్షల డాలర్లు అప్పు ఎందుకిచ్చిందీ వివరించబడింది అమెరికా ఒక్క డివిజను సేన తయారు చేసుకోవాలంటే 7కోట్ల డాలర్లకు పైగా అవుతున్నది 380 లక్షల డాలర్లిస్తే టిటో ఎన్నో డివిజను లిస్తాడు! గత యుద్ధంలో శాంతి విద్రోహకులను జయించింది డబ్బా, ప్రజా శక్తులా? అమెరికా అభిప్రాయం ఏమిటి?

ఇంకొక విషయంకూడా గమనించ తగ్గది, ఐక్యరాజ్యసమితిలో ఏమిటి, బయటేమిటి అమెరికా ఏ విషయాన్ని గురించీ చర్చించటానికి ఆత్రపడ్డట్టు కనపడదు ఐక్యరాజ్యసమితిలో తాను ప్రవేశపెట్టే తీర్మానాలపై ఓటుకోసం తహతహలాడినట్టు, చర్చించటానికి తహతహలాడదు కాని ఐక్యరాజ్యసమితి ఏర్పడిందే విభేదాలు చర్చించటానికి అమెరికాకు ఉన్న తగాదా యావత్తూ రష్యాతోనే అయినప్పుడు తాను శాంతిమార్గం కోరుతున్నదైతే రష్యాతో చర్చకు దిగాలి తనకూ రష్యాకూ ఉండే విభేదాలు చర్చించటానికి తాను యత్నం చెయ్యకపోగా ఇతరులు అట్టి చర్యలు సూచించినప్పుడు కూడా అమెరికా వాటిని తప్పుకుంటూవస్తున్నది

జర్మనీ ఐక్యతా, జపాను సంధీ, ఆస్ట్రేలియా సంధీ, దూరప్రాచ్య సమస్యలూ, కొరియా యుద్ధ విరమణా మొదలైన అసంఖ్యాకమైన సమస్యలను గురించి చర్చలు జరపటానికి ఇతర దేశాలు ఎంత ఆత్రం చూపుతాయో, చర్చలు జరపకుండా ఉండటానికి అమెరికా అంత ఆత్రం చూపుతూవస్తున్నది రష్యాయే యుద్ధం కోరే దేశమైతే చర్చలు జరపటానికి అడుగడుగున

రష్యా ఎందుకు సంసిద్ధంగా ఉంటున్నదో అమెరికాగాని అమెరికా పక్షంవారు గాని తెలుప వలసిన అవసరం ఉన్నది పశ్చిమ జర్మనీలో జర్మనీ ఐక్యతావాంఛ ప్రబలమైపోయి రష్యాతో మిగిలిన మూడు పశ్చిమ దేశాలూ సంప్రతింపులు చేస్తేగాని తప్పదన్న పరిస్థితి వచ్చినప్పుడు జర్మనీ ఐక్యతను గురించి రష్యాతో మాట్లడటానికి అమెరికా కొన్ని అమానుషమైన షరతులు పెట్టింది ఈ షరతులను రష్యా తోసివేసింది తోసివెయ్యటానికి ఆ షరతులు ఉద్దేశించబడిన వని అమెరికను మిలిటరీ గవర్నరయిన లూసియన్‌డిక్లే తన అనుభవాలలో బహిరంగంగా రాసుకున్నాడు "ఒకవేళ రష్యా ఈ షరతులకు ఒప్పుకుంటుందేమోనని మాకు గుండె పిచపిచలాడింది", అని ఈ పెద్ద మనిషి లోకానికి తెలియచెప్పుకున్నాడు అశాంతికి దారితీస్తూ శాంతికి అంతరాయంగా ఉండే సమస్యలను గురించి చర్చలు జరిపి సమాధానం కుదుర్చుకోవటానికి అమెరికా ఎంత సంసిద్ధంగా ఉన్నదీ ఈ ఒక్క సంఘటనే తెలుపుతున్నది

ప్రస్తుత సమస్యకు కారణభూతమైన కొరియా యుద్ధవిరమణ విషయంలో కూడా అమెరికా ఇదే వైఖరి అవలంబించింది కొరియా యుద్ధవిరమణకుగాను ఆసియా అరబ్బు దేశాలు చేసిన ప్రతిపాదనలకు ప్రతిగా చైనా తన ప్రతిపాదనలను ప్రకటించిన అరగంటలోగా అమెరికాస్టేట్ డిపార్ట్‌మెంటు వాటిని తోసివేశామని ప్రకటించింది ఆ ప్రతిపాదనలను గురించి సభ్యులు ఆలోచించటానికి 48 గంటలు వ్యవధి ఇవ్వటానికి కూడా అమెరికా తీవ్రమైన అసమ్మతి ప్రకటించింది ఆఖరుకు కేవలం ఒత్తిడి చేసి చైనా కొరియాలో దురాక్రమణ చేసిందన్న 'డొల్ల" తీర్మానాన్ని సమితిలో అమెరికా నెగ్గింపజేసింది ఈ తీర్మానం ఆధారంతో అమెరికా ఎట్టిచర్య జరపబోతున్నదీ తెలియదు ఇటువంటి తీర్మానం సర్వప్రతినిధి సభలో నెగ్గటం నియమాలకు విరుద్ధమని బి ఎన్ రావు బయటపెట్టి అందరినీ కంగారులో ముంచాడు ఆమాటే చైనా ప్రధాని చౌ-ఎన్-లాయ్ కూడా అన్నాడు

ఇంతకూ, ఇన్ని ఇక్కట్లకూ మూలం చైనాకు ఐక్యరాజ్య సమితిలో సరిఅయిన ప్రాతినిధ్యం లేకపోవటమని నెహ్రూతోబాటు పత్రికలన్నీ కోడైకూస్తున్నాయి అమెరికా చైనా ప్రాతినిధ్యానికి ఎందుకు అభ్యంతరం చెబుతున్నది? చాంగ్-కై-షేక్ ప్రతినిధి ఇవాళ ఇంకా సమితిలో ఎందుకున్నాడు? చైనాలో చాంగ్-కై-షేక్, కొమింటాంగ్ జాతీయవాదులు ఓడారన్నది అమెరికా గుర్తించలేదా? గుర్తించింది అమెరికా స్టేట్ డిపార్టుమెంటు చైనాను గురించి ప్రకటించిన శ్వేతపత్రం నిండా చాంగ్-కై-షేక్ ప్రభుత్వం అసమర్థమైనదనీ, అవినీతియుతమనీ, అమెరికా చేయదగిన ఎట్టి సహాయం కూడా అతనికి విజయాన్ని చేకూర్చి ఉండదనీ పదేపదే చెప్పబడి ఉంది 600 కోట్ల డాలర్లు చాంగ్-కై-షేక్‌కు వృధాగా ధారబోసినందుకు స్టేట్ డిపార్టుమెంటు ఆ శ్వేతపత్రం ద్వారా అమెరికా ప్రజలకు క్షమాపణ చెప్పుకున్నది అయినప్పుడు అమెరికా తన సర్వశక్తులూ వినియోగించి ఆ చాంగ్-కై-షేక్-కొమింటాంగ్ జాతీయవాద ప్రతినిధిని ఐక్యరాజ్యసమితినుంచి పోనివ్వకుండా కాపాడుతూ దూరప్రాచ్యంలో ఇంత జననాశమూ, సంక్షోభమూ కలిగించి, ప్రపంచమంతటా తనకూ ఐక్యరాజ్య సమితికీ తీరని తలవంపులూ చెడ్డపేరూ ఎందుకు తెస్తున్నది? ప్రపంచయుద్ధం తెచ్చిపెట్టటానికి! దూరప్రాచ్యంలో ఫార్మోజాను తనకింద ఉంచుకుని అక్కడ తన యుద్ధస్థావరాలు నిర్మించుకోవటానికి! అమెరికా చాంగ్-కై-షేక్‌ను గుర్తించటం మానిన మరుక్షణం, పాత ఒడంబడికలకింద ఫార్మోజాను

కమ్యూనిస్టుల పరం చెయ్యాలి జనరల్ డగ్లస్ మెకార్థర్ బయట పెట్టినట్టు దూర ప్రాచ్య స్థావరాలలో యుద్ధతంత్ర రీత్యా అమెరికాకు అతి ముఖ్యమైన స్థావరం ఫార్మోజా ఈ రహస్యం బయట పెట్టినందుకు అప్పట్లో ట్రూమన్ చాలా ఆగ్రహించాడు కాని, మెకార్థర్ ఉద్యోగం ఊడలేదు ఊడవలసిన అవసరం కూడా లేదు ఎందుకంటే "ఫార్మోజా విషయం ఏమిటి?" అన్న ప్రశ్నకు అమెరికా అధికారులు, 'దాని ప్రతిపత్తి అమెరికా రక్షణావసరాలను బట్టి నిర్ణయించబడుతుంది," అంటున్నారు ఇంకోభాషలో మెకార్థరుకూడా ఆమాటే అన్నాడు

ఒక్క ఫార్మోజా భవిష్యత్తే కాదు, అంతర్జాతీయ విషయాలన్నీ తన స్వార్థాన్ని బట్టి నిర్ణయించబడాలనే ధోరణిలోకి వచ్చింది అమెరికా, దాని ఫలితమే ఐక్యరాజ్యసమితి పతనం ఇవాళ అమెరికా రాజనీతి తర్కాన్నే విసర్జించింది తమ కాళ్ళమీద నిలబడే శక్తిలేని పశ్చిమ యూరపుదేశాలను అమెరికా కంచీతో కొట్టి పరుగులు తీయిస్తున్నది వాటి శక్తికిమించిన ఆయుధోత్పత్తి చేయిస్తున్నది ఇదంతా రష్యా దురాక్రమణను నిరుత్సాహ పరచటానికేనని చెప్పబడుతున్నది ఐతే రష్యాకు దురాక్రమణ చేసే శక్తి ఉందా అంటే లేదుట 1953 దాకా రాదుట ఈనాడు అమెరికా రాజకీయ పరిభాషలో రక్షణ అంటే దాడి అని అర్థం ఈ సంగతి తెలియని అమాయకులకు అమెరికా ఏమి చెబుతున్నదీ అర్థంకాదుః ఇది తెలిసిన వారు శాంతికాముకులైతే అమెరికా చెప్పే మాటలను సహించలేరు అందుకే ప్రపంచమంతటా శాంతి ఉద్యమం చిలవలూ పలవలూ వేస్తున్నదిః అందుకే యుద్ధోన్మాదులు ఆ ఉద్యమాన్ని అణచటానికి విశ్వయత్నం చేస్తున్నారు

తెలుగు స్వతంత్ర, వారపత్రిక 9-2-1951

# 20. హెర్బర్ట్ హూవర్ దశ సూత్రాలు

"పశ్చిమ యూరప్ సమష్టి రక్షణ బలాలకు నాయకుడు నిర్ణయమైనాడు గాని రక్షణ బలాలు మాత్రం ఇంకా లేవు" అని ఒక బ్రిటిష్ పత్రిక ఇటీవల వెటకారం చేసింది

అమెరికా యుద్ధయత్నం గురించి కూడా ఆమాటే అనవచ్చు ఈ యుద్ధ ప్రయత్నం అప్పుడే ఆరంభమయింది ట్రూమన్ అమెరికాలో తీవ్రపరిస్థితి ప్రకటించాడు నెలకు 1600 కోట్ల చొప్పున అమెరికా ప్రస్తుతం యుద్ధఖర్చు చేస్తున్నదనీ, త్వరలోనే ఈ మొత్తం 2000 కోట్లకు పెరిగి, 1951 డిసెంబరుకు 3000 కోట్లకు అందుకుంటుందనీ అమెరికన్ "న్యూస్‌వీక్" పత్రిక అంటున్నది వివిధ సైనిక శాఖలలోకి 35 లక్షల మందిని చేర్చుకోవటానికి నిర్ణయం జరిగింది కాని ఇంతవరకూ అమెరికా విదేశాంగ విధానమేమిటో మటుకు నిర్ణయం కాలేదు

అమెరికా పెద్దదేశం అందులో రెండు రాజకీయ పక్షాలున్నాయి ఒక పక్షానికి చెందిన వాడు అధ్యక్షుడు, శాసనసభలో కూడా ఆ పక్షానికే ప్రాబల్యం ఉంది అటువంటి పరిస్థితిలో ప్రభుత్వంవారు ఏదిచేసినా రెండో పక్షంవారు విమర్శించటంలో వింతలేదు విదేశాంగ విధానంలో ఉభయ పక్షాలకూ అనుకూలంగా పోవాలని ప్రభుత్వ పక్షం నిర్ణయించే పక్షాన ప్రతిపక్షంవారి విమర్శనలను బట్టి ప్రభుత్వపక్షం తన విధానాలను మార్చుకున్నా అందులో వింతలేదు కాని అమెరికాలో ఇవాళ జరుగుతున్నది అచ్చుగా అదికాదు ఏ ఒక పక్షానికీ

నిర్ధారణగా ఒక విధానమంటూ ఉన్నట్టు స్పష్టంగా తెలియటంలేదు ట్రూమన్, ఆచిసన్, హూవర్, టాఫ్ట్ మొదలైన వాళ్ళు తమ ఆశయాలను బహిరంగంగా ప్రకటించలేని స్థితిలో ఉండటమూ, దాడి అన్నమాట వాడేచోట రక్షణ అనవలసి రావటమూ, తమ స్వాతంత్ర్యాన్ని అమెరికాకు ధారపోసేసే దేశాలను స్వతంత్ర దేశాలని పేర్కొనవలసి రావటమూ, ప్రజాస్వామికాన్ని ఫ్రాంకో, నాజీలు, చాంగ్-కై-షేక్, సింగ్మన్‌రీ మొదలైన వాళ్ళతో సమన్వయించవలసి రావటమూ జరిగి అయోమయం మరింత అవుతున్నది

ఇదంతా అర్ధం చేసుకున్నప్పటికీ అమెరికా లోని నాయకులకు నిర్దిష్ట విధానం ఈనాటికింకా లేదని స్పష్టమవుతున్నది కిందటి నెలలో రిపబ్లిక్ పార్టీ విధాన నిర్ణాయకుడు రాబర్ట్ టాఫ్ట్, "యూరప్‌కు సైన్యాలను పంపటం విషయమై ట్రూమన్ ముందుగా అమెరికా శాసనసభల అనుమతి పొందకపోవటం అక్రమచర్య" అని అన్నాడు ఇప్పుడు టాఫ్ట్ "ట్రూమన్ ఏది చేసినాముందువెనక చూడకుండానూ, బాధ్యతారహితంగానూ, అడగవలసిన వారి సలహా అడగకుండానూ చేస్తున్నాడు" అని అంటున్నాడు ట్రూమన్ విధానానికి దుష్పరిణామం తప్పనిసరి అనే నిశ్చయం కలగక పోతే టాఫ్ట్ ఇంత స్థూలంగా విమర్శించడు డెమొక్రాటు పక్షం పప్పులో కాలువేస్తే దాన్ని రాజకీయంగా ఉపయోగపరుచుకుందామని రిపబ్లికన్‌ల పక్షాన టాఫ్ట్ ప్రయత్నం చేస్తున్నట్టు కనిపిస్తుంది

టాఫ్ట్‌లాగే హెర్బర్ట్ హూవర్ కూడా కొంతకాలం క్రితం తాను చేసిన ప్రసంగానికి కొద్దిగా భిన్నంగా అమెరికా విదేశాంగ విధానం గురించి సూత్రాలు ఇప్పుడు ప్రకటిస్తున్నాడు

అమెరికా విదేశాంగ కార్యదర్శి ఆచిసన్ సంగతి వేరే చెప్పనవసరంలేదు అమెరికా విదేశాంగనీతి ఒక సంవత్సరం కాలంలో చాలా విషయాలలో ఉత్తరం నుంచి దక్షిణానికి తిరిగింది ఫోర్మోజా తమ కెందుకూ పనికిరాదనీ, అది చైనావారిది కాదనేవారు మూఢులనీ అని ఉండటమూ, స్పెయిన్‌తో ఎట్టి సంబంధాలూ పెట్టుకోమని చెప్పి ఉండటమూ, జర్మనీ జపానుల పునరాయుధ ధారణను పూర్తిగా నిరసించి ఉండటమూ కొన్ని ఉదాహరణలు

ఈ విధంగా అమెరికా రాజకీయ వేత్తలు ఈనాటికీ ఒక తాటిమీద నిలబడలేకపోవటం అటుంచి ఏ ఒక రాజకీయవేత్తా నికరంగా ఒకే తాటిమీద చెప్పుకోదగినంత కాలం నిలబడ లేకపోవటం నేటి అమెరికా విదేశాంగ విధానంలో గమనించదగ్గది

హూవర్ దశ సూత్రాలను పరిశీలిస్తే అమెరికను రాజకీయవేత్తల ఆశయాలకూ, వాస్తవ పరిస్థితికీ గల వ్యత్యాసం కొంత ఉన్నదనటానికి ఎటువంటి సందేహమూలేదు మొదటి సంగతిః అమెరికా పాలకులు కోరే యుద్ధానికి చాలా అవాంతరాలున్నాయి వాటిలో చెప్పదగినవిః ప్రతిదేశంలోనూగల సామాన్య, మధ్య తరగతి ప్రజలకుగల విముఖత, పెద్ద ఎత్తున యుద్ధయత్నాలు సాగించటానికి పశ్చిమ రాజ్యాలకు అడ్డుగా ఉన్న ఆర్థిక దుస్థితి, జర్మనీ ఆస్త్రధారణకు పశ్చిమ జర్మను ప్రజల తీవ్ర అసమ్మతి - దీని యధార్ధ ప్రమాణాన్ని అమెరికన్, బ్రిటిష్ పత్రికలు స్పష్టంగా బయట పెట్టుతున్నప్పటికీ మన దేశీయ పత్రికలు బయట పెట్టటంలేదు జర్మనీ అస్త్రధారణకు బ్రిటన్, ఫ్రాన్స్ వగైరా దేశాలలోని రాజకీయవేత్తల తీవ్ర అసమ్మతి, (ఫేబియన్ పార్టీ మాజీ అధ్యక్షుడు కోల్ ఈవిషయమై ఇటీవల న్యూస్టేట్స్‌మన్ అండ్‌దినేషన్ అనే పత్రికలో చాలా ఘాటైనవ్యాసం ప్రచురించాడు)పైవాటితో బాటు

అమెరికాలోనే తీవ్రమైన యుద్ధ విముఖత తల ఎత్తుతున్నది స్టేట్ డిపార్టుమెంటుకూ, ట్రూమన్‌కూ ప్రతిరోజూ వేలాది ఉత్తరాలువస్తున్నట్టు అనేక విదేశ పత్రికలలోపడే వార్తలను స్టేట్ డిపార్టుమెంటు ఖండించినట్టు కనబడదు ఐతే అమెరికన్ శాసన సభలలో సభ్యులు "మన కుర్రవాళ్లు కొరియాకు బలిఅవుతున్నారో" అని ఆక్రోశించటం మటుకు జరుగుతున్నది

హూవర్‌దశ సూత్రాలకు ఎందుకు ప్రాముఖ్యం ఇవ్వాలి? ఆయన ప్రభుత్వ పక్షంవాడుకాదు, కాబోయే అధ్యక్షుడుకూడా బహుశా కాడు అటువంటప్పుడు ఆయన అనే మాటలను పాటించటం దేనికి? కారణం ఉంది ఇటీవల జరిగిన కాంగ్రెస్ ఎన్నికలలో రిపబ్లికనులు దాదాపు డెమోక్రాట్లతో సమానమైన విజయం సంపాదించారు రానున్న అధ్యక్ష ఎన్నికలకుగాను ఇప్పటినుంచీ గుంజాటన జరుగుతూనే ఉన్నది అమెరికా ఇప్పుడు జరిపే యుద్ధ యత్నాలపట్ల రిపబ్లికనులూ, డెమోక్రాట్లూ ప్రదర్శించే వైఖరినిబట్టి అధ్యక్షుడి ఎన్నిక ఫలితం ఉంటుంది అందుచేత అమెరికన్ ప్రజలను ఆకట్టుకోవటానికి హూవర్ తప్పక ప్రయత్నిస్తాడు యుద్ధ యత్నానికి విఘ్నం కలగకుండా అమెరికా ప్రజలకు నొప్పి కలగనిమార్గం హూవర్ సూచించయత్నిస్తాడు ఆయన అదే చేశాడు కూడాను

అమెరికా కాల్బలాలను నిర్మించటంకంటే నౌకా విమానబలాలను హెచ్చించి, ఆయుధోత్పత్తి మాత్రం సాగించాలన్నది హూవర్ మొదటిసూత్రం కొరియా యుద్ధం ఆరంభమైన పిమ్మట సాగిన సైనిక నిర్మాణంలో కాల్బలాలలోకంటె కన్న విమాన బలంలోకి ఎక్కువ మంది చేరారు! విమానబలంలో చేరేవారి అర్హత కాల్బల సైనికుల అర్హతకంటే చాలా హెచ్చు ప్రమాణంతో కూడుకున్నదికూడాను అయితే ఈ విషయం ఇప్పుడే కనిపెట్టలేదు ట్రూమన్ మొట్టమొదటగా కొరియాకు పంపుతానన్నది నౌకా విమాన బలాలు మాత్రమే కొరియాలోకి కాల్బలాన్ని పంపుతానని ముందుగానే అంటే అమెరికా ప్రజాభిప్రాయం ఎట్లా ఉండబోయేదీ ట్రూమన్‌కు తెలుసుననుకోవాలి

ఈ సూత్రం ప్రవచించటంలో హూవర్ కేవలం అమెరికా ప్రజలకుగల యుద్ధభయాన్ని రెండు మెట్లు దించటమేకాక అమెరికాలోని ధనిక వర్గాలవారిని కూడా ఒక కంట కనిపెట్టి ఉన్నాడు నౌకా, విమానబలాల నిర్మాణమూ – అస్త్ర నిర్మాణమూ ఉత్పత్తిదార్లకు అంతులేని లాభాలు చేకూర్చుతుంది జరిగిన రెండు ప్రపంచ యుద్ధాలలోనూ అమెరికా లాభాలు చేసుకున్నదంటే యుద్ధంలో పాల్గొని విజయం చేజిక్కించుకున్నందు వల్ల కాదు– కిందటి యుద్ధంలో విజయం సంపాదించిన మరుక్షణం నుంచీ జోలె చంకన పెట్టుకున్నాయి– గెలిచిన పక్షాలకు అయుధాలు విరివిగా అందించి అమెరికా అంతులేని లాభాలు చేసుకుంది మూడవ ప్రపంచ యుద్ధంలోకూడా అమెరికా కోటీశ్వరులు ఇదే పాత్ర వహించ గోరటంలో వింతలేదు ఈ సూత్రంలో ఇంకో అంతరార్థం కూడా మరవరాదు విమాన నౌకా బలాలు దెబ్బతీయటానికి పనికివచ్చినంతగా ఆత్మరక్షణకు పనికిరావు అమెరికాకు నిజంగా దాడిభయమే ఉంటే చేయవలసింది భూతల సైన్యాలను ఆయత్తం చేసుకోవటం "ఆత్మ రక్షణ కోసం తప్పక పోట్లాడతాం ఎంతమాత్రమూ వెనుదీయం" అనే రష్యా చైనాలు ఇటువంటి బలాలనే అధికంగా తయారు చేసుకున్నాయి పోతే యుద్ధమే వస్తే కాల్బలాలను అమెరికా తరఫున పోరాడే, ఇతర దేశాలు సప్లయి చెయ్యాలని స్పష్టమవుతూనే ఉంది

రష్యా యూరపు పైదాడిచేస్తే అమెరికా తన నౌకా, విమాన బలాలతో రష్యాకు జ్ఞానోదయం–ప్రస్తుతం కొరియాకు కలిగిస్తున్న ధోరణిలో కావచ్చు–కలిగించటం హూవర్ రెండవ సూత్రం రెండేళ్ల క్రితం నేర్పరి అయిన ఒక అమెరికన్ సైనికాధికారి ఒకమాట చెప్పాడుః "ప్రస్తుతం తూర్పు యూరప్ దేశాలకు గల పదాతి బలాలు పశ్చిమ యూరప్ పైకి నడవటం మొదలుపెడితే అమెరికా మొదలైన ప్రజా స్వామిక దేశాల కన్నిటికీగల విమానాలు, బాంబులూ, అణువు బాంబులూ కూడా అట్టి దాడిని నిరోధించలేవు " ఈ మాటనిజమైన పక్షంలో హూవర్ పశ్చిమ రాజ్యాలను ఘోర ప్రమాదానికి గురిచేసే సూత్రం చెబుతున్నాడనాలి

ఆత్మ రక్షణకు గాను పూర్తి కృషి చేసే దేశాలకు అమెరికా ఆయుధాలివ్వాలన్నది మూడవసూత్రం దక్షిణ కొరియా ఉదాహరణను బట్టి అమెరికా ఈ పని చెయ్యదనీ, చాంగ్‌కైషేక్ ఉదాహరణను బట్టి ఇట్టి పని చేసినా ఫలితం ఉండదనీ ఇవాళ ప్రపంచానికి స్పష్టంగా తెలిసిపోతూవుంది దురాక్రమణ జరిగే పక్షాన ఆత్మరక్షణ నిర్ణయం చేసుకోవలసినది ప్రజలు–ప్రభుత్వాలు కాదు కాని ఇటీవల ప్రజా ద్రోహకరమైన ప్రభుత్వాలకు సహాయం చేసిందిగాని ప్రజలకు ముందు నిలబడ్డ ఏఒక్క దేశానికీ సహాయం చేసిన పాపాన పోలేదు

మొదటి రెండు సూత్రాలనూ నాలుగవ సూత్రం మరింత విస్పష్టం చేస్తూ, చైనా, యూరప్ దేశాలలోకి అమెరికా తన కాల్బలాలను పంపరాదని చెబుతున్నది దీన్ని బట్టి అమెరికా బలపరిచే చైనా, యూరప్ యుద్ధాలలో నిజంగా పోరాడవలసిన కాల్బలాలకు ధ్యేయంలేదని విదితమవుతున్నది అటువంటి యుద్ధాలలో పాల్గొని చావటానికి ఇతరదేశ ప్రజలకు ఆసక్తి లేని పక్షాన అది వారి తప్పుకాదు

యూరప్‌దేశాలు బలాలను హెచ్చించుకునే వరకూ అమెరికా అదనపు బలాలు పంపకుండా చూస్తూ ఊరుకోవాలన్నది అయిదో సూత్రం ఇట్లా చాలా కాలం చూస్తూ ఊరుకోవటం సాధ్యం కావటానికి ప్రభుత్వఖర్చు తగ్గించుకోవాలన్నది ఆరో సూత్రం ఈలోగా రష్యా యూరప్‌మీద దురాక్రమణ చేస్తే అమెరికా వీలయినంత వరకు నౌకా విమాన బలాలు పంపుతుంది గాని కాల్బలం పంపదన్నమాట అంతేకాక అమెరికా ప్రజలు తుపాకులకోసం బహు దీర్ఘకాలం కడుపులు కట్టుకోవాలని కూడా హూవర్ స్పష్టం చేస్తున్నాడు

జపాన్, ఫార్మోజా, ఫిలిప్పిన్‌లను నౌకా విమాన బలాలతో రక్షించి, ఐక్యరాజ్యసమితి చేత చైనాపై వ్యాపార ఆంక్షలు పెట్టించి, చాంగ్‌కైషేక్‌కుఆయుధాలిచ్చి చైనామీద ఉసికొల్పమని ఏడో సూత్రం చెబుతున్నది హూవర్ అనుభవంనుంచి నేర్చుకునేవాడు కాదనుకోవాలి దక్షిణ కొరియాను విమాన నౌకాబలాలతో రక్షించే ప్రయత్నాన్ని రెండురోజుల కాలంలో విసర్జించవలసి వచ్చింది జపాన్, ఫార్మోజా, ఫిలిప్పీన్‌లకు "ప్రమాదమే" వచ్చే పరిస్థితిలో ఇంకోలాగుంటుందను కోవటానికి ఆధారం కనపడదు కమ్యూనిస్టు దేశాలు నానాటికీ ఆర్థికంగా అభివృద్ధి చెందటమేకాక, తప్పనిసరి అయితే అవి కమ్యూనిస్టేతర దేశాలమీద ఆధారపడకుండా జరుపుకోవటానిక్కూడా సిద్ధంగా ఉన్నాయని హూవర్ గుర్తించటంలేదు పెట్టుబడిదారీ దేశాలు నూరేళ్లలో చైనాకిచ్చిన సహాయం కంటె దాదాపు ఒకటిన్నర రెట్లు రష్యాదేశం రెండుదేశాలమధ్యా జరిగిన వ్యాపార ఒడంబడిక కింద ఇస్తున్నదని చౌఎన్‌లాయ్ కాబోలు అన్నాడు రష్యా తనతో మైత్రిగల దేశాలను ఎంత బలపరచగలదో ఉత్తర కొరియా చూపింది ఇక చాంగ్–కై–షేక్

అమెరికా సహాయంతో, కొన్నిలక్షల సైన్యంతో చెయ్యగలదేదో అదివరకే స్పష్టమయింది చైనా ప్రజలకు విరుద్ధంగా చాంగ్–కై–షేక్‌ను ఈనాడు బలపరుస్తూ విదేశాంగ నీతి నిర్వచించటం ప్రపంచ ప్రజలందరికీ ద్రోహం చెయ్యటమే

హూవర్ 8వ సూత్రం, జపాన్, జర్మనీలకు సంపూర్ణ స్వాతంత్ర్యం ఇవ్వాలంటున్నది ఇది కేవలం అమెరికా ఇచ్చేదీ, జపాన్, జర్మనీలు పుచ్చుకునేదీ కాదని వర్తమాన చరిత్ర నానాటికీ రుజువు చేస్తున్నది హూవర్ ఇసకదిబ్బమీద ఇల్లు కడుతున్నాడు హూవర్ 9వ సూత్రం కూడా ఇటువంటిదే మెడిటరేనియన్, అట్లాంటిక్, పసిఫిక్, హిందూమహాసముద్రాల మీద రెండవ రక్షణ శ్రేణి నిర్మించాలని–రష్యా, చైనాలను చుట్టుముట్టిఉన్న దేశాలను ఆయత్తం చేయాలని– ఈ సూత్రం చెబుతున్నది

యుద్ధ ప్రకటన చెయ్యటానికి అధ్యక్షుడి కివ్వబడ్డ అధికారాన్ని కాంగ్రెసు తిరిగి పుచ్చుకోవాలని పదవ సూత్రం చెబుతున్నది

హూవర్ సూచించిన ఈ విధానాలు రాజకీయంగా రిపబ్లికనులకూ, ఆర్థికంగా అమెరికా ధనికవర్గాలకు ఉపకరిస్తాయేమో గాని వీటి నాధారంచేసుకుని అమెరికా తన ఆశయాలను ఎంతవరకు సాధిస్తుందన్నది సంశయాస్పదం బహుశా ఈవిధానం అమెరికానూ పశ్చిమయూరప్‌నూ ఎడం చెయ్యటానికి మాత్రమే ఉపకరించవచ్చు ఈ విధానాన్ని ఒకందుకు మెచ్చుకోవచ్చు ప్రపంచశాంతి కిది ట్రూమన్ అనుసరించే విధానంకన్న హెచ్చుగా తోడ్పడుతుంది కమ్యూనిజమును అణగదొక్కాలనే పశ్చిమ రాజ్యాలలో ఆ ప్రయత్నానికి నీళ్లు వదలటానికీ విధానం చాలా చక్కగా ఉపకరిస్తుంది అందుకనే విదేశ వ్యవహారసంఘానికి అధ్యక్షుడైన సెనెటర్ టామ్‌కోనొలీ, "ఈవిధానం యూరప్‌ను కమ్యూనిజం వాతవెయ్యటానికి పనికి వస్తుంది" అన్నాడు

అమెరికా రాజకీయవేత్తల రణగొణధ్వనిలో ఒక చిన్న వింతస్వరంకూడా బయటపడింది అమెరికా రష్యా ప్రజల సఖ్యత చిరస్థమైనదని అమెరికన్ కాంగ్రెసులో ఒక ప్రతిపాదన తీసుకురాబడుతున్నది! ఇందువల్ల ప్రపంచ యుద్ధభయం తగ్గుతుందనీ, ఆయుధ నిర్మాణం నిలిచిపోయి ఆర్థికంగా సామాన్య ప్రజలు సుఖిస్తారనీ, అమెరికా రష్యాల మధ్యగల తగాదాలన్నీ ఒక్కతృటిలో పరిష్కారమయిపోతాయనీ ఎవరూ అనుకోనవసరం లేదు అమెరికా తరఫున "శాంతి ప్రచారం" సాగటానికిది నాంది "శాంతి" అన్న పదాన్ని రష్యా కాస్తా కాజేసిందని అకస్మాత్తుగా కొందరు అమెరికన్ రాజకీయవేత్తలు పసికట్టారు వీరి ప్రయత్నంయొక్క ఆశయం రష్యా ప్రజలను రష్యా పరిపాలకులనుంచి వేరుచెయ్యటం! మంచిదో చెడ్డదో, రష్యా ప్రభుత్వాన్ని రష్యా ప్రజలలో నూటికి 99 99మంది తెలిసో తెలీకో ఎన్నుకుంటున్నారు ) అమెరికా తనకుగల శాంతి వాంఛలనుగురించి ప్రపంచ ప్రజలను నమ్మించటానికి ఇంతవరకూ ఎట్టి చెప్పుకోదగ్గ చర్యా చేసి ఉండలేదు ఐనప్పటికీ ఈ తీర్మానంలో కొంతయదార్థం ఉన్నది అమెరికా అగ్రనాయకులు యుద్ధమే కోరినా, శాంతే కోరినా, రష్యా నాయకులు శాంతే కోరినా, యుద్ధమే కోరినా, అమెరికా ప్రజలకు రష్యా ప్రజలకూ మధ్య సుహృద్భావం తప్ప మరేవీ ఉండదు ఒక దేశ ప్రజలు మరొక దేశ ప్రజలను ద్వేషించే రోజులు హిట్లరుతో గతించాయి హిట్లరు ఖాళీచేసిన గద్దెమీద ఇంకెవరూ కూర్చోలేరు

తెలుగు స్వతంత్ర, వారపత్రిక 16-2-1951

# 21. యుద్ధం అనివార్యమా?

"యుద్ధం అనివార్యమని భావిస్తున్నారా?" అని 'ప్రవ్దా' విలేఖరి అడిగిన ప్రశ్నకు స్టాలిన్, "ప్రస్తుత పరిస్థితులలో యుద్ధం అనివార్యమని భావించ నక్కర్లేదు" అన్నాడు

దీనిమీదా, "ప్రవ్దా" విలేఖరి వేసిన ఇతర ప్రశ్నలకు స్టాలిన్ ఇచ్చిన సమాధానాలమీద మన పత్రికలు రకరకాలుగా విమర్శించాయి

ప్రస్తుతం యుద్ధం అనివార్యంగా భావించనక్కర్లేదని స్టాలిన్ అన్నమాట ఎవరి ఆగ్రహానికి గాని ఎందుకు గురికావాలో ఊహించటం కష్టంగా కనిపిస్తుంది కిందటి నెల లండనులోనూ, ఇతర చోట్ల నెహ్రూ ఈమాటే అన్నాడు కొద్దిరోజుల క్రితం లేక్ సక్సెస్‌లో బి ఎన్ రావు ఇదేమాట అన్నాడు దరిమిలాను జరిగిన ఒక ప్రసిద్ధ అంతర్జాతీయ సంఘటనల్లా అమెరికా మొదలైన దేశాలు చైనాకు దురాక్రమణ అంట గట్టటం మాత్రమే

చైనా దురాక్రమణ తీర్మానం శాంతికి పెద్ద దెబ్బ అనుకోవటం ఒక ఎత్తు: అటువంటి తీర్మానం జరగటం కేవలం స్టాలిన్ పొరపాటే అయినట్టుగా, తీర్మానానికి పూర్వం నెహ్రూ అన్న మాటనే తీర్మానానంతరం స్టాలిన్ అంటే సహించలేకపోవటం మరొక ఎత్తు అచ్చగా రష్యాదృష్టినుంచి గాని, కేవలం అమెరికా దృష్టినుంచి గానీ చూస్తే స్టాలిన్ అన్నమాటలో ఏదో ఒక అర్థం స్ఫురిస్తుంది యుద్ధోన్మాదం పెట్టుబడిదారీ దేశాలదే నన్నది రష్యావైఖరి ఈ "యుద్ధోన్మాదులు" చైనాను దురాక్రమణదారుగా ప్రకటించటంలో యుద్ధాన్ని మరింత దగ్గరికి తెచ్చారనే, రష్యా దృష్టిలో! అయినప్పటికీ యుద్ధం అనివార్యం కాదు అని స్టాలిన్ అంటున్నాడంటే "యుద్ధోన్మాదులకు" ఇంకా యుద్ధంలోకి దిగేశక్తి చేకూరలేదంటున్నాడన్నమాట

అమెరికా దృష్టిలో పెట్టుబడిదారీ దేశాలు ఇవాళ చేసే యుద్ధప్రయత్నాలన్నీ రష్యా దెబ్బకాచుకోవటానికే అందుచేత వారి దృష్టిలో స్టాలిన్ మాటలకు అర్థమేమిటంటే రష్యా ఇంకా దెబ్బ తీయటానికి సిద్ధంగా లేదని కావాలి- అథమం దెబ్బతీయటానికి సిద్ధంగా లేనట్టు నటిస్తున్నదని కావాలి అయితే ఈమాట రష్యాను గురించి, అమెరికా, కెనడా, బ్రిటనువగైరా దేశాలు అదివరకే అంటున్నాయి కనక స్టాలిన్ మాటలతో వారికి పేచీ లేదు

ఇక పేచీఎటువంటి వారికీ? యుద్ధం కావలిసినవారికీ, యుద్ధం ఎవరు తెచ్చిపెడుతున్నారో, ఎందుకు తెచ్చిపెడుతున్నారో స్పష్టంగా తెలీని వారికీనూ ఇటువంటివారు మన దేశంలో అదివరకే యుద్ధం అనివార్యమన్న నినాదం బయలుదేరదీశారు వీరి ఆలోచన హేతుబద్ధమైనా కాకపోయినా అది సులభమైనది రష్యా ప్రపంచమంతటా ఎర్రజెండా ఎగరవెయ్యటానికి ప్రయత్నించకుండా ఉండదు ఈ ప్రయత్నాన్ని అమెరికా ప్రతిఘటించకుండానూ ఉండదు రెండూ రెండే అందుచేత యుద్ధం తప్పదు

యుద్ధం అనివార్యం అనుకోవటంలో ఇంకో దృక్పథంకూడా వున్నది అది యుద్ధం జరగాలనే వారిది వీరు రష్యా వ్యతిరేకులు, "రష్యా శాంతి ప్రచారం చేస్తున్నది కనక మనం యుద్ధ ప్రచారం చెయ్యాలి" అన్న ధోరణిలో వారు, శాంతి ప్రచారం చివరకు రష్యాకు లాభిస్తుంది గనకా, రష్యాకు లాభించటమంటే ప్రపంచానికి నష్టమే కనకా యుద్ధ ప్రచారం చెయ్యాలనే మనస్తత్వం గలవారు ఐతే ఈ వాదంలో గల ఒకలోటేమిటంటే ఇటువంటి వర్గాలలో వారే

ఇప్పుడిప్పుడు "శాంతి అనేమాటను రష్యా కాజేసింది" అని పశ్చాత్తాప పడేవారు బయలు దేరారు అందుచేత వీరి వైఖరిలో ఔడు కనిపిస్తున్నది

స్టాలిన్ మాటలతో పేచీ పెట్టుకునే వారిలో మూడోరకం ఉన్నది రష్యా శాంతి ప్రచారాన్ని రష్యా ఆమోదంతో వివిధ దేశాలలో జరిగే సంఘర్షణలనూ వీరు సమన్వయించలేకుండా ఉన్నారు యుద్ధం కావలిసినవారి లాగా వారికి నిర్దిష్టమైన వైఖరి లేదు కొన్ని అనుమానాలూ, అపోహలూ, మోసపోతామేమోనన్న భయమూ వారిని వేధిస్తున్నాయి

వీరి అపోహలు కొన్ని పేర్కొనదగినవి వీరి ఉద్దేశ్యంలో ఒక దేశాన్ని మరొక దేశం కబళించి, ఆదేశ ప్రజల స్వాతంత్ర్యాన్ని అపహరించటానికి జరిగే యుద్ధం ఎటువంటి అశాంతో దేశాన్ని ఐక్యపరచుకోవటానికీ, బాధ్యతారహిత ప్రభుత్వాలను అణచటానికి జరిగే సంఘర్షణలు కూడా అటువంటి అశాంతే "శాంతి కోసం పోరాడటం"వీరికి అర్థంలేని నినాదం ఏవిధమైన పోరాటమైనా అశాంతే సమగ్ర విజయం సాధించటానికి జాతీయోద్యమాలు జరిపే సంఘర్షణలు శాంతికి విద్రోహకరమైనవని వారి భావం వారి సిద్ధాంతాల ప్రకారం చైనా ప్రజలు చాంగ్-కై-షేక్ దుష్ప్రభుత్వాన్నీ, కొరియా ప్రజలు సింగ్మన్‌రీ దుష్ప్రభుత్వాన్నీ, ఇండో చైనా ప్రజలు బావోడై దుష్పరిపాలననూ భరించి ఊరుకుంటేనే గాని శాంతి సాగదు

జాతీయోద్యమాలపట్ల వీరికి సానుభూతి ఉన్నప్పటికీ కమ్యూనిజమంటేవీరికి గల భయం కొద్దీ, జాతీయోద్యమాలు సామ్రాజ్యవాదాన్ని ప్రతిఘటించటంలో కమ్యూనిజంను ఆశ్రయించటంకన్న సామ్రాజ్యవాదుల పాముపడగను ఆశ్రయించటం మంచిదనే విశ్వాసాన్ని వీరు ప్రకటిస్తున్నారు

ఇంతకన్న కూడా విచిత్రమేమంటే అమెరికా ఒత్తిడికింద బ్రిటను, ఫ్రాన్సు మొదలైన పశ్చిమ యూరపు దేశాలూ, మధ్యప్రాచ్య అరబ్బు, ఇస్రేల్ దేశాలూ, జపాను, ఫిలిప్పైన్స్, ఇండోచైనా మొదలైన దూరప్రాచ్య దేశాలూ నలిగిపోతూ ఉండటం చూస్తూ, ఈ దేశాలను అమెరికా తన స్వార్థంకోసం రష్యా వ్యతిరేక యుద్ధానికి సంఘటితపరచాలని ప్రయత్నించటం చూస్తూ, రెండోపక్షాన రష్యా కూడా తన మిత్రదేశాలపట్ల ఇదే వైఖరి అవలంబిస్తున్నదని అపోహపడుతున్నారు అందుకనే ప్రపంచంలో ఏమూల కమ్యూనిస్టు నాయకత్వంకింద స్వేచ్ఛా స్వాతంత్ర్యంకోసం, ప్రజల బాగుకోసం సంఘర్షణ జరిగినా అందులో "రష్యా హస్తం" కనిపిస్తుంది ఈ సంఘర్షణను రష్యా బహిరంగంగా ఆమోదించటాన్ని బట్టి "ఇది రష్యాపనే" అని వారికి రుజువవుతున్నది ఈ ఆధారంలేని అనుమానంతోనే వారు వివిధ ప్రాంతాల పీడిత ప్రజలు సాగించే స్వాతంత్ర్య సమరాలను మనస్ఫూర్తిగా బలపరచలేకుండా ఉన్నారు ఒక బ్రిటిషు వారపత్రికలో విలేఖరి ఒకడు పశ్చిమ యూరపు పాలకులపై అమెరికా ఒత్తిడిని విశదీకరిస్తూ, "కమ్యూనిస్టులతో ఏకీభవించారని అమెరికా ఆరోపించగలదన్న భయంతో వాళ్ళువాన కురుస్తున్నదని కూడా అనటానికి జంకుతున్నారు" అన్నాడు అమెరికా ఒత్తిడి అవసరం లేకుండానే మనలో చాలామందికి రాజకీయరీత్యా ఇటువంటి మనస్తత్వం ఏర్పడి ఉంది

"ఉక్కు తెరల వెనక రష్యా ఏమిచేస్తున్నదీ మనం చూశామా?" అని వాదించవచ్చు లోకాన్ని మూసే మూకుడు లేదని మనసామెత అమెరికా వొత్తిడి చేసే దేశాలలో జరిగే సాంఘిక

పరిణామాలు మనం చూస్తున్నాం ప్రతి దేశంలోనూ ఇవి ఒకే ధోరణిలో ఉంటున్నాయి అమెరికా నేరుగా ప్రతిదేశం లోనూగల ప్రజలను సంఘటిత పరచలేదు ఆపని చేసేటందుకు ఆయాదేశాలలోని ప్రభుత్వాలను పట్టుకుంటుంది ఆ ప్రభుత్వాలు క్రమంగా ప్రజలకూ, ప్రజా శ్రేయస్సుకూ దూరంకావటం కాక ప్రభుత్వ వర్గాలలోనే చీలికలు కలుగుతాయి ఐసెన్ హూవర్ ఇటీవల యూరప్ పర్యటించినప్పుడు ఇది చాలా బాగా విదిత మయింది అమెరికా పాలకులతో చేతులు కలిపిన పశ్చిమ యూరప్ దేశాలన్నిటిలోనూ ప్రజలు యుద్ధ వ్యతిరేకాందోళన తీవ్రంగా సాగిస్తున్నారు ఏదేశ ప్రభుత్వంకూడా అవతల మరొక దేశానికి తన స్వాతంత్ర్యాన్ని అర్పణచేస్తూ ఇటుదేశ ప్రజల యోగక్షేమాలను అభివృద్ధి చేసుకోలేదు ఇది చాలా ప్రాథమిక రాజకీయ సత్యం ఈ సూత్రం చైనాలోగాని, కొరియాలోగాని, హోచిమిన్ పరిపాలన కిందగల వియత్నాంలోగాని తూర్పుయూరపు రాజ్యాలలోగాని, రష్యాలోగాని మచ్చుకైనా కనిపించదు పశ్చిమ యూరపులో కలుగుతున్న సంక్షోభమే "సోవియట్ సామ్రాజ్యం"లో కూడా కలుగుతున్నదని రుజువు చెయ్యటానికి చాలా ప్రయత్నాలు జరిగాయి ఆ దేశాలలోనుంచి పారిపోయిన ప్రజాద్రోహులనూ, అక్కడే పట్టుబడి శిక్షలు పొందిన వారినీ ప్రభుత్వ వ్యతిరేక ప్రజోద్యమ నాయకులుగా ప్రచారంచేసే ప్రయత్నం తప్ప మరేమీ జరగలేదు లోకాన్నిమూసే మూకుడున్నదనీ దానిపేరు "ఉక్కు తెర" అనీ అమెరికా, బ్రిటనులలోని ప్రచారకులు మనలను నమ్మించాలని చూస్తున్నారు తూర్పు యూరపు దేశాలూ, రష్యా పర్యటించి వచ్చిన ప్రతివారూ మన అరుణ అసఫాలీ లాగే తమకెక్కడా ఉక్కుతెర కనిపించలేదనీ, యుద్ధోన్మాదం కనిపించలేదనీ అంటున్నారు

స్టాలిన్ "ప్రవ్దా" విలేఖరితో ఇంకొక ఆర్థిక సత్యంకూడా బయట పెట్టాడు రష్యా యుద్ధ ప్రయత్నం చేస్తున్నట్టయితే నిర్మాణకార్యకలాపాలెట్లా చేస్తుంది, ధరలు ఎట్లా తగ్గిస్తుంది? డాలరు ధర క్రమంగా పతనం అవుతూవుండటమూ, రూబుల్ ధర హెచ్చుటమూ కూడా ఇదే సూచిస్తుంది ఒక్క రష్యాలోనే గాదు తూర్పు యూరపు దేశాలన్నిటిలోనూ జీవిత నిర్మాణం ఎట్లా హెచ్చిపోతూన్నదీ డాబ్ అనే బ్రిటిష్ ఆర్థిక వేత్త ఇటీవల వివరించాడు

రష్యా యుద్ధ ఖర్చు చెయ్యకపోవటానికి మన పత్రికలు కొన్ని ఊహించిన కారణం– కిందటి యుద్ధంకోసం తయారు చేసిన ఆయుధసామాగ్రి రష్యాకు చాలా ఉన్నదనీ, రష్యాకు సైనిక బలం మటుకు బాగానే ఉన్నదనీనూ, ఇందులో మొదటిది సంశయాస్పదం, రెండవది ఒకవిధంగా సత్యం రష్యా అభిప్రాయం ప్రపంచాన్ని మింగటమే అయితే కిందటి యుద్ధం బాపతు మిగిలిపోయిన ఆయుధాలతో ఎట్లాగూ పని జరగదు రష్యా బారినుంచి ప్రజాస్వామికాన్ని సంరక్షించటానికై "స్వతంత్ర" రాజ్యాలు ఆర్థిక కాటకాలకూ, భరించ శక్యం గాని సాంఘిక పరిస్థితులకూ తమ్ముతాము గురిచేసుకుంటున్నాయి నూతనాస్త్రాలు కనిపెడుతున్నాయి అటువంటి దేశాల మీదికి రష్యా కిందటి యుద్ధంలో మిగిలిపోయిన అస్త్రాలతో దాడిచేస్తుందనటం కంటే ఆత్మవంచన ఉండబోదు ఇక సైనికబలం విషయం వేరే సంకోచించ నవసరంలేదు ఎందుకంటె రష్యా మొదలైన దేశాలలో వయోజనులూ, మధ్య వయసువారూ ఎంతమంది ఉన్నారో అంతమందీ తప్పక పోరాడతారు–తమ దేశాన్ని రక్షించుకోవటానికై అమెరికా, బ్రిటను, ఫ్రాన్సు, పశ్చిమ జర్మనీ మొదలైన దేశాలలో సైనిక సమీకరణకు వ్యతిరేకోద్యమం నడుస్తున్నదంటే అది అక్కడి ప్రజల తప్పుకాదు ఆ దేశాలకు

రష్యా నుంచిగాని, మరే దేశం నుంచిగాని నిజంగా ముప్పు కలిగితే అక్కడి ప్రజలుకూడా పోరాడతారు రష్యా ప్రజలైనప్పటికీ రష్యా ఇతర దేశాలను దిగమింగటానికి యుద్ధం సాగించేపక్షాన ప్రజలు పోరాడరు–పోరాడవలసిన అవసరమూ ఉండదు

నిష్పాక్షిక బుద్ధితో చూడగలవారికి రష్యామరో ప్రపంచయుద్ధం రాకుండా ఉండగలందులకై చేసిన ప్రయత్నాలు అమోదకరంగా ఉండక తప్పవు అగ్రరాజ్యాలు శాంతి ఒప్పందం చేసుకోవాలనీ, అన్ని దేశాలూ ఆయుధ సైనిక బలాలు తగ్గించుకోవాలనీ, అణుశక్తి కంట్రోలు చెయ్యాలనీ రష్యా సూచనలు చేసింది ఈ సూచనలను తోసిపుచ్చిన వారిని పత్రికలు నిలదీసి విమర్శించవలసింది లేదా ఇటువంటి సూచనలలో గల "కుట్ర"ను బయటపెట్టి ఉండవలసింది రష్యా చేసిన ఈ ప్రయత్నాలను "స్వాతంత్ర్య వాదులు" సాగనివ్వక పోయినప్పటికీ ఇవాళ స్టాలిన్ "యుద్ధం ఇంకా అనివార్యం కాదు" అనగల స్థితిలో ఉన్నాడంటే దానికి కారణం ప్రపంచ ప్రజానీకంలో సాగిన చైతన్యమే యుద్ధోన్మాదులు ప్రజలను పూర్తిగా వంచించగలిగిననాడు యుద్ధం అనివార్య మవుతుందని స్టాలిన్ అన్నాడు యుద్ధోన్మాదుల దుష్ప్రచారానికీ, దురాశయాలతోనూ, అపోహలతోనూ పత్రికలు రాసే రాతలకు ప్రజలు మభ్యపడే అవకాశాలు ప్రతి దేశంలోనూ నానాటికీ సన్నగిల్లుతున్నాయిగాని హెచ్చుటంలేదు

తెలుగు స్వతంత్ర, వారపత్రిక, 23-2-1951

## 22. రాను రాను అమెరికా ధోరణి

అమెరికా అనుసరించే విధానాలు కమ్యూనిస్టు వ్యతిరేకుల పక్షానికి చెందిన మేధావులను సయితం ఎట్లా తీవ్రవిమర్శకు పురికొల్పుతున్నదీ మనం చూడగలుగుతున్నాం కొద్దివారాల క్రితం "న్యూస్టేట్స్‌మన్ అండ్‌నేషన్"అన్న బ్రిటిషు వారపత్రికలో జి డి హెచ్, కోల్ ప్రకటించిన వ్యాసం మన పత్రికలలో కూడా కొంత ప్రచారమయింది ఇంగ్లండులో అనేకవేలమంది కోల్‌తోటి ఏకీభవిస్తూ పత్రికలకు రాశారు కొరియా యుద్ధం అంతర్యుద్ధమనీ, అమెరికా వాళ్ళు చైనాపై ధ్వజమెత్తితే తాను చైనా పక్షాన ఉంటాననీ కోల్ అన్నాడు

కోల్‌లాగే, ఫ్రెంచ్ రచయితా, మేధావీ, కమ్యూనిస్టు వ్యతిరేకీ అయిన జాంపాల్ సార్త్రే కూడా, అమెరికా అనుసరించే విధానాలను తీవ్రంగా విమర్శిస్తూ "నేషనల్" అనే అమెరికా వారపత్రికకు ఒక వ్యాసం పంపాడు సార్త్రే వాదం కూడా ఇండియాలో మనం తెలుసు కోదగినది "ఎట్టి పరిస్థితులలో అమెరికా రష్యాలమధ్య శాశ్వత శాంతి సాధ్యమవుతుంది?" అన్న ప్రశ్నకు సార్త్రే సమాధానం చెప్పాడు ఆయన మొట్టమొదటనే అమెరికా విధానాన్ని గురించి ఈ మాటలన్నాడుః

"రష్యా మాకు ఎంత తెలియనిస్తుందో రష్యాను గురించి మాకు అంతే తెలుస్తుంది కాని అమెరికా విధానం కూడా మాకు సులభగ్రాహ్యం కాకుండా ఉంది మీ పత్రికలలోనూ, మా పత్రికలలోనూ కూడా ప్రచురించబడే మీ అగ్రనాయకుల ప్రకటనలే పరస్పరం విరుద్ధంగా ఉంటున్నాయి ఉదాహరణకు 1950 ఫిబ్రవరి 17న డీన్‌రస్క్ సెనేట్ విదేశాంగ వ్యవహార సమితి ఎదట మాట్లాడుతూ రష్యాతో అన్ని సమస్యలూ చర్చించటానికి అమెరికా సంసిద్ధంగా

ఉందన్నాడు ఫిబ్రవరి 23న డీన్ అచిసన్ ప్రసంగిస్తూ, "మనం అటోఇటో తేలవలసిన సంఘర్షణలో మునిగిఉన్నాం: నాజీజంతో జరిగిన పోరాటంలో లాగే మానవ జాతియొక్క భవితవ్యం ఇందులో తేలవలసి ఉంది" అన్నాడు

అమెరికా అనుసరించే కమ్యూనిస్టు వ్యతిరేక ధోరణి గురించి సార్త్రే విచిత్రమైన 'నినాదం' చేశాడు "కమ్యూనిస్టు వ్యతిరేక వాతావరణం ఏర్పడటానికిగానూ (అమెరికాలో) ప్రచారం సాగిస్తున్నారు అయితే మా కమ్యూనిస్టు వ్యతిరేకత కన్న మీది చాలా ప్రమాదకరమైనది దానికి గల వింతకారణం యేమంటే, మీకు కమ్యూనిస్టులు లేకపోవటం కమ్యూనిస్టులను ద్వేషించి, రష్యా విధానాన్ని పూర్తిగా ఖండించే ఫ్రెంచివారు రోజూ, ఎక్కడబడితే అక్కడ కమ్యూనిస్టులను చూస్తూ ఉంటారు అందుచేత కమ్యూనిస్టులు మనుషులే ననీ, దయ్యాలు కారనీ వారికి తెలుసు కమ్యూనిస్టు వ్యతిరేకులైన ఫ్రెంచివారికి కమ్యూనిస్టులు రాజకీయ ప్రతికక్షులు మాత్రమే అమెరికనులతో కమ్యూనిస్టులు అదివరకే యుద్ధప్రతికూలకక్షులు (శత్రువులు) అయిఉన్నారు ఈ శత్రువులు కనిపించరు, తెలియరారు వారు దయ్యాలు, వారిని హతమార్చి తీరాలి అదీకాక వారు ఫలాని చోట ఉన్నారని నిర్ధారణ చేయవీలులేనందున సర్వత్రా, అంతటా ఉన్నట్టేతోస్తారు అనుమానం హెచ్చి అందరినీ చుట్టుకుంటుంది ఎవరైనా పార్టీలో చేరాడని తెలిస్తే మేము వాణ్ణి గురించి వెర్రివాడని అనుకోవచ్చు మీ దృష్టిలో వాడు దేశద్రోహి, ఎందుకంటే వాడు శత్రుపక్షం, కమ్యూనిస్టులుగాని, కమ్యూనిస్టు విప్లవ ప్రమాదంగాని లేని అమెరికాకు కమ్యూనిజమంటే ఇంత భయం ఉన్నదంటే ఇదే కారణమని మా ఊహ "

అమెరికనులు అవలంబించే కమ్యూనిస్టు వ్యతిరేకతకుగల ఇతర కారణాలను సార్త్రే గుర్తించలేదు ఇండియాలాగ వెనుకబడి ఉన్న దేశాలలో పెట్టుబడిదారీ శక్తులు ఎంత దుర్నయాలకు ఒడిగట్టినప్పటికీ అవి అవసానదశలో ఉండి మరణవేదన చెందటంలేదు కమ్యూనిస్టులు చైనాలో పూర్తి విజయం సంపాదించి దేశమంతటా ఏలుబడి సాధించినప్పటికీ అక్కడ పెట్టుబడిదారీ నిర్మూలించబడకపోగా ప్రోత్సహించబడుతున్నది కాని అమెరికాలో పెట్టుబడి పూర్తిగా మృత్యువుతో పోరాటం చేస్తున్నది దానిని పరిష్కరించటానికి అమెరికా పాలకవర్గంవారు చేస్తున్న ఆర్థికయత్నాలు పశ్చిమ రాజ్యాలలో తీవ్రరాజకీయ ఆర్థిక పరిస్థితులకూ, అమెరికా అనుసరించే రాజకీయ విధానాలు ప్రపంచయుద్ధానికీ, అమెరికాచేసే యుద్ధప్రయత్నాలు ప్రపంచ శాంతిశక్తుల విజృంభణకూ దారితీస్తూ, అమెరికను పెట్టుబడిదారీ సమస్య నానాటికీ విషమిస్తున్నది అమెరికా తాను స్వయంగా పడేపాట్లూ, ఇతరులను పెట్టేపాట్లూ చేరి రష్యాకు అఖండవిజయమవుతున్నాయి ఇది అమెరికాను మరింత రెచ్చగొట్టుతున్నది

కమ్యూనిస్టు వ్యతిరేకత అమెరికాలోని ప్రజాస్వామ్యానికి ఏం చేస్తున్నదీ సార్త్రే చెబుతున్నాడు:

"అమెరికా ప్రజలు వెర్రివాళ్లయిపోయి క్రమంగా యుద్ధానుకూల మనస్తత్వం అలవరచుకున్నట్టు కనిపిస్తున్నది మీ పాలకులు డెమోక్రాటిక్ పార్టీకి చెందినవారైకూడా ఇది చూసి భయపడి రిపబ్లికను విధానాలు అవలంబించటంకంటె ప్రమాదం ఉండదు అందరూ రిపబ్లికన్ విధానాలను ఆమోదిస్తే, నేను రిపబ్లికనులకే ఎందుకు వోటివ్వరాదని వోటరుఅనుకుంటాడు అదీకాక తనకు ఇష్టంలేని విధానాలను ఒకసారి తేలికగానూ,

మరొకసారి తీవ్రంగానూ ప్రభుత్వం అమలుచేసి కుదుపు తెప్పిస్తుంది చివరకు ప్రతిపక్షులు జోక్యం కలిగించుకుని తాము బాధ్యతారహితులు గనక అర్థంలేని సూచననుచేయ నారంభిస్తారు ఈ ఉన్మాద వాతావరణంలో స్వాతంత్ర్యం అంతకంతకూ సన్నగిల్లుతుంది" (సార్త్రే చెప్పే బాధ్యతారహిత సూచనలకు టాఫ్ట్, హూవర్‌లు చేసిన సూచనలే నిదర్శనం ఈ సూచనలలో గల అయోమయత్వాన్నీ, బాధ్యతా రాహిత్యాన్నీ "తెలుగు స్వతంత్ర" అదివరకే ఎత్తి చూపింది ఇప్పుడిప్పుడే చేరిన విదేశీ పత్రికలుకూడా ఆమాట స్పష్టం చేస్తున్నాయి )

ఇవాళ అమెరికా దృష్టిలో మంచివాళ్లెవరు? చెడ్డవాళ్లెవరు? ఎందుచేత? సార్త్రే సమాధానం చెబుతున్నాడు

"ఫ్రాన్సులో, ఇటలీలో, దూరప్రాచ్యంలో, ప్రతిచోటా మీపక్షం వహించినవారు మీకు మంచివారు, పూర్తిగా మీపక్షం వహించనివారూ, మీకు వ్యతిరేకించేవారూ చెడ్డవారు కాని కమ్యూనిస్టులున్న దేశాలలో మీ పక్షం వహించేవారు, కమ్యూనిస్టులు లేక ఉన్మత్తులైపోయిన మీలాగే తాముకూడా ఉన్మత్తులై పోయి, తీవ్ర అభ్యుదయ నిరోధకులుగానూ, ఫాసిస్టులుగానూ కూడా పరిణమిస్తున్నారు వీరు ప్రజాస్వామ్యానికీ, సాంఘికాభ్యుదయానికి శత్రువులు వీరిలో గ్రీక్ మోనార్కిస్టులూ, అవినీతి పరులైన చాంగ్-కై-షేక్ భృత్యులూ, ఫ్రాంకో ఫాసిస్టు బృందమూ ఉన్నారు మీనీతి ఆదర్శాలు గొప్పవేగాని మీ విధానం వాటికి వ్యతిరేకంగా నడుస్తున్నది దమన విధానం అవలంభించే అల్పసంఖ్యాకులు మాత్రమే ప్రతిచోటా మీపక్షం ఉన్నారు దీనికి రష్యాచాకచాక్యమే కారణం ప్రతిచోటా కమ్యూనిస్టులు బాధితులనూ, పీడితులనూ చాల బలపరుస్తున్నారు-రష్యా అవసరాలను బట్టి వారీ పీడితులను విడనాడరని కాదు

"రష్యాలో కాన్‌సెంట్రేషన్ క్యాంపు ప్రభుత్వం ఉన్నదని మీరనవచ్చు వాస్తవం కూడాను కాని రష్యాలో అమలులో నున్న శిక్షాస్మృతితో తిండికి మాడే కొరియను రైతులకేం పని? తాముసాగించే న్యాయమైన సమ్మెలను కమ్యూనిస్టులు బలపరుస్తున్నప్పుడు తిండిసరిగా తినని ఫ్రెంచి కార్మికులకు మాత్రం ఏం పట్టింది? అదివరకే అభిప్రాయాలు ఏర్పడి ఉన్నవారికి బోధించలేం చాలా దేశాలలో ప్రజలలో మూడోవంతు లగాయతు సగంమందివరకూ కమ్యూనిజంను బలపరుస్తున్నారు మీ పక్షం ఉన్నవారు అల్పసంఖ్యాకులూ, ఆత్మరక్షణా శక్తికూడా లేనివారూనూ వారికి మీ సాయం కావాలి బహిరంగంగా జోక్యం కలిగించుకోకుండా మీరు సాయం ఇవ్వలేరు ఫ్రాంకోకు ఐక్యరాజ్యసమితిలో స్థానమిచ్చిన తరవాత స్పెయిను ప్రజలు అతనిమీద తిరగబడితే మీరేం చేస్తారు? అతన్ని సమర్థించటానికి పూనుకుంటారా?"

అమెరికా దౌర్బల్యాన్ని సార్త్రే ఈ విధంగా విప్పి చెబుతున్నాడు

"బలిష్టమైన రాజకీయ విధానంగాని ఆత్మరక్షణ చేసుకోగల మిత్రులుగాని లేని కారణంచేత అణువు బాంబు ప్రయోగిస్తామని మీరు బెదిరించవలసి వస్తోంది అణువు బాంబు ఎక్కువైనా అవుతుంది తక్కువైనా అవుతుంది ఎక్కువెందుచేతనంటే అది ఉపయోగిస్తే మూడవ ప్రపంచయుద్ధం సాగుతుంది అది వేస్తే మీదేశంలోనూ ఇతరదేశాలలోనూగల అనంత ప్రజలు సహించరని శత్రువుకు తెలుసు కనుకా, దానిని ఉపయోగించేలోగా శత్రువు చాలా దూరం పోగలడు కనకా అది తక్కువవుతుంది ఇంకొక వైపరీత్యం యేమంటే అమెరికా

చిరకాలంగాశాంతికాముక దేశంగా పేరుపడ్డది రష్యా సాంప్రదాయికంగానూ, సిద్ధాంతరీత్యాకూడా శాంతికాముక దేశంకాదు అందుచేత అమెరికా యుద్ధ శంఖాలు పూరించటమూ, రష్యా శాంతి ప్రసంగాలు చేయటమూ విపరీతంగా కనిపిస్తుంది రష్యా ఎత్తు స్టాక్‌హోం శాంతి ప్రతిజ్ఞా ఆయుధాలని నాకు తెలుసు అయితే ఇతర దేశాలలో నేరుగా జోక్యం కలిగించుకో నవసరంలేదు గనక రష్యా శాంతిని బలపరుస్తున్నది అమెరికా తన ప్రజాస్వామ్యాన్నీ, శాంతి కాముకత్వాన్నీ ఆయుధాలుగా ఉపయోగించుకో లేకపోయింది ”

ఇట్లాఎందుకు జరిగినదీ సార్త్రే తాత్వికంగా వివరించినట్లయితే తాను చెప్పే ఆయుధాలు అమెరికా పాలకవర్గం దగ్గిర లేవని గ్రహించి ఉండేవాడే ఇవాళ అమెరికా ప్రజలకూ, పాలకులకూ మధ్య రాజకీయ సామ్యం చాలా తక్కువ అది ఇంకా తగ్గిపోతోంది ప్రజాస్వామ్యమూ, శాంతికాముకత్వమూ అమెరికాలో ఉంటే అవి అమెరికన్ ప్రజల వెంట మాత్రమే ఉన్నాయి స్టేట్ డిపార్టుమెంటులోగాని, పెంటగన్‌లోగాని లేవు

యుద్ధం నివార్యమా, అనివార్యమా అనేది అమెరికాపైనే ఆధారపడి ఉన్నదని సార్త్రే స్పష్టం చేస్తున్నాడు

“మీ పత్రికలు రష్యా నైతిక, సైనిక శక్తులను గురించి ఒకసారి ఎక్కువచేసీ, మరొకసారి తక్కువచేసీ రాస్తుంటే శాంతి కాముకులైన అమెరికనులు చాలా కలవర పడుతున్నారు ఏదేశానికీ లేనంత మంచి సైన్యం గల రష్యాను గురించి మీరు మొత్తంమీద తక్కువ చేసి మాట్లాడుతూ, అణువు బాంబును గురించి ఎక్కువ చేసి మాట్లడుతున్నారు (అణువు బాంబుకు) చైనా సరిఅయిన లక్ష్యంకాదు రష్యా పరిశ్రమలు సులభంగా చేరదగినవికావు రష్యాయూరప్‌పై దాడిచేసి మా యుద్ధ పరిశ్రమలు స్వాధీనం చేసుకుంటే మీరు మాపై బాంబులు వెయ్యక తప్పుతుందా? కేంద్రీకృత పరిశ్రమలు గల అమెరికా బాంబులకు మరింత మంచి లక్ష్యంకాదా అని అమెరికనులే ఆదుర్దాగా అడుగుతున్నారు ఇదంతా మీకు బాగా తెలుసు అదే నాఆశ ”

నిజంగా రష్యా దాడిచేస్తే ఏం జరిగేదీ సార్త్రే చెబుతున్నాడుః

“అట్లాంటిక్ ఒడంబడిక దేశాలమధ్య విభేదాలుండటంచేత యూరప్ సైన్యాల సమీకరణ అనుమానాస్పదం అందులోనూ జర్మనీలో రష్యాకు సమగ్ర సాయుధడివిజనులు 25 ఉన్న సంగతి మరవరాదు రష్యా మా దేశాలు ఆక్రమించటమే జరిగితే ప్రతిఘటన సంఘటితపరచి వారిని పారదోలటం అసాధ్యం గత యుద్ధంలో జర్మనీ ఫ్రాన్సును ఆక్రమించినప్పుడు నూటికి 90 మంది ప్రతిఘటనకు అనుకూలంగా ఉన్నారు కనీసం తటస్థంగా ఉన్నారు యూరోపియను సేనను ఆయత్తం చేయటానికి చాలా ఏళ్లు పడుతుందని మీరే అంటున్నారు గనుక రష్యాదాడిని యూరపు నిరోధించలేదని స్పష్టమవుతున్నది మీరు రేపే యుద్ధం చెయ్యటానికి సిద్ధంగా లేరు జరిగేదల్లా ఏమిటంటే రష్యా, ఆసియా, యూరపులు ఏకమౌతాయి ఇది జరగకుండా ఉండగలందులకే యుద్ధార్తులు తపించటం చిత్రం ఇవాళ చైనాపై యుద్ధం చెయ్యటం యూరపును రష్యా పాలు చెయ్యటమే ”

ఇప్పుడు మనం యుద్ధం ప్రారంభించకపోతే కొంత కాలానికి రష్యనులే ప్రారంభిస్తారనే అమెరికనులను సార్త్రే అడుగుతున్నాడు

"ఈ విషయం మీకెల్లా తెలుసు? మాకు సరిగా తెలియదు మాకన్నా మీ కెక్కువ తెలుసా? రష్యాలో ఒక శాంతిపక్షం ఉందనీ, స్టాలిన్ పోలిట్ బ్యూరో బందీ అనీ 1948లో ట్రూమన్ అన్నాడు ఈ శాంతి పక్షం ఇవాళ ఏదీ? దాని విషయం ప్రస్తావనే లేదు ట్రూమన్ పొరపడ్డాడా? ఇటువంటి నిదర్శనాలు వంద ఇవ్వవచ్చు అగ్ర చతుష్టయమో, పంచకమో కలుసుకు మాట్లాడాలని ఏటా జరిగే సూచన అమలు కానంతవరకూ ఎవరి అభిప్రాయం సరి అయినదీ ఎవరు చెబుతారు?"

అమెరికా అధికారవర్గాలు చేసే ఆరోపణలు తాను విశ్వసించలేననటానికి సార్త్రే ఈ కింది ఉదాహరణ యిస్తున్నాడుః

"దక్షిణ కొరియన్లమీదికి ఉత్తర కొరియన్లను రష్యాయే పంపకంచేసిందా? లేకయుద్ధం నివారించక చూస్తూకూచున్నదా? చూస్తూ ఊరుకోకజోక్యంకలిగించుకుంటే ఆసియాలో రష్యాపేరు పోయేది కాదా? ఇందులో రష్యా కుట్ర నాకేమీ కనబడటం లేదంటున్నాను పై పెచ్చు కొరియా విషయంలో రష్యా మొదటినుంచీ మితవాదధోరణి అవలంబించటమూ, అమెరికను విమానాలు పడగొట్టిన రష్యా విమానం గురించి అటే తర్జనభర్జనలు చెయ్యకపోవటమూ గమనిస్తున్నాను

"చైనా చెబుతున్నా వినకుండా మెకార్థర్ సేనలు 38వ అక్షాంశం దాటాయి బ్రిటను హితవు ట్రూమన్ సలహాదార్లకు రుచించలేదు చైనాకు కొరియా ఎంత ప్రధానమో ఒక్కరూ ఎరగరా? ఐక్యరాజ్య సభ్యత్వం లేనప్పుడు చైనా ఐక్యరాజ్య నియమాన్నెందుకు పాలించాలి? అయినా మీ ఉద్దేశంలో తప్పు రష్యాది "

ఇప్పుడు తలపెట్టే యుద్ధానికీ మామూలు యుద్ధాలకూ తేడా వివరిస్తూ, మామూలు స్వార్థ యుద్ధాలు సిద్ధాంతాలకు అంటగట్టబడితే, ఇప్పుడు సిద్ధాంతాలవల్ల కలిగే యుద్ధానికి స్వార్థాలు అంటగట్టబడుతున్నాయంటున్నాడు సార్త్రే రష్యా ప్రపంచాన్ని మింగజూస్తున్నదనీ, రష్యాను భయపెట్టి ఈ పని మానిపించవచ్చుననీ అనటంలోనే రష్యా సామ్రాజ్యవాదం ఆర్థిక ప్రతిష్టంభనవల్ల ఏర్పడినది కాదని ఆమెరికా అంగీకరిస్తున్నట్టు సార్త్రే బయట పెడుతున్నాడు తనకు సామ్రాజ్యవాదం ఉందని అమెరికా ఒప్పుకోదు కనక పెట్టుబడిదారీ, సోషలిస్టు విధానాలు దేనిమానాన అది ఉండటానికి ఆర్థిక కారణాలు అడ్డంరావని అమెరికా ఒప్పుకున్నట్టే అవుతున్నదనీ, ఐతే అమెరికా దీన్ని ఆమోదించటంలేదని సార్త్రే ఎత్తి చూపుతున్నాడు

కమ్యూనిస్టు వ్యతిరేకత అనే "ఆదర్శవ్యాధి"తో అమెరికా బాధపడుతున్నదని సార్త్రే వాదం అమెరికా చాంగ్‌కైషేక్‌కు సహాయం చేసింది, కాని చాంగ్‌కైషేక్ పరిపాలననూ, అతని కిందివాళ్ళ అవినీతినీ, అతని నియంతృత్వాన్నీ ఆమోదించలేదు అటువంటప్పుడు అమెరికాకు మావోసేటుంగ్ ఆదర్శాలతో ఏంపనీ? అతనితో వ్యవహరించరాదూ?

"రష్యా మిమ్మల్ని చైనాపట్ల అనుసరించమన్న విధానం ఒకటే సరిఅయిన విధానం అయితే రష్యా కోరుతున్న కారణంచేతనే మీరు దాన్ని అనుసరించలేక పోయారు మీరు మీ భ్రమలన్నిటినీ వొదిలించుకుని, ఆసియాలో నిలువనీడ కావాలంటే పెకింగ్ ప్రభుత్వాన్ని గుర్తించితీరాలని గ్రహిస్తే బాగుండేది

"ఇంకా ఉదాహరణలు కావాలా? అట్లాంటిక్ ఒడంబడికా, జర్మనీ ఆయుధ ధారణా తీసుకోండి వాస్తవిక దృష్టిలో అట్లాంటిక్ ఒడంబడిక ఊహా జనితం చాలా ఏళ్ళదాకా అది సాధ్యంకాదని చూస్తూనే ఉన్నాం ఫారెస్టాల్ చెప్పినట్టు రేపు యుద్ధం జరిగిందో దాని ఫలితంగా దురాక్రమణదారు ఒళ్లో ఉత్తర ఇటలీ, రూర్, స్వీడన్, ఫ్రాన్సుల సంపద యావత్తూ పడిపోతుంది ప్రస్తుతానికి ఈ ఒడంబడిక రష్యాకు భయంకన్న చిరాకు తెప్పిస్తోంది ఇది యూరపులోని కమ్యూనిస్టు పార్టీల ప్రతిఘటనను రెచ్చగొట్టి నిర్మాణ కార్యక్రమానికి నిరోధం కలిగించింది దీనివల్ల బ్రిటనులో తప్ప మిగిలిన అన్ని దేశాల ప్రజలూ రెండు కక్షలుగా చీలారు యుద్ధం వచ్చిందంటే వీరు పరస్పరం చెండుకొంటారు ఈ దేశాలన్నీ యుద్ధానికి నిరోధాలు కావటానికి బదులు యుద్ధక్షేత్రాలయినాయి

"అమెరికా రష్యాలమధ్య యూరపురక్షగా ఉండాలంటే అది ఏపక్షానికీ చెందరాదు సాంఘికాభ్యుదయ ప్రణాళికల ఆధారంతో రెండుపక్షాలూ యూరపు పునర్జీవనానికి తోడ్పడి ఉండవచ్చు

ఈ విషయంలో కూడా ఒక అభ్యంతరం చెప్పవచ్చు ప్రతిదేశంలోనూ బలమైన కమ్యూనిస్టుపార్టీ ఉన్నది గనక ఇది రష్యాకు సమ్మతమవుతుందనవచ్చు కాని ఉన్న కమ్యూనిస్టు పార్టీలను భయపెట్టి నిర్మూలిస్తారా? మీకు తోడుగా ఉన్న అస్పష్టమైన కమ్యూనిస్టు వ్యతిరేకత అంతర్యుద్ధాలు మాత్రమే తీసుకురాగలదు కొరియా పరిణామమూ, జర్మనీ అస్త్రధారణా మూలంగా కొద్ది కాలంక్రితం మీ పక్షం ఉన్న వారికి కూడా మీనుంచి పుచ్చుకునే సహాయం కృతజ్ఞతతో తీసుకునే శక్తిపోయి సందేహాలు రేకెత్తిస్తున్నది మీరు మమ్మల్ని సైనికులుగా పరిగణించటం మానితే మేం మీ స్నేహితులమేనని గ్రహించగలుగుతారు

"జర్మనీ విభజనకూడా భ్రమ జనితమే దేశంలో ఒక సగాన్ని నాశనం చేయటానికి రెండో సగానికి ఆయుధాలివ్వటం వాస్తవికమా? మీరు దేనికి భయపడుతున్నారు? రష్యా ఆక్రమిత జర్మను ప్రాంతంలో కమ్యూనిస్టు వ్యతిరేకత చాలా ఉన్నదనీ, సోవియట్ సైన్యాలకు వెరిచి అది బయటపడటం లేదనీ మీరెన్నో సార్లన్నారు జర్మనీ ఆక్రమణ పొడిగించి దేశంలో సగం భాగాన్ని రెండో సగంమీదా, ఆక్రమణ సేనలమీదా రెచ్చగొట్టటం దేనికి? దీనివల్ల ఆక్రమణ ఉపసంహరించటం నానాటికీ కష్టతరం కావటంలేదా?"

ఈ వాదనలలో సార్త్రే రెండు విషయాలు పరిగణించటం లేదని కనిపిస్తుంది ఒకటి, యుద్ధం ద్వారా అమెరికాలోను ఇతర దేశాలలోనూ ధనికవర్గాలు లాభాలు చేసుకునే యత్నం: రెండు, పెట్టుబడిదారీ వర్గాల ఏకీకరణద్వారా "ప్రజాస్వామిక" దేశాలలో వివిధ పక్షాల మధ్య ఏర్పడుతున్న లంకెలు బ్రిటనులోని ప్రతి పక్షవర్గాల మధ్యా, అమెరికాలోని ప్రతి పక్షవర్గాల మధ్య రహస్య సమాధానాలు కుదురుతూ ఉండటం సార్త్రే గుర్తిస్తున్నట్టు కనబడదు ఫ్రాన్సు నెదర్లాండ్స్ బెల్జియం మొదలైన దేశాలలో కూడా ఇదే జరుగుతున్నది పాత ప్రతి పక్షాలకూ, యుద్ధం తెచ్చిపెడుతున్న ప్రతి పక్షాలకూ చాలా ఎడం ఉంటున్నది బ్రిటనులో రోజూ లేబరు ప్రభుత్వం మీద లేబరు పక్ష సభ్యులు చిన్న చిన్న తిరుగుబాట్లు చేస్తూనే ఉన్నారు లేబరు పక్ష పత్రికలు ప్రభుత్వ విధానాలను విమర్శిస్తూన్నాయి అందుచేతనే శాంతి ఉద్యమాలలోకి

అన్ని రాజకీయ పక్షాలనుంచీ ప్రజలు వచ్చి చేరుతున్నారు ఇవాళ ఎవరు టోరీ, ఎవరు లేబరు అన్న ప్రశ్నకన్న ఎవరు యుద్ధవ్యతిరేకి, ఎవరు కాదు అన్న ప్రశ్న అతి ప్రధానమైనది

అదీకాక అమెరికా ప్రభుత్వ వర్గాలు అన్న మాటలను వారికే వప్పగించటానికి ప్రయత్నిస్తున్నాడు సార్త్రే ఇది నిష్ప్రయోజనం నేటి అమెరికా విధానం తర్కంమీద కాక ప్రభుత్వ వర్గాల యుద్ధోన్మాదంపై ఆధారపడి ఉన్నది వారి ప్రచారం కార్చిచ్చులాగా చుట్టూ కమ్మేస్తున్నది దాని కొక దారీ డొంకాలేదు దగ్ధం చేస్తూపోవటమే దాని ఆశయం రష్యా ఇంకా కొన్ని నినాదాలనూ, కొన్ని ఒడంబడికలనూ పట్టుకుని వేళ్ళాడుతూ, నిన్న అన్న మాటలనూ నేడు చెప్పే మాటలనూ సమన్వయించ ప్రయత్నిస్తున్నదంటే, అది ఏదురుద్దేశంతో చేస్తున్నదని సార్త్రే వంటివారు అనుమానించినప్పటికీ, అంతవరకైనా సంతోషించవలసిన తరుణం వచ్చింది ఎందుకంటే అమెరికా "నా అవసరాలుః నాయిష్టం!" అన్నదాన్ని మించి ఏ సిద్ధాంతాన్నీ ప్రకటించి, వరసగా రెండు రోజులపాటు దాన్ని అనుసరించే స్థితిలో లేదు

తెలుగు స్వతంత్ర, వారపత్రిక 9-3-1951

## 23. స్పెయిన్ ప్రాముఖ్యం ఏమిటి?

ఐక్యరాజ్య సర్వ ప్రతినిధి సభలో, అమెరికా మద్దతుతో, ఫ్రాంకో స్పెయినుపై రాజకీయ అస్పృశ్యత తొలగిస్తూ గత నవంబరు 4న తీర్మానం ప్రతిపాదించబడి నెగ్గింది ఇందువల్ల ఐక్యరాజ్య సమితిలో సభ్యత్వం గల దేశాలు స్పెయిన్‌తో రాయబార సంబంధాలు ఏర్పరచుకునే అవకాశం కలిగింది ఇదిగాక అమెరికా ఫ్రాంకో నియంతకు 620 లక్షల డాలర్లు అప్పు పెట్టింది పశ్చిమరాజ్యాల పత్రికలు యూరపు రక్షణలో స్పెయిన్ వహించవలసిన ప్రముఖ పాత్రను వివరించాయి "నేను లేకుండా యూరపు సమిష్టి రక్షణ ఏమిటి?" అని విలేఖరులకు చెప్పాడు ఫ్రాంకో స్పెయిను పత్రికలు, "జిబ్రాల్టరు తిరిగి స్పెయిను పరంకావాలి" అని ఉద్ఘాటించాయి బ్రిటిషు లేబరు ప్రభుత్వం మటుకు చప్పున మాడ్రిడ్ (స్పెయిను రాజధాని)కి రాయబారిని ఏర్పాటు చేసింది

ఈ పరిణామాలన్నిటి అంతరార్థం ఏమిటి? స్పెయిన్ ఆకస్మికంగా పశ్చిమ రాజ్యాలకు ఎట్లా హితమయింది? రష్యా, చైనా, తూర్పు యూరపు రాజ్యాలలో లేని 'ప్రజాస్వామ్యం' ఫ్రాంకో ఫాసిస్టు పరిపాలనలో అమెరికా, బ్రిటనులకు కనిపించిందా? 47న్నర కోట్ల చైనా ప్రజలకు పెకింగ్‌లో ఉన్నదే బాధ్యతాయుత ప్రభుత్వమని సర్వత్రా ఆమోదించబడుతున్నప్పటికీ, దానిని అమెరికా గుర్తించటంపై అనేక అంతర్జాతీయ ప్రతిష్టంభనల పరిష్కారం ఆధారపడి ఉన్నప్పటికీ, పెకింగ్ ప్రభుత్వాన్ని గుర్తించ నిరాకరించి ప్రతిష్టంభనలను తీవ్ర పరిస్థితుల కింద మారనిచ్చే అమెరికా, ఫ్రాంకో పరిపాలనను గుర్తించటమేగాక ఆ ప్రభుత్వాన్ని నిలబెట్టడానికి లక్షలూ, కోట్లూ ఎందుకు ధారపోస్తోంది? మన దేశంలో తీవ్రమైన ఆహార కరువు ఏర్పడిందంటే తమ మిగులు ధాన్యం అప్పివ్వటానికి ఆపసోపాలు పడే అమెరికా సెంటుకు (సుమారు అర్ధణాకు) 100 పౌనుల రేటున 42,500 టన్నుల బంగాళా దుంపలు ఫ్రాంకోకు ఎందుకిచ్చింది? పశ్చిమ రాజ్యాలు ఫ్రాంకో స్పెయిన్‌ను గుర్తించి అతన్ని అన్ని విధాలా "కాకా" పట్టడంలో

"పరం"కాకపోతే "ఇహ" మన్నా ఏమైనా ఉందా? ఫ్రాంకో స్పెయినును గురించి అమెరికను పత్రికలూ, బ్రిటిషు విలేఖరులూ తెలిపే విషయాలు తెలుసుకుంటే పైప్రశ్నలకు అతివింత సమాధానం వస్తుంది

స్పెయినులో ఫ్రాంకో సాగిస్తున్నది పచ్చి నియంతృత్వమే, కాని ఈనాడు ఫ్రాంకో పరిపాలనను ప్రతిఘటించే ప్రజాస్వామిక శక్తి స్పెయిన్‌లో ఏదీ లేదు స్పెయిన్‌లో జరిగిన అంతర్యుద్ధంలో రిపబ్లికనులు ఓడిన అనంతరం ఫ్రాంకో తన ప్రతిపక్షాలను నిర్దాక్షిణ్యంగా రూపుమాపాడు 1948లో కూడా ఫ్రాంకో తన లెక్క ప్రకారమే 300 మందిని ఉరితీశాడు ప్రజాస్వామిక శక్తులను పునరుద్ధరించటానికి ప్రయత్నించేవారూ, మేధావులూ తీవ్రమైన ఒత్తిడికి గురి అవుతున్నారు దీని ఫలితం నేటి స్పానిష్ కళలలో స్పష్టంగా అవుపిస్తున్నదని చెబుతారు అవి చాలా బలహీన స్థితిలో ఉన్నాయట ఫ్రాంకో పరిపాలన విమర్శకు గురి అవుతున్నమాట నిజమేగాని, ఏ మర్యాదస్తులో హోటల్లో కూచుని ప్రభుత్వ విమర్శతో ఊసుపుచ్చుకుంటే తంటా లేదుగాని దరిద్రులు విమర్శించినా, విమర్శ పత్రికలలో పడినా ప్రమాదం ఉన్నది స్పెయిన్ రాజకీయ వేత్తలు తమలో తాము కీచులాడుకోవటం జాస్తి కావటంచేత వీరంతా ఫ్రాంకోకు ఎదురు తిరిగే అవకాశం తక్కువ కాకపోయినా 3కోట్ల స్పెయిను ప్రజలను కనిపెట్టి ఉండటానికై దాదాపు లక్షమంది పోలీసులున్నారు!

ఫ్రాంకో నియంతృత్వం వెనక కపట జాతీయవాదమైనా లేదు, ప్రజల్ని మభ్యపెట్టటానికి, ఫ్రాంకోకు నినాదాలు లేవు అతన్ని బలపరిచేది స్పెయినులోని, వాటికాన్‌లోని మత వర్గాలూ, సైన్యమూ, ధనిక వర్గాలూనూ స్పెయిన్‌లో 30వేలమంది మతాధికారులున్నారు! ఈవర్గాలు ఫ్రాంకో ప్రభుత్వానికి అవసరమైన ఆర్థిక, రాజకీయ స్థిరత్వాన్నీ, శాశ్వతత్వాన్నీ చేకూర్చలేవని వేరే చెప్పనవసరం లేదు సమయానికి అమెరికా డాలరు ఆర్థిక సహాయం లభించకపోతే కిందటేడే ఫ్రాంకో పరిపాలన దాని దౌర్బల్యంతో అదే కూలిపోయేదని చాలామంది విశ్వసిస్తున్నారు ఈ సహాయమైనా తాత్కాలిక స్థిరత్వమే చేకూర్చగలదనటానికి సందేహం లేదు ఎందుకంటే ఫ్రాంకోకుపెట్టిన అప్పులు తిరిగిరావు అందుకనే 1948, 49లలో ఫ్రాంకోకు గోధుమలిచ్చి ఎంతో సహాయపడిన అర్జంటైనా అటుపిమ్మట అహారం ఇవ్వ నిరాకరించింది ఫ్రాంకో పరిపాలన చిరస్థం కాదన్న భావంతోనే వాటికాన్ ప్రభుత్వం ఫ్రాంకోకు మతాధికారులను నియమించే అధికారం ఇవ్వకుండా ఉన్నది నిజానికి 60 ఏళ్ళ ఫ్రాంకో ఇవాళ కళ్ళుమూస్తే రేపు అతని పరిపాలన కుప్పున కూలిపోతుంది ఫ్రాంకోను బలపరిచే మత, ధనికవర్గాలకు అతనిపై ప్రత్యేకమైన ప్రేమ ఏమీలేదు అతన్ని మార్చి మరొకర్ని పెట్టిన మరుక్షణం ప్రజాస్వామిక శక్తులు విజృంభిస్తాయన్న భయంతోనే వారు ఫ్రాంకోను పట్టుకు వేళ్ళాడుతున్నారు

స్పెయినులోని అగ్ర ధనిక వర్గాలవారు పూర్తిగా బలపరిచే ఫ్రాంకో నియంతృత్వ పరిపాలన కింద ఆర్థిక పరిస్థితులు ఎట్లా ఉన్నవీ చూడటం అవసరం పతనోన్ముఖుడుగా ఉన్న ఫ్రాంకోను అమెరికా చేసిన ధనసహాయం తాత్కాలికంగా ఎట్లా నిలబెట్టింది?

ఫ్రాంకో నియంతృత్వానికి అండగా ఉన్న శక్తులలో ధనికవర్గాన్నీ, సైన్యాన్నీ చెప్పుకున్నాము అమెరికా చేసిన ధనసహాయం ఫ్రాంకో ప్రభుత్వపు ఆర్థిక పరిస్థితులను చక్కబరచటమే కాక,

అక్కడి ధనికవర్గాలు దేశీయ ఆర్థిక వ్యవస్థను చక్కబరచకుండానే తమ లాభాలను పెంచుకునే అవకాశం ఇచ్చింది అందుచేత వారు అమెరికా అనుగ్రహం సంపాదించిన ఫ్రాంకోను బలపరుస్తారు ఇక సైనికాధికారుల ఆశ ఏమంటే, అమెరికా మూడవ ప్రపంచ యుద్ధంలో స్పెయిను సహాయం అవసరంగా భావించే ఫ్రాంకోకు ఆర్థికంగానూ, రాజకీయంగానూ తోడ్పడుతున్నదని, ఆయుధ సహాయం ఇంకా ఎంతోదూరం లేదనీనూ ఇది అసమంజసమైన ఆశకాదు

అయితే స్పెయినులోని ధనిక, సైనికవర్గాల ఆశలు ఎంతవరకు యధార్థంగా ఫలిస్తాయన్నది ప్రశ్న ఈ ప్రశ్నకు సమాధానం చెప్పుకోవాలంటే ఆర్థికంగానూ, సైనికంగానూ స్పెయిను ఫ్రాంకో పరిపాలనకింద ఎట్లా ఉన్నదీ తెలుసుకోవాలి

* * *

స్పెయిను బ్యాంకుద్వారా ప్రభుత్వం తనకు కావలసిన రుణాలలో అధికభాగం చేస్తుంది ఈ బ్యాంకు జారీచేసే రుణపత్రాలను అధికంగా కొనేవి రెండు ప్రజాసేవా సంస్థలు ఈ సంస్థలు ప్రజాసేవపేర ఉద్యోగాలిచ్చేవారివద్దా, పుచ్చుకునేవారివద్దా సొమ్ము వసూలుచేసి వాటిలో కొద్దిభాగం ప్రజాసేవకు వినియోగించి, మిగిలినది ప్రభుత్వానికి అందజేస్తూ ఉంటాయి ఫ్రాంకోచుట్టూ గల పలుకుబడిగల వారు కొద్దిమంది దేశ ఐశ్వర్యాన్ని యధేచ్ఛగా కొల్లగొడుతూ దేశాన్ని దుర్భిక్షానికి గురిచేస్తూ వస్తున్నారు వీరి అమానుషచర్యలవల్ల స్పెయిను దేశంలో ఏర్పడిన దుస్థితిని ప్రభుత్వం అంచనాలుకూడా పూర్తిగా మరుగుపరచలేకుండా ఉన్నాయి ఈ అంచనాల ప్రకారం చూసినా 1935 తరవాత స్పెయినులో ఆహారోత్పత్తి క్రమంగా తగ్గుతూ ప్రస్తుతం సగానికి దిగింది అందుచేత స్పెయిను దొరికినచోటనల్లా తిండిగింజలు కొనవలసిన స్థితి ఏర్పడింది స్పెయిను బ్యాంకులోని బంగారపు నిధి కుదవబెట్టి కొన్ని అమెరికను బ్యాంకులలో రుణం పుట్టించి దానితో ఫ్రాంకో ఆహారం దిగుమతి చేసుకున్నాడు అయితే ఫ్రాంకోకు గల బంగారు నిధి చాలా క్షీణదశకు వచ్చి ఉండాలి స్పెయిను బ్యాంకు ఈనిధిగురించి వివరాలు చాలా గోప్యంగా ఉంచుతున్నది దీనితోబాటు ఇన్‌ఫ్లేషన్ తీవ్రంగా చెలరేగుతున్నది రేషను చాలా తగ్గించబడింది తిండి బ్లాక్‌మార్కెట్ విజృంభించింది

స్పెయిన్‌లో వ్యవసాయం వెనకపడటంలో ఆశ్చర్యంలేదు కిందటేడు ప్రభుత్వం వ్యవసాయానికి కేటాయించినది మొత్తం ఖర్చులో నూరోవంతు సైనికరక్షణ, పోలీసు శాఖలకింద కేటాయించిన మొత్తం దానికి 55 రెట్లు! స్పెయినురిపబ్లిక్‌గా ఉండగా దిగుమతి చేసుకున్న ఎరువులలో మూడోవంతు మాత్రమే ఇప్పుడు దిగుమతి అవుతున్నది ఆధునిక వ్యవసాయ పరికరాలు లేవు పొలాలను గాడిదలతోనూ, కంచర గాడిదలతోనూ దున్నుతున్నారు

పరిశ్రమలు కూడా అధోగతిలోనే ఉన్నాయి ఉక్కు ఉత్పత్తి, గత 20 సంవత్సరాల చిల్లర కాలంలోనూ ఒక్క పిసరు పెరగలేదు విద్యుచ్ఛక్తి ఉత్పత్తి రెట్టింపుకు పెరిగి కూడా పాలకుల అప్రయోజకత్వంవల్ల అది పరిశ్రమలకు అందటంలేదు మాడ్రిడ్‌లోని పరిశ్రమలకు వారానికి 9 గంటలూ, బార్సిలోనా నేత పరిశ్రమకు వారాని కొకరోజు మాత్రమే కరెంటు లభిస్తుందట! విదేశ ద్రవ్యాన్ని లాభసాటిగా ఉపయోగించాలంటే దేనిమీద వెచ్చించాలో, ఉన్న సదుపాయాలను అధికోత్పత్తికి ఎట్లా వినియోగించాలో ప్రభుత్వానికి గాని, ధనికవర్గానికి గాని తెలియదు

దేశంలోని దుర్భిక్షానికి నిదర్శనం సామాన్య ప్రజల జీవితం 1936 తరవాత జీవనవ్యయం ఆరురెట్లు పెరిగితే, వేతనాలు రెండింతలు మాత్రమే పెరిగాయి ఇందులో ఆహారం ఖర్చు పదింతలు పెరిగింది నైపుణ్యంతో కూడిన వృత్తులు చేసుకునేవారు కూడా తమ జీతాలమీద బతకటం అసాధ్యం అందుచేత ప్రతివాడూ తాను చేసుకునే ఉద్యోగం వెంట ఇంకొకపని ఏదైనా దొరుకుతుందా చేద్దామని చూస్తూ ఉంటాడు

ఇటువంటి పరిస్థితిలో పైదేశాలనుండి జరిగే ఆర్థిక సహాయం ప్రభుత్వ యంత్రాన్ని ఆశ్రయించేవారి జేబులు నింపగలదే గాని ప్రజాజీవితాన్ని బాగుచెయ్యటం అసంభవం నేరుగా ఆహారపదార్థాలను పంపినప్పటికీ ప్రజలు సుఖపడతారనే నమ్మకంలేదు అమెరికా చౌకగా సప్లయిచేసిన 42,500 టన్నుల బంగాళా దుంపలు మాడ్రిడ్‌లో దొంగమార్కెటులో కొన్నధరకు నూరింతల ఖరీదుకు అమ్ముడుపోయాయి!

"ఇవాళ ఉన్నంత తిండికరువు స్పెయిను ప్రజలు ఎన్నడూ ఎరగరు వారికెంత సహాయమైనా చెయ్యదగును కాని ప్రజల ఆకలిని ఆధారం చేసుకొని లాభాలు గడించే ప్రభుత్వానికి చేసే సహాయం పోగూడని జేబుల్లోకీ, నోళ్ళలోకి మాత్రమే పోతుంది ఈ అమానుష పరిపాలన తొలగితే స్పెయిను సహాయపాత్రమవుతుంది అంటే ఫ్రాంకోను తొలగించాలన్న మాట" అని ఒక విలేఖరి రాస్తున్నాడు

* * *

ఫ్రాంకో స్నేహాన్ని సమర్థించుకోవటానికి అమెరికన్, బ్రిటిష్ పాలకవర్గాలవారు, "ఫ్రాంకోకు గల సైనికబలాలు మరే యూరపు దేశానికి లేవు" అంటున్నారు

ఫ్రాంకోకు చెప్పుకోదగిన నౌకా, విమాన బలాలు లేవు ఫ్రాంకో సేనలు పెద్ద ఎత్తున యుద్ధంలో పాల్గొనవలసివస్తే ఈ రెండు శాఖలనూ పునాదినుంచి నిర్మించటమేగాక వాటిలో వారినికూడా తరిఫీదు చేసుకోవాలి ఫ్రాంకోకు పెద్ద సైన్యం ఉన్నమాటమటుకు నిజమే ఆ సైన్యమే లేకపోతే ఫ్రాంకో తన దేశ ప్రజలను అదుపులో ఉంచలేడు అదీకాక ఈ సైన్యాలను రద్దుచేస్తే వారికి నిరుద్యోగం ఏర్పడి అది గొప్ప రాజకీయ సమస్యగా పరిణమించటం జరుగుతుంది ఇది ఫ్రాంకోకు రెండు విధాలా నష్టం అందుచేత ఫ్రాంకో ఈ సైన్యాన్ని "ఉండనిస్తున్నాడు" ఫ్రాంకో సైనికుల సంఖ్య 3,4 లక్షల మధ్య ఉంటుంది వీరు 22 డివిజనులుగా ఏర్పాటై ఉన్నారు ఇందులో 16 డివిజనులు స్పెయినులో ఉన్నాయి నాలుగు డివిజనులు స్పెయినుకు చెందిన మొరాకో ప్రాంతంలో ఉన్నాయి ఈ నాలుగు డివిజనులకు నాయకుడైన జనరల్ వారెలా ఫ్రాంకోకు "పోటీదారు" అందుచేత ఫ్రాంకో అతనికి దేశాంతరవాసం కలిగించాడు ఇవిగాక ఫ్రాంకోకు ఒక కవచ దళమూ, ఆశ్విక దళమూ కూడా ఉన్నాయి ఈ "కవచాన్ని" ఫ్రాంకో ఏటా మాడ్రిడ్‌లో ప్రదర్శనం చేస్తూ ఉంటాడు ఇది ఎందుకూ కొరగానిది

ఫ్రాంకో సైనికులు యుద్ధానికి పనికివచ్చే వారుకారు వారికి ఆధునిక ఆయుధాల ప్రయోగం తెలియదు అని లేను కూడా లేవు ఫ్రాంకోకు టాంకు విధ్వంసక పరికరాలూ విమాన విధ్వంసక పరికరాలూ లేవు ఈ సైన్యాలు రేపు యుద్ధంలో పాల్గొనాలంటే ఇవాళనుంచీ వారికి ఆధునిక యుద్ధసామగ్రితో పరిచయం ఉండాలి అందుకే వారు కొన్ని ఆయుధాలనైనా వెంటనే ఇప్పించమని అమెరికానుకోరుతునారు

ఫ్రాంకో సైన్యాల తాలూకు అధికార్లు కూడా పూజా పునస్కారాలు లేక బూజెక్కి ఉన్నారు వారిలో చాలామంది వృద్ధులు కూడానూ సైనికాధికారులకు ఫ్రాంకో ఇచ్చేజీతం చాలా తక్కువ అది వారికి చాలదు అందుచేత వారు తమ సైనికోద్యోగాలు ఉదయం ముగించుకుని మధ్యాహ్నంనుంచీ వేరే ఉద్యోగాలు చేసుకుంటారు ఈ పరిస్థితికి తోడు ఫ్రాంకో రాజకీయాలమూలంగా అతని సైనికాధికారులు అమెరికన్, బ్రిటిష్ యుద్ధతంత్రం నేర్చుకోరాదు–అది ప్రజాస్వామికతంత్రం! రష్యన్ యుద్ధతంత్రం మొదలే పనికిరాదు

పెరేడ్ చెయ్యటమూ, రైఫిళ్ళు మొయ్యటమూ మాత్రమే నేర్చిన ఈ "మూక"కు ఆయుధాలు ఏర్పాటు చెయ్యాలంటేనూ, శిక్షణ ఇవ్వాలంటేనూ బోలెడంత ఖర్చవుతుంది కాని ఇంతకు మించిన ఖర్చుకూడా ఉన్నది అదేమిటంటే ఈ సైన్యాలు కదలటానికి రోడ్లూ, విమాన స్థావరాలూ నిర్మించటం

ప్రస్తుతం స్పెయినులోనున్న రోడ్లన్నీ మాడ్రిడ్‌నుంచి అన్నివైపులకూ బండిచక్రం ఆకులల్లే పోతున్నాయి రైలుమార్గాలుకూడా అంతే వాటిని అడ్డంగా కలిపే రోడ్లు, రైలుమార్గాలూ లేవు రైలు మార్గాలేకాక, స్పెయినుకు తగినన్ని రైలుఇంజన్లూ, బోగీలూ, వాగన్లూ లేవు క్షీణించే ఆర్థిక వ్యవస్థలో వీటి సంఖ్య అంతకంతకూ తగ్గుతూ వీటి మరమ్మతు అంతకంతకూ పెరిగి అవసరాలనే తట్టుకోలేకుండా ఉన్నది మాడ్రిడ్ బయట ఉన్న విమాన స్థావరం చాలా మంచిదేకాని మిగిలినవన్నీ ఎందుకూ పనికిరావు

ఒక అంచనా ప్రకారం స్పెయినును సమగ్రంగా యుద్ధసన్నద్ధం చెయ్యాలంటే 200 కోట్ల డాలర్లూ, అయిదేళ్ళూ పడుతుంది ఇంతా అయిన తరవాత ఈ సైన్యాలు అమెరికాకోసం పోరాడతాయా అన్న సమస్య ఉండనే ఉంటుంది స్పెయినులో అధిక సంఖ్యాకులకు ఫ్రాంకో పరిపాలన తమను ఈ స్థితికి తెచ్చిందని తెలుసు దీనికి బోలెడంత సాక్ష్యం ఉన్నది అటువంటప్పుడు ఫ్రాంకో ఆదేశాల ననుసరించి ఈ సైన్యాలు ఉత్సాహంతో పోరాడుతాయనుకోవటం భ్రమ

ఇటువంటి పరిస్థితులలో, తమతమ దేశాల ప్రజలకు ఫ్రాంకో నియంతపైగల అసహనాన్ని కూడా లక్ష్యపెట్టకుండా అమెరికా బ్రిటను దేశాలు ఎందుకు అతనితో పొత్తుచేస్తున్నాయి? వారు అవలంబించే రష్యా వ్యతిరేక విధానం వారి చేత ఫ్రాంకో వంటి క్షుద్రుల వైపు లాగుతున్నది గనక! తమ ప్రజల సహకారాన్ని కోల్పోతున్న పశ్చిమరాజ్యాలు ఏగడ్డిపోచనైనా పట్టక తప్పదు గనక!

ఈరాజ్యాలు ఫ్రాంకో పొత్తు కోరటం వల్ల ఫ్రాంకో బలం కాదు బయట పడుతున్నది– ఆంగ్లో అమెరికనుల దౌర్బల్యం

కాకపోయినా అమెరికా తెరమీది కెక్కించే చాంగ్‌కైషేక్, సింగ్మన్‌రీ, బావోడామ్, యొషీబా, క్విరినో, అడినొవర్ వగైరా తోలు బొమ్మలలో ఫ్రాంకోకు స్థానం లేకపోలేదు ఫ్రాంకో కూడా ఉంటేనేగాని అమెరికా బలపరిచే "ప్రజాస్వామిక స్వాతంత్ర్యం" యొక్క స్వరూపం పరాకాష్ఠ నందుకోదు

తెలుగు స్వతంత్ర వారపత్రిక, 16-3-1951

# 24. శాంతి ఉద్యమం: ప్రజలు

రెండవ ప్రపంచ యుద్ధం రాకపూర్వం హెచ్ జి వెల్స్ అనుకుంటాను, "అరడజనుమంది వ్యక్తులు తలపెట్టినట్లయితే యుద్ధం తెచ్చిపెట్టగలరు" అన్నాడు అణువు బాంబులూ, హాలాహలం బాంబులూ, వీ–2లూ, రాకపూర్వమే ఇది శోచనీయమైన విషయం: అవి వచ్చాక అరడజనుమంది చేతిలో అందరు మానవుల ప్రాణాలూ ఉండటమనేది ఘోరాతిఘోరమన్నమాటే అరడజను మందీ, డజనుమందీ, అయిదు డజన్లమందీ కలిసి తెచ్చే యుద్ధాలను ప్రజలు నివారించవచ్చునన్న విశ్వాసాన్ని పురస్కరించుకుని ప్రపంచ మంతటా శాంతి ఉద్యమాలు బయలుదేరాయి సామాన్య ప్రజలంతా ఏకమై శాంతికొరకు తమ సర్వశక్తులూ ధారపోయటానికి సిద్ధపడ్డట్టయితే యుద్ధోన్మాదులను నిరోధించగలుగుతా రన్నది ప్రజాస్వామికానికి విరుద్ధమైన సూత్రంకాదు

ఎందుచేతనంటే యుద్ధం నిర్ణయించేది కొద్దిమందే అయినా దానిని నిర్వహించే సైనికులూ, కార్మికులూ, టెక్నీషియనులూ, దానికి ప్రచారం ఇచ్చే విలేఖరులూ, సైనికులనూ యుద్ధసామగ్రినీ రవాణా చేసేవారూ, సామాన్య ప్రజలు వారి సహకారం లేకుండా యుద్ధం జరగదు అమెరికాలో, సైనికులు తగినంతమంది ముందుకు రాకపోవడంచేత కాబోలు ఖైదీలలోనుంచి తగువారిని ఏరి విడుదల చేసి సైన్యంలో చేర్చుకోవాలని యుద్ధ శాఖవారు ఆలోచిస్తున్నట్టు తెలుస్తున్నది మరి అమెరికాలో పెద్ద ఎత్తున శాంతి ఉద్యమా లేవీ సాగుతున్నట్టు కనబడదు

గత ప్రపంచ యుద్ధానికి పూర్వం ప్రజలలో ఇంత చైతన్యం లేనిమాట నిజమే 1938లో కూడా బ్రిటిషు ప్రజలు యుద్ధ విముఖత్వం ప్రకటించారు కాని తీరా యుద్ధం వచ్చినాక వారే యుద్ధ భారాన్ని మోశారు ఎవరి తప్పు వల్లనైనా సరే తమ దేశం యుద్ధంలో ప్రవేశించిన తరువాత దేశ రక్షణకోసం యుద్ధంలో పాల్గొనటం తమ విధి అని వారు భావించేవారు యుద్ధం వచ్చిందీ అనగానే వారు రాజకీయంగా, ఆలోచించటం మానేసేవారు ఈ పరిస్థితి గత యుద్ధంలోనే అంతమయింది ఈ పరివర్తన యూరప్‌లోనే కాక ఆసియాలో కూడా జరిగింది హిట్లరును చూసి యూరప్ ప్రజలు రాజకీయాలు నేర్చుకున్నట్టే జపానును చూసి ఆసియావారూ నేర్చుకున్నారు హిట్లరు ప్రపంచాన్ని కబళించే కార్యక్రమం ప్రారంభించగానే యూరప్ ప్రజలు అతన్ని పడగొట్టడానికి నడుములు కట్టారు ఆస్ట్రియా, పోలెండు, జెకోస్లొవేకియా, ఫ్రాన్సు మొదలైన దేశాలలోని "ప్రజా" ప్రభుత్వాలు అట్టే ప్రయాసలేకుండా హిట్లరుకు పాదాక్రాంతమైతే అక్కడి ప్రజలు ప్రతిఘటనోద్యమాలు సాగించి మిత్రమండలి విమానాలకు సంకేతాలు పంపి తమ దేశాలపై తామే బాంబులు వేయించుకుని హిట్లరు వినాశనానికి తోడ్పడ్డారు! యుద్ధానికి పూర్వమే ఆ దేశాలలో ప్రజలు శాంతి ఉద్యమాలు నడిపి తమ శక్తులను యుద్ధానికి వ్యతిరేకంగా కూడగట్టినట్లయితే హిట్లరు ఆక్రమణగాని, ప్రతిఘటనగాని అంత దూరం వెళ్ళవలసిన అవసరం ఉండేదికాదు

ఆసియాలో పరిస్థితులు కొంత భిన్నంగా ఉండటంవల్ల ఇక్కడ ప్రజోద్యమం రెండు దశలు గడిచింది మొదటి దశలో ఆసియా ప్రజలు బ్రిటిషువారిమీది కోపం కొద్దీ జపానును ఆహ్వానించారు యూరప్‌దేశాలలో 'ప్రజా' ప్రభుత్వాలకన్న ఆసియాలోని వలస ప్రభుత్వాలు చాలా హేయంగా ప్రవర్తించాయని వేరే చెప్పనవసరంలేదు బర్మా, మలయాలనుంచి

బ్రిటిషువారూ, ఇండో–చైనానుంచి ఫ్రెంచివారూ, ఇండోనేషియానుండి డచ్చివారూ సాధ్యమైనంత పెందలాడే ఉడాయించారు వలస అధికారులు పరారీ అయిన కొన్ని రోజులకుగాని ఈ దేశాలు జపాను ఆక్రమణ కిందికి రానేలేదు అప్పుడైనా జపాను, స్థానిక ప్రజల ఆశీర్వాదంతోనే, ఆయా ప్రాంతాలను ఆక్రమించుకున్నది ఆ తరవాత గాని ఆసియా ప్రజలకు యుద్ధం వెనక ఉన్న రాజకీయాలూ, జపాను దురుద్దేశాలూ తెలిసిరాలేదు అవి తెలిసివచ్చాక ఆసియా ప్రజోద్యమం జపానుకు ఎదురుతిరిగింది అనేక ప్రాంతాలనుంచి జపానువారు ప్రజా ప్రతిఘటన చేత సాగనంపబడగా, అది ఆసరా చూసుకుని సామ్రాజ్యవాదులు ఆసియాను పునరాక్రమించి, ప్రజోద్యమాలను అణచటానికీ, ఉద్యమనాయకులను వేటాడటానికీ చక్కా వచ్చారు

మరో ప్రపంచయుద్ధం వస్తుందన్న భయంతో ప్రపంచ ప్రజలు తల్లడిల్లిపోతున్న ఈ తరుణంలో మనం గత యుద్ధపు పాఠాలను విస్మరించటం చాలా ప్రమాదకరం అందులోనూ ప్రజలకూ ప్రజోద్యమాలకూ గల ప్రాధాన్యాన్ని గుర్తించకపోవటం హానిదాయకం

అందుచేత ఈనాడు శాంతి ఉద్యమాలపై జరిగే విమర్శలనూ వాటికి కలిగించబడే ప్రతిబంధకాలనూ ఒకకంట కనిపెట్టి ఉండాలి ఈ విమర్శలూ, ప్రతిబంధకాలూ సదుద్దేశంతో సాగినవే అనుకున్నా, తీరా ప్రమాదం ఏర్పడే సమయానికి అవి ఆ ప్రమాదానికే సాయపడగలవు గమనించదగిన విషయమేమంటే, ఇప్పుడు నడిచే శాంతి ఉద్యమాలను విమర్శించే వ్యక్తులలో చాలామంది ఇంకొకరకం శాంతి ఉద్యమాలను నడపటానికి ప్రయత్నించటం లేదు అటువంటి ప్రయత్నం చేసే ఆలోచన గాని, శక్తిగాని వారికిలేదు ఇటువంటివారు శాంతి ఉద్యమానికి చాలా అపకారులు

ప్రస్తుత శాంతి ఉద్యమాలపట్ల వీరికుండే అభ్యంతరాలు స్థూలంగా పరిశీలించుదాం ఈ అభ్యంతరాలు ప్రధానంగా ఈ ధోరణిలో ఉంటాయి (1) శాంతి ఉద్యమాలను కమ్యూనిస్టులు నడుపుతున్నారుః అందుచేత వాటిలో ఎవరూ చేరరాదు (2) రష్యా తన స్వార్థం కోసం ప్రపంచమంతటా తన ఏజంట్ల ద్వారా శాంతి ఉద్యమాలు సాగిస్తున్నదేగాని ఒకవంక రష్యా యుద్ధానికి సిద్ధమవుతూ వున్నది (3) శాంతి ఉద్యమాలు శాంతిని రక్షించలేవు

ఇటువంటి వాదనలు ప్రజలను రాజకీయంగా మభ్యపెట్టటానికి మాత్రమే ఉపకరిస్తాయన్న విషయం కాస్త స్థిమితంగా ఆలోచిస్తే తేలిపోతుంది

శాంతి ఉద్యమాల ఏకైక ఆశయం శాంతిని కాపాడటమూ, శాంతి రక్షణకు ప్రజలను సంఘటితపరచటమూ అయితే అటువంటి ఉద్యమాలను కమ్యూనిస్టులు బయలుదేర దీస్తున్నారన్న మిషపెట్టుకుని శాంతి రక్షణకు తిలోదకాలివ్వటం ముక్కుమీది కోపంతో మొహం చెరుచుకోవటమవుతుంది ప్రజల స్వార్థం కమ్యూనిస్టుల స్వార్థంతోనూ, ప్రపంచ దేశాల స్వార్థం రష్యా స్వార్థంతోనూ జత కలిసినట్టయితే ఆ కమ్యూనిస్టులనూ, రష్యానూ, కూడగట్టుకోవడంలో తప్పేమీ లేదు ఆసియాను జపాను రక్షిస్తుందని తోచినప్పుడు ఆసియాప్రజలు జపానును కూడగట్టుకొనటానికి ప్రయత్నించారు సాధ్యంకాదని తోచగానే ప్రతిఘటించారు రష్యా నిజంగానే ప్రపంచాన్ని మింగటానికి ప్రపంచమంతటా శాంతి ఉద్యమాలు నడిపితే రష్యాకు కించిత్తయినా బుద్ధి లేదనుకోవాలి ఏమంటే రష్యా ఒక్కసారిగా ప్రపంచాన్ని మింగి పారెయ్యలేదు

దాని వాస్తవం తెలియగానే అది సాగించే శాంతి ఉద్యమాలు దానినడుం విరగగొట్టగలవు ఒక భారతీయ శాంతి ఉద్యమ నాయకుడన్నట్టు మనం శాంతిని రక్షిద్దాం ఆ శాంతిని అమెరికా భంగపరిచినా రష్యా భంగపరిచినా ప్రతిఘటించే స్థితిలో ఉందాం దొంగవాడికి తాళంచెవులిచ్చినట్టు, శాంతిని బలపరుస్తూ కమ్యూనిస్టులూ, రష్యా ముందుకురావటం మరీమంచిది

మరొక విషయం గమనించాలి ఆసియాలో జాతీయోద్యమాలను కమ్యూనిస్టులు బలపరుస్తున్నారని ఆసియాదేశాలలోని ప్రభుత్వ పక్షాలు మాజీ సామ్రాజ్యవాదుల శరణుజొచ్చేటప్పటికి జాతీయోద్యమాలు పూర్తిగా కమ్యూనిస్టుల చేతిలోకి పోయాయి కమ్యూనిజంవల్లా, కమ్యూనిస్టులవల్లా ప్రమాదమున్నదని నిజంగా నమ్మేవాళ్ళు ఆ ప్రమాదాన్ని మరింత యధార్థం చేసే పనులు చెయ్యటం అనూహ్యం

ఈ మధ్య ఒక మాజీ కాంగ్రెసు మంత్రి మద్రాసులో ఏర్పడిన ఒక శాంతికమిటీలో చేరి చిత్రమైన పరిస్థితి కలిగించాడు ఆయన ప్రకటించిన వైఖరి చాలామంది బయట ఉండే ప్రకటిస్తున్నారు కనక ఆయనవైఖరిలో మంచి చెడ్డలు తెలుసుకోవటం అవసరం ప్రపంచ శాంతి ఎంతముఖ్యమో, దేశంలోని అంతరంగిక శాంతికూడా అంతే ముఖ్యమని మాజీ మంత్రిగారు వాదించారు ఆ కారణంచేత దేశంలోని కమ్యూనిస్టులు తమ హింసాయుత విధానం మానాలని ఒక ప్రతిపాదనచేస్తూ శాంతి కమిటీ ఆ ప్రతిపాదనను స్వీకరించాలని పట్టుపట్టాడు శాంతికమిటీ ద్వారా కమ్యూనిస్టులను ఒక మార్గంలోకి తీసుకురావాలని ఆయన వాంఛ ప్రపంచ శాంతి సమస్య ఆయనను బాధించలేదు ఆ విషయం త్వరలోనే రుజువయింది ఆయన చేసిన ప్రతిపాదనకు కమిటీలోని సభ్యులు అభ్యంతరాలు చెప్పారు శాంతికమిటీలో అన్నిపక్షాలవారికీ స్థానమున్నదనీ, ఈకమిటీలో ఏ ఒక పక్షాన్ని విమర్శిస్తూ తీర్మానం ప్రతిపాదించినా అసలు కర్తవ్యం వెనకపడుతుందనీ కొందరన్నారు ప్రభుత్వ పోలీసులు చేసే హింసాకాండను ఖండిస్తూ, ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టాన్ని నిరసిస్తూ మేము తీర్మానం ప్రవేశపెడితే ఒప్పుకుంటారా అని కమ్యూనిస్టు సభ్యుడడిగాడు తన తీర్మానం ఆమోదించబడదని తోచగానే మాజీ మంత్రిగారు తన సభ్యత్వానికి రాజీనామా ఇస్తూ, దేశంలో కమ్యూనిస్టులవల్ల కలిగే అశాంతిని అరికట్టటానికి మాత్రమే వారు ఈ కమిటీలో చేరారనీ, అహింసా సిద్ధాంతానుసారం మాత్రమే తాను ప్రపంచ శాంతి కోరుతున్నాననీ తెలియచేశాడు

అహింసావాదులు కాని కమ్యూనిస్టులు శాంతి ఉద్యమంలో చేరుతున్నారన్నదాన్ని బట్టి చాలామందికి ఈ శాంతి ఉద్యమం అనుమానాస్పదంగా కనిపించటం జరుగుతున్నది అనేక ఏళ్ళుగా మహాత్మాగాంధీ అహింసావాదం మనకు నూరిపోశాడేమో, అహింసకన్నా శాంతి ఒకమెట్టు పైదంటే దేశంలో నూటికి 99 మంది నమ్మలేరు వారికి శాంతికోసం పోరాడట మనేది కూడా అర్థంలేని భావంగా కనిపిస్తుంది అహింసా సిద్ధాంతం కేవలం నైతిక మైనది అహింసావాది ఇంకొకర్ని హింసించడు ఇంకొకరు తనను హింసించకుండా చూసుకోవటం అతడికి అంత ముఖ్యంకాదు అహింసను బోధించిన గాంధీజీయే ఒకప్పుడు, "ప్రతి తలలోనూ ఒక్కొక్క తుపాకిగుండు దూరితే ఉద్యమం అద్భుత విజయం సంపాదిస్తుంది" అన్నాడు శాంతి ఉద్యమం దృక్పథం ఇదికాదు శాంతికోరేవారు ఇతరులమీద బాంబులు పడటానికి

సమ్మతించరుకూడానూ ఇక్కడే శాంతివాదులు శాంతికోసం సంఘర్షణ చేయవలసిన ఆవశ్యకత కూడా కలుగుతున్నది ప్రపంచశాంతి ఉద్యమంవల్ల లభించాలిగాని అహింసా సిద్ధాంతంతో లభించటం అనుమానాస్పదం ఒకవేళ అదిసాధ్యమే అయినా అంత ఆదర్శవాదంతో కూడుకున్న సిద్ధాంతాన్ని ప్రపంచ ప్రజలంతా కలిసికట్టుగా అమలు జరపటం అసంభవం "అహింసావాదం ప్రధానం కాకపోతే మాకు ఈ శాంతి ఉద్యమంతో పనిలేదు" అని మాజీమంత్రిగారివలే ఎవరన్నా అనవచ్చు వారు, నేను ముందే అన్నట్టు, ఉన్న శాంతి ఉద్యమాన్ని బలపరచలేక పోయినవారు మాత్రమే అవుతారుగాని, యుద్ధప్రమాదాన్ని ఆవగింజంత అయినా అరికట్టిన వారు మాత్రం కాజాలరు

ఇక వివిధ దేశాలలోని శాంతి ఉద్యమాలను రష్యా "సామ్రాజ్య కాంక్ష"తో సమంచేసి మాట్లాడే వారున్నారు వీరు ఒక విషయం గమనించటంలేదు అదేమిటంటే-

రష్యా ప్రతిదేశంలోనూ కమ్యూనిస్టు శక్తులను రెచ్చగొట్టి సంఘర్షణలు రేపి, రక్తపాతం సాగించి ఒక్కొక్క దేశాన్నే తన బుట్టలో వేసుకుంటున్నదనీ, ఈ దేశాల కన్నిటికీ రహస్యంగా రకరకాలుగా సరుకూ, సలహాలూ సరఫరా చేస్తున్నదనీ ఒకవంక ప్రచారం జరుగుతూంటే, మరొకవంక రష్యాపై ఇంకొక ప్రచారంకూడా జరుగుతున్నది రష్యా ప్రతిదేశంలోనూ సంఘర్షణలనురేపి తాను చూస్తూ ఊరుకుంటుంది‌ః తన పక్షంవారికి సహాయం చెయ్యదు తనను నమ్ముకున్నవారిని నడి సముద్రంలోకి నెట్టితానూ దూరంగా నుంచుంటుంది ఈ ఆరోపణ ఉత్తర కొరియా విషయంలో అనేక పత్రికల ద్వారా జరిగింది ముందు రష్యాయే ఈనాటకమంతా ఆడించిందన్నారు, రష్యా ఉత్తర కొరియాకు రహస్యంగా సహాయం చేస్తున్న దన్నారు 1950లో తయారైన రష్యను తూటాలు దొరికాయన్నారు, ఉత్తర కొరియా టాంకుల్లో రష్యావాళ్ళ మొహాలు కనపడ్డాయన్నారు ఆ తరవాత ప్రచారం తనకు తానే ఎదురు తిరిగింది ఉత్తర కొరియాను దురాక్రమణకు పురిగొల్పి రష్యా అమెరికా బలంచూసి జడుచుకుని ఉత్తర కొరియన్లను వదిలిచూస్తూ ఊరుకున్నదన్నారు ఈసారి దెబ్బతో రష్యాకు బుద్ధి వచ్చిందనీ, ఇక ఎన్నటికీ రష్యా ఎవరినీ దురాక్రమణకు పురిగొల్పదనీ, రష్యాను నమ్మిన ఉత్తర కొరియాకు కనువిప్పయిందనీ అన్నారు కాని ఈ ప్రచారానికి పరమార్థంలేదు రష్యా పరోక్షంగా ఇతర దేశాల్లో సాగించబోయే దురాక్రమణను అణచటానికే పెట్టుబడిదారీ దేశాలు తమ ధనాన్నంతా మారణహోమంలో ఆహుతిచేస్తూ ఆర్థికంగా అష్టకష్టాలనూ ఎదుర్కొంటున్నాయి! ఉత్తర కొరియనులు చూపించే పశ్చాత్తాపం ఇప్పటివరకూ డగ్లస్ మెకార్థర్ సేనాని ఖచ్చితమైన గెలుపురూపంలో చూడనేలేదు!

ఉన్న సంగతేమంటే రష్యా తనకుతానై యుద్ధం చేయబోవటంలేదు కొంతకాలంకింద నేను మాట్లాడిన ఒక రష్యన్ రాయబార వర్గీయుడు, "మా సరిహద్దులో బాంబులు పడితేనేగాని మేం యుద్ధానికి దిగం నూరారైనా మా పద్ధతి మారదు" అన్నాడు ఒకవేళ ఉత్తర కొరియనులు, రష్యా తోడ్పడకపోతుందా, చైనా తోడ్పడకపోతుందా అన్న ధైర్యంతో యుద్ధానికి దిగి ఉంటే వారికేనాడో కనువిప్పు కలిగిఉండాలి అమెరికన్ సేవలు యాలూనదిదాకా వచ్చేదాకా ఒక్కచైనా కమ్యూనిస్టు ఉత్తర కొరియాకు తోడురాలేదు ఇవాళ చైనా కమ్యూనిస్టు సైనికులు ఉత్తర కొరియా యుద్ధరంగంలో పోరుతున్నారంటే దానికి కారకుడు డగ్లస్ మెకార్థరని ఇండియా,

అరబ్, ఆసియాదేశాలూ, ఫ్రెంచి, బ్రిటిషు కాబినెట్‌లవారూ బహిరంగంగా గుర్తించారు అమెరికా ఒత్తిడి తెచ్చి బక్కచిక్కిన దేశాల మీద చైనా దురాక్రమణ చేసిందని అనిపించినంత మాత్రాన డగ్లస్ మెకార్థర్ కొరివితో తల గోక్కున్నమాట అబద్ధమైపోదు

రష్యామీద దెబ్బకొట్టకుండా రష్యాను యుద్ధంలోకి దింపాలంటే అమెరికాకు ఒకటే మార్గం ఉంది– చైనాను దెబ్బకొట్టడం, ఇవాళ ఆ రెండు దేశాలమధ్యా పరస్పర రక్షణ సంధి ఒకటున్నది ఉత్తర కొరియాతో రష్యాకు అటువంటి సంధి లేకపోయినప్పటికీ ఇటీవల స్టాలిన్ ఉత్తర కొరియాకు సహాయం వాగ్దానం చేసి ఉన్నాడు

ఉత్తర కొరియాను అమెరికన్ విమానాలు ప్రేతభూమి చేసేస్తుంటే చూస్తూ ఊరుకున్న రష్యా తనకు తానై యుద్ధ దురాక్రమణ ఏ దేశంమీదనైనా చేస్తుందని ఊహించటం సాధ్యం కాదు కేవలం ప్రచారంకోసం ఏది చెప్పినా చెల్లుతుంది తమ రాబడిలో మూడు వంతులు యుద్ధానికి ధారపోసే అమెరికాను ఒక వంతు కూడా ఖర్చుచెయ్యని రష్యామరి నాలుగేళ్ళలో కబళించటానికి సిద్ధమవుతుందంటే అర్థమేముంది? ఇవాళ రష్యా ఎందుకు దండెత్తిరాదు అనే దాన్ని సమర్థించటానికి ఈ ప్రచారం ఉపయోగిస్తుంది

అమెరికా తనపై దురాక్రమణ చెయ్యటానికే తనచుట్టూ అంతులేని సైనిక, నౌకా విమాన స్థావరాలు సంపాదిస్తున్నదని లోకానికి హెచ్చరికచేస్తూ రష్యా తన ఆదాయంలో కనీసం మూడువంతులైనా అమెరికాను ప్రతిఘటించటానికి యుద్ధఖర్చు చెయ్యటం లేదంటే అమెరికా ఎత్తు సాగటానికి ఆర్థిక, రాజకీయ కారణా లడ్డుతగులుతాయని అనుకోవచ్చు అమెరికాకు లేనిది తనకు అంగబలం ఉన్నదనుకోవచ్చు ప్రపంచ పరిణామం తనకు అనుకూలంగా ఉన్నదనుకోవచ్చు ఏదైనా అనుకోవచ్చు అమెరికానూ పశ్చిమ రాజ్యాలనూ బలాత్కారంగా మింగజూస్తున్న దనుకోవటం ఎట్లాగో బోధపడదు

ఒక్కటి నిర్వివాదాంశం, రష్యా అవలంబించే విధానం మంచిదైనా చెడ్డదైనా రష్యాకు ప్రజలలో విశ్వాసమున్నది రష్యన్ ప్రజలను రష్యా ప్రభుత్వం కనిపెట్టి ఉండటమేకాక వివిధ దేశాలలోని కమ్యూనిస్టు పార్టీలు కూడా ప్రజలను ఒక్కక్షణం ఏమరటంలేదు చైనాలో వియత్‌నాం, కొరియాలో, జర్మనీలో, ఇటలీలో కమ్యూనిస్టు పార్టీ ప్రజల క్షేమానికి ఏ మాత్రం కూడా దూరంకాకుండా ఉండటానికి తమ విధానాలను ఎప్పటికప్పుడు సవరణ చేసుకుంటూ వస్తున్నారు ఈ దేశాలలో కమ్యూనిస్టు పంధాను కమ్యూనిస్టు వ్యతిరేకులు కూడా ఆమోదిస్తూ ఉండటం గమనించదగ్గది యుద్ధం కోరని ఏవర్గమైనా సరే ఆమోదించే విధానాలను యూరోపియన్ కమ్యూనిస్టులు బలపరుస్తున్నారు తూర్పు జర్మనీని రష్యనులు బలవత్తరంగా చేసిపెట్టారని పశ్చిమ రాజ్యాలవారు చేసిన ఆరోపణకు సమాధానంగా, “మీరు మాతో కలవండి” అని తూర్పు జర్మనీవారు పశ్చిమ జర్మనీని అడిగారు తటపటాయిస్తున్నది పశ్చిమజర్మనీ ప్రభువులు–ప్రజలు కారు ఆ విధంగానే ఇటలీ కమ్యూనిస్టు నాయకుడు ఇటలీ ప్రభుత్వాన్ని, “యుద్ధ ప్రసక్తి మానితే మీ ప్రభుత్వాన్ని బలపరుస్తాం” అని హెచ్చరించాడు ప్రపంచమంతటా గల కమ్యూనిస్టు పార్టీలు ఈ విధంగా నిజమైన యుద్ధ విముఖులనూ, శాంతికాముకులనూ, తమ పక్షాన కూడగట్టుకుంటున్నారు ఇదంతా ప్రపంచ శాంతిని విధ్వంసం చెయ్యటానికే ననటం కన్న ఆత్మవంచన ఉండదు

ప్రపంచశాంతికీ, కమ్యూనిస్టు పార్టీలకూ, రష్యాకూ గల సంబంధమూ, యుద్ధ యత్నాలకూ, అమెరికాకూ, అమెరికా పక్షం చేరి అమెరికా ఒత్తిడికి గురి అవుతున్న ప్రభుత్వాలకు గల సంబంధమూ క్రమంగా ప్రపంచమంతటా గుర్తించబడుతున్నది యుద్ధ యత్నాలకు అధిక ప్రతిబంధకాలు వేరే ఉన్నప్పటికీ రాజకీయ ప్రతిబంధకం ప్రస్తుతం, ఇదే "ప్రపంచ శాంతి భంగమయే పక్షంలో అమెరికా వల్ల అవుతుంది గాని రష్యావల్లకాదు" అని విజయనగరం పత్రిక "పీపుల్స్ వాయిస్" అన్నది ఇదేమాట బ్రిటనులోని కమ్యూనిస్టేతరులూ, ఫ్రాన్సులోని కమ్యూనిస్టు వ్యతిరేకులూ కూడా అంటున్నారు

ఈ పరిస్థితులలో మన కేంద్ర ప్రభుత్వం ప్రభుత్వోద్యోగులు శాంతి ఉద్యమంలో పాల్గొన రాదని తాఖీదు పంపటం చాలా శోచనీయం ఒకవంక నెహ్రూ ప్రపంచశాంతి బలపరచటానికి చేసే యత్నాలు ప్రపంచమంతటా గుర్తించబడుతున్నాయి ఎక్కడెక్కడినుంచో మేధావులు ఆయనకు అభినందనలు తెలిపారు అటువంటి స్థితిలో ఇండియాలో శాంతి ఉద్యమం ప్రజోద్యమం అవుతుందని ఇండియా ప్రభుత్వం భయపడటంకన్నా విషాదకరమైన విషయంలేదు శాంతి అచ్చగా కాంగ్రెసు మంత్రులకు మాత్రమే లాభించదు ప్రజల సహాయం లేకుండా ఉంటే ప్రభుత్వం శాంతిని మరింత బాగా కాపాడ గలుగుతుందనుకోవటం కేవలం వెర్రి

కమ్యూనిస్టులు మనదేశంలో శాంతి ఉద్యమానికి తామే పెత్తనంవహించి దాన్ని పాక్షికంగా నడప యత్నించే పక్షాన అది కమ్యూనిస్టులను బలపరుస్తుంది శాంతిని సాధించలేదు అది జరిగి పోతుందని భయపడేవారు దానికి దూరంగా నిలబడక వివిధవర్గాలను ఉద్యమంలో ప్రవేశపెట్టినట్టయితే శాంతి ఉద్యమం సర్వతోముఖంగా నడవటమేగాక అన్ని వర్గాలకూ అనుకూలించే ఫలితాలనుకూడా ఇస్తుంది ప్రపంచ శాంతికి గొప్ప ఉపద్రవం కలుగుతున్న ఈ తరుణంలో ప్రజలు తప్పుడు సిద్ధాంతాలను అవలంబించటమూ, రాజకీయ వివేచన కోల్పోవటమూ ప్రమాదకరమైనది

తెలుగు స్వతంత్ర వారపత్రిక, 13-4-1951

# 25. కమ్యూనిజం భవిష్యత్తు

కార్ల్‌మార్క్స్ శాస్త్ర పద్ధతులపై క్రోడీకరించిన కమ్యూనిస్టు సిద్ధాంతాలు ఆర్థిక విప్లవ భావాలు కలిగే ఉండటంచేత ధనిక వర్గాలనూ, సాంఘిక విప్లవ భావాలతో కూడుకొని ఉండటంచేత ఇతర వర్గాలనూ కూడా మొదట భయపెట్టాయి ఈ సిద్ధాంతాలకు అనుగుణమైన రాజకీయ-సాంఘిక-ఆర్థిక వ్యవస్థ రష్యాలో ఏర్పడ్డ తరువాత కూడా మిగిలిన ప్రపంచం కమ్యూనిజమును ఒక విధమైన మతంగానూ, ప్రపంచ ప్రజా జీవితంలో దానికి ఏ విధమైన స్థానమూ లేనట్టుగానూ వ్యవహరించటానికి ప్రయత్నించింది కమ్యూనిస్టు సిద్ధాంతాలను అవలంబించిన రష్యా బలపడుతున్న కొద్దీ అది ప్రపంచ నాగరికతకు మరింత ప్రమాదకర మవుతున్నదన్న ప్రచారం సాగించటానికి అవకాశం బలపడిందేగాని దానితో ప్రపంచ దేశాల కుండదగిన సంబంధం రుజువయింది కాదు సామ్రాజ్యవాదుల ఇనప పాదాల క్రింద నలిగే మన దేశంలాంటి దేశాలలో కొద్దిమంది అయినా పని పెట్టుకుని కమ్యూనిస్టు సిద్ధాంతాలను పరిశీలించటానికి అవకాశం చిక్కిందంటే అది 1930 అనంతరం ఏర్పడిన ప్రపంచ కాటకం మూలానే

ప్రపంచ కాటకం కొద్దిమంది సూక్ష్మబుద్ధులకు కమ్యూనిస్టు సిద్ధాంతాలపై విశ్వాసం పూర్తిగా కలిగించినాః అది రష్యా యొక్క విలక్షణతను మరింతగా రుజువు చేసింది ఏమంటే పెట్టుబడిదారీని ఆమోదించిన అన్ని దేశాలనూ బాధించిన ఈ కాటకం రష్యాను బాధించలేదు

ఈ విధంగా, రెండో ప్రపంచ యుద్ధం వరకూ కమ్యూనిజమంటే ఎక్కడో రష్యాలో అమలులో ఉండే సిద్ధాంతంగానూ, విధానంగానూ ప్రపంచంలోని సామాన్య ప్రజలదృష్టికి కనిపిస్తూ వచ్చింది ప్రతి దేశంలోనూ స్థానిక కమ్యూనిస్టు పక్షాలున్నప్పటికీ వారు కూడా పెడగానే ఉన్నట్టు కనపడేవారు ఈ కమ్యూనిస్టుల నినాదాలు వేరు, వారి పరిభాష వేరు చారిత్రకావసరాలను బట్టి నడిచే దేశీయోద్యమాలలో వారు పాత్ర వహిస్తున్నప్పటికీ వారికా ఉద్యమాలపై ఎట్టి ఆసక్తీలేదనీ, ఎప్పటికైనా ఈ కమ్యూనిస్టులు రష్యాకోసం దేశ ద్రోహం చేస్తారని, వీరి కనీస ఆశయం రక్తయుత విప్లవంతో బాటు అరాజకం తెచ్చిపెట్టటమనీ సామాన్య ప్రజలు భావించేవారు కనీసం ఇటువంటి భావాలు ప్రజలలో సులభంగా ప్రచారమయ్యేవి ఆ ప్రచారాన్ని ప్రజలు నమ్మదగిన స్థితిలో ఉండేవారు

రష్యాకూ మిగిలిన ప్రపంచానికి మధ్య నిజమైన ఇనుపతెర ప్రపంచ యుద్ధానికి ముందే ఉండేది రెండవ ప్రపంచ యుద్ధంలో అది తొలగిపోయి, రోజూ పత్రిక చదివే ప్రతివాడికీ రష్యాను గురించి బోలెడన్ని వివరాలు తెలుస్తూ, బోలెడన్ని రష్యను పత్రికలూ, రష్యా వార్తలూ వస్తూ, ఇతర దేశస్థులు అసంఖ్యాకులు రష్యాకు వెళ్ళి పర్యటించుతూ, అంతర్జాతీయ సంస్థలలో రష్యా ప్రతినిధులు పాల్గొంటూ ఉండే సమయంలో చర్చిల్ ఈ ఇనపతెర అనేదాన్ని సృష్టించాడు దాన్ని రష్యా వ్యతిరేక ప్రచారంలో పెద్ద మోతాదు వాడుతున్నారు కాని అసలు ఇనపతెర పోయేదాకా ఈపదం సృష్టి కావలసిన అవసరం కలగలేదని మనం గుర్తించాలి

రెండవ ప్రపంచ యుద్ధంతో కమ్యూనిజం ప్రపంచ ప్రజలకు సన్నిహితంగా వచ్చిందనటానికి సందేహంలేదు యుద్ధంలో కమ్యూనిజం ధనిక వర్గాలకంటే చాలా బలంగా ప్రజాశక్తుల పక్షాన నిలబడింది రష్యాకు పోటీగా హిట్లరును మేపి బలవపెట్టి, మొగ్గగా వున్నప్పుడే హిట్లరును తుంచటానికి రష్యాచేసిన ప్రయత్నాలన్నిటినీ భగ్నంచేసిన ధనికవర్గాలు చిట్టచివరకు రష్యా సహాయం లేకుండా జర్మనీ జపానులను ఓడించలేకపోయినారన్న విషయం వర్తమాన రష్యా వ్యతిరేక ప్రచారంలో కప్పిపుచ్చబడుతూఉన్నా యుద్ధకాలపు ప్రకటనలలో బాహాటంగా గుర్తించబడింది ఈ యుద్ధంలో కమ్యూనిజం గొప్ప ప్రపంచ ప్రమాదాన్ని ప్రపంచ ప్రజల పక్షాన ప్రతిఘటించటమేకాక పెట్టుబడిదారీ ప్రజాస్వామికంతో చేతులు కలిపింది ఫాసిజమూ కమ్యూనిజమూ సుందోపసుందులల్లే పరస్పర విధ్వంసం చేసుకుంటాయని పెట్టుబడిదారీ ప్రజాస్వామికవాదులైతే ఆశించారుగాని కమ్యూనిజం పెట్టుబడిదారీ ప్రజాస్వామికం ఏదోవిధంగా నాశనమైతే బాగుండునన్న ఆశను ఏమాత్రమూ ప్రకటించలేదు పైపెచ్చు పెట్టుబడిదారీ ప్రజాస్వామికం ఫాసిజంతో చేతులు కలుపుతున్న కాలంలోనే ఆ విధానంలో ప్రమాదమున్నట్టు నెత్తీ నోరూ బాదుకుని ఘోషపెట్టింది కమ్యూనిజమూ, పెట్టుబడిదారీ దేనిమానాన అది ఉండవచ్చునని స్టాలిన్ అన్నది కేవలం నినాదం కాదు రష్యా ఆ సిద్ధాంతంపైనే రెండవ ప్రపంచ యుద్ధంలో పాల్గొన్నది

రెండవ ప్రపంచయుద్ధం అనంతరం కలిగిన ప్రపంచ రాజకీయ పరిణామాలుకూడా ఇదే ధోరణిలో ఉండటం గమనించదగినది యుద్ధానంతరం అనేక యూరప్ దేశాలలో ప్రజలు సోషలిస్టు సిద్ధాంతాలను బలపరిచారు ధనిక వాదం బాహాటంగా సామ్రాజ్యతత్వాన్ని ఆశ్రయించటం మానేసి రహస్యంగా సోషలిస్టు తత్వాన్ని ఆశ్రయించి కమ్యూనిజం యొక్క పురోగమనాన్ని అరికట్ట యత్నించవలసి వచ్చింది

ఇక వలస పరిపాలనతో అణగదొక్కబడి ఉంటూ వచ్చిన దేశాలలో కమ్యూనిజం ప్రత్యక్షంగానే జాతీయోద్యమాలను ముందుకు తీసుకుపోవటమూ, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలలో కమ్యూనిస్టేతర జాతీయ విప్లవవర్గాలతో కలిసి పనిచెయ్యటమూ మొదలైన పనులు సాధించింది

ఇవాళ ప్రపంచమంతటాకూడా కమ్యూనిజం ఒక కొత్త పంథా తొక్కుతున్నది అంతర్జాతీయ సమస్యలన్నిటిలోకీ యుద్ధభయం అతి ప్రధాన స్థానం ఆక్రమించుతున్నది ఈ కమ్యూనిస్టులు చేతులు కలిపి ఆ భయం తొలగించటానికి సిద్ధపడుతున్నారు

కమ్యూనిజముకు ఇతరవర్గాలతో గల సంబంధంలో కలిగే ఈ పరిణామం చాలా ముఖ్యమయినది ఇందులో ప్రధానంగా గమనించవలసిన సంగతి ఏమంటే ప్రపంచ రాజకీయ రంగంలో కమ్యూనిజం తనకు గల సంబంధాలను పెంపొందించుకుంటున్నది ఇవాళ కమ్యూనిజం వివిధ దేశాలలో నిర్వహించే రాజకీయపాత్రను పరిశీలించి, "ఇది మిగిలిన సిద్ధాంతాలన్నిటినీ కబళించే మహాశక్తి" అనే భావం ఎవరూ ప్రకటించలేదు రష్యాలో కొద్దిమంది కమ్యూనిస్టులు సర్వాధికారాలూ తమ చేత చిక్కించుకుని ప్రతికక్షులను తల ఎత్తనివ్వకుండా అణచిపెట్టి పరిపాలిస్తున్నారని అనగల వారు చైనాలో కమ్యూనిస్టులను చూచి ఈ మాట అనలేకుండా ఉన్నారు కమ్యూనిజం రష్యాలో నిర్వహించిన పాత్రే చైనాలో నిర్వహిస్తుందనుకో వలసి వస్తే అది అచ్చుగా శ్రామిక వర్గాలనేగాక పెట్టుబడిదార్లనూ, మేధావులనూ, అసంఖ్యాకులైన సైనికులనూ కూడా మభ్యపెట్టి చైనా కమ్యూనిజం సాధిస్తున్నది ఏమంటే జాతీయ పునర్నిర్మాణమూ, జాతీయ వికాసమూనూ!

రెండు ప్రశ్నలకు మనం సమాధానం చెప్పుకోవాలి యుద్ధభయం ఎట్లా ఏర్పడుతున్నది? అది ఎవరికి ఏర్పడుతున్నది?

రష్యాదేశం ప్రపంచంలోని కమ్యూనిస్టు ప్రభుత్వాలనూ, వివిధ దేశాలలోని కమ్యూనిస్టు పార్టీలనూ సహాయంగా తీసుకుని ప్రపంచాన్ని కబళించ జూస్తుండటం వల్ల ప్రపంచ యుద్ధం ఏర్పడుతున్నదని ప్రచారం జరుగుతున్నది ఇది పైన వివరించిన పరిణామానికి పూర్తిగా విరుద్ధం కమ్యూనిస్టు పక్షాలు ఇతర పక్షాలను పూర్వం ఉన్నంత దూరాన ఈ నాడు ఉంచటం లేదు రాను రాను కమ్యూనిస్టు పక్షాలు విస్తృత ప్రజోద్యమాల తోనే సహకరిస్తూండటం చేత బతికించే విధానం అంత కంతకూ వెనకబడుతున్నదిగాని పెరగటంలేదు

కమ్యూనిజం ప్రపంచ ప్రజలకు సన్నిహితంగా వస్తున్నందుకు ప్రజా సామాన్యం దాని మీదగల అపోహలను తొలగించుకోవలసిన దశలో కమ్యూనిజం ఎక్కడ తల ఎత్తినా కొట్టేయాలని అమెరికా బ్రిటను, ఫ్రాన్సు వగైరా దేశాలలోని పాలకులు భావించటమూ, ఆ భావన ఆధారంగా యుద్ధ ప్రయత్నాలు చేయటమూ జరగటం చేతనే యుద్ధ ప్రమాదం ఏర్పడుతున్నది

రెండో విషయంః రష్యా శాంతి కొరకు కృషిచేస్తూంటే అది కపటమనీ, అసలు ప్రపంచ శాంతికి భంగం కలిగించే చర్యలన్నీ రష్యాయే చేస్తున్నదనీ ప్రచారంసాగించారు శాంతికోసమే అమెరికా, బ్రిటను, ఫ్రాన్సు వగైరా దేశాలు అంతులేని స్థావరాలు సంపాదించి యుద్ధయత్నాలు సాగిస్తున్నట్టు కూడా ప్రచారం జరుగుతున్నది ప్రపంచ యుద్ధమంటే భయం రష్యా మొదలైన దేశాల కెక్కువవుంటుందా, యుద్ధ యత్నాలవల్ల ఆర్థికంగా లాభాలు గడించే వారికెక్కువ ఉంటుందా అని మనం ఆలోచించుకోవచ్చు ఇప్పటికే అమెరికా బ్రిటనులో యుద్ధ యత్నాలలో పాల్గొనే వారి లాభాలు ఎట్లా పెరిగి పోతున్నదీ మనం చూడగలుగుతున్నాం ఈ లాభాలు పొందే వర్గాల వారే తమకు కావలసినది శాంతి అనటం కంటే హాస్యాస్పదమైన విషయం ఉండబోదు యుద్ధ భయంలేక పోగా యుద్ధం అత్యవసరమై ఉన్న ఈ వర్గాన్ని తప్ప మిగతా అన్ని ప్రజా వర్గాలతోనూ చేతులు కలపటానికి కమ్యూనిజం శాంతి ఉద్యమాన్ని నడుపుతూ ఉంటే అందుకు కమ్యూనిజమును అభినందించకపోగా కమ్యూనిజంతో కలిసి శాంతి సాధించే కన్న యుద్ధ ప్రమాదాన్ని వాంఛించే వారు కూడా ఉన్నారు! కమ్యూనిజం ఒక విలక్షణమైన శక్తిగా ఉన్నప్పుడు దాన్ని నిర్లక్ష్యంగా చూసి అది తమకన్న ఎన్నో రెట్లు సంఖ్యలు గల ప్రజావర్గాలతో చేతులు కలుపుతున్నప్పుడు అది విజృంభిస్తున్నదని ఆక్రోశించే వారున్నారు ఇటువంటి అయోమయపు ఆక్రోశాలవల్లనే ప్రపంచ వినాశకుల భాష నాశనానికి గురి అయ్యే వారినోట వినిపించటం జరుగుతున్నది

ఈ పరిణామం మరి కొంత దూరం సాగినట్టయితే ప్రపంచ యుద్ధం తప్పక అనివార్యం కావటమేకాక కమ్యూనిస్టు ప్రమాదం అన్న ముక్కకు అర్థమే లేకుండా పోతుంది ఈ శాంతి ఉద్యమం నడిచినకొద్దీ కమ్యూనిస్టు శక్తులకు అన్ని రకాల ప్రజాశక్తులతోనూ సమగ్ర సామరస్యం ఏర్పడక తప్పదు

తెలుగు స్వతంత్ర వారపత్రిక 11-5-1951

## 26. నేటి అమెరికాలో వ్యక్తి స్వాతంత్ర్యం

జనసామాన్యానికి కమ్యూనిజమంటే అందరికీ పని చేసుకునే హక్కూ, అనర్గళ ఉత్పత్తీ, పంచవర్ష ప్రణాళికలూ స్ఫురిస్తాయి నెహ్రూకు కమ్యూనిజంలో వ్యక్తి స్వాతంత్ర్యం లేకపోవటం కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది గతనాలుగైదు సంవత్సరాలలో నెహ్రూ ఈ మాట చాలాసార్లు అని ఉన్నాడు

మామూలు ప్రజలకు వ్యక్తి స్వాతంత్ర్యం ఎట్లా ఉంటుందో తెలియదు ఎందుకంటే వారి జీవితాలలో అది ఉండదు అనేక ఆర్థిక సాంఘిక పరిస్థితులు వారి భావాలనూ, చేతలనూ అరికడతాయి నెహ్రూవంటి అసాధారణ వ్యక్తులకుకూడా ఎంతవ్యక్తి స్వాతంత్ర్యం ఉందో చెప్పటం కష్టం కాంగ్రెసు విచ్ఛిత్తిని దూరంగా ఉంచటానికని నెహ్రూ తన కిష్టం లేనివారి పొత్తు ఆమోదిస్తున్నాడు, తన కిష్టమైన సిద్ధాంతాల విషయంలో కూడా రాజీపడుతున్నాడు అయితే ఒకటిమాత్రం చెప్పవచ్చుః బుద్ధి పూర్వకంగానూ, సమష్టి లాభాన్ని ఆలోచించి తనకు సమ్మతంగాని విధానాలనూ, నిర్ణయాలనూ ఆమోదించేవాడు వ్యక్తి స్వాతంత్ర్యాన్ని కోల్పోయినవాడు కాడు అందుచేత నెహ్రూ స్వతంత్రుడే ఇటువంటి స్వాతంత్ర్యం

కమ్యూనిజంకింద లేదని నెహ్రూ విశ్వాసం ఆయన విశ్వాసానికి గల కారణాలు ఆయనకు తెలిసే ఉంటాయి కాని పెట్టుబడిదారీ కింద వ్యక్తిస్వాతంత్ర్యం ఉన్నదని నెహ్రూ అభిప్రాయమైతే అదిమటుకు చాలా పొరపాటు అభిప్రాయం

పెట్టుబడిదారీ కింద వ్యక్తి స్వాతంత్ర్యానికిఅవకాశం లేదు, ఎందుకంటే అక్కడ వ్యక్తి సమష్టి లాభాలను గురించి ఆలోచించే అవకాశమేలేదు అది వర్గవ్యవస్థ (వర్గరహిత మిశ్రమ ఆర్థిక విధాన శ్రేయో రాజ్యవ్యవస్థ ఇకముందు కాంగ్రెసు ఆధ్వర్యాన భారత పుణ్యభూమిలో అవతరించవలసి ఉన్నది ఇంతవరకు భూప్రపంచంలో అది ఎక్కడాలేదు) వర్గవ్యవస్థలోపై వర్గంవారి లాభాలే కింది వర్గంవారి జీవితాలను నిర్ణయిస్తాయి ఈ వ్యవస్థలో ఒక జమీందారుగారు, "వ్యావహారికభాష ఆమోదించే వారికి డబ్బివ్వను" అనవచ్చు "మార్క్సు సిద్ధాంతాలలో నీకు విశ్వాసం ఉంటే మరొక చోట పని చూసుకో" అని యజమాని ఉద్యోగితో అనవచ్చు "తమరు బీదవాళ్ళ కష్టాలను గురించి రాయదలిస్తే మా పత్రిక్కి పంపకండి," అని పత్రికాసంపాదకుడు అనవచ్చు ఎందుకంటే జమీందారుగారి డబ్బు, యజమాని ఆఫీసు, సంపాదకుడి పత్రిక! పెట్టుబడిదారిలో ఆయా వ్యక్తులకు ఆ మాటలనే అధికారం ఉంది వాళ్ళకా అధికారాలు పోయిననాడు పెట్టుబడిదారీ వ్యవస్థే లేదు వర్గ వ్యవస్థలో వ్యక్తి స్వాతంత్ర్యం నిజంగా అనుభవించేవారు ఉద్యోగా లివ్వగలవారూ, జైళ్ళకు పోవటానికీ, తుపాకులను ఎదిరించటానికీ సిద్ధంగా ఉన్నవారూ మాత్రమే మిగిలిన వాళ్ళు వర్గ వ్యవస్థ పోవాలనే ధోరణిలో వారే కమ్యూనిజం కింద సామాన్య ప్రజల వ్యక్తి స్వాతంత్ర్యం పెరగడం ప్రత్యక్షంగా కనిపించక పోవచ్చుగాక, కాని సమష్టి లాభంకోసం తమ స్వాతంత్రాన్ని పరిమితం చేసుకుంటున్నామన్న తృప్తీ, దాని ఫలితాలు తమకు ఏదో రూపంలో తిరిగి వస్తాయన్న తృప్తీ వారికుంటుంది కూలివాడి శ్రమ శక్తినీ, రాతగాడి రచనాశక్తినీ, కళాకారుడి కళాశక్తినీ, మేధావి మేధశ్శక్తినీ డబ్బుకు కొని, వారి విశ్వాసాల నన్నిటినీ అణచి, అల్ప సంఖ్యాకులు మాత్రమే అధిక లాభాలు పొంది తమకు ఈ లాభాలు చేకూర్చేవారితో పని అయిపోయిన మరుక్షణం వీధిలోకి నెట్టేసే పరిస్థితిలో ఎక్కువ వ్యక్తి స్వాతంత్ర్యం ఉన్నదని ఎవరూ అనలేరు

కమ్యూనిస్టు రష్యా, కమ్యూనిస్టు చైనా, తూర్పుయూరపు రాజ్యాలలో అసంఖ్యాక ప్రజలకు వ్యక్తి స్వాతంత్ర్యం లేనందుకు నెహ్రూ విచారిస్తేమనం సంతోషించవలసిందే కాని నెహ్రూ అమెరికా ప్రజలను చూసికూడా కాస్త కంటతడిపెట్టరాదా? అమెరికాలో "అనమెరికన్" చర్యల విచారణ ధోరణి చూస్తే ఇకముందు అక్కడి కళాకారులకు పౌరసత్వాలుండే అవకాశాలు కనిపించటం లేదని జాన్ బెన్సన్, "న్యూస్టేట్స్‌మన్ అండ్ నేషన్" పత్రికలో రాశాడు

"అనమెరికన్" చర్యల విచారణలో హాజరు కావలసిందని ఎవరికైనా తాఖీదు వెళ్ళిందో వాడు కమ్యూనిస్టుగాని, సానుభూతిపరుడుగాని, స్వాతంత్ర్యంలో విశ్వాసంగలవాడుగాని, శాంతి కాముకుడు గాని , పౌరసత్వవాదిగాని అయిఉండాలని ప్రజలు తలపోస్తారు" అని జోస్‌ఫెడర్ అన్నాడట అధికారులదృష్టిలో ఇవన్నీ విద్రోహక చర్యలేనని ప్రజలకు తెలుసు ఇవే కాదు, విద్రోహక చర్యల విచారణలో హాజరు పెట్టినవారిలో, పెర్ల్ హార్బరు ఉదంతానికి పూర్వం జపానుకు ముడి ఇనుము అమ్మరాదన్న వారూ, యూదు వ్యతిరేకోద్యమాలను ప్రతిఘటించిన వారూ, నీగ్రోలపై హింసాకాండను గర్హించేవారూ, నాజీ వ్యతిరేకోద్యమాలు నడిపినవారూ,

ఫ్రాంకో వ్యతిరేకులూ, పౌరస్వాతంత్ర్యాలను బలపరిచేవారూ ఉన్నారు ఈ విచారణ అనంతరం వీరు న్యాయస్థానాలలో విచారించబడవచ్చు వీరికున్న ప్రభుత్వోద్యోగాలు ఊడవచ్చు స్కూళ్ళలోనూ, కాలేజీలలోనూ ప్రవేశం దొరక్కపోవచ్చు ఇతర ఉద్యోగాలు కూడా దొరక్కపోవచ్చు

ప్రస్తుతం అమెరికాలో గల వ్యక్తి స్వాతంత్ర్యం ఫలితంగా వందలకొద్దీ విదేశీయులు అమెరికా నుండి పంపివేయ బడుతున్నారుః ఉపాధ్యాయులూ, లెక్చెరర్లూ, మామూలు పౌరులూ నోళ్ళు కట్టేసుకుంటున్నారు రేడియో వ్యాఖ్యాతలలో "మితవాదు" లందరికీ ఉద్వాసన చెప్పారు ఈ వేట పుస్తకాలకూ సినిమాలకూ కూడా వ్యాపించింది ప్రఖ్యాత సినిమా స్టేజినటుడు జాన్ గార్ ఫీల్డ్ అనమెరికన్ చర్యల విచారణలో సంజాయిషీకి పిలవబడ్డాడు యుద్ధకాలంలో అతను రష్యాను ప్రశంసించాడని ఆరోపించబడింది ప్రపంచ నాగరికత ఎర్రసేనమీద ఆధారపడి ఉన్నదని జనరల్ మెకార్థరే అన్నాడు గదా అని సమాధానమిచ్చాడు గార్‌ఫీల్డ్ గార్‌ఫీల్డ్‌తో తీయవలసి ఉండిన "హి రాన్ ఆల్ ది డే" అనే చిత్రాన్ని చిత్రనిర్మాతలు సంక్షేపించుకున్నారు దీనికి కథ రాసినవారిద్దరూ అనమెరికన్ కమిటీ ముందు సంజాయిషీ ఇచ్చుకున్నవారే! రోసెలినీ తయారుచేసిన "ది మిరకిల్" అనే చిత్రం నిషేధించబడింది నిషేధించమని అడిగినవారు కేథలిక్ పెద్దలు అమెరికాలో స్వేచ్ఛాభావ ప్రకటన అంతరించింది ఆలోచనలే ప్రమాద కరమైనవి "వినోద" రంగంలో (నాటకాలు, సినిమాలు) భీతి వ్యాపించింది

"కుళ్ళు" కడిగేసుకోవటానికి అందరూ ఆత్రపడుతున్నారు పుస్తకాలు ప్రచురించే వారు ప్రత్యేక కమిటీని నియోగించారు-ఏది ప్రచురించవచ్చునో, ఏది ప్రచురించరాదో తెలపటానికి! ఆధ్యాపకులు కొత్త ప్రమాణాలు చేయవలసి వచ్చింది కాలిఫోర్నియా విశ్వవిద్యాలయం ఒక సంవత్సరంపాటు అధ్యాపకులను పురుగేరింది కొందరు విశ్వవిద్యాలయం వదిలి వెళ్ళిపోయారు అమెరికా అంతటా కాలేజీ విద్యార్థులలో భయమూ, నిస్పృహ ఏర్పడ్డాయని "న్యూయార్క్ టైమ్స్" పత్రిక, తాను జరిపిన అన్వేషణ ఫలితంగా తెలుసుకున్నది

ఇదంతా ముందుగా ప్రారంభమయింది హాలీవుడ్‌లో కాని అనమెరికన్ కమిటీవారు రేడియో, టెలివిజన్, బ్రాడ్వే (నాటకాలు) శాఖలలో కూడా విచారణకు ఉత్తరువు ఇచ్చారు దయ్యాలవేట సాగుతున్నది శరణార్థులకు గాని, అనాథ నీగ్రో బాలబాలికలకు గాని ఏయే నటులూ, రచయితలూ సహాయ పడుతున్నారు అని ఆరాలు తీస్తున్నారు "విద్రోహకుల" జాబితాలు తయారు చేయబడ్డాయి ఈ జాబితాలకు ఆధారం పత్రికలలో పడే "పోచికోలు కబుర్లు",ఎవరెవరో ఎక్కడెక్కడో చేసిన ప్రయోగాలు, ఎవరెవరో పత్రికలలో ప్రచురించిన పట్టీలు ఇంతకు మించిన సాక్ష్యాలూ, ఆధారాలూ, లేవు అయినా ఈ జాబితాలు "యజమాను" లందరూ కొనుక్కున్నారు ఈ జాబితాలలో ఉండేవారికి వారు ఉద్యోగాలివ్వరు "ఈ పీడకలలో విశేషమేమంటే ఇది జయప్రదంగా సాగటమే" నంటాడు బెన్సన్

వినోద ప్రదర్శనలు జరిపేవారే భయానికి లొంగిపోయి ఒకరు ఆదేశించకుండానే చేతులు కట్టేసుకుంటున్నారు పత్రికలలో కొద్దిమంది నిరసన తెలిపేసరికి చార్లీ చాప్లిన్ చిత్రాలను టెలివిజన్ ద్వారా చూపే ప్రయత్నం మానుకున్నారు కొద్దిచోట్ల చార్లీ చాప్లిన్ చిత్రం

"మస్యూవెర్డూ"ను పికెటింగ్ చేసేసరికి దాన్ని మిగిలిన థియేటర్లు ప్రదర్శించలేదు చార్లీ చాప్లిన్ తన కొత్త చిత్రాన్ని తయారు చేయడానికి ఇంగ్లండు పోతాననే సరికి, లేని పన్ను బాకీలకింద ఇరవై లక్షల డాలర్లు డిపాజిట్ ఉంచమన్నారు! "నన్ను అమెరికా వదలి పోకుండా చేయగలిగారు" అన్నాడు చాప్లిన్ పాల్ రోబ్సన్ (ప్రసిద్ధ నీగ్రో గాయకుడు) గాన ప్రదర్శన చేయటానికిలేదు రికార్డులు అమ్ముకోటానికి లేదు ఇతర దేశాలు వెళ్ళటానికి లేదు ప్రసిద్ధనటుడు ఫ్రెడ్రిక్ మార్చ్‌కీ అతని భార్య ఫ్లారెన్స్‌కూ చాలాఏళ్లు సినిమా కంట్రాక్టులు దొరకలేదు లారి అడ్లర్ అనే హార్మోనికా వాద్యగాడి మీదా, పాల్ డ్రేపిన్ అనే నాట్యగాడిమీదా అనేక ఆరోపణలు చేశారు గాని ఒక్కటీ రుజువుకాలేదు అయినా వారు అమెరికాలో "వేట" భరించలేక ఇంగ్లండు వచ్చి ఒకూర్చున్నారు ఆర్టీషా వాద్యబృందాన్ని నియోగించి జారవిడిచారు మార్క్ కానలీ అనే రచయిత "గ్రీన్ పాశ్చర్స్" టెలివిజన్‌లో కనిపించవలసి ఉండి ఆఖరు క్షణాన "ఎత్తివేయబడ్డాడు" జీన్‌మ్యుర్ అనే ప్రసిద్ధ సినిమా స్టేజితారకు రేడియో కంట్రాక్టు ఇచ్చి రద్దుచేసింది ఆమె రష్యానూ, కమ్యూనిస్టులనూ తిట్టిపోసినా ఆ కంట్రాక్టు తిరిగిరాలేదు

ఈ వేటకు గురిఅవుతున్న వారందరి పేర్లూ బహిరంగం కావటంలేదు పికెట్ చేసేవారిని తీసుకుపోలేని ఒక స్త్రీకి ఉద్యోగం ఊడింది ఒక నటుణ్ణి తీసివేశారు– అతని భార్య "మితవాది" అయిన రేడియో వ్యాఖ్యాతకు సెక్రటరీగా వుంది!

ఈ అన్యాయానికి విరుగుడు లేదా? మాన నష్టం దావాలు వెయ్యవచ్చు– పుష్కలంగా డబ్బుంటే కాని ఇటువంటి కేసుల్లో "న్యాయం" జరిగేటట్టు చూడటానికి జూరర్లు భయపడతారు జూరర్ల పేర్లు ప్రచురణ అవుతాయి అతరవాత వాళ్ళు బతకలేరు ఇప్పుడు కొత్త పద్ధతి ఒకటి అమలులోకి వచ్చింది అదేమిటంటే మాజీ–కమ్యూనిస్టులమని ఒప్పుకున్నవారు ఇతర "విద్రోహకుల" పేర్లు "బయటపెట్టడమూ" ప్రాయశ్చిత్తం పొంది తిరిగి పనులు సంపాదించటమూనూ వారితో పోలిస్తే కేవలం ఆరోపణలు జరిగి కొట్టివేయబడినవారి పని మరింత హేయంగా ఉన్నది ఎడ్వర్డ్ జి రాబిన్సన్ ను విచారించారు అతను "విద్రోహి" కాడని తేల్చారు కాని అతని పేరు చెప్పినప్పుడల్లా సినిమా చిత్రనిర్మాతలు ఉలిక్కిపడుతున్నారు

ఇటువంటి పరిస్థితులను నెహ్రూ వంటి స్వాతంత్ర్య ప్రియుడు ఆమోదిస్తాడనేది కలలోవార్త కాని ఇదంతా కమ్యూనిస్టు వ్యతిరేకతతో ముడిపడి ఉన్నంత కాలమూ, కమ్యూనిస్టు వ్యతిరేకత ఆయన మనస్సులో గూడుకట్టుకుని ఉన్నంత కాలమూ, అందులోని హైన్యం ఆయనకు బోధపడదు ఈనాడు అమెరికాలో ఉన్న "భయం" రష్యా, చైనాలలో ఉన్నట్టు ఆవగింజంత సాక్ష్యంకూడాలేదు కాని కమ్యూనిస్టు వ్యతిరేకులకు కమ్యూనిస్టులు చేసే "హింస" మాత్రమే కనపడినట్లుగానే, కమ్యూనిజం కింద "వ్యక్తి స్వాతంత్ర్యం" లేక పోవటమే కనిపిస్తుంది కమ్యూనిస్టు వ్యతిరేకత పేరిట జరిగే పదింతల హింసనూ, వ్యక్తి స్వాతంత్ర్య నిషేధాన్నీ చూడలేని వాళ్ళు కమ్యూనిస్టుల హింసలు గురించీ, కమ్యూనిజం కింద వ్యక్తి స్వాతంత్ర్యం లేకపోవటం గురించీ నిష్పాక్షికంగా ఆలోచించ లేకపోతే అందులో ఆశ్చర్యం లేదు

అమెరికాలో జరుగుతున్నదే తక్కువ ప్రమాణంలో "కమ్యూనిస్టు వ్యతిరేక" రాజ్యాలలోనూ జరుగుతున్నది బ్రిటనులో కూడా జాబితాలు తయారుచేసే ప్రయత్నాలు జరుగుతున్నాయి "చెప్పిన మాట వినని" విలేఖరులూ, పత్రికా నిర్వాహకులూ వెళ్ళగొట్టబడుతున్నారు ఫ్రాన్సులో

కమ్యూనిస్టులకు వోట్ల ప్రమాణానికి తగ్గిన స్థానాలు వచ్చేటట్టుగా ఎన్నిక నిబంధనలు మార్చబడ్డాయి ఇండియాలో కూడా కమ్యూనిస్టుల కొరకు కొన్ని 'ప్రత్యేక సదుపాయాలు' జరిగాయి నెహ్రూకు తెలిసి జరిగిన చట్టాలమాట అటుంచి, కొన్ని పత్రికలు బహిరంగంగా ప్రజలు కొనటానికి లేకుండా స్థానిక పోలీసులు తీసుకున్న చర్యలనుగురించి వింటే నెహ్రూ ఏమంటాడో తెలియదు నెహ్రూగాని మరొకరుగాని వ్యక్తి స్వాతంత్ర్యాన్ని వ్యక్తియొక్క యోగక్షేమాల ప్రమాణం కొలవటంగా నేర్చుకున్నట్టయితే "ఇజముల" ను గురించి అసత్య ప్రచారం చెయ్యవలసిన అవసరం లేకుండా పోతుంది

తెలుగు స్వతంత్ర, వారపత్రిక, 3-8-1951

## 27.శాంతి ఉద్యమం: దాని విరోధులు

అఖిల భారత శాంతి సంఘాధ్యక్షుడు డాక్టర్ సయిాఫుద్దీన్ కిచ్లూ దక్షిణాదిని అనేక ప్రాంతాల పర్యటన చేస్తూ శాంతి ఉద్యమాన్ని గురించి క్రింది విషయాలు స్పష్టం చేశాడు

1 కాంగ్రెసు, కమ్యూనిస్టు, సోషలిస్టు, హిందూ మహాసభ, రాయిస్టు, ఫార్వర్డు బ్లాక్, ముస్లింలీగ్ వగైరా రాజకీయ సిద్ధాంతాల విభేదంగాని, హిందువులు, ముస్లిములు, సిక్కులు, పార్సీలు, క్రైస్తవులు వగైరా మత విభేదంగాని లేకుండా అందరూ కలిసే ఉద్యమం ఇది ఒక్కటే

2 కొద్దిమంది యుద్ధ తత్పరులకు తప్ప మిగిలిన ప్రజానీకాని కంతకూ శాంతి వాంఛనీయమే పెద్ద పెద్ద సేట్‌లు కూడా శాంతి ఉద్యమాల్ని బలపరుస్తున్నారు

3 శాంతి సంఘం చేసే తీర్మానాలన్నీ ఏకగ్రీవంగా జరిగినవే

కిచ్లూ 40 ఏళ్ళుగా కాంగ్రెసువాది అయివుండి, కాంగ్రెసు సిద్ధాంతాలకొరకు ప్రాణాలివ్వటానికి సిద్ధంగా ఉన్నవాడు అయినా ఆయన శాంతి సంఘంలో మిగిలిన రాజకీయ పక్షాల వారందరితోనూ కలిసి పనిచేస్తున్నాడు శాంతి సంఘంలో పనిచేసేవారు రాజకీయ రంగంలో ఎవరి సిద్ధాంతాలు వారు అనుసరించవచ్చు

ఆచరణలో ఇది ఎటువంటి పరిణామాలకు దారితీస్తుందని సందేహం రాకమానద కొన్ని పరిణామాలు ఇదివరకే కనిపించాయి పోను పోను ఇంకా కనిపిస్తాయి భావి ప్రపంచ రాజకీయ చరిత్రలో ఈ పరిణామాలు గొప్ప పాత్ర నిర్వహించబోతాయి

అదివరకు జరిగిన కొన్ని పరిణామాలు స్మరించుదాం కిందటిసారి ఇంగ్లండులో అంతర్జాతీయ శాంతి మహాసభ ఏర్పాటు చేయటానికి నిర్ణయం జరిగినప్పుడు బ్రిటిష్ ప్రధాని అట్లీ, "ఈ మహా సభను అడ్డగించగల శక్తి సృష్టిలో లేదు" అని దంభాలు పలికి ఆ సమావేశానికి వచ్చే విదేశీయులలో కొందరికి అనుమతి నిరాకరించాడు! బ్రిటనును పరిపాలించే లేబరు (సోషలిస్టు) ప్రభుత్వం అంతర్జాతీయ శాంతి ఉద్యమాన్ని చూసి ఝుడుసుకున్నది

ఇండియాలో కాంగ్రెసు ప్రభుత్వ హోంశాఖవారు, శాంతి ఉద్యమంతో ప్రభుత్వోద్యోగులు సంబంధాలు పెట్టుకోరాదని తాఖీదు పంపారు ప్రపంచ శాంతికోసం కృషిచేసే నెహ్రూ నాయకత్వం కింద వున్న కాంగ్రెసు ప్రభుత్వం శాంతి ఉద్యమాన్ని చూసి ఝుడుసుకున్నది

అన్ని దేశాలకన్నా శాంతి అనే మాటను చూసి ఎక్కువ ఝడుసుకున్నది అమెరికా "శాంతి అన్న పదాన్ని కమ్యూనిస్టులు కాజేశారు" అని సెనేటరు వాపోయాడు "మేమూ శాంతికోసమే అణువు బాంబులు వగైరా తయారు చేస్తున్నాము" అని అమెరికనులు అరవటం ప్రారంభించారు అయితే వారు తమ శాంతి కాంక్షను లోకానికి నిరూపించే పద్ధతులు చాలావింతగా ఉంటున్నాయి వారు ఎన్నడూ చేసి ఉండనంత యుద్ధ ప్రయత్నాలు తాము చేయటమేగాక ఇతర దేశాల చేత కూడా చేయిస్తూ, కమ్యూనిస్టు రాజ్యాల బలం చాలా హెచ్చుగా ఉన్నదనీ, ఈ యుద్ధ ప్రయత్నాలు చేయనట్టయితే వారు "స్వతంత్ర" దేశాలను తుడిచి పెట్టెయ్యగలరనీ, ఏ 1954 నాటికో వారితో సమాన యుద్ధబలం స్వతంత్ర రాజ్యాలకు కూడా లభించేటట్టు చూస్తున్నామనీ అంటున్నారు 1954 లోపల కమ్యూనిస్టు దేశాలు"స్వతంత్ర" దేశాలను తుడిచి పెడితే ఏంజరిగేదీ వారు స్పష్టం చెయ్యగలరు "శాంతి" కోసరం వారు కొరియా అంతర్యుద్ధంలో వేలు దూర్చి ఉత్తర కొరియాను తుడిచి పెట్టేశారు "శాంతి"కోసమే ప్రపంచం చుట్టూరా యుద్ధ స్థావరాలు కొనేస్తున్నారు, ఇండియా పాకిస్థాన్ల వంటి పరిసర దేశాల మధ్య చిచ్చు పెడుతున్నారు అయినప్పటికీ శాంతి ఉద్యమం బలపడటం చేతనే అమెరికా పాలకులు సహితం "శాంతి" అన్న పదాన్ని ఆశ్రయించ వలసి వచ్చింది కొరియా విషయంలోనూ, అగ్రరాజ్యాల మధ్య సంభాషణల విషయంలోనూ తమ తొంట చెయ్యి బయట పెట్టుకోవలసిన పరిస్థితి ఏర్పడింది అగ్ర విదేశాంగ మంత్రిచతుష్టయం సంప్రతింపుల కొరకు సంప్రతింపులు సాగించకుండా ఉండటానికి అమెరికా పాలకులు పడ్డ తాపత్రయం చూసి అమెరికా పత్రికలే, "మనకీ సంప్రతింపులు ఇష్టంలేదని లోకమంతా భావిస్తున్నది" అని గగ్గోలెత్తాయి

శాంతి ఉద్యమం చేస్తున్న గొప్పపని ఏమిటంటే యుద్ధోన్మాదులైన అల్ప సంఖ్యాకులను శాంతి కాముకులనుండి అడుగడుగునా వేరు చేస్తున్నది ఇవాళ ప్రపంచానికి కావలసింది స్వేచ్ఛా వాణిజ్యం కాదు పంచవర్ష ప్రణాళికతో కూడిన సోషలిస్టు వ్యవస్థకాదు–యుద్ధోన్మాదులు వేరు పడటమే

ఎందుకంటే ఈనాడు ప్రజా జీవితానికి పరమ శత్రువుగా ఉన్నది ప్రపంచ యుద్ధాలే యుద్ధోన్మాదులు ప్రజాస్వామికాల్ని సాగనివ్వరు మాటవరసకు ఇవాళ నెహ్రూ ప్రభుత్వం ఒక ఆర్థిక ప్రణాళికను అమలుచేసి దాని సహాయంతో ఉత్పత్తి హెచ్చించి, దేశంలో నిరుద్యోగ సమస్య అంతరింపజేసి ప్రజాజీవితం అభ్యుదయమార్గం పట్టించటానికి ప్రయత్నాలు సాగించినట్టయితే దాన్ని యుద్ధోన్మాదులు భగ్నం చేయవచ్చు ఉత్తర కొరియాలో ఇదే జరిగింది అంతకన్న మరీ చిత్రంగా బ్రిటనులో ఇదే జరిగింది బ్రిటనులో లేబరు ప్రభుత్వం ఏర్పాటుచేసిన పరిమితసోషలిస్టు వ్యవస్థను అమెరికావారు దుమ్మెత్తిపోసి, చివరకు వారి నెత్తిన భరించరాని యుద్ధఖర్చు రుద్దారు సోషలిస్టు విధానాలను సంస్కరించవలసిన అగత్యం ఏర్పడింది ఎనూరిన్ బివాన్ మొదలైన వారు ఎదురుతిరిగారు చిల్లర రాజ్యాలలో తమ యిష్టంవచ్చిన ప్రభుత్వాలనే ఉంచటానికి, ప్రజాహిత ఆర్థిక వ్యవస్థలు వివిధ దేశాలలో అమలు జరగకుండా చూడటానికి ఈనాడు ప్రజాపీడకులు ఉపయోగించగల ఒక్క ఆయుధమూ ప్రపంచ యుద్ధం అందుచేత శాంతి ఉద్యమం ప్రజలచేతి అస్త్రంగా ఉపయోగపడుతుంది

"ప్రజల అనుమతి లేకుండా రెండు ప్రపంచ యుద్ధాలు జరిగిపోయాయి గదా మూడవదీ ఎందుకు జరగరాదు? శాంతి ఉద్యమం యుద్ధాన్ని ఏవిధంగా అడ్డగలుగుతుంది?" అనవచ్చు మొదటి రెండు ప్రపంచయుద్ధాలూ శాంతి ఉద్యమాలకు ఆగేవికావు ప్రపంచంలో విస్తృతమైన వలస ప్రదేశాలూ, పరాధీన ప్రజానీకాలూ ఉండేవి సా్రామ్రాజ్య వాదులు తలుచుకున్న మరుక్షణం ఈ దేశాలూ, ప్రజలూకూడా యుద్ధానికి తల ఒగ్గవలసిందే కిందటి యుద్ధంలో మనదేశం బుద్ధి పూర్వకంగా చేరనేలేదు "ఈ యుద్ధంతో మాకు సంబంధంలేదు' అని భారతజాతీయ కాంగ్రెసు ఎలుగెత్తి ఉద్ఘాటించింది జపానుకు సహాయంచేసి తద్వారా దేశవిమోచన సంపాదించుదామన్న భ్రమలోపడ్డ జాతీయవాదుల మాట కూడా పారలేదు అయినా ఇండియా యుద్ధంలో పాల్గొన్నది ఇండియా వైస్రాయి ఒక్క ముక్కతో ఇండియాను యుద్ధంలోకి దింపగలిగాడు

రెండవ ప్రపంచ యుద్ధంతో ఆ పరిస్థితి అంతమయింది శతాబ్దాల తరబడి సామ్రాజ్య వాదుల దోపిడికి గురియైన ఆసియాదేశాలన్నిటా జాతీయ స్వాతంత్ర్యోద్యమాలు విజృంభించాయి ఇక్కడి ప్రజలలో చాలామందికి స్వాతంత్ర్య వాదులనుండి విముక్తికూడా లభించింది ఈ దేశాలచేత సామ్రాజ్యవాదులు యుద్ధాలు చేయించాలంటే ఈ దేశాలలోని ప్రభుత్వాలపై ఒత్తిడి తీసుకురావాలి అప్పటికీ ప్రజలు సమ్మతించని పక్షాన ప్రజా ప్రభుత్వాలు ఏమీ చేయలేవు ఇదే యుద్ధాన్ని నిరోధించటానికి మొదటిదారి ఈదారి ఇప్పుడు కొత్తగా ఏర్పడింది పాత పెట్టుబడిదారీ దేశాలలో కూడా ప్రజాశక్తులు పెరిగాయిగాని తరగలేదు పశ్చిమ యూరపుదేశాలన్నిటిలోనూ వామపక్షాల ప్రభుత్వాలు ఏర్పడ్డాయి

అందుకనే ఈ సారి సామ్రాజ్యవాదులు యుద్ధం తెచ్చి పెట్టటానికి ముందు ప్రజాపీడతెచ్చి పెడుతున్నారు కమ్యూనిజం "బూచి"ని చూపి భయపెడుతున్నారు ప్రపంచ యుద్ధాల అగత్యం సామ్రాజ్యవాదులకు తప్ప ఇంకెవ్వరికీ లేదు అటువంటప్పుడు యుద్ధ భయం కమ్యూనిస్టు దేశాలనుంచి కూడా ఉన్నదని అమాయక ప్రజలను నమ్మించటం ఎట్లా? సామ్రాజ్యవాదాన్ని ప్రజాస్వామిక వాదమనటమూ, కమ్యూనిజమును సామ్రాజ్యవాదమనటమూనూ! ఈ రెండూ యుద్ధోన్మాదులు చేస్తూనే ఉన్నారు

అచ్చగా సామ్రాజ్యవాదులకు మాత్రమే పనికివచ్చే యుద్ధంలో ఇతర ప్రజా పక్షాలను –ముఖ్యంగా అధికారంలో ఉన్నవారిని–చేర్చటం ఎట్లా? డబ్బు పెట్టుబడి పెట్టటం, ఆయుధాలు సప్లయి చెయ్యటం, తమకున్న బలంతో ఆ వర్గాలను ప్రజలనుంచి కాపాడటం, అవసరమైతే (కొరియాలో సింగ్మన్‌రీ తరపున చేసినట్లు) ప్రజలను అణచటానికి తోడ్పడటం

ప్రస్తుతం మన దేశంలో యుద్ధోన్మాదం తగినంతగా–యుద్ధోన్మాదులకు నచ్చినంతగా–లేదు ఈనాటివరకూ దేశంలో అగ్రస్థానం వహించి ఉన్న కాంగ్రెసు ప్రపంచంలో శాంతిని నెలకొల్పటానికే కంకణం కట్టుకుని ఉన్నది రేపు రాబోయే ఎన్నికలలో ఏయే పక్షాలు నెగ్గుతాయో తెలియదు ఆ కారణంచేత యుద్ధోన్మాదులు కొన్ని పార్టీలను తమకు (అంటే యుద్ధానికి) అనుకూలంగానూ, శాంతి ఉద్యమాలకు ప్రతికూలంగానూ తిప్పుకోవటానికి ప్రయత్నించటం సహజము ఇటువంటి ప్రయత్నాలు జరుగుతున్నవని కూడా కిచ్లూ కొన్నిచోట్ల ప్రజలకు తెలిపాడు

యుద్ధోన్మాదులు ఇండియాలో ఉన్న కమ్యూనిస్టు వ్యతిరేకతను చాలావరకు ఉపయోగించుకుంటూనే ఉన్నారు, ఈ "కొనుగోలు" ఎంతదాకా వెళ్ళిందీ శాంతి ఉద్యమం బయట పెడుతున్నది ఉదాహరణకు, ఒక వామపక్షం తమ వర్గానికి చెందిన ఒక పెద్ద మనిషిని శాంతి ఉద్యమం నుంచి బయటికి రావలిసిందని ఆదేశించిందట ఈయన ప్రస్తుతం మద్రాసులోని శాంతి సంఘంలో చాలా ప్రముఖ పాత్ర నిర్వహిస్తున్నాడు వామ పక్షంవారు పట్టుబట్టినట్టయితే ఈయన శాంతి ఉద్యమానికో, తన రాజకీయ పక్షానికో ఉద్వాసన చెప్పవలసి ఉంటుంది

ఏ ప్రజాపార్టీగాని శాంతి ఉద్యమాన్ని వ్యతిరేకించటానికి గల కారణాలు వివరించటం సాధ్యంకాదు అందుచేత "అమ్ముడు పోయిన" పార్టీలు ఈ ఉద్యమాన్ని తమ సభ్యులమీది ఆంక్షల ద్వారా రహస్యంగా ప్రతిఘటిస్తాయి ఇటువంటి పార్టీలను శాంతి ఉద్యమం బయట పెట్టి ప్రజా హితానికి చాలా మేలు చేకూర్చగలదు

తెలుగు స్వతంత్ర వారపత్రిక, 10-8-1951

# 28. బ్రిటనులో ఎన్నికలు

వచ్చే అక్టోబరు 25న బ్రిటనులో పార్లమెంటుకు ఎన్నికలు జరుగుతాయని బ్రిటిషు ప్రధాని అట్లీ తెలియబరిచాడు ఈ ఎన్నికలలో కన్సర్వేటివులు తిరిగి పదవిలోకి వస్తారని ప్రవాదు బయలుదేరింది షేర్ మార్కెట్ సంచలనం కన్సర్వేటివుల విజయాన్ని సూచిస్తున్నదని పత్రికలలో చదివాం ఇదే గనక జరిగినట్టయితే బ్రిటిషు లేబరు పక్షనాయకులు ఎవరినీ తప్పుపట్టే పని ఉండదు గత సంగ్రామంలో కలిగిన జ్ఞానోదయంతో బ్రిటిషు ప్రజలు తమ చేతికి వప్పగించిన అధికారాన్ని లేబరు నాయకులు కన్సర్వేటివులకు ఉపకరించే విధంగా వినియోగపరిచారుగాని ప్రజలకు వినియోగపడేటట్టు ఉపయోగించలేదు లేబరు ప్రభుత్వం పరిశ్రమలను జాతీయం చెయ్యటానికీ, ప్రజలకు ఉచితవైద్య సౌకర్యాలు కలిగించటానికీ ప్రయత్నించలేదా, కన్సర్వేటివులతో అనేక విషయాలపై తర్జనభర్జనలు పడలేదా- అనవచ్చును ఇదంతా నిజమే కాని నూరునోములు ఒక రంకుతో సరి అన్నట్టు, లేబరు ప్రభుత్వం అమెరికాకు దాసోహమని-రష్యా నుంచి తనకు ముప్పులేదనీ, బ్రిటనుకుగల ముప్పంతా అమెరికా తలపెట్టే కమ్యూనిస్టు వ్యతిరేక యుద్ధ ప్రయత్నాలవల్లనేననీ తెలిసి కూడా అటువంటి ప్రయత్నాలు సాగించి సామాన్య ప్రజలకు దుర్భర ఆర్థిక పరిస్థితి తెచ్చిపెట్టటం వల్ల లేబరు పార్టీ సాగించిన సత్కర్మలు రాణించలేదు

యుద్ధం అయిపోయి లేబరు ప్రభుత్వం ఏర్పడిన నాటినుండీ బ్రిటను అమెరికాకు అంతర్జాతీయ వ్యవహారాలలో కుడిభుజంగా ఉంటూ, రష్యా వ్యతిరేక విధానాలను బలపరచటం లోనూ, అమెరికాకు ప్రపంచమంతటా యుద్ధ స్థావరాలు ఏర్పాటు చెయ్యటంలోనూ, ఐక్యరాజ్య సమితి శాంతి రక్షణ విధానాలను విసర్జించి అమెరికా దుర్మార్గాలను బలపరిచేలాగు చెయ్యటంలోనూ, కొరియాలో అమెరికను రాక్షసత్వం విజృంభించటంలోనూ, అట్లాంటిక్ కూటమి ఏర్పరచటం లోనూ, మధ్య ప్రాచ్య దూర ప్రాచ్యాలలో ప్రజాస్వామ్యాలు తల ఎత్తకుండా అణచటంలోనూ శాయశక్తులా తోడ్పడుతూ వస్తున్నది

బ్రిటిషు లేబరు ప్రభుత్వం ఇంకొక ప్రమాదకరమైన పనికూడా చేస్తున్నది తన దేశంలో సోషలిస్టు విధానాలవలంబిస్తున్నట్టు నటిస్తూ, ఇతర దేశాల పట్ల చాటుగానూ, బహిరంగంగానూ సామ్రాజ్యవిధానాలను అవలంబిస్తున్నది మధ్య ప్రాచ్యంలో పర్షియా నూనె విషయంలోనూ సూయజ్ కాలవ విషయంలోనూ, ట్రాన్స్‌జోర్డన్ విషయంలోనూ బ్రిటిషు లేబరు ప్రభుత్వం అవలంబించిన విధానం సోషలిస్టు విధానమనిపించుకోదు మలయాలో ఈ ప్రభుత్వం అవలంబించే విధానం పచ్చి ఫాసిస్టు విధానమనిపించుకుంటుంది రష్యాలో సోషలిస్టు ప్రభుత్వం వచ్చిన మరుక్షణం రష్యన్ సోషలిస్టు ప్రభుత్వం జారునాటి దోపిడీ ఒప్పందాలన్నిటినీ చించి టర్కీ, చైనా, ఫిన్లాండ్, పోలండ్ మొదలైన అనేక దేశాలతో న్యాయమైన ఒడంబడికలు చేసుకున్నది ఈ విషయంలో బ్రిటను రష్యాను అనుకరించ యత్నించిందని తప్పుపట్టే అవకాశం లేకుండా చూశారు లేబరు పార్టీ అగ్రనాయకులు

కన్సర్వేటివులను ఓడించి పదవి స్వీకరించిన లేబరు ప్రభుత్వం తన అంతర్జాతీయ విధానంలో కన్సర్వేటివుల విమర్శకు గురి కాకపోవటం చాలా చిత్రమైన విషయం మొట్టమొదట లేబరు ప్రభుత్వం ఆర్థిక విధానాలనూ, పరిశ్రమల జాతీయకరణాన్నీ ప్రతిఘటించిన కన్సర్వేటివులు ఇదంతా జరిగేదికాదని తెలియగానే ఈ ఆర్థిక విధానాలపై ఆందోళన మానేశారు బ్రిటిషు ప్రజల నందరినీ కష్టాలపాలు చేసి ముందు ముందింకా బాధించనున్న ఆయుధ నిర్మాణం కన్సర్వేటివులకు సమ్మతంగానే ఉన్నది

బ్రిటిషు ప్రజలకు బాధలుపడటం చాతకాదని ఎవరూ అనలేరు వారు గత యుద్ధంలో ఎన్ని ఇబ్బందులనైనా ఎదుర్కొన్నారు యుద్ధం ప్రారంభమైన కొంతకాలం వరకూ ప్రభుత్వం చేసినదానికంటె ప్రజలు చాలా రెట్లు యుద్ధయత్నాన్ని తామై సాగించారు నాలుగు వందల డెబ్భైకోట్ల పౌనులు యుద్ధం ఖర్చుకు అవసరం ఉన్నదని వారికి లేబరు ప్రభుత్వం నచ్చజెప్ప గలిగితే ధరలు హెచ్చినా, వస్తువుల కరువు ఏర్పడ్డా వారు లక్ష్యపెట్టరు కాని అటువంటి తీవ్రపరిస్థితి ఏర్పడిందని అట్లీ గాని అతని అనుచరులుగాని రుజువు చెయ్యలేదు రష్యా తదితర తూర్పు యూరపుదేశాల బలం విపరీతంగా పెరిగిపోయింది దానికి తగ్గబలం అమెరికా బ్రిటను వగైరా దేశాలకు కూడా లేకపోతే యుద్ధం సంభవిస్తున్నదని అట్లీ అన్నాడు దీనికి సాక్ష్యంలేదు ఉన్నదే అనుకున్నాః

కిందటి యుద్ధానికి పూర్వం హిట్లరు, 1935 నుంచీ జర్మనీలో యుద్ధ ప్రయత్నాలు సాగించాడు ఈ యుద్ధ యత్నాలకు కావలసిన ప్రోత్సాహమంతా అమెరికా, బ్రిటనులనుండి లభించింది కనీసం మూడేళ్ళపాటు బ్రిటను హిట్లరును చూసి యుద్ధ యత్నాలు చేయలేదు ఆ తరవాత చేశామంటే చేశామన్నది గాని 1939లో యుద్ధం ప్రకటించే నాటికైనా బ్రిటనుకు "యుద్ధయంత్రం" లేనేలేదు హిట్లరు "నీతి" కి కట్టుబడి రష్యామీద పడటానికి మారుగా బ్రిటనుపైనే పడ్డాడు అటువంటి పరిస్థితులలో కూడా హిట్లరును ఓడించే "యుద్ధ యంత్రమూ" ఆయుధాలూ బ్రిటన్, అమెరికాలకు లభించాయి రష్యా చితుకుతుందేమో నని చూడకుండా యూరప్‌లో రెండో రంగం ఏ రోజున ఏర్పరిస్తే ఆరోజున హిట్లరు కూలిపోయేవాడు ఈ సంగతులన్నీ బ్రిటిషు ప్రజలకు తెలుసు రష్యా హిట్లరు అడుగు జాడల్లో నడిచినట్టు ఏ రోజు

దాఖలా కనపడినా ఆ రోజు ప్రపంచ ప్రజలు రష్యా దురాక్రమణను అణచటానికి నడుములు కట్టలేక పోరు, పన్నెండేళ్ళ క్రితం ప్రపంచ ప్రజల కుండిన శక్తి ఈనాడు లేదనుకోవటానికీ ఆధారంలేదు హిట్లరును ఓడించినది అచ్చగా ఆయుధాలు కావు ప్రజలలో ఉండే నైతిక శక్తులు

ఇదంతా లక్ష్యపెట్టకుండా, బ్రిటిషు ప్రజల నైతిక శక్తులను గాని, దేశాభిమానాన్నిగాని పరిగణించకుండా ఏనాడో రష్యా తలపెట్టబోయే ప్రపంచ దిగ్విజయ యాత్రను "నిరుత్సాహ" పరచటానికి బ్రిటిషు ప్రజల వెన్ను విరగగొట్టబూనుకున్నది! ఇదైనా బ్రిటిషు ప్రభుత్వం తన స్వంత ప్రేరేపణతో గాని, బ్రిటిషు ప్రజల అనుమతితో గాని చేయటం లేదుః అమెరికా ప్రోద్బలంతో చేస్తున్నది ఇందులో దాపరికం ఏమీలేదు ఇటువంటి ప్రభుత్వాన్ని బ్రిటిషు ప్రజలు సహించనవసరంలేదు "వచ్చే ఎన్నికలలో మీ వోట్లు మాకిచ్చి నట్టయితే కన్సర్వేటివులు చెయ్యలేని ఫలానా ఉపకారాలు మీకు మేము చేస్తాం" అని లేబరు నాయకులు అనగల స్థితిలో లేరు

బ్రిటిషు ప్రజలు తమకు లేబరు పార్టీలో విశ్వాసం తగ్గినట్టు కిందటేడు ఎన్నికలలోనే రుజువు చేశారు ఆ ఎన్నికల ఫలితంగా లేబరు పార్టీకి గల మెజారిటీ నామ మాత్రంగా పరిణమించింది కొత్తగా యుద్ధవ్యయం ఒకటి తెచ్చి పెట్టిన తరవాత లేబరు పార్టీలోనే చాలా చీలికలు పుట్టాయి అనూరిన్ బివాన్, జిలియేకస్, హెరాల్డ్ విల్సన్ మొదలైన వామ పక్షీయులు చాలామంది అట్లీ పక్షాన్ని త్యజించారు వారంతా లేబరు పార్టీలో ఉన్నప్పటికీ ప్రభుత్వ విధానాలను తీవ్రంగా నిరసిస్తున్నారు వీరంతా అమెరికాను బ్రిటను శత్రువుగా కూడా చూస్తున్నారు ఇందులో ఆశ్చర్యంలేదు బ్రిటిషు ప్రజలు వారితో సంపూర్ణంగా ఏకీభవించవచ్చు రేపు రష్యా ఏమి చేసినా చేయకపోయినా ప్రస్తుతం అమెరికా బ్రిటిషు ప్రజల కష్టాలన్నిటికీ ప్రత్యక్ష కారణమై కూచున్నది అమెరికా తన యుద్ధ యత్నాలతో బ్రిటనును గొప్ప ప్రమాదానికి గురిచేస్తున్నది బ్రిటిషు కార్మిక ప్రజల ఆర్థిక పరిస్థితులను తారుమారు చేస్తున్నది మార్షల్ సహాయం పుచ్చుకున్న పాపానికి అమెరికా బ్రిటనుకు అంతర్జాతీయ వ్యవహారాలలో స్వయం నిర్ణయమన్నది లేకుండాచేసింది (ఉంటే జపాను శాంతి ఒడంబడికపై బ్రిటను సంతకం పెట్టునా? బ్రిటిషు సైనికులు కొరియాలో చావవలసిన ఆగత్యం కలుగునా? బ్రిటనుకు అతి ముఖ్యమైన రష్యాతోటి వాణిజ్యానికి ప్రతిబంధకాలు ఏర్పడునా? చైనాపై బ్రిటను ఆంక్షలు విధించవలసి వచ్చునా? బ్రిటను పర్షియాల మధ్య తగాదాలలో బ్రిటను అనుమతి లేకుండా ట్రూమన్ ప్రతినిధి వచ్చి జోక్యం కలిగించుకోగలుగునా? చైనాకు ఐక్యరాజ్య సమితిలో ప్రాతినిధ్యంఇవ్వాలని బ్రిటను నెత్తినోరూ కొట్టుకుని చెబుతున్న ముక్కను ఇంతకాలం అమెరికా వినిపించుకోకుండా ఉండగలుగునా?) అమెరికా మూలంగానే బ్రిటనుకు ముడి సరుకుల దుర్భర దారిద్ర్యం ఏర్పడింది బ్రిటను సౌకర్యం కొరకు, బ్రిటిషు ప్రజల క్షేమం కొరకు, అమెరికా ఆవగింజంత త్యాగం చేసినట్లు నిదర్శనం లేదు బ్రిటను కష్టాలన్నిటికీ అమెరికాయే కారణమనటానికి బోలెడంత సాక్ష్యం ఉంది అయినా బ్రిటిషు లేబరు ప్రభుత్వం అమెరికాకు అడుగులకు మడుగులొత్తుతున్నది ఇంత "దీన్" అయిపోయిన ప్రభుత్వాన్ని

ప్రజలునెత్తినెక్కించుకుని ఊరేగ నిరాకరిస్తే ఆ తప్పు వారిది కాదు లేబరు ప్రభుత్వం ఇంట కన్సర్వేటివులకూ సాష్టాంగ పడింది, రచ్చన అమెరికాకు సాష్టాంగపడింది

బ్రిటిషు ప్రజల మాట అట్లా ఉంచి లేబరు పార్టీలో పరిస్థితులు కూడా ఏమీ బాగా లేనట్టు కనిపిస్తుంది ఇండియాలో కాంగ్రెసు పార్టీలాగే బ్రిటనులో లేబరుపార్టీ ఆంతరంగిక విచ్ఛిత్తికి గురి అవుతూ వస్తున్నది లేబరు ప్రభుత్వం అనుసరించే విధానాలతో అసంతృప్తి చెంది 1947 లోనే 37వేల మంది సభ్యులు లేబరు పార్టీని విడిచి వెళ్ళారట అటుపిమ్మట కూడా సభ్యుల నిష్క్రమణ సాగుతూనే వున్నట్టు తెలుస్తున్నది మన కాంగ్రెసు వర్గాలలో అవినీతిని గురించీ, కాంగ్రెసు విచ్ఛిత్తిని గురించీ ఆందోళన సాగినట్టే బ్రిటనులో కూడా స్థానిక శాఖలలో లేబరు పార్టీ పతనం గురించి ఆందోళన జరుగుతున్నది ఈ ఆందోళననుండి పార్టీ నాయకులు గుణపారాలు నేర్చుకోకపోగా, బ్రిటిషు విదేశాంగ విధానం మారాలనీ, యుద్ధ ప్రయత్నాలు మానాలనీ, రష్యాతోగల విభేదాలు శాంతియుతంగా పరిష్కరించుకునే యత్నాలు జరగాలనీ, అమెరికా అడుగుజాడల నుంచి బ్రిటిషు లేబరు ప్రభుత్వం వైదొలగి తన స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకోవాలనీ, బ్రిటను శాంతికోసం' కృషి చెయ్యాలనీ అనేవారిని అణచటానికి యత్నిస్తున్నారు సోషలిస్టు ఫెలోషిప్ అన్న సంస్థ ఈ విధంగానే అణచబడింది

సాధారణంగా ట్రేడ్ యూనియన్ కాంగ్రెసులలో ప్రభుత్వ నాయకులు ట్రేడ్ యూనియన్ ప్రతినిధులను కూడగట్టుకోగలుగుతూ వస్తున్నారు పార్టీ వార్షిక సమావేశంలో తమకుసమ్మతంగాని తీర్మానాలు తెచ్చిన వారిని భయపెట్టి, బెదిరించి, అనేక డజన్ల తీర్మానాలను కలిపి "నిరపాయమైన" ఒక తీర్మానంగా తిరగరాసి, వోటింగు విధానంలో దుర్మార్గంచేసి తమకు ప్రతిపక్షం లేకుండా చూసుకుంటున్నారు ఈసారి జరగబోయే పార్టీ సమావేశంలో ప్రభుత్వ నాయకులు కార్మికుల తీవ్ర ప్రతిఘటనను ఎదుర్కోవలసి ఉంటుంది జరగబోయే ఎన్నికలలో లేబరు పక్షం గతి ఏమికాబోయేదీ ఈ సమావేశంలో తేలిపోతుంది

బ్రిటిషు లేబరు పక్షంనుంచి మనం నేర్చుకోవలసింది చాలా ఉంది బ్రిటిషు వోటరు ఈ అసమర్ధపు లేబరు పక్షానికో, ఇంతకన్న కూడా భయంకరమైన కన్సర్వేటివు పక్షానికో తప్ప మరెవ్వరికీ వోటు వేయలేని దుస్థితిలో తనను తాను పెట్టుకున్నాడు మనకింకా అటువంటి దుస్థితి చేకూరలేదు వచ్చే ఎన్నికలలో నిజమైన రాజకీయ స్వాతంత్ర్యానికీ, ప్రజాభ్యుదయానికి, ప్రపంచ శాంతికీ మనం వోటు చెయ్యనిపక్షంలో మరో ఎన్నికలు తిరిగి వచ్చే నాటికి మనదేశ పరిస్థితి ఇంకా హేయంగా పరిణమించి ఎటుచూసినా మనకు దిక్కుతోచకుండా పోవచ్చు ఇది ఎంత మాత్రం వాంఛనీయంకాదు అందుచేత భారతీయ పౌరులు ఇప్పుడే మేలుకొని జాతీయ, అంతర్జాతీయ విధానాల ఆంతర్యం సరిగా అవగాహన చేసుకోవాలి

తెలుగు స్వతంత్ర, వారపత్రిక 28-9-1951

# 29. ప్రపంచ శాంతి-రష్యా అమెరికాలు

ప్రపంచ యుద్ధం తీసుకురావటానికి అమెరికా బ్రిటను బ్రహ్మాండమైన యత్నాలు తలపెట్టాయి ఏ సిద్ధాంతాలమీదనైతే బ్రిటిషు లేబరు ప్రభుత్వం పదవిలోకి వచ్చిందో ఆ సిద్ధాంతాలను కూడా గాలికి వదిలేసి అట్లీ ప్రభృతులు యుద్ధ ఖర్చు ప్రజలకు అంటగట్టుతున్నారు బ్రిటనులో దాదాపు కమ్యూనిస్టు ఉద్యమం లేకపోయినప్పటికీ కార్మికులుతమ ప్రభుత్వంపై తీవ్రమైన అసంతృప్తి కనబరుస్తున్నారు కమ్యూనిస్టు ఉద్యమం బొత్తిగా లేకపోయినా అమెరికాలో కూడా కార్మిక అశాంతి కనబడుతోంది

బ్రిటన్ అమెరికాల వెంట ఉండటానికి ఫ్రాన్సు ఘోరమైన కష్టాల నెదుర్కొంటున్నది అమెరికా, బ్రిటను, ఫ్రాన్సులు ప్రపంచ అగ్రరాజ్యాలు అయిదింటిలో మూడు అయాయి ఏ ఒక్క అగ్రరాజ్యం యుద్ధం తలపెట్టినా ప్రపంచ శాంతికి భంగం కలుగుతుందన్న విశ్వాసం ఆధారంతో ఐక్యరాజ్యసమితి ఏర్పడింది) ఈ మూడు అగ్రరాజ్యాలకూ మధ్య అభిప్రాయ భేదాలున్నాయి కాని కేవలం యుద్ధయత్నాలు జయప్రదంగా సాగగలందులకై ఈ మూడు అగ్రరాజ్యాలూ ఒకదానితో ఒకటి ఏదో విధంగా రాజీపడుతూ రావటం కూడా కనిపిస్తున్నది ఉదాహరణకు, అమెరికా మాజీ ఫాసిస్టులను తమ పక్షంచేయ నిర్ణయించింది పశ్చిమ జర్మను సైనిక బల పునర్నిర్మాణానికీ, జపాను సైనిక బల పునర్నిర్మాణానికీ, ఫ్రాంకోతో పొత్తుకూ కూడా మొదట ప్రయత్నాలు చేసినప్పుడు బ్రిటను ఫ్రాన్సులు ఆమోదించలేదు కనీసం ఆమోదించనట్టు నటించాయి కాని కాలక్రమాన అమెరికా పథకం నెగ్గటమేగాక ఈ పథకం అమెరికా బ్రిటనుల యుద్ధ యత్నాలతో బహిరంగంగా ముడిపెట్టబడుతున్నది

ప్రత్యక్షంగా అట్లాంటిక్ ఒడంబడికపై సంతకాలుచేసిన దేశాలుకాక, కిందటి యుద్ధం తెచ్చిపెట్టిన దేశాలలో పశ్చిమ జర్మనీ, జపాను, స్పెయినులు కాక, ఇటలీ, గ్రీస్, ఆస్ట్రేలియా, న్యూజీలాండు, పాకిస్తాను మొదలైన దేశాలను కూడ అమెరికా నాయకత్వంగల కూటంలోకి చేరదీశారు ఈకూటం పక్షానే ఉండటానికి నెహ్రూ ప్రభుత్వం ఉవ్విళ్ళూరుతున్నదన్న శుభవార్త విజయలక్ష్మి పండిట్ ఇటీవల అమెరికావారి చెవిని వేసింది ఇండియాలాగే ఇండోనేషియా, ఫిలిప్పీన్స్ మొదలైనవి ఒడంబడిక కాగితాల దండుగా, సంతకాల సిరా దండుగా లేకుండా అమెరికా పక్షాన ఉండగలవు

భయంలేదు దేశాల జాబితా ఐతే చాలా పెద్దదేగాని అమెరికా యుద్ధపక్షాన ఉన్నవి ఈ దేశాల ప్రభుత్వాలేగాని, ప్రజలు కారు అమెరికా యుద్ధ ఖర్చు నెలకు మూడువేల కోట్ల డాలర్లు పెరిగితే ప్రపంచమంతటా యుద్ధ స్థావరాలు సంపాదిస్తే ప్రపంచ ప్రజలు ఉబ్బి తబ్బిబ్బుయిపోరు అమెరికా యుద్ధ ఖర్చుతోబాటు అంతర్జాతీయ రాజకీయాలలో నీతి అన్నదీ, సబబు అన్నదీ, మానవత్వమన్నదీ పూర్తిగా మృగ్యమై పోతూండటం ప్రపంచ ప్రజలు చూస్తూనే ఉన్నారు ఈ విషయమై ప్రతి దేశంలోనూ కొన్ని పత్రికలైనా నెత్తీనోరూ బాదుకుని ఘోషిస్తూనే ఉన్నాయి ఈ విధంగా ఘోషించే పత్రికలలో కమ్యూనిజమునూ, కమ్యూనిస్టులనూ సహించలేనివి చాలా ఉన్నాయి ఉదాహరణకు "న్యూ స్టేట్స్‌మన్ అండ్ నేషన్" అనే బ్రిటిషు వారపత్రిక

ఈ పత్రిక అమెరికా పాలకుల విదేశాంగ నీతినీ, యుద్ధయత్నాలనూ ఖండిస్తోంది బ్రిటను అమెరికా అడుగుజాడల్లో నడవకుండా స్వతంత్రంగా తన వ్యవహారాలు నెరపాలంటోంది బ్రిటను తన సైనిక బలాన్ని పెంచుకున్నా యుద్ధం చేసేటందుకై పెంచుకోరాదంటోంది చైనాకు ఐక్యరాజ్యసమితిలో స్థానమిచ్చి ఫార్మోజాను చైనాకు ఇచ్చెయ్యాలంటోంది అమెరికాలో మెకార్థీయిజమునూ, ఫ్రాంకోతో అమెరికా చేతులు కలపటాన్నీ, జపానుతో సంధినీ, జర్మన్ నాజీల పునరుద్ధరణనూ నిరసిస్తోంది రష్యాకూ, పశ్చిమ రాజ్యాలకూ గల విభేదాలు సౌమ్యంగా పరిష్కరించటం సాధ్యమనీ, ఉభయ పక్షాలూ దానికిగాను కృషి జరపాలని ఈ పత్రిక తన వాంఛ బయట పెట్టింది అయితే ఈపత్రికకు రష్యా మైత్రివాంఛ ఎంతవున్నదో, రష్యాపట్ల అనుమానపిశాచం కూడా అంత ఉన్నది క్లాసులో ఇద్దరు పిల్లకాయలు కీచులాడుకుంటే ఇద్దర్నీ దండించాలనే వీధిబడిపంతులు మనస్తత్వంతో ఈ పత్రిక బాధపడుతున్నది

ఈ ఉష్ట్రపక్షి మనస్తత్వం మన దేశంలో కూడా ఉన్నది గనక దాన్ని గురించి తెలుసు కోవటం అవసరం రష్యాపై ప్రపంచ విస్తృతమైన యుద్ధయత్నాలు చేసేవారిని మనం అర్థం చేసుకోవచ్చు కాని అటువంటి యత్నాలు చేసేవారిని ఖండిస్తూ కూడా లేనిపోని అనుమానాలకు గురిఅవుతూ, వాటిని ప్రచారం చేసే వారివల్ల ప్రమాదమున్నది క్లిష్ట సమయంలో ఏదో ఒక పక్షాన్ని బలపరచ వలసిన తరుణంలో ఆపని చెయ్యటానికి తగినంత సాహసం లేని వాళ్ళే ఇటువంటి వైఖరి అవలంబిస్తారు–కురుక్షేత్ర సంగ్రామంలో కర్ణుడు భీష్ముడి మీద అలిగి పదిరోజులపాటు యుద్ధానికి రాకుండా ముఖం తప్పించినట్లు

రష్యాను గురించి యిటువంటివారి వైఖరి ఏధోరణిలో ఉంటుందంటే, రష్యా చేసినదంతా రైటూ, అమెరికా చేసినదంతా తప్పూనా? అమెరికా చేసేది బాగా ఉందని ఎవరన్నారుగాని, రష్యా ఏమీ చెయ్యందే యిన్ని దేశాలూ ఏకమై రష్యాను చితకపొడవాలని చూస్తున్నాయా? అట్లా అనటం రష్యాపట్ల మూఢభక్తికాక యింకేమవుతుంది? ఈ అనుమాన పిశాచమే బ్రిటిష్ వారపత్రిక రష్యాకు ఒక హెచ్చరిక చేసింది: "మీమీద అందరికీ అనుమానాలు పోవాలంటే మీరు కొన్ని పనులు చెయ్యండి అమెరికా మీద అనుమానాలు పోగొట్టుకోవటానికి అమెరికా ఏంచెయ్యాలో సూచించండి?" అన్నది ఈ పత్రిక తనకు రష్యాపైగల అనుమానాలను గురించేకాక రష్యాకు అమెరికా పట్ల గల అనుమానాలను గురించి కూడా ఆలోచిస్తున్నట్టు కనిపిస్తుంది

రష్యాపై తనకుగల అనుమానాలు పోవాలంటే రష్యా ఆస్ట్రియా సంధికి ఒప్పుకోవాలట యుగోస్లావియాతో రాజకీయ సమరం నిలుపుచెయ్యాలని, ఐక్యరాజ్య సమితిని ప్రచారార్థం కాక ప్రయోజనార్థం వినియోగించాలనీ, వివిధ దేశ ప్రజలను రష్యాకు స్వేచ్ఛగా రానివ్వాలనీ ఈ పత్రిక సూచించింది! బ్రిటన్, అమెరికా, ఫ్రాన్సు, బెల్జియం, లగ్జెంబర్గ్, స్కాండినేవియా, కెనడా, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, దక్షిణ అమెరికా, జర్మనీ, స్పెయిను, జపాను, ఇటలీ, టర్కీ వగైరా దేశాలన్నీ రష్యామీద కత్తికట్టటానికి కారణాలు ఇవా? యుద్ధం ఆఖరైన మర్నాటినుంచీ అమెరికాకు లోబడి బ్రిటన్, ఫ్రాన్స్‌లు రష్యాకు వ్యతిరేకమై యుద్ధకాల ఒడంబడిక లన్నిటికీ తిలోదకాలివ్వటం చూస్తూ కూడా (ఇటలీ సంధి ఒడంబడికకు ఇప్పుడే సవరణ చేస్తున్నారు)

ఆస్ట్రియా సంధి ఒడంబడికను అమెరికా షరతులపై ఆమోదించక పోవటం రష్యాపై అనుమాన పిశాచాన్ని లేవదీసిందన్నమాట

రష్యాలో తన రాజకీయ–సాంఘిక వ్యవస్థ పుట్టిననాటినుంచీ అంతర్జాతీయ రాజకీయాలలో రెండు మార్పులు జరిగాయి 1 రష్యాపై పెట్టుబడిదారీ దేశాలు కత్తికట్టాయి 2 రష్యాకు ఇతర దేశాలను పీడించి లాభం పొందవలసిన అగత్యం పోయింది మొదటి ప్రపంచయుద్ధం అయిపోగానే రష్యాపైకి తమ సేనలను పంపిన రాజ్యాలు రెండో ప్రపంచ యుద్ధంనాటి వరకూ రష్యాను హతమార్చటానికే హిట్లరుని ప్రోత్సహించాయి హిట్లరు తమ చెప్పుచేతలలో లేడని తెలిసిన తరవాత వాడిమీద యుద్ధం ప్రకటించాయి ఆ యుద్ధకాలంలో విధిలేక రష్యాతో చేతులు కలిపాయి ఆ సమయంలో కూడా ఈ దేశాలు ఒక్క హిట్లరు వినాశనమే కోరలేదు, రష్యా వినాశనం కూడా కోరాయి అందుకే చర్చిల్ గారు ఎంతకాలానికీ యూరప్‌లో సెకండ్ ఫ్రంట్ ఏర్పాటు చెయ్యలేదు మళ్ళీ రెండో ప్రపంచ యుద్ధం ముగిసింది లగాయతు రష్యా వ్యతిరేక కూటం ప్రారంభమయింది 1946 శాన్ ఫ్రాన్సిస్కో సమావేశమప్పుడే అమెరికాలోని “నేషన్” పత్రిక రష్యాపై సాగుతున్న కుట్ర గురించి తీవ్రంగా విమర్శించింది మూడో ప్రపంచ యుద్ధానికి జోరుగా యత్నాలు సాగుతున్న సమయంలో అభ్యుదయం వాంఛించే “న్యూస్టేట్‌మన్” పత్రిక రష్యాపై “అనుమానాలు” ప్రకటిస్తున్నది అమెరికా చేసే ప్రతిదానిలోనూ తద్దినం పెట్టేవాడి తమ్ముడి లాగా “ప్రాచీనావితీ” అంటూ బ్రిటన్ ఉంటూనే ఉన్నది కాని తమ ప్రభుత్వం గురించి ఈ పత్రిక్కి తెలీదు రష్యాతో బేరమాడటానికి తగ్గ బలం సంపాదించటానికే యుద్ధ యత్నాలు జరుగుతున్నాయన్నది అమెరికా మరిచిపోతున్నదని ఈ పత్రిక ఎన్నోసార్లు వాపోయింది! ప్రతిసారీ రాజీ సంభాషణలకు పిలిచేది రష్యా అనీ, రలాయించేది అమెరికా బ్రిటనులనీ ఈ పత్రిక గుర్తించటంలేదు

రష్యా పవిత్రమైనదా, నిష్కల్మషమైనదా అన్న ప్రశ్న వొట్టి చొప్పదంటు ప్రశ్న రష్యాను నాశనం చెయ్యటానికి జరిగే అంతర్జాతీయ ప్రయత్నాలు ప్రపంచ శాంతికే గాక, ప్రపంచ ప్రజల స్వాతంత్ర్యానికీ, ఆర్థిక క్షేమానికీ విఘాతం కలిగిస్తున్నాయి ఈ విధంగా రష్యా సమస్య ప్రపంచ ప్రజల సమస్య అయింది

మూడో కాంపులో దాక్కునేవాళ్ళూ, తలలు ఇసుకలో దాచుకునే ఉష్ట్రపక్షులూ ఈ సమస్యను పరిష్కరించలేరు దీని స్వరూపాన్ని మార్చలేరు రష్యా, చైనా, తూర్పు యూరప్ దేశాలు తమ ఆర్థిక ప్రజాస్వామ్యాన్ని వదిలేసి, పెట్టుబడిదారీ తెచ్చిపెట్టుకుని, అక్కడి ప్రజలు ఆర్థిక కాటకాలకూ, నిరుద్యోగానికీ గురి అయినా ప్రపంచ యుద్ధాలు తప్పవు మొట్టమొదట ప్రపంచ యుద్ధం సామ్రాజ్యవాదుల మధ్యనే వచ్చింది తనతో తాను రాజీ పడలేని సామ్రాజ్యవాదం కమ్యూనిజంతోనూ, సోషలిజంతోనూ రాజీ పడుతుందంటే అది కలలో వార్త కథలో తోడేలు గొర్రె పిల్లను చంపటానికి చాలా కారణాలు చెప్పింది అవికూడా “న్యూస్టేట్సుమన్” చెప్పే కబుర్లలాగే ఉన్నాయి ఐతే ఈసారిగొర్రెపిల్ల కాదు అనేకచోట్ల ప్రపంచ ప్రజలు ప్రపంచ శాంతికొరకు రష్యా పక్షాన నిలబడతారు అమెరికా పక్షాన నిలబడేవారు తమ ఆర్థిక రాజకీయ స్వాతంత్ర్యాన్ని పోగొట్టుకుంటున్నారుగాని రష్యా పక్షాన

నిలబడే ప్రపంచ ప్రజలు రష్యా రాజకీయ ఆర్థిక సిద్ధాంతాలను ఆమోదించవలసిన అవసరంకూడా లేదు స్వేచ్ఛా మారుతం ఎటునుంచి వస్తున్నదీ ఇప్పుడైనా తెలుసుకోలేనివారు రానున్న క్లిష్టపరిస్థితిని ఎట్లా ఎదుర్కొంటారు?

తెలుగు స్వతంత్ర వారపత్రిక 5-10-1951

## 30. పశ్చిమ రాజ్యాల స్వాతంత్ర్యము

అమెరికాలోని ప్రజా ప్రతినిధి సభలకు చెందిన అనేక సంఘాలూ, వాటి తాలూకు ఉపసంఘాలూ కూడా నిర్విరామంగా పనిచేస్తూ ఇతర పనులతోబాటు అప్పుడప్పుడు విచారణలు జరుపుతుంటాయి అమెరికా వ్యతిరేక చర్యలను గురించీ, మెకార్థర్ గురించి జరిగిన విచారణలు జగత్ప్రసిద్ధమైనవి ఇటీవల సెనేట్ జుడీషియరీ కమిటీ తాలూకు ఆంతరంగిక భద్రతల ఉపసంఘంవారు పసిఫిక్ సంబంధాల సంస్థను గురించి ఒక విచారణ జరిపారు ఒక పర్యవసాన మేమిటంటే, కెనడా ప్రతినిధి వర్గానికి ఐక్యరాజ్య సమితిలో తాత్కాలిక నాయకుడుగా ఉన్న ఇ. హెర్బర్ట్ నార్మన్ కమ్యూనిస్టని ఒక అభాండం వేశారు అమెరికా సాంస్కృతిక వాఙ్మయ నిఘంటువులో "కమ్యూనిస్టు" అన్న పదం ఒకతిట్టు, శాపనార్థం, దానివెంట చాలా అపఖ్యాతికూడా ఉంటుంది

నార్మన్‌కు సంబంధించి నంతవరకు ఈ అభాండాన్ని రుజువుచేసిన వారెవరూలేరు అతను 1939లో కేప్‌కాడ్‌లో కమ్యూనిస్టు విద్యార్థుల బృందంలో సభ్యుడుగా ఉన్నాడని డా కార్ల్ విట్‌ఫోగెల్ అనేవాడు సాక్ష్యం ఇచ్చాడు నార్మన్‌కు అపఖ్యాతి ఆపాదించటం కంటె ఈ "విచారణ"లో నార్మన్ పేరుతెచ్చి ఈ అబద్ధపు సాక్ష్యం ఇప్పించటంలో కాంగ్రెస్ ఉపసంఘానికి మరో ఆశయం ఉన్నట్టు కనిపించదు నార్మన్ 1938-39లలో రాక్‌ఫెలర్ స్కాలర్‌షిప్‌తో న్యూయార్కులో గడిపాడు అసలు రహస్యమేమిటంటే పసిఫిక్ సంబంధాల సంస్థ చేసేపని చాంగ్‌కైషేక్‌కు ప్రతికూలంగా ఉంటున్నది ఆ సంస్థ కమ్యూనిస్టు ప్రేరితమని రుజువు చెయ్యటానికీ హేయమైన చైనా లాబీ ఈ విచారణను పురికొల్పింది (ఇటువంటి విచారణలను పురికొల్పేది అవాచ్యులుగానే కనిపిస్తుంది)

నార్మన్ మీద వేసిన ఈ అభాండం కెనడా ప్రజలకు ఆగ్రహం కలిగించింది ఆగస్టు 11న ఒక ఒటావా పత్రిక ఈ విధంగా రాసింది " నార్మన్ ఉదంతం కెనడా ప్రజలకు సంబంధించి నంతవరకు ముగిసినట్టే-అదేప్రధానం కాని నార్మన్ మీద జరిగిన ఈ దాడి మూడు ముఖ్యసూత్రాలకు విరుద్ధంగా ఉన్నది " ఈ పత్రిక పేర్కొన్న మూడు సూత్రాలూ ఏమంటేః 1 ఏ వ్యక్తి అయినా సరే ఏదిపడితే అది చదివి, ఎవరితో బడితే వారితో సంపర్కం పెట్టుకునే స్వాతంత్ర్యం కలిగి ఉండాలి అనుమానాస్పదమైన సిద్ధాంతాలను గురించి తెలుసుకోవటానికి యత్నించిన మాత్రాన, ఆసిద్ధాంతాలను ఆమోదించినట్టు భావించ నవసరంలేదు ఈ సూత్రం అమెరికాలో ఒకప్పుడు అమలులో ఉండేది, ఈ నాడు లేదు 2 అమెరికాలో జరిగిన విచారణ కెనడా స్వాతంత్ర్య ప్రతిపత్తిని మన్నించటంలేదు కెనడాలోని ఒకానొక సివిల్ అధికారి మూలంగా అమెరికా యొక్క అంతరంగిక భద్రతకు ప్రమాదం కలిగితే దాన్ని గురించి

ఆందోళనపడి తగుచర్యలు తీసుకోవలసినది కెనడా ప్రభుత్వం "కెనడాను ఉపగ్రహరాజ్యంగా పరిగణించటంవల్ల స్వతంత్ర రాజ్యాల సమాఖ్యబలంగా ఏర్పాటు కాజాలదు "3 వాషింగ్టన్‌లో సత్యాన్వేషణ అన్నది మానేసి వ్యక్తులమీద అభాండాలు వెయ్యటమూ, వారి పరువు తియ్యటమూ, పాక్షిక రాజకీయాలు అవలంబించటమూ పరిపాటి అయినట్టు కనిపిస్తుంది అమెరికా ప్రతినిధులు ఈ గోప్యవిచారణా విధానాలను తమ దేశ ప్రజలకు మాత్రమే వర్తింపజేసినట్లయితే ప్రపంచ స్వాతంత్ర్యానికి గొప్ప సేవచేసినవారవుతారు "

ఆరోజునే మరొక కెనడా పత్రిక టొరాంటోనుంచి ఈ విధంగా రాసింది "కెనడా ప్రభుత్వం వాషింగ్టనుకు తీవ్రమైన ఆక్షేపణ తెలపాలి వాషింగ్టన్ దయ్యాల వేటలో కెనడియనులు వేలుపెట్టరు అమెరికా అధికారులకు ఏకెనడా సివిలు అధికారిని గురించిగాని సందేహాలున్నట్టయితే ఆవ్యక్తికి అన్యాయం జరగకుండా తమ అనుమానాలను తెలియజేసే మార్గాలున్నాయి కెనడా అమెరికాల మధ్య రాజకీయ సంబంధాలున్నాయి ఇనపతెర లేదు అంకుల్‌శామ్ జమీందారీలోని పూరి గుడిసెలో తలదాచుకున్న దరిద్రగొట్టు బంధువులాగా అమెరికా కెనడా యెడల ప్రవర్తించటం ఇది తొలిసారి కాదు బ్రిటన్ ప్రపంచాధిపత్యం వహించిన రోజుల్లో, కెనడా వ్యవహారాల్లో లండను ఏమాత్రం జోక్యం కలిగించుకున్నట్టు అనుమానం తోచినా తీవ్రమైన నిరసన బయలు దేరేది ఈనాటి వాషింగ్టను రాజకీయవేత్తలతో పోలిస్తే ఆ బ్రిటిషు రాజకీయవేత్తలు ఎంతో మర్యాదస్తులు "

అయితే "కెనడావారు సహించరన్నది వాషింగ్టనువారు ఎరగకపోవచ్చు లక్ష్యపెట్టకనూ పోవచ్చు" అని ఈ పత్రికే అన్నమాట అక్షరాలా నిజం ఏ మహాదాశయాలు కోరి పశ్చిమ రాజ్యాలు అమెరికా శరణు జొచ్చినప్పటికీ, అవి ప్రస్తుతం అమెరికాకు అమ్ముడుపోయి తమ స్వాతంత్ర్యాన్ని కోల్పోయిన మాట మటుకు నిజం వెనక హిట్లరు రష్యాను "సంహరిస్తా"డని ఈ పశ్చిమ రాజ్యాలే అతనికి పాలుపోసి పెంచితే అతను పశ్చిమ రాజ్యాలకు ఎసరు పెట్టాడు ప్రస్తుతం అమెరికా అదే పని చేస్తున్నది పశ్చిమ రాజ్య కూటం ఆశయాలు మిగిలినవన్నీ సార్ధకమే అనుకున్నా వాటికి స్వాతంత్ర్యం ఉన్నమాట మాత్రం పూర్తిగా అబద్ధం, బ్రిటిషు పౌరవిమానం కొన్ని బ్రిటిషు విమాన కేంద్రాల్లో దిగాలంటే వాషింగ్టన్ నుంచి అనుమతి కావాలి! బ్రిటను కీనాడున్న స్వాతంత్ర్యానికి ఇంతకంటె మంచి నిదర్శనం అవసరం ఉండదు

పశ్చిమ రాజ్యాలమీద అమెరికా చేస్తున్న ఈ "దురాక్రమణ కేవలం వాటి ప్రతిష్టకే భంగం కలిగించవచ్చు అమెరికా అక్కడ ఆగక వాటిపై ఆర్ధికంగా కూడా దెబ్బతీస్తున్నది అమెరికా"సహాయం"పై ఆధారపడిన దేశాలు రష్యా, చైనా, తూర్పు యూరపుదేశాలకు యుద్ధావసరాలు పంప వీలులేదు యుద్ధావసరాలని అమెరికా తయారుచేసిన జాబితాలో దాదాపు ప్రతి సామగ్రీ ఉన్నది

ఈ వ్యాపార నిబంధనవల్ల కమ్యూనిస్టు దేశాలు ఆర్ధికంగా దెబ్బతినే పక్షంలో కొంత అర్థం ఉండవచ్చు కాని అలా జరగడంలేదు బాటిల్‌గారు తన బిల్లును ప్రతిపాదించకపూర్వమే పశ్చిమ రాజ్యాలు అమెరికా ఒత్తిడికి లొంగి కమ్యూనిస్టు దేశాలతో వ్యాపారం తగ్గించి దాని ఫలితంగా దెబ్బతిని ఉన్నాయి కమ్యూనిస్టు దేశాలు ఆర్థికంగా చిక్కుపడ్డట్టు దాఖలాలు కనపడవు

తన వ్యాపారాన్ని పెంచుకోవటానికే అమెరికా ఈ ఆంక్షలు పెడుతున్నదని బ్రిటన్ మొదలైన దేశాలలోని విమర్శకులు-కమ్యూనిస్టు విరోధులు సహితం-బహిరంగంగా అంటున్నారు "తూర్పు పశ్చిమాల మధ్య వ్యాపారం నిలపటం అంత వివేకం కాదు " అని అంథోని ఈడెన్ అన్నాడు తూర్పు యూరపు రాజ్యాలకూ బ్రిటనుకూ మధ్యగల వ్యాపారం అతి ముఖ్యమైనదని బ్రిటిషు ఆర్థిక మంత్రి గేట్‌స్కెల్ వాషింగ్టనులో పత్రికా విలేఖరులతో అన్నాడు ఆ వ్యాపారం నిలచిపోతే ఆదేశాలకన్న బ్రిటనుకే ఎక్కువదెబ్బ అని కూడా ఆయన వివరించాడు సోవియట్ యూనియన్ నుంచి బ్రిటన్ బోలెడంత ఆహారపదార్థాలూ, కలపా దిగుమతి చేసుకుంటున్నది అట్లాగే డెన్మార్క్ పోలండ్ నుంచి బొగ్గు దిగుమతి చేసుకుని, నావలు ఎగుమతి చేస్తున్నది నావల ఎగుమతికి అమెరికా ఒప్పదు డెన్మార్కు నావల ఎగుమతి నిలిపితే బొగ్గుదిగుమతి నిలిచిపోయి చలికాలానికీ, పరిశ్రమలు నడపడానికి బొగ్గుండదు

అమెరికాకు బ్రిటను యుద్ధస్థావరాలివ్వటాన్ని కూడా సమర్థించే ఏ జె పి టేలర్ ఈ వ్యాపారనిర్బంధం గురించి ఈ విధంగా అంటున్నాడుః

"బ్రిటనుకు గల ఆర్థిక చిక్కులలో గొప్పది డాలరు కొరత మేము ఎన్ని వస్తువులు ఇతర దేశాలనుంచి తెప్పించుకో గలిగితే ఈ చిక్కు అంత తక్కువగా ఉంటుంది బాటిల్ గారు (బాటిల్ బిల్ ప్రతిపాదకుడు) చెప్పినట్టు వింటే మేము అమెరికా మీద మరింతగా ఆధారపడి కాంగ్రెసు చపల చిత్తానికి మరింతగా గురికావలసి వస్తుంది ఎటొచ్చీ, మమ్మల్ని ఏం చేయమంటారు? మార్షల్ సహాయంపై ఆధారపడకుండా ఉండటానికి మేము ఇతర దేశాలకన్నా ఎక్కువ కృషి చేశాం తూర్పు యూరప్ మొదలుగాగల ఇతర దేశాలతో వ్యాపారం చెయ్యకుండా ఇది సాధ్యమై ఉండేది కాదు మేము ముందు బాగుపడాలంటే ఆ దేశాలలో మా అమ్మకాలు పెంచుకోవాలసి కూడా ఉంది (అమెరికా) తన మిత్ర రాజ్యాలను బెదిరింపులతో లొంగదీయక వారి స్వాతంత్ర్యాన్ని మన్నిస్తుందని పశ్చిమ రాజ్యాలలోగల అమెరికా మిత్రులు వాదిస్తూ వచ్చారు బాటిల్ బిల్లు దీనికి విరుద్ధంగా ఉండి, కమ్యూనిస్టులు ప్రకటించే సందేహాలన్నిటినీ బలపరుస్తోంది " (సెప్టెంబరు8, "నేషన్" పత్రిక )

అమెరికా బ్రిటనుల విదేశాంగ విధానంలో గల తేడాను ఈయన ఈవిధంగా చెబుతున్నాడు "మూడవ ప్రపంచయుద్ధం తప్పదని నమ్ముతూ అమెరికనులు దానిలో నెగ్గటం గురించే ఆలోచిస్తున్నారు యుద్ధం రాకుండా ఉండటం బ్రిటను యొక్క ఆశయం" ఈ భ్రమ బ్రిటనులో చాలామందికున్నది ఒకవేళ బ్రిటిష్ లేబరు ప్రభుత్వాశయం కూడా ఇదే అయినప్పటికీ అమెరికా చేతికింద ఉన్న బ్రిటనుకు రాజకీయ ఆర్థిక స్వాతంత్ర్యం లేనంతకాలం బ్రిటన్ ఆశయం ఏదన్నా ఒకటే బ్రిటన్ ఆశయానికి విలువ ఉండాలంటే ముందు బ్రిటన్‌కు స్వాతంత్ర్యం ఉండాలి

పశ్చిమ రాజ్యాల స్వాతంత్ర్యాన్ని ఈ విధంగా ఆపహరించే అమెరికాలో అంతరంగిక స్వేచ్ఛ ఏపాటి ఉన్నదన్నదికూడా తెలుసుకోదగిన విషయమే అమెరికాను "నిష్కమ్యూనిజం" చేసే యత్నంలో ఎటువంటి నాసిరకం వ్యక్తులు ఘరానా మనుష్యుల కింద బోనులెక్కి సాక్ష్యాలిస్తున్నారో అమెరికన్ పత్రికలేవ్యక్తం చేస్తున్నాయి 1949లో నీగ్రోలనూ, వారి

సానుభూతిపరులనూ, పౌరహక్కులనూ, దుంప నాశనం చెయ్యటానికి యెటువంటి వారు ప్రేరేపించబడ్డారో, వారికి అమెరికన్ పోలీసులు యెటువంటి సహాయం ఇచ్చారో హోవార్డుఫాస్ట్ గ్రంధం "పీక్స్కిల్" (1951 ప్రచురణ) వ్యక్తం చేస్తోంది

వీటన్నిటికన్నా విచిత్రమైన కథ సోయాబీనుల కథ కొరియా యుద్ధం ఇంకాకొన్ని వారాలకు ఆరంభమవుతుందనగా అమెరికాలోని కొందరు చైనావారు చికాగో బోర్డాఫ్ ట్రేడ్‌లో సోయాబీన్ వ్యాపారమంతా గుత్తపరచుకున్నారు వారు సోయాబీన్ ధర బుషెల్ 1కి డాలరు పై చిల్లర పెంచి 3 కోట్ల డాలర్ల లాభంతో బయటపడ్డారు వీరిలో చాంగ్‌కైషేక్ దూరబంధు వొకడు అయిదు లక్షల బుషెల్స్ తన పరం చేసుకున్నాడు సోయాబీన్‌లను గుత్తపరచుకున్న చైనావారు 59 మందికి పైగా ఉన్నారు దాదాపు వీరంతా "జాతీయ వాదులే" తీరా కొరియా యుద్ధం ప్రారంభమైనాక చైనావారు సోయాబీన్‌ల వ్యాపారంలో కనబరుస్తూ వచ్చిన ఆసక్తికి అర్థం ఏర్పడింది "అధికార్లకు అనుమానం కలిగింది ఈ దేశానికి ఏమాత్రం తెలియకుండా కలిగిన యుద్ధం గురించి ముందుగా వారికి (జాతీయచైనా వారికి) ఎట్లా తెలిసిందా అని," అని జూలై ఆరున 'న్యూయార్క్ టైమ్స్" పత్రిక రాసినట్లు, సెప్టెంబరు ఒకటి నేషన్ పత్రిక సంపాదకీయం రాసింది ఇంత పెద్ద మొత్తాలలో సోయాబీన్‌లను కొనటానికి చైనావారికి నగదు ఎక్కడ దొరికిందని ఆశ్చర్యం అవసరంలేదు చైనా జాతీయవాదులకు అమెరికా ఇచ్చిన "సహాయం"లో 20 కోట్ల డాలర్ల విలవగల బంగారం కూడా ఉంది

పసిఫిక్ సంబంధాలను గురించి జరిగే "విచారణ"లో తమకు వ్యతిరేకంగా ఉన్నవారు కమ్యూనిస్టులని సాక్ష్యం ఇప్పించటానికి చైనా లాబీ తన పలుకుబడిని ఎందుకు ఉపయోగిస్తున్నదీ అర్థమవుతూనే ఉన్నది, కాని ఎట్లా ఉపయోగిస్తున్నదీ సరిగా అర్థం కావటం లేదు అదే కారణంగా అమెరికా కీనాడు నిజమైన అంతరంగిక స్వేచ్ఛకూడా లేదు

తెలుగు స్వతంత్ర, వారపత్రిక, 26-10-1951

# 31. ఇండియా విదేశాంగ విధానం

ఎన్నికలు జరిగే లోపుగా భారత ప్రజలు నెహ్రూనుంచి మరొకసారి ఇండియా వైదేశిక విధానోద్ఘాటన కోరటానికి హక్కున్నది ఎందుచేతనంటే ఇటీవల ప్రపంచ రాజకీయ వాతావరణంలో అనేక కొత్త పరిణామాలు ఏర్పడటమేకాక, అంతర్జాతీయ రాజకీయ పరిస్థితి చాలా విధాల విషమించింది

అన్నిటికన్నా ప్రధానంగా భావించవలసినవి యుద్ధజ్వాలలు కొరియా యుద్ధం అమెరికాకు ఏమాత్రమూ అనుకూలంగా పరిణమించటంలేదు అక్కడ చైనా యుద్ధ విమానాల చర్యలు జాస్తి అయినాయనీ, అమెరికా విమానాలకు పూర్వం ఉన్న ఆధిక్యత లేదనీ అమెరికా వారే అంటున్నారు ఇటీవల నాలుగు వందల చిల్లర అమెరికన్ విమానాలు ధ్వంసమయినట్టు అమెరికా చెబితే, దానికి ఎన్నో రెట్లు ధ్వంస మయినాయని చైనా చెబుతున్నది ప్రస్తుతం నెలకు 330 కోట్ల డాలర్లు యుద్ధ ఖర్చుక్రింద వ్యయం చేస్తున్న అమెరికా కొరియాలో దెబ్బతిని పారిపోవటానికి ఒప్పుకోదు ఒప్పుకోకపోతే ఐక్యరాజ్య సమితిలో అమెరికాను అడిగేవారూలేరు

రాయిటరు వార్తలు మాత్రమే నమ్మినప్పటికీ కొరియా యుద్ధ విరమణ చర్యలలో అమెరికా కన్న చైనావారే ఎక్కువ ఉదారంగా వ్యవహరిస్తున్నట్టు కనిపిస్తుంది కీసాంగ్ సంభాషణలు భగ్నమైన సందర్భంలో నిష్పాక్షిక విలేఖరుల కథనాన్ని బట్టి కూడా అమెరికాకు కొరియాలో యుద్ధ విరమణ నిజంగా ఇష్టంలేదేమో ననిపిస్తుంది

అది ఏమైనా అమెరికాలోని బాధ్యతగల రాజకీయ వాదులు కొరియా రంగంలో అణువు బాంబులను ప్రయోగించమని అమెరికా ప్రభుత్వాన్ని హెచ్చరిస్తున్నారు ఇటీవల అమెరికాలో పరీక్షించిన అణువు బాంబులు కూడా పరిమిత యుద్ధరంగాన ప్రయోగించటానికి యోగ్యంగా ఉన్నట్టు తెలుస్తున్నది అదే నిజమైతే అమెరికా పరిపాలకులు కొరియాలో అణువు బాంబులను పడవెయ్యటానికి ఇవాళ కాకపోతే రేపైనా నిర్ణయించవచ్చు అటువంటి అస్త్రం చేతిలో ఉండగా చైనాచేత దెబ్బతినటం అమెరికాకు ఇష్టం ఉండదు

అయితే రష్యాకు కూడా అణువుబాంబులు వేరు వేరు ప్రమాణాలవి ఉన్నట్టు స్టాలిన్ బయట పెట్టాడు అంతేకాక, అణువుబాంబులు అమెరికా సొత్తుగాని, రష్యా సొత్తుగాని కావని చైనాకూడా ప్రకటించింది ఒకవేళ రష్యా చైనాకు అణుశక్తి ఉత్పాదన కీలకాలు తెలిపి ఉండవచ్చు ఆ దేశాల మధ్య పరస్పర రక్షణ సహకార సంధిప్రకారం ఈ పని జరిగి ఉండవచ్చు అమెరికా పాలకులు అణ్యస్త్రాల ప్రయోగాన్ని సమర్ధించటానికి, "మాకు గల యుద్ధ సామాగ్రిలో అణువు బాంబులు కూడా ఒకటి గనక మేం వాటిని యుద్ధంలో ప్రయోగించవచ్చు" అన్న ప్రకారమే, చైనాకు సహాయం వెళ్ళటానికి ఒప్పందం చేసుకుని ఉన్న రష్యా, తనకుగల యుద్ధవిమానాల పంపిణీతో బాటే, అణువుబాంబుల పంపిణీ కూడా చైనాకు అందించి ఉండవచ్చు

ఒక్క చైనాకే గాక రష్యా తూర్పు యూరపు రాజ్యాల కన్నిటికీ అణువు బాంబులు తయారుచేసే సాంకేతిక సహాయం చేసి ఉండవచ్చు ఇదే జరిగివుంటే పశ్చిమరాజ్యాలకు లేని సౌకర్యం ఒకటి తూర్పు కూటానికి ఉన్నట్టవుతున్నది మొదటినుంచీ అమెరికా తన అణువు రహస్యాలను ఏదేశంతోనూ పంచుకోలేదు ఆఖరుకు బ్రిటనులో కొన్ని అణువు బాంబులను ఉంచటానికి కూడా అమెరికా సమ్మతించలేదు కాని ఇటీవల ట్రూమన్, అణు రహస్య రక్షణను సడలించి "మిత్ర" దేశాలకు పంచగలమని ప్రకటించటాన్ని బట్టి పశ్చిమ రాజ్యాలకు గల ఈ అసౌకర్యం గుర్తించబడ్డట్టు కూడా కనిపిస్తున్నది ఒకవేళ అమెరికాకు అణువు బాంబు రహస్యాలు తెలిపే ఇచ్ఛ నిజంగా లేని పక్షంలో రష్యా కూటంలోని రాజ్యాల కన్నిటికీ అణువు బాంబులున్నట్టు రుజువై-అమెరికా తనకు తానై అణువుబాంబు ప్రయోగించిన తరవాత ఈ విషయం సులభంగానే రుజువవుతుంది- మిగిలిన పశ్చిమ రాజ్యాలు అమెరికాతో పొత్తులేని స్థితిలో అణువు బాంబులకు గురి కావటానికి ఎంతమాత్రమూ ఒప్పుకోవు అందుచేత అమెరికా తప్పనిసరిగా బ్రిటన్, ఫ్రాన్స్, జర్మనీ వగైరా దేశాలన్నిటికీ అణువు బాంబులు తయారుచేసే పద్ధతి తెలిపి తీరవలసి వస్తుంది లేదా తలా కొన్ని అణువు బాంబులు సప్లయి చెయ్యవలిసి వస్తుంది ఇందులో ఏది జరిగినా యుద్ధప్రమాదం హెచ్చుతుందే గాని తగ్గదు ఇటువంటి పరిస్థితిలో ఇండియావంటి దేశాలు-అణువు బాంబులు లేనివీ, తెచ్చుకోలేనివీ- ప్రపంచ శాంతి కొరకూ, అణ్వస్త్ర నిషేధం కొరకూ మరింత తీవ్రంగా ఆలోచన సాగించవలసి వచ్చింది

ఇదివరలో ఇండియా అణుశక్తి కంట్రోలు విషయంలో సరిఅయిన పాత్ర నిర్వహించలేదు లోగడ అణుశక్తి కంట్రోలు గురించి రష్యా తెచ్చిన ప్రతిపాదనకు విరుద్ధంగా బరూచ్ పథకం అమెరికా ప్రతిపాదించింది ఈ ప్రతిపాదన అణువు బాంబులను నిషేధించేది ఎంత మాత్రమూ కాదు కనుకనే ఇండియా దానిపై వోటింగులో పాల్గొనక తటస్థంగా ఊరుకున్నది బరూచ్ పథకం గురించి కొందరు అమెరికనులూ, బ్రిటిష్ అణుశాస్త్రవేత్తలూ (ఉదా బ్లాకెట్) చెప్పిన విషయాలనుబట్టి అది అమలు జరిగేది కాదు కాని అమెరికా ఇంకా దాన్నే పట్టుకుని వేళ్ళాడుతున్నది ఈసారి పారిస్‌లో జరగగల ఐక్యరాజ్య సర్వ ప్రతినిధి సభలో ఇండియా ప్రపంచ శాంతికొరకు కృషి చేస్తుందనుకొంటున్నారు ఈసారి ఇండియా చేసే కృషిలో తాటస్థ్యం ఎంతమాత్రం ఉండరాదు సర్వ ప్రతినిధి సభలో యుద్ధోన్మాదుల సంఖ్య ఎక్కువైపోయి ఇండియా ప్రయత్నాలు విఫలం అయినప్పటికీ ఇండియా శాంతి యత్నాలు తీవ్రంగా సాగించి ప్రపంచ ప్రజల ఆదరాన్నయినా పొందితీరాలి ఎందుచేతనంటే ప్రపంచ ప్రజలు ఈసారి చేతులు ముడుచుకొని కూర్చోలేదు ఈసారి ఎవరు యుద్ధం ప్రారంభించినా ప్రపంచ కార్మికులూ, మేధావులూ, శాంతికాముక ప్రజాసామాన్యమూ తీవ్రమైన ప్రతిఘటనకు తప్పక పూనుకుంటారు ఈ ప్రపంచ శాంతి ఉద్యమంలో ఇండియా ప్రభుత్వం భారత ప్రజల వెనక నిలబడినా ప్రపంచ శాంతికి చాలా మేలు

ఇంకా ఇతర పరిణామాలు చాలా జరిగాయి, జరుగుతున్నాయి దూర ప్రాచ్యంలో జపాను సంధి జరిగింది ఈ సంధి పత్రం మీద జపానుతో సంబంధం ఉన్న దేశాలూ, లేని దేశాలూ కూడా (!) సంతకాలు పెట్టాయి కాని జపానుకు అతి సన్నిహిత దేశాలూ, పెద్ద దేశాలూ అయిన ఇండియా చైనాలు సంతకాలు చెయ్యలేదు జపానును తిరిగి యుద్ధానికి ఆయత్తంచేస్తున్నట్టు అన్ని దేశాల పత్రికలూ బయటపెడుతున్నాయి ఈ పుణ్యం ప్రస్తుతం అమెరికా కట్టుకుంటున్నది జపాను శాంతి పత్రంపై సంతకం చెయ్యకపోవటంతో ఇండియా బాధ్యత అయిపోదు ఇదికూడా తాటస్థ్యం లాగానే ఉన్నది జపానుతో ఎటువంటి సంధి జరగాలో, ప్రపంచ శాంతికీ, ఆసియా ప్రజల స్వేచ్ఛకూ జపాను తోడ్పడి సమభాగికావాలంటే జపానులో అమెరికా బలాలు శాశ్వతంగా ఉండటంగాని, ఇండియా చైనాలతో జపానుకుగల యుద్ధస్థితి అంతంకాక పోవటంకాని ఎంత వినాశ హేతువో ఇండియా తెలియ జెప్పాలి జపానుతో ఇండియా ప్రత్యేక శాంతి ఒడంబడిక చేసుకుంటుందని తెలిసిన తరవాత అమెరికా పాలకులు ఒక బెదిరింపు బెదిరించారు జపానుతో ఏదేశం ప్రత్యేక శాంతి ఒడంబడిక చేసుకున్నా, అమెరికా బ్రిటనులు చేసుకున్న ఒడంబడికపంపిణీపైనే ఉండాలన్నారు ఇటువంటి శాసనం జారీ చెయ్యటానికి గల అధికారం జపానుపైనా, ఇతర దేశాలపైనా తమకున్నదని అమెరికా పాలకులుభ్రమపడి ఉండాలి ఇండియా ఈ భ్రమను తొలగగొట్టాలి లేని పక్షంలో ప్రపంచ రాజ్యాలన్నిటికీ అమెరికా శాసన కర్త అన్నది రుజువవుతుంది ఇండియాకు స్వాతంత్ర్యం ఉన్నదన్న మాటకూడా అబద్ధం అవుతుంది

ఈ స్వాతంత్ర్యాన్నే చూపి నెహ్రూ ఇటీవల, "బ్రిటనులో ఏప్రభుత్వం ఏర్పడినా మన విదేశాంగ విధానం మార నవసరంలేదు," అన్నాడు కాని కాస్త యోచిస్తే నెహ్రూ చెప్పినది అంత వాస్తవంగా కనపడదు మన స్వాతంత్ర్యానికీ బ్రిటిషు లేబరు ప్రభుత్వానికీ ఎంత సన్నిహిత

సంబంధం ఉన్నదో, మన విదేశాంగ విధానానికీ బ్రిటిషు లేబరు ప్రభుత్వ విదేశాంగ విధానానికీ అంత సన్నిహిత సంబంధం ఉన్నది నెహ్రూ ప్రభుత్వం బ్రిటిషు లేబరు ప్రభుత్వ విధానాన్ని మక్కికి మక్కీగా కాపీ కొట్టకపోయినా ఆ విధానంతో మన విధానాన్ని చాలా దగ్గిరగా సమన్వయిస్తూ వచ్చింది వారి విధానం లాగానే మనదికూడా ప్రత్యక్ష ఫలితాల నివ్వలేక పోయింది చిట్టచివరకు లేబరు ప్రభుత్వంవారు తమ విదేశాంగ విధానానికి స్వస్తి చెప్పవలసిన పరిస్థితి ఏర్పడే, అకాల యెన్నికలు పెట్టి అధికారాన్ని కన్సర్వేటివుల ఒడిలోకి విసిరివేశారు ఎన్నికలముందు స్కార్‌బరోలో కార్మిక పక్షాల సమావేశం జరిగినప్పుడు అట్లీ వర్గంవారి విధానాలపై ఎన్నో సవరణలు ప్రతిపాదింపబడినాయి కాని వాటి పై ఎట్టిచర్చా జరగకుండా చేశారు లేబరు నాయకులు అఖరుకు యుద్ధ ఖర్చుగురించి అట్లీ బెవాన్ వర్గాలకు గల అభిప్రాయభేదాలు కూడా బుట్ట దాఖలు చేయబడ్డాయి 470 కోట్ల పౌనుల యుద్ధవ్యయమూ, దానివల్లకలిగే ఆర్థిక సంకటాలకు ఇచ్చుకోవలిన సంజాయిషీ భారమూ కన్సర్వేటివు నెత్తినే పడనిమ్మని లేబరు పార్టీవారు స్కార్ బరో సమావేశాన్ని కేవలం యెన్నికల సమావేశంకింద ముగించారు గత యెన్నికలలో లేబరు పొందిన ఓటమి మూలంగా పార్టీవారు తమ విదేశ విధానంలోని బండారం బయట పడనీకుండా తప్పించుకోగలిగారు లేకపోతే బ్రిటను స్వాతంత్ర్యాన్ని అమెరికాకు హారతిపట్టిన అపకీర్తి, వెల్‌ఫేర్ స్టేటుకు తిలోదకాలు విడిచిన అపకీర్తి, తాము ప్రారంభించిన సోషలిస్టు విధానాలు బూటకమని చాటుకోవలసిన అపకీర్తి లేబరు పక్షానికే దక్కేవి

లేబరుపార్టీ ఎటువంటి పరిస్థితిలో ఓడిపోయిందో, వారి విదేశాంగ విధానాలు ఎట్లాంటి పరిణామాలకు దారితీశాయో సరిగా ఆలోచిస్తే నెహ్రూ తన విదేశాంగవిధానాన్ని మరింత వాస్తవిక భాషలో ప్రకటించవలసిన అవసరం ఉన్నదని వ్యక్తమవుతుంది నెహ్రూ కూడా వెల్ ఫేర్ స్టేట్ గురించీ, చైనాకు ఐక్యరాజ్య సమితిలో స్థానం ఇచ్చీ తద్వారా ప్రపంచ శాంతి రక్షించటం గురించిమాట్లాడాడు కాని ఈ శుష్కనీతి బ్రిటిషు లేబరు పక్షానికి ఎందుకూ పనికిరాలేదు మనకు అసలే పనికిరాదు మనకవి పనికి రావాలంటేవాటిని సిద్ధాంతాలుగా పెట్టుకుని వాటి కనుగుణంగా మన విదేశాంగతంత్రాన్ని నడిపించాలి చైనాకు రష్యా ఇండియాకన్న సన్నిహితం కాదు అయినా ఆ రెండు దేశాలమధ్య వాణిజ్య, రక్షణాది ఒడంబడికలున్నాయి వాటివల్ల రెండు దేశాలూ బాగుపడుతున్నాయి మనం చైనా సభ్యత్వాన్ని సంవత్సరానికొకటి రెండుసార్లు బలపరుస్తున్నాంగాని చైనాతో గట్టి ఒడంబడికలు చేసుకోలేదు పైపెచ్చు, చైనాకు చాంగ్‌కైషేక్‌ను ప్రతినిధిగా గుర్తించే అమెరికా ఆంక్షలు పెడితే చైనానుంచి మన అవసరం కొద్దీ బియ్యం పుచ్చుకోవటానికి కూడా అశక్తులమై ఉన్నాం

ఆర్థికంగా, సాంకేతికంగా, రాజకీయంగా సైనికంగా మనం ఎంతో సహాయం అవసరమైన స్థితిలో ఉన్నాం ఈనాటి చైనానుండి మనకు కావలసిన అన్నిరకాల సహాయమూ లభిస్తుంది రెండు సంవత్సరాలలో తన స్వరూపాన్ని పూర్తిగా మార్చివేసుకున్న చైనా మనకు అండగా ఉంటే మనం ఎంతైనా ముందుకు పోగలం మన స్నేహాన్ని చైనా ఎంత గాఢంగా వాంఛిస్తున్నదో, అందులో నూరోవంతైనా మన ప్రభుత్వం చైనా మైత్రికోసం కృషి చెయ్యటం లేదు మీదుమిక్కిలి తమకు అక్కర్లేని గోధుమలు తిండికిమాడే మన కివ్వటానికి నూరు షరతులూ, నూరు

అభ్యంతరాలూ చెప్పే అమెరికా పరిపాలకుల ముందు నిలబడి మన ప్రతినిధులు చేతులు నులుపుకుంటూ, "మేము ఐక్యరాజ్యసమితిలో మీకు రెండుసార్లు మాత్రమే విరుద్ధంగా వోటు వేశాము" అని బీద అరుపులు అరవటం కంటె మన విదేశాంగ విధానానికి పెద్ద కళంకంలేదు మన విదేశాంగ విధానంలో చైనాకు అత్యున్నత ప్రాముఖ్యం ఇవ్వకపోతే అది మన క్షేమానికి ఉపకరించే విధానమే కాదు

మధ్య ప్రాచ్యంలో పరిస్థితులు కూడా చాలా మారిపోయాయి మనకున్నంత ఎక్కువ రాజకీయ స్వాతంత్ర్యం లేకపోయినా ఇరాన్, ఈజిప్టులు సామ్రాజ్యవాదులతో మనకన్న దీక్షగా ఢీకొంటున్నాయి మన దేశంలో అంతులేని బ్రిటిషు పెట్టుబడులుండి అంతులేని లాభాలు తీస్తున్నామనం సహించి ఊరుకోవటమేగాక, వాటిని జాతీయం చెయ్యబోయని భరవసా లివ్వటమే గాక, విదేశీ పెట్టుబడిని ఇంకా ఆహ్వానిస్తుంటే ఇరాక్ బ్రిటిషు వారిని బయటికి గెంటేసింది అన్యాయమైన పాత ఒప్పందాలను చించిపారేసింది మనం బెత్తెడు స్థలంలోనుంచి ఫ్రెంచి సామ్రాజ్య వాదులనూ పోర్చు గీసువారినీ తరమలేకుండా ఉంటే ఈజిప్టు బ్రిటిషువారిని సూయజ్, సూడాన్ ప్రాంతాలనుంచి గెంటివెయ్యటానికి సిద్ధపడుతున్నది ఈజిప్టు కూడా తన స్వాతంత్ర్యం కోసరం బానిస ఒప్పందాలను చించిపారేసింది ఈ తిరుగుబాటువల్ల మధ్యప్రాచ్యంలో ఏర్పడే పరిస్థితి ప్రభావం మన విదేశాంగ విధానంపై ఉండదనుకోవటం పొరపాటు ఈ దేశాలు మన సహాయం ఆపేక్షిస్తాయి మనం నిత్యమూ జపించే స్వాతంత్ర పదానికి అర్థం ఉంటే, స్వాతంత్ర్యం కూడా అవిభాజ్యమైతే మనం మధ్య ప్రాచ్య దేశాల స్వాతంత్ర్య సమరాన్ని వీలయినన్ని విధాల బలపరిచి తీరాలి ఇక్కడ కూడా ఇండియా శుష్క ప్రియాలతోనే సంతృప్తి పడుతున్నది

ఒక్కముక్కలో చెప్పాలంటే ఇండియా బలమైన విదేశాంగ విధానం అవలంబించాలంటే సామ్రాజ్యవాదుల తోకా, యుద్ధోన్మాదుల కొంగూ పట్టుకువేళ్ళాడటం ఖచ్చితంగా మానాలి కాంగ్రెసు ప్రభుత్వం ఆపనిచెయ్యలేని పక్షాన మళ్ళీ ప్రభుత్వం నిర్వహిస్తానని ముందుకు రాకుండా ఉండటం మేలు

తెలుగు స్వతంత్ర, వారపత్రిక, 9-11-1951

# 32. జెక్ జాతీయ కళామందిరం

జాతీయ భావాలు అభివృద్ధి అయి కళలను పెంపొందించుకునే ప్రతిజాతికీ కొన్ని జాతీయ కళాచిహ్నాలు ఏర్పడతాయి అటువంటి వాటిల్లో జాతీయ కళామందిరం ఒకటి కళామందిరాలు జాతీయవికాస ప్రభావంచేత ఏర్పడటమేగాక, జాతీయైక్యతకు సాధనాలుగా కూడా పనిచేస్తాయి

జెకోస్లొవాకియాలోని జాతీయ కళామందిరం జెక్ జాతీయతను ప్రతిబింబించినట్టుగా మరే దేశంలోని జాతీయ కళామందిరమూ ప్రతిబింబించదని జెక్‌లు చెప్పుకుంటున్నారు దీనికి కారణమేమిటి?

జెకొస్లొవాకియా ఆస్ట్రియా ఆధిపత్యంకింద ఉండి, వియన్నానుంచి వెలువడే జర్మన్ సంస్కృతి ప్రవాహంలో మునిగి తేలుతున్న కాలంలో జెక్ జాతీయ సంస్కృతికి గుండె కాయలాగా పనిచేయాలన్న భావంతో జాతీయ కళామందిరం నిర్మించబడింది అప్పటికి జెక్ జాతీయ

సంస్కృతిని దేశాభిమానులు నాటకాల ద్వారానూ, బొమ్మలాట ద్వారానూ ప్రజలలో వ్యాపింపజేస్తూ వచ్చారే గాని ఆ సంస్కృతికి ఒక బాహ్యచిహ్నమూ స్థిరకేంద్రమూ లేదు

జెక్ జాతీయమందిరం నిర్మించాలన్న భావం మొట్టమొదటగా జె కె టైల్ అనే నాటక కర్తకు కలిగింది ఈ అభిప్రాయాన్ని ఆస్ట్రియన్ అధికారులు చాలాకాలం సాగనివ్వలేదు కాని, ఒత్తిడికింద గాలికి శక్తి హెచ్చినట్టు, జెక్ జాతీయ భావాలు రానురాను మరింత శక్తి సంపాదించుకున్నాయి 1865లో జాతీయ కళామందిర నిర్మాణోద్యమం కార్యోన్ముఖమయింది డబ్బు దేశం నలుమూలలనుంచీ పోగయింది సామాన్య ప్రజలు అణాలూ, అర్ధణాలూ వేసుకొని జాతీయ మందిరాని కయే ఖర్చు సమకూర్చారు మరి మూడు సంవత్సరాలకు శంకుస్థాపన జరిగింది ఈ శంకుస్థాపనకు గాను దేశం అన్ని ప్రాంతాలనుంచీ రాళ్ళను ఊరేగిస్తూ తెచ్చారు! మందిర నిర్మాణంలోనూ, శిల్పంలోనూ, కుడ్యచిత్రాలలోనూ ఆనాటి ఉత్తమజెక్ శిల్పం ప్రతిబింబించింది నిర్మాణం పూర్తి కాక పూర్వమే అందులో జెక్ నాటకాలూ, ఓపెరాలూ ప్రదర్శించసాగారు నిర్మాణం పూర్తిఅయి ఇంకొక నెలలో అధికారరీత్యా ప్రారంభోత్సవం చేస్తారనగా ఈ మందిరానికి అగ్నిపరీక్ష జరిగింది– 1881 ఆగస్టు12న దానికి నిప్పంటుకుని నేలమట్టంగా కాలిపోయింది

ఇది జెక్ ప్రజలకుకూడా అగ్ని పరీక్షే వారు దీక్షగా కృషిచేసి నిర్మించిన ఈ జాతీయ చిహ్నం పరశురామప్రీతి కావటంతో దీని విలువ జెక్ ప్రజలు మరింత గాఢంగా గుర్తించారు అసమాన దీక్షతో ప్రజలు తిరిగి చందాలు వేసుకున్నారు రెండేళ్ళలో తిరిగి జాతీయ కళామందిరం నెలకొన్నది దీనికి తెర తయారుచేసిన చిత్రకారుడు వాక్లవ్ హైవాయిస్ ఆ తెరమీద అన్ని తరగతులకు చెందిన జెక్ ప్రజలనూ, కళామందిర నిర్మాణానికి కృషి చేసిన శిల్పులనూ, ఇంజనీర్లనూ, కూలీలనూ, కవులనూ, గాయకులనూ, నటులనూ కూడా చిత్రించాడు జెక్ జాతీయైక్యతను అతను ఈ విధంగా తెర కెక్కించాడు

తమదైన జాతీయ కళామందిరాన్ని సందర్శించటానికి జెక్ ప్రజలు అన్ని ప్రాంతాలనుంచీ తీర్థయాత్ర వచ్చారు ప్రాగ్ నగరానికి ప్రత్యేక రైళ్ళు నడిచాయి 1883 నవంబరు 28న కోలిన్ నుండి మొట్టమొదటి ప్రత్యేక రైలులో 630 మంది వచ్చారట

ఇది నిజంగా అపూర్వమైన విషయమే, ఎందుచేతనంటే ఎన్నిదేశాలలోనో జాతీయ కళామందిరాలున్నాయి వాటి నిర్మాణాన్ని ఏ పాలకులో, కళాభిమానులైన ధనికులో సాగించటం జరిగింది కాని సామాన్య ప్రజలు చైతన్యం ప్రదర్శించి, అభిమానించి తమ డబ్బుతోనూ ఉత్సాహంతోనూ జాతీయ కళామందిరం నిర్మించటం జెకొస్లోవాకియాలో తప్ప ఇంకెక్కడా జరిగినట్టు కనిపించదు ఈ సందర్భంలో మనం కీర్తిశేషులైన బళ్ళారి రాఘవాచార్లు గారిని స్మరించాలి ఆంధ్రులకొక జాతీయ కళామందిరం ఏర్పరచాలని ఆయన ఎన్నో కలలు కన్నాడు అది ప్రజలపరంగా ఉండాలనీ, అధికారులకూ, ధనికులకూ, పెత్తందార్లకూ దానిపై అజమాయిషీ ఉండరాదనీ ఆయన కోరారు దేశంలో ప్రజలందరూ పావలాలు వేసుకున్నట్టయితే అద్భుతమైన జాతీయ కళామందిరం తయారవుతుందని ఆయన అంచనా అయితే దురదృష్టవశాత్తూ ఆయన ఆదర్శాల నెవరూ గుర్తించలేదు ఆయనవంటి జగద్విఖ్యాతుడు బయలుదేరితే ఒక

లక్ష రూపాయలు అవలీలగా పోగయేవనీ, ధనికులు పదిమంది పూనుకుంటే జాతీయ కళామందిరం తయారయేదనీ అనేకమంది మిత్రులు రాఘవాచారిగారితో అన్నారు కాని ఆవిధంగా తయారుచేసిన కళామందిరం తప్పకుండా ప్రజలకు దూరమైపోయేది

ప్రజల డబ్బుతో ప్రజల భక్తిశ్రద్ధలతో ప్రజల ఉద్యమంతో నిర్మించిన జక్ కళామందిరమే 1948 దాకా జెక్ ప్రజల పరంకాలేదు అందులో ప్రజాదరణగల నాటకాలను, ప్రజల కన్నీరు తుడవటానికి ఎప్పుడైనా ఆడేవారే గాని అధికంగా ధనిక వర్గాల వినోదానికి మాత్రమే అది ఉపయోగపడుతూ వచ్చింది దాని నిర్మాణానికి జీవితం ధారపోసిన జె కె టైల్ నాటకాలు కళామందిరంలో ఆడటానికి అనర్హమైనవని నిర్ణయించారు! స్మెటనా, ద్వొరాక్‌ల ఓపెరాలు మాత్రమే ఈకళామందిరానికీ, ప్రజలకూ, ప్రాచీన సంస్కృతికీ గల సంబంధాలను నిలుపుతూ వచ్చాయి 1948లో జెక్ ప్రజల విమోచన కలిగింది జెక్ ప్రజాజీవిత వాస్తవికతకు ఈ "ఆలయం"లో ఆరాధన ప్రారంభమయింది ఇవాళ అందులో అన్ని రకాల ప్రజలకూ ప్రవేశమున్నది వారు వాస్తవిక ప్రదర్శనాలను ప్రదర్శించగలరు కూడానూ అయితే ఈనాటి ప్రేక్షకులు కేవలం విమర్శకులేకారు, జ్ఞానార్థులు కూడానూ ఉత్తమ జెక్ సంప్రదాయాలను ప్రదర్శనాల ద్వారా అవగాహన చేసుకోగోరుతారు శ్రామికులకు ప్రత్యేక ప్రదర్శనాలుంటాయి ప్రదర్శనాల అనంతరం ప్రేక్షకుల చర్చలుంటాయి వీటిద్వారా జెక్ నాటక రంగం చాలా లాభాలు పొందుతున్నది

జెక్ జాతీయ మందిరంలో ఆడే నాటకాలలో జెక్, రష్యన్ సాహిత్యాలలోని ఉత్తమ నాటకాలే గాక విశ్వసాహిత్యంలోని ఉత్తమ నాటకాలు కూడా ఉన్నాయి ఇప్పుడు జెక్ జాతీయ కళామందిరం నిర్వహణ కింద మరిరెండు థియేటర్లు– స్మెటనా ఓపెరా థియేటర్, ఎస్టేట్స్ థియేటర్–ఉన్నాయి ఓపెరాలలో స్మెటనాది అగ్రస్థానం "వధూ వినిమయం" అన్న ఓపెరా ఇప్పటికి 1900 ప్రదర్శనాలు పూర్తి చేసింది పాత ఓపెరాలలో మెజారిటీవి తప్పకుండా ఆడతారు రష్యన్ ఓపెరాలలో "బోరిస్ గొదునోవ్" "యూగెన్ ఓనెగిన్" అన్నది జెక్ ప్రజలకు ఎక్కువ ఇష్టం "క్రెమ్లిన్ గంటలు" అన్న నాటకం వారికి ఎక్కువ ప్రీతికరమైనది

జెక్ జాతీయ కళామందిరంలో గోర్కీ నాటకాలు కూడా తరుచు ఆడతారు షేక్స్పియర్, మోలియర్ నాటకాలడతారు "38వ అక్షాంశరేఖకు దక్షిణంగా" అన్న కొరియా నాటకం ఆడారు చైనా నాటకం ఒకటి ఆడబోతున్నారు జాతీయ కళామందిరంలో ప్రొడ్యూసర్లూ, నటులూ, కూలీలు కూడా కలిసి ఒక సమాజం వీరు తయారు చేసే ఉత్తమ నాటకాలకు ప్రభుత్వ బహుమానాలుంటాయి అవి సమాజానికంతకూ కలిపి యిస్తారు "గిట్టుబాటయిన ఉద్యోగం" అన్న వ్యంగ్య నాటికకు ఇటువంటి బహుమతి వచ్చింది

ఆంధ్రులకు జాతీయ కళామందిరం ఒకటి ఏనాటికైనా ఏర్పడాలి దీనికిగాను జరిగే కృషిలో ఒక క్రమంగాని, ఉత్సాహంగాని, ఉన్నతాదర్శాలుగాని లేకపోవటం చాలా శోచనీయం దేశంలోని ఉత్తమ నటులూ, నాటక కర్తలూ, కళాకారులూ, శిల్పులూ, వాస్తు వైజ్ఞానికులూ సహకరించనిదే ఉత్తమ జాతీయకళామందిరం తయారుకాదు సరికదా, జాతీయోద్యమంలోని శక్తులన్నీ సహకరించి అందులో జాతీయత ప్రతిబింబించేటందుకు కూడా కృషి జరగాలి

ఆంధ్ర శిల్పంలోనూ, నాటకకళలోనూ, నాట్యకళలోనూ, చిత్రకళలోనూ గల ఉత్తమ సంప్రదాయాలు అందులో ప్రతిబింబించాలి

ఆంధ్రనాటక కళాపరిషత్తు కళామందిర నిర్మాణానికి గాను చేస్తున్న కృషి ఆంధ్రుల నీరసస్థితిని మాత్రమే వ్యక్తం చేస్తోంది దేశం స్వతంత్రమైన తరవాతకూడా ఆంధ్రకాంగ్రెసు మహానాయకులు పదవీవ్యామోహం, పర్మిట్ల వ్యామోహం ప్రదర్శించినట్టుగా సంస్కృతీ వ్యామోహం ప్రదర్శించలేదు రెండవ ప్రపంచ యుద్ధం అయిపోయిన అనంతరం కమ్యూనిస్టు పార్టీ అయోమయంలో పడిపోయే దాకా తెలుగు కళలలో నవచైతన్యం ప్రవేశ పెట్టటానికిగాను చేసిన కృషి యావత్తూ కమ్యూనిస్టులే సాగించారు "దేశభక్తులు" వారితో కనీసం పోటీ అయినా చెయ్యలేదు ఇవాళ ఆంధ్ర రాష్ట్రోద్యమంతో ఆంధ్రజాతీయావేశం తిరిగి తలయెత్తింది సంస్కృతి ఒక రాజకీయ పక్షంవారి సొత్తుకాదు ఇప్పటికైనా ఆంధ్ర సంస్కృతీ కళాభిమానులంతా కలిసి ఆంధ్రనాటక కళాపరిషత్తుద్వారాగాని మరొక విధంగాగాని ఆంధ్రప్రజల ఆదర్శాలకు సంస్కృతీ చిహ్నంగా ఉండేటట్టు విశిష్ట జాతీయ కళామందిరం ఏర్పరచటం చాలా అవసరం

తెలుగు స్వతంత్ర వారపత్రిక, 16-11-1951

## 33. నిష్పాక్షిక విమర్శ?

నవంబరు 16 "తెలుగు స్వతంత్ర"లో శ్రీ మాకరాజు వేణుగోపాలరాజుగారు "అశ్వని రచనలుః పాక్షిక దృష్టి" అని అరపేజీ విమర్శ ప్రచురించారు ఇందులోనే "అశ్వని" గురించి సంగ్రహవర్ణనలు ఒకటి రెంటికి కూడా వీరు తావిచ్చారు ఉదాః "వీరి మనసెప్పుడూ సైబీరియా పచ్చిక బయళ్ళలో విహరించుతుంటుంది " "అశ్వనిగారి భావాలలాంటి 'మతోన్మాదిక కమ్యూనిస్టు' భావాలు "ఈవర్ణనల సహాయంతోనూ, ఏ యల్ నరసింహారావుగారి ప్రవచనాల అధారిటీతోనూ 'అశ్వని' రచనలపై శ్రీరాజుగారు నిష్పాక్షిక విమర్శ "తెలుగు స్వతంత్ర" పాఠకులకు నివేదించారు అశ్వని పాక్షిక దృష్టిని ఖండించే శ్రీ రాజుగారు నిష్పాక్షిక విమర్శ తప్ప ఇంకేం చెయ్యగలరనుకుంటాం?)

అయితే శ్రీ రాజుగారి నిష్పాక్షిక దృష్టికి నేరుగా సాక్ష్యం దొరకదు "అశ్వని" పాక్షిక దృష్టిని ఆయన రుజువుచెయ్యటాన్ని బట్టే ఆయన నిష్పాక్షిక దృష్టిని మనం ఊహించాలి శ్రీరాజుగారు చాలా మాటల మనిషికాదు అందుచేత ఆయన "తెలుగు స్వతంత్ర" అక్టోబరు అయిదవ తేదీ సంచికనుంచి "అశ్వని" సుభాషితాలు ఎనిమిది పంక్తులు పుచ్చుకున్నారు అది వ్యాసంలో ఒకభాగం అమెరికా పక్షాన చేరిన దేశాలు ఆర్థిక రాజకీయ స్వాతంత్ర్యాలు ఎట్లాపోగొట్టుకుంటున్నదీ ఆ వ్యాసంలో ఉన్నది ఆ వ్యాసంలో లేకపోయినా, రోజూ శ్రద్ధగా పత్రికలు చదివేవారికి ఈ విషయం స్పష్టంగా తెలుస్తున్నదే ఇటీవల ఎన్నికలలో ఓడిపోయిన బ్రిటిషు లేబరు పార్టీలో అంతస్సంఘర్షణ ఏర్పడ్డప్పుడు బెవాన్, కోల్, జిలియేకస్, కింగ్‌స్లేమార్టిన్ మొదలైనవాళ్ళు అనేక మంది బ్రిటన్‌పై అమెరికా వొత్తిడిని నిరసించారు "అశ్వని"కి తెలిసినంతవరకూ వీరెవరూ కమ్యూనిస్టు మతోన్మాదులు కారు కమ్యూనిస్టు వ్యతిరేకులు అయితే కమ్యూనిస్టు వ్యతిరేకత కారణంగా అమెరికా తీసుకురానున్న యుద్ధం వారి కిష్టంలేదు

"శాశ్వతంగా రష్యాతో పొత్తు ఎంత దుర్భరమైనా, మూడవ ప్రపంచయుద్ధం అనంతరం ఉండే ప్రపంచంలో నివసించటం కన్న అదే మేలు" అని ఒక బ్రిటిష్ లేబరు వామపక్ష నాయకుడు అన్నాడు ఇంతకన్న మరొక ఆకు యెక్కువ చదివిన మరొకాయన "ఈ యుద్ధ సన్నాహ ఖర్చు భరించేకన్నా రష్యా ఆక్రమణే మేలు" అన్నాడు శ్రీరాజు గారికి బ్రిటనంటే అభిమానమైతే ఉన్నదిగాని బ్రిటిషు పత్రికలు చదివేట్టు కనపడదు

ఆమాటకు వస్తే ఆయన "అశ్వని" రచనలు కూడా చదివినట్టు కనపడదు ఈ "మతోన్మాదిక కమ్యూనిస్టు" (అంటే ఏమిటో ఆయనకూ, ఏ యల్ నరసింహారావు గారికీ తెలియాలి) "తెలుగు స్వతంత్ర"లో భారతకమ్యూనిస్టుపార్టీ ఎన్నికల ప్రణాళికను గురించి రాస్తూ, ఈ ప్రణాళికను కమ్యూనిస్టులు ఎట్లా అమలు జరుపుతారో స్పష్టం కావటం లేదనీ, ఇంతకంటె వామపక్ష ఐక్యత సాధించి అందులో పాల్గొనే అన్ని పార్టీలూ కలిసి సమ్మతంగా అమలుజరిగే కార్యక్రమం ప్రకటించటం యెక్కువ లాభకరమనీ రాశాడు శ్రీరాజుగారి మనసు ఎక్కడ విహారం చేస్తూ ఉంటుందో ఊహించటానికి కూడా లేకుండా ఉంది

"అశ్వని" విలేఖరిగా కొంత ఆత్మగౌరవం గలవాడు తనకు తెలిసినంత వరకూ అధికారాలు చూపకుండా "తెలుగు స్వతంత్ర" పరితలను ఏ తనమాటా నమ్మమని అడగడు విలేఖరిగా వంచన కావటం–రష్యా చేత వంచన కావటం కూడా–"అశ్వని" కిష్టంలేదు అందుచేత రష్యన్ పత్రికలతోపాటు అమెరికన్ పత్రికలూ, బ్రిటిష్ పత్రికలూ కూడా చదువుతాడు "అశ్వని" రాజకీయవాదికాడు, యధార్ధవాది, కాకపోతే శాంతికాముకుడు అందుచేత విలయం వచ్చి మీద పడుతుంటే "తటస్థం" గా ఉండలేడు రష్యా శాంతి భంగకర చర్యలు చేస్తున్నట్టు ఒక్క గట్టి దాఖలా లేదు రష్యా రాజకీయాలు పాటించకుండాఇతరదేశాలకు సహాయపడటానికి సిద్ధంగా ఉన్నమాట అబద్ధంకాదు ఇండియాకు రష్యన్ గోధుమలు ఎట్లావచ్చాయో, వాటి విలువ మన ప్రభుత్వం యింతవరకూ ఏరూపంలోనూ ఎట్లా చెల్లించలేదో తెలుసుకుంటే ఈ విషయం బోధపడుతుంది

"ఈనాటి సామాన్యుడు మాటలతో, మహజర్లతో శాంతిని స్థాపించే కమ్యూనిస్టుల వాలకం చూసి విస్తుపోతున్నాడు" అని శ్రీరాజుగారు అంటున్నారు చేతలతో శాంతిని సాధించే దెట్లాగో అసామాన్యులైన రాజుగారికి తెలియాలి ప్రపంచ శాంతి భగ్నం గాకుండా ఉండాలంటే అగ్రనాయకులు సమావేశమైచర్చించాలని ట్రిగ్వేలీ కూడా అన్నాడు ఈ మాట అన్నందువల్ల ట్రిగ్వేలీ రష్యావాదైపోయినాడని రష్యన్‌లకు కూడా ఇంకా తెలీదు! కాని శ్రీరాజుగారు ట్రూమన్ ధోరణిలో ఉండి ఉండవచ్చు ఎందుచేతనంటే ట్రూమన్‌కి కూడా మాటల్లో నమ్మకంలేదు "రష్యాతో ఒప్పందాలు చేసుకోవటం వృధా ఆ ఒప్పందాలకు చిత్తుకాగితం విలవ ఉండదు" అని ట్రూమన్ అన్నాడు ఆయన ఈ మాట అన్నందుకు విస్తుపోయినది ఈనాటి సామాన్యులే గాదు, ప్రపంచంలో ఉన్న అనేక పత్రికలు విస్తుపోయాయి ఎందుకంటే రష్యా చిత్తుకాగితం కింద జమకట్టిన ఒప్పందం ఒకటైనా ట్రూమన్ చూపలేదు ఈగడచిన అయిదారేళ్ళలో చాలా ఒప్పందాలను చిత్తుకాగితాల కింద ట్రూమన్ జమకట్టాడు కైరో, పాట్స్‌డామ్ ఒప్పందాలూ, ఇటలీ సంధి ఒడంబడికా చిత్తుకాగితాలై పోయాయి జర్మనీని ఏకం చెయ్యటానికీ,

జర్మనీ, జపానుల ఆయుధాలు పెరగకుండా ఉంచటానికి, స్పెయిన్‌తో రాయబార సంబంధాలు పెట్టుకోకుండా ఉండటానికీ జరిగిన ఒడంబడికల గతి ఏమయింది?

"ఈ రోజుల్లో అమెరికా బ్రిటన్‌లను ఎంత దుమ్మెత్తిపోసి రష్యాను యెంత పొగిడితే అంత అభ్యుదయ వాదులు " అని ఎవరో అనుకుంటున్నారని ఏ యల్ నరసింహారావు గారంటే దానికి శ్రీరాజుగారు భళాభళీ అన్నారు ఇవాళ కావలసింది విమర్శ ప్రపంచ శాంతికి భంగకరంగా ఉన్న పనులు ఏదేశం చేస్తున్నా తెలిసినవారు విమర్శించ వలసిందే పైపెచ్చు రష్యా శాంతికోసం భూమ్యాకాశాలు కదిలించినంత పనిచేస్తున్నది చాలాకాలం రష్యాదంతా నటన అన్నారు జర్మనీలు రెంటికీ కలిపి ఎన్నికలు పెట్టటానికి రష్యా ఒప్పుకున్నది దీన్ని నటన అని ఎట్లా అనాలో ఎవరికీ తెలియలేదు ఎందుచేతనంటే రెండు జర్మనీలకూ కలిపి ఎన్నికలు పెడితే కమ్యూనిస్టులు సోదిలోకి కూడా రారుః ఈ సంగతి ప్రపంచమంతా తెలిసినదే "రష్యా శాంతి కోసం చాలా పెద్ద త్యాగం చేస్తున్నది " అని పాశ్చాత్య విలేఖరులు రష్యాకు పత్రం ఇచ్చారు! ఈ ఆరేళ్ళనుంచీ ప్రపంచ శాంతికోసం రష్యా చేస్తున్న కృషికి అపార్థం కల్పించాలని యెవరు సహేతుకమైన ప్రయత్నంచేసినా సాధ్యం కావటంలేదు రష్యన్ సిద్ధాంతాలను సంపూర్ణంగా ద్వేషించే జీన్‌పాల్ సార్ట్రే ఖచ్చితంగా అమెరికాను తప్పు పట్టాడు

అయినప్పటికీ రష్యా ప్రపంచ శాంతిని ఎట్లా భగ్నం చెయ్యటానికి ప్రయత్నిస్తున్నదీ శ్రీ రాజుగారికి తెలిసివుండాలి ఆ విషయాలు "తెలుగు స్వతంత్ర" ద్వారా తెలుగు లోకానికి తెలపటానికి బదులు "అశ్వని" మీద ఇంత "నిష్పాక్షిక"మైన, వికాసవంతమైన విమర్శ యెందుకు రాయవలసి వచ్చింది? "ఈనాటి వీధి మనిషి కోరేది శాంతిగాని ఒకరి కంట్లో మరొకరు పుల్లలు పెట్టుకోవడం కాదు(?) భట్రాజులా పొగుడుతూ మూఢంగా ప్రవర్తించే ఫ్యూడలిజం కాదు(?)" అని శ్రీరాజుగారు ఏ సందర్భంలో అంటున్నాడో కూడా తెలియటం లేదు

చిట్టచివరకు ఆయన- "తెలుగు స్వతంత్ర" సంపాదకులకు కాబోలు-ఒక హెచ్చరిక చేస్తున్నారు "ఇకముందైనా దయవుంచి మమ్ములను బూర్జువాలుగా సామ్రాజ్యవాద ఏజెంట్లుగా చిత్రింపచేసే రచనలు నిలిపి తటస్థ వైఖరిని అవలంబిస్తారని ఆశిస్తున్నాము "

ఈవాక్యం అర్థం కావటంలేదు దీనికీ "అశ్వని" రచనలకూ ఏమైనా సంబంధం ఉన్నదా? ఉంటే ఆసంబంధం ఎటువంటిది? పైవాక్యంలో "మమ్ములను" అంటే ఎవర్ని? "అశ్వని" కి సామ్రాజ్యవాద ఏజంట్లంటే విముఖత్వం ఉన్నది గాని బూర్జువాలంటే విముఖత్వం లేదు ఎందుకంటే "అశ్వని" కూడా బూర్జువాయే శ్రీరాజుగారు ఒకవేళ అమెరికా పక్షాన నిలబడే వారిలో ఒకరుగా ఉన్నారేమో ఉన్నట్టయితే వారు తమ పాత్రను గురించి పునరాలోచించమని నా సలహా

"అశ్వని" రచనలను గురించి జాగ్రత్త పడమని "తెలుగు స్వతంత్ర" సంపాదకులను హెచ్చరించటం శ్రీరాజుగారి మొరటుతనాన్ని చాటుతున్నది "తెలుగు స్వతంత్ర"లో తనకు సమ్మతముగాని సిద్ధాంతాలతో కూడిన రచనలు వెలువడితే "అశ్వని" వెళ్ళి వాటిని వేయవద్దని

చెప్పడు రష్యావల్ల ప్రపంచ శాంతికి ముప్పున్నదని శ్రీరాజుగారు గాని, మరొకరు గాని రుజువు చేయగలిగితే అట్టి రచనలు "తెలుగు స్వతంత్ర"లో తప్పక ప్రచురించాలని "అశ్వని" విశ్వాసం

"అశ్వని" రచనలకు "తెలుగు స్వతంత్ర" గర్వించటానికి కూడా కొంతవరకు అవకాశం ఉందని చెప్పటానికి సాహసిస్తున్నాను ఈ పత్రికలో చర్చించిన కొన్ని విషయాలను గురించి విదేశ పత్రికలు అనేక వారాల అనంతరం చర్చించటం జరిగింది ఇటీవలి ఉదాహరణ కావాలంటే అమెరికాలో చైనా లాబీచాటున సోయాబీనుల వ్యాపారాన్ని 50 మందికి పైబడ్డ చైనావారు "కార్నర్" చెయ్యటం ఇది ముఖ్యమైన విషయం ఎందుచేతనంటే కొరియా అంతర్యుద్ధం ఇంకా చాలా వారాలకు జరుగుతుందనగానే అది జరగబోతుందని తెలిసినట్టుగా అమెరికాలోని కొందరు వ్యక్తులు వ్యవహరించారు వారికి లక్షల కొద్దీ డాలర్ల విలువ చేసే బంగారం కూడా అందచేయబడింది మొట్టమొదటిగా దక్షిణ కొరియావారే తమమీద పడ్డారని ఉత్తర కొరియా అన్నప్పుడు ప్రపంచ వ్యాఖ్యాతలంతా "కట్టుకథ" అన్నారు ఈకథను నమ్మనివారిలో 'అశ్వని' కూడా ఒకడు కాని ఈ సోయాబీనుల వృత్తాంతం ఉత్తర కొరియా సాక్ష్యాన్ని బలపరుస్తున్నది ఈ వృత్తాంతం గురించి "అశ్వని" "తెలుగు స్వతంత్ర" లో రాసిన అనంతరమే, "అశ్వని" రాసిన ధోరణిలోనే ఎవరో 'న్యూస్టేట్స్‌మన్ అండ్ నేషన్" లో రాశారు విలేఖరి కనుక "అశ్వని" ఇటువంటి నిదర్శనాలకు గర్విస్తాడు ప్రపంచ రాజకీయాలను గురించి తాను ప్రకటించే భావాలు ఇతరత్రా బలపడ్డప్పుడు సంతోషించటమూ, పొరపాటని రుజువైనప్పుడు తన భావాలను సంస్కరించుకోవటమూ కూడా "అశ్వని"కి చాతనవును ఈ మహాప్రపంచంలో "అశ్వని" రచనలు ఒక పత్రిక ప్రకటించటము, అవి తమకు ఎక్కడో తగిలి శ్రీరాజుగారు వాక్యానికి వాక్యం అతకకుండా అరపేజీ నిరసన ప్రకటించటమూ ముఖ్యంకాదు "తెలుగు స్వతంత్ర" చదివే అసంఖ్యాకులకు ప్రపంచ వివరాలను గురించి సర్వతోముఖమైన జ్ఞానం కలగటం ముఖ్యం అది శ్రీరాజుగారి రచనలవల్లే కలుగుతుందో, ఇంకొకరివల్ల కలుగుతుందో, పాఠకులు తెలుసుకోగలరు "మతోన్మాదం" రకరకాలుగా ఉంటుంది మరి!

తెలుగుస్వతంత్ర, వారపత్రిక, 23-11-1951

# 34. స్వగతం (ఎ)

చిన్నతనంలో ఒక్కొక్క సాయంత్రం తాలూకా కచ్చేరీకేసి వెళ్ళేవాణ్ణి ఆ సమయానికి ఖైదీలందర్నీ బయటికి తెచ్చేవారు వాళ్ళను చూడ బుద్ధి అయేది చూడటానికీ, వాళ్ళను గురించి ఆలోచించటానికీ భయంగానూ ఉండేది అందరిలా జీవించవలసిన మనుషులు ఆ ఖైదీల స్థితికి ఎట్లా వస్తారో, ఎందుకు వస్తారో నా బుర్ర ఊహించలేకపోయేది కాని నాకింకాచిన్నతనం వదలకముందే స్వచ్ఛందంగా జైళ్ళకు పోయే పెద్దమనుషులను చూశాను నే నెరిగిన వారిలోంచి, నా యిరుగుపొరుగుల వారిలోంచి, నా బంధువర్గంలోంచి జైళ్ళకు వెళ్ళారు జైళ్ళనుంచి తిరిగి వచ్చేవారికి జనం మెడలో దండలు వెయ్యటం, వారిని ఊరేగింపులతో తీసుకు రావటం, వారు బహిరంగసభలలో మాట్లాడటం కళ్ళారా చూశాను

సాయంకాలంపూట, తాలుకాఫీసు పాయిఖానాల దగ్గిర బారుగా నిలబడే సహం మానవుల గురించి నాఅభిప్రాయం మారకపోయినా జైళ్ళనుగురించి నా అభిప్రాయం మారింది గాంధీనీ, నెహ్రూలనూ, పటేళ్ళనూ అంతదూరంనుంచి చూడటానికి ఎగబడే మూకను కళ్ళారా చూసి, వీళ్ళంతా ఖైదుకు వెళ్ళిన వారని జ్ఞాపకం వచ్చినప్పుడు "అధికారం" పక్షాన ప్రజలు లేకపోవటం ఎటువంటిదో అర్థమయింది ఆ అధికారంమీద ఉండే గౌరవభయాలు ఒక్కసారిగా తుడిచి పెట్టుక పోయాయి కాల ప్రభావం

ఆనాటినుంచీ కాలప్రభావం చిత్రవిచిత్ర స్వరూపాల్లో ప్రత్యక్షమవుతూ వస్తున్నది దేశ విభజనకు ససేమిరా ఒప్పుకోమన్న కాంగ్రెసు వారు దానికే ఒప్పుకుని ప్రభుత్వంలోకి వచ్చి దేశభక్తిని గుత్త పుచ్చుకోవటమూ, స్వాతంత్ర్య సమరపు రోజులలో తమమీద పరాయి ప్రభుత్వం చేసిన దౌర్జన్యకాండను మించిన దానిని ఈ కాంగ్రెసు ప్రభుత్వమే విచక్షణలేకుండా కార్మికుల మీదా, విద్యార్థులమీదా , ఆకలి యాత్రల వారిమీదా, కమ్యూనిస్టులమీదా ప్రయోగించటమూ, కాంగ్రెసు రామరాజ్యంలో కస్టడీలోఉన్నవారు అదృశ్యులు కావటమూ, కాంగ్రెసు ప్రజా ప్రభుత్వం చేత ప్రజా శత్రువులుగా ప్రకటించబడిన కమ్యూనిస్టులు ఎన్నికలలో గెలవటమూ, కమ్యూనిస్టుల "ఘాతుకకృత్యాలు" జరిగినచోట కాంగ్రెసు అభ్యర్థులకు వోట్లు రాకపోవటమూ, కాంగ్రెసు పరిపాలనలో ఒక కాంగ్రెసువాది ఆంధ్రరాష్ట్రంకోసం బలిదానం కావటమూ ఇవన్నీ కాలమహిమను సూచించేసంఘటనలే

1947 ఆగస్టు 15 తరవాత మనం స్వతంత్రులం స్వతంత్రులు కావడంలో స్వతంత్రంగా ఆలోచించే శక్తీ, స్వకీయభావాలు ప్రకటించే శక్తీ కూడా ఇమిడి ఉన్నాయనే అనుకోవాలి మనలాటి వెనుకబడిన ప్రజలకు మార్గదర్శకంగా ఉండవలసినవి పత్రికలు ప్రజలకంటే పత్రికలు ఎక్కువ స్వాతంత్ర్యాన్ని ప్రదర్శించాలి, ప్రకటించాలి కాని మన పత్రికలు స్వతంత్రంగా ఆలోచించే శక్తినికూడా ప్రకటించలేదు ఇవి రాయిటర్, పి టి ఐ విలేఖరుల పరిభాషను చిలకపలుకుల్లాగా ప్రతిధ్వనిస్తూ మలయాలో, బర్మాలో, ఇండోచైనాలో ప్రజల తరఫున స్వాతంత్ర్య పోరాటాలు సాగించేవారిని "బందిపోటు" లనీ, "దుండగు"లనీ, "తిరుగుబాటుదారు"లనీ పేర్కొన్నాయి ఇదే సమయంలో భారత ప్రధాని నెహ్రూ వీటన్నిటినీ స్వాతంత్ర్యోద్యమాలని స్పష్టంగా ఉద్ఘాటించాడు

కొరియాలో అంతర్యుద్ధం వచ్చింది ఐక్యరాజ్య సమితి జోక్యం కలిగించుకున్నది తదాదిగా యుద్ధవార్తలలో ఉత్తర కొరియావారినీ, దరిమిలా చైనా వాలంటీర్లనూ రాయిటర్, పి టి ఐ విలేఖరులు అమెరికా భృత్యుల్లాగా "శత్రువు" లంటూ పేర్కొంటూ వచ్చారు మన పత్రికలు ఆమాటేరాస్తూవచ్చాయి అదే సమయంలో దేశంలోని కమ్యూనిస్టు పత్రికలు అమెరికావారినీ, వారి అనుయాయులనూ "శత్రువు"లని పేర్కొంటూ వచ్చాయి ఇందులో ఏ పత్రికమీదా ప్రభుత్వం చర్య తీసుకోలేదు కాలమహిమ!

తెలుగుస్వతంత్ర, వారపత్రిక 6-11-1953

# 35. స్వగతం (బి)

కోడలు లేదంటే వెళ్ళిపోతున్న బిచ్చగాణ్ణి చూసి అత్తగారు, "లేదనటానికైనా నేనుగాని, అది ఎవత్తె?" అన్నదిట! "విమోచనం" పొందిన అనేక దేశాలలో ప్రజల గతి ఈ బిచ్చగాళ్ళ వతుగా ఉంటున్నది

1942 జులైలో, జపాను కూడా యుద్ధం లోకి వచ్చిన కొంతకాలానికి, మనదేశంలోని నేషనల్ వార్ ఫ్రంట్ వారు జపాను వ్యతిరేక ప్రచారం ప్రారంభించారు జపాను వాళ్ళు తాము అడుగుపెట్టిన చోట ఎటువంటి ఘోరాలు చేశారో, తాము ఆక్రమించిన చోట్లలో జాతీయ నాయకులను అరెస్టు చేసి జాతీయోద్యమాలను ఏవిధంగా అణచిపెట్టారో వివరిస్తూ తయారైన ఈ "కాంపెయిన్" ప్రారంభమయిందో లేదో ఆగస్టు 9 జరిగింది! జపానువాళ్ళు వస్తే ఏమేం చేస్తారని చెప్పదలుచుకున్నారో అవన్నీ మనకు బ్రిటిషు వాళ్ళే చేశారు (జపాను వ్యతిరేక ప్రచారం మధ్యలో ఆపేశారు కూడా )

బ్రిటిషువాళ్ళు మనదేశాన్ని చాలాకాలం నిరంకుశంగా పాలించి మనడబ్బూ, సంపదా కొల్లగొట్టి, మన ప్రజను భయంకరమైన దారిద్ర్యంలో ఉంచి, వారికి ఎటువంటి హక్కులూ లేకుండా చేశారు ఈ పరిస్థితి చక్కజేయటానికిగాను కాంగ్రెసు అరవై ఏళ్ళు హోరాహోరి పోట్లాడి చిట్టచివరకు బ్రిటిషువారి స్థానంలోకి వచ్చింది

కాంగ్రెసు రాగానే దేశమంతటా ప్రజాస్వామ్యాలు వెల్లివిరుస్తాయనుకున్నాం పరిస్థితులేమీ మారలేదు సంస్థానాలను కలిపేశామన్నారు ఏ సంస్థానంలో అడుగుపెట్టినా పాత కంపే కొడుతుంది ప్రజలందరికీ వోటిచ్చారు ప్రజలు ఒక్కపెట్టుగా, కాంగ్రెసు నిలబెట్టిన ప్రతి పేడతట్టకీ వోటు చేయకపోయేసరికి కొందరు "నాయకులు" బహిరంగంగా విలవిల్లాడుతున్నారు ప్రజలందరికీ వోటివ్వటం పొరపాటయిందని!

మనదేశంలో ఇంత నిరుద్యోగం ఉండటానికీ, సంపద లేకపోవటానికీ కారణం పూర్వపు రోజుల్లో బ్రిటిషువారి సామ్రాజ్యవాద వైఖరి అన్నారు బ్రిటిషు సామ్రాజ్యం మన దేశంలో అస్తమించింది సంపద వృద్ధికాదు నిరుద్యోగం తరగదు దేశదారిద్ర్యం తొలగదు దానిని తొలగించే కార్మికులకు ఉద్యోగాలులేవు! ఇప్పుడు ఎవరడ్డుబడుతున్నారో కాంగ్రెసు చెప్పదు

కాంగ్రెసు హోరాహోరి పోట్లాడిన అంశాలలో భాషారాష్ట్రాలు ఒకటి బ్రిటిషువారి హయాంలో రాష్ట్ర విభజన విభేదాలు కల్పించటానికి అనుకూలంగా జరిగిందన్నారు కేంద్రంలోనూ రాష్ట్రంలోనూ కాంగ్రెసు ప్రభుత్వాలున్నాయి ప్రజాస్వామిక సూత్రాలనుకూడా అట్టే పాటించకుండా, పార్టీ సిద్ధాంతాలను పరిగణించకుండా, ఏదోవిధంగా కాంగ్రెసు ఆధిపత్యాన్ని అమలు జరిపే ప్రభుత్వాలను ముక్కుతాళ్ళుపోసి నిలబెడుతున్నారు ఈ పరిస్థితులలో కూడా భాషా రాష్ట్రాలడగడం తప్పని నెహ్రూ కాంగ్రెసు సభ్యులను హెచ్చరిస్తున్నారు ఎందుకు తప్పో వారు చెప్పలేదు ఆంధ్రరాష్ట్రానికిలాగే ఇతర భాషా రాష్ట్రాలకు కూడా కొంత నరబలి అవసరమేమో!

బ్రిటిషువారి నిరంకుశత్వాన్ని తొలగించిన కాంగ్రెసుపార్టీ యొక్క జాతీయ సిద్ధాంతాలు ఈనాడేమిటో మనకు తెలియవు కాని ఆ నాటి బ్రిటిషు అధికారులలాగా ప్రవర్తించినవారికి నేడుకాంగ్రెసులో ఉన్నత స్థానం ఉండేలాగ కనబడుతుంది భాషారాష్ట్రాలు కావాలనే వారికి కాంగ్రెసులో స్థానంలేదు! రేపు కర్నూలు నుంచి ఆంధ్ర రాజధాని మారాలనే వారికి కాంగ్రెసులో స్థానం ఉండదు! కర్నూలుకన్న ఆంధ్రకు మంచి రాజధాని ఉండరాదన్నది ఒక కాంగ్రెసు జాతీయ సిద్ధాంతం! భాషారాష్ట్రాలను ఏర్పాటు చేయరాదన్నది మరొక జాతీయ సిద్ధాంతం!

అవును, ఇండియాలో ప్రజాస్వామ్యాలు లేకుండా పరిపాలించినా ఆ పని కాంగ్రెసు చెయ్యాలిగాని బ్రిటిషువాళ్ళెవరు? –

తెలుగుస్వతంత్ర వారపత్రిక 27-11-1953

# 36.స్వగతం (పి)

విస్కోన్సిన్ (అమెరికా) తొమ్మిదవజిల్లా వారు కాంగ్రెసుకు డెమోక్రాట్ అభ్యర్థిని ఎన్నడూ ఎన్నుకొని ఉండలేదు (గత అక్టోబరులో జరిగిన) ప్రత్యేక ఎన్నికలో తమ అభ్యర్థి ఆర్ జాన్సన్‌కు నూటికి 35 వంతున వోట్లు వస్తే తమకు నైతిక విజయం లభించినట్టేనని డెమోక్రాట్లు అన్నారు కాని తొమ్మిదవజిల్లా నాయకులు రాజకీయ క్రోధంలో జాన్సన్‌ను ఎన్నుకున్నారు ఐసెన్‌హోవర్ మద్దతుతో తనకు ప్రత్యర్థిగా నిలబడిన వాడిమీద గెలిచాడు నూటికి వంతు వోట్లు తెచ్చుకున్నాడు ఓడిపోయిన వ్యక్తి అన్నాడు "ప్రభుత్వ విధానాలతో ప్రజలూ, కూలీలూ, అసంతృప్తి చెందారు?" (నవంబరు 14 "లైఫ్" పత్రిక )

"ప్రభుత్వాన్ని అదరగొట్టేదెబ్బ"– సెనేటర్ "వ్యవసాయ సరుకుల ధరలు పడిపోవటం రైతులకేగాక గాక, ఉద్యోగులకూ, వ్యాపారులకూ కూడా నష్టమే 20లలో ఆరంభమైన వ్యవసాయ కాటకం 30లలో ఆర్థిక కాటకానికి దారి తీసిందన్నది ఎవరూ మరువజాలరు"– సెనేట్ కల్చరల్ కమిటీ అధ్యక్షుడు, సెనేటర్ ఐవెన్

కొత్తపంటతోసహా అమెరికాలో ఈయేడు గోధుమల నిల్వ 1,788,000,000 బుషేల్స్ వీనిలో అమెరికనులకు కావలసింది తక్కువ ఈ గోధుమలన్నీ ఎక్కడ పెట్టాలో తెలీదు మామూలుజాగాలు దొరికేదాకా 125 ఓడలలో గోధుమ నిలవచేశారు ఒక స్టేషనువద్ద వ్యవసాయ దారులు కొన్నివందల టన్నుల గోధుమ రోడ్లమీద పోసేశారు ఈ దృశ్యం తాలూకు ఫోటో "బిజినెస్‌వీక్" ప్రకటించింది

పంటల మీద రైతులకు వచ్చే సొమ్ము గడిచిన 12 మాసాలలో బాగా పడిపోయింది కాని వ్యవసాయ సరుకులు గుత్త వ్యాపారం చేసే సంస్థల లాభాలు నూటికి 20 నుంచ 22 వంతులు పెరిగాయి!

అమెరికావాసులు 1945లోకన్న నూటికి ఏడున్నర వంతులు తక్కువ పాలూ, 1946లో కన్న పదకొండున్నర వంతులు తక్కువ కూరలూ, 1947లో కన్న ఎనిమిదన్నర వంతులు తక్కువ మాంసమూ భోంచేస్తున్నారు వచ్చే ఏడు గోధుమ పండించే పొలాలలో 160 లక్షల ఎకరాలు పాడుబెడుతారు!

ఈ తిండి అతి వృష్టిని వదిలించుకునే మార్గం లేదా? అమెరికాలో తిండిలేని వారికి చవుకగా ఇవ్వగూడదా? ఇతర దేశాలతో తిండి గింజల స్వేచ్ఛా వాణిజ్యం జరపగూడదా? వీలులేదు ఈ తిండి గింజలతో వేరే పని ఉంది:

"కమ్యూనిజంపై జరిగే మూగ యుద్ధానికి సహాయంగా ప్రతిసారీ తిండి ఉపయోగించబడుతుంది"–సెనేటర్ ఐకెన్

ఈమహత్తరమైన ఆశయం ముందు ఏడాదికో లక్ష పొలాలు పాడుబడడం గాని, కొన్ని లక్షల చిన్న రైతులు చితికిపోవటంగాని ఒక పెద్ద విషయం కాదు

కాలిఫోర్నియా ఫాం రిసెర్చ్ అండ్ లెజిస్లేటివ్ కమిటీ అధ్యక్షుడు "కాలిఫోర్నియా ఫాం రిపోర్టర్"లో అమెరికా తదితర దేశాలు యుద్ధ యత్నాలను విరమించాలని హెచ్చరించాడు ఉన్న మాట ఇంత గట్టిగా చెప్పినందుకు ఈయనను కమ్యూనిస్టు కింద విచారణ జరపటం బాగుంటుంది!–

తెలుగు స్వతంత్ర , 18-12-1953

# 37. స్వగతం (డి)

మధ్యేమార్గం–మూడో కాంప్–తాటస్థ్యం ఇవన్నీ కలలని అప్పుడే అనుకున్నాం ఆమాటలలో ఆచరణీయమైన రాజకీయ వాస్తవికత లేదు

కాని దురదృష్టవశాత్తూ నిద్రాభంగం అయేదాకా కల నిజంలాగే ఉంటుంది రష్యన్ చిత్రాలకి సెన్సార్ సర్టిఫికేట్లివ్వకపోవటం–రష్యన్ పత్రికలు చేతబట్టిన వారిని పోలీసులు హింసించటం–శాంతి సమావేశాలలో సీఐడీలు లుకలుకలాడటం–అంతా మధ్యేమార్గంలాగే, శాంతి స్థాపనకు హైరోడ్డులాగే ఉంటుంది!

డొక్కలోతన్ను! కల ఎగిరిపోతుంది తన్నిన కాలికి ఇనుప ముళ్ళుగల మిలిటరీ బూటు! కాలు అమెరికాది–రష్యాది కాదు

కమ్యూనిస్టు వ్యతిరేక, అమెరికా అనుకూల భావాన్ని అవలంబించి దాన్ని తాటస్థ్యమని అంటే తాటస్థ్యాన్ని చచ్చేలా తన్నింది అమెరికా!

ఇండియా రష్యాను నెత్తినెక్కించుకుంటున్నదా! కాదు ఇండియాలో కమ్యూనిస్టుల వేట చాలించబడిందనా? కాదు ఇండియాకు నిజంగా శాంతికావాలి! ఇండియా నిజంగా యుద్ధోన్మాదులకు అమ్ముడుపోదలచలేదు! ఇంకేం? తన్ను!

"కమ్యూనిజం ఎక్కడ తల ఎత్తినా అణచివేస్తాం" అని అమెరికా పాలకులంటే ప్రపంచ కమ్యూనిస్టు వ్యతిరేక ముఠా కరతాళధ్వనులు చేసి, కొంగులుబట్టి డాలర్లు స్వీకరించింది ఇది ఏనాడో ప్రపంచయుద్ధానికి నాందివాక్యమని కరతాళధ్వనులు చేసిన వారిలో హెచ్చుమందికి తెలియలేదు

అమెరికాలో పత్రికలు యుద్ధయత్నాలకు బాక్‌గ్రౌండ్ మ్యూజిక్‌గా కమ్యూనిస్టు వ్యతిరేక గానాలు మాత్రమే చేశాయి

కాని అమెరికా పాలకులకు నిజంగా కావలిసింది కమ్యూనిజమును అణచటంకాదు కమ్యూనిజమును అణచేవాళ్ళు రష్యామీద దండెత్తుతారు, చైనామీద దండెత్తుతారు, తూర్పుయూరపు రాజ్యాలమీద దండెత్తుతారు

వాళ్ళకి కావలసింది డాలరుమార్కు మారణ సామాగ్రియొక్క విక్రయ వ్యాపారం, కొరియాలో ఒకపొయ్యి వెలిగింది, ఇండోచైనాలో ఇంకోపొయ్యి వెలిగింది అమెరికా నుంచి కట్టెలు సప్లయ్ నరభక్షణ సాగింది

ప్రపంచమంతటా పుర్రెమార్కు యుద్ధస్థావరాలు వెలిశాయి కాని యుద్ధం అనుకున్నట్లుగా విస్తరించటంలేదు కమ్యూనిస్టు వ్యతిరేకగానం విని తలలు ఆడించినవాళ్ళు నరహోమానికి కలిసి రావటంలేదు

అమెరికన్ పత్రికలు కొత్తపాటలు ప్రారంభించాయి తాటస్థ్య వ్యతిరేకపు పాటలు

ఎవరు తటస్థులు? నెహ్రూ, అట్లీ, బివాన్, కొందరు బ్రిటిష్‌టోరీలు–ఇండియా, బర్మా, చాంగ్‌కైషేక్, సింగ్మన్‌రీ, ఫ్రాంకో వగైరాలు "మిత్రులను" సహించలేనివారంతా తటస్థులే

ఈ చాంగ్ కై షేక్, సింగ్మన్‌రీ మురాతో, పాపం, అమెరికా, కమ్యూనిజమును అణచివేసే మహత్తర ఆశయం దృష్ట్యా రాజీపడవలసి వచ్చిందే గాని నిజంగా అమెరికా పాలకుల రంగు చాంగ్ కైషేక్, రీలది కాదని చాలామంది విశ్వసించారు తనకు కావలసిందే ఆ రంగని ఇప్పుడు అమెరికన్ యుద్ధోన్మాదుల మురా చెబుతోంది

తాటస్థ్యం పట్ల "స్వతంత్ర" దేశాలు అవలంబించవలసిన వైఖరిని ఐక్యరాజ్యసమితిలోని ఫార్మోజా ప్రతినిధి– చైనాకు ప్రతినిధిలేదు– చక్కగా వివరించాడు: చాంగ్ కై షేక్ సైనికులు బర్మా సరిహద్దులో బందిపోటు చెయ్యటం ఎందుకు సబబంటే బర్మా ప్రభుత్వం "తాటస్థ్యం" అవలంబిస్తోంది గనక!

తాటస్థ్యానికి కొన్ని కొండగుర్తులు:

ప్రపంచమంతటా అమెరికాకు యుద్ధస్థావరాలెందుకని సవాలు చెయ్యటం, ప్రతిదేశానికీ ఇతర దేశాలతో స్వేచ్ఛగా వాణిజ్యం చేసుకునే హక్కుండాలనటం, ఐక్యరాజ్యసమితిలో చైనాకు ప్రాతినిధ్యం ఉండాలని ఉద్ఘాటించటం, రష్యా వగైరాలతో వ్యాపారం చెయ్యటం, యుద్ధ యత్నాలు చురుకుగా సాగించకపోవటం, జర్మనీ పునరాయుధధారణను విమర్శించటం, అమెరికా కబంధహస్తాన్ని వదిలించుకో జూడటం

నిక్సన్ ఉవాచ: "రెండేరెండు సిద్ధాంతాలు వాటిమధ్య రాజీ, మధ్యేమార్గం లేదు నువ్వు తటస్థంగా ఉండలేవు" ఈ విషయం మన నెహ్రూకి నిక్సన్ చేతలతో మరీ చూపాలని పాకిస్తాన్‌ను యుద్ధతంత్రంలోకి దింపాడు

మననిక్సన్‌లు ఇంకా పెరటిదారినే ఉన్నాడు వారింకా కమ్యూనిస్టు వ్యతిరేకపు రొచ్చులో ఓలలాడుతూ తోకలు జాడిస్తున్నారు

"నువ్వింకా కమ్యూనిస్టు రచనలు రాస్తున్నావా?" అని ఒక విదుషీమణి అడిగింది

"నేను కమ్యూనిస్టుకాదు నాకు మార్క్సిస్టు తత్వంలో విశ్వాసం ఉంది– అంతే" అన్నాను

నా సమాధానం ఆవిడకి నచ్చినట్టు కనబడలేదు లేక నాది మరోరకం తాటస్థ్యంలా ఆమెకు తోచిందో! ఆఖరుకు ఇడ్డెనలు తినటంలో కూడా కమ్యూనిస్టుగా తినటం, కమ్యూనిస్టు వ్యతిరేకంగా తినటంగా గుర్తించబడే ఈ కాలంలో తాటస్థ్యాన్ని ఎవరికిబడితే వారికి సులువుగా ఆపాదించవచ్చు మరి!–

తెలుగుస్వతంత్ర, వారపత్రిక, 25-12-1953

## 38. స్వగతం (ఇ)

మతానికీ రాజకీయాలకూ సమన్వయం కుదరదన్నాడు నెహ్రూ మద్రాసు ప్రధాన మంత్రి రాజాజీగారు ఉపనిషత్తుల డికాక్షన్‌తో తయారు చేసిన కమ్యూనిస్టు వ్యతిరేక కాఫీని అమెరికనుల కందించారు " ఈ కాఫీ అద్భుతంగా వుంది నెహ్రూకేమీ తెలీదు", అన్నారు అమెరికనులు

పాత చింతకాయ పచ్చడి అనేక రోగాలకు పథ్యం వామనకాయల పచ్చడి ఉక్కులాటి మనిషికి కూడా తుమ్ములు తెప్పిస్తుంది అందుచేత శరీర దార్ఢ్యం సన్నగిల్లిన నడివృద్ధులూ, వృద్ధులూ పాత చింతకాయ పచ్చడి పట్టుకు వేళ్ళాడతారు అందులో వారికి అంతులేని ఆరోగ్య మహిమలు కనిపిస్తుంటాయి అది వేడి కొట్టేస్తుంది అతిసారం హరిస్తుంది సుఖవిరోచనం చేస్తుంది ఎవరు జబ్బుతో బాధపడుతున్నా అదే పథ్యం

శ్రీ కృష్ణ పరమాత్మ అర్జునుడిచేత జనక్షయం చేయించటానికి భగవద్గీత ఉపదేశించాడు తరవాత కొంతకాలానికి శంకరుల వారికి ఆ భగవద్గీతలో అద్వైతం దొరికింది అందులోనే రామానుజాచార్యుల వారికి విశిష్టాద్వైత సిద్ధాంతాలూ, మధ్వాచార్యుల వారికి ద్వైత సిద్ధాంతాలూ దొరికాయి మరికొన్ని శతాబ్దుల అవతల గాంధీజీకి ఆ భగవద్గీతలోనే అహింస దొరికింది

ఒక్క బైబిల్‌లో అనేక క్రైస్తవ మతాలు దొరికాయి

వేదాలలో ఛాందసులకు బాల్యవివాహాలూ, స్త్రీ పునర్వివాహ నిషేధమూ దొరికాయి పాత చింతకాయ పచ్చడిలో అట్టే నమ్మకంలేని వీరేశలింగంగారు, ఎక్కడున్నాయో చూపించమన్నారు

అట్లా అడగటం అన్యాయం పాత చింతకాయ పచ్చడిని పరీక్షకు పెట్టడం తగదు నమ్మకం మీద పోనివ్వాలి రాజాజీగారు ఉపనిషత్తుల డికాక్షన్‌తో కాఫీ తయారు చేసి ఇచ్చిన తరువాత ఫిల్టరులో పొడిని పరీక్షిస్తామా? కూడదు! కూడదు!

మద్రాసులో అన్ని హోటళ్ళలోనూ కాఫీ ఇస్తారు అది కాఫీ అని మనం ఆమోదించ వలసిందేగాని ఫిల్టరు పరీక్షించి అందులో అచ్చుగా కాఫీపొడే ఉందో, మాడ్చిన చింతగింజల పొడే ఉందో మాడ్చిన పంచదారే ఉందో పరీక్షిస్తామా? తప్పు తప్పు

తెలుగు స్వతంత్ర, 1-1-1954

# 39. స్వగతం- (ఎఫ్)

పాకిస్తాను వేరు పడిపోయినప్పుడు ఇండియాకు జనుముపోయి జనపనార మిల్లులు మిగిలాయని రాజకీయ వాదులు ఆక్రోశించారు జనుము ప్రాముఖ్యాన్ని తగ్గించే అధికారం ఎవరికీ లేదు కాని అంతకన్న ముఖ్యమైనవి చాలా పోయాయి వాటికోసం రాజకీయవాదులాక్రోశించలేదు పాకిస్తానుతో ఎంతమంది రచయితలు పోయారో, ఎంతమంది గాయకులు పోయారో, ఎంతమంది ఇతరకళాకారులు పోయారో ఎవరూ అంచనా కట్టలేదు "మీకు షేక్స్పియర్ కావాలా? ఇండియా కావాలా?" అని బ్రిటిషువారిని నిలదీసి అడిగిన కార్లయిల్, "రాజకీయవాదులు రాజకీయభాష మాట్లాడుతారు ఎప్పుడో ఎట్లాగో ఇండియా పోతుంది, షేక్స్పియర్ ఉంటాడు," అని గొణుక్కున్నాడు బ్రిటిషు వారికి ఇండియా పోయింది (ఇంకా పూర్తిగా పోకపోతే త్వరలోనే పోతుంది) వారికి షేక్స్పియర్ మిగిలాడు కాని మనకు పాకిస్తానూ పోయింది, ఖాన్ సాహెబ్ బడేగులామాలిఖాన్ కూడా పోయాడు హిందూస్థానీ సంగీతంలో అత్యుత్తమగాయకుణ్ణి పోగొట్టుకున్నందుకు ఎందరు రహస్యంగా చింతించారోగాని పైకి వగచిన వారు లేరు

ఈనష్టంయొక్క ప్రమాణం తెలిసివచ్చేటట్టుగా బడే గులామాలీఖాన్ మద్రాసుకువచ్చి గానసభలు చేశాడు ఆయనపాట విన్నవారు ముగ్ధులయారు, తన్మయులయారు, మతులు కూడా పోగొట్టుకున్నారు పాకిస్తాన్ నుంచి వచ్చే రాజకీయ వార్తలు కరిగించిపోసిన సీసంలా ఉన్న ఈ తరుణంలో ఈ పాకిస్తానీ గాయకుడు భారతీయుల చెవులలో ఈ అమృతం ఎట్లా పోయగలిగాడు? ఒక ప్రసిద్ధ తమిళగాయకుడు ఈ ఖాన్ సాహెబ్‌గారి పాదాలంటి కళ్ళ కద్దుకునేటట్టు చేసినదేమిటి? ఆ తమిళగాయకుడికి "ఖుదా" మేలు చేయాలని ప్రార్థించిన ఈ ముస్లిము గాయకుడు "భజరే హరినాం" అనే పాటను-భక్తితో కాదు భక్తికన్న కూడా తన్మయత్వాన్ని సాధించగల రాగభావంతో- పాడటానికి కారణమేమిటి? ప్రపంచంలో కల్లా ఉత్తమ హిందూస్తానీ గాయకుడైన ఈ "సాయిబు"కు మద్రాసు పౌరుల ప్రేమ దేనికి?

అన్నిటికీ ఒకటే కారణం బడేగులామాలీఖాన్ పాకిస్తాను రాజకీయవాదుల ప్రతినిధికాడు ఆయన మద్రాసువచ్చినది పాకిస్తాను ముస్లిముల ప్రతినిధిగాకూడాకాదుః ఆయన దేవుడు "ఖుదా" అవుగాక, ఈ సాంస్కృతిక ప్రాతినిధ్యం వహించటానికి "ఖుదా" అడ్డం రాలేదు- అనేక మంది తమిళ సంగీతవిద్వాంసులు త్యాగరాజ కృతులు పాడటానికి తమిళభాషాభిమానం అడ్డం రానట్టు! మద్రాసు పౌరులను ముగ్ధులను చేసిన ఖాన్‌సాహెబ్ గారి సంగీత సంస్కృతికి పాకిస్తాన్ వారు ముగ్ధులైనంత కాలమూ ఉభయదేశ ప్రజల మధ్య దృఢమైన సాంస్కృతిక బంధం ఉండనే ఉన్నది పాకిస్తాన్‌నిండా అమెరికన్ యుద్ధ స్థావరాలు పరిచి, బాంబరు విమానాలు దించినా ఈ బంధం తెగదు రాజకీయవాదులు రాజకీయ భాషమాట్లాడవచ్చుగాక, అమెరికన్ స్థావరాలూ, విమానాలూ వెళ్ళిపోతాయి, బడేగులామాలీఖాన్ ఉంటాడు ఏంసందేహం లేదు బడేగులామాలీఖాన్ సంగీతాన్ని ప్రేమించే ఇండియా పాకిస్తాన్ ప్రజలు పరస్పరం ద్వేషించుకోలేరు అసంభవం!

తెలుగుస్వతంత్ర, వారపత్రిక 15-1-1954

# 40. స్వగతం (జి)

లాయకాలీ హయాంలో ప్రకాశంగారికీ మరి కొందరికీ కొంత డబ్బు పంపినట్టు "బయట పెట్టారు" ఇంతకీ వారికాడబ్బు అందనేలేదు ఈ విధంగా లాయకాలీ పంపిన డబ్బు అందుకున్న అదృష్టవంతులు కొందరులేకపోలేదు లాయకాలీ పంపిన వారంతా పరారీ కాలేదు వారిలో కనీసం కొందరైనా సురక్షితంగా మద్రాసుచేరి అక్కడ రోజుల తరబడి ఉండి, అనేకమంది నాయకులనూ, జర్నలిస్టు వినాయకులనూ కలుసుకుని తమ విధిని నిర్వర్తించారు

అయితే ఈపని పూర్తిగా విజయవంతమయిందని చెప్పటానికిలేదు చేతికి అందించిన డబ్బుకూడా తీసుకోలేక పోయిన దౌర్భాగ్యులు తెలుగు వాళ్ళలో ఉన్నారు అందులో ఒకడు జర్నలిస్టు వినాయకుడు, నిజాం రాజ్యపు పుట్టుపూర్వోత్తరాలన్నీ రాసి, ఆసంస్థానంపట్ల కాంగ్రెసు ప్రభుత్వం అప్పట్లో చూపుతూవచ్చిన తటపటాయింపులను విమర్శించాడు ఈ దీర్ఘవ్యాసం వెలువడిన కొద్దిరోజులకే ఇతనికి టెలిఫోన్ మీద లాయకాలీగారి మనిషి నుంచి పిలుపు వచ్చింది వెళ్ళాడు

ఇద్దరూ ఆనాటి రాజకీయాలు మాట్లాడుకున్నారు లాయకాలీమనిషి ఒక్క నిజాంగారికే గాక పాకిస్తానుకు కూడా అనుకూలంగా అత్యున్నత రాజకీయ పరిభాషలో మాట్లాడాడు ఆయన దృష్టిలో భారతీయ కాంగ్రెసు ప్రభుత్వం రెండు "దూడలు" వేసింది ఒకటి, కాశ్మీరును ఆదుకుని పాకిస్తానును కబళించకపోవటం ఆపని చేసి నట్టయితే నిజాంసంస్థానం వశపరచుకునేటందుకు ఆస్కారం ఉండేదట భారతీయ ప్రభుత్వం చేసిన రెండోతప్పు ఇండియాలో చేరమని ఒత్తిడి చేయటముః నిజాం ఎట్లాగూ ఇండియాతో చేరదుః బలతాకరంగా చేర్చుకునే నైతిక శక్తిగాని , ఆయుధ శక్తిగాని ఇండియాకు లేదట

జర్నలిస్టు వినాయకుడు దీనికి ఆమోదించలేదు "నైతిక శక్తిమాట దేవుడెరుగు ముష్టి నిజాము రాష్ట్రాన్ని ఆయుధబలంతో జయించాలంటే ఇండియాకు గట్టిగా మూడు నిముషాలు పట్టదు యుద్ధకాలంలో ఆయుధ నిర్మాణశాఖలలో పనిచేసినవాణ్ణి, ఈమాత్రం రూఢిగా చెప్పగలను" అన్నాడు

"నిజాం ఇండియాతో చేరనందువల్ల ఇండియాకు కలిగేనష్టమేమిటి?" అన్నాడు లాయకాలీ మనిషి

"ఇండియా నడిబొడ్డులో నిరంకుశ పరిపాలనా, రజాకార్ ఫాసిస్టుశక్తులూ విజృంభించటం ప్రమాదంకాదా?" అన్నాడు జర్నలిస్టు వినాయకుడు

"నిజాంలో సంఘటనలను గురించి నువు విన్నదంతా వట్టి అసత్య ప్రచారం దాన్ని ఎట్లా నమ్ముతావు?"

"వచ్చిన వార్తలన్నిటినీ నమ్మేటంత వెర్రి కుట్టెనుకాను జర్నలిస్టుగా నాకు తగిన ఆధారాలు నాకున్నాయి ఆ ఆధారాలను నమ్ముతాను అవి నమ్మదగినవికావని రుజువయే దాకా నమ్మటం మానను" అన్నాడు జర్నలిస్టు

"నువ్వు అవీనమ్మవద్దు, నామాటా నమ్మవద్దు మా అతిధిగా హైద్రాబాదుకు రా నీ యిష్టం వచ్చినంతకాలం ఉండు, స్వయంగా చూడు నీకు ఏ లోపం జరగకుండా నేను చూస్తాను "

ఆ సమయంలో హైదరాబాదు వెళ్ళి నాలుగురాళ్ళు సంపాదించుకుంటున్నవాళ్ళను ఎరిగుండి కూడా ఈ జర్నలిస్టు వినాయకుడు ఈ ఆహ్వానాన్ని నిరాకరించి, పొట్టచేతబట్టుకుని మరో రాష్ట్రం వెళ్ళి అక్కడ అయిదురూపాయల రోజుకూలీమీద–ఆదివారాలూ, శలవుదినాలూ నాగా గుమాస్తాగిరీ చేసి, మరి మూడునెలల అనంతరం హైదరాబాద్‌మీద పోలీసు చర్య జరిగేదాకా వెనక్కు తిరిగిరాలేదు

లాయకాలీ డబ్బు సంచులకు ప్రమాదాలు జాస్తి వాటిని మోసుకొచ్చేవాళ్ళేకాక, పంపేవాళ్ళు కూడా ఎప్పుడో ఒకప్పుడు పరారీ అవుతారు

తెలుగుస్వతంత్ర, వారపత్రిక, 22-1-1954

# 41. స్వగతం (ఎచ్)

తిరువాన్కూర్–కొచ్చిన్‌లో ఎన్నికలు కాంగ్రెసు ప్రముఖులు వెళ్ళారు కమ్యూనిస్టు ప్రముఖులు వెళ్ళారు ఉపన్యాసాలిస్తున్నారు "కాంగ్రెసును గెలిపించండి" "ఎట్లాగైనా కాంగ్రెసును ఓడించండి," అని ప్రజలను హెచ్చరిస్తున్నారు

ప్రజలు కాంగ్రెసును ఎందుకు గెలిపించాలి? కాంగ్రెసు ప్రజలకేం చేసింది? దేశానికేం చేసింది? చెయ్యవలసిన దానిలో ఒకవీసం చేసి దానికే వీపు తట్టుకుంటున్న కాంగ్రెసు గెలవకపోతే దేశం ఇంతకన్న అధోగతి పాలవుతుందనా?

ప్రజలు కాంగ్రెసును ఓడించిన తరువాత ఏ మవుతుంది? ఇవాళ కాంగ్రెసును ప్రతిఘటించే పార్టీలలో ఎన్నిటికి వాస్తవమైన ఆదర్శాలున్నాయి? వాటిలో సామ్యం ఎంతవరకున్నది? ఈ ఆదర్శాలు ఆచరణలో పెట్టి ప్రజలకూ, దేశానికీ ఎంత వరకు ఉపకారం చెయ్యగలుగుతారు? ఈ ప్రతికక్షులలో మంత్రిత్వం చూస్తే జారిపోనివారెందరు?

ఈ దేశానికి ఈరకం పార్టీ ప్రభుత్వం, ఈ రకం ఎన్నికలూ దేనికి? రాజ్యాంగం రచించినట్టుగానే దేశంయొక్క ఆర్థిక, రాజకీయ, సాంఘికాభివృద్ధికి ప్రణాళికలు తయారుచేసి వాటిని అమలు జరిపేటందుకు దేశంలో ఉన్న సమర్థులంతా పూనుకుంటే అటువంటి ప్రణాళికలకు ప్రజాసహకారం దొరకకపోయిందా? "దేశాభ్యుదయాన్ని మా పార్టీ ఒక్కటే సాధించగలదు", అని చెప్పగల పార్టీ ఏది? నవచైనాలో కూడా అచ్చంగా కమ్యూనిస్టు పార్టీయే దేశాభ్యుదయానికి పాటుపడలేదే!

రేపు ఖర్మంచాలక మళ్ళీ ప్రపంచ మారణ హోమం జరిగితే అందులో ఈ అభాగ్యదేశం మాడిపోకుండానూ, బయటినుండి ఈ దేశానికి రాగల ప్రమాదాన్ని ప్రతిఘటించేటట్టుగానూ చూడగల ఏకైక పార్టీ ఏది?

కమ్యూనిస్టు వ్యతిరేకత ఒక రాజకీయ సిద్ధాంతంగా పెట్టుకుని ఐక్యంకాలేక అంతస్సంఘర్షణలతో అలమటించే పశ్చిమరాజ్యాలను చూస్తున్నాం ఈ దేశానికి కాంగ్రెసు వ్యతిరేకత ఒక రాజకీయ సిద్ధాంతమా? దాని ఆధారంతో దేశాభ్యుదయం చేకూరి, ప్రభుత్వానికి ప్రజాబలం లభ్యమవుతుందా?

ఇన్నాళ్ళు పదవులను దుర్వినియోగపరచి కొందరు కాంగ్రెసు నాయకులు కాంగ్రెసును ప్రజలకు దూరంచేశారు కాని కాంగ్రెసుపార్టీ కొమింటాంగ్ లాగా ఇంకా దేశదౌర్భాగ్యం కొరకు కృషి ప్రారంభించలేదు గడచిన కాలంలో కాంగ్రెసు సాగించిన జాతీయపోరాటాలనుబట్టి దేశంలోని అనేకమంది జాతీయవాదులు ఆ పార్టీపైగల అభిమానాన్ని, పదవులను దుర్వినియోగపరచిన నాయకులను చూసి జారవిడువ లేకుండా ఉన్నారు "ఎవరు పదవిలోకి వచ్చినా ఇంతేలే!" అని వారు తమ అంతరాత్మలను సమాధానపరుచుకొంటున్నారు ఇటువంటి రాజకీయ విముఖత దేశాభిమానులలోనూ, ప్రజలలోనూ విస్తరించటం చాలా ప్రమాదకరం ప్రజల ఉదాసీనతయే ఈనాటి దేశస్థితికి ప్రధానకారణంకూడా!

ఎన్నికల సంఘర్షణలు ఉద్రేకాలు రెచ్చగొట్టి ప్రజలను రాజకీయాంధులను చేస్తాయిగాని ఈ ఉదాసీనతను తొలగించవు రష్యాలో ఎన్నికలు జరిగితే ఆ ఎన్నికలను విమర్శకూ, సింహావలోకనానికీ వినియోగిస్తారట అదృష్టవశాత్తూ రష్యా, చైనా దేశాలలో దేశాభ్యుదయానికి ప్రాతిపదిక ఏర్పడ్డాక-దేశాభ్యుదయకర శక్తులన్నీ కూడగట్టబడినాక-ఎన్నికలు జరిగాయి పార్టీ పోటీలు, ఎన్నికలూ దేశాభ్యుదయకర శక్తులను కూడ గట్టటానికి తోడ్పడటం కలలో వార్త

అధికారపు కీచులాటలలోనే కొమింటాంగ్ పార్టీలు తయారయేది పాలించ మరిగిన వాళ్ళు ప్రతిఘటనకు తట్టుకోలేనప్పుడు వెలపలి దుష్టశక్తులకు దాసోహమవుతారు ప్రజాస్వామ్యం పేరిట పార్టీల పోటీలు పెరుగుతున్నకొద్దీ పార్టీలలోపల క్రమశిక్షణ పేరిట నియంతృత్వం వృద్ధి అవుతుంది పార్టీ పరిపాలనలో ఈ నియంతృత్వమే ప్రజా శత్రువుగా పరిణమిస్తుంది

ప్రజల ఆసక్తిని రాబట్టలేనిది ఎటువంటి ప్రజాస్వామ్యం? ఈ దేశానికి కావలసింది సర్వపక్షదేశహితకాముల సమీకరణ, దేశాభ్యుదయ ప్రణాళికలు, ప్రజా సహకారం

తెలుగుస్వతంత్ర, వారపత్రిక 29-1-1954

## 42. అణుశక్తి మానవకల్యాణానికా? మారణహోమానికా?

ద్వితీయ ప్రపంచయుద్ధం ముగిసే దినాలలో, 1945 ఆగస్టు 6న, "ఇనోలా గే" అనే అమెరికన్ విమానం తినియన్ దీవిలోని స్థావరంనుంచి బయలుదేరి, మరి రెండు పరిశీలక విమానాలను వెంటబెట్టుకుని, జపాన్‌లోని హిరోషిమా నగరంమీదికి వచ్చి, ఉదయం 8-15 గంటలప్పుడు ఒకబాంబు వేసింది అది పేలిన మరుక్షణం, పేలినచోటికి మైలుదూరంలోగల ఇళ్ళన్నీ పూర్తిగా ధ్వంసమయాయి నాలుగుమైళ్ళ దూరంలోగల ఇళ్ళు సగం పడిపోయాయి ఎనిమిది మైళ్ళదాకా గల ఇళ్ళు దెబ్బతిన్నాయి బాంబుధాటికి కనీసం 75 వేలమంది మనుషులు చచ్చారు మరి 70వేల మంది గాయపడ్డారు

మరికొద్దిరోజులకు అమెరికనులు ఇలాటి బాంబునే, నాగసాకీ అనే మరొక జపానునగరం మీద పేల్చారు దాని ఫలితంగా అక్కడ కనీసం 40వేల మంది చచ్చి, మరి 40 వేలమంది గాయపడ్డారు

ఇవి ఆటంబాంబులు  వీటికి అపారమైన పేలుడుశక్తి ఉన్నది, ఇవి పేలినప్పుడు అతి తీవ్రమైన వేడి ఉత్పత్తి అవుతుంది  వీటినుంచి అపాయకరమైన కిరణాలు ప్రసారమవుతాయి  ఆటంబాంబుల విధ్వంసనశక్తి పైమూడు అంశాలపైనా ఆధారపడి ఉన్నది

ఒక ఆటంబాంబులో (లేక, హైడ్రోజన్ బాంబులో) ఇన్నివేల టన్నుల డైనమైట్‌కు గల పేలుడుశక్తి ఉన్నది అని శాస్త్రజ్ఞులు అంచనాలు కట్టటం పరిపాటి  కాని, ఈ లెక్కలవల్ల ఆటంబాంబుకు గల వినాశనశక్తి బోధపడదు  కేవలం పేలుడు వల్ల కలిగే దుష్ఫలితాలు అప్పటికప్పుడే తెలిసిపోతాయి  కాని, ఆటంబాంబులనుంచి వెలువడే విషకిరణప్రసారం–రేడియేషన్–వల్ల ప్రజలు భయంకరమైన వ్యాధులకు గురిఅయి, ఏళ్ళ తరబడి నరకయాతన అనుభవించి, ఘోరమైన చావు చస్తారు  1945 ఆగస్టు 6న హిరోషిమాలో రేడియేషన్‌కు గురి అయిన వ్యక్తులలో ఒకడు దాని దుష్ఫలితాల కారణంగా 1954 జూన్‌లో చనిపోయాడు

రేడియేషన్ దుష్ప్రభావం ఒక తరంతో వదిలిపెట్టదు  అది తరతరాలు వెంబడిస్తుంది  ఉదారహణకు, నాగసాకీపై ఆటంబాంబు పేలిన అనంతరం ఆ నగరంలో పుట్టి బతికిన పిల్లలలో నాలుగోవంతుమంది అసహజంగా పుట్టినవారూ, అంగవికలురూనూ!

## మారణాస్త్రాల ముందడుగు

ఆటంబాంబులను అపరిమిత ప్రమాణంలో తయారుచేసే అవకాశం లేదు  ఎందుచేతనంటే అందులో చేర్చేయురేనియం గాని, ప్లుటోనియంగాని ఒక ప్రమాణాన్ని మించి ఒక చోటచేర్చగానే పేలుతాయి  అందుచేత ఈ పదార్థాలను అంతులేని ప్రమాణంలో ఒక చోట చేర్చటం సాధ్యంకాదు

అయితే హైడ్రోజన్ బాంబును ఎంత ప్రమాణంలో నైనా చేయవచ్చు  ఇందులో హైడ్రోజన్ పరమాణువుల మధ్య సంయోగం కలగటం వల్ల శక్తి ఉత్పత్తి అవుతుంది  హైడ్రోజన్ ప్రమాణం ఎంత హెచ్చుగావుంటే హైడ్రోజన్ బాంబు తాలూకు పేలుడు శక్తి అంత హెచ్చుగా ఉంటుంది  యురేనియం, ప్లుటోనియంలాగా కాక హైడ్రోజన్ వాయువును అపరిమిత ప్రమాణంలో ఒకచోట చేర్చవచ్చు  అందుచేత హైడ్రోజన్ బాంబులు ఎంత ప్రమాణంలోనైనా తయారుచేసే అవకాశం ఉంది

పేలుడు శక్తిలోనూ, వేడిలోనూ, రేడియేషన్‌లోనూ హైడ్రోజన్ బాంబు ఆటంబాంబుకన్న అనేక వందల రెట్లు మిన్న  1952లో పేల్చిన హైడ్రోజన్ బాంబు ఫలితంగా 3,700 చదరపు మైళ్ళమేర ప్రాణికి ఆస్కారం లేకుండా అయిపోయింది  అది పేలినచోట 4 మైళ్ళ వ్యాసమూ, 50 గజాల లోతూగల గుంటపడింది  అక్కడగల పదార్థం అనేకకోట్ల టన్నుల ప్రమాణంలో భస్మమై ఆకాశంలోకి దాదాపు 20 మైళ్ళు ఎత్తు లేచింది

ఒక్కొక్క బాంబరులో 10 టన్నుల మామూలు బాంబులుపెట్టి, ఆవిధంగా 2 వేల బాంబర్లచేత దాడి చేయిస్తే ఎంత విధ్వంసం జరుగుతుంది? ఒక హైడ్రోజన్‌బాంబు పేలుడు ఇలాటిదాడులు వెయ్యింటికి సమానం! గత ప్రపంచ యుద్ధంలో జర్మనీమీద అన్ని దేశాలవారూ కలిసి మొత్తం ఎన్ని బాంబులు వేశారో అంతకు 15 రెట్లుంటుంది ఒక హైడ్రోజన్ బాంబు!

ఈ హైడ్రోజన్ బాంబుకు కొబాల్ట్ తొడుగు అమర్చినట్టయితే దాని విధ్వంసనశక్తి అనేక రెట్లు హెచ్చుతుంది కొబాల్ట్ తొడుగుగల ఒకటన్ను హైడ్రోజన్‌బాంబు పేలిస్తే దానినుంచి వెలువడే రేడియేషన్ 2,400 టన్నుల రేడియం తాలూకు రేడియేషన్‌తో సమానం కొబాల్ట్‌యొక్క రేడియేషన్ శక్తి 5 ఏళ్ళపాటు నిలిచిఉంటుంది దీని భస్మం గాలిలో సంచరిస్తూ అయిదేళ్ళపాటు ఎక్కడ రాలితే అక్కడ ప్రాణికి ఆస్కారం లేకుండా చేయగలదు ఎవరిమీద రాలితే వారికి ఆటంవ్యాధి తెచ్చిపెట్టగలదు

హైడ్రోజన్ బాంబుమీద వ్యాఖ్యానిస్తూ సుప్రసిద్ధ శాస్త్రవేత్త ప్రొఫెసర్ ఆల్బర్ట్ ఐన్‌స్టయిన్, "భూమిమీదగల వాతావరణాన్ని విషపూరితంచేసి, మానవజాతిని సర్వనాశనం చెయ్యటానికి పథకం అమరింది," అన్నాడు

## ఆటంవ్యాధులు

జపానీ నగరాలలో ఆటంబాంబులు పేలినప్పుడు వాటిధాటికీ, వేడికీ చచ్చినవారు చావగా వాటి రేడియేషన్‌వల్ల అసంఖ్యాకులు వ్యాధిగ్రస్తులయారు ఈవ్యాధికి జపానులో ఆటంవ్యాధి అని పేరుపెట్టారు ఆటంబాంబు పేలిన 20 రోజులకు డాక్టరు నొబుఓ కుసనో అనే జపానీ డాక్టరు హిరోషిమా నగరానికి వెళ్ళి ఈ వ్యాధిని వివరంగా పరిశీలించారు ఆయన ఈ విధంగా వివరించారుః

బాంబు పేలినప్పుడు పేలుడు జరిగినచోటుకు మైలు దూరంలో ఉండి, తీవ్రమైన దెబ్బలూ, బొబ్బలూ, కలగటంవల్ల మరణించనివారు రెండురోజులపాటు వికారంతో బాధపడి, తరవాత మామూలు మనుషుల్లాగా తిరగసాగారు కాని, రెండు వారాలు గడిచాక వారిజుట్టు వేగంగా రాల నారంభించింది రెండు మూడు రోజులలో వారివి పూర్తిగా బట్టతలలయాయి వారి శరీరాలమీద ఎర్రనిమచ్చలు కనిపించాయి నీళ్ళ విరేచనాలు ఆరంభమై, వాటితోబాటు గ్రహణిలోలాగ రక్తం పోసాగింది నయమవుతున్నట్టు కనబడిన బొబ్బలూ, గాయాలూ, తిరగబెట్టి తీవ్రతరమయాయి వారి శరీరాలవేడి తీయకుండా 104 డిగ్రీలుంటూ వచ్చింది వారి రక్తమంతా విషకలితమై పోయింది వారి ఉమ్మిలోనూ, ఇతర శరీర భాగాలనుండీ రక్తం స్వేచ్ఛగా స్రవించసాగింది వారి శరీరాలనుండి భరించరాని దుర్గంధం బయలుదేరింది వ్యాధి ఆరంభమైన వారం రోజులకు మృత్యువు అనివార్యంగా వారిని పొట్టన పెట్టుకుంది

ఈ ఆటంవ్యాధి శరీరాలలో ఏమి మార్పులు తెస్తుంది? రేడియేషన్ బలంగా సోకినవారి రక్తంలోని తెల్లకణాలు క్షీణించి, ఉండవలసినదానిలో పదోవంతుకూ, యాభయ్యోవంతుకూ తగ్గిపోతాయి "గామా" కిరణాలు రక్తోత్పత్తి జరిగే శరీరభాగాలలోకి చొచ్చుకుపోయి, తెల్లకణాల ఉత్పత్తిని నిరోధిస్తాయి శరీరాన్ని వ్యాధులనుంచీ, వ్యాధిక్రిములనుంచీ రక్షించే యీ తెల్లకణాల ఉత్పత్తి తగ్గిపోగానే రక్తానికి చిక్కబడేశక్తి నశించి రక్తస్రావాలు సాగుతాయి పైకి చూడటానికి రోగి పెద్దవ్యాధితో తీసుకుంటున్నట్టు కనుపించడుః కాని అతని శరీరంలోని ధాతువును మైక్రోస్కోప్‌తో పరిశీలించినట్టయితే, జీవకణాలు చురుకుగా పనిచేసే ధాతువు ఎంతఘోరంగా శిథిలమైపోయినదీ తెలుస్తుంది

ఆటంవ్యాధికి రెండు దశలుః మొదటిదశలో రక్తోత్పత్తి దెబ్బతింటుందిః రెండవదశలో శరీరం వ్యాధినిరోధకశక్తిని కోల్పోయి, సమస్తమైన వ్యాధిక్రిముల దాడికి గురి అయి కుళ్ళనారంభిస్తుంది

హిరోషిమా, నాగసాకీలలో ఆటంబాంబు ప్రేలిన ఫలితంగా చచ్చినవారిలో నూటికి 70 మంది ఆరోజే చనిపోయారు నూటికి 10 మంది బాంబులుపడిన 2 వారాల లగాయతు 2 మాసాలలోపల ఆటంవ్యాధితో తీసుకుని మరణించారు 2 నెలలనుంచి 6 నెలలకాలంలో చావులసంఖ్య తగ్గిందిగాని, రోగులు ఎనీమియా (రక్తక్షీణత)తో ఎక్కువగా బాధపడ్డారు 6 నెలలు గడిచాక మిగిలిన రోగులలో హెచ్చుగా కనపడే వ్యాధి లుకీమియా బాంబు పేలినచోటికి 10 ఫర్లాంగుల దూరంలో ఉండినవారిలో ఈ వ్యాధి, మామూలుగా ఉండేదానికన్నా పదిరెట్లు తరుచుగా కనిపిస్తున్నది 1954లో 10 మంది ఈ వ్యాధితో చనిపోయారు

**ముందుతరాల గతి**

ఆటంబాంబుల రేడియేషన్ ప్రభావం రేడియేషన్‌కు గురి అయినవారిపై మాత్రమే గాక ముందుతరాలవారిపైన కూడా భయంకరంగా ఉంటాయని నాగసాకీ నగరంలో సేకరించిన వివరాలు సూచిస్తున్నాయి

ఎక్కడన్నా పుట్టేపిల్లలలో అసహజంగా, అంగవైకల్యంతో, విడ్డూరంగా పుట్టేవారు కొందరుంటారు ఆటంబాంబు పేలిన అనంతరం నాగసాకీలో ఇలాటి పిల్లల సంఖ్య చాలా విపరీతంగా పెరిగింది

బాంబు పేలిన అనంతరం నాగసాకీలో 9 ఏళ్ళ కాలంలో 30,150 మంది బిడ్డలు పుట్టారు వీరిలో 4,282 మంది అవలక్షణాలతో పుట్టారు వివరాలివిః

471 మంది చచ్చిపుట్టారు 181మంది నెలలు తక్కువగా పుట్టారు వీరిని వెలికితీయటానికి శస్త్రప్రయోగం అవసరమయింది 1046 మందికి ఎముకలూ, కండరాలూ, చర్మమూ, నరమండలమూ సరిగా ఏర్పడలేదు 429 మందికి ముక్కులూ, చెవులూ లేవు 254 మందికి పెదవులూ, నాలుకలూ వక్రంగా ఉన్నాయి 59 మందికి మూతులు, తోడేళ్ళ ముట్టెల్లాగా పొడుచుకువచ్చి పుట్టారు 243 మందికి లోఅవయవాలు సరిగా ఏర్పడలేదు 47 మందికి మెదడు వికలంగా ఏర్పడింది 25 మందికి మెదడేలేదు 8 మందికి కళ్ళుగాని, కనుగుంటలుగాని లేవు హైడ్రోజన్ బాంబు దుష్ఫలితాలు ఇంతకంటే కూడా దారుణమైనవి ఈ హైడ్రోజన్ బాంబుల పంపిణీ 1951లో కనిపెట్టబడింది వీటిని ఇంతవరకు బుద్ధిపూర్వకంగా జనసమూహాలపై ప్రయోగించటం జరగలేదు పరిశోధనల కోసమో, జనాన్ని బెదరగొట్టటం కోసమో ప్రయోగాలు మాత్రమే జరిగాయి వీటిని ప్రయోగించటంవల్ల ఎవరికీ ప్రమాదం జరగకుండా కట్టుదిట్టాలు కూడా జరిగాయి అయినా ఈ బాంబులు చాలా హానిచేశాయి

1954 మార్చి 1న బికినీ ఎటోల్‌లో ఒక హైడ్రోజన్ బాంబు పేల్చబడింది బాంబు పేల్చినచోటికి 200 మైళ్ళ దూరంలోగల వలయమంతా అపాయప్రాంతంగా పరిగణించబడింది "ఫుకుర్యు మారు" అన్న జపానీ బెస్తనౌక బాంబు పేలిన సమయాన బికినీకి వెయ్యిమైళ్ళ దూరాన ఉన్నది ఆరురోజుల అనంతరం అది బాంబు పేలినచోటికి 200 మైళ్ళ దూరానికి

వచ్చింది అయినా బాంబుతాలూకు "మృత్యుభస్మం" పడవమీద రాలి, పడవలోని 1200 టన్నుల చేపలూ, విషకలితమయాయి పడవమీద గల 23 మంది జపానీయులూ మృత్యుభస్మానికి గురిఅయారు వారిలో ఒకడు కొద్ది కాలానికి "ఆటంవ్యాధి"తో చనిపోయాడుకూడా ఆ 23గురిలో 14 మంది అవివాహితులు వారు పెళ్ళాడరాదని తీర్మానించుకున్నారు!

ఈ బాంబు పేల్చకముందు మార్షల్ దీవినుండి కొందరు అమెరికనులు "క్షేమ" ప్రాంతానికి తీసుకుపోబడ్డారు! వీరిమీద కూడా మృత్యుభస్మం పడింది!

అమెరికాలోని "ఆటం" కేంద్రాలలో పనిచేసేవారిలో లుకీమియా వ్యాధి జాస్తిగా ఉండటం చూసి అమెరికన్ డాక్టర్లు ఆందోళన చెందుతున్నారట!

## అంతర్జాతీయ నీతి

అమెరికన్ బాంబర్లు 1945లో ఆటంబాంబులు వేసి రెండు జపానీ నగరాలను ధ్వంసం చేసేనాటికి మిత్రరాజ్యాలకూ, జపానుకూ మధ్య యుద్ధం యింకా కొనసాగుతున్న మాటనిజమేగాని, అప్పటికే జపాను చాలా చితికిపోయింది అదీగాక-మరి రెండురోజులకు (1945 ఆగస్టు 8న) రష్యాబలాలు జపానుమీదికి నడుస్తాయనగా హిరోషిమామీద మొదటి ఆటంబాంబు పేలింది రష్యా యుద్ధంలోకి దిగాక నాగసాకీపై రెండవ ఆటంబాంబు పేలింది ఈ ఆటంబాంబులు పేలుడు యుద్ధంలో ఆఖరుచర్యగా కాక, మూగయుద్ధానికి తొలిచర్యగా అమెరికావారు ఉద్దేశించినట్టు కొందరు రాజకీయవేత్తలు భావిస్తున్నారు

జపానును గెలవటానికి ఈ ఆటం విధ్వంసం అవసరమా, కాదా అన్న సమస్య అలా ఉంచి, అంతర్జాతీయ యుద్ధనీతికి ఈ చర్య విరుద్ధమా, కాదా అనికూడా విచారించవలసి యున్నది

ఈ నాగరికయుగంలోకూడా యుద్ధసంఘర్షణ అనివార్యమనే విశ్వాసంతో, యుద్ధంపేరిట అనవసర హింస జరగకుండా ఉండగలందులకై, యుద్ధంలో పాటించవలసిన నియమాలు అనేక పర్యాయాలు నిర్వచించబడ్డాయి

"శాంతి కాలంలో, దేశాలు పరస్పరం సాధ్యమైనంత ఎక్కువ ఉపకారమూ, యుద్ధకాలంలో సాధ్యమైనంత తక్కువ అపకారమూ చేయాలి" అన్న సూత్రాన్ని ఏబ్‌గ్రేగ్వార్ 1806లో ప్రతిపాదించాడు

"శత్రువుయొక్క సమరబలాన్ని తగ్గించటానికి అవలంబించదగిన చర్యలు మాత్రమే ధర్మసమ్మతమైనవి" అని 1868 డిసెంబరు 11న జరిగిన సేంట్‌పీటర్సుబర్గ్ ప్రకటన ప్రవచించింది

ఈ ప్రకటన ప్రకారం యుద్ధాస్త్రాలను శత్రువుయొక్క సైనికబలాల మీదా, సైనిక స్థావరాలమీదా మాత్రమే ప్రయోగించాలి సామాన్య పౌరులపై ప్రయోగించరాదు

1872లో, ఫ్రెంచి సుప్రీంకోర్టు న్యాయవాది అయిన మెొరాసి అనే ఆయన, "జనసమూహాలను నిర్మూలించి, గృహాలను తగలబెట్టే కొన్ని విధానాలను అరికట్టవలసి ఉన్నది,"

అని రాశాడు  ఈయనే, మరి 70 ఏళ్ళకు జరగబోయే కొరియా యుద్ధాన్ని అప్పుడే చూచినవాడిలాగా, "ఏ దేశంమీదికిగాని విషపూరిత పదార్థాలనూ, అంటు వ్యాధులు వ్యాపింపజేసే పదార్థాలనూ పంపకం చెయ్యటం చాలా హేయమైన పని," అనికూడా రాశాడు

1907 లో జరిగిన హేగ్ ఒడంబడిక, "యుద్ధంచేసే వారు శత్రువుకు హాని కలిగించే నిమిత్తమై అస్త్రాలు నిర్ణయించటంలో సర్వస్వతంత్రులెన్నటికీ కాదు  ఎట్టి ఆయుధాలతోగాని నగరాలనూ, గ్రామాలనూ, గృహాలనూ, రక్షణలేని భవనాలనూ కొట్టటం నిషిద్ధమైనది," అని నిర్ణయించింది

1925లో తయారైన జినీవా ప్రొటొకోల్ క్రిమి ఆయుధాలనూ, రసాయనికాస్త్రాలనూ నిషేధించుతూ, "నాగరిక ప్రపంచం ఇటువంటి అస్త్రాలను విధిగా ఖండిస్తుంది" అన్నది

ద్వితీయ ప్రపంచయుద్ధంలో అంతర్జాతీయ నీతి విరివిగా ఉల్లంఘించబడటంవల్ల, 1945లో ఏర్పాటయిన న్యూరెన్బర్గ్ ట్రిబ్యునల్ "మానవత్వంపై అత్యాచారాలు" అన్నవాటిని యుద్ధనేరాలలో చేర్చింది

దీనిని బట్టి ఆటం, హైడ్రోజన్ బాంబుల ప్రయోగం అంతర్జాతీయ నీతికి విరుద్ధమని స్పష్టమవుతున్నది  ఈ అస్త్రాలను జననాశనార్థం ప్రయోగించటం మాత్రమేగాక, పరిశీలనార్థం ప్రయోగించటంకూడా నీతి బాహ్యమైన విషయమేనని ప్రపంచ శాస్త్రవేత్తలు యెలుగెత్తి చాటుతున్నారు  భయంకరమైన హైడ్రోజన్, ఆటం అస్త్రాల ప్రభావం వాతావరణం మీద ఎలా ఉండేదీ విచారించాలనీ, ఈ అస్త్రాల పేలుడు వెంటనే ఆపుచేయాలనీ అనేకదేశాలు ఘోషపెట్టాయి

గత యుద్ధంలో అనేకదేశాల ప్రజలు అంతులేని కష్టనష్టాలకు గురిఅయ్యారు  అపార జననష్టం జరిగింది  ఫాసిస్టు పైశాచిక శక్తులను ప్రతిఘటించటంలో అనేక దేశాల జనసామాన్యం అంతులేని ధైర్యసాహసాలను ప్రకటించింది  తిరిగి ప్రపంచంలో యుద్ధాలు జరగరాదని ప్రపంచ ప్రజలు తీర్మానించుకున్నారు  జాతి, మత, దేశ రాజకీయ సిద్ధాంత వివక్షత లేకుండా యావత్ప్రపంచం యుద్ధనిరోధానికీ, శాంతిరక్షణకూ ఉద్యమిస్తున్నది  నేటి శాంతి ఉద్యమంలాంటి ప్రపంచ విస్తృతమైన ఉద్యమం మానవచరిత్రలో ఎన్నడూ లేదు  ఈ ఉద్యమంలో అనేక దేశాలూ, వివిధ దేశనాయకులూ ప్రవేశిస్తున్నారు

శాంతి ఉద్యమం యింతగా విజృంభించటానికి కారణం ఒకపక్క యుద్ధోన్మాదులు, మరొక ప్రపంచ యుద్ధానికి పథకం వేస్తూండటమే

## యుద్ధ ప్రయత్నాలు

యుద్ధయత్నాలు ఇప్పటికే చాలాదూరం నడిచాయి  ఉత్తర అట్లాంటిక్ ఒడంబడిక ఇందుకే జరిగింది  తమ వ్యూహాన్ని కప్పిపెట్టటానికిగాను యుద్ధోన్మాదులు దీనిని రక్షణ ఒడంబడిక అని ప్రకటించారు  కాని ఇందులో రష్యాకూడా చేరుతానంటే ఒప్పుకున్నారుకారు!

ఉత్తర అట్లాంటిక్ పథకంలోకి పశ్చిమ జర్మనీని చేర్చటానికిగాను పారిస్ ఒప్పందాలు జరిగాయి  ఈ ఒప్పందాల ప్రకారం పశ్చిమ జర్మనీ ఉత్తర అట్లాంటిక్ పథకంలోకి రావటమేగాక, పునరాయుధీకరణకూడా సాగించటానికి అవకాశం యేర్పడుతున్నది  పశ్చిమ జర్మనీ పునరాయుధీకరణకు జరగవలసిన యేర్పాట్లన్నీ ఏనాడో పూర్తి అయాయి  హిట్లర్ యుద్ధ

యంత్రాన్ని నడిపిన క్రప్‌లాటి యుద్ధ పారిశ్రామికులూ, మార్షల్ కెసల్రింగ్, థియొడోర్‌బ్లాంక్, తదితర మాజీ నాజీలూ, యుద్ధనేరస్థులూ, ఫాసిస్టు సంస్థలూ, పూర్వపు యుద్ధాలలో సహాయపడిన యుద్ధతంత్రజ్ఞులూ, ప్రతీకార వాంఛతో తహతహ లాడుతున్న వారూ పునరుద్ధరించబడ్డారు రెండు భయంకర ప్రపంచయుద్ధాలు తెచ్చిపెట్టిన జర్మను యుద్ధయంత్రం పునస్సమీకరణపొంది ఉత్తర అట్లాంటిక్ పథకంలో చేర్చబడడమేగాక, అందులో ఘనమైన పాత్ర నిర్వహించనున్నది ఈసారి అమెరికా జర్మనీకి ఆటం అస్త్రాలుకూడా బహూకరిస్తున్నది అట్లాంటిక్ పథకంలో ఒక భాగస్వామి అవతారం యిది

ఈ పథకానికి ఆధ్వర్యం వహించిన అమెరికా యుద్ధ శాఖవారూ, రాజకీయ నాయకులూ ప్రకటించే వైఖరి కూడా యుద్ధోన్మాద ధోరణినే సూచిస్తోంది

అమెరికా నౌకాశాఖామంత్రి మాత్యూస్ 1950 ఆగస్టులో, "ఇతర దేశాల శాంతియుత సహకారాన్ని బలాత్కారంగా పుచ్చుకునే నిమిత్తం అమెరికా యుద్ధం ఆరంభించటానికి సిద్ధంగా ఉన్నట్టు స్పష్ట పరచాలి" అన్నాడు మాత్యూస్, "చాలా కాలంగా రహస్యచర్చలు జరుగుతున్న విషయాన్నే పైకి అన్నాడు" అని "కురియర్" (పశ్చిమబెర్లిన్) పత్రిక అనేసింది

1951మేలో జనరల్ బ్రాడ్లీ, సెనేట్ కమిటీలో, "మనం మూడవ ప్రపంచయుద్ధంలో పాల్గొంటే నాశనం చేయవలసినది రష్యాని" అన్నాడు

మేజర్ జనరల్ క్రో తన డయిరీలో, "కమ్యూనిజం నిర్మూలించబడాలి మనం అధర్మానికి పాల్పడాలి యుద్ధం! సాధ్యమైనంత త్వరలో! ఇప్పుడే!" అని రాసుకున్నాడు ఈ డయిరీ అచ్చు అయింది

1954మేలో జనరల్ కర్టియస్ లిమే, "అమెరికన్ అటామిక్ బాంబర్లు ఎటువంటి వాతావరణంలోనైనా బయలుదేరగలవు ఎక్కడికైనా వెళ్ళగలవు శత్రువెవరో మనకు తెలుసు ఇవాళే ఉపక్రమించటానికి మనం సిద్ధంగా ఉండాలి, మనం తీసుకునే ప్రతిచర్యా ఈ సంసిద్ధతపై ఆధారపడాలి" అన్నాడు

"జర్మనులకు మనం ఆయుధాలిచ్చి, అట్లాంటిక్ రక్షణ కౌన్సిల్‌లో సమానహక్కులిచ్చి, తూర్పు జర్మనీని విముక్తం చేసే ఆశా, ఓడర్‌నియెసీ లైనుకు తూర్పున ఉండే ప్రాంతాలను యుద్ధంలో గెలుచుకునే ఆశా కల్పించినట్టయితే, జర్మనులు మనకు నమ్మకమైన మిత్రులవుతారనటానికి సందేహం లేదు" అని "అమెరికన్ మెర్క్యురీ" పత్రిక చేసిన సూచనలు అమలు చేయటాని కవసరమైన చర్యలన్నీ జరిగాయి

ఈ పథకంలో ప్రపంచాధిపత్యం కోరేవారికీ, ప్రతీకార దాహం గలవారికీ, సామ్రాజ్యవాదులకూ, వలసవిధానాన్ని స్వాతంత్ర్యోద్యమాలనుంచి రక్షించేవారికీ మాత్రమే స్థానమున్నది స్వతంత్ర భారతంనుంచి నిష్క్రమించ నిరాకరించే పోర్చుగీసువారిని బ్రిటన్ వెనకవేసుకురావటమూ, పోర్చుగీసు వారూ ఉత్తర అట్లాంటిక్ పథకం కింద తమకు గల బాధ్యతలను ప్రస్తావించటమూ ఈ విషయాన్ని స్పష్టంగా రుజువుచేస్తాయి ఈ పథకంలో శాంతికాముక దేశాలకూ, యుద్ధ వ్యతిరేక దేశాలకూ తావు లేదు

ఉత్తర అట్లాంటిక్ పథకంకింద జరిగే యుద్ధాలలో ఆటం అస్త్రాలు ఉపయోగించ బడతాయని కూడా అనేక మార్లు స్పష్టం చేయబడింది

"మిత్ర దేశాల యుద్ధవ్యూహంలో ముఖ్యమైన అంశం కాల్బలాలను చాలా తక్కువగా వినియోగించి, ఆటం అస్త్రాలను భారీగా ఉపయోగించటం" అని అమెరికన్ సెనేట్‌లో 1949 లోనే జనరల్ గ్రుయెంతర్ (అట్లాంటిక్ సర్వసేనాని) అన్నాడు

1954 డిసెంబరులో ఉత్తర అట్లాంటిక్ కౌన్సిల్‌వారు తాము ఆటం యుద్ధానికి సన్నద్ధులవుతున్నట్టు ప్రకటించారు దీనిమీద వ్యాఖ్యానిస్తూ "మాంచెస్టర్ గార్డియన్" పత్రిక ఇలా అన్నదిః "1948 తరవాత యూరప్‌లో ఆటం అస్త్రాలు లేకుండా యుద్ధం జరిగే అవకాశం పోయింది ఈ నిర్ణయంలో వింత ఏమీలేదు "

అంతకు రెండు నెలలు పూర్వమే జనరల్ మంట్గోమరీ "మా వ్యూహాలన్నిటినీ ఆటం, హైడ్రోజన్ అస్త్రాలపై ఆధారపడి రచిస్తున్నాము 'ఉపయోగించవచ్చు' నన్నది లేదు,విధిగా ఉపయోగించితీరుతాము " అన్నాడు

"యుద్ధం వస్తే హైడ్రోజన్ బాంబులు ఉపయోగించ బడవనుకోవటం మౌఢ్యం," అని బ్రిటిషు ప్రధాని చర్చిల్ 1955 మార్చిలో తెలియజెప్పాడు

వీరంతా బాధ్యతలేనివారుకాదు ఉన్నతాధికారులే, ఉత్తర అట్లాంటిక్ పథకంలో పెద్దలే

ఆటం అస్త్రాలతో యుద్ధమే జరిగితే యూరప్ వినాశనం తప్పదు ఈ నిర్ణయాలు ప్రకటనలద్వారా ప్రజలలో చెలరేగిన ఆందోళనను కొంత ఉపశమింపజేయటానికి అమెరికా వైదేశిక మంత్రి, డల్లెస్ యీ ఆటం అస్త్రాలు ప్రత్యేక లక్ష్యాలమీదనే ప్రయోగించబడతాయని హామీయిచ్చాడు

ఇది అర్థంలేనిమాట హైడ్రోజన్ బాంబు పేలితే 3700 చదరపుమైళ్ళ ప్రాంతం – ఒక చిన్న దేశమంతమేర – నివాసయోగ్యం కాకుండా పోతుంది బ్రిటన్‌వంటి దేశాన్ని నిర్మూలించటానికి 10,15 హైడ్రోజన్ బాంబులు సరిపోతాయని అంచనావేయబడింది!

అది అటుంచి ఉత్తర అట్లాంటిక్ పథకంతాలూకు విమానాశ్రయాలు పశ్చిమ యూరప్ అంతటా పరచుకుని ఉన్నాయి "ప్రత్యేక లక్ష్యాల" మీద ఆటం బాంబులు వేసే విమానాలు ఈ ఆశ్రయాలనుంచే బయలుదేరుతాయి అందుచేత రెండో పక్షంవారు ఈ ఆశ్రయాలమీద ఆటం బాంబులు వేస్తే అందులో విడ్డూరమేమీ ఉండదుః పశ్చిమ యూరప్ ఆటం ఘోరణాగ్నిలో మసికాక తప్పదు

యుద్ధోన్మాదులు అనే ఈ మాటలూ, చేసే ఈ నిర్ణయాలూ అచ్చుగా జనాన్ని అదరగొట్టటానికి మాత్రమే అంటున్నవి కావు ఆటం యుద్ధాలకు కావలసిన ఏర్పాట్లుకూడా ఒక వంక జరిగిపోతూనే ఉన్నాయి

1954 నవంబరు 19 నాటి "న్యూయార్క్ టైమ్స్"లో ప్రకటించిన వివరాల ప్రకారం ఉత్తర అట్లాంటిక్ శిబిరానికి 10 లక్షల టన్నుల టి.ఎన్.టి. మందుగుండు సామానులు పేలుడుశక్తికి సమమైన హైడ్రోజన్ బాంబులూ, 12 మొదలు 14 వెల మూడు మామూలు బాంబులకు తుల్యమైన ఆటంబాంబులూ ఉన్నాయి

ఇవి చాలా కాలంగా యూరప్‌లో అక్కడక్కడా భద్రపరిచి ఉన్నాయి  మధ్యధరా, అట్లాంటిక్ సముద్రాలలో అమెరికన్ విమానవాహక నౌకలలో ప్రత్యేకమైన ఆటం అస్త్రాలూ, వాటిని చేరవేసే విమానాలూ ఉన్నాయి

బ్రిటన్‌లో స్థావరం ఏర్పరచుకుని ఉన్న 49వ అమెరికన్ వాయుదళంలో, కాల్బలాలకు ఆటం అస్త్రాలతో రక్షణ ఇవ్వగల విమానాలున్నాయి

11 అంగుళాల ప్రమాణమూ, 20 మైళ్ళ బారూగల ఆరేసి ఆటంఫిరంగులుగల 5 బెటాలియన్‌లూ, 30 అంగుళాల ప్రమాణమూ, 20 మైళ్ళ బారూగల రాకెట్ బాటరీలు అనేకమూ, శబ్దాన్ని మించే వేగంతో సుమారు నూరుమైళ్ళు పోగల "గైడెడ్" బాంబులూ, 500 మైళ్ళదూరం పైలట్‌కూడా లేకుండా పోగల విమానాలతో కూడిన రెండు విమానదళాలూ ఉన్నాయి

పశ్చిమ యూరప్‌లోని వివిధ ప్రాంతాలలో అమెరికా 30 ఆటంఫిరంగు లుంచింది  మరి 30 ఆటంఫిరంగులు ఒక్క పశ్చిమ జర్మనీలోనే ఉంచబడ్డాయి  ఇంకా 88 అటామిక్ బంకర్ మాగజీన్లుకూడా పశ్చిమ జర్మనీలో ఉంచబడ్డాయి

## శాస్త్రవేత్తల ఖండన

యుద్ధోన్మాదులు చేసే ఈ ప్రయత్నాలను ప్రపంచంలోని ప్రముఖ శాస్త్రవేత్తలందరూ విస్పష్టంగా ఖండించారు

1955 జనవరి 17–19 లలో వియన్నాలో జరిగిన శాంతి మహాసభలో మాట్లాడుతూ, ప్రఖ్యాత ఫ్రెంచి శాస్త్రవేత్త ప్రపంచ శాంతి ఉద్యమనాయకులలో ఒకరు, అయిన ప్రొఫెసర్ జూలియో–క్యూరీ ఈ విధంగా అన్నాడుః

"ఆటం అస్త్రాల ప్రాబల్యంపై తమ వైదేశిక విధానాలను నిర్మించే ప్రభుత్వాలు ప్రజా ప్రతిఘటనకు సిద్ధంగా ఉండాలి  కనుకనే వారు తమ యత్నాలను గోప్యంగా ఉంచ యత్నిస్తున్నారు  ఆటం యుద్ధానికి సన్నద్ధులయేవారిని ప్రతిఘటించ వలసినదిగా ప్రజలకు మనం వెంటనే హెచ్చరిక చేయవలసి ఉంది"

ఆటంశక్తి మనిషికి అందుబాటులోకి రావటానికి సహాయపడిన శాస్త్రవేత్తలలో ఒకరైన ప్రొఫెసర్ అల్బర్ట్ ఐన్‌స్టయిన్ 1950లోనే ఇలా అన్నాడుః

"ఆటంనుంచి విడుదల అయిన శక్తి మన ఆలోచనా విధానాలను తప్ప మిగతా అన్నిటినీ మార్చివేసిందిః అందుచేత మనం ఘోరప్రమాదంవేపు జారిపోతున్నాం  మానవజాతి దక్కాలంటే మన ఆలోచనావిధానం మారాలి "

6–2–55 నాటి "న్యూయార్కుటైమ్స్"పత్రికలో రాస్తూ డాక్టర్ స్జిలార్డ్ అనే అమెరికన్ శాస్త్రవేత్త "మనం వెనక్కు మళ్ళే దారిలేని చోటికి చాలా దగ్గిరిగా వచ్చాం  శాంతి మార్గం కానలేక, మనం తడువుకుంటూ మరొక అడుగువేస్తే చాలు అగాధంలో పడిపోగలం"అన్నాడు

ప్రసిద్ధ బ్రిటిష్‌శాస్త్రవేత్త, ప్రొఫెసర్ జె డి బర్నాల్, "సంస్కృతీ, జీవితమూ పరిరక్షణీయమైనవని భావించే బుద్ధిమంతులందరూ ఏకమై, సంస్కృతిని శాంతిమార్గానికి తిప్పవలసిన సమయం ఆసన్నమయింది" అన్నాడు

నోబెల్ బహూకృతి పొందిన బ్రిటిష్ శాస్త్రజ్ఞుడు ప్రొఫెసర్ సి ఎఫ్ పనెల్ యిలా అన్నాడు

"హైడ్రోజన్ బాంబుతో ఒకశకం ముగియటానికి మారుగా, ఒకశకం ఆరంభమయేలాగు మనం చూడవలసివుంది విజ్ఞానం అతిత్వరగా వ్యాపిస్తోంది 1939లో ఆటం విచ్ఛేదమూ, 1945లో ఆటం బాంబూ, మళ్ళీ దశాబ్దం పూర్తి కాకుండానే హైడ్రోజన్ బాంబూ కనిపెట్టబడ్డాయి "

డాక్టర్ అలెగ్జాండర్ హాడ్ అనే బ్రిటిష్ శాస్త్రవేత్త యిలా అన్నాడు:

"సర్వనాశనం నివారించాలంటే ఆటం పేలుడులను అంతర్జాతీయంగా నిషేధించవలసిన అవసరం ప్రపంచానికి నేడు కాకపోతే రేపైనా కలిగితీరుతుంది "

ప్రొఫెసర్ రాట్‌బ్లాట్ అనే శాస్త్రవేత్త ఇలా చెప్పాడు:

"ఒకదేశం యింకో దేశాన్నీ, ఒక కూటమి యింకో కూటమినీ నాశనం చేసుకొనటమనే ప్రసక్తి యిక లేనేలేదు: మన మూర్ఖతవల్ల అన్ని దేశాల భవిష్యత్తూ నాశనమవుతుంది ప్రపంచ ప్రజలు వ్యాధులతో, అంగవైకల్యంతో, మానసిక దౌర్బల్యంతో శాశ్వతంగా బాధపడటం జరుగుతుంది "

ప్రొఫెసర్ లియొపోల్డ్ ఇన్ఫెల్డ్ అనే పోలిష్ శాస్త్రవేత్త, "ఆటం శక్తిని శాంతియుతంగా వాడుకునేటందుకు పోరాడటం మనవిధి స్వర్ణయుగం నిర్మించటానికి అవసరమయే సాధన సంపత్తి యావత్తూ మనకున్నది" అన్నాడు

నోబెల్ బహుమతి పొందిన జర్మన్ శాస్త్రవేత్త, ప్రొఫెసర్ ఓటో హాన్ ఈవిధంగా చెప్పాడు:

"హైడ్రోజన్ బాంబులతో నాగరికత నిర్మూలం కావటమనేది యెంతమాత్రం జరగనివ్వరాదు ఆటం బాంబులూ, హైడ్రోజన్ బాంబులూ తయారుచేసేశక్తిగాని, ఇచ్ఛగాని చాలా దేశాలకు లేదు అయితే ఆటం శక్తిని శాంతియుతంగా ఉపయోగపరచుకునేశక్తీ, ఆశా అందరికీ ఉన్నాయి ప్రపంచాన్ని నాశనం చేయగల అస్త్రాలలోని ప్రమాదాన్నీ, తమ బాధ్యతనూ గుర్తించగల శాస్త్రవేత్తలందరూ సమష్టిగా విజ్ఞాపనచేసినట్టయితే, ఉభయపక్షాలగల రాజకీయనాయకులూ సంప్రతింపులకు దిగే అవకాశమున్నది "

(ఇటువంటి సంప్రతింపులు గతజూలైలో మొదటిసారిగా జినీవాలో రష్యా, అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్‌ల అగ్రనాయకుల మధ్య జరిగాయి)

"రచయితలూ, ప్రొఫెసర్లూ, ప్రత్యేకించి శాస్త్రవేత్తలూ, తాము అమానుషమైన అస్త్రాల ప్రయోగాన్ని గర్హిస్తున్నామనీ, వాటి పూర్తి నిషేధంకోసం డిమాండ్ చేస్తున్నామనీ ప్రజలకు తెలియజేయటం వారి విధ్యుక్తధర్మం" అన్నాడు మెక్సికన్ శాస్త్రవేత్త, ప్రొఫెసర్ అంద్రాదే

ఇంకా లార్డ్‌రసెల్, ప్రొఫెసర్ బ్లాకెట్, అనేకమంది బ్రిటిష్, జపానీ, యూరోపియన్ శాస్త్రవేత్తలూ ఇదే ధోరణిలో ఆటం అస్త్రాలను ఖండించారు బ్రెజిల్‌శాస్త్రజ్ఞుడు మరియోషెర్న్‌బెర్గ్ ఈ క్రింది అమూల్యమైన సలహా ఇచ్చాడు

"మౌనం వహించని పక్షంలో ప్రజలు ఆటం యుద్ధాలను నిషేధించగలరు ఆటం అస్త్రాలను ఉపయోగించరాదనీ, అసలు వాటిని తయారుచేయనేరాదనీ, ప్రజలు ఎలుగెత్తి చాటినట్టయితే, ఏ ప్రభుత్వం కూడా వాటిని ఉపయోగించేఉద్దేశం ఉన్నట్టు ప్రకటించ సాహసించజాలదు!"

## శాంతి ఉద్యమం

ప్రజలు మౌనంగా లేరు శాంతి ఉద్యమం ప్రపంచ వ్యాప్తంగా సాగుతున్నది

1949 ఏప్రిల్ 20-25 లలో ప్రాగ్‌లోనూ, ప్యారిస్‌లోనూ ఒకేసారి శాంతిమహాసభలు జరిగాయి మొట్టమొదటి శాంతి మహాసభలో 72 దేశాలనుండి 2,200మంది ప్రతినిధులు పాల్గొన్నారు

రెండవ ప్రపంచ శాంతి మహాసభ 1950 నవంబరు 16-22లలో వార్సాలో జరిగింది ఇందులోనే ఆటం ఆయుధాల నిషేధం గురించి తీర్మానం జరిగింది ప్రపంచ శాంతి సమితి సభ్యుల సంఖ్య 221 నుంచి 417 కు పెంచబడింది ఇందులో అనేక దేశాలకు చెందిన ప్రసిద్ధవ్యక్తులూ, కళాకారులూ, శాస్త్రవేత్తలూ, రచయితలూ ఉన్నారు మదామ్ సన్యట్ సెన్ (చైనా), ఇకుయుమ (జపాన్) కాంగ్రెసునాయకుడు డాక్టర్ కిచ్లూ (ఇండియా), డి యన్ ప్రిట్ (బ్రిటన్), ప్రొఫెసర్ జూలియో-క్యూరీ (ఫ్రాన్స్) మేజర్ జనరల్ సోఖే (ఇండియా) మొదలైనవారున్నారుః విశ్వసాహిత్యకారులు లూయీ ఆరగాన్, పాబ్లోనెరుడా, నాజిమ్‌హిక్మత్, ముల్క్‌రాజ్ ఆనంద్ మొదలైనవారున్నారుః ప్రసిద్ధగాయకుడు పాల్ రాబ్సన్, ప్రసిద్ధ చిత్రకారుడు పికాసో మొదలైనవారున్నారు

ప్రపంచ శాంతి సమితి కార్యాలయస్థానం వియన్నా దీని కార్యవర్గంలో 48 మంది సభ్యులు పారిస్, రోమ్, స్టాక్‌హోమ్, లండన్, ప్రాగ్, వార్సా, జినివా, బెర్లిన్, హెల్సింకీ, బుడాపెస్ట్ మొదలైన నగరాలలో సమితి ఆధ్వర్యాన రకరకాల సమావేశాలు జరిగాయి గత జూన్ 22-29లలో హెల్సింకీలో జరిగిన ఇటీవలి సమావేశంలో 68 దేశాలనుంచి వచ్చిన 1841 మంది ప్రతినిధులు పాల్గొన్నారు

**శాంతి సమితి యొక్క ఆశయాలు ః**

1 విభిన్న సాంఘిక వ్యవస్థలుగల దేశాలు శాంతియుత సహజీవనం సాగించటం

2 దేశాలమధ్య ఉండే విభేదాలు సంప్రతింపుల ద్వారా అందరికీ అనుకూలమైన మార్గాలలో పరిష్కారం కావటం

3 ఏదేశానికి సంబంధించిన ఆంతరంగిక వ్యవహారాలను ఆ దేశప్రజలే సరిచూసుకోవటం

71 దేశాలలో శాంతి ఉద్యమం నడచి, ప్రపంచ శాంతి సమితి కృషికి దోహదం జరుగుతున్నది

1950 మార్చిలో ఆటం ఆయుధాల నిషేధానికి శాంతి సమితి స్టాక్ హోమ్‌నుండి చేసిన విజ్ఞాపనపై 50 కోట్లమంది ప్రపంచ ప్రజలు తమ సంతకాలను చేర్చారు

అమెరికా, రష్యా బ్రిటన్, ఫ్రాన్స్, చైనారిపబ్లిక్ అగ్రపంచకం సమావేశమై శాంతి నిర్ణయం చేసుకోవాలని 1951 ఫిబ్రవరిలో బెర్లిన్‌నుండి శాంతిసమితి చేసిన విజ్ఞాపనపై 60 కోట్లమంది సంతకాలు చేశారు

1952 డిసెంబరు 12-19లలో వియన్నాలో జరిగిన ప్రపంచ శాంతి కాముకుల సహాసభకు 85 దేశాలనుండి ప్రతి నిధులు వచ్చారు

అయిదు అగ్రరాజ్యాలు సమావేశమై ఒక ఒప్పందం చేసుకోవాలని ఈ సభలో తీర్మానం జరిగింది కొరియాలో యుద్ధవిరమణ జరగాలని కోరబడింది కొరియాలో క్రిమిబాంబుల ప్రయోగం జరిగినట్టు కొరియా వెళ్లివచ్చిన శాస్త్రజ్ఞుల బృందం ఈ మహాసభలోనే రుజువు చేశారు

ప్రపంచ ప్రజానీకం యొక్క ఐక్యవాంఛగా నడిచే ఈ శాంతి ఉద్యమం ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ అనేక ఘనవిజయాలు సాదించింది అనేక దేశాలలోని ప్రసిద్ధశాస్త్రవేత్తలు, కళాకారులు, రాజకీయవేత్తలు, మేధావులు, కార్మిక, సాంస్కృతిక సంఘాలు ఈ ఉద్యమంద్వారా ఏకంకావటం జరిగింది కొరియాలో, చైనాలో, ఇండో–చైనాలో ఆటం అస్త్రాలు ప్రయోగిస్తామని ఆలోచనచేసిన యుద్ధోన్మాదులు తమ ఆలోచనను ఆచరణలో పెట్టలేకపోయారు ప్రపంచశాంతి సమితి ఆశించినట్టుగానే కొరియా లోనూ, ఇండోచైనాలోనూ యుద్ధవిరమణ జరిగింది శాంతి సమితి ప్రధానాశయాలలో ఒకటైన సంప్రతింపులు ఈ యుద్ధవిరమణలను సాధించగలిగాయి ఈ సంప్రతింపులను శాంతిసమితి పూర్తిగా బలపరిచింది

ఐక్యరాజ్యసమితిలో అధికారరీత్యా ఆయుధవిసర్జన గురించీ, ఆటంశక్తి కంట్రోలుగురించీ జరిగిన కృషి ఈనాటి వరకూ ఫలించలేదు కాని శాంతి ఉద్యమం ద్వారా ప్రపంచ ప్రజలలో కలిగిన చైతన్యం ఫలితంగా అగ్రచతుష్టయ సమావేశం జరిగింది యుగోస్లావియాకు రష్యానాయకుల ప్రయాణమూ, రష్యాలో నెహ్రూచేసిన పర్యటనా ప్రపంచ శాంతి స్థాపనకు అనుకూలంగా ఉన్నాయి

సుస్థిర ప్రపంచశాంతికి ప్రతికూలంగా ఉన్న సమస్యలు ఇంకా చాలా ఉన్నాయి చైనాకు ఐ రా స లో ప్రాతినిధ్యం లేకపోవటమూ, కొరియా, ఇండోచైనా, జర్మనీదేశాలు విభజించి ఉండటమూ, తాయివాన్ భవిష్యత్తు నిర్ణయం కాకపోవటమూ, మలయా, ఆఫ్రికాలలో సామ్రాజ్యవాదం సాయుధ పోరాటం సాగిస్తూండటమూ మొదలైనవి అంతర్జాతీయ ఉద్రిక్తతను హెచ్చించేవి ఆయుధవిసర్జన జరగవలసి ఉంది సాయుధ బలాలు తగ్గవలసిఉంది యూరప్‌దేశాలమధ్య విస్తృతరక్షణ ఒప్పందం జరగవలసిఉంది ఇవన్నీ సంప్రతింపుల ద్వారా జరుగుతాయి చైనా–అమెరికాలు సంప్రతింపులు జరపటానికి ఇంత కాలానికి మార్గం ఏర్పడింది ఇతర సమస్యలు కూడా శాంతియుత పరిష్కారం పొందగలవు ప్రపంచ ప్రజల శాంతి వాంఛ అంతర్జాతీయ రాజకీయ వ్యవహారాలలో ముందుముందు మరింతగా ప్రతిబింబించగలదు

అమెరికా ఆధ్వర్యాన జరిగే యుద్ధ యత్నాలు ఇప్పటికే ఆయాదేశాల ప్రజలకు విషఫలితాలనిచ్చాయి అమెరికాలోనే నిరుద్యోగ సమస్య తీవ్రతరమవుతున్నది బ్రిటన్ ఈ యేడు తీవ్రమైన ఆర్థికదుస్థితి నెదుర్కొంటున్నది మారణాస్త్రాల నిర్మాణానికిగాను కోటానుకోట్లు దుర్వ్యయం అవుతున్నది కాని ఈ మారణాస్త్రాలు సాధించలేని సమస్యలు శాంతియుత సంప్రతింపుల వల్ల సుఖంగా పరిష్కారం కాగలవు

అంతర్జాతీయ సమస్యలను శాంతియుతంగా పరిష్కరించటంవల్ల ఆటం అస్త్రాల నిషేధం జరిగి ప్రపంచానికి ఘోరవిపత్తు తప్పిపోవటమేగాక, ఆటంశక్తి శాంతి నిర్మాణాలకు ఉపకరించి, శాస్త్రవేత్తలు సూచించినట్టు స్వర్ణయుగానికి సహాయపడగలదు

## ఆటంశక్తి ఉపయోగాలు

సూర్యుడినుంచి మనకు లభించే శక్తి ఆటంశక్తి  ఇది మనకు అనేకవిధాల ప్రాణాధారంగా ఉన్నది  సూర్యరశ్మి సహాయంతో చెట్లు, అనేకరకాల రసాయనిక మార్పులు సాధించి, అనేకరకాల పదార్థాలను ఉత్పత్తిచేసుకోగలుగుతున్నాయి  వీటిని మనం ఉపయోగించుకుంటున్నాము

శిలలలో చేరియున్న రేడియోపదార్థాలను ఆయా శిలల వయసు నిర్ణయించటానికి శాస్త్రవేత్తలు ఉపయోగించుకోగలుగుతున్నారు

ఆటంశక్తిని కృత్రిమంగా సృష్టి చేయటం ఆరంభం కాకపూర్వమే, తీవ్రమైన వ్రణాలకు చికిత్సచేయటానికి రేడియం ఉపయోగపడుతూ వచ్చింది

ఆటంశక్తి యొక్క ఉత్పత్తి కనిపెట్టిన కొద్ది సంవత్సరాల లోనే దానిని శాంతియుత ప్రయోజనాలకు వినియోగించే మార్గాలు అనేకం కనిపెట్టబడ్డాయి

1954లో మొట్టమొదటిగా ఆటంశక్తి ద్వారా నడిచే పారిశ్రామిక విద్యుత్కేంద్రం ఒకటి రష్యాలో స్థాపించబడి పని ప్రారంభించింది  ఇది 5,000 కిలోవాట్ల శక్తి సరఫరా చేస్తుంది  దీనికిగాను ఎటామిక్‌పైల్ ఒకటి  ఉపయోగించబడుతుంది  ఈ పైల్ నుంచి వెలువడే అపారమైన వేడి, నీరును బాయిలర్లలో ఆవిరిచేయటానికి ఉపయోగిస్తారు  ఆ ఆవిరి ద్వారా జెనరేటర్లు తిప్పి విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేస్తారు

లక్షకిలోవాట్ల శక్తిగల మరొక విద్యుత్కేంద్రం రష్యాలో నిర్మాణమవుతున్నది

ఫ్రాన్స్‌దేశంలో ఇప్పటికి రెండు ఎటామిక్ పైల్‌లున్నాయి  మూడవది నిర్మాణంలో ఉంది  1957లో ఫ్రాన్స్‌లో 20 వేల కిలోవాట్లశక్తిగల  అటామిక్ పారిశ్రామిక విద్యుత్కేంద్రం పనిప్రారంభిస్తుంది

బ్రిటన్‌లో కూడా ఇలాటి విద్యుత్కేంద్రం నిర్మాణమవుతున్నది  ఇది 1956 లోనే పని ప్రారంభిస్తుంది  దీని శక్తి 40 వేల కిలోవాట్లు

సరిఅయిన ఇంజనీరింగ్ పరిశోధనలు జరిగినట్టయితే, జనరేటర్లు తిప్పకుండానే, ఆటం శక్తిని నేరుగా విద్యుచ్ఛక్తిగా మార్చే అవకాశాలున్నాయి

ఆటంశక్తిని నేరుగా వెలుగుకింద మార్చటానికికూడా మార్గాలున్నాయి  దీనికి అతి సులువైన పద్ధతి ఏమంటే ఎలక్ట్రాన్ల తాకిడికి వెలుగునిచ్చే పదార్థాలతో రేడియోపదార్థాలను కలపడం

రష్యాలో కృత్రిమ రేడియో పదార్థాలు–రేడియోకొబాల్ట్, రేడియో అయొడిన్, రేడియో ఫాస్పరస్, రేడియో సోడియం మొదలైనవి–పరిశ్రమలకూ, పరిశోధనలకూ, వ్యాధి చికిత్సలకూ ఉపయోగించబడుతున్నాయి

రేడియో ఫాస్ఫరస్‌ను కొన్ని చర్మవ్యాధుల నివారణకు ఉపయోగిస్తున్నారు  రేడియో అయొడిన్‌ను థైరాయిడ్ వ్యాధులను చికిత్సచేయటానికీ, కనిపెట్టటానికీ కూడా ఉపయోగిస్తున్నారు  రేడియో కొబాల్ట్‌ను అనేక వందల ఆస్పత్రులలో పుట్టవ్రణంలాంటి తీవ్రమైన వ్రణాలు చికిత్సచేయటానికి ఉపయోగిస్తున్నారు

యంత్రనిర్మాణం, నౌకానిర్మాణం, లోహపు కార్ఖానాలు మొదలైన పరిశ్రమలలో, యంత్రభాగాలలోని అదృశ్యలోపాలను పసికట్టడానికి రేడియోకొబాల్ట్ ఉపయోగపడుతున్నది

ఇంతకుపూర్వం ఈ లోపాలను పసికట్టడానికి రేడియంగాని, ఎక్స్‌రేలుగాని ఉపయోగించేవారు రేడియోకొబాల్ట్ రేడియం కన్న చాల చౌక, ఎక్స్‌రేలకన్న చాలా సుకరం

జీవశాస్త్రం, రసాయనశాస్త్రం, వ్యవసాయశాస్త్రం మొదలైన శాస్త్రాలలో అపరిష్కృతంగా అనేక సమస్యలు పరిష్కరించటానికి రేడియోపదార్థాలు ఉపయోగపడుతున్నాయి అనేక ప్రకృతిరహస్యాలను ఇవి బయట పెడుతున్నాయి

మొక్కలకు ఎరువుచేసే సరియైన తరుణాలు తెలుసుకునేటందుకుగాను రష్యాలో 30 చిల్లర పరిశోధనా కేంద్రాలలో రేడియోసూపర్ ఉపయోగించారు మొక్కలు పెరిగేటప్పుడు కొన్నిదశలలో, దానికి వేళ్ళ ద్వారా కాకుండా, ఇతర భాగాల ద్వారా సూపర్ ఫాస్ఫేట్ అందించి ఫలసాయంపెంచటానికి కూడా మార్గాలు కనిపెట్టారు

ఆహార పదార్థలు పురుగుపట్టీ, క్రిములుపట్టీ ధ్వంసం కాకుండా "ప్రసారం" ఉపయోగపడుతున్నది గోదాములో ఉంచే ధాన్యాన్నీ, పిండినీ "గామా"కిరణాల ప్రసారానికి గురిచేసినట్టయితే అవి చాలాకాలం చెడకుండా ఉంటాయి ఎండుపళ్ళూ, సుగంధ ద్రవ్యాలూ, మాంసమూ ఇదేవిధంగా చెడకుండా నిలవ ఉంచవచ్చు కొద్దిపాటి ప్రసారంతో ఇవి నిలవ ఉంటాయి ఇందుకయ్యే ఖర్చుకూడా అతిస్వల్పం

టిన్నులలో ఉంచే అహారపదార్థాలనూ, ఉర్లగడ్డలు మొదలైనవాటినీ భద్రపరచటానికి రష్యాలో చేసిన ప్రయోగాలు విజయవంతమయాయి

ఆటంశక్తి విస్తృతమైన ప్రయోజనాలకుకూడా ఉపయోగపడుతుంది ఆటంబాంబులలోని పేలుడుశక్తి జనక్షయానికి మాత్రమే ఉపయోగించబడింది ఈ పేలుడుశక్తిని శాంతియుతంగా కూడా ఉపయోగించవచ్చు బ్రహ్మాండమైన నిర్మాణాలు కొనసాగించేటప్పుడు క్వారీలలో అంతులేని పేలుడు మందు ఉపయోగిస్తారు సోవియట్ ఇంజనీర్లు 1600 టన్నుల పేలుడు మందు ఉపయోగించిన సమయాలున్నాయి 50 వేల,70వేలటన్నుల పేలుడు మందు ఉపయోగించ వలసి రావడం కూడా దురూహ్యంకాదు కాని, ఇంతమొత్తాలలో పేలుడు మందు పేర్చాలంటే ఒక పెద్దమేడ ప్రమాణంలో గుంట తవ్వాలి ఆటం పేలుళ్ళకు మామూలు గుంట చాలును దాని పేలుడు ఇన్ని వేల టన్నుల పేలుడుమందుకూ సమంగా వుంటుంది అయితే, రేడియేషన్ ప్రమాదం ఉంది కాని, పరిశోధనలద్వారా ఈ ప్రమాదాన్ని అరికట్టవచ్చునని సోవియట్ శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు

ఎడారులు నిరుపయోగమైనవి వాటిని సస్యక్షేత్రాలుగా చెయ్యాలంటే ప్రధానంగా కావలసింది నీరు అంతులేని నీటిని ఎంతో లోతునుంచిగాని, దూరంనుంచిగాని చేరవేస్తే తప్ప ఎడారి ఫలించదు ఇందుకు ఆటంశక్తిని మించినది లేదు ఈ శక్తి మనిషికి అందుబాటులోకి వచ్చాక ఎడారులను సస్యవంతంగా చేసేటందుకు మార్గం ఏర్పడింది

మన దేశానికి ఆటంశక్తివల్ల చాలా లాభాలున్నాయి విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి నదీజలాలూ, ఆవిరి యంత్రాలూ మాత్రమే ఇప్పుడు ఉపయోగంలో ఉన్నాయి నదీజలాలకు దూరంగా ఉండే ప్రాంతాలలో ఆవిరి యంత్రాలు ఉపయోగించాలి కాని వీటికికూడా రాతిబొగ్గు అవసరం ఎటామిక్ పైల్‌ను ఎక్కడబడితే అక్కడ ఏర్పాటుచేసుకోవచ్చు మన దేశంలోని రాజస్తాన్ ఎడారిని సస్యశ్యామలం చేసుకోవాలంటే ఆటంశక్తి చాలా ఉపయోగపడుతుంది

ఆటంశక్తిపై ఆధారపడి ఒకవంక యుద్ధోన్మాదులు ప్రపంచ వినాశనం గురించి పీడకలలు కకంటూంటే, మరొకవంక శాస్త్రవేత్తలు మానవాభ్యుదయంతో కూడిన స్వర్ణయుగం గురించి కలలు కంటున్నారు ఇవి గొంతెమ్మకోరికలు కావు ఇప్పటిలాగే పరిశోధనలుసాగితే, యుద్ధోన్మాదులను అరికడితే, ఈ కలలు మరొక పాతిక ఏళ్ళలో నిజమవుతాయి

ఎటామిక్ రాకెట్ విమానాలు గంటకు 12,500 మైళ్ళవేగంతో ప్రయాణీకులతో సహా ఒక దేశం నుంచి మరొక దేశానికి ప్రయాణం చేస్తాయి ఇలాటి విమానాలే చంద్రమండలానికి కూడా వెళ్ళి వస్తూంటాయి

పొగా, చప్పుడులేని మోటారుకార్లు వీధులలో పరిగెత్తుతాయి నగరాలలోని గాలి ఇప్పటికన్న చాలా నిర్మలంగా ఉంటుంది

రేడియోపదార్థాలు ఇళ్ళను శుభ్రంగా ఉంచటానికీ, వేడిలేని చల్లనికాంతిని ఇళ్ళలో ప్రసరించటానికీ, బుల్లిరేడియో, టెలివిజన్ సెట్లు పనిచెయ్యటానికీ ఉపయోగపడతాయి

అనేకరకాల కొత్త పదార్థాలు గృహోపకరణాలు తయారు చేయుటానికి ఉపయోగించబడతాయి రేడియో పదార్థాలు చేర్చిన మందులు దుకాణాలలో అమ్ముతారు

శాస్త్రజ్ఞులు ఆటంశక్తితో జడపదార్థంనుంచి ప్రాణిపదార్థాన్ని ఉత్పత్తి చేయటానికి పరిశోధనలు సాగిస్తారు

ఆటంశక్తి యొక్క భవిష్యత్తు అపారమైనది

ఆంధ్రరాష్ట్ర శాంతిసంఘ ప్రచురణ (పుస్తకరూపం), 1957

# 1. బ్రిటిష్ వారి బాకీ

ఈనాడు బ్రిటను భారతదేశానికి సుమారు రూ 1400 కోట్లు బాకీపడి ఉంది మనదేశపు సాలుసరి ఆదాయంలో ఇది ఇంచుమించు సహం రైళ్ళూ, ఇతర ట్రాన్స్‌పోర్టులూ మినహాయిస్తే మనదేశపు పారిశ్రామిక పెట్టుబడి ఈ బాకీలో సహంకంటె ఉండదు ఇది మనం సమృద్ధి కొద్దీ ఇచ్చిన అప్పు కాదు, మన బానిసత్వాన్ని ఆసరా చేసుకొని ఆర్థిక-రాజకీయ ఒత్తిడిచేత మనవద్ద బలాత్కారంగా పుచ్చుకున్న అప్పు

నవంబరు 1939లో, యుద్ధంసాగిన రెండునెల్లకి మనదేశానికీ బ్రిటనుకూ మధ్య ఒక ఆర్థిక ఏర్పాటు జరిగింది దాన్ని అనుసరించి భారతదేశం ఇక్కడ చేర్చుకోబడిన సైనికులందరి ఖర్చులూ, వారు దేశంలో రక్షణసైన్యం కింద ఉన్నంతకాలమూ భరించి, వారిని దేశాంతరాలకు పంపగానే వారికింద- జీతాలూ, భత్యాలూ, తిళ్ళూ, దుస్తులూ, పరికరాలూ వగైరాలకు చేసిన ఖర్చు బ్రిటిషు ప్రభుత్వం నుంచి రాబట్టుకొంటుంది ఈ విధంగా మనం పంపిన సైనికులఖర్చులు తామే భరించటానికి ఒప్పుకుని, బ్రిటిషు ప్రభుత్వంవారు మన రాజకీయ పార్టీలతో (కాంగ్రెసుతో) ఎటువంటి పరిష్కారమూ లేకుండా పని జరుపుకున్నారు ఈవిధంగా సామ్రాజ్యం కోసం పోరాడగలగటమే గాక భారతదేశాన్ని కోల్పోనవసరం లేకుండా చేసుకున్నారు అధికారం వదిలిపెట్టకపోయినా భారతదేశం మీద భారంలేకుండా చేసిన కీర్తి బ్రిటిషు వారు దక్కించుకున్నట్టు ప్రపంచానికి కనపడ్డది కొంత నరబలి భారతదేశం నించి పుచ్చుకుని యూరపులోనూ, మధ్య దూరప్రాచ్యాలలోనూ నిలబెట్టేస్తే పని గడిచిపోయేటట్టు కనిపించింది బ్రిటిషువారికి

కాని యుద్ధం విస్తరించి ప్రపంచం అంతటా అంటుకుని సామ్రాజ్యవాదుల ఆలోచనలు తారుమారు చేసింది మొదట్లో అంచనా వేసుకున్న మనుషులూ, డబ్బూ, పరికరాలూ, ధూపానికి రాలేదు సామ్రాజ్యాన్ని బానిసత్వంలో ఉంచే ఉద్యమం చాలా భారీ అయి ఊరుకుంది

జపానుతో యుద్ధం సాగించటానికి భారతదేశం ప్రధానక్షేత్రంగా పరిణమించింది భారత సరిహద్దులు కాయటానికి అంతులేని బ్రిటిషు, అమెరికను సైన్యాలను పంపవలిసొచ్చింది స్టెర్లింగు బాలెన్సులు(బ్రిటిషువారి ఋణం) పాపం పెరిగినట్టు పెరగసాగింది సైనికుల కోసం అంతులేని తిండి, గుడ్డ, శిబిరాలు, రైళ్ళు (ఇప్పటికి ఇవే10,000 అయినాయి) ఆయుధాలు, డేరాగుడ్డ, దోమతెరలు, ఇనుము, ఉక్కు, కొయ్య, సిమెంటు, ఇటుకలు-ఒకటేమిటి, సమస్తమూ భారతదేశం సప్లయ్ చెయ్యసాగింది అంతులేని కూలీలని ఈ పనిమీద నియోగించారు ఈ ఖర్చంతా ఒడంబడిక ప్రకారం బ్రిటనుది ఈ బాకీ 1945-46కు దాదాపు 1800కోట్లు రూపాయిలవుతుంది!

సామ్రాజ్యవాదం బ్రిటను నెత్తినకట్టిన ఈ బ్రహ్మాండమైన ఖర్చు ముందు భరించినది మనదేశం మనచేతినుంచి అయిన ఈ ఖర్చు మనకు తిరిగి రాకపోగా బ్రిటిషు సైన్యాన్ని కూడా మనం భరించిన వాళ్ళమయినాం

మన ఖర్చులు భారతదేశం నెత్తిన వెయ్యటం బ్రిటనుకు కొత్తకాదు బ్రిటను తన వ్యాప్తికోసం చేసిన యుద్ధాల ఖర్చు(సిపాయి కలహం అణచటానికయిన ఖర్చుతో సహా) మనమీద పడుతూ

వస్తున్నది కాని ఈ పనే ఈసారి చాలా దొంగెత్తుగా జరిగింది ఈ దొంగతనానికి రిజర్వుబ్యాంకు చాలా ఉపయోగపడింది బ్రిటిషు ప్రభుత్వానికి అయే ఖర్చుకుగాను భారతీయ ప్రభుత్వం డబ్బు పుట్టించటానికి అంగీకరించింది అంటే, బ్రిటను తాను ఇండియానుండి స్వీకరించే వస్తువులకయే ఖర్చు స్టెర్లింగు లెక్కన ఇంగ్లండులో ఇండియా ప్రభుత్వం పేర జమకట్టితే, ఆ జమ ఆధారం మీద ఇండియా ప్రభుత్వం ఆ మొత్తానికి సరిపడా రూపాయినోట్లు అచ్చుగుద్ది ఆ డబ్బుతో బ్రిటను తరఫున వస్తువులు కొంటుంది అయితే ఈ ఏర్పాటువల్ల కలిగిన నష్టం ఏమిటంటే ఇంగ్లండులో ఉన్న ఈ డబ్బు ఇండియాకు ప్రస్తుతం అక్కరకురాదు ఆ డబ్బులో ఇండియా తనకు కావలసిన యంత్రసామాగ్రి వగైరా బ్రిటను నుంచి కూడా కొనలేదు అదేమంటే నౌకల సదుపాయంలేదు ఉన్న జాగా బ్రిటను తాలూకు యుద్ధవ్యాపారానికి అత్యవసరం

మనని ఇంతటితో పోనివ్వక 45 కోట్ల రూపాయల విలువగల మన డాలరు(అమెరికా) రిజర్వులు కూడా సామ్రాజ్యవాదులు అవుపోసన పట్టారు ఆ డబ్బుకు సరిపడా యంత్రసామాగ్రి మనం అమెరికానుంచి తెప్పించుకోవటానికి అనుమతించలేదు మనకు దక్కిందల్లా మన ప్రభుత్వమే జారీచేసిన కాగితాల కట్టలు

ఈ దోపిడీ ఫలితంగా అన్ని వస్తువులకీ ధరలు హెచ్చిపోయినై ఆగస్టు 1939 లగాయితు నేటివరకూ 900 కోట్ల రూపాయల నోట్లు కొత్తగా అమలులోకి వచ్చినాయి యుద్ధానికి పూర్వం ఇందులో ఆరోవంతు నోట్లుమటుకే చలామణిలో ఉండేవి ఈ కాగితం డబ్బు జపానుయుద్ధంతో మరీపెరిగివచ్చింది ఈ పెరుగుదల 1940–41లో నెలకు రెండున్నర కోట్లు ఉన్నదల్లా, 41–42కు 5 కోట్లకు హెచ్చి, 42–45 మధ్య నెలకి 20కోట్ల పెరుగుదల అయింది

ఈ కాగితం డబ్బు విలువగల వస్తువులు ఎగుమతి అయిపోగా, వస్తువుల మూల్యం కింద కూలిచేసి రైళ్ళూ, ఫాక్టరీలూ వగైరా నడిపిన వారికిచ్చిన ఈ దగాడబ్బుకు ప్రత్యామ్నాయంగా అవతల వస్తుసముదాయం లేదు బ్రిటను వస్తువులు పంపదు ఇక్కడ తయారయినవి కాస్తా బ్రిటను కింద ఖర్చయిపోయినాయి దీనికి ఫలితంగా డబ్బు విలువ క్షీణించి, వస్తువుల ధరలు పెరగసాగినాయి బతుకుతెరువు దుర్భరంగా ప్రియమైంది

1942లో రూపాయివిలువ 12 అణాలుంది 1944 మే నెలకు 7 అణాలకు దిగింది! ఆ లెక్కనే ప్రజల జీవితావసరాలు ప్రియమైనాయి ఈ రీతిగా శ్రామికుల సంపాదనలను క్షీణింపజేసి బ్రిటను తన యుద్ధఖర్చు గడుపుకున్నది దీనికి నేరుగా గురిఅయినవారు పారిశ్రామిక పనివాళ్ళూ, గుమాస్తాలూ, చిన్న తరగతి వ్యవసాయదార్లూ, వ్యవసాయకూలీలూ, ఉపాధ్యాయులూ, శిల్పులూనూ బ్రిటనుచేసిన 1400కోట్ల ఖర్చునూ వీరిజీతాల తరుగుదల నుంచి రాబట్టుకోబడింది తెలియకుండా వీరంతా చందాలు వేసుకున్నారన్నమాట చందా ఏ మాత్రమూ ఇచ్చుకోలేని తరగతివాళ్ళ సంపాదనలు సగానికి పైగా దిగిపోయినాయి

దారిద్ర్యమూ, మృత్యువూ విజృంభించిందంటే ఆశ్చర్యమేమిటి? బ్రిటను అప్పు పెరుగుతున్న కొద్దీ ధరలు తగ్గటమనేది అసంభవం గనక వస్తువులు దాచి హెచ్చు ధరల కమ్మటం క్షేమకరమైన వ్యాపారంగా పరిణమించింది పనికిమాలిన కాగితం డబ్బూ, దాపరికమూ, హెచ్చుధరల

వ్యాపారమూ మధ్య నలిగి ఆహారపదార్థాల విలవ హెచ్చిపోయింది బెంగాలులో బియ్యం పదింతల ధరకమ్మింది తిండీ, గుడ్డా, ఇతర అవసరాలూ జనసామాన్యానికి అందకుండా పోయినాయి

తిండిలేక బెంగాలులో 35 లక్షలు మరణించారు మరికొన్ని వేలమంది నిస్సత్తువకు లోనై రోగాల వాతపడి చచ్చారు బెంగాలు, బీహారు, కేరళ రాష్ట్రాలలో మృత్యువు విహరించింది ఈ దౌర్భాగ్యపు పరిస్థితి త్వరలో అంతం కాని పక్షంలో దేశమంతటా కూడా విస్తరిస్తుంది

ఇవీ మనం బ్రిటనులో దాచుకున్న స్టెర్లింగు బాలెన్సులూ! వీటికోసం గాను మనం చేసిన త్యాగం ఇదీ! ఇదంతా మన దాస్యానికి ప్రతిఫలం

బ్రిటను మనకు బాకీ ఉన్న ఈ 1400 కోట్లే కాక మనభారం ఇంకా ఉంది మనం వెనక బ్రిటనుకు బాకీ ఉన్న 300 కోట్లు పోగా ఈ 1400 కోట్లు అంటే మన భారం మొత్తం 1700 కోట్లన్నమాట దయాదాక్షిణ్యాలు లేని బాకీదారులాగా మనదేశంలో వేలకువేలు తిండికి మాడి చస్తున్న ఈ సమయంలో ఈ బ్రిటను మన బాకీ చెల్లవేసుకుంది పైపెచ్చు ఈ అప్పు న్యాయమైనది కూడా కాదు ఇందులో ఎక్కువభాగం బ్రిటను తన వ్యాప్తికొరకు చేసిన యుద్ధాల తాలూకు అప్పు రైళ్ళు వగైరాలకు మన దేశం కింద అయిన ఖర్చుల్లో కూడా దుర్వ్యయం ఎంతో ఉంది దీనికి సాక్ష్యం బ్రిటిషు వారే ఉన్నారు

తమ పాత అప్పు నిలబెట్టి వసూలు చేసుకుని, ఆ పైన ఇన్ని వందలకోట్ల వస్తుసామాగ్రి వొలిచి బ్రిటిషు పెట్టుబడిదార్లు ఈ బాకీ రాసెయ్యాలనీ, అధమం తగ్గించాలనీ అంటున్నారు!

ఈ అప్పు చాలాభాగం ఇండియాను జపానుబారి నుంచి రక్షించటానికి చేయబడిందనీ, ఇందులో కొంత భారతదేశాన్ని పారిశ్రామికంగా పైకి తెప్పించటానికి ఉపయోగించిందనీ ఈ కారణాల చేత ఈ అప్పు పూర్తిగా వసూలుచెయ్యటం కేవలమూ అన్యాయమనీ అంటున్నారు! వస్తువుల ధరలు ఇండియా ఇంగ్లండు దేశాల్లో పోల్చిచూస్తే వాళ్ళ 6 పెన్నీలకి మన రూపాయ సమానమనీ, అయినా మామూలు మారకపురేటు 18 పెన్నీలకు రూపాయగా ఉంటున్నదనీ, అందుచేత ఈ అప్పులో మూడోవంతిచ్చినా న్యాయమేననీ చెబుతున్నారు!

1944 జూన్‌లో 'ఇకనమిస్టు' పత్రిక ఇండియా బ్రిటనుల మధ్య జరిగిన ఆర్థిక ఒడంబడికనే తప్పుపట్టింది ఈ ఒడంబడిక జరిగినప్పటికి భారతదేశం యుద్ధానికి చాలా ఎడంగా ఉందనీ, ఇటలీ జపానులు యుద్ధంలోకి దిగగానే పరిస్థితి మారినప్పుడే ఒడంబడిక సవరణ చేయకపోవటం వల్ల 'విడ్డూరమైన' పరిస్థితులేర్పడ్డవనీ రాసింది ఇంతేకాక ఈ అప్పును తగ్గించని పక్షంలో అసలే ఎగ్గొట్టవలసి వస్తుందని కూడా బెదిరించింది ఈ అప్పు ఇవ్వటంలో భారతీయులెంత త్యాగం చేసి ఉండినప్పటికీ, అప్పు ఇవ్వటమూ త్యాగం చెయ్యటమూ జరిగిపోతూనే ఉంది గనక ఈ బాకీ తిరిగి తీర్చే విషయం చర్చ అనవసరమని కూడా 'ఇకనమిస్టు' పత్రిక సూచించింది!

ఈ తర్కమంతా కుతర్కం 1939లో చేసుకున్న ఒడంబడిక దురుద్దేశంతో చేసుకున్నది, భారతదేశంతో పరిష్కారం జరపకుండా, సామ్రాజ్యానికి భంగం రాకుండా, అంతులేని నరబలి కోసం చేయబడినది అధికారం భారతీయులకు వప్పగించనవసరం లేకుండా ఉండగలందులకు ఈ ఖర్చు బ్రిటను భరించింది ఇందువల్ల భారతదేశానికి మహోపకారం జరిగినట్టు నటించటం

ద్రోహం సామ్రాజ్యవాదుల అంచనాలు తప్పిపోతే ఆ తప్పు మనదా? జపాను యుద్ధంలో దిగగానే యుద్ధం ఖర్చు పెరిగిందంటే పెరగదా? మలయా, సింగపూరు, బర్మా ప్రజలకు స్వాతంత్ర్యం ఇచ్చి, సాయుధులుగా వారు జపానును ప్రతిఘటించినట్టయితే సామ్రాజ్యం విచ్ఛిన్నమవుతుందని అంతులేని సైనికులనూ, సామాగ్రినీ అక్కడికి పంపారు దానికి ఫలితంగా మలయా, సింగపూరు, బర్మాలు జపాను పాలయినాయి అందువల్ల జపానుతో యుద్ధం పదింతల ఖర్చయింది

ఇండియాలో కూడా ఇటువంటి దౌర్భాగ్యపు వైఖరే అవలంబించారు జపాను యుద్ధం ప్రకటించగానే భారతీయులలో యుద్ధచైతన్యం కలిగించి, జాతీయ ప్రభుత్వం ఏర్పరచి, తద్వారా ప్రజల త్యాగయుత సహకారం పొందటానికి బదులు, స్వార్థపరులై కాంగ్రెసువారి చేతిలో రక్షణ, ప్రయత్నం ఉంచటానికి అంగీకరించక, పెద్ద తుఫాను రేపి, క్రిప్సు రాయబారం పడగొట్టి, దేశనాయకుల్ని జైళ్ళలో తొక్కి, దేశానికి వర్ణనాతీతమైన దుర్భరస్థితి తెచ్చిపెట్టారు ఈ ప్రముఖుల ప్రతినిధులే ఈనాడు అప్పు తీర్చటం విషయం పేచీలకి దిగారు ఈ అప్పు అనుకున్న దానికి పదింతలు కావటం కేవలమూ జపాను యుద్ధ ప్రకటన వల్ల కాదు, సామ్రాజ్యంలోని ప్రజలకి స్వాతంత్ర్యం ఇచ్చే వైఖరి లేక దానికోసరమే 1939 ఒడంబడిక జపానుయుద్ధం ప్రకటించిందని ఆ ఒడంబడికను మార్చారా? ఈ పేచీ అప్పు తిరిగి ఇవ్వటం దగ్గిరే

ఇన్ని సంవత్సరాలూ భారతదేశం ఆత్మరక్షణకి సొంతాన ఖర్చుచేస్తూనే ఉందనీ, తమ సామ్రాజ్యతత్వం ధర్మమా అంటూ పారిశ్రామికంగా అధోగతిలో ఉండి కూడా తప్పనిసరి అయి తన రక్షణకు కావలసిన దానికంటే కూడా ఎక్కువే ఖర్చు చేస్తున్నదనీ సామ్రాజ్యవాదులు మరిచిపోతున్నారు ఈ ఖర్చు సాలుకు 400కోట్లు అంటే ప్రతిభారతీయుడూ తలకొక పదిరూపాయలిచ్చుకుంటున్నాడన్నమాట న్యాయంగా ఇది బ్రిటిషిండియాలో వారిమీదే పంచితే 15 రూపాయలకు తక్కువ ఉండదు ఈ దేశంలో మనిషి ఒకటికి సంపాదన సాలుకు 75 రూపాయలు అందులో రూ 15లు ఆత్మరక్షణకి! కరువులూ, కాటకాలూ రాక ఏమవుతుంది? ఇప్పటికే బ్రిటిషువారికి తృప్తిలేదు ఇంకా మనం, ఒక చెంప నడుం విరిగినా, భరించవలసినంత మొయ్యటం లేదుట

ఏ సామ్రాజ్యతత్వం మూలంగా యుద్ధప్రయత్నం సక్రమంగా నడవక, యుద్ధం దబ్బున తెమలకుండా పోయిందో, ఏ వైఖరి భారతదేశాన్ని అధోగతిలో, దారిద్ర్యంలో ఉంచిందో, ఏమైనా అంటే ఆ వైఖరినే అనాలి భారతదేశం మరింత యుద్ధభారం మొయ్యలేకపోతే, దాని తప్పు కాదు

యుద్ధం మూలంగా బ్రిటను సాలుసరి ఆదాయం నూటికి 76 పాళ్ళు పెరిగింది, అమెరికాలో 112 పాళ్ళూ, కెనడాలో 54పాళ్ళూ పెరిగితే, భారతదేశంలో 20 పాళ్ళే పెరిగింది ఈ పెరుగుదల కూడా కొత్త కార్ఖానాల స్థాపనవల్ల కాక ఎక్కువభాగం రాత్రి అంచెల వల్ల పెరిగింది పైపెచ్చు ఈ పెరుగుదల యుద్ధపరికరాల నిర్మాణం ద్వారా సాగింది గాని, ఒక చెంప బొగ్గు మొదలైన వాటి ఉత్పత్తి తగ్గిపోయింది నారలాటి పరిశ్రమలు కొన్ని సొంతం ఆపుదల కూడా అయినాయి ఈ కథ ఇంకా ఉంది యుద్ధానికి నేరుగా అవసరమైన మోటారు, రైలు, విమాన పరిశ్రమలకు అధికారులనుమతి ఇవ్వలేదు ఈ దేశంలో ఈ పరిశ్రమలు సాగితే

నావలకు జాస్తి ఒత్తిడి కూడా ఉండేది కాదు ఈ పరిశ్రమలనే ఆస్ట్రేలియా సాగించగలిగింది ఇండియాలో మటుకు ఆఖరుకు గ్రేడీమిషను వారి సలహా కూడా అమలు జరపబడలేదు ఇదంతా సాగితే దేశం సంపదలు పైకి వచ్చిపోతుందేమోనని అధికార్లు బెంగపడ్డారు అప్పు పెరిగిందంటే ఎవరిది తప్పు?

ఈ అప్పు ఇంత కావటానికి కారణం హెచ్చిపోయిన ధరలనీ, అందుచేత ఈ అప్పు కొంత కొట్టెయ్యాలనీ మరో వాదం ఇంతకంటే నంగనాచితనం ఉండబోదు ఎందుచేతనంటే ఈ ధరల పెరుగుదలకి కారణం కాగితాల రూపాయిలూ, కాగితాల రూపాయిల ద్వారా ధరలు పెరగటానిక్కారణం బ్రిటిషువారు వస్తువులెగుమతి చెయ్యకపోవటం ఈ పద్ధతి అవలంబించి తమ యుద్ధ ఖర్చు భారతీయులచేత చందావేయించారు గాని మరో సదుద్దేశం ఇందులో ఏమీ లేదు ధరలు పెరగటం వల్ల నానా కష్టాలపాలూ అయింది భారతీయులు ఇప్పుడు అప్పు తగ్గించుకోవాలట!

ఇంత తర్కం లేకుండా ఈ అప్పు ఎగ్గొట్టే ఉద్దేశం కూడా సామ్రాజ్యవాదులు పైకి అనేస్తూనే ఉన్నారు ఇది బొత్తిగా అసాధ్యం కూడా కాదు ఎందుచేతనంటే ఈ అప్పు స్టెర్లింగ్ లెక్కలో ఉంది స్టెర్లింగ్ రూపాయమారకంరేటు బ్రిటిషువారి చేతిలో ఉంది గత యుద్ధంలో భారతదేశం 40కోట్లు కూడబెట్టుకుంది ఆ సమయంలో సవరు 15 రూపాయల మారకంరేటుంది దాన్ని కాస్తా పదిరూపాయలకు దించారు వెంటనే మారకపు బ్యాంకులవారు రూపాయలు పోసి చౌకగా సవరులు కొనుక్కున్నారు భారతదేశపు నిలవ అలాములు పలాములయిపోయింది మన ఆర్థిక రాజకీయ ప్రాణాలు రెండూ వారి చేతుల్లో ఉండటం మూలాన ఈసారి కూడా ఇటువంటి ఎత్తే ఎత్తవచ్చు

మన నిలవని వ్యర్థపరిచేటందుకు మారకపురేట్లే కాక ఇతర పద్ధతులు కూడా లేకపోలేదు అందులో ఒకటి ప్లానులు తయారుచెయ్యటం– మనదేశం అభివృద్ధి అయేటందుకు! నూటయాభై సంవత్సరాలుగా మన దారిద్ర్యమూ దౌర్భాగ్యమూ – పెంపొందించటానికే శ్రమిస్తున్న వీరీనాడు మన అభ్యుదయానికి గాను ప్లానులు వేస్తారంటే అనుమానించటానికి మనకు హక్కున్నది

ఇరవైయేళ్ళ క్రితం బొంబాయి ప్రభుత్వం బొంబాయిలోని జనసమ్మర్దం తగ్గించటానికి ఒక ప్లాను వేసింది ఒక చెంప దాదరు, మాటుంగా, మాహీమ్ ప్రాంతాలు ఖాళీగా ఉండగా, సముద్రంలో కొంతభాగం పూడ్చటానికి గాను ఇంగ్లండునుండి పాతయంత్రాలు కొన్ని తెప్పించి అనేక కోట్ల రూపాయలు దుర్వ్యయం చేసింది ఇప్పుడు రాష్ట్రీయ ప్రభుత్వాలు తయారుచేసే ప్లానులింతకంటె ఘనంగా ఉండబోవు వీటి ఫలితంగా మనకు పెద్ద పరిశ్రమలకు మారుగా గృహపరిశ్రమలూ, ఇనుము ఉక్కులకు బదులు రోడ్లూ, మోటార్లకు బదులు ఎవరూ నివసించని ఇళ్ళూ రావచ్చు లేదా ఈ డబ్బంతా పెట్టి చవుకబారు వస్తుసామాగ్రి మన నెత్తిన ఇంగ్లండునుంచి తెచ్చి తొక్కవచ్చు అక్కడితో మన పరిశ్రమలు మూలబడి దేశమంతటా నిరుద్యోగం తాండవించవచ్చు

బ్రిటన్‌వుడ్సు సమావేశంలో కీన్సు ప్రభువు మాటతప్పమని భరోసా ఇచ్చాడు గాని ఎప్పుడో, ఏమిటో చెప్పలేదు అవకాశం దొరికితే సామ్రాజ్యవాదులు ఈ అప్పులలో చాలావరకు

దిగమింగి మిగిలిన దానికింద తయారు వస్తువులూ, దిక్కుమాలిన ప్లానులూ ఇచ్చి తృణమో, కణమో తప్ప యంత్రసామాగ్రి ఇవ్వరు చూస్తూ, చూస్తూ భారతదేశంలో ముఖ్య పరిశ్రమలు సాగటం వారికెంతమాత్రమూ మనస్కరించదు

ఈ బాకీ వసూలు చెయ్యటంలో మనకు బ్రిటిషు ప్రజల యెడల సానుభూతి లేకపోవటమనేది కూడా లేదు శత్రువును పరిమార్చటానికి మనం చెయ్యగల త్యాగం చేసేశాం బ్రిటిషు ప్రజలను పిండి అప్పు వసూలు చేసుకోవాలనే తలంపు మనకేమీ లేదు

ఏమంటే బ్రిటను ఈ అప్పు తీర్చగల స్థితిలోనే ఉంది

బ్రిటను రోజూ యుద్ధం కింద ఒకటిన్నర కోట్ల సవర్లు ఖర్చు చేస్తున్నది మన బాకీ 100 రోజుల యుద్ధ ఖర్చు మాత్రమే యుద్ధానికి పూర్వం బ్రిటను సాలుసరి రాబడిలో ఇది ఆరోవంతు బ్రిటనుకున్న మొత్తం అప్పు మీది వడ్డీకి మన బాకీ రెట్టింపుకంటె లేదు ఆ బాకీలో మన బాకీ నూరులో 8వంతుకంటె లేదు ఈ బాకీ ఇవ్వలేమని గోలెత్తటం బ్రిటిషు ప్రజలనీ, భారతీయులనూ వంచించటమే

అదీ కాక ఈ బాకీ యావత్తూ ప్రస్తుత ఆదాయంలోనుంచే బ్రిటిషు వారు చెల్లువెయ్యనవసరం లేదు వారు మనదేశంలో టీ తోటల్లోనూ, ఇనుము, బొగ్గు గనుల్లోనూ, నార, బట్ట ఫ్యాక్టరీలలోనూ, పారిశ్రామిక సంస్థల్లోనూ చాలా పెట్టుబడులు చేసి ఉన్నారు ఈ పెట్టుబడులకు చెందిన వాటాలు కొంత అప్పు కింద భారతీయులపరం చెయ్యటం ధర్మం కొద్దిమంది బ్రిటిషు పెట్టుబడిదార్లు ఇండియా దారిద్ర్యాన్ని దోచుకునే అవకాశం పోతుందేమో గాని బ్రిటనుకెంత మాత్రమూ నష్టం లేదు

కిందటియుద్ధంలో అమెరికా బాకీని బ్రిటన్ ఈవిధంగా తీర్చుకున్నది ఈ యుద్ధంలో కూడా బ్రిటను తన డాలరు రిజర్వులతో అమెరికా నుండి వస్తువులు కొనుక్కున్నది ఈ అప్పు గురించి వితర్కించే బ్రిటిషు పెట్టుబడిదార్లు భారతదేశంలో తమకున్న పెట్టుబళ్ళ ఊసే ఎత్తరు ఎత్తితే తమ ప్రజలకు తెలిసిపోదా – ఈ పెట్టుబళ్ళతో సహం బాకీ తీరిపోతుందని

మన బాకీ సొంతం పరిష్కారం కావటం బ్రిటిషు ప్రజలకి క్షేమకరం బ్రిటిషు పెట్టుబడిదార్ల వాటాలతో కొంత అప్పు రహితమయితే బ్రిటను తాలూకు ప్రస్తుతాదాయంలో నుండి పెద్ద చెల్లులుండక యుద్ధప్రయత్నం సుకరంగా సాగిపోతుంది భారతదేశం పారిశ్రామికోన్ముఖం కావటం కూడా వాళ్ళకి క్షేమమే భారతీయ దారిద్ర్యం మీద యుద్ధ ప్రయత్నం మీదా ఆధారపడిన బ్రిటనులో యుద్ధం పూర్వం పదిలక్షలమందికి పనులుండేవి కావు ఆ రోజులు తిరిగిరాకుండా ఉండటం అక్కడి ప్రజలకి మేలు భారత దారిద్ర్యం బ్రిటిషు ప్రజల పరమశత్రువు బ్రిటనులో ప్రస్తుతం ఉన్న పారిశ్రామిక పనీ, జీతాలూ కుంగిపోకుండా ఉండాలంటే భారత ప్రజల క్రమాభివృద్ధికి బ్రిటిషు ప్రజలు చేయూత ఇవ్వాలి బ్రిటిషువారి యంత్ర సామగ్రికి ఇండియా క్రయస్థానం అవుతుంది పరిశ్రమలు విస్తరించే అవకాశం ఏర్పడుతుంది లేనిపక్షంలో రెండుదేశాల ప్రజలకీ దుష్కర్మ తప్పదు

భారతదేశం యుద్ధభారంతో కుంగిపోయింది సామ్రాజ్యవాదులు పారిశ్రామికంగా మన నడుము విరగ్గొట్టెయ్యటం చేత చెప్పరాని బాధలకి లోనయినాం యుద్ధానంతరం దేశగతి

ఇంకా అన్యాయమవుతుంది అప్పుడే పారిశ్రామిక వస్తువుల దిగుమతి సాగి మన కర్మాగారాలు ఒక్కొక్కటే మూలబడుతున్నాయి ఇంతకాలమూ నడిచిన యుద్ధ పరిశ్రమల స్థానే కొత్త పరిశ్రమలేర్పడి పనివాళ్ళకి కొత్త ఆర్జనోపాయాలేర్పడాలి లేనట్టయితే నిరుద్యోగంతో దేశం అల్లాడిపోగలదు

యుద్ధానంతరం మన దేశస్థితిగతులు విషమించకుండా ఉండాలంటే స్టెర్లింగు రిజర్వుతో యంత్రాలు కొనుక్కుని భారతదేశం ముందడుగు వేసుకోవాలి 1400 కోట్లంటే మాటలు కాదు దానితో భారతీయ పరిశ్రమలు ఇప్పుడున్నదానికి మూడింతలు చేసుకోవచ్చు

బ్రిటిషువారు మనదేశంలో –ముఖ్యంగా ఉక్కు, బొగ్గు పరిశ్రమల్లో – పెట్టుబడి చేసిన మొత్తాలు వెంటనే భారతీయులపరం కావాలి మన ముఖ్య పరిశ్రమలు బ్రిటిషువారి చేతుల్లో నుంచి తొలగటం అత్యవసరం ఇందువల్ల ఇక్కడి నుంచి ఏటా ఎగుమతి అయే అంతులేని లాభాలు అరికట్టటమే ఎక్కువైన సంగతి వీటితోనే ఎంత పారిశ్రామిక వ్యాప్తి అయినా జరుగుతుంది మనకు రాజకీయంగా శత్రువై ఉన్న బ్రిటిషు పెట్టుబడిదారును ఈ విధంగా బలహీనపరచటం కూడా మనకు మంచిదే పోతే మనకత్యవసరమైన యంత్రాలు, వగైరా ఈ బాకీతోనే రావలసి ఉంది ప్రస్తుత పరిస్థితిలో ఈ యంత్రాలు మనకత్యవసరం మన కనీసపు అవసరాలు నిర్ణయించటానికి ప్రజావిశ్వాసానికి పాత్రమైన జాతీయ ప్రభుత్వం ఏర్పడాలి ఆ ప్రభుత్వం వేసే అంచనాలు పూర్తి అమలులోకి రావటానికి కొన్ని ఏళ్ళు పట్టినా ప్రారంభం వెంటనే కావాలి ఈ అప్పు పాతి ఉంచటానికి గానీ బ్రిటిషు పెట్టుబడిదార్లు తిరగా బోర్లా తొయ్యటానికి గాని ఏమాత్రమూ వీల్లేదు

బాకీ రద్దుచెయ్యటానికి చాలా సంవత్సరాల వాయిదాలిచ్చినట్టయితే బ్రిటిషువారికి భారంగా ఉండదు పైగా ఇక్కడి బ్రిటిషు పెట్టుబడులు భారతీయులపరం చెయ్యటం వల్ల అప్పు కొంతభాగం తీరేపోతుంది

ఈ స్టెర్లింగును బంగారంగానూ, డాలర్లుగానూ మార్చుకోవటానికి కూడా అవకాశం ఇస్తే భారతదేశం తనకు కావలసిన యంత్రసామగ్రి అమెరికా వగైరా దేశాలనుండి తెప్పించుకోగలుగుతుంది దీనివలన మనకు కావలసిన యంత్రాలన్నీ బ్రిటనునుంచే కొనుక్కుని అక్కడ కరువు వచ్చే పరిస్థితులేర్పరచటానికి బదులు ఇతర దేశాల నుంచి కూడా కొనుక్కోవటానికి వీలవుతుంది ఇది బ్రిటిషు ప్రజల క్షేమానికి మాత్రం విరుద్ధం కాదు

బ్రిటిషు ప్రజలూ, భారతప్రజలూ పరస్పర సానుభూతితో సంప్రదించి ఈ అప్పు తీర్చటం బ్రిటనుకు భారమవుతుందనే తీర్మానానికి వచ్చేపక్షంలో ఇందులో కొంత వదిలేసుకోవటానికి మనం ఒప్పుకోకపోం కాని ఈవిధంగా కొంత అప్పు కొట్టెయ్యటం వల్ల భారతదేశాన్ని దోపిడీచేసేవాళ్ళకు బలం చేకూరుతుందనే అనుమానం మటుకు మనకు కలగకుండా ఉండాలి భారతదేశాన్ని సంకెళ్ళలో ఉంచి, దేశనాయకుల్ని జైళ్ళలో తొక్కేవారి కోసం భారతీయులు ఈషన్మాత్రం కూడా సానుభూతి చూపలేరు రెండుదేశాలకీ పరస్పర సానుభూతి కలగాలంటే ఇక్కడా అక్కడా కూడా ప్రభుత్వాలు మారాలి

ఈ స్టెర్లింగు అప్పు ప్రత్యేక భారతీయ వ్యక్తుల పేర లేదు, ప్రభుత్వపరంగా ఉన్నది అందుచేత ఈ బాకీ మొత్తాన్ని సవ్యంగా వినియోగపరిస్తే మనదేశంలోని ముఖ్యపరిశ్రమలు ప్రభుత్వపరంగా నడిపే సదవకాశం దానంతట అదే ఏర్పడుతుంది ఆమీదట మన పారిశ్రామికాభివృద్ధి ఒక నిర్ణీతమైన పద్ధతిలో జరగటానికి వీలుంటుంది దీనివల్ల భారతదేశం పెట్టుబడిదార్ల దురాశకు గురికాకుండా తప్పుకోగలుగుతుంది పారిశ్రామిక నిర్మాణం విచ్చలవిడిగా సాగటానికి మారుగా ప్రజల యోగక్షేమాలకి అనుకూలంగా జరుగుతుంది

యుద్ధం అయిపోలేదు బ్రిటిషు సైనికులకింకా మనం వస్తువులందజేస్తూనే ఉన్నాం అప్పు పెరుగుతూనే ఉంది దానివెంట ధరలూ, దారిద్ర్యమూ కూడా పెరుగుతూనే ఉన్నాయి దీన్ని ఆపుదల చెయ్యాలి – అంటే మనం వస్తువులివ్వమని కాదు, ఇంగ్లండులో పెరిగే స్టెర్లింగుకు ప్రత్యామ్నాయంగా కాగితాల రూపాయలు జారీకావటం ఆగాలి భారతదేశానికి విరివిగా ఆహారపదార్థాల దిగుమతి అవసరం నౌకల మీద ఒత్తిడి తగ్గింది గనక సైన్యానికి కావలసిన అహారపదార్థాలు ఇతరచోట్ల నుంచి ప్రభుత్వం దిగుమతి చేసుకోవాలి ఈ పనిచేస్తే బ్రిటిషువారికి అప్పు కూడా వృథాగా పెరగదు, మన ఆహార ధరలు కూడా దిగిపోతాయి

మనకి యంత్రాలూ, ఇతర వస్తువులూ కావాలి మెడిటరేనియను మార్గం తెరుచుకున్నది గనుక మన అప్పు కింద వీటిని బ్రిటను సప్లయి చెయ్యటానికాటంకమేమీ లేదు బ్రిటనుకు ఇవ్వటానికి అవకాశం లేని పక్షంలో అమెరికా ఇస్తుంది, స్టెర్లింగును డాలరుకింద మారిస్తే బ్రిటనుక వస్తువులకు వస్తువులే మారకం ఇవ్వవచ్చు అది సాధ్యం కాని పక్షంలో భారతదేశంలో రూపాయలు అప్పు పుట్టించుకోవచ్చు కాని, బ్రిటను వైఖరి చూస్తూ బ్రిటనుకు రూపాయలు అప్పు ఎవరిస్తారనేది సమస్య బ్రిటను భారతదేశంతో రాజీకి వచ్చే యెడల అది సాధ్యం కావచ్చు ఈ రూపాయల అప్పువల్ల లాభం ఏమిటంటే కొత్తనోట్లు అచ్చువెయ్యనవసరం లేకుండా ఉన్ననోట్లే అప్పిచ్చి వాటితో మనం బ్రిటను నుండి వస్తువులు కొనుక్కోగలుగుతాం ధరలు లేచిపోవు ఈ పని చెయ్యటానికయినా సామ్రాజ్యతత్వమే ఆటంకంగా ఉంది

ఈ అప్పు తగ్గించటానికి వీల్లేదని మన పెట్టుబడిదార్లూ, పారిశ్రామికులూ ఆందోళన చేస్తున్నారు మన ప్రజలు ఈ ఆందోళనను బలపరచటం లేదు గాని బలపరచటం ప్రజలకు విహితమైనది

సంగ్రహణకర్త : కొ కు
ఆంధ్రజ్యోతి మాసపత్రిక, సెప్టెంబర్ 1945
"INDIA'S STERLING BALANCES" By B T RANADIVE,
Peoples Publishing House, Bombay -4

# 2. స్టెర్లింగు నిల్వలు

రెండుదేశాల మధ్య వ్యాపారం జరిగేటప్పుడు ఒక దేశానికి ఇంకొకటి అంతో ఇంతో బాకీ ఉండటం జరుగుతుంది అందులో ఒకటి బ్రిటను లాగా పాలించే దేశమూ, రెండవది ఇండియాలాగా బానిసదేశమూ అయినపుడు రుణగ్రస్తమైయుండటం సహజం యుద్ధానికి పూర్వం మనదేశం బ్రిటనుకు చాలా బాకీ పడిఉంది

కాని యుద్ధం ప్రారంభమై పూర్తి అయ్యే సమయానికి జరిగిందేమిటంటే బ్రిటను రుణం పూర్తిగా తీరటమే గాక, బ్రిటను మన దేశానికి రమారమి 1600 కోట్లరూపాయలు బాకీపడి కూచుంది "వందసంవత్సరాలకైనా మీ బాకీ తీర్చలేము" అని బ్రిటిషువారు మనతో మొరపెడుతున్నారు

ఇంత కొద్దికాలంలో బ్రిటను మనకింతగా రుణపడటానికి కారణమేమిటి? ప్రపంచంలోకల్లా భాగ్యవంతమైన దేశాల్లో ఒకటి అయిన బ్రిటనుకంటే మనదేశం అకస్మాత్తుగా భాగ్యవంతమై పోయిందా? అప్పు సొంతం తీర్చుకోలేమనే బ్రిటనుకు, మనం ఎటువంటి జాలి చూపవచ్చు? ఈ విషయం తెలుసుకోవటం అత్యవసరం

**స్టెర్లింగు నిల్వలు ఎలా ఏర్పడ్డవి?**

ఈ అప్పు ఇంతగా పెరిగిపోవడానికి కారణాలు రెండు 1) యుద్ధం జరిగిన ఏడు సంవత్సరాలలోను మనం పూచికపుల్ల ఖరీదు వస్తువులు కూడా పుచ్చుకోలేదు మనవేపు నుంచి వస్తువులిస్తూ వచ్చాం అందుచేత బాకీ తీరటమనేది జరగనేలేదు 2) యుద్ధానికి అవసరమైన సామగ్రీ, సహాయమూ మనవల్ల పొంది, దానికిగాను బ్రిటను మనకు రుణపడింది ఇది మనం బ్రిటనుకు చేసిన సహకారం ఇది మొదట్లో అంత జాస్తిగా లేదు గాని, జపాను యుద్ధంలో దిగిననాటినుంచీ, అంటే 1942 లగాయతు పాపం పెరిగినట్లు పెరిగిపోయింది న్యాయంగా ఈ యుద్ధం ఖర్చు మనం భరించుకోవలసిందే మనకు స్వాతంత్ర్యం ఉండినట్టయితే దాన్ని జపాను ఫాసిస్టులు దోచుకోకుండా ఉండగలందులకు మనం మన ఖర్చుతో యుద్ధ ప్రయత్నం సాగించి ఉండేవాళ్ళం కాని బ్రిటను మనకా అవకాశం ఇవ్వలేదు మన దాస్యాన్ని తన వద్ద నుంచి జపానువారూ, జర్మనీ వారూ లాగుకోకుండా ఉండగలందులకు మన సంరక్షణభారము బ్రిటను తన నెత్తిన వేసుకుంది అందుకే ఇంత అప్పు అయింది

బ్రిటనుకు ఇంత అప్పు పెట్టినందుకు మనకు ఒరిగినదేమిటి అని ఆలోచించాలి ఈ యుద్ధప్రయత్నంలో మనకు కొత్త పరిశ్రమలు స్థాపన కాలేదు సరికదా, పాత పరిశ్రమలు కొన్ని పూర్తిగా నిలిచిపోయాయి జీవితావసరాలకఉత్పత్తి యుద్ధసహకారానికే సరిపోవటం వల్ల తిండీ, గుడ్డా మొదలైనవి అందకుండా పోయాయి యుద్ధప్రయత్నంలో అధిక సంఖ్యాకులు పనిచేసి వేతనాలు పుచ్చుకోవటం వల్ల డబ్బు చలామణీ అధికమయింది దేశంలో డబ్బు చలామణీ అధికమయిపోయి జీవితావసరాలు తరిగిపొయ్యేసరికి రూపాయి విలువ క్షీణిస్తుంది దేశంలో తిండి కరువొచ్చింది గుడ్డకరువొచ్చింది అంటువ్యాధులు రెచ్చిపోయాయి మందులు లేవు దొంగ వ్యాపారులు విజృంభించారు దేశంలో భీకర పరిస్థితులు ఏర్పడ్డాయి బెంగాలులోను, బీహారులోను, ఒరిస్సాలోను, రాయలసీమలోను మృత్యుదేవత తాండవించింది

అంగట్లో అన్నీ ఉండి అల్లుడినోట్లో శని అన్నట్లు ఎక్కడో బ్రిటనులో మనపేర కోట్ల కోట్ల డబ్బు పెరుగుతున్నది మనం మటుకు చితికిపోయాం

**సామ్రాజ్యవాదుల కుట్రలు**

యుద్ధం అయిపోతూనే బ్రిటిషువారు డబ్బెగవేసే ధోరణి ప్రారంభించారు తమదగ్గిర అప్పంతా పుచ్చుకోవటం ధర్మం కాదన్నారు డబ్బు చలామణీ పెరిగిపోవటం వల్ల ధరలు పెరిగి ఇంత అప్పయింది గాని న్యాయమైన ధర ప్రకారం చూస్తే ఇంత అప్పు ఉండదన్నారు కాని ధరలు పెరగటానికి కారణం తాము అప్పు పేరబెట్టడమేనని వారు చెప్పరు ఎప్పటికప్పుడు మన అప్పుకు సరిపడా వస్తువులు బ్రిటను సప్లయ్ చేసినట్లయితే ధరలింతగా పెరిగిఉండవు

మనను కాపాడటానికే ఈ రుణం చేశామని ఇప్పుడంటున్నారు కాని మనకు స్వాతంత్ర్యం ఇచ్చేసినట్లయితే మనను మనమే కాపాడుకునేవాళ్ళం కొన్ని ముఖ్య కీలక పరిశ్రమలను నెలకొల్పుకునే వాళ్ళం యుద్ధం అయిపోయేసరికి మన ఆర్థిక జీవితం మనం చక్కబెట్టుకొని ఉండేవాళ్ళం ఇంగ్లండు, కెనడా, ఆస్ట్రేలియా మొదలయిన స్వతంత్రదేశాలు ఈ విధంగా పరిశ్రమలను పెంచుకున్నాయి మనం ఇంతా త్యాగం చేసి, స్టెర్లింగు నిల్వలు ఇంతగా చేర్చుకొని అధోగతిలోనే ఉన్నాం

బ్రిటను మనకింకొక ద్రోహం కూడా చేసింది బ్రిటను లాగే అమెరికా కూడా మనకు రుణపడింది ఈ రుణానికి సరిపడా మనం అమెరికానుండి వస్తువులు తెచ్చుకునే అవకాశం బ్రిటను ఇవ్వకుండా ఉంది ఈ అప్పును బ్రిటను రుణం కింద మార్చుకొని మనం వినియోగపరచుకోవాలి

**దేశ పునర్నిర్మాణానికి స్టెర్లింగులే ఆధారం**

న్యాయంగా, సవ్యంగా ఈ రుణం బ్రిటను సాధ్యమైనంత త్వరలో మనకు తీర్చినట్లయితే, మనం ఇదివరలో పడ్డ కష్టాలేవో పడ్డాం, ఇప్పుడు మనం ఈ స్టెర్లింగు నిల్వలతో మన ఆర్థిక పరిస్థితిని చక్కబెట్టుకోగలం మనదేశంలో బ్రిటిషువారి పెట్టుబడులు 500కోట్ల రూపాయల విలువగలవి ఉన్నవి వీటిని మనం కొంత అప్పు కింద స్వాధీనం చేసుకోవచ్చు మిగతా డబ్బుతో మనకవసరమైన ఘనపరిశ్రమలకు గాను అమెరికానుంచి, బ్రిటను నుంచి తదితరదేశాల నుంచీ యంత్రసామగ్రి కొనుక్కోగలం ఈ విధంగా నెలకొన్న భారతీయ పరిశ్రమలు పెట్టుబడిదార్లతో సంబంధం లేకుండా ప్రభుత్వపరమై ఉంటాయి ఈవిధంగా మనకి స్టెర్లింగు నిలవలు ఉపకరించటం బ్రిటిషు సామ్రాజ్యవాదులకిష్టం లేదు వారి అభిప్రాయం – వీలైతే వీటిని వాతాపి జీర్ణం చేసుకోవాలని ఇవ్వటం తప్పనిసరి అయితే ఇందులో ఒకవంతు ఇచ్చి మిగతాది కాజేయాలని అది కూడా మనకి పనికివచ్చే యంత్రసామగ్రి రూపంలో గాక వాడుక వస్తువులుగానూ అదైనా చాలాకొద్ది కొద్ది మొత్తాలుగా చాలాకాలం మీదటనూ ఇవ్వాలని

**అమెరికా కుతంత్రాలు**

ఇక్కడ అమెరికా సహాయం బ్రిటనుకు కొంత వస్తున్నది ప్రస్తుతం అమెరికా ఇండియాతో పెద్దవ్యాపారం సరాసరి సాగించటం లేదు అందుచేత ఇటీవల అమెరికా బ్రిటనుతో ఒక ఆర్థిక ఒడంబడిక చేసుకొన్నది దీనిప్రకారం 15 జులై 1947 నాటికి అమెరికా ఇండియాల మధ్య బ్రిటను పెత్తనం తొలగిపోతుంది ఆనాటినుండీ అమెరికా మనకు సరుకులు పంపుతుంది

ఈ విధంగా అమెరికా తన స్వార్థం చక్కపెట్టుకుని ఆ పైన స్టెర్లింగు నిల్వల విషయంలో బ్రిటనుకు సహాయంగా వస్తుంది బ్రిటనుకు అమెరికాకు జరిగిన పై ఒడంబడిక ప్రకారం స్టెర్లింగ్ నిల్వల వ్యవహారం కూడా తేలిపోవాలి అంటే బ్రిటను 15జులై లోగా మన బాకీ యావత్తూ తీర్చాలని కాదు, అందులోనూ ఎంత తీర్చేదీ, ఎంత ఎగవేసేదీ, ఇచ్చేమొత్తం ఎంత కాలంలో ఇచ్చేదీ తేలిపోవాలని! దానిలో 50 సంవత్సరాల పాటు కొద్దివడ్డీమీద తొక్కిపట్టేటట్లూ, అమెరికా దీనికంతకూ ఆమోదించినట్టూ తెలుస్తుంది బ్రిటనులోని ఆర్థిక రాజకీయవేత్తలూ, ఆర్థిక వ్యాపారపత్రికలూ చేసే అలజడి చూస్తే స్టెర్లింగ్ నిల్వలు మనకెందునా ఉపకరించకుండా చూడాలనే ధోరణిలో ఉన్నట్టు స్పష్టమవుతుంది వారు నియమించే షరతులకు ఒప్పుకోకపోతే వారు మన బాకీ సొంతం బిగబడతామని కూడా బెదిరిస్తున్నారు బ్రిటను ధోరణి చూస్తే వారీబాకీ చెల్లించే పద్ధతికీ, ఎగవేసే పద్ధతికీ అట్టే తేడా కనిపించడం లేదు

ఈ 15జులై లోగా ఈ నిల్వలను గురించి మన ప్రతినిధులు లండను సమావేశంలో తీవ్రమైన అలజడి చేసి మనకు అనుకూలంగా పరిష్కారం చేసుకురావటం ఎంతయినా అవసరం మనం యేమాత్రం అజాగ్రత్త వహించినా దొంగలూ, దొంగలూ చేరి ఊళ్ళు పంచుకుంటారు మన రక్తం ధారపోసి ఆర్జించిన ఈ నిల్వలు గాలిలో ఎగిరిపోతవి రేపు కొత్త రాజ్యాంగంలో మనదేశం ముక్కచెక్కలైపోయి, దేశమంతటా స్వతంత్ర ప్రభుత్వాలు నెలకొల్పి బ్రిటిషువారి స్టెర్లింగ్ నిల్వల పంపకం దగ్గర మళ్ళా మనలో మనకు జుట్టూ, జుట్టూ ముడిపెట్టడం ఉండనే ఉంటుంది కాని ప్రస్తుతం జులై 15 గడువులోపుగా స్టెర్లింగ్ నిల్వల పూర్తి పరిష్కారమూ, శీఘ్రపరిష్కారమూ స్థిరపడటం అత్యవసరం

నవయుగ మాసపత్రిక, 1-7-1947

## 3. ప్లానింగు కమిషను

కిందటి వారం కాంగ్రెసు వర్కింగు కమిటీ వారు మన దేశానికి ప్లానింగు కమిషను ఏర్పాటు కావాలని తీర్మానించారు దేశంలోని ఆర్థిక చిక్కులను సరిదిద్దటం, ప్రజావసరాలను అధికంగా ఉత్పత్తి చేయించటం, అందరికీ పని దొరికేటట్టు చూడటం, ప్రజల జీవన ప్రమాణాలు హెచ్చించటం ప్లానింగు కమిషను ఆశయాలు

కొన్ని నిర్ణయాలకు స్వతస్సిద్ధంగా గొప్ప విలువ ఉంటుంది రష్యాలో విప్లవానంతరం ఆర్థిక వ్యవస్థ నిర్దిష్ట ప్రణాళికలను ఆశ్రయించుకొని, క్రమాభివృద్ధి చెందిన విషయం ప్రపంచమంతటా గుర్తింపబడిన నాటినుండి 'ప్లానింగు' అనేది 'మంచి పనుల' జాబితాలో చేరిపోయినది ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరం మరికొన్ని దేశాలు – తూర్పుయూరపు దేశాలు –'ప్లానింగు' విధానం అవలంబించాయి గుటకలు వేసీ, పగటికలలు కనీ సంతృప్తి చెందుతున్నాయి కారణం అది సులభసాధ్యం కాదు దానికి షరతులూ, నిబంధనలూ ఉన్నాయి వీటిని స్థూలంగా ముందు పరిశీలిద్దాం

ఒకవిషయం, కాంగ్రెసుకు 'ప్లానింగు' అనే భావన ఇవాళ కొత్తగా వెలువడినది కాదు 1938లో కాంగ్రెసువారు ప్లానింగు కమిటీ ఒకటి ఏర్పాటుచేసి కొంతపని సాగించారు అయితే

అప్పటి కాంగ్రెసే ఇప్పటి కాంగ్రెసా? అన్న విషయంలో చాలామందికి సందేహం లేకపోలేదు కనీసం ప్రొఫెసరు కె టి షా –కాంగ్రెసు వర్గాలకు అప్పుడున్నంత సన్నిహితంగా ఇప్పుడు లేరు 'సోషలిస్టు' అనే పదంపట్ల అప్పటి కాంగ్రెసుకున్న ఆదరణ ఇప్పటి కాంగ్రెసుకు లేదనేది కూడా విదితమే (లేకపోతే మన రిపబ్లికుకు సోషలిస్టు రిపబ్లిక్ అనే నామకరణ జరిగి ఉండును) ఇప్పటి సోషలిస్టులు, ఈ కాంగ్రెసువారు నిజంగా ఈ 'ప్లానింగు' సాగిస్తారని నమ్మలేకుండా ఉన్నారనేది కూడా పత్రికల వార్తలవల్ల విదితమవుతున్నది ఈ సంశయమే ఇతరవర్గాలకు కూడా ఉండటం దురూహ్యం కాదు

* * *

'ప్లానింగు' అంటే ఏమిటి? అది కొనసాగటానికి అవసరమైన కనీసపు అవకాశాలేవి?

ప్రతిదేశం లోనూ సహజసంపద కొంత ఉంటుంది దానిని అవసరవస్తువులుగా మార్చటానికి నిపుణులు కావాలి సాధనసామగ్రి – యంత్రాలు, ఫ్యాక్టరీలు, రవాణా సౌకర్యాలు, విద్యుచ్ఛక్తి వగైరా కావాలి దేశావసరాలు సవ్యంగాను, సమగ్రంగాను గడవాలంటే ఏ తరగతి సరుకులు ఎంతెంత ఉత్పత్తి కావాలో అంచనాలు కట్టాలి దేశావసరాలను గురించి ముందుగా 'తబ్సీళ్ళు' సంపాదించాలి తబ్సీళ్ళు దొరికి, అవసరాలు అంచనా కట్టబడినాక వాటి నిర్మాణానికి సాధనసంపత్తీ, నిపుణులూ, శ్రామికులూ నియోగించబడాలి

సరుకుల ఉత్పత్తి బహుముఖాలు గలది ఒక్కసారిగా నూరేళ్ళకు సరిపడే సరుకులు ఉత్పత్తికావు దానికి కావలసిన యంత్రాలుండవు వాటిని సృష్టించే నిపుణులుండరు ఆ కారణంచేత ఇండియా వంటి వెనుకబడి ఉన్న దేశాన్ని అమెరికాలాగ ముందుకొచ్చిన దేశంగా చేయడం అసంభవం కనుక దేశం యొక్క ఆర్థికాభ్యుదయం అనేక ప్రణాళికల ఆధారంతో సర్వతోముఖాభివృద్ధి చెందుతూ పోవాలి ఒకవంక నిపుణులు తయారు కావాలి, ఉత్పత్తి చేసే యంత్రాలు, యంత్రాలు చేసే యంత్రాలు, యంత్రాలు నడిపే విద్యుచ్ఛక్తి ఉత్పాదన చేసే ప్రాజెక్టులు వగైరాలు, ముడిపదార్థాలను రవాణా చేసే రైళ్ళూ, వాటికి సంబంధించిన కార్ఖానాలూ, కార్మికుల శ్రమశక్తిని హెచ్చించే ఆహారమూ వారి ఆరోగ్యాన్ని కాపాడే వైద్యసౌకర్యాలూ, వారి పనితనం హెచ్చించే సాంకేతిక విద్యా– ఈ లక్షా తొంభై ముఖాల అభివృద్ధి జరగటమే కాక, ప్లానింగు ద్వారా ఇవి సాధ్యం కావాలి ఇందులో ఏ ఒక అంశం ప్లానింగులో స్థానం సంపాదించలేకపోయినా ప్లానింగు పథకమంతా దెబ్బతింటుంది ఉదాహరణకు మిగిలినవన్నీ అభివృద్ధి అయి వాటితో పాటు రైళ్ళు అబివృద్ధి కాకపోతే, ఎటువంటి ప్రతిష్టంభన ఏర్పడేది మనం ఊహించవచ్చు ముడిపదార్థాలను ఫ్యాక్టరీలకు అందించడానికి తగినన్ని రైళ్ళు, రైలు మార్గాలు లేకపోతే ఫ్యాక్టరీలు నిలిచిపోతాయి యంత్రాలాగిపోతాయి, కార్మికులకు పని ఉండదు, ఉత్పత్తి యంత్రమే స్తంభించిపోతుంది ప్లానింగు– దేశం యొక్క ఉత్పత్తి నిర్దిష్ట ప్రణాళికలననుసరించి జరగటం చాలా పెద్ద భారం పైన చెప్పిన అంగాలన్నీ ఆ భారాన్ని లాగే గొలుసులోని లింకులు ఏ లింకు బలహీనంగా ఉన్నా గొలుసు బలంలేనిదైపోతుంది ఉత్పత్తి పెరుగుతున్న కొద్దీ ఈ గొలుసులో లింకులు కూడా బలపడాలి ప్లానింగులోని అతి ముఖ్యవిషయం దుర్బలమైన లింకులు లేకుండా చూడటమే

ఇదంతా ఆలోచిస్తే ఎవరికైనా ఒక సందేహం కలిగితీరుతుంది ప్లానింగు ఏ గొలుసు లింకులనైతే బలపరచటానికి పూనుకుంటుందో ఆ లింకుల మీద ప్లానింగు కమిషనుకు, దానివెనుక ఉండే ప్రభుత్వానికి పూర్తి పెత్తనం ఉండవద్దా? ప్రస్తుతం ప్లానింగు కమిషనుని ఏర్పాటు చేయవలసినది భారత ప్రభుత్వం, దానిని నిర్వహించేది కాంగ్రెసు పార్టీ కాంగ్రెసువారు నిర్వహించే, భారత ప్రభుత్వానికి దేశంలో ఉండే ముడిపదార్థాల మీదా, వాటి స్థావరాల మీదా, దేశంలో ఉన్న ఉత్పత్తి పరికరాల మీదా, ఇతర సాధనసామగ్రి మీదా, విద్యుచ్ఛక్తి మీదా, కార్మికుల మీదా ఉన్న అధికారాలెటువంటివి? వీటిపై కాంగ్రెసుకు గాని, కాంగ్రెసు ప్రభుత్వానికి గాని ఉండే అధికారాలకు కల పరిమితి ఏమిటి? ఇది చాలా ముఖ్యమైన అంశం

కాంగ్రెస్ వర్కింగు కమిటీ వారు శిఫార్సు చేసిన ప్లానింగు కమిషను నూతన రాజ్యాంగం కిందనే ఏర్పడబోతుంది కనుక ప్లానింగు కమిషను వెనుక ఉండే ప్రభుత్వాధికారాలను నూతన రాజ్యాంగం ఏ విధంగా నిర్వచిస్తుందో చూడాలి మన నూతన రాజ్యాంగంలో ఆస్తిహక్కులు విస్పష్టంగా నిర్వచించబడ్డాయి ఎవరి ఆస్తిని కూడా 'న్యాయమైన' పరిహారం ఇవ్వకుండా ప్రభుత్వం స్వాధీనం చేసుకునే అధికారాన్ని మన నూతన రాజ్యాంగం ఇవ్వదు

ఆ కారణం చేత దేశంలో ఉన్న చిన్న పెద్ద పరిశ్రమలన్నీ సొంతదార్ల చేతిలోనే ఉంటాయి పెట్టుబడి ధర్మాన్ని బట్టి వీరు ఈ పరిశ్రమలను లాభాల కొరకు మాత్రమే నడుపుతారు కాంగ్రెసు మీద భక్తి కొద్దీ గాని, దేశక్షేమం కోరి గాని పెట్టుబడిదార్లు తమ పరిశ్రమలను ప్రభుత్వపరం చేస్తారనే ఆశ ఏమైనా ఉండేటట్టయితే, ఆ ఆశకు అవకాశం లేకుండా అప్పుడే బొంబాయి వ్యాపారస్తులు ప్లానింగు కమిషను మీద 'చన్నీళ్ళు' చల్లారు

ఎవరి ఆస్తులపై వారికి పూర్తి హక్కులంటూ, పరిశ్రమలు లాభాలకొరకు నడుస్తూనే ప్లానింగు అమలు జరగటం సాధ్యం కాదా అని ఎవరికీ సందేహం కలుగనవసరం లేదు పెట్టుబడిదార్ల లాభాలకు దేశావసరాలకు ఎప్పుడూ పొంతన ఉండదు దేశావసరాలు పెట్టుబడిదార్ల లాభాలను ఖాతరు చేయనట్టే, పెట్టుబడిదార్ల లాభాలు దేశావసరాలను కూడా ఖాతరు చేయవు దీన్ని రుజువు చేయటానికి మన సమీపంలోనే ఎన్ని ఉదాహరణలైనా లభిస్తాయి తాతా కంపెనీ వారు తమ లాభాలు తక్కువగా ఉన్నాయని, ఒక వంక ఉక్కు అవసరం ఎంతో హెచ్చుగా ఉండగానే, 1946 నుంచి 1948 వరకూ ఉక్కు ఉత్పత్తి క్రమంగా తగ్గిస్తూ రావటమే కాక, ఇంకా తగ్గిస్తామని కూడా చెప్పారు పంచదార పారిశ్రామికులూ ఇవే ఎత్తులు వేస్తున్నారు ఆస్ట్రేలియాలో ప్రజల జీవిత ప్రమాణం ఏ మాత్రం హెచ్చుకాకుండానే ఇతర దేశాల అవసరాలను ఆసరా చేసుకుని అక్కడి గోధుమల ధర నూటికి 40వంతులు పెంచబడింది అవసరాన్ని గుర్తించి లాభాలు పెంచటం వ్యాపారరీత్యా చాలా మంచిపని కూడాను! అయితే అది ప్లానింగుకు అనుకూలించే ఆచారం మటుకు కాదు

ఇట్లా కాని పక్షంలో అన్ని పెట్టుబడిదారి దేశాలు ప్లానింగు పద్ధతి అవలంబించే ఉండును అచ్చంగా సోషలిస్టు ఆర్థిక విధానాన్ని అవలంబించిన దేశాలు మాత్రమే ప్లానింగు అమలుచేయటంలో ఉన్న రహస్యం ఇదే భారత రిపబ్లికును, 'సోషలిస్టు' రిపబ్లికు అనలేని

కాం[గ్రెసు వారు గాని, నిన్న మొన్నటివరకు పెట్టుబడిదార్ల కాళ్ళావేళ్ళా పడుతూ, ఉత్పత్తి పెంచండని [ప్రాధేయపడుతున్న భారత [ప్రభుత్వం గాని ఇంతలో 'సోషలిజం' అవలంబించిందని అశోకమెహతా మొదలైన సోషలిస్టు నాయకులు నమ్మలేకపోతే వారిని తప్పుపట్టరాదు పెట్టుబడిదారీ సంస్కృతికి గర్భశ[త్రువులైన సంస్థానాధీశులకు బరఖాలు కప్పటమూ, ముఖ్య పరి[శ్రమలను జాతీయం చేసే ఉద్యమాన్ని కూడా గడువులేకుండా వాయిదా వేయడమూ చేసిన కాం[గ్రెసు సంస్థ వీటన్నిటిని తలదన్నే ప్లానింగు విధానాన్ని అనుసరించ నిర్ణయించిందంటే నమ్మలేని వారంతా పూర్తిగా క్షంతవ్యులే

బొంబాయి వ్యాపారస్తులు కాం[గ్రెసు వర్కింగు కమిటీ నిర్ణయాన్ని గురించి చేసిన వ్యాఖ్యానాలలో కనీసం ఒక్కటి అతివిచి[త్రంగా ఉన్నది "కాం[గ్రెసు [ప్రభుత్వం వారు ధనికవర్గం వారి వద్ద కోల్పోయిన గౌరవ [ప్రతిష్ఠలను కొంతవరకు తిరిగి రాబట్టుకోగలందులకు ప్లానింగు కమిషను ఏర్పాటు చేస్తూ ఉండి వుండవచ్చు" అని ఒకరు అన్నారు ఈమాట రెండు విషయాలను రుజువు చేస్తున్నది మొదటి సంగతి, ప్లానింగుకమిషను వారు తయారుచేసే ఆర్థిక [ప్రణాళికలు పెట్టుబడిదారీ వర్గానికి అనుకూలంగా ఉంటాయని పై మాట అన్నవారు విశ్వసిస్తున్నారు లేనిపక్షంలో కాం[గ్రెసు [ప్రభుత్వం ఇప్పటికన్నా ధనికవర్గం వారి గౌరవాన్ని పోగొట్టుకోగలదనే ధ్వని కూడా ఇందులో ఉన్నది

ప్లానింగుకు నిజంగా అవసరమైనది [ప్రజల సహకారం మొదటిదశలో అది [ప్రజలను అగ్నిపరీక్షకు పెడుతుంది [ప్రజలూ, ముఖ్యంగా కార్మిక వర్గమూ, తమ చెమట ధారపోసి, కడుపులు సహితం మాడ్చుకొని ఈ దశలో ఉత్పాదన సరుకులు ఉత్పత్తి చేస్తారు ఆ సరుకులు ఉమ్మడిగా తమకు చెందుతాయనే విశ్వాసమే, వాటి ద్వారా తమ అవసరాలు ముందు ముందు తీరుతాయనే ఆశే వారికి [ప్రేరణా ధైర్యమూ ఇస్తుంది తాము సాముదాయిక [శమతో తయారుచేసే ఈ దోహదమంతా, ఈ యం[త్రాలన్నీ ధనికవర్గం స్వంతం కాబోతాయనే అనుమానం ఏమా[త్రం ఉన్నా [శామికులు ఈ కష్టాలకు ఒప్పుకోరు ఈ త్యాగం చేయరు అందుచేత బొంబాయి వ్యాపారస్తులు ఊహించే ప్లానింగును నిజంగానే కాం[గ్రెసువారు అమలు చేసే పక్షంలో [ప్రజలకు, ముఖ్యంగా [శామికవర్గానికి, అంతకంటె [ద్రోహమూ, అపచారమూ ఉండబోవు ఈ సంగతి [శామికవర్గం ఊహించలేనిది కాదు జాతీయ [ట్రేడ్‌యూనియన్ స్థాపనతో కార్మికవర్గానికి తాత్వికంగా కొంత [ద్రోహం చేసిన కాం[గ్రెసు సంస్థను కార్మికవర్గాలు విశ్వసించలేకపోతే ఆశ్చర్యం లేదు కనుక కాం[గ్రెసు [ప్రభుత్వం ఏర్పరచబోయే ప్లానింగు కమిషనును కార్మికవర్గాలు చాలా అనుమానంతో చూడగలవు ఒకవంక పెట్టుబడిదార్ల అనుమానానికీ, మరొకవంక కార్మికుల అనుమానానికీ గురవుతూ ప్లానింగు కమిషను ఎవరి సహకారంతో పని [ప్రారంభిస్తుందో చూడవలసి ఉన్నది కాం[గ్రెసు [ప్రభుత్వం వారు ప్లానింగు కమిషను ఏర్పాటు చేసేటందుకై శాసనం [ప్రతిపాదించే సమయంలో జరిగే చర్యల వల్ల ఈ కమిషను పెట్టుబడిదార్లనే అణచివేస్తుందో [శామికులనే అణచివేస్తుందో స్పష్టంగా తెలిసిపోతుంది కాం[గ్రెసు వర్కింగు కమిటీ చేసిన తీర్మానంలో వ్యక్తమైన ఆశయాలు ఉదారంగా ఉన్నవన్న సంతోషాన్ని, కాం[గ్రెసు ఆశయాలకూ చర్యలకూ మధ్య వికసిస్తూ వస్తున్న అఖాతం మింగేస్తున్నది

తెలుగుస్వతంత్ర వారపత్రిక, 27-1-1950

# 4. నీ వోటెవరికిస్తావు?

ఆగు! నాకు సమాధానం చెప్పకు నీ సమాధానం నాకవసరం లేదు అసలు నువ్వెవరో కూడా నాకు తెలీదు నిన్ను గురించి నాకొకటే తెలుసు – నీకు వోటు చేసే అధికారం ఉంది లేకపోతే నీతో ప్రసంగం తీసుకురానుగా

కాని మళ్ళీ ఆలోచిస్తే నిన్ను గురించి నాకేమీ తెలీదనుకోవటం చాలా పొరపాటేమోననిపిస్తున్నది మిగిలిన విషయాలట్లా ఉంచి, నీలో స్వాతంత్ర్యకాంక్ష తీవ్రంగా ఉందనీ, దేశం పరాధీనంగా ఉండటం నువ్వేమాత్రమూ ఒప్పుకోవనీ నాకు స్పష్టంగా తెలుసునే! ఇది చాలదా? ఈ స్వాతంత్ర్యకాంక్ష కాదా మనందర్నీ ఒక కులం చేస్తున్నది?

ఉండు! నిన్ను గురించి ఇంకా అనేక విషయాలు అంచనా కట్టగలనల్లే ఉంది పదిహేను వీసాలు, నువు సామాన్యకుటుంబీకుల మనిషివై ఉంటావు, ఆర్థిక సమస్య అంతో ఇంతో రోజూ మీ దర్శనం చేసుకుంటూనే ఉంటుంది నువు తినే ఆహారం వైద్యులామోదించేదిగా ఉండదు నీ దుస్తులు నువు కోరినంత నాజూకుగా ఉండవు, అయినవాళ్ళ వల్ల నీకు రాదగినంత ఆనందమూ సానుభూతీ వస్తూ ఉండదు(ఇది ఆర్థిక సమస్యకు సంబంధించినదేనని బహుశా నువు గ్రహించి ఉండవు) ఇష్టమైన సినిమా గాని, నాటకం గాని, పత్రికల్లో ఎప్పుడన్నా నీకునచ్చే ఒక కథ గాని– ఇంతకుమించిన సుఖాలు నీ జీవితంలో ఆటే ఉండవు

ఎనిమిది వీసాలు, నీకు రాజకీయాలను గురించి సొంత అభిప్రాయాలుండవు నీ రాజకీయ విశ్వాసాలు నీ అనుచరుల నుంచి స్వీకరిస్తూ ఉంటావు రాజకీయాల గురించి ఈ విశ్వాసాలే నువు ప్రచారం కూడా చేస్తూ ఉంటావు ఎవరైనా రాజకీయాలను గురించి తర్కిస్తుంటే వారి చర్చయొక్క పర్యవసానం మీదే నీ బుద్ధి ఉంటుంది గాని ఇతరవివరాలు నిన్నాటే బాధించవు

పన్నెండు వీసాలు, నువు కమ్యూనిస్టు వ్యతిరేకివై ఉంటావు జిన్నా దేశద్రోహి అనీ, పాకిస్తాను ప్రమాదకరమైనదనీ నమ్ముతుంటావు జైహింద్ నిన్నుత్సాహపరిచి ఉంటుంది

పదిహేను వీసాలు, నీకు జీవితం గురించీ, రాజకీయాలను గురించీ మొండి విశ్వాసాలుండవు ఎన్నో ఏళ్ళుగా ఉన్న విశ్వాసాలనైనా, తగిన కారణం ఉంటే మార్చుకోవటానికి నీకభ్యంతరం ఉండదు అయితే నీలో సంఘబుద్ధి ప్రబలంగా ఉండటం చేత నువు ఒంటరిగా ఏ విశ్వాసాన్నీ కూర్చుకోవటానికి సాహసించవు

నిన్ను గురించి నాకివన్నీ తెలుసును అయితే పాళ్ళలో ఏ మాత్రమైనా నేను పొరపాటుపడి ఉండొచ్చు ఆ మాత్రం పొరపాటు ఒక్కొకసారి ఎరిగినవాళ్ళ విషయంలోనే పడటం కలుగుతుంది గదా!

అయితే మరి నీ వోటెవరికిస్తావు?

అది కూడా అంచనా కట్టి పదిహేను వీసాలు కాంగ్రెసుకే ఇస్తావని సులభంగా చెప్పగలను ఎందుచేతనంటే దేశాన్ని దాస్యంలో ఉంచి పీడిస్తున్న ప్రభుత్వానికి ప్రత్యక్ష ప్రతికక్షి కాంగ్రెసు ప్రభుత్వ నిషేధానికి గురి అయి హింసపాలయిన రాజకీయపక్షం ఇదొకటే మిగతా పార్టీలను గురించి నీకు స్పష్టంగా తెలియాలంటే నీకు రాజకీయ పరిజ్ఞానం చాలా ఉండివుంటుంది నువు నా అంచనాకు పెడగా ఉంటావు నీ వోటెవరికివ్వాలో నీకొకరు చెప్పనక్కర్లేదు

అయితే ఇప్పుడీ గొడవంతా నేనెందుకు తెస్తున్నానని నీకు సందేహం కలగొచ్చు అదే చెప్పబోతున్నాను

కాంగ్రెసు తప్ప నీ వోటివ్వటానికి మరేపక్షమూ లేనప్పటికీ కాంగ్రెసుకు మనస్ఫూర్తిగా వోటివ్వటానికి కొన్ని అనుమానాలు నిన్ను బాధించవచ్చు

ఒకవేళ మీ డివిజనుకు కాంగ్రెసు అభ్యర్థిగా నిలబడే పెద్దమనిషి ఘనత గురించి – పాపం శమించుగాక! – నీకు విశ్వాసం లేకపోవచ్చు "కాంగ్రెసువారు మరో అభ్యర్థిని నిలబెట్టి ఉండరాదా?" అని నీకనిపించవచ్చు ఈ విషయం నిన్నంతగా బాధించనవసరం లేదు ఇక్కడ వ్యక్తి విజయం పార్టీ విజయమే అవుతుంది నీ వోటు స్వీకరించే వ్యక్తి స్వబుద్ధి చేత ఎటువంటి వాడయినా, కాంగ్రెసు అభ్యర్థి అయినాక కాంగ్రెసు కార్యక్రమాన్ని ప్రతిఘటించి నీవోటుకపచారం చెయ్యలేడు

కాంగ్రెసు వైఖరి గురించే నీకు చిల్లర అనుమానాలు కలగవచ్చు కాంగ్రెసులో పెట్టుబడిదార్లకూ జమీందారులకూ బలం జాస్తి కావటమూ, కాంగ్రెసు పేరుతో దేశీయుల మీదనే హింసాప్రయోగం జరగటమూ, కాంగ్రెసు నాయకులలోనే కలతలూ కక్షలూ ఉన్న సూచనలు కనిపించటమూ నిన్నాందోళ పెట్టవచ్చు కాని ఒకటి జ్ఞాపకం ఉంచుకో కాంగ్రెసు యొక్క నిజమైన బలం ప్రజలు – నువ్వూ, నువ్వూ, నువ్వూ, నువ్వూనూ!

మరో విషయం ఈ విధంగా స్వలాభం కోసం కాంగ్రెసునాశ్రయించినవారికీ నీకూ రాజకీయాశయాల్లో సంబంధం లేదనుకోకు స్వాతంత్ర్యం అందరికీ అవసరమే విజాతీయ ప్రభుత్వం వల్ల ఇంతకాలమూ లాభం పొందినవాళ్ళు కూడా కాంగ్రెసులో ఎందుకు చేరుతున్నారంటే, కాంగ్రెసు బలమైన సంస్థ అనీ, కాంగ్రెసులో నువ్వూ, నువ్వూ, నువ్వూ, నువ్వూ ఉన్నారనీనూ

కాంగ్రెసులో నీ బలం హెచ్చినకొద్దీ వాళ్ళ బలం తగ్గుతుంది కాంగ్రెసు ఆశించే సంపూర్ణ స్వాతంత్ర్యం నీ షరతులమీద రావాలి గాని వారి షరతుల మీద కాదు

అందుచేత మనస్ఫూర్తిగా నీ బాధ్యత తెలిసి ఇచ్చే నీవోటు కాంగ్రెసుకు బలం అనుమానంతో గత్యంతరం లేనట్టుగా వోటివ్వకు

మరో సంగతి నీకు కేవలమూ నాయకులయందే మూఢభక్తి విశ్వాసాలు లేక, ప్రజలయందే ఎక్కువ విశ్వాసం ఉండి, ఇతర ప్రజాసంస్థల పట్ల కాంగ్రెసు సరిఅయిన ఆదరం చూపటం లేదే, ప్రజాసంస్థలు తలా ఒకదారీ అవుతున్నాయే అనీ బాధగా ఉండవచ్చు

ఈ విషయం కూడా నువు ఆటే విచారించనవసరం లేదు ఎందుచేతనంటే పోయినకొద్దీ ప్రజాశక్తులు ప్రబలమవుతాయి గాని విచ్ఛిన్నం కావు ఏ ప్రజాసంస్థకిచ్చిన వోటయినా కాలక్రమాన ఇతర ప్రజాసంస్థలకు చేరి తీరుతుంది బయటి శత్రువును ఎదుర్కోవటానికి ప్రజాసంస్థలు ఒక్కొక్క అడుగే ముందుకు వేసినకొద్దీ అవి దగ్గిరకొచ్చి తీరాలి ఆలోచించుకో

ఇప్పుడు చెప్పు, ఇంతకూ నీవోటెవరికిస్తావు?

ఆంధ్రజ్యోతి మాసపత్రిక, 1-3-1946

# 5. హింస అంటే ఏమిటి?

మహాత్ముడు రాజకీయాలలో అహింసాసిద్ధాంతం ప్రవేశపెట్టిననాటి నుంచీ అహింస జనసామాన్యంలో ఎంత విరివిగా ప్రచారమయిందో దాని నిర్వచనం అంత అగమ్యగోచరంగా ఉంది సత్యమూ, అహింసా, ప్రేమా, కళా మొదలైన మాటలు నిర్వచించకుండా విస్తారం ప్రచారం అయినప్పుడు వాటికవే పరమార్థాలై ఊరుకుంటాయి సత్యారాధన ఇంతగా చేసే మహాత్ముడే సత్యమనే ముక్కను అరాధిస్తున్నట్టు కనిపిస్తుంది గాని ఈనాటి రాజకీయ జీవితంలో సత్యాన్ని అన్వేషిస్తున్నట్టు కనిపించదు

అహింసను గురించి కూడా మహాత్ముడు తృప్తికరమైన నిర్వచనం చేసినట్టు కనిపించదు అహింస మనోవాక్కాయకర్మలా ఆచరించవచ్చుననీ, తారతమ్యం బట్టి హింసాహింసలు నిర్ణయమవుతాయనీ మహాత్ముడు ఒకప్పుడన్నాడు

ఈనాడు అహింసను అవలంబించే వారిలో అన్నిరకాల వారూ కనిపిస్తారు అహింస అనేది ఒక పరమాదర్శమనీ, దాన్ని ఎప్పటికో ఎవరో అందుకుంటారనీ, ఈ లోపుగా ఎంత హింసనైనా మనం మన ఇష్టాయిష్టాలను బట్టి సహించి ఆచరించను కూడా వచ్చుననీ అనేవారున్నారు మరోవంక పాములనూ, తేళ్ళనూ, రోగక్రిములనూ చంపటం కూడా హింసేననీ విశ్వసించి అహింస అక్షరాలా అవలంబించటం అసాధ్యమైపోయినందుకు చింతించే వారున్నారు అవతలికి వెళ్ళి రాజకీయ ప్రతికక్షులను తలలు పగలగొట్టి వచ్చి ఇవతల సభావేదికల మీద రొమ్ము చరుచుకుని అహింసలో విశ్వాసం ప్రతిపాదించటం ప్రజలకు సాధ్యమవుతున్నది

హింసాహింసలను గురించి మనం ఇంత అయోమయంగా ఉండవలిసిన అగత్యం కనపడదు ఎందుచేతనంటే హింస అనేదాన్ని నిర్దుష్టంగానూ, స్పష్టంగాను నిర్వచించవచ్చును

మొట్టమొదటి సంగతి, దేన్ని గాని మనం నిర్వచించదలినప్పుడది ఆచరణయోగ్యంగా ఉండేటట్టుగా చూడటం అవసరం అహింసను కాగితం మీదా, గగనవీధిలోనూ, పూజామందిరంలోను ఉంచి ఆరాధించటానికి కాకుండా యదార్థజీవితంలో ఆచరణలో పెట్టాలంటే సాధ్యం కాని అహింసను మన నిర్వచనంలో వదిలెయ్యాలి వరి మొక్కలను హింసించకుండా పంట కొయ్యలేం కూరగాయలను హింసించకుండా అన్నం తినలేం దారిలో మన కాలికింద పడే ప్రతీచీమనూ తప్పించుకుంటూ నడవలేం గాలిలో ఉండే అదృశ్య క్రిములను వడగట్టి గాలి పీల్చలేం

రెండో సంగతి, మన నిర్వచనం ఆత్మహత్యా ప్రయత్నంగా పరిణమించరాదు క్షయా, సెగా, సన్నిపాతమూ, మలేరియా, కలరా మొదలైన వ్యాధులను అహింసాసిద్ధాంతం మీద స్వీకరించలేం ఆ విధంగానే తేళ్ళూ, పాములూ, ఈగలూ, దోమలూ మొదలైన దుష్టప్రాణులను నిర్మూలించటం మన అహింసానిర్వచనానికడ్డం తగలరాదు

మూడో సంగతి, మన నిర్వచనం సాంఘికవిలువలకు అపాయం కలిగించరాదు క్రిమికీటకాల యెడల అపారమైన భూతదయ చూపి సాటి మానవులను పీక్కుతినే మార్వాడీ పద్ధతులు హాస్యాస్పదంగా ఉంటాయి ఇంతే కాక మన నిర్వచనంలో సామాజికమైన అంశం ఉండాలి

ఈ అహింస వ్యక్తి యొక్క మోక్షానికి మాత్రమే గాక సామాజిక వ్యవస్థ యొక్క సక్రమ పరిణామానికి తోడ్పడేదిగా ఉండటం అత్యవసరం రాజకీయాల్లో హింసను ఆమోదించే కుళ్ళుమోతులు నల్లుల్ని పట్టుకెళ్ళి దూరంగా పారేస్తుంటే చూసి సంస్కారి అయినవాడు సహించటం కష్టంగా ఉంటుంది

ఈ పై విషయాలు జ్ఞాపకం ఉంచుకుని హింస అంటే బలాత్కారంగా ఇతరుల మీద మన నిర్ణయాలు ఆరోపించటమనీ, అహింస అంటే మన సక్రమ నిర్ణయాలు అవతలి వాళ్ళకామోదకరంగా ఉండేమాదిరిగా వారిలో పరివర్తన కలిగించటమనీ నిర్వచించవచ్చును

బలాత్కారం లాఠీలతోటే చెయ్యనవసరం లేదు, అవతలి మనిషి సుకుమారుడైతే ఒక్క పరుషవాక్యం చాలును

గాంధీమహాత్ముడు రాజకీయరంగంలో ఆచరణలో పెట్టుతున్నది ఈ నిర్వచనానికి సరిపడే అహింసేనని వాదించవచ్చు కాని ఈ అహింస రాజకీయరంగంలో ఎంతదూరం పనిచేస్తుందనేది చూడాలి గాంధీజీ అహింసాయుత రాజకీయాల్లో సాంఘిక విలువలకు స్థానంలేదు

మాటవరసకు ఒక తండ్రి కొడుకును బలాత్కారంగా బడికి పంపించటం హింసే కాని ఆ తండ్రి తన కొడుకుకు చదువుకొనటం గురించి హృదయపరివర్తన తీసుకురాగలిగే దాకా కొడుకు బడికి వెళ్ళకుండా ఉండాలంటే ఈలోగా పుణ్యకాలం కాస్తా వెళ్ళిపోవచ్చును తండ్రి కొడుకుల మధ్య వయోజ్ఞానాలలో ఉండే తేడాను బట్టి అహింసాసూత్రం ఆచరణయోగ్యం కాకుండా పోతుంది హిట్లరును నాశనం చెయ్యటానికి ఆరేళ్ళు పట్టింది అతడిలో హృదయపరివర్తనం తీసుకురావటానికి అరవైయ్యేళ్ళు చాలి ఉండవు ఫాసిజముకూ, డెమొక్రసీకీ సాంఘిక విలువల్లో సామ్యం లేదు ఆ విధంగానే ఇంపీరియలిజముకూ స్వాతంత్ర్యకాంక్షకూ మధ్య సాంఘిక సామ్యం లేదు

సంఘంలో ఆర్థిక విభజన ద్వారా ఏర్పడ్డ వర్గాల మధ్య అహింస కొనసాగదు ఇన్ని వర్గాలకూ సామ్యమైన విలువలంటూ ఉన్నంతకాలమూ అహింసకు తావున్నది ఈనాడు స్వాతంత్ర్యం కోసరం పోరుతున్న వర్గాలన్నిటి మధ్య అహింసకు స్థానం ఉంది రేపు స్వాతంత్ర్యం లభిస్తే తిరిగి ఏ వర్గానికావర్గమే అయిపోయి హింసాసిద్ధాంతం పైకి వచ్చి తీరుతుంది

వర్గవిభేదాలున్నచోట అహింస సాధ్యం కాకపోవటానికి ఒక్క ప్రబలమైన కారణం ఏమంటే వర్గవిభేదాలు హింస ద్వారానే ఏర్పడి ఉండటం శ్రామికవర్గానికి గత్యంతరం లేని ఆర్థిక పరిస్థితులు దేశంలో కల్పించి, అవసరమైతే పంటభూములన్నిటినీ బీళ్ళుగా మార్చి తిండికి చాలీచాలని వేతనాల మీద తమ ఫ్యాక్టరీలలో పని చేసేటట్టు చెయ్యటం హింసే శ్రామికులేకమై తమ కనీసపు కోర్కెలకోసం సమ్మె చేసినప్పుడు పోలీసుల్ని వారిమీద తోలి లాఠీఛార్జీలూ కాల్పులూ చేయించటం హింస పనివాళ్ళ సంఘాలకు నాయకులుగా ఉన్నవారిని ఏరి వారిని పనిలో నుంచి తొలగించటం హింస పనివాళ్ళ బలం జాస్తి అయినప్పుడు వాళ్ళు కోరిన కోర్కెలకామోదిస్తూ (ట్రూమన్ అన్నట్టు) వస్తువుల ధరలు పెరగనిస్తానని బెదిరించటం హింస దేశంలో ప్రజాప్రభుత్వం లేకపోయినప్పటికీ యుద్ధ పరిశ్రమలు అప్పు మీద సాగించటానికి ఒప్పుకుని, ఆ పరిస్థితి వల్ల కలిగిన వస్తుకాటకాన్ని ఆసరాచేసుకుని దొంగమార్కెట్లు నడిపి, కోట్లు గడించి పాటకవర్గాన్ని చావనివ్వటం హింస ఆ పైన దేశభక్తుల బురఖా వేసుకుని

యుద్ధాన్ని సమర్థించిన రాజకీయ పార్టీల వారిని మనుషులను పెట్టి చంపించటం మరింత హింస  హింస చెయ్యకుండా పెట్టుబడిదారీ ఒక్క అడుగు ముందుకు వెళ్ళలేదు

హింసను అహింసతో ప్రతిఘటించవచ్చునని మహాత్ముడి అభిప్రాయం  తన అభిప్రాయం సరియయినదని రుజువు చెయ్యటానికి పెట్టుబడిదారుల హింసను శ్రామికుల అహింస ద్వారా ప్రతిఘటించేటందుకు మహాత్ముడొక ఉద్యమం ప్రారంభిస్తే బాగుంటుంది

సాంఘిక విలువలను తృణీకరించి అహింసను నిర్వచించటం నావల్లకాదు  నాకు చాతకానిపని మరొకరు చేస్తే చెయ్యవచ్చునేమో  దాని మాట ఎట్లా ఉన్నా, అవకాశం దొరికినప్పుడల్లా అహింసపట్ల తమ విశ్వాసాన్ని ప్రకటించే కాంగ్రెసు వర్గమే తమతో ఏకీభవించని వారి మీద బహిష్కారరూపంలో హింసను ప్రయోగిస్తూ దాన్ని సమర్థించటానికి సాంఘిక విలువల వ్యత్యాసం ఉండాలన్న అనుమానంతో  బహిష్కరించబడ్డ వాళ్ళని దేశద్రోహులని నిందిస్తూ ఉంది గనక ప్రస్తుతం కాంగ్రెసు విశ్వసించే అహింస నేను చెప్పే అహింసకన్న ఉత్కృష్టమైనదనుకునేటందుకు మటుకాధారం లేదు

అహింసకు సంఘంలోనూ రాజకీయాల్లోనూ స్థానం లేకపోలేదు  పరిమితమైన ప్రయోజనం కూడా లేకపోలేదు  రాజకీయ సాంఘికాశయాలు సామ్యంగా కలవారు ఆ ఆశయసిద్ధికి పాటుపడుతున్నంతవరకు అహింసాతత్వం అవలంబించి ఆశయాలను సాధించటం చక్కని కార్యవాదం  అహింసలో ఇంత అపారమైన విశ్వాసం గల కాంగ్రెసు, తనలాగే భారత స్వాతంత్ర్యం అర్థించే ఇతర పార్టీలకెందుకు దూరం అయిపోతున్నదో అది తెలుసుకోవటం దేశ శ్రేయస్సుకు మంచిది

నవోదయ వారపత్రిక, 3-3-1946

## 6. గాంధీజీ శక్తి ప్రజాశక్తి

"అసంఖ్యాకులైన భారతీయులకు నేను ప్రతినిధినైనానంటే ఆ అధికారాన్ని నేను కష్టపడి సాధించుకున్నాను" అని గాంధీజీ ఒకప్పుడు చెప్పారు

గాంధీజీ సాగించిన రాజకీయోద్యమాలే గాక ఆయన కొల్లాయిగుడ్డా, అల్పాహారమూ, ప్రకృతివైద్యమూ, పేదరికమూ మొదలైనవి కూడా భారత ప్రజానీకానికి ఆయనని ప్రతినిధిని చేశాయి

కోటీశ్వరులూ, ప్రభువులూ, నాయకులూ, రాజకీయతంత్రజ్ఞులూ ఆయన దర్శనం చేసుకున్నప్పుడల్లా ప్రజల దర్శనం చేసుకున్నారు

గాంధీజీని నిత్యమూ చుట్టుముట్టిన వాళ్ళంతా గాంధీజీ సిద్ధాంతాలను అర్థం చేసుకున్నవాళ్ళనుకోవటం భ్రమ  కోటీశ్వరులకూ, ప్రజలని దోపిడీచేసేవాళ్ళకూ, అధికార వ్యామోహితులకూ గాంధీ భక్తులని చెప్పుకునే అధికారం లేదు  ఖరీదైన కార్లలో గాంధీ దర్శనం చేయబోయినవారంతా, గాంధీలో ఉన్నది ప్రజాశక్తి కనకనే వెళ్ళారు

దాదాపు 20ఏళ్ళ క్రితం నేను కాశీ విశ్వవిద్యాలయంలో చదువుతుండగా యాజ్ఞిక్ అనే ఆయన మా బ్లాకుకు వార్డెన్‌గా ఉండేవాడు ఆయన హిందూ మతాభిమాని ఆ రోజుల్లో గాంధీజీ కాశీ వచ్చి మా విశ్వవిద్యాలయానికి కూడా రానున్నారు మాతో మా వార్డెన్ గాంధీజీ 'గోహత్య' చేశాడు గనక హిందువు కాదనీ, ఊళ్ళో ఉన్న హిందూ మతాభిమానులందరూ గాంధీజీకి నల్లజెండాలు చూపుతున్నారనీ చెప్పాడు తాను కూడా వాళ్ళతో పాటు నల్లజెండాలు చూపుతానన్నాడు ఆరోజు ఉదయం యాజ్ఞిక్ ఏమిచేసిందీ నాకు తెలియదు కాని ఆ సాయంకాలం విశ్వవిద్యాలయంలో గాంధీజీ కోసం పెట్టిన మీటింగులో యాజ్ఞిక్ గాంధీపాదాలు తగులుతూ కూర్చుని ఉండటం మేమంతా చూశాం

గాంధీజీలో వ్యక్తిగతమైన ఒక ఆకర్షణశక్తి ఉందనీ, అది అందర్నీ వివశులను చేస్తుందనీ చెప్పవచ్చు కాని యాజ్ఞిక్ గాంధీజీని గురించి తన విశ్వాసాలు మార్చుకున్నాడనుకోను వీధిలో ఏదన్నా ప్రమాదం జరిగితే ఆగిచూడకుండా ఉండటం ఎంత అసాధ్యమో గాంధీజీ దగ్గిరికి వెళ్ళకుండా ఉండటం అంత అసాధ్యం

గాంధీజీని నిత్యమూ చుట్టుముట్టినవాళ్ళు ఆయనలో ఉన్న ఈ శక్తికి గురి అయారే గాని ఆయనని అర్థం చేసుకోలేదు ఈ దరిద్రనారాయణుడు కోటీశ్వరులకే దర్శనం ఇచ్చాడు ఈ హిందూ మతాభిమాని మతసామరస్యం కోసమే ప్రాణత్యాగం చేశాడు ఇందులో అర్థం ఉంది

ఈ అర్థం భజనల ద్వారానూ, బొల్లి ఏడుపుల ద్వారానూ వ్యక్తం కాబోదు "ఒక మహాపురుషుడి కోసం దేశమంతా దుఃఖసాగరంలో మునిగిపోయింది" నిజమే కాని ఈ మహాపురుషుణ్ణి హత్యచెయ్యటానికి దేశం అన్నిమూలలా కుట్రసాగింది ఈ మహాపురుషుడి చావు గురించి ముందుగానే కరపత్రాలు తయారుచేయబడ్డాయి ఈ అశుభవార్త కోసం టెలిఫోనుల వద్ద కొందరు ఆత్రంగా వేచికూచున్నారు ఈ మహాపురుషుడు చచ్చిపోగానే సంతోషంగా మిఠాయి పంచుకున్నారు దేశంలో అనేకవేలమందికి– లక్షల మందికి– మహాత్ముడి చావు అత్యవసరమయింది

ఎందుచేత? ఈ లక్షలమంది రక్తదాహానికి ఒక్క మనిషి అడ్డంగా నిలబడ్డాడు సాంఘిక వాతావరణమూ, రాజకీయ వాతావరణమూ ప్రజా ద్రోహులకు అనుకూలంగా ఉన్నాయి జీవితంలో కుళ్ళు హెచ్చింది కుళ్ళులోనుంచి క్రిములు రాక ఏం చేస్తాయి? ప్రజాక్షేమానికి అనర్థదాయకమైన పరిస్థితులు సాగించగలందులకు గాంధీజీ హత్యకావటంలో నాకెంతో అర్థం స్ఫురిస్తుంది దేశంలో ఉన్న శ్రామికులూ, దరిద్రులూ, అనాథలూ సుఖపడేటందుకు రాజకీయవేత్తలు ఏం చేశారు? స్వాతంత్ర్యం వచ్చినాక ఈ ప్రజాసామాన్యానికి జీవితం మరింత దుర్భరమయింది తుపాకులు సర్వసామాన్యమైనాయి అహింస ఏనాడో చచ్చింది సత్యాన్ని లోతుగా పాతేశాం ప్రజాక్షేమానికి హానికలిగించే గుత్త పెట్టుబడిదార్లు, నరపాలకులూ అదుపుచేయబడలేదు ఉద్యోగం కావాలనటం, తిండి కావాలనటం, బట్ట కావాలనటం దేశద్రోహమయింది సాంఘికదోపిడి– అటువంటిది ఉందనే జ్ఞానం కూడా లేనట్టుగా మనం ప్రవర్తిస్తున్నాం – అది ఇప్పుడు విజృంభించింది ఈ దేశంలో ఈనాడు సామాన్య మానవుడై జీవించటంకంటె హేయమైనది లేదు ఈ వాతావరణంలో గాంధీజీ చావవలిసి వచ్చింది

"నేను గాంధీజీ వారసుణ్ణి" అని చెప్పుకోగల ఒక రాజకీయవాది గాని ఒక రాజకీయసంస్థ గాని దేశంలో లేదు గాంధీజీకి వారసులు నిరుపేదలు, అనాధలు, అశక్తులు, స్త్రీలు, పిల్లలు

అధర్మం ప్రబలి ధర్మచ్యుతి జరిగినప్పుడు అవతారపురుషుడు జన్మించి దుష్టులను శిక్షించి శిష్టరక్షణ చేస్తాడనేది కల్ల కృష్ణుడు నీచకిరాతకుడి చేతిలో చచ్చాడు గాంధీజీని చంపటానికి మరొక పరమ కిరాతకుడు కావలిసివచ్చింది తనను నాశనం చేసిన అధర్మం ఎటువంటిదో ప్రజలకు చూపటానికే అవతారపురుషులు ఉపకరిస్తారు గాంధీజీ మనకు తన మృతి ద్వారా హిందూ మతావేశపరుల నగ్న స్వరూపం చూపగలిగారు

గాంధీజీ ఆత్మకు శాంతికలగాలంటే రాజకీయవాదులూ దేశనాయకులూ గాంధీజీ హత్యానేరాన్ని తమమీద వేసుకోవాలి దేశాన్ని ప్రజలపరం చేయాలి రాజ్యాన్ని అనాధల అతినికృష్టుల రాజ్యం చేయాలి ధనికుల అధిక లాభాల కోసం ప్రజలు బలికావటం అంతం కావాలి ఆదర్శరహితమైన గూడుపురాణీ రాజకీయాలూ ప్రజల జీవితంలో స్థానంలేని మత సంపర్కాలూ తక్షణం నిర్మూలనం కావాళి

అదే దేశానికి విముక్తి మార్గం ఆ మార్గం తొక్కితేనే గాంధీజీ మృతికి ఒక అర్థం ఏర్పడుతుంది

ఆంధ్రమహిళ పక్షపత్రిక, ఫిబ్రవరి-మార్చి 1948

## 7. ప్రజాశక్తి

కొన్నిసత్యాలు అవగాహన చేసుకోవటానికి ఎంత సుగమంగా ఉంటాయో అంతగా వాటికి జీవితంలో ఆచరణ కనిపించకుండా ఉంటుంది జీవితం వాస్తవికపంథాలో లేకపోవటానికి నిదర్శనం ఇటువంటి సత్యాలే

జీవితం ప్రాణం లాంటిది ఏమాత్రం ప్రోత్సాహం ఉన్నా అది మొగ్గతొడిగి వికసించే ధోరణిలో ఉంటుంది "వెలుగు చీకటినీ, సత్యం అసత్యాన్నీ, ప్రాణం మృత్యువునూ అధిగమించడం నేను చూస్తున్నాను" అన్నాడు మహాత్మాగాంధీ

జీవితంలో, ముఖ్యంగా సామాజిక జీవితంలో, పురోగమన శక్తులు ఎల్లప్పుడూ అంతర్భూతమై ఉంటాయి వీటిని ప్రతి ప్రవక్తా, ప్రతి నాయకుడూ, ప్రతి విప్లవవాదీ, ప్రతి సంస్కర్తా అర్థం చేసుకోగలడు

దేశం అతి క్రూరమైన, అతి బలవంతమైన పరప్రభుత్వం వారి ఉక్కు సంకెళ్ళలో ఉండగానే గాంధీజీ ఈ దేశప్రజలలో ఉన్న అపారశక్తిని అనేకసార్లు ప్రకోపింపచేసి ప్రపంచదృష్టిని ఆకర్షించగల ఉద్యమాలు నడిపాడు ఆ ఉక్కుసంకెళ్ళు తెగిపడిపోయాయి కొద్దికాలం తోక ఝాడించిన సంస్థానాలవాళ్ళు దారికి వచ్చారు కొత్త రాజ్యాంగంలో సంస్థానాలూ, సంస్థాన యూనియనులూ రాష్ట్రాలతో సమం చేయబడ్డాయి

కానీ ప్రజాజీవితంలో ఏం ఫలితం కలిగింది? బ్రిటిషువారి నిరంకుశ పరిపాలన కొద్దిమంది అగ్రవర్గం వారినే బాధించిందా? కాని పక్షాన మామూలు ప్రజల జీవితం ఎందుకు

వికసించలేదు? నిరంకుశులైన సంస్థాన ప్రభువుల ఆధిపత్యం సంస్థాన ప్రజల జీవితాలని ఏమీ బాధించలేదా? కాని పక్షాన సంస్థాన ప్రజల జీవితం అదివరకుకన్నా అయోమయంగా ఎందుకున్నది?

ఏ దృష్టినుంచి చూసినా ప్రజలు ఈనాడున్నంత అధోగతిలో మరేనాడూ లేరన్నది స్పష్టమవుతున్నది వాడుక సరుకుల ఉత్పత్తి దేశంలో పూర్తిగా నిలిచిపోయి, దేశంలో ఉన్న పరిశ్రమలన్నీ అత్యున్నతంగా యుద్ధం నిమిత్తం పనిచేస్తూ దేశంలో అందరికీ రాబడి ఉండిన రోజుల్లో తప్పనిసరిగా ఇన్‌ఫ్లేషన్ ఏర్పడింది యుద్ధం అయిపోయింది దిగుమతులు ఆరంభమయ్యాయి వాడుకసరుకుల ఉత్పత్తి సాగింది స్టెర్లింగు విడుదల అయింది– ధరలు మాత్రం దిగలేదు సరిగదా, నానాటికీ హెచ్చిపోతున్నాయి ఒకవంక నిరుద్యోగం కూడా హెచ్చిపోతున్నది వందలు సంపాదించుకుంటున్నా మధ్యతరగతి వాళ్ళు మాడిపోతున్నారు ప్రజల పోషణ ఈవిధంగా ఉండగా ప్రజారక్షణకు గాను, పోలీసు బందోబస్తూ, పోలీసు ఖర్చూ హెచ్చించబడింది గ్రామసీమల్లో పోలీసుచర్యలు దారుణంగా ఉంటున్నాయి కాంగ్రెసు నాయకులు పదవులలో ఉండి గాంధీ దివ్యనామం ఉచ్చరించుతూ అతి హేయమైన ఆర్డినెన్సులూ శాసనాలూ చేశారు

దేశస్వాతంత్ర్యం వెంట ఇంకా ఈవిధంగా ప్రజాజీవితం మారిందంటే అది స్వాతంత్ర్యం తెచ్చిన వారికీ, స్వాతంత్ర్యానికీ కూడా తలవంపులే

స్వాతంత్ర్యం వెంట ఇంకా ఎన్నో సమస్యలు వచ్చాయి, నిజమే అందులో ఒకటి మనని ఇవాళ గుండెలమీద గాడిదతన్నులు తన్నుతున్నది అది పాకిస్తానులోని హిందువుల విషాద సమస్య అనేకవందల జనం పండిత నెహ్రూను కలకత్తాలో కలుసుకుని, “తూర్పుపాకిస్తానులోని హిందువులనందర్నీ ఇండియాకు రప్పించండి” అని ప్రాధేయపడ్డారు “సరే”నని స్పష్టంగా నెహ్రూ అనలేదు ఎందుచేత? వారందరినీ పోషించేభారం ప్రభుత్వం వహించగలదా అన్న ప్రశ్న కలుగుతుంది

ఇది ఆర్థికసమస్య ఈ ఆర్థిక సమస్యను గురించి ఒక్క సత్యం అందరమూ తెలుసుకోవాలి ఆదిమసమాజంలో మానవులు అనుక్షణమూ శ్రమిస్తూ కూడా తమ అవసరాలకు తగిన సంపదను తాము సృష్టించుకోలేని వ్యవస్థలో యుద్ధంలో తమకు చిక్కినవారిని చంపేసే వారు అది ఆనాటి ఆర్థికసమస్య కాని సంపదను సృష్టించే మార్గాలు అభివృద్ధి అయిన అనంతరం మానవుడు తన అవసరాలకే గాక ఇతరుల అవసరాలకు కూడా సరిపడేలాగు వస్తుసామగ్రిని ఉత్పత్తిచేసే వ్యవస్థ వచ్చి ఒక మురావాళ్ళు ఇంకొక మురాను ఓడించినప్పుడు చేజిక్కిన వారిని బానిసలుగా ఉపయోగించి వారి అవసరాలు తీరుస్తూ కూడా తాము శ్రమించకుండా జీవించగలగసాగారు ఆనాటినుంచీ ఈనాటివరకూ సంపదను సృష్టించే సాధనాలలో ఎన్ని పరిణామాలు కలిగాయో చెప్పతరం కాదు బానిసయుగం అయిపోయింది కాని మన ప్రభుత్వం వారు ఇవాళ శరణార్థుల పునరావాస సమస్యను కాందిశీకుల ఆస్తిసమస్యతో ముడిపెట్టకుండా ఆలోచించలేకపోతున్నారు ఎందువల్ల? ఈ విషయం నెహ్రూ మొదలైన మన నాయకులు దీర్ఘంగా ఆలోచించాలి

మనదేశంలో దున్నవలసిన పొలాలున్నాయి తవ్వవలసిన ఖనిజాలున్నాయి కోట్లకొద్దీ నిరుద్యోగులున్నారు సృష్టించవలసిన సంపద అనంతంగా ఉన్నది ప్రజలలో నానాటికి హెచ్చిపోయే నిరాశానిస్పృహల కింద అణిగి ఉన్న ప్రజాశక్తి ఉన్నది ఈ ప్రజాశక్తి ఎందుకు పైకి రాదు? ఎవరు అడ్డం? "దేశంలో ఉండే జనానికంతకూ పనులు చూపండి కూటికే చాలని జీతాలతో పనిచెయ్యటంకన్న సమ్మెలు చెయ్యటమే మానుషమని కార్మికులు భావించకుండా చెయ్యండి మీ లాభాలకన్న కార్మికుల సహకారమే అధికోత్పత్తికి ఎక్కువ అవసరం" అని నెహ్రూ పెట్టుబడిదార్లతో చెబితే వాళ్ళేమంటారు?

ప్రజాశక్తి అణుశక్తి వంటిది దాన్ని శాస్త్రీయంగా కూడగట్టినట్టయితే సర్వశక్తులూ ప్రకటిస్తుంది అది చెయ్యలేని పని ఉండదు నెహ్రూకు ఆ శక్తుల ప్రదర్శనం కావాలి అందరూ ప్రభుత్వాన్ని బలపరిస్తే ఏ సమస్యనైనా పరిష్కారం చేయగలనంటాడు నెహ్రూ కాని ప్రజాశక్తిని కూడదీయడానికి ధర్మపన్నాలు చెప్పడం మినహాగా నెహ్రూ చేసిందేమిటి? ఏమీ లేదు ప్రజలు ప్రత్యక్షంగా అనుభవించే కష్టాలు తీర్చటానికి ఆయన ఎవరి మీద ఆధారపడ్డాడు? ప్రజాద్రోహులూ, స్వార్థపరులూ అయిన పెట్టుబడిదార్ల మీద ఈ దుష్టశక్తులతో నెహ్రూ రాజకీయ చదరంగం ఆడుతున్నాడు వాళ్ళు పన్నులు ఎగగొట్టటానికి ప్రయత్నించారు కంట్రోళ్ళ విషయంలోనూ ప్రభుత్వాన్ని తీవ్రంగా ధిక్కరించి ప్రతిష్టంభన తీసుకురావటానికైనా తయారుగా ఉన్నారు దొంగవ్యాపారాలు యధేచ్ఛగా సాగించిన వీరిని నెహ్రూ ఉరితీయలేదు సరికదా, కాశ్మీరులో షేక్‌అబ్దుల్లా చేసినట్లు వీధుల్లో నిలబెట్టి బరికెలతో అయినా బాదించలేదు పైపెచ్చు దొంగవ్యాపారాలను రుజువు చెయ్యటం అసాధ్యమని కూడా నెహ్రూ ఒప్పుకున్నాడు ప్రభుత్వమూ ధనికవర్గాన్ని కాపాడటానికి ప్రయత్నాలు చేస్తున్నదన్న భావం దేశంలో ప్రతివాడికీ ఉన్నది

అభివృద్ధి పథకాలన్నీ కట్టిపెట్టి కాంగ్రెసు ప్రభుత్వం రక్షణ ఖర్చు కింద అంతులేని ద్రవ్యం వినియోగం చెయ్యటం కూడా తప్పే నెహ్రూ ప్రపంచశాంతి కోసరం తాపత్రయ పడుతున్నవ్యక్తి ఆయన యుద్ధ విముఖత్వాన్ని ఎవరూ సంశయించరు కనుక ఈ రక్షణఖర్చు మరింత అర్ధరహితమవుతున్నది ఒకవేళ పాకిస్తాను దౌష్ట్యం తప్పనిసరిగా యుద్ధానికే దారితీస్తుందనుకున్నా నెహ్రూకు కావలసింది ప్రజల అండ

నెహ్రూ చేస్తున్న అన్ని పొరపాట్లకన్నా ప్రజల అండ కోల్పోవటం పెద్దది ప్రజాద్రోహీ, కిరాతకుడూ అయిన నిజామును పదవిలో ఉండనిచ్చి హైదరాబాదు ప్రజలందరి అభిమానాన్నీ కోల్పోతున్నాడు విశాలాంధ్ర స్థాపనకు పిడికెడు అరవలూ, సంయుక్త మహారాష్ట్రం స్థాపనకు పిడికెడు గుజరాతీలు, ఐక్యకర్నాటక స్థాపనకు పిడికెడు మైసూరు సంస్థానాధికారులూ అడ్డం ఉండటం వల్ల మూడు మేటిరాష్ట్రాల ప్రజల ఆదరాన్ని నెహ్రూ ప్రభుత్వం కోల్పోతున్నది చిట్టచివరకు, ప్రతిరాష్ట్రంలోనూ ఉండే కాంగ్రెసు వర్గాలలో గల చీలికలనూ, కలహాలనూ, అధికారపు పోటీలనూ అయినా అగ్రనాయకులు పరిష్కరించలేకపోయినారు

"ప్రభుత్వం విమర్శను ఆహ్వానిస్తుంది కాని విమర్శించేవారు ప్రభుత్వంవారి విధానాలను గుర్తించి విమర్శించాలి" అంటాడు నెహ్రూ ఈ విధానాలేమిటో, వీటి అంతర్యమేమిటో ఊహించటానికి ఎవరి మేధస్సూ చాలటం లేదు నెహ్రూ ఎప్పుడు మాట్లాడినా తనను

నలువైపులకూ లాగే శక్తుల నగ్నస్వరూపాన్ని ప్రదర్శిస్తున్నట్టు కనిపిస్తుంది కాని తాను దేశానికి ఏర్పాటుచేసిన కార్యక్రమం ఏమిటో తెలియదు తాను ధనికవర్గంతో ఆడే రాజకీయచదరంగంలో జనసామాన్యం పావులకింద చచ్చిపోతున్నారని అయినా నెహ్రూ గుర్తించినట్లు కనబడదు

తెలుగుస్వతంత్ర, 17-3-50

# 8. నేటి మన సాంఘిక దుస్థితి

ప్రస్తుతం మన రాజకీయ స్వాతంత్ర్యాన్ని మీద వేసుకుని ఇల్లు చక్కబెట్టటానికి ప్రయత్నిస్తున్న అగ్ర కాంగ్రెసు నాయకులస్థితి చూడబోతే ఈత కొత్తగా నేర్చుకొనేవాడు సముద్రంలో భయంకరమైన సొరచేపలతోనూ, తిమింగలాలతోనూ పోట్లాడుతూ బ్రహ్మాండమైన నావను తాడుతో ఒక హొడ్డుకు లాక్కుపోవటానికి ప్రయత్నిస్తున్నట్టుగా ఉన్నది స్వతంత్ర భారతంలో ప్రజాజీవితంలో కలగదగిన పరిణామాలను గురించి వారికి విస్పష్టమైన అభిప్రాయాలున్నాయనే అనుకున్నా, వారు వాటికోసం కృషి చేసే స్థితిలో ఉన్నట్టు లేరు కేవలం రాజకీయ సమస్యలే వారిని పీల్చి పిప్పిచేస్తున్నాయి ఒక్క పాకిస్తాను సమస్యే చాలు ఊపిరిసలపనివ్వకపోవటానికి అల్పసంఖ్యాకుల భద్రతకు తగిన బందోబస్తు రెండుదేశాలలోని మతోన్మాదులనూ, యుద్ధోన్మాదులనూ హద్దులో ఉంచటమూ, దేశ విభజన వల్ల దారుణాలకూ, అమానుషమైన అనుభవాలకూ గురి అయి, ఇళ్ళూ వాకిళ్ళూ ఆస్తిపాస్తులూ పోగొట్టుకుని అగచాట్లు పడుతూ, దుఃఖంతోనూ ఆగ్రహంతోనూ నైరాశ్యంతోనూ కుమిలిపోయే కాందిశీకులను అనునయించి, వారొక పెద్ద రాజకీయ సమస్యగాను, చేసే ప్రయత్నాలకు అవాంతరంగానూ పరిణమించకుండా చూడటమూ, మైనారిటీల విషయంలో సాధించే సామరస్యం కాశ్మీరు సమస్య దగ్గిర విషమించకుండా చూడటమూ, రెండుదేశాల మధ్యా మారకం రేటుతగాదా, దానితో బాటు వాణిజ్యం తగాదా పరిష్కారమయేటట్టు చూడటమూ – పాకిస్తాను సమస్యలో ఇన్ని ఇమిడిఉన్నాయి

దేశీయ రాజకీయాల విషయంలో కూడా కాంగ్రెసు నాయకులు తలనొప్పి కలిగించే సమస్యలనే ఎదుర్కొంటున్నారు కాంగ్రెసు సంస్థే ఒక రొమ్ముల కుంపటి దాదాపు అన్ని రాష్ట్రాలలోనూ కాంగ్రెసు వర్గాలలో తీవ్రమైన చీలికలూ, కక్షలూ, వాటి తాలూకు సమస్యలూ ఉన్నాయి ఈ సమస్యల వల్ల రాష్ట్రాలలో కాంగ్రెసు నాయకులకు ఏ విధమైన నైతికబలమూ, ప్రజలలో పలుకుబడీ, పరిపాలనలో దక్షతా లేకుండా పోతున్నది దేశమంతటిమీదా కూడా కాంగ్రెసు అగ్రనాయకులు సమగ్రబాధ్యతలు వహిస్తూ, రాష్ట్రాలలో తలయెత్తే ఈ సమస్యలు కేవలమూ కాంగ్రెసుపార్టీ వ్యవహారాలకు సంబంధించినటువంటివేనన్నట్టు భావిస్తున్నారు ఈ వైఖరివల్ల కాంగ్రెసు ప్రజలకు మరింత దూరం కావటం మటుకే జరుగుతున్నది ఒకవంక దేశప్రజలందరి రాజకీయ, ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక జీవితానికి తామే ఉత్తరవాదులమని చెప్పుకుంటూ కాంగ్రెసు హైకమాండువారు రాష్ట్రాలలో ఏర్పడిన కాంగ్రెసుసమస్యల విషయంలో పదవులలో లేని కాంగ్రెసు నాయకులపై తమ దాష్టీకం చూపటమూ, కాంగ్రెసు పాలకులపై తేబడే అభియోగాలు కాంగ్రెసు అంతర్వ్యవహారాలుగా దాచిపెట్టటమూ అర్థంలేని పనులు

ఇది కూడా ఎప్పటికైనా కాంగ్రెసు అగ్రనాయకులు తెలివితేటలతో సరిచేయవలసిన రాజకీయ సమస్యే మరొక రాజకీయ సమస్య కమ్యూనిజం ఇది ఒక్క ఇండియాలోనే కాదు, ఇంకా అనేక దేశాలలో తీవ్రంగా ఉన్నది మలయాలో బ్రిటిషు అధికారులనూ ఈ సమస్య గట్టిగా ఊపేస్తున్నది ఇక బర్మా వంటి దేశం సంగతి చెప్పనవసరం లేదు అయితే మన కాంగ్రెసు ప్రభుత్వం మనదేశంలో కమ్యూనిజమును ఒక రాజకీయసమస్యగా గణిస్తున్నట్టు కనబడదు, ఈ పని మలయాలో బ్రిటిష్‌వారు చేసినదే వారు కమ్యూనిస్టులను ఇప్పటికీ బందిపోటులనే అంటున్నారు అచ్చమైన బందిపోటులను పోలీసుచర్యలతో లొంగదీయవచ్చు కాని కమ్యూనిస్టులు అచ్చంగా బందిపోటులూ, హంతకులూ అన్నంతమాత్రం చేత కమ్యూనిజం రాజకీయతత్వాన్ని కోల్పోదు ప్రస్తుతం మనదేశంలో ఉండే కమ్యూనిస్టు విజృంభణను రాజకీయంగా ఎదుర్కోక, దాన్ని అణచటానికి కేవలం తుపాకుల మీదా, పోలీసుల మీదా ఆధారపడటం గాంధీజీ సత్యాహింసలు రెంటికీ స్వస్తి చెప్పటంలో కనిపిస్తుంది పాశ్చాత్య దేశాలవారు కమ్యూనిజం కేవలమూ ఆర్థిక సమస్యగా భావించి, దారిద్ర్యమూ, ఆకలి కమ్యూనిజం వ్యాప్తికి దోహదం చేస్తాయని చెబుతున్నారు అదీ అర్ధసత్యమే అయినా కమ్యూనిజమును సాంఘిక సమస్యగా భావించటంకంటె చాలా నయం ఇదే సమస్యను బ్రిటిషు బలాలు మలయాలోనూ, ఫ్రెంచి బలాలు ఇండో-చైనాలోనూ ఎందుకు పరిష్కరించలేకుండా ఉన్నాయో మన ప్రభుత్వం కాస్త యోచించాలి యోచించినట్టయితే మన దేశంలో పోలీసు బలాలను హెచ్చించినా కూడా ఈ సమస్య ఎందుకు తీవ్రతరమవుతున్నదీ అర్థం కావచ్చు

పైన చెప్పిందంతా రాజకీయపు గొడవ ఇది సామాన్య మానవులను బాధించేది కాదు సామాన్యమానవులు కోరేది సాంఘిక పరిస్థితులలో ఆరోగ్య పరిణామాలు అటువంటి పరిణామాలేవీ కంట్లో కలికం వేసుకున్నా కనిపించటం లేదు మామూలు మనుష్యులకు బతుకు రాను రాను దుర్భరమైపోతున్నది సామాజిక దుష్టశక్తుల స్వైరవిహారం సర్వత్రా కనిపిస్తున్నది అధికారుల అవినీతీ, స్వార్ధపరతా, సామాన్య ప్రజల కష్టాల మీదా, సాంఘిక నీతిపట్లా అనాదరమూ ప్రబలిపోతున్నాయి సాంఘిక చైతన్యం గల లలితకళలను వ్యాపారధర్మం తుడిచిపెట్టేస్తున్నది ప్రజలలో మూఢవిశ్వాసాలు హెచ్చిపోతున్నాయి ఫాసిస్టు మత రాజకీయవాదుల ప్రభావమూ, దొంగ సన్యాసుల ప్రభావమూ, ప్రజలమీద హెచ్చిపోతున్నాయి భౌతికజీవితం భ్రష్టయిపోతున్న కారణం చేత చౌకబారు ఉపదేశికులు చెప్పే శుష్కవేదాంతాల మీదా, జ్యోతిష్కులు మొదలైనవాళ్ళ వంచనమీదా ప్రజలకు గురి కుదురుతున్నది ప్రజలలో సాంఘిక చైతన్యం తరిగిపోయి, వారు నిరాశకూ, నిస్పృహకూ గురి అయి, నిర్లక్ష్యం అవలంబించుతున్నారు వ్యక్తుల ఆత్మగౌరవానికి గాని, ప్రాణానికి గాని, సాంఘిక నీతినియమాలకు గాని చిన్నమెత్తు విలువలేకుండా పోతున్నది కొన్నివర్గాలవారిలో చావటానికీ, చంపటానికీ కూడా తెగింపు జాస్తి అవుతున్నది ఎటువంటి సాంఘిక పరిస్థితులవల్ల వ్యక్తులీ పరిణామాలకు గురి అవుతారో ప్రభుత్వం గుర్తించటానికి ప్రయత్నించక, ప్రజలమీద మారణాస్త్రాలను యధేచ్ఛగా ఉపయోగిస్తూ సాంఘిక జీవితం ప్రజలలో ఏ అలక్ష్యాన్నయితే కలిగిస్తున్నదో ఆ అలక్ష్యాన్నే ప్రభుత్వం పెంచుతున్నది

ఈవిధంగా సాంఘిక పరిస్థితిని గురించి ప్రభుత్వం ఉపేక్ష వహించి ఒక్క సమస్యను కూడా పరిష్కరించలేదు మనలను బానిసత్వంలో ఉంచినవారు మన ప్రవర్తనను తుపాకులతో శాసించి మన మనఃప్రవృత్తులనూ, సాంఘిక పరిస్థితులనూ ఉపేక్షించారు కాని ప్రజాస్వామిక సూత్రాలమీద ఆధారపడే ప్రజాప్రభుత్వం ప్రజల జీవితాలనూ, ప్రజల మనస్తత్వాన్నీ ఉపేక్షించరాదు ఒకవంక అతి హేయమైన దుష్టసాంఘిక శక్తులను నిగ్రహించే బలంలేక వాటికి తలవొగ్గే ప్రజలు మరొకవంక ప్రజాప్రభుత్వాలను బలపరచలేరు ఎంతసేపూ మన పత్రికలూ ప్రభుత్వమూ కమ్యూనిస్టులను తప్పించి దుష్టసాంఘికశక్తులను చూడలేకుండా ఉన్నారు అసహాయస్థితిలో ఉన్న ప్రజలను దోచుకునే దొంగవ్యాపారస్తులూ, అధికారాలను దుర్వినియోగపరచే దొంగదేశభక్తులూ, ప్రజల మూఢత్వాన్ని రెచ్చగొట్టి వాళ్ళను పశుప్రాయులుగా చేసే కపట మతవిక్రేతలూ, హేయమైన స్వరూపాలను పత్రికల ద్వారానూ, వెండితెర మీదనూ, ప్రచారం చేసి సంచులు నింపుకునే కళావ్యాపారులూ యదార్థమైన దుష్టసాంఘిక శక్తులని గుర్తించబడిన నాడు మన దౌర్భాగ్య ప్రజాజీవితానికి విముక్తి ఉన్నది కనీసం కమ్యూనిజం ప్రతిఘటింపబడుతున్నది అది కొన్ని ప్రాంతాలనే ఆశ్రయించి ఉన్నది దానిని సాంఘిక దుష్టశక్తి అనటం ప్రచారం దృష్ట్యా వీలుగా ఉండవచ్చు గాని, ఆ ప్రచారం మూలంగా కమ్యూనిస్టులకు అండగా ఉండే సాంఘికశక్తులు గుర్తించబడకపోవటం జరుగుతుంది కాని ఈ దుష్ట సాంఘికశక్తులు సర్వత్రా వ్యాపించి ఉన్నాయి ఇవి సంఘం యొక్క రక్తమాంసాలను హరించి ప్రజాస్వామిక శక్తులకే చచ్చువాతం తెచ్చిపెడుతున్నాయి పారతంత్ర్యంలోకన్న స్వాతంత్ర్యంలో ఈ దుష్టశక్తులు విజృంభించటం మరింత శోచనీయం

తెలుగు స్వతంత్ర , వారపత్రిక, 28-4-50

## 9. ఇది అవినీతి కాక మరేమిటి?

'తెలుగుస్వతంత్ర' సెప్టెంబరు 1 సంచికలో సి ఇ.ఆర్ గారు 'ప్రభుత్వము సంఘములోని నైతిక విలువలు' అన్న వ్యాసం రాస్తే అది 'విపరీత అర్థాలకు తావిస్తోంది' అని శ్రీ కనకమేడల వెంకట్రామయ్యగారు మరుసటి సంచికలో రాశారు

మాటవరసకు సి ఇ.ఆర్ జవహర్లాల్ నెహ్రూ అయి ఉండి, 'కాంగ్రెసు కుళ్ళు కంపు కొడుతున్నది' అని గాని, హరికృష్ణ మహెతాబ్ అయి ఉండి 'దొంగ వ్యాపారస్తులు సంఘాన్ని చెండుకు తింటున్నారు' అని గాని, టాండన్ అయి ఉండి 'కాంగ్రెసు చావో బతుకో తేలుస్తాం' అని గాని అని ఉంటే శ్రీ వెంకట్రామయ్య గారికి ఎట్టి అపోహలు కలిగేవి కాదని మనం ఊహించవచ్చు! నెహ్రూ, పటేల్, కృపలానీ, పట్టాభి, టాండన్ –ఒకరేమిటి? అందరు కాంగ్రెసు అగ్రనాయకులూ, ఇంకా చిల్లర నాయకులూ నెత్తీ నోరూ కొట్టుకుని కాంగ్రెసులోనూ, ప్రభుత్వంలోనూ, వ్యాపారస్తులలోనూ, ప్రజలలోనూ అవినీతి ప్రబలిందని నిత్యమూ వాపోతుంటే ఆ విషయమై ఎవరైనా శాస్త్రీయంగా చర్చించడం ఇష్టంలేని వారున్నారని స్పష్టమవుతున్నది మన నాయకులంతా రోజూ ఈ అవినీతి పారాయణ చెయ్యడమే అవినీతి నివృత్తికి నిదర్శనమని నమ్మే అమాయకులు కూడా దేశంలో ఉన్నారు

శ్రీ వెంకట్రామయ్యగారు రాసిన దానిలో నిష్కల్మషమైన కాంగ్రెసుభక్తి తప్ప వాస్తవ పరిస్థితులను గురించిన జిజ్ఞాస కనిపించడం లేదు "సంకుచితత్వం, స్వార్థం, కాంగ్రెసు హయాంలో పెరిగిపోయినాయ"ని విమర్శించుతూ (సి ఇ ఆర్ గారు) "తమకున్న స్వార్థప్రయోజనాన్ని బయటపెట్టుకున్నారు " అని ఆయన అంటున్నారు కాంగ్రెసు హయాంను విమర్శించి ఎవరుగాని సాధించే స్వార్థ ప్రయోజనమేమిటి? కాంగ్రెసు వర్గాలలోనే అధికారం కొరకు కొట్లాడుకుంటూ రచ్చలెక్కి కాంగ్రెసును నడివీధిలోకి ఈడ్చిన వారికే పైనున్న పూజార్ల కటాక్షవీక్షణ లేకపోతే ఆవగింజంత లాభించటం లేదు ఈ సంగతి వెంకట్రామయ్యగారు ఎరుగరా?

కాంగ్రెసు ప్రభుత్వ హయాంలో స్వార్థ సంకుచితత్వాలు హెచ్చిపోయిన మాట అబద్ధమా? కాంగ్రెసు స్వాతంత్ర్య పోరాటంలో చేతులు కలిపినవాళ్ళు, కలిపినట్టు నటించినవాళ్ళూ స్వలాభాలకు ఎగబడ్డారు ఇవాళ గుండెమీద చెయ్యివేసుకొని 'మాకు స్వరాజ్యం వచ్చింది' అని చెప్పగల వాళ్ళెవరు? ప్రభుత్వానికే ఎసరుపెడుతూ, ప్రభుత్వశాసనాలను ధిక్కరిస్తూ, ప్రభుత్వాధికారుల చేతుల్లో ముడుపులు, కళ్ళలో దుమ్ముకొడుతూ, సరుకులు దాస్తూ, ధరలు పెంచుతూ ఏలాటి దెబ్బలకూ ఏ పోలీసు కాల్పులకూ గురికాకుండా తప్పించుకు తిరుగుతున్నదెవరు? పన్నులెగవేసినందుకు విచారణసంఘాన్ని నియమించి ఎంత ఖర్చు చేశారు? దాని ద్వారా ఎన్నిపన్నులు రాబట్టారు? పన్నులెగవేసినవారు మంచిదారికి రావటానికి ఏయే వీళ్ళు కలిగించారు? ఎంతమంది పన్నులెగవేసిన వాళ్ళను శిక్షించారు? చివరకు విచారణసంఘం ఏమయింది? బెంగాలు క్షామంలో శవానికి పదివేల రూపాయలు గడించిన తిండిదొంగలను చెట్టుచెట్టుకూ ఉరితీయాలన్న నెహ్రూ తన హయాంలో ఎంతమంది తిండిదొంగలను ఉరితీశాడు? పంచదార సిండికేటులో ఎంతమందికి శిక్షలు విధించబడ్డాయి?

ఈ ప్రశ్నలు వేలసంఖ్యలో వెయ్యవచ్చు కాని వీటికి శ్రీ వెంకట్రామయ్యగారు తమ అంతరాత్మకు తృప్తికలిగించే సమాధానాలివ్వలేరని కూడా చెప్పగలను సి ఇ.ఆర్ చిలవలూ పలవలూ నిర్మించవలసిన అగత్యం లేదు ఈనాటి రాజకీయ, సాంఘిక, ఆర్థిక అవినీతి మహావృక్షంలాగ కళ్ళ ఎదుట నిలబడి ఉన్నది

కాంగ్రెసు నాయకుల మీద సామాన్యప్రజలకున్న ప్రేమ ఎటువంటిదో శ్రీ వెంకట్రామయ్యగారికి తెలిసే ఉంటుంది అటువంటి కాంగ్రెసే తప్పులు చేస్తే ప్రజలు క్షమించలేకపోయారు కాని ఈనాడు కాంగ్రెసు పరిపాలన గురించి కాస్త ఇంగిత జ్ఞానం ఉన్నవాళ్ళను అడిగి చూస్తే వారేమంటున్నదీ తెలుస్తుంది

ఎన్నికలముందు కాంగ్రెసు చేసిన వాగ్దానాలన్నిటినీ గంగపాలు చెయ్యటం – భాషా రాష్ట్రాలు, భారీ పరిశ్రమలు జాతీయం చెయ్యడం, భూసంస్కరణలు మొదలైనవి వాయిదా వెయ్యటం పొరపాటు అనిపించుకోదు ప్రజల యోగక్షేమాలదృష్టితో చూసే వారికి అది అవినీతి అనిపిస్తుంది

ఆహారవిషయం తీసుకున్నట్లయితే అంతకంటె ప్రధానమైన సమస్య ఇంకొకటి లేదు ఆహారం దిగుమతికింద ఏటా అనేక ప్రాజెక్టులకు సరిపడే ధనం – ఎక్కువభాగం డాలర్ల రూపేణా

ఖర్చుచేస్తున్నాం కనుక ఇది అతిముఖ్యమైన ఆర్థిక సమస్య కూడాను దీన్ని గురించి కాంగ్రెసు ప్రభుత్వం ఏం చేసింది? ఇవాళ దున్నేవాడికి భూమి ఉన్నదా? లేదు జమీందారుల రద్దుకు పరిహారం అడ్డం పెట్టింది ఆ పరిహారం తలబరువయ్యేసరికి జమీందారుల రద్దుద్వారా ఆహారసమస్య పరిష్కరించటంకంటె ఈ జమీందార్లకు ముడుపులు చెల్లించటం ప్రధాన సమస్య అయింది జమీందార్లు తమ పొలాలను స్వాధీనం చేసుకుంటూంటే అడ్డిన రైతులను కాంగ్రెసు పోలీసులు కాల్చిచంపారు చచ్చినవాళ్ళందరినీ కమ్యూనిస్టుల్ని చెయ్యటం క్షణంలో సగం

ఇండియా సర్వ స్వతంత్ర రిపబ్లిక్ అయి ఉండిన్నీ, వచ్చేరాబడిలో సగం 'రక్షణ'ఖర్చు చేస్తూ ప్రాణావసరమైన ప్రాజెక్టులు మొదలయినవి వాయిదా వేస్తూ బీదరుపులు అరుస్తున్నది ప్రభుత్వం ఈ భయంకరపరిస్థితి గురించి చిలువలూ, పలవలూ కల్పించవలసిన అవసరమేమున్నది?

సి ఇ.ఆర్ 'సుభాషితం' కింద పోలీసు కాల్పులను శ్రీ వెంకట్రామయ్యగారు ప్రస్తావిస్తున్నారు పోలీసుకాల్పులకు కమ్యూనిస్టులు ఒక్కరే కారణమని ఆయన విశ్వాసంగా కనిపిస్తుంది బొంబాయి సమ్మె సందర్భంలో కాల్పులు జరిగినట్లు వింటున్నాం కర్షక కార్మికులూ, విద్యార్థులూ ప్రభుత్వ విధానాలపట్ల ఏ మాత్రం అసమ్మతిచూపినా తమ హక్కులకోసం ఏ మాత్రం ఆందోళన చేసినా పోలీసులు తుపాకులతో సత్కరిస్తున్నారు అటువంటప్పుడు శ్రీ వెంకట్రామయ్యగారు "దోపిడీలలో పాల్గొన్నారని నిర్ధారణగా తేలినవారినే పోలీసులు కాల్చివేశారని సి ఇ.ఆర్ గారికి గాని స్వతంత్ర సంపాదకులకు గాని తెలియదా?" అని అమాయకంగా అడుగుతున్నారు కాని ఆయన మరుక్షణంలోనే ఇంతమాత్రం చేత పోలీసు దౌర్జన్యాలను సమర్థిస్తున్నానని మాత్రం నామీద నిందవేయద్దు అని భుజాలు దులుపేసుకుంటున్నారు అందుచేత ఆయన అమాయకత్వం కపటంగా కనపడుతున్నది

అసలే ఆర్థికంగా సంక్షుభితమై ఉన్నదేశంలో అశాంతిని రేకెత్తించుతూ అరాచకానికి దారితీసే పరిస్థితులను కల్పించే దుండగీంద్రను గురించి శ్రీ వెంకట్రామయ్యగారు నేర్చుకోవలసిన సత్యం ఒకటున్నది తిండికోసమూ బట్టకోసమూ ఆందోళన సాగించినా అరాచకం ఏర్పడే పరిస్థితి దేశంలో ఉన్నదంటే దానికి ప్రభుత్వానిదే బాధ్యత అని ఆయన తెలుసుకోవాలి కాటూరు యెలమర్రుల్లో కాంగ్రెసువారు అరెస్టయినారని సి ఇ ఆర్ చెప్పినది ఒక వాదనగా శ్రీ వెంకట్రామయ్యగారికి కనిపించకపోవడంలో ఆయనకీ విషయం తెలియదని స్పష్టమవుతూనే ఉన్నది కాంగ్రెసు పోలీసు 'నేను కాంగ్రెసువాణ్ణి కమ్యూనిస్టును కాను' అని అరిచే వాణ్ణి 'అయితే మరి రెండుతన్నులు తిను' అని తన్నటం జరిగిందంటే, దానికి కాంగ్రెసు అభిమానులే విచారించాలనీ, కాంగ్రెసు అభిమానులు కానివారు సంతోషించాలనీ అనుకొనే వెంకట్రామయ్యగారి రాజకీయ విజ్ఞానం వింతగా ఉన్నది అందుకనే ఆయనకు ప్రజలు తమ కనీస హక్కులకుగాను చేసే పోరాటం అరాచక చర్యలుగా కనిపిస్తున్నది నానాటికీ ప్రజాజీవితం క్షీణించిపోతున్నప్పటికీ దేశంలో ఎవరూ కిక్కురుమనకుండా ఉంటే శ్రీ వెంకట్రామయ్యగారు చాలా సంతృప్తిపడుతారులా ఉంది

'ఈనాడు అమలులో ఉన్న ఆర్థిక వ్యవస్థ, నైతిక జీవనం ఈనాటివి కావు ' అందుచేత వీటి శిథిల పతనాలకు కాంగ్రెసువారు కాని, కాంగ్రెసు ప్రభుత్వం గాని బాధ్యత వహించజాలవు'

అని శ్రీ వెంకట్రామయ్యగారు తీర్పు చెప్పేశారు అయితే కాంగ్రెసూ, కాంగ్రెసు ప్రభుత్వమూ దేనికి బాధ్యత వహిస్తారో ఆయన చెప్పగలరా?

ఇవాళ అనేకదేశాలలో ముఖ్యంగా తూర్పుయూరపు చైనాలలో ఉన్న ఆర్థిక నైతిక వ్యవస్థలు నిన్నటివి కావు అక్కడ జరిగిన మార్పులకు అక్కడి ప్రభుత్వాలు పూర్తిబాధ్యత వహిస్తున్నాయి స్వయంసేవక ఫాసిస్టులను వేటాడటంలో ఒకనీతి, కమ్యూనిస్టులను వేటాడటంలో మరొకనీతీ, ధనికుల కుళ్ళు కప్పటంలో వేరొకనీతీ చూపటం నేర్చిన కాంగ్రెసు ప్రభుత్వం, ఉన్న పరిస్థితికి బాధ్యత వహించకుండా నేర్చుకుంటే బాగుంటుందేమో ఇండియా బాగుపడటానికి అంతర్జాతీయ పరిస్థితి అడ్డొచ్చిందంటే శ్రీ వెంకట్రామయ్యగారు సగం ప్రపంచ గురించి ఏమీ ఎరగరన్నమాట ఈ అర్థజ్ఞానమే మనకొంప ఏనాటికైనా తీస్తుంది

ఇండియాలో ఫాసిజం ఉన్నదంటే శ్రీ వెంకట్రామయ్యగారు సహించలేకుండా ఉన్నారు ఏ స్వరూపంలో అయితే ఆయన ఫాసిజమును గుర్తిస్తారో తెలియదు ఇవాళ ఇండియాలో ఒక విచిత్రమైన రాజకీయ పరిస్థితి ఉన్నది దానిని రాజకీయాభిలాషులందరూ అర్థం చేసుకోవాలి మన రాజ్యాంగం బలమైన కేంద్రప్రభుత్వాన్ని నిర్దేశిస్తున్నది దేశపునర్నిర్మాణానికి గాను బలమైన కేంద్రప్రభుత్వం ఉండాలని రాజ్యాంగ నిర్మాతలు అధికారాలను బాగా కేంద్రానికి కట్టబెట్టారు కాని ఇవాళ కేంద్రంలో ఉన్న ప్రభుత్వం అతి దుర్బలమైనది ఒక ముఖ్య సమస్యనైనా జయప్రదంగా పరిష్కరించిందని వేలుమడచి చెప్పటానికి లేదు ఈమధ్య పార్లమెంటులో ఒక సభ్యుడు ప్రభుత్వాన్ని సవాలు చేశాడు 'ప్రభుత్వానికి ఎన్ని అధికారాలైనా ఇస్తాం కాని ప్రభుత్వం అసమర్థంగా ఉన్నది' అని ఆయన ఆక్షేపించాడు ఇన్ని అధికారాలు కట్టబెట్టించుకొన్న ప్రభుత్వం అసమర్థంగా ఎందుకున్నది? ఈ అధికారాలు కొన్ని వర్గాలవారికి పంచిపెట్టబడుతున్నవి కనక! ఆ వర్గాలవారెవరు? ప్రత్యక్ష ప్రజాద్రోహులు ఒక్క ఉదాహరణతో దీన్ని నిరూపించవచ్చు ప్రజారక్షణ శాసనాలకింద పౌరులపై ప్రభుత్వం అంతులేని అధికారాలు చేపట్టి వాటిని పోలీసుశాఖ పరం చేసింది! ఈ పోలీసుశాఖ ధ్వజమెత్తింది బీదలమీదా, శ్రామికుల మీదానూ ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టంలో అమానుషమైన సెక్షనులు ప్రవేశపెట్టారు ఆ సెక్షనులు ఏయే వ్యక్తులమీద అమలుచేయాలో పోలీసు వగైరాశాఖలకు వదలబడింది ఇటువంటి సెక్షనులను సుప్రీంకోర్టు అక్రమంగా ప్రకటించినంత మేరకు దేశంలో ప్రజాస్వామికం ఉన్నదని ఒప్పుకోవచ్చు కాని ప్రజాస్వామిక ప్రభుత్వం ప్రజలవద్ద అంతులేని అధికారాలు పుచ్చుకొని వాటితో ప్రజల సమస్యలు పరిష్కరించకపోగా వాటిని సంకుచిత వర్గాలపరం చేస్తున్నదంటే ఫాసిజంకు చక్కని పునాది ఉన్నదనటానికి సందేహపడనవసరం లేదు

శ్రీ వెంకట్రామయ్యగారన్నట్టు దేశం యొక్క ఆర్థికస్థితి బాగుచెయ్యటానికి ప్రభుత్వం కృషి చేస్తుంటే ఇంత దరిద్రదేశంలో దాని ఫలితాలు విరుద్ధధోరణిలో కనిపిస్తూ ఉండటం అతి విచిత్రమైన సంగతి ఎందుకంటే, ముందుకు వచ్చిన దేశాలలో పెద్ద అభివృద్ధి కనబడేలాగు చేయటం కష్టం కావచ్చు కాని పూర్తిగా అధోగతిలో ఉన్నచోట కించిత్తయినా కృషిఫలితం కనిపించకపోవటానికి కారణం కనబడదు నానాటికీ ప్రజాజీవితం క్షీణిస్తున్నదని ప్రభుత్వం ప్రకటించి ఎన్నోరోజులు కాలేదు! ఈ ప్రకటన ప్రజాస్వామ్యానికి ఉత్సాహం చేకూర్చేది మాత్రం కాదు

తెలుగుస్వతంత్ర వారపత్రిక, 22-9-1950

# 10. కప్పిపెట్టబడిన అంతర్మాలిన్యం

నాసిక్ కాంగ్రెసు మహాసభకు బాబూ పురుషోత్తందాస్ టాండన్ అధ్యక్షుడు కాకపోయినా, అధ్యక్ష ఎన్నికలో ఆయన విజయం పొందిన అనంతరం మతవాదులు పొందిన ఆనందానికి నెహ్రూ పరవళ్ళు తొక్కకపోయినా ఈ మహాసభను గురించి దేశం ఎక్కువ ఆసక్తి కనబరిచి ఉండేది కాదేమో

ఇండియా రిపబ్లిక్ అయిన అనంతరం కాంగ్రెసు మహాసభ జరగటం ఇదే మొదలన్న విషయానికి వార్తాసంస్థల వారు అనవసర ప్రాముఖ్యం ఇచ్చారు స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత మొట్టమొదటగా జరుగుతున్న మహాసభ అని జయపూరు కాంగ్రెసుకు ప్రాముఖ్యం ఇచ్చినట్టే పై సంవత్సరం అనుకున్న విధంగా మే, జూన్ నెలలలో ఎన్నికలు అనంతరం జరిగే తొలిమహాసభ అవుతుంది అంతమాత్రానికి ఎవరుగాని హడావుడి పడవలసిన అవసరం ఏమీ లేదు

కాంగ్రెసు మహాసభ జరక్కముందే కాంగ్రెసు సంస్థను గురించి కొన్ని విషయాలు దేశమంతటా బహిరంగంగా తెలిసిపోయాయి అందులో ముఖ్యమైనది, కాంగ్రెసు సంస్థ ప్రతిరాష్ట్రంలోనూ శిథిలావస్థలో ఉన్నదన్నది కాంగ్రెసు ఒక్క ఆంధ్రరాష్ట్రంలోనే రద్దుచేసి ఒక విధమైన 93వ సెక్షనును అమలుచేసినప్పటికీ, ఇతర రాష్ట్రాలలో కాంగ్రెసు వ్యవహారాలు ఇంతకన్నా బాగున్నాయని ఆంధ్రులు సిగ్గుపడవలసిన అవసరంలేదు

మూలవిరాట్టులలోనే చీలికలున్న సంగతి అధ్యక్షుని ఎన్నిక రుజువుచేసింది ఉన్న ముగ్గురు అభ్యర్థులలోనూ ఒకరు నెహ్రూ అభ్యర్థీ, మరొకరు పటేల్ అభ్యర్థీ అన్నమాట పుట్టింది ఈ చీలికను కప్పిపుచ్చటానికి మన అగ్రనాయకులు ప్రయత్నించలేదు ఎన్నికలకు పూర్వం సర్దారుపటేలు ఫోటోతో సహా టాండన్‌ను బలపరుస్తున్నట్టు బయటపడితే, ఎన్నికల అనంతరం ఆర్భాటం చేసి నెహ్రూ బయటపడ్డాడు

కాంగ్రెసు సంస్థ శిథిలమైపోతున్నదని జోస్యం చెప్పినవారిని, మహాసభ అసత్యవాదులుగా రుజువు చేసిందని టాండన్ అధ్యక్షపీఠం నుంచి వక్కాణించాడు కాని కాంగ్రెసు మహాసభ, కాంగ్రెసులో చీలికలు లేవని రుజువుచెయ్యలేదు ఆ చీలికల అంతు తేల్చుకుని ఎవరిమార్గం వారు తొక్కే సాహసం అగ్రనాయకులకు లేదని మాత్రమే రుజువయింది నాసిక్ కాంగ్రెసు మహాసభవల్ల కాంగ్రెసు ఎప్పటిలాగే సజీవమైన సంస్థగా ఉండి, కాంగ్రెసు అగ్రనాయకులు దేశాన్ని ఉద్ధరించే ఏకదీక్ష గలవారై సోదరులల్లే ఉన్నారన్న భావం దేశానికి కలిగిందను కున్నట్టయితే అధ్యక్షుడు టాండన్ చాలా పొరపడ్డాడని చెప్పవలసి ఉంటుంది కాంగ్రెసులోని అంతర్మాలిన్యం కడగటానిక్కాక, కప్పిపెట్టటానికి జరిగిన నిర్ణయమే నాసిక్ మహాసభ

ఈ కాంగ్రెసు మహాసభ ఒకవైపు ప్రజలకూ, మరొకవంక ప్రభుత్వానికి ఏమి మార్గం చూపింది? ఏమీ చూపలేదు వేదిక లభ్యమైనప్పుడల్లా సగటు కాంగ్రెసు నాయకులు చెప్పే సగటు ధర్మపన్నాలే నాసిక్‌లోనూ వినిపించాయి జయపూరులో మారుమోగిన 'ఉదారాశయాలే' నాసిక్‌లోనూ మారుమోగాయి ఇప్పటివరకూ కాంగ్రెసు ప్రభుత్వం అవలంబించిన అంతర్జాతీయ, దేశీయ, ఆర్థిక విధానాలపై కాంగ్రెసు మహాసంస్థ ఎడమచేతి బొటనవేలి ముద్రవేసింది

'ఈ మహాసభ కాంగ్రెసువాదులకు నెహ్రూలోగల అపారవిశ్వాసాన్ని రూఢి చేసింది' అన్నారు కొందరు వీరికి 'సెన్స్ ఆఫ్ హ్యూమర్' లేదు లేక నాసిక్ మహాసభలో నెహ్రూ చేసిన బెదిరింపు గురించి వీరికి తెలియకపోయి ఉండాలి తాను చెప్పేది నూటికి నూరుపాళ్ళు వివేకమని నెహ్రూకు గల విశ్వాసం నూటికి నూరుపాళ్ళూ నిజం కావచ్చు అట్లా అయేపక్షాన దేశానికి నెహ్రూ చాలు, ఈ కాంగ్రెసు మహాసభాప్రదర్శనం వృథా కాంగ్రెసు చావో, బతుకో తేల్చబోతున్నామని ఝాన్సీలో డాబులుకొట్టిన టాండన్ తన జోస్యం తానే భంగపరచుకున్నాడు కాంగ్రెసు చావనూలేదు, బతకనూలేదు ఎప్పటిలాగే ఉంది కాంగ్రెసు మహాసభ కాంగ్రెసు ప్రభుత్వానికి ఒక ప్రణాళిక ఇవ్వలేదు

నిజానికి కాంగ్రెసుసంస్థ ఇవాళ కాంగ్రెసు ప్రభుత్వానికి ఒక ప్రణాళిక ఇవ్వలేదు సరికదా అది ఒక ప్రజా సంస్థగా ప్రభుత్వాన్ని క్రమమార్గాన నడిపించి, ఒక వంక ప్రజల ప్రతినిధిగా పనిచేసేటందుకూ, మరొకవంక, ప్రభుత్వానికి బలం ఇచ్చేటందుకూ తగినస్థితిలో లేదు అది రాను రాను స్వార్థానికీ, అవినీతికీ ఆలవాలమవుతూ అగ్రనాయకులచేత అడుగడుగునా తిట్లు తినడమే గాక అగ్రనాయకులవద్ద నుండీ, వారికి ప్రస్తుతం గల పదవులనుండీ, కొంతబలాన్ని పొందుతోంది

ఇతరదేశాలలో పార్టీలున్నాయంటే అవి వాటి నాయకులపై సరిఅయిన అజమాయిషీ అమలుచేస్తాయి వారవలంబించవలసిన విధానాలను నిర్ణయిస్తాయి ఆ విధానాలననుసరించి వారు చేసిన నిర్ణయాలను విమర్శించి ఆమోదించటమో ఖండించటమో చేస్తాయి ప్రభుత్వంలో ఉన్న కొద్దిమంది వ్యక్తులు పార్టీ మాందేటుకు బద్ధులైఉంటారన్న పూచీయే పార్టీలో విశ్వాసం గల ప్రజలహక్కులకు కూడా పూచీ అవుతుంది ఏనాడైతే కాంగ్రెసు మహాసభ నిర్ణయాలకన్న అగ్రనాయకుల నిర్ణయాలు ఎక్కువ నిర్దుష్టంగా ఉంటాయన్న పరిస్థితి ఏర్పడిందో ఆనాడు కాంగ్రెసు సంస్థ వ్యర్థం వ్యర్థమైఉండి కూడా ఆ సంస్థ పనిచేస్తున్నదంటే ఇది ఛోటానాయకుల దుర్వినియోగానికి మాత్రమే పనికివస్తుంది

ఈ కాంగ్రెసు సంస్థ ఇంకా ఒక జాతీయసంస్థగా బతికిఉండటానికి ఈనాటికి కూడా కారణం గాంధీజీయే అయితే ప్రస్తుతం గాంధీపేరు విరివిగా వాడుతున్నవారు స్వార్థపరులూ, దేశద్రోహులూ

కంట్రోళ్ళు తొలగిపోతే రెండుచేతులా విచ్చలవిడిగా ఆర్జించాలని తహతహలాడేవారు నాసిక్ మహాసభలో గాంధీజీకి కంట్రోళ్ళు ఇష్టంలేదని వాదించారు వీరికి హరికృష్ణ మహతాబ్ మంచి సమాధానమే ఇచ్చాడు కంట్రోళ్ళు ఎత్తివేయటంతోబాటు స్వయంసంపూర్ణతావిధానాన్ని అవలంబించమన్నాడు ప్రభుత్వాన్ని అది ఇవ్వమనీ, ఇది ఇవ్వమనీ అడగవద్దన్నాడు ఎవరికి కావలసినవి వారు ఉత్పత్తిచేసుకుని సరుకులు లేకపోతే ఉన్నవాటితో తృప్తిపడి ఊరుకోమన్నాడు

అయితే, కాంగ్రెసు ప్రభుత్వాలు గాంధీని దాటి చాలాదూరం వచ్చేసినట్టు మహతాబ్ జవాబు స్పష్టం చేస్తున్నది కాంగ్రెసుప్రభుత్వం గాంధీ ఆర్థికవిధానాలను అమలు చేయక పోవటమే కాక నైతిక విధానాలనూ అమలుచేయటం లేదు కాంగ్రెసుప్రభుత్వం కాశ్మీరులో పాకిస్తాను హింసను హింసతోనే ఎదుర్కొన్నది, హైదరాబాదును పోలీసుచర్యతో దారికి తెచ్చింది

అంతమాత్రానికి కాంగ్రెసు ప్రభుత్వం చేసినది తప్పనీ, గాంధీవిధానం అనుసరించి ఉండవలసిందనీ ఎవరూ అనరు దీనివల్ల కాంగ్రెసు సంస్థ తన శిధిలత్వాన్ని గాంధీపేరుతో వాయిదావెయ్యలేదని మాత్రమే రుజువవుతుంది కాంగ్రెసు చావో బతుకో నాసిక్‌కు పూర్వమే తేలిపోయింది ఆ సంస్థ రద్దుకాకపోవటం వల్ల దేశానికి నష్టం కలుగుతున్నదిగాని లాభం కలగటం లేదు కాంగ్రెసు అగ్రనాయకులకైనా ఈ సంస్థ ఒక సమస్యేగాని సహాయం ఎంతమాత్రమూ కాదు

తెలుగు స్వతంత్ర, 29-9-50

# 11. ఎన్నికలలో రకాలు

వచ్చే ఏప్రిలు, మే నెలల్లో దేశవ్యాప్త ఎన్నికలు జరుగుతాయని మాట ఇచ్చారు ఆ ఎన్నికలు ఏప్రిల్‌లో కాకపోతే అక్టోబరు లోనో, అప్పటికీ కాకపోతే వచ్చేయేడో జరుగుతాయి గాని మానవు

ప్రజాస్వామికానికి ఎన్నికలు పునాది ఈ సంగతి బాగా ప్రచారమైనటువంటిది అందుచేత అందరికీ తెలిసినది జనాభాలో ఎంత ఎక్కువమందికి వోటింగుహక్కుంటే, వోటు చేసేవాళ్ళకి ఎంత స్వాతంత్ర్యం ఉంటే, ఎంత అధికసంఖ్యాకులైన వోటర్లు ఎన్నికల్లో పాల్గొంటే అంత ప్రజాస్వామికం అమల్లో ఉందన్నమాట

రాబోయే ఎన్నికలు స్వతంత్రభారత రిపబ్లికులో జరుగుతూన్న మొట్టమొదటి ఎన్నికలు కనుక ఎన్నికలను గురించి ఎంత జాగరూకత అలవరుచుకుంటే అంత మంచిది ముఖ్యంగా ఇతరదేశాల్లో ఎన్నికలు ఎట్లా జరుగుతాయో తెలుసుకుంటే మనం నేర్చుకునే పాఠాలు మనం నేర్చుకోవచ్చు

ప్రస్తుతం ప్రపంచంలో ఒకదాన్నొకటి ప్రతిఘటించి ఉన్న రెండే రెండు దేశాలు అమెరికా రష్యాలు రష్యాలో ప్రజాస్వామ్యం లేదని అమెరికా అంటుంది అమెరికాలో ప్రజాస్వామ్యం లేదని రష్యా అంటుంది రష్యాలో ఎన్నికలు జరిగే పద్ధతి చూస్తే అమెరికాకు నవ్వొస్తుంది అమెరికాలో ఎన్నికలు జరిగే పద్ధతి చూస్తే రష్యాకు పొట్టచెక్కలయిపోతుంది రష్యాలో ప్రజలు ఒక్క జాబితాపేర్లకే వోట్లు వేస్తారని అమెరికా విమర్శిస్తుంది అమెరికాలో ప్రజల వోటింగు హక్కులకు అనేక అవాంతరాలని రష్యా విమర్శిస్తుంది రష్యా అమెరికాలు ఒకదానికొకటి ప్రతిగా ఉండగా ఒకదాన్నొకటి మెచ్చుకోవటం ఎవరూ ఊహించలేని విషయం ఈ పరిస్థితిలో మనం చేయదగిందేమిటంటే రష్యాలో ఎన్నికలను గురించి రష్యా పత్రికలూ, అమెరికాలో ఎన్నికలను గురించి అమెరికను పత్రికలూ రాసుకున్న నమూనాలు చూస్తే మనకు కొంత లాభించవచ్చు

**రష్యాలో ఎన్నికలు**

రష్యాలో పిచ్చివాళ్ళూ, న్యాయస్థానాల చేత ముద్దాయిలుగా విచారించబడి వోటింగు హక్కు తాత్కాలికంగా పోగొట్టుకోబడినవారూ తప్ప మిగిలిన ప్రజలలో 18ఏళ్ళు వచ్చినవారందరూ వోటు చేయవచ్చు స్త్రీలూ, పురుషులూ, అన్ని వృత్తులవారూ, అన్ని మతాలవారూ, స్వస్థలాలో

ఉండేవారూ, లేనివారూ కూడా వోటు చెయ్యవచ్చు రష్యను సుప్రీం సోవియటుకూ, ప్రతి రిపబ్లికు యొక్క సుప్రీం సోవియటుకూ, స్థానిక సోవియటుకూ కూడా ప్రతినిధులను ప్రజలంతా కలిసి నేరుగా ఎన్నుకుంటారు పైన చెప్పిన సోవియట్లకు వరుసగా 23,21,18 ఏళ్ళ వయస్సు చేరుకున్న ఏ పౌరుడైనా అభ్యర్థిగా నిలబడవచ్చు వోటింగు రహస్యంగా జరుగుతుంది ఏ వ్యక్తి ఎవరికి వోటిచ్చినదీ ఎన్నికల అధికారి కూడా తెలుసుకోలేడు రష్యాలో అభ్యర్థులను నిర్ణయించేదెవరు? ప్రతి ప్రజాసంస్థకూ, శ్రామికసంస్థకూ అభ్యర్థులను నిలబెట్టే అధికారం ఉన్నది ప్రజలే అభ్యర్థులను నిలబెట్టటంతో అ అభ్యర్థులకు ఆదేశాలు కూడా చేస్తారు ఎన్నికల ఆదేశాలను తాను ఏవిధంగా నిర్వహిస్తున్నది ప్రతినిధి తనను ఎన్నుకొన్నవారికి ఎప్పటికప్పుడు నివేదించవలసి ఉంటుంది ఏ ప్రతినిధి అయినా సరిగా పనిచెయ్యటం లేదని తోస్తే వాణ్ణి ఎన్నుకొన్నవారు వాడి గడువు పూర్తికాక పూర్వమే వాణ్ణి వెనక్కురప్పించి, వాడి స్థానంలో మరొకణ్ణి ఎన్నుకోవచ్చు

గత మార్చి12న రష్యను సుప్రీం సోవియటుకు జరిగిన ఎన్నికలను గురించి రష్యను 'న్యూటైమ్సు' పత్రిక ఈ విధంగా రాసుకున్నది

"ఈ ఎన్నికలలో 11,10,00,000 మందికి పైగా, దేశంలోని 18ఏళ్ళ పైబడిన ప్రజలు దాదాపు అందరూ పాల్గొన్నారు అందులో నూటికి 99 7మంది కమ్యూనిస్టుపార్టీ, నాన్‌పార్టీ అభ్యర్థులకు వోటుచేశారు సుప్రీం సోవియటుకు ఎన్నుకోబడిన స్త్రీ పురుషులు దేశంలోని ఉత్తమోత్తములు ప్రీమియర్ ప్రతినిధిగా జె వి స్టాలిన్ ఎన్నుకోబడ్డాడు ప్రతినిధులలో పార్టీ ప్రముఖులూ, ఉత్తమ కార్మిక కర్షకులూ, శాస్త్రవేత్తలూ, రచయితలూ, డాక్టర్లూ, ఉపాధ్యాయులూ, ఇంజనీర్లూ, ఎగ్రానమిస్టులూ – వివిధ జాతుల ప్రతినిధులున్నారు మొత్తం 1316 ప్రతినిధులలో 687 మంది కార్మికులూ, కర్షకులూ, నూటికి 20మందికి పైగా స్త్రీలూ సుప్రీం సోవియట్ ప్రతినిధులు వాస్తవమైన ప్రజాస్వామ్యానికి, సోవియట్ సోషలిస్టు ప్రజాస్వామ్యానికి తార్కాణం ఈ ప్రజాస్వామ్యంలో ప్రజలే యజమానులూ, దేశ పరిపాలకులూనూ "

ఒకటి స్పష్టంగా కనిపిస్తుంది ఇంగ్లండులో బెర్నార్డుషా వంటి ప్రసిద్ధరచయితలు ఎన్నికలకు నిలబడి ఓడిపోవటమూ, అమెరికను సెనేటులో సంస్కృతీరంగాల్లో పనిచేసేవాళ్ళ ప్రసిద్ధనామధేయాలు లేకపోవటమూ, ప్రసిద్ధులైన రష్యను రచయితలు సుప్రీం సోవియటుకు ఎన్నుకోబడటమూ కళ్ళకు కొట్టవచ్చినట్టు కనబడుతుంది

**అమెరికాలో ఎన్నికలు**

అమెరికాలో ప్రజలందరికీ వోటింగుహక్కులేదు ఉన్న వోటింగు హక్కులకు చాలా ప్రతిబంధకాలున్నాయి అభ్యర్థులను నిలబెట్టగల తాహతు రెండు రాజకీయపక్షాలకే ఉన్నది హక్కులను బట్టి ఎవరైనా అభ్యర్థులుగా నిలవొచ్చు గాని ఎన్నికలకు కావలసిన పత్రికాప్రచారమూ, ఖర్చూ పెట్టుకోవటం దాదాపు ఎవరికీ సాధ్యం కాదు అందుచేత ప్రజలు డెమోక్రాటు అభ్యర్థికో, రిపబ్లికను అభ్యర్థికో వోట్లు వేయవలసిందేగాని తమ అభ్యర్థి అంటూ ఎవర్నీ నిలబెట్టటం ఉండదు అభ్యర్థులు వాగ్దానాలు చేస్తారు, నిజమే గాని ఎన్నిక అయిన అభ్యర్థి తన వాగ్దానాలను మర్నాడే మరిచిపోవచ్చు అతణ్ణి సంజాయిషీ అడిగే హక్కు గాని, పదవీభ్రష్టుణ్ణి

చేసే హక్కు గాని ప్రజలకు లేదు తిరిగి ఎన్నికలు జరిగేదాకా ఎన్నికైన అభ్యర్థి తన అధికారాన్ని యథేచ్ఛగా దుర్వినియోగపరచవచ్చు మళ్ళీ ఎన్నికలు వచ్చినప్పుడు– అదొక విచిత్రమైన కథ

కొద్దిరోజుల క్రితమే అమెరికాలో సెనేటు ఎన్నికలు జరిగాయి ఈ ఎన్నికల సంరంభం న్యూయార్కులో ఏ విధంగా జరిగిందీ 'న్యూస్‌వీక్' అనే అమెరికను పత్రిక ఈ విధంగా వర్ణించింది

"న్యూయార్కు ఎన్నికల ప్రచారంలో ఒకపార్టీని గురించి మరొకపార్టీ కుళ్ళు బయట పెట్టటానికి జోరుగా పోటీచేశాయి మొదటిదశలో రిపబ్లికనులే విజయం పొందుతున్నట్టు కనిపించారు మొదట ఓడయర్ దుర్మార్గం బయటపడింది బ్రాండ్స్ యజమాని ఎడ్‌ఫ్లిన్, మేయర్ విలియం ఓడయర్‌ను మెక్సికోకు రాయబారిగా పంపటానికి ట్రూమన్‌ను ఒప్పించాడు ఇంతలోనే ఇంతకన్న ఘోరం బయటపడింది జూదగాళ్ళకూ, పోలీసులకూ గల లాలూచీ గురించిన విచారణ దీనిని ఓడయర్ నిరసించాడు ఈ విచారణ ఫలించసాగింది పోలీసులు ఉద్యోగాలకు రాజీనామాలిచ్చి ఫించనులు పుచ్చుకోసాగారు

"ఇదే డెమోక్రాట్లకు దెబ్బగా ఉంటే ఇంకా చిక్కులు వచ్చాయి ఓడయర్ స్థానే మేయరయిన విన్సెంట్ ఇంపెలిటెరీ, డెమోక్రాటు పక్షానికి చెందిన ఉద్యోగి తన పార్టీ చేత అభ్యర్థిగా నిలబెట్టబడకపోగా స్వతంత్రంగా నిలబడతానని బెదిరించాడు డెమోక్రాట్లు అతనితో రాజీపడి, అతను ఈ ప్రయత్నం మానుకుంటే 28వేల డాలర్ల సంవత్సరాదాయంతో 14 ఏళ్ళపాటుండగల సుప్రీంకోర్టు ఉద్యోగం ఇప్పిస్తామన్నారు ఈ క్షణం వరకూ డెమోక్రాట్లు రిపబ్లికనుల పై వెయ్యగల అభాండమల్లా జోహాన్లీని కాదని థామస్ డ్యూయీకి న్యూయార్కు గవర్నరు అభ్యర్థిత్వం ఇచ్చారని మాత్రమే

"గతవారం డెమోక్రాట్లకు వారికి కావలసిన పెద్దఅవకాశం లభించింది అదేమిటంటే హాన్లీ ఉత్తరం ఈ ఉత్తరంలో హాన్లీ తాను డ్యూయీ అభ్యర్థిత్వానికి ఏ విధంగా తలవొగ్గినదీ వివరించాడు తనకున్న భారమైన అప్పులు తీరుస్తామన్నారు సెనేటు ఎన్నికలలో తాను (హాన్లీ) ఓడిపోవటం జరిగితే విదేశాంగశాఖలో ఉద్యోగం ఇస్తామన్నారు ఈ ఉత్తరం డ్యూయీ విరోధులద్వారా డెమోక్రాట్లకు దొరికింది ప్రత్యక్షంగా కాగితం మీద ఉన్న దాన్ని గురించి డ్యూయీగాని హాన్లీ గాని ఏ విధంగా సమర్థించజూచినా ప్రయోజనంలేదు 'రాజకీయవేత్తలు టెలిఫోనుద్వారా మాట్లాడాలి గాని రాయరాదు' అని న్యూయార్కు టైమ్సు పత్రిక నీతి పలికింది "

ఇదే ధోరణిలో ఉన్నది ఈ వర్ణన 'న్యూస్‌వీక్' పత్రికగాని, 'న్యూయార్కుటైమ్సు' పత్రికగాని అమెరికా ప్రజాస్వామికాన్ని గురించి అభాండాలు వెయ్యటానికి కృషిచేస్తున్నవనన్నా అనుకోవాలి లేదా అమెరికా ఆరాధించే ప్రజాస్వామికం కింద వోటింగుహక్కు వినియోగించే ప్రజలు, ఉన్న అభ్యర్థులలో ఎవడికన్నా ఎవడు తక్కువ తుచ్ఛుడో, ఏ పార్టీకన్నా ఏపార్టీ తక్కువ అవినీతి ప్రదర్శిస్తున్నదో సూక్ష్మంగా తూచి వోటు ఇవ్వవలసి ఉంటుందనన్నా అనుకోవాలి

రష్యాలో ఎన్నికలముందురోజులు ప్రజలకు పర్వదినాలనీ, వాళ్ళకా రోజులు రాజకీయచైతన్యం అమితంగా కలిగిస్తాయనీ, ఆ రోజుల్లో అనేకసభలు జరిగి రాజకీయనాయకుల ద్వారా ప్రజలు దేశం ఎంతవరకు పురోగమించిందీ, ఇకముందు ఎటువంటి అభివృద్ధి జరగవలసి ఉన్నదీ తెలుసుకుంటారనీ రష్యను పేపర్లు గొప్పగా చెప్పుకుంటాయి

అదే సమయంలో అమెరికా ప్రజలకు మరొకపర్వం తమను పాలించనున్న వాళ్ళూ, పాలించిన వాళ్ళూ, వాళ్ళను నిలబెట్టే పార్టీలూ ఎటువంటి సంఘద్రోహులో అమెరికా ప్రజలు ఎన్నిల ప్రచారసమయంలో తెలుసుకుంటారు వాళ్ళ మనస్తత్వం సినిమా ప్రేక్షకుల మనస్తత్వం లాగా ఉంటుందనుకోవాలి హాస్లీ ఉత్తరాన్ని గురించి రాస్తూ న్యూస్‌వీక్ పత్రిక "జిమ్మీ వాకర్ పరిపాలన అంత్యదశ తరువాత ఇంత దారుణమైన రాజకీయ అపవాదులేదు" అన్నది అయినా అమెరికా ఎన్నికలలో రిపబ్లికనులు, డెమోక్రాటులతో సమానంగా స్థానం సంపాదించారు అదివరకు వారికి గల స్థానాలతో పోలిస్తే రిపబ్లికనులకే ఎక్కువ విజయం లభించింది

బ్రిటనులో జరిగిన ఎన్నికలలో లేబరుపార్టీకి, కన్సర్వేటివులకూ ఇంచుమించు సమానమైన విజయం లభించటంలో ఉన్న రహస్యమే ఇప్పుడు జరిగిన అమెరికను కాంగ్రెసు ఎన్నికలలో కూడా ఉన్నది వోటర్లకు ఏ రాయి అయినా ఒకటే, పళ్ళూడగొట్టుకోవటానికి

తెలుగుస్వతంత్ర, 17-11-50

# 12. వాయిదా పడిన విప్లవం

**దుర్గతి అలాగే ఉంది –**
**పేరు మాత్రం మారుస్తున్నాం**

విప్లవం లేకుండా ఇండియా స్వాతంత్ర్యం తెచ్చుకున్నందుకూ, బ్రిటను ఇచ్చినందుకూ మన నాయకులే గాక ప్రపంచంలో చాలామంది ఇప్పటికీ ఇంకా హర్షిస్తున్నారు కాని ఇందులో హర్షించవలసింది ఏమీలేదని బుద్ధిమంతులు సులభంగానే గ్రహించవచ్చు 1947 ఆగస్టు15న మనకు సంక్రమించినది స్వపరిపాలనాధికారం మాత్రమే ఆ అధికారాన్ని మనం వినియోగపరచుకొని మన సంప్రదాయాలకూ, అవసరాలకూ, పురోభివృద్ధికీ, ఆదర్శాలకూ అనుగుణంగా జాతీయ జీవితాన్ని రాజకీయ, ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక రంగాల్లో నిర్మించుకునేటందుకు అవసరమైన విప్లవం మాత్రం అట్టే ఉండిపోయింది

విప్లవం జరగలేదని సంతోషించేవాడికన్న అవివేకి, లేదా సందర్భాన్ని బట్టి వంచకుడు మరొకడుండడు విప్లవం జరగకుండా విప్లవ ఫలితాలు ఏ జాతికీ, ఎన్నడూ సంక్రమించవు

జనం వెర్రెత్తి ఒకరినొకరు నరుక్కుంటేనే విప్లవం కాదు అదే విప్లవమయితే 1947 ఆగస్టు 15 తరువాత మనం చాలా పెద్దవిప్లవాన్నే చూశాం విప్లవమంటే నూతన నిర్మాణశక్తితో కూడిన ప్రజాశక్తుల విజృంభణ ఆ విజృంభణలో పాత కశ్మలం పాత అవాంతరాలు కొట్టుకుపోయి సమష్టి జీవితం కొత్తమొగ్గ తొడుగుతుంది జీవితపు అన్ని రంగాలలోనూ కొత్త జవం, కొత్త జీవితం తలఎత్తుతాయి ఇటువంటి జవమూ, జీవమూ 1917 అనంతరం రష్యాలోనూ, 1949 అనంతరం చైనాలోనూ కనుపించాయి స్వాతంత్ర్యం అధికారరూపేణా మనకు సంక్రమించి నాలుగేళ్ళు కావస్తోంది గాని మన జీవితంలో జవమూ లేదు, జీవం అంతకన్నా లేదు

రోగి మంచానపడి ఉండటం ఒకటీ చికిత్స అయిపోయినాక మంచంలోంచి లేవలేక పోవటమూ మరొకటీనూ పూర్వం మన అధోగతికి బ్రిటిషువారిని నిందించాం పాకిస్తాను

విభజన కాకపోతే ముస్లిములను నిందించే అవకాశం ఉండేది ఇప్పుడు ప్రస్తుతం కమ్యూనిస్టులను నిందించేవారు లేకపోలేదు కాని కాస్త జాగ్రత్తగా ఆలోచిస్తే, ఎవరో ఒకరిని ఈ విధంగా నిందిస్తూ పోవటంలో గల అనర్థత్వం బోధపడుతుంది మళ్ళీ వ్యాధిగ్రస్తుడి ఉదాహరణే తీసుకుందాం రోగికి చికిత్స చేయలేని వైద్యుడు వరసగా రోగంపేరు మారుస్తూ పోతే ఎట్లా ఉంటుందో మన జాతీయ అధోగతికి ఇటువంటి కారణాలను ఒకదానితరవాత ఇంకొకటి చూపిస్తూ పోవటం అట్లా ఉంటుంది

అదీకాక ఈ రోగికి కొన్ని కొత్త వ్యాధిలక్షణాలు ఏర్పడుతున్న మాట నిజమే గాని పాతలక్షణాలు పోయినట్లు మాత్రం కనిపించటం లేదు బ్రిటిషువాళ్ళు తమ 'హేయమైన వలసవిధానం'తో మనకు కలిగించిన సమస్యలు చాలాభాగం అట్లాగే ఉన్నాయి కాందిశీకుల సమస్య కొత్తగా వచ్చింది కాని ఇది మనం చేతులారా చేసుకొన్నది దేశవిభజనకు ఒప్పుకున్నాం విప్లవం లేకుండా స్వరాజ్యం వస్తున్నదన్న సంబరంలో బ్రిటిషువాళ్ళ మాట విని శాశ్వతంగా మెడకు ఉచ్చు తగిలించుకుని, ఆ బ్రిటిషువారి సఖ్యత చూసుకుని ఇంకా గర్వపడుతూనే ఉన్నాం మనకు స్వాతంత్ర్యం ఇచ్చేసి నాలుగేళ్ళ క్రితం తప్పుకున్న బ్రిటిషువారు, మనతో సఖ్యతగా ఉన్న బ్రిటిషువారు, మనని పరోక్షంగా ఇంకా వాణిజ్యం వగైరాల విషయంలో శాసించగలుగుతూనే ఉన్నారు మనం కామన్వెల్తులో ఉన్నాం కామన్వెల్తు కొంతభాగం అట్లాంటిక్ కూటమి ఛాయలో ఉన్నది బ్రిటిషువాళ్ళూ, అమెరికనులూ చేరి మన అంతర్జాతీయ వ్యవహారాలలో గోతులు తవ్వుతూనే ఉన్నారు

మనకివాళ ఉన్న సమస్యలన్నీ కాందిశీక సమస్యలాంటివి కావు కాశ్మీరుసమస్యలాంటివి కావు మన కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలలో గొప్ప అవినీతి ప్రబలి ఉన్నది దేశంలో అరాజకంలాంటి దొంగ వర్తకమూ, పన్నుల ఎగవేతా, రాజకీయ గూడుపురాణీ, అభ్యుదయ నిరోధకుల విజృంభణా, కుట్రా ఉన్నాయి ఇవి బ్రిటిషువారు గాని, ముస్లిములు గాని, కమ్యూనిస్టులు గాని తెచ్చిపెట్టినవి కావు "మన ప్రభుత్వంలో అవినీతి అతివ్యాప్తి చెంది ఉన్నది" అని చెప్పుకోవటానికి మన మహానాయకులు గర్విస్తున్నారు! ఆరోగ్యం, విద్యా, తిండీ, ఇళ్ళూ, బట్టలూ, ఆర్థికస్థితీ, జీవనప్రమాణాలూ, శ్రామికుల స్థితీ, ప్రజలహక్కులూ – ఇటువంటి విషయాలలో బ్రిటిషు వారి పరిపాలనకంటె ప్రస్తుత పరిపాలన ఎన్నోరెట్లు హీనంగా ఉన్నదనిపిస్తున్నది స్వాతంత్ర్యం ఈ సమస్యలను పరిష్కరించటానికి కాకపోతే దేశంలో అధిక సంఖ్యాకులకు అట్టి స్వాతంత్ర్యం అవసరమేలేదు

ఆమాట అంటే కేవలసిద్ధాంత ప్రియులు సత్పరిపాలనకంటె స్వపరిపాలన మేలు అని మనకు జ్ఞాపకం చేయవచ్చు అవును, మేలే– అది ప్రజల స్వపరిపాలన ఐతే ప్రజలు తమకు ప్రతినిధులైన వారిని ఎన్నుకోవటంలో పొరపాట్లు చేసినట్టయితే అందువల్ల తప్పులను ప్రజలు సులభంగా దిద్దుకుంటారు దిద్దుకునే అవకాశాలను ప్రభుత్వం హరించకపోతే

కాని మనదేశంలో జరుగుతున్నదది కాదు ఇవాళ కేంద్రంలోనూ, రాష్ట్రాలలోనూ ఏలుబడి చేస్తున్న కాంగ్రెసు ప్రభుత్వం ఒక ప్రజాపక్ష ప్రభుత్వం కాదు కాంగ్రెసు పక్షం ప్రజలకు చేసిన వాగ్దానాలకేనాడో కాలదోషం పట్టిపోయింది ఇప్పుడీ కాంగ్రెసు ప్రభుత్వం తన అధికారాన్ని నిలదొక్కుకునేటందుకు ఏ ఇతరపక్షం చేయదగిన మాయోపాయాలనైనా చెయ్యటానికి సంసిద్ధంగా

ఉన్నది అక్కడక్కడా జరిగే ఎన్నికలలో జరిగే దురంతాలను ప్రతికూల పత్రికలే గాక కాంగ్రెసు వర్గాలలోని నాయకులే బయటపెట్టుతున్నారు కాంగ్రెసు మనుగడకూ దేశం మనుగడకూ ఇవాళ ఏ విధమైన అవినాభావ సంబంధమూ లేదు కాంగ్రెసు అగ్రనాయకులు రహస్య సమాలోచనలు చేసి, అవాంఛనీయులను చేరదీసి, తమ ప్రజల ప్రతికక్షులతో చాటున రాజీబేరాలు సాగించి ప్రజలపట్ల ద్రోహం చేస్తున్నారు

అన్నిటికన్నా హాస్యాస్పదమేమంటే ప్రజల యదార్థసమస్యల విషయంలో “మిమ్మల్ని మీరే రక్షించుకోవాలి మీరు ప్రభుత్వానికి తోడ్పడాలి ప్రతిదానికీ మామీద ఆధారపడరాదు” అని చెబుతూ, తమ రక్షణకుగాను రకరకాల ప్రజావిద్రోహకర చట్టాలు తయారు చేసుకుంటు న్నారు ప్రజలనుండి తన్ను తాను కాపాడుకునే ప్రభుత్వం బతకదు, బతికి ఉండతగదు

నిన్నగాక మొన్న పెకింగ్‌లో ఏర్పడిన చైనా ప్రభుత్వం ఇంద్రజాలంలాగు ప్రజాజీవితాన్ని క్షణంలో వికాసానికి తెచ్చింది అక్కడి ఆర్థిక, ఆహార, విద్యా, ఆరోగ్య సమస్యలు – ఎన్నో ఏళ్ళుగా ప్రజలను బాధించినవి – మటుమాయం అయిపోతున్నాయి చైనా జాతీయోద్యమాలకు నిన్న కూడా శత్రువులుగా పనిచేసిన వర్గాలను పెకింగ్ ప్రభుత్వం జాతీయపునర్నిర్మాణానికి వినియోగించుకుంటున్నది మనదేశంలో ప్రజాద్రోహుల సంఖ్య (డిటెన్యూలను చాటుగా కాల్చనవసరం లేకుండానే) తగ్గించబడుతోంది కొమింటాంగు క్షుద్ర పరిపాలన కింద జరిగిన ఘోరాతిఘోరాలు ఈనాడు జరుగుతున్నాయి ఐతే ప్రస్తుత చైనాను గురించి మన నాయకులు గర్వపడుతున్నట్టు మాట్లాడుతున్నారు

మనదేశంలో స్వాతంత్ర్యంతోబాటు నూతన చైతన్యం సాగలేదనటానికి ఒక్కటే పెద్ద తార్కాణం అది ఉత్పత్తి హెచ్చకపోవటం కాదు, ఎన్నికలు జరగకపోవటం కాదు, అధికాహారోత్పత్తి లేకపోవటం కాదు, అంకెలలో నిరూపించదగిన మరేదీ కాదు అది కేవలం మన ఆధ్యాత్మిక అనుభవానికి చెందినది అదేమిటంటే మన జాతీయజీవితంలో మనకు ఆసక్తిలేకపోవటం బ్రిటిషువారి హయాంలో ఎట్లా ఉన్నామో, ఇవాళ కూడా ఈ విషయంలో అట్లాగే ఉన్నాం ఆనాడు రాజకీయాలూ, విజ్ఞానమూ, సంస్కారమూ మొదలైనవి మనకు బాహ్యంగా కనిపించేవి ఈనాడూ అంతే స్వాతంత్ర్యం మనని ఈ విషయంలో మార్చలేకపోయింది ఒక్క సాంఘిక విప్లవం మాత్రమే మనని మార్చగలదు అది ఎట్లా ఉంటుందో మనం ఎరగం

మన అగ్రనాయకుడు నెహ్రూను తీసుకోండి అంతర్జాతీయ రంగంలో నెహ్రూ ప్రపంచశాంతి కొరకు అతి శ్లాఘనీయమైన కృషి చేస్తున్నాడు కాని ఈ నెహ్రూకు మన ఆర్థిక జీవితం పట్ల ఆదరం లేదు ఉంటే కేంద్రబడ్జెట్‌ను అంతగా బలపరిచి ఉండడు దేశీయ విషయాలలో మహానాయకుడనిపించుకుందామనే ఆత్రం నెహ్రూకు లేదు ఉంటే కొన్ని కాంగ్రెసు వర్గాలతో ఆయన ఏనాడూ రాజీపడి ఉండడు

మన పత్రికలు తీసుకోండి ఇవి ప్రజలపక్షాన పరిపాలనను విమర్శించటం చాలా తక్కువ ఇవి దేశీయ రాజకీయాలకన్న అంతర్జాతీయ రాజకీయాలకు ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తాయి దేశంలోని ప్రజల జీవితాన్ని మంచినిగాని చెడునుగాని శాసించే విషయాలపట్ల పత్రికలకు ఆసక్తి తక్కువ

ఆఖరుకు కళారంగంలో కూడా ఇదే కనిపిస్తుంది కళాసిద్ధాంతాలు చేసేవారు సయితం తమ సిద్ధాంతాలను బలపరిచేటందుకు ఇతరత్రా ఉదాహరణలు చూసుకుంటారు ఈ సిద్ధాంతాలను పురస్కరించుకుని వెలువడే కళలకు కూడా వాస్తవికజీవితంతో సన్నిహిత సంబంధం ఉండదు

ఇది బానిసబుద్ధికి తార్కాణం బానిస అయినవాడికి జీవితం – నిజమైన జీవితానందమూ, జీవితాకర్షణా – తనకు బాహ్యంగా ఉన్నట్టు తోస్తుంది మనం రాజకీయ బానిసలుగా ఉన్నప్పుడు మనకు అట్లాగే తోచింది ఇప్పుడూ అట్లాగే తోస్తున్నది

అంటే మనకు అంతర్జాతీయ రాజకీయాలతో పనిలేదనీ, మనం కూపస్థమండూకాలుగా ఉండాలని కాదు మన రాజకీయాలతో అంతర్జాతీయ రాజకీయాలనూ, మన సంస్కృతితో ఇతరుల సంస్కృతినీ సమన్వయించుకోవలసిందే కాని ఇతరులకు దళ్ళు కట్టి, తన దడిని ఉపేక్షించే మనస్తత్వం మనిషిని ముందుకు తీసుకుపోదు అటువంటి మనస్తత్వం మీద ఎప్పుడూ ఏజాతీ పైకి రాలేదు తాను పైకి రాలేని జాతి ఇంకొకరిని ఎన్నడూ ఉద్ధరించనూ లేదు ప్రపంచశాంతి కోసరం ఇండియా పాటుపడగలిగితే అంతకన్న కోరదగినదేమీ లేదు కాని పులిని చూసి నక్క వాతపెట్టుకున్నట్టు ఏ బ్రిటనుకో కట్టుపడి – బ్రిటను అమెరికాకు కట్టుబడి ఉన్నది! – దేశీయాదాయంలో అనేకకోట్లు 'రక్షణ' వ్యయం కింద ఖర్చుపెట్టే ఇండియా బ్రిటను, అమెరికా రష్యాల వంటి ప్రబల రాజ్యాలమధ్య సామరస్యం చేకూర్చగలదంటే విశ్వసించటం కష్టం

నిజంగా ఇండియా శాంతికోసం ప్రబలమైన కృషి చెయ్యాలంటే చైనాలాగే ఇండియా కూడా ప్రజాజీవితంలోని విప్లవబీజాలను మొలకెత్తించి ఎన్ని శతాబ్దాలుగానో వాయిదాపడి ఉన్న సాంఘిక విప్లవాన్ని సాధించాలి అప్పుడు ప్రజలను పోషించటానికన్న 'రక్షించటానికి' ఎక్కువ డబ్బు ఖర్చు చెయ్యటమూ, గాంధీపేరు స్మరించే ప్రభుత్వం నిండా కుళ్ళూ అవినీతీ పెచ్చుపెరగటమూ, మతరహిత లౌకిక రాజ్యతంత్రంలో కులవివక్షతలూ మొదలైన 'రోగలక్షణాలు' ఉండవు ఈ 'రోగలక్షణాలు' పోవటమూ, విప్లవం రావటమూ ఏనాటికైనా తప్పదన్న సంగతి ఎంతమంది గుర్తించి ఉంటే అంతమంచిది

అయితే ఈ విప్లవం చిట్టచివరకు ఏ రూపంలో వస్తుందన్న ప్రశ్నకు సమాధానం, ఎవరు తెస్తారన్న ప్రశ్న యొక్క సమాధానం పై ఆధారపడి ఉంటుంది విప్లవం లేకుండా అధికారం వచ్చినందుకు సంతోషించేవాళ్ళు విప్లవాన్ని ఎవరు తెచ్చినా, అది ఏ రూపంలో వచ్చినా సంతోషించరు వారు విప్లవానికి శత్రువులు అట్లాగే ప్రస్తుతం దేశీయ రాజకీయాలలోనూ, దేశీయ జీవితంలోనూ ఆసక్తి కనపరిచేవారు కొందరున్నారు, వారిలో కొందరు ప్రస్తుత జడస్థితిని స్వప్రయోజనార్థం వినియోగపరచుకుని, ఈ స్థితిని తమ మురా రాజకీయాలకు అనువైన వాతావరణంగా వాడుకుంటున్నారు మరికొందరు విప్లవాన్ని తీవ్రంగా వాంఛిస్తున్నారు వీరిలో మొదటితరగతి వారు ఏ విప్లవాన్నయినా ప్రతిఘటించు తారు వారు కూడా విప్లవ శత్రువులే పోతే రెండోరకం వారు ఏ రూపంలో విప్లవం వచ్చినా స్వీకరిస్తారు, ఎటువంటి విప్లవాన్నయినా బలపరుస్తారు

ఇక విప్లవం ఎట్లా వస్తుందన్న ప్రశ్నకు సమాధానం కూడా మనం చెప్పుకోవచ్చు ఈ విప్లవం ప్రస్తుత ప్రభుత్వంలోని కొందరు అగ్రనాయకుల ద్వారా వచ్చినట్లయితే దాదాపు రక్తరహితంగా ఉంటుంది పలువిధాల శాసనాల ఒత్తిడికీ, పోలీసు జులుముకూ, ధనిక వర్గాల దోపిడీకీ గురి అయి ఉన్న కార్మికుల నుంచి మాత్రమే వచ్చినట్లయితే రక్తప్రవాహాలు తప్పవు అటువంటి దుస్థితిని కలగనీయకుండా విప్లవం సాధించే శక్తి తమ చేతిలో ఉన్న అగ్రనాయకులు విప్లవవైఖరి అవలంబించకపోగా నానాటికీ అధోగతిపాలవుతున్న ప్రజల పట్ల నిర్లక్ష్యభావం ప్రదర్శిస్తున్నారు, చివరకు దేశంలో విప్లవం వర్ధిల్లటానికి ఎంతపాటి రక్తపాతం జరిగినా అందుకీ నాయకులే బాధ్యత వహించవలసి ఉంటుంది ఇక్కడ కూడా మనకు చైనా మంచి నిదర్శనం ఒకప్పుడు జాతీయోద్యమానికి నాయకుడై నిలిచి చైనా అంతటినీ కూడగట్టిన చాంగ్‌కైషేక్ విప్లవానికి స్వస్తి చెప్పి ప్రభుత్వ వర్గాలలో అవినీతీ, అధికారవాంఛా, స్వార్థమూ విచ్చలవిడిగా పెచ్చుపెరగనిచ్చాడు విప్లవం కమ్యూనిస్టుల నాశ్రయించింది విప్లవం వెంట రక్తపాతం జరిగింది ఆ రక్తపాతం ఎంత ప్రమాణంలో జరిగేదీ చాంగ్‌కైషేక్ తన పూచీమీద నిర్ణయించాడు ఆయన అమెరికాను రక్తపాత ప్రతిఘటనకు ఆహ్వానించకపోతే ఇంత రక్తపాతం కలిగి ఉండేది కాదు కాని చైనా విప్లవహోమంలో ప్రజారక్తం ఆహుతి చేయటానికి చాంగ్‌కైషేక్ అమెరికా సొత్తు 600కోట్లడాలర్లు అందిపుచ్చుకున్నాడు మన పురాణాలలో రావణుడు, నరకుడు మొదలైన రాక్షసులపేర్లు ఎట్లా నిలిచిఉన్నాయో చైనా చరిత్రలో ప్రజాద్రోహిగా చాంగ్‌కైషేక్ అట్లాగే శాశ్వతంగా నిలిచి ఉంటాడు 1951లో కూడా మనం అంతర్జాతీయ రాజకీయాలను ఇంత శ్రద్ధగా ఆకళింపు చేసుకుంటూ కూడా, ఈ స్వల్ప విషయాన్ని – విప్లవాన్ని అడ్డటం ప్రమాదమన్న పాఠాన్ని– తెలుసుకోలేకపోతే ఆ అజ్ఞానానికి జాతికి అంతటికీ శిక్షపడక తప్పదు

రేపు జరుగబోయే దేశవ్యాప్త ఎన్నికలలో ప్రపంచంలో ఏ దేశంలోనూ ఎన్నడూ పాల్గొననంత సంఖ్యలో ప్రజలు పాల్గొంటారనీ, ఇదే ఒక గొప్ప విప్లవమనీ కొన్ని విదేశీ పత్రికలు మనని ఉబ్బేస్తున్నాయి కాని ఈ ఎన్నికలను తన ఇష్టం వచ్చినట్టు నడిపే శక్తులను కాంగ్రెసు ఇదివరకే సేకరించుకు ఉంచుకున్నది ఈ శక్తులను కాంగ్రెసు దుర్వినియోగ పరచదన్న నమ్మకం చాలామందికి లేదు దుర్వినియోగపరచని పక్షాన దేశంలో విప్లవానికి తప్పక దోహదం జరుగుతుంది మావో సేటుంగ్‌ను చైనా ప్రజలు ఆహ్వానించారంటే, అంతకు పూర్వం చాంగ్‌కైషేక్‌నూ ఆహ్వానించారు మావో సేటుంగ్ ప్రత్యేకత అతను పదవిలోకి వస్తూనే విప్లవాన్ని విసర్జించకపోవటంలో ఉన్నది నాలుగేళ్ళ క్రితం నెహ్రూ ఇండియాలో అదేస్థితిలో ఉన్నాడు కాని నెహ్రూ మావోసేటుంగ్ పంథా తొక్కలేదు సాధ్యమైనంత త్వరలో ఆ పంథా తొక్కకపోతే ఆయనకు చాంగ్‌కైషేక్ పంథా మాత్రమే మిగలవచ్చు 35కోట్ల భారతీయులకు నాయకత్వం వహించటం బాధ్యతగల పని ఆ బాధ్యత నిర్వహించేవాడు ప్రజలకేసి పోకపోతే ప్రజలకు ప్రతికూలంగా లాగే ప్రబలశక్తులీనాడు ప్రపంచంలో ఉన్నాయి

తెలుగుస్వతంత్ర వారపత్రిక 23-3-1951

# 13. శాసనాలూ : న్యాయమూ

సాంఘిక వ్యవస్థలో న్యాయస్థానాలూ, వాటిని శాసించే నియమాలూ, న్యాయశాఖకు గల స్వేచ్ఛా, న్యాయవాదులకు గల స్వాతంత్ర్యమూ మొదలైనవి ప్రజాహితానికి గీటురాళ్ళు

సమాజం ఉన్నచోటనల్లా శాసనం కూడా ఉంటుంది ప్రతి ఇంటి నాలుగుగోడల మధ్య కూడా మనుష్యుల ప్రవర్తన ఏదోవిధంగా శాసించబడుతూ ఉంటుంది ఆ నాలుగుగోడల మధ్య జీవితం సుఖమయమా, దుఃఖమయమా, వికాసవంతమా, అంధకారమయమా, నాగరికతతో కూడినదా, కాదా మొదలైన విషయాలు, ఈ శాసనం దుష్టమా, సక్రమమా, అక్రమమా, స్వేచ్ఛాయుతమా, నిరంకుశమా అన్నదానిపై కొంతవరకైనా ఆధారపడి ఉంటాయి అందుచేత కొన్ని కుటుంబాలు ఇంత కలిగిఉండి కూడా సుఖం ఎరగకుండా ఉంటే మరికొన్ని కుటుంబాలు అంత గొప్పగా బతకకపోయినా శాంతియుతంగా కాలం వెళ్ళబుచ్చగలుగుతాయి

దేశంలో ప్రజాజీవితం కూడా ఇంతే ప్రతిదేశమూ ఒక్కపెట్టున సకల భోగభాగ్యాలతోనూ తులతూగనవసరం లేదు ప్రజాజీవితంలో తగిన చైతన్యం ఉంటే ఎంత వెనకపడి ఉన్న దేశం కూడా భోగభాగ్యాలనూ, సుఖవంతమైన ఐహిక జీవితాన్నీ నిర్మించుకోగలుగుతుంది కాని దుష్టశాసనాలూ, అసమర్ధమైన న్యాయవ్యవస్థా ఉన్నట్టయితే ప్రజాజీవితం దుఃఖపూరితంగా ఉండి, ఎన్నటికీ పైకి రాలేదు మామూలు కుటుంబాల విషయంలో క్రమశాసనం అభ్యుదయాన్ని చేకూర్చలేకపోవచ్చు కాని దేశం మీద చూసినట్లయితే అభ్యుదయానికి క్రమశాసనాలూ, సరి అయిన న్యాయపద్ధతీ పునాదిలాటివి

రష్యాలో ప్రజాహిత న్యాయవ్యవస్థ ఉన్నదని పాశ్చాత్యదేశాలలోని నాయకులు కూడా అనటం వింటున్నాం అక్కడ న్యాయమూర్తులను నియమించటంలోనూ, వారి స్వాతంత్ర్యాన్నీ, న్యాయవాదుల స్వాతంత్ర్యాన్నీ కాపాడటంలోనూ ప్రజాహితం పూర్తిగా పాటించబడుతున్నదట కాని ఇది నిజమైనట్టయితే రష్యా సంపద నిత్యవృద్ధి చెందడానికి గాను నిర్బంధకూలిపై అక్కడి ప్రభుత్వం ఆధారపడటానికి అవకాశం తక్కువ రష్యాలో సంపద నిత్యవృద్ధి చెందుతున్న మాట కాదనలేక కొందరు పశ్చిమ యూరప్‌దేశాల రచయితలు, రష్యాలో అనేకలక్షలమంది దాదాపు ఖైదీలుగా ఉండి– మనదేశపు తేయాకుతోటలు వగైరాలలో లాగా ఉత్పత్తి సాగిస్తున్నారని అంటున్నారు అయితే అటువంటి శాసనాలు అమలులో ఉన్న దేశంలో స్వతంత్రమైన న్యాయశాఖ ఉండీ పనిచెయ్యలేదు అటువంటి చోట ప్రజాహితం కూడా అమలుజరగదు

చైనాలో కూడా ఇప్పుడు న్యాయశాఖలో పెద్ద పరివర్తన కలిగింది ఇప్పుడు చైనా నిండా ప్రజా న్యాయస్థానాలున్నాయి వాటిలో న్యాయనిర్ణయం చేసే అధికారం సామాన్యపు ప్రజలకున్నది ఇటువంటి న్యాయస్థానాలను స్వయంగా చూసివచ్చిన అమెరికన్ వర్తకుడొకాయన వీటిని చాలా శ్లాఘిస్తూ రాశాడు అక్కడ కూడా ప్రజాహితం తలెత్తటానికీ, న్యాయపాలన స్వతంత్రంగా అమలు జరగటానికీ గల సంబంధం స్పష్టమవుతున్నది ఇవాళ చైనా ప్రజలు అమెరికా ప్రజలలాగా జీవించలేరు అమెరికా, బ్రిటన్, రష్యా, ఆస్ట్రేలియా, న్యూజీలాండ్ మొదలైన దేశాలలో గల భౌతికసంపద ఇంకా చైనాకు లేదు కాని అక్కడి ప్రజలు తమ భౌతికసంపదను అభివృద్ధి చేసుకుని జీవితం సుఖమయం కావించుకునే ధోరణిలో ఉన్నారు

ఈ ధోరణికి అవాంతరం ఉండదని ప్రజలకు భరోసా ఏమంటే స్వేచ్ఛాయుతమైన వారి న్యాయస్థానాలే

న్యాయస్థానాల స్వాతంత్ర్యానికీ ప్రజాహితానికీ గల సన్నిహిత సంబంధం తెలుసుకోవాలంటే గత సన్నిహిత చరిత్రలోనూ, ప్రస్తుత చరిత్రలోనూ చాలా నిదర్శనాలు కనిపిస్తాయి ఫాసిస్టు పరిపాలనకింద ప్రజాహితమూ ఉండదు, స్వతంత్రమైన న్యాయపాలనా ఉండదు హిట్లరు పరిపాలనలో కార్మికుల తగాదాలను పరిష్కరించటానికి ఏర్పాటైన న్యాయస్థానాల్లో ఫ్యాక్టరీ యజమానులుంచబడ్డారు! బ్రిటిషువారి పరిపాలనలో న్యాయస్థానాలకు ఎట్టి స్వాతంత్ర్యమూ ఉండేది కాదు ప్రభుత్వంవారు చేసే ప్రజాపీడిత శాసనాలను అమలుజరిపి వాటిప్రకారం ప్రజలను శిక్షించటమే న్యాయస్థానాల పని మన రాజ్యాంగంలో ప్రజాస్వాతంత్ర్యాలు ఉదహరించి వాటిని కాపాడటానికి సుప్రీంకోర్టును ఏర్పాటు చెయ్యటమూ, కార్యశాఖవారి అజమాయిషీ న్యాయశాఖ పై లేకుండా చెయ్యటమూ చెప్పుకోదగిన పరిణామం దాన్ని పత్రికలు ప్రశంసించటంలో ఆశ్చర్యం లేదు మన రాజ్యాంగంలో ప్రజాస్వాతంత్ర్యాలకు కొన్ని నిర్బంధాలు ఏర్పాటు చేయబడ్డాయంటే అంతవరకు మన రాజ్యాంగం లోపభూయిష్టమే

దుష్టశాసనాలను సవరణ చేసే అధికారాన్ని మన న్యాయస్థానాలు ఉపయోగపరచుకోవటం మనం చూశాం ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టంలో ఒక సెక్షను అక్రమమని సుప్రీంకోర్టు కొట్టివేసింది అట్లానే బొంబాయి మధ్యనిషేధచట్టం పై బొంబాయి హైకోర్టు తీర్పు ఇచ్చింది మద్రాసు హైకోర్టు కొన్ని పత్రికల పై ఆంక్షలను కొట్టివేసింది ఇటీవల ఎ కె గోపాలన్‌ను విడుదల చేసింది కలకత్తా హైకోర్టు బెంగాలు కమ్యూనిస్టు పార్టీ పై నిషేధాన్ని కొట్టివేసింది రాజ్యాంగరీత్యా ఇవన్నీ శాసన దుర్నయాలు మన న్యాయస్థానాలకు వీటిని సంస్కరించే అధికారం లేకపోతే, రాజ్యాంగం దారిన రాజ్యాంగం ఉండగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల తాలూకు కార్యశాఖలు ఈ దుర్నయాలను అమలుచేసి ప్రజాహితానికి ఆటంకం కలిగించి ఉండేవేనని స్పష్టమవుతున్నది

దేశంలో ప్రజాస్వామికం అమలులో ఉన్నదన్న మాత్రంచేత ప్రజాహితం సరిగా కొనసాగుతున్నదని భావించటానికి లేదు ప్రజాస్వామికానికీ ప్రజాహితానికీ గల సంబంధం చెడకుండా చూసుకుంటూ ఉండటం అవసరం బ్రిటనులో ప్రభుత్వం చేసే శాసనాలకు తిరుగులేదు ఆ శాసనాలు అక్రమంగా ఉండకుండా చూసే భారం ప్రభుత్వపక్షం పైనా, పార్లమెంటు సభ్యులమీదా ఉన్నది వారు తమ విధిని సరిగా నిర్వర్తించని పక్షంలో, బ్రిటను ప్రజలు ప్రభుత్వాన్నీ, దానితోబాటు శాసనాలనూ మార్చగల రాజకీయ జాగృతి కలిగిఉన్నారు బ్రిటిష ప్రజల ప్రత్యేకతను గురించి రాస్తూ ఒక విలేఖరి "బ్రిటిష ప్రజలు తమకిష్టంలేని ప్రభుత్వాన్ని పదవిలోంచి తొలగించేటప్పుడు తాము ఎన్నుకునే ప్రభుత్వం ఇంతకన్నా బాగా ఉండబోతుందా అన్న విషయం కూడా పాటించరు" అన్నాడు వారు ప్రభుత్వాన్ని గాని ప్రవర్తనను బట్టి ఆదరిస్తారు

అమెరికాలో కూడా ఇండియాలో లాగే సుప్రీంకోర్టు ఉన్నది రాజ్యాంగానికి దుష్టశాసనాలవల్ల తభావతు కలగకుండా అక్కడి సుప్రీంకోర్టు చూస్తుంది ఇటీవల ఒక విశ్వవిద్యాలయంలోకి నీగ్రోలను రానివ్వాలని సుప్రీంకోర్టు తీర్పు ఇచ్చింది ఇది స్థానిక ప్రభుత్వానికి ఇష్టమైన తీర్పు కాదు

అమెరికాలో సుప్రీంకోర్టు ఉన్నప్పటికీ అక్కడి పాలకవర్గాల వారు ప్రజాపీడన విధానాలను అవలంబించి ప్రజాహితం జరగకుండా ఉండటానికి న్యాయస్థానాలనూ, న్యాయమూర్తులనూ వినియోగించగలుగుతున్నారు ప్రభుత్వాన్ని ప్రతిఘటించేవారిని సమర్థించుతూ వారి తరపున వాదించే న్యాయవాదులు శిక్షకు గురికావటం జరుగుతున్నది

ఇది రుజువు చెయ్యటానికి ఒక అమెరికన్ విలేఖరి మూడుకేసులను పేర్కొన్నాడు మొదటిది హారీబ్రిడ్జెస్ అనే వాడి కేసు బ్రిడ్జెస్ తాను కమ్యూనిస్టుపార్టీ సభ్యుణ్ణి కానని ప్రమాణం చెయ్యని నేరానికి విచారింపబడ్డాడు ఇతని తరపున వాదించినవారిలో ఇద్దరిపై న్యాయస్థాన ధిక్కరణ నేరం మోపబడింది రెండవ కేసు కమ్యూనిస్టులది విద్రోహకర చర్యలు చేస్తున్నారని 11మంది కమ్యూనిస్టు సభ్యులపై విచారణ జరిగింది వాది తరపున వాదించిన ఐదుగురు న్యాయవాదుల పైనా న్యాయస్థాన ధిక్కరణ నేరం మోపబడింది న్యూజెర్సీలో ఆరుగురు నీగ్రోలపై హత్యానేరం మోపబడింది వీరి తరపున వాదించటానికి న్యాయవాదులను తీసుకురావటానికి అవాంతరాలు కల్పించబడ్డాయి

అమెరికాలో ప్రస్తుతం గల పరిస్థితిని గురించి ఈ విలేఖరి ఈ విషయాలు చెబుతున్నాడు "కమ్యూనిస్టుల పై గల ద్వేషం కొన్ని న్యాయస్థానాల కార్యకలాపాలలో ద్యోతకమయింది కొందరు లాయర్లు కూడా ఈ ద్వేషానికి గురి అయినారు ముద్దాయి పై గల ద్వేషం కారణంగా న్యాయక్రమం తప్పినప్పుడు దాన్ని తీవ్రంగా విమర్శించాలి అప్రియమైన ముద్దాయిలనూ, సిద్ధాంతాలనూ సహితం న్యాయస్థానాలలో సమర్థించవలసిన బాధ్యత తమపై ఉన్నదని అమెరికన్ లాయర్లు గ్రహించాలి "

ఈమధ్య అమెరికాలోనే ఏడుగురు నీగ్రోలు ఒక తెల్లదాన్ని చెరిచిన నేరానికి మరణదండనకు గురయ్యారు ఈకేసు సక్రమంగా విచారించబడలేదని ప్రపంచంలో అనేక పత్రికలు వ్యాఖ్యానించాయి "నన్ను వీరు చెరిచారు" అని సాక్ష్యం చెప్పిన స్త్రీ అక్షరాలా అదృశ్యమై పోయింది స్త్రీలను చెరిచిన నేరానికిగాను అమెరికా దక్షిణ రాష్ట్రాలలో అనేకవేల మంది నీగ్రోలు మరణదండన పాలైనారు ఆ రాష్ట్రాలలో అదే నేరానికి ఒక్క తెల్లవాడు కూడా మరణదండన పొందినట్లు రుజువుకాలేదని పత్రికలు విమర్శించగా అక్కడి అధికారులు ఒక్క తెల్లవాడి ఉదాహరణ ఇచ్చారు కాని వారు అతని మరణదండనకు గల అసలు కారణాన్ని దాచిపెట్టారు వాడు 14 ఏళ్ళ పిల్లను చెరచటం కాక, ఆమెని చంపాడు! అమెరికా ప్రజాస్వామికమైనప్పటికీ, అక్కడ ప్రతీరాష్ట్రానికీ ఒక్కొక్క సుప్రీంకోర్టున్నప్పటికీ తెల్లవాళ్ళకు ఒక న్యాయమూ, నీగ్రోలకు మరొక న్యాయమూ ఉండటం స్పష్టంగా కనిపిస్తున్నది అమెరికా ప్రజలే అయిఉండి కూడా నీగ్రోలూ, యూదులూ అక్కడ తీవ్రమైన అధికారపీడనకు అన్నివిధాలా గురి అవుతున్నారు

బ్రిటిషువారి పరిపాలన కింద మలయాలో కూడా న్యాయం ఇట్లాగే జరుగుతున్నది మలయా కమ్యూనిస్టుపార్టీతోనో, ట్రేడ్‌యూనియన్‌తోనో సంబంధం ఉన్నదన్న అనుమానంతో అధికారులు అనేకవేలమందిని అరెస్టుచేసి కాన్‌సెంట్రేషన్ క్యాంపుల్లో ఉంచుతున్నారు అధికారులకు విరుద్ధంగా ఒక కేసులో పనిచేసిన జాన్ ఈచన్ అనే ఆయనను ఆరోపణ ఏమీ చేయకుండానే అరెస్టు చేశారు ప్రభుత్వానికి ఎదురుగా కేసుపెట్టటమే నేరం!

మనదేశంలో ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టం కూడా ఇటువంటిదే ఈ చట్టం ప్రకారం నేరం చెయ్యకపూర్వమే చేస్తాడన్న అనుమానంతో పోలీసులు ఎవరినన్నా అరెస్టుచేసి విచారణ లేకుండా ఖైదు చేయవచ్చు ఇటువంటి చట్టాన్ని ప్రజాహితం కోరే ప్రభుత్వం ఎందుకు అమలుచేయరాదంటే దీని ఆధారంతో స్థానికాధికారులు తమ ప్రతికక్షులనూ, తమను విమర్శించేవారిని విచారణలేకుండా ఖైదులో ఉంచటానికి పనికివస్తుంది చిల్లర అధికారులు తమ విరోధులను జైలులోకి నెట్టవచ్చు పన్నులెగగొట్టటం అనే నేరం చేసినవారి పేర్లు భద్రంగా దాచిపెట్టే మన ప్రభుత్వం నేరాలు చెయ్యబోతారని వ్యక్తులను అరెస్టు చేస్తున్నదన్న విమర్శ బయలుదేరింది ప్రజాహితం కోరే ప్రభుత్వం ఇటువంటి విమర్శకు గురికారాదు

ఇంతకన్న దారుణం – తెలంగాణా ముద్దాయిల ఉరిశిక్షలు నల్లగొండజిల్లా స్పెషల్ ట్రిబ్యునల్ వారు 12మందిని విచారించి వారికి ఉరిశిక్షలు విధించారు ఈ శిక్షలపై సుప్రీంకోర్టుకు అప్పీలు చేయగా సుప్రీంకోర్టు న్యాయమూర్తులు నల్గొండ ట్రిబ్యునల్ చేసిన విచారణపట్ల ఆక్షేపణలు తెలుపుతూ కూడా అప్పీలు కొట్టివేశారు కారణం 1950 జనవరి 26కు పూర్వం హైదరాబాదులోని ట్రిబ్యునల్ ఇచ్చిన తీర్పు పై అప్పీళ్ళు విచారించే అధికారం సుప్రీంకోర్టుకు లేదు

ఈ ముద్దాయీల తరఫున ట్రిబ్యూనల్‌లో వాదించటానికి వకీలు నియమించబడలేదు 'టైమ్స్ ఆఫ్ ఇండియా' పత్రిక దీనివిషయమై సంపాదకీయం రాస్తూ, "సుప్రీంకోర్టు న్యాయమూర్తులకున్న చిక్కు ప్రభుత్వానికి లేదు ప్రభుత్వం ఇందులో జోక్యం కలిగించుకుని ఉరిశిక్షలు తప్పించాలి" అన్నది ప్రభుత్వం ఈపని చెయ్యనిపక్షాన ఈ ముద్దాయీలకు నల్లగొండ ట్రిబ్యూనల్‌లో జరిగిన అన్యాయాన్ని మనప్రభుత్వం సమర్థించిందన్న కళంకం శాశ్వతంగా ఉండిపోతుంది

పోలీసుశాఖను అడ్డం పెట్టుకుని ప్రభుత్వశాఖలు ప్రజలపై ఒత్తిడి సాగించటమూ, పోలీసు అధికారులకు అంతులేని అధికారాలిచ్చి వాటిని వారు దుర్వినియోగపరచే అవకాశాలు కలిగించటమూ కూడా ప్రజాహితానికి విరుద్ధం కాంగ్రెసు ప్రభుత్వాల హయాంలో ఈ రెండూ జరుగుతున్నాయి దీనికి కుంభారే ఉదంతం ఒక దృష్టాంతం

ఆర్ బి కుంభారే మధ్యప్రదేశ్ శాసనసభలో కాంగ్రెసు సభ్యుడు నూలుకొరత సత్యాగ్రహంలో మార్చి12న అరెస్టయినాడు ఇతరులతోబాటు జైలుశిక్షా, జరిమానా విధించబడ్డాడు ఈయన ఫిబ్రవరి నెలలో పండిట్‌నెహ్రూకు రాసిన కొన్ని అంశాలు గమనించదగినవి ఆయన ఈ విధంగా రాశాడు

"నేను కాంగ్రెసువాణ్ణయినా నన్ను ప్రతిపక్షం వాడల్లే చూస్తున్నారు నేను ప్రజాహితం కోరి చేసిన ఫిర్యాదులు పాటించటం లేదు "

ప్రతిపక్షవర్గాలను పీడించటం అర్థం చేసుకోగలననీ, అమాయిక ప్రజలను పోలీసులు పీడించటం అర్థం చేసుకోలేననీ కుంభారే నెహ్రూకు రాశాడు కాని ప్రతిపక్షాలను పీడించే విధానాలే ప్రజాపీడనకూ దారితీస్తాయి ఈ కారణంచేతనే ఆస్ట్రేలియాలో మెంజీస్ కమ్యూనిస్టులను అణచటానికి తయారుచేసిన శాసనాన్ని అక్కడి సుప్రీంకోర్టు కొట్టేసింది

మాటవరసకు కుంభారే లాగే మనం కూడా ప్రతిపక్షాన్ని అణగదొక్కటాన్ని 'అర్థం చేసుకోవటానికి' ప్రయత్నిద్దాం ప్రజాహితాన్ని వ్యతిరేకించటానికి గల అవకాశం ప్రభుత్వవర్గానికే ఉంటుందని మనం గ్రహించాలి ప్రతిపక్షమన్నది ఎటువంటి దుష్టసిద్ధాంతాల పై ఆధారపడినా అది ప్రజాపీడనను చాటుగా, చట్టవిరుద్ధంగా తప్ప సాగించలేదు పోలీసు శాఖా జైళ్ళూ, పాలనాయంత్రమూ, చట్టాలు చేసే శక్తీ ప్రభుత్వపక్షం చేతిలో ఉంటాయి అటువంటప్పుడు ప్రతిపక్షం ప్రభుత్వాన్ని ఎదిరించాలంటే ప్రజాహితాన్ని పురస్కరించుకుని మాత్రమే ఆ పనిచెయ్యాలి ఏ ప్రభుత్వపక్షం గాని ప్రతిపక్షాన్ని అణచివేయవలసిన అగత్యం కలిగిందంటే, విధిగా దాని అర్థమేమిటంటే ప్రతిపక్షం ప్రజలను తనవైపు లాక్కొనే ప్రచారం చేస్తుందనే దానితోబాటు ప్రభుత్వపక్షం ప్రజాహితాన్ని పాటించేస్థితిలో లేదని కూడా అర్థమవుతుంది ఈ అంతరార్థాన్ని మన ప్రజలు బాగా ఎరగరు మన ప్రజలకు ప్రజాస్వామికము అనుభవం లేదు కాని ఇతరదేశాల ప్రజలు ప్రభుత్వం తలపెట్టే చర్యలను సులభంగా పసికట్టగలరు బ్రిటనువంటి దేశంలో పదవిలో ఉన్న పక్షం రెండోపక్షం వారిమీద ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టం ప్రయోగించి ఒక్కక్షణం బతకలేదు

మనం ప్రజాస్వామికం అవలంబించామని సంతృప్తిపడి లాభం లేదు ప్రభుత్వవర్గం వారు ప్రతికూల వర్గాల మీద దుష్టశాసనాలు అమలుజరిపినన్నాళ్ళూ మన వోటింగు హక్కు కూడా వీసానికి కొరగాదు ప్రజాస్వామికాన్ని ప్రజాహిత పద్ధతిలో నడిపించగలది ప్రజల జాగృతే స్థానికాధికారుల నిరంకుశత్వాన్నీ, పోలీసుశాఖ యొక్క దుష్ప్రవర్తననూ ప్రతిఘటించే చైతన్యం ప్రజలలో ఉండాలి తమకిష్టమైన పక్షం ప్రభుత్వం నిర్వహిస్తోంది గదా అని ఆ పక్షం చేసిన ప్రతిశాసనాన్నీ, దాని పరిపాలన కింద జరిగే అక్రమాలనూ సహించే ప్రజలు ఏ పరిపాలననయినా భరించగలరు అట్టి ప్రజలకు ప్రజాస్వామ్యం అనవసరం

తెలుగుస్వతంత్ర వారపత్రిక 30-3-1951

## 14. రక్షణలోని లోతుపాతులు

ఈ మధ్య ఢిల్లీ మీదుగా ఎవరిదో జెట్‌విమానం ఇండియా ప్రభుత్వరక్షణశాఖ అనుమతి లేకుండా ఎగిరి, మన విమానాలు దాని వెంటపడగా పారిపోయిన సంగతి పత్రికల్లో చదివాం దీని విషయమై మన రిపబ్లికన్ పార్లమెంటులో ప్రశ్నలు వేసిన సభ్యులు కొందరు మన రక్షణ విమానాలు అక్రమంగా మనదేశం మీద ఎగిరే విమానాల పై ఎట్టి చర్య తీసుకుంటాయో తెలియగోరగా మన రక్షణోపాయాలు రహస్యంగా ఉంచటం మంచిదని జవాబువచ్చింది

పరాయిదేశపు విమానం మన అనుమతి లేకుండా మనదేశం మీద ఎగిరి మనం ఏదీ చేసేలోపునే అది దాటిపోయిందంటే మన పార్లమెంటు సభ్యులు ఆందోళన చెందటం సబబే ఒకే ఇంజను గల జెట్‌విమానం అణువుబాంబు పడెయ్యగలదనుకోవటానికింకా ఆధారంలేదు గాని అదే ఏ సూపర్ ఫోర్ ట్రెస్ విమానమో అయితే అంత పనీ చెయ్యటానికి అవకాశం ఉంది హిరోషిమా నాగసాకీ నగరాల మీద అణువుబాంబులు వేసి చక్కాపోయింది ఇట్లా చుట్టపుచూపుగా వచ్చిన విమానాలే గాని విమానతూగిడీలు కావు

అయితే మన ప్రభుత్వం మన రక్షణ రహస్యాలు బయటపెట్టకపోవటంలోనూ కొంత అర్థం లేకపోలేదు "ఇతరదేశాల విమానాలు మా సరిహద్దు దాటిన ఐదు నిమిషాలలో మా విమానాలు వాటిని అటకాయించగలవు" అని రష్యనులు కొంతకాలం కింద చెప్పుకున్నారు అటువంటి రక్షణ ఏర్పాట్లుండటం సరిహద్దుకు దూరంగా ఉండే నగరాల రక్షణకు ఎంతో లాభం కొరియాయుద్ధం ఆరంభమైనాక కొన్ని అమెరికా విమానాలు 'పొరపాటున' రష్యా ప్రాంతం మీదికి వెళ్ళి అక్కడ ఎగిరే రష్యన్ విమానాన్ని పడగొట్టాయి దాని గురించి చెబుతూ ఒక రష్యను, "తలుచుకుంటే మేము ఆ అమెరికన్ విమానాలను అతి సులువుగా పడగొట్టి ఉండేవాళ్ళం" అన్నాడు

ఇండియా రక్షణశాఖ వారికి కూడా కొన్ని రక్షణ రహస్యాలున్నాయని తెలియటం మనందరికీ కొంత సంతృప్తినిస్తుందనటానికి సందేహం లేదు

కాని ఇక్కడ ఉత్పన్నమయే ప్రశ్న ఏమిటంటే, అసలు రక్షణ అన్నది ఎంతవరకు సాధ్యం అని కిందటి యుద్ధంలో జర్మను విమానాలు రోజూ ఇంగ్లండుమీదికి దాడికి వచ్చి బాంబులువేసి పోతూ వచ్చాయి యుద్ధం ఆఖరుదశలో బ్రిటను విమానతూగిడీలు రాత్రివేళా అమెరికన్ విమానతూగిడీలు పట్టపగలూ వెళ్ళి జర్మనీలోని ప్రధాన నగరాలను నేలమట్టంచేసి ఎన్నో లక్షల ప్రాణులను బలిగొన్నాయి అట్లాగే అమెరికను విమానాలు జపాను నగరాలను భస్మీపటలం చేశాయి జపానువాళ్ళు దొంగపోటున పెరల్‌హార్బరు పై బాంబులు వేసేసరికి పశ్చిమ రాజ్యాలకు రెండుమూడేళ్ళపాటు దూరప్రాచ్యంలో మంచినీరు పుట్టకుండా పోయింది

ఇటువంటి పరిస్థితిలో ఎన్నిదేశాలు నిజంగా ఆత్మరక్షణ చేసుకోగలవు? "మా సరిహద్దు దాటిన ఐదు నిమిషాలలో ఏ శత్రువిమానాన్నయినా మా ఫైటరు విమానాలు ఎదుర్కోగలవు" అని రష్యా లాగ సాహసించి చెప్పగలదేశాలెన్ని ఉన్నాయి? ట్రూమన్ ప్లాను ఫలించి పశ్చిమ రాజ్యాలన్నీ తమ యుద్ధశక్తులను కలబోసుకుని కొన్నివేల విమానాలను ఒకే దిక్కునుంచి రష్యామీదికి పంపితే రష్యా తనను తాను ఎంతవరకు రక్షించుకోగలదు? మాటవరసకు వెయ్యిమైళ్ళ దూరం గురిగా వెళ్ళే వీ-2 రాకెట్టు తయారుచేసి వాటిలో అణువుబాంబులు అమర్చితే రష్యా ఎట్లా ఆత్మరక్షణ చేసుకుంటుంది? కిందటియుద్ధంలో ఇతరదేశాలమీద దెబ్బతీసిన దేశాలున్నాయి, ఇతరదేశాలను ఓడించిన దేశాలున్నాయి, ఇతర దేశాల చేతిలో చావుదెబ్బ తిని ఓడిన దేశాలూ ఉన్నాయి యుద్ధంలో ప్రవేశించి ఆత్మరక్షణ చేసుకున్న దేశం అమెరికా ఒకటే అమెరికా కూడా ఆత్మరక్షణ చేసుకోలేదు, దాని 'ఆత్మ' మీదికెవరూ రాలేదు

యుద్ధోన్మాదశక్తులను శాంతిశక్తులు అదుపులో ఉంచలేకపోవటమే జరిగి మూడో ప్రపంచయుద్ధమే వస్తే దాని స్వరూపం ఎట్లా ఉంటుందో కొరియా చూపిస్తున్నది ఉత్తర కొరియా బలాలు దక్షిణ కొరియా ప్రవేశించినప్పుడు యుద్ధమన్నది దాదాపు లేనేలేదు కొరియామీదికి అమెరికా బలాలు వచ్చిపడ్డతరవాత దాడిచేసే బలాలు చావుదెబ్బ తిన్నాయి, దాడికి గురి అయిన దేశం నేలమట్టమయింది ఇవి రెండే మార్గాలు మూడోమార్గం లేదు ఒక దేశం మీదికి మరొకదేశం వచ్చిపడితే దాడికి గురి అయినవారు ఆత్మరక్షణ చేసుకోలేకపోతే ఆక్రమణకు గురి అవుతారు, ఎదురుతిరిగి ప్రాణాలొడ్డి పోరితే ఉభయపక్షాలూ నాశనమవుతాయి

అమెరికా వంటి అగ్రదేశానికీ, కొరియావంటి అల్పదేశానికీ మధ్య జరిగే యుద్ధంలోనే ఇట్లా ఉంటే రెండూ అగ్రదేశాలే అయితే ఇక వేరే చెప్పనవసరం లేదు

ఇటువంటి పరిస్థితులలో రక్షణబలాలూ, రక్షణ విధానమూ, రక్షణ వ్యయమూ అన్న మాటలకు ఆవగింజంతైనా అర్థం లేదు తనమీదికి ఏ దేశమైనా ఏ కారణం చేతనైనా దాడిచేస్తుందని తోస్తే దానిమీద ఎదురుదెబ్బ తీసే శక్తి ప్రతిదేశమూ సంపాదించాలి, లేదా యుద్ధప్రయత్నం దాదాపు విరమించుకోవచ్చు ఈ దృష్టిలో అగ్రరాజ్యాలు తప్ప మరేవీ యుద్ధప్రయత్నం జోలికే పోనవసరం లేదు

ఇటువంటి పరిస్థితి నిజంగా అల్పదేశాలకు చాలామంచిది ఎందుకంటే పారిశ్రామికంగా పైకి వచ్చిన పెద్దదేశాలు తమ జాతీయ వ్యయంలో ఒక పెద్దభాగాన్ని యుద్ధఖర్చుకింద వినియోగించుకుని దాని వల్ల ధరలు హెచ్చి, నిర్మాణం తగ్గి తారుమారై పోయుంటే అల్పదేశాలు తమకున్న కొద్ది రాబడిని నిర్మాణయుతంగా వినియోగపరుచుకుని సంపదనూ, జాతీయాదాయాలనూ, జీవనప్రమాణాలనూ పెంచుకుని పైకిరావచ్చు కాని ఇది ప్రత్యక్షంగా ఎక్కడా జరగటంలేదు పెట్టుబడిదారీతో కూడిన ప్రజాస్వామికం గల దేశాలలో ప్రతీదీ 'రక్షణ' ఖర్చు అని పేరుపెట్టి రాబడిలో చాలా పెద్దమొత్తాన్ని నిర్మాణ కార్యక్రమాలకు ఉపకరించకుండా చేసుకుంటున్నది నూతన నిర్మాణాల ఆవశ్యకత దాదాపు ఏమీలేని అమెరికా తనరాబడిలో చాలా పెద్దతునక యుద్ధనిర్మాణానికి ఖర్చుచేస్తుంటే, ఉన్న రాబడి అంతా కూడా నిర్మాణానికి వెచ్చించినా చాలని ఇండియా వంటి దేశాలు కూడా తమఖర్చులో సగం రక్షణకు వినియోగపరుస్తున్నాయి! ఇంకా రష్యా చైనాల వంటి అగ్రరాజ్యాలే నిర్మాణం చురుకుగా సాగించటం కనిపిస్తున్నది

అల్పరాజ్యాలు తమ రాబడినంతా యుద్ధఖర్చుకింద కేటాయించినా ఇతరదేశాల పై దెబ్బగాని తిరుగుదెబ్బ గాని తీయలేని పరిస్థితిని బట్టే సమష్టి రక్షణ అనేది బయలుదేరింది నిజమైన రక్షణలాంటిదే నిజమైన సమష్టిరక్షణ కూడానూ – శుష్కపదం సమష్టి రక్షణ అంటే క్రియకు ఏమిటంటే, సమష్టిగా తిరుగుదెబ్బ లేక దెబ్బతీసేశక్తే అట్లాంటిక్ రాజ్యాల కూటాన్ని తీసుకున్నట్టయితే అట్లాంటిక్ రాజ్యాలు ఏ పెద్దదేశం మీదా– మాటవరసకు రష్యా మీద పెద్దదెబ్బ తియ్యలేవు, ఎదురుదెబ్బ తియ్యలేవు కాని అవన్నీ సమష్టిగా యుద్ధబలాలను పెంపొందించుకుని అమెరికా వెనక నిలబడినట్టయితే రష్యా దెబ్బకాచుకోవటానికి– అంటే, రష్యా మీద దెబ్బతీయటానికి కూడా అన్నమాటే –శక్తిచాలి ఉంటాయనే ఉద్దేశంతో అట్లాంటిక్ రక్షణ పథకం తయారయింది

ఇటువంటి పథకం చిన్నరాజ్యాల శక్తులను ఏ విధంగా పెంపొందించేదీ చూద్దాం వ్యష్టిబలంకన్న సమష్టిబలం హెచ్చన్న సిద్ధాంతం యుద్ధం విషయంలోనూ, రక్షణ విషయంలోనూ ఎంతవరకు వర్తిస్తుందో చూద్దాం

అట్లాంటిక్ ఒడంబడిక రక్షణ ఒడంబడిక అని అమెరికా అన్నప్పుడు అది యుద్ధఒడంబడిక అని రష్యా పేరుపెట్టింది ఇందులో తప్పేమీలేదు దీనికి చాలా కారణాలున్నాయి 1) అట్లాంటిక్ ఒడంబడికలో మూడు అగ్రరాజ్యాలనబడేవి – అమెరికా, బ్రిటను, ఫ్రాన్సులు చేరి ఉన్నాయి ప్రపంచంలోని మిగిలిన అగ్రరాజ్యాలలో చైనా దూరంగా ఉన్నది అదీకాక ఈ ఒడంబడిక

పుట్టేనాటికి చైనాలో కమ్యూనిస్టు ప్రభుత్వం ఏర్పడి ఉండలేదు, చైనాను ఏలుతూ ఉండిన చాంగ్‌కైషేక్ అమెరికాకు అమ్ముడుపోయే ఉన్నాడు అట్లాంటిక్ ఒప్పందం కింద అమెరికా చేసిన విదేశసహాయంలో చైనా ప్రాంతానికి కూడా కొంత ప్రత్యేకించబడింది అందుచేత అట్లాంటిక్ ఒడంబడిక కేవలం రష్యాకు వ్యతిరేకంగా ఉద్దేశించబడినదయింది అట్లాంటిక్ ఒడంబడికకు ఆధారంగా రష్యా పశ్చిమరాజ్యాలపై దెబ్బతీస్తుందనే అనుమానమో రష్యా పై దెబ్బతీయాలన్న దురుద్దేశమో ఉండితీరాలి అగ్రరాజ్యాలలో రష్యా ఒక పక్షమూ, అమెరికా బ్రిటను ఫ్రాన్సులు మరొకపక్షమూ అనీ ఈ రెండుపక్షాలకూ మధ్య యుద్ధం జరిగి తీరుతుందనీ అట్లాంటిక్ ఒప్పందం ఎలుగెత్తి చాటింది ఇది ఐక్యరాజ్య మూల సూత్రాలకు కేవలం విరుద్ధం ఎందుచేతనంటే అగ్రరాజ్యాలకు మధ్య సామరస్యం కోసం ఐక్యరాజ్యసమితి పనిచేస్తూ ఉండగానే, రక్షణకైతేనేం, యుద్ధానికైతేనేం, ఒక అగ్రరాజ్యానికి విరుద్ధంగా మరి మూడు అగ్రరాజ్యాలూ, తదితర అల్పదేశాలూ కలిసి యుద్ధసంబంధమైన ఒడంబడిక చేసుకుని దానికిగాను ద్రవ్యాలూ, ఆయుధాలూ, బలాలూ సృష్టిచేయటం జరుగుతున్నది ఇదంతా ఐక్యరాజ్యాల సూత్రాలననుసరించే జరుగుతున్నదని అట్లాంటిక్ ఒడంబడిక రాజ్యాలు నేటికీ బుకాయిస్తున్నాయి

ఐక్యరాజ్యసమితిని కాస్సేపు విస్మరించి సమష్టి రక్షణయత్నం అసహాయదేశాలను ఏ స్థితికి తెచ్చిందో చూసినట్టయితే ఏ భయం కొద్దీ సమష్టి రక్షణ అన్నది ఆచరణలో తీసుకురాబడిందో ఆ భయం యుద్ధం లేకుండానే సంప్రాప్తమయినట్లు స్పష్టమవుతుంది ఒక పెద్దరాజ్యం– ఉదాహరణకు రష్యా– చిన్న రాజ్యాలను– ఉదాహరణకు పశ్చిమయూరపు రాజ్యాలను– కబళించకుండా ఉండగలందులకు సమష్టి రక్షణ –ఉదాహరణకు అట్లాంటిక్ రాజ్యాల రక్షణ– పుట్టింది కాని దీని పుటకలోనే ఆ అల్పరాజ్యాలు ఒక పెద్దరాజ్యానికి– ఉదాహరణకు అమెరికాకు పాదాక్రాంతం కావలసి వచ్చింది అట్లాంటిక్ ఒడంబడికలో మూడు అగ్రరాజ్యాలున్నప్పటికీ అందులో రెండు, బ్రిటను ఫ్రాన్సులు తమ రాజకీయ, ఆర్థిక స్వాతంత్ర్యాన్ని అమెరికాకు ధారపోశాయి! అమెరికా ఒత్తిడికి తట్టుకోలేక ఈ 'అగ్ర'రాజ్యాలు తమ తలలకు మించిన యుద్ధ వ్యయభారాన్ని నెత్తినవేసుకున్నాయి బ్రిటిషు పత్రికలూ, ఫ్రెంచి పత్రికలూ రాసే మాటలలో ఏమన్నా యదార్థం ఉన్నట్టయితే, ఆ రెండుదేశాలూ తలపెట్టిన యుద్ధఖర్చూ, కార్యక్రమమూ ఆదేశాల ప్రభుత్వాలు బుద్ధిపూర్వకంగా సాగించేవి కావటానికి వీల్లేదు అంతకంటే కూడా దారుణం ఏమంటే అమెరికా ఈ 'అగ్ర'దేశాలను ఏ దేశంతో యుద్ధం చేయమంటే అవి ఆ దేశంతో యుద్ధం చెయ్యకతప్పే గతి లేదు!

బ్రిటను ఫ్రాన్సులే ఈ దుస్థితిలో ఉంటే ఇతరదేశాలమాట వేరే చెప్పేదేమిటి? రష్యా పశ్చిమ యూరపుపై దండెత్తివస్తే రష్యాకు అనుకూలమైన రాజకీయ, ఆర్థిక విధానాలు అవలంబించవలసి వస్తుందని భయపడి ఈ దేశాలు అమెరికా నిర్ణయించే రాజకీయ ఆర్థిక విధానాలను శిరసావహించి ముందుగానే దివాలా తీస్తున్నాయి "ఇంతకన్న రష్యాను ఎదిరించకుండా రష్యాకు లొంగిపోవటం మేలు" అని కొందరు బ్రిటిషు రచయితలు ఇటీవల పత్రికలలో ప్రచురించటంలో ఆంతర్యం ఇదే రష్యా యూరపు పైకి దండెత్తి వస్తుందన్న మాటకు ఆధారంలేదు, బ్రిటన్ అమెరికాకు తన స్వాతంత్ర్యాన్ని ధారపొయ్యటం ప్రత్యక్షంగా కనిపిస్తోంది! బ్రిటిషు మేధావులీస్థితి భరించలేకుండా ఉన్నారు

ఫ్రాన్సు, జర్మనీలలో ఇంకొకరకం వాదం బయలుదేరింది రష్యా దండెత్తివస్తుందన్న భయంతో గదా యూరపుసమష్టిరక్షణ? ఈ సమష్టిరక్షణ ఒక పుష్కరంలోగా సాధ్యమయేటట్టు లేదు ఒకవేళ తనంతట తాను దాడిచెయ్యని రష్యా, ఈ ప్రయత్నాలు చూసి నిజంగానే దాడి చేస్తుందేమో? ఏది తప్పించుకోవటానికి సమష్టి రక్షణ జరుగుతున్నదో అదే ఈ ప్రయత్నఫలితంగా దాపరిస్తుందేమో?

ఈ ప్రశ్నలోగల ధ్వని చాలా విషాదకరమైనది ఎందుచేతనంటే 'ఏమో' అన్నది చివర తగిలించకుండానే, సమష్టి రక్షణ పేరుతో అల్పరాజ్యాల, అగ్రరాజ్యాల స్వాతంత్ర్యం అమెరికాకు ఇదివరకే ఆహుతి అయిపోయి 'సమష్టి' అనేపదం హాస్యప్రేరకంగా నిలబడిపోయింది

రక్షణకు సంబంధించిన రాజకీయాలను పశ్చిమదేశాలకన్న ఆసియాదేశాలు బాగా అర్థం చేసుకున్నందుకు మనం గర్వించాలి పసిఫిక్ రక్షణ ఒడంబడిక కోసం అమెరికా బ్రిటనులు చేసిన ప్రయత్నాలు విఫలం చెయ్యటానికి అన్ని అసియాదేశాలూ అంతో ఇంతో తోడ్పడ్డాయి అందులో ఇండియా, ఇందులోనూ నెహ్రూ చాలా ఘనపాత్ర వహించటం జరిగింది ఐతే దీనికి కారణం లేకపోలేదు అట్లాంటిక్ ఒడంబడిక వెనకచేరిన దశాలు కమ్యూనిజం యొక్క అభివృద్ధి ద్వారా నష్టపడేవర్గాల పరిపాలనలో ఉన్నాయి కేవలం రష్యాను నాశనం చేసే ఉద్దేశంతోనే అవి అమెరికాకు తమ స్వాతంత్ర్యాలన్నిటినీ ధారపోశాయి కాని నానాటికీ రష్యా నాశనమవుతుందన్న ఆశ సన్నగిల్లి అమెరికాకు తమ పై పెత్తనమూ, ఒత్తిడిచేసే శక్తీ లభించటమే ప్రత్యక్షంగా కనిపించేసరికి ఆ దేశాలకు ఆందోళన హెచ్చుతోంది నిజంగా రష్యా తమమీద పడుతుందన్న అనుమానమే ఉంటే ఈ దేశాలు అమెరికాకు అమ్ముడుపోయి అటువంటి ప్రమాదం హెచ్చుచేసుకుని ఉండవు రేపు జర్మనీ పునరాయుధధారణ గురించి పశ్చిమరాజ్యాలు పాత ఒడంబడికలను ఉల్లంఘిస్తే రష్యా తన సైన్యాలను జర్మనీలోకి నడిపేటందుకు న్యాయమైన హక్కు కలిగి ఉన్నది ఒక జర్మనీ పునరాయుధధారణే కాక, జపాను పునరాయుధధారణ, ఫ్రాంకో మిత్రత్వమూ మొదలైనవన్నీ రష్యాను దాడికి పురికొల్పేవిగా ఉంటూ, రష్యా దాడినెదుర్కొనే సాధనాలుగా ప్రకటించబడుతున్నాయి పాత యుద్ధ ముద్దాయిలందరూ జైళ్ళనుంచి విడిపించబడి యుద్ధపథకాల నిర్మాణంలోకి తీసుకోబడుతున్నారు సమష్టి రక్షణ సమష్టి నాశనానికి సులువుగా దారితీస్తున్నది

ఆసియా దేశాలకీ అగచాట్లు లేవు ఏదైనా పెద్దరాజ్యం తమపైన బడితే ఇవి వ్యష్టిగా గాని సమష్టిగా గాని తమ్ము తాము రక్షించుకోలేవు ఈ దేశాలు ఎన్నటికీ సామ్రాజ్యాలను విస్తరింపజేయలేవు ఇవి తమను తాము నిర్మించుకుని స్వశక్తి వల్ల పైకి రావలసినవే అందుచేతనే ఈదేశాలకు పెట్టుబడిదారీ విధానంలో పరిమితమైన విశ్వాసమే ఉన్నది, సామ్యవాదంతో కూడిన ఉత్పత్తి విధానంలో వీటికి విశ్వాసం హెచ్చు కమ్యూనిజమును అవలంబించిన రష్యా, చైనాలను నాశనం చెయ్యటంవల్ల వీటి స్థితి పెరిగేదీ లేదు– తరిగితే తరగవచ్చు (ఇండియా చైనాల పరస్పర సహకారంతో ఆసియాదేశాలన్నీ పైకిరావచ్చునని నెహ్రూ విశ్వాసం) అందుచేతనే అసియా దేశాలు సమష్టి రక్షణపథకాలను అంతదూరంలోకి కూడా రానివ్వటంలేదు

ఇండియా వంటి ఆసియాదేశాలలోని పెట్టుబడిదారీవర్గాల దృష్టి అమెరికా వగైరా దేశాల పాలకవర్గాల దృష్టితో కలవవచ్చు గాక కాని ఈ వర్గాలు పూర్తిగా బలపడి పరిపాలనలో పెద్దస్థానం ఇంకా అందుకోలేదు పాలకవర్గాలలో వీరికి నూటికి నూరుపాళ్ళు ప్రాతినిధ్యం లేదు

పెట్టుబడిదారీ సామ్రాజ్యవాద స్వరూపంలో ఆసియాదేశాలను చిరకాలం పీల్చిపిప్పి చేసి ఉండటం ఈనాడు ఈ దేశాలకు లాభిస్తున్నది ఎందుకంటే రక్షణ విషయంలో ఏ దేశానికీ లేని వాస్తవికదృష్టి ఆసియాదేశాలలో కానవస్తున్నది అదేమిటంటే, రక్షణకు అత్యంతప్రధానం ఆయుధాలు కాదు అంగబలం, దేశం యొక్క ఉత్పత్తిశక్తీ కాదు, ప్రజల జీవితప్రమాణం ప్రజలందరూ దేశరక్షణకు పూనుకుని నిలబడి, వారి జీవనప్రమాణం అభివృద్ధి అయే పరిస్థితులు కూడా తోడైనట్టయితే ఆదేశం ఎంత చిన్నదైనా సరే దానిని ఎంత పెద్దదేశం కూడా జయించి తనకు లోబరచుకోలేదు (ఉదాహరణ కొరియా, అమెరికా) అటువంటి పరిస్థితి గల దేశం ఇతరులను భయపెట్టలేదు ఎందుచేతనంటే అటువంటి దేశానికుండేదే నిజమైన రక్షణబలం, ఆ బలం దురాక్రమణకు వినియోగించదు రోజురోజుకూ తమ జీవనప్రమాణాలు పెంచుకునే కృషిలో నిమగ్నులై ఉన్న రష్యా, చైనాల ప్రజలు ఆ పని మానేసి తమ పాలకవర్గాలకోసరం ఇతర దేశాలపైకి దురాక్రమణకు పోతారా? అట్లా స్వార్థం కొరకు తమ ప్రజలను ఇతరదేశాల ఆక్రమణకు పంపేవారు ప్రజల జీవనప్రమాణాలను నానాటికీ పెరగనిస్తారా?

కమ్యూనిజం ఎక్కడ తల ఎత్తినా అణచటానికి కంకణం కట్టుకున్న అమెరికాలో కమ్యూనిజమును అణచటానికి నిజమైన సాధనం ప్రజాజీవితం పెంపొందించటమేనన్న రాజకీయ నైతిక సూత్రాన్ని చెప్పేవారు అసంఖ్యాకులుగా ఉన్నారు ఈ రాజకీయ నైతిక సూత్రాన్ని అమెరికా పాలకులు కూడా గుర్తించకతప్పటం లేదు అందుకనే ఆసియాదేశాలవంటి పేదదేశాలను ఆర్థికంగా పైకి తెస్తామనీ, అందుకు తగిన సహాయం ఇస్తామనీ వారు వాగ్దానం చేస్తున్నారు ఈ నైతిక సూత్రం మీద పనిచేసే వారే ఐతే అమెరికా పాలకులు సమష్టిరక్షణ పేరిట అమెరికా, ఫ్రాన్సు, బ్రిటను వగైరా దేశాలలో ప్రజాజీవన ప్రమాణాలను ఎందుకు కుంగదీస్తున్నారో తెలుసుకునే అధికారం మనకున్నది వారు తమ ప్రజలమీదకన్న ఆసియా ప్రజలను ఎక్కువ ప్రేమిస్తున్నారనుకోవాలా? ఆ విషయం కొరియానడిగి తెలుసుకోవలసి ఉంటుంది

కామన్వెల్తు సాహచర్యం మనచేత కూడా రక్షణ ఖర్చుకింద చాలాధనం దుర్వ్యయం చేయిస్తున్నది నిజమైన రక్షణ ఏ విధంగా సాధ్యమవుతుందో మన ప్రభుత్వం గ్రహించినట్టయితే బ్రిటనుకు పనికిరాని నౌకలనూ, విమానాలనూ ఇతర సామగ్రినీ కొనే డబ్బుతో జాతీయ నిర్మాణ కార్యక్రమాలు సాగించి ప్రజలకు కావలసినంత తిండీ, బట్టా, పనీ, ఆరోగ్య సౌకర్యాలూ, ఇళ్ళూ వగైరా చూపవచ్చును ఇది కేవలం పుస్తకాలలో సిద్ధాంతం కాదు ఈ సిద్ధాంతాన్ని రష్యా, చైనా, తూర్పుయూరపు దేశాలు ప్రత్యక్షంగా అమలుజరుపుతున్నాయి ప్రజల జీవితాలను పెంపొందించే మార్గాలే దేశరక్షణను అభివృద్ధి చేసే మార్గాలు కూడానూ ఆ రెంటికీ మధ్య వైరుధ్యం చూసే వాళ్ళు కేవలం గుడ్డివాళ్ళు ఒకదాని కోసం మరొకటి త్యాగం చేసేవాళ్ళు ఏనాడో తమ వాస్తవ స్వాతంత్ర్యాన్ని కోల్పోయి ఇతరుల చేతిలో కీలుబొమ్మలై ఆడుతున్నవాళ్ళు

పశ్చిమరాజ్యాలు తమ రక్షణశక్తిని కోల్పోతున్నాయి గాని పెంపొందించుకోవటం లేదు ఈ విషయం కిందటేడుకన్న ఈయేడు బాగా తెలిసివచ్చింది పై సంవత్సరం ఇంకా బాగా తెలిసివస్తుంది ఈ దేశాలన్నిటిలోనూ శాంతి ఉద్యమాలే కాక, యుద్ధవ్యతిరేకోద్యమాలు కూడా దినదిన ప్రవర్ధమానమవుతున్నాయి

తెలుగుస్వతంత్ర, వారపత్రిక 6-4-1951

## 15. సంఘధర్మం : నేరం

ఎంతవరకు నిజమో తెలీదుగాని బొంబాయిలో ఒక ప్రసిద్ధ కాంగ్రెసు వ్యవహర్తపోషణలో ఐదువందలమంది మవాలీలున్నట్టు కొంతకాలం క్రితం బొంబాయిలోనే చెప్పుకునేవాళ్ళు ఇది నిజమైనా కాకపోయినా, ఒక్కొకవిధమైన సంఘధర్మం సమాజంలో అమలుజరిగేటప్పుడు ఉన్నత పాలనాధికారులకే హంతకులతోనూ, దోపిడీగాళ్ళతోనూ పని ఉంటూ వుంటుంది చట్టం దారిన చట్టం ఉండగా చట్టాన్ని అధిగమించి పరిపాలకులు ఈ దుండగుల ద్వారా కొన్ని పనులు చేయించుకుంటూ ఉండటమూ, దానికి ప్రతిఫలంగా ఆ పరిపాలకులు ఆ దుండగులను చట్టంబారినుండి సంరక్షిస్తూ ఉండటమూ జరుగుతూ ఉంటుంది

"అంతటా అలాగే తగలబడుతుంది మానవనైజమే అంత" అని కొందరనవచ్చు గాని అది పూర్తిగా నిజం కాదు ఇటువంటి పరిస్థితులు మానవనైజాన్ని బట్టి కాక సంఘధర్మాన్ని బట్టి ఏర్పడుతూ ఉంటాయి

వెనకటికొక జమీందారు కింద పనిచేసే ఉద్యోగి ఒకడు తనకు ఎస్టేటువారిచ్చే జీతం చాలటం లేదని విజ్ఞాపన చేసుకోగా ఎస్టేటు అధికారులు "చాల్చాల్లే, నీ సంపాదన నువు చేసుకోలేనివాడివి మాకేం రాబట్టిపెడతావు? ఉద్యోగం చాలించుకో" అన్నారుట ఆ జమీందారీ వ్యవస్థలో 'పదవే' అన్నీనూ పదవిలో ఉన్నవాడు ఎట్లా దోచాలో, అందులో అధికార్లకు ఎంత ముట్టజెప్పాలో తానే స్వయంగా చూసుకోవాలి అట్లా చూసుకునే శక్తే వాడి అర్హతకు దాఖలా దాన్ని మనం అవినీతి అనవచ్చు కాని అది ఆ వ్యవస్థలో నేరం ఎంతమాత్రమూ కాదు

అటువంటి ఏర్పాటే ప్రజాహితవ్యవస్థలో ఉంటే అది అవినీతే కాక నేరం కూడా అవుతుంది బ్రిటిషువారు అటువంటి నేరాన్ని ఈ దేశంలో బాగా పెంపొందించారు అది వారు బుద్ధిపూర్వకంగా చేసిన పనే భారత ప్రజలను నేరుగా దోపిడీ చెయ్యటానికి బ్రిటిషువారికి అంగబలం లేక పరోక్షాన భారతీయాధికారుల చేతనే ప్రజలను దోపిడీ చేయించటానికి అనువైన పరిస్థితులు కలిగించారు అది ఏమంత కష్టం కాదు ప్రభుత్వోద్యోగాలలో నియమించే వారికి అధికారాలు బాగా ఇవ్వటమూ, జీతాలు తక్కువగా ఇవ్వటమూ చేసినట్టయితే మిగిలిన పని వారే చేస్తారు బ్రిటిషువారి చల్లని పరిపాలనలో 10రూపాయలకు కరణీకాలూ, 18 రూపాయలకు పోలీసు ఉద్యోగాలూ చెయ్యటానికి ప్రజలు సిద్ధపడ్డారంటే ఆ జీతాలతో సంతృప్తిపడి కాదు, ఆ హోదాలద్వారా అంతులేని దోపిడీ చెయ్యటానికి అవకాశాలుండటం వల్ల

చైనా జాతీయ ప్రభుత్వాధినేత చాంగ్‌కైషేక్ తన సైనికాధికారులను ఇటువంటి స్థితిలోనే ఉంచాడు

అందుచేతనే రాజ్యాంగంలో ప్రజాహిత సూత్రాలు ఎన్ని ఇమడ్చబడి ఉన్నప్పటికీ పరిపాలనలో ప్రజాహితం సరిగా అమలుజరగని పరిస్థితిలో సంఘం ధర్మం పూర్తిగా కుంటుపడి నేరం విజృంభిస్తుంది సంఘవ్యవస్థకూ సంఘధర్మానికీ ఎడం జాస్తి అవుతున్నకొద్దీ నేరం స్వైరవిహారం చెయ్యసాగుతుంది

అమెరికాలో ఇది పరిపాటే డబ్బూ, అధికారమూ, శక్తీ పాలిస్తాయి ధనికులూ, రాజకీయవేత్తలూ, గాంగ్‌స్టర్లూ వాటిని సాగిస్తారు అక్కడ రాజకీయవేత్తలు చాటుగా నేరాలు చెయ్యటమూ, నేరస్తులు చాటుగా రాజకీయాలు నడపటమూ కూడా జరుగుతూ ఉంటుంది అమెరికా రాజకీయాలలో హత్యలు కూడా జరుగుతూ ఉండటం కద్దు ఈ మధ్య జరిగిన విచారణలో ఇటువంటి వివరాలే బయటపడ్డాయి అధ్యక్షుడు ట్రూమన్ నుంచి కాస్టెల్లో అనేవాడివరకూ సన్నిహిత సంబంధాలు ప్రత్యక్షంగానో పరోక్షంగానో ఉన్నట్టూ, దొంగలమురా నాయకుడైన కాస్టెల్లో తెరచాటునుంచి తన ఇష్టం వచ్చినవారిని పదవులలో పెడుతూ వచ్చినట్టు బయటపడింది అమెరికాలో ఉన్న సంఘధర్మం ధనికవాదాన్ని పూర్తిగా బలపరిచేది అక్కడ ఉన్న చట్టం ప్రజాహితానికి అనుకూలమైనది సంఘధర్మానికీ ప్రజాహితానికీ పొత్తు కుదరనప్పుడు నేరం విజృంభించటమూ, చట్టం దెబ్బతినటమూ తప్పనిసరి

అమెరికాలో జరిగిన విచారణలను గురించి మాట్లాడుతూ విచారణ నడిపించిన కఫాకర్, విచారణవల్ల నేరస్థుల పద్ధతులు బయటపడ్డాయనీ, ఇకముందు చట్టాన్ని మరికొంత బిగించి నేరస్థుల ఆటకట్టించాలనీ అన్నాడు వెనక హూవర్ కాలంలో మద్యనిషేధం వల్ల నేరాలు రెచ్చినట్లే ప్రస్తుతం జూదం మూలంగా నేరాలు రెచ్చిపోతున్నాయని కూడా ఆయన అన్నాడు

సంఘధర్మం గురించి అమెరికన్లకంటే బ్రిటిషువారే బాగా ఎరుగుదురనిపిస్తుంది ఈ విచారణలను గురించే ఒక బ్రిటిష పత్రిక మరొకవిధంగా చెప్పింది అధికసంఖ్యాకులైన ప్రజలు అనుసరించని చట్టాలు అమలుచెయ్యడం వల్ల నేరం హెచ్చిపోతుందని ఈ పత్రిక అన్నది ఇందులో చాలా నిజం ఉన్నది

శాసనాలు స్వతహాగా చాలా గొప్పవనుకుని సంతృప్తి పడినంతమాత్రాన లాభంలేదు అవి ప్రజల అవసరాలను తీర్చేవిగానూ, అధికసంఖ్యాకులైన ప్రజలు బలపరిచేవిగానూ, ఉండాలి మద్యనిషేధం చాలామంచిదని మన పరిపాలకులు దానిని ప్రవేశపెట్టారు అమెరికాలో ఈ మద్యనిషేధం ఎటువంటి దురంతాలకు దారితీసినదీ తెలిసికూడా ఈ పని చేశారు దానివల్ల తాగుడు తగ్గకపోగా నేరం జాస్తి అయింది

ప్రపంచంలో ఏ రాజకీయపార్టీ కూడా అవలంబించని గొప్ప ఆదర్శాలు పరించి అధికార స్వీకారం చేసిన కాంగ్రెసు పరిపాలన కింద సంఘధర్మం దెబ్బతిని నేరం జాస్తి అవుతున్నది సంఘధర్మం ఎట్లా శిథిలమవుతున్నదీ తెలుసుకోలేకుండా మన ప్రభుత్వాలు నేరాలను అరికట్టటానికి శాసనాలు తయారుచేశాయి

దేశంలో దొంగవ్యాపారమూ, అధికార్లలో లంచగొండితనమూ, అవినీతీ హెచ్చాయి దొంగవ్యాపారాన్ని శిక్షిస్తామన్నారు శిక్షించారు రెండుమానికలు బియ్యం అమ్మిన వాళ్ళనూ, అగ్గిపెట్టె అణాకు అమ్మినవాళ్ళనూ శిక్షించారు బళ్ళకు బళ్ళు బియ్యం దొంగరవాణా చేసిన

వారిని వదిలేశారు ఆశ్చర్యమేమీ లేదు ప్రభుత్వం నేరాలన్నిటినీ శిక్షించటానికి పూనుకుంటే తానే బోనులో నిలబడాలి మంత్రులపై అవినీతి ఆరోపణలు జరిగినప్పుడు ప్రభుత్వం వాటిని గురించి బహిరంగ విచారణలు ఎన్నడూ జరపలేదు పైపెచ్చు నేరారోపణలకు గురి అయినవారు ఆరోపణలు చేసినవారిని కూడా నేరస్థులుగా ప్రకటించి ఆవిధంగా తమను తాము సమర్థించుకో జూడటం కూడా జరిగింది!

సాంఘికనేరం గురించి మన నాయకులకు కూడా విస్పష్టమైన అభిప్రాయాలు లేకపోవటం దేశదౌర్భాగ్యం కాంగ్రెసు పదవిలోకి రాకపూర్వమే పట్టాభి గారు ఒక గొప్పసంగతి సెలవిచ్చారు దొంగ అమ్మకం ఎంత నేరమో, దొంగ కొనుగోలు కూడా అంతే నేరమన్నారు సరి అయిన ధరకు ప్రభుత్వం ప్రజలకు తిండీ, గుడ్డా, మందులూ అందించలేనప్పుడు ప్రజలు అవి లేకుండా జరుపుకోవాలి గాని వాటిని ఎక్కువధరకు కొనరాదని పట్టాభి గారి భావమేమో – లేక వారు ఫేస్‌పౌడర్లనూ, సెంట్లనూ గురించి మాట్లాడారో తెలీదు

కాంగ్రెసు ప్రభుత్వాలు సంఘనేరాన్ని అరికట్టలేరన్నది స్పష్టం ఎందుచేతనంటే వారు సంఘధర్మం కన్న స్వలాభాలనూ, ధనికవాదాన్నీ, తమ భారం తగ్గించుకోవటాన్ని ముఖ్యంగా ఎంచుతున్నారు వారు ఒకవంక ధనికవర్గం వారితో సాధ్యమైనన్ని విధాల రాజీపడుతూ, వారిని సంతృప్తి పరుస్తూ, ప్రజల అసంతృప్తిని లాఠీలతోనూ, తుపాకులతోనూ అణుస్తున్నారు ప్రభుత్వవర్గాలలోనూ కాంగ్రెసు వర్గాలలోనూ గల అవినీతి కిందికి విస్తరించకుండా ఉండటం అసంభవం అవినీతి ఉన్నదని అగ్రనాయకులే ఒప్పుకుంటున్నారు కాని కాంగ్రెసు ఐక్యత అని పేరుపెట్టి ఆ అవినీతితో రాజీపడుతున్నారు గాని బయటపెట్టి ఖండించటం లేదు సంఘద్రోహులను పట్టుకోవటానికి డబ్బు ఖర్చుతో ఏర్పాటు చేసి దొరికిన వారిని శిక్షించలేని స్థితిలో ఉన్నారు శాంతిభద్రతలు కాపాడటానికి పోలీసుశాఖ కింద అంతులేని డబ్బు ఖర్చుచేస్తూ ఈ పోలీసులను ధనికులకు అంగరక్ష గానూ ప్రజలకు పీడ గానూ ఉండనిస్తున్నారు వస్తువుల ధరలు తగ్గిస్తామని కిందటేడు ఇచ్చిన వాగ్దానాన్ని ధరలు పెంచడం ద్వారా పాలిస్తున్నారు గ్రామసీమల్లో రేషనింగు కట్టిపెట్టటం లాంటి పనులు చేసి ప్రజాక్షేమం పట్ల తమ బాధ్యతకు తిలోదకాలిచ్చేస్తున్నారు రాజకీయంగా తమ పార్టీని బలపరచుకోవటమూ, తమకు అండగా ఉండేటందుకు ధనికవర్గాలను దువ్వటమూ తప్ప ప్రస్తుతం కాంగ్రెసు ప్రభుత్వం ఏమీ చెయ్యలేదు ఒక కాలమందు ఈ పద్ధతి సంఘధర్మాన్ని రక్షించి ఉండేదేమో ఈనాడు ప్రజాస్వామిక వ్యవస్థలో ఇది తప్పక సంఘనేరానికి దారితీస్తుంది తీస్తున్నది కూడా బహిరంగంగా ప్రకటించే ఆశయాలూ, చేసే శాసనాలూ ఒక ధోరణిలో ఉంటే సంఘధర్మం మరొక దారిలో పోతున్నది అందుచేత పరోక్షంగా హంతకులకూ, గూండాలకూ సంఘంలో స్థానం ఏర్పడుతున్నది వీరు ప్రభుత్వానికీ, ధనికవర్గానికీ కలిపి కట్టుకుంటున్న గోడకింద చేరి సంఘనేరాన్ని పెంచేస్తున్నారు

చైనాలో కలిగిన మార్పులు చూసి మనం లొట్టలువేసి లాభంలేదు అక్కడ జరిగిన విప్లవమూ, అటుతరవాత ఏర్పడిన పరిపాలనా కూడా ప్రజాహితంతో కూడిన సంఘధర్మానికి విజయం చేకూర్చాయి అక్కడి ప్రభుత్వవర్గాలలో గాని, కమ్యూనిస్టు పార్టీలో గాని అవినీతిపరులూ, లంచగొండులూ తల ఎత్తితే తక్షణం శిక్షించబడతారు వారిమీద అభియోగాలు తెచ్చేవారిని వెళ్ళగొట్టటం జరగదు ఎవరైనా దొంగవ్యాపారం చేస్తున్నట్టు ఫిర్యాదుచేసిన వారిని పోలీసులు

లాకప్‌లో తొయ్యరు ఈ సంగతి మనం ప్రత్యక్షంగా చూసినంత ధైర్యంగా చెప్పవచ్చు దానికి ప్రజాజీవితంలో కలిగే పరిణామమే సాక్ష్యం మనం ఆమెరికను జీవితవిధానమే కోరుతామో, చాంగ్‌కైషేక్ బ్రాండు ప్రజాస్వామ్యమే కోరుతామో, ప్రస్తుత చైనా జీవితవిధానమే కోరుతామో నిర్ణయించి దానికోసం పాటుపడాలి ప్రజాస్వామికంలో సంఘధర్మానికి స్వరూపమిచ్చే బాధ్యత ప్రజలది

తెలుగు స్వతంత్ర వారపత్రిక, 20-4-1951

# 16. కాంగ్రెస్ వహించవలసిన బాధ్యత

కీర్తిశేషుడైన సర్దారుపటేలు 1947 ఆగస్టు15 అనంతరం చేసిన ప్రతి ఉపన్యాసం లోనూ, ప్రసంగంలోనూ కూడా "మనం కష్టించి సాధించిన ఈ స్వాతంత్ర్యాన్ని దక్కించుకోవాలి" అంటూ ఉండేవాడు ఆయన ప్రకటించిన ఈ భావం ఎంతమందిని చైతన్యవంతం చేసిందీ తెలుసుకోవటానికి ఆధారంలేదు కాని ప్రజలను ఉత్తేజపరిచే మహత్తరమైన విప్లవ వాస్తవికత ఆ మాటలలో లేదు తమతమ స్వాతంత్ర్యాన్ని తనకు అర్పించుకునే దేశాలు 'స్వతంత్ర'దేశాలని అమెరికా ప్రభుత్వం అంటున్నది ఈ భావం కూడా ప్రపంచ స్వాతంత్ర్యకాముకులనెంతమందిని చైతన్యవంతులను చేస్తున్నదీ చెప్పటానికి ఆధారంలేదు

ఒక్కటి తెలుసుకోవాలి - ఈ పరిభాష తప్పు ప్రస్తుతం ప్రపంచం ఎదుర్కొనే క్లిష్ట పరిస్థితిలో ఇటువంటి పరిభాష వినాశనానికి మాత్రమే దారితీస్తుంది రోగియొక్క జబ్బును సరిగా నిర్వచించలేని వైద్యుడు రోగం నయం చేసే అవకాశం ఏపాటి ఉన్నదో ఈనాటి రాజకీయవేత్తలు ప్రస్తుత దేశీయ పరిస్థితిని నిర్దుష్టంగా నిర్వచించే పరిభాష లేకుండా ఈనాటి సమస్యలను పరిష్కరించే అవకాశం అంతే ఉన్నది

ఈ స్వాతంత్ర్యమనే దాన్నే తీసుకుందాం తన స్వాతంత్ర్యాన్ని ఎన్నడూ కోల్పోయి ఎరగని అమెరికా ప్రపంచంలోని స్వతంత్ర దేశాలను రక్షించటానికిగాను ప్రపంచంలో ఎక్కడ కమ్యూనిజం తలఎత్తినా హతమార్చటానికి గాను అంతులేని ధనం వ్యయంచేస్తూ తన ప్రజలనూ, తనను ఆశ్రయించిన దేశాల ప్రజలనూ ఎంతో బాధలకు గురిచేస్తున్నది ఈ అమెరికాయే దక్షిణకొరియా స్వాతంత్ర్యాన్ని రక్షించటానికి వచ్చి కొరియాలో దూకి భయంకరంగా విధ్వంసం చేస్తున్నది అమెరికా అధికార్లు రక్షించే వైనం రానురాను ప్రపంచయుద్ధాన్ని రెచ్చగొట్టుతుందనే భయం ప్రపంచ ప్రజలలో కలగటమే గాక, చిరకాలంగా స్వాతంత్ర్యం అనుభవించి వలసదేశాలను దోచిన సామ్రాజ్యవాద దేశాల ప్రజలు కూడా తమ స్వాతంత్ర్యాన్ని అమెరికా కాజేస్తున్నదని భావించి అమెరికాలోని ప్రభుత్వవర్గాన్ని ద్వేషిస్తున్నారు! అమెరికా ప్రపంచయుద్ధం తెచ్చిపెడితే తమ ప్రభుత్వాలు నిరోధించేస్థితిలో లేవని బ్రిటిష్, ఫ్రెంచి పత్రికలు బహిరంగంగా ఒప్పుకుంటున్నాయి

ఇదంతా చూస్తూ ఉంటే 'స్వాతంత్ర్యం' అనే మాటను నిర్వచించటానికి ఐక్యరాజ్యసమితి పూనుకోవటం ప్రపంచక్షేమానికి ఎంత అవసరమో బోధపడుతుంది కొరియాయుద్ధం 'దురాక్రమణ' అన్న పదాన్ని నిర్వచించటానికి ఐక్యరాజ్యసమితిలో ఒక ప్రయత్నం జరిగింది

గాని స్వాతంత్ర్యాన్ని నిర్వచించటానికి ప్రయత్నం జరగలేదు దురాక్రమణ అంటే ఏమిటో అందరికీ తెలుసు, స్వాతంత్ర్యమంటే ఒక్కొక్కరికి ఒక్కొక్క అభిప్రాయం ఉన్నట్టు కనిపిస్తున్నది ప్రపంచ ప్రజల స్వాతంత్ర్యాన్ని సంరక్షించే నెపంమీద అమెరికా ప్రభుత్వం జపాను జర్మనీల లోని గుత్తపెట్టుబడిదార్లకూ, మాజీ యుద్ధఖైదీలకూ, ఫాసిస్టు హంతకులకూ స్వాతంత్ర్యం ఇచ్చేస్తున్నది ఒక పుష్కరం క్రితం, ప్రపంచ ప్రజల స్వాతంత్ర్యాన్ని శాశ్వతంగా ధ్వంసం చెయ్యటానికి తల ఎత్తి చావుదెబ్బ తిన్న దుష్టశక్తులు ఈసారి ప్రపంచ ప్రజల స్వాతంత్ర్యాన్ని బలపరచటానికి ఆవాహన చెయ్యబడుతున్నాయి! అయితే ఒకవంక పశ్చిమరాజ్యాల వారు, తాము చేసే యుద్ధ యత్నాల ఫలితంగా దారుణ హత్యాకాండ రష్యాలో ప్రారంభించటమా, చైనాలో ప్రారంభించటమా అనే విషయమై అభిప్రాయాలు కలవక కీచులాడుకుంటున్నారు స్వాతంత్ర్యం దృష్ట్యా ఈ కీచులాటకు అర్థమేమిటి? ప్రపంచ ప్రజల స్వాతంత్ర్యానికి ఎక్కువ ప్రమాదం రష్యా నుంచి వస్తున్నదా లేక చైనా నుంచి వస్తున్నదా అన్న సమస్య పై వీరు కీచులాడుకుంటున్నారా? నిర్మాణ కార్యక్రమాలకు వినియోగించవలసిన ద్రవ్యాన్ని తీసుకుపోయి ఈ దేశాలు యుద్ధయత్నాలకు ఆహుతి చేస్తున్నాయా? ఈ దేశాలలో ప్రజా పీడా, అశాంతీ నానాటికీ హెచ్చిపోతున్నాయా? హిట్లరు టోజోల బలాల లాగా ఇవి పరిసర దేశాలను ఆక్రమించుకుంటే ఆయా దేశాల ప్రజలు ఈ దేశాల సైన్యాల పై ప్రతిఘటనోద్యమాలు సాగిస్తున్నారా? ఈ ప్రశ్నలకు సమాధానాలు ఇవాళ ప్రపంచప్రజలందరికీ తెలుసు రెండవ ప్రపంచయుద్ధం ముగిసిన మరుక్షణమే అంతర్జాతీయ ఘోరకలికి అంకురార్పణ జరిగింది చైనా రష్యాలు భయంకరమైనవే అనుకున్నప్పటికీ అక్కడి ప్రభుత్వాలు నిరంకుశంగా పాలిస్తున్నాయే అనుకున్నప్పటికీ అక్కడ ప్రజాజీవితం క్రమాభివృద్ధి చెందుతూ ఉండటం ప్రత్యక్షంగా కనిపిస్తున్నది స్వాతంత్ర్యం కోసం ప్రజలు ఘోరమైన త్యాగాలు చెయ్యాలంటున్నది పశ్చిమరాజ్యాల ప్రభుత్వాలు ధరలు పాపంలాగా పెరిగిపోతున్నవి పశ్చిమరాజ్యాలలో యుద్ధసన్నాహాలూ, వాటితోబాటు పెట్టుబడిదార్ల లాభాలూ ముమ్మరంగా పెరిగిపోతున్నది పశ్చిమ రాజ్యాలలో ఇంతా అయి కూడా నిరుద్యోగమూ, ద్రవ్యోల్బణమూ, కాటకలక్షణాలూ ఉన్నది పశ్చిమరాజ్యాలలోనే కాని కమ్యూనిస్టురాజ్యాలలో కాదు పశ్చిమ రాజ్యాల తుపాకులు ఏయే కమ్యూనిస్టు దేశాల వైపు బారుచేసి ఉన్నాయో ఆ వియిట్మిన్, తూర్పు జర్మనీ, ఉత్తరకొరియా, రష్యా, చైనా, తూర్పుయూరప్ దేశాలలో ఆర్థికంగా ప్రజలు హెచ్చుస్థాయికి వస్తున్నారు పశ్చిమరాజ్యాల వెంట ఉన్న ఒక్క కమ్యూనిస్టు దేశమూ యుగోస్లావియా – ఆర్థికంగా కటకటలాడిపోవటం గమనించదగ్గ విషయం ఇదంతా చూస్తూ సామాన్య ప్రజలు పశ్చిమరాజ్యాలు చేసే యుద్ధసన్నాహాలన్నీ తమపై కట్టిన కత్తి అనుకుంటే అది వారి తప్పు కాదు పశ్చిమ రాజ్యాలు కనీసం తాము రక్షించబోయే స్వాతంత్ర్యం ఎటువంటిదో నిర్వచించినట్టయితే వారి యత్నాలకు విరివిగా ప్రజాసహకారం లభించి ఆ ప్రయత్నాలు ఫలించే అవకాశం ఉన్నది ఏనాటికైనా ప్రపంచాన్ని నీతి పాలించాలి గాని అణువు బాంబులు పాలించవు

పశ్చిమ రాజ్యాల వారు మారణహోమం ద్వారా రక్షించే స్వాతంత్ర్యాన్ని మనం గాని మన ప్రభుత్వం గాని ఇంతవరకు ఆమోదించి ఉండలేదు అయినప్పటికీ మన స్వాతంత్ర్యాన్ని గురించి మనకు కూడా విస్పష్టమైన అభిప్రాయాలుండటం ఎంతో అవసరం ప్రపంచంలో స్వతంత్రదేశాలూ, పరతంత్ర దేశాలూ మాత్రమే ఉంటాయనుకోవటం భ్రమ ఆధునిక

ప్రపంచంలో ఉలిపికట్టె స్వాతంత్ర్యానికి విలువ లేదని పూర్వం చెప్పిన నెహ్రూ ఈ వారం ఉత్తరప్రదేశంలో మాట్లాడుతూ నేడు ప్రపంచంలో నిజమైన స్వాతంత్ర్యం గల దేశాలు కొద్దిగా మాత్రమే ఉన్నాయన్నాడు

స్వాతంత్ర్యం నిర్వచనం గురించి గతంలో జరిగిన శుష్క వాదోపవాదాలతో అనేక విచిత్ర సిద్ధాంతాలు ప్రతిపాదించబడ్డాయి అందులో ఒకటి ఏమిటంటే సృష్టిలో వాస్తవమైన స్వాతంత్ర్యం లేదని ఇది భావవాదం మనిషి ప్రకృతి నియమాలకూ, అవసరాలకూ కట్టుపడి ఉంటాడు గనుక స్వాతంత్ర్యం ఎక్కడా లేనేలేదని భావవాదులు వాదించారు చక్రవర్తినీ బిచ్చగాణ్ణీ ఒకస్థాయిలో ఉంచటానికీ, బిచ్చగాడి నోరునొక్కటానికీ తప్ప ఈవాదం ఇంకెందుకూ పనికిరాదు స్వాతంత్ర్యాన్ని అవసరాలకు పోటీ పెట్టే పక్షాన జఠరపుష్టి గలవాడికన్న అగ్ని మాంద్యం గల వాడికి ఎక్కువ స్వాతంత్ర్యం ఉందనవలసి వస్తుంది!

అవసరాలున్నంత మాత్రాన స్వాతంత్ర్యం లోపించదు వాటిని తీర్చుకునే అవకాశాలలోనే అది లోపించటం జరిగితే జరగాలి ఒకదేశం గాని వ్యక్తి గాని స్పష్టంగా తెలుసుకోవలసినదేమంటే స్వాతంత్ర్యం ఒక నిర్దిష్ట ప్రమాణం గల వస్తువు కాదు ఒక విషయంలో ఉన్నంత స్వాతంత్ర్యం మరొక విషయంలో ఉండదు ఒకనాడున్నంత స్వాతంత్ర్యం మరొకనాడుండదు గతయుద్ధానికి పూర్వం బ్రిటను స్వతంత్ర దేశం ఇవాళ అంత స్వతంత్రదేశం కాదు మార్షల్ సహాయం పుచ్చుకోవటం ఆరంభించిన అనంతరం పశ్చిమరాజ్యాలు తమ స్వాతంత్ర్యాన్ని కొంతవరకు కోల్పోయాయి జర్మనీ జపానులలో రేపు గుత్తదారీ యుద్ధసన్నాహాలూ పూర్తి అయి 1939 నాటి ప్రమాణం అందుకున్నా అమెరికా కర్రపెత్తనం ఉంటుంది గనక 1939లో ఉండినంత స్వాతంత్ర్యం రేపుండదు ఈ దృష్టితోనే నెహ్రూ అవమానకరమైన షరతులపై ఆహారం ఎవరివద్దా పుచ్చుకోమని గట్టిగా చెప్పాడు ఎన్నికలకన్న అన్నం ముఖ్యమని నెహ్రూ అన్నమాట అబద్ధం కాదు ఎన్నికలు ఉన్న రాజకీయ హక్కును ఉపయోగించే సాధనాలు మాత్రమే కాని ఆహారం ఉన్న రాజకీయ హక్కులకు ఉద్వాసన చెప్పేలా కనిపిస్తున్నది మానవుడి అవసరాలన్నిటిలోకీ అగ్రస్థానం వహించేది కావటం చేత అన్నం స్వయంకృషి చేత లభ్యం కానప్పుడు స్వాతంత్ర్యాన్ని హరిస్తుంది అందువల్ల భారతదేశానికి అత్యవసరంగా కావలసినది ఆహారస్వాతంత్ర్యం

ఈవిషయం గుర్తించి కూడా నెహ్రూ మరికొన్ని విషయాలు గుర్తించనట్టూ కనీసం వాటిని పరిగణించనట్టూ కనిపిస్తాడు ప్రస్తుత ప్రభుత్వం దేశ ఆహారసమస్య పరిష్కరిస్తుందని నెహ్రూ భావించినట్లయితే అది కేవలం భ్రమ దేశానికి ఆహారస్వయంసమృద్ధి చేకూర్చే రాజకీయ, ఆర్థిక విధానాలను ఈ ప్రభుత్వం వెలిగా చూస్తున్నది మన ఆహారకొరతను అడ్డం పెట్టుకుని అవమానకరమైన షరతులను ప్రతిపాదించే అమెరికాకు విధేయులైనవారు కొందరు ఈ ప్రభుత్వంలో అగ్రస్థానాలాక్రమించి ఉన్నారు దేశంలో ఏదోమూల తీరని కరువు ఉండటం వారి స్వార్థానికి ఉపకరిస్తుంది ఈ మాతృద్రోహులను నెహ్రూ వదిలించుకోలేడు

స్వాతంత్ర్యం సిద్ధాంతాలను కూడా ఆశ్రయించి ఉన్నది పెట్టుబడిదారీ సిద్ధాంతాలలోకన్న సామ్యవాద సిద్ధాంతంలో ఎక్కువ స్వాతంత్ర్యం ఇమిడి ఉన్నది అందుకే పెట్టుబడిదారీ గల దేశాలలో ప్రజల అవసరాలు ఒకవంక క్లిష్టమవుతుంటే సోషలిస్టు దేశాలలో ఆర్థిక ప్రణాళికలు

అమలుజరిగి ప్రజల జీవనప్రమాణం క్రమాభివృద్ధి చెందుతున్నది ఇంతేగాక సోషలిస్టులు పదవిలోకి వచ్చిన బ్రిటను సోషలిస్టు విధానంలో జాతీయపునర్నిర్మాణం సాగించటానికి మారుగా మార్షల్ సహాయం పుచ్చుకుని అమెరికాకు అమ్ముడుపోయింది ఫలితం– తనకన్న యుద్ధంలో ఎక్కువదెబ్బ తిన్న రష్యా వల్ల తనకు ప్రమాదం ఉన్నదని గడగడలాడుతూ యుద్ధఖర్చు తలకుమించి మీద వేసుకుని బ్రిటను ఆర్థిక సంక్షోభం తెచ్చిపెట్టుకుంటే, రష్యా తన పునర్నిర్మాణం విజయవంతంగా చేసుకుని నూతన నిర్మాణాలు కూడా తలపెట్టి ముందుకు సాగుతున్నది

ఇదంతా చూసి నేర్చుకోదగిన నీతి ఏదో ఉండాలి కాని మన కాంగ్రెసు ప్రభుత్వం ఆ నీతిని నేర్చుకోవటంలేదు నెహ్రూ చిరకాలంగా సోషలిజం అర్థం చేసుకున్నవాడై ఉండికూడా జాతీయ పునర్నిర్మాణానికి పెట్టుబడిదారీ మీదనూ, సామ్రాజ్యవాదుల మీదనూ, వారి ఏజెంట్లమీదనూ ఆధారపడి వ్యవహరిస్తున్నాడు అయితే నెహ్రూయే చెప్పినట్టు తన ధర్మాన్ని నెరవేర్చలేని ప్రభుత్వం అధికారం చలాయించతగదు ఎన్నికలలో గెలవటమూ, ఓడటమూ ముఖ్యంగాదు తిండికి మాడి జనం చచ్చేదేశంలో రాజకీయ గూడుపురాణీకి స్థానం లేదు ఇవాళ జరిగే రహస్యమంతనాలూ, కూటాలూ, ఒప్పందాలూ, కుట్రలూ అవాస్తవికతకు చిహ్నాలు దీనిని అంతమొందించగలవారు ప్రజలు రేపు జరిగే ఎన్నికలలోనైనా ప్రజాశక్తులు విజృంభించి దేశానికి అత్యవసరమైన స్వాతంత్ర్యానికి పునాది ఏర్పడకపోయినా, ఈ ఎన్నికలలో తమకే విజయం చేకూరాలనే దురాశతో కాంగ్రెసు ప్రభుత్వాలు తమకున్న అధికారాలను దుర్వినియోగపరచి ప్రజాశక్తులను పోలీసు తుపాకులతో అణచినా ఎన్నికలు వృథా ఈ పద్ధతులు కాంగ్రెసు అవలంబించటమే జరిగితే వాటి ఫలితంగా చెలరేగే అశాంతికి కాంగ్రెసే పూర్తిబాధ్యత వహించవలసి ఉంటుంది

తెలుగుస్వతంత్ర, వారపత్రిక 4-5-1951

# 17. పాట్నా సమావేశం : ఒక పరిశీలన

ప్రస్తుతం దేశాన్ని పాలించే కాంగ్రెసుపార్టీకి ప్రతిపక్షంగా నిలబడే పార్టీని సృష్టిచెయ్యడానికై పాట్నాలో ఆచార్య జె బి కృపలానీ నాయకత్వం కింద జరిగిన సమావేశం ద్వారా నేర్చుకోవలసిన అంశాలు చాలా ఉన్నాయి కాంగ్రెసు అగ్రనాయకులలో ఒకడైఉండి, కాంగ్రెసు అధ్యక్షపదవి నిర్వహించి కూడా ఉండిన కృపలానీ స్వయంగా ఈ పార్టీని స్థాపిస్తూ ఉండటమూ, కాంగ్రెసు సభ్యత్వాలకు రాజీనామాలిచ్చిన అసంఖ్యాకులు ఈ పార్టీలో చేరే అవకాశాలుండ టమూ ఒక ప్రధానాంశం కాంగ్రెసుకు ప్రతిపక్షం ఏర్పాటుకు గాను 'మితవాదుల' నుంచే ఇటువంటి ప్రయత్నం బయలుదేరటమూ, అది దేశవ్యాప్తంగా ఏర్పాటుకావటానికి ప్రయత్నం జరగటమూ మరొక ప్రధానాంశం కాంగ్రెసుకు వ్యతిరేకంగా వామపక్షాల సమీకరణ జరగాలన్న ప్రయత్నం అదివరకే జరుగుతున్నది కాని ఆ ప్రయత్నం వేరు, ఈ ప్రయత్నం వేరు అది విప్లవదృష్టితో కూడుకున్న యత్నం, ఇది సంస్కరణ దృష్టితో కూడుకున్నది

పాట్నా సమావేశం ప్రారంభోపన్యాసంలో ఆచార్యకృపలానీ కొత్తపార్టీ ఆవశ్యకతను బయటపెడుతూ కాంగ్రెసు ప్రభుత్వంలోని లోపాలను విపులీకరించాడు ఆయన కాంగ్రెసు

పై చేసిన విమర్శలో ప్రచారంతో కూడిన అసత్యారోపణలూ, అతిశయోక్తులూ లేవు తాను కాంగ్రెసుకు వ్యతిరేకంగా పార్టీ ఏర్పాటుచేయబోతూ ఉన్నవాడై ఉండి కాంగ్రెసును విమర్శించటంలో ఎంతో నిగ్రహం చూపాడంటే అందుకు ఆశ్చర్యపడవలసిందే

అయితే, ఇప్పుడు కృపలానీ సాగించదలుచుకున్న పార్టీని గురించి చాలా సందేహాలు కలుగుతాయి ఇటువంటి పార్టీవల్ల దేశానికి అవసరం ఉన్నదా? కాంగ్రెసు చెయ్యని పని ఈ పార్టీ చేస్తుందా? ఎందుకు చేస్తుంది? ఎట్లా చేస్తుంది? దీని ఆదర్శాలేవి? కాంగ్రెసుకూ ఈ పార్టీకీ గల తేడా ఏమిటి? ఇది ఇతర రాజకీయపార్టీలతో ఎట్లా వ్యవహరిస్తుంది? ఈ ప్రశ్నలకు ప్రజలు సమాధానాలు తెలుసుకో గోరుతారు ఇందులో కొన్ని ప్రశ్నలకు కృపలానీ సమాధానాలు చెప్పాడు మిగిలిన సమాధానాలు మన ఊహకు వదలబడ్డాయి అందులో కొన్ని చర్చనీయాంశాలు

ప్రజాస్వామికంలో పోటీపక్షాలవల్ల కలిగే లాభాన్ని సూచించాడు కృపలానీ ఇందులో ఆయన కొత్తగా బయటపెట్టిన గొప్ప సత్యం ఏమీ లేదు ప్రజాస్వామికం పేర పోటీచేసే రాజకీయ పార్టీలు ఒకదానికుళ్ళు మరొకటి బయటపెట్టి ప్రజల వోట్లు సంపాదించుకొనగలవు గాని జీవితవిధానంలో పెద్దపెట్టున పరిణామాలు సాధించలేవు ఇవాళ మనదేశంలో జరగదగిన ప్రజాజీవిత పరివర్తన 'ప్రజాస్వామిక పార్టీ పోటీ'లతో సాధ్యమవుతుందా అన్నదొక వివాదవిషయం

కాంగ్రెసులో 'స్వార్థం, పదవీ వ్యామోహం, అవినీతి, కుళ్ళు', కాంగ్రెసు 'అసమర్థత' మొదలైనవాటిని గురించి చాలా పత్రికలు ప్రతినిత్యమూ ఘోషిస్తూనే ఉన్నాయి వాటిని రుజువు చెయ్యవలసిన అవసరం కూడా ఇవాళ లేదు కాంగ్రెసు పరిపాలనా ఫలితాలను బిచ్చగాళ్ళ దగ్గిర్నుంచీ అందరూ అనుభవిస్తూనే ఉన్నారు అసలు సమస్య ఏమంటే, భారత జాతీయతకు అర్ధశతాబ్దం పైగా ప్రాతినిధ్యం వహించి, పావుశతాబ్దం పైగా గాంధీజీ నాయకత్వం కింద స్వాతంత్ర్య సమరం సాగించిన కాంగ్రెసు సంస్థ, గాంధీజీ బతికి ఉండగానే, పటేలు పోకముందే జవహర్లాలు నెహ్రూ, రాజేంద్రప్రసాద్, రాజగోపాలాచారి మొదలైనవారి నాయకత్వం కిందే ఎట్లా 'కుళ్ళింది'? ఇవాళ కాంగ్రెసు అగ్రనాయకులుగా ఉన్నవారికి కాంగ్రెసు మహదాశయాలు తెలియవని ఎవరంటారు? అగ్రనాయకులంతా అవినీతిపరులైపోయినారని ఎవరంటారు? ఒకవేళ కాంగ్రెసు అగ్రనాయకులంతా 'పతన'మైనా సరే అనుకున్నా, కాంగ్రెసు సంస్థను ఇంకా నమ్మి ఉన్న అసంఖ్యాకుల మాటేమిటి? ఈ కాంగ్రెసు తిరిగి బాగుపడాలని ప్రార్థనలు చేసేవారి మాట ఏమిటి?

కాంగ్రెసువర్గాలలోని 'పతితు'లంతా కాంగ్రెసులో ఉండిపోయి, 'పవిత్రు'లంతా తన పార్టీలోకి వస్తారని ఏ ప్రమాణాన్ని బట్టి ఆచార్యకృపలానీ దేశానికి హామీ ఇస్తారో ఆయన ప్రారంభోపన్యాసం వ్యక్తం చెయ్యటం లేదు కాంగ్రెసులో ఉన్న జబ్బేమిటో చెప్పినంతమాత్రం చేత సరిపోదు ఆ జబ్బెందుకు వచ్చినదీ కృపలానీ తెలిపిఉండవలసింది కాంగ్రెసుకు సోకిన వ్యాధి ఈ పార్టీకి సోకదనుకోవటానికి ఆధారాలున్నదీ లేనిదీ కృపలానీ ప్రసంగం రుజువుచెయ్యటం లేదు

రుజువు చెయ్యటం లేదనటం కూడా సరికాదు, కాంగ్రెసులోని జబ్బు ఈ పార్టీకి కూడా సోకవచ్చునన్న భయం కృపలానీ ప్రసంగం కలిగిస్తున్నది! "కాంగ్రెసుకూ ఈ కొత్తపార్టీకీ,

ప్రాథమిక నియమాలకు సంబంధించినంత వరకు వ్యత్యాసం ఉండదని నేను చాలాసార్లు చెప్పి ఉన్నాను మాది స్నేహపూర్వకమైన ప్రతిపక్షం మాతృసంస్థ (కాంగ్రెసు)పట్ల మాకు ఎట్టి విద్వేషమూ లేదు" అని కృపలానీ అన్నాడు

అంటే కాంగ్రెసు ఆదర్శాలే ఈ కొత్తపార్టీవీనూ అయితే తేడా ఏమిటి? అది విధానాలలోనూ, ఆశయాలలోనూ ఉంటుందన్న మాట ఇది నిజమైనట్టయితే ఒకే ఆదర్శాలూ, నియమాలూ గల రెండుసంస్థలు వేరువేరు విధానాలనూ, ఆశయాలనూ అవలంబించవచ్చునన్న మాట ఎంతోకాలం గాంధీ అనుచరుడుగా ఉండి, కాంగ్రెసుసంస్థకు అధ్యక్షత వహించిన ఈ నాయకుడు ఆదర్శాలనూ, నియమాలనూ ఇంత తేలికచేసిపారేసి వాటిని నిరర్థకంగా భావించటం చాలామంది కాంగ్రెసువాదులకే ఆశ్చర్యం కలిగించి తీరాలి కాంగ్రెసు ప్రభుత్వాలను విమర్శించే కాంగ్రెసువాదులు సహితం కాంగ్రెసు తన ఆదర్శనియమాలను దాటిపోతున్నదంటారు గాని,వాటిని దక్కించుకుంటూనే తప్పుడు విధానాలవలంబిస్తున్నదనటం లేదు ఒకవేళ కృపలానీ కూడా అట్లా భావిస్తూ ఆ విషయం స్పష్టం చెయ్యలేక పోయినాడేమో నన్న సందేహం కొందరికి కలగవచ్చు కాని కాంగ్రెసు పోగొట్టుకున్న ఆదర్శాలను తన పార్టీ ఉద్ధరిస్తుందని కృపలానీ అనటంలేదు అసలు ఆదర్శనియమాలలో కృపలానీకి విశ్వాసమే లేదు! వాటిని గురించి ఆయన అన్న ముక్కలు వినండి

"20వ శతాబ్దపు మనుష్యులను భయపెట్టటానికి ఆదర్శాలు సృష్టించబడ్డాయి ఆదర్శాలతో గూడిన సంఘర్షణలు అసత్యమైనవి (అవాస్తవికమైనవి) 'తమ పక్షాన లేనివారు తమ ప్రతికక్షు'లని నమ్మే మతోన్మాదులు (సిద్ధాంతోన్మాదులు) సాగించే సంఘర్షణలు కమ్యూనిజము తల ఎత్తకపూర్వము ప్రజాస్వామిక పక్షాలమధ్య తేడాలు ఏర్పాటుచేసినవి ఆదర్శ వ్యత్యాసాలు కావు, కొన్ని విధానాలూ, కార్యక్రమాలూనూ "

ఆదర్శాలను గురించి కృపలానీ బుద్ధి ఏ విధంగా పనిచేస్తున్నదీ ఈ మాటలు విప్పిచెబుతున్నాయి ఆదర్శాలు అనవసరం! వాటి ప్రయోజనం ప్రజల్ని భయపెట్టటడం! కమ్యూనిస్టులే ఆదర్శాలను తెచ్చిపెట్టారు ప్రజాస్వామికం ఆదర్శాలు లేకుండానే నడుస్తుంది! ప్రజాస్వామిక పార్టీలు (అవసరం కలిగితే) తమ పక్షానలేని వారితో చేతులు కలుపుతాయి! ఆ అవసరాన్ని గుర్తించేదీ, నిర్ణయించేదీ - ఎవరైనా కావచ్చు!

ఆదర్శాలు కమ్యూనిస్టుల సృష్టి కనక కాంగ్రెసుకు ఆదర్శాలు లేవనే అనుకుందాం అయితే కాంగ్రెసుకు ప్రాథమిక నియమాలున్నట్టూ, అవే తమ పార్టీ నియమాలు కూడా అయినట్టూ కృపలానీ చెబుతున్నాడు ఈ నియమాలు దేనికి? పార్టీ నియమాలు రెండు రకాలుగా ఉంటాయి అవి పార్టీ ఐక్యతను కాపాడటానికి కావచ్చు - అటువంటి నియమాలు అన్నిపార్టీలకూ ఒకటిగానే ఉంటాయి, నియమాలు ఆదర్శాలను పురస్కరించుకుని ఉండవచ్చు- అప్పుడు ఆదర్శాలు లేకుండా నియమాలుండవు కృపలానీ మాట్లాడేది ఏ నియమాలను గురించి? ప్రజాస్వామిక పార్టీలకు ఆదర్శాలు అనవసరం, వాటి బాగోగులను వారి ఆశయాలే చాటుతాయి ఆ ఆశయాలు తమకు మేలుచేసేవైనప్పుడు ప్రజలు వాటిని బలపరుస్తారు ఈ కొత్తపార్టీ ఆశయాలూ, కార్యక్రమమూ కాంగ్రెసు ఆశయ కార్యక్రమాలకు విరుద్ధమైనప్పుడు, కృపలానీ రెంటికీ ఒకే

నియమాలుంటాయనీ, తమ పార్టీ కాంగ్రెసును శత్రుపక్షంగా చూడదనీ భరోసా ఇవ్వటంలో గల ఆంతర్యం ఏమిటో

ఆదర్శాలు ఏమీ లేకుండా ప్రజాస్వామిక ప్రతిపక్షాలుగా వ్యవహరించిన కొన్ని పార్టీలను కృపలానీ పేర్కొన్నాడు "ఇంగ్లండులో టోరీ లిబరల్ పక్షాలు ఐర్లండు యూనియనిస్ట్, లిబరల్ కన్సర్వేటివ్ పక్షాలు అమెరికాలో డెమోక్రాటిక్, రిపబ్లికన్ పక్షాలు" ఈ వివిధ పదాలకు ఆదర్శాలలో వ్యత్యాసం లేదని కృపలానీ రుజువు చెయ్యటానికి పేర్కొన్న అంశమేమంటే – అన్ని పక్షాలకూ పెట్టుబడి దారిలో విశ్వాసం ఉండటం! ఏ రెండు పార్టీలకు గాని ఆదర్శ వ్యత్యాసం ఉండటమంటే పెట్టుబడీదారీలో విశ్వాసం ఉండటం, లేకపోవటం అన్నమాట! ఆదర్శాలన్నవి కమ్యూనిస్టు సృష్టి అని కృపలానీ ఎందుకన్నాడో దీన్ని బట్టి సులభంగా అర్థమవుతుంది

కృపలానీ రాజకీయదృక్పథం రెండు ప్రపంచయుద్ధాలకు వెనకగా ఉందనుకోవాలి "ప్రజాస్వామిక రాజకీయపోటీ" ప్రజాసామాన్యాన్ని ఉద్ధరిస్తుందన్న భ్రమ తొలిప్రపంచయుద్ధం పూర్తికాక పూర్వమే ప్రపంచంలో ఆరోవంతు భూభాగంలో రద్దయింది ప్రజాస్వామిక రాజకీయపోటీ ప్రణయ కలహాలు ప్రపంచయుద్ధాలను నిలపలేకపోవటమే గాక, ప్రజాజీవితంలో పరివర్తన కలిగే 'ప్రమాదస్థితి' ఏర్పడినపుడల్లా ప్రణయాలింగనంగా మారింది ఈ నగ్నసత్యం ఇవాళ కూడా మనం అమెరికా బ్రిటనులో చూస్తున్నాం ప్రపంచయుద్ధాన్ని సాధ్యం చెయ్యటానికిగాను బ్రిటనులో లేబరు పక్షం కన్సర్వేటివ్ పక్షం వారి విదేశాంగనీతిని అనుసరిస్తోంది అదే ఆశయంతో అమెరికాలో డెమోక్రాట్లు రిపబ్లికన్ విదేశాంగనీతిని అమలు జరుపుతున్నారు దీన్ని బై పార్టిజాన్ పాలసీ అంటున్నారు దీన్ని తర్జుమా చేస్తే ఊళ్ళు పంచుకోవటానికి దొంగలూ దొంగలూ ఏకం కావటమన్నమాట ప్రజాస్వామిక 'ప్రణయ కలహాల' అవసరం లేకుండా రష్యా, చైనా, తూర్పుయూరప్ దేశాలలో ప్రజాజీవితం ఎట్లా నిత్యాభివృద్ధి చెందుతున్నదో, కమ్యూనిస్టు విప్లవవిధానంలో విశ్వాసం లేని వెబ్ లాటివాళ్ళు నిజమైన ప్రజాస్వామ్యం రష్యాలో ఉన్నదని ఎందుకు అంగీకరించవలసి వచ్చిందో, రష్యా కొద్దిసంవత్సరాల కాలంలో ప్రపంచరాజ్యాలలో రెండోదిగా ఎట్లా అయిందో, ప్రపంచ అగ్రరాజ్యమైన అమెరికా చైనాను ఎదుర్కొనే శక్తి తనకు లేదని– అన్ని అణువు బాంబులుండి కూడా! –ఎందుకంటున్నదో, కృపలానీ వంటివారు మనకు తెలియచెప్పాలి ఇంకా మనం తెలుసుకోవలసిన ముఖ్యవిషయమొకటున్నది ఒక అమెరికన్ ఆర్థిక నిపుణుడు, ఆసియాదేశాలు ఆర్థికంగా అభివృద్ధి చెందాలంటే ప్లానింగు పద్ధతి అవలంబించక తప్పదనీ, పెట్టుబడిదారీ పోటీ పద్ధతి అందుకు ఉపకరించదనీ అన్నాడు 20వ శతాబ్దపు ప్రజలను భయపెట్టటానికి ఆదర్శాలను సృష్టించిన కమ్యూనిస్టుల ఆశయాలు– వర్గరహితవ్యవస్థ స్థాపించటమూ, నిరుద్యోగ సమస్య తొలగించటమూ, ప్లానింగు సహాయంతో ఉత్పత్తిసాగించటమూ, వగైరా – ప్రకటించవలసి వచ్చింది కమ్యూనిస్టుల సృష్టి ఇవాళ దాదాపు సగం ప్రపంచంలో రాజకీయ వ్యాప్తి చెందటమే కాక, 20వ శతాబ్దపు ప్రజలను భయపెట్టటానికి మారుగా ప్రజాసామాన్యానికి ఆశలు కూడా కల్పిస్తున్నది

అసలు ఇంతకూ కృపలానీ రాజకీయభావాలను ఇంతదూరం తరచవలసిన అవసరంలేదు తాను తన కొత్తపార్టీ తరఫున ప్రకటించిన ఉన్నతాశయాలే ఫలోన్ముఖానికి వచ్చే 'ప్రమాదం' ఏర్పడ్డనాడు కృపలానీ నేటికాంగ్రెసు నాయకులను గట్టిగా ఆలింగనం చేసుకుని వారిని బలపరుస్తాడు అట్లా కాని పక్షంలో ఆయన ఉపన్యాసంలో వామపక్ష సమీకరణ గురించి ఒక్క ముక్కయినా లేకపోవటానికి కారణం లేదు వామపక్షాల వారి ఆశయాలు కూడా కృపలానీ ఆశయాలవంటివే వారు కూడా కాంగ్రెసు పార్టీకి ప్రతిపక్షంగానే నిలబడనున్నారు వారు కూడా కృపలానీ లాగే రాజకీయ ప్రజాధినైత్యం ఒప్పుకుంటారు వారూ సాంఘిక న్యాయం కోసమే పాటుపడతామంటున్నారు కాంగ్రెసుతో తమకు గలది ప్రణయకలహమని ఆదిలోనే ఎలుగెత్తి చాటుతున్న కృపలానీ కమ్యూనిజం గురించి విరోధభావం వెల్లడించటమూ, సర్వోదయము (అమెరికా ప్రజాస్వామికాన్ని కూడా) ఆమోదించిన సోషలిస్టులను తప్ప మిగతా వామపక్ష సమీకరణను గురించి ప్రస్తావించకపోవటమూ గమనించదగినది

తెలుగుస్వతంత్ర, 22-6-51

## 18. ఎన్నికల వాగ్దానాలు

రాబోయే ఎన్నికల సందర్భంలో ఎన్నికలలో పోటీ చేయదలచే వివిధ రాజకీయపక్షాల వారు వోట్ల కోసమై ఎరలు వేయనారంభిస్తారు ఈ ఎరలే ఎన్నికల వాగ్దానాలు ముఖ్యంగా, కేవలం అధికారం కొరకే పోటీచేసే పక్షాలవారు చూపే ఎరల్లోంచి గాలం కనిపిస్తూనే ఉంటుంది సామాన్య ప్రజలు ఈ గాలాలను గుర్తించటం నేర్చుకోవాలి

నిత్యజీవితంలో లాగే రాజకీయాల్లో కూడా ఎవరూ స్వార్థాన్ని నగ్నంగా బయటపెట్టరు, ఆ స్వార్థానికొక ఔదార్యపు పూత పూస్తారు విస్తీర్ణంలో గట్టిగా మద్రాసు రాష్ట్రమంత లేకుండానే, రెండు శతాబ్దాలపాటు మనని ఘోర దారిద్ర్యంలోనూ, రాజకీయ దాస్యంలోనూ ఉంచిన బ్రిటను, గత యుద్ధంలో అల్పరాజ్యాల స్వేచ్ఛయొక్క ప్రాముఖ్యాన్ని గురించీ, ప్రజాస్వామ్యాన్ని గురించీ ధర్మపన్నాలు పలికితే దాన్ని మనం విశ్వసించలేదు "ఇండియా అంత గొప్పదేశాన్ని బూటుకాలి కింద తొక్కిపెట్టిన బ్రిటిషు సామ్రాజ్యవాదులు ఎప్పటినుంచీ అల్పరాజ్యాల స్వేచ్ఛను గురించి ఆక్రోశించటం నేర్చుకున్నారు?" అన్న సందేహం మనందరకీ కలిగింది

ఇటువంటి వంచన అచ్చుగా సామ్రాజ్యవాదుల ప్రత్యేక లక్షణం కాదనీ, అధికార వ్యామోహం ఉన్నచోటనల్లా దాని వెంటనే వంచన ఉంటుందనీ మనం కాంగ్రెసు ద్వారానే నేర్చుకున్నాం కాంగ్రెసువాదులు అత్యధికసంఖ్యగా గల రాజ్యాంగపరిషత్తు యావద్భారతానికి రాజ్యాంగం తయారుచేస్తూ, ఆశయాలలోనేమో వర్గరాహిత్యమూ, ఆర్థిక విభేదాల తొలగింపూ పేర్కొని, ఆస్తిహక్కును నిబంధనలలో భద్రంగా కాపాడారు! ఆర్థికవర్గ వ్యత్యాసాలకు గట్టి తభావతు కలగకుండా రక్షించే రాజ్యాంగంలో వర్గరాహిత్యం ఎట్లా సంప్రాప్తమవుతుందో ఎవరికీ తెలియదు అక్రమమైన జమీందారీల రద్దుకే పరిహారం ఏర్పాటుచేసి, ధనికవర్గంగా జమీందారీలు అంతర్ధానం కాకుండా ఏర్పాటుచేశారు వారందరూ పెట్టుబడిదారీ వర్గాలలోకి మారాలని కాంగ్రెసు నాయకులు బహిరంగంగా ఉద్బోధలు చేశారు సంస్థానాధీశుల రాజకీయహక్కులు కత్తిరించబడేటప్పుడు కూడా ఆర్థికంగా వారి 'కోరలు' వారికి వదిలివేయబడ్డాయి రేపు పరిశ్రమలు జాతీయం చేసినా

పెట్టుబడిదారీ వర్గానికి ఆర్థికంగా ప్రమాదం కలగకుండా చూడబడుతుంది ఇదంతా చేసేవారే, గాంధీమహాత్ముడి పవిత్రనామం ఉచ్చరించి ప్రమాణాలు చేసి వర్గరహిత ప్రజాస్వామికం నెలకొల్పటానికై మన రాజ్యాంగం తయారుచేశారు!

దేశంలో ఉన్న అన్ని సంస్థలలోకీ అతి 'నీతివంతమైన' సంస్థ కాంగ్రెసు కనక అంత నైతిక ప్రమాణాలకు అర్రులు చాచని ఇతర రాజకీయసంస్థలు కూడా వర్గరాహిత్యమూ, సర్వమానవ సౌభ్రాతృత్వమూ, మేకలూ పులులూ ఒకే కంచాన తిని ఒకే మంచాన పరుండే సర్కసులూ వాగ్దానం చేసే అవకాశం ఉంది మార్క్సిజం 'యాభైఏళ్ళ క్రితమే బూజెక్కింది' అని చెప్పేవాళ్ళు మార్క్సు సిద్ధాంతాలకు చేసే జోహారే గాని ఇందులో అంతకంటే అధికమైనదేమీ ఉండదు ఎందుకంటే ప్రజల అజ్ఞానాన్ని పురస్కరించుకుని వివిధ రాజకీయ వర్గాలవారు రకరకాల వాగ్దానాలు చేస్తారే గాని వాటిని ఎట్లా, ఎవరి సహాయంతో అమలుచేస్తారో చెప్పరు

మాటవరుసకు ఒక రాజకీయపక్షం ఇండియా పాకిస్తానులను ఏకంచేస్తామని వాగ్దానం చెయ్యవచ్చు ప్రస్తుతం ఇండియా పాకిస్తానుల మధ్య రగిలే వైషమ్యాలనూ, వీటి ఫలితంగా ఏర్పడ్డ కాశ్మీరు క్లిష్టసమస్యనూ చూసేవారికిది చాలా ఆకర్షవంతంగా కనపడవచ్చు కాని తరచిచూస్తే ఇది బ్రహ్మాండమంత సమస్య ఇండియా పాకిస్తానులు ఏకం కావాలంటే ఈ రెంటిలో ఏదో ఒకటి జరగాలి 1)పాకిస్తాను తన స్వాతంత్ర్యానికి ఉద్వాసన చెప్పి ఇండియాలో అంతర్భాగంగా ఉండటమే తనకు లాభమని నమ్మే వాదన సృష్టించాలి 2) పాకిస్తానును ఇండియా యుద్ధంలో ఓడించి బలాత్కారంగా కలుపుకోవాలి పాకిస్తానుకు ఇండియాపట్ల ఎంతో స్నేహభావం ఉంటేగాని మొదటిది సాధ్యం కాదు, నిజంగా అంత స్నేహభావమే పాకిస్తానుకుండే పక్షాన ఇండియా పాకిస్తానులు ఏకమై, తమ స్వాతంత్ర్యాన్ని కోల్పోనవసరం లేకుండానే ఈ రెండుదేశాలమధ్యా గల సమస్యలన్నీ అతి సులభంగా పరిష్కారమవుతాయి ఇంతకూ పాకిస్తానుకు ఇండియాపట్ల కించిత్తయినా స్నేహభావం ఉన్నట్టు నిదర్శనం లేదు కనక మొదటి విధంగా ఇండియా పాకిస్తానుల ఐక్యత సాధించటం సాధ్యం కాదు, అవసరమూ లేదు ఇక రెండోవిధం అమలుజరిగితే – అది మరీ గడ్డయిన విదేశాంగవిధాన సమస్య – కొరియాకు పట్టినగతే ఇండియా పాకిస్తానులకు పట్టవచ్చు అమెరికా బ్రిటనులు పాకిస్తాను పక్షం వహించి కాశ్మీరు విషయంలో నెహ్రూకు సయితం పట్టరాని ఆగ్రహం తెప్పిస్తున్నాయి గనక, పాకిస్తాను మీద దాడికి దిగేపక్షాన అంతర్జాతీయంగా, మన మిత్రులెవరో తేలకపోయినా, శత్రువులెవరో తేలిపోతుంది అదీకాక పాకిస్తానును బలాత్కారంగా ఇండియాతో కలిపేవారు పదవిలోకి వస్తే కాశ్మీరు సమస్య ఆ విధంగా తేలిపోయే అవకాశం లేకపోలేదు పాకిస్తాను పై యుద్ధం ప్రకటించి ఇండియా 'పశ్చిమ' రాజ్యాలతో విరోధం తెచ్చుకుంటే 'తూర్పు' రాజ్యాలు ఇండియాపక్షం నిలబడతాయన్న ఆశ ఆవగింజంతయినా లేదు ఇది అన్నివిధాలా ఇండియా 'ఆత్మహత్య'కు మార్గమైనప్పటికీ ఈ విధానాన్ని ఎన్నికల వాగ్దానం కింద ఆశపెట్టటానికి సిద్ధంగా ఉన్నవారు ఇవాళ మనదేశంలో ఉన్నారు!

మనస్ఫూర్తిగా ఏ పక్షమైనా సరే ఎన్నికల వాగ్దానాలు చెయ్యదలచినట్లయితే, ఆ పక్షం అవలంబించబోయే దేశీయ విధానం ఎట్లా ఉండబోతుందో, ఆ విధానాన్ని ప్రతిఘటించే శక్తులను ఎట్లా ప్రతిఘటించటం జరుగుతుందో, ఆ పక్షం యొక్క విదేశవిధానం ఏమిటో,

ఆ విధానం ద్వారా దేశానికి ఏయే దేశాల స్నేహసహకారాలు లభిస్తాయో, వాటి ద్వారా దేశీయ సమస్యలు ఎంతవరకు చక్కబడతాయో, ఏయే దేశాల శత్రుత్వాన్ని మనం ఎదుర్కోవలసి ఉంటుందో, దాన్ని ఎట్లా ఎదుర్కుంటామో – ఇదంతా విపులీకరించాలి

అంతేగాని కాంగ్రెసు ఒరవడిలో "అన్నిదేశాల స్నేహాన్నీ సంపాదిస్తాం ప్రపంచశాంతికి తోడ్పడతాం" అని పైకి చెబుతూ చివరకు ఎవరి స్నేహాన్నీ సరిగా సంపాదించలేక, శాంతి భంగకారులను గట్టిగా ఒక్కమాట అనలేని స్థితిలో ఉండేపక్షాలు చేసే వాగ్దానాలు వట్టిదండగ "ప్రజలు ఎటువంటి ప్రభుత్వానికి అర్హులో అటువంటి ప్రభుత్వాన్నే సంపాదిస్తార"ని సామెత అందుచేత ప్రజలు సాధ్యమైనంత మంచి ప్రభుత్వాన్ని సంపాదించుకునే అర్హత సంపాదించుకోవాలి ఇది సాధ్యం కావాలంటే వివిధపార్టీలు చేసే శుష్కవాగ్దానాలతో మభ్యపడకుండా, చెప్పే మాటలు వెనక చేసే అవకాశాలు కూడా అంచనా కట్టటం నేర్చుకోవాలి

తెలుగుస్వతంత్ర వారపత్రిక 6-7-1951

# 19. నెహ్రూ సింహావలోకనం

ఈవారం బెంగుళూరులో ఏ ఐ సి సి సమావేశం కానున్నది ఇంతవరకూ జరిగిన కాంగ్రెసు పరిపాలన యొక్క మంచిచెడ్డలను గురించి సింహావలోకనం చేస్తూ నివేదిక ఒకటి ప్రధాని నెహ్రూ ప్రకటించాడు దాని ఆధారంపైనే బెంగుళూరులో చర్చలు జరుగుతాయని కూడా తెలిసింది

నెహ్రూ సింహావలోకనం ఎవరి దృష్టినుంచి కూడా ఏమంత సంతృప్తి కలిగేదిగా కనిపించదు అందులో కొత్తవిషయాలేమీ లేవు ఏ లోపాలైతే లోగడ ఆమోదించబడ్డాయో అవే ఇప్పుడూ పునరుద్ఘాటించబడ్డాయి కాని వాటిని పరిష్కరించటానికి 'విప్లవయుత'మైన మార్గాలేవీ సూచించబడలేదు "కాంగ్రెసుమంత్రులు నీతివంతులుగా వ్యవహరించాలి ఆదర్శాలను పాటించాలి 'తలుపులు' తెరిచి ఉంచాలి" ఇత్యాది ధర్మపన్నాలే ఉన్నాయి ఇందులో కూడా సామాన్య ప్రజలు శ్లాఘించని అనేక విషయాలను గురించి నెహ్రూ కాంగ్రెసు వీపు తట్టాడు

ఈ తరుణంలో కాంగ్రెసు అత్యవసరంగా చేయవలసిన పని ఏమంటే, నలుముఖాలా సేవతో ఎన్నికలలో పోటీ చేయనున్న వివిధ రాజకీయపక్షాల కార్యక్రమం సరిఅయినది కాదనీ, అంతకన్న తన కార్యక్రమం ప్రజల అవసరాలను సాధించి ప్రజాజీవితం ముందుకు తీసుకుపోవటానికి మరింత బాగా ఉపయోగపడగలదని రుజువు చేయటం లోగడ తాను చేసిన పొరపాట్లేవైనా ఉంటే వాటిని నిశితంగా విమర్శించి వాటిని ఎట్లా సరిదిద్దుకునేదీ సూచించటం ఈ ఆశయాలతో ఏ ఐ సి సి బెంగుళూరు సమావేశానంతరం ప్రణాళిక ప్రచురిస్తే ప్రచురించవచ్చు కాని ఆ ప్రణాళికకు నెహ్రూ సింహావలోకనం తోడ్పడుతుందనుకోవటానికి అటే అవకాశం కనిపించటం లేదు

ఇతర పార్టీలను గురించి మాట్లాడుతూ సోషలిస్టులనూ, ప్రజాపార్టీనీ నెహ్రూ పైపైన విమర్శించాడు కాంగ్రెసుకూ, ప్రజాపార్టీకీ గల వ్యత్యాసం విధానంలో ఉన్నదీ కార్యక్రమంలో ఉన్నదీ సరిగాతెలియటం లేదన్నాడు ఆదర్శ విభేదాలు స్పష్టంగా లేనప్పుడు వ్యక్తిగతమైన సంఘర్షణలు బయలుదేరుతాయన్నాడు (ఈమాట అబద్ధం కాదు దీనికి ప్రజాపార్టీ నాయకులు

ఏం సమాధానం చెబుతారో చూడవలసి ఉంది)  మొత్తం మీద ప్రజాపార్టీ, సోషలిస్టు పార్టీలు కేవలం పదవులకోసమే కాంగ్రెసును ప్రతిఘటించుతున్నట్టూ, వారికి వేరు లక్ష్యాలు లేనట్టూ నెహ్రూ భావిస్తున్నాడనిపిస్తుంది  అందుచేత ఆ పార్టీల ప్రతిఘటనను గురించి నెహ్రూ ఎట్టి ఆందోళనా కనబరచలేదు  పోతే కమ్యూనిస్టులనూ, కమ్యూనలిస్టులనూ (హిందూ మహాసభలాటి సంస్థలనూ) విధ్వంసక వర్గాల కింద నెహ్రూ జమకట్టాడు  వాళ్ళు రాజ్యాంగాన్ని తారుమారు చేయయత్నిస్తారనీ, దాన్ని ఏ ప్రభుత్వమూ సహించదనీ ఆయన చెప్పాడు  మరొక సందర్భంలో కమ్యూనిజము గురించి మాట్లాడుతూ, "కమ్యూనిజము ప్రజలకు ముఖ్యావసరాలు జరుపుతాననీ, భద్రత కలిగిస్తాననీ అంటుంది కనక చాలామందికది రుచిస్తుంది  కాని దాని వెనకగా సంఘర్షణా, హింసా, నిరంకుశత్వమూ, వ్యక్తులను అణచివేయటమూ మొదలైనవి సంభవించటం మనం చూస్తూనే ఉన్నాం  ప్రజా స్వాతంత్ర్యాలను బలిచేయకుండా ఆర్థిక భద్రతా అభ్యుదయాలను సాధించలేమా?  కొన్ని ఇబ్బందులున్నప్పటికీ ఇది సాధ్యం కాదనుకోనవసరం లేదు" అని, కమ్యూనిజం అవలంబించకుండానే "వెల్ఫేర్ స్టేట్" సాధించవచ్చునని నెహ్రూ తేల్చాడు

కమ్యూనిజం గురించి నెహ్రూ చెప్పిన దానిలో వింత ఏమీ లేదు  కమ్యూనిజం గురించి సరిగా తెలియకుండా, అది అంటే భయపడేవారూ, పనిపెట్టుకుని కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారం చేసేవారూ, సోషలిస్టు వ్యవస్థలో అమలులోకి వచ్చే సంస్కారం రుచించని 'మేధావులూ', కమ్యూనిజం విజృంభించటం వల్ల ఆర్థికంగానూ, రాజకీయంగానూ నష్టపడేవారూ తరచు అనేమాటలనే నెహ్రూ కూడా అన్నాడు  కమ్యూనిజంలో విశ్వాసం గలవారూ, దాన్ని సమర్థించేవారూ, కోరేవారూ నెహ్రూను చాలా ప్రశ్నలు వేయవచ్చును  ఈనాడు ఇండియాలో వ్యక్తులకున్న స్వాతంత్ర్యం ఏపాటిది?  ప్రజాస్వామికదేశాలు ఆర్థిక దుస్థితిని యుద్ధయత్నాల ద్వారా ఎందుకు కొనితెచ్చి పెట్టుకుంటున్నాయి?  హింస మాట ఎత్తదలిస్తే ప్రపంచయుద్ధాలను చెప్పి మరొకటి చెప్పాలి గనక, రెండు ప్రపంచయుద్ధాలలో కమ్యూనిజం వహించిన పాత్ర ఏమిటి?  'ప్రజాస్వామిక'దేశాలు వహించిన పాత్ర ఏమిటి?  మూడో ప్రపంచయుద్ధానికి కాలుదువ్వుతున్నదెవ్వరు? ప్రపంచం చుట్టూరా యుద్ధస్థావరాలెవరికున్నాయి? ప్రజాస్వామిక దేశాలలో నూటికి 90, వలసదేశాలనూ, అర్థికంగా వెనకపడి ఉన్న దేశాలనూ ఎందుకు దోచుకుంటున్నాయి?

ఈ ప్రశ్నలకు నెహ్రూ ఏ సమాధానమిచ్చినా మనకు ఒకటేననుకుందాం  కాని నెహ్రూ ఇండియాలో కమ్యూనిజమునకు ప్రత్యామ్నాయంగా 'వెల్ఫేర్ స్టేట్' ఏర్పాటు కావాలనటం చాలా హాస్యాస్పదమైన సంగతి  ఇందులో నెహ్రూ రాజకీయవిచక్షణాశక్తి అణుమాత్రమైనా ప్రతిఫలించటంలేదు  ఈ 'వెల్ఫేర్ స్టేట్' నినాదం బ్రిటిషువారిది  1945లో లేబరు ప్రభుత్వం ఏర్పడిన తరువాత కొన్నిమార్పులు బ్రిటనులో జరిగాయి  ధనికవర్గాల పై తీవ్రంగా పన్ను భారం వేశారు  కొన్ని ప్రధాన పరిశ్రమలు జాతీయం చేయాలని సంకల్పించారు  నిరుద్యోగసమస్య దాదాపు అంతమొందించారు  దేశమంతటా ఉచిత వైద్యసౌకర్యాలు ఏర్పాటుచేశారు

కాని దీన్ని సాధించటానికే అమెరికా దగ్గర భారీగా అప్పులు చేయవలసి వచ్చింది  "మా దగ్గర  డబ్బు కొట్టుకుపోయి ఈ బ్రిటిషువాళ్ళు సోషలిజం అమలు చేస్తున్నారు" అని అమెరికను

పత్రికలు హేళన చేశాయి "పరిశ్రమలు జాతీయం చేయటమూ, ఉచితంగా కళ్ళజోళ్ళూ, కట్టుడుపళ్ళూ ఇవ్వటమూ మానితే గాని మనం బ్రిటనుకు డాలర్లు ఇవ్వరాదు" అని మరికొన్ని అమెరికను పత్రికలు కారాలు మిరియాలు నూరాయి ఏమైనా ఈ అప్పు ఊరికే పోలేదు అమెరికా తెచ్చిన 'ఒత్తిడి' ఫలితంగా బ్రిటను భారీగా యుద్ధయత్నాలకు ఒడిగట్టవలసివచ్చింది "సోషలిజముకూ యుద్ధోత్పత్తికీ తూగదు ఏదో ఒకటి మానుకోవాలి" అన్నది నానాటికీ బ్రిటిషువారికి స్పష్టంగా తెలిసివస్తున్నది

బ్రిటనులో ఆరంభమైన "వెల్‌ఫేర్‌స్టేట్" గతి ఈ విధంగా ఉంది ఇక మనం ఈ దేశంలో 'వెల్‌ఫేర్‌స్టేట్' సాధించే దేమిటి? అది సమీపంలో లేదని నెహ్రూ కూడా ఒప్పుకున్నాడు అది సమీపంలో లేదన్నమాటకు దూరంగా ఉన్నదని ఎవరైనా అర్థం తీయవచ్చు కాని నిజమేమిటంటే 'వెల్‌ఫేర్ స్టేట్' మనకు కనుచూపుమేరలో ఎక్కడా లేదు ఈమాట నెహ్రూ స్పష్టంగా అని ఉండవలసింది కాని నెహ్రూ ఆ మాట అంటే కమ్యూనిజానికి ప్రత్యామ్నాయం గగనకుసుమాలేనని ఒప్పుకోవలసి వస్తుంది అందుచేతనే నెహ్రూ 'వెల్‌ఫేర్‌స్టేట్' సన్నిహితంగా లేదని మాత్రం అన్నాడు

'వెల్‌ఫేర్‌స్టేట్' మనకు ఎంతదూరంలో ఉందో చూద్దాం 1) మనం ఇంకా పరిశ్రమలను జాతీయం చేసే పద్ధతిని గురించి నిర్ణయించలేదు మన దేశానికి 'మిశ్రమ' ఆర్థిక విధానము ఉండాలనీ, అందులో ప్రభుత్వభాగమెంతో ఇకముందు నిర్ణయమవుతుందనీ నెహ్రూ అంటూనే ఉన్నాడు కనీసం భారీ పరిశ్రమలనన్నా జాతీయం చెయ్యకుండా 'వెల్‌ఫేర్ స్టేట్' సాధించటం సాధ్యం కాదు ప్రస్తుతం చైనాలో కూడా 'మిశ్రమ' ఆర్థిక విధానమన్నంత మాత్రాన అది 'వెల్‌ఫేర్‌స్టేట్'కు దారితీసేదో, సోషలిస్టు వ్యవస్థకు దారితీసేదో చెప్పటం సాధ్యం కాదు దాన్ని నిర్ణయించటం సాధ్యం చేసే వివరాలింకా నెహ్రూకే తెలియవు 2) మనకు అమెరికా భారీగా డాలర్లివ్వదు ముఖ్యంగా మనం యుద్ధవ్యతిరేకులం గనక, యుద్ధయత్నాలు భారీగా చెయ్యటం మన అభిమతం కాదని నెహ్రూ స్పష్టంగా చెబుతున్నాడు గనక అమెరికా కోట్లకొద్దీ డాలర్లు అప్పిచ్చే ఆశ ఎంతమాత్రమూ లేదు అమెరికా అంతులేకుండా డాలర్లు అప్పిస్తే గాని బ్రిటను వంటి పారిశ్రామిక దేశమే 'వెల్‌ఫేర్‌స్టేట్'కు ఉపక్రమించకపోతే, చెప్పుకోతగిన పరిశ్రమలు లేకుండా, అమెరికా డాలర్లూ లేకుండా మనం 'వెల్‌ఫేర్‌స్టేట్' ఏ విధంగా సాధిస్తామన్న సమస్య కలిగితీరుతుంది 3) అన్నిటికన్న ముఖ్యమైన విషయమేమంటే మనకు సామ్రాజ్యం లేదు!

బ్రిటను ప్రారంభించిన 'వెల్‌ఫేర్‌స్టేట్'కు వలస ప్రాంతాల మద్దత్తు పూర్తిగా ఉంది నెహ్రూ లెక్క ప్రకారం కమ్యూనిజంలో ఉన్నంత దౌర్జన్యంతో కాకపోవచ్చు గాని, మొత్తం మీద మలయాలో ప్రజల రక్తం పిండి బ్రిటను రబ్బరు సాధించి దానిమీద విపరీతమైన లాభాలు తీస్తున్నది పెర్షియాలో బ్రిటను నూనె ద్వారా సంపాదించే లాభాలు ఏ ప్రమాణంలో ఉన్నాయో మనం పత్రికలలో చదివే ఉన్నాం కామన్వెల్తుకు తలగానూ, ఆసియా ముడిపదార్థాల గుత్త ఎగుమతి దారుగానూ, స్టెర్లింగు ప్రాంతానికి బ్యాంకరుగాను బ్రిటను చాలా ఆర్జిస్తున్నది ప్రతి బ్రిటిషు కార్మికుడు సంపాదించే ప్రతి నాలుగు షిల్లింగులలోనూ ఒకటి 'సామ్రాజ్యం' ధర్మాన లభిస్తున్నదనీ,

అందుచేతనే బ్రిటనులో కమ్యూనిస్టుల మాటలు పారవనీ కూడా చెప్పేవారున్నారు! ఇటువంటి సదుపాయాలు ఇండియాకు లేవని వేరే చెప్పనక్కర్లేదు

ఇదంతా కూడా ఎందుకు? మన ప్రభుత్వం మన ధనికవర్గాలని పన్నుల ద్వారా పిండలేకపోవటమే గాక, వారు పన్నులు ఎగగొడితే గట్టి చర్య కూడా తీసుకోలేదు ఇటువంటి ప్రభుత్వానికి ప్రధాని అయిన నెహ్రూ 'వెల్‌ఫేర్ స్టేట్' ప్రస్తావించటం కేవలం వంచన కావాలి లేదా అపాయకరమైన ఆత్మవంచన కావాలి

నెహ్రూ సింహావలోకనంలో అన్నిటికన్న పెద్దలోపమేమంటే నెహ్రూ కాంగ్రెసు పరిపాలనను పాలకుల దృష్టితో చూశాడు గాని పాలితుల దృష్టితో చూడలేదు ఆయన తన మనస్సులో అనుకొనే ఊహాచిత్రాలకూ వాస్తవానికీ ఏమీ సంబంధం లేదు యదార్థం కళ్ళ ఎదుట నగ్ననాట్యం చేస్తున్నా ఆయన చూడలేదు ఉదాహరణకు, సంస్థానాలను ఇండియాతో చేర్చటం చాలా గొప్పవిషయంగా నెహ్రూ చెప్పాడు ఈ పని సాధించిన సర్దారుపటేలు "సంస్థానాధీశులను మన మిత్రులుగా చేసుకున్నాం", అని చెప్పి చనిపోయిన కొంతకాలానికి ఈ మిత్రులే ఒక సంస్థానాధీశుని అధ్యక్షుడుగా పెట్టుకుని యూనియను ఏర్పాటుచేసి ఒక ఆట ఆడారు! సంస్థానప్రజల జీవితంలో ఆవగింజంత మార్పు కలిగినట్టు లేదు పై పెచ్చు వారికష్టాలు పెరిగాయేమో కూడానూ నెహ్రూ దృష్టి నుంచి గొప్ప పరిణామంగా కనిపించేది ప్రజలదృష్టిలో చిన్న పరివర్తనగా కూడా లేదు ఇదే రాష్ట్ర ప్రభుత్వాలలో ఉన్న కాంగ్రెసుమంత్రుల విషయంలోనూ వర్తిస్తుంది వీరంతా ఋషీశ్వరులనీ, అర్హతగలవారనీ ఎన్నికలకు నిలబెట్టితే ఇంక దేశప్రజలు కోరతగింది ఏమీలేదని నెహ్రూ భావిస్తున్నట్టు కనిపిస్తుంది కాని ఈ వర్గాలలోనే అవినీతి ఏవిధంగా పెచ్చుపెరిగిందో, అభ్యర్థులను నిర్ణయించే అధికారం కొరకు ఎటువంటి హేయమైన పనులు జరుగుతున్నాయో ప్రజలకు తెలుసు – నెహ్రూకు తెలిసినట్టు కనబడదు

నెహ్రూ ఎంతసేపూ "ఇది చేశాము, ఇది చెయ్యలేకపోయాము, చెయ్యాలి" అన్న ధోరణిలో మాట్లాడతాడు ఈ కాంగ్రెసు ప్రభుత్వం ఏమీ సాధించలేకపోయినా ప్రజలు బాధపడి ఉండరు తాము కోరిన ప్రభుత్వం కోసం ప్రజలు ప్రాణాలు విడువమంటే విడుస్తారు కాని కాంగ్రెసువల్ల జరిగిన లోపం ఏమీ చెయ్యలేకపోవటం కూడా కాదు కాంగ్రెసు చేసిన ప్రతిపనీ ప్రజాసామాన్యానికి ప్రాణాంతకంగా పరిణమించటం దేశంలో ఎవరూ బాగుపడలేకపోతే ఎట్లా ఉండునో కాని జరిగినది అది కాదు కాంగ్రెసు అధికారవర్గాల వారు బాగుపడ్డారు, ధనికవర్గాలవారు బాగుపడ్డారు, జమీందారులను రద్దుచేస్తామని నోటీసిచ్చి అందరి పొలాలూ కలుపుకునే అవకాశం కూడా విరివిగా ఇవ్వటం వల్ల జమీందార్లూ బాగుపడ్డారు ప్రజల జీవితం అంతకంతకూ క్షీణించి మారణహోమం అవుతున్న సమయమందే ప్రజావిద్రోహక వర్గాలు బాగుపడటమూ, కాంగ్రెసు అధికారవర్గాలు ప్రజల దృష్టిలో ఈ ద్రోహులకు సన్నిహితంగా కనబడటమూ జరిగింది ఈ పరిణామానికి క్షమాపణలేదు నెహ్రూ తన సింహావలోకనంలో దాన్ని ప్రస్తావించలేదు ప్రజల నిరసన హెచ్చిందని మాత్రమే నెహ్రూ అన్నాడు ఆ విషయం తెలుసుకున్నవాడు చెప్పడానికి ఎంతో ఉన్నది కాని నెహ్రూ చెప్పలేదు ప్రజల సమస్యలన్నీ కాంగ్రెసు ఒక్క తృటిలో పరిష్కరించనందుకు ప్రజలు విముఖులైనారని నెహ్రూ అనుమానం కావాలి

తన సింహావలోకనంలో నెహ్రూ ఒక విచిత్రమైన మాట అన్నాడు కాంగ్రెసుపరంగా ఆత్మవిమర్శ చేసుకునేశక్తి నెహ్రూలో ఎంతగా లోపించిందో ఈమాటే వ్యక్తం చేస్తున్నట్టు కనిపిస్తుంది నెహ్రూ అన్నమాట ఇది " స్వాతంత్ర్యం రావటంతో దేశానికిగల అభిప్రాయాలన్నీ వెనకబడ్డాయని బహుశా ప్రజలు అనుకుంటూండవచ్చు అందుకనే వారు సంకుచిత చర్యలకూ, సెక్టేరియన్ విధానానికీ దిగుతున్నారు "

సరిగా దీనికి విరుద్ధమైన భావాన్ని 'న్యూ స్టేట్స్‌మన్ అండ్ నేషన్' అనే బ్రిటిషు వారపత్రికలో ఒక విలేఖరి ప్రకటించాడు "బాహ్యశత్రువు(బ్రిటను) వైదొలగటంతో కాంగ్రెసు విచ్ఛిత్తి ఆరంభమయింది" అన్నాడాయన చూస్తే ఇదే నిజంగా కనబడుతుంది స్వాతంత్ర్యం వచ్చిన తరువాత, జేబులు నింపుకోవడమూ, ఇళ్ళు చక్కబెట్టుకోవడమూ తప్ప ఇంకొక పని ఏదీ లేనట్టు ప్రవర్తిస్తున్న వారెవరన్నా ఈ దేశంలో ఉంటే వారు కాంగ్రెసు అధికారులే మిగిలిన పార్టీలలో సంఘర్షణలుంటే అవి సిద్ధాంతాలకు సంబంధించినవి కేవలం పదవీ వ్యామోహంతో కూడిన సంకుచితత్వం కారణంగా చీలికలు బయలుదేరినది ఒక్క కాంగ్రెసులోనే కాంగ్రెసు మనోవైకల్యాలను దేశప్రజలకు నెహ్రూ ఎందుకు అంటగట్టుతున్నాడో ఉహించరాకుండా ఉంది

తెలుగుస్వతంత్ర, 13-7-1951

## 20. కాంగ్రెసు దేశానికేం చేస్తుంది?

రానున్న ఎన్నికలలో మనమంతా కాంగ్రెసును గెలిపించే పక్షంలో కాంగ్రెసు దేశానికేం చెయ్యగలదో ఆలోచించాలి ఏదో చేస్తామని కాంగ్రెసు అంటుంది అదంతా చేసే శక్తి కాంగ్రెసుకున్నదా అని వోటర్లమయిన మనం ఆలోచించాలి "నేను కొండను మొయ్యగలన"ని గప్పాలు కొడితే నమ్ముతారా? "నా నెత్తిన పెట్టండి, మొయ్యకపోతే అడగండి" అని తప్పుకుంటారేమో అపూర్వమైన పనులు చేసే మిషతో విపరీతమైన అధికారాలు చేజిక్కించుకున్న కాంగ్రెసు, రాజ్యాంగాన్ని అతిక్రమించే శాసనాలు చేసి, సుప్రీంకోర్టు వాటిని కొట్టివేయగా రాజ్యాంగ సవరణకు పూనుకుని ఆఖరుకు బాధ్యత యావత్తూ ప్రజలమీదే ఉన్నట్టు ఇప్పుడే మాట్లాడుతున్నది! కాంగ్రెసువాలకం చూస్తే మనమంతా కొండను నెత్తినపెడితే గాని మోసేటట్టు కనిపించదు

అందుచేత, కాంగ్రెసు ఏది చెయ్యగలదు?, ఏది చెయ్యలేదు? అన్న విషయాలను గురించి సాధ్యమైనంత వరకూ సరిగా ఉండేలాగ అంచనా కట్టాలి అందులో కాంగ్రెసును అనవసరంగా తేల్చిపారెయ్యటం గానీ ఆకాశానికెత్తటం గాని చేయరాదు

ముందు కాంగ్రెసు యొక్క వైదేశికవిధానం (లేక విదేశాంగ నీతి) తీసుకుందాం ఇది అచ్చగా నెహ్రూ స్వంత విషయం లాంటిది ఇప్పటివరకూ ఈ విధానం ప్రశంసనీయంగానే ఉందనాలి స్వతంత్రభారతం ఏర్పడ్డ ఈ నాలుగేళ్ళలో విదేశాలలో ఇండియా పరపతి చాలా హెచ్చింది అనేకదేశాలతో మనం చేసుకున్న స్నేహ ఒడంబడికల మాట అటుంచి, భద్రతామండలిలో ఇండియాకు స్థానం లభించటమూ, మనదేశంలో కరువు గురించి వివిధ దేశాలు ఆందోళనచెంది సహాయపడటమూ, ఇండియా తనకుతానై ఎన్నడూ పాకిస్తాను పైకి

దండెత్తదని అరబ్‌లీగ్ ప్రధాన కార్యదర్శి వంటివారు సహితం అనటమూ, ప్రపంచశాంతి కొరకు నెహ్రూ, ఇండియా ప్రభుత్వదూతలూ చేసిన కృషి ప్రపంచపరిగణన పొందటమూ గమనించదగినవి

అయినప్పటికీ ఇండియా అనుసరించే వైదేశిక విధానంలో అస్పష్టత చాలా ఉన్నది మనతో స్నేహసంబంధాలు గల బ్రిటన్, అమెరికా, ఆస్ట్రేలియా, న్యూజీలాండు, దక్షిణాఫ్రికా వగైరా దేశాలు మన వైదేశిక విధానాన్ని తమకు అనుకూలంగా – కమ్యూనిస్టు వ్యతిరేక సంఘర్షణలో అమెరికా నాయకత్వం కింద పిల్లిమొగ్గలు వేసే దేశాలకు అనుకూలంగా తిప్పుకోవటానికి ప్రయత్నించటంతో తృప్తిపొందక కాశ్మీరు, పాకిస్తాను మొదలైన సమస్యల విషయంలో మన కాళ్ళ కింద గోతులు తవ్వుతున్నాయి ప్రపంచశాంతి కోసమూ, చైనాకు న్యాయం జరగటం కోసమూ అంతగా కృషిచేసిన నెహ్రూ, ప్రపంచశాంతి భంగానికి కారకులు కావటంలో పెట్టుబడిదారీ – సామ్రాజ్యదేశాలు వహిస్తున్న పాత్రను బాహాటంగా ఖండించలేకపోయినాడు అదీ కాక ఇటీవల ఎ ఐ సి సి కి సమర్పించిన నివేదికలో కమ్యూనిజం గురించి నెహ్రూ అన్నమాటలు కాంగ్రెసు వైదేశిక విధాన దిక్సూచిగా ఉన్నాయి

ప్రజల సమస్యలు తీరుస్తామనే 'వాగ్దానాల'తో కమ్యూనిస్టులు ప్రజలను 'ఆకర్షిస్తార'నీ, వారిది 'హింసాయుత విధానమ'నీ కమ్యూనిజం కింద 'వ్యక్తిస్వాతంత్ర్యం ఉండద'నీ నెహ్రూ అన్నాడు పెట్టుబడిదారీ విధానాన్ని దక్కించటానికి అసంఖ్యాక ప్రజల రక్తాన్ని కాలవలు గట్టి ప్రవహింపజేయటానికై యుద్ధోన్మాదులు మాట్లాడే అర్థంలేని మాటలను నెహ్రూ లౌడ్‌స్పీకర్‌లాగా ప్రతిధ్వనింపచేసి, తన హృదయం–కాంగ్రెసు హృదయం ఎటు మొగ్గుతుందో చూపాడేగాని కమ్యూనిజం గురించి 'నిజం' చెప్పటానికి పూనుకోలేదు

కమ్యూనిజం వలసవిధానాన్నీ, ఆర్థికదోపిడీ విధానాన్నీ ఎట్లా రూపుమాపిందీ, ప్రజల అవసరాలను ఎట్లా తీర్చి ప్రజాజీవితాన్ని దినదిన ప్రవర్ధమానం చేసిందీ, ఫాసిజమును– పెట్టుబడిదారీ సామ్రాజ్యవాదశక్తులు పాలుపోసి పెంచిన ఫాసిజమును – మొదటినుంచీ ఎట్లా ప్రతిఘటించి చివరకు ఎట్లా నిర్మూలించిందీ, కమ్యూనిజం కింద ఉత్పత్తి ఎట్లా పెరుగుతున్నదీ, ఆర్థిక దుస్థితులు ఎట్లా అంతరించినదీ, కమ్యూనిస్టు దేశాలలో ఈనాడు శాంతియుత నిర్మాణవాంఛ ఎంత ప్రబలంగా ఉన్నదీ నెహ్రూకు తెలియదనుకోవాలా?

కమ్యూనిజం హింసాయుతమైనదనటం ఛాందసం ఎందుకంటే ఏనాడైనా కమ్యూనిజం కంటె కమ్యూనిస్టు వ్యతిరేకత వెయ్యిరెట్లు హింసాయుతం హింసను అహింసతో ఎదుర్కొనే ధైర్యం గలవారే ఇతరుల హింసావిధానాన్ని తప్పుపట్టాలి సోవియట్‌రష్యాలో ప్రజలు ప్రభుత్వం మీద తిరుగుబాటు చేసి తమకు కావలసిన ప్రభుత్వం నెలకొల్పినందుకు ఎన్నిదేశాలవారో తమ సైన్యాలను పంపి అనవసర రక్తపాతం కలగచేశారు 'పెట్టుబడిదారి' చరిత్రలో ఇంతకన్న హేయమైన అధ్యాయం ఉండబోదు నెహ్రూ చరిత్రకారుడు చైనాలో జరిగిన అంతర్యుద్ధంలో కూడా ఎవరు హింసాయుత పాత్ర వహించారో మనం కళ్ళారా చూశాం అన్ని లక్షలమంది చైనావారు చావటానికి తోడ్పడింది కమ్యూనిస్టులా? అమెరికా ప్రేరేపించిన చాంగ్‌కైషేకా? మనదేశంలో కమ్యూనిస్టులు హింసాయుతచర్య సాగించినందుకు అందరిచేతా చీవాట్లు తిన్నారు

అటువంటి కమ్యూనిస్టులు కూడా ప్రజాపీడ ఎక్కువ కలిగించలేదు నిజమైన ప్రజాపీడ కలిగించినవారు– గ్రామస్థులందర్నీ ఒకచోట చేర్చి గుడ్డలు విప్పి, కొట్టి, అమానుషాలూ, అవాచ్యాలూ చేసి, స్త్రీలకు మానభంగాలు చేసి, ఆహారం మొదలైనవాటిని కిరసనాయిలు పోసి తగలబెట్టి అంతులేని ప్రజాపీడ జరిగించారు దీన్ని గురించి కావలిస్తే నెహ్రూ ఆరా తీయవచ్చు కమ్యూనిజం హింసాయుత విధానం అనేటప్పుడు కమ్యూనిస్టు వ్యతిరేకత మరింత హింసాయుతం అన్నది జ్ఞాపకం ఉంచుకోవాలి అప్పటికీ నమ్మకం కుదరకపోతే ఇవాళ అమెరికా, "ప్రపంచంలో ఎక్కడ కమ్యూనిజం తలఎత్తినా అణచేటందుకై" ఎంత యుద్ధసన్నాహాలు చేస్తున్నదీ, శాంతికాలంలో కనీవినీ ఎరగని 'యుద్ధపరిస్థితి' పెట్టుబడిదారీ దేశాలలో ఏ విధంగా ఏర్పడి ఉన్నదీ చూడవచ్చు

కమ్యూనిస్టులు వారి దృక్పథం నుంచి తప్పులు చేశారు అది సరిదిద్దుకునేటందుకు తమ తప్పులను బాహాటంగా ఒప్పుకుంటుంటే దాన్ని కమ్యూనిస్టువ్యతిరేక ప్రచారం కింద ఉపయోగించుకోవాలని ఇతరులు చూస్తున్నారు వారు చేసినపని ప్రజాజీవితానికి దూరం కావటం గాని, ప్రజాపీడనకు దిగటం కాదు ఈ విషయంలో సందేహం ఉంటే, ఏ ప్రాంతాల కమ్యూనిస్టుల 'దుశ్చర్యలూ', 'దారుణాలూ' జరిగాయో అక్కడ ముందుగా ఎన్నికలు పెట్టి కమ్యూనిస్టు అభ్యర్థులతో కాంగ్రెసు అభ్యర్థులు పోటీ చేసి చూడవచ్చు కమ్యూనిస్టులు ఎక్కువ విజయం పొందితే ఆశ్చర్యపడనవసరం లేదు

గెలిచే అభ్యర్థులను దేశమంతటా కాంగ్రెసు నిలబెట్టగలదా అన్న ప్రశ్నకు కూడా మనం సమాధానం చెప్పుకోవాలి ఇది చాలా అనుమానాస్పదం ఇంతకాలం కాంగ్రెసు నాయకులుగా ప్రజల ఎదుట మసలినవారు చాలామంది పదవులలో ఉన్నారు మిగిలినవారు కాంగ్రెసు నుంచి చీలిపోయినారు పదవులలో ఉంటూ ప్రజాభిమానం చూరగొన్నవారు చాలా అరుదు వారు తిరిగి ఎన్నికలకు నిలబడితే ఇప్పుడున్న అధికారాలను దుర్వినియోగ పరచి గెలవవలసిందే గాని ప్రజల ఆదరాభిమానాలను బట్టి గెలవటం సామాన్యంగా జరగదు అనేక ప్రాంతాల జరిగే ఎన్నికలలో కాంగ్రెసు అభ్యర్థులు అపజయం పొందటం చూస్తున్నాం మొన్న తెన్నేటి విశ్వనాథం గారికి ఎదురుగా కాంగ్రెసు అభ్యర్థిని నిలబెట్టలేకపోవటం కూడా చూసే ఉన్నాం

కేంద్ర ప్రభుత్వంలో కాంగ్రెసేతరులను చాలామందిని ఉంచకుండా ఇప్పటివరకూ జరగలేదు సమర్థులైన కాంగ్రెసువాదులు ఈ పదవులు నిర్వహించేటందుకు లభ్యం కాకపోవటమే దీనికి కారణం అంబేద్కరు కాంగ్రెసు మంత్రివర్గంలోనూ, రాజ్యాంగ పరిషత్తులోనూ అంత ప్రముఖపాత్ర వహించి కూడా కాంగ్రెసును నిందించినప్పుడు చిత్రమైన పరిస్థితి ఏర్పడింది తిరిగి ఇప్పుడు కిద్వాయ్, జైన్‌లను మంత్రివర్గంలో నిలిపి ఉండమని నెహ్రూ కోరటంతో మరొక చిత్రపరిస్థితి ఏర్పడింది వీరు కాంగ్రెసును తీవ్రంగా విమర్శించి కాంగ్రెసు నుంచి వైదొలగారు దీనికి టాండన్ ఆగ్రహిస్తున్నాడు కూడాను రేపు ఎన్నికలు జరిగాక కాంగ్రెసు ప్రభుత్వం అచ్చకాంగ్రెసు గోత్రీకులతోనే పరిపాలన సాగించుకో గలుగుతుందన్న నమ్మకం ఆవగింజంత కూడా లేదు

కాంగ్రెసువారు ప్రజలకు తమ పంచవర్ష ప్రణాళికను ఆశ జూపుతున్నారు ఇతర విషయాలు అట్లా ఉంచి ప్రభుత్వం ఉత్పత్తిదార్లను అదుపులో ఉంచితేగాని ఏ పంచవర్ష ప్రణాళికా అమలు

జరగదు ఉత్పత్తిదార్లను కాంగ్రెసు ప్రభుత్వం ఇదివరలో ఎంత అదుపులో ఉంచిందీ మనం చూశాం ఇకముందు అంతకన్న పొడిచేస్తారనటానికి ఆధారంలేదు

నెహ్రూ తిట్టిన కమ్యూనిజం కింద రష్యాలోని వివిధ జాతులవారి స్వాతంత్ర్యమూ, భాషా, సంస్కృతీ, కళలూ ఎట్టి ఆదరాన్ని పొందినదీ మనం చూశాం కాంగ్రెసువారు భాషారాష్ట్రాలు ఏర్పడటానికి ఎటువంటి హేయమైన అవాంతరాలు కల్పిస్తున్నదీ, జాతీయ సమస్యను గురించి వారికేపాటి శ్రద్ధ ఉన్నదీ నెహ్రూ ఇంతకాలం నుంచీ వ్యక్తం చేస్తూనే ఉన్నాడు

"గడిచిన ఐదేళ్ళలో ఏం చేశారో రాగల ఐదేళ్ళలోనూ అంతే చేస్తారు" అని జయప్రకాశనారాయణ కాంగ్రెసును ఆశీర్వదించాడు అంతకంటె కాంగ్రెసు నుండి హెచ్చుగా ఆశించటానికి ఆధారం ఏమీ కనపడదు ప్రజలలో కాంగ్రెసు విద్వేషం పెరిగిపోతున్నదని గుర్తించి కూడా ప్రజల అభిప్రాయాన్ని మార్చి ఉత్సాహం రేకెత్తించగల ఒక్కముక్క తమ ప్రణాళికలో ప్రవేశపెట్టలేని కాంగ్రెసు, పదవులు వచ్చినాక ప్రజలను ఆనందాబ్ధిలో ఓలలాడిస్తుందనుకోవటం కేవలం భ్రమ

తెలుగు స్వతంత్ర, 27-7-51

## 21. కమ్యూనిస్టుపార్టీ ఎన్నికల ప్రణాళిక

భారతకమ్యూనిస్టుపార్టీ తన ఎన్నికల ప్రణాళికను బయటపెట్టింది ఈ ప్రణాళిక కాంగ్రెసు ప్రభుత్వం యొక్క జాతీయ, అంతర్జాతీయ, ఆర్థిక, రాజకీయ విధానాలనన్నిటినీ పూర్తిగా ఖండిస్తున్నది కాంగ్రెసు ప్రభుత్వాన్ని పడగొట్టటానికి గాను ప్రజల సహకారాన్ని వాంఛిస్తూ ఈ ప్రణాళిక వెలువరించబడింది కనుక ప్రజలు ఈ ప్రణాళికలో సూచించిన విషయాలతో ఎంతవరకు ఏకీభవిస్తారన్నది ప్రధానవిషయం

స్థూలంగా కాంగ్రెసు కొన్ని పెద్దపొరపాట్లు చేసినమాట నిజమే దేశస్వాతంత్ర్యాన్ని విదేశీయుల నుంచి అందిపుచ్చుకున్న కాంగ్రెసు ప్రజలను బందిఖానాలోనుంచి విడుదలచేయలేదు పైపెచ్చు కాంగ్రెసు ప్రభుత్వాలు ప్రజలను స్వాతంత్ర్యానర్హులుగా కూడా చూసి 'శాసనాన్ని' మరింత తీవ్రం చేశాయి తన విధానాలను విమర్శించే పక్షాలను జాతీయ విద్రోహపక్షాలను చూసినట్టు చూడటానికి కాంగ్రెసుపక్షం ప్రయత్నించింది ప్రజాజీవితాన్ని ఉద్ధరించటానికి కాంగ్రెసు సద్బుద్ధితోనే ప్రయత్నించదలచినప్పటికీ ఇతర ప్రజాపక్షాల సహకారం లేకుండా ఈ పని తాను స్వయంగా సాగించగలననుకోవటం కాంగ్రెసు అవివేకమే కాంగ్రెసులో గల అంతఃకలహాలదృష్ట్యా చూస్తే హాస్యాస్పదం కూడానూ

నాలుగేళ్ళ కాంగ్రెసు పరిపాలనలో ప్రజాజీవితం ఒక్క అంగుళం కూడా పైకి రాకపోవటానికి కారణం కాంగ్రెసు సిద్ధాంతాలు కాకపోవచ్చు- కాంగ్రెసు పాలకవర్గంలో అవినీతి కావచ్చు కాని కాంగ్రెసువిధానాలలో జరిగిన తప్పులు అంత సులభంగా క్షమించదగినవి కావు ఈ విధానాలు జాతీయ వికాసానికి తోడ్పడలేదు ఇందులో జాతీయ స్వాతంత్ర్యం భాసించలేదు ముఖ్యంగా అంతర్జాతీయ విధానంలో, నెహ్రూ ప్రపంచశాంతికీ, చైనాను బలపరచటానికీ చేసినకృషి శ్లాఘనీయమేగాని, బ్రిటిషు పాలకవర్గాలను అనుకరించటం చాలా పొరపాటు

లేబరు కుడిపక్షంవారు అంతర్జాతీయ శాంతిఉద్యమం పట్లా, చైనా రష్యా తూర్పుయూరపు రాజ్యాలపట్లా ఏ పలుకులు పలికారో నెహ్రూ కూడా అవే పలుకులు పలికి, మక్కీకి మక్కీగా అవే విధానాలు అవలంబించాడు దీనితోబాటు నెహ్రూ ఇండియాను బ్రిటిషు కామన్వెల్తులో ఉంచటమూ, బ్రిటనుతో బాటు ద్రవ్యమారకంరేటు తగ్గింపువిషయంలో గుడ్డిగా అనుకరించటమూ, మలయాలో బ్రిటిషు సామ్రాజ్యస్వరూపాన్ని గురించి ఖచ్చితమైన అభిప్రాయం ప్రకటించకపోవటమూ నెహ్రూ విదేశాంగనీతి ఉపజ్ఞకు చాలా పెద్దమచ్చ తెచ్చాయి బ్రిటిషు లేబరు కుడిపక్షానికి బ్రిటనులోనే పరపతి తగ్గుతున్నట్లు స్పష్టమవుతున్నది వీళ్ళు పాకిస్తానులో చేరి ఇండియాపై ఘోరమైన కుట్ర సాగిస్తున్న విషయం కూడా స్పష్టమవుతున్నది మన జాతీయాభ్యుదయం అట్లీ ప్రభృతులను గుడ్డిగా అనుసరించటం పై ఆధారపడి ఉన్న పక్షాన, కొందరు కాంగ్రెసు నాయకులు కోరుతున్నట్టు అమెరికాకు అమ్ముడుపోవటం పై ఆధారపడి ఉన్నా ఆశ్చర్యం ఉండదు కొంతకాలం క్రితం పార్లమెంటులో మాట్లాడుతూ బ్రజేశ్వరప్రసాదు, ఇండియా రష్యా చైనాలతో కలిసి అంతర్జాతీయ శాంతి సాధించాలన్న భావం ప్రకటించాడు ఇది వాస్తవికదృష్టితో చెప్పినమాట అంతర్జాతీయ యుద్ధాలవల్ల లాభం లేకపోగా నష్టపడే పెద్దదేశాలు రష్యా చైనాలు శాంతికాముక దేశాలు ఆ రెంటితోనూ చేరటం వల్ల నష్టపడే ఆదర్శాలేవీ లేవు అమెరికా గోధుమలకున్నట్టు శాంతికి 'దారపోగులు' లేవు కాని కాంగ్రెసు 'తాటస్థ్యం' పేరుతో ఈ పని చేయలేదు ఇది పొరపాటనటానికి సందేహం లేదు బ్రిటనుతో మనకుగల స్నేహసంబంధాలు ప్రజాసామాన్యం హర్షించేవి కావు

తన ఐక్యతను కాపాడుకోలేని కాంగ్రెసు పదవిలో ఉండటానికై చేస్తున్న కృషి ప్రజాక్షేమానికి ఏవిధంగానూ ఉపకరించలేదు ఈ విషయం ప్రజలు గ్రహించలేనంత క్లిష్టమైన విషయం కాదు వెనకటికి కుంటివాడు, "నేను లేస్తే మనిషిని కాదు" అన్నట్టున్నది ప్రస్తుతం కాంగ్రెసు ప్రతాపం కాంగ్రెసు ఆశయాలేవైనా, సిద్ధాంతాలేవైనా, కాంగ్రెసు పరిపాలన కింద ధనికులు మరింత ధనికులు కావటానికి మాత్రమే అవకాశమున్నదని స్పష్టమవుతున్నది నూటయాభై రూపాయలు మించి భూమిశిస్తు కట్టేవారిపై అదనపు పన్ను వేయరాదని మద్రాసు శాసనసభాకాంగ్రెసు నిర్ణయించింది ఏ దేశానికైనా వెన్నెముక వంటి శ్రామికవర్గం పట్ల కాంగ్రెసు అవలంబించిన విధానాలు పూర్తిగా హేయమైనవి అవి యజమానుల వర్గం వారు అవలంబించదగిన విధానాలు శ్రామికవర్గాన్ని ఒత్తిడిచేసి తద్వారా ఉత్పత్తి హెచ్చించటమూ, సైనికవ్యయానికిగాను ప్రజాహిత వ్యయాలు వాయిదావేయటమూ జాతీయాభ్యుదయకరపంథా కాదు ఏ ధనికవర్గాలు విచ్చలవిడిగా కంట్రోళ్ళను ఉల్లంఘించి, ఉత్పత్తిని పరిమితంగా ఉంచి, లేమి సృష్టించి, బాహాటంగా విశృంఖలంగా దొంగవ్యాపారం సాగిస్తున్నాయో, ఆ వర్గం నుంచే ఎన్నికల ఖర్చులకు డబ్బు సంపాదించటంలో తప్పేమీలేదని పంత్ వంటి కాంగ్రెసునాయకులు చెబుతున్నారు భాషారాష్ట్ర నిర్మాణంలో సంకుచితత్వం చూసే కాంగ్రెసునాయకులకు తెలుగువాళ్ళ నదీజలాలను అపహరించి తమిళుల భూసంపదను పెంపొందించటంలో ఎట్టి సంకుచితత్వమూ కనిపించటం లేదు వివిధజాతుల విషయంలోనూ, వారి హక్కులను గుర్తించటంలోనూ కేంద్రకాంగ్రెసు ప్రభుత్వనాయకులు సామ్రాజ్యవాదుల్లాగా ప్రవర్తిస్తున్నారు హైదరాబాదును చీల్చి ఆయా భాషా ప్రాంతాలతో కలపటానికి నెహ్రూ పూర్తిగా నిరాకరించటంలో గల జాతీయనైతికసూత్రం ఏమీ బోధపడదు

కమ్యూనిస్టుపార్టీ ప్రణాళిక తాను అనుసరించదలచిన విధానాలలో ప్రజలకు అభ్యంతరంగా ఉండేవేవీ లేవు అన్నీ ప్రజలు హర్షించేవే కాని వీటివిషయంలో కొన్ని సందేహాలకు తావున్నది

మొదటిది పాకిస్తాను సమస్య పాకిస్తాను, నేపాలు, సింహళాలతో కమ్యూనిస్టుపార్టీ స్నేహ ఒడంబడి చేసుకోవటానికి అవకాశం ఉంటే నెహ్రూ ప్రభుత్వం దానికి చాలాకాలం నుండీ సంసిద్ధంగా ఉన్నది తమతో అన్నివిధాలా కలిసివచ్చే నెహ్రూ ప్రభుత్వం పరిపాలిస్తుండగానే బ్రిటను అమెరికావాళ్ళు తమ సౌకర్యార్థం పాకిస్తానును ఇండియామీదికి ఉసికొల్పుతున్నారు కమ్యూనిస్టుల పరిపాలనకింద ఉండే ఇండియా పాకిస్తానుతో ఎటువంటి స్నేహ ఒడంబడిక చేసుకునేదీ ఊహించరాని విషయం పాకిస్తాను మతప్రచారం అప్పుడే ఫాసిజానికి దారితీస్తున్నది పాకిస్తానులోని ప్రజాస్వామిక శక్తుల నోళ్ళకు తాళాలు పడుతున్నాయి ఫ్రాన్సులో జరిగిన డ్రేఫస్ కేసును మించిన రావల్పిండి కేసు పాకిస్తానులో సాగింది ఏదో ఆసరా చూసుకోకుండా పాకిస్తాను నాయకులు ఇండియావైపు పిడికిలి చూపుతున్నారంటే వారు 'ఆత్మహత్య'కు సిద్ధమవుతున్నారన్నమాట పాకిస్తాను విషయం, ముఖ్యంగా ఇండియా పాకిస్తానుల మధ్య శాంతిభంగం విషయం, కమ్యూనిస్టుపార్టీ వైఖరి ఇంకా విస్పష్టం చెయ్యవలసి ఉన్నది

కమ్యూనిస్టులు, తాము పదవిలోకి వస్తే వ్యవసాయ, పారిశ్రామిక, విద్యా, ఆరోగ్య, పరిపాలన సంస్కరణలు చాలా తీసుకువస్తామంటున్నారు ఇవి సాధ్యం కావాలంటే ఇండియా వంటి దేశానికి ఇతర దేశాల సహాయం చాలాకావాలి ఇదివరలో కాంగ్రెసు ప్రభుత్వం రష్యా, తూర్పుయూరపు రాజ్యాలతో తగినంత వాణిజ్యాది సంబంధాలు ఏర్పరచుకొనని మాట నిజమే ఆ దేశాలు కొంత సహాయం చేయవచ్చు, కాని మొత్తంమీద ఎంత సహాయం కావలసిఉంటుందో అది ఎక్కడనుంచి లభిస్తుందో కొంత అంచనా ఉండాలి రష్యా మినహాయిస్తే మిగిలిన కమ్యూనిస్టుదేశాలు సోషలిస్టు ఆర్థిక వ్యవస్థను కొత్తగా ప్రారంభించినవి అందుచేత పరిమితంగా మాత్రమే తోడ్పడగలవు

విప్లవం ద్వారా పునర్నిర్మాణం సాగించే దేశాల విషయంలో – నెహ్రూ ప్రభృతులు ఎంత ఆమోదించకపోయినా – ఒక సుగుణం ఉంటుంది చైనాలో చాంగ్‌కైషేక్ లాగా విప్లవవిరోధులు తమ దోపిడీ విధానంతో ఆర్థిక వ్యవస్థలో పూర్తి అరాచకస్థితి ఏర్పరుస్తారు విప్లవంలో కొన్ని ప్రజాశక్తులు విజృంభించి పైకి వస్తాయి ఆ శక్తులను సులభంగా కూడగట్టి పునాదినుంచి నూతన ఆర్థిక వ్యవస్థను నిర్మించుకురావటం తేలికపని అవుతుంది కేవలం ఎన్నికద్వారా అధికారాన్ని చేతబుచ్చుకుని విప్లవ ఆర్థిక, సాంఘిక పరిణామాల కోసం పాటుపడాలంటే విప్లవవిద్రోహక శక్తులు బురఖాలు వేసుకుని పొంచి ఉండి ప్రతీపచర్యలు సాగిస్తాయి వీటిని ఎదుర్కొనటానికి తగిన శక్తులను కూడగట్టటం మాటలు కాదు

అన్నిటినీ మించి ఇంకొక్క సందేహం ఉండనే ఉన్నది ఇండియాలో శాంతియుత విప్లవం సాధ్యమా అని! ఎన్నికలలో కమ్యూనిస్టులను గెలవకుండా చేయటానికి ప్రభుత్వం ఏమేమి చేసినదీ కమ్యూనిస్టుపార్టీ ప్రణాళికే వివరిస్తున్నది అంతకుమించి వెయ్యిరెట్లు ఘోరాలు ఇంకముందు జరగవచ్చు

ఈ కారణాలన్నిటిని బట్టి కమ్యూనిస్టుపార్టీ ప్రణాళికలో ఇవ్వబడిన కార్యక్రమం అంతముఖ్యమైనది కాదు ఇండియాలో కాంగ్రెసు సాధించలేకపోయిన ప్రజాస్వామికపక్షాలను ఎంతవరకు కూడకట్టగలదు, వాటితో ఎంతవరకు సహకరించగలదు? అన్నవే చాలా ముఖ్యమైన సమస్యలు రాగల ఎన్నికలలో 17,18 కోట్ల వోటర్లుంటారు వీరిలో అత్యధికసంఖ్యాకులు ప్రాతినిధ్యం వహించే ప్రజాస్వామిక రాజకీయ పక్షాలూ, యూనియనులూ, సమితులూ ఏకమై తాము సమష్టిగా అమలుజరుపగల ప్రజాస్వామిక ప్రణాళిక తయారుచేసి దాన్ని అమలుజరిపే పక్షాన వారి ప్రతినిధులు తప్పక ఎన్నికల అనంతరం ప్రభుత్వాలను దేశమంతటా నిర్వహించగలుగుతారు లేనిపక్షాన కేవలం కాంగ్రెసును ఓడించడమే ఒక పెద్ద ప్రజాస్వామిక ఆశయంగా పరిణమించి దానికోసం అడ్డమైనవర్గాలూ చేతులు కలిపి ఎన్నికలు పూర్తి అయిన మరుక్షణం దేశంలో అరాచకం సంభవించవచ్చు కమ్యూనిస్టుపార్టీ తాను చేసిన తప్పులు ఒప్పుకొనటం చాలామంచిదే గాని అన్నిటికన్న పెద్దపొరపాటు, తాత్వికంగా మడికట్టుకు కూర్చోటం చేసింది ఈ పార్టీ ఏ పార్టీ గాని తన సిద్ధాంతాలను జారవిడవకుండానే ఏదశలో ఏయే ఇతర పార్టీలతో కలిసి ఎంతదూరం నడవగలదో తేల్చుకోవటంలో తప్పులేదు కమ్యూనిస్టుపార్టీ ఇకముందయినా ఇతర పార్టీలతో కలిసి విశాలాశయాల సాధనకు కృషి చేసే దక్షత ప్రదర్శించాలి కాంగ్రెసును ఓడించటానికి చేతులు కలపనున్న ప్రజాస్వామికపక్షాల సమష్టి ఎన్నికల ప్రణాళిక చాలా ముఖ్యమైనది అటువంటి ప్రణాళిక అమలుజరగటంలో అంతరాయాలకు అవకాశం చాలా తక్కువ ఉంటుంది అటువంటి ప్రణాళిక ప్రకటన అయిన పక్షాన దాన్ని అమోదించే స్వతంత్ర అభ్యర్థులు కూడా విపులంగా లభించవచ్చు

తెలుగుస్వతంత్ర వారపత్రిక, 31-8-1951

## 22. శిఖరాలు (ఎ)

స్వామీసీతారాం ప్రభృతులు ఆంధ్రరాష్ట్ర సిద్ధికోసం ఆగస్టు 16 నుంచి ప్రాయోపవేశ దీక్ష బూనారు దీక్షగైకొన్నవారిలో ఇద్దరుముగ్గురు ప్రమాదస్థితిలో ఉండడంవల్ల ఈ ప్రాయోపవేశంతో సాగిన ఆందోళన మరింత జాస్తి అయింది ఆంధ్రరాష్ట్రం కోసం ఎవరు బలికావటమూ ఎవరికీ ఇష్టం లేదు కొందరు ఢిల్లీలో రాయబారాలు జరుపుతున్నారు, మరికొందరు ప్రాయోపవేశపరులను దీక్ష మానమంటున్నారు కొంతమందికి ఈ ప్రాయోపవేశంలో మొదటినుంచీ నమ్మకం లేదు ఇంకా కొందరికి దీనిమీద ఇప్పుడిప్పుడు ఒక విధమైన జుగుప్స కలుగుతున్నది మరికొందరు ఆంధ్రరాష్ట్రం ఇట్లా తప్ప రాదనే ధోరణిలో ఉన్నారు ఈ ఆఖరువారిలో ప్రాయోపవేశపరులనూ, వారి సన్నిహితులనూ తప్పక చేర్చవచ్చు

ఇతర విషయాలు అటుంచి రాజకీయాశయాలు సాధించటానికి ప్రాయోపవేశం ప్రజాస్వామిక విధానం మటుకు కాదు ప్రజాస్వామ్యంలో పౌరుల రాజకీయాధికారాలే ప్రజాహితాన్ని సాధించాలి ఆంధ్రుల శక్తిసామర్థ్యాల వల్ల ఆంధ్రరాష్ట్రం రావాలిగాని అరుగురు వ్యక్తుల హరం వల్ల ఆంధ్రరాష్ట్రం రావటం వాంఛనీయంకాదు ఆంధ్రరాష్ట్రం ప్రత్యేకించవలసిన

బాధ్యత కాంగ్రెసు పార్టీమీదా, కాంగ్రెసు ప్రభుత్వాలమీదా ఉన్నదని రుజువు కావటానికి ఆరుగురువ్యక్తుల నైతికవిశ్వాసం తప్ప వేరే ఆధారం లేదా? వీరు కాంగ్రెసు పై నైతికంగా వొత్తిడి తీసుకురావటం తప్ప వేరే మార్గం లేదా?

ఒకనాటి కాంగ్రెసు నియమావళిలో భాషారాష్ట్రాలున్నాయి ఏ కారణంచేతనో కాంగ్రెసు గద్దె ఎక్కిన తరువాత ఈ భాషారాష్ట్రాల ఏర్పాటుకు బోలెడన్ని అభ్యంతరాలేర్పడ్డాయి మహారాష్ట్రులూ, కన్నడులూ తమతమ రాష్ట్రాల కొరకు ఆందోళన చెయ్యటం 'సంకుచితత్వం' అనిపించుకోసాగింది ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి తమిళుల అనుమతీ, మహారాష్ట్ర స్థాపనకు గుజరాతీల అనుమతీ అత్యవసరమయింది "బ్రిటిషు సామ్రాజ్యవాదులు విభజించి పాలించే ధోరణిలో ఏర్పరిచిన కృత్రిమ రాష్ట్ర సరిహద్దులూ, సంస్థానాలూ" ఈనాడు కాంగ్రెసు ఏలుబడిలో వేదవాక్యాలంత ప్రమాణం సంపాదించుకుని వాటిలో కించిత్తు మార్పు జరగటానికి కూడా హిరణ్యాక్షవరాలు ప్రజలు చెల్లించవలసిన అగత్యం కలిగింది కాంగ్రెసు పంచప్రాణాలనూ కోల్పోయిన అనంతరం కూడా దానికి ఆరవప్రాణంగా నిలబడి, గాంధీ మహాత్ముడు దేశానికిచ్చిపోయిన నైతిక సిద్ధాంతాలకు ఏకైక ధర్మకర్తగా ఉన్న నెహ్రూ మహాత్ముడు కాంగ్రెసులో కలిగిన ఈ నైతిక పరివర్తనను పూర్తిగా బలపరుస్తున్నాడు తన నాయకత్వానికి ప్రమాదం తెచ్చేవారి పట్ల సత్వరచర్య తీసుకోగల నెహ్రూ ఆంధ్రుల ప్రాయోపవేశ దీక్షను తుడిచిపెట్టేశాడు ఈ ప్రాయోపవేశానికి పూర్వం ఆంధ్రరాష్ట్ర నిర్మాణం గురించి ఆయన ఏ పాటపాడుతూ వచ్చాడో ఇప్పుడూ ఆ పాటే పాడుతున్నాడు ఆరుగురు ఆంధ్రులు తమ రాష్ట్ర వాంఛను లోకానికి వ్యక్తం చెయ్యటానికి ప్రాణాలు బలిపెడుతున్నారన్నప్పుడైనా కాంగ్రెసుపార్టీ ఈ సమస్య పట్ల వహించుతున్న అవినీతిని గురించి ఆయన పునరాలోచించటం లేదు ఎందుకాలోచించాలి? నెహ్రూ నాయకత్వం కోసం కాంగ్రెసు వర్గాలు ఎన్ని ప్రజాస్వామిక సిద్ధాంతాలనైనా త్యాగం చెయ్యటానికి సిద్ధంగా ఉన్నాయి కాంగ్రెసులో నెహ్రూ తప్ప ఇంకేమీ లేదని నెహ్రూ బహిరంగంగా రుజువు చేశాడు ఒక వ్యక్తి పార్టీకన్న అంత పెరిగినప్పుడు పార్టీ నైతిక నియమావళి నాయకుణ్ణి ఎందుకు బాధించాలి? పై పెచ్చు, ఎవరో ఆంధ్రులు ప్రాయోపవేశాలు చేసి తనమీద నైతికమైన వొత్తిడి తెచ్చి తనది అవినీతి అని రుజువు చెయ్యాలని చూడటం నెహ్రూకు మరింత ఆగ్రహాన్నే కలిగిస్తుంది

తన సత్యాగ్రహ పద్ధతులు తనమీద ఇతరులు ప్రయోగించటం గాంధీజీయే సహించలేకపోయినాడు వాటిని నెహ్రూ ఆదరించటం కలలో వార్త ఈ ప్రాయోపవేశం విషాదాంతమయే పక్షాన తనకు శాశ్వతమైన అపకీర్తి కలుగుతుందని నెహ్రూ భయపడే అవకాశం గాని, ఆ భయానికి ఆధారంగాని ఉండవు కనీసం ఈ ప్రాయోపవేశం ద్వారా ఆంధ్రులలో ఒక రాజకీయ చైతన్యం బయలుదేరినట్టయితే దీని ప్రయోజనం ఉంటుంది అది కూడా అనుమానాస్పదమే రాష్ట్ర సిద్ధి కొరకు ఎట్టి రాజకీయచర్యలు సాగించాలో అదివరకు తెలియని ఆంధ్రులకు ఈ ప్రాయోపవేశాలు మార్గోపదేశం చేస్తాయా? చేయవు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీలోకి పదవీవ్యామోహంతోబాటు అనేక కుట్రలూ, గూడుపురాణీలూ, మురాతత్వమూ ప్రవేశించాయి కాని ఆంధ్రరాష్ట్ర సమస్య వంటి దానిపైన కక్షలు సాగలేదు అటువంటి

సమస్య పై ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు ఆంతరంగిక రాజకీయ సంఘర్షణ సాగి ఉన్నట్టయితే, ఆంధ్రమహాసభతో ఒక ఆంధ్ర కాంగ్రెసువర్గం చేతులు కలిపి ఆంధ్ర ప్రజలందర్నీ కూడగట్టుకుని ప్రజాస్వామిక పోరాటం సాగించే అవకాశం ఏనాడో ఏర్పడి ఉండేది అది చాలా ఆరోగ్యవంతం కూడా అయిఉండేది స్వామీ సీతారాం ప్రభృతులు ఆంధ్రరాష్ట్రం కొరకు ప్రాయోపవేశం చెయ్యటం చేత ఆంధ్రకాంగ్రెసు పెద్దలు యధేచ్ఛగా తమ మురా రాజకీయాలను అనుసరిస్తూనే ఆంధ్రరాష్ట్రం రప్పించిన కీర్తి మీద వేసుకునేందుకు అవకాశం ఉన్నదన్న భ్రమకు అవకాశం దొరికింది

నిజానికి ఆంధ్రరాష్ట్ర సమస్య రాజకీయాలు తెలిసినవారికి, ఒక విడి సమస్య కాదు ఇది స్వతంత్రభారతంలో జాతులకు సంబంధించిన సమస్య దేశంలోని వివిధజాతుల పట్ల ప్రజాస్వామికవిధానం అనువర్తింపచేస్తూ కాంగ్రెసు ఏ సూత్రాన్నీ అవలంబించి ఉండలేదు ఈ వివిధజాతుల ప్రజాస్వామిక హక్కులను గురించి కాంగ్రెసుకు పట్టలేదు ప్రస్తుతం కాంగ్రెసుకు తన పరిపాలనాసౌకర్యాలూ, తన క్షేమం మాత్రమే పట్టింది వివిధ జాతుల ప్రజాస్వామ్యహక్కులు గురించి కాంగ్రెసుకు పట్టేటట్టు చెయటానికి తగినయత్నం ఇంతవరకు జరిగి ఉండలేదు "భాషారాష్ట్రాల గొడవ ఎత్తకుండా ఉంటే మీ ఆంధ్రరాష్ట్రం వచ్చేటట్టు చూస్తా"నని పూర్వం సర్దారుపటేలు అన్న మాటలతో ప్రకాశంగారు తృప్తిపడ్డట్టు ప్రకాశంగారి ప్రసంగాల ద్వారా మనకు తెలిసింది అటుతరువాత కొంతకాలానికి – పట్టాభిగారి అధ్యక్షతలో – మనకు రాష్ట్రం వచ్చేస్తోందని భ్రమ కలిగిన తరుణంలో కన్నడులు తమ రాష్ట్రం కొరకు ఆందోళన సాగించగా మన పత్రికలకు కోపం వచ్చింది ఈనాడు స్వామీసీతారాం ప్రభృతులు జాతుల సమస్యతో గాని, ఇతర భాషా రాష్ట్రాల సమస్యతో గాని సంబంధం లేకుండా కేవలం ఆంధ్రరాష్ట్రం కొరకు ఆందోళన చేసి ఒక విషమపరిస్థితి కల్పిస్తున్నారు

ఇది ప్రజాస్వామిక విధానం కాదని మళ్ళీ మనవి చేస్తున్నాను ఇందులో రాజకీయ సిద్ధాంతాలు లేవు ప్రజలలో విశ్వాసం లేదు, ఆటే ఔదార్యం కూడా లేదు ప్రజాస్వామ్యంలో విశ్వాసమూ, దేశీయైక్యత మీద లక్ష్యమూ కలిగినవారు, భాషారాష్ట్రాల కాంక్షగలవారు చేయవలసిందేమిటంటే ఒక జాతీయ హక్కుల మహాసభ ఏర్పరచి దేశంలోని వివిధ జాతులనూ, వారికి గల ప్రజాస్వామిక హక్కులనూ నిర్వచించి, వాటిని రాబట్టేటందుకు జరగవలసిన కర్తవ్యాలను జాబితావేసి వాటిని కాంగ్రెసు మొదలయిన పార్టీల సమక్షానా, ప్రజల సమక్షానా ఉంచి, వచ్చే ఎన్నికలలో ఈ జాతి హక్కులను పాటించే అభ్యర్థులను చేతనైతే గెలిపించుకోవాలి అరడజనుమంది ఆంధ్రుల హరానికి నెహ్రూ లొంగిరాలేదని ఆయనను దేశం నిరసిస్తుందనుకోవటం చాలా పొరపాటు నెహ్రూ ప్రజాస్వామ్యానికి ఈ ప్రాయోపవేశాలు గీటురాయి కానేకావు ఆంధ్రరాష్ట్ర వాంఛకు ఆధారంగా ప్రజాస్వామ్య సూత్రాలున్నాయి ఆంధ్రరాష్ట్రం పట్ల నెహ్రూ అవలంబించే వైఖరిలో ప్రజాస్వామ్యం లోపించి కూడా ఉన్నది కాని ఈ రెంటినీ ప్రాయోపవేశాలు బయటపెట్టలేవు పైపెచ్చు కప్పికూడా పెడుతాయి అందుచేత ఆ ప్రాయోపవేశం విరమించి ప్రజలనూ, ప్రజాస్వామ్యాన్ని ముందుకు నడిపేవిధానాలు అవలంబించటం ఎంతో శ్రేయస్కరం

తెలుగు స్వతంత్ర, వారపత్రిక, 14-9-1951

# 23. శిఖరాలు (బి)

రాగల జనరల్ ఎలెక్షనులలో మనం ఎటువంటి ప్రభుత్వాన్ని ఎన్నుకోవాలి?

ఈ ప్రశ్న వోటర్లలో ఎంత ఎక్కువమందికి కలిగితే దేశానికంత మంచిది ఎందుచేతనంటే మనకు ప్రజాస్వామ్యం ఆచారం లేదు ఇంత పెద్దఎత్తున మనదేశప్రజలకు వోటింగు హక్కు లభించటం ఇదే ప్రధమం ముప్పై ఏళ్ళ నుంచి మనం స్వాతంత్ర్య పోరాటాన్ని ప్రత్యక్షంగా చూస్తున్నప్పటికీ, మన ప్రజలు 'స్వరాజ్యం' అనేమాట మించి రాజకీయ పరిజ్ఞానం కలవారు కారు కాంగ్రెసు మహాసంస్థ మనకు నైతికబోధలు చేసిందిగాని ప్రజాస్వామ్యం గురించి బడిపెట్టి పాఠాలు బోధించలేదు ప్రజాస్వామ్యం గురించి మనకు విశేషం రాజకీయ సాహిత్యం కూడా లేదు

స్వతంత్ర దేశంలో వివిధవర్గాల మధ్య జరిగే సాంఘికసంఘర్షణే రాజకీయ సంఘర్షణ పారిశ్రామిక కార్మికవర్గం పొట్టచేతబట్టుకుని యజమానులతో సాగించే సంఘర్షణ ఇతరవర్గాలకు 'రాజకీయాలు' అనిపిస్తుంది కాని యజమానుల కార్మికులమధ్య అది సాంఘికసమస్యే అయితే ఇంతకాలమూ మన రాజకీయసంఘర్షణ విజాతీయులతో జరిగి ఉండలేదు అట్టి సంఘర్షణ ద్వారా కలిగే రాజకీయ పరిజ్ఞానం కూడా మనకు లేకపోయింది తీరా దేశం స్వతంత్రమై అటువంటి సంఘర్షణ సాగేటందుకు అవకాశం లభించగానే, మన కాంగ్రెసు ప్రభుత్వాలు ఈ సంఘర్షణలో అధికసంఖ్యాక వర్గాలను అణచటానికి పోలీసు తుపాకులనూ, ప్రజాపీడక శాసనాలనూ విరివిగా ఉపయోగిస్తూ, కృత్రిమంగా వివిధవర్గాల ఐక్యత సాధించి తమ పరిపాలన సాఫీగా సాగించుకోజూస్తున్నారు కాని ఇది ప్రజాస్వామ్యంలో సాగేది కాదు ప్రజలు తమ రాజకీయహక్కులను పూర్తిగా వినియోగించటమూ, వాటికోసం తమకు గల శక్తులను ప్రయోగించటమూ ప్రజాస్వామ్యానికి పునాదిరాయి ఈ విషయాన్ని పాటించని ప్రభుత్వం ఏనాటికైనా ఫాసిజం అవలంబించవలసిందే నిజమైన ప్రజాస్వామ్యానికి ఫాసిజముకూ మధ్య మజిలీలు లేవు ఇంగ్లండు అమెరికాలలో లాగా కొంతకాలం ప్రజాస్వామ్యం అనుసరించిన దేశాలలో ప్రవేశించటానికి ఫాసిజం చాలా శ్రమపడి పాకుతూరావాలి కాని మనదేశం తెరిచిన ఇల్లు ఇక్కడి ప్రజలు తమ హక్కులను గుర్తించేలోపుగా ఫాసిజం వచ్చి తిష్ఠవేయగలదు కాంగ్రెసుసంస్థ గాని, మరో సంస్థగాని దేశప్రజలకు ఒక వంక వారి హక్కులనివ్వకుండా అడ్డుపుల్లలు వేస్తూ మరొకవంక ఫాసిజమును నిరోధిస్తుందనుకోవటం భ్రమ ఫాసిజం ప్రివెంటివ్ డిటెన్షన్‌చట్టం రూపంలోనూ, రాజగోపాలాచారి ప్రెస్‌బిల్ రూపంలోనూ ఉంటుంది ఫాసిజమును నిరోధించాలన్నా ప్రజలకు బోలెడన్ని రాజకీయహక్కులుండాలి

వచ్చే ఎన్నికలలో మనం ప్రజాహక్కులను గౌరవించే ప్రభుత్వాన్ని ఎన్నుకోవాలి ప్రజాహక్కుల కోసం పోరాడే అభ్యర్థులకు వోట్లు వెయ్యాలి అభ్యర్థులు ప్రజావర్గాల వాస్తవ ప్రతినిధులై ఉండాలి

మనది బీదదేశం దారిద్ర్యం మన ప్రధాన సమస్య నిజంగా ప్రజలదైన ప్రభుత్వం ఏర్పడినట్లయితే ప్రజలందరికీ చేసుకునేటందుకు పనీ, తినేటందుకు తిండీ, కట్టబట్టా, ఇళ్ళూ వాకిళ్ళూ, ఆరోగ్య సౌకర్యాలూ అమరేలాగు ప్రణాళికలు తయారుచేయటం సాధ్యమని మనకీనాడు

తెలుసును బంజరుభూములన్నిటినీ సస్యక్షేత్రాలు చెయ్యటానికీ, వాడుక వస్తువులు సమృద్ధిగా ఉత్పత్తిచెయ్యటానికీ, కొత్త రైలుమార్గాలూ, కాలువలూ, ప్రాజెక్టులూ నిర్మించటానికీ, కొత్త పరిశ్రమలు నడపటానికీ అవసరమైన చెమటను ధారపోయటానికి తగిన కార్మిక సంపద మనదేశంలో ఉన్నది ఒకవంక నిరుద్యోగమూ, మరోవంక దారిద్ర్యమూ ఉండటానికి కారణం ఏదో సంఘవిద్రోహక శక్తుల ప్రభావమేనని కూడా మనకు తెలుసు అయితే కొందరు రాజకీయవేత్తలు, కార్మికులకూ, వస్తుజాలానికీ మధ్య పెట్టుబడీ, సాంకేతిక ప్రావీణ్యమూ అడ్డం పెడుతున్నారు ఇది అబద్ధం కాదు గాని ఈ సత్యం రాజకీయ దుర్వినియోగం పాలవుతున్నది శ్రామికుడికి యంత్రం తోడులేనిదే వస్తూత్పత్తి జరగదు ఈ యంత్రాలు చేయటానికీ నడపటానికీ కూడా సాంకేతిక ప్రవీణులుండాలి ఈ సత్యం ఎట్లా దుర్వినియోగపడుతున్నదంటే, "పెట్టుబడిదారీ ప్రజాస్వామికాల"లో ఈ యంత్రాలకయే ఖర్చూ, ప్రవీణులని నియోగించే శక్తి గల పెట్టుబడిదార్లు అంతులేని రాజకీయాధికారాలు తమపరం చేసుకుని శ్రామికవర్గానికి దారిద్ర్యమూ, తెంపులేని దాస్యమూ అంటగడుతున్నారు "పెట్టుబడిదారీ ప్రజాస్వామిక" దేశాలలో పెట్టుబడిదారీ ధనికవర్గ ప్రతినిధులు పాలనాయంత్రపు కీలకస్థానాలలో ఉండటం మనం గమనించవచ్చు అమెరికాలో నూనె పారిశ్రామికులు ప్రభుత్వ విధానాలను శాసిస్తారన్నది జగత్ప్రసిద్ధ విషయం

ప్రస్తుతం మనదేశంలాంటి బీద దేశాలకు పెట్టుబడీ, సాంకేతిక సహాయమూ చెయ్యటానికి అమెరికా చాలా ఆసక్తి కనబరుస్తున్నది ఈ సహాయం చేసేవారికి ఎటువంటి రాజకీయాధికారాలుంటాయో అమెరికాకు తెలుసు మన దౌర్భాగ్యం కాలి మన దేశంలో ఈ సహాయానికి అర్రులుచాచి మోరలెత్తి ఆక్రోశిస్తున్న వారున్నారు కాని అన్నిదేశాలూ అమెరికాలాంటివి కావు రష్యా, చైనా తదితర సోషలిస్టు ప్రజాస్వామిక దేశాలలో యంత్రసామగ్రి యావత్తూ ప్రజలపరం చేయబడింది అక్కడ సాంకేతిక నిపుణులు ప్రజాప్రభుత్వ నియోగితులు గాని పెట్టుబడిదారీవర్గాల సేవకులు కారు ఈ దేశాలు ఒకదాని స్వాతంత్ర్యం ఒకటి అపహరించకుండా పరస్పరయంత్రసహాయం, సాంకేతిక సహాయం చేసుకుంటున్నాయి

శ్రామికులకూ వస్తూత్పత్తికీ మధ్య ఇతరవర్గాలను అడ్డం పెట్టి ఆ వర్గాలకు అంతులేని రాజకీయాధికారాలివ్వ నిరాకరించే ప్రభుత్వాన్ని మనం ఎన్నుకోవాలి వస్తూత్పత్తి చేసే యంత్రాలూ, వాటి వల్ల తయారయే వస్తువులు కూడా సాముదాయికమైనవేననీ, అవి సాముదాయికమైనప్పుడే వర్గకలహాలు అంతరించి నిజమైన ప్రజాస్వామ్యం ఏర్పడుతుందనీ గుర్తించే ప్రభుత్వాన్ని మనం ఎన్నుకోవాలి

ఉత్పత్తి హెచ్చించి దారిద్ర్యాన్ని సర్వత్రా నిర్మూలించి ప్రజాజీవితాన్ని ఒక్కొక్క మెట్టే పైకి చేర్చాలంటే శాంతి అత్యవసరం యుద్ధయత్నాలు దారిద్ర్యానికి దారితీస్తాయి అట్లాంటిక్ ఒప్పందంలో చేరి యుద్ధయత్నాలు సాగించే అమెరికా, బ్రిటన్, బెల్జియం, ఫ్రాన్స్ మొదలైన దేశాలన్నిటిలోనూ దారిద్ర్యం ధరలరూపంలో పెరుగుతున్నది అంతర్జాతీయసంఘర్షణలూ, ప్రపంచయుద్ధాలూ ప్రజలమధ్య ఎప్పుడూ జరగవు వీటికి కారణభూతమైన వర్గాలకు ఏ దేశంలో వాటిని ఆ దేశంలో నిర్మూలించగలిగినట్టయితే ప్రపంచశాంతికి అవాంతరం ఉండదు యుద్ధభయానికి ఇంతకంటె సరి అయిన చికిత్స లేదు వైద్యులు ప్రతిరోగానికీ కారణభూతమైన

క్రిములను కనిపెట్టి వాటిని నిర్మూలించే మందులు కనిపెడుతున్నారు గాని, 25 ఏళ్ళ కాలంలో రెండు ప్రపంచ మారణహోమాలు కలిగించి అనేకకోట్ల మందిని పొట్టనపెట్టుకున్న వర్గాన్ని ప్రపంచప్రజలు పోల్చుకుని నిర్మూలించలేదు అందుచేతనే ఇప్పటికింకా ప్రపంచయుద్ధభయం ఇంత ముమ్మరంగా ఉంది ఐతే ఈ యుద్ధభయం వస్తున్నది సగం ప్రపంచంనుంచే, మిగతా సగం ప్రపంచం తాను యుద్ధానికి దిగనని హామీ ఇవ్వటానికి సిద్ధంగా ఉన్నది ఈ అర్ధప్రపంచం ప్రతీ శాంతిఉద్యమాన్ని బలపరుస్తుంది ఇందులో 'భ్రమ'కు అవకాశంలేకుండా యుద్ధోన్మాదులు తమ దేశాలలోని శాంతి ఉద్యమాల పట్ల కూడా శత్రుత్వం వహించి వాటిని రెండో అర్ధప్రపంచానికి చెందిన వాటినిగా ప్రకటిస్తున్నారు

నిజంగా పెట్టుబడిదారీ దేశ ప్రభుత్వాలకు కూడా శాంతే కావలసి ఉన్నపక్షంలో ఇటీవల బెర్లినులో నూరుదేశాల యువకులు సమావేశం అవుతూంటే, అట్టి సమావేశం వల్ల దేశాలమధ్య సఖ్యత ఎంతగా పెంపొందేదీ కూడా విచారించకుండా తమదేశపు యువకులను బెర్లిను వెళ్ళనివ్వకుండా నిర్బంధించి ఉండరు బెర్లిను పోనున్న బ్రిటిషు యువకులపై అమెరికను సైనికులు చేసిన దారుణచర్యలు బ్రిటనులో కొంతసంచలనం కూడా కలిగించాయి శాంతివిషయంలో ప్రజాభిప్రాయం గురించి మనకు వేరే నిదర్శనం అవసరంలేదు శాంతి విజ్ఞాపనలపై వివిధదేశ ప్రజలు చేసిన కోటానుకోట్ల సంతకాలు చాలు శాంతి విజ్ఞాపనలో ఎట్టి రాజకీయనిబంధనలూ లేవు ఏవిధమైన మత, రాజకీయ, ఆర్థిక, తాత్విక విశ్వాసాలు గలవారైనా సంతకం చేయటానికి వీలుగా ఉన్నాయి అయినా వాటిని కమ్యూనిస్టు ప్రచారం కింద కొన్ని ప్రభుత్వాలు పాటిస్తున్నాయంటే ఆ ప్రభుత్వాలలో ఏదో లోపం ఉండి ఉండాలి

శాంతి ఉద్యమాన్ని బలపరిచేవారిని చూసి చాటు కమ్యూనిస్టులని శంకించేవారూ, కమ్యూనిస్టుల మాయకు లోబడ్డారని జాలితలచే వారూ మన దేశంలోనే ఉన్నారు ఇందులో వింత లేదు తాము రాజకీయాలలో ఆరితేరిన వాళ్ళమని వారి నమ్మకం తాము కమ్యూనిస్టుల మాయకు లొంగి శాంతివిజ్ఞాపనలపై సంతకాలు చేయరు! ఇదంతా రాజకీయ విజ్ఞానం కాకపోవచ్చుననటానికి ఒక చిన్న ఉదాహరణ ఇస్తాను

అమెరికను ప్రజలు18వ శతాబ్దం పూర్తికాకపూర్వమే రాజరికం మీదా, సామ్రాజ్యవాదం మీదా తిరుగుబాటుచేసి ప్రజాస్వామ్యం కొరకు విప్లవం చేసి ప్రపంచానికి మార్గదర్శకులైనారు ఈనాడు కూడా వారు తమదేశం భూలోకస్వర్గమని భావిస్తారు అమెరికా పాలకులు నేడు ప్రపంచప్రజాస్వామికానికి తామే మహానాయకులమని చెప్పుకుంటున్నారు కూడా ఇటువంటి అమెరికాలోని ప్రజలకు ఇతరదేశాలవారికన్న ఎక్కువ రాజకీయపరిజ్ఞానం ఉంటుందనీ, వారు తమ హక్కులను పూర్తిగా గుర్తిస్తారనీ మనం అనుకోవచ్చు కాని ఈ అమెరికాలోనే 'స్వాతంత్ర్యవాదులూ', 'పౌరహక్కులవాదులూ' కమ్యూనిస్టులుగా భావించబడటం జరుగుతోంది అందులో కూడా ఏదో తిరుగుడు ఉండవచ్చుననుకుందాం

మొన్న జులై4(అమెరికా స్వాతంత్ర్యప్రకటన దినం నాడు) మాడిసన్‌లోని 'కాపిటల్ టైమ్స్' పత్రిక ఒక చిన్న ప్రకటన తయారుచేసి సంతకాలు చేయించటానికి నూటపన్నెండుమంది మాడిసన్ నగరవాసుల వద్దకు పంపిందట ఇందులో ఒక్కడు మాత్రమే సంతకం చెయ్యడానికి

అంగీకరించాడు, మిగిలిన వాళ్ళు నిరాకరించారు ఒకడు, "నేను దానిమీద సంతకం పెట్టకేం? ప్రభుత్వోద్యోగం కోసం ప్రయత్నిస్తున్నాను" అన్నాడు చాలామంది దానిని 'కమ్యూనిస్టు ప్రకటన' అన్నారు అందులో అమెరికా స్వాతంత్ర్య ప్రకటనలో భాగాలూ, రాజ్యాంగంలో భాగాలూ మాత్రమే ఉన్నాయంటే ఒక లాయరు నమ్మలేదు! ప్రభుత్వాన్ని మార్చటానికీ తొలగించటానికీ ప్రజలకు హక్కున్నదన్న వాక్యం చాలామందికి ఆందోళన కలిగించింది "ఇది రష్యన్ స్వాతంత్ర్య ప్రకటన అయిఉండొచ్చు మనదంటే మాత్రం నమ్మం" అన్నారు

ఈ వృత్తాంతం తెలిసి జులై31న 'న్యూయార్క్‌పోస్ట్' పత్రిక న్యూయార్క్ నగరంలో ఇదే పరీక్ష సాగించింది ఆ పత్రిక తయారుచేసిన ప్రకటన పై సంతకాలు చేయమని 161మందిని అడిగితే 19మంది మాత్రమే ఒప్పుకున్నారు ఒక మతగురువు చాలాగాభరా పడ్డారు "దేనిమీద సంతకం చెయ్యటానికీ నాకు ధైర్యంలేదు" అన్నాడాయన అమెరికాలో రాజకీయవిజ్ఞానం గలవారే లేరని కాదు స్టాక్‌హోం శాంతివిజ్ఞాపన పై 30లక్షలమంది అమెరికనులు సంతకం చేశారు

తమ హక్కులు తామెరిగిన ప్రజలను ఏ ప్రభుత్వమూ వంచించలేదు అమెరికావంటి దేశంలో ప్రజలు కొంత ప్రజాస్వామికాన్ని చవిచూసి ఉండటం వల్లనూ, ఇతరదేశాలలో ప్రజలకన్న తాము ఎక్కువ సుఖంగా ఉన్నామన్న విశ్వాసం కారణంగానూ రాజకీయమైన ఏమరుపాటు అవలంబించవచ్చు తమ పాలకవర్గంలో గుడ్డివిశ్వాసం ఉంచవచ్చు అటువంటి దేశంలో ఆకస్మికంగా ఫాసిజం రావటం సాధ్యంకాదు గనక వారి ఏమరుపాటు సమర్ధనీయం కూడా కావచ్చు కాని మన ఆసియావాసులం ఏమరుపాటున ఉండటం చాలా ప్రమాదకరం మన సమష్టి భావిజీవితం రాగల ఎన్నికలలో మనం ప్రదర్శించే రాజకీయ విజ్ఞానం పై ఆధారపడి ఉంది

తెలుగు స్వతంత్ర, వారపత్రిక 21-9-1951

## 24. పత్రికల బిల్లు

కేంద్రపార్లమెంటువారు భారతీయ పత్రికలకు రెండేళ్ళు విడిఖైదు విధించారు ఖైదు ఆవరణ దాటిపోగోరని పత్రికలకు ఖైదన్న భావం కలగనే కలగదని శ్రీమాన్ రాజగోపాలాచారిగారు భరోసా ఇచ్చారు

పత్రికల అక్షేపణీయరచనల బిల్లుపై జరిగిన చర్చలో పాల్గొన్నవారిలో బిల్లును తీవ్రంగా ఖండించినవారు కూడా ఉన్నారు గాని మొత్తంమీద ఒక్కరైనా పత్రికల యొక్క సాంఘిక ప్రయోజనాన్ని గుర్తించినట్టు మాట్లాడలేదు పత్రికలకు యావజ్జీవఖైదు విధించనందుకు చాలామంది హర్షించారు! మరికొందరు సభ్యులు రాజగోపాలాచారి గారి చాకచక్యాన్ని శ్లాఘించటమే కాక పత్రికలవారిని మందలించారు కూడానూ

ప్రజాస్వామికంలో పత్రికలు – ఒక రాజకీయపక్షాన్ని మాత్రమే బలపరిచే పత్రికలు కూడా– ఒక చిత్రమైనపాత్ర నిర్వహిస్తాయి బహిరంగసభలు పరిమితంగా చేసేపనినే పత్రికలు సమగ్రంగా చేస్తాయి రాజకీయంగానూ సాంఘికంగానూ జీవితాన్ని గురించి ప్రజలకు సరికొత్త విషయాలు

తెలపటమేగాక, జీవితాన్ని విమర్శిస్తాయి ఒక్కొక్క పత్రిక ఒక్కొక్క రాజకీయపక్షాన్నే బలపరిచినందువల్ల ఆటే నష్టంలేదు ఎందుకంటే ప్రతి పక్షానికీ పత్రికలుంటాయి ఏ పత్రికగాని అసత్యప్రచారం సాగించినట్టయితే మిగిలిన పత్రికలు సులభంగా ఆ పత్రికను బయటపెట్టగలవు

ఏ పత్రికగాని సాంఘిక ప్రయోజనాన్ని సాధించాలంటే దానికి స్వాతంత్ర్యం ఉండితీరాలి– పొరబాటు చేసి దిద్దుకునే స్వాతంత్ర్యంతో సహా ఈ స్వాతంత్ర్యం దుర్వినియోగం కావటం ఉండదా? స్వాతంత్ర్యానికి మటుకు ఏవో అవధులు ఉండవా? అని అడగవచ్చు అటువంటి అవధులు సంఘంలోనే ఉన్నాయి ప్రతి పత్రికా ఏదో ఒక రాజకీయ, సాంఘిక ఆశయానికి కట్టుబడి పనిచేస్తుంది ఈ ఆశయమే పత్రికయొక్క స్వాతంత్ర్యానికి కాలవగట్టుతుంది ఆ పైన ఆ ఆశయాన్ని బలపరిచే పాఠకులుంటారు వారు కూడా ఆ పత్రిక తన పరిమితి దాటకుండా చూస్తారు పత్రిక యొక్క స్వాతంత్ర్యాన్ని అరికట్టే అధికారాన్ని మూడోపక్షం అవలంబించినట్టయితే మరుక్షణమే ఆ పత్రిక సాంఘికప్రయోజనాన్ని సాధించలేకపోతుంది

సంఘంలో సంఘవిద్రోహకరమైన ఆదర్శాలూ, వాటిని అవలంబించేవారూ లేరా అనవచ్చు ఇటువంటి పత్రికలు అసత్యప్రచారమూ, వ్యక్తిదుర్విమర్శలూ సాగించకుండా పత్రికలు నడపలేవు ఈ రెంటినీ ఎదుర్కోవటానికైనా ఇతర పత్రికలకు స్వాతంత్ర్యం ఉండాలి మన కేంద్రప్రభుత్వానికి కొన్ని పత్రికలను చూస్తే చాలా గుర్రు ఆ పత్రికలు ప్రకటించే రచనలూ, ఆ రచనల ధోరణీ కూడా ప్రభుత్వానికి చాలా కంటగింపుగా ఉంటున్నాయి కాని ఆ పత్రికలు అరాచకాన్ని తెచ్చిపెట్టాలని ప్రయత్నించలేదు పైపెచ్చు ప్రభుత్వ పరిపాలనలోనూ, ప్రజాజీవితంలోనూ గల అరాచకాన్ని ఖండిస్తున్నాయి ఆ పత్రికలకు ప్రజలలో పలుకుబడి ఉన్నది ఆ పత్రికలు నిజంగా ప్రజలను మభ్యపెడుతున్నట్టయితే ఆ విషయం ఇతర పత్రికలు సులభంగా బయటపెట్టగలవు కాని వాటిని అదుపులో ఉంచే అధికారాన్ని ప్రభుత్వం అవలంబించినట్టయితే కలిగే ఫలితాన్ని మనం ఊహించవచ్చు ఎటొచ్చీ పత్రికలకు హక్కులు మాత్రమే ఉన్నాయి అధికారాలు లేవు ఈ హక్కులు కూడా లేకపోయినతరవాత పత్రికలు పొట్లాలు కట్టుకోవటానికి తప్ప పనికిరావు

ఇంకొక ప్రధానవిషయం జర్మనీలో హిట్లరు పరిపాలనకిందా, ఇటలీలో ముసోలినీ పరిపాలనకిందా, ప్రస్తుతం పాకిస్తానులోనూ పత్రికలు ప్రజలను పెద్దఎత్తున వంచించి, సంఘంలోని పశుశక్తులను ప్రేరేపించటం మనం చూస్తున్నాం అయితే ఈసాకు పెట్టి పత్రికలహక్కులను అణచిపెట్టటం చాలా అవివేకమవుతుంది ఎందుచేతనంటే, ముందుగా పత్రికల హక్కులను అణచటం ప్రారంభమయితేనే కొన్ని పత్రికలకు ఇటువంటి సంఘవిద్రోహకపాత్ర వహించే అవకాశం లభించింది ఇటువంటి బిల్లులు పత్రికల ద్వారా ఫాసిజమును అభివృద్ధి చెయ్యటానికి మాత్రమే ఉపకరిస్తాయి గాని, నిరోధించటానికి ఉపకరించవు గాంధీజీ అడుగుజాడల్లో నడిచే కాంగ్రెసు, ఫాసిజమును తీవ్రంగా ఖండించిన కాంగ్రెసు, ఈనాడు ఫాసిజముకు దారితీసే బిల్లును తయారుచేస్తుందా? చేసింది ఇటువంటి బిల్లుయొక్క ఆవశ్యకత ఏమిటో ప్రభుత్వం పార్లమెంటు ఎదట రుజువుచెయ్యలేకపోయిందని పండిట్ హృదయనాథ కుంజ్రూ చేసిన సవాలుకు సమాధానం లేదు ఏ సూత్రాలను బట్టి

బ్రిటిష్ పరిపాలనలో యంగ్ ఇండియా, హరిజన్ మొదలైన పత్రికలను నిషేధించారో ఆ సూత్రాలను బట్టే ఈ బిల్లు కూడా తయారయింది ఏ పత్రికగాని ప్రభుత్వానికిష్టం లేని సత్యాలు ప్రకటించినప్పుడు వాటిని ఖండించటానికి వీలులేదు గనక దండించటం!

పత్రికల వారికి తమ హక్కులపట్ల అభిమానం ఉన్నట్టయితే ఈ బిల్లు సందర్భంలోనైనా అందరూ ఏకమై ఉండేవారే పత్రికలు ఏకమైనట్టయితే ఈ బిల్లు అమలులోకి వచ్చిఉండదు కాని అఖిలభారత పత్రికాసంపాదకుల సంఘంలోనే ఈ బిల్లు విషయంలో చీలికలు ఏర్పడ్డాయి రాజ్యాంగసవరణ జరిగినప్పుడే విభేదాలు స్పష్టంగా బయటికొచ్చాయి పత్రికలకు గల హక్కులు అవిభాజ్యాలన్న జ్ఞానం పత్రికలవారికి పోయింది ఈ సంగతి గమనించే రాజగోపాలాచారి పత్రికల వారిలో కొందరు మంచి పిల్లకాయలున్నట్టూ, ఈ బిల్లు వారికోసం కానట్టూ మాట్లాడగలిగాడు విభజించి పాలించే మహాసూత్రం ఇంతకాలానికి కాంగ్రెసు మహానాయకులకే అక్కరకువచ్చింది– గిరీశానికి జంఝుప్పోచ వినియోగించినట్టు ఈ బిల్లుకు వ్యతిరేకంగా ప్రొఫెసరు భట్టాచార్య మాట్లాడటానికి లేచినప్పుడు రాజగోపాలాచారి పక్షాన అల్లరిచేసిన కాంగ్రెసు సభ్యులు ఈ బిల్లులోని అంతరార్థానికి సరిఅయిన భాష్యం ప్రదర్శించారు

ప్రెస్‌బిల్లు పట్ల తమ అసమ్మతిని వ్యక్తపరిచే ఉద్దేశంతో కొందరు నిస్సహాయులు దీనిని ప్రయోగించే అవకాశం రాగూడదన్న ఆశ వెలిబుచ్చారు కాని ఇది అర్థంలేని ఆశ నూటికి తొంభైతొమ్మిది పత్రికలు దేశసేవకంటె ఆత్మరక్షణే ప్రధానంగా గణించవలసిన పరిస్థితి కల్పించిన మీదట జరగవలసిన మోసం జరిగేపోయింది ఈ బిల్లుకింద ఎన్ని పత్రికలు శిక్షించబడతాయన్నది ప్రధానంకాదు అది ప్రధానమే అయితే మామూలు క్రిమినల్ ప్రొసీజర్‌కోడ్ సంఘక్షేమానికి ఎంత అవసరమో ఈ బిల్లూ అంతే అవసరమని తృప్తిపడవచ్చు కాని వాస్తవం అదికాదు అక్కడే ఈ బిల్లు ఆక్షేపణీయమవుతున్నది

ఏ వర్గం యొక్క వ్యవహారాలను ఆ వర్గం నిర్వహించుకోవటం ప్రజాస్వామికమవుతుంది దేశంలోని కార్మికులూ, రచయితలూ, ఉత్పత్తిదార్లూ, వైద్యులూ, విద్యావేత్తలూ, రాజకీయ వేత్తలూ తమ సమష్టిజీవితాలను తాము శాసించుకోవటంకన్న ప్రజాస్వామికంలేదు ఇందులో సంఘవిద్రోహానికి అవకాశం ఉన్నమటుకే ప్రభుత్వం శాసనాలు చేయవచ్చు కాని హిందూపత్రిక అన్నట్టు పత్రికలన్నీ దుర్మార్గపువే అన్న ధోరణి కనబరిచే ఈ బిల్లు పత్రికల న్యాయమైన హక్కులను హరిస్తోంది

కాంగ్రెసుపార్టీ వారు ఆత్మరక్షణ నిమిత్తమే ఇటువంటి ధోరణి అవలంబిస్తున్నారనటానికి సందేహం లేదు కాని తీరా జరిగేది దీనికి విరుద్ధంగానే ఉంటుంది ఇటువంటి బిల్లులు అమలుచేసినపుడల్లా కాంగ్రెసు ప్రభుత్వం కొత్తవర్గాల అసంతృప్తిని చూరగొంటున్నది స్వలాభార్థం కాంగ్రెసు నష్టానికే దారితీస్తున్నదంటే మార్క్సిస్టు పరిభాషలో కాంగ్రెసులోని ఆంతరంగిక సంఘర్షణ చాలా తీవ్రదశను అందుకున్నదన్నమాట ప్రెస్‌బిల్లు దేశక్షేమం కోసం నిర్దేశించబడిందనటానికి రాజగోపాలాచారిగారు అద్భుతమైన కారణం చెప్పారు దేశంలోని మోతుబరి పత్రికలు ప్రెస్‌బిల్లును ప్రతిఘటిస్తున్నాయట! దేశంలోని పత్రికలన్నీ ప్రతిఘటిస్తున్నాయన్నమాట ఆయన చెప్పలేదు దేశంలోని ప్రజలందర్నీ ప్రతిఘటించి దేశక్షేమాన్ని సాధించటానికి కూడా కాంగ్రెసుకు

అభ్యంతరం లేదని రుజువవుతున్నది  పెద్ద పత్రికలపట్ల ప్రజలకు గల అనుమానాలను కూడగట్టుకుని ఈ బిల్లును ఆమోదింపజేయాలని ఆచారిగారి సంకల్పమై ఉండవచ్చుగాని, ఆయన దేశక్షేమం కోసం అవలంబించిన పద్ధతి ఫాసిజం గురించి యుద్ధకాలంలో వెలువడిన ఒక హాస్యాన్ని స్ఫురింపజేస్తున్నది  ప్రపంచమంతా జర్మనీకిందికి వచ్చిన అనంతరం ప్రపంచప్రజలందరికీ సౌఖ్యం చేకూరుస్తామనీ, వారు దానికి సమ్మతించకపోతే బలాత్కారంగానైనా వారికి సౌఖ్యాలను అంటగడతామనీ నాజీలు ప్రకటన చేసినట్టు ఆంగ్లో అమెరికనులు ప్రచారం చేశారు  వేళాకోళానికి కాంగ్రెసు ప్రభుత్వం ఇటువంటి బిల్లుల ద్వారా దేశక్షేమాన్ని సాధించయత్నించే పద్ధతి ఆ వేళాకోళాన్ని నిజం చేస్తున్నది

తెలుగుస్వతంత్ర, 12-10-1951

## 25. సంతాన నిరోధం

క్లిష్ట పరిస్థితిలో ఉన్న ప్రతివాళ్ళకీ తారకమంత్రం ఒకటి ఎంతైనా అవసరం  మన నాయకులకు ఈ పరిస్థితిలో సంతాననిరోధం తారకమంత్రంలాగే దొరికింది  అధికాహారోత్పత్తికి ఇన్నికోట్లు తగలేసినా ఆహారకొరత పెరగటానికి కారణమేమిటి?  నాలుగేళ్ళకు పైగా దేశసంపదను పెంపొందించటానికి కాంగ్రెసు ప్రభుత్వం నానా హైరానాపడుతుంటే అది పెరగదేం?  జనాభా పెరుగుదల! దాన్ని తరించే మార్గమేమిటి?  సంతాననిరోధం!

తారకమంత్రాలలో ఉండే ప్రత్యేకత ఏమంటే, అవి చిక్కు ప్రశ్నలకన్నిటికీ సమాధానా లివ్వవు  అదీ కాక, వాటిని విశ్వాసంతో ఆచరించవలసిందే గాని వాటి ఫలితాలకోసం ప్రతిక్షణమూ ఎదురుచూడగూడదు  ఎదురుచూస్తే ఏమీ కనపడదు

ఎందుచేతనంటే మనదేశంలోని దారిద్ర్యానికీ ఆహారకొరతకూ జనాభాతో సంబంధం లేదు  మనం ఉపయోగించే సనాతనపు వ్యవసాయ పరికరాలతోనూ, భూవిభజన విధానంతోనూ, భూస్వామ్యవిధానంతోనూ, మన వ్యవసాయానికి జలసౌకర్యాలు లేకపోవడంతోనూ సంబంధం ఉన్నది

ఆసియా దేశాలకున్న సంపదల్లా జనాభాయే  మనకు అర్థబలం లేదు  అంగబలమైనా ఉన్నందుకు సంతోషించాలి  ఏమంటే ఈ అంగబలంతోనే మనం బ్రహ్మాండమైన నిర్మాణాలు సాగించవలసి ఉంది  దేశాన్ని రక్షించుకోవలసి కూడా ఉంది

మన ప్రజాకోటిని చూసి భయపడుతున్న వారూ, భయపడదగినవారూ సామ్రాజ్యవాదులు, విముక్తచైనాలోని ప్రజాకోటి వారిని కలవరపెడుతోంది  ఆగ్నేయాసియాలోని ప్రజాకోటి చైనామార్గం అవలంబిస్తే సామ్రాజ్యవాదానికి నిలవనీడ ఉండదు  ఈ విషయం కొరియా విపులంగానే రుజువు చేస్తున్నది  “ఇవాళ మనకు కొరియాలో గల శక్తి యాలూ నదిదాకా వెళ్ళి అక్కడ స్థావరాలు ఏర్పరచుకోవటానికి చాలదు” అని అమెరికన్ సైనికాధికారి ఒకడు కుండ పగలేసి చెప్పాడు

మలయాలో బ్రిటిష్‌వారి అనుభవమూ, వియత్నాంలో ఫ్రెంచివాళ్ళ అనుభవమూ ఇందుకు భిన్నంగా లేవు  ఆసియా ప్రజాకోటి సామ్రాజ్యవాదులకు తీరనిసమస్య అయిపోయింది

అందుచేత వారు మన అంగబలం మీద ఏవో అభాండాలు వేయటంలో ఆశ్చర్యం లేదు ఉన్న ఆశ్చర్యమల్లా మన పరిపాలకులు ఈ అభాండాలను గుడ్డిగా ఏకరువు పెట్టటంలో ఉన్నది మన పత్రికలు అంతకన్న గుడ్డిగా సంతాననిరోధాన్ని ప్రచారం చెయ్యటం మరింత ఆశ్చర్యం

రష్యా జనాభా ఏటా ముప్పైలక్షలకు పైగా పెరుగుతోంది పైగా 1940తో పోలిస్తే 1951కి అక్కడి మరణసంఖ్య సగానికి సగమైనట్టు తెలుస్తున్నది అయినప్పటికీ అక్కడి సంపద ఏడాదికి సుమారు నూరింట పన్నెండుపాళ్ళ చొప్పున అభివృద్ధి అవుతూనే ఉన్నది వారికి తిండిసమస్య ఎంతమాత్రమూ లేకపోగా 1953కల్లా రష్యాలో అందరికీ రొట్టె ఉచితంగా దొరుకుతుందని అంచనా వేస్తున్నారు

చైనాకూడా జన్మనిరోధం అవలంబించకుండానే తన ఆహారకొరతను పరిష్కరించుకుంటోంది

మరి మన మహానాయకులు మన ప్రజాకోటిని అదనపు జనాభాకింద పరిగణించి ఎందుకవమానిస్తున్నారు? రష్యా చైనాలలాగే ప్రజాక్షేమకర చర్యలు సాగించే దక్షతలేక!

సామాన్య ప్రజలమీద ఈ సంతాన నిరోధతారకమంత్రం విసరటంలో మన నాయకులకు ఒక ఆశ లేకపోలేదు అదేమంటే, ప్రజలకు సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ గురించి ఏమీ తెలియదనీ, వ్యక్తిగత ఆర్థిక చిక్కుల్లో ఉండేవారికి ఈ తారకమంత్రంలో ప్రత్యక్షసత్యం కనిపిస్తుందనీనూ!

నిజానికి, నూరురూపాయల సంపాదనా నలుగురు పిల్లలూ గలవాడు తన ఆర్థికసమస్యను గురించి వ్యక్తిగతంగా ఆలోచించక ఏం చేస్తాడు? ఐదో పిల్లో, పిల్లాడో కలిగితే వాడిగతి ఏమవుతుందో వాడికి తెలుస్తూనే ఉంటుంది సంతాననిరోధాన్ని వాడు తప్పక బలపరుస్తాడు చాతనయితే అమలుచేస్తాడు కూడానూ దీనికోసం నాయకులు ప్రసంగాలు చెయ్యటమూ, పత్రికలలో పేజీలకొద్దీ వ్యాసాలు ప్రచురించటమూ అవసరంలేదు ఈ సమస్యను వ్యక్తిగత సమస్యగా కాక సమష్టి సాముదాయిక సమస్యగా పరిష్కరించదలచినప్పుడే ఈ విధంగా పత్రికలు ఖరాబు చెయ్యవచ్చు అయితే సమష్టి ఆర్థికసమస్యను సంతాననిరోధం పరిష్కరించదు ఎందుచేత? ఆర్థికసమస్య గలవాళ్ళు ఆర్థిక సమస్య తెచ్చిపెట్టేవారయినప్పుడే సంతాననిరోధం పరిష్కారమార్గమవుతుంది కాని ఈ విషయం అట్లా కాదు పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థలో దారిద్ర్యానికి కారకులైన ధనికులకు దారిద్ర్యబాధలేదు సంపదను సృష్టించే శ్రామికులకు మాత్రమే దారిద్ర్యబాధ అందుచేత శ్రామికవర్గమంతా సంతాననిరోధం అవలంబించి రెండోతరం లేకుండా చేసుకున్నట్టయితే దేశమంతా ధనికులే మిగలటానికి బదులు దరిద్రులే మిగులుతారు ఎందుచేతనంటే రెండువందల ఎకరాలుండటం సంపదకాదు దాన్ని ఎవరన్నా దున్ని ఫలసాయం ధారపోస్తే దాన్ని తేరగా ఆరగించటం ఈనాటి మన ఆర్థికవ్యవస్థలో సంపద అనిపించుకుంటున్నది పనిగల ప్రతివాడి వెనకా ఇద్దరు నిరుద్యోగులుంటే గాని ఈ ఆర్థిక వ్యవస్థ తనకాళ్ళ మీద తాను నిలబడలేదు ఈ ఆర్థికవ్యవస్థను సమర్థించేవారు సంతాననిరోధాన్ని బలపరచటం ఆత్మవంచన అవుతుంది

ఇంకొక ముఖ్యవిషయమేమంటే సంతాననిరోధం ఒక్కటే అవలంబించి ఆర్థిక సమస్య– వ్యక్తిగతంగానే అయినా– పరిష్కరించటం సాధ్యం కాదు సంతాన నిరోధం వెంట హత్యలూ, ఆత్మహత్యలూ కూడా ఉండాలి మాటవరుసకు ఒకడు నాలుగువందలు తెచ్చుకుంటున్నా

దనుకోండి తన రాబడిని బట్టి ఇద్దరుముగ్గురు పిల్లల్ని కంటాడు అయితే ఇంతలో ఉద్యోగం కాస్తా పోతుంది ఉన్నపిల్లలే ఎక్కువవుతారు ఆ పిల్లల్ని తండ్రి హత్యచేసే సదుపాయం ఉండాలి 'ఫామిలీ ప్లానింగ్' అనగానే సరికాదు ఏ కుటుంబానికి గాని నికర ఆదాయం ఉన్నప్పుడు ప్లానింగ్ సాధ్యమవుతుంది గాని, ఉద్యోగాలిచ్చే అధికారం కొద్దిమంది చేతుల్లో ఉండగా, వాళ్ళ పై ఆధారపడే అసంఖ్యాకులు 'ప్లానింగ్' అవలంబించటంలో అర్థమేమిటి? అయితే ఈ విషయం కాంగ్రెసు పెద్దలనడిగి లాభంలేదు ఎందుకంటే వారు ధనికవర్గాల హక్కులజోలికి పోకుండానే దేశానికంతకూ ఆర్థిక పంచవర్ష ప్రణాళికలు వేస్తున్నారు! ఈ వంచన ముందు 'ఫామిలీ ప్లానింగ్' అన్న వంచన సముద్రంలో కాకిరెట్ట అయినప్పటికీ సంతాననిరోధం చాలామంచిదని అన్నందుకు నెహ్రూ కీర్తి అమెరికా దిగంతాలు మోసిందట పాపాలకల్లా భైరవులు, జనాభాని దారిద్ర్యానికి మూలహేతువు చేసేస్తే నెహ్రూ నాయకత్వం కింద పంచవర్ష ప్రణాళికలూ, నేషనల్ ప్లానింగూ మొదలైనవి జరగకుండా పోతాయని అమెరికా పాలకుల ఆశో, లేక సంతాననిరోధం మీద నిపుణులను నలుగురిని అమెరికానుండి ఇండియాకు పంపించి, ఆ నెపంతో ఐక్యరాజ్యసమితిలో ఇండియాచేత తమకు అనుకూలంగా వోటుచేయించుకోవచ్చునన్న ఆశో మనకు తెలీదు

కాని మనదేశ ప్రజలు ఈ 'చావు' సంస్కారాన్ని దూరంగా ఉంచటం మంచిది సంతాన నిరోధం వల్ల ఏ సమస్యలూ తీరవు దారిద్ర్యంతో బాధపడే వ్యక్తులు పిల్లల్ని కనకూడదు నిజమే కాని సంతాన నిరోధానికి సమ్మతించని వర్గం కూడా వారే శ్రామికులకే అంగబలంలో విశ్వాసం ఉన్నట్టు కనపడుతుంది వారు పిల్లల మీద గాని వారి చదువుసంధ్యల మీదగాని ఎక్కువ ఖర్చు పెట్టరు నలుగురు పిల్లలుంటే నాలుగింతలు ఆర్జించి తెస్తారు గదా అన్న ధోరణిలో ఉంటారు సంతాన నిరోధవాదుల దృష్టిలో ఇదంతా మూఢత్వం కావచ్చు అనేకవందల తరాలుగా వీరు సంతాన నిరోధం అవలంబించవలసినవారై ఉండవచ్చు కాని వారాపని చెయ్యనందుకు మనం సంతోషించవలసి ఉంది వారు ఉండబట్టే పరిశ్రమలకు చౌకగా కూలి దొరుకుతున్నది వారుండబట్టే డాలర్లూ స్టెర్లింగూ రెక్కలుగట్టుకుని మనదేశానికి వచ్చి ఇక్కడ విహరించగోరుతున్నాయి

మనదేశంలో అందరూ ప్రజాకోటి మీద అనాదరణ గలవారే కాదు, ప్రజలలో విశ్వాసం గల రాజకీయవర్గాలు కూడా ఈ దేశంలో లేకపోలేదు ఆ వర్గాలు రేపు పదవిలోకి వస్తే జనానికందరికీ వారు పనులు చూపించవచ్చు దేశీయసంపద పెంపొందించటానికి దేశంలో వారంతా కృషిచేయవలసి రావచ్చు అప్పుడు ఈ సంతాన నిరోధ తెలివితేటలు కొంచెం వెలవెలా పోయితీరుతాయి

జనాభా పెరుగుదల పైన దారిద్ర్యసమస్యను మోపేవారు ఇంకా ఏయే సిద్ధాంతాలు అవలంబిస్తారో తెలుసుకుంటే గాని ఆ చచ్చుసంస్కృతి యొక్క సమగ్రస్వరూపం బోధపడదు జనాభా పరిమిత ప్రమాణంలో ఉంచటానికి అప్పుడప్పుడు యుద్ధాలుండాలి! మారణాస్త్రాలు పైకి చెడ్డవిగా కనిపించినా, జనాభాను నాశనం చెయ్యటంలో చాలామంచి పనే చేస్తాయి! మలేరియా, క్షయా, కలరా, ప్లేగూ మొదలైన జాడ్యాలు కూడా చాలావరకు జనాభాను అదుపులో ఉంచగలుగుతాయి!

యుద్ధాలనూ, అంటువ్యాధులనూ ఆరాధించే చచ్చుసంస్కృతిని మనం కొనితెచ్చుకో నవసరం లేదు మనుష్యులు భారమయేది తరచు మధ్యతరగతి వాళ్ళకు వారు సంతాన నిరోధం అవలంబించవచ్చు ఎవరూ నివారించరు ధనికులకు పిల్లలభయం లేదు దరిద్రులకు-నిండామునిగినవాడికి చలేముంది? పైగా రానున్న సాంఘిక వ్యవస్థకు వారు నాయకులు, శ్రామికప్రజల నాయకత్వం కింద పురోగమించే దేశాలలో ఈ సంస్కారం లేదు వారు చావును కూడా అదుపులోకి తెస్తున్నారు అటువంటి వ్యవస్థను దేశంలో అవతరింపజేయటం కాంగ్రెసు మహానాయకులకు చేతకాకపోతే చేతకాదని చెప్పెయ్యవచ్చు కాని ఈ వేదాంతం బోధించవలసిన అవసరం లేదు

తెలుగుస్వతంత్ర, వారపత్రిక 7-12-1951

## 26. కమ్యూనిస్టు భయం

ప్రాణికోటి అన్నతరువాత అనేకభయాలు ప్రాణభయం, మానభయం, రోగభయం, ఆకలిభయం, కాటకభయం, దొంగలభయం, దొరలభయం, దేవుడి భయం, నరకభయం అయితే అన్నిటికన్న పెద్ద భయం కమ్యూనిస్టుభయం

ఇందులో చిత్రం ఏమీలేదు మంచానబడి తీసుకుంట్ను వాడికి రోగభయం ఉండగా నేనెన్నడూ చూడలేదు నేనెరిగిన మనిషి ఒకడుండేవాడు అతను రోగక్రిములను గురించి ఒక పుస్తకం చదివాడు అది చదివినప్పటినుంచీ అతనికి చెప్పరాని గాభరా పట్టుకుంది భయంకరమైన రోగకారక క్రిములు కోటానుకోట్లు గాలిలో, నీటిలో ఈదులాడుతున్నట్టూ, ప్రతివస్తువునూ అంటిపెట్టుకుని లుకలుకలాడుతున్నట్టూ అతనికి పరిజ్ఞానం కలిగింది మనిషి నిలువునా నీరుకారిపోయాడు గాలి పీల్చాలంటే భయం, ఏదైనా తాగాలంటే భయం, ఎక్కడన్నా చెయ్యిపెడితే వెంటనే చేతికేసి చూసుకునేవాడు ఈ భయంకరవ్యాధికారక క్రిములు చర్మచక్షువులకు కనిపించేవి కావన్న విషయం అతనికి జ్ఞాపకం వచ్చేది చెయ్యి కడుక్కుందామంటే నీళ్ళలో కూడా క్రిములేనాయే ఏ వస్తువునూ అంటకుండా, ఏ గాలీ పీల్చకుండా జీవించే ఉపాయం అతనికి తెలీలేదు తేళ్ళంటేనూ, పాములంటేనూ వల్లమాలిన భయం ఉండేవారున్నారు అయితే వాళ్ళు ఈ క్రిమిపీడితుడికన్నా చాలానయం ఎందుకంటే తేళ్ళూ, పాములూ కంటికి కనిపిస్తాయి క్రిములు కనిపించవు

కమ్యూనిస్టుభయంలో ఉండే రెండోగొప్ప విశేషం ఇదే అది ఇతర భయాలలాంటిది కాదు క్రిమిభయం లాంటిది మిగిలిన భయాలు విస్పష్టమైనవైతే ఇది అస్పష్టమైనది కమ్యూనిజం రావటంవల్ల మనిషికి వచ్చే నష్టం ఇదమిద్ధమని చెప్పేది కాదు అది పరబ్రహ్మస్వరూపం లాగా అవాఙ్మానసగోచరమైనది నరకభయం కూడా ఇంత అస్పష్టమైనది కాదు నరకంలో మట్టలాగులవాళ్ళు మనల్ని రంపాలతో కోస్తారు నూనెలో ఉడకేసి వండుతారు నిప్పుల్లో కాలుస్తారు అంతకంటే ఇంకేమీ చెయ్యలేరు అందులో మన ఊహకు అందనిదేమీలేదు

ఈమధ్య అంతర్జాతీయ నైతిక పునరుద్ధారకులు మనదేశం వచ్చారు వాళ్ళతో మాట్లాడాను వీళ్ళను గురించి ముందుగానే కొంత విన్నాను వీళ్ళ నాయకుడికి హిట్లరంటే అవతారపురుషుడనే నమ్మకం ఉండేదట కనక వీళ్ళచూపు తప్పకుండా పెద్దదే అయిఉండాలనుకున్నాను వీళ్ళొక

కొత్తమతాన్ని మోసుకొచ్చారు  మందికన్నా మనిషి ముఖ్యమన్నది వీరి సిద్ధాంతాల్లో ఒకటి ఇది నాకు బాగా నచ్చింది  ఎందుచేతనంటే అదివరకల్లా నాకు మనుష్యులలో తేడాలున్నట్టు భ్రమ ఉండేది  గ్రామగ్రామాన్నీ గుడ్డలూడదీయించి  గాంధీమహాత్ముని విగ్రహం ముందు మోకరింపజేసిన పోలీసు అధికారి నాకన్న ఈ భారతావనికి చాలాముఖ్యుడనీ, "మాకు తిండిలేదు మొర్రో" అని ప్రదర్శనం చేయటానికి వెళ్ళిన స్త్రీ పురుషుల మీద కాల్పులు జరిపించి ఏడేళ్ళ కుర్రాళ్ళని సహితం చంపించిన అధికారితో పోలిస్తే నేను అనామకుణ్ణనీ భ్రమపడేవాణ్ణి  అదంతా ఏమీలేదుట  ప్రతివ్యక్తీ ముఖ్యమేనట  ఇదే నైతిక పునరుద్ధరణ  అయితే నాకు నైతిక పునరుద్ధరణే ఇవ్వండి  రేపు ప్రపంచసంగ్రామం రాకుండా చెయ్యాలంటే మంది పూనుకుని లాభంలేదు  'ఐ–లైక్–ఐక్'తో మాట్లాడి కూడా లాభంలేదు  "ఐక్ ఎవరు?" నైతిక పునరుద్ధరణసంఘంలో చేరిన కోటీశ్వరుల అన్నలూ, యుద్ధపారిశ్రామికుల తమ్ముళ్ళూ, మాజీ నాజీ బావమరుదులూ నా దగ్గిరకి రమ్మను  నాతో మాట్లాడమను,  నన్ను నైతికంగా పునరుద్ధరించమను, అంతా చక్కబడుతుంది  ఇదీ నేను తెలుసుకున్న పరమరహస్యం

ఇంకొక రహస్యం కూడా తెలుసుకున్నాను  ఈ నైతిక పునరుద్ధారకులకు కమ్యూనిజమంటే భయం  ప్రపంచం– అంటే ఇంకా మిగిలిఉన్న ప్రపంచం– కమ్యూనిజం వాతపడకుండా ఉండగలందులకే వాళ్ళు నైతిక పునరుద్ధరణ ప్రారంభించారు  అమెరికాలో ఈనాడు ఎన్నో భయాలున్నాయి  అక్కడ ప్రతి స్త్రీకీ మానభయమూ, ప్రతి పురుషుడికీ ప్రాణభయమూ ఉంది ఉండటంలో ఏదేశంలోనూ లేనంతగా ఉంది  అయినా ఈ నైతిక పునరుద్ధారకులు అమెరికా ప్రజల్ని ఉద్ధరించటానికి బదులు ఆసియా ప్రజల్ని ఉద్ధరించడానికి వచ్చారు  ఎంచేత? అమెరికాలో కమ్యూనిస్టు భయంలేదు  ఆసియాలో ఉంది  దీన్నిబట్టి మిగిలిన భయాలన్నిటికన్నా కమ్యూనిస్టు భయం గొప్పదని తెలుస్తోంది

నైతిక పునరుద్ధారకులు తమ మతం కమ్యూనిజంకన్నా మంచిదంటున్నారు  ఎంతోమంది కమ్యూనిస్టులు ఈ విషయం గ్రహించి ఈ మతం పుచ్చుకున్నారట  అటువంటప్పుడు వీళ్ళు వెళ్ళవలసింది కమ్యూనిస్టు దేశాలకాదా అని నాకు సందేహం కలిగింది  పాపం ఆ కమ్యూనిస్టు దేశాలవాళ్ళు ప్రపంచంలోకల్లా సర్వోత్తమమైన సాంఘికతత్వం తమ సొమ్మని అపోహపడుతున్నారు  వీళ్ళు గనక అక్కడికి వెళ్ళి "మీ కమ్యూనిజంకంటె మంచిసరుకు మా దగ్గరుంది" అని చెబితే వాళ్ళు కమ్యూనిజం అవతల పారేసి దీన్ని పుచ్చుకుంటారేమోగా!

కాని అట్లా కాదుట  'నన్నిప్పుడు చైనా వెళ్ళమంటే నేను వెళ్ళను  నో, నో సర్" అన్నాడొక నైతిక పునరుద్ధారకుడు  ఒక చైనాయే కాదు ఈయన రష్యా కూడా వెళ్ళడట తూర్పుయూరపు దేశాలకు అసలే వెళ్ళడట  దీనికి బహుశా ఒక కారణం ఉండిఉంటుంది పాపిని నరకకూపంలో వెయ్యటం గురించి బొకాషియో చెడ్డ అశ్లీలమైన కథ ఒకటి రాశాడు నైతిక పునరుద్ధారకులకు చెడ్డ అశ్లీలమైన ఈ కథకు సామ్యం తేవటం నాకూ కష్టంగానే ఉంది గాని, మరి ఏం చేయను? సామ్యం ఉంది  ఈ ఉద్ధారకులున్నారే వీళ్ళు పులుల్నీ మేకల్నీ కలుపుతారు  రెంటివల్లా తప్పుండబట్టే పులి మేకను తినటం జరుగుతోందను కోండి రెంటిలోనూ హృదయపరివర్తన తెచ్చేసరికి మేకలు మరి కమ్యూనిజం మాట తలపెట్టలేవు పులుల్ని చంపి మేకలదే రాజ్యం చేసినాక ఈ మేకల్ని ఎవరితో రాజీచేయటం? శ్రీ మద్భగవద్గీతలో

భగవానులు ఏమని ఉవాచించారంటే "యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి, అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామి" అన్నారు వెధవది ఇవాళ రష్యాలో భగవానుడే అవతారం ఎత్తేట్టులేడు అక్కడికి నైతిక పునరుద్ధారకులు పొమ్మంటే పోతారా? అదీ వచ్చిన చిక్కు "చైనా పెద్ద జైలు-రష్యా, తూర్పుయూరపు దేశాలలాగే" అన్నాడు నా నైతిక పునరుద్ధారక మిత్రుడు చాంగ్‌కైషేక్ కింద చైనా ఇట్లా లేదు అప్పుడు చైనా ప్రజలకు అన్నిరకాల భయాలూ ఉండేవి ఉంటేనేం గనుక? నైతిక పునరుద్ధారకులకు చైనా స్వర్గంలా కనపడింది ఇప్పుడు చైనా ప్రజాజీవితం నిరంతరం అభివృద్ధి అవుతోందని ఆ ప్రజలే అనుకుంటున్నారు అయితేనేం? అది జైలు అక్కడికి నైతిక పునరుద్ధారకులనూ, అమెరికా గూఢచారులనూ రానివ్వరు ఈ మావోసేటుంగ్ ఉన్నాడే ఇతను చైనాప్రజలను హింసలకు గురిచెయ్యటానికిగాను అమెరికా నిపుణులను సలహా అడగడు చైనా ప్రజలను మారణహోమం చెయ్యటానికి అమెరికానుంచి మారణాస్త్రాలు పుచ్చుకోడు ఉష్!

కకమ్యూనిస్టుభయం తదితర భయాలన్నిటికన్న భయంకరమైనదనీ, అది అంత భయంకరమైనది కావటానికి, ప్రధాన కారణం దానికొక అనిర్వచనీయమైన, అవాఙ్మానసగోచరమైన స్వరూపం ఉండటమేననీ, దాని వాతపడ్డవారికి ఆ భయం తెలియనైనా తెలియదనీ, తెలుసుకున్నాక మనం తెలుసుకోవలసిందేమిటంటే ఈ భయాన్ని దూరంగా ఉంచే విధానాలేవీ అన్న విషయం, జాగ్రత్త, ముందుగానే తెల్సుకోండి! ఒకసారి కమ్యూనిజం వాతపడ్డారో మీరిక కోలుకోలేరు సంఘంలో నిరుద్యోగం, దోపిడీ, అనారోగ్యం, అవిద్యా, కరువుకాటకాలూ అంతమైపోతాయి సంపద పెరుగుతుంది జనాభా పెరుగుతున్నా భయం కలగదు ఆర్థిక దుర్దశలు ఏర్పడ్డం మానేస్తాయి ప్రజలలో వెర్రి ఆవేశం పుట్టుకొస్తుంది ఒక్కొక్కడూ పదిమంది పెట్టున పనిచెయ్యసాగుతాడు వస్తువులధరలు తగ్గుతాయి జనానికి మతులే పోయి జీవితం భూలోక స్వర్గమనిపిస్తుంది ఎన్నిశతాబ్దాలుగానో ఎరగని పరిణామాలకు పూనుకుంటాడు ఎడారులు నందనవనాలవుతాయి బిచ్చగాళ్ళుండరు శరీరాల అమ్మకం ఉండదు ఎంగిలాకులు నాకే వాళ్ళుండరు లంచగొండితనం, మాతృద్రోహం, భ్రాతృద్రోహం ఉండవు అందాకా పరిస్థితి విషమించాక మిమ్మల్ని పునరుద్ధరించడానికి నైతికంగా పెట్రోలియంజెల్లీ బాంబులను ప్రతిమనిషి మీదా వర్షపాతంగా కురిపించినా మీరు ఎదురు తిరిగి పోట్లాడుతారు గాని హిట్లరు మహాశయుడికి ఫ్రాన్సు పాదాక్రాంతమైనట్టుగా లొంగిపోరు అప్పుడు మీకేవిటి శరణ్యం? కొరియా ప్రజల దుర్గతే మీ దుర్గతి రష్యా చైనా ప్రజలకు పట్టిన ఖర్మే మీకూ పడుతుంది కనక కమ్యూనిస్టుభయం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోండి దానికి మార్గంలేదంటే ఇలా చేస్తే సరిపోతుంది ప్రజలమధ్య ఉండే వైషమ్యాలు ఒక పెద్ద అంగరక్షకుల తత్వాలంటే, మతోన్మాదాలంటే, జాతివైషమ్యాలంటే, ఇవి కొంతవరకు- అట్లీ మహాశయుడు అభిభాషించినట్లు- ఆసియాలో కమ్యూనిజాన్ని అరికడతాయి ప్రజల అజ్ఞానమూ, అవిద్యా, అనాథత్వమూ, నాయకద్రోహుల ఎడల అచంచల విశ్వాసమూ, మనిషిని నమ్మకుండా అన్నిటికీ ఆ యొక్క పరమాత్మనే నమ్ముకుని ఉండటమూ చాలావరకు కమ్యూనిజాన్ని దూరంగా ఉంచేందుకు ఉపకరించగలవు

ప్రజల దృష్టిని జీవితవాస్తవికత మీద నుంచి మళ్ళించి సంఘద్రోహకరమైన విషయాలమీద మమకారం కలిగించే కళలు విరివిగా సృష్టికావడం వల్ల చాలా ఉపయోగం ఉంది సెక్సువిజ్ఞానాన్ని ముఖ్యంగా కామానికి సంబంధించిన మానసికవ్యాధుల్ని చిత్రించేకథలూ, అత్యంతనైపుణ్యంతో కూడిన హత్యలను చిత్రించే కథలూ కమ్యూనిస్టుభయాన్ని కొంతవరకు దూరంగా ఉంచగలవు

కమ్యూనిస్టు సమాజంగురించీ, అక్కడి జీవితాన్ని గురించీ శరపరంపరగా విషప్రచారం సృష్టించే లేఖకులూ, ప్రసారం చేసే వార్తా సంస్థలూ, ప్రకటించే పత్రికలూ చాలావరకు ఉపయోగపడతాయి

టిటో, ఫ్రాంకో, చాంగ్‌కైషేక్, సింగ్మన్‌రీ, యొషీదా మొదలైనవారి అడుగుజాడలలో జాతీయ, దేశీయ నాయకత్వాలను వహించగలవారూ, అమెరికాకు స్థావరాలమ్మగలవారూ కమ్యూనిస్టు భయాన్ని దూరంగా ఉంచగలందులకు ఉపకరిస్తారు

ప్రజలకు నిజం తెలియకుండా వారిలో అవ్యక్తమైన భయాలను రేకెత్తిస్తూ, వారి ఆర్థిక నైతిక జీవితాన్ని పూర్తిగా ధ్వంసం చేస్తూ, అత్యాశనూ, అవినీతినీ, రాక్షసత్వాన్నీ పెంపొందించే సాంఘికవ్యవస్థలో కమ్యూనిస్టు విత్తనం నాటదు

ఈ విషయాలన్నిటినీ ప్రజలు శ్రద్ధగా గమనించి పాటించినట్టయితే ఏదేశానికీ కమ్యూనిస్టుభయం ఉండదు

విశాలాంధ్ర, దినపత్రిక 22-2-1953

# 27. ఎన్నికలు-ప్రజాస్వామ్యం

కిందటి ఎన్నికలలోకంటె నాలుగులక్షలు మాత్రమే హెచ్చు వోట్లు తెచ్చుకున్న కాంగ్రెసుఫ్రంటుకు 146 సీట్లు ఎలా వచ్చాయి ? క్రిందటిసారికంటె 12లక్షలు ఎక్కువ వోట్లు తెచ్చుకున్న కమ్యూనిస్టులకు 15 స్థానాలే ఎందుకొచ్చాయి? కమ్యూనిస్టులు పోటీచేసినన్ని స్థానాలకూ పోటీ చేసినా, వారిలో సగం వోట్లు కూడా తెచ్చుకోలేకపోయిన స్వతంత్రులకు 22 సీట్లు ఎట్లా వచ్చాయి? ఇటువంటి ప్రశ్నలకు ఒక సమాధానం "ఇది ప్రజాస్వామికయంత్రంలో సహజంగా ఇమిడిఉన్న ఒకరకమైన జూదమని చెప్పవలసి ఉంటుంది "!

"ప్రజాస్వామిక పక్షాలకూ కమ్యూనిస్టులకు పోటీ", "ప్రజాస్వామ్యాన్ని రక్షించండి!", "ప్రజాస్వామ్యం నెగ్గింది" ఇత్యాది శీర్షికలతో పత్రికాపాఠకులను హెచ్చరించినవారు ప్రజాస్వామ్యమనగా లాటరీ అని వింటే ఎంతైనా ఖేదిస్తారు జూదంలాంటి ప్రజాస్వామిక యంత్రంతో 36కోట్ల ప్రజలు గలదేశం ఆడుకోవచ్చా? లేక ఏనాటికైనా గుర్రాలరేసులతో పాటు ఈ జూదాన్ని కూడా నిషేధించాలా?

పి టి ఐ నిపుణులకే కాదు, చాలామంది రాజకీయవేత్తలకూ, కొందరు 'మేధావులకూ' కూడా ప్రజాస్వామ్యం గురించి వింత అభిప్రాయాలున్నట్టు కనబడుతుంది ప్రజాస్వామ్యం అన్నది ఒక రాజకీయసిద్ధాంతం దాన్ని ఆచరణలో అమలుచేయటానికి ఏవో మార్గాలు అన్వేషించాలి పెట్టుబడిదారీ వ్యవస్థ గల అనేకదేశాలలో పార్టీ విధానంతో కూడిన పార్లమెంటరీ

విధానం అమలులో ఉన్నది మనదేశంలోనూ అంతే ఎన్నికలప్పుడు దేశంలో ఉన్న రాజకీయపార్టీలు తమకు ఓపిక ఉన్నంత మటుకు ప్రతినియోజకవర్గంలోనూ అభ్యర్థులను నిలబెడతాయి ప్రజలు తమ ఇష్టం వచ్చిన అభ్యర్థికి స్వేచ్ఛగా వోటు చేస్తారు గెలిచిన అభ్యర్థులంతా శాసనసభకు వెళ్ళినాక అధికసంఖ్యతో కూడిన పార్టీకి ప్రభుత్వం నిర్వహించే అవకాశం ఉంటుంది

అయితే ప్రజాస్వామ్యాన్ని అమలుచేయటానికి ఇది తప్ప మరో మార్గం లేదనీ, ఈ పద్ధతిలో దొసగులేమీ రావనీ అనుకోనవసరం లేదు విమర్శగా చూస్తే ఇందులో చాలా లోపాలు గమనించవచ్చు కొన్ని ఉదాహరణలు తీసుకుందాం

మాటవరసకు దేశంలో రెండే పార్టీలున్నాయనుకుందాం ఒకటి పచ్చపార్టీ రెండోది నీలంపార్టీ ప్రతినియోజకవర్గంలోనూ పచ్చపార్టీ అభ్యర్థికి నీలంపార్టీ అభ్యర్థికన్న నూరింట ఒకవంతు వోట్లు తక్కువ వచ్చాయనుకుందాం ఎన్నికలలో ఒక్క నీలంపార్టీ అభ్యర్థి కూడా గెలవడు పచ్చపార్టీకున్న ప్రజాదరణలో నీలంపార్టీకి నూరింట 99వంతులున్నప్పటికీ శాసనసభలో నీలంపార్టీ గొంతు వినిపించదు అంటే తిరిగి ఎన్నికలసమయం వచ్చేదాకా పచ్చపార్టీ స్వేచ్ఛగా అధికారదుర్వినియోగం చేయవచ్చు, పార్టీ నియంతృత్వానికి అవకాశాలుంటాయి

అసలీవిధమైన ఎన్నికల విధానంలో వాస్తవంగా ఉన్నది పార్టీ నియంతృత్వమే అది ఏ విధంగా అమలుజరుగుతోందో చూద్దాం ఎన్నికలు రాబోతాయనగా అందులో పోటీచేసే పార్టీలు ఏయే నియోజవర్గాలలో పోటీ చేయాలో, ఏయే నియోజకవర్గానికి ఎవరెవరిని నిలబెట్టాలో పార్టీ నాయకుల మధ్య తేల్చుకుంటారు గెలుస్తామని ధైర్యం గల వ్యక్తులు తమను తామే అభ్యర్థులుగా ఎన్నుకుని దరఖాస్తులు పడేస్తారు ఏ సూత్రంపైన గాని, ఏ ప్రజాసముదాయంగాని తమ అభ్యర్థిని తాము ముందుగా ఎన్నుకుని ఎన్నికలకు నిలబెట్టడం జరగదు ఆయా పార్టీల తరఫున, లేక తమంతట తామే, నిలబడిన ప్రతినిధులలో తమకెవరు ఎక్కువగా నచ్చితే, లేక తమకు ఎవరిమీద తక్కువ అనాదరణ ఉంటే వారికి వోటుదార్లు వోటు వేస్తారు

పార్టీ నియంతృత్వం ఎన్నికలకు అభ్యర్థులను నిలబెట్టడంతో అంతం కాదు ఏ కొన్నిపార్టీలు గాని తాము ఏకాంతంగా నిలబడి అధికారంలోకి రాలేమని నిశ్చయించుకున్నప్పుడు, అవన్నీ ఏకమై అభ్యర్థులను నిలబెట్టటం విషయంలోనైతేనేమి తమలో తాము ఎట్టి ఏర్పాట్లయినా చేసుకోవచ్చు ఈ ఏర్పాట్లలో ప్రజాబాహుళ్యానికి ఎటువంటి ప్రమేయమూలేదు

ఇంకా ఉంది శాసనసభలో ప్రభుత్వపక్షం ఏదైనా ఒక బిల్లు ప్రవేశపెట్టినపుడు ప్రభుత్వపక్షీయులకే అధికసంఖ్యాకులకు ఆ బిల్లు ఏహ్యంగా తోచవచ్చు బిల్లుపై చర్చ జరిగేటప్పుడు వారు లేచి బిల్లుకు ప్రతికూలంగా మాట్లాడనూవచ్చు కాని తీరా విభజనసమయంలో వారు కూడా బిల్లుకు అనుకూలంగా చేతులెత్తటమో, పార్టీ క్రమశిక్షణకు గురికావటమో జరిగి తీరుతుంది ఇలా మన పార్లమెంటులో అనేక పర్యాయాలు జరిగింది

పార్టీవిధానంలో పార్టీ నియంతృత్వం కనబడకుండా సాగటమే గాక ఇతర ఇబ్బందులు కూడా ఉన్నాయి కొన్నిదేశాలలో కొన్ని పార్టీలు కాలక్రమాన స్థిరపడిపోతాయి – బ్రిటన్‌లో

కన్సర్వేటివ్, లేబర్‌పార్టీలు, అమెరికాలో రిపబ్లికన్, డెమోక్రటిక్ పార్టీలు లాగ అటువంటిచోట ఉభయపార్టీలమధ్య దొడ్డిదారిన కొన్ని విషయాలలో సామరస్యం కుదిరినప్పుడు వారిమధ్య పోటీ ఒక ఆటకింద పరిణమిస్తుంది ఈ ఆటను అరికట్టటానికి మూడోపార్టీ బయలుదేరాలంటే ప్రజలు దాన్ని గుర్తించరు పాతుకుపోయిన పార్టీలమీద కొత్తపార్టీ ఎక్కిరాలేదు ప్రజాజీవితానికి అత్యంత ముఖ్యమైన వైదేశిక విధానం, యుద్ధవ్యయం మొదలైన అంశాలపై ఒక పార్టీని మరొక పార్టీ బలపరచి ప్రజలకు ద్రోహం చెయ్యటానిక్కూడా యత్నించవచ్చు ఈ విధంగా ఒక పార్టీ మరొకపార్టీని బలపరిచినప్పుడు దాన్ని "బైపార్టిజాన్ పాలసీ" అంటున్నారు నిజంగానే ప్రజాస్వామ్యం పార్టీలపోటీపై ఆధారపడి ఉన్నదైతే బైపార్టిజాన్ పాలసీ ప్రజాస్వామ్య వ్యతిరేకమనుకోవలసిందేగా? అందుకు ఒప్పుకుంటారేమో అమెరికానడగండి!

ఇక అనేక పార్టీలు పోటీచేసి శాసనసభనలంకరించే దేశాలలో ప్రజాస్వామికం మరీ విషమదశలలో ఉంటున్నది ప్రపంచయుద్ధం అయిపోయాక ఫ్రాన్సులో ఇప్పటికి 22 ప్రభుత్వాలు కాబోలు వచ్చాయి ఒక సమస్య పై మెజారిటీ తెచ్చుకోగల ప్రభుత్వం ఇంకో సమస్య పై పతనం అవుతుంది- మెండెస్ ఫ్రాన్స్ ప్రభుత్వం లాగా

ఇవన్నీ పార్టీవిధానాన్ని పురస్కరించుకుని ఏర్పడే సమస్యలు- ఇక వోటింగులో కూడా చాలా గమ్మత్తులు చేసే అవకాశాలున్నాయి నియోజకవర్గాలను ఒకరకంగా ఏర్పాటుచేస్తే ఎన్నికల ఫలితాలు ఒకరకంగా ఉంటాయి ఇంకొకరకంగా ఏర్పాటు చేస్తే ఇంకోరకంగా ఉంటాయి గ్రామాలలో ఒక పార్టీకి ప్రాబల్యం ఉంటే బస్తీలలో ఇంకొకరికుంటుంది

కొంతకాలం క్రితం ఇటలీలో కమ్యూనిస్టులు గెలవకుండా ఉండేటందుకు ఎన్నికల విధానాలను చెప్పి మరీ మార్చారు కొత్తపద్ధతుల ప్రకారం ఆ పార్టీకి వోట్లువచ్చినట్లు సీట్లు రావు!

అయినప్పటికీ ఈ విధానాలన్నీ ప్రజాస్వామ్యానికి అనుకూలమైనవిగానే భావించబడుతున్నాయి ఏ విధానంలోనైనా ఏదో లోపం ఉండవచ్చు ఆ లోపాలను అంచనావేసుకొని, "మనకు నిజమైన ప్రజాస్వామ్యం ఎన్నిపాళ్ళు అమలుజరుగుతున్నది?" అని అంచనా వేసుకునే శక్తి ప్రజలలో ఉండాలి మనదేశంలో ప్రజాస్వామ్యం ఉందిగదా అని సంతోషించగానే సరికాదు ఎన్నికలలో ఓడిపోయిన ఒక పార్టీ అభ్యర్థి, అకస్మాత్తుగా ఆ పార్టీ నుంచి ఇంకోపార్టీకి మారి, మరుక్షణమే ముఖ్యమంత్రి అయి ప్రభుత్వం ఏర్పాటుచేసినప్పుడూ, ఒక రాష్ట్రంలో మూడునాలుగు పార్టీలు ఎన్నికలలో పోటీచేస్తే అందరికన్న తక్కువ సీట్లు సంపాదించిన పార్టీకి ప్రభుత్వం ఏర్పాటుచేసే అవకాశం దొరికినప్పుడూ, "ఇది నిజంగా ప్రజాస్వామికమా?" అని ఆలోచించాలి "ఎన్నికల యంత్రములో కూడా జూదాలే" అని కళ్ళు మూసుకుంటే కొద్దికాలానికి ప్రజాస్వామ్యం అన్న శుష్కపదం తప్ప మరేమీ మిగలదు ప్రజలకోసం ప్రజలను ప్రజలే పరిపాలించటం ప్రజాస్వామ్యం ఆచరణలో ఇది ఎట్లా జరుగుతున్నది, ఎంతవరకు జరుగుతున్నది అని ప్రజలు వెయ్యికళ్ళతో కనిపెట్టి ఉండాలి

1944లో జయపూర్ సంస్థానంలో మొదటిసారిగా మునిసిపల్ ఎన్నికలు ఏర్పాటై జరిగాయి అందులో పోటీచేస్తున్న ఒక లక్షాధికారిని ఆప్తులు "మామా, గెలిస్తే ఏం చేస్తావు?" అని అడిగారు "దివాన్‌గారేం చెయ్యమంటే అది చేస్తా" అన్నాడు ఆ పెద్దమనిషి

నోటివెంట ప్రజాస్వామ్యం జపించటం చాలా సులభం దాన్ని ఆచరణలోనే సాధించాలి

విశాలాంధ్ర 15-3-1955

# 28. భావ విప్లవం

మనదేశం స్వతంత్రమై ఎనిమిదేళ్ళయింది అనేకశతాబ్దాలుగా సాంఘికాభ్యున్నతి కోల్పోయి నడుము విరిగి ఉన్న జాతి ఎనిమిదేళ్ళకాలంలో ఘనమైన అభివృద్ధి సాధించలేకపోతే అందులో ఆశ్చర్యం ఏమీలేదు మన జాతీయప్రభుత్వం జాతీయనిర్మాణం కోసం అనేక పథకాలు వేస్తున్నది ఆత్రం కనబరుస్తున్నది కాని ఈ స్వాతంత్ర్యం పట్లా, ప్రభుత్వ కృషి పట్లా జనసామాన్యంలో ఆసక్తి దాదాపు ఏమీ కనబడదు

ఒక శతాబ్దంపాటు జాతీయవిముక్తి కోసం తహతహలాడిన దేశం తీరా విముక్తిపొందాక జనులలో నూతనోత్సాహం వెల్లువలై పారకపోవటానికి కారణమేమిటి? స్వాతంత్ర్యంతోపాటు ప్రజలలో కలిగి ఉండవలసిన భావవిప్లవం ఎక్కడ?

'స్వాతంత్ర్యం వచ్చినాక మన ప్రభుత్వం ఈ ఘనవిజయాలు సాధించింది' అని జాబితా ఇవ్వవచ్చు 'ఈ సమస్యలు పరిష్కరించలేకపోయింది' అని మరో జాబితా ఇవ్వవచ్చు కాని ప్రజలలో కలగవలసిన చైతన్యాన్ని కొలిచేవాళ్ళు లేరు దీన్ని పరోక్షంగా అంచనా కట్టవలసిందే

దేశంలోని రాజకీయశక్తులకు తామే నియంతలమన్న భావాన్ని ప్రజలుఎంతవరకు కలిగి ఉన్నారు? ప్రజాస్వామికం అనేది దేశంలో ఎంతవరకు అమలుజరుగుతున్నదీ ప్రజలెంతవరకు గమనిస్తున్నారు? ప్రభుత్వమనేది కేవలం శాసించేయంత్రంగా ప్రజలెంతవరకు ఆమోదిస్తున్నారు? ప్రజాస్వామ్యానికి విఘ్నం కలిగితే దానికోసం పోరాడేశక్తి ప్రజలలో ఎంతవరకున్నది? ప్రజాస్వామిక సిద్ధాంతాలకూ, మూలసూత్రాలకూ విరుద్ధమైన విశ్వాసాలూ, ఆచారాలూ, ఆనవాయితీలూ, అలవాట్లూ ఎంతవరకు సంస్కారం పొందాయి? 1947 ఆగస్టు 15 అనంతరం దేశంలో ఒక పెద్ద రాజకీయమైన మార్పువచ్చిన సంగతి తెలుసుకోనట్టు ప్రవర్తించేవాళ్ళ సంఖ్య ఎంత ఉన్నది? ఇటువంటి అసంఖ్యాకమైన ప్రశ్నలకు సమాధానాలు తెలుసుకున్నట్లయితే స్వాతంత్ర్యం వెంట ప్రజలలో కలిగిన భావచైతన్యం అంచనా కట్టవచ్చు

ఈ రచయిత ఉద్దేశంలో ప్రభుత్వం సాధించిన ఘనవిజయాలకంటే ప్రజల్లో కలిగే భావవిప్లవం చాలా ఎక్కువైనది ఎందుచేతనంటే ఒక పార్టీ ఆశయాలు అభ్యుదయకరంగా ఉన్నప్పుడు అది అధికారంలో ఉండగా కొన్ని అభ్యుదయకరమైన ప్రణాళికలు అమలు జరుగవచ్చు కాని భావచైతన్యం లేని ప్రజలు ఎల్లప్పుడూ ప్రజాస్వామికానికి అనుకూలంగా ఉండే పార్టీనే పదవులకు ఎన్నుకుంటారనే నమ్మకం ఏమీలేదు

రాజకీయదాస్యానికి వ్యతిరేకంగా దేశంలో ఉద్యమం సాగినప్పుడు ప్రజలందరిలోనూ, భావచైతన్యం ఒకేసారి ఒకేవిధంగా రాలేదు కొందరు ద్రష్టలు ఆ ఉద్యమాన్ని ఎక్కువ స్పష్టంగా చూడగలిగారు దానికి స్వరూపం ఇవ్వగలిగారు దానిని నడిపించగలిగారు ఉద్యమంలో త్యాగాలు చేసినదీ, దెబ్బతిన్నదీ, జైళ్ళకు పోయినదీ, బలియైనదీ కూడా ఎప్పుడూ అల్పసంఖ్యాకులే కాని అచ్చంగా అల్పసంఖ్యాకులలోనే చైతన్యం యావత్తూ ఉండినట్లయితే స్వాతంత్ర్యోద్యమం నడిచిఉండేది కాదు ఈ అల్పసంఖ్యాకుల వెనకగా కొంత భావచైతన్యం పొందినవర్గాలు చాలా ఉండడం చేతనే ఉద్యమం నడిచింది నిజానికి భావచైతన్యం లేనివారే ఆ రోజుల్లో అల్పసంఖ్యాకులు

స్వాతంత్ర్యానికి పూర్వం ఉండిన పరిస్థితే స్వాతంత్ర్యం తరువాత మరొకరూపంలో ఏర్పడింది ఆనాడుండినది ప్రతిఘటనాత్మకమైన భావచైతన్యం అయితే ఈనాడు అవసరమైనది నిర్మాణాత్మకమైన భావచైతన్యం ఇది హెచ్చుగా ఉండవలసింది పాలకవర్గాలలోనే అనుకున్నప్పటికీ ఆ అల్పసంఖ్యాకవర్గానికి మాత్రమే అది ఉన్నట్లయితే ఎంతమాత్రమూ చాలదు ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు ప్రజాస్వామికానికి అభిముఖులు కావాలి స్వాతంత్ర్యం వెంటసాగే జాతీయ నిర్మాణానికి ఉపకరించే భావచైతన్యం ప్రజలలో వ్యాపించాలి ఇది మనదేశానికి ఈనాడున్న ఆధ్యాత్మిక సమస్య

రాజ్యాంగంలోనూ, చట్టాలలోనూ ప్రజలకు కావలసిన ప్రజాస్వామికమంతా ఇమిడి ఉంటుందనీ, అందుచేత ప్రజలు దాని విషయం మధనపడనవసరం లేదనీ అనుకోవడం భ్రమ ఎందుకంటే ప్రజలు ప్రమత్తులై నిస్పృహచెందివుండిన తరుణాలను ఆసరా చేసుకొని ఎన్నోదేశాలలో పెద్ద తిరుగుబాటు కూడా అవసరం లేకుండా నియంతృత్వాలు వచ్చి కూచున్నాయి వాటిని వదిలించుకోవడానికి ప్రజలు అపారమైన కష్టాలనుభవించి, దారుణమైన త్యాగాలు చేయవలసి వచ్చింది నిర్మాణంకంటె విధ్వంసనం చాలా సులువన్నది రాజకీయరంగంలో ఎన్నోసార్లు రుజువయింది ఉదాహరణకు, చైనామీద జపాను ఫాసిస్టులు సాగించిన యుద్ధంకన్న చాంగెకైషేక్ తెచ్చిపెట్టిన యుద్ధం ఎన్నోరెట్లు క్రూరమైనది, పైశాచికమైనది ఎంతో దారుణమైన త్యాగాలు చేసినాక చైనా ప్రజలకి విప్లవయుతమైన భావచైతన్యం ఏర్పడింది

ఇటీవల చైనా పర్యటించి వచ్చిన ప్రధాని నెహ్రూ 'చైనా ఇంకా ఇండియా ప్రమాణంలో పారిశ్రామికం కాలేదు' అన్నారు నిజమేకావచ్చు కాని ఇండియాలో లేని గొప్ప ఆధ్యాత్మికశక్తి చైనాలో తలయెత్తి ఉన్నది అది చైనా ప్రజలలో ఉండి మనదేశ ప్రజలలో లోపించిన భావచైతన్యం ఈ పరిస్థితి మారకుండా ఇలాగే ఉంటే చైనా ఇండియాను మించి నిర్మాణంలో ఘనవిజయాలు సాధిస్తుంది

ఈ భావచైతన్యానికి పట్టుగొమ్మ విద్యార్థులు దేశం స్వతంత్రం కావడంతో మనలో ప్రత్యక్షశత్రువులు – ప్రస్తుతం గోవాలో తప్ప –లేరు కాని అందుచేత సంఘర్షణ అంతంకాదు అలా ఇప్పుడు అంతర్ముఖమై కనపడని దుష్టశక్తులతో చేరి నిస్పృహ, అజ్ఞానం, బానిసబుద్ధి, అలక్ష్యం మొదలైనవాటితో సాగవలసి ఉంటుంది హేయమైన కులతత్వాలు, స్వలాభాపేక్షలూ, సంకుచిత తత్వం, అవినీతి, మూఢవిద్వేషాలూ, అసహనమూ మొదలైనవి మన జాతిలోకి పరదాస్యం ద్వారా సంక్రమించాయని మేధావులంతా స్వాతంత్ర్యసమర కాలంలో విస్పష్టంగా గుర్తించారు కాని స్వాతంత్ర్యం రావటంతో ఇవన్నీ మళ్ళా తలెత్తాయి

వీటన్నిటితో సంఘర్షణ సాగించే బాధ్యత యువకులందరి పైనా ముఖ్యంగా విద్యార్థుల పైనా ఉన్నది భావచైతన్యాన్ని పెంపొందించి విస్తరింపచేయవలసినవారు విద్యార్థులు నిరక్షరత ఇంకా తీవ్రంగా ఉన్నది మనదేశంలో విద్యార్థులు నిర్వహించవలసిన పాత్ర చాలా గొప్పది స్వాతంత్ర్యసమరమప్పుడు విద్యార్థులు అందరికన్నా హెచ్చు భావచైతన్యం చూపారు జాతీయనిర్మాణంలో కూడా అదేవిధంగా విద్యార్థులు భావచైతన్యం ప్రదర్శించవలసి ఉన్నది

తెలుగువిద్యార్థి, మాసపత్రిక అక్టోబరు 1955

# 29. అనుద్యమపరమైన ఆంధ్రజాతి

ఒకజాతి నిర్మాణం కావటమంటే మాటలుకాదు జాతీయజీవితం తాలూకు అన్నిరంగాలూ అభివృద్ధి కావాలి అన్నింటా ఆధునిక సంస్కృతీ, ఉత్తమ ప్రాచీన సంస్కృతీ ప్రతిబింబించాలి ఇందుకుగాను ఎంతోమంది నడుములుకట్టి తపస్సులాంటి అవిరామకృషి సాగించాలి

జాతియొక్క భౌతికాభ్యుదయం పరిశ్రమలపై ఆధారపడి ఉంది పరిశ్రమల ద్వారా సంపదసృష్టి అయి జీవనప్రమాణం పెరుగుతుంది దేశంలోని సహజసంపద వినియోగమవుతుంది పారిశ్రామికంగా అభివృద్ధి కాని ప్రాంతాలు, సామ్రాజ్యవాదులకు గురి అయే మన ప్రాంతాలలాగా, తమ సహజసంపదను ఇతరుల పొట్టన పెట్టి క్రమంగా దుర్భిక్షం పాలవుతాయి

సోషలిస్టువ్యవస్థలో పరిశ్రమలు నడపడం, సహజసంపదను ప్రజల అవసరాలకు వినియోగించటం వగైరా కార్యకలాపాలను ప్రభుత్వమే కొనసాగిస్తుంది కాని మనదేశంలో సోషలిస్టువ్యవస్థ లేదు, పారిశ్రామికంగా ఇంకా వెనుకబడి ఉంది, యంత్రపరికర నిర్మాణం లేక, అతి చిన్న యంత్రాలకు కూడా పరదేశాలపై ఆధారపడే దేశంలో సోషలిస్టువ్యవస్థ సాధ్యం కాదు చైనాలో కమ్యూనిస్టులు పరిపాలిస్తున్నా కూడా అక్కడ మిశ్రమ ఆర్థిక వ్యవస్థ అమలులో ఉంది ప్రస్తుతానికి మనదేశంలో కూడా అట్టి వ్యవస్థే అమలులో ఉంది

అందుచేత ఆంధ్రలో పరిశ్రమలు పెంపొందాలంటే అవి పెట్టుబడిదారీలోనే అభివృద్ధి కావాలి దురదృష్టవశాత్తూ మనదేశంలో పెట్టుబడుదార్లు జాతీయ నిర్మాణంలో ప్రముఖపాత్ర నిర్వహించే అవకాశం లభించేలోపున ప్రపంచపెట్టుబడిదారీ అనేకవిధాల అవినీతికరమైన, విధ్వంసనకరమైన, జుగుప్సాకరమైన పాత్ర నిర్వహించి శిథిలావస్థలో పడింది నెహ్రూ చెప్పినట్టు పెట్టుబడిదారీ విప్లవం తాలూకూ, సత్ఫలితాలు మనకు కొంచెమైనా దక్కలేదు అయినప్పటికీ, గర్భస్థ శిశువు 50కోట్ల సంవత్సరాల పరిణామాన్ని తొమ్మిదిమాసాలలో సాధించినట్టుగా, మనం శీఘ్రకాలంలో రెండుదశాబ్దాల మానవచరిత్రను దాటి, జమీందారీ మనస్తత్వాలనూ, సంస్కృతినీ నిర్మూలించుకుని, పెట్టుబడిదారీ సంస్కృతిలోని ఉత్తమ లక్షణాలను జాతికి పట్టించుకుని సోషలిజంకేసి పురోగమించవలసి ఉంది

ఇందుకుగాను తగినకృషి ఆంధ్రలో జరుగుతున్నట్టు కనబడదు ఆంధ్రలో పెట్టుబడిదార్లుగా ముందుకువచ్చిన అనేకమందినీ, వారు నడిపిన పరిశ్రమలనూ గమనిస్తే వారి ఉద్దేశంలో పెట్టుబడిదారీ అంటే ధనాశమాత్రమేననిపిస్తుంది ఇది మటుకు చాలా పొరపాటు పెట్టుబడిదారీ అంటే నైపుణ్యమూ, సమర్థతా కూడానూ పెట్టుబడిదారీ అంటే పోటీ పై ఇంకా మంచి సరుకులు, ఇంకా చౌకగా తయారుచేయటం, పెట్టుబడిదారీ వెంబడి కూడా కొన్ని నీతినియమాలున్నాయి అవే అభివృద్ధిదశలో పెట్టుబడిదారీ సంస్కృతికి వెన్నెముకగా పనిచేశాయి

నేటి మారిన పరిస్థితులలో పారిశ్రామికులను ప్రేరేపించవలసినది జాతీయాభిమానం, జాతి ఆర్థికంగా పైకిరావాలనే గాఢవాంఛ అలాటి వాంఛలు ఎన్నికలలో పోటీచేసేవారిలో ఉండటమే స్వాభావికమని ఎవరూ అపోహ పడనవసరం లేదు, పారిశ్రామికులలో కూడా ఉండవచ్చు

పారిశ్రామికవిప్లవం మొదటగా సాగించిన దేశాలలో పెట్టుబడిదారీ జాతీయలక్షణాలను విసర్జించి, అధికలాభాలకోసం పెట్టుబడిని వలసదేశాలకు ఎగుమతిచేయనారంభించిన దశలో సామ్రాజ్యవాదులకు ఇష్టం లేకపోయినా ఈ వలసలను కొంతవరకు పారిశ్రామికంగా చేయకతప్పింది కాదు సామ్రాజ్యవాదులమధ్య జరిగిన పోటీలో వలసలు మరింత పారిశ్రామికమయాయి

ఈ విధంగా మనదేశంలోని అనేక పట్టణాలలో పరిశ్రమలు ఏర్పాటై కాలక్రమాన వారికి సంక్రమించాయి వాటిలో కొన్ని ఇంకా ఆ దేశీయుల పేర్లతోనే దేశీయుల నిర్వహణ కింద నడుస్తున్నాయి కాని ఆంధ్రలో పట్టణాలు లేని కారణంచేత అక్కడ పరిశ్రమలు వెలువడలేదు ఈ లోపం ఈనాటికీ ఉంది పరిశ్రమలు నిర్వహించటంలో ఆంధ్రులు అందరికీ తీసికట్టని రుజువు చెయ్యటానికన్నట్టుగా కొన్ని పారిశ్రామికసంస్థలు వెలసి, కొద్దికాలం నడిచి, చివరకు గుంటపూలు పూసి, నామరూపాలు లేకుండా పోయాయి పెట్టుబడిదారీలో అనుభవమూ, పరిశ్రమలు నడపడంలో నైపుణ్యమూ గల ఇతర ప్రాంతీయులు వచ్చి ఆంధ్రలో గల సహజసంపదను వినియోగించటానికి పరిశ్రమలు పెడితే కద్దు, లేకపోతే లేదన్న పరిస్థితి ఏర్పడి ఉంది

దేశాన్ని బ్రిటిషువారు పరిపాలించినంతకాలమూ మనం వెనకబడి ఉండటానికి వారు ప్రత్యక్షకారణంగా కనిపించారు స్వాతంత్ర్యం వచ్చాక రాష్ట్రం లేకపోవటం పెద్దకొరతగా కనిపించింది రాష్ట్రం కూడా వచ్చేసింది కాని ఆంధ్రజాతి బ్రిటిషువారి కింద ఉన్నదానికి కొంచెం కూడా పెరగకపోగా అంతో ఇంతో క్షీణించినట్టు కనిపిస్తుంది కనీసం బ్రిటిషువారి హయాంలో ఆంధ్రలోని రచయితలూ, కళాకారులూ, మేధావులూ, విద్యాధికులూ ఇంత పెద్దయెత్తున ఆంధ్రనుంచి పలాయనమైపోలేదు ఆంధ్ర సంస్కృతికి మద్రాసుకేంద్రంగా ఈనాడున్నట్టు – అదయినా కేవలం ఒక్క సినిమా పరిశ్రమ ఫలితంగా! పూర్వం ఎన్నడూ ఉండి ఉండలేదు 1939లో మేం కొందరం మిత్రులం ఏకగ్రీవంగా నిర్ణయానికొచ్చాం మద్రాసు ఎన్నటికీ ఆంధ్రసంస్కృతికి కేంద్రంగా ఉండలేదు – ఆంధ్రరాష్ట్రం ఇంకా రాకముందే మేము పొరపడ్డట్టు రుజువు అయింది ఇవాళ ఏదన్నా తెలుగు సినిమాచిత్రం తయారు కావాలంటే మద్రాసులోనే తయారుకావాలి, కాస్త అందంగా పత్రిక అచ్చు అయి అమ్ముడు కావాలంటే అది మద్రాసునుంచే రావాలి ఆంధ్రులు చేస్తున్న భారీపెట్టుబడి సినిమా చిత్రాల మీద, ఏటా తీసే తెలుగు చిత్రాలమీద ఎంత హీనంగా చూసినా ఒక కోటిరూపాయలు ఖర్చు అవుతుంది కానీ, అంధ్రలో ఒక్క స్టూడియో లేదు వందలాది సినిమాకారులు – నిర్మాతలు, దర్శకులు, నటులు, టెక్నీషియన్లు, రచయితలు, గాయకులు – మద్రాసు పౌరులు ఆంధ్రపౌరులు కారు

ఆంధ్రుడు కాల్చే ప్రతి సిగరెట్టూ, కట్టుకునే ప్రతి మిల్లుబట్టా, వెలిగించుకునే ప్రతి నిప్పుపుల్లా, రాసుకునే ప్రతికాగితం ముక్కా, తొక్కే ప్రతి సైకిలూ, వాడుకునే ప్రతి వస్తువూ బయటినుంచి రావాలి! ఆఖరుకు ఏ ఆసామిగాని మద్రాసు రావలసిందే తప్ప, డబ్బు జల్సాగా తగలబడే జాగా ఆంధ్రలో దొరుకుతున్నట్టు కనబడదు

ఇంతవరకు ఆంధ్రులకు ఇంగ్లీషు పత్రికలేదు ఆంధ్రప్రజల తరఫున ప్రాతినిధ్యం వహించి వారి దృక్పథాన్ని కేంద్రానికి తెలియజేయగల సాధనమే లేదన్నమాట

ఆంధ్రసాహిత్య కళ, నాటక కళ, గాన కళ, చిత్ర కళ మొదలైనవన్నీ కూడా చాలా నీరసమైన స్థితిలో ఉన్నాయి – వాటికి సంబంధించిన ఉద్యమాలు లేనేలేవు 'కన్యాశుల్కం' గురజాడవారు రాయలేదనీ, ఉగాది సాహిత్యగోష్ఠిలో జర్నలిజంకు అత్యాచారం జరిగిందనీ నెలల తరబడి జరిగిన ఆందోళనలు ఉద్యమాలు అనుకుంటే తప్పు!

40 ఏళ్ళుగా సాగిన ఆంధ్రోద్యమానికి ఫలితం ఏమిటి అని ఆలోచిస్తే కర్నూలు రాజధాని తప్ప ఇంకేమీ కనిపించకుండా ఉంది ఫలితాలున్నాయని తెలిస్తే సంతోషించటానికి మటుకు నాకేమీ అభ్యంతరం లేదు

కృష్ణాపత్రిక 1955 దసరాసంచిక

## 30. ఫలించే కలలు

కలలను ఎవరూ నమ్మరు మనిషి నిద్రావస్థలో వివశుడై ఉండే సమయంలో కలలు వస్తాయి మనసుకు విశ్రాంతి కలిగి బలం చేకూరి నిద్రలేవగానే ఈ కలలు ఎందుకో మాయలాగా విచ్చిపోతాయి

చాలాకాలంగా మనజాతి నిద్రావస్థలోనుండిన జాతి అందుచేత మనం కలలు కనే వాళ్ళను క్రియాశూన్యులుగా భావించటం నేర్చుకున్నాం ఆఖరుకు పగటికలల మీద కూడా మనకు న్యూనతే వ్యక్తులు తమ భవిష్యత్తు గురించి గాని, జాతి భవిష్యత్తు గురించి గాని మంచి కోరుకుంటే అవి గొంతెమ్మ కోరికలనే అనుకునేవాళ్ళం

కాని దేశం స్వాతంత్ర్యాన్ని పొంది, ప్రజాతంత్రాన్ని అవలంబించాక మనకు అనేక ఇతరహక్కులతోబాటు భవిష్యత్తు గురించి కలలుకనే హక్కు వచ్చింది నిజానికి కలలు కనటం కూడా మానవుడికి గల హక్కుల్లో ఒకటి ఆ కలలకు సహజమైన పరిమితి వ్యక్తియొక్క శక్తిసామర్థ్యాలే నిర్ణయిస్తాయి

నిజమైన శ్రేయోరాజ్యంలో ప్రతివ్యక్తీ తన శక్తిసామర్థ్యాలకు అనుగుణంగా తన భవిష్యత్తు గురించి కలలు కనవచ్చు శక్తిసామర్థ్యాలు మనిషిలో ఉంటే వాతావరణం అనుకూలంగా ఉంటుంది– ఉండకపోతే అది శ్రేయోరాజ్యం కాదు

అలాగే జాతియొక్క భవిష్యత్తు గురించీ, దేశంయొక్క పురోభివృద్ధి గురించీ కలలు కనే హక్కూ, అవకాశమూ జాతీయనాయకులకున్నది

మన అగ్రనాయకులు కలలు కనకుండా మన భవిష్యత్తు దానంతట అదే మహోజ్వలంగా తయారవుతుందంటే అది 'కలలో మాట'

తమ దేశంకోసమూ, జాతికోసమూ జీవితాన్ని అంకితం చేసిన ప్రతిభాసంపన్నులు కలలు కనడమూ, వారి కలలు సఫలమై దేశమూ, జాతీ అభ్యున్నతికి రావటమూ చరిత్రలో అక్కడక్కడా మనకు కనిపిస్తుంది రష్యా భవిష్యత్తు గురించి లెనిన్ కలలు కనటమూ, వాటిని ప్రపంచం గొంతెమ్మ కోరికలకింద కొట్టిపారెయ్యటమూ, అవి నిజం కావటమూ మనకు తెలిసిన చరిత్రే అలాగే త్సియోల్కొవ్‌స్కీ అనే ఆయన ఆకాశయానాల గురించి కలలు కన్నాడు ఆయన

కేవలం కలలు కనటమే గాక, ప్రతిభాసంపన్నుడు గనక తన కలలు సఫలం కావటానికి అవసరమైన శాస్త్రపరిజ్ఞానాన్ని కూడా సృష్టించాడు ఆయన కలలు ఇటీవలే నిజమవుతున్నాయి

మనలాటి సామాన్యవ్యక్తులం పెద్దకలలు కనటానికి తాహతులేనివాళ్ళం మన భవిష్యత్తుగురించే కలగనటానికి మనకు శక్తి చాలదు అయినా మనవంటి వాళ్ళు సమష్టి కలలలో భాగం పంచుకునేందుకు వివిధ రంగాలలో రకరకాల సమాజాలున్నాయి రాజకీయవాదులకు రాజకీయపార్టీలున్నాయి, రచయితలూ, చిత్రకారులూ, నటులూ, గాయకులూ మొదలైనవారికి ఆయా కళాసమాజాలున్నాయి నిజానికి క్లబ్బులూ, కల్చరల్ అసోసియేషన్లూ కూడా సమష్టిగా కలలు కనటానికి అనువైనవే

అన్నీ ఉన్నప్పటికీ మనకు కలలుగనే సంప్రదాయమూ ఉత్సాహమూ ఏర్పడలేదు

మన అగ్రనాయకులలో నెహ్రూకు కలలుకనే సామర్థ్యం ఉన్నట్టు మనం యెరుగుదుము ఆ తరగతికి చెందిన నాయకులు బహు అల్పసంఖ్యాకులు మరికొందరు ఉంటే ఉండవచ్చును కాని మిగతావారు– నాయకులుగా చలామణీ అవుతున్నవారు – ఏమి కలలు కంటున్నదీ మనకు తెలియటం లేదు అనేకమంది ఛోటానాయకులు ఆననాలకోనమూ, అధికారదుర్వినియోగం కోసమూ కలలు కంటున్నట్టు స్పష్టంగా తెలిసిపోతున్నది కూడా

ఈ సందర్భములో నా సూచన ఏమంటే, రాజకీయ సాంస్కృతిక, కళా, పారిశ్రామికరంగాలలో నాయకులుగా ముందున్నవారు తమ కలలను గురించి బహిరంగంగా ప్రకటించేటట్టు కోరేహక్కు ప్రజలకు ఉండాలి అవసరమైతే ఈ హక్కును మనం రాజ్యాంగంలో చేర్పించాలి కలలుకనే శక్తి లేనివాళ్ళనూ, పీడకలలు కనే వాళ్ళనూ నాయకత్వం నుంచి వెంటనే తొలగించటం జరగాలి దేశంయొక్క పురోభివృద్ధి జరగాలంటే ముందుగా తగిన మనుషులు దానిని గురించి కలలుకనటం తప్పనిసరి ఆమాటకువస్తే ప్రతి పంచవర్ష ప్రణాళికా ఒక కల– ఒక సమష్టి కల ఈ కలలను గురించి ప్రజలలో తగినంత ఉత్సాహం లేకపోవటం జాతియొక్క అవలక్షణం ప్రజలందరూ పరిశీలించకుండా, సంస్కరించకుండా, హర్షించకుండా ఏ పంచవర్షప్రణాళికా పూర్తిగా విజయవంతం కాదు

నాయకులు కలలుకనడం నేర్చుకోవాలన్నట్టే ప్రజలు కూడా కలలను కొట్టిపారేసే మనస్తత్వాన్ని మార్చుకుని, వాటిపట్ల శ్రద్ధా, పరిశీలనాశక్తీ, ఆసక్తీ పెంపొందించుకోవాలి ఇది మన దేశప్రజల తక్షణ కర్తవ్యమని నేను నొక్కివక్కాణించగలను

రాజారంగారావు సోషల్‌క్లబ్ సావనీర్ రజతోత్సవ సంచిక, జగ్గయ్యపేట, 1956

# 31. ప్రజాపతులెవరు?

"ఈ ఎన్నికలలో కాంగ్రెసు దేశాన్ని ఊడ్చేస్తుందని ముందుగానే జోస్యం చెప్పవచ్చు అట్లా ఫలితాలు ముందుగానే తెలిసిపోయినప్పుడు ఎన్నికలు ప్రజాస్వామికంగా జరిగాయనవచ్చునా? అనవచ్చు!"

ప్రస్తుతం మనదేశంలో జరిగే ఎన్నికలను గురించి ఒక అమెరికన్ పత్రిక వ్యాఖ్యానానికి పై మాటలు జ్ఞాపకానువాదం

ప్రజాస్వామ్యం, ప్రజాతంత్రం, వోటింగు హక్కు, ప్రజాప్రభుత్వం – ఇటువంటి మాటలన్నీ వొట్టి హంబగ్ అని ఎవరైనా ఎలుగెత్తి అరిస్తే బాగుణ్ణు!

దీని శ్రాద్ధం బెట్ట! ఈ ప్రజావంచనకు కొన్ని ఊతపదాలు ఉండితీరాలి రాగి డబ్బులాటిది ప్రభుత్వ మింటులోంచి రాలేదని తోస్తే బిచ్చగాడు కూడా తిరగ్గొట్టేస్తాడు కాని ఈ కౌంటర్‌ఫీట్ మాటలు చలామణీ కాకుండా ఆపగలవాడు కనబడడు

ప్రజలు తమను తాము పరిపాలించుకోగలరా? చచ్చినా పరిపాలించుకోలేరు! కనీసం తమను ఎవరు పరిపాలిస్తే తమ జీవితం సాధ్యమైనంత సుఖంగా వెళ్ళిపోతుందో వాళ్ళకి తెలుసా? చచ్చినా తెలీదు! అధవా తెలిసినా అటువంటి వాళ్ళను వాళ్ళు ఎన్నికలకు నిలబెట్టలేరు అధవా ఒకరో ఇద్దరో నిలబడినా వాళ్ళు శాసనసభలకు పోయి ఏమీ చెయ్యలేరు

ఈ దేశంలో గర్భదరిద్రులు నూటికి అధమం డెబ్బయిమంది అయినా ఉంటారు దేశమంతటా ఎన్నికలకు నిలబడేవారిలో ఒక్కడైనా గర్భదరిద్రుడుంటాడా? ఉండడు

ఈ ఎన్నికలు పార్టీనియంతృత్వం అమలుజరగటానికి ఏర్పాటైనవి ఏ ప్రత్యేక ప్రదేశంలోనైనా ఒక పార్టీ నియంతృత్వం సాధ్యం కాకపోతే, తెరవెనక భాగోతం జరిగి ఊళ్ళు పంచుకునే దొంగలు పదవులలోకి వస్తారు

ప్రతి పార్టీ లోపలా మళ్ళీ నియంతలుంటారు, వాళ్ళు తాళ్ళు లాగినప్పుడల్లా చేతులెత్తే కళ్ళనగాళ్ళూ ఉంటారు కొన్ని పార్టీల వెనక లంకెబిందెలవాళ్ళుంటారు

'ప్రజాస్వామికానికి' పట్టుగొమ్మనదగిన పత్రికలలోనూ, ప్రజానాయకులమని చెప్పుకునే వాళ్ళ నోటా వెలువడే కొన్ని ప్రవచనాలు చూస్తే వాంతి వస్తుంది

"కాంగ్రెసును ఎన్నికలలో ఎదిరించేవాళ్ళు దేశద్రోహులు!"

"స్వతంత్రంగా నిలబడే వాళ్ళు దుష్టులు!"

ఇక దేశభక్తులెవరు?

ఎన్నికలకు అభ్యర్థులను నిలబెట్టే అర్హతలేని కమ్యూనలిస్టులు బహిరంగంగా బలపరిచేవాళ్ళు!

మా పార్టీ తరఫున నిన్నటిదాకా దేశద్రోహుల పాత్ర నిర్వహించినవాళ్ళనూ, ప్రజా ద్రోహులనూ, దోపిడీమురాల వాళ్ళనూ నిలబెడుతున్నాం మీరు వాళ్ళను చూసి వోటివ్వకండి పార్టీని చూసి వోటివ్వండి! మీ ప్రతినిధి మీ భాషవాడు కాకపోవచ్చు మీదేశం వాడు కాకపోవచ్చు అయినా పార్టీని చూసి వోటివ్వండి "

మాటలివి కావుగాని, వైఖరి ఇదే!

మధ్యప్రదేశ్‌లో ఒక ముసలిది తన వోటును 'నెహ్రూ కుమార్తెకు' వెయ్యటానికి నాలుగుమైళ్ళ దూరాన ఉన్న పోలింగ్‌బూత్‌కు బయలుదేరిందిట ఎవరో 'నెహ్రూ కూతురు' అభ్యర్థిగా నిలబడటం లేదని చెప్పారు, ముసలిది వోటువెయ్యకుండా ఇంటికి తిరిగిపోయింది

ఈ ముసలిదానికి తెలిసిన ప్రజాస్వామ్యం మీద నాకు చాలాగౌరవం ఉంది తమకు కావలసిన అభ్యర్థులు లేని కారణం చేత ఉదయం ఎనిమిదిన్నర దాకా పోలింగ్ స్టేషనుకు పోని వోటర్లమీద నాకు గౌరవం ఉంది అదే కారణం చేత అసలు వోటే వెయ్యని అసంఖ్యాకులకు ప్రజాస్వామ్యం తెలీదనటానికి ఎవరికీ అధికారం లేదు

ఈ దేశంలో ప్రజాస్వామ్యం తలకిందికి పెట్టి కాళ్ళు పైకెత్తిన కారణం చేత అనేక విద్దూరాలు జరుగుతున్నాయి

జమీందార్లూ, రాజులూ, ధనిక ఖామందులూ, లంకెబిందెలవాళ్ళూ దేశంలో సోషలిస్టువ్యవస్థ తెచ్చిపెట్టటానికి వీరకంకణం కట్టుకున్నారు సోషలిస్టులూ, కమ్యూనిస్టులూ సోషలిస్టువ్యవస్థ స్థాపించటానికి బొత్తిగా పనికిరానివాళ్ళయిపోయారు!

ఒక్కొక్క పంచవర్ష ప్రణాళికే విజయం పొందుతున్న కొద్దీ విదేశీయుల లాభాలు పెరుగుతున్నాయి విదేశీ పెట్టుబడి అంతకంతకూ హెచ్చుగా కావలిసివస్తున్నది ఒకవంక ధరలూ, ఇంకోవంక నిరుద్యోగమూ పెరుగుతున్నట్టు కనిపిస్తున్నది

నామినేషన్లు ప్రజలనుంచే వచ్చి, ఎన్నికలలో ఓడిపోయినవాడికి ధరావతులు పోవటం, చేతిచమురు దండుగ కావటం మొదలైన అవమానాలు అవసరంలేకుండా పోయి, ఎన్నికైన అన్ని పార్టీల వాళ్ళనూ పాలకవర్గంలో ఉండనిచ్చినరోజున ఈ దేశంలో కొంత ప్రజాతంత్రం అమలు జరుగుతుంది

(ఇంచుమించు ఇదే పద్ధతిలో ఆలోచనచేసిన ఇండోనేషియా అధ్యక్షుడి సూచనను తోసి అవతలపారేశారు!)

ఏ కారణాలవల్లనైనా మనదేశంలో పార్టీ నియంతృత్వమే తప్ప ప్రజాతంత్రం అమలుజరగటానికి వీలులేని పక్షాన ఆమాట స్పష్టంగా గుర్తించటం మంచిది

"గులాబీకి ఇంకే పేరన్నా పెట్టు దానివాసన కమ్మగానే ఉంటుంది" అన్నాడు షేక్స్పియర్ ఇంకేదో పువ్వును గులాబీ అన్నంతమాత్రాన అది గులాబీవాసన మటుకు కొట్టదు

ఇప్పుడు అమలులో ఉన్నదాన్ని ప్రజాతంత్రం అనవద్దు

పార్టీ ప్రతినిధులను ప్రజాప్రతినిధులనవద్దు నూటికి యాభైమంది వోటుచేస్తే అందులో ముప్పైమంది వోట్లు తెచ్చుకుని అఖండ విజయంతో నెగ్గినవాడు ఏ లెక్కన ప్రజాప్రతినిధి అవుతాడు?

భవిష్యత్తులో ప్రజలకు ఏమి చెయ్యబోయేదీ చెప్పకుండా జరిగిన చరిత్ర ఆధారం మీద వోట్లు అర్థించేవాళ్ళు వాగ్దానాలు చేసేదీ లేదు, వాటిని నిలబెట్టుకునేదీ లేదు

ఒక పార్టీ టిక్కెట్టుమీద ఎన్నికైనవాడు మళ్ళీ ఎన్నికలు జరిగేలోపల మూడుపార్టీలు మారడని లేదు!

పదవికోసం చెయ్యరానిది లేదు అన్న వైఖరి అమలులో ఉండగా ప్రజాతంత్రం అమలులోకి రావటం సాధ్యం కాదు

కాంగ్రెసుపార్టీ నియంతృత్వం కూడా అవసరంలేదు నెహ్రూ నియంతృత్వానికి అనుకూలంగానూ, ప్రతికూలంగానూ దేశమంతటా ప్రజలను వోట్లు వెయ్యమంటే అధికసంఖ్యలో ప్రజలు నెహ్రూకు అనుకూలంగా వోటు చెయ్యవచ్చు! అటువంటి పరిస్థితి దేశంలో లేదనటానికి లేదు

ఈ సంగతి గుర్తించేకాబోలు మద్రాసులో ఒక కాంగ్రెసు ఎన్నికల పోస్టరుమీద స్థానిక కాంగ్రెసు అభ్యర్థుల బొమ్మలకు బదులు నెహ్రూ బొమ్మను వేశారు!

చాలామందికి బలమైన ప్రతిపక్షంలో విశ్వాసము ఉన్నట్లు కనబడుతుంది సిద్ధాంతం ప్రకారం పార్టీ నియంతృత్వం అదుపులో ఉంచటానికి బలమైన ప్రతిపక్షం ఉపకరిస్తుంది

అయితే ఈ పుణ్యభూమిలో అటువంటి శషభిషలు పనికిరావు కాంగ్రెసు ప్రభుత్వాలు తెచ్చిపెట్టిన బిల్లులు తీవ్రమైన విమర్శలకు గురి అయి కూడా, ఆ విమర్శలలో కాంగ్రెసు సభ్యులే పాల్గొని కూడా, పశుబలంతో (బ్రూట్ మెజారిటీతో) బిల్లులు నెగ్గిన సందర్భాలున్నాయి

"ఈ ఒక్కసారికి మమ్మల్ని స్వతంత్రంగా వోటు చెయ్యనివ్వండి" అని పార్లమెంటులో కాంగ్రెసు సభ్యులు తమ నియంతలను వేడుకున్న సందర్భాలున్నాయి

ఇదంతా అటుంచి దేశంలో ఒకరకమైన బ్లాక్‌మెయిల్ అమలులో ఉన్నది నెహ్రూ పండితుడే అనేక ప్రాంతాల దేశం యొక్క ఐక్యత గురించి మాట్లాడాడు అంటే ఆయన ఉద్దేశం "మిగతా రాష్ట్రాల్లో మేమే గెలుస్తాం! మీరు ఇంకో పార్టీని గెలిపించకండి!" అనా?

నిజానికి రాష్ట్రాలలో ఏ పార్టీవాళ్ళు గెలిచినా పార్లమెంటులో కాంగ్రెసుకు మెజారిటీ ఉన్నంతకాలం దేశంలో అన్ని ప్రాంతాలా పరిపాలన కాంగ్రెసుకు కావలసిన విధంగానే ఉంటుంది

కొందరు ఇంకొకరకం దుష్ప్రచారం గెలిచారో, మనకు కేంద్రం గ్రాంటులివ్వదు, ప్రాజెక్టులు కట్టదు, ఏమీ చెయ్యదు!" అంటున్నారు పూర్వం 'బ్రిటిషువాళ్ళకు కోపం తెప్పించవద్దని చెప్పిన వాళ్ళ ధోరణిలోనే!

ఇటువంటి మాటలు నమ్మేవాళ్ళు లేనిపక్షాన అనేవాళ్ళున్నా అంత ఇబ్బంది ఉండదు కాని నమ్మేవాళ్ళుండబట్టే అనేవాళ్ళు అనటం కూడా జరుగుతుంది

అన్ని రాష్ట్రాలలోనూ ఒకే పార్టీ గెలవటం రాజ్యాంగం రీత్యా అవసరం కాదు అందుచేత అన్ని రాష్ట్రాలలోనూ ఒకే పార్టీ పదవులు నిర్వహించే ఐక్యత ఐచ్ఛికం

పైగా అన్ని రకాల ఐక్యతా మంచిదేననుకోవటం పొరపాటు ప్రజాభిప్రాయాన్ని తృణీకరించి మరాఠీ గుజరాతీ ప్రాంతాలను ఏకం చేశారు ఈ ఐక్యత ఏమంత సుఖప్రదంగా కనబడటం లేదు

తెలుగుస్వతంత్ర, వారపత్రిక, 15-3-1957

పునర్ముద్రణ : సృజన జనవరి 1983 స్వాతి మాసపత్రిక, ఫిబ్రవరి 1983

# 32. ఔపదేశికంగా

ఆర్థికసౌభాగ్యంతోబాటు నైతికదృష్టి కూడా పెరగటం అవసరం  లేకపోతే, ఆలివర్ గోల్డ్‌స్మిత్ అన్నట్టు – సంపద పెరుగుతుంది  మనుషులు తరుగుతారు  చిన్న ఇల్లున్నచోట పెద్దభవంతి లేస్తుంది  కారుషెడ్డు వెలుస్తుంది  గూర్ఖా ఏర్పాటవుతాడు  ఈ లోపల బుద్ధి గడ్డితినబోయి మళ్ళీ వెనక్కు తిరిగిరావటం మరిచిపోతుంది

చూడగా చూడగా ఆర్థికసౌభాగ్యానికి బుద్ధి గడ్డితినటానికీ కొంత అవినాభావ సంబంధం ఉన్నట్టు కనిపిస్తుంది

తిండిలేక మాడేవాడికి అతిగా తినవద్దని బోధించటం నిరుపయోగం  వాళ్ళను విటమినులూ, ప్రోటీనులూ, కొవ్వు పదార్థాలూ ఉండే ఆహారం తినమనటం విప్లవాలకు దారితీయవచ్చు! (మేరీ ఆంటోయినెట్ ఆత్మకు శాంతి కలుగుగాక!)

దొంగతనాలు చేసి పదిహేనుసార్లు జైలుకువెళ్ళివచ్చినా పదిరాళ్ళు వెనకవెయ్యలేని వాడితో, 'నాయనా, నువు ఇంకొకరి సొత్తు అపహరించటం చాలా తప్పు!" అని చెప్పి ఆటే ప్రయోజనం లేదు

తెగతినవద్దని చెప్పదలిస్తే, ఇంత తినగలిగిన స్థితిలో ఉన్నవాళ్ళకే చెప్పాలి  ఇతరుల సొత్తు హరించవద్దని చెప్పదలిస్తే, చట్టానికి గంతలుకట్టి దోపిడీ ద్వారా లక్షలూ, కోట్లూ గడించేవారికే చెప్పాలి

దరిద్రులూ, నిర్భాగ్యులూ ఉపదేశాలకు అతీతులు "భగవంతుడు కూడా వాళ్ళ ఎదట భోజనం రూపంగా తప్ప కనిపించసాహసించలేడు" అని గాంధీజీ కూడా అన్నాడు

భగవంతుడికి కాస్త బుద్ధి ఉండి ఉండాలి  కాని మానవమాత్రులకు అది లోపించటం వల్ల వాళ్ళు పేదలకి ఉపదేశించటానికి యత్నిస్తారు  ధనికులకు ఉపదేశించటానికి వాళ్ళకు 'కలేజా' ఉండదు  ఉపదేశించి ప్రయోజనం ఉండదు సరికదా, ఉపదేశం మరీ ఉదాత్తమైతే ఔపదేశికుడికి ప్రమాదం (ఉదాః యేసుక్రీస్తు, మహాత్మాగాంధీ, సోక్రటీస్ మొదలైనవాళ్ళు ) కాని ప్రాణాలకు లక్ష్యపెట్టక ఉపదేశం చేయబూనుకున్నవాళ్ళు దరిద్రులను వదిలేసి ధనికులకే ఉపదేశాలు చేస్తారు  అయితే వీళ్ళు ఎంత మైనారిటీ అంటే, వీళ్ళను పిలిచి గవర్నరు ప్రభుత్వం ఏర్పాటుచెయ్యమని అడిగే అవకాశం బొత్తిగాలేదు

మనం తరచు చూసే ఔపదేశికులు నిరపాయంగా ఉపదేశాలు చేసేవారు మాత్రమే  వారైనా కొత్తకొత్త ఉపదేశాలు చెయ్యరు  గడిచిన అయిదారువేలసంవత్సరాలుగా అందరికీ తెలిసిన ఉపదేశాలే చేస్తారు

పేదలకు ఉపదేశించటం లాంటిదే పిల్లలకు ఉపదేశించటం కూడా  పిల్లలకు ఉపదేశించటం నల్లేరుమీద బండినడకే!  దరిద్రులకు ఉపదేశించటానికి సాహసం చాలనివాళ్ళు సయితం పిల్లలకు ఉపదేశాలు చెయ్యటానికి నిక్షేపంగా ముందుకురావచ్చు  ఎందుకంటే, విప్లవాలు చేసిన దరిద్రులున్నారు గాని, విప్లవం చేసిన పిల్లలున్నట్టు చరిత్ర చెప్పటం లేదు–  1942 ఆగస్టులో తెనాలి స్టేషను తగలబెట్టినవాళ్ళను మినహాయిస్తే

అయితే, అడ్డమైనవాళ్ళూ వచ్చేసి పిల్లలకు ఉపదేశాలు చేసిపోవటమా అని మనం విచారించవలసిన అవసరం లేదు దేశంలో పిల్లలు ఎప్పటికన్నా ఎక్కువ ఉన్నారు దేశంలో ఐక్యత లోపించి ఉన్నది (కేరళలో కమ్యూనిస్టులు గెలవటమేమిటి? బొంబాయిలో భాషారాష్ట్రవాదులకు అన్ని సీట్లు రావటమేమిటి?) ఒకవంక సినిమాలు, ఇంకోవంక కమ్యూనిజం, మరోవంక రాజకీయాలూ, నాలుగోవంక క్రమశిక్షణారాహిత్యం, అయిదోవంక కులతత్వవాదమూ (ఇది పెద్దలైన రాజకీయవాదుల ప్రత్యేకహక్కు!) ఇత్యాది దుష్టశక్తులు మన దేశపు పిల్లలను నాశనం చెయ్యటానికి పొంచి ఉన్నాయి నిన్నటిపిల్లలైన నేటి నాయకులు కేవలం అదృష్టం వల్ల సరిఅయిన మార్గంలో అభివృద్ధి అయ్యారు కాని రేపటి పౌరులైన పిల్లలు స్వతంత్రభారతంలో ఏమవుతారో ఎవరూ చెప్పలేరు అందుచేత ఔపదేశికులు అవసరం

ఈ ఆవశ్యకతను మరొకకారణం కూడా సెకండ్ చేస్తోంది అదేమిటంటే, పిల్లలకు పనికివచ్చే సినిమా చిత్రాలలాగే, పిల్లలనీతిని ఆర్ సి (రీఇన్‌ఫోర్స్‌డ్ కాంక్రీట్) చేసే రచనలు లోగడ బహుతక్కువ శతకాలు వల్లెవేయించేవాళ్ళు గాని, వాటిల్లో 'పారకుమీ రణమందున, దూరకుమీ శత్రునింట' మొదలైన హెచ్చరికలు చూసి, 'ఇవి మనకెందుకా?' అని మేం ఆశ్చర్యపోయేవాళ్ళం అప్పర్ డివిజన్ గుమాస్తాగా రిటైర్ కావటం జీవితాశయంగా పెట్టుకున్న కుర్రాడికి రణాలలో పారటం, శత్రులిళ్ళ దూరటం కట్టుకథలు తప్ప మరేమీ కావు అదీగాక 'కూడకుమీ పరకాంతల' అనేది ఏమిటో అర్థమయ్యేది కాదు ప్రహ్లాదుడు 'కన్నుదోయికి అన్యకాంతలడ్డంబైన మాతృభావము చేసి మరలువాడు' (శకటరేఫేత్యాది దోషాలు నావి కాని, బమ్మెరపోతన్న గారివి కావు!) అంటే అందులో విశేషమేమిటో తెలిసేది కాదు గౌతముడు తన భార్యని నరకమని పరశురాముడితో ఎందుకన్నాడో తెలిసేది కాదు – కార్తవీర్యార్జునుడు జలకాలాడుతుంటే నిలబడి చూసిందిట, అందులో తప్పేమిటో!

ఇట్లా ఎన్ని ఉదాహరణలైనా ఇచ్చుకుంటూ పోవచ్చు అసలు సంగతేమంటే, ఈనాడు ప్రభుత్వాలు పిల్లల సాహిత్యానికి పోటీలు పెట్టి బహుమానాలిస్తున్నాయే, అటువంటి సాహిత్యం వెనక లేదు ఈ పోటీలలో పాల్గొంటే బమ్మెరపోతన్న గారు ఫటా అయిపోతాడు కూడా!

అయితే ఈనాటి బాల ఔపదేశికులను ఎదుర్కొనే సమస్య ఒకటుంది (బాల ఔపదేశికులు షష్ఠీతత్పురుష అవుతుందా, శాస్త్రుల్లుగారూ?) అదేమిటంటే, పిల్లలకు ఏం నీతి నేర్పేట్టు?

కొంచెం ఆలోచిస్తే అది అటే పెద్దసమస్య కాదు రచనలు కొత్తవి కావచ్చు గాని, ఉపదేశాలు ఎంతపాతవైతే అంత మంచిది "మనుషులలో జన్మతహా ఎక్కువ తక్కువలు లేవు", "ఇతరుల కాయకష్టంతో కుడిచి కూచోవటం మహాపాపం" మొదలైన ఆధునిక ఉపదేశాలు వర్జించటం ఎందుకైనా మంచిది "పెందలకడ నిద్రలేవుము" (లేక లేచుము అని ఉండాలా?) "ఎల్లప్పుడు నిజమునే చెప్పుము", "కర్మఫలము అనుభవించక తప్పదు", "కష్టములను ఓరిమితో సహించవలెను", "పెద్దలను గౌరవించవలెను" ఇత్యాదిబోధనలు నిరాపేక్షణగా చెయ్యవచ్చు

నా ఉద్దేశంలో వ్యతిరేకార్థకం గల ఉపదేశాలు పనికిరావు అంటే, నా అభిప్రాయమేమంటే, "కల్లు తాగవద్దు", "దొంగతనము చేయవద్దు" మొదలైన ఉపదేశాలు ఆధునిక మనోవైజ్ఞాన సిద్ధాంతరీత్యా అంత మంచివి కావు అటువంటి ఉపదేశాలు చెయ్యటం మూలంగా ఆ

పనులు చేయటం అస్వాభావికం కాదేమో అనే అభిప్రాయం కలిగించినట్టవుతుంది "విషం తాగితే చస్తారు" అనటంలో అర్థం ఉన్నది "కల్లు తాగితే ఫలాని రోగం వస్తుంది", "దొంగతనం చేస్తే ఫలాని ఎముక విరుగుతుంది" అని చెప్పటానికి లేదు (కల్లుతాగితే వచ్చే రోగాలను గురించి శాస్త్రవేత్తలకే ఏకాభిప్రాయం లేకుండా ఉంది కొందరు తెగించి, కల్లులో బి విటమినులున్నాయంటున్నారు కూడా!) తాగేవాళ్ళూ, దొంగతనాలు చేసేవాళ్ళూ శిక్షింపబడతారని చెప్పవచ్చు కావలిస్తే కాని అందరూ శిక్షపడుతున్నారనటానికి లేదు (నా జేబులోనుంచి డెబ్భైరూపాయలు ఒక్కసారిగా కొట్టేసిన దుర్మార్గుడి పేరు కూడా నాకింతవరకూ తెలీదు – ఇది జరిగి అప్పుడే నాలుగేళ్ళు దాటింది!)

పిల్లలకు నీతిపుస్తకాలు రాయటంలో ఇంకో సౌలభ్యం ఏమిటంటే, కొత్త పంపిణీలో రాస్తే పాతకథలు కూడా పనికివస్తాయి ఉదాహరణకు, ఆ పాత కథలో యాయవారం ఎత్తుకునే బ్రహ్మచారి ఇంటివారి కోడలిస్తనాలు చూసి, "అమ్మా, నీ రొమ్ముమీద ఆ వాపులేమిటి?" అని అడగక్కర్లేదు, వాళ్ళ దొడ్లో ఉన్న చెట్టుకాయలు చూసి, "అమ్మా, అవేమిటి?" అని అడగవచ్చు "నాయనా, అవి పుట్టబోయే చెట్లకు బీజాహారాలు!" అని ఇంటివారి కోడలు చెబుతుంది "ఓహో, పుట్టబోయే చెట్లకే బీజాహారాలు ఏర్పాటుచేసినవాడు పుట్టిపెరిగిన నాకు ఆహారం ఏర్పాటుచెయ్యకపోతాడా?" అని బ్రహ్మచారి యాయవారం మానేసి గుళ్ళో పడుకుంటాడు మిగిలినకథ మామూలే

బాలోపదేశికులు (ఇందాకటి సమాసమే, సంధి కలిపి చూశాను, అంతే!) మరొక పని కూడా చెయ్యవచ్చు (ముష్టిది నేను చెప్పటమేమిటి? కొందరు ప్రాజ్ఞులు చేస్తూనే ఉన్నారు ) అదేమిటంటే, పాత కథల్లో ఉండిన పాత నీతి మనకు నచ్చకపోతే అదే కథ తీసుకుని మనకు నచ్చిన ఇంకొక నీతి వచ్చేటట్టు చెప్పవచ్చు

ఒక నమూనా :

రేణుక కార్తవీర్యుడి జలక్రీడలు చూస్తూ నిలబడలేదు గౌతముడికి ఆవిడమీద కోపమూ రాలేదు తన కొడుకు పితృభక్తి పరీక్షింతామని ఆయన (పేరు గౌతముడా? జమదగ్నా?) "ఒరే, నీ తల్లిమెడ తెగవెయ్యి!" అన్నాడు పరశురాముడు తెగేశాడు గౌతముడు (లేక జమదగ్ని) "భేష్!" అని పరశురాముడి భుజం తట్టి, తన పెళ్ళాన్ని బతికించాడు

ఇంతకన్నా కూడా నీతి కథలను తారుమారు చేసెయ్యొచ్చు అందరికీ తెలిసిన కాకీ, పామూ కథను ఈ విధంగా తిరగరాయవచ్చు

"ఒక చెట్టు పై యొక కాకి ఉండెను అది చెట్టు పై గూడుకట్టుకొని గ్రుడ్లు పెట్టుచుండెను ఆ చెట్టు తొఱ్ఱలో యొక పాము యుండెను అది కాకి పెట్టిన గ్రుడ్లను మ్రింగుచుండెను దైవప్రేరణ చేత కాకి యొక నక్క యొద్దకుబోయి తన యగచాట్లు చెప్పికొనెను లీలామానుష విగ్రహుడు శ్రీమన్నారాయణుని అనుగ్రహముచే నక్కకు యొక యుపాయము జనించెను అది కాకితో సోదరా, యీ సమీపమున గల రాజుగారి పత్ని అప్పుడప్పుడు జలకమాడును ఆ సమయము గనిపెట్టి నీవు ఆమె ముద్దుటుంగరంబును తెచ్చి పాముయుండు తొఱ్ఱలో బడవేయుము నీకు భగవత్కృపచే మేలు గలుగగలదు యని చెప్పెను కాకియట్లే చేసెను

రాజభటులు కాకిని తరిమికొని వచ్చెను కాకి ముద్దుటుంగరమును తొర్రలో వేసెను తొర్రను తవ్వెను పాము దొరికెను భటులు పామును చంపెను భగవంతుని ప్రభావమద్భుతము గదా!"

మనం ఈ కథే కాదు, ఏ నీతికథ తీసుకుని అయినా భగవంతుడి మహిమను వ్యక్తం చెయ్యవచ్చు వడ్రంగి సగంకోసి పోయిన దూలంలో కోతి కాలు (అండాలు కావు! ఆ మాట రాసినవాడు తెలియకరాశాడు!) ఇరికించుకుని ఎందుకు చచ్చిపోయింది? భగవత్ప్రేరణవల్ల!

ఈ విధంగా ప్రతిదీ భగవంతుడిపరంగా చూడటం మన ప్రాచీనసంస్కృతికి గాని ఈనాటి సంస్కృతికిగాని ఎంతమాత్రమూ విరుద్ధం కాదు భారతయుద్ధంలో పంచపాండవులు ఎట్లా గెలిచారు? శ్రీకృష్ణుడి ప్రభావం వల్ల! వాళ్ళ ఏడక్షౌహిణీల సైన్యమూ ఎందుకు హతమయింది? శ్రీకృష్ణుడి ఇచ్ఛ వల్ల! భగవంతుడి ఇచ్ఛలూ, లీలలూ, ప్రభావాలూ పక్కపక్కనే పరిస్తే మానవయత్నం నిలబడటానికి సూదిమొన మోపినంత జాగా కూడా దొరకదు!

అందుచేతనేగదా మనం ఏడుకొండలవాడికి "స్వామీ, ఈ డాక్టరుగారు నారోగం కుదిరిస్తే నీకు అభిషేకాలు చేయిస్తాను!" అని మొక్కుకుంటున్నాం! వీలైతే డాక్టరుకిచ్చేది ఎగనాం పెట్టి, ఏడుకొండలవాడి ముడుపు చెల్లించుకుంటున్నాం కూడా!

తెలుగుస్వతంత్ర వారపత్రిక, 29-3-1957

## 33. కొత్తరకం రాజకీయాలు కావాలి

సాంప్రదాయమైన రాజకీయవిధానాలు, నిర్వచనాలు సిద్ధాంతాలు ఇకముందు పనికిరావేమోననిపిస్తున్నది పెట్టుబడిదారీవిధానం తోనే ప్రజాతంత్రం నాలుగుపాదాలు నడుస్తుందనీ, సోషలిజం, కమ్యూనిజం అనేవి నియంతృత్వమనీ రాజకీయవేత్తలు చాలాకాలం ప్రజలని నమ్మించారు కాని ఇది శుష్కవాదమని రెండవ ప్రపంచయుద్ధానికి ముందే రుజువయింది జర్మనీలో హిట్లరు ప్రజాతంత్రానికి స్వస్తిచెప్పినా ప్రజాతంత్ర దేశాలు ఆ హిట్లరుతో గూడుపురాణీలు చేసి గోరుతో పొయ్యేదానికి గొడ్డలి తెచ్చుకున్నారు

యుద్ధానంతరం అమెరికా ప్రపంచపెత్తనం దొరకపుచ్చుకుని 'ప్రజాతంత్రం' అనేదానికి 'స్వేచ్ఛ' అనేది జతపరిచింది దేశసంపదలు సృష్టించేహక్కు వ్యక్తులచేతిలో ఉండిపోక ప్రభుత్వాల చేతిలోకి పోతే 'స్వేచ్ఛ' అంతరించిపోతుంది, అందుచేత సోషలిస్టువ్యవస్థలో ప్రజలు బానిసలైపోతారు సోషలిస్టువ్యవస్థ లేనట్టయితే నిరంకుశత్వాల కిందకూడా ప్రజలు 'స్వేచ్ఛ'గా ఉంటారు అందుకే అమెరికా ఫ్రాంకోను, చాంగ్కైషేక్‌నూ, సింగ్మన్‌రీనూ, అలాటి కోవకు చెందిన ఇతర పుచ్చుపిందెలను ఆదరించింది

ఈనాడు ప్రజాస్వామ్యం అన్నది ఎంత దుస్థితికి వచ్చిందంటే దానిచాటున దేశాలకు దేశాలు కుళ్ళిపోవటమూ, ఏ సైనికాధికారులో ప్రభుత్వాన్ని తోసిరాజని నియంతృత్వం అవలంబించటమూ, ఆ నియంతృత్వాలను 'గుర్తించటానికి' ప్రపంచదేశాలన్నీ ఎగబడటమూ జరుగుతున్నది!

ఒకవంక ప్రపంచ రాజకీయాలిలా ఉంటే రెండోవంక సోషలిస్టు దేశాలు విప్లవాలు సాగించి సోషలిస్టు ఉత్పత్తివిధానాలను అమలుజరిపి కొద్దిసంవత్సరాల కాలంలో ఒక శతాబ్దం ముందుకు వచ్చేస్తున్నాయి ప్రజాతంత్రం మాట దేవుడెరుగు, ప్రజాచైతన్యం ఈ దేశాలలో అపారంగా వెల్లివిరుస్తున్నది రష్యాలో శాస్త్రపరిజ్ఞానంలో జరిగిన అభివృద్ధి, చైనాలో సంపద ఉత్పత్తి అభివృద్ధి చూస్తుంటే రాజకీయాలను గురించి ప్రతివాడూ అభిప్రాయాలు మార్చుకుతీరాలనిపిస్తున్నది

ఎందుచేతనంటే రాజకీయాలలో, ఇతర జీవితరంగాలలో లాగే, వాస్తవికతా, అవాస్తవికతా అనేవి ఉన్నాయి నిరుద్యోగంతోనూ దారిద్ర్యంతోనూ బాధపడే ప్రజలతో "రష్యాలో అందరికీ ఉద్యోగాలు, తిండీ, వైద్యసౌకర్యాలు ఉన్నాయిగాని, ఆ ప్రజలకు స్వేచ్ఛ లేదు" అని చెబితే ఆ మాట అవాస్తవికంగా వినపడుతుంది

"చైనాలో ప్రజలను పశువులలాగా తోలి పనిచేయించి ఉత్పత్తి పెంచుకున్నారు సంపదకూ సౌఖ్యానికీ సంబంధం లేదు" అని అమెరికను రాజకీయవిజ్ఞుడు చెబితే నా చెవికి అది అవాస్తవంగా వినిపిస్తున్నది

ప్రజలను పశువులలాగా తోలటం సాధ్యమైనపని కాదు ఏదో ఆశించి ప్రజలు పశువులలాగా శ్రమించటానికి అంగీకరించవచ్చు అది వేరేవిషయం అలా పనిచేసినందువల్ల జరిగే నష్టం సంపదరెట్టింపు కావటమే అయితే అందుకు విచారించే మూఢుడెవడూ ఉండడు మనం ఊహించగలిగినంతవరకు నిరుద్యోగిగా ఉండే హక్కూ, తిండికి మాడే హక్కూ కోరే మనుషులుండరు

ప్రపంచంలోకల్లా పెద్ద ఉక్కుకర్మాగారాన్ని చైనాలో ఆరునెలల్లో కట్టి పనిచేయిస్తున్నారంటే అందులో వాస్తవికత ఉన్నది అమెరికను ఎన్నికలలో డెమోక్రాట్లకు ఎంత మెజారిటీ వచ్చిందన్నది ఈ చైనా ఉక్కుకర్మాగారంలాగా మనసుకు పట్టదు రాజకీయాలు నిత్యజీవితానికి, ప్రజాజీవితానికి ఎంత సన్నిహితంగా రాగలవో సోషలిస్టు వ్యవస్థ నిరూపిస్తున్నది గాని 'పెట్టుబడిదారీ ప్రజాతంత్రం' ఏమీ నిరూపించడంలేదు

అన్ని రాజకీయాలకూ పునాది ఆర్థికజీవితం, ఈ సంగతి మన జాతీయనాయకులు ఎరుగుదురు 'ప్రొడ్యూస్ ఆర్ పెరిష్' అన్న నినాదాన్ని నెహ్రూ ఏనాడో పలికాడు మనదేశం పంచవర్ష ప్రణాళికలు అమలుచేస్తున్నది కాని మనకు సంప్రదాయ రాజకీయధోరణి పోలేదు

ఎన్నికలలో నిలబడేవారు ప్రత్యక్షంగా స్వలాభాపేక్షతోనే నిలబడుతున్నారు ఎన్నికల ప్రచారం జరిపేపద్ధతిలోనూ, వోట్లు కూడగట్టుకునే పద్ధతిలోనూ ప్రజాశత్రుత్వం ఉట్టిపడుతున్నది ఇక గ్రూపుతత్వాలు ప్రతిచోటా ఉన్నాయి, వాటి కంపు నానాటికి దుర్భరం అవుతున్నది అందుకనే స్వాతంత్ర్యం వచ్చిన పుష్కరానికి ఇంకా ప్రజలు మన్ను తిన్న పాములల్లే చైతన్యరహితులై ఉన్నారు ఆఖరుకు రాజకీయకీచులాటను గురించి కూడా వారికి ప్రసక్తి ఉన్నట్టు కనబడదు

రాజకీయవర్గాలో కూడా పదవీవ్యామోహం తప్పిస్తే ప్రజాజీవితం పట్ల గాఢమైన భావాలు లేవు ప్లానుకింద ఖర్చయే డబ్బులో కైంకర్యం హెచ్చుగా ఉన్నదని అందరికీ తెలుసు బ్రిటిషు

పరిపాలనలో అధికారులు లంచం తినటం ఎంత గొప్పగా ఉండేదో, ఇప్పుడూ అంత గొప్పగానూ ఉన్నది

'ప్రజాస్వామ్యం' అన్నదానికి ప్రజాజీవితానికీ ఏమైనా సంబంధం ఉండవలసి ఉంటే ఈ దేశంలో ఈనాడున్న ప్రజాస్వామ్యం బ్రిటిషువారి హయాంలో ఉండే దానికన్న ఏమీ హెచ్చుగా కనపడదు ఇది చాలా శోచనీయం

రాజకీయాలు ఒక విద్య అనీ, ఒక టెక్నిక్ అనీ, ప్రజలను మభ్యపెట్టటమూ, ఉపన్యాసాలు దంచడమూ, శాసనసభలలో గొంతులు చించుకోవటమూ, ప్రత్యర్థుల మధ్య చీలికలు పెట్టటమూ, ఎట్లాగైనా ఒక్క వోటు అధికంగా సంపాదించటమూ అనీ అనుకునే మనస్తత్వం గలవాళ్ళు ఈనాడు రాజకీయనాయకులుగా పనికిరారు అటువంటి వాళ్ళని ప్రజలు పోల్చటమూ, దించెయ్యటమూ నేర్చుకోవాలి

ఈనాడు మనదేశానికి ప్రజాతంత్రమంటే ఎక్కువ తిండి ఉత్పత్తి చెయ్యటం, ఎక్కువ ఉక్కూ, ఎక్కువ బట్టా, ఎక్కువ మందులూ, ఎక్కువ వాడుక సరుకులూ సృష్టించటం, దేశాన్ని ఉన్నదానికి అనేకరెట్లు పారిశ్రామికం చేసి నిరుద్యోగమూ, నిరక్షరతా, అనారోగ్యమూ మొదలైనవాటిని తొలగించటం మనం యుద్ధోన్మాదులం కాము ఇతర దేశాలపై అధికారం చలాయించాలనే కాంక్ష మనకు లేదు అందుకనే మనం యుద్ధకూటాల జోలికి పోవటం లేదు కాని మనం రెంటికీ చెడిన రేవడ కాకుండా కాపాడుకోవాలి ఒకవంక తిండిగింజలకు మార్కెటు లేకపోతే వాటిని బాయిలర్లలో వేసి, వ్యవసాయక్షేత్రాలను బీడుపెట్టే అమెరికాతో మనం ఎలాగూ పోటీచెయ్యం ఇంకోవంక ఎకరానికి రెండువందల బస్తాల బియ్యం పండించే చైనాతో కూడా పోటీ చెయ్యకపోతే మనకు భవిష్యత్తులేదు

ప్రజాజీవితాన్ని ముందుకునడిపించే కార్యక్రమం ఏ ప్రభుత్వం అమలుజరిపినా ఆరోజునుంచీ దేశంలో వివిధ రాజకీయపక్షాలకు తావులేకుండా పోతుంది నిరుపయోగమైన సిద్ధాంతాలు గల రాజకీయపక్షాలు దేశంలో అనేకం ఉండటం ఒక వినోదమూ వేడుకా మాత్రమే "బలమైన ప్రతిపక్షం ప్రజాస్వామ్యానికి అవసరం" అన్నమాటలో కూడా అర్థం లేదు ప్రభుత్వ పక్షం తరఫున చేతులెత్తేవాళ్ళు మెజారిటీ ఉన్నంతకాలమూ ప్రతిపక్షం చేసేది లేదు ప్రతిపక్షం వారి ద్వారా ప్రజలు కొంత రాజకీయవిజ్ఞానం సంపాదించుకోవచ్చునన్నది సిద్ధాంతరీత్యా నిజమేగాని, ఫ్రాన్సులో లాగా ప్రజలు రాజకీయవిజ్ఞానం ఎక్కువై నియంతృత్వానికి వోటివ్వవచ్చు ప్రజలు నేర్చుకోవలసినదల్లా ఒకటే, తమకు లాభించని వారికి వోటివ్వకుండా ఉండటం ఇది బ్రహ్మవిద్య కాదు

తెలుగువిద్యార్థి మాసపత్రిక, జనవరి 1959

# 34. చిత్రజగత్తు - ఎ

అమెరికాలో కుర్రాళ్ళని "నీకు అధ్యక్షుడు కావాలని ఉందా?" అని అడగటమూ, వాడు "అవును" అని చెప్పటమూ ఒక రివాజు

కాని ఎవడన్నా కుర్రాడు, "నాకు అధ్యక్షుడు కావాలని లేదు ' అన్నట్టయితే అందరూ వాణ్ణి ఛీవాట్లు వేసినప్పటికీ, అది బుద్ధిమాలిన జవాబు అని అనుకోవటానికి వీల్లేదు

"నేను అధ్యక్షుణ్ణయితే నాదేశానికి ఈ ఫలానామేలు చేస్తాను" అని ఏ అమెరికను పౌరుడూ ముందుగా అనుకోవటానికి లేదు అధ్యక్షుడుగా ఎన్నికలకు నిలబడే మనిషిని నిర్ణయించటానికి ఎంత యంత్రాంగమైతే ఉన్నదో అధ్యక్షుడైన వాణ్ణి నడిపించటానికి అంత యంత్రాంగమూ ఉన్నది ఒకసారి అధ్యక్షుడైనవాడు తిరిగి మామూలు మనిషి అయేదాకా ఆ యంత్రాలు ఎలా తిప్పితే అలా తిరిగి, ఏమనమంటే అది బలంగా అనాలి లేదా ఆ యంత్రాలతో పోరాడి, ఆరోగ్యం కోల్పోయి, ఒక్కొక్కప్పుడు అకాలమరణం పాలుకకూడా కావలసిరావచ్చు

ఒక్కోసారి అధ్యక్షుణ్ణి గావుపట్టిన యంత్రాలు బొత్తిగా మతిమాలినవాళ్ళ చేతుల్లో ఉన్నట్టు కనిపిస్తాయి ఒక్కోసారి వాటిని పిశాచాలు ఆవహించినట్టుంటుంది అలాంటప్పుడు అధ్యక్షుడే ఉన్మాదిలాగానూ, పిశాచిలాగానూ తన అభిప్రాయాలు తనకే తెలియనివాడుగానూ లోకానికి కనిపించవచ్చు కాని ఇదంతా భ్రమ ఒక ఆభాస

కెన్నడీ అధ్యక్షుడు కాగానే ఆయనగారి శీలసంపదనూ, సిద్ధాంతాలనూ, వ్యక్తిత్వాన్నీ గురించి జర్నలిస్టులు పెద్దపెద్ద లిస్టులు రాసుకుపోయారు ఆ కెనెడీని మనం మరి నాలుగేళ్ళదాకా చూడం

అమెరికాలో ఉన్నంతదారుణంగా లేకపోయినా ఇతరచోట్ల కూడా ఉన్నతపదవులలో ఉండేవారు అంతో ఇంతో అస్వతంత్రజీవులే సమాజంలో ఉండే బలవత్తరశక్తులు తమ ప్రతిశక్తులతో సాగించే సంఘర్షణకు గాను అత్యున్నతమైన పదవులను యుద్ధరంగంగా వినియోగించుకుంటాయి ఆ బలవత్తరశక్తులు పురోగామిశక్తులైతే ఆ పదవులను అలంకరించేవారు చరిత్రలో కీర్తి గడిస్తారు అవి దుష్టశక్తులైతే వారు తిట్లుతింటారు

సంఘం యొక్క పురోభివృద్ధికిగాను పాటుపడదలచిన వాళ్ళు పదవులను ఆశ్రయించనవసరంలేదు సమాజంలోని ప్రతికూల, అనుకూలశక్తుల సంఘర్షణకు నిజమైన యుద్ధరంగం జీవితం చరిత్రలో చెప్పుకోదగిన పోరాటాలన్నీ అక్కడే సాగాయి వాటినిబోలిన పోరాటాలు సింహప్రజాసనాల పైనా, 'సీట్ల' పైనా జరగనేలేదు

లెనిన్‌గాని, గాంధీ గాని పదవులలో ఉండి చరిత్ర నిర్మించలేదు తెలుగుదేశంలో మంత్రిత్వాలు నిర్వహించిన వారందరి పేర్లూ మాసిపోయినాక కూడా కందుకూరి వారి పేరూ, గురజాడ వారి పేరూ, గిడుగువారి పేరూ నిలబడి ఉంటాయి వీరు ఏనాడూ ఏ యంత్రాలలోనూ చిక్కుకుని అవి ఆడించినట్టు ఆడినవారు కారు వారిది పదహారణాల స్వతంత్రకృషి.

అదృశ్యమైన యంత్రాల చేతి కీలుబొమ్మ అనటానికి వీలులేకుండా, అత్యున్నతమైన పదవిలో ఉన్న కొద్దిమంది ప్రపంచ రాజకీయవేత్తలలో భారతప్రధానిని చెప్పుకోవచ్చు నెహ్రూ పదవిలో ఉంటూ కూడా తన వ్యక్తిత్వాన్ని చాలావరకు నిలబెట్టుకుంటున్నాడు – కాని పూర్తిగా కాదు

నెహ్రూ ఆదర్శాలు అత్యున్నతమైనవి, దేశానికీ ప్రజలకూ మేలు చేకూర్చేవి అవి నిజంగానే అమలుజరిగేటట్టుంటే దేశంలోని అనేక ప్రజాపార్టీలు పూర్తిగా ఆయనతో సహకరిస్తాయి కాని ఆయన ఆశయాలు– ఆయన ప్రోద్బలం వల్ల కాంగ్రెసుపార్టీ ఆమోదించిన ఆశయాలు– పొట్టనపెట్టుకునేవారు కాంగ్రెసుపార్టీలో ఉంటున్నారు నాయకవర్గంలో అభిప్రాయభేదాలూ, పదవులనలంకరించినవారిలో చీలికలూ ముఠాతత్వాలూ, ఒకరినొకరు బహిరంగంగా కడుక్కోవడాలూ – వీటి వెనక మహత్తరమైన ఆదర్శాలుగాని, మహోన్నతమైన ఆశయాలుగాని ఏమీ లేవు ఉండే అవకాశంలేదని నెహ్రూకు తప్పకతెలిసి ఉండాలి కాని ఆయన ఈ విషయమై చేసేదేమీ కనిపించదు ఈ విషయంలో ఆయనకు స్వేచ్ఛలేకుండా చేసిన అదృశ్యయంత్రాలేవో ఉన్నాయనే అనుకోవాలి

ఎన్నికలు జరిగినప్పుడల్లా కాంగ్రెసుకు ఓట్లువేసేవారందరూ కాంగ్రెసు తరఫున నిలబడిన అభ్యర్థులు నెహ్రూగారి ప్రతినిధులే అన్నట్టుగా వోట్లు వేస్తారు ఆ ఓట్లను అదృశ్యయంత్రాలు మింగేస్తాయి ఈ ఓట్లతో ఎన్నికైనవారు, మళ్లీ బజార్నపడి ఒకరినొకరు తిట్టుకుంటారు ఈ 'ఫార్సు'నే మనం స్వాతంత్ర్యమనీ, ప్రజాస్వామ్యమనీ అంటున్నాం

జైహింద్!

విశాలాంధ్ర, దినపత్రిక 7-5-1961

# 35. చిత్రజగత్తు - బి

విశ్వకవి టాగూరు జన్మించి నూరేళ్ళయింది విశ్వమంతటా శతవార్షిక జయంతి జరిపారు, జరుపుతున్నారు చాలామంచిసంగతి ఈ కాలంలో ప్రపంచమంతా ఆరాధించదగినవాళ్ళు శాస్త్రవేత్తలైనా కావాలి, కళాకారులైనా కావాలి నన్నడిగితే ఒకరిద్దరు రాజకీయవేత్తలను కూడా ఇటువంటి జాబితాలో చేర్చవచ్చునంటాను– కాని రాజకీయవేత్తలను గురించి అభిప్రాయభేదాలుండకతప్పవు

కళాకారులూ, శాస్త్రవేత్తలూ – ముఖ్యంగా కళాకారులు– అజాతశత్రువులు టాగూరు, టాల్‌స్టాయ్ వంటి వాళ్ళు అజాతశత్రువులలో కూడా అగ్రగణ్యులు సత్యమూ, శివమూ, సుందరమూ అయిన దానినల్లా ఆరాధించినవాడు టాగూరు ఆయనలోనే ఈ మూడూ మూర్తీభవించి ఉండినట్టుండేవి స్వేచ్ఛ, శాంతి, సౌందర్యం, సౌజన్యం, సౌఖ్యం – ఇవి తన దేశానికే గాక, ప్రపంచవాసులందరికీ కావాలని ఆయన కలలు కన్నాడు ఆ కలలు సోవియట్‌రష్యాలో రూపందాల్చుతుంటే చూసి ఆనందించాడు ఆయనకు రాజకీయ మూఢవిశ్వాసాలు లేవు ఆయన మతమేమిటో నాకైతే స్పష్టంగా తెలీదుగాని, అందులో గుడ్డివిద్వేషం మాత్రం ఏ కోశానా లేదని చెప్పగలను

ఈ శతవార్షికోత్సవాలు దేనిని ప్రతిబింబిస్తున్నాయన్న విషయంలో నాకు సందేహాలు లేకపోలేదు మూక ఉమ్మడిగా జరిగే ఉత్సవాలలో కొంత అర్థలోపం జరుగకతప్పదు కొందరు కేవలం టాగూరుపేరు ఒకటికి పదిసార్లు వినటం మాత్రమే జరుగుతుంది పత్రికలు విప్పితే టాగూరు ఫోటోలు, శీర్షికలలో ఆయనపేరు చూడటం జరుగుతుంది రేడియో తిప్పితే ఆయన గీతాలు అనువాదాలు వినటం జరుగుతుంది

మరికొందరు ఈ ఉత్సవాలలో ఊపిరిసలపకుండా పెత్తనం సాగిస్తారు తీరా విచారిస్తే వీరు టాగూరు ప్రచారం చేయతలపెట్టిన మహోన్నత మానవాదర్శాలనూ, విశ్వమానవత్వాన్నీ అనుక్షణమూ ఉల్లంఘించడమూ, వాటిపై కత్తికట్టి ఉండటమూ వ్యక్తమవుతుంది

అందుకే ప్రధాని నెహ్రూ చెప్పిన ముక్కలు సార్థకమైనవి- టాగూరును నిజంగా ఆరాధించినవారు, ఆయన తన కృషిని ఏ మహదాశయానికి అంకితం చేసినదీ తెల్సుకోవాలి, ఆ ఆశయాలను వ్యక్తం చేసే రచనలు చదవాలి ఏ ఒక్క 'గీతాంజలి' గాని తీసుకుని గట్టిగా చదివినంతమాత్రాన జరిగేదీ, ఒరిగేదీ ఉండదు

ఇటువంటి ఉత్సవాలు ఎట్లా జరగరాదో తెలుసుకోవాలంటే మనకు మంచి నమూనా అమెరికా నుంచి లభిస్తున్నది

కిందటినెల 12న అమెరికా అంతర్యుద్ధం తాలూకు శతవార్షికోత్సవం ఆరంభమయింది ఈ అంతర్యుద్ధం జరగటానికి కారణం అమెరికా ఉత్తరరాష్ట్రాలవారు బానిసవిధానం రద్దుకావాలనటమూ, దక్షిణ రాష్ట్రాలవారు అందుకు వ్యతిరేకించటమూనూ 1865 ఏప్రిల్9న దక్షిణరాష్ట్రాలు ఓటమి ఆమోదించాయి వారి సేనానాయకుడైన జనరల్ రాబర్ట్‌లీ అస్త్రసన్యాసం చేసేశాడు

ఆ యుద్ధంలో గెలిచిన సేనానాయకుడు జనరల్‌గ్రాంట్ అందుచేత కిందటినెల జరిగిన ఉత్సవాలను కొనసాగించటానికి ఒక సంఘాన్ని ఏర్పరుస్తూ జనరల్ గ్రాంట్ మనుమడైన యులిసెస్‌గ్రాంట్‌ను దానికి అధ్యక్షుడుగా వేసుకున్నారు చాలాబాగుంది

కాని నేనే అమెరికన్‌నైతే ఏ మొహం పెట్టుకుని ఈ శతవార్షికోత్సవం చేస్తానా అనే ప్రశ్న నాకు కలుగుతోంది ఎందుకంటే అమెరికాలో నీగ్రోలు ఇంకా తక్కువజాతి పౌరులుగానే ఉన్నారు వారికి పౌరహక్కులు లేవు వారిని అస్పృశ్యత ఆవహించి ఉండనే ఉన్నది పేరుకు బానిసలు కాదుగాని వారిది బానిసబతుకే ఏ ప్రజాస్వామ్యం కోసం పోట్లాడినందుకు ప్రపంచమంతా ఉత్తరరాష్ట్రాలను బలపరిచిందో, ఏ నీగ్రోలకోసం ఆ అంతర్యుద్ధం సాగిందో, ఆ నీగ్రోలు ఆ ప్రజాస్వామ్యానికింకా వెలిగానే ఉన్నారు

అమెరికనులను ఈ ప్రశ్న ఏమీ బాధించలేదు వారు చరిత్రను తలకిందులుగా వేళ్ళాడదీసి కోదండం వేసేశారు బానిసవిధానాన్ని అందరికన్న ఎక్కువగా బలపరిచిన జెఫర్సన్‌డేవిస్‌ను జాతీయ మహానాయకాగ్రేసరుణ్ణి చేసేశారు!

ఈ ఉత్సవాల సందర్భంలో ఒక గొప్ప విందు జరిగింది దానికి అన్ని రాష్ట్రాలనుంచీ ప్రముఖులు ఆహ్వానించబడ్డారు ఆహూతులలో మిసెస్ విలియమ్స్ అనే నీగ్రో స్త్రీ కూడా ఉన్నదట ఆవిడను విందులో పాల్గొనకుండా చేశారు

ఈ శతవార్షిక కమిటీ యొక్క ఎగ్జిక్యూటివ్ డైరెక్టరు మిష్టర్ కార్ల్‌బెట్స్ అనే ఆయన కుండపగలేసి చెప్పేశాడు: "దక్షిణరాష్ట్రాలు యుద్ధంలో ఓడిఉండవచ్చు కాని శతవార్షికోత్సవాలు తప్పక గెలుస్తాయి "

అసలు దక్షిణరాష్ట్రాలు ఓడను కూడాలేదట ఏం జరిగింది అంటే, రాబర్టులీ జనరల్‌గ్రాంటును చూసి తన బంట్రోతు అనుకుని తన కత్తి తీసి ఇచ్చాట్ట! అది అస్త్రసన్యాసంగా పరిణమించిందట

విశాలాంధ్ర, 14-5-1961

# చిత్రజగత్తు -సి

మానవజీవితం గురించీ, మనిషి పాటించవలసిన ధర్మాలను గురించీ, సంఘంలో ఏర్పడే కుళ్ళుకు ఉండే మూలకారణాలను గురించీ దూరదృష్టిగల కవులూ, మేధావులూ, ప్రవక్తలూ ఏనాడో చెప్పదగినదంతా చెప్పారు మనం కొత్తగా కనుక్కునేదేమీ లేదు– విజ్ఞానం ద్వారా ప్రకృతిశక్తులను మరింతగా అదుపులోకి తెచ్చుకుని, జీవితంలో సుఖాన్నీ, ఆనందాన్నీ పెంపొందించి మానవజాతినంతనూ ఉన్నతికి తీసుకురావటం తప్ప

రెండు దశాబ్దాల క్రితం ఉద్యోగి అయిన ఒక యువకుడు భగవద్గీతలో కమ్యూనిజం ఉన్నదని చూపటానికి ఒక చిన్న పుస్తకం ప్రచురించడం నాకు జ్ఞాపకం ఉంది భారతం నిండా 'విప్లవబీజాలు'న్నాయని నేను రుజువు చెయ్యగలను నాబుద్ధికి ఈనాడు మతాలన్నీ నిరర్థకమే అనిపించినప్పటికీ మానవజాతిలో ప్రతి ఒక్కడూ నిజంగా ఏ మతాన్ని నమ్మినా ప్రపంచం ఇంత కంపు కొట్టదేమోననిపిస్తుంది

ప్రాంతీయ జాతీయ అంతర్జాతీయ జీవితాన్ని నిజంగా కంపుకొట్టిస్తున్న వాళ్ళు, తాత్కాలిక ప్రయోజనాలను కోరేవారు, స్వార్థపరులు, విశ్వమానవ దృక్పథం పగలగోసినా కనిపించనివాళ్ళు – నాకు తెలిసినవరకు ఏ మతమూ ఇటువంటి దృక్పథాలను సమర్థించదు

మతాలను భుజానవేసుకుతిరిగేవారు 'రేపు' అన్నదాన్లో విశ్వాసం లేకుండా జరగని యుద్ధాలలో 'ఆత్మరక్షణ' కోసం పేదలకడుపులు కొట్టి జాతీయసంపదను మారణాస్త్రనిర్మాతలకు దోచిపెడుతుంటే, 'భౌతికవాదం' అవలంబించిన దేశాలలో అనంతమైన భవిష్యత్తుకు పునాదులు వెయ్యటం జరుగుతున్నది మానవజాతిని ఇంతదాకా లాక్కొచ్చి ఇంకా ఎంతో ముందుకుతీసుకుపోనున్న విజ్ఞానానికి 'సోషలిస్టు'దేశాలలో ఉన్న ఆదరం 'దేవతార్చన'లో మునిగితేలే ధనస్వామ్యదేశాలలో కనపడదు నియమబద్ధంగా ప్రజల ఆర్థిక జీవితానికి ప్రణాళికలు వేసినదేశం సోషలిస్టుదేశం సోవియట్‌రష్యా అంతరిక్షయానాల విషయంలో ఈనాడు చేసే ప్రయోగాల సత్ఫలితాలు మానవులకు ఉపయోగపడటానికి శతాబ్దాలు పట్టవచ్చు

సోషలిస్టుశాస్త్రం అంతదూరం చూడటం విశేషం

మనం ఎన్నికలకోసం మతంపేరిట హత్యాకాండలు సాగిస్తున్నాం!

మతతత్వాన్ని, కులతత్వాన్ని మన కాంగ్రెసునాయకులు గర్హించటంలేదని కాదు ఆధునిక జీవితంలో కులమతతత్వాలకు తావులేదని ఒకరు చెప్పనవసరం లేదు అది అందరికీ తెలుసు ఈనాడు వాటిని గర్హించినవారే తమ అక్కరకు వాటిని ఉపయోగించుకున్నారు

ఒకవర్గం వారి ఓట్లు మరొకవర్గం వారి ఓట్లను కూడ మారకం వేసుకొనటం, కొన్ని నియోజకవర్గాలలో ఓటర్లసంఖ్య అధికంగా ఏ కులం వారిదైతే వారినే తమ అభ్యర్థిగా నిలబెట్టటం,

తమ అభ్యర్థులకు అనుకూలంగా ఉండేటట్లు నియోజకవర్గాలను పునర్నిర్మించటం, ఎన్నికలలో విజయం కోసం మతసంస్థలతో చేతులు కలపటం, తరువాత వారిని అదుపులో ఉంచటానికి నానా అగచాట్లూ పడటం - ఇటువంటివన్నీ కాంగ్రెసువారు చెయ్యలేదా?

జీవితసత్యాలు నాయకులనోట వెలువడినా, పుస్తకాలలో ఉన్నా అంతా ఒకటే జీవితం భౌతికంగా విస్తరించాలి జీవితంపోయిన కొద్దీ భారం అనిపించకుండా, భవిష్యత్తును గురించి ఆందోళనలేకుండా, చేసుకోగలవాడికల్లా పని ఉండి, శ్రమ ఫలితం ద్వారా జీవితం వృద్ధిచేసుకోగల అవకాశాలు కల్పించినట్టయితే మూఢవిశ్వాసాలు వాటంతట అవే మటుమాయమవుతాయి ప్రజలు త్యాగశక్తి లేనివాళ్ళు కాదు తమ నాయకులు నిస్వార్థంగా దేశసమస్యల పరిష్కారానికే అంకితమై ఉన్నారన్న నమ్మకం కలిగితే వాళ్ళు సమష్టిక్షేమం కోసం ఎంత త్యాగాలైనా చేస్తారు నాయకులు సిగ్గువిడిచి పదవులకోసం పాకులాడుతున్నట్టు బాహాటంగా తెలిసిపోయాక వాళ్ళు పదిరూపాయలకు ఓట్లు అమ్మేస్తారు వందరూపాయలకు హంతకులుగా కూడా తయారవుతారు జీవితాన్ని కశ్మలం చేసే హక్కు 'పైన' ఉండే కొద్దిమంది పెద్దలకే ఉంటుందనుకోవటం పొరపాటు

విశాలాంధ్ర, దినపత్రిక, 4-6-1961

## 37. చిత్రజగత్తు -డి

కాలధర్మాన్ని బట్టి కొన్ని మాటలకు సువాసనలూ, దుర్వాసనలూ కలుగుతుండటం మనం చూస్తునే ఉన్నాం 'బూర్జువా' అనే మాట గౌరవవాచకం కావటం మానేసి తిట్టుకింద పరిణమించింది 'విప్లవం' అనే మాటకు అనాదరణ పోయి గౌరవం వచ్చింది మాటలు వాడుకలో అరుగుతాయి అరుగుదలవల్ల కొన్ని మాటలు నునుపెక్కి నిగనిగలాడితే, మరికొన్ని పలకబారి పెళుసెక్కుతాయి ఇది అస్వాభావికం కాదు

నిజంగా స్వభావ విరుద్ధమైన సంగతేమంటే పరస్పరం ఏమీ సంబంధం లేని మాటలు సమానార్థాలుగా చలామణి కావటం సినిమారంగంలో అవాస్తవికతకూ, భావదారిద్ర్యానికీ, కళారాహిత్యానికీ 'వినోదం' పర్యాయపదంగా పరిణమించింది 'ఇది కేవలం వినోదం ప్రధానంగా గల పిక్చరు' అని ప్రొడ్యూసరు చెప్పుకున్నాడంటే అందులో మనం ఏదీ ఆశించనవసరం లేదన్నమాటే

అదేవిధంగా ఇప్పుడు అంతర్జాతీయరంగంలో అమెరికా ఏలికలు రెండుమాటలను పర్యాయపదాలుగా వాడుతున్నారు అందులో ఒకటి స్వేచ్ఛ, రెండోది కమ్యూనిస్టునిరోధం అమెరికా నాటో, సీటో, సెంటో మొదలైన కూటాలన్నిటినీ ఏర్పరచి, అడగనిదేశానిది పాపంగా యుద్ధసహాయం చేస్తూ డాలర్లు కుమ్మరిస్తూ, చమురుగుడ్డలు లభించిన చోటనల్లా అగ్గిపెడుతూ, అంతర్జాతీయంగా అందరిచేత నానామాటలు పడుతూ ఇంత కశ్మలం ఎందుకు చేస్తున్నది? కమ్యూనిస్టు వ్యాప్తిని అరికట్టడానికని ఒక సమాధానం స్వేచ్ఛను కాపాడడానికని మరొక సమాధానం రెండూ ఒకటేనని నమ్మే 'వెర్రికుట్టెలు' ప్రపంచంలో లక్షోపలక్షలున్నట్టు కనబడుతుంది

ఈ రెండూ ఒకటి కావు ఈ సంగతి తటస్థదేశాలలో వాళ్ళకు స్పష్టంగా తెలియటం మంచిది చేతనైతే కమ్యూనిజమును నిరోధించు, లేదా స్వేచ్ఛను కాపాడు రెండూ ఒకేసారి చెయ్యలేవు ఈ సంగతి 'స్వతంత్ర' దేశాలవాళ్ళు తామై స్పష్టం చేస్తున్నారు అమెరికా గడిచిన పుష్కరకాలంలోనూ చేసిన కృషి ఫలితంగా కమ్యూనిజం విస్తరించింది స్వేచ్ఛ సన్నగిల్లింది

అమెరికా ఆదరణ పొంది 'స్వేచ్ఛ'ను కాపాడటంలో తోడ్పడుతూ డాలర్లు భోజనం చేస్తున్నవాళ్ళనూ, ఉద్వాసన చెప్పబడిన వాళ్ళనూ ఒకలైనులో నిలబెడితే 'స్వేచ్ఛ' యొక్క స్వరూపం బయటపడుతుంది చాంగ్‌కైషేక్, సింగ్మన్‌రీ, న్గోదిన్‌దియమ్, ఫ్రాంకో, సాలాజార్ అందుకే ఒకప్పుడు ఆడ్లాయ్ స్టీవెన్సన్ "మన నాయకులు స్వేచ్ఛ స్వేచ్ఛ అంటూ నియంతలను వాడేసుకుంటున్నారు" అని ఎత్తిపొడిచాడు

స్టీవెన్సన్ నాయకవర్గంలో చేరిన తరువాత కూడా పరిస్థితులేమీ మారలేదు ఇటీవల మనదేశానికి వచ్చి ఎద్దుబళ్ళలో వెళ్ళటం మొదలైన గమ్మత్తులు చేసిన లిండన్ జాన్సన్ (అమెరికా ఉపాధ్యక్షుడు) 'స్వతంత్ర' ఆసియా నాయకులైన చాంగ్‌కైషేక్, దియమ్‌ప్రభృతులకు షేక్‌హాండ్‌లిచ్చి వారికి అభయం కూడా ఇచ్చాడు

ఇదేసమయంలో, స్వేచ్ఛకు రెండో పట్టుకొమ్మ అయిన బ్రిటిషుప్రభుత్వం తన దేశీయ, విదేశీయ మంత్రులైన బట్లర్,లార్డ్‌హోమ్‌లను పర్యటనకు పంపింది బట్లర్ స్పెయిన్ వెళ్ళి ఫ్రాంకో నియంత ఆతిధ్యం పుచ్చుకుని, స్పెయిన్ పశ్చిమరాజ్యాలతో చేరి ఉండటం జరక్కపోవడం శోచనీయమన్నాడు బ్రిటిషుపత్రికలు గొల్లున గోలపెట్టాయి అయినా లార్డ్‌హోమ్, నాటో వ్యవహారాల ఉపమంత్రితో సహా స్పెయిన్‌కు ప్రయాణమయాడు

స్పెయిన్ నాటోలో చేరే లక్షణాలకు తక్కువేమీలేదు అహింసాసిద్ధాంతాన్ని తుపాకులతో అమలుజరిపితే ఎట్లా ఉంటుందో సాలాజార్, ఫ్రాంకోలతో స్వేచ్ఛను కాపాడటం అట్లా ఉంటుంది

అసలు సంగతేమంటే 'స్వేచ్ఛ' వలసవిధానానికి పర్యాయపదంగా వాడుక అవుతున్నది వైరం వలసవిధానానికీ కమ్యూనిజంకూ మధ్య ఉన్నమాట నిజమే

ఈ వైరం చైనా అంతర్యుద్ధంలోనూ, కొరియా, ఇండోచైనా, వియత్నాం, కాంగో మొదలైన ప్రాంతాలలోనూ విచిత్ర నినాదాలు లేవదీసింది పోరాటాలు జరిగినది వలసవిధానాలకూ, ప్రజాశక్తులకూ మధ్య స్వేచ్ఛ అన్నది ప్రజలపక్షాన ఉంటుంది వలసవిధానం తన శత్రువులైన కమ్యూనిజమునే అంతటా చూనన్తా ఉంటుంది అందుచేత ఇంపీరియలిస్టులు స్వేచ్ఛాకాముకులందరికీ కమ్యూనిస్టులని ముద్రవేశారు

తాము పోరాడుతున్నది స్వేచ్ఛకోసమనీ చెబితే ప్రజలు కొంతవరకైనా మోసపోతారని వారి ఆశ కాని కమ్యూనిస్టు వ్యతిరేకత 'స్వేచ్ఛ'ను పెంచటం మచ్చుకైనా ఎక్కడైనా కనిపించటం లేదు అమెరికాలో కమ్యూనిజం వేట ఫలితంగా పౌరహక్కులు తుడిచిపెట్టుకుపోతున్నాయి కమ్యూనిజంలో విశ్వాసం గలవాడు విదేశీ ఏజెంట్‌నని ప్రకటించుకోవాలనీ, కమ్యూనిస్టు పత్రికలు 'ప్రచారం' అని ప్రకటించుకోవాలనీ అమెరికాలో శాసనం ఉన్నది ఈ శాసనాన్ని అక్కడి సుప్రీంకోర్టు కూడా ఆమోదించింది

ఈ అంతర్జాతీయ భాషావంచనకు ఫలితం ఏమిటంటే నిజమైన స్వేచ్ఛాకాముకులు కమ్యూనిజంను ఆదరణతో చూడడమూ, దుష్టులూ, దుర్మార్గులూ, దుశ్శాసనులూ, ధూర్తులూ, దుండగీళ్ళూ డాలర్లు భోంచేసి దేశద్రోహులపాత్ర నిర్వహించటమూ జరుగుతున్నది

విశాలాంధ్ర దినపత్రిక 17-6-1961

## 38. కొరతకు కొరతలేని భారతదేశం

1980 నాటికి అందరికీ తిండి ఉచితంగా అందేటట్లు చెయ్యటానికి రష్యావాళ్ళు పథకం వేస్తున్నారు  అందరికీ అంటే సోవియట్‌రష్యాలో అందరికీనీ– ఇతరదేశాల్లో కాదు, మిగిలినదేశాల్లో యథాప్రకారం ధర్మం నాలుగుపాదాలమీద నడుస్తూ ఉంటుంది  ఈ నాలుగుపాదాలు ఏవీ అంటే :1)నూటికి 30 లగాయతు 80మంది వరకూ సరిఅయిన తిండి లేకా, అసలే తిండిలేకా ఉండటం, 2)కొందరికి తిండి జాస్తి అయిపోయి అజీర్ణవ్యాధులు నివారణ చేసే, ఆకలి కలిగించే మందులు తాగుతూండటం, 3)కొనగల వాళ్ళు లేక ఆహారధాన్యాలు గోదాముల్లో మురిగిపోయి, బడుగుదేశాలు దేహీ అన్నప్పుడు వాటినే మంచిధాన్యం ఖరీదుకు అమ్ముతుండటం, 4) ఏకంగా ధాన్యం తీసుకుపోయి సముద్రంలో పొయ్యటం, పందులకు వెయ్యటం, బాయిలర్లలో తగలెయ్యటం వగైరా, వగైరా  ఇవన్నీ స్ట్రిక్టుగా అర్థికసూత్రాలను బట్టే జరుగుతున్నాయి

రష్యాలో ధర్మానికి ఒక్కపాదమూ ఉన్నట్టు కనబడదు  అక్కడ కళ్ళలో ఆకలిపెట్టుకున్న వాళ్ళు లేరట– వెళ్ళొచ్చినవాళ్ళు చెప్పారు  పైపెచ్చు రష్యనులు తిండి మహాతింటారుట మన సినీనటుడు అశోక్‌కుమార్ వాళ్ళ తిండి చూసి హడలిపోయాడు  అయితే శ్రమించేవాడు ఎక్కువ తిండి హరించుకోగలడు  నడిచే వ్యాయామం కూడా లేని వాడికే 'అజీర్ణమాత్రలు' కావాలి  రష్యానుంచి మనకు వచ్చిన గోధుమలు పుచ్చిపోయినవి కావుట  అక్కడ వాళ్ళు ఆహారపదార్థాలను సముద్రంలోనూ, బాయిలర్లలోనూ పోస్తున్నట్టు పాశ్చాత్యఅభిజ్ఞులు చెప్పలేదు

బహుశా రష్యావాళ్ళు తిండిగింజలు సముద్రంలో పొయ్యకపోవటానికి ఒక కారణం ఉంది సోవియట్ వ్యవసాయం చాలా హీనస్థాయిలో ఉన్నట్టు పాశ్చాత్య నిపుణులు చెబుతున్నారు అటువంటి పరిస్థితిలో 1980కల్లా అందరికీ ఉచితభోజనం ఎట్లాపెడతారూ?

ఇది మనవంటి పామరులు సమాధానం చెప్పే ప్రశ్న కాదు  పాశ్చాత్యవిజ్ఞులు చెప్పాలి వారు చెబుతున్నదేమంటే అందరికీ తిండిగింజలు ఊరికే పంచాలంటే రష్యను అర్థికవ్యవస్థను ఇంకెక్కడో తోక తెగ్గోస్తారట  ఎలా తోక తెగ్గోస్తారు?  దానికి చాలా మార్గాలున్నాయి– మరొక అర్థికరంగంలో అర్థికనిర్బంధాలు పెట్టవచ్చుట, లేదా మరొక అర్థికరంగంలో కొనుగోలు పరిమితం చెయ్యవచ్చుట

ఈ సంగతి తెలియగానే నాకు పరమానందమయింది  జనానికి తిండి అన్నిటికన్నా ముఖ్యం మనదేశంలో అందరూ తిండి తినాలని నా గాఢ వాంఛ  నా దేశాభిమానం తరచు ఆ రూపంలో పైకితన్నుతూ ఉంటుంది  కొందరికి మంత్రిత్వం సంపాదించాలని అనిపించినట్టు

మనదేశంలో కూడా అందరికీ తిండి ఉచితంగా కాకపోయినా డబ్బుకైనా లభించే అవకాశాలు ఏమంతలేవని నేను ఇన్నాళ్ళూ దిగులుపడేవాణ్ణి పాశ్చాత్యవిజ్ఞులు నాలో ఆశారేఖ రేకెత్తించారు

అందరికీ తిండి లభించాలంటే మన ప్రభుత్వం చెయ్యవలసిందల్లా ఏమిటంటే 'ఇంకొక' ఆర్థికరంగంలో పన్నులు హెచ్చించటం, కొన్నిరకాల అమ్మకపుసరుకుల కొరత తీసుకురావటం మాటవరసకు ఏ బట్టమీదో పన్నుపెంచితే సరి, ఏ బొగ్గుల్లాటివో మాయం చేస్తే సరి! రష్యాలో అదే చెయ్యబోతారని విజ్ఞులు చెబుతున్నారు నన్నడిగితే ఈ అద్భుత ప్రక్రియ రష్యాలోకన్న మనదేశం లాంటి బడుగుదేశాలలో అమలుచెయ్యటం అత్యవసరం రష్యాలో నిరుద్యోగం లేదు ద్రవ్యోల్బణం లేదు బిచ్చగాళ్ళు లేరు "మీ తిండి మీరు కొనుక్కుని తినండి, చచ్చినట్టు!" అంటే రష్యాలో ప్రజలు నిస్పృహ చెందరు మనదేశంలో నిరుద్యోగం ప్రణాళికానుగుణంగా పెరుగుతోంది, చేసుకునేవాడికి పొలం లేదు శ్రమించేవాళ్ళకు తగినంతగా పరిశ్రమలేదు ఆహారపదార్థాల ధరలు నానాటికీ అకాశాన్నంటుతున్నాయి

దీనికి తగ్గట్టు మన ప్రభుత్వానికి పన్నులభారం హెచ్చించటానికి జంకు లేదు ఒక ఆర్థికరంగంలో కాదు, అన్ని ఆర్థికరంగాల్లోనూ 'ఒత్తిడి' తెస్తూనే ఉంది కొనుగోలువస్తువుల కొరత కూడా పుష్కలంగా ఉన్నది దేశంలో మనదేశంలో దేనికి కొరత ఉన్నా కొరతకు కొరతలేదు మన పాలకులు ఒక 'పుంజీ' పాశ్చాత్యనిపుణులను తెచ్చి వారి సూచనలు తీసుకుని, అందరికీ ఉచితంగా కాకపోతే కిందటేడు ధరలకన్నా ఆహారపదార్థాలన్నీ ఎందుకు అందేట్టు చెయ్యగూడదు? ఆర్థికసూత్రాల ప్రకారం మనకు రాదగిన దానిలో నేను నూరోవంతు కూడా అడగటం లేదు

రష్యాలో డెమోక్రసీ లేదుట అందుచేత అక్కడి ప్రభుత్వం ప్రజల అనుమతి లేకుండా కొనుగోలు వస్తువుల ధరలు తగ్గిస్తుంది దౌర్జన్యంగా తిండి ఊరికే ఇస్తుంది మనం ఈ పనులు మన ప్రభుత్వం చేత అడిగి చేయించుకోవచ్చు తిండిపదార్థాల ధరలు అదుపులో ఉంచమనటం కోరదగని కోరిక కాదు దానికి మార్గాలున్నట్టు విజ్ఞులు చెబుతున్నారు ఏమిటి ఆలస్యం?

విశాలాంధ్ర, దినపత్రిక, 6-8-1961

## 39. యువకులకు తగినంత పని ఉండాలి.

ఈ కాలపు యువకుల విశృంఖలవర్తనను గురించి చెబుతూ, ఆల్డస్‌హక్స్‌లీ వీళ్ళకు తగినంతపనీ, వ్యాపకమూ లేని కారణంచేత వీళ్ళను పురుగుతొల్చి వక్రమార్గాల నడిపిస్తున్నదన్నాడు ఇందులో చాలా సత్యం ఉన్నది నన్నడిగితే మనదేశంలో నవనాగరికత వచ్చిపడ్డాక, పిల్లలసమస్యను అర్థం చేసుకున్నవాళ్ళు లేకుండా పోయారు బ్రిటిషువారి 'చల్లని' పరిపాలనలో మనుషులు స్పష్టంగా రెండుతరగతులయారు– చదువుకుని ఉద్యోగాలు చేసి ఊళ్ళేలటానికి పుట్టినవర్గమూ – గొడ్లుకాసో, కూలినాలి చేసుకునో, ఎద్దుముడ్డి పొడుచుకునో బతకటానికి పుట్టిన వర్గమూనూ

కులాలవారీగా చూస్తే బ్రాహ్మణులలోనూ, ఆస్తిపాస్తులు గల బ్రాహ్మణేతరులలోనూ, విద్యాభిలాష ఉండేది చదువుకు తమ కుర్రతనాన్ని అంకితం చేసినవారందరూ, ఉద్యోగాపేక్ష గలవారు కాకపోయినా 'డొక్కశుద్ధి' సాకొకటి ఈ వర్గానికి ఉండేది మిగిలిన వాళ్ళు, 'వీడికి చదువెందుకులే! వీడేం ఉద్యోగం చేసి ఏడుస్తాడులే!' అని తమ పిల్లలను తిరిగినన్నాళ్ళు 'గాడిదల్లాగా' తిరగనిచ్చి, ఆ తరువాత వాళ్ళను, బలాత్కారంగానైనా ఏదో పనిలో పెట్టేవాళ్ళు, పనికి మొండికెత్తినవాళ్ళను ఇంటినుంచి తరిమేసేవాళ్ళు కూడా అతికొద్దిమంది వెనుకబడిన కులాలవాళ్ళు దూరదృష్టి, వివేకమూ కలిగి, తమ పిల్లలలో చదువుమీద అభిలాషా, ఉద్యోగవాంఛా కలిగించటం కూడా కద్దు

ఇప్పుడు పిల్లలకు చదువు అనేది సార్వజనీనమయింది కులవృత్తులు నానాటికీ దిగనాసిల్లిపోతున్నాయి పల్లెజనాన్ని పట్టణాలూ, నవనాగరికతా కన్నుగీటి పిలుస్తున్నాయి ఆ ఆహ్వానాన్ని స్వీకరించాలంటే చదువు ఒకటే మార్గం దాదాపు అందరూ ఈనాడు తమ పిల్లల చదువు గురించి– ఆడపిల్లల చదువు గురించి కూడా– ఆదుర్దా కనబరుస్తున్నారు

ఇందులో తప్పేమీలేదు ఆధునిక ప్రపంచంలో నిరక్షరులకు తావులేదు వృత్తివిద్యలు చేసుకునేవాళ్ళు కూడా కొంత కనీసవిద్య కలిగిఉండవలసిందే సవ్యమైన పరిపాలనలో అందరికీ విద్య ఉచితంగానూ, విధిగానూ లభించాలి వృత్తివిద్యలు కూడా అలా విద్యను ప్రజలకు అందుబాటు చేస్తున్న ప్రభుత్వాలు, కొన్ని దేశాలు ప్రపంచంలో ఉన్నాయిగనక మిగిలినవి వాటికన్న వెనకబడి ఉండటానికి ఒప్పవు మనదేశంలో కూడా ఇవాళ కాకపోతే రేపైనా అందరికీ ఉచితంగా విద్య లభించి తీరాలి

ఇప్పుడు సమస్య ఏమిటంటే – ఈ సంధికాలంలో పెద్దవాళ్ళు చదువుకునే తమ పిల్లలను మీదు కట్టేస్తున్నారు వాళ్ళు చదువుకుంటున్నారు గనక ఇంకేపనీ చెయ్యనవసరం లేదనీ, మళ్ళీ మాట్లాడితే చెయ్యరాదనీ, ఇతర పనులు చేస్తే పిల్లలకు చదువు అంటదనీ పెద్దవాళ్ళ అనుమానం (చదువుకూ, పనులకూ గల వైరుధ్యం సంచితం)

ఇది చాలా పొరపాటు పిల్లలు చదువుకుంటూ కూడా బోలెడన్ని ఇంటిపనులూ, పై పనులూ చెయ్యవచ్చు కొన్ని ఇతర విద్యలు కూడా నేర్చుకోవచ్చు ఎప్పుడో పరీక్షలప్పుడు తప్ప పిల్లలు పుస్తకాలు వేళ్ళకంటించుకుని కూచోనవసరం లేదు తన పాఠాలు తప్ప, ఇంకే ప్రపంచమూ ఎరుగని కుర్రాళ్ళు ఆ పాఠాలకన్న పెరగలేరు చిన్నచిన్న ఇతరవిద్యలూ, ఇంటిపనులూ చూసుకునేశక్తి సంపాదించుకునే కుర్రాళ్ళకు ఆత్మవిశ్వాసం పెరుగుతుంది చదువులో మరింత సామర్థ్యం ప్రదర్శిస్తారు

"మా అమ్మాయి కాలేజీలో చదువుకుంటోందిగాదూ? దానికి పొయి రాజెయ్యటం కూడా చాతకాదు" అనేవాళ్ళు తమ కూతుళ్ళు అప్రయోజకులని చెప్పకచెబుతారు!

"గుడ్డెద్దు చేనులోపడ్డట్టు" చదువులో మునిగిపోవటంలో చాలా నష్టాలున్నాయి మనం వీటిని చూస్తూనే ఉన్నాం చదివే చదువు ఎప్పటికైనా అయిపోకతప్పదు ఇక చదవటానికి లేకనో, డబ్బు ఇబ్బంది ఏర్పడో, అబ్బాయికి చదువుమీద విముఖత్వం కలిగో చదువుకు స్వస్తిచెప్పే రోజు వచ్చి తీరుతుంది అప్పుడు వాణ్ణి "ఇక ఏం చేస్తావురా?" అంటే వాడు గుడ్లు వెళ్ళబెడతాడు

ఈ జీవితసాగరంలో తన జీవనోపాధి ఎక్కడ ఉన్నదో వాడికి మాత్రం ఏం తెలుసు? ఆ విషయం "ఏ శాస్త్రంలోనూ కనబడదు" కాలేజీల్లో కూడా చెప్పరు

కాస్త వివేకం గల పెద్దవాళ్ళు చదువు పూర్తి అయినదాకా ఆగక 'మెట్టు' ఎక్కగానే కొడుకును "నీకేం ఉద్యోగం చెయ్యాలని ఉందిరా?" అని అడుగుతారు అదీ సులువైన సమాధానం గల ప్రశ్న కాదు ఉన్న అభ్యర్థుల్లో ఒక్కడూ మనకు ప్రాతినిధ్యం వహించదగినవాడుగా కనబడనప్పుడు ఓటెవ్వరికియ్యాలో తెలియనట్టు తన ఉద్యోగం తలుచుకుంటే కాలేజీలో చేరబోయేవాడికి అయోమయంగానే ఉంటుంది 'పడికట్టు రాళ్ళ'ల్లే ప్లీడరీ, డాక్టరీ, పంతులుగిరీ, ఆడిటరుగిరీ లాటివి కొద్దిగా కనిపిస్తాయి ఉండటానికి సవాలక్ష రకాల ఉద్యోగాలు ఉన్నాయి కాని అందులో ఏ ఒకటిగాని తనకు లభ్యమవుతుందనే ధైర్యం చదివేకాలంలో ఏ కుర్రవాడికీ ఉండదు వాడితండ్రికీ ఉండదు ఏ బియ్యేనో పాసయినాక తన అదృష్టాన్నిబట్టి జర్నలిస్టో, రిపోర్టరో, సేల్స్ రిప్రజెంటేటివో, భీమా ఏజంటో, పబ్లిసిటీ కంపెనీ ఉద్యోగో, సినిమా ప్రొడక్షను అసిస్టెంటో, మరోటో, ఇంకోటో కావటానికి ఎవడిమానాన వాడు తడువుకోవాలి

కాని, బాల్యాన్ని చదువుకోసం మీదుకట్టక తమ సహజశక్తులకు సర్వతోముఖంగా అవకాశాలు కల్పిస్తూ, తమ తమ అభిలాషలూ, అభిరుచులూ ఎటుగా ఉన్నదీ స్పష్టంగా తెలుసుకున్నవాళ్ళు జీవితంలో తమ స్థానం కోసం అయోమయంగా తడువుకోవలసిన అవసరం ఉండదు

కొందరు రచయితలుగా, కొందరు గాయకులుగా, కొందరు జంత్రవాద్యకులుగా, కొందరు చిత్రకారులుగా, కొందరు నటులుగా ఎట్లాగూ బతుకుతూనే ఉన్నారు మిగిలిన వృత్తులలో బాగా రాణించే వాళ్ళకన్నా కూడా కళలకు సంబంధించిన వృత్తులలో రాణించగలిగేవారికి ఈనాడు రాబడి కూడా హెచ్చే దబ్బుకు దబ్బూ- ప్రతిష్ఠకు ప్రతిష్ఠా అయితే ఈ కళాభిరుచికి చిన్నతనం నుంచీ దోహదం జరగాలి అచ్చగా కళకే కాక కొందరికి వడ్రంగంలో, కొందరికి ఇంజనీరింగులో, కొందరికి మొక్కల పెంపకంలో అభిరుచి ఉంటుంది

ఈ అభిరుచులు ప్రతి కుర్రవాడిలోనూ, కుర్రదానిలోనూ ఏదో ఒకరూపంలో ఉంటాయని చెప్పవచ్చు కాని అధికసంఖ్యాకులలో అవి అణగారిపోతున్నాయి వాటికి దోహదం ఏమీ జరగటంలేదు చదువుకునే కుర్రవాళ్ళు తమ తీరికకాలాన్ని, అదనపు జీవశక్తినీ ప్రేమకధలకో, సినిమా వార్తలకో వినియోగించి, సుక్షేత్రం లాగా తయారుకావలసిన బుర్రలను కుళ్ళుతోనూ, చెత్తతోనూ నింపేసుకుంటున్నారు వారిలో కలిగే ప్రేరణలు చూస్తే విచారం కలుగుతుంది జీవితం పట్ల వారికి గల అపోహలను చూస్తే భయం వేస్తుంది

నిజమే- అనేకమంది కుర్రవాళ్ళు సినిమాతారలు కావాలని పెద్దవాళ్ళతో చెప్పకుండా వచ్చి, పట్టణంలో పడిగాపులు కాస్తూ పస్తులుంటున్నారు అనేకమంది గాయకులు 'కోర్సు' పూర్తిచేసి ఒక్క రేడియోఛాన్సు కోసం, సినిమా 'ప్లేబాక్' ఛాన్సు కోసం నానా అగచాట్లూ పడుతున్నారు ఎందరో 'ఆర్టు' విద్యార్థులు ఉద్యోగాల కోసం అలమటిస్తున్నారు వీరిలో కొందరు తమకన్న అసమర్థులు తారలైపోయారనీ, ప్లేబాక్ గాయకులుగా వేలకు వేలు సంపాదిస్తున్నారనీ, ఆర్టు డైరెక్టర్లుగా పనిచేస్తున్నారనీ అనుకోవటం కూడా కద్దు

జీవితం కొంత అరాజకంగా ఉన్నమాట అబద్ధం కాదు అయినా సహజప్రతిభకు బొత్తిగా విలువలేదనుకోవటం పొరపాటు అలాటి ప్రతిభ ఉండి సరిగమలు కూడా నేర్చుకోకుండా చక్కగా 'ప్లేబాక్' పాటలు పాడుతున్నవారూ, 'ఆర్టు' నేర్చుకోకుండా పత్రికలలో అతిచక్కని బొమ్మలు వేస్తున్నవాళ్ళూ ఉన్నారు వారి సహజ ప్రతిభకు పసితనం నుంచి కొంత దోహదం జరగబట్టే వాళ్ళు డబ్బూ, కీర్తీ కూడా గడించగలుగుతున్నారు ఈ అవకాశం లేక ఎన్నిలక్షల మంది పిల్లల సహజప్రతిభ అణగారిపోతున్నదో ఎవరూ ఊహించటం కూడా సాధ్యం కాదు లక్షమంది పిల్లలలో బొత్తిగా అప్రయోజకులు పదిమంది కూడా ఉండరని నా నమ్మకం చదువురాని వాళ్ళలోనూ, కొన్ని విషయాలలో మందమతులుగా కనపడేవాళ్ళలోనూ సయితం ఏదో ఒక విషయంలో మామూలుకన్న ఎక్కువయిన శక్తులుండటం నేను చాలాసార్లు గమనించాను

పిల్లలను చిన్నతనంలో అరాజకం నుంచి కాపాడాలంటే వారికి ఇష్టమైన పనులూ, చేతనైనపనులూ చేసే అవకాశం ఇవ్వాలి పిల్లలకు జీవితం మీద ద్వేషం పుట్టకుండా చూడాలంటే వారికి అసహ్యమైన పనులు బలవంతాన చేయించటం మానాలి జీవితపు కుళ్ళుకు బీజాలు ఎంతవరకు పిల్లల లేతహృదయాలలో ఎవరూ చూడకుండా పడుతున్నాయో! హారర్ కామిక్కులు, టి వీ ప్రోగ్రాములూ, మాదకద్రవ్యాలూ అందుబాటులో ఉండటమూ, దుష్టసాంగత్య స్వాతంత్ర్యమూ గల అమెరికాలో పిల్లలు 'క్రిమినల్స్'గా మారటం మనంచూస్తున్నాం మానవ నాగరికతకు అమెరికాయే గీటురాయనుకున్న దేశాలన్నిటిలోనూ ఒక తరం తరువాత మరొకతరం తమ సహజప్రతిభలను కోల్పవటం జరగవచ్చు

విశాలాంధ్ర దినపత్రిక 3-12-1961

# 40. నిజమైన స్వేచ్ఛ సోషలిస్టువ్యవస్థ లోనే

ఈనాడు నిజమైన సోషలిస్టులెక్కడ ఉన్నారు? 'లేరు' అంటాడొక బ్రిటిషు వామపక్షీయుడు యాభై ఏళ్ళ క్రితం బ్రిటిష్ సోషలిస్టులు పెట్టుబడిదారీని ప్రతిఘటించారట ఈనాడు బ్రిటనులో సోషలిస్టులు ప్రతిఘటించటానికి స్పష్టమైనదేమీ లేదట – కేవలం మానవవాదాన్ని బలపరచటం తప్ప!

మానవవాదం ఎక్కడ లోపించింది? రష్యాలో, ఎప్పుడన్నా అమెరికా మొదలైనదేశాలలో, తరచు బ్రిటిషు టోరీ పరిపాలనలో, ఇంకా తదితరచోట్ల!

ఈ వైఖరి గల సోషలిస్టులు పెట్టుబడిదారీ విధానంతో ఏనాడో రాజీపడిపోయినారు బ్రిటనులో కార్మికులు పడే ఇబ్బందులకూ, పెట్టుబడిదారీకీ ఏమీ సంబంధంలేదని వారి ఉద్దేశం – పరిశ్రమలను జాతీయం చేయడం లేబరుపార్టీ కార్యక్రమంలోని ప్రధానసూత్రాలలో ఒకటి కాదని స్పష్టంగా చెప్పిన సోషలిస్టులున్నారు

ఇదేవిధంగా సామ్రాజ్యవాదమూ, వలసవిధానమూ యుద్ధానంతర కాలంలో నశించాయని మనస్ఫూర్తిగా నమ్మిన సోషలిస్టులూ ఉన్నారు కాంగోలోనూ, అల్జీరియాలోనూ, క్యూబా

విషయంలోనూ, బ్రిటను, ఫ్రాన్సు , అమెరికాలు చేస్తున్న దౌష్ట్యాలు కేవలం వివేచనారహిత చర్యలనీ, వలసవిధానంతో దానికేమీ సంబంధం లేదనీ వారి ఉద్దేశం

మాజీ సామ్రాజ్యవాదులు ఇకముందు ఇతరదేశాలలో తిష్టవేసి యధేచ్ఛగా ఇక పాలించ లేరన్నది నిజమే కాని ఈ పరిస్థితిలో వలసవిధానాల వల్ల కలిగే ఫలితాలను దక్కించుకునేటందుకు ఇతర పద్ధతులు ఆలోచిస్తున్నారు 'స్వేచ్ఛ' అని రొమ్ములు బాదుకుంటూ నియంతృత్వ పిశాచాలను గద్దెలెక్కించటానికి కంచుకాగడాలు వేసుకుని వెతుకుతున్నారు అటువంటి పిశాచాలు దొరికినప్పుడు వారిని పదవులలో ఉంచటానికి తగిన అంగబలమూ, అర్థబలమూ అందించి, దారుణమైన కిరాతక చర్యలకు దారితీస్తున్నారు

పెట్టుబడిదారీకీ, వలసవిధానాలకూ, అంతర్జాతీయ పైశాచిక చర్యలకూ, ఎంతో రక్తసంబంధం ఉన్నదని గ్రహించలేనివాడు 'మానవత్వం' కోసం ఎంతగా 'నెత్తీనోరూ బాదుకున్నా, తాను ప్రతిఘటించవలసినది దేన్నో తెలుసుకోలేడు

అమెరికా కోట్లకు కోట్లు మారణాస్త్రాల కోసం కేటాయించి, ప్రజోపయోగాలను వాయిదా వెయ్యటానికీ, అమెరికన్ పెట్టుబడిదారులు యుద్ధపరిశ్రమల మీద అపారమైన లాభాలు గుంజుతూఉండటానికీ సంబంధం లేదా? ఇలా మారణాస్త్రాల నిర్మాణం పెరిగిపోతే ఎప్పటికైనా, ఎవరి అజాగ్రత్తవల్లనైనా యుద్ధం రావచ్చునని 'మానవవాదులు' కూడా అంటూనే ఉన్నారుగదా?

ఈ మధ్యను ఐక్యరాజ్యసమితిలో బ్రిటను ప్రతిష్ఠ బొత్తిగా మంటగలిసిపోతున్నదని ఒక బ్రిటిషువామపక్ష వారపత్రిక వాపోతున్నది కాటంగా విషయంలో బ్రిటనువహించిన దుష్టపాత్ర అందుకు కారణం అకారణంగా ఏ దేశమూ అంతర్జాతీయరంగంలో దుష్టపాత్ర వహించదు బ్రిటిషు ధనికవాదుల స్వార్థంకోసమే బ్రిటను ఐక్యరాజ్యసమితిలో తన ప్రతిష్ఠను కడిగేసుకుంటున్నది పెట్టుబడిదారీ వలసవిధాన దుష్టపాత్రకు ఈనాడు బురఖా లేదు అందుకే సూయజ్ పైన సిగ్గుమాలిన యుద్ధం జరిగింది అంతకన్న సిగ్గుమాలిన దండయాత్ర క్యూబాపై జరిగింది తైపేలో అమెరికా నిర్వహిస్తున్న పాత్ర పరువైనది కాదు ఇండోచైనాలో కూడా అంతే

రష్యా మొదలైన సోషలిస్టు దేశాలు మానవత్వాన్ని విడిచి పెట్టేశాయని కొందరు సోషలిస్టులు దృఢంగా నమ్మదలచినప్పుడు దానికి కారణమేమై ఉంటుందని తాపీగా ఆలోచించవచ్చు వర్గవ్యవస్థలోనూ, ధనికస్వామ్యంలోనూ ఉండే స్వేచ్ఛలు వేరు వర్గరహిత సమాజంలో ఉండే స్వేచ్ఛలు వేరు పిల్లలకు ఇంట్లో ఉండే స్వేచ్ఛలు వేరు పాఠశాలలో ఉండే స్వేచ్ఛ వేరు ఉద్యోగాలు చేసుకుని నాలుగుడబ్బులు సంపాదించుకొనేవాళ్ళు రోజుకు ఎనిమిదిగంటలు తమ ఆఫీసులలో కట్టుబడి ఉంటారు అంతకంటె నిరుద్యోగంతో సతమతం కావటంలో హెచ్చు స్వేచ్ఛ ఉందని భావించరు అవసరాలు తీరేలాగా జీవించటమనేది స్వేచ్ఛ పెట్టుబడిదారీలో శ్రామికుల అవసరాలు తీరటమనేది క్రమంగా క్షీణిస్తుందని మార్క్సిజం చెప్పిన ముక్క ఈనాడు కూడా రుజువవుతూనే ఉంది సోషలిస్టులు కాగోరినవారు సోషలిస్టు వ్యవస్థలో ఎలాటి స్వేచ్ఛ ఉంటుందో స్పష్టంగా తెలుసుకోవటం అవసరం

విశాలాంధ్ర, దినపత్రిక 7-1-1962

## 41. కళలు - సంఘవిమర్శ

సంఘంలో చాలారకాల వ్యక్తులు ఏదోవిధంగా ప్రజలకు సేవచేస్తున్నవారు సయితం– ఎవరి 'బొరియల్లో' వారు కాలక్షేపం చేస్తూ జీవితాన్ని వెళ్ళబుచ్చే అవకాశం ఉన్నది రోజూ లక్షలాదిప్రేక్షకుల కళ్ళ ఎదుటా, కోట్లాది అభిమానుల మనసులలోనూ విహరించే సినిమాతారలు కూడా తమ పరిమిత ప్రపంచం దాటి పైకి చూడకుండా తమ కర్తవ్యాన్ని తాము నిర్వర్తించవచ్చు (ఈ సందర్భాల్లో నేను సినిమాతారలను, కళాకారుల జాబితాలో చేర్చడంలేదు న్యాయంగా కళాకారుల జాబితాకి చేరవలసినవాళ్ళు సినిమాడైరెక్టర్లని నా నమ్మకం ఈ విషయమై అభిప్రాయభేదానికి అవకాశం ఉన్నదనీ, కొందరు సినిమాతారలు డైరెక్టర్ల భారాన్ని కూడా ఎక్కువగానో, తక్కువగానో వహిస్తున్నారనీ ఒప్పుకుంటాను )

ఇదేవిధంగా ఉపాధ్యాయులూ, డాక్టర్లూ, ప్లీడర్లూ రకరకాల గుమాస్తాలూ, పోలీసులూ, సైనికులూ, వైమానికులూ, దుకాణదార్లూ తమతమ పరిమితమైన ప్రపంచంలో మాత్రమే నిమగ్నులై సఫలజీవులు కావచ్చు కాని కళాకారుడికి అది ఎంతమాత్రము కుదరదు మిగిలిన సాంఘిక కార్యకలాపాలు సంఘశరీరం తాలూకు అంగాలూ, ఉపాంగాలూ అయితే కళలు హృదయకోశమూ, మెదడూ, నాడీమండలమూ లాటివి

అందుచేత కళాకారుడికి జీవితం యొక్క శాఖోపశాఖలన్నిటిని గురించీ పట్టించుకునే ఓపికా, వాటి తాలూకు మంచిచెడ్డలను అర్థంచేసుకునే సమర్థతా ఉండాలి అంటే సంఘతత్వం తెలియాలి ఆనవాయితీలనూ, ఆచారాలనూ, సంప్రదాయ సిద్ధాంతాలనూ అధిగమించి కళాకారుడు ఆలోచించగలగాలి సమర్థుడైన వైద్యుడు రోగనిదానం చేసినట్టుగా కళాకారుడు సమకాలిక జీవితాన్ని చూసి అందులో కలిగే మార్పులలో వాంఛనీయమైనవి ఏవో, కానివి ఏవో, ఏ మార్పులతో జీవితం ముందుకుపోతున్నదో, ఏ మార్పులు సంఘాన్ని వెనక్కు తీసుకుపోతున్నాయో స్పష్టంగా గ్రహించగలిగి ఉండాలి "మంచి గతమున కొంచెమేనోయ్! మందగించక ముందుకడుగెయ్! వెనకబడితే వెనుకేనోయ్!" అని మహాకవి హెచ్చరించాడు కాని ఘనకీర్తిని మోసేవారు ఎందరో 'గొప్పవాళ్ళు' సంఘాన్ని వెనక్కుచూడమని ఆదేశిస్తున్నారు వర్ణాశ్రమధర్మాలూ, బ్రాహ్మణభక్తీ, దైవభక్తీ, యజ్ఞయాగాదులూ, మూఢవిశ్వాసాలూ, సనాతనధర్మమూ తిరిగి దేశంలో నెలకొంటేనేగాని సంఘం బాగుపడదని నమ్మేవారిని గొప్ప కళాకారులుగా బ్రహ్మరథం పట్టేచోట సంఘం యొక్క భవిష్యత్తు ఎటున్నదీ తెలుసుకున్న కళాకారుడికి ఎదురీత తప్పదు

రాజకీయరంగంలో కూడా ఇదే ప్రతీపశక్తుల విజృంభణ మన కళ్ళఎదుట సాక్షాత్కరిస్తున్నది సోషలిస్టు విధానాలు దేశాన్ని ఆర్థికంగా నాశనం చేస్తాయనీ, సహకారపద్ధతి ఉత్పత్తి పెరుగుదలకు హానికరమనీ, యుద్ధకూటాలలో చేరకపోవటం చేత మనదేశానికి ప్రమాదం ఉందని చెబుతూ బహిరంగసభలో వేలాదిప్రజల ముందు వేదికనెక్కి ప్రచారం చేసి జనాన్ని వోట్లు అడుగుతున్నవారున్నారు!

మూఢవిశ్వాసాలమాటకు వస్తే నిన్నమొన్న జరిగిన అష్టగ్రహకూటం గురించి ఎవరో ఉన్మాదులు చేసిన ప్రచారం తాలూకు పిరికిమందు ఆప్యాయంగా తాగితందరలాడి పారిపోయిన వాళ్ళలో విద్యాధికులూ, బుద్ధిమంతుల్లాగా ప్రవర్తించగలిగినవాళ్ళూ కూడా ఉన్నారు!

ఇక పరిపాలనారంగంలో తమ స్వార్థానికి సామాన్యప్రజల జీవితాలనూ, సుఖాన్నీ, డబ్బునూ, దేశంయొక్క భవిష్యత్తునూ బలిపుచ్చుకొంటున్నవారి సంఖ్యకు పరిమితిలేదు ప్రణాళికల కార్యక్రమాన్ని చూచుకొని ధనికవర్గం వారు కొవ్వారని నెహ్రూయే బహిరంగంగా ఒప్పుకొంటున్నాడు!

ఇవాళ మన జాతీయజీవితం చూస్తే అదొకభయంకరమైన సాంస్కృతిక శిథిలంలాగా ఉన్నది ఆర్థికంగా కప్పలూ, పాములూ ఒకే పార్టీలో కనిపిస్తున్నాయి సాంస్కృతికంగా గతించిన కళలకు పులికాపు జరుగుతున్నది దేశీయ సాహిత్య సమైక్యత సాధించటానికి తెలుగుసాహిత్యపు మణిపూస కింద చిన్నయసూరిగారి నీతిచంద్రికను జాతీయ కార్యక్రమంగా రేడియోలో ప్రసారం చెయ్యబోతున్నారు

ఈ పరిస్థితులను నిజమైన కళాకారుడెవ్వడూ సహించలేడు, కళాకారులు కొన్నివందలమంది నడుముకట్టి ఈ దుర్గమారణ్యాన్ని ఛేదించుకుంటూ పోతేగాని జీవితంలోకి వెలుగు ప్రవేశించదు బహుముఖమైన జీవితవిమర్శతో కూడుకొన్న కళలు ఈనాడు ఎంతైనా అవసరం కందుకూరివారు మొదలైన రచయితలు ఘాటుగా సంఘాన్ని విమర్శించినమాట నిజమే గాని ఈనాటి విమర్శ అంతకన్న విస్తృతంగా ఉండాలి మూఢాచారాలూ, మూఢవిశ్వాసాలూ ఒకప్పుడు సంఘపురోగమనానికి ముఖ్యప్రతిబంధకాలుగా ఉండేవి పారతంత్ర్యం ఒకటే బాహ్యశత్రువుగా ఉండేది ఈనాడు అభ్యుదయనిరోధకశక్తులు అన్నిరంగాలలోనూ అనేకరూపాలలో పొడగట్టుతున్నాయి ఈనాటి దారిద్ర్యమూ, నిరక్షరతా మొదలైనవి కృత్రిమమైనవి ప్రజాజీవితం ముందుకు పరుగులు తీయటానికి తగిన టెక్నాలజీ, సహజసంపదా లభ్యంగా ఉన్నాయి వాటి లాభాన్ని ప్రజలు పొందటంలేదంటే ఆ తప్పు మన సాంఘిక-ఆర్థిక-రాజకీయ వ్యవస్థలో ఉన్నది, కళాకారులు ఈ కనీస సత్యాన్నయినా గుర్తించినట్టయితే జీవితాన్ని సరిఅయిన విధంగా విమర్శించగలుగుతారు

విశాలాంధ్ర, దినపత్రిక, 18-2-62

## 42. కళాకారుడు - వర్గసమస్య

వర్గవ్యవస్థలో అనేకవర్గాలుంటాయి మిశ్రమ ఆర్థికతంత్రం కలిగి కొత్తగా శతాబ్దుల పారతంత్ర్యం నుంచి బయటపడిన మనదేశం లాంటి దేశంలో సమాజం అడ్డంగానూ, నిలువుగానూ కూడా విభాగం పొంది ఉంటుంది ఒక్కక్షణం ఆలోచించండి- మనదేశానికి పాశ్చాత్యులు వచ్చిననాడు ఎన్నిరకాల విభజనలున్నాయో, అన్నీ ఈనాడు ఉండటమేగాక వాటితోపాటు పాశ్చాత్యులు సృష్టించిన అన్నిరకాల విభజనలూ కూడా ఉన్నాయి అన్నీ కలిసి ఇంకా పిల్లలను పెడుతున్నాయేగాని ఉన్న గాడిగీతలు చెరిగిపోవటం లేదు- కమ్యూనిస్టు వర్గాలలో తప్ప (కుల విచక్షణ లేకుండా, వర్గవిచక్షణం లేకుండా బంధుత్వాలు కలవడమూ,

మనుష్యుల మధ్య సమైక్యత ఏర్పడటమూ, కమ్యూనిస్టుసంస్కృతి కల వారిమధ్య చూశాను చూడనివాటిని గురించి విన్నాను కూడా ఇటువంటి సంఘసంస్కరణకు కమ్యూనిస్టులే ఒరవడి పెట్టారని నేననను బ్రహ్మసమాజ సంస్కృతీప్రభావం కారణంగానూ, గాంధీజీ ఉద్బోధనల ఫలితంగానూ ఇలాటి కలగలుపులు దేశంలో చాలా కలిగాయి కాని ఆయా సంస్కృతులలో అవి అరిగి జీర్ణం కాలేదని నా విశ్వాసం ఇది నా అపోహ అయితే సంతోషిస్తాను )

నిర్దుష్టమైన బూర్జువా వ్యవస్థలో విస్పష్టమైన వర్గవిభజన కనిపిస్తుంది బూర్జువా సంస్కృతి మతసంస్కృతినీ, జమీందారీ సంస్కృతినీ తుడిచిపెట్టి, కలవాళ్ళూ, లేనివాళ్ళూ, మధ్యతరగతి అనేవి మాత్రమే ఉండేటట్టు చేయగలదు ఎక్కువ తక్కువ కులాలూ, వంశాలూ ఉండవు "చెడ్డ బ్రాహ్మణుడికన్న మంచి చెండాలుడు ఎక్కువా, తక్కువా?", "బ్రాహ్మడికి శూద్రస్త్రీ వల్ల జన్మించిన సంతానం ఎక్కువా? క్షత్రియుడికి వైశ్యస్త్రీ వల్ల జన్మించిన సంతానం ఎక్కువా?" ఇటువంటి ప్రశ్నలకు అవకాశం ఉండదు "కులమింటి కోతి"కి రోలీ విలువ ఉండదు

ఇటువంటి బూర్జువాసంస్కృతి పారిశ్రామిక విప్లవంతో పాటు పాశ్చాత్యదేశాలలోనూ, స్వాతంత్ర్యంతోబాటు అమెరికాలోనూ కొంతకాలం సాగింది కాని బూర్జువా వ్యవస్థలోని అంతస్సంఘర్షణలు తీవ్రమైనకొద్దీ బూర్జువాసంస్కృతి వెనుకడుగువేసి తాను జయించిన సంస్కృతుల అవలక్షణాలను ఆశ్రయించసాగింది

"ఇండియాను జయించేవరకూ బ్రిటిషువాళ్ళలో కులతత్వం లేదు" అని నా పాశ్చాత్యమిత్రుడొకాయన అన్నాడు అమెరికాలో బూర్జువాసంస్కృతికి బానిసలు అడ్డువచ్చారు బానిసలుగా ఉండిన నీగ్రోలు తక్కువ 'వర్గం' కావటంతో అమెరికాలో ధనికులైన తెల్లవాళ్ళూ, ధనికులైన రంగుమనుషులూ, దరిద్రులైన తెల్లవాళ్ళూ, దరిద్రులైన రంగుమనుషులూ – నాలుగురకాలు ఏర్పడ్డాయి అమెరికాలో ఫాసిజం ముదిరినకొద్దీ ఇటాలియనులూ, గ్రీకులూ, స్పానిష్‌వాళ్ళూ, తదితర శ్వేతవర్ణులూ మరొక తక్కువ తరగతి వారికింద జమకాసాగారు ఆఫ్రికా, ఆస్ట్రేలియా మొదలైన ఖండాలను ఆక్రమించిన శ్వేతజాతులవాళ్ళు బూర్జువా సంస్కృతికి పెందలాడే తిలోదకాలిచ్చి ఫాసిజం అవలంబించారు

ఇదంతా ఎందుకు తడవవలసి వచ్చిందంటే నిజమైన బూర్జువాసంస్కృతి సమాజంలోని వర్గాలను ఆర్థికంగా మాత్రమే విభజించిన వర్గరాహిత్యానికి దారిచేస్తుంది ఈ సంస్కృతి కూడా లేని స్థితిలో ఆదర్శవాదులైనవారు ఒక గొప్పధర్మాన్ని అనుష్ఠించుతున్నామనుకొని ఏ అస్పృశ్యకన్యనో వివాహం చేసుకున్నప్పటికీ వారి వివాహం సంఘం ఉక్కుపాదాలకిందపడి నలుగుతుంది ఆ వివాహం ఫలప్రదం కావటానికి తగినంత సామాజిక సంస్కృతీ, వాతావరణమూ లభించవు

అయితే ఎలాటి సంఘవ్యవస్థలో కూడా భవిష్యత్తులో ఏర్పడవలసిన సంస్కృతికి తగినబీజాలు పడే జాగాలుంటాయి కనుకనే బూర్జువాలు నడిపించిన కాంగ్రెసుపక్షం నుంచి కమ్యూనిస్టు కార్యకర్తలూ, సోషలిస్టు కార్యకర్తలూ వెలువడ్డారు కాంగ్రెసు బూర్జువా పార్టీగా మిగిలిపోక బూర్జువా వర్గీయులకు సోషలిజాన్ని ప్రధానం చేసి కమ్యూనిస్టుల పైన కత్తికట్టింది సోషలిస్టులు కూడా ఈ 'ప్రధానాన్ని' ఆమోదించలేదు దొంగలుపడ్డ ఆరునెల్లకు కుక్కలు మొరిగినట్టుగా

దేశంలో రాజగోపాలాచారి ప్రభృతులకు ఒక బూర్జువాపక్షం యొక్క ఆవశ్యకత తెలిసివచ్చింది కాని ఏం ప్రయోజనం? అప్పటికే ప్రపంచచరిత్ర– ముఖ్యంగా సోవియట్‌రష్యా చరిత్ర– సోషలిస్టు వ్యవస్థ ఉత్కృష్టతను పసిపిల్లలకు కూడా తెలియజెప్పింది ఎన్నో దశాబ్దాలుగా పెట్టుబడిదారీ విధానాన్ని అవలంబించే స్కాండినేవియా దేశాలవంటివి సయితం సోషలిస్టు విధానాలను అవలంబించాయి యునైటెడ్‌అరబ్ రిపబ్లిక్ వంటి ఫ్యూడల్ దేశాలూ, కొత్తగా స్వాతంత్ర్యం సంపాదించుకొన్న క్యూబా వంటి దేశాలూ సత్వర ఆర్థికాభివృద్ధికి సోషలిస్టు ఆర్థికవిధానాలూ, సమష్టి ఉత్పత్తి విధానాలూ అవలంబిస్తున్నాయి ఈ దశలో "పోగొట్టుకోవటానికి ఏదైనా ఉన్నవారందరూ' ఏకమై స్వతంత్రపార్టీ నెలకొల్పారు

మనకు ఏ వ్యవస్థ ఉండాలో మన సంస్కృతి నిర్ణయిస్తే మనం ఏ సంస్కృతిని అవలంబించాలో చరిత్ర నిర్ణయిస్తుంది చరిత్రకు విరుద్ధంగా ఏర్పాటుచేయాలనుకున్న సంస్కృతి వెనకడుగువేసి వికటిస్తుంది పాశ్చాత్యదేశాలలో బూర్జువాసంస్కృతి దాని బద్ధశత్రువైన ఫాసిజాన్ని బలపరచటానికిదే కారణం స్వతంత్ర పార్టీ వారికి కూడా ఈనాడు అటువంటి ఫాసిజమే శరణ్యమయింది

ఈ విషయాలు మనసులో ఉంచుకుని మనం కళాకారుడివద్దకు వద్దాం ఏ కాలంలోనైనా ఉత్తమకళాకారుడు తన పూర్వసంస్కృతి విడిచిన కుబుసంగా ఉండేకన్న భవిష్యత్తుకు బీజంగా ఉండగోరుతాడు, నిన్న తిన్న తిండి తాలూకు త్రేన్పుతో తృప్తిపడక రేపటిని గురించి కలలు కనగోరుతాడు, తన కళ్ళఎదుట ఉన్న సమాజంలో రేపు ఉండనిదేదో, రేపు మొగ్గతొడిగేదేదో నిరూపించగోరుతాడు

ఇది కళాకారుడి కనీసధర్మమైతే అతనికి చరిత్రయొక్క అవసరాలూ, అది కోరే సంస్కృతి యొక్క స్వభావమూ పూర్తిగా అవగాహన కావాలి అప్పుడు అతను ఏ వర్గం నుంచి వచ్చినవాడన్న సమస్య రాదు కళాకారుడు సమాజంలో ఉండే వర్గాలలో ఏదో ఒకదానినుంచి రావటం తప్పనిసరి అతను తనకు పరిచితమైన వర్గవాతావరణాన్ని తన కళల్లో చిత్రించటం కూడా తప్పనిసరి కాని అతని కళయొక్క ఆశయం చరిత్రగతికీ, భావిసంస్కృతికీ దోహదకారిగా ఉండటం కూడా తప్పనిసరే

ఇక్కడ కళాకారులు రకరకాల తప్పుతోవలను బట్టే అవకాశం ఉన్నది వాటిని స్థూలంగా సూచిస్తాను కళాకారుడు వ్యక్తిగతంగా అభ్యుదయవాది అయివుండిన్నీ, అప్రయత్నంగా తనవర్గం మానసిక దుర్లక్షణాలను తన కళాసృష్టిలోకి తొంగిచూడనివ్వవచ్చు ఒకప్పుడు అతను శ్రామికవర్గం పై తనకు గల సానుభూతిని చూపటానికి ఆ వర్గం పడే పాట్లను ఎగదోసి, దానికి సంబంధించిన పాత్రలను అవాస్తవికంగా చిత్రించవచ్చు ఇంతకంటే కూడా పెద్దపొరపాటు – శ్రామికులను వాస్తవంగా చిత్రిస్తున్నట్లు ఆత్మవంచన చేసుకుంటూ తనకు పరిచయం ఉన్న శ్రామికుల దౌర్బల్యాలను వర్గలక్షణాల కింద చిత్రించి, ఆ వర్గం జీవితంలోని సత్యాన్ని మరుగుపరచవచ్చు వాస్తవం ఒక కళాప్రమాణం కాదు– నిజమైన కళాప్రమాణం వాస్తవికత

ప్రజాకళలు అనేవాటిని గురించి ఒకప్పుడు తర్జనభర్జనలు జరిగాయి మనదేశంలో జనసామాన్యం అక్షరాస్యులై పుస్తకాలు చదివేవరకూ ఎవరూ సామాన్య ప్రజలకోసం పుస్తకాలు రాయలేరు ప్రొలిటేరియట్ అల్పంగా ఉండేచోట ప్రొలిటేరియన్ సాహిత్యం సృష్టికాదు అభ్యుదయకళల నినాదం వర్గాలకు అతీతమైన నినాదమే అయితే వర్గరహిత వ్యవస్థకు అది దారితీయాలి వర్గసమాజంలోని దుర్లక్షణాలను అది తీవ్రంగా విమర్శించగలగాలి ఆ విషయంలో ఉత్తమకళలు పాక్షికంగా ఉండాలి భవిష్యత్తుకేసీ, భావిసంస్కృతికేసీ, చరిత్రకేసీ మొగ్గాలి

కళాకారుడు తన కళకు ఆశయాలను తగిలించాలి గాని తన ఆశయాలకు కళలను తగిలించి జీవితాన్ని, పాత్రలనూ, వారిప్రవర్తననూ కృత్రిమంగా తయారుచేయరాదు అలా చేయటం తప్పు కాకపోతే మధ్యతరగతి సినిమారచయితలు రాజులనూ, రాణులనూ, వారి మనస్తత్వాలనూ ఊహించటం కూడా ఒప్పే అవుతుంది!

విశాలాంధ్ర దినపత్రిక, 25-2-62

## 43. కళలు- ప్రజాస్వామ్యం

కమ్యూనిస్టుల రాజ్యం వస్తే కళలన్నీ రాజకీయమయమై పోతాయని కొందరిభయం కళలు ఎప్పుడూ రాజకీయవాతావరణాన్ని ప్రతిబింబిస్తూనే ఉంటాయి సంఘాన్ని మతాలు నడిపించినప్పుడు కళల నిండా మతావేశం కనిపిస్తుంది రాజుల ఏలుబడి కింద కళలు సృష్టించేవారు రాజులసంస్కృతినీ, అభిరుచులనూ తమ కళలలో ప్రతిబింబింపజేశారు రాజుల పరిస్థితి క్షీణించి, వారు ప్రజాశత్రువులుగా మారేదశలో కవులు వారిని తిట్టిపోశారు సంఘధర్మం కాలప్రభావం చేత పరివర్తన చెంది కొత్తధర్మం ప్రజల ఎదుట సాక్షాత్కరించినప్పుడు కళాకారులు కొత్త ఆదర్శాలను పైకెత్తారు గాంధీజీ ఉద్యమాల ప్రభావంతో అస్పృశ్యులనూ, దీనులనూ దేవతల కింద చిత్రిస్తూ రచనలూ, కవిత్వాలూ బయలుదేరాయి యంత్రనాగరికత వలసవిధాన రూపంలో మనపైకెక్కి సవారీ చేసిన కారణంచేత ఆ నాగరికతను గర్హిస్తూ కళలు పుట్టాయి జాతీయభావాలు తలెత్తేసరికి మన కవులకు గతచరిత్రలోని సువర్ణ ఘట్టాలపైనా, జానపదగేయాల పైనా, పల్లెజీవితం పైనా అపారమైన ప్రేమ పుట్టుకొచ్చింది ఇందులో అస్వాభావికమైనది ఏదీ లేదు అటువంటి కళలు ప్రజలకు చేయవలసిన మేలు చేయటమే గాక జాతియొక్క సాంస్కృతిక చరిత్రలో మైలురాళ్ళ లాగ నిలిచిపోయాయి

కమ్యూనిస్టుల చరిత్రలో ఇలాటి మైలురాళ్ళు ఉండరాదని ఎందుకనుకోవాలి?

రాబోయే కమ్యూనిజం మాట అటుంచి, ఈనాడు మనకున్న- కనీసం ఉన్నదనుకుంటున్న - ప్రజాస్వామ్యం తాలూకు సాంస్కృతిక చరిత్రతీసుకుందాం

మనకు రాజకీయంగా ప్రజాస్వామ్యం సిద్ధించకముందే ప్రజాస్వామ్యసంస్కృతి అలవడింది (రాజకీయాలకన్నా సంస్కృతి రెండడుగులు ముందుకు ఉండటం పరిపాటే) దేశం స్వాతంత్ర్యం అయి ప్రజాప్రభుత్వాలు ఏర్పడటానికి దాదాపు అర్ధశతాబ్దం ముందుగానే గురజాడ అప్పారావుగారూ, వీరేశలింగం గారూ సామాన్యప్రజలనూ, వారి జీవితాలనూ, వాటిలోని

సమస్యలనూ గురించి నాటకమూ, నవలా, గీతాలూ, నాటికలూ, కథలూ మొదలైనవి రచించారు వాటి తరవాతనే దురభిమానాన్ని రెచ్చగొట్టే చారిత్రక నవలలూ, పద్యాలూ అవీ వచ్చాయి నిజానికవి ప్రజాస్వామ్యాన్ని ప్రతిబింబించే రచనలు కావు భావకవిత్వం వ్యక్తియొక్క విశిష్టతను చాటినమాట నిజమేగాని భావకవిత్వంలో అవతరించిన వ్యక్తులు కొంతవరకు విశిష్టవ్యక్తులు

ఆ మాటకువస్తే సోషలిస్టు సాహిత్యంలో కూడా నాయకుడు విశిష్టవ్యక్తిగానే ఉంటున్నాడు అయితే ఈ విశిష్టవ్యక్తి జనసామాన్యానికి చెందినవాడై ఉండటం అవసరం భావకవిత్వపు నాయకులు జనసామాన్యానికి విలక్షణంగా ఉన్నవారనాలి

భావకవిత్వం మాట ఎలా ఉన్నా మనదేశంలో– ముఖ్యంగా తెలుగులో– జనసామాన్యానికి చెందిన సాహిత్యం పుష్కలంగానే వచ్చింది ఇందులో కొంత పాశ్చాత్య ప్రభావజనితం కావచ్చు అయినప్పటికీ రాజు–రాణుల కథలూ, అపూర్వవ్యక్తుల అద్భుతగాధలూ, భక్తిరచనలూ, అలౌకిక సాహిత్యమూ వెనకపడ్డాయి వర్తమాన సాహిత్యమంటే ప్రజాజీవితానికి చెందినదేననే మాట స్థిరపడిపోయింది దీనికి భిన్నంగా కొంతసాహిత్యం వెలువడినప్పటికీ దాన్ని గురించి అంతగా పట్టించుకున్నవారు లేరు చివరకు ఈ ప్రజాసంస్కృతి సినిమాలకు కూడా ఎగబాకి గూడవల్లి రామబ్రహ్మం గారు, వై వి రావుగారు, బి ఎన్ రెడ్డి గారు, హెచ్ యం రెడ్డిగారు మొదలయినవారు సాంఘికచిత్రాలు తయారుచేశారు

కాని దేశం స్వాతంత్ర్యం సంపాదించిన అనంతరం చాలారకాల ప్రజాస్వామ్య వ్యతిరేకశక్తులు ఒక్కొక్కటే తలయెత్తినట్టుగా కనిపిస్తుంది వీటి ప్రభావం కళలలో కనిపిస్తూ వస్తున్నది ప్రజాస్వామ్యం పైన ధనికస్వామ్యం పెత్తనం సంపాదించుకున్నది కళలు వ్యాపారస్తులకు అమ్ముడుకావటం భారీఎత్తున సాగింది కళలకు సినిమాలూ, పత్రికలూ అతిముఖ్య వాహకాలైనాయి

పెట్టుబడిదారులు కళాకారులకూ, ప్రజలకూ మధ్య పెట్టని గోడగా తయారుకావటమే గాకుండా కళాకారులకు కళాప్రయోజనం లేకుండానూ, ప్రజలకు కళలు–వినోదానికి తప్ప– ఉపకరించకుండానూ చేశారు సినిమా చిత్రాలలోకి బూజుపట్టి, మూలపడిన పౌరాణిక కథలు తిరిగిఅవతరించాయి ఏ యుగానికీ, ఏ దేశానికీ చెందని జానపదకథలు ముమ్మరంగా వచ్చాయి సంఘానికీ, వ్యక్తులకూ ఎటువంటి సంబంధమూ లేని సాంఘికచిత్రాలు బయలుదేరాయి పత్రికలలో పదింట తొమ్మిది అబ్బాయి–అమ్మాయి కథలు

'సాహిత్య'రంగం అనదగిన దానిలో కూడా 'శవాల' పునరుజ్జీవనం జరిగింది దీనికి ప్రబలకారణం అభ్యుదయోద్యమమేనని నా దృఢవిశ్వాసం నవ్యసాహిత్య పరిషత్తుకూ, అభ్యుదయ రచయితల సంఘానికీ మధ్య దోస్తీ బలపడగానే కొందరు నవ్యసాహిత్య పరిషత్పుభాగ్రేసరులు – ఒకప్పుడు సాహితీసమితి ద్వారా పాతసాహిత్యం పై విప్లవం సాగించినవారే– తమకు వాడుకభాషలో నమ్మకంలేదని వంకపెట్టి, గిడుగువారిపై అత్యాచారం చేసి సాహితీసమితిని పునరుద్ధరించారు!

ఈ తిరోగమనం ఆశ్చర్యకరంగా అనుయాయులనూ, ఆమోదకులనూ సంపాదించుకున్నది ఇటీవల శ్రీ విశ్వనాధసత్యనారాయణ గారి రామాయణకల్పతరువు గురించి జరిగే తర్జనభర్జనలు

ఈ వాతావరణంలో జనించినవే ఒక మిత్రుడు చెప్పినట్టు కల్పతరువును విమర్శించేవారూ, సమర్థించేవారూ కూడా ఒకే సంస్కృతికి ప్రతినిధులు

ఈ సంస్కృతియొక్క ప్రభావంతోనే ఒక సాహిత్య పత్రిక అభ్యుదయకవులమీదా, సాహిత్యం మీదా పేడనీళ్ళు చల్ల ప్రయత్నించింది శ్రీశ్రీ, గురజాడ వంటి వారికి తారుపుయ్యటానికి ఇంత కృషి జరుగుతుందని ఏ 1939లోనో ఎవరన్నా అంటే ఒక్కరు కూడా నమ్మి ఉండకపోదురు!

ప్రజాస్వామ్య సంస్కృతిని ప్రతిబింబించే కళలకు పురుగుముట్టటం ఒక గొప్ప సంస్కృతి కాదు అసలు ప్రజాస్వామ్యానికే వేరుపురుగులు దాపురించాయి- వాటి నగ్నస్వరూపం ఇటీవల జరిగిన ఎన్నికలలో ప్రత్యక్షంగా కనబడింది

ఎన్నికలలో పోటీ చేస్తున్నవారిలో అనేకులు తమ పార్టీల ఆదర్శాలనూ, ఆశయాలనూ పాటించక తమ విజయం కోసం అడ్డమైన గడ్డీ కరిచారు, తమ పార్టీ అభ్యర్థులకే ద్రోహం చేశారు ప్రొహిబిషన్ సారా ఏరులైపారింది! ఒకరి ప్రచారాన్ని ఒకరు రౌడీలతో అడ్డగించారు అభ్యర్థులు ప్రత్యర్థుల మనుషులకు కత్తులూ, తుపాకులూ చూపారట ఎన్నికలకు వోట్లు వేసే బూత్‌ల దగ్గర కొందరు అభ్యర్థుల మనుషులు గంద్రగొడ్డళ్ళు పట్టుకుని నిలబడి ప్రత్యర్థుల మనుషులను రాకుండా చేశారుట! తన ప్రత్యర్థులను ఓడించి ఎన్నికైన ఒక అభ్యర్థికి తన సొంత నియోజవర్గంలో వోట్లే పడలేదుట! ప్రచారకుల తలలు పగలగొట్టారు ఇటువంటి అత్యాచారాలు జరగకుండా చూడటానికైనా సమర్థత -లేక ఉద్దేశం- లేని పోలీసులతో ప్రజాస్వామ్యం ఏం నెలకొంటుంది?

పత్రికలలో అత్యధికసంఖ్య గల పత్రికలు ప్రజాస్వామ్య శత్రువులుగా ఎన్నికలలో బయటపడ్డాయి అప్పటిదాకా పండితనెహ్రూకు సాంఘికశక్తుల నిజస్వరూపం అవగాహన కాలేదు అయినా నలుగురు కాంగ్రెసు పెద్దలతోబాటు ఆయనకూడా కాంగ్రెసు విజయానికి చాలా తృప్తిపడ్డాడు! ఎన్నికలు ఎలా జరిగాయో తెలిస్తే ప్రజాస్వామ్యాభిమాని ఎవడైనా విచారించవలసిన సంగతి! ఇందుకు అచ్చగా ప్రజాశత్రువులనే నిందించపనిలేదు ఇది ప్రజలకూ, ప్రజాశత్రువులకూ మధ్య జరగవలసిన సంఘర్షణ ప్రజల రాజకీయ అజ్ఞానమూ, మూఢవిశ్వాసాలూ, ప్రజాశత్రువుల అసలు ఆయుధాలు అందుకే కొన్నిచోట్ల అభ్యర్థులు ఓటర్లవద్దకు వెళ్ళి తమకే ఓటు ఇస్తామని వారిచేత ఘోరప్రమాణాలు చేయించారు కొన్నిచోట్ల స్త్రీలకు చీరెలు పంచిపెట్టి వోట్లు అడిగారు ఇవన్నీ అలా ఉండగా ఏ అభ్యర్థి అయినా తన ప్రత్యర్థులను 'కొనేసి' ప్రజల వోట్లతో ప్రమేయం లేకుండా 'ఎన్నిక' అయ్యే అవకాశం ఉండనే ఉన్నది

ప్రజాస్వామ్యం దుర్బలంగా ఉండబట్టే ఎన్నికలలో కులతత్వమూ, మతతత్వమూ విలయతాండవం చేశాయి పరీక్షలలో కనీసపు మార్కులతో పాసయిన విద్యార్థిలాగా తమకు ఏదో అవకాశం దొరికిందని సంతోషించే కాంగ్రెసుకు అనేకచోట్ల ప్రతిపక్షంగా ప్రజాస్వామ్య వ్యతిరేక పక్షాలు తయారయాయి ప్రజాస్వామ్యం ఇదేవిధంగా పురుగునాకిపోతే ఈ పార్టీలే రేపు ప్రభుత్వాలు కూడా నిర్వహిస్తాయి

ఇటువంటి దుష్టపరిణామాల ప్రభావం మన కళలలో ప్రతిబింబించకుండా ఉంటుందా? ఈ ప్రభావాన్ని ప్రతిఘటించే బాధ్యత అభ్యుదయకళాకారుల పైన ఉన్నది

విశాలాంధ్ర, దినపత్రిక 11-3-1962

# 44. లౌకికజీవితంలో ఆధ్యాత్మికవాదం!

కళల్లో భౌతికవాదానికి మాత్రమే చోటున్నదని కిందటివారం రాశాను నిజానికి ఈనాటి కళల్లో, ముఖ్యంగా సాహిత్యంలో, భౌతికవాదమే హెచ్చుగా కనిపిస్తుంది ఇందుకు భిన్నంగా కొట్టవచ్చినట్టు కనబడేవి సినిమాలు మాత్రమే

మన సినిమాలలో ఆధ్యాత్మికశక్తుల విజృంభణ మనం తరచు చూస్తూ ఉంటాం ఏచిత్రంలోనైనా ఆధ్యాత్మికశక్తుల విజృంభణ ఏమాత్రమూ కనిపించకపోతే మనకు సినిమా చూచినట్టే ఉండదు సాధారణంగా ఈ ఆధ్యాత్మికశక్తులు కథానాయకుని వెన్నంటి ఉంటాయి (ఇలాటి శక్తులను వెంటబెట్టుకు తిరిగేవారిని ఆధ్యాత్మికశాస్త్ర పరిభాషలో 'సెన్సిటివ్'లూ, 'మీడియమ్'లూ అంటారు ) కథానాయికకు అన్యాయం జరిగే ఘట్టాలలో పిడుగుల చప్పుళ్ళూ, మెరుపుల కాంతులూ సాగుతాయి భూమి దద్దరిల్లిపోతుంది ఒకప్పుడు అటూ ఇటూ ఒరిగిపోతుంది ఒక్కొక్కప్పుడు (స్టాక్ షాట్లు లభ్యమైతే) మేఘాలు సుళ్ళు తిరుగుతాయి అగ్నిపర్వతాలు బద్దలై లావా ప్రవహిస్తుంది పులులూ, సింహాలూ పరుగెత్తుతాయి ఇవి 'ఫిజికల్ మానిఫెస్టేషన్స్' అన్నమాట

సినిమాలలో టెలిపతీ కూడా ఉంటుంది తన భర్త అయిన హీరోను ఎవరన్నా నెత్తిమీద ఒకటి పెట్టగానే, ఆ దెబ్బ పతివ్రత అయిన హీరోయిన్‌కు ఎంతదూరాన ఉన్నా సరే, వినిపించి కంగారుగా లేస్తుంది ఒక్కొక్కసారి కెవ్వున అరుస్తుంది రక్తంకారుతూ పడిపోయిన భర్త ఎదురుగా ఉన్నట్టే నీరుకారే కళ్ళతో బిత్తరచూపులు చూస్తుంది మరీ క్లయిమాక్సు ఘట్టమైతే పరుగెత్తుకుంటూ సూటిగా తన భర్త పడిఉన్న చోటికో, అతన్ని చేర్చిన ఆస్పత్రికో, జంత్రవాద్యాల రొదచేత తరమబడుతూ వచ్చివాలుతుంది

పతివ్రత అయిన హీరోయినులేగాక మాతృమూర్తులైన తల్లులూ తండ్రులూ కూడా ఆధ్యాత్మికశక్తులు ప్రకటించటం మనం చూస్తున్నాం– జీవితంలో కాదు, సినిమాల్లో సినిమాలలో ఆధ్యాత్మికఫినామినాకు భౌతికకారణం లేకపోలేదు అది బాక్సాఫీసు ఆధ్యాత్మికశక్తులు డబ్బుగుంజుతాయి సినిమాలలో పాత్రపోషణకూ, క్లయిమాక్సుల ఎగదోతకూ ఆధ్యాత్మికశక్తులను నల్లమందులాగా వాడి చిత్రనిర్మాతలు జనాన్ని ఏ స్థితికి తెచ్చారంటే, సత్యజిత్‌రాయ్ పిక్చర్లు ఎవరూ చూడటంలేదు, నాస్తికులు తప్ప

ఇదే దుస్థితి మన రాజకీయనాయకులకు పట్టింది స్వతంత్రభారతం పుట్టినది మొదలు ప్రతిరాచకార్యానికీ పంచాంగాలు చూసి ముహూర్తాలు పెడుతున్నారు తూతూ మేళాలు వాయిస్తున్నారు కట్టని ప్రాజెక్టులక్కూడా సుముహూర్తంలో మంత్రోక్తంగా తూతూ మేళయుక్తంగా శంకుస్థాపనలు జరుగుతున్నాయి ప్రతిరోజూ మనం కాఫీటైం మ్యూజిక్ కింద శ్రీ వెంకటేశ్వరసుప్రభాతమ్, యెడ్లరామదాసు కీర్తనలూ, అన్నమాచార్య కృతులూ, భజగోవిందం పాటలూ, అవీ, ఇవీ, ఏవేవో విని పుణ్యం సంపాదిస్తున్నాం మనచెవుల్లో ఇంత భక్తిరసం డబ్బు ఖర్చుచేసి పోస్తూ మన పాలకులు నాస్తికుల్లాగా ప్రవర్తించటం సాధ్యమవుతుందా?

అందుచేత 'సామాన్యుడు' మన కొత్తమంత్రులు తిరుపతి వెంకటేశ్వరస్వామి సాన్నిధ్యానికి వెళ్ళినందుకు అవహేళన చేసి ఏమీ ఉపయోగం లేదు సినిమా హీరోయిన్‌కు పాతివ్రత్యం

ఎంత అవసరమో మన మంత్రులకు భగవద్భక్తి అంత అవసరమనీ, మంచి కాంగ్రెసు అభ్యర్థి అయినవాడు టిక్కెట్టు దొరకటానికి ఒక మొక్కు, ఓట్లు పడటానికి ఒక మొక్కూ, మంత్రో, మంత్రి కాని మంత్రో, ఉపమంత్రో కావటానికి మరొక మొక్కూ, మొక్కుకుంటాడని జనం భావిస్తారు (కృష్ణమీనన్ కమ్యూనిస్టుల సహాయంతో గెలిచాడని సోదరుడు రమణారెడ్డి అంటే అనుగాక దేవుడు లేడూ? ఒకవేళ కృష్ణమీనన్ ప్రచ్ఛన్నకమ్యూనిస్టూ, నాస్తికుడూ అయి తాను మొక్కుకోక పోవచ్చుగాక ఆయన తరఫున ఏ కాంగ్రెసు అభిమానీ ముడుపులు కట్టలేదని రమణారెడ్డి గుండెమీద చెయ్యివేసి చెప్పగలడా? కృష్ణమీనన్‌కు వ్యతిరేకంగా ప్రచారించిన కాంగ్రెసు వాళ్ళున్నప్పుడు, కృష్ణమీనన్ విజయం కోసం శ్రీ వెంకటేశ్వరస్వామివారి ముడుపులు కట్టిన కాంగ్రెసువాళ్ళు ఎందుకుండగూడదూ?)

చెప్పవచ్చిందేమంటే మంత్రులు ముడుపు చెల్లించుకునేటందుకు తిరుపతి వెళ్ళివుంటారు ముడుపులు కట్టగానే సరా, వాటిని చెల్లించాలి వ్యక్తిగతంగా కట్టుకునే ముడుపులను మంత్రిగతంగా ఎందుకు చెల్లించాలి? అందుకయే ఖర్చు ప్రజలెందుకు భరించాలీ అనవచ్చు ప్రజలు భరించకతప్పేదేముందీ? ఇకనుంచీ జరిగే మూడు ఎలక్షనుల్లో గెలిచిన కాంగ్రెసు అభ్యర్థులందరికీ మంత్రిత్వాలుంటాయని ఒక స్టాటిస్టిక్స్ ప్రవీణుడు అంచనా వేస్తున్నాడు శుభం

అది అలా ఉంది ఈ గెలిచినవారిలో కొందరు పెట్రోలుకయితేనేం, సారాకయితేనేం, పైఖర్చులకయితేనేం ఎంతో ద్రవ్యం ఖర్చుచేశారు ఆమాటకు వస్తే ఓడినవారూ ఖర్చుచేశారు కనీసం గెలిచినవారు చేసినఖర్చయినా రావాలికదా సినిమా పరిశ్రమలో పెట్టుబడి తిరిగిరాకపోతే పరిశ్రమ మూలబడటం ఎంతఖాయమో, ఎలక్షనుఖర్చులు రాకపోతే ఎన్నికలు మూలబడటం అంతే ఖాయమనుకోవాలి మరి ఈ దబ్బు ప్రజలనుంచి రాక ఎవరినుంచి వచ్చేట్టూ? మంత్రిత్వాలు దొరకవనే ఉద్దేశ్యంతో కమ్యూనిస్టులు ముందుగానే ఎలక్షనుఫండు ప్రజలనుంచి వసూలు చేసేశారు మరి ఇతరులమాటా, వారికి పెట్టుబడి చేసినవారి మాటా ఏమిటి? భయపడకండి, అదంతా ప్రజలే ఇచ్చుకుంటారు

ఇప్పుడెలాగూ మంత్రులకు ఇల్లు ఎలవెన్సూ, కారు ఎలవెన్సూ, కానుకలు వగైరా పుచ్చుకునే ఎలవెన్సూ, ఆశ్రితులకు పదవులిచ్చే ఎలవెన్సూ, ట్రావెలింగ్ ఎలవెన్సూ, వేదికలెక్కి నాన్సెన్స్ మాట్లాడే ఎలవెన్సూ మొదలైన ఎలవెన్సులున్నాయి వాటితోపాటు ఒక పుణ్యం ఎలవెన్సు కూడా ఏర్పాటుచేస్తే తీర్థయాత్రలూ అవీ చేసుకోవచ్చు

కాకపోతే ఈ పుణ్యకార్యాచరణలో ఒకటే చిక్కున్నది ప్రతిదేశీయ నిర్మాణాన్ని వేదపఠనంతో ఆరంభించే మనప్రభుత్వం సోషలిస్టు వ్యవస్థ ఏర్పాటుచేసే భారం దేవుడికి వదిలేస్తుందేమోనని తెలిసినవాళ్ళు భయపడవచ్చు ఈశ్వరసంకల్పం వల్ల సోషలిస్టు వ్యవస్థలు ఎక్కడా ఇంతవరకూ ఏర్పాటైనట్టు కనబడదు పరోక్షంగా ఈశ్వరుడున్నాడేమోగాని, ప్రత్యక్షంగా మనుషులు తమ చెమటా, రక్తమూ, ప్రాణాలూ ధారపోసి సోషలిజం వ్యవస్థాపించారు ప్రతిరెండోవాక్యానికీ కళ్ళుతేలవేసి, ఆకాశాన్నిచూసి ఈశ్వరుణ్ణి స్మరించేవారు సోషలిస్టువ్యవస్థకు పరమశత్రువులపాత్ర నిర్వహించటమే జరుగుతూ వస్తున్నది అదేవిధంగా, ఈశ్వరవాదులు కులతత్వాలు పోతేనే

భరించలేరే, తమ వర్గతత్వాలు పోతే భరిస్తారా? 'చాతుర్వర్ణం మయా సృష్టం' అని భగవంతుడు చెప్పనేచెప్పాడాయె సంజీవరెడ్డి మంత్రివర్గాన్ని అప్పుడే 'రెడ్డిరాజ్యం' అని గిట్టనివాళ్ళు అంటూ ఉండిరి ముఖ్యమంత్రి పదవి సంపాదించుకున్నా కూడా 'సంజీవయ్య'కు 'హరిజన'బిరుదు ఊడకపోయె (పాపం హరిజనుడు గదా అని మంత్రిగా వేసుకోదలచినట్టుగా సంజీవరెడ్డిగారు పత్రికావిలేఖరులతో మాట్లాడినట్లు ధ్వనించింది) కులం అటుంచి వర్గాలన్నీ ఏకమైతే ఎన్నికలకు కావలసిన 'సంచులు' ఎవరు అరువిస్తారు? లక్షలమంది మీద సారా వగైరా పోయించేదెట్లా?

ఇవి దేశీయులకు కలిగే సంశయాలు ఇక విదేశీయుల మాట చెప్పనే అక్కర్లేదు మనదేశంలో ప్రభుత్వపరంగా జరిగే పనులను ఒక ఏడాదిపాటు చూసిన విదేశీయుడికి, "ఇది హిందూరాజ్యం ఎందుకు కాదు?" అని అనుమానం వస్తే వాడి తప్పా?

మనం ఎప్పటికో సోషలిజం అవలంబించబోతాం కాని ఏనాడో సోషలిజం వ్యవస్థాపించు కున్న రష్యను టెక్నీషియనులు భిలాయ్‌లో జరిగిన తంతు చూసి నిర్ఘాంతపోయారు ప్రతిపనికీ వర్జ్యం చూడటమూ, మంత్రాలు చదవటమూ, కొబ్బరికాయలు కొట్టటమూ, హారతివెలిగించటమూ ఇదంతా వారికి ఆటవిక కర్మకాండలాగా కనిపించి ఉండాలి ఇటువంటి తంతంతా రూర్కెలాలో కూడా జరిగిందేమో మరి పట్టలేక ఒక జర్మనువాడు భారతీయులకు కావలసింది ప్రాజెక్టులు కావనీ, విషవాయువనీ అనేశాడు అక్కడ కఇంకా భారతీయులను ఆటవికులవలెనే చూస్తున్నట్టు కనిపిస్తుంది మనం అలాంటి అవమానకరమైన మాటలకు మన నిరసన తెలిపాం బాగానే ఉంది ఆ తరువాతనైనా కొంచెం ఆత్మపరీక్ష చేసుకుంటే బాగుంటుందేమో

విశాలాంధ్ర, దినపత్రిక, 25-3-1962

# 45. మానవుడి శాంతిహక్కు

పురాణాలలో వర్ణించిన రాక్షసచర్యలనూ, వాళ్ళు తెచ్చిపెట్టే ఉపద్రవాలనూ నిన్నమొన్నటిదాకా మనం అతిశయోక్తుల కింద, కల్పనకింద కొట్టిపారేసేవాళ్ళం కాని ఈనాడు వాటిని మించిన రాక్షసశక్తులనూ, పాశుపతాస్త్రాన్ని తలదన్నే హైడ్రోజన్‌బాంబులనూ, వాటిని ఎంతదూరమైనా పంపకం చెయ్యగల శాస్త్రసామగ్రినీ కళ్ళారా చూస్తున్నాం

భూమిని బొగ్గు కణికలాగా చేసి మానవజాతినే నిర్మూలనచేయటానికి సరిపడినంత అణ్వస్త్రసామగ్రి తయారైఉంది యుద్ధయత్నాల కింద ప్రపంచదేశాలు రోజుకు కొన్నికోట్లు కేటాయిస్తున్నాయి ఈనాడు ప్రపంచంలో నిజమైన ప్రజాతంత్రం అంటూ ఉంటే ఇలాటి అమానుషమైన యుద్ధయత్నాలు ఇంత బాహాటంగానూ, భారీగానూ జరగవని లోకజ్ఞానం కలవాడెవడైనా అనుకుంటాడు

ఈ మహామారణసామగ్రి దేన్ని రక్షించటానికి, లేక దేన్ని శిక్షించటానికి అని అడిగేహక్కు అందరికీ ఉన్నది ఈనాటి అంతర్జాతీయ పరిస్థితినిబట్టి ఒక పక్క సోషలిస్టుదేశాలూ, ఇంకోపక్క వలసవిధానాన్ని అమోదించే దేశాలూ ఉన్నాయి ఈ రెండోపక్షంవారి పెట్టుబడిదారీ విధానాన్నీ, వలసవిధానాన్నీ, నియంతృత్వాన్నీ, హేయమైన దుష్పరిపాలననూ కూడా సమర్థించుకుంటూ

తమపక్షాన అణ్వస్త్రాలను ఉంచుకోవటాన్ని బట్టి ఈపక్షం వారు ప్రజలమేలును రక్షించటానికి వినియోగించారన్న నైతికసత్యం స్పష్టమవుతున్నది

సోషలిస్టుదేశాలలో ఇప్పుడు రష్యాకుమాత్రమే అణ్వస్త్రాలున్నాయి కాని అవసరం వస్తే రష్యా, తోటి సోషలిస్టుదేశాల ఆత్మరక్షణకు వాటిని ఇవ్వవచ్చు కాని సోషలిస్టుదేశాలు కూడా అణుయుద్ధాన్ని తెచ్చిపెట్టవచ్చునని కొందరింకా నమ్ముతూ, ఉభయపక్షాలకూ సమమైన ఉన్మాదం అంటగడుతున్నారు అయితే గడచినపదేళ్ళచిల్లర కాలంలో శాంతి ఉద్యమం కమ్యూనిస్టు ఉద్యమంగా భావించబడింది అంతర్జాతీయ సమావేశాలకు తమదేశపు ప్రతినిధులను వెళ్ళకుండా అడ్డంకులు కల్పించినది పెట్టుబడిదారీదేశాలు అలాంటి ప్రతినిధు లకు పాస్‌పోర్టులు నిరాకరించిన ఘనత మన ప్రభుత్వం కూడా కొంత గడించుకొన్నది శాంతిసభలు ఎంత చిన్నవి జరిగినాసరే సిఐడీలు గుత్తులు గుత్తులుగా చేరేవారు! శాంతి ఉద్యమంలో కమ్యూనిస్టు ప్రమాదం చూసినవారున్నారనేది చరిత్రప్రసిద్ధమైన విషయం

శాంతిరక్షణా, నిరాయుధీకరణా, అణ్వస్త్రనిషేధమూ మొదలైనవాటిని గురించి రష్యాచూపుతున్న ఆసక్తి జగద్విదితం పశ్చిమరాజ్యాలు తాత్సారం చెయ్యటమూ, అడ్డుపుల్లలు వెయ్యటమూ మాత్రమే చేస్తున్నాయి శాంతిచర్చలు సఫలం కావడం పశ్చిమరాజ్యాల ఆశయం కాదని అమెరికన్ పత్రికలు బాహాటంగానే చెబుతున్నాయి

అయితే ఈ విషయం ప్రపంచానికి తెలియటం ప్రమాదకరం ప్రపంచానికి ఉపద్రవం తెచ్చిపెట్టటం తప్ప పశ్చిమరాజ్యాలకు వేరొక రాజకీయతంత్రంగాని, సమర్థనగాని లేదంటే ప్రపంచప్రజలంతా అటువంటి విధానాన్ని తీవ్రంగా ప్రతిఘటిస్తారు ఈప్రమాదం గుర్తించి ఒక అమెరికను 'మేధావి' రష్యాకు కూడా నిరాయుధీకరణ ఇష్టంలేదని ఒక వదంతివేశాడు శాంతికాముకులైన కమ్యూనిస్టువ్యతిరేకులు ఈ ఎరను గాలంతో సహామింగారు

అయితే కమ్యూనిస్టు వ్యతిరేకతకూ, శాంతికాముకత్వానికీ ఉండిన వైరుధ్యం క్రమంగా మంచువిచ్చినట్టు విచ్చిపోతున్నది అణ్వస్త్రాల మహామారణమంటూ వస్తే అది పశ్చిమరాజ్యాలకూ, సోషలిస్టుదేశాలకూ మధ్య వస్తుంది సోషలిస్టుదేశాలను నాశనం చెయ్యటానికి పశ్చిమరాజ్యాలు ఈ అస్త్రాలను ప్రయోగిస్తాయి ఆత్మరక్షణకుగాను సోషలిస్టుదేశాలు ఎదురుదెబ్బ తీస్తాయి

సోషలిస్టు ఆర్థికవిధానానికీ, పెట్టుబడిదారీ విధానానికీ మధ్య వైషమ్యమే ఉండాలంటే దాన్ని ఆర్థికపోటీగా మార్చుకుందామని రష్యా ఏనాడో సూచించింది పెట్టుబడిదారీదేశాలన్నీ మలేరియాలాంటి ఆర్థికమాంద్యంతో బాధపడుతున్నాయి వాటిలో ఆర్థికాభివృద్ధి మందకొడిగా ఉన్నది నిన్నమొన్నటి దాకా పశ్చిమజర్మనీని చూపించి 'పెట్టుబడిదారీ విధానంలో పశ్చిమ జర్మనీ ఎలా పురోగమిస్తున్నదో చూడండి" అన్నారు ఇప్పుడు అక్కడ కూడా 'అజీర్తి' ఆరంభమయింది సోషలిస్టు దేశాలలో ఆర్థికాభివృద్ధి లేదని పశ్చిమదేశాల పత్రికలు వ్యాసాలు కూడా రాశాయి అయితే ఈ యుద్ధయత్నాలన్నీ ఎందుకు? లక్షలాదికోట్ల యుద్ధయత్నాలెందుకు?

ఈనాడు ప్రపంచసంక్షోభం తెచ్చిపెట్టే రాక్షసుడిరూపం బాగా ఫోకస్‌లోకి వచ్చింది వీడికి కోటిచేతులు వీడిరంగు కమ్యూనిస్టుద్వేషం వీడిపొట్టలో ప్రజాపీడకులూ, నియంతలూ

కుహనాప్రజాతంత్రవాదులూ ఉన్నారు వీడి తలలో దోపిడీవిధానాలూ, వలసవిధానాలూ, అమానుషత్వమూ, లాభకాంక్షా గూడుకట్టుకుని ఉన్నాయి వీడివ్యాధిలక్షణం ఆత్మహత్య అణుయుద్ధం వస్తే ఎంతమంది అమెరికనులు ఆహుతికావటానికి సిద్ధంగా ఉండాలో లెక్కలువేసి చెప్పారు!

చాలాకాలం ఈ అణుయుద్ధయత్నాలు నిరాఘాటంగా కొనసాగటానికి కారణమేమంటే, ప్రచారకులు అణుయుద్ధానికీ, రాజకీయాలకూ అవినాభావసంబంధం ఉన్నట్టు ప్రచారం చేశారు అణ్వస్త్రాల తయారీకీ కమ్యూనిస్టు ప్రమాదానికీ జోడీ కల్పించారు అయినప్పటికీ ప్రపంచశాంతి ఉద్యమం రాజకీయాలకు అతీతంగానే నడచింది కాని ఇది పశ్చిమదేశాలలో అంత చురుకుగా సాగలేదు

ఇటీవల ఈ పరిస్థితి మారుతున్నది బ్రిటనులో అణ్వస్త్రనిషేధం గురించి తీవ్రమైన ఆందోళన ప్రదర్శితమవుతున్నది ప్రజలు సత్యాగ్రహానికి ఉపక్రమించారు ఈ ఉద్యమానికి రాజకీయపక్షాల నాయకత్వం ఏమీలేదు (బ్రిటనులో ఉన్న రాజకీయపక్షాలు అణ్వస్త్రాల నిర్మాణానికి సుముఖంగానే ఉన్నాయి ) ఇదేవిధంగా అమెరికాలో అనేక ఉద్యమాలు 'వాటికవే' పుట్టుకొస్తున్నాయి "మనం నాశనమైనా సరే, సోషలిస్టుదేశాలను నాశనం చెయ్యాలి" అని యుద్ధోన్మాదులు అన్నదానికి విరుద్ధంగా అమెరికాప్రజలు "కమ్యూనిజం ప్రపంచమంతా వ్యాపించినాసరే అణుయుద్ధాలు జరగటానికి వీలులేదు" అన్నవైఖరిని అవలంబిస్తున్నారు

శాంతికాముకులై ఉండి కమ్యూనిస్టువిద్వేషాన్ని కడిగేసుకోలేనివారు "ఇది సరిఅయిన ఉద్యమం! ఇందులో కమ్యూనిస్టుప్రమేయం ఏమీలేదు!" అని హర్షధ్వానాలు చేస్తున్నారు యుద్ధవ్యతిరేకతకు కమ్యూనిస్టువాసన ఏమైనా ఉంటే వీరు నల్లులల్లే మాడిచావటానికైనా సిద్ధమేలాగుంది!

"నువ్వు అణువుబాంబులతో చావగోరుతావా? కమ్యూనిస్టువు కాగోరుతావా?" అని ప్రశ్నిస్తే ప్రపంచంలో ఎవరూ చావటానికి ఒప్పరు అటువంటి ప్రశ్న వేసేవాడిదే బుద్ధితక్కువ– లేక దుర్మార్గం యుద్ధప్రమాదం హెచ్చినకొద్దీ పశ్చిమదేశాల్లో కూడా యుద్ధవ్యతిరేకత హెచ్చకతప్పదు యుద్ధోన్మాదులు ఈ ప్రజాభిప్రాయాన్ని పాటిస్తారా?" అనేది ప్రశ్న పాటించనిపక్షంలో "స్వతంత్రదేశాలు", "స్వేచ్ఛ", "ప్రజాతంత్రం" అని గొంతులు చించుకునే పాశ్చాత్యపాలకుల బండారం బయటపడుతుంది నామటుకు నేను బ్రిటన్‌లోగాని, అమెరికాలోగాని, ఇతర పాశ్చాత్యదేశాలలోగాని ప్రజాభిప్రాయానికి ఉండవలసినంత విలువ ఉన్నదని నమ్మలేకుండా ఉన్నాను

విశాలాంధ్ర దినపత్రిక, 13-5-1962

# 46. అజ్ఞానప్రచారం

చదవనివాడు అజ్ఞుడుగా ఉండిపోతాడనీ, చదివితే సదసద్వివేక చతురత కలుగుతుందనీ రణ్యకశిపుడిచేత పోతన్నగారు చెప్పించారు ఆయన ఉద్దేశంలో చదువంటే ఏదో మనకు లియదు ఆరోజులలో సదసద్వివేక చతురత కలిగించేదే తప్ప మరొకరకం చదువులేదేమో! ని ఈ రోజులలో అనేకరకాల చదువులున్నాయి అన్నీ నిష్పాక్షికంగా ప్రచారంలో ఉన్నాయి

ఒక తమిళ 'పద్మశ్రీ' జాతివైషమ్యాలను రెచ్చగొట్టేపుస్తకాలు రాశాడనీ, అవి పాఠ్యపుస్తకాలుగా న్నాయనీ తెలుస్తున్నది మతావేశాలను రెచ్చగొట్టే చదువులున్నాయి కుర్రవాళ్ళనూ, ువకులనూ, ప్రపంచజ్ఞానం లేని పెద్దలను సయితం ఆకట్టివారి మనస్సులను ఇరుకుసందుల్లో ట్టి బంధించటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి ఈ ప్రయత్నాలు మందిమీద నిచేస్తున్నాయి

"ఇవి తప్పనటానికి ఎవరికిగాని ఎటువంటి అధికారం ఉన్నది?" అని అడిగేవాళ్ళున్నారు జాస్వామ్యవ్యవస్థలో ప్రతి ఒక్కరికి తన అభిమాన విశ్వాసాలను ప్రచారం చేసుకునే అధికారం న్నదన్న అపోహ చాలామందికున్నది ప్రజాజీవితాభివృద్ధికి నిరోధకంగా ఉండే ప్రచారాన్ని షేధించే ప్రభుత్వాలను నిరంకుశప్రభుత్వాలనీ, కమ్యూనిస్టు ప్రభుత్వాలనీ పేరుపెట్టి కత్తులునూరే ారున్నారు వీరి సదభిప్రాయం పోగొట్టుకోవటానికి భయపడే ప్రభుత్వాలు తమదేశానికి ామే చేజేతులా ప్రమాదం తెచ్చిపెట్టుకుంటాయి

ఇటువంటి ప్రజాస్వామ్యం ఎట్లా పనిచేసేదీ మనం పత్రికలలో రోజూ చూస్తున్నాం బ్రిటను క ప్రజాస్వామికదేశం! అక్కడ ఫాసిస్టులు స్వేచ్ఛగా తమజాతి విద్వేషాన్నీ, నిరంకుశనియంతృత్వ ావాలనూ ప్రచారం చేసుకోవచ్చు అణ్వస్త్రనిషేధం జరగాలనేవారు సభలు జరపటానికి ేదు! ఫాసిస్టుల మీటింగును భగ్నం చెయ్యటానికి ప్రయత్నించినవారిని అరెస్టుచేసి, జరిమానాలు ధించారు!

ఈనాటి అంతర్జాతీయ రాజకీయాలలో ప్రతిదానికీ నామాంతరాలుండటం గమనించదగిన షయం రష్యాలో ఉండేది నియంతృత్వమని పశ్చిమరాజ్యాల ఆరోపణ ఇది నిజం కాదని లుసుకోవటానికి పెద్ద తెలివితేటలూ, కుశాగ్రబుద్ధీ అవసరంలేదు ఫ్రాంకో, సాలజార్లు ఎవరు? క్షిణ అమెరికాలో అమెరికా అభిమానానికి పాత్రులైన నియంతలు లేరా?

కులమతజాతి దురభిమానాలు ఈనాటి జీవితానికి ఏ విధంగానూ ఉపయోగ పడవనటానికి ూడా పెద్దతెలివితేటలు అవసరంలేదు ఈ దురభిమానాలు గలవారు తమ కులాలమంచికీ, ుతవ్యాప్తికీ, జాతిపునరుద్ధరణకూ పనిచెయ్యటం లేదు మతసంస్థలు భౌతికశక్తుల పక్షాన నిచేస్తూ, గూఢచారులకూ, హంతకులకూ ఆశ్రయంగా పనిచెయ్యటంలో నిజమైన ుతాభిమానం ఏమున్నది? కులాభిమానాలను జనంలో రెచ్చగొట్టి బాగుపడుతున్న దెవరు? దవులకోసం పాకులాడేవాళ్ళు! పశ్చిమరాజ్యాలు సోషలిస్టుదేశాలకు ప్రతిపక్షంగా తయారై చ్చన్నయుద్ధాన్ని రెచ్చగొట్టి అంతర్జాతీయాలను కంపుచేసి ప్రపంచప్రజలకు అణ్వస్త్రభీతి లిగిస్తున్నది ఎందుకో తెలుసుకోవడం కష్టమా? కొనప్రాణంతో కొట్టుకుంటున్న వలసవిధానాన్ని

మరికొంతకాలం ప్రాణాలతో నిలిపి ఉంచటానికి కాదా? ఆ పీడనుంచి బయటపడిన ప్రతిదేశంలోనూ చిచ్చుపెట్ట ప్రయత్నిస్తున్నది ఈ పశ్చిమరాజ్యాలు కావా?

కాని ఈ విషయాలు ప్రపంచప్రజలలో ఎంతమందికి స్పష్టంగా తెలుసు? ఎన్నిపత్రికలు ఈ విషయాలను విప్పిచెబుతున్నాయి? ఎన్ని వేల పత్రికలు అసందర్భాలతో ఈ విషయాలమీద ప్రజలదృష్టి కేంద్రీకరించకుండా చేస్తున్నాయి?

బ్రిటిషుప్రభుత్వం విద్యకోసం ఎంత ఖర్చుచేస్తుందో బ్రిటిషు వ్యాపారస్తులు పత్రికలలోనూ, ఇతరత్రాను తమ వస్తువుల్ని ప్రచారం చెయ్యటానికి అంత డబ్బు ఖర్చుచేస్తారట బ్రిటనులో లభించే విద్య అంతా పోతన్నగారనుకున్నదే అనుకున్నప్పటికీ ప్రకటనలలోది నూటికి నూరుపాళ్ళూ అవిద్య అనుకోవచ్చు అన్నిదేశాలకన్నా ముందుగానే పారిశ్రామికసంస్కృతి అలవరచుకొని, ప్రజాస్వామ్యానికి దారి చూపిన బ్రిటనులో దుష్టప్రకటనల నిషేధాన్ని చట్టం చెయ్యటానికి సాధ్యంకాకుండా ఉందట

అపాయకరమైన మందులూ, నిరుపయోగమైన వస్తువులూ, ప్రజల మూఢవిశ్వాసాలను రెచ్చగొట్టే దురాశలూ మనదేశంలో కూడా ప్రకటనల ద్వారా ప్రచారం అవుతున్నాయి కాని మనమింకా అమెరికా, బ్రిటన్ల ఔన్నత్యాన్ని అందుకోలేదు కాని ఆ అడుగుజాడలలోనే మనం కూడా నడవాలా అని నా సందేహం రకరకాల అజ్ఞానాన్ని ప్రచారం కాకుండా అరికట్టేమార్గం ఏదీలేదా?

విశాలాంధ్ర దినపత్రిక, 5-8-1962

# 47. జీవితంలో అవాస్తవికత

విమర్శనాదృష్టీ, నిజమైన కళాభిరుచీ గలవాడికి కళల్లో అవాస్తవికత ఎంతో కనిపిస్తుంది అటువంటి కళల వ్యాప్తి హెచ్చుగా ఉన్నట్టు కనిపిస్తే ఆ విమర్శకుడు, సంస్కృతి యొక్క భవిష్యత్తు ఏమిటా అని దిగులుపడిపోతాడు

కాని ఈనాడు జీవితమే అవాస్తవికంగా తయారయింది అంతర్జాతీయరంగంలో చూస్తే ఒక వంక శాంతికోసం ఏర్పడిన ఐక్యరాజ్యసమితీ, ఇంకోవంక అంతులేని యుద్ధఖర్చులూ మనకు కనిపిస్తాయి రెండవప్రపంచయుద్ధం 1945లో నిలిచిపోక ఇంకా సాగుతూనే ఉండినప్పటికీ ప్రపంచదేశాలు ఇప్పటికన్నా హెచ్చుగా యుద్ధంకోసం ఖర్చుచేసి ఉండేవి కావేమోననిపిస్తుంది

అసలు రెండవప్రపంచయుద్ధం అయిపోయిందా అన్న సందేహం కూడ కలుగుతుంది ఆ యుద్ధంలో ఫాసిజంగాని, ఇంపీరియలిజం గాని నిర్మూలమైపోయిందని ఎవరన్నా అనుకుంటే అది శుద్ధపొరపాటు ఉరిశిక్షలు తప్పించుకున్న నాజీ రాక్షసులు జర్మనీలో మళ్ళీ ఉన్నతస్థానాల్లో ఉన్నారు కాకపోతే పార్టీలు మారాయి మాజీ ఫాసిస్టులు– జర్మను, జపాను, ఇటాలియను వగైరాలు–ఈనాడు అమెరికా పక్షాన ఉన్నారు ఫాసిజాన్ని నిర్మూలించటానికి ఆరంభమైన యుద్ధం, కమ్యూనిజాన్ని నిర్మూలించడానికి కొనసాగుతున్నది ఈ యుద్ధం ప్రజాస్వామ్యం తరపున జరుగుతున్నదని తృప్తిపడినవారికి క్రమంగా కనువిప్పవుతున్నది ఇతరదేశాల ఆంతరంగిక వ్యవహారాలలో అమెరికాజోక్యం కలిగించుకున్నప్పుడల్లా అమెరికాసహాయం

పొందేపక్షం ప్రజాస్వామ్యవ్యతిరేకపక్షంగానే ఉంటున్నది అందుచేత ఈనాడు ప్రచ్ఛన్నంగానూ, మధ్యమధ్య బహిరంగంగానూ జరిగే ప్రపంచయుద్ధంలో అమెరికా మొదలైన పశ్చిమరాజ్యాలు ఫాసిజంకోసం ఈ యుద్ధాన్ని సాగిస్తున్నట్టు భావించాలి

అమెరికాలోనూ, బ్రిటనులోనూ, ఫ్రాన్స్‌లోనూ ప్రజాస్వామ్యం అమలులో ఉన్నదని తెలియనివారు అనుకొంటున్నప్పటికీ, అలాటిదేమీలేదని ప్రాజ్ఞులు చెబుతున్నారు అమెరికా అధ్యక్షుడు డెమోక్రాట్ అయి ఉండిన్నీ, శాసనసభలలో డెమోక్రాట్ల మెజారిటీ ఉండిన్నీ అధ్యక్షుడి నిర్ణయాలకు శరపరంపరగా శాసనసభలో అపజయాలు లభిస్తున్నాయి బ్రిటనులో మాక్మిలన్ ప్రభుత్వదౌష్ట్యం ఉన్మాదస్థాయినందుకున్నది ఫ్రాన్సులో డిగోల్ ప్రజాస్వామ్యనియంత అయికూచున్నాడు

ప్రజాస్వామ్యంలో ప్రజలు ఎక్కువ సుఖపడతారన్న సూత్రం నిజమైతే ఈనాడు పశ్చిమదేశాల ప్రజలు పడుతున్నకష్టాలకు కారణం అక్కడ ప్రజాస్వామ్యం లేకపోవటమన్నా కావాలి, లేక మరో కారణమన్నా కావాలి “కమ్యూనిజం మూలంగానే మనకీ కష్టాలువచ్చాయి దాన్ని అణచటానికి మనం ఘోరమైన త్యాగాలు చెయ్యకతప్పదు ” అని ప్రజలను నమ్మించటానికి ఫాసిస్టుల అభిమానులంటున్నారు ఒకడు పనిపెట్టుకుపోయి మరొకణ్ణి హత్యచేసి, “చూశారా వాడెంత దుర్మార్గుడు? నన్ను హంతకుణ్ణి చేసేశాడు!” అంటే ఎంత సౌమ్యంగా ఉంటుందో, “కమ్యూనిస్టు ప్రమాదం” ఎదుర్కొనేటందుకు పశ్చిమప్రభుత్వాలు యుద్ధఖర్చులు పెంచేసి, అణ్వస్త్ర నాశనాన్ని కోరితెచ్చుకుని, ప్రజాజీవితాన్ని స్తంభింపజేసి, ఆర్థికంగా పిల్లిమొగ్గలు వెయ్యటం అలా ఉంటున్నది ఇదంతా వాస్తవిక రాజకీయాలని ఎవడుగాని ఎట్లా అనుకోవటం?

మనదేశంలో పరిస్థితి కూడా అంత అవాస్తవంగానే ఉంటున్నది మన ప్రభుత్వం సోషలిజాన్ని పెంపొందించినకొద్దీ కాపిటలిజం బలపడుతున్నది భూసంస్కరణలు అమలుజరిగిన కొద్దీ భూమి దున్నేవాడి పని హీనమవుతున్నది పారిశ్రామికనిర్మాణం పెరిగినకొద్దీ నిరుద్యోగం హెచ్చవుతున్నది విద్యావ్యాప్తికోసం కృషిసాగినకొద్దీ విద్యార్థులకు సీట్లులేకుండా పోతున్నాయి స్వాతంత్ర్యం వచ్చాక పై దేశాలజులుం ఎక్కువైనట్టు కనిపిస్తుంది అధమం పై వారికి ఇది చక్కని విహారభూమీ, వేటప్రాంతమూ అయింది

కాంగ్రెసువారికి తమపక్షం కానిదంతా ప్రతిపక్షమే ప్రతిపక్షాలలో వ్యత్యాసాలు కాంగ్రెసుకు తెలిసినట్టు కనబడదు కాంగ్రెసుగమ్యం సోషలిజమైతే సోషలిస్టు, కమ్యూనిస్టుపార్టీల సహకారం కాంగ్రెసు ఎందుకు పొందటం లేదు? రెండు పంచవర్షప్రణాళికలు అమలుజరిగాక ప్రజలు కమ్యూనిస్టు, ఫాసిస్టు పక్షాలకు వోట్లు హెచ్చుగా ఎందుకువేస్తున్నారు? సామాన్య ప్రజలకు జీవితం అంతకంతకూ ఎందుకు దుర్భరమవుతున్నది? నిమ్నజాతుల ఉద్ధరణయత్నాలు ఆ జాతులు శాశ్వతంగా ఉండటానికి ఎందుకు తోడ్పడుతున్నవి? కాంగ్రెసుపార్టీలలో చీలికలెందుకున్నాయి? వాటికి కాంగ్రెసు ఆశయాలతో ఏ విధమైన సంబంధమైనా ఉన్నదా? పరిపాలనలో అవకతవకలు సరిచేయయత్నించినప్పుడల్లా ఉన్నతపదవుల్లో ఉన్నవారిని కూడా అదృశ్యశక్తులు కుంగదీసి ఆత్మహత్యలకు పురిగొల్పటానికేమిటి కారణం?

ప్రజాప్రభుత్వంలో చిన్నయసూరి తెలుగువాళ్ళకు యుగపురుషుడెలా అయాడు?

విశాలాంధ్ర, దినపత్రిక, 12-8-1962

# 48. భాషల బెడద

మనదేశానికి స్వాతంత్ర్యం వచ్చినాక మననెదుర్కొన్న పెద్దసమస్యలలో భాష ఒకటిలాగుంది జాతీయసంస్కృతీ, పరిపాలనా సౌకర్యమూ మనసులో ఉంచుకుని కాంగ్రెసువారు భాషాప్రయుక్త రాష్ట్ర నిర్మాణ సూత్రానికి ఆమోదించారు కాని ఆంధ్ర, మహారాష్ట్ర నిర్మాణాలు చేయవలసి వచ్చిన సందర్భాలలో ఈ సూత్రం మాటుపడిపోయి భాషలు దేశీయైక్యతకు ప్రతిబంధకంగా ఉన్నాయనీ, భాషాభిమానం దురభిమానమనీ ఒక ప్రచారం లేవదీశారు మూడునాలుగు కోట్లమంది యొక్క మాతృభాష ప్రత్యేకరాష్ట్రానికి నోచుకోకపోతే భాషాప్రయుక్తరాష్ట్రాలసూత్రానికి అర్థమేమిటో తెలియలేదు కొంత నరబలి జరిగాక ఆంధ్ర, మహారాష్ట్రలు ఏర్పడ్డాయి

తరువాత హిందీ, ఇంగ్లీషుభాషల సమస్య వచ్చింది మనదేశానికి ఏది దేశీయభాషగా ఉండాలి? రెండుభాషలకూ ఉండతగిన ఆధిక్యతలున్నాయి ఇంగ్లీషు దేశాన్నంతటినీ ఏకంచేసిన భాష. పరిపాలనకూ, శాసననిర్మాణానికీ, ఉన్నత విద్యాబోధనకూ, అంతర్జాతీయ వ్యవహారాలకూ సమర్థంగా ఉపయోగపడుతున్న భాష– కాని అది భారతీయులలో అత్యల్ప సంఖ్యాకులకు మాత్రమే మాతృభాష. ఇంగ్లీషు శాశ్వతంగా మనదేశీయభాషగా ఉండిపోవాలన్నది సబబైన ఆలోచనగా కనబడదు ఎప్పటికైనా ఏదో ఒక దేశభాష దాని స్థానం ఆక్రమించాలి

అటువంటి అర్హతగల భాష హిందీయే నిజానికి అది విస్తృత ప్రాంతాలలో మాతృభాషగా ఉండటమే గాక, ఇతర భాషా ప్రాంతాలలో కూడ పాకింది జాతీయోద్యమం వెంట దేశవ్యాప్తి పొందిన భాష హిందీ దానికి గాంధీజీ ఆశీస్సు కూడా ఉన్నది అయితే ఆ భాష ఇంగ్లీషుస్థానం ఆక్రమించదగిన స్థితిలో లేదు పరిపాలనా వ్యవహారాలూ, ఉన్నతవిద్యా హిందీలో జరిగితే ఒక్క తరంలో భారతదేశం కొన్నిశతాబ్దులు వెనక్కుపోయే ప్రమాదం కలగవచ్చు

హిందీని వ్యతిరేకించేవారికి ఇంతకన్న పెద్ద భయం ఏమంటే రాజకీయంగా హిందీ ప్రాంతీయులు ఇతర ప్రాంతీయుల పై ఎక్కి సవారిచేస్తారని ఇంగ్లీషు వ్యవహారభాషగా చలామణీ అవుతుండగానే హిందీప్రాంతీయుల 'జులుం' సాగుతున్నట్టు దక్షిణదేశీయులకు అనుమానం

అసలు రహస్యమేమంటే ఈనాడు భాషాసమస్యగా కనిపిస్తున్నది నిజంగా భాషకు సంబంధించిన సమస్య కాదు– రాజకీయసమస్య అంధ్రులూ, మహారాష్ట్రులూ ప్రత్యేకరాష్ట్రాలు కోరటం పెద్దలకు కంటగింపు కావటానికి ఉండిన కారణాలు రాజకీయమైనవి ఒకనాడు మద్రాసు(ఉమ్మడి) రాష్ట్రానికి ప్రధానిగా ఉండి హిందీ వ్యతిరేకులను ఖైదుచేయించిన శ్రీమాన్ రాజగోపాలాచారి గారు ఈనాడు హిందీవ్యతిరేకోద్యమానికి ముందుండటానికి కారణం ఈ పాతికేళ్ళలోనూ హిందీభాష దిగనాసిల్లిపోవటం కాదు– శుష్కరాజకీయాలు

కేవలం భాషదృష్ట్యా మాత్రమే చూచినట్లయితే వివిధ రాష్ట్రాలలోని వారికి ప్రధానమైనది మాతృభాష. అధికసంఖ్యాకులకు మాతృభాషలో తప్ప పని ఉండదు ఎందుకంటే హెచ్చుమంది తమ పనులు చేసుకోవటానికీ, తమకు కావలసిన సాహిత్యం వగైరా చదువుకొనటానికీ, ప్రపంచవార్తలు తెలుసుకోవటానికీ మాతృభాష చాలి ఉండాలి

ఉన్నత ప్రభుత్వోద్యోగాలూ, ఉన్నతవిద్యా, దేశాంతరాలతో వ్యాపారసంబంధాలు, సంస్కృతీసంబంధాలూ కావలసినవారికి కనీసం రెండు అదనపు భాషలు వచ్చిఉండటం

అవసరమవుతుంది అందులో ఒకటి దేశభాషా, మరొకటి అంతర్జాతీయభాషా భాషాదురభిమానులు - హిందీవారైనాసరే- వ్యవహారభాష గురించీ, అంతర్జాతీయభాషలను గురించీ అభిప్రాయం ప్రకటించటానికి అర్హులుకారు

ఇతరభాషలను ద్వేషించటం స్వభాషాభిమానం అనిపించుకోదు అది వెనకబడిన మనస్తత్వాన్ని మాత్రమే సూచిస్తుంది ఈనాడున్న పరిస్థితిలో రాజ్యాంగరీత్యా ఇంగ్లీషుకు వ్యవహారభాషగా మరికొంతకాలం స్థానం ఇవ్వటంలో తప్పేమీలేదు ఏ భాషనైనా ఒక ప్రయోజనానికి ఉపయోగిస్తూ పోతే తప్ప అది ఆ ప్రయోజనం సాధించటానికి అనుకూలంగా పరిణామం చెందదు హిందీభాషను ఇంగ్లీషుతోపాటు వివిధప్రయోజనాలకు వినియోగించి ఇంగ్లీషుస్థానం ఆక్రమించేటట్టు తీర్చిదిద్దుకోవాలి ఈ పని హిందీ మాతృభాషా ప్రాంతాలలో విజయవంతంగా జరిగితే ఆ తరువాత దేశవ్యాప్తంగా జరగవచ్చు

అన్నిటికన్న ప్రధానమైన సంగతి భాషాసమస్యలోకి రాజకీయాలను ప్రవేశపెట్టకుండా ఉండటం మన కేంద్రపాలకులూ, శాసనసభ్యులూ అన్నిభాషలపట్లా అభిమానం చూపినట్టయితే భాషాసమస్య దానంతట అదే పరిష్కారం అవుతుంది అంతేకాదు, ప్రజలలో ఇతర భాషల పట్ల కూడా ఆదరం హెచ్చుతుంది అది జరగనిపక్షంలో భాషాసమస్య తీవ్రంగా పరిణమించి విచ్ఛిన్నకరధోరణులు పెచ్చుపెరగవచ్చు

విశాలాంధ్ర దినపత్రిక, 21-10-1962

# 49. యుద్ధాలులేని భవిష్యత్తు?

లార్డ్ రసెల్ వంటి శాంతికాముకమేధావి ప్రపంచమారణహోమానికిగాను జరగవలసిన ఏర్పాట్లన్నీ జరుగుతున్నాయనీ, అణ్వస్త్రప్రయోగం ముందుగా రష్యాచేసి, అమెరికా ఎదురుదెబ్బ తీస్తే, ఏ దేశంలో ఎంతెంత జననష్టం ఏ రీతిగా ఉండేదీ అంచనాలు కూడా వేసి వుంచారనీ చెబుతున్నాడు రసెల్ తొంభైఏళ్ళవాడు, విజ్ఞాని, అకారణంగా జనాన్ని భయపెట్టి "అదుగోపులి" అంటే "ఇదుగోతోక" అనే రకం మనిషికాడు

రెండో ప్రపంచయుద్ధం రాకపూర్వం వెల్స్ కాబోలన్నాడు - ప్రపంచంలో పది, పన్నెండు మంది తలుచుకుంటే ప్రపంచయుద్ధం తెచ్చిపెట్టగలరని రెండవప్రపంచయుద్ధానంతరం ప్రపంచప్రజలలో కలిగిన రాజకీయచైతన్యం ధర్మమా అంటూ ఆ పరిస్థితి మారిపోయినట్టు కనిపించింది కాని అణ్వస్త్రాలు వచ్చిపడి పరిస్థితిని పాడుచేశాయి రాకెట్ ప్రయోగాలు అణ్వస్త్రప్రమాదాన్ని మరింతపెంచాయి అణ్వస్త్ర నిషేధమూ, సైనికబలాల తగ్గింపూ, సమగ్రనిరాయుధీకరణా- వీటిని గురించి జరిగే అంతర్జాతీయ చర్చల వెనక అన్నిపక్షాలవారికీ సమమైన శాంతివాంఛ ఉన్నట్టు కనబడదు యుద్ధయత్నాలకకింద అన్ని దేశాలూ కలిసి 50వేల కోట్లరూపాయలలో ఏమో ఖర్చుచేస్తున్నాయట ఈ ఖర్చుతో ప్రపంచంలో బడుగుదేశాలన్నవే లేకుండా చెయ్యవచ్చు! భూలోకస్వర్గం నిర్మించవచ్చు! కాని అందుకుగాను అనివార్యమైన ప్రతిబంధకాలేవో ఉండి ఉండాలి లేకపోతే మానవజాతికి ఈ అణ్వస్త్రభయం యింతగా ఎందుకుంటుంది?

మానవజాతియొక్క అంతస్సంఘర్షణే చిన్నయుద్ధాలకూ, పెద్దయుద్ధాలకూ వెనక ఉంటుంది ఈ సంఘటనకు కారణం పచ్చి దురాక్రమణ వాంఛ కావచ్చు సాంఘిక సిద్ధాంతాల మధ్య వైషమ్యం కూడా కావచ్చునని కొందరి నమ్మకం కాని బాగా ఆలోచిస్తే సిద్ధాంతాలమధ్య వైషమ్యమనేది దురాక్రమణవాంఛకు ఒక ముసుగుగా కనిపిస్తుంది రెండవప్రపంచయుద్ధమప్పుడు ఫాసిస్టు రాజ్యాలకు ప్రజాస్వామ్యదేశాలకకింద చలామణీ అవుతుండినవి కూడా దోహదం చేశాయి ఆ శక్తులను అణచక గత్యంతరంలేని పరిస్థితి ఏర్పడినప్పుడు ఇంగ్లండు, అమెరికాలు రష్యాతో చేతులు కలపటానికి సాంఘిక సిద్ధాంతాలమధ్య గల తేడా ఏమీ అడ్డురాలేదు

రెండవప్రపంచయుద్ధం ముగిసినాక అనేకచోట్ల ప్రాంతీయయుద్ధాలు చెలరేగాయి వాటన్నిటివెనకా మాజీ సామ్రాజ్యవాదులూ, నవవలసవిధానమూ ఉన్నట్టు రుజువు చెయ్యటానికి వీలవుతూ వచ్చింది: ఐక్యరాజ్యసమితి ఆధ్వర్యాన ప్రపంచంలోని అన్ని ప్రాంతాలూ స్వతంత్రమై అంతర్జాతీయ ఆర్థిక సహకారంతో దరిద్రాన్ని తొలగించుకుంటే మానవజాతి చరిత్రలోనే ఒక స్వర్ణయుగం ఆరంభమవుతుందని ఆశ ఉంటూ వచ్చింది

ఈ స్వర్ణయుగం రావటానికి ప్రపంచమంతటా ఒకే రాజకీయ సాంఘిక సిద్ధాంతం అమలులో ఉండటం కూడా అవసరంగా కనిపించలేదు ఎందుచేతనంటే దురాక్రమణవాంఛ లేని దేశాలలో పెట్టుబడిదారీవిధానం అమలులో ఉండినా, సోషలిస్టువిధానం అమలులో ఉండినా, లేక మనదేశంలో లాగా మిశ్రమ ఆర్థికవ్యవస్థ ఉండినా కూడా ప్రపంచశాంతికి భంగం ఉండదు యూరపులో అనేకదేశాలు ఏనాడూ, దురాక్రమణవాంఛ కనబరచలేదు– వాటిలో కొన్ని దురాక్రమణకు గురికావటం జరిగింది గాని ఈ దేశాలు పెట్టుబడిదారీ విధానాన్నే అవలంబించాయి

అదేవిధంగా కొత్తగా, స్వాతంత్ర్యం సంపాదించిన దేశాలలో చాలావాటికి దురాక్రమణవాంఛ లేదు మన దేశానికి అంతర్జాతీయరంగంలో గౌరవప్రతిపత్తులుండటానికి ప్రధానకారణం మన ప్రభుత్వానికి దురాక్రమణవాంఛ లేకపోవటమే గోవాలో పోర్చుగీసువారి ఆక్రమణనూ, ఫ్రాన్సు వలసప్రాంతాలలో ఫ్రెంచివారి అజమాయిషీనీ మన ప్రభుత్వం ఎంతో ఓర్పుతో సహించి ఆ ప్రాంతాలను ఉపాయంగా విముక్తం చేసుకున్నది ఇండియా గోవా పై దురాక్రమణ చేసిందని విదేశాలలో కొందరన్నారు గాని, వారివి చాలా కాలంగా దురాక్రమణ రాజకీయాలేనని ప్రపంచానికంతకూ తెలుసు

ఇండియాకు దురాక్రమణ వాంఛ ఉన్నదని ఆరోపించిన మరొకదేశం చైనా ఇండియాకూ చైనాకూ మధ్య ఇప్పుడేర్పడిన ఘర్షణ యుద్ధంగా పరిణమించవచ్చు లేదా నిలిచిపోవచ్చు– చారిత్రకదృష్టితో చూస్తే అతివిచిత్రమైనది చైనా ఇండియాల మధ్య గల సరిహద్దు గురించి ఏళ్ళ తరబడి చర్చలూ, ఉత్తరప్రత్యుత్తరాలూ జరిగి కూడా సమస్య పరిష్కారం కాకపోవడం చూస్తే నిరాయుధీకరణచర్చలు జ్ఞాపకం వస్తాయి! ఈ చర్చలు ఫలించకపోవటానికి కారణం చైనాకు చర్చల ద్వారా దీన్ని పరిష్కరించే ఉద్దేశం లేకపోవడమేననుకునేటందుకు బలమైన నిదర్శనం, వారు తమదనుకున్న ప్రాంతాన్ని యుద్ధతంత్రరీత్యా ఎంతోకాలంగా కట్టుదిట్టం చేసుకుని ఉండటమే తాను ఆక్రమించదలచిన ప్రాంతాన్ని చర్చల ద్వారా కాకపోతే యుద్ధంచేసి

అయినా స్వాధీనం చేసుకోవడానికి చైనా నిశ్చయించుకున్నదా? లేక కాశ్మీర్‌లో ఒక భాగం పాకిస్తాను దురాక్రమణ కింద ఉండగానే రాజీకోసం యుద్ధవిరమణ చేసిన ఇండియాకు చైనా భూభాగం పై దాహం పుట్టిందని ఆనాడే చైనాకు తెలియవచ్చిందా?

ఎంత త్యాగమైనా చేసి చైనా సైనికుల దురాక్రమణ కింద ఉన్న ప్రాంతాలను విముక్తం చేసుకునేటందుకు ఇండియా పట్టిన దీక్షను ఎవరు బలపరుస్తున్నారు, ఎవరు వ్యతిరేకిస్తున్నారనేది రాజకీయవాదులకు చాలా ముఖ్యమైన సమస్య కావచ్చు సోషలిస్టు వ్యవస్థ గల దేశాలు కూడా దురాక్రమణవాంఛ కనబరిచి "బలంతో బెదిరించే" (పొజిషన్ ఆఫ్ స్ట్రెంత్) పద్ధతి అవలంబిస్తే భవిష్యత్తులో ప్రపంచశాంతికి ఏ మాత్రం అవకాశాలుంటాయా అని నాబోటి సామాన్యులు విచారించకతప్పదు

విశాలాంధ్ర దినపత్రిక 4-11-1962

# 50. మారే ప్రపంచం

భవిష్యత్తు ముక్కుపట్టుకొని లాగినదాకా గతాన్ని పట్టుకొని వేళ్ళాడటం ప్రపంచమంతటా మానవస్వభావంగా ఉంటుంది నిరుపయోగమైన ఆచారాలూ, సాంప్రదాయాలూ అభివృద్ధికి అంతరాయంగా ఉండే సాంఘిక, రాజకీయ, ఆర్థిక, మత, కళా విశ్వాసాలూ మందిమీద ఆదరణ పొందుతూనే ఉంటాయి మనిషి మేధస్సు ఎప్పుడూ ముందుకే చూస్తుంది కొత్తనే అన్వేషిస్తుంది కాని భవిష్యత్తు గురించి ఏ మాత్రమూ ఆలోచించక గతం మీదనే పంచప్రాణాలూ పెట్టుకొనే మనస్తత్వం అధికంగా ఉద్రేకభావాలనుంచే బలం సంపాదిస్తుంది ఈ మనస్తత్వం గలవాళ్ళు కాలం ఈడిస్తేనేగాని ముందుకు కదలరు– కదిలినా వెనక్కే చూస్తారు భవిష్యత్తును– కనీసం సమీప భవిష్యత్తును– స్పష్టంగా చూడగలవారు ఉంటారు వారు "మంచి గతమున కొంచెమే" అని తెలుసుకొని, ఆ కొంచెం మంచినీ వెంటతీసుకుని, ప్రతిబంధకంగా ఉండే గతాన్నంతా దులిపేసుకుని పురోగమనానికి దారులు సూచిస్తారు వారికీ, గతాన్ని పట్టుకుని వేళ్ళాడేవారికీ మధ్యనుండే వ్యత్యాసం– బెర్‌ట్రాండ్ రస్సెల్‌కూ, కోల్డ్‌వార్ జర్నలిస్టుకూ ఉండే తేడాలాటిది

ప్రజలను ఏకోన్ముఖులను చెయ్యటానికి జాతీయసమస్య ఏ విధంగా తోడ్పడుతుందో చీనాకు మనకు ఏర్పడిన సంఘర్షణ రుజువు చేసింది స్వలాభాపేక్షులు సమష్టి చైతన్యాన్ని ఉపయోగించుకోవటానికి, కళేబరాల మీద రాబందుల్లాగా, ఎలా ఎగబడతారో కళ్ళారా చూస్తున్నాం మధుమేహం వెంట అతిమూత్రం లాగా సరిహద్దు సంఘర్షణ వెనకాడితే కమ్యూనిస్టు వ్యతిరేకతా, సోషలిస్టు వ్యవస్థకు తిలోదకాలివ్వమనే వైఖరీ, తాటస్థ్యం వదిలేసి నవసామ్రాజ్యవాదం చంకనెక్కుదామనే ధోరణీ మొదలైనవి బయలుదేరాయి

మనకు జాతీయ సమస్యలు ఇంతకాలమూ లేక కాదు, స్వాతంత్ర్యం వచ్చిన క్షణం నుంచీ మనదేశాన్ని ఆర్థికంగా పటిష్టం చేసి, సామాజిక సంబంధాలలో విప్లవ పరిణామాలు రావటానికి తగిన పరిపాలనావిధానాలు అమలుజరగటమనే సమస్య మనని ఎదుర్కొనే ఉన్నది కాని దాన్ని గురించి ప్రజలలో చైతన్యం కలగలేదు ప్రచారం జరగలేదు ముఖ్యంగా మన

పత్రికలు ఇతరదేశాలను కొల్లగొట్టి పైకి వచ్చిన దేశాలలో అమలులో ఉండిన పాతజర్నలిస్టు పద్ధతులను అవలంబించాయి వార్తల వెనక ఉండే సత్యాన్ని తెలుసుకోకపోవటమూ, తెలిస్తే చెప్పకపోవటమూ, ఏ సమస్యను ఆ సమస్యగానే వివరించి ఇతర సమస్యలతో వాటికి గల సంబంధాలను ప్రస్తావించకపోవటమూ, భయంకరమైన అంతర్జాతీయ పరిణామాలను గురించి కూడా ప్రేక్షకుడి వైఖరిలో వార్తలందించి, మిగతాది ఉహాగానాలతో నింపడమూ, పాఠకులందరూ శుద్ధమొద్దులన్నట్లుగా ప్రవర్తించటమూ మనదేశంలో ఉండే కొన్ని ఘరానా పత్రికలకు కూడా అలవాటైపోయింది ఈ పత్రికలు భవిష్యత్తును చూడలేకపోగా వర్తమానాన్నే అయోమయంగా ప్రదర్శించి జనసామాన్యానికి ఏమీ అంతుబట్టకుండా చేస్తున్నాయి

ఇందువల్ల జనం నష్టపోతున్నారు గాని పత్రికలు బావుకుంటున్నదేమీ లేదు అమెరికా, బ్రిటన్ వంటి దేశాలలో ప్రజానిర్ణయం (ఎన్నికలలో) అవసరమైనప్పుడు, పత్రికలు చేసే ప్రచారం ఎందుకూ పనికిరాకుండా పోతూనే ఉన్నది బ్రిటన్‌లో లేబరుపార్టీకీ, అమెరికాలో డెమోక్రాట్‌లకూ పత్రికల అండ బహుస్వల్పం అయినా ఎన్నికలలో ఆ పార్టీలకు రాదగినన్ని వోట్లు వస్తున్నాయనే అనిపిస్తుంది

మొన్న క్యూబా విషయంలో అణుయుద్ధం వచ్చేటంత తీవ్ర పరిస్థితి ఏర్పడినప్పుడు, పత్రికలన్నీ ఉన్మాదంగా క్యూబా వ్యతిరేకతను బలపరుస్తూ ఉండినప్పటికీ, అమెరికను ప్రజలు అణుయుద్ధ ప్రమాదమంటే ఏమిటో చవిచూశారు ఇకమీదట అమెరికా పరిపాలకులు అటువంటి తీవ్రపరిస్థితిని అంత తొందరపడి తెచ్చిపెట్టరు క్యూబా మీద దాడిచెయ్యమని కాకిగోల చేసిన పత్రికలకు శృంగభంగమయింది, క్యూబాపై దాడిచెయ్యబోమని కెన్నెడీ మాట ఇచ్చాడు

పత్రికలు కాకిగోల చెయ్యటం డెమోక్రసీకి అతిముఖ్యలక్షణమనేవారున్నారు, కాని డెమోక్రసీ ధోరణే మారుతున్నది అమెరికాలో పేరుకు రెండుపార్టీలున్నాయి గాని ఈ రెండూ కూడా ఒకే పార్టీలోని చీలికలు అనుకున్నవాడు పొరపాటు పడినవాడు కాడు అమెరికా శాసనసభలో కెనెడీ పార్టీకి మెజారిటీ ఉన్నది గాని, చాలాసార్లు ప్రతిపక్షం నిర్ణయాలే సాగుతున్నాయి! మన దేశంలో నెహ్రూ పార్టీలోనే కృపలానీ, మసానీ, రాజాజీ, రంగా మొదలైన కాంగ్రేసేతర నాయకుల మనస్తత్వాలుగలవారున్నారు ఏనాడో చీనాతోయుద్ధం పెట్టుకోమని చెప్పిన కారణంగా తాము వివేకం గలవారన్నట్టు పోజుపెట్టేవారిలో గోవాను విముక్తం చేయవద్దన్న వారున్నారు!

అణ్వస్త్రాలూ, రాకెట్‌లూ మొదలైనవాటితో 'రక్షణ' అనే మాటకు అర్థం లేకుండా పోయింది అంతర్జాతీయ నియమావళి ఒక్కొక్కటే శిధిలమవుతున్నది స్పూత్నిక్కులతో ఇతరదేశాల పై గూఢచారి చర్యలు చేయవచ్చు ఇతరదేశాల సరిహద్దుకు ఎడంగా ఉండే విమానాలలో నుంచి సరిహద్దులోపలి ప్రాంతాలను ఫోటో తీయవచ్చు ఇదంతా అంతర్జాతీయ రాజకీయాలను మరింత క్లిష్టం చేసి, ప్రజాస్వామ్యం నాలుగుపాదాలా నడవటానికి లేకుండా చేస్తున్నదని, గతాన్ని పట్టుకు వేళ్ళాడే వాళ్ళు భావించవచ్చు

కాని భవిష్యత్తులోకి ఒక్క అంగుళంమేర చూడగలవాడికి ఇవి చాలా మంచి 'శకునాలు' శాస్త్రవిజ్ఞానం 'రక్షణావకాశాలు' లేని అస్త్రాలను సృష్టించిందంటే మానవుడి భవిష్యత్తులో యుద్ధానికి తావులేదన్నమాట ఆటోమేషన్ పెట్టుబడిదారీ ఉత్పత్తివిధానానికి అనుకూలం గానూ, సోషలిస్టువిధానానికి అనుకూలంగానూ ఉన్నట్టే, వైజ్ఞానికాభివృద్ధి వల్ల ఏర్పడుతున్న

అనేకపరిణామాలు భవిష్యత్తులో యుద్ధోన్మాదులకూ, స్వార్థపూరితమైన ఆర్థికవిధానాల నవలంబించే వారికీ, ఇతరదేశాలపై కుట్రలు చేసే వారికీ భవిష్యత్తులేదని స్పష్టంగానే చెబుతున్నాయి ఈ భాషను జనసామాన్యం, ఏ పత్రికలవాళ్ళూ, రాజకీయోపన్యాసకులూ చెప్పకుండానే అర్థంచేసుకునేరోజు వస్తుంది

విశాలాంధ్ర దినపత్రిక 18-11-1962

# 51. జీవిత సార్థక్యం

ఒక ప్రాణియొక్క జీవితం సార్థకమయిందా, నిరర్థకమయిపోయిందా అన్న సమస్య మానవుల విషయంలో మాత్రమే ఉత్పన్నమవుతుంది మృగాలు తమ ప్రాకృతధర్మాన్ని అనుసరించి జీవిస్తాయి వాటివి ఎప్పుడూ సార్థకజీవితాలే ఒకే జాతి ప్రాణుల్లోనే కొన్ని ప్రత్యేకపాత్రలు నిర్వహించటం ఉండవచ్చు ఉదాహరణకు చీమలూ, తేనెటీగలూ మొదలైన వాటిలో కొన్ని రాణులూ, కొన్ని శ్రమించేవీ, కొన్ని సోమరులూ, కొన్నియోధులూ – ఇలా విభజన ఉంటుంది కాని ఈ విభజన, ఈ వ్యత్యాసం ప్రకృతిసిద్ధంగా ఏర్పడినది వాటి వాటి జీవితసార్థక్యం వాటివాటికి ఉండనే ఉంటుంది

మనుషులలో బహుకొద్దిమంది మాత్రమే సార్థకజీవులనే అభిప్రాయానికి మనం అలవాటుపడ్డాం మానవసామాజిక పరిణామమే ఈ అభిప్రాయానికి అవకాశం ఇచ్చింది సామాజిక జీవనం లాంటిది మృగాలలో కూడా ఉన్నప్పటికీ ఆ జీవనానికి ప్రాతిపదిక జ్ఞానం కాదు సామాజిక మానవుడు మేధోపజీవి అయినాకనే సామాజిక పరిణామం కూడా జాస్తి అయింది ఆదికాలపు మానవులకు జ్ఞానులు మార్గదర్శకులూ, ముఖ్యులూ అయారు వారు సమాజంలో ఇతరులకన్నా హెచ్చు సార్థకజీవులు వారికి సమాజం బ్రహ్మరథం పట్టింది అయితే సమాజంలో కొద్దిమంది మేధావులైన కారణం చేత ఇతరులు నిరర్థకజీవులు కాలేదు

సంఘం యొక్క అభివృద్ధితో పాటు శ్రమవిభజన హెచ్చినకొద్దీ వేరువేరు రకాల శ్రమలకు గల పరిగణనలో హెచ్చుతగ్గులేర్పడ్డాయి అన్నిరకాల శ్రమా సంఘక్షేమానికి అవసరమే అయినా కొన్నిరకాల శ్రమలకు ఎక్కువ గణన, కొన్నిటికి తక్కువా అయింది దీనివల్ల సంఘంలో దురన్యాయం ఏర్పడింది (నగర పారిశుధ్యాన్నీ, సమష్టి ఆరోగ్యాన్నీ కాపాడే పాకీవాళ్ళది హీనశ్రమ కావటంకన్నా హెచ్చు దురన్యాయం ఇంకేముంటుంది?)

సమాజ పరిణామం కేవలం ఈ దురన్యాయం పైనే ఆధారపడి సాగిందనుకోవాలి ప్రాచీన ఆర్యసమాజాలనుతీసుకున్నట్టయితే వాటిలో అందరూ ఒకే వర్గం అయిన నాటికన్న మూడువర్గాలు ఏర్పడిననాటికి అబివృద్ధి చాలా జరిగింది నాలుగోవర్గం (దాస్య లేక శూద్ర) ఏర్పడినాక మరింత పురోగమనం సాధ్యమయింది కాని సంఘ దురన్యాయం హెచ్చిపోతూనే ఉన్నది యుద్ధాలలో గెలిచి క్షత్రియులూ, శాంతిసమయంలో సంపదను పెంపొందింపజేసి వైశ్యులూ సార్థకజీవులు కాగలిగారు కాని సంపదను సృష్టించి, యుద్ధాలలో చచ్చిన అధికసంఖ్యాకవర్గానికి జీవితసార్థక్యం లేకుండాపోయింది ఇదే విధంగా గ్రీకు, రోమను సమాజాలలో బానిసలు సంఘపరిణామానికి కారకులై కూడా నిరర్థకజీవులయ్యారు

పెట్టుబడిదారీ యుగంలో సార్థకజీవనం అంటే ఏమిటో ఊహించటానికి కూడా అవకాశం లేకుండాపోయింది సంఘదురన్యాయం పరాకాష్ఠనందుకున్నది సంఘ పురోభివృద్ధికి దాదాపు ఏమీ తోడ్పడనివారు అత్యంత సార్థకజీవులూ, పురోభివృద్ధికి బలిఅయే జీవితాలు అత్యంత నిరర్థకాలూ కావడానికి తగిన పరిస్థితులు ఈ పెట్టుబడిదారీ సంస్కృతిలో మనకు కనిపిస్తాయి

రాజకీయరంగంలో చూస్తే ప్రజలు నిరర్థకజీవులూ, వారి వోట్లు సంపాదించగలిగినవారు సార్థకజీవులూనూ! పరిపాలనా యంత్రాన్ని చూసినట్టయితే తినగలవాళ్ళదీ, తినిపించగలవాళ్ళదీ పైచెయ్యి, తిననివాడు అడుక్కు దిగజారిపోతాడు పైవాళ్ళ ఆగ్రహానికి గురి అవుతాడు ప్రమోషన్లు పోగొట్టుకుంటాడు, ట్రాన్స్‌ఫర్ అవుతాడు

ఆర్థికరంగంలో సక్రమంగా డబ్బుచెయ్యటంకన్నా అక్రమంగా హెచ్చుడబ్బుచేసుకునే సదుపాయాలు జాస్తి పన్నులు కట్టినవాడికన్న ఎగ్గొట్టినవాడు హెచ్చుసార్థకజీవి అవుతాడు

పారిశ్రామికరంగంలో సంపదను సృష్టించేవాళ్ళు ఏపూటా కడుపునిండా తినలేరుగాని వాళ్ళ యజమానులు సంఘం నిచ్చెనమెట్లు గబగబా ఎక్కేస్తారు

కళారంగంలో కళల వికాసానికి హెచ్చుగా తోడ్పడేవాడికన్న వాడి ఆధారంతో బతికేవాళ్ళు హెచ్చుసార్థకజీవులు సినీ డైరెక్టర్లకన్నా, రచయితలకన్నా, టెక్నీషియన్లకన్నా నటులు హెచ్చుసార్థకజీవులు చిత్రనిర్మాతలకన్నా డిస్ట్రిబ్యూటర్లూ, ఎగ్జిబిటర్లూ ఎక్కువ సార్థకజీవులు, ఎగ్జిబిటర్లకున్న స్థిరత్వం డిస్ట్రిబ్యూటర్లకు లేదు డిస్ట్రిబ్యూటర్లకున్న స్థిరత్వం నిర్మాతలకు లేదు అందరికన్న నిరర్థకజీవులెవరంటే కళలనన్నిటినీ పోషించే జనసామాన్యం

నిరుద్యోగి అయినవాడికన్నా నిరర్థకజీవిని ఎవరూ ఊహించలేరు పైకి ఎన్ని ఆర్భాటాలు చేసినా పెట్టుబడిదారీసమాజంలో నిరుద్యోగం అనేదానికి బాధ్యత ఎవరిదీకాదు ఏ పరిశ్రమకూ అవసరంలేనివాడు కార్మికనిరుద్యోగి ఏ ఆఫీసుకూ అవసరం లేనివాడు సేవకనిరుద్యోగి నిరుద్యోగసమస్య పరిష్కరించటానికి ప్రభుత్వాలు ప్రయత్నాలైతే చేస్తాయిగాని ఆ సమస్యను పరిష్కరించేశక్తి వాస్తవంగా ప్రభుత్వాలకుండదు అందుచేత నిరుద్యోగసమస్య పరిష్కారం చెయ్యలేని కారణంచేత ఏ మంత్రివర్గమూ రాజీనామా ఇచ్చి వెళ్ళిపోవటం జరగదు అమెరికాలో ఈనాడు కనీసం అరకోటిమంది నిరుద్యోగులు(నిరర్థకజీవులు) ఉన్నారు వారు తమ జీవితాలు సార్థకం చేసుకోదలిస్తే ఏం చెయ్యాలో బెర్ట్రాండ్‌రస్సెల్ కూడా చెప్పలేదు

పెట్టుబడిదారీ సమాజంలో సుస్థిరమైన జీవితపు విలువలు ఉండవు శాంతిసమయంలో నిరర్థకుల్లాగా తిరుగుతూ, ఎక్కడైనా సమ్మెలు జరిగితే సమ్మెదార్ల నడుములు విరచటానికి ఉపయోగపడే 'జవాన్లు' యుద్ధకాలంలో ఆరాధనీయులవుతారు యుద్ధకాలంలో సంసారస్త్రీలు సయితం సైనికులకు కామసంతృప్తి కలిగించటం దేశభక్తిగా పాశ్చాత్యదేశాలలో పరిగణించ బడింది! యుద్ధంపేరిట ప్రజాస్వామ్యాలన్నీ రద్దుకావటం అక్రమమని ఎవరూ భావించరు

సామాజిక పరిణామంలో యుద్ధాలు ఆదికాలంనుంచీ కూడా ముఖ్యపాత్ర వహిస్తూ వచ్చాయి యుద్ధాలలో ఒక దురన్యాయం ఉన్నది విజయానికి నిజంగా సాయపడ్డవాళ్ళు చావగా హతశేషులు విజయఫలితాన్ని పొందుతారు ఇది ఎంత అక్రమమో మనవాళ్ళు ఆదికాలంలోనే కనిపెట్టారు అందుచేత యుద్ధనిహతులకు వీరస్వర్గమూ, యజ్ఞపశువులకు పుణ్యలోకాలూ

కల్పించారు యుద్ధాలులేకుండా జీవించే మార్గం వారికెక్కడా కనుచూపుమేరలో లేనికారణంచేత ఈ కల్పన అవసరమయింది భారతయుద్ధం నాటి కృష్ణార్జునులు ఆ కాలపు మేధావులనే మనం అనుకోవాలి "హతోవా ప్రాప్స్యసే స్వర్గం, జిత్వావా భోజ్యసే మహీం" అని చెప్పి కృష్ణుడు అర్జునుణ్ణి యుద్ధానికి సుముఖుణ్ణి చేస్తాడు "రుధిర ప్రదిగ్ధాలైన భోగాల" పట్ల విముఖత్వం ప్రదర్శించటం స్వాభావికం కృష్ణుడు అతనికి వీరస్వర్గం పైన ఆశ చూపెట్టటం వంచన!

ఇంతకీ ఈనాటి ప్రపంచంలో నిరర్థకజీవులుండటం ఒక 'ఎనక్రానిజం' ప్రతివాడు సార్థకజీవి కావచ్చు శ్రామికులకూ సేవకులకూ చేసుకునేటందుకు పనులు లేకపోవటమూ, దారిద్ర్యమూ, రోగాలూ, యుద్ధాలూ, సమ్మెదార్లను కవ్వించి పోలీసులను పిలిపించే హక్కు యజమానులకుండటమూ, రోగులు కల్తీమందుల తోనూ, వైద్యుల అలక్ష్యంతోనూ చావటమూ మొదలైనవేవీ అనివార్యాలు కావు

ఈనాడు మానవుడి అధీనంలో ఉండే శాస్త్రవిజ్ఞానంతో అన్నిరకాల శ్రమనూ గౌరవనీయంగా మార్చవచ్చు అందరికీ అవసరాలు ఉత్పత్తి చేయవచ్చు అందరి జీవితాలు సార్థకం కావచ్చు శాస్త్రజ్ఞానం ఎంతగా విభజన పొందిందంటే ఏ శాస్త్రశాఖలో కృషి చేసేవాడు కూడా తన జ్ఞానం పై ఇతరుల జ్ఞానం ఆధారపడి ఉందనుకోలేడు ఆకాశంలోకి మనుషులను పంపినా, ఆగిపోయిన గుండెలను మళ్ళీ ఆడించి, చచ్చినవాళ్ళను బతికించినా, ఎన్నోవేలమంది కృషి ఫలితంగానే అది సాధ్యమవుతున్నది వీరస్వర్గాలకు ఏనాడో నీళ్ళు వదిలాంగాని, యుద్ధాలు లేని స్వర్గాన్ని భూమిమీదనే అవతరింపజేసుకునే కృషి ఇంకా ఆరంభం కాలేదు ఇది అనేక దశాబ్దాల మీద సాగవలసిన కృషి శతాబ్దాలు ఇట్టే గడచిపోతాయి, కాని భూలోకస్వర్గం ఏర్పరచటం గురించి మనుషులలో ఉండే 'అభిప్రాయ భేదాలు' సరికావటం చాలా కష్టంగా ఉంటున్నది అందుచేత మనుషులు ఏకాభిప్రాయానికి వచ్చేదాకా జీవితసార్థక్యం అనేది అనేకకోట్లమందికి గగనకుసుమంగా ఉండిపోవాలిసిందే

విశాలాంధ్ర దినపత్రిక 14-1-1963

## 52. జగమే మాయ!

"జగమే మాయ! బ్రతుకే మాయ!" అని తత్వాలు పాడటం ఒకటీ, కేవలం ఐహికచింత మాత్రమే గల పామరుడికి సైతం జీవితం అయోమయంగా ఉండటం మరొకటీను

ఆకలీ, దప్పికా, దారిద్ర్యమూ, ప్రేమా, ప్రపంచజ్ఞానమూ, వృత్తీ, రోగాలూ, చికిత్సలూ, సామాజికకృషీ, వీరారాధనా, కళాపిపాసా, ఆనందమూ, సుఖమూ, దుఃఖమూ, జీవిత సంఘర్షణా ఇలాటివి జీవితంలో వాస్తవవిషయాలు వీటిని కథావస్తువులుగానూ, కవితా సామగ్రి గానూ, ప్రచారసాధనాలు గానూ మాత్రమే ఉపయోగించుకునేవాళ్ళు జీవితానికే ద్రోహం చేసినవాళ్ళవుతారు

ఇవి నిత్యజీవితానికి సంబంధించినవి జీవితంలో అసాధారణపరిస్థితులు ఏర్పడినపుడు మరికొన్ని జీవితవాస్తవాలు మనుషులను ఎదుర్కొంటాయి దేశభక్తీ, త్యాగమూ, వీరత్వమూ,

విప్లవచైతన్యమూ మొదలైనవి ఇలాటివి వీటిని కృత్రిమంగా అభిమానించటంకన్నా హేయమైనది మరి ఉండదు

ఇటువంటి జీవితసత్యాలను గురించి సంఘంలో అవాస్తవికదృష్టి ప్రబలటం జీవితం యొక్క రుగ్మతకు ప్రత్యక్షనిదర్శనం

ముందు కళారంగం తీసుకుందాం కళలలో ప్రతిబింబించే జీవితంలో గాని, పాత్రలలో గాని వాస్తవిక 'తీవ్రత' ఏపాటి ఉంటున్నది? ఉండవలసిన దానిలో దశాంశం లేదు

చారిత్రకంగా చూస్తే వాస్తవికత ఉప్పెనలాగా వచ్చిపడి ఉండవలసిందనిపిస్తుంది ఎందుకంటే వాస్తవిక కళలకు అనుకూలమైన విప్లవ పరిణామాలు అన్నీ జరిగాయి గ్రాంధికభాషావాదం వెన్నువిరిగిపోయింది సరస్వతి పండితులు తగిలించిన సంకెళ్ళను తెంచుకుని ప్రజలకేసి వచ్చింది రాజకీయంగా పరాధీనత తప్పిపోయింది ఆంధ్రరాష్ట్రం కోసం జరిగిన తపస్సు ఫలితానికి వచ్చింది తెలుగు కళాకారులను చైతన్యపరచటానికి ఇంకేం కావాలి? కాని చైతన్యం ఏదీ? జీవితాన్ని మరింత వాస్తవంగా చిత్రించాలనీ, వ్యక్తులను మరింత సజీవంగా చిత్రించాలనీ కళాకారులమధ్య పోటీ ఏదీ? బహుకొద్ది కథావస్తువులనూ, కవితాసామగ్రినీ, నేలకు దిగిరాని ఆశయాలనూ, పరిమితమైన సంఖ్యగల 'అచ్చు' పాత్రలనూ, కొన్ని గిరులమధ్య మాత్రమే గానుగెద్దుల్లాగా తిరిగే జీవితసమస్యలనూ పట్టుకుని ఎందుకు వేళ్ళాడుతున్నాం? ఆకలీ, దారిద్ర్యమూ, ప్రేమా మొదలైన సమస్యలను తీసుకున్నప్పుడు కూడా వాటిని వాస్తవంగా చిత్రించక ఆదర్శదృష్టికి అనుగుణంగా వాటిని ఎందుకు 'చలన' చేస్తున్నాం?

మన కళల్లో వాస్తవం లోపించిందనటానికి ప్రబలమైన నిదర్శనం కళాకారులకు జీవితసంఘటనల 'బరువు' ఏ మాత్రమూ తెలియకపోవటం నిత్యజీవితంలో అతి చిన్న నిర్ణయాలు చెయ్యటానికి కూడా అంతులేని ప్రతిబంధకాలు కలుగుతాయి కళల్లో పాత్రలు ఎంతో పెద్దనిర్ణయాలు కూడా ఇట్టే చేసేస్తారు ఒక కుర్రాడు గాని, కుర్రది గాని పుట్టిపెరిగిన వాతావారణంలో నుంచి బయటికి వెళ్ళిపోవడం ఏమీ తేలికైన పని కాదు ఒకరిని ప్రేమించినట్టు రూఢి చేసుకుని వివాహనిర్ణయం చేసుకోవటమైనా అలాటిదే కీకారణ్యంగా చిత్రించవలసిన జీవితాన్ని పచ్చీసుగళ్ళ లాగా చిత్రించటం వల్ల కళల ద్వారా జీవితానికి ఏం లాభం? నేను అతి సాధారణ సంఘటనలనే కథల్లో ప్రవేశపెడతానని కొందరన్నారు ఆ చిన్నసంఘటనలనైనా వాస్తవికంగా చిత్రించానన్న తృప్తి నాకు కలగటం లేదు అటువంటప్పుడు అసాధారరణ సంఘటనలను తీసుకుని ఆనవాయితీగా వస్తున్న వరవడిలో చర్విత చర్వణంగా చిత్రించటం వల్ల ప్రయోజనమేమిటి? జీవితాన్ని ఉన్నదానికంటే మరింత మాయగా చిత్రించటంలో సినిమాలూ, నాటకాలూ, కథలూ ఒకదానికన్న మరొకటి ఒక్క పిసరు మాత్రమే మెరుగుగా ఉంటున్నాయి ఇవి జీవితాన్ని జ్ఞాపకం చెయ్యటానికే జంకుతుంటే జీవితాన్ని అర్థమయేటట్టు చేసే అవకాశం ఎక్కడ? జీవితంలో సంస్కరించదగిన విషయాలున్నప్పుడు కళలు అంతో ఇంతో బాధే కలిగించాలని నా నమ్మకం అంటే కళలు దిగులుగా ఉండాలనికాదు, హాస్య వ్యంగ్య ధోరణిలో ఉన్నప్పటికీ హాస్యం వెనక చురుకు ఉండాలి కందుకూరి, చిలకమర్తి గార్ల హాస్యంలాగా కళారంగంకన్న దౌర్భాగ్యంగా ఉన్నది రాజకీయరంగం ప్లానులు అమలుజరుగుతున్న కొద్దీ సాధారణ ప్రజల దారిద్ర్యం పెరుగుతున్నది, నిరుద్యోగసమస్య

హెచ్చుతున్నది  జాతీయాభివృద్ధి ప్రణాళికలలో తాడుంటే కొలలేదు  కొల ఉంటే తాడుండటం లేదు  ప్లానులు వాస్తవంగా ఉన్నప్పుడు కూడా అవి అమలుజరిగే పద్ధతులు 'మాయ'గానే ఉంటున్నాయి  ఒకవంక డబ్బు చాలటం లేదు  మరొకవంక డబ్బు కైంకర్యమైపోతున్నది

మద్రాసు రాష్ట్రంలో 5,500 ప్రభుత్వోద్యోగాలకు అర్హులులేరు  నేషనల్ ఫిజికల్ లేబరేటరీకి డైరెక్టరుగా పనికివచ్చేవాడు దొరకలేదు అని పత్రికల్లో వార్తలు  చదువుకుంటామనే వాళ్ళకు సీట్లు లేవు

ఆర్థికంగా ప్రైవేటురంగమే నలుగురికి ఉద్యోగాలిస్తున్నది  అత్యధికసంఖ్యాకులైన యువకులు ఇప్పటికీ ఆ రంగాన్ని నమ్ముకునే ఉన్నతవిద్యలకు ఎగబడుతున్నారు

ఈ 15,16 ఏళ్ళ నుంచీ అధికారం పేరుకు ప్రజలదే అయినా ఎక్కడికక్కడ ప్రాంతీయపరిపాలన స్థానిక ప్రజలదే! వాళ్ళకి చట్టం లేదు, వాళ్ళ అధికారానికి తిరుగులేదు ప్రాంతీయ ప్రభుత్వ యంత్రం, పోలీసుశాఖతో సహా, వారి చేతి కీలుబొమ్మ  ఇవి బహిరంగంగా అందరికీ తెలిసినవిషయాలు, రహస్యశాఖ వారి రహస్య రిపోర్టులు కావు, కాని కేంద్రప్రభుత్వానికి ఈ పరిస్థితి మార్చే శక్తిలేదు  ఈ పులులు రాజకీయంగా ఘనమైన పాత్ర నిర్వహిస్తున్నాయి అలాటప్పుడు ఎన్నికలు దేనికీ?  అంతా మాయ!

చీనాతో సరిహద్దు ఘర్షణ వచ్చింది  మన సరిహద్దున దురాక్రమణ జరిపింది చీనావాళ్ళో, కమ్యూనిజమో తెలియకుండా పోయింది  ముందు కొన్ని వందల కమ్యూనిస్టులు ఖైదు చెయ్యబడ్డారు  "ఇది పరిమిత యుద్ధమనే నా నమ్మకం" అని నెహ్రూ అన్నప్పటికీ 'కంట్రాక్టు' దేవత విజృంభించి యుద్ధరంగానికి కొన్నివందల మైళ్ళ దూరాన కందకాలు తవ్వించింది! దేశద్రోహులూ, స్వార్థపరులూ, దేశభక్తి మాయ తగిలించుకుని ప్రభుత్వం మీద ఘోరమైన ఆపాదనలు చేశారు  డబ్బులు వసూలుచేసుకున్నారు! వాళ్ళనెవరూ ఖైదులో పెట్టలేదు చీనా తగాదా వెంట వున్న అసలు సమస్యను విడిచిపెట్టి, దాన్ని అడ్డంపెట్టుకుని కొన్ని పత్రికలు అవాకులూ, చవాకులూ రాశాయి  రాస్తున్నాయి నిన్న మొన్నటిదాకా రాజకీయవిజ్ఞులూ, నాయకులూ అనిపించుకున్న రాజాజీ దళంవారు అంతర్జాతీయ రాజకీయపరిస్థితీ, పెట్టుబడిదారీ దేశాలలోని ఆర్థికసంక్షోభమూ అర్థం కానట్లుగా ఇండియాను తాటస్థ్యం మానమనీ, పశ్చిమదేశాలను శరణుకోరమనీ సలహాలిస్తున్నారు, ఆర్థిక ప్రణాళికలు వద్దంటున్నారు, దొడ్డిదారిన మళ్ళీ మనని కసాయి ఖైదులోకి చొరబడమనీ, అదే మనకు ముక్తిమార్గమనీ అంటున్నారు  ఇది రాజకీయవిజ్ఞత ఎలా అవుతుంది?  మాయ!

అమెరికావాళ్ళు ఇన్నాళ్ళూ పాకిస్తానుని మనమీదకు ఎగదోశారు  ఇప్పుడు కూడా ఆయూబ్ చెవికొరికి కాశ్మీర్‌లో సాధ్యమైనంత కాజెయ్యమంటున్నారని వినికిడి  ఇండియా చీనాల మధ్య సరిహద్దు సంప్రదింపుల కోసం కృషి చేస్తున్నందుకు సింహళానికి 'సహాయం' బిగదీశారు కాని వాళ్ళు మనకు ఆయుధాలిస్తున్నారు! వాళ్ళు మనకు హితులా, అహితులా?  ఎవరి ఇష్టం వచ్చినట్టు వారనుకోవచ్చు  అంతా మాయ!

రష్యా మనకు పబ్లికు ఆర్థికరంగంలో చాలా సహాయం చేసింది  మిగ్ విమానాలిచ్చింది అలాటి విమానాలు తయారుచేసే ఫ్యాక్టరీ ఏర్పాటుచేస్తున్నది  అయితే రష్యా కమ్యూనిస్టు

దేశం ఇంతకీ మనకు రష్యా మిత్రుడా, శత్రువా? ఏ అభిప్రాయమైనా చెప్పండి, దాన్ని ప్రచురించే పత్రికలు నేను చెబుతాను

ఈ వారమే ఒక రేడియో ప్రసంగ భాగం నా చెవినపడింది ప్రసంగం చేసేవారు నీఫాలో మన జవాన్లు ఇంకా యుద్ధం చేస్తున్నట్లు మాట్లాడారు! జగత్తును పట్టి పీడించి, మనుషులను కీలుబొమ్మలు చేసి ఆడించే మహామాయలో ఇది కూడా ఒక భాగమే!

విశాలాంధ్ర, 3-3-1963

# 53. మన అజ్ఞానం

స్వాతంత్ర్యం వచ్చిన ఇరవై యేళ్ళకు ఒక జాతిగా మనకుగల అజ్ఞానం తలచుకుంటే నిజంగా ఆశ్చర్యం కలుగుతుంది

ఈ పరిస్థితిని సమర్థించటానికి ఎన్నిసాకులైనా చెప్పవచ్చు రాజకీయ స్వాతంత్ర్యం వచ్చినా మనకు ఆర్థికస్వాతంత్ర్యం రాలేదు రెండుమూడు శతాబ్దాల పర పరిపాలన యొక్క దుష్ఫలితాలు అంత తేలికగా పోవు మన జాతీయ(ప్రాచీన) సంస్కృతిని పునరుద్ధరించుకోకపోతే మన గతి ఇంతే ఫ్రీ ఎంటర్‌ప్రైజ్ లేనిదే మన సంస్కృతి అభివృద్ధి కావటం కల్ల, కమ్యూనిజం వస్తేనే గాని మనజాతి ముందుకుపోదు- ఇత్యాది

కాని ఇవన్నీ విషయాన్ని దాటవేసే సిద్ధాంతాలు ఆర్థికంగా పైకివచ్చిన దేశాలలోనే సంస్కృతి పెరుగుతుందనటానికి ఏమీ ఆధారంలేదు పోతన పొలం దున్నుకుంటూ భాగవతం అనువదించిన సంగతి అందరికీ తెలిసినదే త్యాగరాజుగారు ఎడాపెడా ఇళ్ళస్థలాలు కొనెయ్యలేదు ఎస్టేట్లు సంపాదించలేదు పర పరిపాలన సాంస్కృతికంగా మనకు కీడుచేసినంతగా మేలు కూడా చేసింది మన రాజ్యాంగం దగ్గిరనుంచి, మనం సినిమాలు తీయటం దాకా ఆ పాశ్చాత్యులు పెట్టిన భిక్షే ఇంగ్లీషు మాటల సహాయం లేకుండా మన చదువుకున్న వాళ్ళు రెండు నిమిషాలపాటు మాట్లాడలేరు ఈ దేశంలో ఇంగ్లీషుకు స్థానం లేకుండా చేసే పక్షంలో రక్తపాతం జరిగేలాగా కనబడుతుంది ఇంగ్లీషువాళ్ళ ప్రభావం చేతనే మనకొక యంత్రనాగరికతా, జాతీయాభిమానమూ, ప్రజాతంత్రాభిలాషా, ప్రపంచదేశాలతో ఇచ్చిపుచ్చుకునే స్తోమతా కలిగాయని చరిత్రకారులు కూడా ఒప్పుకుంటున్నారు మన ప్రాచీన జాతీయ సంస్కృతి గొప్పదే అయిఉండవచ్చును కాని అది మన పతనాన్ని అరికట్టలేకపోయింది ఆ సంస్కృతి అవసరమైన భౌతిక ఉపాధులీనాడు లేవు మళ్ళీ భోజరాజులు వచ్చి కవులకు అక్షరలక్షలివ్వరు మళ్ళీ కృష్ణదేవరాయుళ్ళు వచ్చి తమ స్వహస్తాలతో కవులకు గండపెండేరాలు తొడగరు ఇంకో సంగతేమంటే మన సంస్కృతి భోజరాజుల తోనూ, కృష్ణదేవరాయుళ్ళతోనూ అంతరించిపోలేదు తిండికి లేనివాళ్ళూ, సంఘానికి వెలి అయినవాళ్ళూ, సైతం దాన్ని ముందుకు తీసుకుపోయి, చచ్చాక అయినా భళీ అనిపించుకున్నారు ఫ్రీ ఎంటర్‌ప్రైజ్ మాటకొస్తే అందుకు ఆదర్శశిఖరమైన అమెరికాలో వెర్రితలలు వేసిన కళలకు ఆరాధన జాస్తి అయింది 'పొరపాటున తప్ప హాలీవుడ్ నుంచి మంచి చిత్రం రాదు" అని ఒక హాలీవుడ్ రచయిత ఏనాడో అన్నాడు పులిట్జర్ బహుకృతి పొందిన ఓనీల్ ఆ బహుకృతిని గురించి అవహేళనగా

మాట్లాడాడు అదీ ఫ్రీ ఎంటర్‌ప్రైజ్ నిర్వహించే సాంస్కృతిక పాత్ర పోనీ కమ్యూనిజం మీద ఆశలు పెట్టుకుందామన్నా, రష్యాలో టాల్‌స్టాయ్, చెహోవ్, గోర్కీ మొదలైన రచయితలూ, చీనాలో లూసున్ వంటి వాళ్ళూ రావటానికి కమ్యూనిజం లేకపోవటం అడ్డురాలేదు

అలాటప్పుడు మన సాంస్కృతిక అంధత్వానికి కారణం ఇవేవీ కాదనే అనుకోవాలి

"ఒక జాతి ఆదరించే, లేక నిరసించే కళలు ఆ జాతి యొక్క ఆరోగ్యానికీ, సంస్కృతికీ కొలబద్దలు" అని డా రాబర్ట్‌స్టీల్ అనే అమెరికన్ విజ్ఞానవేత్త అన్నాడు (అమెరికాలో చచ్చు సినిమా చిత్రాలకు ఆదరం ఉన్నదని చెప్పటానికి ఉపోద్ఘాతంగానే ఈ మాట అన్నాడనుకోండి')

ఈ మాటే నిజమైతే మన ఆరోగ్యం మాటేమిటి? మన సంస్కృతి ఏ మురికిగుంటలో ఉన్నది?

మిగిలిన ప్రాంతాలను వదిలేసి మన ఆంధ్ర గురించే అనుకుందాం ఒక జాతిగా మనం ఆదరించే సాహిత్యం ఎటువంటిది? మనం ఆకాశానికెత్తే సినిమాలేవి? మనం 'పడిచచ్చే' సంగీతకళ ఏ జాతిది? మనం ఎంత క్షుద్రమైన కళలను ఆరాధించే స్థితికి దిగజారిపోయాం!

ప్రపంచంలో అనేకరంగాలలో విజ్ఞానం ముందుకుపోతున్నది అది ముందుకుపోతున్నకొద్దీ మనం వెనక్కు పోతున్నాం

మనం ఈనాడు– ఈ ఇరవైఏళ్ళ నుంచి సర్వస్వతంత్రులం మన జాగృతికిప్పుడు కవాటాలు లేవు మన శక్తులను అణచిపెట్టేవాడు లేడు విడుదలచేశాక ఖైదునే పట్టుకువేళ్ళాడే వాడి స్వేచ్ఛాప్రియత్వం సంశయాస్పదమైనది మన ప్రజలలో వివిధ వైజ్ఞానిక గ్రంథాలను చదవాలనే తృష్ణ ఎందుకు పుట్టలేదు? ఇతరదేశాలను గురించి తెలుసుకోవాలనీ, ఇతర దేశభాషలు నేర్చుకోవాలనీ మనం ఎందుకు తహతహలాడలేదు? కనీసం మన దేశంలోనైనా ఏయే ప్రాంతాలలో ఎటువంటి సాహిత్యం పుట్టుతున్నదో, ఎలాటికళలు అభివృద్ధిలోకి వస్తున్నాయో తెలుసుకునేటందుకు మనం ఎందుకు ప్రయత్నించలేదు?

సత్యజిత్‌రాయ్ చిత్రాలకూ, రవిశంకర్ సితార్ వాద్యానికీ, ఎం ఎస్ సంగీతానికీ, ఎస్ వి రామారావు చిత్రకళకూ, ఆర్ కె నారాయణ్ రచనలకూ పై దేశాలలో హర్షధ్వనులు వస్తే వాటిని ప్రతిధ్వనించటానికి మనకు నిజంగా స్వాతంత్ర్యం రావాలా?

ప్రతి జాతీ ఏవో కళలను సృష్టిస్తుంది ఆ కళలు వివిధస్థాయిలలో ఉండటం కూడా స్వాభావికమే అందరు కవులూ అత్యుత్తమ కవిత్వం రాయలేరు అందరు గాయకులూ అత్యుత్తమంగా పాడలేరు ఇలాగే ప్రతికళలోనూ ఉచ్చనీచాలుంటాయి అందుకు ఎవరూ తప్పుపట్టరు

కాని అలా సృష్టి అయ్యే కళలలో ఉత్తమమైన వాటికి ప్రచారంగాని, ఆధారం గాని, చివరకు గణనకాని లేకపోగా, రెండోతరగతికీ, మూడో తరగతికీ చెందిన కళలకు కీర్తీ, గుర్తింపూ, సన్మానమూ, ప్రజాదరణ మొదలైనవి లభించటం జాతియొక్క సాంస్కృతిక వికాసానికి గీటురాయి అనిపించుకోదు రెండోరకం, మూడోరకం కళాకారులు సంఘంలో గొప్ప కీర్తి, ప్రతిష్టలు పొందుతుంటే, ఉత్తమ కళాకారులు అనాదరణపాలు కావడం సంఘం యొక్క 'అనారోగ్యాన్ని' సూచిస్తుంది

ఆంధ్రులు చాలా రోగగ్రస్తులై ఉన్నారు దానికేమీ సందేహం లేదు ఆంధ్రలో హెచ్చుగా అమ్ముడయే సాహిత్యం ఎటువంటిదో, ఎక్కువగా డబ్బుగడించే సినిమా చిత్రాలు ఎటువంటివో, జనం జాస్తిగా ఎగబడే నాటకప్రదర్శన ఎటువంటిదో, మన కళావిమర్శకులు ఎంత కళాభిజ్ఞులో- ఇదీ, అదీ ఏమిటి మన సాంస్కృతిక చైతన్యం ఏ స్థాయిలో ఉంటున్నదో తెలుసుకోవాలంటే, ప్రతి ఒక అంశంలోనూ మనకన్న ఒక్క అడుగు ముందున్నవారితో పోల్చి చూసుకోవాలి అందుకు తగిన ఓపిక కూడా మనకు లేదు

సంవత్సరం పై చిల్లర క్రితం కేరళలో అఖిలభారత రచయితల సమావేశం జరిగినప్పుడు, సినిమా కళ మృగ్యంగా ఉన్న చిత్రాలకి నమూనాగా ఒక తెలుగు చిత్రం నుంచి రెండురీళ్ళు ప్రదర్శించి చూపారు దానితోపాటు 'పొటెమ్కిన్' చిత్రం నుంచి కూడా రెండురీళ్ళు ప్రదర్శించి, రెంటికీ తేడా వివరించారు వారు చూపిన తెలుగుచిత్రం చచ్చుదేమీ కాదు- శతదినోత్సవాలు విరివిగా చేసుకున్న చిత్రమే

ఇలాటి సందర్భాలలోనే, జాతీయ సంస్కృతి పెంపొందాలన్న కాంక్ష తీవ్రంగా గలవాడికి బాధ కలిగేది కాని వ్యక్తులు బాధపడినమాత్రాన పరిస్థితులు మారవు సాహిత్యం గురించీ ఇతర కళలను గురించీ బాధపడే బాధ్యతను రకరకాల అకాడమీలు, పరిషత్తులు, సమాజాలు గుత్తకు తీసుకున్నాయి వాటికి బాధపడేశక్తి లేకపోవటమే అసలైన బాధ

అకాడమీలూ, పరిషత్తులూ, సమాజాలూ - వీటి స్థాయినుంచి దిగివచ్చి చూసినా ఆశాకిరణాలు ద్యోతకం కావటంలేదు మన సంస్కృతిని ప్రచారం చేసే భారాన్ని మీదవేసుకున్న వివిధ దిన, వార, మాస పత్రికలున్నాయి ఒకవిధంగా ఇవే తమ బాధ్యతను మరింత బాగా నిర్వర్తించగలవనాలి ఏమంటే ఇవి ప్రజలకు సన్నిహితమైనవి వీటికి బహుళప్రచారం ఉన్నది వీటి ద్వారా తమ అభిరుచులను, విజ్ఞానాన్ని పెంపొందించుకునే అవకాశం ఉన్నట్టయితే ప్రజలు తప్పక లాభం పొందగలరు

కాని పత్రికలు విధిగా అనుసరించవలసిన వ్యాపారధర్మం అందుకు అనుకూలంగా వున్నట్టు కనబడదు ఏ వ్యాపారకళను తీసుకున్నా, ప్రజల అభిరుచులను మరింత దిగలాగి, వారిని మరింత అజ్ఞానంలో ఉంచటమే ఎక్కువ లాభసాటి అయినట్టుగా కనబడుతుంది

బ్రిటిషువారి వలసవిధానాన్ని అనేకమంది అనేకవిధాలుగా తప్పుపట్టుతున్న కాలంలో, హెచ్ జి వెల్స్ మరొకందుకు తప్పుపట్టాడు- వలసదేశాలవారికి నిజమైన సాహిత్యం అందకుండా చేస్తున్నారన్నాడు 'దోపిడీ విధానం' అనే దానికి ప్రజలలో సరి అయిన కళాభిరుచులు లేకపోవటమూ, సాంస్కృతికంగా వెనకపడి ఉండటమూ ఎంతైనా సహాయకారి అని చెప్పక తప్పదు జాతీయంగా మనలో ఈ వెనుకబాటు అలాగే ఉన్నది గనక, మనకు ఒకరకం పారతంత్ర్యం తప్పినా, దాని స్థానే మరొకరకం పారతంత్ర్యం అమలులోకి వచ్చిందనుకోవాలి

బహుభాషావాదం ఈ పరిస్థితిని మరింత అధ్వాన్నం చేసేటట్టు కనబడుతుంది దేశానికంతకూ ఇంగ్లీషు సామాన్యభాషగా ఉన్నప్పుడే, ఆ భాషతో పరిచయం గలవారి సంఖ్య చాలా తక్కువ గనక మన దేశ భాషా పత్రికలు తోటి ఇంగ్లీషు పత్రికలతో పోటీ పడవలసిన అవసరం లేకపోయింది ఇంగ్లీషులో నడిచే పత్రికలకన్న చాలా చచ్చుపత్రికలను మనం

నడపగలిగాం ఇంగ్లీషులో రాసి పంపితే ఏ పత్రికా వేసుకోని చెత్తను తెలుగులో పత్రికలు ప్రచురించి ప్రజలచేత చదివించకలిగాయి

ఆ ఇంగ్లీషే సామాన్యభాషగా మాత్రమే కాక, చదువుకున్న వారందరికీ నిర్బంధ భాష అయి ఉన్నట్టయితే ఇది సాధ్యమై ఉండేది కాదు

నేను ప్రస్తుతం చర్చించే సమస్యకు సంబంధించినంతవరకు ఇంగ్లీషుగాని, హిందీ గాని, ఏది సామాన్యభాష అయినా ఒకటే అది నిర్బంధభాష కావటం అవసరం కనీసం, అలా అయినపక్షంలో ప్రాంతీయమైన అజ్ఞానం చాలావరకు సరి అవుతుంది

లేనిపక్షంలో ఒక భాషాప్రాంతం లోని ఉత్తమకళల ప్రభావం మరొక ప్రాంతం మీద ఉండదు ఎవరి ఆముదపు చెట్లను వారు మహావృక్షాలని చెప్పుకుంటూ సంతోషిస్తారు భారతీయులంతా ఒకేజాతి అన్నది ఎన్నటికీ నిజం కాబోదు

జాతీయ సాంస్కృతిక నిర్మాణం మాటలతో జరిగేది కాదు అందులో కూడా ఎంతో పోరాటమూ, సంఘర్షణా ఉన్నది ఒకరకం సంస్కృతి, ఒకవర్గానికి ఆర్థికంగా అచ్చుబాటుగా ఉన్నప్పుడు, దానిలో ఏ మాత్రం అభివృద్ధి కలుగుతుందన్నా ఆ వర్గం కత్తులు నూరుతుంది రాజకీయ పోరాటాలకైనా ప్రజా సమూహాన్ని ఆయత్తం చేయవచ్చుగాని, సాంస్కృతిక పోరాటంలో ప్రజల సహకారం అనుమానాస్పదం వారు తమ సంస్కృతిలోపంగా ఉన్నదని గుర్తించిననాడు పోరాటం ఉండనే ఉండదు సాంస్కృతికరంగంలో దోపిడీవర్గాలు 'ప్రజలవెనక నడవటం' బాగా నేర్చి ఉంటాయి ఎవడైనా తమకు ముందుండి నడిపించినప్పుడే ప్రజలు వాడి నాయకత్వాన్ని గుర్తించగలరు వెనకనుంచి తోలేవాడు తమను నడిపిస్తున్నాడన్న జ్ఞానం వారికి ఉండదు డబ్బుదాహంతో కళలను ఉత్పత్తిచేసేవాళ్ళు తమ అభిరుచులను దిగలాగుతున్నా ప్రజలు తెలుసుకోలేరు తమ అభిరుచులు ఐచ్ఛికమైనవేనని వారు నమ్ముతారు

మన జాతీయ సాంస్కృతిక సమస్య ఎంత క్లిష్టమైనదో సూచించటానికి ప్రయత్నించాను దీనికి పరిష్కారం ఏమిటో పెద్దలంతా శ్రద్ధగా ఆలోచించాలి ఇది అశ్రద్ధ చేయవలసిన సమస్య కాదు మన జాతి యొక్క భవిష్యత్తు అధికంగా ఆధారపడిన ప్రధానవిషయాలలో ఇది ఒకటి

లత, మాసపత్రిక, నవంబరు 1967

# 54. దేవరహస్యాలు

అవీ అందరికీ అంతుబట్టవు లోకమంతా కోడైకూసినా రుజువుకురావు వాటిని గురించి ఒక్క సాక్ష్యాధారం కూడా దొరకదు అవి దేవరహస్యాలు దేవుడికి మాత్రమే వాటిని గురించి నిజం తెలుస్తుంది కమిటీలూ, పాడూ వేసి, వాటిని రుజువు చేసి, నివేదికలు అండర్‌గ్రౌండ్ వెళ్ళిపోకుండా చూసేశక్తి, పైనున్న వాడికి ఉందేమో తప్ప, మానవమాత్రులకుండదు

ప్రెసిడెంటు కెనడీ హత్య ఒక దేవరహస్యం ఈ సంగతి అందరూ ఒప్పుకున్నారు హత్యజరగటం చూసినవాళ్ళున్నారు కాని వాళ్ళు సాక్ష్యం ఇచ్చి దేవరహస్యం బట్టబయలు చెయ్యకుండా పైనున్నవాడు వాళ్ళను తీసుకుపోయాడు! ఆ హత్య దేవరహస్యమనటానికి అంతకన్న వేరే రుజువేం కావాలి?

గాంధీ మహాత్ముడు ప్రాణాలు వదిలింది బిర్లాగారి ఇంట్లోనా, బయటి కాంపౌండులోనా? ఎవరికీ తెలీదు ఎందుచేతనంటే అది దేవరహస్యం! దేవరహస్యాలు మంత్రులకు పట్టుబడునా? బడవు బడవు!

ఇంకో పది పదిహేనేళ్ళు పోయాక, గాంధీగారు ఏం జబ్బుతో పోయాడన్న మీమాంస కూడా వచ్చి అదో దేవరహస్యంగా పరిణమిస్తే మన పిల్లలు ఆశ్చర్యపడతారు ఎంచేతనంటే, వర్తమాన చరిత్ర గురించే గాక గతచరిత్ర గురించి కూడా దేవరహస్యాలు పుట్టుకొస్తాయి చరిత్రకారులు వాటిని గురించి ఎటూ తేల్చలేక చాలా తికమకపడిపోతారు

1942 ఆగస్టు ఉద్యమం బాధ్యత కాంగ్రెసుదా, కాదా అని 1943లోనే తేల్చటం అసాధ్యమైపోయింది

కొన్ని కొన్ని చారిత్రక సత్యాలు స్పష్టంగా ఉన్నట్టే ఉండి అకస్మాత్తుగా దేవరహస్యాలైపోతాయి ఆ తరవాత చచ్చినా నిజంతేలదు

ఇండియాకు స్వరాజ్యం తెచ్చింది కాంగ్రెసా కాదా అన్న సమస్యకు తావే లేదని అందరము అనుకుంటున్న సమయంలో ఎవరో 'కాదు' అనేశారు ఆ తరవాత అవునని రుజువు చెయ్యటం మహాకష్టమైపోయింది స్వరాజ్యం పుచ్చుకున్నది కాంగ్రెసే, కాని తెచ్చింది? నేవల్ తిరుగుబాటా? ఇండియన్ నేషనల్ ఆర్మీయా? బ్రిటిషువారి దుస్థితా? భారత కమ్యూనిస్టుపార్టీయా? ఎవరు? ఏది? అది దేవరహస్యాల జాబితాలో చేరిపోయింది

అట్లాగే చీనా, ఇండియా వార్ రెండుదేశాలమధ్యా టపాకాయలు పేలటానికి మూలకారణం ఎవరు? మనమా? వాళ్ళా? అటూ, ఇటూ కూడా సాక్ష్యం దొరుకుతున్నది అదో చారిత్రక దేవరహస్యం

చరిత్రలో ఇలాటి దేవరహస్యాలుండటంలోనూ ఓ ఉపయోగం ఉంది ఎవడికి కావలసినట్టు వాళ్ళు చరత్ర రాసుకోవచ్చు ఇలా దేవరహస్యాలు సృష్టించేశక్తి మన భారతీయులకున్నట్టు మరెవరికీ లేనందుకు మనం గర్వపడవచ్చు పాశ్చాత్యులకు ఈ విద్యే తెలీదు (పాశ్చాత్యుల నుంచి అమెరికాను మినహాయించండి దేవరహస్యాలు సృష్టించటంలో మనం వాళ్ళ నుంచి నేర్చుకోవలసింది చాలా ఉంది!)

ఉదాహరణకు విక్టోరియా మహారాణి ఎడ్వర్డు సార్వభౌముడూ ఏలుతుండగా ఉండిన వాళ్ళింకా బతికి ఉండగానే వాళ్ళ'రంకు'లన్నీ బయటపెట్టేశారు బ్రిటిషువాళ్ళు

రష్యా కమ్యూనిస్టుదేశం కావటం చేత వాళ్ళకు రహస్యాలుండవు వాళ్ళు చరిత్రను మార్చదలుచుకుంటే ఎవరిమీదుగానో సంకురమయ్యగా చేసి, వాడి పేరు చెరిపేసి చరిత్ర మళ్ళా రచించగలరు అంతేగాని నీళ్ళు నమలరు

చీనా గురించి మనకు అన్ని రహస్యాలూ హాంకాంగ్ నుంచి గానీ, టోక్యో నుంచి గానీ తెలుస్తూనే ఉంటాయి ఆ మధ్య మావో పోయాడా, లేదా అన్నది ఒక దేవరహస్యం కావటానికి ప్రయత్నించింది గాని, దానికి సాధ్యపడలేదు మావో ఇంకా సజీవుడేనని తేలిపోయింది

దేవరహస్యాలు మనదేశంలో పుట్టినట్టు మరే దేశంలోనూ పుట్టవు ఎంత చెడ్డా యిది పుణ్యభూమి!

మనదేశంలో మంత్రులున్నారు ధనికులున్నారు పెద్ద అధికారులున్నారు వీరంతా అవినీతిగా ప్రవర్తిస్తున్నారనీ, అక్రమంగా ఆర్జిస్తున్నారనీ లోకమంతా చెప్పుకుంటున్నది కాని రుజువు లేదు విచారణలు జరిపినా కూడా ఏమీ ఫలితం లేదు రిపోర్టులు తయారైన సందర్భాలలో ఆ రిపోర్టులను భూగర్భంలో దాచవలసిన పరిస్థితి ఏర్పడింది ఎంచేతనంటే వాటిని బయటపెడితే ఇటు చీనాకూ, అటు పాకిస్తానుకూ కూడా అనుకూలించి, దేశక్షేమానికి భంగం వాటిల్లుతుంది! వెధవ రిపోర్టులకన్న దేశక్షేమం ముఖ్యం గద!

పాలకవర్గాలలో అవినీతి తారాపథం అందుకుంటున్నదన్న పుకారు నిజమా, అబద్ధమా? తెలీదు అదీ దేవరహస్యమే

సినిమాలలో బూతు సన్నివేశాలూ, బూతుపాటలూ, బూతుడాన్సులూ ఉన్నాయని సినిమాలు చూసేవాళ్ళు ఒకటే కాకిగోల! ఉంటే సెన్సారు వాళ్ళకు కనబడవా, వినబడవా? బూతు కనిపిస్తేనూ, వినిపిస్తేనూ వాళ్ళు కత్తిరించిపారెయ్యరూ? సెన్సారుబోర్డులో కొద్దిమందికి ఓ వేళ భాష తెలీదనుకున్నా మిగతావాళ్ళకు తెలీదూ? మైథునం లాంటి డాన్సులు పెడితే వాళ్ళు చూడలేరూ?

సెన్సారువాళ్ళు లంచాలు పుచ్చుకుంటున్నారని మరో పుకారు రుజువుచేస్తే చర్య తీసుకుంటానంటున్నారు కేంద్రమంత్రి నిజమే మరీ! లంచం పుచ్చుకున్నవాడు, ఇచ్చినవాడు ఆ మంత్రిగారి దగ్గరికి వెళ్ళి, రామాయణం నెత్తిన పెట్టుకుని ఒప్పుకుంటే, మంత్రిగారు చర్యతీసుకోగలరు గాని, ఆకాశపోకాశ కబుర్లు విని ఎవరినని దండిస్తారు, దేనికని దండిస్తారు?

సెన్సారుబోర్డుకు సంబంధించినవాళ్ళు లంచాలు పుచ్చుకున్నట్టు రుజువులేదంటే, వాళ్ళు నిజంగా సెన్సారు పనిచేస్తున్నట్టే గదుటండీ? వాళ్ళు సరిగా పని చేస్తే అసభ్యదృశ్యాలు లేవనేగా? "మేం చూశాం పాటలు పచ్చిబూతు! మాటలు పచ్చిబూతు! డాన్సులు పచ్చిబూతు!" అని ఎవడో కోన్‌కిస్కా హే అంటే దాన్ని ఎలా నమ్మటం? వాళ్ళు ఏం చూసి ఏమనుకున్నారో!

ఇంతకూ మన సినిమాల్లో అసభ్యత ఉన్నట్టా? లేనట్టా? అడక్కండి అదీ దేవరహస్యమే

అటువంటివే సెక్సుపత్రికలని చెప్పుకునేవి వీటిని గురించి కూడా గగ్గోలు బయలు దేరింది వీటిని కిల్లీషాపుల్లో తోరణాలు కట్టి అమ్మటం కూడా మనం చూడవచ్చు కాని అవి నిజంగా సెక్సుపత్రికలని చదివినవాడు చెప్పినా మనం నమ్మటానికి లేదు ఎందుకంటే, అవి నిజంగా అసభ్యమైన పత్రికలే అయితే ప్రభుత్వం చూస్తూ ఊరుకుంటుందా? వెనక నేను 'మాస్కో న్యూస్' పత్రిక్కి చందా కట్టి వొస్తుంటే ఒక సిఐడీ వాడు వెంటబడివచ్చి మా నాన్నపేరూ, మా ఇంటి ఎడ్రసూ అవీ తీసుకుని వెళ్ళిపోయాడు అసభ్యపత్రికలకు చందాలు కట్టేవాళ్ళను మన ప్రభుత్వం వెయ్యికళ్ళతో కనిపెట్టుకుంటుంది గదా, వాటిని బహిరంగంగా అమ్మనిస్తుందా? అమ్మో! ఎంతమాట!

ఇంకా ఎన్ని దేవరహస్యాలు! ఈ దేశంలో తిండికిమాడి చచ్చేవాళ్ళున్నారా? బ్లాక్‌మార్కెట్ చేసేవాళ్ళున్నారా? కోట్లకొద్దీ పన్నులెగేసేవాళ్ళున్నారా? సాక్ష్యంలేదు రుజువులేదు అవునంటే, కాదనేవాళ్ళూ ఉన్నారు ఎవరిమాట నమ్మటం?

విస్సన్న చెప్పింది వేదమన్నట్టుగా మనమంతా ప్రభుత్వం చెప్పిందే నిజమని నమ్మితే ఈ చిక్కులేమి ఉండవుగద! ప్రతిదీ అనుమానంలో పెడుతున్నది ఎవరు? కమ్యూనిస్టులు వీళ్ళు రష్యా నుంచీ, చీనా నుంచీ రహస్యంగా డబ్బుతెప్పించుకుని ఈ ఆటలాడుతున్నారని, అట్లా అని కొందరంటున్నారు కాని దానికో రుజువులేకపోవటం చేత అదీ దేవరహస్యమే అయిపోయింది

అంటే ఏమిటన్నమాట? దేవరహస్యాలకన్నిటికీ మూలకారణమే ఒక దేవరహస్యం! ఇంక మనం చెయ్యగలిగిందేమిటి? ఏమీ లేదు

జయశ్రీ, మాసపత్రిక, సంక్రాంతి ప్రత్యేకసంచిక, 1969

# 1. సాహిత్యరంగంలో కమ్యూనిస్టు వ్యతిరేకత

కమ్యూనిస్టు వ్యతిరేకత అన్నది రాజకీయరంగంలో ఒక ప్రబలమైన శక్తిగా, ఉన్నతమైన ఉద్యమంగా సాగటం చూస్తున్నాం చారిత్రకదృష్టితో చూస్తే నాకిది దుష్టశక్తిగా మాత్రమే కనిపిస్తుంది ఎందుకంటే ఇది అమెరికా వంటి దేశంలోనే స్వైరవిహారం సాగించి, అక్కడి ప్రజాస్వామిక హక్కులను క్రమంగా కబళిస్తూ, ఫాసిస్టుశక్తులను బలపరుస్తూ, అమెరికాకు గల అపారసంపదను ఎందుకూ కొరగాకుండా చేస్తూ, అమెరికా వైదేశిక విధానం పట్ల ప్రపంచమంతటా అంతో ఇంతో జుగుప్సను ప్రకోపింపజేస్తూ, ప్రపంచాన్ని అణుశక్తికి ఆహుతి చేయటానికి సర్వతోముఖమైన కృషి చేస్తున్నది ఇతర ప్రముఖదేశాలలో రాజకీయదుష్టశక్తులను వామపక్షసమైక్యసంఘటన ద్వారా నిరోధించే అవకాశం ఉన్నప్పుడు కూడా అలాంటి సంఘటనకు వేరుపురుగుగా ఉండి చరిత్రయొక్క పురోగతికి అడ్డుపుల్లగా పనిచేస్తున్నది అయితే ఇదంతా రాజకీయవాదులు ఆలోచించుకోవలసిన సంగతి ఈనాడు రాజకీయరంగంలో 'కమ్యూనిస్టు వ్యతిరేకతా వ్యతిరేకత' అనేది శక్తిగా తలెత్తటమే ఒక ప్రత్యేకగుణం కమ్యూనిస్టు అభిమానం లేనివారు కూడా కమ్యూనిస్టు వ్యతిరేకతను ప్రతిఘటించటానికి ముందుకువస్తున్నారు దీనినిబట్టి కమ్యూనిస్టు వ్యతిరేకత రాజకీయరంగంలో నిర్వహిస్తున్న క్షుద్రపాత్ర అర్థమవుతుంది

ఇంతకన్నా క్షుద్రమైనది సాహిత్యరంగంలో అక్కడక్కడా, అప్పుడప్పుడూ తల ఎత్తుతున్న కమ్యూనిస్టువ్యతిరేకత దీని వాతపడిన బుద్ధిమంతులు కూడా గాడిదలు కాక తప్పదు ఈ హెచ్చరిక చేయటానికే ఈ నాలుగుముక్కలు రాస్తున్నాను

కమ్యూనిజం అనేది ఒక సాంఘిక వ్యవస్థగా ప్రపంచంలో ఎక్కడా అమలులో లేదు తాము త్వరలో అమలుచేస్తామని రష్యనులంటున్నారు కాలక్రమాన సోషలిస్టుదేశాలన్నీ కమ్యూనిస్టువ్యవస్థను సాధించుకోవచ్చు, సాధించుకోలేకపోవచ్చు - కమ్యూనిస్టుసిద్ధాంతాల లోనూ, కారల్‌మార్క్సు సూత్రాలలోనూ నమ్మకంలేని వారన్నట్టు సోషలిస్టుదేశాలన్నీ తిరిగి పెట్టుబడిదారీని ఆశ్రయించి, ధనికవర్గాలను పునఃసృష్టి చేసుకుని అఘోరించవచ్చు ఏమైనా ఇది భవిష్యత్తుకు సంబంధించిన విషయం

కమ్యూనిస్టు పార్టీలంటూ దాదాపు అన్ని దేశాల్లోనూ ఉన్నాయి కొన్ని దేశాలలో ఇవి పెత్తనం సాగిస్తున్నాయి మరి కొన్నిదేశాలలో ప్రతిపక్షాలుగా ఉన్నాయి వాటికి అనుకూలురూ, ప్రతికూలురూ ఉన్నారు వీరు కృషిచేస్తున్నది సోషలిస్టువ్యవస్థ కోసమే సోషలిస్టు పక్షాలనేవి కమ్యూనిస్టు పక్షాలకు వ్యతిరేకంగా పనిచేస్తున్నాయంటే దానికి తగ్గ రాజకీయకారణాలుండే ఉంటాయి కోటీశ్వరుల ఇళ్ళలో దిగే సోషలిస్టునాయకుల సోషలిజం, మసానీ మార్కు సోషలిజం, హిట్లరు ఏర్పాటుచేసిన 'నేషనల్ సోషలిజం' లాంటివి అందరికీ తెలిసినవే

కమ్యూనిస్టుపార్టీలలో ఇన్నిరకాలు లేనిమాట నిజమే గాని వాటిలో కూడా ఇటీవల ఏర్పడ్డ అభిప్రాయభేదాల వైనం నాబోటి రాజకీయపామరుడికి అంత బాగా తెలియటం లేదు కమ్యూనిస్టు సాహిత్యమనేది కూడా ఉన్నది ఇది రాజకీయాలకూ, ఆర్థికాలకూ, మార్క్సిస్టు, లెనినిస్టు రచనలకూ సంబంధించి ఉంటుంది

పైవి మినహాయిస్తే మామూలు సాహిత్యంలోకి 'కమ్యూనిజం' ఎలా ప్రవేశిస్తుందో నాకీనాటికీ బోధపడలేదు కథలు రాస్తాం నవలలు రాస్తాం వాటిలో ఎంతో కొంత జీవితాన్ని ప్రతిబింబింపచేస్తాం రాసేవాడికి జీవితం అంతుచిక్కకపోవచ్చు వాడు అభూతకల్పనలు రాయవచ్చు రచన చచ్చుగా ఉండిపోతుంది దానికి సాహిత్యగౌరవం రాదు కాని కమ్యూనిస్టుకథలు ఎట్లా రాయటం?నాకు తెలియని ఈ రహస్యాన్ని మేధావులనిపించుకున్న వాళ్ళే అర్థం చేసుకున్నట్టు కనిపిస్తుంది మద్రాసులో సాహితీపరుల వెంట తిరుగుతూ, సాహిత్యగోష్ఠులలో పాల్గొనే ఒక 'దొరసాని' నన్ను "నువ్వింకా కమ్యూనిస్టు కథలు రాస్తున్నావా?" అని ఒకసారి అడిగింది "నేను కమ్యూనిస్టును కాను, మార్క్సిస్టున"న్నాను "రెంటికీ తేడా ఉన్నదా?" అని ఆవిడ అడిగింది నేను ఉన్నదనే అనుకుంటున్నాను మార్క్సిజం ఒక తత్వం, ఒక శాస్త్రం మార్క్సిస్టును కాకపూర్వం నేను ఫిజిసిస్టును " ఫిజిసిస్టులకూ, కాంగ్రెసువాళ్ళకూ తేడా ఉన్నదా?" అని ఎవరైనా అడిగితే నేను తప్పక ఆశ్చర్యపడతాను

"ఫలానా ఎల్లయ్య కమ్యూనిస్టు సాహిత్యం రాస్తాడు" అని అనుకునేవాళ్ళూ, పైకి అనేవాళ్ళూ కాస్త తలచెడ్డవాళ్ళని నా అనుమానం వారి దృష్టిలో కమ్యూనిస్టుసాహిత్యమంటే కమ్యూనిస్టులకు నచ్చే సాహిత్యమో, కమ్యూనిస్టు పాత్రలను మంచివాళ్ళుగా చిత్రించే సాహిత్యమో, ఏదీ లేక కమ్యూనిస్టు రాజకీయాలను ఆమోదించేవారు రాసిన డిటెక్టివు నవలలు సయితం కూడానో అయి ఉంటుంది కమ్యూనిస్టుపార్టీపై నిషేధం ఏర్పడేదాకా కమ్యూనిస్టు రాజకీయాలను ఆమోదించి,ఎన్నికలలో కమ్యూనిస్టు అభ్యర్థులకు ఓటువేసే హక్కు ప్రతిపౌరుడికీ ఉంటుంది ఈ సంగతి తలచెడ్డవాళ్ళకి తెలుసు కాని ఈ పరిస్థితిని సహించలేరు ప్రజాస్వామ్యానికి తిలోదకాలిచ్చి అయినా సరే కమ్యూనిస్టుపార్టీ నిషేధించబడే వరకూ వారు తమ కమ్యూనిస్టు వ్యతిరేకతను ఇలా బయటపెట్టుకుంటూ ఉంటారు రాజకీయ రంగంలో కమ్యూనిస్టు వ్యతిరేకత ప్రజాస్వామ్యానికి తిలోదకాలిచ్చేస్తే, సాహిత్య రంగంలో కమ్యూనిస్టు వ్యతిరేకత మనుషుల బుర్రలను పురుగులకు అప్పగించేస్తుంది లాగుంది

ఇంకొక్కరకం అపోహను కూడా ఇక్కడ స్పష్టం చెయ్యాలి సామాజికజీవితాన్ని మతాలు అనుశాసించిన కాలంలో మతసాహిత్యం వచ్చింది వీరశైవులూ, బౌద్ధులూ, జైనులూ, వైష్ణవులూ, కృష్ణభక్తులూ సాహిత్యం సృష్టించారు మతసాహిత్యమే అయినా అది సాహిత్యంగా చలామణి అయింది ప్రతిమతం వాడూ తాను సృష్టించే సాహిత్యంలో ఇతర మతాలను దుమ్మెత్తిపోశాడు శ్రీహర్షుడి వంటివాళ్ళు మతసామరస్యం కోసం బ్రహ్మాండమైన రాజకీయకృషి చేసిన అనంతరం కూడా ఇటువంటి సాహిత్యం వచ్చింది

మతం జీవితాన్ని అనుశాసించేకాలం వెళ్ళిపోయింది అందరూ వాచానే అయినా ప్రశంసించే ప్రజాస్వామ్యానికీ మతాలకూ పొత్తుకలవదు (ముస్లిం రిపబ్లిక్‌లు ఏర్పాటు చేయటానికి జరిగే ప్రయత్నాలు హాస్యాస్పదమైనవి ) ఇది శాస్త్రజ్ఞానయుగం ఈ యుగంలో మతం నల్లమందు భాయీలకు చోటులేదు కాని, వీరిని మనం ఒకంతట వదిలించుకోలేం వారి దృష్టికి ప్రజాస్వామ్యమనేది ఒక మతంగానూ కమ్యూనిజమనేది (లేక మార్క్సిజమనేది) మరొక మతంగానూ గోచరిస్తాయి రచయితలలో మార్క్సిస్టులమని చెప్పుకునే వారందరూ ఒక

మతాన్ని ప్రచారం చేస్తున్నవారే వారు రాసేది నిజమయేది, కళ అయేది గాక, దాని పై పేడనీళ్ళు చల్లకపోతే మార్క్సిస్టు మతం ప్రజలలో వ్యాపించిపోయి ప్రజలను నరకకూపాలకేసి లాగేస్తుంది!

"కమ్యూనిస్టులతో ఏకీభవించవలసి వస్తుందేమోనని మేము "వాన కురుస్తోంది" అనటానికి కూడా భయపడి చస్తున్నాం!" అన్నాడొక పాశ్చాత్యదేశ ప్రతినిధి ఐక్యరాజ్యసమితి నుంచి

పాపం, సాహిత్యకమ్యూనిస్టు వ్యతిరేకుల గతి కూడా అదే అయినట్టున్నది!

ముద్రణ ·జనశక్తి వారపత్రిక 8-6-1963

పునర్ముద్రణ . సాహిత్యప్రయోజనం, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ అక్టోబరు 1963

## 2. ఈ యుగం

ఇది చాలా విచిత్రమైన యుగం ఇటువంటి యుగం చరిత్రలో లేదని చెప్పాలి ఏ దృష్టితో చూచినప్పటికీ ఈ యుగం అపూర్వంగానే కనిపిస్తుంది

శాస్త్ర-సాంకేతిక దృష్టితో చూద్దాం ఇది ఐన్‌స్టయిన్ యుగం, సాపేక్షసిద్ధాంత యుగం, ఆంటీ బయోటిక్‌ల యుగం, ఆటోమేటిక్ యంత్రాల యుగం, స్పూత్నిక్కులయుగం, అంతరిక్షయానాల యుగం, అణువుబాంబుల యుగం, రేడియేషన్ చికిత్సల యుగం!

శాస్త్రజ్ఞానం పైనా, శాస్త్రీయపరికరాల పైనా, కృత్రిమపదార్థాల ఉత్పత్తిపైనా ఆధారపడిన జీవితరంగాలు ఏనాడూ మానవుడు ఎరగని వేగంతో పురోగమిస్తున్నాయి ఎన్నో శతాబ్దాలుగా స్తంభించి ఉన్న మానవజీవితం గడిచిన రెండుశతాబ్దాలలోనూ కదలబారి, ఈనాడు తెర్లుతున్నది

రాజకీయరంగంలో ఆదర్శాలకు ఏనాడూ లేనంత ప్రాముఖ్యం వచ్చింది రాజకీయమానవుడు భావపుష్టి సంపాదించాడు పదవుల కోసమో, స్వార్థంతోనో రాజకీయాలను అనుసరించేవారు అనామకులైపోతున్నారు ఒక జీవితవిధానానికి జీవితాలను అంకితం చేసేవారు చరిత్రకు రూపం ఇస్తున్నారు ఒకప్పుడు ఆదర్శప్రాయంగా భావించబడిన ప్రజాస్వామ్యం పరిస్థితుల ప్రభావానికి తట్టుకోలేక స్తంభించి ఉంటే సోషలిస్టు భావాలకూ, ఫాసిస్టు భావాలకూ మధ్య అసలైనపోరాటం సాగుతూ, ఆ పోరాటాన్ననుసరించి చరిత్ర నడుస్తున్నది ఈ పోరాటం మన పురాణాలలో చెప్పబడే కృతయుగం నాటి దేవదానవ పోరాటాలకు ఏ విధంగానూ తీసిపోయేది కాదు మానవ పురోభివృద్ధి సాధన ఒక పక్కా, దాని నిరోధం ఒక పక్కా ఉండి వివిధ రూపాల పోరాటం సాగిస్తున్నాయి రాజకీయపరిజ్ఞానం లేని అమాయకులు వేరు వేరు పోరాటాలను వేరు వేరు పేర్లతో పిలవవచ్చు గాక, కాని పోరాటం అంతటా ఒకటే

మానవుల చారిత్రకదృష్టి ఈ యుగంలో ఎంతగా మారిపోయినదీ చూస్తే ఆశ్చర్యం వేస్తుంది నేను చరిత్రపాఠాలు చదువుకున్న రోజులలో రాబర్ట్‌క్లయివ్ విజయాలు నా విజయాలేనన్న భావం కలిగించారు సిపాయీల కలహం అణచబడింది నా మంచికోసమేనని తోపింపజేశారు పారిశ్రామికదేశాలు వెనుకబడిన దేశాలపట్ల వలసవిధానాలు అవలంబించటం సహజమూ,

ధర్మమూ అనే నమ్మకం ఉండేది మన దేశం కూడా గొప్ప దేశమేననుకోవటానికి రాజపుత్రుల కథలు చదివేవాళ్ళం ప్రపంచచరిత్ర ఏమిటో తెలిసేది కాదు

ఒకే దేశపు చరిత్ర చదివినవాడికి చరిత్ర యేమిటో తెలియదు– తన అనుభవం మాత్రమే తెలిసినవాడికి జీవితం తెలియనట్టు ఈ యుగంలో చరిత్ర అంటే సమస్తదేశాల చరిత్రా అయిపోయింది సామ్రాజ్యాల చుట్టూ ఉండే గోడలు పడిపోయాయి ఏ ఒకదేశం స్వాతంత్ర్యం కోసం పోరాటం సాగించినా మిగిలినదేశాలూ ఆ పోరాటాన్ని బలపరుస్తున్నాయి బలపరచక వ్యతిరేకించే రాక్షసశక్తులు నగ్నంగా ప్రపంచప్రజల యెదుట ప్రత్యక్షంగా కనిపిస్తూనే ఉన్నాయి అందుచేతనే ఈనాటి ప్రపంచంలో సాగే ప్రతిపోరాటానికీ అంతర్జాతీయ గుణం అంతో ఇంతో ఉంటున్నది

పరిమితమైన ప్రయోజనాల కోసం ఒకే దృక్పథం (మాటవరసకు, సామ్రాజ్య విస్తరణ కాంక్ష) గల పార్టీల మధ్య జరిగిన సంఘర్షణలతో పోలిస్తే ఈనాటి సంఘర్షణలు అతి క్రూరమైనవి చరిత్రను వెనక్కుమళ్ళించటానికి యత్నించేవారు ముసుగులతో పోరాడరు వారి రాక్షసత్వం నగ్నంగా బైటపడక తప్పదు ఈ రాక్షసత్వాన్ని కప్పటానికి మూకుడులేదు ఉండటానికి వీల్లేదు

ఇది మానవజాతి మేలుకొని, కలయజూసుకుని, చైతన్యం పొందదగిన యుగం గత యుగాలలో మానవుణ్ణి పీడించిన దారిద్ర్యమూ, కాటకాలూ, అల్పాయువూ, అంటువ్యాధులూ, ఆకలీ– ఇవేవీ అనివార్యం కాదు ఎంత ధనధాన్యాలతో తులతూగే దేశమైనా సహకార కృషితో తన సంపదను కొద్దిసంవత్సరాలలో రెట్టింపుచేసుకోవచ్చు గడచినకాలంలో వెనుకబడిన దేశాలు తమనుచూసి తాము సిగ్గుపడాలి వెనుకపాటు కూడా అనివార్యం కాదు, దానికి విరుగుడు ఉన్నది

మానవాభివృద్ధి కోరేవారు లక్షకు లక్షా, దాన్ని ప్రతిఘటించేవాడు లక్షకు ఒకడూ అయినప్పుడు యుద్ధాలు కూడా అనివార్యం కాదు కాని ఆ ఒక్కడూ అభివృద్ధినిరోధక పాత్ర వహించినంత కాలమూ పురోభివృద్ధి కోసం పోరాటం తప్పనిసరి అయినప్పటికీ నేటిప్రపంచంలో ఆ పోరాటాలు తప్పనీ, యుద్ధాలే ఒప్పనీ భావించే అజ్ఞానులున్నారు

నేటియుగంలో అసలైన అజ్ఞానం చారిత్రకదృష్టి లేకపోవటం, ఉజ్వల భవిష్యత్తుకోసం ప్రపంచమంతటా కొనసాగుతున్న సంఘర్షణ యొక్క స్వభావాన్ని గ్రహించలేక అంతర్జాతీయ జీవితఖండాలను దేనికదిగా చూడటం ఈ హ్రస్వదృష్టి గలవాడు నేటియుగధర్మాన్ని గ్రహించలేడు గతంలోనే జీవిస్తాడు చరిత్ర ముందుకు నెట్టితే తప్ప కదలడు ఇలాటివారు నేటి మన పాలకవర్గంలోనే అనేకులున్నారు దేశ ప్రజలమాట వేరే చెప్పనవసరం లేదు

విహారి, మాసపత్రిక, 26-1-1964

# 3. కమ్యూనిస్టు విముఖత అంటే ...

జరుగుబాటు లేక, భవిష్యత్తు శూన్యంగా ఉండే మధ్యతరగతి మేధావి అయినవాడికి కమ్యూనిజం మీద ఎంత దురభిప్రాయం ఉండవచ్చునో నాకూ అంత ఉండేది అందుకవసరమైన ఒక్క అర్హతా నాకుండేది- కమ్యూనిజమంటే ఏమిటో నాకు తెలీదు, మార్క్స్, లెనిన్‌ల రచనలు నేను చదవలేదు

నేను కమ్యూనిస్టు వ్యతిరేకిని కాను, విముఖుణ్ణి ఈ విముఖత ఎట్లా ఏర్పడింది? మనం చూడని సినిమా గురించి, చదవని పుస్తకం గురించి చెడ్డగా గాని, మంచిగా గాని ఎందుకు మాట్లాడటం జరుగుతుంది? ఇతరుల అభిప్రాయాలు 'రిలే' చెయ్యటం వల్ల కమ్యూనిస్టు విముఖత నాకు పరిసరాల నుంచి సోకింది గొప్ప సోషలిస్టు మేధావిగా జగద్విఖ్యాతి పొందిన హెచ్‌జి వెల్సు తన నవలలలో కమ్యూనిస్టులను కొద్దిగా మతిచలించిన వాళ్ళుగా చిత్రించాడు ఆ ప్రచారం కూడా నాకు తలకెక్కింది

దీనికి తగ్గట్టే కొత్తరోజుల్లో కమ్యూనిస్టులు కొత్త మతం పుచ్చుకున్నవాళ్ళ లాగా, విలక్షణంగా ప్రవర్తించేవాళ్ళు విలక్షణమైన పదజాలం ఉపయోగించేవాళ్ళు 'మతాంతరుల'ను చూసి జాలిపడుతున్నట్టూ, వాళ్ళను అజ్ఞానులకింద జమకట్టినట్టూ కనబడేవాళ్ళు- లేకపోతే కమ్యూనిస్టు వ్యతిరేకత అట్లా అనిపించేటట్టు చేసేదో! ఒకటి నిజం- వాళ్ళు 'మమ్మల్ని' ఎట్లా చూస్తున్నారనుకునేవాళ్ళమో, అట్లా మేం మటుకు 'వాళ్ళను' చూసేవాళ్ళం!

ఆ రోజుల్లో బెంగాలీ పత్రికలు 'డయలెక్టిక్స్' గురించి వ్యాసాలు ప్రచురించాయి చక్రపాణి గారికి బెంగాలీ పత్రికలు వచ్చేవి 'డయలెక్టిక్స్' అంటే ఏమిటని ఆయన నన్నడిగితే 'డయలెక్ట్'కు సంబంధించినదా అని ఎదురు అడిగాను నేనామాట కూడా విని ఉండలేదు

కమ్యూనిస్టులంటే ద్వేషం లేకపోయినా, సదభిప్రాయం అంతగాలేని మిత్రుడొకతను మార్క్స్ రాసిన 'కాపిటల్' చదవయత్నించి ఒక్క విషయం బయటపెట్టాడు "కాపిటల్' నేననుకున్న దానికన్నా చాలా సీరియస్ పుస్తకం ఈ కామ్రేడ్స్‌లో ఎంతమంది దాన్ని సొంతం చదివారో, ఎంతమంది పూర్తిగా అర్థం చేసుకున్నారో చెప్పలేను" అన్నాడతను

అప్పటికే నేను జీవితంలో ఆర్థికవిషయాలకు గల ప్రాధాన్యతను గుర్తించి ఇకనామిక్స్ పాఠ్యపుస్తకం తెచ్చి చదివాను (కాలేజిలో నేను చదువుకున్నది సైన్సు ) గోపీచందు గారు హెన్రీజార్జి పుస్తకాలు సంపాదించి చదవమని సలహా ఇచ్చారు చదివాను కాని నా స్నేహితుడు చెప్పినతరువాతనైనా నేను 'కాపిటల్' చదవటానికి ప్రయత్నించనేలేదు

అందుకు నేను ఆటే గిల్టీగా ఫీల్‌గాలేదు ఏమంటే కాపిటల్ లైబ్రరీలలో గాని, కొనటానికి గాని ఆ రోజులలో లభ్యమయేది గాదు కమ్యూనిస్టులతో సాన్నిహిత్యం ఉంటే వారా లోటు తీర్చేవారేమో, అదీ జరగలేదు నేను ఆనాటి పత్రికలను ఈ విషయంలో తప్పుపడతాను మంచో చెడో మార్క్సిజం సోషలిజం అన్నవి ప్రపంచమంతటా భావసంచలనం తెస్తున్నాయి వాటిని గురించి బెంగాలీ పత్రికలలాగా తెలుగుపత్రికలెందుకు వ్యాసాలు ప్రకటించకపోవాలి?

ఆనాడే కాదు, ఈనాడు కూడా పాఠకులలో జ్ఞానతృష్ణను రేకెత్తించి వారికి ప్రపంచజ్ఞానం అందించే అలవాటు తెలుగుపత్రికలకు లేదు అమ్మాయి–అబ్బాయి కథలతో జాతి వికసిస్తుందన్న దురభిప్రాయం పత్రికానిర్వాహకులలో చాలామందికున్నది

నేను మామూలుగా బుద్ధిమంతుణ్ణే తెలియనివాటిని గురించి రాయను నాది చాలాకాలం పాటు కమ్యూనిస్టు విముఖతగానే ఉండిపోయింది కాని ఉండబట్టలేక కమ్యూనిస్టు వ్యతిరేకతను అవలంబించి 'ప్రతిభ' (నవ్యసాహిత్యపరిషత్పత్రిక)లో ఒక 'అద్భుత'మైన వ్యాసం రాశాను 'ఆర్థికోపన్యాసాలు' అన్న ఒక చిన్న కథ కూడా రాశాను నా అజ్ఞానాంధత్వాలకి మచ్చుతునకలు నా జీవితంలో నేనవలంబించిన కమ్యూనిస్టు వ్యతిరేకత అంతా ఈ రెండు రచనలకే పరిమితమయిందనుకుంటాను!

ఒకసారి 'ప్రజాశక్తి' ఆఫీసులో తుమ్మలగారిని కలుసుకోవటానికి వెళ్ళాను ఆయన సీటులో లేరు ప్రెస్‌లోకి వెళ్ళినట్టుంది అక్కడ 'ప్రతిభ' కాపీ పెట్టిఉన్నది పేజీలు తిరగేస్తుంటే నా 'అమూల్య'మైన వ్యాసం కనిపించింది దాదాపు ప్రతివాక్యం కింద ఎర్ర పెనిసిలుగీటున్నది

యుద్ధం వచ్చాక రాజకీయదృక్పథాలను సరిగా అవగాహన చేసుకోవటం తప్పనిసరి అయింది జీవితం చావుబతుకుల సమస్య అయి కూర్చున్నది ఇరవైఏళ్ళుగా సాగిన జాతీయోద్యమంతో దేశం ఎక్కడికి వచ్చిందో తెలియలేదు అంతర్జాతీయంగా చూడబోతే ఫాసిజం భూతంలాగా లేచి ప్రపంచాన్ని మింగేసే ధోరణిలో ఉన్నది అదృష్టవశాత్తూ నేను ఏనాడూ ఫాసిజాన్ని తప్పుగా అవగాహన చేసుకోలేదు నా హిట్లరు విద్వేషం 1932లో ఆరంభమయింది అందుచేత ఫాసిజాన్ని నిర్మూలించటానికీ యుద్ధం జరగటానికి నేను మొదటినుంచీ సుముఖుణ్ణే

యుద్ధం ఆరంభమైన తొలికాలంలో జర్నలిస్టుగా పనిచేసేవాణ్ణి ఛాందసులు హిట్లరును అవతారపురుషుడనీ, "వాడు వచ్చి బ్రాహ్మణ్యం నిలబెడతాడు" అనీ అనుకోవటం విన్నాను హిట్లరుకు వ్యతిరేకంగా నేను ఏం రాసినాసరే, "ఈన చూసొచ్చాడు గామాలు!" అని వాళ్ళలో వాళ్ళు అనుకునేవాళ్ళు!

జపాను కూడా యుద్ధంలో దిగాక నా అవగాహనలో పరిస్థితి విషమించింది కాంగ్రెసులో ఒక వర్గం జపానుకు సుముఖమైంది జాతీయాభిమానులూ, స్వరాజ్యకాంక్షా, సామ్రాజ్యవాద వ్యతిరేకతా, జపానుకు విజయం చేకూర్చాలన్న ఎత్తుగడా– ఇవన్నీ ఫాసిస్టు వ్యతిరేకతకు అడ్డుపుల్లలుగా పరిణమించాయి ఫాసిస్టు విధ్వంసమే అన్నిటికన్నా ప్రధానమని గట్టిగా నమ్మిన నాబోటివాళ్ళకు, దేశంలో సరిఅయిన రాజకీయవైఖరి ఎటునుంచి వస్తున్నదా అన్నది ప్రధానసమస్యే అయింది దేశంలో రాజకీయపార్టీలనేకం ఉన్నాయి కాంగ్రెసువారు లాంఛనప్రాయమూ, నిరుపయోగమూ అయిన వ్యష్టి సత్యాగ్రహం చేసి, తమలో తమకు అభిప్రాయభేదాలు వచ్చి కర్తవ్యం నిర్ణయించలేని స్థితిలో ఉన్నారు జపానుకు అనుకూలవర్గం ఒకటీ, ప్రతికూల వర్గం ఒకటీ, యుద్ధయత్నాలకు అనుకూలురు కొందరు, ప్రతికూలురు కొందరూ రాయ్ ఒకడున్నాడు సుబాస్‌బోస్ అభిమానులున్నారు కమ్యూనిస్టులున్నారు– బ్రిటిషుపాలకులు ఉండనే ఉన్నారు

నా మిత్రులు కొందరు తమకున్న రాజకీయజ్ఞానమంతా ఉపయోగించి కమ్యూనిస్టుపార్టీ తొక్కినమార్గమే సరిగా ఉన్నదన్న నిర్ణయానికి వచ్చారు ఆ రోజుల్లో నేను బొంబాయిలో ఉండి యుద్ధోత్పత్తికి యథాశక్తి కృషిచేస్తూండేవాణ్ణి 'పీపుల్స్‌వార్' చదివేవాణ్ణి 'కాపిటల్' కూడా చదివాను అది నాకు చక్కని సైన్సు పుస్తకంగా కనిపించింది అది చదవటంతో జీవితంలోని కుళ్ళు చాలావరకు నాకు అర్థమయింది నా కమ్యూనిస్టు విముఖత్వానికదే గొడ్డలిపెట్టు

జనశక్తి వారపత్రిక, 6-6-1964

# 4. అద్భుత దీపాలు

వెనకటికి అల్లావుద్దీన్ అనేవాడొకడుండేవాడు, వాడిదగ్గర మ్యాజిక్ లాంతరొకటుండేది అది మాసిపోయినప్పుడల్లా వాడింత 'విమ్' వేసి తోమేవాడు తోమినప్పుడల్లా బ్రహ్మరాక్షసి ప్రత్యక్షమై "ఏం చెయ్యమంటావు దొరా!" అని, చెప్పినపని చేసేసి వెళ్ళిపోయేది

అటువంటి అద్భుతదీపం ఉండటం ఎంత అదృష్టం అని మనం అనుకోవచ్చు అదే పొరపాటు అల్లావుద్దీన్‌కు బ్రహ్మరాక్షసి ఉండగా, నాకెందుకు లేకపోవాలని మరో అభాజనుడు కూడా ఓ బ్రహ్మరాక్షసిని వశం చేసుకొన్నాడు వశం చేసుకొన్నాననుకొన్నాడు "తాతార్‌ను పట్టుకొనడ"మనే సామెత అప్పటికింకా అమల్లోకి రాలేదు కాబోలు ఎవరు ఎవరిని పట్టుకొన్నదీ వెంటనే తేలిపోయింది

"ఏ పని చెబుతావు దొరా!" అన్నాడు బ్రహ్మరాక్షసి ఆనవాయితీ ప్రకారం (బ్రహ్మరాక్షసుడు అనగా, బ్రహ్మరాక్షసుడు కలవాడు షష్ఠీతత్పురుషో యేదో అంటారు తెలుగువ్యాకరణం చదివింది కొంచెమూ, మరిచిపోయింది జాస్తీనూ! రీజనల్ లాంగ్వేజెస్ అంటున్నారు కనుక గ్రాంధిక భాషకూ మంచి భవిష్యత్తున్నట్టు కనబడుతుంది– తా వెంకయ్య గ్రామర్ సంపాదించి మళ్ళీ తిరగెయ్యాలి)

విషయం దొంకకడ్డం పడుతున్నది "ఓ లక్ష ఎకరాలు దున్ని రా" అన్నాడు బ్రహ్మరాక్షసుడు ఇరవైసెకండ్లలో వచ్చి, "దున్నేశా, ఇంకేమిటి సెలవు!" అన్నాడు కొండలు పిండిగొట్టడమూ, తివిరి(?) ఇసుక నుంచి తైలం తీయడమూ లాంటి దుస్సాధ్యమైనపనులెన్నో చెప్పాడు యజమాని ఒక నిమిషంలో బ్రహ్మరాక్షసుడు అన్నీ చేసుకొచ్చి, "పని చెప్పు" అన్నాడు యజమాని చెప్పలేకపోయాడు బ్రహ్మరాక్షసుడు యజమానిని నోట్లో వేసుకొని చక్కా పొయాడు!

అందుచేత యేమిటంటే ఓ బ్రహ్మరాక్షసుణ్ణి సంపాదించుకోవడంలో కూడా అదృష్టం కలిసిరావాలి లేకపోతే బెడిసికొడుతుంది అద్భుతదీపాలూ, బ్రహ్మరాక్షసులూ కల్పన అని కొందరు కొట్టిపారెయ్యగలరు కాని, ఈనాడు కూడా మనకు రకరకాల అద్భుతదీపాలున్నాయి వాటిని రుద్ది మనం బ్రహ్మరాక్షసులను సృష్టిస్తున్నాం

మచ్చుకు ఎలెక్షన్లు తీసుకోండి అవి అద్భుతదీపాలు ఓటుకాగితం ముక్కలతో మనం బ్రహ్మరాక్షసులను సృష్టించలేదా? హిట్లరు బ్రహ్మరాక్షసి ఎట్లా పుట్టిందీ, ఎన్ని లక్షల ప్రాణులను బలిపుచ్చుకొన్నదీ మనం చూడలేదా? ఇప్పుడు వియత్నాంలో జరిగే విలయతాండవం మాట యేమిటి?

కిందటి ఎన్నికలలో చాలా లాంతర్లను రుద్దారు అనేక శిరస్సులు గల బ్రహ్మరాక్షసులు కొన్ని ప్రాంతాలలో పుట్టుకొచ్చాయి ఆ తలలన్నీ ఒక దిక్కుగా, రావణుడి పదితలలల్లే చూడగలిగితే బాగుండును కానీ అలా జరగటం లేదు ఒక మనిషికే ఒకటి ఎడమకూ, మరొకటి బొత్తిగా వెనక్కు చూస్తున్నాయి ఒకటి రెండు తలలకు కళ్ళూ, చెవులూ కూడా లేవని వినికిడి ఈ తలలకు సిమెట్రీ బ్యాలెన్సూ ఉన్నట్టు కనపడవు

ఒక రాజకీయరంగంలోనే యేమిటి? అన్ని రంగాలలోనూ అద్భుతలాంతర్లు చిన్నవీ పెద్దవీ ఉంటున్నాయి వాటిని ఎవరో రుద్ది రకరకాల సైజుల బ్రహ్మరాక్షసులను ఉత్పత్తిచేస్తున్నారు

గ్రాంథిక రాక్షసులు యూనివర్సిటీలను అంటిపెట్టుకొని ఉన్నారు హిందీ రాక్షసిని మరికొన్ని ప్రాంతాలవారు ఆహ్వానిస్తున్నారు కొన్ని ప్రాంతాలవారు దాన్ని దూరంగా ఉంచాలని చూస్తున్నారు ఈ రాక్షసి ఇప్పటికే కొంత నరబలి పుచ్చుకొన్నది ఇంకా పుచ్చుకొనేటట్టే కనపడుతున్నది మత రాక్షసుడి మాట చెప్పనే అవసరం లేదు వాడు ఎన్నిసార్లు చంపినా మరింత బలంతో బతికివస్తాడు వాడు అహిరావణ మహిరావణ జాతికి చెందినవాడు లాగా కనిపిస్తాడు

తిండి కరవు రాక్షసిని దేశం మీద వదలిన వాళ్ళెవరో రహస్యశాఖకు కూడా అంతుబట్టేట్టు లేదు దొంగధాన్యం పట్టుపడుతూనే ఉన్నది దొంగలు మాత్రం పట్టువడరు చచ్చేవాళ్ళు చస్తున్నారు, ఆకలితో కాదు, తిండిలేకపోవడం వల్ల వచ్చే రోగాలతో తిండిలేక ఎవరన్నా చస్తారా? ఛీ! ఛీ! అనుకోను కూడా కూడదు నిజానికి ఈ బ్రహ్మరాక్షసులన్నిటినీ తలదన్నినవి 'ఆటంబాంబులు' అని పామరులు చెప్పుకొనే 'న్యూక్లియర్' బాంబులు క్లియర్గా ఇవి కొన్నికోట్లమంది ప్రాణాలను తృటిలో తీయగలవు అయితే, మిగిలిన బ్రహ్మరాక్షసులకన్న ఇవే యెక్కువ అదుపులో ఉన్నాయి ఇవి మన పొలిమేరలో తలెత్తరాదని మన ప్రభుత్వం ఇప్పటిదాకా అనుకొంటున్నది

కాని, మన దేశం మిగిలిన అన్నిరకాల బ్రహ్మరాక్షసులకూ విహారభూమిగానే ఉంటున్నది అజ్ఞాన భూతాలు, నియో కలోనియల్ భూతాలు, అవినీతి భూతాలు, అసమర్థతా భూతాలు అన్నీ ఈ పవిత్రదేశంలో స్వేచ్ఛావిహారం చేస్తూనే ఉన్నాయి వీటిని ఆవాహన చేసేవాళ్ళ పేర్లూ, ఆదరించి అభయమిచ్చేవాళ్ళ పేర్లూ పత్రికలలో పడుతూనే ఉన్నాయి

భూతాలు లేకుండా జరుపుకుపోయేరోజు నాగరికప్రపంచానికింకా రాలేదు వెనకబడి ఉన్న మనమాట వేరే చెప్పాలా? సినిమా చిత్రాలను నిర్మించే ప్రొడ్యూసర్లకు కూడా అందమైన ఆకర్షవంతమైన భూతాలను సృష్టించవలసిన అవసరం ఏర్పడింది అందుకని వాళ్ళు తారలను సృష్టించారు (తారలను పట్టుకొని భూతాలంటున్నానని యెవరూ ఆగ్రహించవద్దు తనను ఆవాహన చేసినవాడికన్న శక్తివంతమైనది భూతం అనే అర్థంలో మాత్రమే చెబుతున్నాను )

ఈ తారలు ప్రొడ్యూసర్ల పబ్బం గడిపినమాట నిజమే కాని, వాళ్ళు తమకే భయకారణంగా పరిణమిస్తారని ఆ ప్రొడ్యూసర్లు అనుకోలేదు వెనకటికెవరో చిత్రకారుడు గోడమీద మీదికి దూకుతున్నట్టు కనిపించే పెద్దపులి బొమ్మ చిత్రించి, చిత్రణ పూర్తయాక ఎల్లాఉన్నదో చూడటానికని నాలుగడుగులు వెనక్కివేసి, నిజంగానే పెద్దపులి తనమీద దూకనున్నదనుకొని మూర్ఛపోయాట్ట! ఈ శాస్త్రం ఎందుకు జ్ఞాపకం వచ్చింది– పోనివ్వండి

ఆంధ్రజ్యోతి వారపత్రిక, 13-10-1967

# 5. సోషలిస్టు పంథాలో

సోషలిజమంటే భయపడేవాళ్ళు కొందరుంటారని నాకు తెలుసు వాళ్ళను భయపెట్టేవాళ్ళు కొందరున్నారని కూడా నాకు తెలుసు

సోషలిజం గురించి భయపడేవాళ్ళను చూసి "హోరి పిచ్చివాళ్ళల్లారా!" అనుకోవటమూ, భయపెట్టేవాళ్ళను చూసి, "హోరి దుర్మార్గుల్లారా" అనుకోవడమూ నాకు అలవాటుగా ఉంటూ వస్తున్నది

ఇంతలో ఉన్నట్టుండి, ఓ రోజున సోషలిజమంటే నాకే దడ పుట్టుకొచ్చింది నేనే సోషలిజంకేసి దూరాన్నుంచి చూసి బిత్తరబోయి, ఉలిక్కిపడి కొద్దిగా వణికాను

అటువంటి పరిస్థితి ఎందుకు కలిగిందంటే–

ఓ నెల క్రితం కాబోలు ఒక రష్యను స్క్రిప్టు రైటరు – ఆయన స్క్రిప్టు రాసిన సోవియెట్ సినిమా చిత్రం ఒకటి కూడా మన దేశానికింకా రాలేదుట– మద్రాసువస్తే కొద్దిమందిమి కలుసుకున్నాం

అంతదూరం వచ్చిన వాణ్ణి ఏదన్నా అడగటమూ, తెలుసుకోవలసిన విషయాలుంటే తెలుసుకోవటమూ, సహజమే గనక మేం కొన్నిప్రశ్నలు వేశాం ఆయన చెప్పింది విన్నాం

ఇంతలో ఒకాయన ఆ వచ్చినాయన్ని, "మీ దేశంలో "ఆవారా", "లవ్ ఇన్ సిమ్లా" లాంటి భారతీయ చిత్రాలు అంత విజయవంతంగా నడవటానికి ఏమిటి కారణం? వాటిని మేము ఉత్తమకళాఖండాలుగా గాని, భారతీయ జీవితానికి వాస్తవ ప్రతిబింబాలుగా గాని పరిగణించటం లేదే" అన్నాడు

దానికి సోవియెట్ అతిథి చాలా దీర్ఘంగానే సమాధానం చెప్పాడు దాని సారాంశమేమంటే సోవియెట్ ప్రేక్షకులు 'ఆవారా'లో వాస్తవమైన భారతీయజీవితం ఉందనే అనుకుని ఉంటారు ఈనాడు సోవియెట్‌దేశంలో సినిమా చిత్రాలకు బాక్సాఫీసు విలువ కూడా పరిగణించబడుతున్నది ఉత్తమ కళాఖండాలూ, వాస్తవ జీవితచిత్రణలూ అయినంతమాత్రం చేత ఏం లాభం? ప్రజలు 'ఆవారా' చిత్రాన్ని, 'లవ్ ఇన్ సిమ్లా' చిత్రాన్ని వెర్రిగా ఎగబడి చూచినమాట నిజం!

ఈ మాట విన్నప్పుడే నేను కొంచెంగా వణికాను

అర్ధశతాబ్దంగా సోషలిస్టు వ్యవస్థకు అలవాటుపడి ఆర్థికదోపిడీ విధానాన్ని, నిరక్షరతను, దారిద్ర్యాన్ని అంతం చేసి, శాస్త్రవిజ్ఞానంలో ఏ ఇతర దేశానికీ తీసిపోని దశను అందుకున్న సోవియెట్ సోషలిస్టు ప్రజలకు అభిరుచులు ఇంత హీనంగా ఎట్లా దిగజారిపోయాయి? ఈ దిగజారిన అభిరుచులకు అక్కడి ప్రభుత్వం సైతం ఎట్లా ఆమోదముద్ర వేసింది (రష్యాలో సినిమా వ్యాపారం పూర్తిగా ప్రభుత్వ నిర్వహణ కిందనే ఉన్నది )

ఇదే నాకు మింగుడుపడకుండా ఉంటే జనవరి 10న నాకు మరొక చిన్న షాక్ తగిలింది ఈసారి మేం కలుసుకున్నది సోవియెట్ ద్రవిడాలజిస్టుల బృందాన్ని

వీరి నుంచి కూడా చాలా విషయాలు తెలుసుకున్నాం రష్యాలో కొనసాగుతున్న సాంస్కృతిక కృషిని గురించి ఎన్నో మంచి మాటలు విన్నాం మనదేశంలో అందులో సహస్రాంశమైనా జరగలేదని దుఃఖపడ్డాం కూడా

ఈ ఆనందంలో నేను ఓలలాడుతున్న సమయంలో నాకు షాక్ తగిలింది  ఈ షాక్ కూడా పాత షాక్ లాటిదే  తగిలినచోటే తగులుతుందని ఊరికే అన్నారా?

ఇతర సాహిత్యాల తాలూకు ఉత్తమగ్రంధాలను ఎంచి మేము రష్యనుభాషలోకి తర్జుమాచేసినప్పుడు ఒక విచిత్రమైన విషయం కానవస్తున్నది  వాటిలో కొన్నిటిని మా దేశస్తులు చదవకుండా ఉంటున్నారు  వాళ్ళకవి రుచించటంలేదు అని ద్రవిడాలజిస్టుల బృందానికి నాయకుడు చెప్పాడు

ఇది నాకు మింగుడుపడలేదు

సోషలిస్టు దేశంలో ప్రజలు ఇతరదేశాల సాహిత్యం చదివేటప్పుడు ఏ మనఃస్థితిలో ఉంటారు? ఆ దేశం జీవితవాస్తవాలను ఆ సాహిత్యం ద్వారా తెలుసుకోవాలనే ఉద్దేశంతో చదవరా? కులాసాకు, కాలక్షేపానికీ విదేశీ సాహిత్యం చదువుతారా?

అలాంటి దృష్టితో తెలుగువాళ్ళు తెలుగుపుస్తకాలు చదివినా నేను అంతగా శ్లాఘించనే? అంతో ఇంతో 'చెత్త' అయితే తప్ప పుస్తకాలు చదవలేనివాళ్ళు మనదేశంలో ఉన్నారని నాకు తెలుసు  మనదేశంలో! యాభై ఏళ్ళ క్రితం సోషలిస్టు విప్లవం జరిగినదేశంలో కాదు  ఇంకో యాభై ఏళ్ళయినా సోషలిజం సాధిస్తుందన్న నమ్మకం లేని దేశంలో!

సోవియెట్ ప్రజలు ఆసక్తితో చదివే రచయితల జాబితా విన్నాం  వారిలో చాలామంది జాతీయ సాహిత్యంకన్న అంతర్జాతీయంగా రాసేవాళ్ళు (అంతర్జాతీయ సాహిత్యం రాసేవాళ్ళు కారు, అంతర్జాతీయ పఠనం కోసం జాతీయ సాహిత్యం లాంటిది రాసేవాళ్ళు  ఒక ఇంగ్లీషువాడు మన దేశం గురించి నవల రాసినా, ఒక  అమెరికావాడు జపానుగురించి రాసినా అది నిజమైన అంతర్జాతీయసాహిత్యం  ఒక భారతీయుడు ఇంగ్లీషువాళ్ళు చదవగలిగిన విధంగా రాస్తే అది అంతర్జాతీయంగా రాసిన సాహిత్యం  ఈ తేడా గమనించదగ్గది )

మన భారతీయులలో అంతర్జాతీయంగా పనిపెట్టుకుని రాసినవాళ్ళు చాలామంది ఉన్నారు  పాశ్చాత్యసాంస్కృతికదృష్టిలో భారతీయసాహిత్యమే రాస్తే అది ఇతరదేశాలవాళ్ళ దృష్టిని ఆకర్షించిన సందర్భాలు కూడా ఉన్నాయి

ఒక అచ్చమైన తెలుగువాడు లేక బెంగాలీ వాడు లేక తమిళుడు అచ్చగా తన జాతివాళ్ళు మాత్రమే చదవటానికి ఎంత గొప్ప పుస్తకం రాసినా అది ఇతరదేశాలమాట దేవుడెరుగు – మన దేశంలోనే ఇతర భాషలో చలామణి కాదు  (ఢిల్లీ సస్తాసాహిత్య సంస్థ వారు ఒక తమిళ మిత్రుడి పుస్తకాన్ని తమిళంలో మంచిపేరు తెచ్చుకున్నదాన్ని హిందీలో అచ్చువేశారు  కాపీలు కదిలితే తుపాకి తియ్యండి!)

అయితే– మళ్ళీ పాత అనుమానమే– మనకింకా సోషలిజం రాలేదు

ఒకవేళ దేవుడు మేలుచేసి, మనకు సోషలిజం వచ్చి యాభైఏళ్ళు మనం సోషలిజంలో ఓలలాడినా మనం ఇలాగే ఉండిపోతామా?

ఆ మాట అనుకుంటేనే  భయం భయంగా ఉంది

ఆంధ్రజ్యోతి వారపత్రిక 2-2-1968

# 6. ఈ మన దేశం

ఏ దేశం యొక్క వర్తమానాన్ని గురించి గాని, భవిష్యత్తును గురించిగాని సార్ధకంగా ఆలోచించదగిన వాళ్ళు ఆ దేశాన్ని పాలించే పాలకవర్గం

ఈనాటి మన పాలకవర్గం ఎదుర్కొనే సమస్యలూ, వాటిని పరిష్కరించటంలో ఆ వర్గం ప్రదర్శించే అశక్తతా చూస్తుంటే, మన రైలు ఎక్కడో పట్టాలు తప్పిందాన్న అనుమానం కలుగుతోంది అది నిజమా కాదా అన్నది తేల్చుకోవాలంటే కొన్ని శాఖలు లేవదీయటం ఒక పద్ధతి అందుచేత కొన్ని శాఖలు లేవదీద్దాం

భారతీయులమందరమూ ఒక జాతివాళ్ళమేనా? భారతదేశమంతా ఒక దేశమేనా? ఈ దేశమూ, ఈ జాతీ ఒక కేంద్రప్రభుత్వం కింద ఉండి పురోగమించగలదా?

ఈ ప్రశ్నలకు జవాబు చెప్పటంలో ఏదో దేశభక్తి, ఆత్మసంతృప్తి ఉన్నట్టు అనిపిస్తుంది కాని మనలో దేశభక్తి నానాటికీ తగ్గిపోతున్నదెందుకు? ఆత్మసంతృప్తి రాదేం? మనమంతా ఒకే జాతి అనీ, ఒకే దేశమనీ అనుకునే గదా మన రాజకీయ వ్యవస్థను ఏర్పాటుచేసుకున్నాం? ఒక కేంద్రప్రభుత్వం కిందనేగదా ఉన్నాం?

మనది ఒకే దేశమైతే వివిధరాష్ట్రాల మధ్య తగాదాలెందుకు? సరిహద్దు తగాదాలెందుకు? అంతా భారతదేశమేగా? ఒక జిల్లా, లేక తాలూకా, లేక ఒక బస్తీ, లేక కొన్ని గ్రామాలు ఈ రాష్ట్రంలో కాక ఆ రాష్ట్రంలోనే ఉండాలని పట్టుబట్టటంలో అర్థం ఏమిటి? వాటిని ఈ రాష్ట్రం నుంచి ఆ రాష్ట్రానికి బదిలీ చేస్తే వాటి దశ అమాంతం పెరిగిపోతుందా? ఒక ప్రాంతంకోసం రెండు రాష్ట్రాల ప్రభుత్వాలు తగాదా పడేటప్పుడు ఆ ప్రాంతానికి మేలు చెయ్యటం గురించి ఉభయులూ పోటీ అయినా పడరే?

ఇదంతా ఒకే దేశమైతే శివసేన వంటిది బహిరంగంగా దక్షిణాది వాళ్ళను వేటాడ గలుగునా? "మైసూరు వాళ్ళు వెళ్ళిపొండి" అని గోడలమీద రాయటం సాధ్యమవుతుందా? మహారాష్ట్ర వేరే దేశమైతేనే అలాంటి పనులు సాధ్యం కావాలి ఆ పనులు చేసేవాళ్ళను శిక్షించేవాళ్ళు లేరు గనుక, మహారాష్ట్రను ప్రత్యేకదేశంగా చూడటం చట్టసమ్మతమేనన్నమాట!

పంజాబు హర్యానాల మధ్యా, అస్సాము బెంగాలుల మధ్యా ఇలాటి తగాదాలున్నాయి ఈ విభేదాలు రాజకీయవాదాల వల్ల కలిగినవైతే కొంతవరకు అర్థం చేసుకోవచ్చు ఒక రాష్ట్రం కాంగ్రెసుపార్టీ కిందా, మరొకటి కమ్యూనిస్టు, లేక సోషలిస్టు, లేక స్వతంత్ర, లేక జనసంఘం పరిపాలన కిందా ఉన్న పక్షంలో తగాదాలకు మూలం ఏదో తెలుస్తుంది కాని కాంగ్రెసు ప్రభుత్వాలు గల రాష్ట్రాలమధ్యనే తగాదాలు వచ్చి, కేంద్రంలో ఉన్న కాంగ్రెసు ప్రభుత్వం ఆ తగాదాలను పరిష్కరించలేని స్థితిలో ఉంటే కాంగ్రెసుపార్టీ అనేది ఒక జాతీయపార్టీ అనుకోవటం చాలా కష్టమవుతున్నది

అంతేకాదు, కాంగ్రెసుపార్టీ రెండుగా చీలింది! దేశం ఏకంగా ఉంటే, జాతి ఒకటే అయితే ఒక జాతీయ పార్టీ రెండుగా చీలదు కమ్యూనిస్టుపార్టీ చీలటానికి సిద్ధాంతవిభేదాలన్న సాకు అయినా ఉన్నది, కాంగ్రెసు పార్టీకి అది కూడా లేదు

మిగతా జాతీయపార్టీలు కూడా దేశమంతటా ఒకేవిధంగా మసలటానికి కత్తిమీద సాముచేస్తున్నట్టు కనబడుతుంది

ఇవన్నీ చూస్తే ఈ దేశమంతా ఒకటి కాదనీ, భారతీయులందరూ ఒక జాతి కాదనీ గట్టి అనుమానం కలుగుతుంది

ఈ అనైక్యతకు మూలకారణం భాషాదురభిమానాలని కొందరు తెగేసి చెప్పారు భాషాప్రయుక్తరాష్ట్ర విభజన చేయటం మూలానే దేశ అనైక్యత ఏర్పడిందన్నారు

కాని ప్రత్యేకతెలంగాణా ఉద్యమం ఈ సిద్ధాంతాన్ని అబద్ధం చేసింది ప్రాంతీయ వైషమ్యాలకు భాషాసామ్యం అడ్డురావటం లేదు

భాష ద్వారా ఐక్యత సాధ్యమైతే ప్రపంచంలో ఎన్ని భాషలున్నాయో, అన్నే జాతులుండేవి అమెరికనులూ, బ్రిటిషు వారు కూడా ఇంగ్లీషే మాట్లాడుతారు అమెరికాలో తెల్లవాళ్ళూ, నల్లవాళ్ళూ కూడా ఇంగ్లీషే మాట్లాడతారు కొన్నిదేశాలలో మూడు నాలుగు భాషలుండి కూడా ఒకే జాతిగా వ్యవహరించటం కూడా కద్దు

ఇదంతా గ్రహించినట్లయితే భారతీయులందరి మీదా ఏ హిందీభాషనో రుద్దితే జాతీయసమైక్యత దానంతట అదే వస్తుందన్నది వట్టి భ్రమ అని తెలిసిపోతుంది

ఇంగ్లీషుభాష ఒకప్పుడు మన జాతిని ఏకం చేసిందన్నది కూడా అపోహే మనదేశం ఏకమయింది సామ్రాజ్యవ్యతిరేకత వల్ల, జాతీయోద్యమం ద్వారా కాని స్వాతంత్ర్యం వచ్చాక ఆ జాతీయభావాలు ఇగిరిపోయి, ప్రాంతీయభావాలు తలఎత్తాయి మన దేశమూ, జాతీ ఎంతవరకు విచ్ఛిత్తి పొందాయి అన్న ప్రశ్నకు సమాధానం పై దేశాల నూతన వలసవిధానాలకు మనం ఎంతవరకు లొంగిపోయామో అంచనా కట్టితే సమాధానం దొరుకుతుంది

మన జాతీయత దెబ్బతినటానికి ఒక కారణం ప్రాంతీయ ఆర్థిక, సాంస్కృతిక అసమత్వాలు కావచ్చు బ్రిటిషువారు వెళ్ళిపోయేనాటికి కొన్ని ప్రాంతాలు మరీ వెనకపడి ఉన్నాయి కొన్ని కాస్త మంచి స్థితిలో ఉన్నాయి స్వాతంత్ర్యాన్ని అందిపుచ్చుకున్న ప్రభుత్వం నిజమైన జాతీయ ప్రభుత్వంగా వ్యవహరించదలచినట్లయితే, వెనకబడిన ప్రాంతాల అభివృద్ధికి ప్రయారిటీ ఇచ్చి ఉండవలిసింది ఆ పని జరగలేదు ఒక్క ఆంధ్రనే తీసుకున్నా, తెలంగాణా, రాయలసీమ ప్రాంతాల అభివృద్ధికి హెచ్చుకృషి జరిగి ఉండవలసింది ఈ ప్రాంతాలను కనీసం సర్కారుజిల్లాల స్థాయికి తీసుకురావటానికి ఇరవైఏళ్ళ చిల్లరకావాలా? ఇరవైఏళ్ళలో, మనకన్న ఎంతో వెనకపడి ఉండిన చీనాదేశం మనని దాదాపు అన్నివిధాలా మించి ముందుకుపోయిందే

దేశప్రజలలో ధనికులు మరింత ధనికులై పేదలు మరింత పేదలు అయిన విధంగానే వెనకబడిన ప్రాంతాలు మరింత వెనకబడ్డాయి ముందుకు ఉన్నవి మరింత ముందుకు వచ్చాయి నగరాలకూ గ్రామాలకూ మధ్య ఉన్న వ్యత్యాసం తరగటానికి బదులు పెరిగింది– నూటికి 80మంది గ్రామాలలో నివసించే ఈ దేశంలో

జాతీయత దెబ్బతిన్నది అచ్చగా ఆర్థికకారణాలవల్లనే అనుకోనవసరం లేదు మన రాజ్యాంగంలో పరిపాలనా విధానం డెమోక్రసీగా పేర్కొనటం జరిగినా కూడా, డెమోక్రసీకి మరింత దూరంగా ఉన్న ఫ్యూడల్ వ్యవస్థను ఆశ్రయించి ఉన్న ప్రాంతాలలో ప్రజాతంత్రం ముందుకు తేవటానికి ఎలాటి కృషీ జరగలేదు బూర్జువా, పెటీబూర్జువా శక్తులు కాస్తో కూస్తో తలఎత్తిన తెలంగాణాలాటి చోట ప్రజలను ఆ సంస్కృతికి విరుద్ధంగా రెచ్చగొట్టటం చాలా తేలిక అయింది బూర్జువా కాణాచి అనదగిన బొంబాయిలాటి మహానగరంలో మతోన్మాదుల వీరవిహారానికి ఎలాటి అడ్డంకీ కలగలేదు

ఇదంతా దేనికి? జాతీయోద్యమంలో ఏర్పడిన జాతీయత ఏనాడో నీరుగారిపోయిందనటానికి ప్రత్యక్షనిదర్శనం, జాతీయోద్యమంనాడు జాతివిద్రోహకపాత్ర నిర్వహించినవాళ్ళు జాతీయప్రభుత్వంలో ఉన్నతస్థానాలు సంపాదించటం రష్యాలో విప్లవం జరిగినాక మాజీ ప్రభువులు దేశాంతరాలకు పారిపోయి కార్లు తోలుకు బతికితే, మనజాతీయతకు ప్రతిబంధకాలుగా నిలబడిన ప్రభువులు డెమోక్రసీకి అగ్రపూజారులయారు కాంగ్రెసు ఉద్యమంలో త్యాగాలు చేసి చితికిపోయిన లక్షలాది కుటుంబాలు అజాపజా లేవు! స్వాతంత్రానికి ముందు మన దేశం సాధించిన ఐక్యతా, జాతీయతా ఈ రెండు దశాబ్దాల చిల్లరకాలంలో నీరుగారిపోయి దేశం యొక్క అసలురంగు ఈనాడు బయట పడుతున్నది బ్రిటిషువాళ్ళు రాజద్రోహానికి చంపినవాళ్ళకన్న ఎంతో హెచ్చుమందిని మనం దేశద్రోహనేరానికి చంపాం, చంపుతున్నాం ఈ మారణహోమం ఇంతలో ఆరేటట్టు కనబడదు

ఎవడు దేశద్రోహి! ఏ లెక్కన దేశద్రోహి? ఆంధ్రరాష్ట్రం కోసమూ, ప్రత్యేక తెలంగాణా కోసమూ, ప్రత్యేక మహారాష్ట్ర కోసమూ చచ్చినవాళ్ళు దేశభక్తులా, దేశద్రోహులా? తెలంగాణా కోసం ప్రాణాలర్పించిన వారికోసం స్మారకచిహ్నాలు ఏర్పాటుచెయ్యటం దేశద్రోహచర్యా, దేశభక్తి చర్యా? ఈ ప్రశ్న తెలంగాణావారికి అనుకూలంగా ఉన్నదని ఎవరైనా అనుకోగలరు ఇంకో ప్రశ్న వేద్దాం ఆంధ్రస్త్రీలను గురించి గోడలమీద అవాచ్యాలు రాసినవాళ్ళూ, తెలంగాణాలో ఆంధ్రులు ఉద్యోగాలు చేయరాదని నిర్ణయించి, వారికి భీతావహం పుట్టించి సకుటుంబంగా పారదోలినవాళ్ళు దేశభక్తులా, దేశద్రోహులా? ఈ రెండుప్రశ్నలకూ ఒకే సమాధానం రాదు కాని వారూ వీరూ ఒకరే ఈ పారడాక్స్ ఎందువల్ల ఏర్పడింది? దేశం ఒకటేననుకోవటం వల్ల ప్రతిభారతీయుడూ దేశంలో ఎక్కడైనా బతుకుతెరువు చూసుకోవచ్చునన్నది అమలుజరగటం సాధ్యం అనుకోవటం వల్ల! ఏదీ? తెలంగాణా నుంచి పారిపోయివచ్చినవారినందర్నీ వెనక్కు పిలిపించి, పునరావాసం కల్పించమనండి!

ఇదంతా చెప్పటం దేశమంతా ఒకటి కాగూడదనీ, మనమంతా ఒకజాతిగా తయారుకాగూడదని కాదు కావాలి, అవశ్యం ఈ దేశం ఏకం కావాలి దేశప్రజలందరూ ఒకటి కావాలి కాని రాజకీయవిధానాల ద్వారా ఈ పనిచేయగల రాజకీయపార్టీ ఏదన్నా ఈనాడు ఉన్నదా అనేది తేలికగా సమాధానం చెప్పే ప్రశ్న కాదు ఇప్పుడున్న ఏ ఒక్క పార్టీ కూడా అలాంటి కృషికి ఉన్ముఖంగా ఉన్నట్టు లేదు

ఒకవేళ ఈ జాతి నిర్మాణానికి ప్రస్తుతం రాజకీయకృషి సాధ్యం కాదేమో

ఇంకా కిందికి దిగివస్తే సాంస్కృతికరంగంలో జాతీయైక్యతకు భాషలు కొంత కృషి చేయగలవని తోస్తుంది భాషలు ఆ భాష మాట్లాడేవారిని ఏకం చేస్తాయి విరుద్ధవర్గాల వాళ్ళు కూడా భాషదగ్గిర ఏకమవుతారు రాజకీయరంగంలో విషజ్వాలలు చెలరేగుతున్నా సాహిత్యరంగంలో ఆంధ్ర అంతా ఒకటే రాయలసీమ, సర్కారు, తెలంగాణా రచయితలు ఏకంగానే సాహిత్యం సృష్టిస్తున్నారు అది సమష్టి సాహిత్యమే

ఇదే వివిధ భాషల మధ్య కూడా సాధ్యం వివిధ భారతీయ భాషా సాహిత్యాలమధ్య సాన్నిహిత్యం ఏర్పడితే భారతీయ సాహిత్యం అనేది ఒకటి ప్రభవిస్తుంది దీనికోసం ఎంతైనా కృషి జరగాలి ఒక భాషలో సాహిత్యపిపాసగల వారెవరైనా వారికి ఇతర భాషాసాహిత్యాల

పరిచయం లభించాలి ఇది తక్షణకర్తవ్యంగా కనబడుతుంది జాతీయసంస్కృతి నిర్మాణానికి మంచి పునాది

ఈ దేశాన్నీ, దేశప్రజలనూ ఏకం చెయ్యటానికి ఒకప్పుడు బౌద్ధమూ, అద్వైతమూ లాటి మతాలూ, శిల్పకళా, సంగీతకళా లాటివి ఎంతో ఉపకరించాయి ఈనాడు ఆ పాత్రకు సినిమాల లాటి హీనసాధనం ఉపయోగపడటం చాలా విచారకరం సినిమాకళకు అంతటి శక్తిలేదు– ముఖ్యంగా అది వ్యాపారకళగా ఉన్నంతవరకు ఉత్తమసాహిత్యం అంతకన్న మంచి పాత్ర నిర్వహించగలదు

సాంస్కృతికరంగంలో మన జాతీయతకూ, దేశ ఐక్యతకూ కొంత పునాది పడినమీదట ఆర్థిక, రాజకీయరంగాలలో కొంతకృషి జరిగే అవకాశం ఉంటుంది

ఇంకొక్క విషయాన్ని కూడా విస్మరించరాదు మనదేశం ఏకం కావటమూ, మనమంతా ఒకజాతి కావటమూ, ఒక విప్లవకర పరిణామం కావచ్చునన్నది కూడా మన పాలకులకు తట్టినట్టు కనబడదు నేషనల్ ఇంటిగ్రేషన్ ఉపన్యాసాల ద్వారానూ, పోస్టర్లద్వారానూ సాధ్యం అవుతుందన్నది అనుమానాస్పదం వెనకబడిన ప్రాంతాలూ, ముందుకువచ్చిన ప్రాంతాలూ వేరువేరు దేశాలలాగా ప్రవర్తించబట్టే, కలిగినవాళ్ళూ, లేనివాళ్ళూ వేరు వేరు జాతులుగా వ్యవహరించటం తప్పనిసరి ఈ వ్యత్యాసం వైరుధ్యంగా పరిణమించినకొద్దీ విప్లవం కూడా తప్పనిసరి అవుతుంది సాంస్కృతికంగా దేశాన్ని ఏకంచేసే కృషిలో నిమగ్నులు కాదలచినవారు ఈ వర్గ వ్యత్యాసాలనూ, వర్గస్వభావాలనూ దృష్టిలో ఉంచుకోవటం అవసరం

దేశంలోగల ధనికవర్గం ఒకేవర్గంగా వ్యవహరించగల స్థితిలో ఉన్నది దేశంలోని దరిద్రులు తామంతా ఒకేవర్గం అనుకునేరీతిలో ఉన్నట్టు కనబడరు అలాటి స్థితిలో ఉన్నట్టయితే వారు ధనికులచేతి కీలుబొమ్మలుగా ప్రవర్తించటం జరగదు వారిని ఈ పాత్ర నిర్వహించకుండా చేయటమే ఒక విప్లవకరమైన సంగతి

రచన. 28-2-1970
పొలికేక, వారపత్రిక, 24-4-1970

# 1. పరిణామవాదంలో వెనకడుగు

శాస్త్రవేత్తలు ఒప్పుకుంటారో ఒప్పుకోరో గాని, పరిణామం అనేది బాణంలాగా పోదు అది రెండడుగులు ముందుకు వేసి ఒక్కడుగు వెనక్కు వేస్తుందని నేను గట్టిగా చెప్పగలను తిరోగమనవాదులందరూ ఈ విషయాన్ని గుర్తించినవారే ననుకోవచ్చు

సర్కసులోనూ, హాలీవుడ్ సినిమాల్లోనూ మనం చూసే చింపాంజీ కోతులను చూడండి అవి సైకిళ్ళు తొక్కుతాయి సిగిరెట్లు కాలుస్తాయి, ఫోర్కుస్పూనులతో తిండి తింటాయి–అనేక విధాల మనుషులను పోలి ఉంటాయి కాని అవి చిన్న చింపాంజీలు ఒక వయసు వచ్చినాక చింపాంజీలు మనుషులను పోలటం మానుకొని కొంచెం ఆటవికంగా తయారవుతాయి అదీ వాటి పరిణామం

ఇదే మనుషులలో కూడా కనిపిస్తుంది ఆఫ్రికాలో పురాతత్వ పరిశోధనలు చేసిన లీకీ దంపతులకు ఓల్డువాయి కనుమలో 20 లక్షల ఏళ్ళ నాటి పొరలో ఆధునిక మానవుడి దవడ ఎముకలాంటిది దొరికింది అంతకన్న రెండున్నర లక్షల ఏళ్ళ తరవాతి పొరల్లో వానరాలకు ఇంకా సన్నిహితంగా ఉన్న అస్థికలు దొరికాయి ఇది పరిణామ వాదానికి విరుద్ధంగా కనబడవచ్చు కాని పరిణామ వాదాన్ని "రెండడుగులు ముందుకు, ఒకడుగు వెనక్కు" అని అర్థం చేసుకుంటే మనం ఆశ్చర్యపడం

ఆధునిక జీవితం తీసుకోండి ఒక యేసుక్రీస్తో, లెనినో వచ్చి కొద్ది కాలంలో జనాన్ని ఒక యుగం ముందుకు తోస్తాడు ఆతరవాత ఆ పరిణామాన్ని రద్దు చేసుకుని వెనక్కు పోవటానికి చిల్లర నాయకులు దశాబ్దాల కొద్దీ కృషిచేస్తారు వీళ్ళ కృషి విఫలం ఎంతమాత్రమూ కాదు లెనిన్ కృషి రష్యాలో ఈనాడు ఇటువంటి పరిణామాన్ని అద్భుతంగా సాధిస్తున్నట్టు రాజకీయ వేత్తలు చెబుతున్నారు

మనదేశంలో గాంధీయుగం ఒకటి వచ్చిందని విన్నాం గాంధీగారు రాజకీయాలలో ధార్మిక, నైతిక సూత్రాలు చొప్పించి, నిజాయితీకి, అహింసకూ పెద్దపీట వేశాడు కాని గాంధీ వారసులు ఈ నైతిక, ధార్మిక సత్యాహింసల కిలుమును వదలగొట్టటానికి దేశం మీదికి పోలీసులను అచ్చుపోసి వదిలేశారు వాళ్ళు వీరవిహారం చేసి, ముసలాళ్ళనూ, పిల్లలనూ, తలలు పగలగొట్టి, పట్టుబడ్డ వాళ్ళను కోర్టెక్కకుండా కాల్చి పారేసి, ఆడవాళ్ళను చెరిచి, దాహమన్నవారికి ఉచ్చ ఇచ్చి, మన స్వాతంత్ర్యానికి ఒక అమూల్యమైన పరిణామ యుతమైన అలంకారంగా ఉంటున్నారు మన స్వాతంత్ర్యానికి ఇంకా అలంకారాలు లేవని కాదు– అవినీతి, లంచగొండితనమూ, కులతత్వమూ, పదవీ వ్యామోహమూ, పులుల లాంటి పెట్టుబడిదార్లూ, భూస్వాములూ, నక్కల లాంటి అధికార్లూ మొదలైనవి ఎన్నయినా ఉన్నాయి

మన స్వాతంత్ర్యానికి గల సహనం అనన్యం అది నెలకు 27 రూపాయల తలసరి ఆదాయాన్నీ, రాతియుగాన్ని మరిపించే దారిద్ర్యాన్నీ, ప్రజల దుర్భర దారిద్ర్యాన్నీ, అనారోగ్యాన్నీ అవిద్యనూ, జీవిత నరకాన్నీ, స్థితప్రజ్ఞత్వంతో సహిస్తుంది ముప్ఫై ఏళ్ళు ఉద్యమం నడిపి సాధించుకున్న స్వాతంత్ర్యాన్ని ఆర్థికంగా పై దేశాలకు ధారాదత్తం చేస్తుంది

"రెండడుగులు ముందుకు , ఒకడుగు వెనక్కు" అన్నదానికి ఉదాహరణలు కొల్లలుగా దొరుకుతాయి అమెరికావాళ్ళు ప్రజాతంత్రం సాధించుకుని "ప్రభువులు" లేకుండా చేసుకున్నాక, ఆలోటు తీర్చుకోవటానికి ఇంగ్లండునుంచి లార్డ్లనూ, పీర్‌లనూ ఆహ్వానించి, వారితో కరచాలనాలు చేసి డబ్బిచ్చారట

అమెరికాలో "ఒకడుగు వెనక్కు" అన్నసూత్రం ఎంతబాగా అమలు జరిగిందంటే, అమెరికను కాన్‌స్టిట్యూషన్‌లోనుంచి భాగాలు రాసి పౌరులను సంతకం పెట్టమంటే ఎవరూ పెట్టటం లేదుట పైపెచ్చు, అది కమ్యూనిస్టుల ప్రణాళిక అంటున్నారుట అంటే అమెరికాలో ఆ రాజ్యాంగం ఒకడుగు వెనక్కు వెయ్యకుండా అమలు జరిగితే ఈపాటికి కమ్యూనిజం అక్కడ వెలసి ఉండేది కాబోలు ఎంత ప్రమాదం

మన దేశంలో కూడా గాంధీగారు చెప్పినట్టు ధనికులు పేదలకు ధర్మకర్తలుగా వ్యవహరించి, సత్యమూ, ధర్మమూ, అహింసా అమలు చేసినట్లయితే, తాతలూ, బిర్లాలూ నెలకు 27 రూపాయల ఖర్చుమీద బతకవలసి వచ్చేది ఎంత దారుణం! గొప్ప గొప్ప హోటళ్ళను ఎవరు పోషిస్తారు? నైట్‌క్లబ్బులూ, రేస్ కోర్సులూ, కార్లూ ఎవరు పోషిస్తారు? విమానాల్లో ఎవరు తిరుగుతారు? వీటన్నిటికీ గాంధీగారి ప్రణాళికలో చోటు లేదేమో?

1945లో ఫాసిజం అనే దుష్టశక్తిని అనేక దేశాలూ, ప్రజలూ ఏకమై ఓడించటం జరిగింది అందువల్ల ఒక కొత్తయుగం ఆరంభమయింది కాని యుద్ధానంతర పరిణామంలో తిరిగి ఫాసిజం ప్రతి దేశంలోనూ ఏదోరూపంలో ప్రాణం పోసుకుంటున్నది అమెరికా పాలకులు దాన్ని తమ దేశంలోనే యధాశక్తి అమలు చేస్తున్నారు ఇతర దేశాలలో కూడా ఫాసిస్టులకు సహాయపడటానికి తమ దేశప్రజల ధన మాన ప్రాణాలను సైతం బలిపెడుతున్నారు

వియత్నాంలో మైలాయ్ మొదలైన చోట్ల అమెరికను సైనికులు ఫాసిజం తమకు కూడా తెల్సునని నిరూపించారు అంతకన్న మరేంలేదు

"రెండడుగులు ముందుకు, ఒక్కడుగు వెనక్కు" అన్న సూత్రంలో వెనక్కు వేసే అడుగు ఎంత పెద్ద అంగ అన్నదాన్ని గురించి ఎవరి అభిప్రాయం వారిది మతవాదులు కొన్ని వేల ఏళ్ళు వెవక్కు పోదామంటున్నారు వేద కాలానికి ముందుకు కూడా వెళదామనేవాళ్ళను గురించి మనకు ఆశ్చర్యం కలగవచ్చు కాని చాలా "ముందుకు"వచ్చిన దేశాలలో ఆటవికసమాజాన్ని పునరుద్ధరించటానికి ఉద్యమాలున్నాయి అదేమిటో, కొంతమందికి ఎంత వెనక్కు పోదామంటే అంత ఆనందం సాధ్యంకాదు గాని వీరిలో కొందరికి డినజార్లుగానూ, ట్రైలోబైట్లుగానూ జీవించాలని ఉన్నట్టు కనిపిస్తుంది శరీరాలు మారవు గనక వీళ్ళు సేబర్‌టూత్ మనస్తత్వమూ, జడల ఏనుగు మనస్తత్వమూ ప్రదర్శించటంతో తృప్తి పడవలసిన వాళ్ళవుతున్నారు

మన వెనకడుగులో కొట్టవచ్చినట్టు కనబడుతున్నది గుళ్ళ నిర్మాణం ఇది మధ్య యుగంలో మనుష్యుల మధ్య సంఘీభావం పెంపొందించి సంఘ పురోభివృద్ధి కోసం సృష్టి అయిన ప్రక్రియ ఇది ఇప్పుడు "వెనకడుగు"గా మాత్రమే ఉపకరిస్తున్నది ఈ వెనకడుగులో దాక్షిణాత్యులది ముందడుగు చెన్నపట్నం రోడ్లవారల అంతులేని చిన్న పెద్ద దేవాలయాలు లేస్తున్నాయి వీటిని గురించి చర్య తీసుకునే దమ్ము కార్పొరేషనుకు లేదు ఈ నూతన ఆలయ

నిర్మాణంతోబాటు, పాత దేవాలయాల సేవ పెచ్చు పెరిగింది ఉత్పత్తి పెరిగితే గాని దేశానికి ముక్తి లేదన్నాడు నెహ్రూ కాని ముక్తికి సూటి బాట అయిన భక్తి పెరుగుతున్నది నూతన యుగాన్ని తెచ్చిపెడదామనే ఉద్దేశంతో నెహ్రూలాంటి గొప్పవాళ్ళు చాలా మాటలు అంటారు కాని అవి వెనుకడుగులో తుడిచిపెట్టుకు పోతాయి బ్లాక్‌మార్కెట్ వాళ్ళనందరినీ ఉరి తియ్యాలన్న నెహ్రూగారి హయాంలోనే, ఆ బ్లాక్ మార్కెట్‌వాళ్ళే రాజకీయ పెద్దలయారు

వీరేశలింగంగారు పుస్తకాలను ప్రజా వికాసానికి అంకితం చేసే సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు దానివల్ల ఆధునిక సాహిత్యంలో వచ్చిన పరిణామం వెనకడుగు వేస్తున్నది ఇవాళ బళ్ళకొద్దీ వచ్చే సాహిత్యానికి ప్రజలను కాస్సేపు రంజింపచెయ్యటం తప్ప మరే ఆశయమూలేదు పాతికేళ్ళ క్రితం అభ్యుదయంకోసం కలంపట్టినవాళ్ళు పాలకుల వేటకుక్కలుగా మారుతున్నారు ఇది కూడా ఒక పరిణామదశే సినిమాలు ఈ దశను ఏనాడో అందుకుని, జీవితసమస్యలను చిత్రించిన చిత్రాలను ఔటాఫ్‌డేట్ చేసేశాయి

ఈ "ఒకడుగు వెనక్కు" ఆవేశపరులైన కుర్రకారుకూ తెలీదు వాళ్ళు విప్లవాలు చేస్తారు గెరిల్లాయుద్ధాలు సాగిస్తారు చిత్ర మేమిటంచే, బక్క దేశాలుకూడా ఇదేపని చేస్తున్నాయి "ఒకడుగు వెనక్కు" అనే సూత్రాన్ని ఆమోదించక వియత్నాం, ఉత్తర కొరియా, కక్యూబాలాటి దేశాలు విప్లవాలు చెయ్యటమేగాక, వాటిని నిలబెట్టుకునేటందుకు అమెరికావంటి దేశాలతో తలపడి పోరాడాయి

ఇక్కడ మనం గుర్తుంచుకోవలసిన దేమంటే, విప్లవాలు మహామంచివి ఎందుకంటే అవి నూతన యుగాన్ని ప్రారంభిస్తాయి కాని వాటి తరవాత రావలసిన "వెనకడుగు" కు అడ్డుపడటం చాలా తప్పు అమెరికను విప్లవం మంచిది కాని దాన్ని ముందరికి తీసుకుపోవాలని చూస్తున్న నీగ్రోలూ, విద్యార్థులూ, తదితరులు చెడ్డవాళ్లు రష్యా విప్లవం మంచిది కాని రష్యా విప్లవ లక్ష్యాలకు ఎసరు తెచ్చుకుంటే ఇంకామంచిది చీనావిప్లవం చేసిన మావో మంచివాడే, కాని విప్లవం నీరుకారిపోకుండా సాంస్కృతిక విప్లవం సాగించటం చాలా దారుణం "వెనుకడుగు" తత్వం గ్రహించటానికి ఈ ఉదాహరణలు చాలు

"అసలు మాకు ముందడుగూ వద్దు, వెనకడుగూ వద్దు మా కసలు పరిణామమే వద్దు" అనే మనస్తత్వం గలవాళ్ళుకూడా ఉన్నారు అలాటి దేశాలు కూడా ఉన్నాయి వాళ్ళకి మటుకు భవిష్యత్తులేదు హరప్పా, మొహెంజొదారోలలో సింధు నాగరికతను అమలు జరిపిన వాళ్ళు తమకు మార్పు వద్దనుకుని రూపుమాసి పోయారు పితికాంత్రోపస్ అనే నరవానరుడు, "నాకు పరిణామంవద్దు నేను ఆకులూ అలములూ తిని, రాళ్ళు చెక్కి ఆయుధాలు తయారు చేసుకోకుండా ఇలాగే ప్రశాంతంగా జీవిస్తాను" అనుకుని– అంతరించిపోయాడు

పెరుగుదలకు తిలోదకాలిచ్చిన శాంతి వాంఛ వినాశనానికే దారితీస్తుందని దాదాపు స్పష్టమే అందుకే మనదేశంలో ఈనాడు కొందరు శాంతియుతంగా సోషలిజం తెద్దామంటున్నారు అయితే శాంతియుతంగా కొత్తయుగాలను ప్రారంభించే సాధనాలు పాఠ్యపుస్తకాలలో ఎక్కడా కన్పించటంలేదు 'వెనకడుగు' సిద్ధాంతం మహా ప్రబలమైందిగా కూర్చున్నది

అందుచేత "శాంతికాముకులు" నూతన యుగానికైనా లేదా పరిణామానికైనా తిలోదకాలియ్యాలి ఏదైనా ప్రమాదమే

అది అలా ఉంచి, శాంతి అన్నది కోరుకుంటే లభించేదికాదు అందుచేత మనం శాంతి కాముకులం కావాలంటే కుడికన్ను పొడిచేసుకోవాలి కుడిపక్కన వెనుకడుగు వాళ్ళ దారుణాలు కనిపిస్తాయి ఎడమపక్కన విప్లవకారుల దారుణాలు కనిపిస్తాయి కుడి కళ్ళు పొడిచేసుకున్నవాళ్ళు అశాంతికి కారకులు విప్లవవాదులు మాత్రమే నని గ్రహించగలుగుతారు విప్లవం నెగ్గినప్పుడు-అదైనా ఎన్నోదశాబ్దాల కొకసారి, ఒకచోట జరుగుతుంది:- ఈ ఒంటికంటి రామలింగాలు కొద్దికాలంపాటు స్తన్నయిపోయి, అటుతరవాత తమ గుడ్డికంటిని వెనకడుగు వాళ్ళకేసి మళ్ళీ తిప్పే అవకాశం లభించకపోదు

వసుధ మాసపత్రిక ప్రారంభసంచిక, 1971 జనవరి
పునర్ముద్రణ సాహిత్యంలో విప్లవోద్యమం , సృజన ప్రచురణ అక్టోబరు 1971

## 2. ఎన్నికల జూదం

మళ్ళీ పేకలు కలిపి పంచబోతున్నారు ఈ సారి ఆసులూ, రాజులూ, రాణీలూ ఎవరికి పడతాయో! అంతా దైవేచ్ఛ!

అన్ని పార్టీలవాళ్ళూ రెండేసి బేస్తులు పెట్టి మూటం బేస్తుకు సిద్ధమవుతున్నారు ఇది కుదేలు ఆట

ప్రపంచంలో కెల్లా పెద్దదిగా చెప్పబడే ఈ దేశం ఒక ద్యూతగృహం ఇక్కడ నాలుగేళ్ళ కొకసారి ద్యూతమహోత్సవం జరుగుతుంది ప్రవేశరుసుము చాలా హెచ్చు ఈ ఆటలో నీకూ, నాకూ స్థానంలేదు ఇది రాజులూ, మహారాజులూ ఆడే ఆట

"ఎవరికి వారే యమునా తీరే" 'అన్‌టు ఈచ్ హిజ్ ఓన్" లాంటి సామెతలు ఇక్కడ చెల్లవు ఇది లాలూచీ ఆట-బహిరంగమైన లాలూచీ, జూదగాళ్ళ మధ్య లాలూచీలు అంత సులువుగా జరగవు ఈ విషయంలో దొంగల నీతి చాలా గొప్పది జూదగాళ్ళ మధ్య వాటాలు, దొంగలూ దొంగలూ చేరి ఊళ్ళు పంచుకున్నంత సవ్యంగా జరగవు

లాలూచీలు బహిరంగంగా సాగటం ఎట్లా సాధ్యమవుతుందంటే-ఒకటి, ప్రజలకు ఈ జూదం కిటుకు తెలియకపోవటం, రెండు జూదగాళ్ళు పార్టీ ముసుగులు ధరించటం మనది ముసుగులు నమ్మే జాతి బురఖాలేసుకున్న మనిషల్లా మనకు బూబే: కాషాయ బట్టలు ధరించినవాడల్లా సన్యాసే, హిప్పీ వేషం వేసినవాడల్లా బాబా యే!

అందుచేత మనం పార్టీలను నమ్ముతాం కాని ముక్కలు పంచుకునేవాళ్ళంతా నిజానికి ఒక పార్టీవాళ్ళు కారు అందులో చాలామంది స్వతంత్రులు (స్వతంత్ర పార్టీ వాళ్ళు కారు)! వారికి పార్టీలు మార్చే స్వాతంత్ర్యం ఉన్నది

ఈజూదం, లాలూచీల్లో ఉన్న ఒక గొప్ప విశేషం ఏమిటంటే, జూదం ముగిసినాక కూడా లాలూచీలు సాగుతూనే ఉంటాయి మళ్ళీ ద్యూతమహోత్సవం ఏర్పాటు అయినాక కూడా అందుచేత ఈ మహోత్సవం కేవలం మూణ్ణాళ్ళ ముచ్చటకాదు ఇది శాశ్వత మహోత్సవం-పత్రికలకు అంతులేని మేత, ప్రజలకు ఎడతెగని డెమోక్రసీ

పార్టీలపేరు చెప్పుకునే స్వతంత్రులు కానివారు ప్రతిపార్టీలోనూ ఇద్దరు ముగ్గురుంటారు వీరు అగ్రనాయకులు వాళ్ళు చీటికీమాటికీ పార్టీలు మార్చలేరు ఇందిరాగాంధీ, నిజలింగప్ప డాంగే–ఇటువంటివాళ్ళు, "మేం ఇవాళనుంచీ ఇంకో పార్టీ," అనటానికి లేదు రాచపీనుగుల సామెతగా, ఈ పెద్ద జూదగాళ్ళు పార్టీ మార్చాలంటే, వాళ్ళ వెంట పెద్ద తూగిడీ వచ్చెయ్యాలి కమ్యూనిస్టు, కాంగ్రెసు పార్టీలలాటివి చీలినప్పుడు ఇదే జరిగింది

పార్టీల మహానాయకులు రంగు ఫిరాయించటానికి లేనంత మాత్రాన జూదంలో ఉండే రమ్జు చెడిపోతోందనుకోనవసరం లేదు ఎందుచేత నంటే ఏ పార్టీకీ ఒక రంగు అంటూలేదు అధవా ఉన్నా, ఇతర రంగులతో చేరికవల్ల వైవర్ణ్యం ఏర్పడే పోయింది

ఎక్కడన్నా ఒకరు, "మేం మారంగుతోనే నిలబడతాం" అంటే మనం సీరియస్‌గా తీసుకోనవసరం లేదు ఒకవేళ వాళ్ళే సీరియస్‌గా తీసుకుంటే వాళ్ళు నమ్మకంగా కుదేలు పెట్టేస్తారు ఈ ఆట అలాటిది ఇందులో మంచివాడికి చోటులేదు

నేనిదంతా రాజకీయ విముఖత్వంతో చెబుతున్నానని ఎవరన్నా ఆక్షేపించవచ్చు అలాటిదేమీలేదు నా రాజకీయ అవగాహనలో, ఎన్నికలకు నిలబడే కొద్దివేలమంది అభ్యర్థుల కన్న వాళ్ళకు వోట్లు వేసే అనేక కోట్ల మంది ప్రజలు ముఖ్యం ఇంత కాలంగా జరుగుతున్న ఎన్నికల సంరంభంలో ప్రజల ప్రసక్తి ఏమైనా ఉన్నదా? "ఎవరెన్ని నియోజక వర్గాలకు పోటీ చేయాలి? ఎక్కడ ఏ ఏ పార్టీలు ఏకమై, ఏ ఏ పార్టీలను చదును చెయ్యాలి? లోకసభ సీట్ల కోసం శాసనసభ సీట్లు త్యాగం చెయ్యాలా, లేక అటునుంచి ఇటా? " ఇవేగదా చర్చలు? క్షమించండి! ఇది జూదగాళ్ళ పరిభాష ఇందులో ప్రజల ప్రమేయం ఏమీ లేదు

కాని ఈ జూదగాళ్ళు రేపు ప్రజలను వెతుక్కుంటూ వస్తారు! దేనికి? ఈ జూదంలో పణం ప్రజలూ, వాళ్ళ ఆర్థిక, సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక జీవితమూనూ గడిచిన కాలంలో ఇవన్నీ స్వదేశీ, విదేశీ గుత్తదార్లకు చాలా భాగం ధారాదత్తం అయాయి ఈ పుణ్యభూమిలో హిందువుడై పుట్టిన ప్రతివాడూ కులం అనే బరువును మోస్తూ పుట్టినట్టుగానూ, బానిస కడుపున పుట్టినవాడు బానిస బరువుతో పుట్టినట్టూ, ప్రతి ఆడపిల్లా మన సమాజంలో కట్నం అనే పాపంతో పుట్టినట్టుగా, ఇవాళ ప్రతి భారతీయుడూ రెండువేల తలసరి ఆదాయానికి కాబోలు సమానమైన విదేశీ రుణభారంతో పుడుతున్నాడు స్వాతంత్ర్యం రాక మునుపు అందరికీ అంతో ఇంతో విదేశీ బాంక్ బాలెన్స్ ఉండేది అది హారతి కర్పూరంలా హరించి పోగా భారతీయ ప్రజా జీవితం రుణగ్రస్తమైపోయింది స్వాతంత్ర్యం అందరికీ ఖర్చుపద్దే కాలేదు కొందరు "అదృష్టవంతులు" ఆకాశంలోకి లేచారు వాళ్ళ తరపునే ఈ ద్యూతమహోత్సవాలు జరుగుతున్నాయి ప్రజా జీవితం ధర్మరాజుకి సరిపడేలాగా ఒక్కొక్క పందానికి తరిగి పోతున్నది

* * *

అయినా, ఎవరికీ పట్టని ప్రజాజీవితం గొడవ మనకు దేనికి? వాళ్ళు వోట్లు డబ్బుకు అమ్ముకుంటారని వాపోయేవాళ్ళున్నారు వోటు ఎవరికి వెయ్యాలో తెలీనివాడు నాలుగు డబ్బులన్నా చేసుకుని, రెండు రోజులపాటు కడుపునిండా తిండి తింటే అదైనా దక్కుడు గద! వాళ్ళకు "ఓటర్లు" అని పత్రికలు ఊరికే పేరు పెట్టాయా? వాళ్ళకు వోటర్లు అయే పరిజ్ఞానం వచ్చేసరికి దేశ పరిస్థితే మారిపోతుందని ఆశించటం తప్పమనం చెయ్యగలది ఏమీ కనబడదు

అందుచేత, నూటికి తొంభై తొమ్మిది మందిని వొదిలేసి, నూటికి ఒకడుగా ఉండే మేధావులు ఈ మహా ద్యూతంలో ఏం చెయ్యాలన్నది ఆలోచిస్తే ఏమీ కనబడకుండా ఉన్నది

నువు విద్యావంతుడివి, రాజకీయ రంకెలు అర్థం చేసుకోగలవాడివి కుడి ఎడమలు తెలిసిన వాడివి, నీకు నీ దేశం గురించి అట్టే దుగ్ధలేకపోయినా, ఏ అమెరికా అంటేనో, ఏ రష్యా అంటేనో, ఏ చీనా అంటేనో మనసు పీకుతూ ఉండవచ్చు చీనా రంగు పేక ముక్కల్లో ప్రస్తుతం లేదు గనక దాన్ని వదిలేద్దాం

పెద్ద ఆటగాళ్ళలో రష్యా అభిమానులున్నారు అమెరికా అభిమానులున్నారు అమెరికా వియత్నాం, కాంబోడియాలలో చేసేదే ఇక్కడా చెయ్యటం లేదని దిగులు పడేవాళ్ళున్నారు ప్రీవీ పర్సులు చాలా తాత్కాలికంగా రద్దయితే అన్నమూ, నిద్రా మానేసి కడవలకొద్దీ కన్నీరు కార్చి, పత్రికలను నానబెట్టిన విలేఖరులూ, లేఖకులూ ఉన్నారు దేశంలో ముస్లిములు లేకుండా పోతేనే గాని మన స్వాతంత్ర్యం పరిపూర్ణం కాదనేవారు ఉన్నారు

వీళ్ళలో నీకు ఏ పెద్దెత్తు జూదగాళ్ళమీద నన్నా మమత ఉండవచ్చు కాని నీ మమత ఎలా తీరుతుంది? లాలూచీ ఫలితంగా అంతాకలగాపులగమయింది ఒకే కూటంలో సోషలిస్టు సిద్ధాంతానికి చేతులూ కాళ్ళూ కట్టేసుకున్నవాళ్ళూ, మత పిచ్చగాళ్ళూ ఉన్నారు నువు వోటు వేసే చోట నీకు కావలిసిన పిచ్చివాడు అభ్యర్థి కాకపోవచ్చు దొంగలు ఊళ్ళు పంచుకుంటే, "నేను ఫలాని దొంగకు వచ్చే ఊళ్ళోనే ఉంటాను," అని పట్టు బట్టటం ఎంత సబబో, "నేను ఫలానా దినుసు పిచ్చిగలవాడికే నా వోటు ఇస్తా"ననటం అంతే సబబు అది సాగేదికాదు

అంతేకాదు, జూదంలో గెలుపు డబ్బు గలవాడిదే (చూడుము గుర్రపు పందెములు ) ఒక కులం వాళ్ళు ఒక నియోజక వర్గంలో ఉంటే ఆకులం వాణ్ణేనీకు ఎదురుగా పెడతారు అది గెలుపు పద్ధతి నీ కిష్టమైన పార్టీ చేరి ఉన్న మురా ఎవణ్ణి పెడితే వాడికే నీ వోటు వెయ్యాలి అక్కడ నీ సిద్ధాంతాలూ, విశ్వాసాలూ చిన్నమెత్తు పనికిరావు నువు శుద్ధ ఖద్దరు కావచ్చుగాక, లేదా నూరు పైసల డీయమ్కే కావచ్చుగాక నీ నెత్తిన ఒక కమ్యూనిస్టు అభ్యర్థిని నీవాళ్ళే తెచ్చి పెడితే ఏం చేస్తావు? ఒక ముస్లింలీగు సోదరుణ్ణి తెచ్చి పెడితే ఏం చేస్తావు?

అదే ఇంకో విధంగా అడగాలంటే, ఈ మహాద్యూతంలోనీ ఆదర్శాల కున్న స్థానం ఏమిటి? విలువ ఏమిటి?

అభ్యర్థులు ఏదో చెబుతారు అది నీబోటి వాళ్ళకోసం పామరులను డబ్బుతో కొనెయ్యవచ్చు నువు మేధావివి, నువు డబ్బుకు అమ్ముడు పోయేటంత చవుకబారు భౌతిక వాదివి కావు అందుచేత నీ వోటును తమ జూదంలో ఎందుకు పణంగా పెట్టవలసి ఉంటుందో నీ అభ్యర్థి చెబుతాడు కాని ఆ చెప్పేదానికి ఎంత విలువ ఉంటుంది? అన్నమాట నిలబెట్టుకునే శక్తి అతనికి ఏపాటి ఉన్నది? ఆశక్తిని అతను ఉపయోగించుకునేటందుకు ఎంతవరకు కృషి చేస్తాడు–చెయ్యగలడు

ఈ ప్రశ్నలకు బేతాళుడే సమాధానం చెప్పలేడు

పరిస్థితి ఇలా ఉందనీ, ఇలా ఉండటం బాగు లేదనీ గ్రహించినవారు కొందరు ఉన్నారు

"చదువుకున్నవాళ్ళకే వోటు వేసే హక్కుంటే ఇంత గందరగోళం లేకపోను " అంటాడొక ఆలోచనాపరుడు

"ఆస్తి ఉన్నవాళ్ళకే వోటుంటే సరిపోయేది," అంటాడు మరొకడు

చదువుకున్న వాళ్ళకున్నాడా వోటిచ్చినా కూడా అక్షరాస్యత నత్తనడక నడుస్తున్నది: చదువుకున్నవాళ్ళకే వోటంటే ఈ దేశంలో నిరక్షరతపోయే దెప్పుడు?

దరిద్రులకు వోటున్నాకూడా ధనికవర్గమే మరింత ధనికమవుతున్నది: దరిద్రులు అడుగంటే పోతున్నారు దరిద్రులకు వోటు లేకుండా చేస్తే దేశ దౌర్భాగ్యం తీరేమార్గం ఏమిటి?

లేక – పాపము శమించుగాక! –అసలువోట్లూ, వోటింగూ లేకుండా చేస్తేనే గాని ఏ సమస్యా పరిష్కారం కాదా?

తోకముక్క–

"ఎవరికి వోటు వేద్దామనుకుంటున్నావు?"

"అసలు నాకు వోటు వేద్దామని లేదు "

"కొంపదీసి, నువు నక్సలైట్స్‌తో చేరావా ఏం?"

"చంపేసావు! పోనీ నువు చెప్పు–నువ్వెవరికి వెయ్యమంటే వారికి వేస్తాను,"

వసుధ మాసపత్రిక, మార్చి,1971

# 3. జీవిత దృక్పధాలు

మనిషికీ ఇతర జంతువుకూ గల తేడాలలో ముఖ్యమైనది ఏమంటే, మనిషి తన చుట్టూ ఉండే వాతావరణాన్ని బుద్ధి పూర్వకంగా మార్చుకోగలడు ఇతర జంతువులు ఆ పని చెయ్యలేవు–అని శాస్త్రజ్ఞులు చెబుతారు

కేవలమూ దీనిని బట్టి మనుషులు పైకి వస్తారా అన్నది తేలదు మానవుడు తన వాతావరణాన్ని మంచికి మార్చవచ్చు చెడుకు కూడా మార్చవచ్చు మానవుడు సాధించే మార్పు పురోగమనానికి తోడ్పడవచ్చు తిరోగమనానికి తోడ్పడవచ్చు

ఏది పురోగమనం? ఏది తిరోగమనం? ఏది మంచి? ఏది చెడు? ఈ ప్రశ్నలకు అందరూ ఆమోదించేసమాధానాలున్నాయా అంటే లేవు పత్రికలలోనూ, పుస్తకాలలోనూ సెక్సు ఎంత జాస్తిగా ఉంటే జీవితం అంత సంబరంగా ఉంటుందనుకునే యువకులున్నారు సాయుధ పోరాటం ద్వారా విప్లవం సాధిస్తేనేగాని జీవితానికి అర్థం లేదనుకునే యువకులూ ఉన్నారు డబ్బు సంపాదించటమూ, ఉద్యోగం ఆర్థికంగా మంచి పునాది వేసుకోవటం ఉన్నత జీవితాదర్శం అనుకునే వాళ్ళూ ఉన్నారు

జీవిత దృక్పధాలలో తేడా ఈ వైవిధ్యానికి మూలకారణం ఈ కారణం వెనక వ్యక్తి గతమైన కారణాలు మనిషి మనిషికీ భిన్నంగా ఉంటాయి కులమూ, మతమూ, వర్గమూ, వాతావరణమూ, చదువులూ, స్నేహ సంపర్కాలూ, శక్తి సామర్థ్యాలూ మొదలైనవి దృక్పధాలకు రూపాన్ని కలిగిస్తాయి అవే వ్యక్తుల సామాజిక ప్రవర్తనను నిర్ణయిస్తాయి

కాని చాలా మందికి ఒక విస్పష్టమైన దృక్పధం ఉండదు వారు జీవిత ప్రవాహంలో గడ్డి పరకలాగా కొట్టుకుపోవటానికి తప్ప ఇంకెందుకూ పనికిరారు అలాటి వారికన్న హిప్పీలు కూడా నయమేనేమో గాలికి ఎగిరే పులి విస్తరాకుల్లాగా వాళ్ళు కాస్సేపు పైకి లేస్తారు కాస్సేపు కిందపడి దొర్లుతారు ఏమి జరిగినా అది వారి ప్రయోజకత్వం కాదు!

కొంతమందికి దృక్పధాలు స్పష్టంగానే ఉంటాయి అవి అవాస్తవికంగా ఉంటాయి ఇలాంటి వాళ్ళు తమకు సాధ్యం కానివీ, అసంభావ్యమైనవీ అయిన లక్ష్యాలమీద మనస్సును కేంద్రీకరిస్తారు ఇలాంటి వారే తాము భారతీయులమైనందుకు చింతించి, పాశ్చాత్యుల లాగా జీవించటం జీవితాదర్శంగా పెట్టుకుంటారుః తోటివాడితో మాట్లాడటం చేతకాక పోయినా సినిమా స్టారు కావాలని గొంతెమ్మ కోరికలు కోరుతారు బీడీ ముక్క మరి కొనలేక పోయినా కోటీశ్వరుడు కావాలని కలలు కంటారు సాధారణంగా ఈ రకం మనుషులలో వర్గ స్వభావం ఏమీ ఉండదు

అసలు వర్గాలనే కృత్రిమంగా భావించి, అవి కార్ల్‌మార్క్స్ చేసిన విశ్వామిత్ర సృష్టి అనుకునే వాళ్ళు కూడా వున్నారు మానవజాతి అనేక లక్షల ఏళ్ళుగా సాధిస్తున్న పరిణామం సామాజిక మైనదనీ, సమాజంలో వర్గాలనేవి భౌతిక కారణాల వల్ల ఏర్పడిన వాస్తవ సామాజిక విభాగాలనీ వీరికి తెలీదు వర్గవైషమ్యాలకూ, జాతి వైషమ్యాలకూ, యజమానికీ కార్మికులకూ మధ్య శత్రుత్వానికీ తేడా తెలీదు

సామాజిక జీవితంలో మనుష్యుల దృక్పధాలు వర్గ స్వభావం కలవై ఉండటం ప్రయోజనకరమైనవి అవీ సమాజాన్ని నడిపించేవి (వర్గరహిత సమాజంలో అందరికీ ఒక దృక్పధం ఉంటుంది ఆ సమాజం నీడలే వేరు ) ధన కాంక్షా, స్త్రీ వ్యసనమూ, కీర్తి కండూతీ అధికార దాహమూ మొదలైన వ్యష్టి లక్ష్యాలుజీవిత దృక్పధాలనిపించుకోవు

మనిషికి సరిఅయిన అవగాహనా, జీవితానుభవమూ ఉండటం సరిఅయిన దృక్పధానికి ముఖ్యం కాని పరిమితమైన వాతావరణంలో పెరిగే వ్యక్తికి జీవితానుభవమూ, జీవితాన్ని అవగాహన చేసుకునే శక్తీ కూడా పరిమితంగానే ఉంటాయి ఈ లోపాన్నీ తీర్చగలది సాహిత్యం వార్తాపత్రికలు కొంత వరకు మన నిత్యానుభవాలను పెంచుతాయి కాని జీవితాన్ని అవగాహన చేసుకునే శక్తిని ప్రసాదించవు ఎందుచేతనంటే, ఆ పత్రికల వాళ్ళకు వర్గ దృక్పధం ఉంటుంది వార్తా పత్రికలు అన్ని వర్గాలవారూ కొని చదవటానికి వెలువడేవే అయినా, ఒక వర్గం (సాధారణంగా ధనిక వర్గం, పాలకవర్గం) యొక్క దృక్పధాన్నే ప్రచారం చేస్తాయి పత్రికలలో పడినది పరమ వేదమనుకునే వారిమాట ఏమోగాని, కాస్త విచక్షణతో చదివే వారికి ఏ పత్రిక ఏరకం వార్తలను అణచిపెట్టేదీ, ఏరకం వార్తలను మారుమూలలకు నెట్టేదీ స్పష్టంగా తెలుస్తుంది సంపాదకీయాల మాట చెప్పనే అక్కరలేదు! అవి కొందరికి అమృతమూ, మరి కొందరికి విషమూ లాగుంటాయి ఒక్క ముక్కలో చెప్పాలంటే, వార్తా పత్రికలు పైవర్గాలకు ప్రచార సాధనాలు

కింది వర్గాలవారికి పత్రికలు లేక పోలేదు కాని వర్గచైతన్యమూ, దానితోబాటు జీవిత దృక్పధము లోపించిన మన దేశంలో 'కింది' వాళ్ళుకూడా 'మీది' వాళ్ళ పత్రికలే చదువుతారు!

సాహిత్యంలో ఇంత మోసం లేదు వర్గచైతన్యం రచయితలలో చాలా తక్కువే అని చెప్పాలి అందుచేత చాలామంది సాహితీపరులు సాహిత్య సంప్రదాయంతో ప్రభావితు లైనట్టుగా జీవితం నుంచి సాధారణంగా ప్రభావితులు కారేమో అందుచేతనే జీవితంలో అంతులేని వైవిధ్యం ఉన్నప్పటికీ, రచయితలు రక రకాల జీవితానుభవాలు కలవారైనప్పటికీ, వెలువడే కధలు బహుకొద్ది మూసలనుంచి వచ్చినట్టుంటాయి

అయితే ఇందుకు భిన్నంగా వర్గచైతన్యం కలిగి రాసేవాళ్ళూ, వాస్తవ జీవితాన్ని తమ రచనలలో ప్రతిబింబించే వారూ లేకపోలేదు కాని, సాహిత్య సమస్య ఒకపాలు రచయితదీ, తొంభై తొమ్మిది పాళ్ళు చదివేవాళ్ళదీనూ, ఏ రచయితా తన ఆత్మవికాసం కోసం రాయడు, రచించిన రచన పుట్టిన బిడ్డలాంటిది దాని జీవితం పాఠకులపైన ఉంటుంది అది పాఠకులలో కలిగించే చైతన్యమే దాని సార్ధకత్వం

ఇప్పుడున్న పరిస్థితిలో సాహిత్య సమస్య చదివేవారి సమస్య అన్నదాన్ని గురించి నాకు ఎటువంటి సందేహమూ లేదు

ఏ రచన ఏ తరగతి పాఠకుల కోసం పుట్టిందో ఆ తరగతి పాఠకులు దాన్ని చదవటం జరగాలి జమీందారుగారబ్బాయి చదివి ఆనందించే కథలు నిరుద్యోగి అయిన తక్కువ శ్రేణి మధ్య తరగతి యువకుడు చదివి ఆనందించటం మూలాన సాహిత్యం ద్వారా సాంఘిక చైతన్యం పెంపొందదు

పాఠకులలో లేని వర్గ చైతన్యం ఎక్కడినుంచి వచ్చేటట్టు? వార్తా పత్రికల నుంచి రాదు, ప్రభుత్వ చర్యలు పై వర్గాలవారికి అనుకూలంగా ఉండటం చేత వాటి నుంచి కూడా రాదు అందుచేత సాహిత్యమే వర్గ స్వభావాలను వాస్తవంగా చిత్రించి పాఠకులలో వర్గ చైతన్యం పెంపొందించాలి ఇది జరగనంతకాలం సాంఘిక చైతన్యం అస్తవ్యస్తంగా ఉండి సామాజిక పురోభివృద్ధికి పునాది ఏర్పడదు

సినిమాలు అనే సాహిత్య స్వరూపం పనిపెట్టుకుని సాంఘిక చైతన్యాన్ని అస్తవ్యస్తం చేస్తున్నది వాటిలో సాధారణంగా ఎలాంటి జీవిత సత్యమూ ఉండటంలేదు చాలా చిత్రాలు నూటికి నూరుపాళ్ళు పచ్చి అబద్ధాలు జనం వాటిని ఎగబడి చూస్తున్నారు అందువల్ల వారికి కలిగే చైతన్యం శూన్యం

వర్గ చైతన్యం లేక, కీర్తికో, డబ్బుకో రచనలు చేసే వారికి చెప్పి లాభంలేదు వర్గచైతన్యం కలిగించటానికి దీక్షగా కృషి చేయాలి పాఠకులు కేవలమూ ఊసుపోక కోసంకాక, సాహిత్యం ఒక అమూల్యమైన సాంఘిక శక్తి అన్నది గుర్తించి, తమలో వికాసం కలిగించే సాహిత్యం కోసం వెతికి చదవాలి

ఈదృక్పథం గలవారు వర్గవైషమ్యాలు తెచ్చి పెట్టుతున్నారని విమర్శించే వారున్నారు వర్గవైషమ్యం జీవితంలో ఉంటేనే వాటికి సాహిత్యంలో స్థానం ఉంటుంది కృత్రిమంగా కల్పించిన వైషమ్యాలు జనానికి పట్టవు అలాంటి వైషమ్యాలు సృష్టించటం రాజకీయ వాదులకు లాభిస్తుందిగాని రచయితలకు ఏమాత్రమూ లాభించదు రచయితలలో దుర్మార్గం ఉండటం సాధ్యం కాదనికాదు ఇప్పుడు రాజకీయవాదులు "పోషించే" రచయితలు కూడా ఉంటున్నట్టు కనిపిస్తుంది అటువంటి వారు పనిపెట్టుకుని రియాక్షనరీ సాహిత్యం సృష్టించవచ్చు కాని ఇది రెంటికీ చెడ్డ రేవడ సాహిత్యం అవుతుంది ఈ సాహిత్యాన్ని ఆమోదించే వారు జీవితంలో కూడా రియాక్షనరీలుగానే ఉంటారు సాంఘిక చైతన్యాన్ని పెంపొందించే సాహిత్యం క్రమంగా విస్తరిస్తుంది విస్తరిస్తున్నది కూడానూ

జ్యోతి, మాసపత్రిక, దీపావళి ప్రత్యేక సంచిక, 1971

పునర్ముద్రణః కళలు, శాస్త్రవిజ్ఞానం

# 4. చీనా కథ
## (చారిత్రక ఇతిహాస కథ)

ఈనాడు ముఖ్యంగా చీనాకు ఐక్యరాజ్య సమితిలో సరిఅయిన ప్రాతినిధ్యం దొరికింది గనుక – చీనా గురించి సూక్ష్మంగా నైనా తెలుసుకోక పోతే మనకు ప్రపంచం గురించి తెలిసినట్టు కాదు

గత శతాబ్దిలో ప్రాచ్య దేశాలను గురించి పాశ్చాత్యులకు ఎలాంటి అభిప్రాయాలుంటే అవే చరిత్రగా చలామణి అయాయి పాశ్చాత్యుల దృక్పథమే మనదీనూ! నేను నాలుగో క్లాసు చదువుకునేటప్పుడు ఒక మేస్టరు క్లైవు ఆర్కాటు ముట్టడి గురించి క్లాసులో చెబుతూ, బ్రిటిషు వారి విజయమే మన విజయ మన్నంత ఉత్సాహానందాలు కనబరచాడు! బ్రిటిషువారు మనదేశాన్ని ఏకం చేశారు మనకు ఆధునిక నాగరికత నేర్పారు, రైళ్ళు వేశారు, ఆనకట్టలు కట్టారు, కోర్టులు ఏర్పాటు చేశారు మన అరాజకం పోగొట్టారు ఇదే మనం ఆ కాలంలో తెలుసుకున్న హిందూదేశ చరిత్ర

అలాంటి చరిత్రే చీనాను గురించి కూడా పాశ్చాత్యదేశాలలో వ్యాప్తి అయింది ఇరవై సంవత్సరాల క్రితం కూడా పాశ్చాత్య దేశాలలో విద్యార్థులకు చీనా వాళ్ళు మగతనం లేని వాళ్ళనీ, పిరికి పందలనీ, సంఘటితపడే సామర్థ్యం లేని అసమర్థులనీ, ద్రోహబుద్ధి కలవాళ్ళనీ బోధించేవారని హాన్ సూయిన్ అంటుంది

నిజానికి ఈ నాడున్న నాగరికతలలో అత్యంత ప్రాచీనమైన నాగరికత చీనావారిది చీనాకన్న ముందు కొన్ని నాగరికతలు (సుమేర్, బాబలోనియా) ఉండిన మాట నిజమేగాని అవేవీ చీనా నాగరికతలాగా అవిచ్ఛిన్నంగా పరిణతి పొందక, మధ్యలో అంతరించి పోయాయి

ప్రాచీనకాలంమాట అలా ఉంచి ఆధునిక రాజకీయ చరిత్రకూడా చీనాకు తీరనిద్రోహం చేసింది ఈ ద్రోహం ప్రధానంగా అమెరికా వల్ల జరిగినా అమెరికాకు పాటపాడిన దేశాలు చాలా ఉన్నాయి 1949లో చీనాలోని ప్రభుత్వానికి ప్రాతినిధ్యం లేకుండా అడ్డుపడటమేగాక, ఫార్మోజాలో ప్రవాసం చేస్తున్న చ్యాంగ్ కైషేక్ ప్రభుత్వానికి ప్రాతినిధ్యం ఉండేటట్టు చూసింది చిట్టచివరకు పరిస్థితుల ప్రోద్బలంవల్ల చీనాలోని కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని గుర్తించటం తప్పనిసరి అయాకకూడా అమెరికా ద్రోహబుద్ధి మానక, ఫార్మోజాకు కూడా చీనాతో బాటు ప్రాతినిధ్యం ఉంచటానికి ఎత్తువేసింది ఫార్మోజాకు ఐక్యరాజ్యసమితిలో స్థానం ఉండగా కమ్యూనిస్టులు అందులో ప్రవేశించబోమని స్పష్టంచేసినా కూడా అమెరికా ఇలా చెయ్యటంలో ఉద్దేశం ఏ విధంగా నైనా కమ్యూనిస్టు చీనాకు ఐక్యరాజ్యసమితిలో స్థానం లేకుండా చూడాలనే తప్ప మరేమీ లేదు

అంతేకాదు, న్యాయంగా చీనాకు చెందిన ఫార్మోజాను అమెరికా ఆక్రమించుకుని, తన స్థావరంగా చేసుకుని ఉన్నది చ్యాంగ్ కై షేక్ ఎప్పటికైనా చీనా భూభాగాన్ని తిరిగి జయించి, అక్కడ పెట్టుబడి దారీని, ప్రజా పీడను, దోపిడీని, దారిద్ర్యాన్నీ, అవినీతినీ తిరిగి నెలకొల్పుతాడన్న కట్టుకథలను ప్రపంచం చేత నమ్మించటానికి ప్రయత్నం చేస్తూ వచ్చిన అమెరికా రాజకీయ

దృక్పథం అవాస్తవికతకూ, సిగ్గుమాలిన తనానికీ గొప్ప నిదర్శనం ఈ అమెరికా దృక్పథాన్ని భళీ అని మెచ్చుకుని, ఫార్మోజాను ఐక్యరాజ్యసమితి నుంచి గెంటి వెయ్యటంతో ధర్మం దెబ్బతిన్నదని రాజగోపాలాచారి వంటి రాజకీయ 'మేధావులు' అశ్రుతర్పణాలు కూడా విడిచారు!

జనాభారీత్యా అయితే నేమి (75కోట్లు), అణ్వస్త్రాలుండటం వలన అయితేనేమి, వెనుకబడిన దేశాలను ప్రభావితం చేసేశక్తి ఉండటం చేతనైతేనేమి, ఐక్యరాజ్యసమితిలో అగ్రదేశాల మధ్య స్థానం సంపాదించుకున్న కారణంగా నైతేనేమి, చీనా వర్తమాన ప్రపంచ చరిత్రలో అతిముఖ్యమైన పాత్ర వహించబోతున్నది చీనా పరిణామం అమెరికా పరిణామం లాగా క్షీణదశలోలేదు వృద్ధిదశలో ఉన్నది అంటే, అంతర్జాతీయ రాజకీయాలలో అమెరికా పాత్ర క్రమంగా దుర్బలమవుతుంటే, చీనా పాత్ర మరింత బలపడే అవకాశం ఉన్నది

మనం చీనా కథ తెలుసు కోవటానికి అది బలమైన కారణం చీనా గురించి తెలుసుకునే టందుకు మనం చీనా తోవలోనే పోవాలని కూడా లేదు అలాపోవటం అంతసులువు కూడా కాదు చీనా తోవ తమది కాదన్న భావంతోనే పాశ్చాత్యులు చీనా కథను సరిగా గ్రహించక "అప్రాచ్యం"గా ప్రవర్తించి, అపఖ్యాతి పాలవుతున్నారు మనదేశంలో కూడా అలాంటి అపోహలతో కొట్టుకునే వారున్నారు చీనాను గురించి వాస్తవం తెలుసుకోవటం ఇష్టంలేక ఊహాగానాలు చేసేవారు అపహాస్యం పాలుగాక తప్పదు మనం అలాంటి పొరపాటు చేయవద్దు

"చీనాను తెలుసుకోవాలంటే ముందు చీనాను గుర్తించాలి" అని ఒక ఫ్రెంచి విలేఖరి అన్నాడట 'రాజకీయంగా గుర్తించటమే కాదు, చీనా దృక్పథాన్నీ, ప్రపంచవైఖరినీ, స్వభావాన్నీ, అంతర్జాతీయ పాత్రనూ వాస్తవంగా గుర్తించాలి అంటుంది హాన్‌సుయన్ ఈ చీనా కథ కొంత వరకైనా ఆపని సాధించాలని నాఉద్దేశ్యం ఈ కథను రాయటానికి నేను కొందరు రచయితలపై ఆధారపడుతున్నాను వారెవరూ కమ్యూనిస్టులు కారు

* * *

డేవిడ్సన్ బ్లాక్ అనే కెనడా వాస్తవ్యుడు పీకింగ్ నగరంలోని వైద్యకళాశాలలో విద్యార్థులకు శరీర నిర్మాణ శాస్త్రం బోధిస్తూ ఉండేవాడు

పీకింగ్ నగరానికి 30 మైళ్ళ దూరంలో సున్నపురాళ్ళ కొండల్లో ఒక గుహ ఉండేది ఆ ప్రాంతాన్ని చూకొటియెన్ అంటారు ఆ గుహలో ప్రాచీన మానవుల అవశేషాలుండేవి అనేక శతాబ్దాలుగా 'వైద్యులు' ఆ అస్థికలను త్రవ్వితీసి, చూర్ణంచేసి, అగ్నిమాంద్యానికి ఔషధంగా తిండిపోతులైన ఐకులీనులకు అమ్ముతూండేవారు ఆలా ఎన్ని అమూల్యమైన అవశేషాలు పోయాయో తెలీదు

ఆ గుహలో దొరికిన ఒక చిన్న దంతం (పన్ను) బ్లాక్ వద్దకు వచ్చింది దాన్ని చూస్తూనే ఆయన అది ఆధునిక మానవుడిది కాదని తెలుసుకున్నాడు పరిశోధకులు ఆగుహలో తవ్వకాలు జరిపి, అసంఖ్యాకమైన అస్థికలనూ, అతిప్రాచీన మానవుల పుర్రెలనూ, ఇతర ఎముకలనూ పోగుచేసి, పరిశోధనలు సాగించారు

ఆ విధంగా 1927లో 'పీకింగ్ మానవుడు' అనే వాణ్ణి గురించి ప్రపంచం తెలుసుకున్నది ఈ "పీకింగ్ మానవుడు" అయిదు లక్షల ఏళ్ళక్రితం జీవించినవాడు ఇతనికి నిప్పు ఉపయోగం

తెలుసు  ఈనాటి చీనా వారందరూ ఈ 'పీకింగ్ మానవుడి' సంతతే అయితే ఆశ్చర్యం ఏమీలేదు

'పీకింగ్ మానవుడు' పూర్వ శిలాయుగానికి చెందిన వాడు  ఉత్తర శిలాయుగానికి చెందిన మానవుల అవశేషాలు చీనాలోని వివిధ ప్రాంతాల కనిపిస్తాయి  వారు తమ రాతి పనిముట్లను, పదును పెట్టుకున్నారు  రాళ్ళతో కత్తులూ, గొడ్డళ్ళూ, ఈటెలూ తయారు చేసుకున్నారు  విల్లులూ, బాణాలూ వాడారు  వారి జీవనం అన్ని ప్రాంతాలా ఒకేరీతిగా సాగలేదు  కొన్ని చోట్ల వారు వేటాడి జీవించారు  మరికొన్ని ప్రాంతాల వరీ, ఇతర ధాన్యాలూ పండించి ఉంటారు  బట్టలు నేశారు, కుండలు చేశారు, కుక్కలనూ, గొర్రెలనూ, పశువులనూ, పందులనూ, గుర్రాలనూ మచ్చిక చేశారు

అయిదువేల ఏళ్ళక్రితం "పచ్చనది" పెద్ద మలుపులో ఉత్తర శిలాయుగపు నాగరికత వెలిసింది  ఆ ప్రాంతాలలోని ఒండ్రుభూమి సులువుగా దున్నటానికీ, నీరు పెట్టటానికీ, పంటలు పండించటానికీ అనుకూలమైనది  అందుచేత ఆ ప్రాంతంలో మనుషులు హెచ్చుసంఖ్యలో నివాసాలు ఏర్పాటు చేసుకోగలిగారు  అక్కడ ఒక సామాజిక వ్యవస్థ ఏర్పడింది

ఆదికాలపు చీనీయులు పశుపాలన ఎరుగరని తోస్తుంది  వారుపాలుగాని, వెన్నగాని ఉపయోగించినట్టు ఎలాంటి దాఖలా కూడా లేదు  వారూ మొదట వ్యవసాయం నేర్చి, అనంతరం పశుపోషణ తెలుసుకుని ఉండాలి

చీనా సంస్కృతి అవిచ్ఛిన్నంగా కొనసాగిందనటానికి ఆధారం ఉన్నది  ఎందుకంటే శిలాయుగంలో వారు తమ పరికరాలను రాళ్ళతో ఏయే రూపాలలో తయారు చేసుకున్నారో, ఆ పరికరాలను అదే రూపాలలో లోహయుగంలో లోహంతో కూడా తయారు చేసుకున్నారు

ఈ తొలికాలపు చీనా నాగరికత తూర్పుగానూ, దక్షిణంగానూ వ్యాపించి, అక్కడి ప్రజలకు కూడా సంక్రమించింది  ఈ నాగరికత తాలూకు ప్రారంభదశ కొన్నివేల ఏళ్ళ పాటు సాగింది  ఆ సహస్రాబ్దాల కాలంలో  మంగోలియానుంచి బర్మా, వియత్నాముల దాకానూ, టిబెట్, సింకియాంగ్‌ల నుంచి సముద్రతీరం దాకానూ చీనీయులనదగిన వారు వెలిశారు

## పురాణయుగం

అన్ని జాతుల వారికీ ఉన్నట్టే చీనీయులకు కూడా ఒక పురాణయుగం ఉన్నది  పురాణ గాధలున్నాయి

భూమీ, ఆకాశమూ విడివడి పోయిన అనంతరం, 12 మంది 'దేవతా' చక్రవర్తులు 18,000 ఏళ్ళ పాటు పాలించారు  తరువాత 11 మంది 'భూలోక' చక్రవర్తులు మరి 18,000 ఏళ్ళపాటు పాలించారు  తరువాత తొమ్మిది మంది మానవ చక్రవర్తులు 45,600 ఏళ్ళు పాలించారు  వారి అనంతరం 16 మంది మహారాజులు పాలించారు  మనకు కూడా షోడశ మహారాజులుండి ఉండటం గమనించ దగినది  షోడశ మహారాజుల అనంతరం "రాజత్రయం" పాలించారు  వారి పేర్లు: ఫుసి, షేన్ మంగ్, హ్వాంగ్ తీ

ఈ రాజత్రయమే అన్ని కళలనూ, విద్యలనూ సృష్టించారు  వాళ్ళు నివసించినట్టు చెప్పబడే ప్రాంతం ఈనాటి హెనాన్  మొట్టమొదటగా వ్యవసాయం చేసినవాడు షేన్ మంగ్  హ్వాంగ్

తీ అనంతరం నాలుగు తరాలవారు రాజనీతిని రూపొందించారుః హ్వాంగ్ తీ సంతతికి చెందిన యూ అనే వాడు నదులను మళ్ళించి, వరదలను అదుపులో పెట్టాడు

(పైన చెప్పిన పురాణ పురుషులు పాలించిన కాలాన్నీ కలిపితే పీకింగ్ మానవుడి కాలానికి ఉజ్జాయింపుగా సరిపోవటం యాదృచ్ఛికం)

## ఇతిహాసం

చీనా ఇతిహాసాలలో చెప్పి ఉన్న సియా రాజవంశం క్రీ పూ 2205లో నేటికి(4000 ఏళ్ళ క్రితం) ప్రారంభయింది దీనికి మూల పురుషుడు యూ-హ్వాంగ్ తీ సంతతివాడు

సియా రాజులు 439 ఏళ్ళు పరిపాలన చేశారట వారి రాజధాని షాన్సీ రాష్ట్రం నెరుతీ ప్రాంతంలో ఉండినట్లు ఇతిహాసం చెబుతున్నది సియా పాలకులలో ఆఖరి వాడు ప్రజాకంటకుడు అతణ్ణి తాంగ్ అనేవాడు పదవీ భ్రష్టుణ్ణి చేసి, క్రీ పూ 1766 లో షాంగ్ పరిపాలన స్థాపించాడు ఈ తాంగ్ కూడా తాను హ్వాంగ్‌తీ సంతతివాడిననే చెప్పుకున్నాడు

షాంగ్ సంతతి పాలన క్రీ పూ 1100 దాకా సాగింది

ఇటీవలి దాకా చరిత్ర కారులు సియా, షాంగ్ రాజవంశాల ఇతిహాసాలను కాకమ్మ కథల కింద కొట్టి పారేశారు అయితే గత శతాబ్ది అంతంలో జరిగిన కొన్ని పరిశోధనల ఫలితంగా షాంగ్ రాజులు వాస్తవపురుషులే నన్నది రుజువయింది

ఆ సమయంలో కొన్ని 'మంత్రాస్థికలూ' తాబేటిచిప్పలు దొరికాయి ప్రాచీనులు తమ కేదైనా సమస్య వచ్చి నప్పుడు ఎముకలమీద అక్షరాలు గీకి, ఆ ఎముకలను నిప్పులలో వేసేవారు కాలిన ఎముకలలో కనిపించే పగులు గీతలను బట్టి కర్తవ్యం నిర్ణయించుకునేవారు

షాంగ్ పాలకుల రాజధాని హునాన్ రాష్ట్రంలోని యిన్‌సు అనే నగరం క్రీ పూ 1100లో పచ్చనది వరదలు వచ్చి ఈనగరం నేలమట్టమయింది ఆ రాజులు ఉపయోగించిన మంత్రాస్థికలూ, తాబేటి చిప్పలూ మూడువేల ఏళ్ళపాటు హునాన్‌లో నిక్షిప్తమై ఉండి, గత శతాబ్ద అంతంలో బయట పడ్డాయి

లక్షకుపై బడిన సంఖ్యలో దొరికిన ఈ ఎముకల మీద 25 మంది షాంగ్ రాజుల పేర్లూ, అయిదుగురు ఇతర రాజులపేర్లూ బయట పడ్డాయి హాన్ యుగపు (క్రీ పూ 206 నుంచి క్రీ శ 221) దాకా చరిత్ర కారులు కొన్నివేల ఏళ్ళనాటి షాంగ్ రాజుల వంశక్రమాలు లిఖించి పెట్టి ఉన్నందున, ఎముకలమీద రాజులపేర్లూ, హాన్ చరిత్ర కారులు రాసిపెట్టిన పేర్లూ, సరిచూడటం సాధ్యమయింది ఆ విధంగా షాంగ్ రాజవంశీయులందరూ వాస్తవ వ్యక్తులే నన్నది రుజువయింది

ఇది ఇలా ఉండగా 1956లో కియాంగ్యూలో జరిగిన తవ్వకాలలో షాంగ్, చౌ సెటిల్మెంటులు ఒక దానిపైన ఒకటి ఉన్నట్టు బయట పడింది దీనికి తగ్గట్టుగానే చౌ కులీనులందరూ తాము సియా సంతతి వారమని చెప్పుకోవటంతో సియా వంశానికి చారిత్రిక దార్ఢ్యం లభించింది (క్రీ పూ 1100-481 దాకా రెండు శకాలు జరిగాయి)

షాంగ్ రాజవంశం వాస్తవమని రుజువయినాక, అంతకుపూర్వం నడిచిన యీ వంశం గురించి కూడా చర్చలు జరిగాయి హాన్ చరిత్ర కారులు సియా రాజులపేర్లు కూడా రాసి పెట్టి ఉన్నారు మరి

షాంగ్ నాటి మంత్రాస్థికలమీది లిపి పరిణితమైన లిపి, ప్రాకృత లిపి కాదు  లిపి పరిణితం కావటానికి చాలాకాలం పట్టుతుంది  అందుచేత సియా యుగంకూడా వాస్తవమే అయి ఉండాలి  అయితే సియా చరిత్ర ఇంకా నిరూపణ కావలసి ఉన్నది

## షాంగ్ నాగరికత

షాంగ్ ప్రజలు కంచు పోతపోసి, కంచు వస్తువులు ఉపయోగించారు  వారిది 'కాంస్య' నాగరికత, వారు తయారు చేసిన కంచు వస్తువులు చాలా మేలైనవి

ఆ యుగంలో బానిసత్వం ఉండేదనుకోటానికి ఆధారం ఉన్నది  ఆ కాలంలో చచ్చిపోయిన వారితో బాటు బతికివున్న వాళ్ళను కూడా పాతిపెట్టే ఆచారం ఉండేది

ఇలాంటి నాగరికతకు పూర్వదశ ఉండి తీరాలి  అదే సియా నాగరికత  గత చరిత్రను తవ్వకాల ద్వారా బహిర్గతం చెయ్యటానికి విస్తృతంగా ప్రయత్నాలు జరుగుతున్నాయి ఎన్నిరాజవంశాలు మారినా చీనా జాతి అవిచ్ఛిన్నంగా ఉంటూవచ్చింది  విజాతీయుల దాడులేవీ భారీగా జరగక పోవటం చేత మూల జాతిలో పెద్దమార్పులకు అవకాశం లేక పోయింది ఇతరజాతుల వాళ్ళు చీనాకు వలస రావటం జరిగితే చీనాజాతి వారిని తనలో కలుపుకున్నది

ఇందుకు తార్కాణంగా చీనాలో పశ్చిమ ప్రాంతాల ఒయాసిస్సులలో నివసించే ఆదిమవాసులు టర్కీ భాష మాట్లాడేవారు  తెల్ల జాతులకు చెందిన వారనీ, స్విట్జర్లాండులోనూ, టైరోన్‌లోనూ నివసించే శ్వేత జాతులకు సన్నిహితులనీ మానవ శాస్త్రవేత్తలు చెబుతారు  కాని అనేక శతాబ్దాలుగా వారు చీనీయులే

ఏదేశ చరిత్ర కూడా రాజుల వంశ వృక్షాలతోనూ, పెళ్ళిళ్ళతోనూ, హత్యలతోనూ వ్యక్తం కాదు  చరిత్రకు ముఖ్యమైనవి చారిత్రక, సాంస్కృతిక, ఆర్థిక అంశాలు

## నికరమైన చరిత్ర

చౌ రాజవంశం క్రీ పూ 1100 నుంచి 221 దాకా నడిచింది  ఈ చౌ యుగం యొక్క చివరి భాగంలో నికరమైన చీనా చరిత్ర ఆరంభమయినట్టు భావించబడుతున్నది  (చౌ యుగం క్రీ పూ 1027–249 మధ్య అని ఎడ్గార్ స్నో  షాంగ్ యుగంలోనే క్రీ పూ 1523 లగాయితు లిఖిత చరిత్ర నమ్మదగినదని ఆయన అభిప్రాయం )

చౌ యుగంలోనే చీనా సంస్కృతి ఉన్నతికి వచ్చినట్లు చెబుతారు  చీనాలో ఫ్యూడలిజం ప్రారంభమైనది కూడా ఈ యుగంలోనే  ఆనాటి సంస్కృతి యొక్క చిహ్నాలు ఈ నాటికీ చీనాలో నిలిచి ఉన్నాయి

ఈ సంస్కృతికి చెందిన ఇద్దరు మహావ్యక్తులను గురించి చెప్పుకోవచ్చు  ఒకడు కుంగ్‌పు–త్సె– ఈయననే పాశ్చాత్యులు కన్‌ఫూసియస్ అంటారు  చీనా రాజకీయ సామాజిక విశ్వాసాలపైన కుంగ్ ఫు–త్సె సిద్ధాంతాల ప్రభావం రెండువేల ఏళ్ళపాటు తియ్యకుండా ఉన్నది  ఆయనమత ప్రబోధకుడు కాడు  (మనకు వేమనలాగా అనుకోవచ్చునేమో?) చీనాదేశమే మత ప్రధాన దేశం కాదని ఎడ్గార్‌స్నో అభిప్రాయం  నీతి, ధర్మమూ, ఆచారమూ, తాత్వికభావాలూ–ఇవే చీనావారి జీవితంలో ప్రాధాన్యం వహించాయి  కుంగ్‌ఫు–త్సె సంస్కర్త తాను ఆదర్శవర్తన అలవరచుకుని విసుగు లేకుండా బోధలు చెయ్యటం ఆయన ఆశయమట

రెండవ మహావ్యక్తి లావో–త్జు (ముసలాయన అని అర్థం) ఆయన బోధించిన తత్వాన్ని "తావో" (మార్గం) అంటారు ఆయనకూ, కుంగుపు–త్సేకూ దృక్పధాలలో చాలా తేడా ఉన్నది ప్రకృతితో సామరస్యం సాధించే "మార్గం"లావో–త్జుది ఈయన తత్వచింతనకూ, ప్లాటో సిద్ధాంతాలకూ, హిందూ, బౌద్ధ తాత్విక దృక్పధాలకూ కొంత సామ్యం ఉన్నది ఈయన మత దృష్టి కలవాడు కాకపోయినా ఈయన సిద్ధాంతాలను ప్రాచీన ప్రకృతి దేవతారాధనలను జోడించి, తావోయిజం అనే మతాన్ని చీనాలో వ్యాప్తి లోకి తెచ్చారు (మనదేశం సాంఖ్యానికి, చార్వాక మతానికీ ఈశ్వరుణ్ణి జోడించినట్టు)

చౌయుగంలో సుమారు అయిదువేల చిల్లర రాజ్యాలుండేవి ప్రతి సారవంతమైన చిన్న లోయకూ ఒక నాయకుడుండేవాడు ఒక్కొక్కడూ ఒక్కొక్క 'జాతి'కి పెద్ద భూమిబాగా పండేది నాయకుడికీ, అతడి సైనికులకూ, పరివారానికీ అవసరమయే ధాన్యం నిలవజేసుకునే వారు ఈ ధాన్యపు రాసులను రక్షించుకోవటానికి కోటలు నిర్మించుకుని, వాటి రక్షణకు సైనికులను సృష్టించుకోవలసి వచ్చింది చౌరాజులు ఇలాటి నాయకులేగాని, మిగిలిన నాయకుల మీద ఆధిపత్యం సంపాదించి, కప్పాలు పుచ్చుకుంటూ వారు రాజులనిపించు కున్నారు ఇదే ఫ్యూడల్ వ్యవస్థ దక్షిణ ప్రాంతపు మైదానాలలో ఇలాంటి ఫ్యూడల్ వ్యవస్థ ఏర్పడే అవకాశం లేదు అక్కడివి మైదాన భూములు

చౌ ఆధిపత్యం కింద ఉండిన ఉపరాజ్యాల మధ్య యుద్ధాలు సాగి, ఒక్కొక్కరాజ్యమే పతనమై పోయింది వీటి పతనంతోనే చౌయుగం ముగిసింది

వసుధ, మాసపత్రిక, డిసెంబరు, 1971

# 5. అజ్ఞాత శత్రువులు

ముప్పై ఏళ్ళ క్రితం ఒక పెద్ద మనిషి "నాకు కాంగ్రెసూ ఇష్టమే కమ్యూనిస్టు పార్టీ ఇష్టమే సోషలిస్టు పార్టీ ఇష్టమే " అంటూ ఒక దండకం చదివాడు

"అంటే నీకు రాజకీయాలేమీ తెలీవన్నమాట!" అన్నాడు మరో పెద్ద మనిషి

ఆ వ్యాఖ్య సరి అయినదే

జీవిత పోరాటంలో తాటస్థ్యం విషప్రాయమైంది అందుకే సార్త్రే, "నువు పరిష్కారంలో భాగం కాకపోతే సమస్యల్లో భాగం అవుతావు " అన్నాడు

సమాజంలో స్థిరత ఏర్పడటానికి ఆ సమాజంలోని దురన్యాయాలు అడ్డురావు ఆ దురన్యాయాలను నిర్మూలించే ప్రయత్నం జరగటం లేదన్న మాట

మన దేశంలో వర్గాలను వర్ణాలుగా మార్చి శాశ్వతీకరించారు వర్ణాల పంపిణీ మీదనే కులాలూ (వృత్తులను బట్టి) ఏర్పడ్డాయి అయితే సమాజ స్వరూపం మార్పు చెందటం చేత వర్గాలలో పరివర్తనలు జరిగాయి కాని, వర్ణాలలోనూ, కులాలలోనూ పరివర్తన కలగలేదు శూద్రులుఅనే వాళ్ళు మొదటగా సమాజంలో ప్రవేశించినప్పుడు అప్పటి పరిస్థితులను బట్టి హీనులుగానే వ్యవహరించినా సమాజ స్వరూపం మారి, ఆ శూద్రులు ఉన్నత సాంఘిక

కార్యకలాపాలలోనూ, నాయకత్వంలోనూ సమర్ధత చూపి, చరిత్రను నడిపించడం మొదలుపెట్టాక, వాళ్ళది తక్కువ వర్ణంగా మిగిలిన వాళ్ళు భావించడం సాంఘిక దురన్యాయమే అయింది

సామాజిక వ్యవస్థ గత జీవితం దాటి విస్తృతం కావటానికే, చిల్లర రాజ్యాలు పోయి రాష్ట్రాలు ఏర్పడటానికీ, రాష్ట్రాలు విస్తరించి సామ్రాజ్యాలు వెలయటానికి క్షత్రియులు పాటుపడి శౌర్య వీర్య బలపరాక్రమాలతో కూడిన క్షాత్ర సంస్కృతిని పెంపొందించారు

వైశ్యులు వ్యవసాయమూ, పశుపోషణ విడిచి పెట్టి, వాణిజ్యం చేపట్టి, సంపదను పోగు చేసి, కళలకూ, నాగరికతకు దోహదం చేశారు రాజ్యాలేలిన వాళ్ళు సైతం వారి కుమార్తెలను వైశ్య యువకులకిచ్చి చెయ్యడం గౌరవప్రదంగా భావించుకున్నట్టు కథాసరిత్సాగరం చెబుతుంది

శూద్రులు అగ్రవర్ణాలకు ఊడిగం చెయ్యడంతో తృప్తి చెందక తిరుగుబాటు నడిపారు రాజ్యాలు జయించారు కళలన్నిటా ప్రతిభ ప్రదర్శించారు సంస్కృతిని ముందుకు తీసుకుపోయారు

అవర్ణులనీ, పంచములనీ, అస్పృశ్యులనీ పిలవబడేవాళ్ళు ఈనాడు ఉన్నత స్థానాల లోనైనా మనకు కనిపిస్తున్నారు

చరిత్ర ఇలా నడిచినా వర్ణక్రమంలో ఏమీ మార్పు లేనట్టూ, బ్రాహ్మణులు అగ్రవర్ణమైనట్టూ మిగిలిన వర్ణాల వాళ్ళు జన్మాంతర పాపులయినట్లూ బహిరంగంగా అనేవాళ్ళు మన సమాజంలో ఉన్నారు (ఒక్క హరిజన మంత్రికి గాని, శూద్ర కలెక్టరుకు గాని ఈ బ్రాహ్మణోత్తములు అడుగులకు మడుగులొత్తుతారు అది వేరే కథ)

కొందరు బ్రాహ్మణులు, "మేము భూలోక దేవతలం! కిందటి జన్మలో గొప్ప పుణ్యం చేసుకుని ఈ జన్మ ఎత్తాం!" అన్నంత మాత్రాన సమాజానికి పెద్ద నష్టం ఉండేది కాదు ఈ దురన్యాయానికి గురి అయిన వాళ్ళు ఒకూడా ఆ మాటే నమ్మారుః కనీసం నమ్మినట్టుగా వెయ్యేళ్ళకు పైగా ప్రవర్తిస్తున్నారు వారి దురన్యాయం క్షమించరానిది

వర్ణవ్యవస్థకు కాలదోషం పట్టిన దగ్గర నుంచి అది సమాజంలో వైషమ్యాలకు దారి తీసింది సామాన్య ప్రజలను పై వర్ణాలవారి దోపిడికి గురిచేసింది ఆ దశలో సంఘర్షణ ఆరంభమై ఉండవలసింది కాలేదు వర్ణవ్యవస్థను తుదముట్టించటానికి బౌద్ధమూ, శైవమూ, వైష్ణవమూ, పోతులూరి వీరబ్రహ్మంగారి వంటి వాళ్ళు సాగించిన అనేక ఉద్యమాలూ, ఇటీవలి కాలంలో క్రైస్తవమూ ప్రయత్నించాయి కాని ఒక్కటీ చెప్పుకోదగిన విజయం సాధించలేదు ఆఖరుకు కమ్యూనిస్టుల మార్క్సిజం కూడా విస్తృతమైన విజయాలు సాధించలేక పోయింది ఎందుచేత? వర్ణ వ్యవస్థ వల్ల లాభం పొందేవాళ్ళు దాని నిర్మూలనను వ్యతిరేకించటం సహజం కాని ఈ దురన్యాయానికి గురి అవుతున్న వాళ్ళు ఈ ఉద్యమాలకు దూరంగా ఎందుకు ఉండిపోయారు? క్రైస్తవం పుచ్చుకున్నవారిలో "మేము కమ్మ క్రైస్తవులము", "బ్రాహ్మణ క్రైస్తవులము" అనటం ఎలా జరిగింది?

ప్రపంచంలో అన్ని నాగరిక జాతులూ-అనాగరిక జాతులూ సైతం వర్గ వ్యత్యాసాలను గుర్తిస్తాయి గాని జన్మతః కొందరు ఎక్కువనీ, కొందరు తక్కువనీ అనవు మానవులను అంటిపెట్టుకొని ఉండదగిన బలహీన విశ్వాసాలలో వర్ణాలు, కులాలు అనేవి అధమాధమం అనటానికి సందేహం లేదు అంతకన్నా కూడా అధమమైనది అస్పృశ్యత

ప్రపంచం వర్గరాహిత్యాని కేసి పురోగమిస్తున్న ఈ కాలంలో మనం ఆటవిక మనస్తత్వాన్ని అవలంబించటమే గాక కుల వ్యవస్థ పట్ల ఏ విధమైన అసహనాన్ని ప్రదర్శించకుండా వుండిపోయాం ఇదే దేశంలో ఆటవికులనదగిన వాళ్ళు విప్లవ చైతన్యం ప్రదర్శిస్తున్నారు

అన్నిటికీ ధనమే మూలమనీ, మూఢాచారాలూ, అశక్తతా, అజ్ఞానమూ దారిద్ర్యం వల్లనే ఏర్పడ్డవనీ అనవచ్చు దాని వల్ల మనం పొందగల తృప్తి ఏమిటో బోధపడదు అందరు హరిజనులూ జిల్లా కలెక్టరులయిననాడు అస్పృశ్యత తొలగిపోతుందా? అది ఎలాగూ జరగదు అస్పృశ్యత తొలగటానికి అస్పృశ్యులంతా ఏకమై చెయ్యవలసిన చర్యలు ఉంటాయి అవి జరిగితే అస్పృశ్యత తొలగిపోతుంది

పేదవారంతా ఏకమై పేదరికం మీద తిరుగుబాటు చేస్తే పేదరికం ఉండదు పూర్వ జన్మలో చేసుకున్న పాపం చేత పేదరికం సంప్రాప్తమవుతుందని పేదరికం లేనివాళ్ళు చెప్పేది నిజమే కాబోలని పేదవాళ్ళే అనుకున్నంత కాలమూ పేదరికం పోదు

ఏ సమస్యకైనా మనిషి చేతిలో ఉన్న పరిష్కార మార్గాన్ని విడిచిపుచ్చి మనిషి చేతిలో లేని పరిష్కారాన్ని సూచించటం ద్వారా సమస్యకు స్థిరత్వం సిద్ధిస్తుంది స్థిరత్వం చేకూర్చే మార్గాలు ప్రచారం చేసేవాళ్ళు ప్రత్యక్ష శత్రువులు ఆ మార్గాలను విశ్వసించే వాళ్ళు పీడితులైనా సరే పరోక్ష శత్రువులు

విజయ భాను వారపత్రిక, సంక్రాంతి సంచిక, 1972

# 6. రాజకీయ దృక్పథం

రాజరికం ముదరక పూర్వం మానవ సమాజాలలో సాంఘిక వ్యవహారాలకూ, రాజకీయ వ్యవహారాలకూ తేడా ఉండేది కాదు తమ సమిష్టి సమస్యలు ఏవో, వాటి పరిష్కారానికి "పెద్దలు" ఏం చెయ్యాలను కుంటున్నారో, ఆ చర్యలు ఎంత వరకు ఫలించాయో సమాజంలో అందరికీ స్పష్టంగా తెలిసేది "సభలు" చర్చించే విషయాలు అందరూ వినేవారు వినని వారికి కూడా చర్చల సారాంశం పొద్దుగూకే లోపల తెలిసి పోయేది

అయితే ఈ రకం సమాజాలు మూడు, నాలుగువేల ఏళ్ళ క్రితం మార్పు చెందాయి రాజులేగాక పాలకవర్గాలు కూడా ఏర్పడటం జరిగింది మెగాస్తెనీస్ మన దేశానికి వచ్చి "ఆర్య" సమాజంలో ఏడు కులాలు ఉన్నట్టు రాశాడు అందులో ఒకటి రాజోద్యోగులు (బురోక్రాట్‌లు) రాజకీయాలతో ఎలాటి ప్రమేయమూలేని కులాలు కూడా అతను చెప్పిన ఏడింటిలో ఉన్నాయి

సమాజంలో వర్గ విభజన పెరిగిన కొద్దీ, వర్గాల మధ్య ఎడం హెచ్చిన కొద్దీ రాజకీయాలకూ, సామాజిక విషయాలకూ మధ్య గండి ఏర్పడి, అది క్రమంగా అగాధం కింద తయారయింది ఈ గండిని మనం నెర్రె రూపంలో చాతుర్వర్ణ్యంలోనే చూడవచ్చు శూద్రులను వేద బాహ్యులనుచేసి, వారికి సామాజిక కర్మకాండలో (యజ్ఞాలు వగైరాలలో) ఎలాటి ప్రమేయమూ లేకుండా చేశారు

ఈ నెర్రె–గండి–అగాధాన్ని పూడ్చటానికి డెమోక్రసీ, లేక ప్రజాతంత్రం అన్నది గ్రీకులనుంచి ఈ యుగపు ధనస్వామ్య సమాజం అరువు తెచ్చుకున్నది కాని ఇది బూటకం సమాజంలో వేరువేరు వర్గాలుండి, వాటి మధ్య వైరుధ్యాలున్నంత కాలమూ ప్రజాస్వామ్యం అనేది మిధ్య ప్రజలు తమ శాసనకర్తలను ఎన్నుకుంటారు కాని ఆ శాసన కర్తలు ప్రజల మనుషులు కారు వాళ్ళు చేసే శాసనాలు ప్రజల సమస్యలను పరిష్కరించవు అదీగాక, ఈ శాసన సభ్యులు నిజమైన పాలకవర్గం కాదు శాశ్వతమైన – ప్రజలు ఎన్నుకోని–ప్రభుత్వోద్యోగులు వేరే ఉంటారు వీరి సహాయంతోనే "ప్రజా మంత్రులు" పరిపాలన సాగిస్తారు వాళ్ళు పరీక్షలు పాసయినవాళ్ళూ, పబ్లిక్ సర్వీస్ కమిషన్లు ఆమోదించిన వాళ్ళూ అయి ఉంటారు మంత్రులకు తాము నిర్వహించే శాఖలను గురించి ఏమీ తెలియదు–తెలియ నవసరం కూడా లేదు

ప్రజలు తమ ప్రతినిధులను ఎందుకు ఎన్నుకోలేరు? పీడిత వర్గాలనుంచి శాసన సభ్యత్వం నిర్వహించే దక్షతగలవారు రావటం చాలా దుర్లభం అది ఒకటి మరొకటి ఏమిటంటే, ఎన్నికలకు నిలబడి ప్రజలలో ప్రచారం చెయ్యటానికీ చాలా డబ్బు కావాలి ఇది ధనిక వర్గీయులకే సాధ్యం

ఇందుకే కార్మిక వర్గీయ పార్టీలు పుట్టుకొచ్చాయి అవి కమ్యూనిస్టు, సోషలిస్టు వగైరా పార్టీలు ఈ పార్టీలు బయలుదేరక ముందే ధనస్వాములు తమకు వీలైనట్టుగా రాజ్యాంగాన్ని రచించి, రాజకీయ రంగంలో పాతుకుపోయి ఉంటారు అందుచేత ఈ పార్టీలు ఎన్నికలలో ధనస్వామ్య పార్టీలను పడగొట్టి రాజ్యాధికారం సంపాదించుకుంటే, పరిస్థితి విషమింపజేసే సూత్రాలు రాజ్యాంగంలో ఉండే ఉంటాయి–ఆర్డినెన్సులు, రాష్ట్రపతి పరిపాలన, ఆత్యయిక పరిస్థితి, దేశరక్షణలాటి సాకులతో ప్రజాతంత్రాన్ని తాత్కాలికంగాగాని, నిరవధికంగాగాని, శాశ్వతంగాగాని నిలిపేటందుకు రాజ్యాంగ చట్టంలో అవకాశాలుంటాయి

రాజ్యాంగం మారదని కాదు–ప్రజోపయోగం కోసం అది మారదు ధనస్వాముల అవసరాలనుబట్టి మారుతుంది మొత్తం రాజ్యాంగమే తమకు అడ్డంగా ఉన్ననాడు ధనస్వాములు ఫాసిజంను తెచ్చిపెట్టగలరు ఇది వర్తమాన చరిత్రలో చాలాసార్లు జరిగింది, జరుగుతున్నది

ఈ పరిస్థితి సామాజికాభివృద్ధికి అంతరాయంగా ఉన్నమాట నిజం ప్రజలు నిజంగా స్వతంత్రులై, నిజమైన ప్రజాస్వామ్యం ఏర్పడితేగాని సామాజిక పురోభివృద్ధిలేదు, శాంతి కూడా లేదు

సామాజికంగా జరగవలసినది విప్లవ పరిణామం కొన్ని సంస్కరణలు జరిగినా విప్లవం దృష్ట్యా జరగాలి

సామాజిక విప్లవానికి అనేక అవాంతరాలున్నట్టు చెప్పవచ్చు ఇవన్నీ వర్గ సమాజంలో పీడకవర్గాల క్షేమం కోసం సృష్టించినవి–దేవుడూ, కర్మసిద్ధాంతమూ, మతాల సంస్కృతీ, కుల విభజనా, మూఢాచారాలూ వగైరా వీటి అన్నిటిలోకీ అతి ముఖ్యమైనది రాజకీయ అవగాహన

వర్గ సమాజం తీసుకున్న మొట్టమొదటి చర్య సాంఘిక జీవితానికీ, రాజకీయాలకూ మధ్య గండి పెట్టడమేనని నా దృఢ విశ్వాసం ఆ గండిని పూడ్చాలి, లేదా ఆ అగాధం మీద వంతెన కట్టాలి

ప్రజలకు రాజకీయ పరిజ్ఞానం కావాలి

ఈనాటి ప్రజా జీవితంలో ప్రభుత్వ ప్రమేయం లేనిది ఏదీలేదు దారిద్ర్యమూ, నిరక్షరతా, ఉద్యోగాలూ, చదువూ, అనారోగ్యమూ మొదలైనవి ప్రభుత్వ ప్రసక్తి లేకుండా పరిష్కారమయే రోజులు పోయాయి అవి ఇక రావు ఎంతమంది పిల్లలను కనాలో కూడా మనకు ప్రభుత్వం చెబుతుంది

అందుచేత ప్రతివాడికీ రాజకీయ పరిజ్ఞానం అవసరం ప్రభుత్వం చెప్పేదానికీ, చేసేదానికీ తేడా తెలియాలంటే రాజకీయ పరిజ్ఞానం కావాలి లేకపోతే అబద్ధాలాడి ఏ ప్రభుత్వమైనా మనని పరిపాలించవచ్చు

"సోషలిజం తేవటానికి అన్నిటినీ జాతీయం చేయనవసరం లేదు," అన్నారు ఇందిరాగాంధి అనేకం జాతీయం చేసినా సోషలిజం కానవసరం లేదని మనం తెలుసుకుని ఉండటం అవసరం

మనకు స్వాతంత్ర్యం వెంబడి సామ్యవాదం అమలు జరిగినట్టుంటే మొట్టమొదటగా అభివృద్ధి అయి ఉండవలసినది ఆంధ్రలో రాయలసీమ, ఆర్థికంగా అభివృద్ధి అయి ఉండవలసినది పేద ప్రజలు ప్రణాళికలతోపాటు దారిద్ర్యమూ, నిరుద్యోగమూ పెరగడం సామ్యవాద లక్షణం కాదు

పాతికేళ్ళుగా మనం చూస్తున్నవి ప్రజారాజకీయాలుకావు, ధనిక వర్గ రాజకీయాలు, ధనికవర్గ అంతస్సంఘర్షణ రాజకీయాలు, దోపిడీ రాజకీయాలు! ప్రజల పార్టీలు అనబడేవి ఈ రాజకీయాలను మార్చలేకపోగా, వీటిలో నిజమైన ప్రజల రాజకీయాలు కొంతవరకైనా ఉన్నట్టు భ్రమపడ్డాయి

దానికి కారణం మరేమీకాదు–రాజకీయాలను ధన స్వామ్యపు కళ్ళతో చూడటమే ధనస్వాములు కాని వాళ్ళు కూడా ధనస్వాములు (ధనస్వామ్య దృక్పథం గలవారు) కావటం మనం గమనించవచ్చు

సమాజంలో మౌలికమైన మార్పులు జరిగి, రాజకీయాలు మారినప్పుడల్లా కొంత "మంచి" జరుగుతూనే వస్తున్నది గణ జీవితంపోయి సమాజం పెరిగినప్పుడు సమాజంలో కొన్ని మంచి మార్పులూ, కొంత అభివృద్ధీ కలిగిన మాట అబద్ధం కాదు కాని హీనవర్గాల రాజకీయ దృక్పథంతో చూసినట్టయితే ఆ మంచీ, ఆ అభివృద్ధీ పీడించే వర్గాల అభివృద్ధి వెంబడి ఏర్పడినవే ఇంగ్లీషువాళ్ళు తమ లాభంకోసం వేసిన రోడ్లూ, రైళ్ళూ మామూలు ప్రజలకు ఉపయోగించినట్టు!

ఎడారిలో ఒయాసిస్సులలాగా, ప్రజలంతా సుఖసౌభాగ్యాలతో తులతూగినట్టు భావించదగిన ఘట్టాలు అక్కడక్కడా చరిత్రలో కనిపించవచ్చు ఆ ఘట్టాలు నడిచినప్పుడు సాంఘిక దోపిడీ నిలిచిపోయిందనికాదు, అంతకు పూర్వం ఉండినా పీడితుల పరిస్థితి ఒక్క పిసరు మెరుగై ఉన్నదన్నమాట! పీడకులకూ, పీడితులకూ మధ్య సంఘర్షణ తాత్కాలికంగా కొంత ఉపశమించిందన్నమాట

నెహ్రూ చెప్పినట్టు, ఏ స్వర్ణ యుగంలోనూ సామాన్య ప్రజలు అట్టడుగునే ఉంటూ వచ్చారు సాంఘిక పీడన తుదముట్టిన దాకా సామ్యవాదం వచ్చినట్టు కాదు, సాంఘిక

పీడనను తొలగించే చర్యలు ప్రకటించి, వాటి అమలుకు ప్రజల సహాయం అర్థించనివాళ్ళు "సామ్యవాదం" అన్నమాటను ఉచ్చరించటానికి కూడా అర్హులు కారు

మనం ఈనాడు చూసే ప్రజాస్వామ్యం హాస్యాస్పదమైనది ఇళ్ళ సోదాలు రోజూ జరుగుతున్నాయి "మావో సాహిత్యం" జప్తు అవుతున్నది ఎందుకు? మావో సాహిత్యాన్ని ఎవరు నిషేధించారు? నిషిద్ధం కాని సాహిత్యాన్ని పోలీసులు పట్టుకు పోవటమూ, తిరిగి ఇవ్వక పోవటమూ జరుగుతున్నది (ఈ విషయమై నార్లవారు రచించిన సంపాదకీయం ప్రశంసనీయమైనది చాలా ప్రజాస్వామిక పత్రికలు ఈ ఊసే ఎత్తలేదు!)

పారిశ్రామికులకూ, కార్మికులకూ వైరుధ్యం వచ్చినప్పుడల్లా పోలీసులు లాటీ చార్జీలు చేసేదీ, కాల్చిచంపేదీ కార్మికులనే, ఎందుచేత? పారిశ్రామికులను ఎవరూ లారీ చార్జి చెయ్య రెందుకు? అలాగే భూస్వాముల తరపున రైతు కూలీలను కొడతారు, చంపుతారు దేనికి? ఈ ప్రభుత్వం పెట్టుబడి దార్లదీ, భూస్వాములదీ గనకనే గద! దారితప్పి రామకృష్ణ దాల్మియాను జైలులో పెడితే అది ఎంత నాజూకుగా జరిగినదీ మనకు తెలుసు

ఈనాటి మన రాజకీయాలు ఏ వర్గానికీ చెందినవో తెలుసు కొనటానికి ఇందిరాగాంధీని అడగనవసరం లేదు తిమ్మయ్య పేరు ముఖమే చెబుతుంది

మన దేశంలో పేద ప్రజలూ, పీడిత ప్రజలూ మన రాజకీయాలను ధనస్వామ్యపు కళ్ళతో చూసే ప్రమాదంలేదు వాళ్ళను బాధించేది రాజకీయ అజ్ఞానం మాత్రమే కాని విరసం రచయితలు మన రాజకీయాలను ధనస్వాముల దృక్పథంతో చూసే ప్రమాదం ఉన్నది దానినుంచి మనం జాగ్రత్తపడాలి ధనస్వామ్య రాజకీయ దృక్పథంతో రాజీపడని వారిది తీవ్రవాదమనీ, ఉగ్రవాదమనీ కొందరు అనవచ్చు ఖైదీలను జైళ్ళలో హతమార్చుతున్న వాళ్ళు సౌమ్యవాదులుకారు, సామాజిక విప్లవం తీవ్రవాదంతోనూ, ఉగ్రవాదంతోనూ తప్పరాదు అలాటి దృక్పథంతోనే రచయితలు రాజకీయాలను అవగాహన చేసుకోవాలి

విరసం రెండోమహాసభల (సెప్టెంబరు 1971), మేడే ప్రత్యేక సంచిక,
ప్రచురణ జూన్1972
పునర్ముద్రణ. అరుణతార, మాసపత్రిక, జనవరి 1990

# 7. విప్లవ శాస్త్రం

**1. చీనా విప్లవం గురించి స్టాలిన్ (ఇంగ్లీషు)**

**2. చీనా విప్లవం గురించి మావో సె-టుంగ్ (ఇంగ్లీషు)**

**రచయిత : చెన్‌పో-టా, న్యూబుక్ సెంటర్, కలకత్తా.**

ఈనాడు చీనాలో కమ్యూనిస్టు పరిపాలన ఉన్నదన్న విషయం నిక్సన్ కూడా గుర్తించి, చీనా యాత్రచేసి, పూర్వం హంతకులుగానూ, బందిపోట్లుగానూ పేర్కొనబడిన వాళ్ళతో సంప్రదింపులు జరిపి, ఫోటోలూ అదీ తీయించుకున్నాడు గనక శ్రీమాన్ రాజకోపాలాచారి గారు సైతం చీనాలో అనివార్యంగా విప్లవం జరిగిందనీ, అది "హుష్, కాకీ!" అంటే పొయ్యేది కాదనీ అంగీకరించక తప్పదు

మనదేశంలో విప్లవంలేదని లోకానికి తెలియగలందులకు మన పోలీసుశాఖవారు మావో సాహిత్యాన్ని జప్తుచేసుకు పోతున్నా అది టన్నుల కొద్దీ విదేశాలలోతయారై ఇండియాకు దిగుమతి అయి అమ్ముతున్నది పెలికాన్ పుస్తకాలూ, ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్‌వారివీ ఇతరులవీ చీనా-మావో పుస్తకాలు అసంఖ్యాకంగా విడుదలవుతున్నాయి ఇప్పుడు సమీక్షించే ఈ రెండు పుస్తకాలూ మనదేశంలో తయారైనవి వీటిలో ఉన్నది చీనా విప్లవ చరిత్ర కాదు, విప్లవ శాస్త్ర చర్చలు

"విప్లవ శాస్త్రం అంటూ ఉన్నదా?" అన్నాడు స్టాలిన్, అదే మార్క్సిజం-లెనినిజం విప్లవకారులు అరాజకీయవాదులనీ హింసావాదులనీ, వాళ్ళు తమ సహజ దౌష్ట్యంతో ప్రజలను మభ్యపెట్టి, వాళ్ళను హింసాచర్యలకు పురికొల్పి 'ధర్మం'గా ఏర్పడిన ప్రభుత్వాలను కూలదోసి, 'ధర్మ' హీనమైన వ్యవస్థ నెలకొల్ప యత్నిస్తారనీ, అందుచేత వారిని నిర్మూలించటంలో ఏధర్మాన్ని పాటించనవసరం లేదనీ ఒక నాయనమ్మ సిద్ధాంతాన్ని ఏనాడో తయారుచేశారు రష్యా విప్లవం జరిగింది అక్కడ సోషలిస్టు వ్యవస్థ ఏర్పడి, ఆవ్యవస్థ కింద దేశం ఆర్థికంగానూ, సాంఘికంగానూ, మిలిటరీగానూ ఊహించరాని అభివృద్ధి సాధించటమేగాక, కిందటి యుద్ధంలో ఫాసిజం నడుము విరగగొట్టిన మీదట ఈ నాయనమ్మ సిద్ధాంతానికి కాలదోషం పట్టింది దాని ఫలితంగా జరిగినదేమంటే విప్లవం అనేమాటకు న్యూనత తగ్గి కొంతగౌరవం-దూరవు కొండలునునుపు-లాటిది లభించింది సోవియట్ విప్లవకారులు హంతకులూ, దుండగులూ, బందిపోట్లూ కావటం మానేసి మహావీరుల జాబితాలోకి చేరారు మన పరిపాలకులకు ప్రొలిటేరియన్ రివల్యూషన్ అంటే హడలే అయినా లెనిన్ మహాశయుణ్ణి ప్రజల డబ్బుతో ఆరాధించబూనుకున్నారు

చెప్పవచ్చిందేమంటే ఇలాటి ఆరాధనల వెనక శాస్త్రీయ విప్లవ దృక్పథాలేమీ ఉండవు నిజంగా విప్లవాలు చేసేవాళ్ళు అలా చేలకు అడ్డంపడిపోలేరు వాళ్ళప్రతి ఎత్తుగడా నిర్దుష్టంగా వుండాలి ఎక్కడ ఏ రవంత పొరపాటు జరిగినా తీరని నష్టం కలుగుతుంది ఈ బాధలు వర్గ నియంతృత్వాలకు లేవు రాజరికానికి పునాది "రాజు తప్పు చేయడు" అన్న నినాదం బూర్జువా వర్గ నియంతృత్వానికి అనుకూలించేది ఏదైనా చెయ్యవచ్చు వీలైతే ప్రజలను మభ్యపెట్టడం, వీలుకాకపోతే తుపాకులతో నోళ్ళు మూయటం, మరీ తప్పనిసరిగా వస్తే దొడ్డిదారిన ఫాసిజం ప్రవేశపెట్టడం, అత్యధిక ప్రజల కష్టసుఖాల ప్రమేయం ఏమీలేదు ఆ అత్యధిక సంఖ్యాక ప్రజలపైన ఆధారపడి, తన విజయాన్ని వారి అభ్యుదయంతో అంచనా కట్టేది శ్రామిక విప్లవం అది కత్తిమీద సాము అమిత నిర్దుష్టంగా కొనసాగవలసినది అందులోని ఎత్తుగడలు మేధోవంతమైనవి పొరపాట్లకు అవకాశాలు హెచ్చు ఒకపంక మితవాదాన్నీ, మరొకవంక అతివాదాన్నీ సరిచేసుకుంటూ, అడుగడుగునా ఆత్మ విమర్శ చేసుకుంటూ, విప్లవం కొనసాగాలి దాని సిద్ధాంతాలు సార్వత్రికమై మార్క్సిజం-లెనినిజంకు సంబంధించినవిః ఆచరణ మాత్రం ప్రాదేశిక సమకాలిక పరిస్థితులకు అనుగుణంగా మలచుకోవలసినది అడుగడుగునా యేర్పడే వైరుధ్యాలను సమన్వయించాలి శత్రు కూటమిలోని వైరుధ్యాలను ఉపయోగించుకోవాలి

ఏ విప్లవమూ ఆకాశం నుంచి ఊడిపడదు గాలిలో జరగదు ప్రతి విప్లవానికి పూర్వ చరిత్రా, క్షేత్రమూ, బీజాలూ వుంటాయి రష్యా విప్లవాన్ని ఎప్పటినుంచి లెక్కగట్టుతారో నాకు స్పష్టంగా తెలీదు కనీసం 1905 నుంచి రష్యాలో విప్లవం రాజుతూనే వున్నది కాని 1949లో మావో చీనా విప్లవం వయసు 109 ఏళ్ళని అంచనా కట్టాడు అంటే 1840లో నల్లమందు యుద్ధాలు చీనాలో ఆరంభమయాయి ("బందిపోట్లు డబ్బిస్తావా, ప్రాణం ఇస్తావా అంటారు మనం–అంటే బ్రిటిషువాళ్ళం–మీ డబ్బూ, ప్రాణాలూ ఇయ్యండి అన్నాం"రస్కిన్)

అది మొదలు వారు (చీనా ప్రజలు) "పోరాడారు అపజయం పొందారు, మళ్ళీ పోరాడారు, మళ్ళీ అపజయం పొందారు మళ్ళీ పోరాడారు 109 యేళ్ళ అనుభవం గడించారు అనేక వందల చిన్న పెద్ద పోరాటాల అనుభూతి పొందారు–రాజకీయంగానూ, యుద్ధతంత్రంలోనూ, ఆర్థికంగానూ, సాంస్కృతికంగానూ, రక్తపాతంతోనూ, రక్తపాతం లేకుండానూ– అప్పుడే ఈనాటి ప్రాధమిక విజయం సాధ్యమయింది"–మావో

చీనా విప్లవ విజయం ప్రపంచ చరిత్రలో మొట్టమొదటిది కాకపోయినా మిగిలిన వాటికన్న అనేకవిధాల విలక్షణమైనది 1926 డిసెంబరులోనే స్టాలిన్ చీనా విప్లవం తాలూకు విశిష్టలక్షణాలను వివరిస్తూ, రష్యాలాగా కాక చీనా సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం ద్వారా విప్లవాన్ని సాధించవలసి వుంటుందని చెప్పాడు సామ్రాజ్యవాదం ఉడ్డుకుడుచు కుంటున్న తరుణంలో రష్యా విప్లవం జరిగింది ఫాసిజమును ఎదుర్కొనటానికి అమెరికా, బ్రిటనులు రష్యాతో చేతులు కలిపిన ఫలితంగా తూర్పు యూరపు దేశాలలో సోషలిస్టు వ్యవస్థలు యేర్పడ్డాయి చీనా విప్లవం ఎలాటి బాహిరసహాయమూ లేకుండానే కొనసాగి చివరకు నెగ్గింది నిజానికి చీనాలో కమ్యూనిస్టుపార్టీ యేర్పడినది మొదలు కొమింటర్న్ ఆ పార్టీ అనుసరించవలసిన పంథాను గురించి 1927 దాకా అంటే కమ్యూనిస్టులు కొమింటాంగ్‌తో తెగతెంపులు చేసుకున్న దాకా–సలహాలు ఇస్తూనే వచ్చింది

చీనా విప్లవాన్ని కొమింటర్న్ తప్పుదారి పట్టించిందన్న అపవాదు వచ్చింది అందుచేత చీనా విప్లవ విజయం పూర్తిగా చీనా విప్లవకారులదీ, వారిని నిర్దుష్టమార్గాన నడిపించిన మావోదీనూ చీనా విప్లవం 1949లో ఆగిపోలేదని మనకిప్పుడు తెలుసు, మానవ చరిత్రలో అపూర్వమనదగిన ప్రోలిటేరియన్ సాంస్కృతిక విప్లవం మావో నాయకత్వంలోనే జరిగింది (పార్టీనీ, పరిపాలన యంత్రాంగాన్నీ క్షాళన చెయ్యటానికి మావో ప్రజలను తిరగబడమన్నాడు!) ఇంకా ఇలాటి సాంస్కృతిక విప్లవాలు జరగాలని మావో అభిప్రాయం

చీనా విప్లవంలో మరొక విశిష్టత ఏమంటే, అది మిగిలిన విప్లవాలకంటె సమగ్రమైనదీ, లోతైనదీనూ రష్యా మొదలైన సోషలిస్టు వ్యవస్థలలో లాగా విప్లవం నీరుకారి పోకుండానూ, రివిజనిజం తలయెత్తకుండానూ చీనావిప్లవపార్టీ చాలాజాగ్రత్తలు తీసుకున్నది తీసుకుంటున్నది

టాయ్‌పింగ్ తిరుగుబాటు నుంచి ప్రోలిటేరియన్ సాంస్కృతిక విప్లవం దాకా నడచిన విప్లవ దశలను గురించీ, వాటి నాయకత్వమూ, ధోరణీ మొదలైన వాటిని గురించీ చదువుకోవచ్చు ఈ రెండు పుస్తకాలూ అందుకోసం ఉద్దేశించినవి కావు సినిమాలో చూసే యుద్ధాలలాగే, పుస్తకాలలో చదివే విప్లవచరిత్రలు కూడామనని "ఆనందపరచ" వచ్చుగాని,

నిజంగా మనకు అంటవు  రామాయణంలో రామరావణ యుద్ధమూ, భారతంలో కౌరవపాండవ యుద్ధమూలేవా?

ఈరెండు పుస్తకాలూ విప్లవశాస్త్రం ఎలావుంటుందో విశ్లేషించి చెబుతాయి  1926 డిసెంబరు 10 నుంచి 1927 అక్టోబరు 14 దాకా స్టాలిన్ చీనా విప్లవ పరిస్థితిని మార్క్సిస్టు-లెనినిస్టు దృక్పధంతో విశ్లేషించాడు  ఈ ప్రసంగాలు విప్లవశాస్త్రజ్ఞానం సంపాదించగోరే వారికి చక్కని పాఠాలు  చీనా విప్లవ విజయానికి ఇవి ఏమి సహకరించలేదని అనుకున్నా కూడా వీటి విలువ గొప్పది

రెండవ పుస్తకం చీనా విప్లవంలో మావో దృక్పధం నిర్వహించిన పాత్ర ఎలాటిదో స్పష్టంచేస్తుంది  చీనా విప్లవానికి మావో చేసిన మహత్తరసేవ యేమంటే, "ఆయన మార్క్సిజం-లెనినిజం యొక్క సార్వత్రిక సత్యాన్ని చీనా విప్లవ ప్రత్యక్ష ఆచరణతో సమన్వయించి, విప్లవ పంధాలో యేర్పడిన అసంఖ్యాక సమస్యలను నిర్దుష్టంగానూ, అద్భుతంగానూ పరిష్కరించాడు" 30 ఏళ్ళపాటు మావో తన పార్టీలోపలా వెలుపలా ఉన్న ప్రతీఘాతుకులనూ, అవకాశవాదులనూ నిర్ద్వంద్వంగా ఎదుర్కొని పోరాడాడు  మార్క్స్, ఏంగెల్స్, స్టాలిన్‌ల విప్లవ సిద్ధాంతాన్ని ప్రచారం చెయ్యటంలోనూ అమలుజరపటంలోనూ అత్యంత సమర్థుడని రుజువుచేసుకున్నాడు

సిద్ధాంతానికి ఆచరణకూ అవినాభావ సంబంధం ఉండటం మార్క్సిజం-లెనినిజం ప్రత్యేక లక్షణం  మార్క్సిస్టు యొక్క మౌలిక కర్తవ్యం వర్గవిశ్లేషణా విధానాన్ని వినియోగించటం ఇందులో మావో నిపుణుడు

దాదాపు నూరేళ్ళ పాటు చీనా అర్ధవలస దేశంగా ఉండింది  ప్రాచ్యంలో అది అనేక వైరుధ్యాలకు కేంద్రంగా ఉండేది  ఇంపీరియలిస్టు దేశాలన్నీ చీనామీద రాబందుల్లాగా పడి పీక్కుతిన్నాయి  దాన్ని ఆ దేశాలు తమ సరుకుల ఎగుమతికీ, పెట్టుబడిఎగుమతికీ దివ్యమైన క్షేత్రంగా వాడుకున్నాయి  చీనా విప్లవాన్ని అణచటానికి అదేశాలన్నీ ఏకమయ్యాయి  ఇతర సమయాలలో చీనాను తమలో తాము పంచుకోవటానికి కృషిచేశాయి  ఈ ప్రక్రియ వారిమధ్య వైరుధ్యాలకుదారితీసి, సామ్రాజ్య వాదులను దుర్బలం చేస్తుందన్న సంగతి మావో గమనించాడు ఇంతేగాక, సామ్రాజ్యవాదుల కీచులాటలతోబాటు చీనా పాలకుల మధ్య కీచులాటలు కూడా పెరిగి సేనాపతుల మధ్య అంతులేని యుద్ధాలు సాగాయి  1912 మొదలుకొని ఈ యుద్ధాలకు బయటినుంచి సామ్రాజ్యవాదులూ, లోపలనుంచి దళారీ భూస్వామి వర్గాల వాళ్ళూ మద్దతు యిచ్చారు

ఒకవంక సామ్రాజ్యవాదుల పీడనా, మరొక వంక ఫ్యూడలిస్టు పీడనా భరించలేని ప్రజలు 1840 మొదలుకొని ఎడతెగని ప్రతిఘటనలు సాగించారు  ఈ ప్రతిఘటనలలో అసంఖ్యాక ప్రజలు క్రమంగా పాల్గొన్నారు  అతిదీర్ఘకాల విప్లవం కొనసాగింది  దీని ఫలితంగా ప్రజలు క్రమంగా అమిత బలవత్తరమైన సుసంఘటిత శక్తిగా రూపొందారు  దేశం మొదట సామ్రాజ్యవాదుల మధ్య సంఘర్షణకూ, తరవాత విప్లవ, తద్వ్యతిరేక సంఘర్షణకూ కేంద్రమయింది  "ఈ వైరుధ్యాలను పరిష్కరించటానికి ప్రజావిప్లవం తప్ప మార్గంలేదనీ, ప్రాచ్యంలో సామ్రాజ్యవాదులు పన్నిన వుచ్చులు చీనాలోనే మొదటగా తెగాలనీ స్పష్టమయింది "

ఈ పని సాధించేశక్తి చీనాప్రజలకున్నది కాని వారికివిజయం లభించాలంటే ప్రోలిటేరియట్ నాయకత్వం వహించాలి చీనాలో శ్రామికవర్గం విస్తృతం కానప్పటికీ కేంద్రీకృతమై ఉండేది ఆ వర్గాన్ని మూడు క్రూరశక్తులు – విదేశీ సామ్రాజ్యవాదం, స్వదేశీ ఫ్యూడలిజం, పెట్టుబడిదారీ– మహా తీవ్రంగా పీడించాయి కార్మికుల సంఖ్య జనాభాలో అల్పభాగమే అయినా అర్ధ ప్రొలిటేరియనులైన పేదరైతులతో కలిసినప్పుడు వారి సంఖ్య జనాభాలో సగానికి మించింది ఈ కారణంచేత చీనాలో శ్రామికవర్గం తన పార్టీని (కమ్యూనిస్టు పార్టీని) ఏర్పరచుకుని విప్లవవర్గాలన్నిటికి నాయకత్వం వహించగలిగింది దీనికి కాలంకూడా కలిసివచ్చింది ఎందుచేతనంటే రష్యా విప్లవం అనంతరం విప్లవయుగం ఆరంభమయింది చీనాకు అంతర్జాతీయ సహకారం కూడా లభించింది చీనా విప్లవం వలస వ్యతిరేక స్వభావాన్ని తప్పక పొంది, ప్రపంచవ్యాప్తమైన వలస విధానపు పునాదులనే బద్దలు చేస్తుందని 1927 లోనే స్టాలిన్ అన్నాడు అదే జరిగింది

కాని అది తేలికగాగాని సులభంగాగాని జరగలేదు దాని మార్గం దారుణంగానూ క్లిష్టంగానూ, అనేక చుట్టు తిరుగుళ్ళతోనూ కూడుకున్నది ఆ కారణంచేతనే చీనా శ్రామికులూ, ప్రజలూ, కమ్యూనిస్టు పార్టీ బాగా రాటుతేలటం సాధ్యమయింది ఈ విప్లవానుభవాలసారమే "మావోధాట్" (మావోతత్వం లేక మావో విధానం)

ప్రపంచ ప్రోలిటేరియన్లతోనూ, ప్రాచ్య దేశాలలో దోపిడీకి గురి అయే శ్రమజీవులతోనూ ఎలాటి సంబంధాలు సృష్టించుకోవాన్న సమస్యలకు పరిష్కారం కావాలనీ, ఆ పరిష్కారం ఏ కమ్యూనిస్టు పుస్తకంలోనూ దొరకదనీ లెనిన్ అన్నాడు ఈ సమస్య యొక్క మూల సూత్రాలను లెనిన్, స్టాలిన్‌లు ప్రతిపాదించారు మావో వారి కృషిని మరింతముందుకు తీసుకుపోయి, చీనా విప్లవకార్యాచరణకు అన్వయించాడు ఆయన కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని చీనా ప్రజల భాషలోకి అనువదించి, అనేక చోట్ల ప్రజలను ఉత్తేజపరిచాడు

చీనా విప్లవాన్ని మావో ప్రాదేశిక సమస్యగా చూడలేదు అది ప్రపంచవ్యాప్త వలస విధాన వ్యతిరేకోద్యమంః ప్రపంచ ప్రోలిటేరియన్ విప్లవంలో ఒక భాగం పీడిత ప్రజలంతా ఒక పక్షం విప్లవ వ్యతిరేకులంతా ఒక పక్షం మధ్యంతరవర్గాలు విచ్చి పోతాయి వాటికి స్వతంత్ర ప్రతిపత్తిలేదు అని 1927లో మావో అన్నాడు ఆ సమయంలో చ్యాంగ్‌కైషేక్ విప్లవోద్యమానికి స్వస్తి చెప్పే ఎత్తుగడలో ఉన్నాడు కొమింటాంగ్‌లో ఒకవర్గం రష్యాతోగాని, సామ్రాజ్యవాదులతోగాని కలవకుండా మధ్యేమార్గంగా ఉండే ఆలోచన చేస్తున్నది

1937–45 మధ్య జపానును ప్రతిఘటించి యుద్ధం చెయ్యటానికి అన్ని వర్గాలూ ఏకమయినాయి కమ్యూనిస్టులు కూడా ఆ సమాఖ్యలో వున్నారు ఆ సమయంలో కమ్యూనిస్టు పార్టీలో మితవాద అవకాశవాదం తలఎత్తింది కొందరు శ్రామికవర్గాన్ని బడా బూర్జువావర్గానికి తోకగా రూపొందించాలని వాదించారు వారి వాదనలను మావో తీవ్రంగా ఖండిస్తూ, రష్యాలో విప్లవం జరిగి, అంతర్జాతీయ బూర్జువా–పెట్టుబడిదారీ వర్గానికి పెద్ద దెబ్బ తగిలిన దశలో పాతకాలపు బూర్జువా డెమోక్రాటిక్ ప్రపంచవిప్లవానికీ కాలదోషం పట్టిందనీ, రావలసినది ప్రపంచ ప్రోలిటేరియన్ విప్లవమేనని మావో స్పష్టం చేశాడు వలస, అర్ధవలస దేశాలలో జరిగే విప్లవాలకిది కీలకమైన మార్క్సిస్టు–లెనినిస్టు సూత్రం

చీనాలో జరగవలసిన విప్లవం ప్రపంచ ప్రోలిటేరియన్ విప్లవంలో అంతర్భాగ మనటానికి మావో కారణాలు వివరించాడు

"1 విప్లవం సామ్రాజ్యవాదంమీద దెబ్బదీసి, సామ్రాజ్యవాదుల ప్రతిఘటనను ఎదుర్కొంటుంది సోషలిస్టు దేశం (రష్యా) సహాయమూ, అంతర్జాతీయ ప్రోలిటేరియన్ సహాయమూ లేకుండా చీనా విముక్తి పొందలేదు 2 సోవియట్ యూనియన్‌కూ సామ్రాజ్యవాదులకూ మధ్య ఘర్షణ తీవ్రమవుతూవుంటే చీనా ఏదో ఒక పక్షం చేరాలి ఏ పక్షమూ చేరమన్నది భ్రమ 3 ఇంపీరియలిజంమీదా, ఫ్యూడలిజంమీద విజయం సాధించినాక చీనాలో బూర్జువా నియంతృత్వంకింద పెట్టుబడి వ్యవస్థ నిర్మించుకోవాలనటం విడ్డూరంకాదా? కమ్యూనిజం దారిచూపకుండా చీనాలో డెమొక్రాటిక్ విప్లవమే నెగ్గలేదు తదనంతరం విప్లవదశమాట అటుంచండి ప్రపంచ మంతా ఈనాడు తన విమోచనకోసం కమ్యూనిజం మీదనే ఆధారపడి వుంది ఈ విషయంలో చీనాకు అపవాదు ఏమీలేదు "

డెమొక్రాటిక్ విప్లవం మొదటిదశ అనీ, ప్రోలిటేరియన్ విప్లవం రెండవ దశ అనీ మావో చెప్పాడు మొదటి దశకు బూర్జువా వర్గం నాయకత్వం వహించలేదని స్పష్టమయాక మావో దాన్ని ప్రజల డెమొక్రాటిక్ విప్లవం అన్నాడు రెండు దశలకూ ప్రోలిటేరియన్ నాయకత్వం అవసరమయింది ఆ నాయకత్వం కింద ప్రజాబాహుళ్యం సామ్రాజ్యవాదాల్నీ, ఫ్యూడలిజమునూ, బ్యూరోక్రాటిక్ పెట్టుబడి దారీని ప్రతిఘటించాలి ఇందులో ప్రజా బాహుళ్యం అనేవారు మావో దృష్టిలో ప్రధానంగా రైతులూ, కార్మికులూ, మేధావులూ తదితర పెటీబూర్జువా వర్గాలూను ప్రోలిటేరియన్ నాయకత్వం కింద చీనా భవిష్యత్తు నిర్ణయించాలి

విప్లవం యొక్క విజయం ప్రోలిటేరియన్ నాయకత్వంపైనే ఆధారపడి ఉన్నది చీనాలోని పెటీబూర్జువా, జాతీయ బూర్జువా వర్గాలు నడిపిన విప్లవాలు ఫలించలేదు అయితే ప్రోలిటేరియన్ నాయకత్వానికి గుండెకాయ రైతు సమస్య ("సంగ్రహంగా చెప్పాలంటే, జాతీయ సమస్య రైతు సమస్యే"–స్టాలిన్) ఈ విషయంలో లెనిన్, స్టాలిన్‌లు చెప్పిన దాని మీదనే మావో మరింత చెప్పాడు

"రైతు విప్లవంలో నాయకత్వం వహించటమే ప్రోలిటేరియన్ నాయకత్వానికి అర్థంతాచిప్పాం బూర్జువా డెమొక్రాటిక్ విప్లవానికి బూర్జువా వర్గం నాయకత్వం వహించక పోవటానికి ముఖ్య కారణం ఆ వర్గం రైతు విప్లవానికి నాయకత్వం వహించలేకపోవడమూ, అలాటి విప్లవమంటే భయపడి ప్రతిఘటించటమూనూ "

శ్రామిక కర్షకుల సమ్మేళనమే కొత్త డెమొక్రాటిక్ విప్లవాన్ని సోషలిస్టు విప్లవంగా పరిణమింప జేయటానికి దోహదం చేసిందని మావో అన్నాడు

1927 అనంతరం చీనా కమ్యూనిస్టులు నగరాలను వదిలేసి పల్లెపట్టులను కైవసం చేసుకో నారంభించారు పల్లెపట్టులలో తమ బలాన్ని పెంచుకొని, ఆబలంతోనే నగరాలను చుట్టుముట్టారు, వశపరుచుకున్నారు

ఇది మావో నిర్దేశించినవిధానం ఇది సరిఅయినవిధానమన్నది ఆచరణలో రుజువయింది

మావోకు శత్రువు బలమూ, క్రౌర్యమూ బాగా తెలుసు అందుచేత చీనా విప్లవం దీర్ఘకాల పోరాటానికి సిద్ధంగా ఉండాలని, విప్లవశక్తులు వ్యవధి మీద బలాన్ని కూడగట్టుకుని, శత్రువును నిర్మూలించే విధంగా రాటుతేలాలనీ హెచ్చరిస్తూ, క్షణకాలంలో విప్లవం ఆయత్తమవుతుందన్నది పొరపాటని చెప్పాడు అది సాయుధవిప్లవమే తప్ప, శాంతియుత విప్లవం కాజాలదు శాంతియుత చర్యలు వేటికీ శత్రువు ఆస్కారం ఇవ్వటంలేదు "చీనాలో సాయుధ విప్లవ శక్తులకూ, సాయుధ విప్లవ వ్యతిరేక శక్తులకూ పోరాటం జరుగుతున్నది చీనా విప్లవానికి ఇదొక ప్రత్యేకతా, సదవకాశమూనూ" అన్నాడు మావో

చీనా విప్లవానికి స్థావరాలు కావాలి ముఖ్యపట్టణాలన్నీ శత్రువుల ఆధీనంలో వున్నాయి శత్రువుతో ముఖాముఖి యుద్ధాలు తలపెట్టకుండా బలంపుంజు కోవాలంటే మారుమూల పల్లెపట్టులలో స్థావరాలు ఏర్పరచుకోవాలి ఆ స్థావరాలను సైనికంగానూ, రాజకీయంగానూ, ఆర్థికంగానూ, సాంస్కృతికంగానూ బలమైన విప్లవదుర్గాలుగా రూపొందించుకోవాలి తరువాత సుదీర్ఘ పోరాటం ద్వారా సమగ్ర విప్లవ విజయం సాధించాలి ఎంత చిన్నవైనా స్థావరాలు ఏర్పడటం ముఖ్యమని మావో గట్టిగా చెప్పాడు ఎర్రసేనను సృష్టించుకొనటానికీ, విప్లవ వేగాన్ని పెంపొందించుకొనటానికీ అంతకన్న మార్గంలేదని మావో స్పష్టం చేశాడు చీనా విస్తృతమైన దేశం కదలటానికి కావలసినంత చోటు! శత్రువుకు బలం తక్కువగా ఉండేవి పల్లెపట్లు ఆ దౌర్బల్యాన్ని ఆసరా చేసుకొని తొలి విజయాలు అక్కడే సాధించినట్టయితే దీర్ఘకాల విప్లవ పోరాటానికి అవి స్థావరాలుగా పనికి వస్తాయి

చింగ్‌కాంగ్ షాన్ (చింగ్‌కాంగ్ పర్వతాలు)లో మొదటి స్థావరం ఏర్పడింది అటు తర్వాత ఇంకా అనేక స్థావరాలు యేర్పడ్డాయి అయినా మావో అనేక తప్పుడు వాదనలను ఎదుర్కోక తప్పలేదు కొందరు కామ్రేడ్స్ చాలాకాలంపాటు స్థావరాలను అంటిపెట్టుకొని ఉండటం గురించి అసంతృప్తి చెంది, సత్వరవిజయాలు సాధ్యమని సిద్ధాంతీకరించారు చీనా రాజకీయ ఆర్థిక పరిణతిలో ఎన్నో ఎగుడు దిగుడులున్నట్టు వీరు అంగీకరించలేదు మావో సరిఅయిన ఆలోచననే చెప్పినప్పటికీ అతివాద దుందుడుకువాదం మూడుసార్లు తాత్కాలికంగా నెగ్గి, విప్లవానికి తీరని నష్టాన్ని కలిగించింది పట్టణాలను పట్టుకోవాలని తీవ్రవాదులు పట్టుబట్టారు

గెరిల్లా యుద్ధతంత్రానికి గూడా మావో అత్యంత ప్రాధాన్యం యిచ్చాడు ("చిన్న చిన్న విజయాలను పోగుచేసుకుని ఘనవిజయాలకు మార్గం చేసుకో") తీవ్రవాదులు గెరిల్లా పోరాటాల విలువ గ్రహించక, ముఖాముఖి పోరాటాలకోసం– అది కూడా తమకన్న బలవత్తరమైన శత్రువుతో– వాంఛించారు ఈ పొరపాటువల్ల స్థావరాలు పోయాయి చిత్రమేమంటే, తమ యెత్తుగడ బెడిసికొట్టేసరికి ఈ తీవ్రవాదులే మితవాదాన్ని ఆశ్రయించారు

జపాను వ్యతిరేక యుద్ధమప్పుడు కూడా వీరు అదే తప్పుడు ధోరణి అవలంబించి, సత్వర విజయాలు కాంక్షించారు గెరిల్లా యుద్ధంతంతు మావో సమగ్రంగా వివరించాడు ప్రచ్ఛన్న (గెరిల్లా) యుద్ధాన్ని ఎప్పుడు ప్రత్యక్ష యుద్ధంగా మార్చవచ్చునో, ప్రత్యక్ష యుద్ధాన్ని అవసరమయితే ప్రచ్ఛన్నయుద్ధంగా ఎలా మార్చాలో మావో స్పష్టం చేశాడు

ముఖ్యమైన విషయమేమంటే, మావో చీనా విప్లవం తాలూకు అన్ని దశలలోనూ, అన్ని రంగాలలోనూ నిర్దుష్టమయిన సూత్రీకరణలూ, నిర్ణయాలూ చేశాడు మార్క్సిజం- లెనినిజంను వాస్తవపరిస్థితులలకు అద్భుతంగా అన్వయించాడు కుడి యెడమల నుంచి వచ్చిన పెడధోరణులను సరిదిద్దాడు (అది జరగనప్పుడు నష్టం సంభవించనే సంభవించింది )

పదిసంవత్సరాల అంతర్యుద్ధ కాలంలో (1927-37) మితవాదం నియమరహితమైన వర్గసమీకరణ ప్రతిపాదించి, ప్రోలిటేరియన్‌కు వ్యక్తిత్వం నిరాకరించింది("కూటమే తప్ప సంఘర్షణలేదు") తీవ్రవాదం ఎలాటికకూటమినీ ఆమోదించక ప్రోలిటేరియనులకు అండనిరాకరించింది ("ఎలాటి కూటమీ లేకుండా అచ్చగా సంఘర్షణే") ఇవి శాస్త్రీయ దృక్పథాలు కావు

విప్లవ సమరంలో అన్ని దశలూ ప్రోలిటేరియన్ విప్లవ విజయానికి సూటిగా వుండవు ఎత్తుగడలు మలుపులు తిరుగుతాయి శత్రువును ప్రతిఘటించాలి అదే శత్రువుతో చేతులు కలపాలి కాని ఏ దశలోనూ చరమలక్ష్యాన్ని వెనక్కి పట్టించరాదు ప్రతి ఎత్తుగడా ఆ లక్ష్యాన్ని దగ్గిరపడేసేదిగానే ఉండాలి ఈ ఎత్తుగడలు శత్రువును నగ్నంగా బయటపెట్టాలి అతనిలో విశ్వాసం ఉన్నవారికి కనువిప్పుకలిగించాలి ఊగిసలాడేవారిని విప్లవం కేసి మళ్ళించాలి క్రమంగా అసంఖ్యాక ప్రజాకోటిని విప్లవానికి అభిముఖం చేసుకుంటూరావాలి ఇందుకుగాను మార్క్సిస్టు-లెనినిస్టు మూలసిద్ధాంతాలను తద్దేశతాత్కాలిక పరిస్థితులకు ఎలా అన్వయించాలో తెలియటం గొప్పవిద్య దాన్ని ఆచరణలో పెట్టడం గొప్ప ప్రతిభ ఈ విద్యా, ప్రతిభా మావోలో పరిపూర్ణత్వం పొందాయి

మావోను విప్లవవాదులు ఆరాధించటం సహజం కాని కావలసినది ఆరాధన కాదు మావో ఆలోచనావిధానపు అవగాహన విప్లవాలను ఎగుమతి చెయ్యటం అసాధ్యమన్నట్టే విప్లవ ఎత్తుగడలను కాపీచెయ్యటం కూడా సాధ్యమయేది కాదు 1927లో తొలి అపజయం సంప్రాప్తమయాక చీనాకమ్యూనిస్టులు కొమింటర్న్ పైన ఆధారపడటం మానేశారు కాని మార్క్సిజం-లెనినిజమును వదలి పెట్టలేదు, మార్క్సిజం-లెనినిజమునేగాక, దేశ పరిస్థితులనూ, వర్గస్వభావాలనూ, విప్లవ దశలలో వాటి మధ్య కలిగే అనుకూల, ప్రతికూల సంబంధాలనూ చక్కగా అర్థంచేసుకోగలవారే విప్లవాలను సాధించగలరు మావో చెప్పినట్టు విప్లవంలో అపజయాలు కూడా పనికివచ్చే అనుభవమే అపజయాలను విజయాలుగా మార్చుకునే మార్క్సిస్టు దృక్పథం ఎంతైనా అవసరం

సృజన మాసపత్రిక, ఆగస్టు 1972

# 8. జాతి సమస్య-మార్క్సిస్ట్ దృక్పథం

జాతి సమస్యను మార్క్సిస్టు దృక్పథం నుంచి పరిశీలించే ఈ రచనను స్టాలిన్ 1912-13 సంధి కాలంలో వియన్నాలో ఉండి రచించాడు లెనిన్ ఈ రచనను ప్రశంసించాడు "ప్రస్విష్చేనియి" (వికాసం) అనే పత్రికలో 1913 ఆరంభంలో మూడు భాగాలుగా వెలువడింది

సోవియట్ విప్లవానికి నాలుగైదేళ్ళు ముందే వెలువడిన ఈ రచనలో జాతి సమస్యలను గురించీ, వాటి పరిష్కారం గురించీ అన్ని దేశాలవారికీ ఉపకరించే విషయాలున్నాయి

రష్యాలోనే విప్లవ ప్రతీపశక్తులు విజృంభించి, జాతీయవాదం ప్రజలలో చీలికలూ, వైషమ్యాలూ విషంలాగా వ్యాపించి, సమష్టిదృక్పథాన్ని ఛిన్నాభిన్నం చేస్తున్న కాలమది "డ్యూమా" చట్టబద్ధంగా ఏర్పడి, అది అవలంబించిన చర్యలు జాతీయవాదాన్ని ఉధృతం చేశాయి యూదులలో "జీయనిజం" వ్యాప్తిచెందింది పోలండులో జాతీయ దురభిమానమూ, తాతార్లలో సమైక్య ఇస్లాము తత్వమూ, ఆర్మేనియా, జార్జియా, ఉక్రాయిన్‌లలో జాతీయవాదమూ, సాధారణ ప్రజలలో యూదులపట్ల విద్వేషమూ చెలరేగాయి

అంటువ్యాధిలాగా ప్రజలలో వ్యాపించిన ఈ ధోరణులను రష్యను సోషల్ డెమోక్రాట్‌లు (కమ్యూనిస్టు-మార్క్సిస్టులు) ఎదుర్కోవలసిన అవసరం ఏర్పడింది అంతర్జాతీయతా, వర్గపోరాటంలో సమైక్యతా ప్రజలకు బోధించటానికి మరొక పార్టీలేదు ముఖ్యంగా జాతీయవాదం అమిత తీవ్రరూపం దాల్చిన సరిహద్దు ప్రాంతాలలో సోషల్ డెమోక్రాట్లు అత్యంత దీక్షతో జాతీయవాదాన్ని ఎదుర్కోవలసి వచ్చింది

కాని సరిహద్దు ప్రాంతాలలోని సోషల్ డెమోక్రాట్లు కొందరు ఈ విధిని నిర్వహించటంలో కృతకృత్యులు కాలేకపోయారు ఒకప్పుడు సమైక్యతను అవలంబించిన "బూంట్" (బండ్, లితుయేనియా, పోలండు, రష్యాలలోని యూదు శ్రామికుల సంస్థ, యూదు పెటీబూర్జువాలు దీనిని 1897 అక్టోబరులో స్థాపించారు) కేవల యూదు జాతీయాశయాలకు దిగజారిపోయింది

కాకసస్‌లో సోషల్ డెమోక్రాట్లు బూంట్ దారేతొక్కి, పూర్వం నిరాకరించిన "జాతీయ సాంస్కృతిక స్వతంత్ర ప్రతిపత్తి" (నేషనల్ కల్చరల్ అటానమీ) అర్జంటుగా కావాలన్నారు

ఇలాంటి విచ్ఛిన్నకర ధోరణుల మధ్య స్టాలిన్ జాతి సమస్యల గురించి విపులంగా చర్చించాడు "నేషన్" (ప్రజ) అనే మాటనూ "రేస్" అనే మాటనూ కూడా మనం "జాతి" అనే అంటున్నాం అది మన పరిభాషలో లోపం స్టాలిన్ చర్చించినది వివిధ మానవ జాతులగురించి కాదు, "ప్రజ" గురించి ఎలాటి మానవ సమాజాన్ని మనం "ప్రజ" అంటాం అన్న ప్రశ్నకు, "ప్రజ అంటే ఒకజాతి కాదు, ఒక తెగకాదు" అని స్టాలిన్ సమాధానం చెప్పాడు అందుచేత ఈ సమీక్షలో జాతి అనే మాట "ప్రజ" అన్న అర్థంలోనే గ్రహించాలి

జాతికి ఈ దిగువ లక్షణాలుండాలి

1 చారిత్రకంగా సంఘటితమైన మానవ సమాజం జాతి అయితే సైరస్, అలెగ్జాండర్లు స్థాపించిన సామ్రాజ్యాలు చారిత్రకంగా ఏర్పడినవే అయినా వివిధ జాతుల, తెగల కలగాపులగం అవి తేలికగా కలిసేవి తేలికగా చీలిపోయేవి జాతికి (ప్రజకు) స్థిరత్వం ఉండాలి కాని

అదికూడా చాలదు రష్యా, ఆస్ట్రియాలలో స్థిరమైన మానవ సమాజాలున్నప్పటికీ అవి ఏక ప్రజగలవి కావు అందుచేత

2 ఒకే భాష ఉండటం జాతికి అవసరం అయితే, ఒకే భాషలో మాట్లాడే వారంతా ఒకే జాతి (ప్రజ) కానవసరం లేదు ఇంగ్లాండులోనూ, ఐర్లాండులోనూ, అమెరికాలోనూ ఒకే భాష మాట్లాడతారు కాని మూడు దేశాలవాళ్ళూ మూడు భిన్నజాతులు

3 ఒకే ప్రదేశానికి (టెర్రిటరీకి) అంటిపెట్టుకుని ఉండటం జాతికి ఒక ముఖ్య లక్షణం దీనికి తోడు జాతియావత్తూ ఒకే ఆర్థిక వ్యవస్థలో శ్రమ విభజన ద్వారా పాలుపంచుకోవాలి

4 ఇంతేగాక జాతి అన్నదానికి దాని సాంస్కృతిక ముద్ర ఉండాలి

పైన చెప్పిన లక్షణాలలో ఏది లోపించినా అది జాతి అనిపించుకోదు

జాతీయ లక్షణాలు ఉంటే చాలు మిగిలినవన్నీ ముఖ్యం కాదన్న వాదనను స్టాలిన్ ఖండించారు

ఉదాహరణకు యూదుల కందరికీ ఒకే రకమైన జాతీయ లక్షణం (సంస్కృతి) ఉన్నది కాని వారు ప్రపంచమంతా చెదురుమదురుగా ఉన్నారు (ఇప్పుడు ఇజ్రాయిల్ ఉన్నదనుకోండి) ఏ దేశంలో ఉంటే యూదులు ఆ దేశపు భాష మాట్లాడతారు ఒక ఆర్థిక వ్యవస్థలో భాగస్వాములు కారు వారికి సమంగా ఉన్నదల్లా మత సంస్కృతి మాత్రమే (ఇస్లాము మత సంస్కృతి ప్రాతిపదికపై పాకిస్తాను ఏర్పడటం కూడా అప్పటికి జరగలేదు)

ఆమాటకువస్తే జాతీయ ముద్రనుబట్టి చూస్తే అమెరికాకు వెళ్ళిపోయిన బ్రిటిషు వాళ్ళదీ, బ్రిటిషువాళ్ళదీ ఒకే సంస్కృతి కాని ఇంగ్లండులోనూ, అమెరికాలోనూ పరిస్థితులు ఎంత భిన్నంగా ఉన్నాయంటే, రెండు జాతులూ త్వరలోనే వేరయిపోయాయి

యూదు జాతిని కాగితం మీద "జాతి" అన్నాడు స్టాలిన్ "సోషల్ డెమోక్రసీ (అంటే మార్క్సిజం) జాతీయ కార్యక్రమాలు తయారుచేయవలసినది అలాటి జాతుల కోసం కాదు ఏకంగా కదలి, చర్యలు తీసుకోగల నిజమైన జాతులకోసం వాటిని ఉపేక్షించటానికి లేదు" అన్నాడాయన

మనం మొట్టమొదట అనుకున్నట్లుగా, జాతి అనేదాన్ని ప్రజ అనే అర్థంలో గాక మానవజాతి అనే అర్థంలో బేవర్ ( యూదు జాతీయతను ప్రతిపాదించిన వాడు) వాడుతున్నట్టు కనబడుతున్నాడనీ, అలాచేసి గందరగోళం సృష్టిస్తున్నాడనీ కూడా స్టాలిన్ అన్నాడు

## జాతీయోద్యమాలు

జాతి అన్నది చారిత్రకంగా ఏర్పడినది మాత్రమే గాక ఒక చారిత్రక దశలో పెట్టుబడిదారీ ఫ్యూడలిజమును రద్దుచేసి మనుషులను ఒకే జాతికింద సంఘటిత పరిచింది పశ్చిమ యూరపులో బ్రిటిషు, ఫ్రెంచి, జర్మను, ఇటాలియను మొదలైన జాతులు ఇలా ఏర్పడినవే ఇవి స్వతంత్ర రాజ్యాలు (స్టేట్స్) కూడాను

తూర్పు యూరపులో దీనికి భిన్నంగా వివిధ జాతులతో కూడిన రాజ్యాలు ఏర్పడ్డాయి ఆస్ట్రియా, హంగరీ, రష్యా ఈ తరగతివి ఆస్ట్రియాలో జర్మను జాతివారు రాజకీయంగా

పురోగమించి ఉండి, ఆస్ట్రియాలోని జాతులను ఏకంచేసి రాజ్యం ఏర్పాటు చేశారు హంగరీలోని జాతులను సమీకరించినది మాగ్యార్ జాతివారు రష్యాలో వివిధ జాతులను ఏకం చేసినది "మహారష్యన్" జాతి

తూర్పు యూరపులో కలిగిన పరిణామాలు ఫ్యూడలిజం నిర్మూలన కానప్పుడే సాధ్యమవుతాయి ఆ పరిస్థితిలో పెట్టుబడిదారీ బలహీనంగా వుంటుంది దుర్బల జాతులు ఆర్థికంగా పుంజుకుని దృఢమైన జాతులుగా రూపొందలేక పోతాయి

అయితే ఆ పరిస్థితి అలాగే ఉండిపోలేదు పెట్టుబడిదారీ వృద్ధి అయింది వర్తకమూ, రవాణా సదుపాయాలూ అభివృద్ధి కావటమూ, నగరాలు వెలయటమూ జరిగింది అట్టడుక్కు తొక్కి వేయబడిన దుర్బల జాతులు బలం చేకూర్చుకుని చైతన్యం పొందాయి పత్రికలూ, థియేటర్లూ, శాసనసభలూ జాతీయాభిమానాలను బలపరిచాయి కొత్తగా పుట్టుకొచ్చిన మేధావివర్గం జాతీయాభిమానాలను పెంపొందించింది

కాని, ఈ ఆలస్యంగా మేలుకున్న జాతులు స్వతంత్ర రాజ్యాలుగా పరిణామం చెందే అవకాశం లేదు పాలకవర్గంగా పాతుకుపోయిన జాతి వారిని నిరోధిస్తుంది కాలాతీతమై పోయింది! అందుచేత, ఆస్ట్రియాలో జెక్, పోక్ వగైరా జాతులూ, హంగరీలో క్రోట్ వగైరా జాతులూ, రష్యాలో రెట్, లితువానియన్, ఉక్రెయిన్, జార్జియన్, ఆర్మేనియన్ వగైరా జాతులూ తమ జాతీయతలను పెంపొందించుకున్నాయి పశ్చిమ యూరపులో స్వాతంత్ర్యం లేకుండా దిగబడిపోయిన జాతి ఐరిష్ జాతి ఒక్కటే అది జాతీయోద్యమ పోరాటం సాగించింది అలాగే తూర్పు యూరపు దేశాలలోని జాతులు కూడా జాతీయోద్యమాలు సాగించాయి

ఈ సంఘర్షణ పాలకవర్గానికీ–దానికి చెందిన బడా బూర్జువా వర్గానికీ, పీడిత జాతులకు–వాటికి చెందిన పెటీబూర్జువా వర్గానికీ మధ్య కొనసాగింది లేదా, పీడిత జాతులకు చెందిన "జాతీయ" బూర్జువా వర్గం ఏకమై అధికారం చలాయించే జాతి తాలూకు పాలకవర్గాన్ని ప్రతిఘటించింది సంఘర్షణలో బూర్జువావర్గానిదే ముఖ్యపాత్ర

ఈ సంఘర్షణకు మూలకారణం "సొంత" వ్యాపారం (మార్కెట్) వ్యాపారం ద్వారానే బూర్జువాలు జాతీయవాదం నేర్చుకుంటారు కాని బలవంతమైన జాతి అడుగున ఉన్న జాతిని ఎక్కిరానివ్వదు (తూర్పు పాకిస్తానువారి ఆశయాలను పశ్చిమ పాకిస్తాను అణచినట్టు) అందుకు తగిన నిర్బంధ చర్యలు శీఘ్రంగా జరుగుతాయి

ఆర్థిక సంఘర్షణ రాజకీయ సంఘర్షణగా పరిణమిస్తుంది ఈ సంఘర్షణలో బక్కజాతుల కదలికకూ, భాషకూ, వోటింగుహక్కులకూ, స్కూళ్ళకూ, మతం వగైరాలకూ ప్రతిబంధకాలూ, నిషేధాలూ ఉత్పత్తి అవుతాయి పాలకవర్గం "పెద్ద కులం" గా వ్యవహరించటం కూడా ఈ చర్యల ఆశయాలలో ఒకటి

ఇంత వత్తిడి వచ్చాక పీడిత జాతికి చెందిన పెటీబూర్జువాలు తమ జాతికి చెందిన వారిని "మాతృదేశం" నినాదంతో రెచ్చగొడతారు తమ సమస్య జాతికంతకూ చెందినదంటారు ప్రజలు నిర్లిప్తంగా ఉండక, చైతన్యం ప్రదర్శిస్తారు (బంగ్లాదేశ్) జాతీయోద్యమం అలా ప్రారంభమవుతుంది ఆ ఉద్యమంలో ప్రోలిటేరియనులూ (కార్మికులూ), కర్షకులూ ఎంతబాగా పాల్గొంటే జాతీయోద్యమం అంతబలంగా ఉంటుంది

బూర్జువా జాతీయవాదాన్ని కార్మికవర్గం ఎంతవరకు బలపరుస్తుందనేది వర్గపోరాటాన్ని బట్టీ, కార్మికుల వర్గచైతన్యాన్ని బట్టీ, సంఘటనను బట్టీ ఉంటుంది కార్మికులకు తమ "జెండా" వేరే ఉన్నది గనక, చైతన్యవంతమైన కార్మికవర్గం బూర్జువా పతాకను ఆశ్రయించనవసరం ఉండదు

ఇక కర్షకులు నిర్వహించేపాత్ర జాతిపీడన యొక్క స్వభావాన్ని బట్టి ఉంటుంది ఐర్లండులోలాగా పీడన భూములకు కూడా విస్తరించినప్పుడు కర్షకులు అధిక సంఖ్యలో జాతీయోద్యమంలో పాల్గొంటారు

ఈ అంశాలను పురస్కరించుకొని జాతీయోద్యమం బహుళ ప్రజోద్యమంగా వృద్ధి కావటమో, లేక చిన్న చిన్న సంఘర్షణలకింద తునిగిపోయి, "సైన్‌బోర్డుల" కోసం కీచులాటలుగా మారటమో జరుగుతుంది

జాతీయోద్యమ స్వభావం సర్వత్రా ఒకటిగా ఉండదు అది ఉద్యమంయొక్క ఆశయాలనుబట్టి మారుతుంది

పైన చెప్పిన దానిని బట్టి, పెట్టుబడిదారీ బలపడేదశలో తలఎత్తే జాతీయోద్యమాలు బూర్జువా వర్గాలమధ్య సంఘర్షణలే అన్నది స్పష్టం అవుతుంది బూర్జువావర్గం ఒక్కొక్కప్పుడు శ్రామికవర్గాన్ని జాతీయోద్యమంలోకి లాగగలగటంవల్ల అది సమగ్ర జాతీయోద్యమం అయినట్టు పైకి కనపడవచ్చు– కాని అది ఆభాస, వాస్తవానికి అది బూర్జువా వర్గానికి చెందిన ఉద్యమమే (అలాంటి ఉద్యమం విజయవంతం కావటం జరిగితే ఆ విజయఫలితాలు శ్రామికులకు చెందబోవని త్వరలోనే స్పష్టమవుతుంది )

అంటే, జాతీయ పీడనను ప్రోలిటేరియన్ వర్గం ప్రతిఘటించరాదని కాదు జాతి పీడన ఆ వర్గాన్ని కూడా బాధించేదే జాతి పీడన అంతం కాకుండా ఆ వర్గం తన బుద్ధి బలాన్ని స్వేచ్ఛగా అభివృద్ధి చేసుకోలేదు అంతేకాదు, జాతి పీడన మూలంగా ప్రజల దృష్టి వర్గపోరాటాల మీదినుంచి సార్వజనీనమైన జాతీయ సమస్యవైపు మళ్ళుతుంది వర్గ సామరస్యం అవసరమన్న ప్రచారం ఫలించి, శ్రామికుల బానిసత్వానికి వీలు కలుగుతుంది ఇంతేగాక, వివిధ జాతుల ప్రోలిటేరియన్లుల సమైక్యతకు విఘాతం కలుగుతుంది జాతుల మధ్య వైషమ్యాలు పెరుగుతాయి పరస్పర హత్యాకాండ సాగుతుంది "విభజించి పాలించ"టానికి చక్కని వాతావరణం ఏర్పడుతుంది ఆ వాతావరణంలో అన్ని జాతుల ప్రోలిటేరియనులను ఏకం చెయ్యటమనేది సాధ్యంకాదు (మన దౌర్భాగ్య దేశంలో ఇదంతా మన కళ్ళఎదటనే జరిగింది జరుగుతున్నది)

కాని శ్రామికులకు కావలసింది సమస్తజాతుల శ్రామికవర్గ సమైక్యత, బూర్జువా వర్గ దాస్యం నుంచి సంపూర్ణ విముక్తి అందుచేత వారు అన్నిరకాల జాతి పీడననూ ప్రతిఘటిస్తారు వివిధ జాతుల స్వయం నిర్ణయ హక్కును సోషల్ డెమోక్రాట్లు (కమ్యూనిస్టులు) బలపరుస్తారు

జాతియొక్క స్వయం నిర్ణయాధికారం అంటే ఆ జాతియొక్క గమ్యాలను నిర్ణయించే హక్కు ఆ జాతికే ఉండటంః జాతి జీవితంలో ఇతరులు వేలుపెట్టటంగాని, స్కూళ్ళను నాశనం చెయ్యటంగాని, ఆచారాలను మార్చటంగాని, హక్కులను నిగ్రహించటంగాని బలాత్కారంగా చేసే హక్కు ఉండరాదు

అంత మాత్రాన కమ్యూనిజం ప్రతి జాతియొక్క ప్రతి ఆచారాన్నీ, జాతీయ సంస్థనూ సమర్థిస్తుందని కాదు ప్రతి జాతికీ తన పూర్వస్థితికి పోయే హక్కు ఉన్నప్పటికీ, అలాటి నిర్ణయాలు

తీసుకునే అధికారం జాతీయ సంస్థలకులేదు కమ్యూనిజం ప్రోలిటేరియనుల హక్కులను కాపాడుతుంది జాతుల స్వయం నిర్ణయాధికారం కోసం కమ్యూనిజం పోరాడటమంటే, జాతుల పీడన విధానాన్ని అంతమొందించటమూ, జాతుల మధ్య సంఘర్షణకు దారితీసే అవకాశాలను రద్దుచేయటమూనూ, వర్గచైతన్యంగల ప్రోలిటేరియట్ అవలంబించే విధానానికీ బూర్జువా విధానానికీ ఇక్కడే తేడా–బూర్జువా విధానం జాతీయ పోరాటాలను ఎగదోసి, జాతీయోద్యమాలను తీవ్రతరం చెయ్యటానికీ, సాగదీయటానికీ చూస్తుంది

జాతీయోద్యమం అనేది ప్రధానంగా బూర్జువా ఉద్యమం కావటంచేత అది బూర్జువా వర్గం భవిష్యత్తుతో ముడిపడి ఉంటుంది బూర్జువా వర్గం పతనంతోగాని అది పతనం కాదు సోషలిజం వస్తేగాని శాంతి పూర్తిగా నెలకొనదు పెట్టుబడిదారీ వ్యవస్థలో కూడా జాతీయోద్యమాలను తగ్గుముఖంలో ఉంచి, వాటి వేళ్ళు తెగగొట్టి, సాధ్యమైనంత వరకు శ్రామిక వర్గానికి వాటివల్ల హాని జరగకుండా చూడవచ్చు కాకపోతే దేశంలో పూర్తి ప్రజాతంత్రం నెలకొని, అందులోని జాతులు స్వేచ్ఛగా అభివృద్ధి చెందే అవకాశం ఉండాలి (ఉదాహరణలుః స్విట్జర్లాండుః అమెరికా)

## జాతీయ సమస్య

జాతిలోని అత్యధిక సంఖ్యాకులు– ముఖ్యంగా ప్రోలిటేరియనులు– బాగుపడాలంటే దాని జీవిత విధానం ఎలా తీర్చిదిద్దాలి, దాని రాజ్యాంగం ఎలా రూపొందాలి?

జాతికి స్వతంత్ర ప్రతిపత్తి (అటానమీ) ఉండాలి దానికి వేరుపడే హక్కు కూడా వుండాలి కాని ఈ రెండు హక్కులూ సర్వకాల సర్వావస్థలయందూ అత్యధిక సంఖ్యాకులకు (ప్రోలిటేరియనులకు) లాభకరం కాకపోవచ్చు స్వతంత్ర ప్రతిపత్తా, విడిపోవడమా, సమాఖ్య (ఫెడరేషన్) లో చేరటమా, ఏది లాభదాయకమన్నది కమ్యూనిజముకు సమస్య పరిస్థితులు మార్పు చెందుతూ ఉంటాయి ఒక సమయంలో సరిఅయిన పరిష్కార మార్గం మరొక పరిస్థితిలో అననుకూలం కావచ్చు చారిత్రక దశనుబట్టి పరిష్కారం ఉండాలి ఒక జాతియొక్క ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక పరిస్థితులు పరిష్కారానికి సూచికలు రాజకీయ పరిస్థితులు ఎలా పరిణామం చెందుతున్నదీ గమనించి, దానికి అనుకూలంగా జాతియొక్క భావిరాజ్యాంగం నిర్ణయం కావాలి పరిష్కారం జాతి జాతికీ మారుతుంది జాతిసమస్య పరిష్కారంలో గతితార్కికదృష్టి అత్యంత ప్రముఖపాత్ర వహిస్తుంది

(బూంట్ లాగా) జాతి సమస్యను అలాగ్గా తేల్చిపారెయ్యటం అభ్యంతరకరమైనది (జాతి సమస్య పరిష్కారానికి ఆస్ట్రియాలో అవలంబించిన మార్గాలను బూంట్ వాళ్ళు రష్యాలో 'జాతి' సమస్యకు అన్వయించజూడటాన్ని స్టాలిన్ వివరంగా ఖండించాడు )

"జాతీయ సంస్కృతీ స్వాతంత్ర్యం" (కల్చరల్ నేషనల్ అటానమీ) నినాదం ఒకటి లేవదీశారు ఇది అభివృద్ధిలోకి వచ్చి, సాంస్కృతిక, సాహిత్య పరిణతిగల జాతులకు వర్తిస్తుంది "కాకసస్‌లో అనేక తెగల వాళ్ళున్నారు వారికి వేరు వేరు భాషలున్నాయి, సాహిత్యంవేరు, వారి సంస్కృతి ప్రాచీనమైనది వారు పరిణామ దశలో ఉన్నారు కొంతవరకు 'జీర్ణమై', కొంతవరకు అభివృద్ధి పొందుతున్నారు అలాటి ప్రజలను ఏం చెయ్యాలి? ఎలాటి సాంస్కృతిక విషయాలతో వారిని సంఘటిత పరచాలి?" అని స్టాలిన్ అడుగుతాడు రష్యాలో అజారియన్ జాతివాళ్ళు

జార్జియాభాష మాట్లాడేవారు వారి సంస్కృతి టర్కీది వారి మతం ఇస్లాం "వారిని మతవిషయాలలో ఒక రకంగానూ, ఇతర సాంస్కృతిక విషయాలలో మరొక రకంగానూ సంఘటిత పరచాలా? అని స్టాలిన్ ప్రశ్న

వెనుకబడిన జాతులను ఉన్నంతలో ఉన్నత సాంస్కృతిక మార్గంలో ప్రవేశపెట్టటమే పరిష్కారమార్గం అలాటి ప్రజలుగల కాకసస్ ప్రాంతానికి ప్రాంతీయ స్వతంత్ర ప్రతిపత్తి ఇచ్చినట్టయితే అక్కడ ఒకే సంస్కృతి అభివృద్ధి చెందే అవకాశం ఉన్నది అల్ప జాతుల వాళ్ళు తమ జాతీయ సంకుచితత్వాలను పోగొట్టుకొని, సంస్కృతిలో పైకి రాగలుగుతారు

ప్రాంతీయ స్వతంత్ర ప్రతిపత్తివల్ల లాభాలేవంటే, అది ఒక ప్రాంతంలోని వారందరినీ కలుపుకుంటుంది జాతులపేర ప్రజలను విభజించదు అలాటి విభజనలను నిర్మూలించి, మరొక రకం విభజనను–వర్గ విభజనను పెంపొందిస్తుంది కేంద్రం యొక్క దయాధర్మాల మీద ఆధారపడకుండా ప్రాంతీయ నిసర్గ సంపదను వినియోగించుకుని ఉత్పత్తి శక్తులు పెంపొందే అవకాశం కలిగిస్తుంది

జాతి సమస్య యొక్క పరిష్కారంలో ప్రాంతీయ స్వతంత్ర ప్రతిపత్తి ఒక ముఖ్యాంశం

ఏ ప్రాంతంలోనూ అచ్చగా ఒకేజాతి ఉండదు అంతటా అల్పసంఖ్యాక జాతులుంటాయి పాత వ్యవస్థలోనే ఈ అల్ప సంఖ్యాక జాతుల వారికి అధిక సంఖ్యాక జాతి పీడన ఉంటుంది పూర్తి ప్రజాస్వామ్యం వస్తే ఈ బెడద ఉండదు చెల్లాచెదురుగా (వివిధ ప్రాంతాలలో) ఉన్న జాతి వాళ్ళను ఒక జాతీయ సమాఖ్యలో చేర్చే ప్రయత్నం నిష్ప్రయోజనం ప్రజాస్వామ్యం లేనిచోట అది నిరుపయోగం, ప్రజాస్వామ్యం ఉన్న పక్షంలో అనవసరం

అల్ప సంఖ్యాకుల ఆక్షేపణలు ఏవి? వారు తమ మాతృభాషను ఉపయోగించలేరు వారికి తమ సొంత స్కూళ్ళుండవు మత స్వాతంత్ర్యమూ, కదిలే స్వాతంత్ర్యమూ ఉండవు అన్ని జాతులకూ అన్ని విషయాలలోనూ సమాన ప్రతిపత్తి ఉండాలి జాతి విశిష్టతలు నశించాలి అల్ప సంఖ్యాక జాతుల మీద ఆంక్షలుండరాదు

జాతి సమస్యను గురించి 60 ఏళ్ళ క్రితం స్టాలిన్ ప్రకటించిన ఈ అభిప్రాయాలు విముక్తమైన వలస దేశాలన్నిటికీ ఈ నాటికీ వర్తిస్తాయి బూర్జువా ప్రజాస్వామ్యం జాతుల సహజీవనానికి ఉపకరిస్తుందనటానికి స్టాలిన్ అమెరికానూ, స్విజర్లాండునూ పేర్కొన్నాడు అమెరికా నీగ్రో జాతి పీడన అలా ఉంచి, అక్కడి వివిధ జాతుల మధ్య అనేక విచక్షణలున్నాయి అమెరికాలో జాతులే కులాలంటే అందులో ఆశ్చర్యంలేదు

స్టాలిన్ రష్యాలోనే "మహా రష్యనులు" అగ్రజాతిగా తయారై మిగిలిన జాతుల మీద సవారీ చేస్తున్నట్టు చెప్పబడుతున్నది జెకొస్లొవేకియాలో జెక్‌లకూ, స్లొవాక్‌లకూ పడటం లేదుట

ఇటీవలి ప్రపంచ చరిత్రలో జాతీయత మరొక రూపంలో సాక్షాత్కరించింది సామ్రాజ్యవాదులు నీగ్రోలనందరినీ ఒకే గాటకట్టి, వారికి నాగరికత తెచ్చినట్టు రొమ్ములు చరుచుకున్న కారణంగా నీగ్రో జాతీయ సంస్కృతి తలఎత్తింది ఆఫ్రికాలో వలసలు దాదాపు అన్నీ ఈ సంస్కృతిని చేపట్టాయి అమెరికాలోని నీగ్రోలు కూడా ఈ సంస్కృతిని అందిపుచ్చుకున్నారు నీగ్రో సాహిత్యం అంటూ వెలువడింది 1956లో "ఆఫ్రికన్ కల్చరల్

సొసైటీ" పారిస్‌లో సమావేశమయింది  కాని త్వరలోనే వీరందరిదీ ఒకే జాతీయ సంస్కృతి కాదని స్పష్టమయింది  అమెరికాలోని నీగ్రోల పౌర హక్కుల పోరాటాలకూ, ఆఫ్రికాలోని జాతీయ విమోచన పోరాటాలకూ ఎలాటి సంబంధమూ లేదు

సంస్కృతి ప్రధానంగా దేశ కాలాలకు సంబంధించి ఉంటుంది  ఆ దృష్టితో చూస్తే ప్రపంచంలోని నీగ్రోలందరూ ఒకే చారిత్రక పరిణామ దశలో లేరు  వారి సమస్యలు కూడా ఒకటికావు

అరబ్ సంస్కృతి కూడా ఇలా పెంపొందిందే  చాలా అరబ్ రాజ్యాలు సామ్రాజ్యవాదుల అధీనంలోకి వచ్చాయి  అరబ్ సంస్కృతి హీనంగా చూడబడింది  అందుచేత అరబ్ మేధావులు అరబ్ సంస్కృతిని ప్రపంచానికి నిరూపించే ప్రయత్నం చేశారు  కాని ఆ కృషికూడా ఫలించలేదు  వివిధ అరబ్ రాజ్యాలలో రకరకాల రాజకీయ వ్యవస్థలున్నాయి  సాంస్కృతికంగా ఈ అరబ్ దేశాలన్నీ ఏకం కావటం అసాధ్యమయింది

ఇలాంటి పరిణామాలు చూస్తే ఒక్క విషయం స్పష్టమవుతుంది, ప్రోలిటేరియన్ నియంతృత్వం లేనిచోట, లేక క్షీణించినచోట, జాతి సమస్యకు సరిఅయిన పరిష్కారం ఉండటం లేదు  అందుచేత ఒక దేశంలోని వివిధ జాతుల మధ్య సమైక్యతా, సామరస్యమూ, సమానతా ఉండాలంటే ప్రోలిటేరియన్ నియంతృత్వం తప్ప మరోమార్గంలేదు

మార్క్సిజం అండ్ ది నేషనల్ క్వశ్చన్ - జె స్టాలిన్, న్యూ బుక్‌సెంటర్,
14రామ్‌స్ట్రీట్, కలకత్తా, వెలః రు 2/-

సృజన, మాసపత్రిక, అక్టోబరు 1972

## 9. "జాతి సమస్య-మార్క్సిస్టు దృక్పథం"

"తూర్పు పాకిస్తాన్ ప్రజల ఆశయాలను పశ్చిమ పాకిస్తాన్ పాలకులు అణచిన మాట నిజమే అయితే అక్కడ ఇటీవల జరిగినదాన్ని ప్రజలు చైతన్యం ప్రదర్శించిన జాతీయోద్యమంగా ఉదహరించవచ్చునా, అన్నది ప్రశ్న", అంటున్నారు చంద్రంగారు (మే సృజన)

తూర్పు పాకిస్తాన్ ప్రజలు పశ్చిమ పాకిస్తాన్ ప్రజలకు విజాతిగా ప్రవర్తించిన మాట నిజం ప్రాదేశికంగానూ, భాష విషయంలోనూ కూడా వారిపంథా వేరుగా ఉంటూ వచ్చింది  పశ్చిమ పాకిస్తాన్ చేసిన దోపిడీగురించి సందేహం లేనేలేదు  అంతవరకే నేను ఉదాహరణగా తూర్పు పాకిస్తాన్‌ను వాడుకున్నాను

తూర్పు పాకిస్తాన్ జరిపిన జాతీయోద్యమం ఏదో స్పష్టంగా చెప్పటం కష్టం  అక్కడ జరిగిన ఆఖరు ఎన్నికల్లో తూర్పు పాకిస్తాన్ ప్రజలు అటానమీకి పూర్తిగా మద్దతు ఇచ్చారు  జాతీయ విముక్తికోసం తూర్పు పాకిస్తాన్ జరిపిన పోరాటం దాదాపు భారతీయ సైనికులదేకనక దాన్ని మనం (లేక ఇతర దేశాల కమ్యూనిస్టు పార్టీలు) సమర్థించటమూ, సమర్థించక పోవటమూ మరొక ప్రశ్న  దానికి నా పుస్తక సమీక్షలో చోటున్నట్టు తోచదు  తూర్పు బెంగాలులో జాతీయ పోరాటం ఇంకా మిగిలి ఉన్నదనే అనుకోవాలి

లేఖ, సృజన మాసపత్రిక, ఆగస్టు 1973

# 10. మార్క్సిస్టు తత్వశాస్త్రం

విరసం ఉద్భవించిన కొత్తలో విప్లవ రచయితలు మార్క్సిస్టులు కానవసరంలేదనీ, అనుభవంనుంచి విప్లవ రచనలు రావచ్చుననీ ఒక వాదం వెలువడింది దీనివెనుక ఉన్న మనస్తత్వాన్ని మూడు దశాబ్దాల చిల్లర క్రితమే డేవిడ్ గెస్ట్ ఖండించాడు

"అనుభవం చాలదా? సిద్ధాంతం దేనికి?" అనేవారు శ్రామిక వర్గం లోనే ఉండటాన్ని అతను తప్పుబట్టి "సిద్ధాంతం కార్యకర్తకు అడుగడుగునా అవసరమే" అన్నాడు ఏమిచేసి ఏ ఫలితం సాధించాలన్నా ఒక సార్వత్రిక సూత్రాన్ని అధారం చేసుకోవాలి ఇలాంటి సార్వత్రిక సూత్రాలే చేరి సిద్ధాంతమవుతాయి అనుభవం ద్వారా రుజువైన సిద్ధాంతం శాస్త్రీయ సిద్ధాంతం అనిపించుకుంటుంది

సిద్ధాంతమూ, అనుభవమూ పరస్పరాధారంగలవి, శాస్త్రజ్ఞానమంతా అనుభవం నుంచి పుట్టి, అనుభవాన్ని విస్తరించుతూ దాని ద్వారా పెరుగుతూ వచ్చినదే సిద్ధాంతమూ అనుభవమూ అనేవి వైరుధ్యాలు అవి విడదీయరానివి "వైరుధ్యాల ఐక్యత" అన్నది గతితార్కిక భౌతిక వాదానికి వెన్నెముక

అయితే వర్గసమాజంలో –ముఖ్యంగా బూర్జువా సంస్కృతిలో అనుభవ సిద్ధాంతాల ఐక్యత గుర్తించబడదు బూర్జువా ప్రపంచ దృక్పథం శాస్త్రజ్ఞానంతో సమాజ స్వభావాన్ని అవగాహన చేసుకునే వైఖరిని సహించదు ఎందుకంటే అలాంటి అవగాహన విప్లవస్వభావం కలిగిఉంటుంది బూర్జువా సంస్కృతిలో అంతో ఇంతో మత దృష్టి ఉంటుంది: పదార్ధం కన్న మనస్సూ, "ఆత్మా" ప్రాముఖ్యం వహిస్తాయి పెట్టుబడిదారీ దశ చిరస్థంగా ఉండాలన్న ఆరాటం ఉంటుంది

ఈ సంస్కృతి శ్రామిక వర్గ శత్రువు ప్రపంచాన్ని భౌతిక దృష్టితో చూడటమూ, దానిలో కలిగే విప్లవ పరిణామాలను గ్రహించటమూ గతితార్కిక భౌతికతత్వం చేసేపని అదే శ్రామిక వర్గ దృక్పథం

"సిద్ధాంతంగా బాగానే ఉండవచ్చు కాని ఆచరణలో సాధ్యంకాదు" అన్నమాట అర్ధంలేనిమాట ఆచరణలో రుజువైనదే సిద్ధాంతం బూర్జువా సంస్కృతిలో ఆచరణకూ, సిద్ధాంతాలకూ పొంతనలేకుండా పోయిన కారణంగా యిటువంటి మాటలు పుడతాయి

శాస్త్రీయ సామ్యవాదం శ్రామికోద్యమానికి ప్రాతిపదిక అన్ని శాస్త్రాల దృక్పధాన్ని యిది పరిగ్రహిస్తుంది మానవ సమాజం మొదలుకొని ప్రతిదాన్నీ శాస్త్రీయ దృష్టితో అర్ధం చేసుకుంటుంది అందునా బూర్జువా తత్వంతో దీనికి ఘర్షణ తప్పదు ఈ ఘర్షణ స్వరూపం ఆధునికమైనా స్వభావం ప్రాచీనమే మన పూర్వులలోనే ప్రకృతివాదమూ, ఆధ్యాత్మిక వాదమూ ఘర్షణపడ్డాయి (ప్రకృతివాదంనుంచి శాస్త్ర విజ్ఞానమూ, ఆధ్యాత్మికవాదుల నుంచి ఈశ్వరుడూ, ఇహపరవిభజనా, కర్మసిద్ధాంతమూ పుట్టుకు రావటం యాదృచ్ఛికం కాదు) ఆధ్యాత్మికవాదం అనేది చేసేది ఏమంటే భౌతికకారణాలవల్ల కలిగే పరిణామాలకు అలౌకికకారణాలు ఆపాదించటం దీని వెనక మతదృష్టి ఉంటుంది ఆధ్యాత్మిక వాదుల దృష్టిలో భౌతిక

ప్రపంచం యొక్క అస్తిత్వమే అనుమానాస్పదం  దాన్ని గురించి మనకు నిజంగా ఏమీ తెలీదు,  తెలుసుననుకునేదంతా భ్రమ

అయితే ఆధ్యాత్మికవాది జీవించేది భౌతిక జీవితమే  ఆకలి అన్నం తింటే పోతుందని తెలుసు  వానలో తడవకుండా గొడుగు పట్టుకోవాలని తెలుసు  మొండికత్తికి పదునుపెట్టించాలని  తెలుసు, రైతులూ, కూలీలూ పొలాలలోపడి గొడ్లలాగా పనిచేస్తేనే గాని పొయ్యిలో పిల్లి లేవదని తెలుసు  అయితే ఈ ఆధ్యాత్మిక వాది ఆధిక్యత ఎక్కడ వున్నదంటే తనను పోషించేవారి శ్రమను చిన్నచూపు చూడటంలో ఉన్నది  తాను తనలాభ క్షేమాలకొరకు వినియోగించే శాస్త్రజ్ఞానాన్నే తిరస్కరించి తాను కూర్చున్న కొమ్మనే నరుక్కునేవాడి మనస్తత్వం ప్రదర్శించటములో ఉన్నది!  ఆధ్యాత్మిక వాదులు బుద్ధిని పైకెత్తి, శరీరశ్రమను చిన్నచూపు చూస్తూనే మహా మేధావులైన శాస్త్రవేత్తలు కనిపెట్టే శాస్త్రజ్ఞానాన్ని కూడా ప్రతిఘటిస్తారు  ఆధ్యాత్మిక దృష్టి హేతుబద్ధంగా ఉండటానికి వీల్లేదు

ఆధ్యాత్మిక వాదులకు వాస్తవమైన పునాది లేదు  "ఈశ్వరసత్యం జగన్మిధ్యా" అన్న ప్రాతిపదికమీద వారు ఆధ్యాత్మిక వాదాన్ని నిర్మించారు  జగత్తు మిధ్య అన్న విశ్వాసానికి ఆధారం ఏమిటి? జగత్తు వాస్తవమే అనుకుని దానిమీద మేధాశక్తితో సిద్ధాంతాలు చేస్తూపోతే నిజమైన భౌతికవాదం పెంపొందుతుంది  జీవంకన్న మరణమే మేలన్న ప్రాతిపదికమీద జీవితసత్యాలు పుట్టుకురావుగదా!

మన జ్ఞానేంద్రియాలు భ్రమలు కలిగిస్తాయన్నది ఆధ్యాత్మిక దృష్టిని నిరూపించదు  శాస్త్రవేత్త ఆ భ్రమలు ఏ కారణాలవల్ల కలుగుతాయో,  వాటివెనక "సత్యం" యెలా ఉంటుందో భౌతిక దృష్టితోనే అన్వేషిస్తాడు  కామెర్లరోగికి లోకం పచ్చగా కనిపించటం భ్రమే  అంత మాత్రంచేత ప్రపంచం మిధ్యకాదు  పచ్చగా కనిపించే ప్రపంచం వెనక ఉన్న కామెర్లరోగానికి చికిత్సచేస్తే ఆ భ్రమ పోతుంది  అన్నీ రోగ సంబంధమైన భ్రమలేకావు  అనేక భ్రమలు ప్రకృతి సిద్ధమైనవి  మన జ్ఞానేంద్రియాల నిర్మాణం, వాటికి గల పరిమితులు, అనేక భ్రమలు కలిగిస్తాయి  అవి ప్రకృతి సిద్ధమైనవి అన్నతరవాత ఈశ్వరుణ్ణి చర్చలోకి తేనక్కరలేదు  ఆ భ్రమలకు భౌతిక కారణాలే దొరుకుతాయి

"జగత్తే మన దత్తాంశం (డేటమ్), అది మనకు ప్రసాదితం, అది ఉన్నది  అదే మన నిత్య ప్రపంచం, మన సమానుభవం (కామన్ ఎక్స్‌పీరియన్స్) అందులో పరిణామాలు జరుగుతాయి" అన్నాడు ప్రొఫెసర్ లెవీ

ఇలాటి వైఖరి ఆత్మ విధ్వంసకమైనది కాకపోగా హేతుబద్ధమైనది కూడా

అసలు ఈఆధ్యాత్మిక వైఖరి అనేది ఎలా వచ్చింది?  అవకతవక దృక్పధాలకు కూడా కారణాలుంటాయి  భౌతికవాదానికీ, ఆధ్యాత్మిక వాదానికీ అంతులేని సంఘర్షణ జరిగింది, జరుగుతున్నది  ఇది కేవలమూ, భావ సంబంధమైనది కాదు  (అల్పాయుష్కుడైన శంకరుడు సాంఖ్యంతోనూ, చార్వాకంతోనూ చాలా ఘర్షణ పడ్డాడు  చిట్టచివరకు సాంఖ్యానికీ ఆధ్యాత్మిక వాదానికీ పొసగని లంకె కృత్రిమంగా తగిలించారు) ఇలాటి సంఘర్షణలు ఆకాశం నుంచి

ఊడిపడవు  ఈ సంఘర్షణ వర్గ సమాజం నుంచి వర్గ పోరాటం నుంచీ పుట్టింది  వర్గ పీడనకుఉపయోగపడుతున్నది  లేకపోతే వర్గ పీడనలోనూ, వర్గ సంబంధాలలోనూ ఉన్న సాంఘిక దురన్యాయాన్ని సమర్థించటం ఎలాగ? ఉత్పత్తి మీద ఆధారపడిన సమాజంలో ఉత్పత్తి చేసే వాళ్ళు హీనులనీ, చెయ్యీకాలూ కదల్చకుండా అందలాలెక్కి తిరిగేవాళ్ళు ఉన్నతులనీ వాదించటమెలాగ? పెట్టుబడిదారీ సమాజానికి కూడా ఈ ఆదర్శవాదాన్ని ఆసరాచేసుకోక తప్పలేదు  చిత్రమేమిటంటే, పెట్టుబడిదార్లు అందుబాటులో ఉన్న శాస్త్రవిజ్ఞానాన్ని పుష్కలంగా వినియోగించుకుంటారు  శ్రామిక వర్గాన్ని మరింత క్షీణదశకు తీసుకురావటానికి ఆటోమేషన్ లాటి సాంకేతిక ప్రక్రియలకు వారికి అభ్యంతరంలేదు  కాని వారికి భౌతిక తత్వవాదం సరిపడదు  పెట్టుబడిదారీలో ఉన్న సాంఘిక వైరుధ్యాలలో ఇది కూడా ఒకటి

ఉత్పత్తి చేసే శ్రామికుడికి ఈ ఆధ్యాత్మిక వాదం ఎందుకూ పనికిరాదు  దున్నేవాడూ, వడ్రంగం చేసేవాడూ, లేత్‌మీద పనిచేసేవాడూ, యంత్రాలు తయారుచేసేవాడూ వచ్చి భౌతిక వాదులుగానూ, నైపుణ్యంపై ఆధారపడినవారుగానూ మాత్రమే పనిచెయ్యగలరు  వాళ్ళకు ఈశ్వరుడి లీలలను గురించి, పూర్వజన్మతాలూకు పుణ్య పాపాల గురించీ, లలాట లిఖితాలను గురించీ చెప్పాలంటే తీరిక వేళలలోనే సాధ్యం! ఈ ఉచ్చుల నుంచి బయటపడాలంటే శ్రామికవర్గం భౌతిక వాదానికి పరాకాష్ఠ అయిన మార్క్సిజమును అవలంబించాలి  అది ప్రపంచ కార్మికుల సొంతం

ఆది కాలంలో తత్వవేత్తలు భౌతికవాదాన్నే అవలంబించారు  ప్రపంచం పాంచభౌతికమని ఊహించారు  గ్రీకు తత్వవేత్తలు నాలుగే చెప్పారు  ఆకాశాన్ని వదిలేశారు  అణు సిద్ధాంతం కూడా చాలా ప్రాచీనమైనది  అయితే ఆ కాలపు తత్వవేత్తలకు ప్రయోగ విధానాలు లేవుః అవి కొద్ది శతాబ్దాల క్రితం వచ్చి, ఆధునిక శాస్త్ర విజ్ఞానానికి దోహదం చేశాయి

భౌతిక వాదం నుంచి “యాంత్రిక వాదం” వచ్చింది  బ్రిటనులో యంత్ర నాగరికత పెరుగుతున్న దశలో యంత్రసంబంధమైన విజ్ఞానాన్ని పెంచటానికీ, మత రాజస శక్తులను ప్రతిఘటించటానికీ ఈ వాదం అవసరమయింది  మూడు వందల ఏళ్ళ క్రితం శాస్త్ర విజ్ఞానం కన్న యాంత్రిక విజ్ఞానమే హెచ్చుగా అభివృద్ధి చెందింది

యాంత్రిక భౌతిక వాదం ప్రకారం ప్రపంచం ఒక క్లిష్టమైన యంత్రం  దాన్ని “కీ” ఇచ్చి ఆడించటం మొదలు పెట్టారు  అప్పటి నుంచీ అది నియమిత సూత్రాల ప్రకారం మార్పులేకుండా నడుస్తూ వస్తున్నది  ఈ దృక్పథంలో పరిణామ వాదానికి ఆస్కారం లేదు  ఈ వాదం సాధారణ తర్కాన్ని ఆశ్రయిస్తుంది  గతి తర్కానికి అవకాశం లేదు  ఈ వాపంలో ఉన్న పెద్దలోపం సులువుగా గ్రహించవచ్చు  ఈనాడున్న ప్రాణులన్నీ ఆది నుంచీ ఉండి ఉండాలిః కొత్త జీవజాతులు పుట్టటానికిగాని, పాతవి అంతరించటానికిగాని వీలులేదు  మానవ సాంఘిక వ్యవస్థలో కూడా మార్పుకు అవకాశం లేదు  ఈ కారణంచేత ఇది మత విశ్వాసం లాంటిదిగా తయారవుతుంది  ఎందుకంటే, మత విశ్వాసాలు మారరాదు  ఆ కారణంచేత ఇది “ఆదర్శవాదానికి” దారి తీసిందిః  విప్లవ ధోరణులను అటకాయించింది

అందుచేత దీనిని ప్రతిఘటించుతూ గతి తర్కం వచ్చింది  గతి తర్కం మార్పుల వెనక ఉండి హేతువులను వివరిస్తుంది  గతితర్కం శాస్త్రవేత్తలకుకూడా అవసరమయింది  దాని సహాయం లేకుండా జీవ పరిణామం ఎలా అర్థమవుతుంది? చరిత్రా, సాంఘిక పరిణామమూ ఎలా అర్థమవుతాయి?  కొంతమంది చారిత్రక పురుషుల చర్యలే చరిత్ర అన్నది చరిత్రకు అర్థం చెప్పదు  గతి తార్కిక విధానాన్ని రూపొందించినవాడు హెగెల్

కాని హెగెల్ ఒక అలౌకిక శక్తిని మూలకారణంగా పేర్కొని, అదే పరిణామాన్ని సాధించుకుంటూ పోతున్నదనీ, మానవ మేధస్సుతో దానికి ఎలాటి ప్రమేయమూ లేదనీ అన్నాడు మార్క్సు ఎంగెల్సులు ఈ తలకిందులు సిద్ధాంతాన్ని భౌతిక వాస్తవికత అనే కాళ్ళమీద నిలబెట్టారు చరిత్ర పరిణామం గాని, సాంఘిక పరిణామంగాని, జీవ పరిణామంగాని సూటిగా (యాంత్రికంగా) జరగలేదు  అది కిందనుంచి మీదకే జరిగింది గాని దాని మార్గం, గమ్యానికి సూటిగా జరగలేదు  వంకరటింకరగా ఎగుడుదిగుడుగా జరిగింది  అందుచేత పరిణామం వెనక ఆవాఙ్మనస శక్తి ఏదీలేదు  భౌతిక సూత్రాలే పనిచేస్తున్నాయి

గతితర్కం భౌతికవాదాన్ని దృఢంగా నిలబెట్టింది  ఇప్పుడు ప్రపంచ వాస్తవాన్ని శాస్త్రీయంగానూ, భౌతిక దృష్టితోనూ అవగాహన చేసుకునేటందుకువీలు ఏర్పడింది  అంతేగాక విశ్వాన్ని ఏకాండంగా భావన చెయ్యగలదు  ప్రతి విషయాన్ని విశ్లేషించగలదు

గతితార్కిక భౌతిక వాదాన్ని మొదట ప్రవచించినవాళ్ళు మార్క్సు ఎంగెల్సులు  సిద్ధాంత ఆచరణల ప్రాతిపదికగల ఈవాదం శ్రామికోద్యమంలో ప్రచారం కావటంలో వింతలేదు యాంత్రిక దృక్పథం నుంచి విముక్తిపొందలేని బూర్జువా ఆలోచనా ధోరణికి సిద్ధాంతాచరణల ఐక్యత సాధ్యంకాదు  "గతితార్కిక భౌతిక వాదం" అన్న మాటే అయోమయంగా ఉన్నదన్న బూర్జువా మేధావులున్నారు  కాని భౌతిక వాదంలో గతితర్కం ఎలా ఉంటుందో అర్థం చేసుకొనటం చిన్నపిల్లలకు కూడా సాధ్యమే  ఇది ముందు చూద్దాం

విశ్వమంతటా జరిగే పరిణామాలను వివరించే తత్వం రూపంలో గతి తార్కిక భౌతిక వాదం అవతరించింది  19వ శతాబ్దంలో ప్రకృతి శాస్త్రాలు గతి తర్కాన్ని పుష్కలంగా రుజువు చేశాయి  శక్తి అన్నది ఒక రూపంనుంచి మరొక రూపానికి పరివర్తన చెందగలదని రుజువయింది  యాంత్రిక, ఉష్ణ, కాంతి, విద్యుత్, అయస్కాంత, రసాయన సంయోగ శక్తులన్నీ "కదలిక" యొక్క రూపాంతరాలేనని రుజువయింది  చెట్లు చేమలు మొదలుకుని తిమింగలం లాటి మహా ప్రాణిదాకా ప్రతిజీవీ ఏక కణంగా జీవితం ఆరంభించటం జరుగుతున్నది అలాటప్పుడు ఇన్ని కోట్ల రకాల జీవరాసులు ఎలా ఏర్పడ్డాయన్న ప్రశ్నకు పరిణామవాదం సమగ్రమైన సమాధానం ఇచ్చింది  ఈ విధంగా గతితర్కం  విజ్ఞాన రంగంలో వివిధ శక్తి రూపాల మధ్య సరిహద్దులను తుడిచివేసి, వాటి వెనక ఉన్న ఏకసత్యం "కదలిక" (గతి) అని నిరూపించింది

ఎంగెల్స్ 19 వశతాబ్దికి చెందిన ప్రకృతి శాస్త్రాలను ప్రత్యేకంగా అధ్యయనం చేసి, ప్రకృతినీ, చరిత్రనూ సయితం "గతిసూత్రాలు" శాసిస్తున్నాయనీ, యాదృచ్ఛికంగా ఏదీ జరగటం లేదని సిద్ధాంతీకరించి, స్థూలంగా మూడు సూత్రాలు ప్రతిపాదించాడు  క్రియా, పరివర్తనా పరిణామము

గతి సూత్రాలను హెగెల్ ఇలా నిబంధన చేశాడు

1 ప్రమాణమూ, గుణమూ ఒకదాని నుంచి మరొకటిగా మారుతాయి

2 వైరుధ్యాలమధ్య ఏకత్వం (పరస్పర సంబంధం, సామ్యం) ఉన్నది

3 వ్యతిరేకించినది వ్యతిరిక్తం అవుతుంది

మార్క్సు ఎంగెల్స్‌లు ఈ సూత్రాలను వినియోగించుకున్నారు ఈ మూడు సూత్రాలూ అనుభవంలో ఎలా వర్తించేదీ చూడవచ్చు

**1 గుణం నుంచి ప్రమాణమూ, ప్రమాణం నుంచి గుణమూ మార్పు చెందుతాయి**

పదార్థాలలో ప్రమాణానికి అనుగుణంగా కొత్తగుణాలు ఎలా వస్తాయో, కొత్త గుణాల ద్వారా ప్రామాణికమైన మార్పులు ఎలా కలుగుతాయో ఈ సూత్రం చెబుతుంది పదార్థాల ఘన, ద్రవ, వాయు స్థితులు మనకు తెలిసినవే నీరు ద్రవం, దాన్ని వేడెక్కిస్తే ఆవిరి అవుతుంది చల్లబరిస్తే మంచు అవుతుంది ఈ స్థితి మార్పు కూడా క్రమంగా జరగదు ఒక దశలో ఆకస్మికంగా జరుగుతుంది

ఈ ఉదాహరణలో ప్రమాణం వేడిది, గుణం నీటిది ఎందుకంటే మంచి ఉష్ణోగ్రతకు నీటిని చల్లబరచవచ్చు అది ఇంకా నీరురూపంలోనే ఉంటుంది మరింత "చలి" చేరితేతప్ప నీరు మంచుగా మారదు అలాగే నీరు ఆవిరి అయే ఉష్ణోగ్రతలో నీరు వెంటనే ఆవిరి అయిపోదు మరికొంత వేడిని స్వీకరించిన మీదటనే నీరు ఆవిరిగా మారిపోతుంది

ఇదే ఉదాహరణలో నీరును ప్రమాణంగా భావించి నీటి ప్రమాణం గుణంలో మార్పుకు ఎలా కారణభూతమవుతుందో చూడవచ్చు మాట వరసకు ఒకే ఒక నీటి అణువుకు ఘన, ద్రవ, వాయు స్థితి అంటూలేదు మంచులోనూ, నీటిలోనూ, ఆవిరిలోనూకూడా నీటి అణువు రూపం మార్పుచెందదు అదే అనేక కోట్ల కోట్ల అణువులు చేరేసరికి వాటికి నీరుగానూ, మంచుగానూ, ఆవిరిగానూ ఉండే గుణం సాధ్యమవుతుంది

అదే విధంగా ఏ అరణ్యం మధ్యనో, నిర్జన ద్వీపంలోనో నివసించే ఒకరిద్దరు మానవులలో సామాజికుల గుణాలు ఉండవు అధిక సంఖ్యలో ఒకే జీవితంలో భాగస్వాములైన మానవులే సామాజికుల గుణాలు అలవరచుకుంటారు వ్యష్టి తిరుగుబాట్లు విప్లవం కావనీ, వర్గాలకు వర్గాలు కదిలి తిరుగుబాటు చేసినప్పుడే విప్లవం వస్తుందనీ మనకు తెలుసు ప్రమాణం కొత్త సామాజిక గుణాలకు దారితీయటానికి విప్లవం మంచి ఉదాహరణ

కొత్త గుణాలు కొత్త ప్రమాణాలకు దారితీస్తాయనేందుకు మానవచరిత్రే మంచి ఉదాహరణ ఆహారం ఏరుకుతింటూ, జంతువులను వేటాడుతూ తిరిగిన దశలో జన సమూహాలు ఒకటి రెండు డజన్లను మించేవి కావు వ్యవసాయం రాగానే స్థిరనివాసానికీ మంది సమిష్టి జీవనానికీ ఆస్కారం ఏర్పడింది లోహయుగం నగర నిర్మాణానికి దోహదం చేసింది ఆధునిక శాస్త్రజ్ఞానం కోటి మందికి సమిష్టి జీవనం చెయ్యటమేగాక, మానవజాతినే ఏకం చెయ్యటానికి ఉపక్రమించింది ప్రపంచమే కుంచించుకుపోయింది ఆయా దశలలోని సమాన స్వరూపాలను తరచి చూసినట్టయితే జన ప్రమాణం సాంఘిక గుణాలలో ఎటువంటి మార్పు తెచ్చిందికూడా స్పష్టమవుతుంది గుర్తుంచుకోవలసిన అంశమేమంటే, గుణంనుంచి పరిణామానికీ,

పరిణామంనుంచి గుణానికీ కలిగే మార్పులన్నీ విప్లవ పరిణామాలు, అవి క్రమంగా జరిగేవి కావు నీరు చిక్కబడి మంచు కావటం అనేది ఉండదు

**2.వైరుధ్యాల ఐక్యత**

వాస్తవ ప్రపంచమంతా వైరుధ్యాల మయమని ఈ సూత్రం చెబుతుంది వైరుధ్యాలనేవి ఒకదానికొకటి వ్యతిరేక స్వభావం కలవే అయినా వాటి మధ్య విడదీయరాని సంబంధం ఉన్నది ధనికులు లేనిచోట పేదలంటూ ఉండే అవకాశం లేదు ఒకడి రుణం మరొకడి ఆదాయం తూర్పుగా వెళ్ళేదారే, పడమరగా వచ్చేదారి రుణవిద్యుత్తు ఉండబట్టే ధన విద్యుత్తు ఉన్నది ఉత్తర ధృవం ఉండబట్టే దక్షిణ ధృవం ఉన్నది అచ్చుగా ఉత్తర శృంగమో, దక్షిణ శృంగమో గల సూదంటురాయిని తయారు చేయటం అసాధ్యం ఎండలేనప్పుడు నీడాలేదు పదార్థమూ, శక్తీ కలిసి ఉంటే వైరుధ్యాలే! వైరుధ్యాలను గురించి అర్థంచేసుకోవటం యొక్క ప్రాముఖ్యాన్ని లెనిన్ చెప్పాడు

మానవ సమాజంలో గల వైరుధ్యాలను గ్రహించటం ద్వారా సామాజిక పరిణామాన్ని వివరించటం మార్క్సిజంకు సాధ్యమయింది

మరొకటి ఏమంటే, వైరుధ్యాల మధ్య ఐక్యత అన్నది తాత్కాలిక పరిస్థితిని బట్టి మాత్రమే ఉంటుంది కాని విశ్వదృష్టితో చూసినట్టయితే వైరుధ్యాల మధ్య సంఘర్షణే గతిని (పరిణామాన్ని) నిర్ణయించేది

**3. వ్యతిరేకించినది వ్యతిరిక్తమవుతుంది**

అన్ని రంగాలలోనూ విప్లవ పరిణామాలు కలిగే పద్ధతి గుండ్రంగా తిరుగుతూ పైకిపోయే మెట్ల లక్షణం కలిగి ఉంటుందని ఈ సూత్రం చెబుతుంది ఒక క్షణంలో పడమరగా మెట్లు ఎక్కుతున్నవాడు మరొకదశలో దానికి వ్యతిరేకంగా, తూర్పుగా ఎక్కుతూ కనిపిస్తాడు మరొక దశలో దానికి వ్యతిరేకంగా మళ్ళీ పడమరగా ఎక్కుతాడు విశేషం ఏమిటంటే వాడు పూర్వం ఉన్న స్థితికన్న ఎత్తులో ఉంటాడు అంటే పరిణామం ఒకప్పుడు విసర్జించిన దశతాలూకు లక్షణాలను కొన్నిటిని ప్రదర్శిస్తుంది అయితే ఇది ఉన్నత దశ యాంత్రిక భౌతిక వాదాన్ని తోసిపుచ్చి గతితార్కిక భౌతికవాదం రావటం ఇందుకు ఒక ఉదాహరణ ఆదిమజాతులలో ఉండిన సామ్యవాదమూ నిర్దుష్ట ప్రజాతంత్రమూ ఉన్నత దశలో–కమ్యూనిస్టు వ్యవస్థలో తిరిగిరావటం మరొక ఉదాహరణ అనుకోవచ్చు

ఈ సూత్రాలను బలాత్కారంగా చరిత్రకుగాని, ప్రకృతికిగాని అంటగట్టటం సాధ్యంకాదు మార్క్సు ఎంగెల్సులు ఈ విషయం నొక్కి వక్కాణించారు

పైన చెప్పిన సూత్రాల మధ్య సమన్వయం గ్రహించాలంటే గతితర్కవిధానాన్ని అవగాహన చేసుకోవాలి ఈ పని లెనిన్ చేశాడు వైరుధ్యాల అవినాభావ సంబంధం గతితర్కానికి మూల సంబంధమనీ, అయితే ఆ సూత్రాలన్నీ వివరించటమూ, విస్తరించటమూ అవసరమనీ ఆయన అన్నాడు ఇందుకు గాను పదహారు అంశాలు చెప్పాడు అవన్నీ ఈ పుస్తకంలో చెప్పబడిఉన్నాయి ఈ సందర్భంలో, వైరుధ్యాలను గురించి మావో వ్యాసాలు మరింత స్పష్టమైన అవగాహనతో కూడుకుని ఉండి, అందరూ చదవదగినవి

గతితార్కిక భౌతిక వాదాన్ని చరిత్రకు అనువర్తింపజేసిన దాకా శాస్త్రీయమైన చరిత్ర లేకపోయింది చరిత్రను భౌతిక దృష్టితో అవగాహన చేసుకోవటం –చారిత్రిక భౌతిక వాదం శాస్త్రీయ సామ్యవాదానికి అవసరం శాస్త్రీయంకాని చరిత్ర పుక్కిటి పురాణాల పుట్ట బూర్జువా దృష్టిలో "చరిత్ర ఇంకా శాస్త్రం కాదు అది శాస్త్రమనే అభాస కలిగించటానికి కొన్ని దాటివేతలూ, వక్రీకరణలూ అవసరం"(బెర్ట్రాండ్ రసెల్) ఈ అభిప్రాయం తప్పని మార్క్సిజం నిరూపించింది స్థూలమైన ప్రపంచ పరిణామాలను ముందుగా చెప్పగలిగింది ప్రపంచ ఆర్థిక సంక్షోభం ఫలితంగా ఫాసిజం పుట్టుకువచ్చిన దశలో సోవియట్ ఆర్థికవ్యవస్థ యొక్క ఆధిక్యత మార్క్సిజమును రుజువు చేసి, అనేక మంది బూర్జువా ఆర్థిక వేత్తల కళ్ళుతెరిచింది

మార్క్సుకు పూర్వం సోషలిస్టు భావవాదులుండేవారు వారు పెట్టుబడి దారీలోని అవలక్షణాలను ఖండించి, ఉజ్వలమైన సాంఘిక వ్యవస్థను గురించి కలలుకన్నారు కాని పెట్టుబడిదారీలోని అవలక్షణాలను విశ్లేషించలేకపోయారు సమాజాన్ని పునర్నిర్మించేశక్తి ప్రొలిటేరియన్ వర్గం నుంచి వస్తుందని తెలుసుకోలేకపోయారు వారి దృష్టిలో సోషలిజం అనేది పరమ సత్యానికీ, పరమ విచక్షణకూ, పరమ న్యాయానికీ ప్రతీక ఈ "పరమ" లు వాస్తవ వర్గ సంఘర్షణకు అంటేవి కావు

కమ్యూనిస్టులు అవలంబించే సిద్ధాంతాలు ఎవరో సంస్కర్తలు సృష్టించినవీ, కనిపెట్టినవీ కావనీ, వాస్తవ వర్గపోరాటాల నుంచీ, ప్రత్యక్షచరిత్రగతి నుంచీ ఏర్పడ్డ వాస్తవ సంబంధాల నుంచి సూత్రీకరించినవేననీ కమ్యూనిస్టు మానిఫెస్టో చెబుతున్నది వర్గ సమాజాలు ఏర్పడినది లగాయతు మానవ చరిత్ర అంతా వర్గ కలహ చరిత్రగానే ఉంటున్నది పీడితులకూ పీడకులకూ మధ్య తీవ్ర సంఘర్షణ ఉంటూనే ఉన్నదని కమ్యూనిస్టు మానిఫెస్టో విస్పష్టంగా చెబుతున్నది వర్గ పోరాటాన్ని ఆమోదించని బూర్జువాలు చరిత్రను అస్పష్టం చేస్తారు

గతితర్కాన్ని మనం సమాజానికి అనువర్తింపజేసి, అందులోని పరిణామాలను తెలుసుకోవాలంటే, అందులోని వైరుధ్యాలనూ, విరుద్ధ పక్షాలనూ పరిశీలించాలి సమాజంలోని ప్రధాన వైరుధ్యం వర్గపోరాటంలో వ్యక్తమయిందని చప్పున అనిపిస్తుంది కాని, సమాజం అభివృద్ధి చెందేకొద్దీ పోరాటంలో పాల్గొనే వర్గాలలో మార్పులు కలిగాయి ప్రతి సామాజిక విప్లవంలోనూ ఒకరకం వర్గపోరాటం సఫలమై, కొత్తవర్గాలూ, కొత్త సంఘర్షణలూ రావటం జరిగింది ఈ విషయం ఇలా ఉంచి, ఆదిమసమాజంలో వర్గాలు లేకుండానే అది అభివృద్ధి చెందింది అలాగే కమ్యూనిస్టు వ్యవస్థలో కూడా వర్గాలుండవు కనుక వర్గ కలహం మూలకారణాలకోసం మనం మరింతలోతుగా అన్వేషించాలి

వర్గ కలహం యొక్క మూలం ఉత్పత్తి విధానాలకూ, ఆస్తి సంబంధాలకూ మధ్య గల వైరుధ్యమని మార్క్సు కనిపెట్టాడు ఒక చారిత్రక దశలో (పెట్టుబడిదారీ వ్యవస్థలో) ఈ వైరుధ్యం వర్గశత్రుత్వంగా వ్యక్తమవుతుంది ఈ దశలో ఉత్పత్తిశక్తులు విస్తరించే ధోరణిలో ఉంటాయి ఆస్తి సంబంధాలు ఉత్పత్తిని అరికట్టే ధోరణి కలిగి ఉంటాయి కాని వర్గరహిత సమాజంలో కూడా ఈ మూలవైరుధ్యం ఉండనే ఉంటుంది ఉండి, ఉత్పత్తి శక్తులు పెరిగేకొద్దీ సాంఘిక సంబంధాల అభివృద్ధికూడా కొనసాగుతుంది (విప్లవం విజయవంతమైన అనంతరం కూడా కొనసాగే వర్గ సంఘర్షణకూ ఇక్కడ చెప్పిన వైరుధ్యానికి సంబంధం లేదు)

మార్క్స్ ఇలా చెప్పాడు సామాజిక ఉత్పత్తి కొనసాగించే మనుషులకు కొన్ని సంబంధాలు అనివార్యంగా ఏర్పడతాయి వారి ఇచ్ఛతో వాటికి సంబంధం ఉండదు ఈ ఉత్పత్తి సంబంధాల సమిష్టి స్వరూపమే సామాజిక ఆర్థిక వ్యవస్థ ఆ పునాదిపైనే సమాజం యొక్క న్యాయ, రాజకీయ నిర్మాణం, జరిగి, ఒక సామాజిక (భావ) చైతన్యం ఏర్పడుతుంది సమాజంలోని సాధారణ రాజకీయ, సాంస్కృతిక ధోరణులు ఎలా ఉండేది భౌతిక జీవనోత్పత్తి విధానాలే నిర్ణయిస్తాయి మనుషుల భావచైతన్యం వారి మనుగడను నిర్ణయించదు, వారి మనుగడే వారి భావచైతన్యాన్ని నిర్ణయిస్తుంది – బానిస బతుకు బతికేవాడికి బానిస బుద్ధులున్నట్టు ఉత్పత్తి విధానాలలో అభివృద్ధి కలుగుతూ పోయేటప్పుడు ఒక దశలో ఆ విధానాలకూ, ఆస్తి సంబంధాలకూ సంఘర్షణ ఏర్పడుతుంది (వైషమ్యం ఏర్పడుతుందనటం సరిగా వుంటుంది) అదే సామాజిక విప్లవదశ

విప్లవానంతరం జరిగేది కూడా మార్క్స్ స్పష్టం చేసాడు

పునాది అయిన ఆర్థిక వ్యవస్థ మారగానే దాని ఆధారంపైన నిలబడిన శాసన, రాజకీయ, మత, సాంస్కృతిక, తాత్విక భావాలన్నిటిలోనూ మార్పు వచ్చి తీరాలి అయితే, ఆర్థిక వ్యవస్థ తాలూకు భౌతిక పరివర్తనను శాస్త్రీయం గానూ, నిర్దుష్టంగానూ అంచనా వేసినట్టు"భావ" పరివర్తనలను అంచనా వెయ్యటం సాధ్యంకాదు (పాత ధోరణులు ఒకంతట అంతరించవనీ, అవి ప్రచ్ఛన్నంగా వర్గకలహాలను కొనసాగించి, విప్లవ విఘాతాన్ని కల్గించ యత్నిస్తాయనీ ఈనాడు మనకు స్పష్టంగా, అనుభవం ద్వారా తెలుసు) ఆ దశలో ఉండే భావ చైతన్యాన్ని బట్టి ఆదశను నిర్ణయించటానికి లేదు ఒక సామాజిక వ్యవస్థలో ఉండే ఉత్పత్తి శక్తులన్నీ పూర్తిగా అభివృద్ధి చెందేదాకా ఆ వ్యవస్థ అంతరించదు పాత వ్యవస్థలో నూతన ఉత్పత్తి సంబంధాలకు అవసరమైన భౌతిక పరిస్థితులు పరిపక్వమయినప్పుడే ఉన్నత సంబంధాలు అవతరించవు (ఇది అక్షరాలా నిజంకాదు చీనావంటి అర్ధ వలస దేశంలో సోషలిస్టు విప్లవం జరిగి, విప్లవ ఆర్థిక వ్యవస్థకు అవసరమైన భౌతిక, ఆర్థిక పునాదులు విప్లవంద్వారానే నిర్మించబడ్డాయి)

చరిత్ర కేవలమూ ఆర్థిక పునాదిమీదనే ఆధారపడుతుందని మార్క్స్ అన్నట్టు ఆరోపణలు వచ్చాయి కాని ఈ ఆక్షేపణలు సరికావు చరిత్ర గతికి మూలాధారం ఆర్థిక పునాదికి చెందిన మార్పులే అయినప్పటికీ, దానిపైన వుండే ఉపరితల నిర్మాణానికి ఉండే ప్రభావాన్ని కాదనటానికి లేదు ఆర్థిక పునాదిపై పెరిగే భావజాలం యొక్క ప్రభావం పునాదిపైన కూడా ఉంటుందని మార్క్సిస్టులు ఒప్పుకుంటారు

మార్క్స్ చరిత్రగతి అనివార్యం చేశాడనీ, మానవుల ఆలోచనా ధోరణులు దానిని మార్చలేవన్నాడనీ మరొక ఆరోపణ, అలా అనుకోవటం మార్క్సిస్టు తత్వానికే విరుద్ధం "మానవులు తమ చరిత్రను తాము నిర్మించుకుంటారు కాని తమ ఇష్టం వచ్చినట్టు కాదు పరిస్థితులు వారి చెప్పుచేతలలో ఉండవు గతం తమకు అందించిన పరిస్థితి అధారంతో వారు కృషిచేయాలి "

గతి తార్కిక తత్వం మూలంగా పరిణామవాదం ఆమోదయోగ్యం అయింది డార్విన్‌లాటి శాస్త్రవేత్త ప్రాణి పరిణామాన్ని రుజువు చేశాడు అటు తరవాత కూడా పరిణామాన్ని గురించి

రెండు సిద్ధాంతాలు బయలుదేరాయి పరిణామం విప్లవలక్షణంతో కూడుకున్నదనీ, అది సాఫీగా సాగిపోయేదనీనూ, మార్క్సిస్టులది విప్లవ పరిణామవాదం పరిణామానికీ విప్లవానికీ పొంతన కుదరదన్నది రెండో వాదం

ఈ రెండో వాదంలో ఉన్న పెద్దలోపం ఏమిటంటే అభివృద్ధి క్షయాలు పెంపొందాలంటే వాటి ఉనికిని ఆమోదించాలి ఉన్న లక్షణాలే పరిణామం ద్వారా అభివృద్ధి క్షయాలు పొందుతాయి కొత్త లక్షణాలు పుట్టుకురావటానికి అవకాశం లేదు అభివృద్ధి జరిగేటప్పుడు ఏర్పడే వైరుధ్యాలు ఏర్పడటం ద్వారా విప్లవ పరిణామాలు కలుగుతాయని గతితర్కం స్పష్టం చేస్తుంది

**తర్కమూ, గతితర్కమూ**

జగత్తును గురించి, మనకు వాస్తవమైన జ్ఞానం సంపాదించే అవకాశం ఉన్నదనీ, మన భావాలు భ్రమలు కావనీ, అవి బాహిర వాస్తవాన్ని ప్రతిబింబించగలవనీ, ఆచరణ ద్వారా రుజువు అవుతుంది అయితే, "ఏది సత్యం?" అన్న ప్రశ్న పరిష్కారం కావాలి భావానికీ, వాస్తవానికీ గల సంబంధం వివరించటం అవసరం

"యాంత్రిక" వాదులు వాస్తవానికీ జ్ఞానానికీ తేడా లేదంటారు మన జ్ఞానం సమగ్రం కాకపోతే అందుకు కారణం అందులో కొంతభాగం అలభ్యంగా ఉండటమేనని వారివాదన "శాస్త్రజ్ఞానం ఒకనాటికి సమగ్రజ్ఞానం అవుతుంది " (బెర్ట్‌రాండ్ రసెల్) ప్రాచీన తాత్వికులు అనేకులు జ్ఞానం యొక్క సారాన్ని చేరుకున్నామనే అనుకున్నారు

దీనికి వ్యతిరేకంగా కొందరు జ్ఞానమన్నది సాపేక్షకమంటారు ఎందుకంటే, శాస్త్ర విజ్ఞానం మార్పు చెందుతూ వస్తున్నది భావవాదుల నడిగితే జ్ఞానమే లేదనీ, అంతా మిధ్యేననీ తోసిపారేస్తారు

ఈ ధోరణులన్నీ మానవుడి జ్ఞానానికి ఏదోవిధంగా వర్తించేవే గాని గతితర్కం తెలియని వాళ్ళు అయోమయంలో పడ్డారు పరమంలోసాపేక్షం ఎలా ఉండేదీ, సాపేక్షంలో పరమం ఎలా ఉండేదీ గతితర్కం వివరిస్తుంది శాస్త్రజ్ఞులు ప్రయోగాలు చేసి ప్రతిపాదించిన కొన్ని సూత్రాలు మరింత సున్నితంగా చేసిన ప్రయోగాలద్వారా తప్పుపోయినట్టు స్పష్టమయింది అంత మాత్రాన ఆ పాతసూత్రాలు తప్పుడువి అయిపోవు, ఆ సూత్రాలలో పరమసత్యం గర్భితంగా ఉన్నది ఆ సూత్రాలను సంస్కరించటం ద్వారా ఆ పరమసత్యం పాలు పెరుగుతుంది (ఇది రుజువు చెయ్యటానికి ఎంగెల్స్ "బాయిల్స్‌లా" తీసుకున్నాడు)

న్యూటన్ సిద్ధాంతం ఇందుకు మంచి ఉదాహరణ న్యూటన్ సిద్ధాంతాలు విశ్వమంతటికీ వర్తించినట్టే– పరమ సత్యంలాగే– కనబడ్డాయి కాని వాటినిఐన్‌స్టైన్ సిద్ధాంతం సంస్కరించింది అందువల్ల న్యూటన్ సిద్ధాంతాలలోగల పరమ సత్యం అబద్ధమైపోలేదు ఆ సత్యం ఐన్‌స్టయిన్ సిద్ధాంతంలో మరింతగా పెరిగింది

సాధారణ తర్కానికీ గతితర్కానికీ తేడా ఉన్నది సాధారణ తర్కం వర్గీకరణలకు సంబంధించి ఉంటుంది ఈ వర్గీకరణలు ప్రాథమిక భావాలకు సంబంధించినవి సాధారణ తర్కం వాటిని వేరుపరచి ఉంచటానికి పనికివస్తుంది మామూలు వర్గీకరణల ప్రయోజనం ఉన్నమేరకు

సాధారణ తర్కం ఉపయుక్తమైనదే ఆ మేరలో ఆవర్గీకరణలు పరమమైనవి వాటి మధ్య గల సంబంధాలూ, సంపర్కాలూ గణనలోకి రావు పరిణామ ప్రక్రియలను గురించి తెలుసుకోవటానికి సాధారణ తర్కం పనికిరాదు ప్లెఖనోవ్ అన్నట్లు గతి తర్కంలో సాధారణ తర్కం ఒక ప్రత్యేక అంతర్భాగం సామాన్య గణితానికీ క్లిష్టగణితానికీ ఉండే సంబంధమే సాధారణ తర్కానికీ, గతితర్కానికీ ఉన్నదని ఎంగెల్స్ అన్నాడు

"ఆధునిక భౌతికవాదం గతితర్కంతో కూడినది దానికి శాస్త్రజ్ఞానానికి అతీతమైన తత్వజ్ఞానంతో పనిలేదు" (ఎంగెల్స్) ఆలోచనా విధానానికి సంబంధించిన శాస్త్రాన్నీ, దాని తాలూకు సిద్ధాంతాలనూ తత్వం అనే పక్షంలో గతి తర్కం ఒక తత్వమే

గతితర్కాన్ని కుతర్కానికి ఉపయోగించిన వారున్నారు ఫాసిజం గతి తర్కంమీదనే ఆధారపడిందట రష్యా విప్లవం తరవాత అక్కడ ఏర్పడినది ఫాసిజమేట బూర్జువా మేధావులు ఇలాంటి సిద్ధాంతాలు చాలా లేవదీశారు ఏ సిద్ధాంతమైనా అభివృద్ధికి దోహదం చేస్తూ ముందుకు వచ్చినప్పుడు అభివృద్ధి నిరోధకులు మొదట దాన్ని నిరాకరించటానికి ప్రయత్నిస్తారు అది సాధ్యం కాకపోయేసరికి దాన్ని వక్రీకరించటానికి ప్రయత్నిస్తారు విప్లవం అన్న పదాన్ని నినాదం చేసుకుని, దాన్ని వక్రీకరించటం మనం చూస్తున్నాం వీళ్ళు ఆమోదించే విప్లవాలు ఆకలి చావులకూ, అంతులేని దారిద్ర్యానికీ, ఇతర దేశాలకు అమ్ముడుపోవటానికీ దారితీస్తున్నాయి గతితార్కిక భౌతికవాదం సమస్యలను సృష్టించరాదు పరిష్కరించాలి మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, స్టాలిన్‌లు దాన్ని అలా ఉపయోగించారు

**తాత్విక సంఘర్షణ**

పెట్టుబడిదారీ వ్యవస్థలో మార్పులు జరుగుతున్నకొద్దీ ఆ మార్పులకు అనుగుణంగానే తాత్విక దృక్పథాలు ఏర్పడతాయి మొదట పచ్చి భౌతికవాదులుగా ఉండేపెట్టుబడిదార్లు అభ్యుదయకర పాత్ర వహించి భౌతికవాదానికి కట్టుబడి ఉంటారు తరవాత సామ్రాజ్యవాదం వస్తుంది దానివెంట మతతత్వం ప్రవేశిస్తుంది ఇది ఒకప్పుడు బూర్జువావర్గం నిరసించినదే ఇదే సమయంలో కార్మికులలో చీలికవస్తుంది వారిలో బాగుపడిన వర్గం సామ్రాజ్యవాదంతో రాజీపడుతుంది మరొకవర్గం విప్లవ పంథా చేపడుతుంది చరమదశలో పెట్టుబడిదారీ ఫాసిజమును ఆశ్రయిస్తుంది ప్రోత్సహిస్తుంది

మనదేశంలోకూడా జాతీయోద్యమమప్పుడు దేవుడూ, కులతత్వాలూ ఎక్కడ పోయాయో ఎవరూ గమనించలేదు స్వరాజ్యం గుత్తపెట్టుబడిదార్ల ఒళ్ళో పడగానే మతమూ, దేవుడూ, కులతత్వమూ, సాంఘిక అవినీతి వీరవిహారం సాగించాయి ఫాసిజం దొడ్డిదారిన అమలు జరుగుతున్నది పుస్తకాల నిషేధమూ, అనుమానాలమీద అరెస్టులూ, చెయ్యబోయే నేరాలకు జైలుశిక్షలూ ఫాసిజం యొక్క నగ్నరూపాలే ఈ దశలో కొందరు "మేధావి"వర్గీయులు పెట్టుబడిదారీ పాలనకు బాసటగా ఉండి విప్లవ భావాలనూ, తిరుగుబాటు చర్యలనూ ప్రతిఘటించటం వారి సామాజిక తాత్వికదృష్టికి నిదర్శనం

ఈ తాత్విక వైరుధ్యాలను సమన్వయించే ప్రయత్నం జరిగింది (పరిష్కరించే ప్రయత్నం కాదు) ఎర్న్స్ట్‌మాఖ్ అనే ఆస్ట్రియను భౌతిక శాస్త్రవేత్త, తత్వవేత్త భౌతికవాదానికీ, భావవాదానికీ వైరుధ్యం లేదన్నాడు ఈ దృక్పథాన్ని అవలంబించిన బెర్ట్రాండ్ రసెల్ జగత్తుయొక్క మూల

ద్రవ్యం భౌతికమైనదీకాదు, మానసికమైనదీకాదు, దానినుంచి మనసూ, పదార్థమూ పుట్టాయన్నాడు దీనిని ఆయన "తటస్థ అద్వైతం" అన్నాడు లెనిన్ "మాఖ్" వాదం గురించి చేసిన విమర్శ రసెల్‌కు సూటిగా తగులుతుంది

మాఖ్‌వాదులు తాము భావవాదానికీ, భౌతికవాదానికీ అతీతులమన్న పోజు పెట్టటానికి అష్టకష్టాలు పడ్డారు కాని ఆరెండు వాదాల మధ్య జరిగే సంఘర్షణలో భావ వాదంవైపే మొగ్గుతూ వచ్చారు ఇది మార్క్స్ చెప్పిన పెటీబూర్జువా లక్షణం

మాఖ్‌వాదం సంస్కరణ వాదానికి చాలా సన్నిహితమైనది దానినే మార్క్సిజం అని చెప్పి బ్రిటీషు కార్మికోద్యమంలో ప్రవేశ పెట్టటానికి ప్రయత్నించారు ఇలాటి తాత్విక ధోరణులు ఊబిలోకి తీసుకుపోతాయని లెనిన్ అన్నాడు

గతితార్కిక భౌతికవాదంతో పెట్టుబడిదారీ దశలో కార్మికుల సంఘర్షణ సమస్యలేగాక సామ్యవాద సాంస్కృతిక సమస్యలను కూడా పరిష్కరించవచ్చు శ్రామికవర్గం అధికారం చేజిక్కించుకున్న అనంతరం సాంస్కృతిక రంగంలో ఏర్పడే సమస్యలను విప్లవ తాత్వికవాదం పరిష్కరించగలదు

పెట్టుబడిదారీ సిద్ధాంత ఆచరణలమధ్య సంబంధం ఉండదు పెట్టుబడిదారీలో ఉండే ప్రత్యేక శ్రమవిభజన దానికి కారణం అలాగే దైహిక, మానసిక పరిశ్రమలు వేరు వేరు అరలలో జరుగుతాయి శాస్త్ర విజ్ఞాన రంగంలో కూడా గణితాలూ, భౌతిక శాస్త్రమూ, రసాయనిక శాస్త్రమూ, జీవశాస్త్రమూ, మనోవిజ్ఞాన శాస్త్రమూ, ఇంజనీరింగు మొదలైన శాఖలలో జరిగే కృషి ఆ శాఖలకే పరిమితమై ఉంటుంది ఏ రంగంలో ఏ విషయానికి ప్రాముఖ్యం ఉంటుందనేది పారిశ్రామిక రంగంలో దాని ప్రాముఖ్యాన్ని బట్టి ఉంటుంది ఈ అన్ని వైజ్ఞానిక రంగాల సమిష్టి దృక్పథం ఏర్పడాలంటే ఈ వేరు వేరు విజ్ఞానాల సామాజిక విలువలు శాస్త్రజ్ఞులకు తెలియాలి అణువు బాంబులు తయారుచేసే సాంకేతిక ప్రావీణ్యత కనిపెట్టిన వారు అణుబాంబు ప్రయోగాల ఫలితాన్ని గురించి ఆలోచించలేదనే అనుకోవాలి పెట్టుబడిదారీ సమాజం కల్పించిన ఈ అరలలో శాస్త్రవేత్తలు యాంత్రికంగా, విధిచోదితులలాగా పనిచేస్తారు వెనకటికి కథలో చెప్పినట్టు, ఒక వైజ్ఞానికుడు చచ్చిన సింహానికి ప్రాణం పొయ్యగలనని నిరూపించి దానిచేతిలో చచ్చాడట వాడు పెట్టుబడిదారీ యుగంలో ఉండదగినవాడే

కాని సామ్యవాద సంస్కృతి (గతితార్కిక భౌతిక వాదంతో) సమస్తాన్నీ సమ్యక్ దృష్టితో చూస్తుంది ఉత్పత్తి ప్రణాళికాబద్ధమవుతుంది సిద్ధాంతాలకూ ఆచరణకూ సమన్వయం ఉంటుంది (మావో దృష్టిలో ఆచరణకురాని విజ్ఞానం శుద్ధ దండుగ!) శ్రామికరంగంలోనూ, విజ్ఞానరంగంలోనూ ఒకదాని సహాయంతో ఒకటి అభివృద్ధి చెందాలి

సోషలిస్టు సాహిత్యం కూడా సిద్ధాంతాచరణల సమైక్యతతోనే అభివృద్ధి అవుతుంది దీనికే గోర్కీ సోషలిస్టు వాస్తవికత అని పేరు పెట్టాడు వర్గసమాజములో సాహిత్యం ప్రజాసామాన్యానికి దూరమవుతుంది సోషలిస్టు వ్యవస్థలో ఈ దూరం రద్దవుతుంది విప్లవ రచయితలు బూర్జువావర్గ పక్షం నుంచి శ్రామికుల పక్షానికి వచ్చేస్తారు శ్రామిక వర్గం నుంచే రచయితలు పుట్టుకొస్తారు

భౌతిక వాదాలలో అనేక భేదాలున్నట్టుగానే వాస్తవికతలో గూడా చాలా రకాలున్నాయి సోషలిస్టు వాస్తవికత కానివన్నీ బూర్జువా వ్యక్తివాదాన్ని బలపరిచేవే ఆదిలో బూర్జువా సమాజాభివృద్ధికి తోడ్పడిన బూర్జువా వాస్తవికత రాను రాను వాస్తవికతనుంచి పలాయనంగా పరిణమించింది ఈనాడు "వాస్తవికత" అన్నది సంఘంలోని వైరుధ్యాలను చిత్రించాలి అది గతితర్కాన్ని ఉపయోగించి, సోషలిస్టు వాస్తవికతను చేరుకునేలాగా ఉండాలి

వివిధ శాస్త్రాలమధ్య అడ్డుగోడలు పడిపోయి శాస్త్రజ్ఞానమంతా ఏకాండంగా పునర్నిర్మాణం కావాలి అది మానవులందరి సొత్తు కావాలి ఇది కమ్యూనిస్టు వ్యవస్థయొక్క ఉన్నత దశలలో జరుగుతుంది

కమ్యూనిస్టులకు ధర్మమూ నీతీ అన్నవి ఉండవవి బూర్జువాలు ఆక్షేపిస్తారు దేవుడి ప్రవచనాల లాటి బూర్జువా ధర్మాలనూ, నీతులనూ కమ్యూనిస్టులు ఆమోదించనిమాట నిజమే

మార్క్సిస్టులు వీటినికూడా మిగతా ఆదర్శాలలాగే వర్గ స్వభావం కలవిగా పరిగణిస్తారు బూర్జువా నీతిని బయటపెట్టకుండా ప్రోలిటేరియనులు దాని ప్రభావాన్ని ప్రతిఘటించలేరు కాని ఈ తిరస్కరణకూ పెటీబూర్జువాలు నీతి అవసరంలేదనే వైఖరికి ఎలాటి పోలికాలేదు వర్గపోరాటం మీద ఆధారపడిన సోషలిస్టు ఉద్యమం ఆ వర్గ పోరాటానికి అనుగుణమైన ధర్మాన్నీ, నీతినీ, అవలంబించక తప్పదు వర్గ సమైక్యతా, సమష్టికోసం వ్యష్టిత్యాగాలూ అత్యవసరం విప్లవ చర్యలు చేసేవారిలో ఇది మరింత అవసరం విప్లవ పోరాటం అన్ని దశలలోనూ కార్మిక వర్గ ప్రయోజనమూ, తద్వారా మన భవిష్యత్తూ ఇమిడిఉంటుంది విప్లవ పార్టీ పెటీబూర్జువా వ్యక్తివాదాన్ని సహించలేదన్నది స్పష్టం

పెట్టుబడిదారీ కింద సాగే వర్గ పోరాటంలో ప్రారంభమయే సోషలిస్టు నీతి సామ్యవాద వ్యవస్థలో పూర్తిగా వికసనం పొందుతుంది కాని అది ఆ దశలోనే స్థిరపడిపోక, సోషలిస్టు సమాజం అభివృద్ధి చెందినకొద్దీ సోషలిస్టు "జన వాక్యానుసారం" అభివృద్ధి చెందుతూ వుంటుంది

ఈ పుస్తకంలోని ఉపన్యాసాలు చేసినవాడు డేవిడ్ గెస్ట్, 1911లో పుట్టాడు ఇతను గొప్ప గణిత వేత్తా, తాత్వికుడూనూ, జర్మనీలోనూ, ఇంగ్లండులోనూ చదివాడు 1931లో విద్యార్థి ప్రదర్శనలో పాల్గొని అరెస్టయాడు నిరాహారదీక్ష పట్టి రెండు వారాల అనంతరం విడుదల చేయబడ్డాడు 1937లో ఇతను గణితం బోధించటానికి లెక్చరరుగా చేరాడు కాని త్వరలోనే, స్పెయినులో ఫ్రాంకోకు విరుద్ధంగా పోరాడటానికి వెళుతున్న అంతర్జాతీయదళంలో చేరి, యుద్ధం చేస్తూ చనిపోయాడు అందుచేత ఈ ఉపన్యాసాలు చాలా దశాబ్దాల క్రితంవి అయినప్పటికీ వీటిలో మార్క్సిస్టులు కాగోరేవారు తెలుసుకోదగిన ప్రధాన విషయాలన్నీ ఉన్నాయి అప్పటికీ ఇప్పటికీ ప్రపంచం చాలా మారింది అయినా ఆ మార్పులను అర్థంచేసుకునేటందుకు అవసరమైన సూత్రాలు ఈ పుస్తకంలో ఉన్నాయి

లెక్చర్స్ ఆన్ మార్క్సిస్ట్ ఫిలాసఫీ - డేవిడ్ గెస్ట్,

న్యూ బుక్‌సెంటర్, కలకత్తా, వెలః రు 3/-

ముద్రణః సృజన మాసపత్రిక, నవంబరు 1972

పునర్ముద్రణః నూరవసంచిక, ఫిబ్రవరి,1980

# 11. ఉద్యమలేఖ

ఆంధ్ర దేశాన్ని కబళించిన రిజర్వు పోలీసు, సైనిక దళాల అత్యాచారాలను విప్లవ రచయితల సంఘ అధ్యక్ష, ఉపాధ్యక్షులుగా మేం ఖండిస్తున్నాం పంచసూత్ర పథకాన్ని రుద్దడం కోసం ఇందిరాగాంధీ తన ఆయుధాగారం నుండి చివరి ఆయుధాన్ని తీసికొన్నది ఫలితంగా ఆమె ప్రజాస్వామ్యం అస్తమిస్తున్నది ఎప్పటిలాగే తనదారి సుగమం చేసుకోవడం కోసం ప్రజాస్వామ్య మంత్రోచ్చారణ చేస్తున్నది అంతరంగిక భద్రతా చట్టం కాంగ్రెసేతర వేర్పాటువాదనాయకులను, విద్యార్థులను, కార్మికులను జైల్లో పెట్టడానికి ఎక్కువగా ఉపయోగించబడుతున్నది కర్ఫ్యూలేని దినం లేదు ఈ భూమిపై చీకట్లు వ్యాపించాయి సి ఆర్ పి సైనిక దళాలు విద్యుచ్ఛక్తి కార్మికుల సమ్మెమూలంగా విద్యుచ్ఛక్తికి అంతరాయం ఏర్పడితే, వాళ్ళను వాళ్ళు రక్షించుకోడం కోసం కర్ఫ్యూపెడుతున్నారు ఆంధ్రప్రాంతము అన్ని పట్టణాలలో ముందు హెచ్చరికలేకుండా బుల్లెట్లు, బాయ్‌నెట్లతో ఆందోళనకారులపై దాడులు జరుపుతున్నారు ప్రభుత్వ యంత్రాంగం మృగ్యమైంది తెనాలి, అనంతపురం, నెల్లూరు,విజయవాడ, విశాఖపట్టణం, ఆదోని, అమరావతి, ఒంగోలు సంఘటనలు తూర్పు పాకిస్తాన్‌లో పాక్ దురాగతాలను మరిపిస్తున్నవి ఊగిసలాడుతున్న ముఖ్యమంత్రిని (అప్పటికి-సం) అపఖ్యాతిపాలైన ప్రధానమంత్రిని నిలబెట్టటం కోసం ఆంధ్రప్రాంతం సైనిక వలస ప్రాంతంగా మార్చబడింది

సిసలైన సమైక్యత సాధించడానికి ఆంధ్రప్రదేశ్‌లోని రెండు ప్రాంతాలలో ఐక్యతాభావం ఏనాడూ బలంగాలేదు ప్రభుత్వం విభజించి పాలించే పద్ధతిలో కావాలనే వారినలా తెలివిగా దూరంగా ఉంచింది ఒకరిపై ఒకరు కక్షసాధించుకోవడం కోసం ప్రాంతీయ అసమానతలు స్వార్థపరవర్గాలచే ఉపయోగించుకోబడుతున్నవి ప్రపంచానికి ఈ రోజు కనిపిస్తున్నది కృత్రిమమైన పరిపాలనా ఐక్యత- ఏరకంగా మొదలైనా, దాని ప్రారంభకుల ఆశయాలేవైనా ప్రస్తుత రాష్ట్ర విభజనోద్యమం వేనవేలసంఖ్యలో పురుషులను, స్త్రీలను, యువకులను తనలో కలుపుకుంటూ ప్రజాపోరాటంగా మారింది వేర్పాటు ప్రజల మూల సమస్యలకు నిజమైన పరిష్కారం కాకపోవచ్చు కాని మేము ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహిస్తున్న విద్యార్థులు, నిరుద్యోగులతో నిలబడతాం అదే సమయంలో మన యువకిశోరాల హత్యల నెత్తురుటేర్లనుండి పాలకవర్గం దాని తొత్తులు రాజకీయ ఉద్దేశ్యాలను సాధించుకోవాలనే విద్రోహంనుండి జాగ్రత్త పడాలని హెచ్చరిస్తున్నాం-చూడండి మొన్ననే దీనికి ఉదాహరణగా సమ్మెచేస్త ్న విద్యుచ్ఛక్తి కార్మికుల నాయకులనబడేవారిపై వత్తిడి తేబడగానే లొంగిపోయారు

అందుకే 1969లో తెలంగాణాలో దగాజరిగినట్టే మళ్ళీ యీ ప్రజాద్రోహులచే మోసపోరాదని ప్రజలను హెచ్చరిస్తున్నాం- ప్రస్తుత ప్రభుత్వ వ్యతిరేక పాక్షిక పోరాటం దీర్ఘకాల ప్రజాపోరాటంలోకలిసి ఈ కథకంతకు కూడా కారణభూతమైన వ్యవస్థను కూలద్రోసేవరకూ విశ్రమించవద్దని ప్రజలకు మేం పిలుపు ఇస్తున్నాం

విప్లవం వర్థిల్లాలి!

విప్లవ రచయితల సంఘం వర్ధిల్లాలి!!

ముద్రణ సృజన మాసపత్రిక, ఫిబ్రవరి, 1973

# 12. ప్రజల సమస్యలు

ఇలాటి పేరుతో ఒక పత్రిక ప్రారంభంకావటం కాల ప్రభావాన్ని సూచిస్తుంది న్యాయంగా ప్రజల సమస్యలను గురించి ఆలోచించటానికి ప్రభుత్వం ఉన్నది అది ప్రజలు ఎన్నుకున్న ప్రభుత్వమే కూడానూ

కాని స్వాతంత్ర్యానంతరం మనకు వచ్చిన ప్రభుత్వాలకు ప్రజలు పెద్దపీడగా తయారయారు–లంజకు పిల్లల్లాగా, పదవులకోసం కుమ్ములాడుకోవటమూ, ప్రాంతీయ గూండాలను అచ్చుబోసి ప్రజలమీద వదలటమూ, జనంలో అశాంతి కలిగినప్పుడు వాళ్ళమీద కాల్పులు జరిపి "లా అండ్ ఆర్డర్" నిలబెట్టటమూ తప్ప ప్రభుత్వాలు ప్రజలకు ఒరగబెట్టినది ఏదీ కానరాదు ఈ పాతికేళ్ళ పై చిల్లరకాలంలో ప్రజల సమస్యలు పదింతలయాయి డబ్బు విలువ పదింతలు పడిపోయింది, అవినీతి పదింతలు పెరిగింది ప్రజాక్షేమం పదింతలు తరిగింది

నిజానికి తాతా బిర్లాలు లగాయతు మావీధుల్లో తిరిగే ముసలి ముష్టివాడి దాకా అందరూ ప్రజలే అందరికీ సమస్యలుంటాయి కోట్ల కొద్దీ ధనం ఉన్నవాళ్ళకు సమస్యలుండవనుకోవటం పొరపాటు అయితే వాళ్ళ సమస్యలు పరిష్కారం అయేమార్గాలు వారిచేతిలో ఉన్నాయి పరిపాలనా యంత్రాంగమే వారిచేతిలో ఉన్నది లేని పక్షంలో బీదవాళ్ళు బికార్లు అయే ఈ దేశంలో ధనికులు మరింత ధనికులు ఎలా అయారు? వారి ఎస్టేట్లు కోట్లమీద కోట్లు ఎలా తొడుక్కుంటున్నాయి?

సాధారణంగా సామాజిక మానవుడికి ఉండదగిన తిండీ, బట్టా, ఇల్లూ, మందులూ, ఆర్జనా, శాంతీ వగైరా సమస్యలన్నీ ఈ దేశంలో జనబాహుళ్యాన్ని తీవ్రంగా బాధిస్తూ వస్తున్నాయి వీటిని పరిష్కరించే ఇచ్ఛా, శక్తీ కూడ ప్రభుత్వానికి ఉన్నట్టు కనబడదు

అన్ని సమస్యలకూ మూల సమస్యా, కీలక సమస్యా డబ్బు, డబ్బుసంపాదించటానికి చాలా మార్గాలున్నాయి శరీర శ్రమ చెయ్యవచ్చు, ఆఫీసులో కూర్చుని కాగితాలమీద రాయవచ్చు, క్లాసులో పాఠాలు చెప్పవచ్చు కుర్చీలమీద కూర్చుని నజర్లు పుచ్చుకోవచ్చు, వ్యాపారాలు చెయ్యవచ్చు, పరిశ్రమలను నడపవచ్చు ఇవి ఈ వరసలో ఎక్కువ ధనాన్ని సంపాదిస్తాయి కాని వీటిలో కిందివి దారిద్ర్యాన్ని తీర్చవు, పైవి జన బాహుళ్యానికి అందుబాటులో ఉండవు అందుకే నిరుద్యోగ సమస్యకన్న కూడ విస్తృతంగా ఉన్నది దారిద్ర్య సమస్య 'నరుల చెమటను తడిసిమూలంధనం పంటలు పండవలెనోయ్' అని మహాకవి అన్నాడుగాని, నరుల చెమటకు దారిద్ర్యాన్ని పోగొట్టే శక్తి లేదు ఈ దేశంలో అందుకే ఈ దేశంలో 52 శాతం మంది దారిద్ర్యంలో పూర్తిగా మునిగి ఉన్నారు

పెద్దపారిశ్రామికుల లాభాలు రాజకీయ విషయం అయినట్టూ, ప్రజల దారిద్ర్యం వ్యష్టి విషయం అయినట్టూ చాలామంది అపోహపడతారు 'మొద్దులాగా ఉన్నావు, అడుక్కుని తినకపోతే పనిచేసుకోలేవూ?" అంటాం అబిచ్చగాడు సోమరేకావచ్చు కాని వాడికి పని చూపించటం వాస్తవానికి రాజకీయ సమస్యే

అత్యధిక సంఖ్యాకులకు పనులు ఇచ్చేవాళ్ళు ప్రైవేటు వ్యక్తులు–వ్యాపారులూ, పారిశ్రామికులూ మొదలైన వాళ్ళు నిరుద్యోగ సమస్య పరిష్కరించటం వారి పనికాదు, వారికి కావలసినది లాభాలు వారిలాభాలు గారంటీ చెయ్యటం కూడ ప్రభుత్వం బాధ్యతలాగే కనిపిస్తుంది లాభాలు రాక కట్టేసిన పరిశ్రమలను ప్రభుత్వం తీసుకోవటమూ కొన్ని పరిశ్రమలకూ పారిశ్రామికులకూ రకరకాల ఆర్థిక సౌకర్యాలు కలిగించటమూ మనం చూస్తూనే ఉన్నాం

ప్రజల ఆర్థిక సమస్యను పరిష్కరించలేని ప్రభుత్వం తమసమస్యలను వాళ్ళు తమకు చేతనైనట్టు పరిష్కరించుకోనివ్వాలి అంటే జేబులు కత్తిరించే వాళ్ళనూ, దోపిడీచేసే వాళ్ళనూ, ఇతర "నేరస్తులనూ" నేరాలు చెయ్యనివ్వాలి అలా చేయని పక్షంలో తిరుగుబాట్లూ బలప్రయోగాలూ మారణహోమాలూ తప్పవు ఈ పరిస్థితి ఈనాడు దేశంలో ఉండటానికి కారణం ప్రభుత్వం ప్రజల సమస్యలను పరిష్కరించక పోవటం–లేదా పరిష్కరించే శక్తి లేనిది కావటం అటువంటి ప్రభుత్వం సోషలిజం తెస్తాననటం కన్న వంచనలేదు

సమాజంలో వర్గాలుండటం అందరికీ తెలుసు ఒక వర్గం యొక్క అవసరాలు మరొక వర్గం అవసరాలకు అడ్డంగా ఉన్నప్పుడే వర్గవైషమ్యం ఉంటుంది వర్గవైషమ్యం వర్గపోరాటానికి దారి తీస్తుందని పరమశుంఠలు కూడా గ్రహించగలరు వర్గపోరాటాలు రోజు రోజుకూ పెరిగిపోయే సమాజం దానికదే హింసా సమాజం వర్గశత్రువులను చంపటమూ, పోలీసులనూ, మిలటరీని జనం మీద ప్రయోగించి, విచక్షణారహితంగా కాల్పులూ, ఇళ్ళుకొల్లగొట్టడాలూ, ఆడవాళ్ళను చెరచటాలూ, చేయించటమూ జరిగినదాకా అది అహింసాసమాజం అనుకోవటం పొరపాటు

విప్లవాలు ఎలా వస్తాయో ఇప్పుడు అందరికీ తెలుసు పీడిత ప్రజలు విప్లవం చేస్తారు బైరాగి చిట్కాలు ఏవీ పనిచెయ్యనప్పుడు శస్త్రచికిత్స తప్పని సరి అవుతుంది బానిస సమాజంలో సైతం, బానిసల శ్రమను అమిత క్రూరంగా దోచుకునే యజమానులు బానిసలను తమ ఆస్తిగాభావించి, వాళ్ళ తిండి తిప్పలు గురించీ, ఆరోగ్యం గురించీ, శ్రద్ధ తీసుకునేవారు బానిస సమాజం కన్న భయంకరమైన ఈనాటి మన "ప్రజాతంత్రం"లో ప్రజలు ఎవరి సమస్యాకాదు వాళ్ళ సమస్యలకు ప్రభుత్వం పరిష్కారం చూపించదు ప్రజలు తమ సమస్యలను తామే పరిష్కరించుకునే మార్గాలన్నీ చట్టవిరుద్ధమైనవీ, తుపాకీలతో ఎదుర్కోవలసినవీను

ఈ సమాజంలో ప్రజా బాహుళ్యం ఏమీ చెయ్యకుండానే సంఘద్రోహులు వాళ్ళు చేతులు కట్టుకు కూర్చుంటే జీవితంలో నలిగి చస్తారు అలా చావటానికి ఎదురు తిరిగితే పోలీసులు కాల్చిచంపుతారు రాజకీయ–సాంఘిక విప్లవం తప్పమరొక విముక్తి మార్గం లేదు

ప్రజలు విప్లవ మార్గంచే పట్టటానికి ఒకే అడ్డంకి ఉన్నట్టుకనిపిస్తుంది వాళ్ళలో తగినంత రాజకీయ చైతన్యం లేకపోవటం, అనాదిగా మనవాళ్ళు విధినీ, దేవుణ్ణీ నమ్ముకోవటమూ, ఐహిక భౌతిక దృష్టిని తక్కువచేసి చూడటమూ, కడుపునిండా తిండీ, సంసారసుఖమూ, ఇతర భౌతిక సుఖాలూ, పాపభూయిష్టమైనవనినమ్మటమూ, ప్రజాతంత్రం ఎలా ఉంటుందో తెలియకపోవటమూ, మొదలైన వన్నీ పాలకవర్గానికి పనికి వస్తున్నాయి అందుకే మన పాలకులు ప్రజాస్వామ్యం పేరిట పచ్చి ధన స్వామ్యాన్ని అమలు చేస్తూ, దాన్ని కాపాడటానికి

అంగుళం అంగుళమే సాధిస్తున్నామనీ, మన ప్రభుత్వం ఫాసిస్టుచర్యలు తీసుకోవటమన్నది దుర్మార్గుల కల్పన అనీ, అనేక వేలమందిని చార్జిషీట్లూ విచారణలూ, లేకుండా జైళ్ళలో ఉన్న వాళ్ళ మారణహోమం అభూత కల్పన అనీ నమ్మేవాళ్ళు ఈ దేశంలో లక్షల సంఖ్యలో దొరకరా! వారికి కనువిప్పు కలిగించటం మాటలా?

అసలు అంతా దేవుడిమీదా, కర్మను బట్టీ జరుగుతున్నదనుకునే వాళ్ళే ఈ 'పుణ్యభూమి'లో కోటానుకోట్లున్నారు వాళ్ళు ప్రభుత్వాలనూ, పాలకులనూ తప్పు పట్టేదాకా రావటానికే కొన్ని యజ్ఞాలు చేసినంత ప్రయత్నం కావాలి దీన్ని అర్థం చేసుకోవచ్చు నిద్ర మాత్రలకు, నల్లమందులకూ ఏవో విరుగుళ్ళు లేక పోలేదు

కాని రాజకీయాలు తెలిసివాళ్ళూ, రాజకీయ సంఘటనలను అర్థం చేసుకున్న వాళ్ళూ, కమ్యూనిస్టు వాసనలు వెదజల్లే వాళ్ళూ, మార్క్సిస్టు అవగాహనలు గలవాళ్ళూ సైతం ఎప్పటికప్పుడు ఏదోచూసి కనువిప్పు కలిగి నట్టుగా మాట్లాడతారు కళ్ళు మూసుకున్న వాళ్ళకేగదా కనువిప్పు కలగటమంటూ ఉండేది?

"నక్సలైట్ల ముసుగులో విప్లవ వ్యతిరేకులు కూడా చేరారటగా?" ఎందుకు చేరరూ? వాళ్ళు అలాంటి అవకాశాన్ని ఎందుకు వదులుకుంటారూ? 'పట్టుబడిన వాళ్ళను హతం చేసి పోరాటంలో మరణించారంటున్నారటగా?' ఇది ఇవాళ కొత్తా? 1949-50 లో జరగలేదా? ఆ ప్రభుత్వం కాదా ఇది? ఆ పోలీసులు కారా వీళ్ళు?

రాజకీయ మేధావులమనుకునే వాళ్ళు ఉద్యమాలను చూడగలరుగాని వాటి వెనక ఉన్న (లేక లేని) రాజకీయాలను చూడలేరు తెలంగాణా పోరాటమప్పుడు వాళ్ళు కమ్యూనిస్టుల హత్యా కాండ చూశారు–ఇప్పుడు నక్సలైట్ల హత్యాకాండ చూచినట్టే ఈ దేశంలో శాంతి అహింసలకు అవకాశం లేకుండా చేస్తున్నది ప్రభుత్వమన్న సంగతి గ్రహించలేని వాడికి రాజకీయాలు తెలియవని నేను దృఢంగా నమ్ముతాను

మనదేశంలో విప్లవ జ్వాలలురేగాయని ఒప్పుకునే వాళ్ళు అల్పసంఖ్యాకులు వాళ్ళలో కూడ చాలామంది "నక్సల్బరీ చల్లబడింది శ్రీకాకుళం చప్పబడింది ఇంక విప్లవం ఏమిటి? అంతా అయిపోయింది" అనేవాళ్ళున్నారు విప్లవాలు విమానాశ్రయం నుంచి బయలుదేరి గమ్యాన్ని చేరే విమానాలు కావని వారికి తెలీదు విప్లవ పరిస్థితి నానాటికీ తీవ్రమవుతున్నదనీ, దాన్ని సరిచేసే ఉద్దేశంగాని శక్తిగాని ప్రభుత్వానికి లేదని గ్రహించిన వారెవరూ విప్లవం వెనక్కిపోయిందని అనరు విప్లవపు తిరుగుబాట్లను ప్రభుత్వం ఎదుర్కొంటున్న పద్ధతులను అర్థం చేసుకోగల వారెవరూ ఈ ప్రభుత్వం విప్లవాన్ని "అనవసరం" చేస్తుందని పొరపాటున కూడా అనుకోరు మన ప్రభుత్వం విప్లవ సాహిత్య స్వేచ్ఛను కూడా అరికట్టేటంత అదురులో ఉన్నది

మనదేశానికి రాజకీయ దిగ్గజాల కింద చలామణి అయిన రాజగోపాలా చారివంటి వాళ్ళు కొందరు అమెరికానూ, అక్కడి జీవిత విధానాన్నీ, రాజకీయాలనూ ఆకాశాని కెత్తారు వియత్నాం వంటి బక్కదేశం మీద అమెరికా అమ్మశక్తిలాగా విరుచుకు పడటాన్ని వాళ్ళుసిగ్గు పడలేదు హత్యలూ, స్త్రీలను చెరచటమూ దారిదోపిడీలూ మొదలైన నేరాలలోనూ, మానసిక వ్యాధులకూ

అన్ని దేశాలను మించిన అమెరికాను వీరుభళీ అనీ మెచ్చుకుంటె, వీరిని భళీ అన్న ఘరానా పత్రిక లున్నాయి  అమెరికాలో పెట్టుబడిదారీ స్వభావానికీ, రాజకీయ కుట్రలకూ, అండర్ గ్రౌండుకూ, రాజకీయాలకూగల సంబంధాలను వివరిస్తూ కట్టుకు పోయినన్ని పుస్తకాలు వచ్చాయి  నిక్సన్‌కు పూర్వం అధ్యక్షుడుగా ఉండిన జాన్సన్ తన నేరాన్ని మీదవేసుకున్నవాడికి మిలియన్ డాలర్లు ఇస్తానన్న సంగతి పుస్తకంలోకి ఎక్కింది  (ఆపుస్తకం రాసిన వాడిమీద జాన్సన్ పరువు నష్టందావా అయినా వెయ్యలేదుట)  నిక్సన్ ఏనాడో రాజకీయ నీచుడుగా అమెరికాలోనే ప్రసిద్ధి పొందాడు  'పాత నిక్సన్ పోయాడు  నేను కొత్త నిక్సన్‌ను' అని చెప్పుకుని ఆ ప్రబుద్ధుడు రాజకీయాలలో ప్రవేశించి ప్రెసిడెంటు అయాడు  వాటర్ గేట్ చాకిరేవు ప్రారంభమై మైలబయట పడినాక కూడా 'పాపం, నిక్సన్ ఏపాపమూ ఎరిగి ఉండకపోవచ్చు' అనేవాళ్ళు అన్ని దేశాలలోనూ కనిపిస్తున్నారు  వారికి కూడ కనువిప్పు కాక తప్పదు

ఇదే సందర్భంలో మరొక కనుమూత కానవస్తుంది  అమెరికా రాజకీయాలు స్వతహాగా స్వచ్ఛమైనట్లూ, కొద్దిమంది 'దుండగీళ్ళు" నిక్సన్ చుట్టూ చేరి ఆ రాజకీయాలను కశ్మలం చేసినట్టూ కొందరు భావిస్తున్నారు  ధనిక స్వామ్యం మార్క్సిస్టు దృక్పధంతో అర్థం చేసుకున్న వాడికి ఇండియాలో జరిగేవి గాని, ఇతర దేశాలలో జరిగేవి గాని ఏవీ ఆశ్చర్యాన్నీ, కనువిప్పునూ కలిగించ నవసరం లేదు  కుట్రలూ, హత్యలూ, క్రూరత్వమూ, పైశాచికత్వమూ ధనికుల అభ్యుదయానికి పునాది  దీనికి మినహాయింపు అంటూ లేదు  ఈ విషయం మార్క్సిజం ద్వారా తెలుసుకోలేని వాళ్ళు కనీసం రాచకొండ విశ్వనాధ శాస్త్రి రచనలు చదివి అయినా వంట బట్టించుకోవచ్చు  కనీసం అదికూడా జరుగుతున్నట్టు కనబడదు  మనలో చాలా మంది రాజకీయ విజ్ఞులకన్న మందుల భీముడికి జీవిత సత్యాలు బాగా తెలిసి ఉండటం ఆశ్చర్యం కదా!

ముద్రణ ప్రజాసమస్యలు, పక్షపత్రిక 1-6-1973

# 14. నాకు మార్క్సిస్టు దృక్పధం ఎలా అలవడింది?

ఇటువంటి ప్రశ్నకు స్పష్టమైన సమాధానం చెప్పటం దాదాపు అసాధ్యం  ఒకడు గాయకుడుగాని, కవిగాని, చిత్రకారుడుగాని, మరొక కళలో ప్రవీణుడుగాని కావటానికి వాడిలో కొంత సహజ ప్రతిభ ఉంటుంది  మార్క్సిస్టు కావటానికి అలాటిది కారణం అయే అవకాశం లేదు  జీవితానుభవమూ, దృక్పధమూ, పరిజ్ఞానమూ కలిసివస్తేనేగాని ఎవరూ మార్క్సిస్టు కాలేరు  ఇవి నా విషయంలో ఏ విధంగా పనిచేసినదీ చెప్పుకోవచ్చు

నేను తెనాలిలో పుట్టి పెరిగాను  తెనాలి పెద్ద నగరం ఏమీ కాదు  అందుచేత నేను నగరవాసిని కాదు  అయినా నాకు పల్లెటూళ్ళలో ఆచారాలూ, అలవాట్లూ అవమానకర మనిపించేవి  నా దగ్గర బంధువు లందరూ పల్లెటూళ్ళలో ఉండేవారు  నేను ఆ గ్రామాలకు తరచు వెళ్ళేవాణ్ణి  అక్కడి సాంఘిక ఆచారాలూ, పద్ధతులూ నాకు ఆశ్చర్యమూ, అసహ్యమూ కలిగించేవి

నేను అయిదేళ్ళవాణ్ణి అయి ఉండగా మాపెత్తండ్రి వెంట వాళ్ళ గ్రామానికి కాలినడకన బయలుదేరాను రోడ్డులేదు పొలాల గట్లమీదుగా నడిచాం దారిలో కొందరు మనుషులు ఎదురైనప్పుడు మాపెత్తండ్రి, "ఒరే, తొలుగు!" అనేవాడు అవతలివాడు గట్టుదిగి దూరంగా వెళ్ళేవాడు ఇది నాకు చాలా ఘోరంగా కనిపించింది అస్పృశ్యతను ప్రత్యక్షంగా చూడటం అదే నాకు మొదటి అనుభవం నేను నా జీవితంలో ఎన్నడూ ఒక మనిషికి దూరంగా పోలేదు ఇంకొకర్ని పొమ్మనలేదు

మరికొంచెం పెద్దవాణ్ణి అయ్యాక పదహారో ఏట అని జ్ఞాపకం– నేను మరొక పల్లెటూరిలో ఉండగా ఆ వూరికి ఒక వేశ్య వచ్చిందనీ, ఆమె ఆధ్యాత్మికరామాయణ కీర్తనలు పాడుతుందనీ తెలిసింది నాకా పాటలు చాలా ఇష్టం నేను పోదామనుకునేసరికి నాకు తెలిసిన వాళ్ళందరూ నిర్ఘాంతపోయి, నన్ను మందలించి, పోకుండా చేశారు నాకు పట్టరాని కోపం వచ్చింది వాళ్ళందరూ కూపస్థ మండూకాలలాగా కనిపించారు కాని నేను ఏమీ చేయలేక పోయాను

ఒక చిన్న బస్తీలో పెరిగిన కారణం చేతనే నాకు పల్లెటూరిలో జీవితం అంధకారమయం అనిపించింది నేను ఈ పల్లెటూరి ప్రమాణాలను ఏనాడూ ఆమోదించినట్టు గుర్తురావటం లేదు నా ఎనిమిదో ఏట ఒక వేసవి మా అన్నగారివద్ద ఒక గ్రామంలో గడిపాను ఆ గ్రామంలో మాకు ఎవరూలేరు నేను అందరి ఇళ్ళకూ వెళ్ళి దాహం అయితే మంచినీళ్ళు అడిగేవాణ్ణి "మా ఇంటిలో మంచినీళ్ళు తాగుతావా, నాయనా?" అని ఆడవాళ్ళు ఆశ్చర్య పడేవాళ్ళు మంచినీళ్ళలో మజ్జిగ చుక్కవేసి ఇస్తామంటే నాకు కోపం వచ్చేది నా పధ్నాలుగో ఏట మాచెల్లెలిని పల్లెటూరు ఇస్తే, పల్లెటూరివ్వటం నాకు ఇష్టంలేక, ముహూర్తం చూడకుండా దూరంగా వెళ్ళి పడుకొన్నాను

పల్లెటూరి భౌతిక జీవితం గురించి నా కెప్పుడూ పేచీలేదు పేదరికం అంటే అసహ్యంలేదు నాకు ఇళ్ళకన్నా పాకలంటేనే ఎక్కువ ఇష్టంగా ఉండేది దారిద్ర్యం అంటేనే మంటగా ఉండేది నీరకావి బట్టలంటే అసహ్యం లేదు అనారోగ్యమంటేనే మంట పల్లెటూరి "బుద్ధులు" అసహ్యమైనా, అక్కడి వాతావరణం బాగుండేది

కులాలను గురించి గూడా నాకు పట్టింపు ఉండేదికాదు మధ్యతరగతికి చెందిన వాళ్ళు ఏ కులం వాళ్ళయినా నాకు ఒకటిగానే ఉండేవాళ్ళు దారిద్ర్యం ఓడుతూ కనిపించేవాళ్ళే నాకు వేరే రకం మనుషులుగా కనబడేవాళ్ళు వాళ్ళు బ్రాహ్మలే అయినా కూడా

ఈ మనస్తత్వం నా విశ్వాసాలకూ, ఆలోచనలకూ, రచనలకూ పునాదిగా పనికివచ్చింది

చాలామంది దిగువ మధ్యతరగతివాళ్ళలాగే నాకు రాజకీయాలంటే ఏవగింపు ఉండేది కాని నా పదకొండో ఏట జరిగిన సహాయ నిరాకరణోద్యమం నన్ను ఆకర్షించింది ఆ వయసులో నాలో నిజమైన రాజకీయ చైతన్యం ఉండటం అసంభవం నన్ను ఆకర్షించినదేమంటే, మా ఊళ్ళో ఆ సమయంలో పెట్టిన జాతీయ పాఠశాలలో చేతి పనులు నేర్పేవారు నాకు అవి చాలా బాగా ఉన్నట్టు అనిపించింది నేను స్కూలు మానేసి జాతీయ పాఠశాలలో చేరుతానంటే పెద్దవాళ్ళు అభ్యంతరం చెప్పలేదు గాని కొన్నాళ్ళు ఆగి చూడమన్నారు ఈ లోపల ఆ పాఠశాల మూసేశారు

అటు తరవాత నడిచిన ఉద్యమాలు-కాంగ్రెసు ఉద్యమాలు-నాకు అవాస్తవికంగా కనబడ్డాయి నేను హింసావాదిని కాకపోయినా బెంగాలు టెరరిస్టులే నిజమైన రాజకీయ వాదులనిపించింది దానికి తోడు నాసాటివారిలో 'టెరరిస్టు'లను గురించి ఆక్షేపించిన వారెవరూలేరు శాసనోల్లంఘనలూ, ఉప్పువండి జైళ్ళకు పోవటమూ, తాటిచెట్లు నరికి ఎరస్టు కావటమూ, "మేము కోర్టులను గుర్తించం" అనటం, నాకు ఫార్సుగా కనిపించింది, రాజకీయోద్యమంగా కనిపించలేదు "స్వరాజ్యం" అన్నందుకు జైళ్ళలో పెట్టిన బ్రిటిషు అధికారులు గూడా మూఢులుగానే కనిపించారు అంతా ఏదో ఆటలాగుంది-లాఠీచార్జీలు తలలు బద్దలు కావటం తప్ప

నేను హేతువాదిని కావటానికి కారణం చిన్నతనంలోనే తండ్రీ తల్లీ పోవటం కావచ్చు సాధారణంగా గుడ్డి నమ్మకాలు సన్నిహితులనుంచి సంక్రమిస్తాయి దూరస్థులు చెప్పే మాటలు అంత తేలికగా మింగుడు పడక పోవచ్చు ఏమయినా సైన్స్ విద్యార్థిని కావటం నాలో ఉండిన హేతువాదానికి బలం వచ్చింది నా కున్న శాస్త్రజ్ఞానం అంతా కలిపి మిల్లి గరిటెడు కూడా ఉండదు కాని శాస్త్రీయ దృక్పథం నాకు చాలా మేలు చేసింది సంఘసంస్కరణ విషయంలో వీరేశలింగంగారి వాదాలు గాని, వ్యావహారిక భాష విషయంలో గిడుగు రామమూర్తిగారి వాదాలుగాని సరిఅయినదని గ్రహించటానికీ, ఆమోదించటానికీ నాకు ఏమాత్రమూ సంకోచం కలగలేదు

ఎవరు ఏమనుకుంటారోనని నాకు తప్పుగా తోచిన పనులు చెయ్యవలసిన పరిస్థితి నాకు లేకపోయింది నేను అంతవరకు స్వతంత్రుణ్ణే అనేక విషయాలలో నేను "తిరుగుబాటు" చేశాను అందులో నేను పెద్ద సాహసం కూడా ప్రదర్శించలేదు మా బంధువులలో ఒకామె వితంతు వివాహం చేసుకొన్నది ఆమె తల్లి ఆమెను రప్పించి, పగలల్లా బయటి పాకలో ఉంచి, పగలు అక్కడే అన్నం పెట్టేది ఇటువంటి మూఢత్వంపట్ల నాకు అసహనం జాస్తి నేను ఆమెను మా ఇంటికి పిలిచి, నా పక్కనే భోజనం పెట్టి పంపాను నన్ను ఎవరూ హత్యచేయలేదని రూఢిచేసి ఆమెను తల్లి ఇంట్లోకి చేర్చింది

అలాగే జంఝంతీసి పారేసి తద్దినాలు పెట్టడం మానేసినప్పుడు నన్నెవరూ హత్య చెయ్యలేదు మనం ఏవో జీవిత విధానాలమధ్య పుట్టి పెరుగుతాం అది తప్పదు కాని ఆవిధానాలు నిరర్థకమని తెలిసినాక వాటిని విసర్జించకపోవటం ఆత్మద్రోహమని నాకు మొదటినుంచీ నమ్మకం

నాకు ఆవేశాలు చాలా తక్కువ ఆవేశాలకు తేలికగా గురి అయేవాడు బుద్ధిని పదునుగా ఉంచుకోలేడు ఆవేశం లేనిదే మతపిచ్చి కలగదు నాకు మతోన్మాదుల పట్ల సానుభూతిలేదు కమ్యూనిస్టు పార్టీ అవతరించినప్పుడు కమ్యూనిస్టులలోనూ, కమ్యూనిస్టు వ్యతిరేకులలోనూ కూడా నాకు ఆవేశం నచ్చేదికాదు వాస్తవ పరిస్థితులను పరిగణించకుండా సిద్ధాంతాలు ఏకరువుపెట్టేవాళ్ళు ఒకరకం పిచ్చి వాళ్ళలాగే కనిపించేవాళ్ళు

తెనాలిలో నెలకు 250 రూపాయల నష్టంమీద నడిచే ఒక ప్రెస్‌లో కమ్యూనిస్టులు సమ్మె తెచ్చిపెట్టారు ప్రెస్ వాళ్ళ తప్పు లేకపోలేదు రోజుకు ఆరుగంటలైనా పని లేని ఆ ప్రెస్‌లో

పనివాడు పదినిమిషాలు ఆలస్యంగా వస్తే ఒక గంట జీతం విరగకోస్తామనీ, ఒక పూట రాకపోతే రోజల్లా రానట్టు పరిగణిస్తామనీ చెత్తరూలు పెట్టారు దొందూ దొందే!

నిజానికి 1942లో మార్క్సు రాసిన "కాపిటల్" చదివినదాకా నాకు కమ్యూనిజముకు ఆధార మేమిటో తెలియదు అంతదాకా నా దృష్టిలో కమ్యూనిజం అంటే ఒకవేలం వెర్రి మాత్రమే నాకు కమ్యూనిస్టులను గురించి తెలుసుకోవాలని కోరిక కలగటానికి కారణం, ఎవరో మిత్రుడు మాటల సందర్భంలో, "చూడగా కమ్యూనిస్టుల పద్ధతే సరిగా ఉన్నట్టు కనిపిస్తుంది" అన్నాడు నిర్వికారంగా అతను బుద్ధి ఉపయోగించి చెప్పిన ఈ మాట నామీద బండెడు ప్రచారంకన్న ఎక్కువగా పనిచేసింది దొరికిన మార్క్సిస్టు సాహిత్యం చదివాను "పీపుల్స్ వార్" చదివేవాణ్ణి భవిష్యత్తు మార్క్సిజంకే ఉన్నట్టు నాకు నమ్మకం కుదిరింది

నాలో ఈ మార్పు చూసి కొందరు మిత్రులు, "ఈ కమ్యూనిస్టులను నువు ఎరుగవు వీళ్ళు వట్టి లఫంగులు" అన్నారు

"వీళ్ళు మంచివాళ్ళు కాకపోతే మంచివాళ్ళు వస్తారు కమ్యూనిజం సరిఅయినదే" అని సమాధానం చెప్పాను

ఈ రకం వాదం నాకు చాలాకాలంగా తెలుసు అందులో ఉన్న తిరుగుడు ఏమిటంటే, నువు సమర్థించదలచినప్పుడు సిద్ధాంతాన్ని పొగుడు తిట్టదలచు కున్నప్పుడు వ్యక్తులను తిట్టు! చాలా తేలిక పద్ధతి చాలామంది మీద పనిచేస్తుంది కూడా కాంగ్రెసులో లఫంగులు లేరా? వాళ్ళను బట్టి కాంగ్రెసు సిద్ధాంతాలను గురించి నేను ఒక కధరాస్తే "భారతి" పత్రిక తిప్పిపంపించింది దాన్ని శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తమ "ప్రబుద్ధాంధ్ర"లో వేసుకున్నారు ఇది 1935నాటి మాట అప్పటికి తెనాలిలో కమ్యూనిస్టులున్నట్టు కూడా నాకు తెలీదు

నేను వాతావరణాన్ని బట్టి కమ్యూనిస్టు అభిమానిని కాలేదు కమ్యూనిజముకే భవిష్యత్తు ఉన్నట్లు నేను నిశ్చయించుకున్న సమయంలో నా చుట్టుపక్కల కమ్యూనిస్టు అభిమానులుగాని, కమ్యూనిస్టులుగాని లేరు నేనప్పుడు ఎక్కడో సిమ్లాలో ఉంటున్నాను, యుద్ధప్రచారం చేసే సంస్థలో వాతావరణ ప్రభావంతో కొన్ని విశ్వాసాలకు లోనైన వాళ్ళు, వాతావరణం మారగానే తామూ మారిపోతారు కాని కేవలం హేతుబుద్ధితో విశ్వాసాలు కలిగించుకున్న నాబోటి వాడికి పైనుంచి కొంత మోరల్ సపోర్టురావటం చాలా బలాన్ని ఇస్తుంది అలాటి బలాన్ని నాకు ఇచ్చిన వాళ్ళు శాస్త్రవేత్త జె బి ఎస్ హాల్డేన్, అనటోల్ ఫ్రాన్సులు వాళ్ళిద్దరూ కమ్యూనిస్టులయారని తెలిసి, నేను ఎంత గొప్పవాళ్ళ దారిలో నడుస్తున్నాను అనుకున్నాను

సామాన్య ప్రజలకు శాస్త్రజ్ఞానం అందించటంలో నాకు హాల్డేన్ పద్ధతి అత్యుత్తమంగా కనిపించింది (నాకు కొంచెం చిరాకు కలిగించినది ప్రొఫెసర్ జీన్స్ పద్ధతి) ఫ్రాన్స్ విషయం చెప్పనే అక్కర్లేదు ఆయనను మించిన మేధావి రచయితలలో ఉండడు అనుకునేవాణ్ణి ఆయన కూడా చివరి రోజులలో కమ్యూనిస్టు అయి, జాక్ లండన్ రచించన "ఐరన్ హీల్"కు గొప్ప పీఠిక రాశాడు

నేను రచనలు చెయ్యటం మొదలు పెట్టినప్పటినుంచీ ఏదో ఒక సాహిత్యోద్యమం వెంట ఉంటూనే వస్తున్నాను నవ్యసాహిత్య పరిషత్తులో సభ్యుణ్ణి కాని 1941 ఆరంభంలో మద్రాసులో

జరిగిన నవ్యసాహిత్య పరిషత్సమావేశంలో నాకు దానిమీద కొంత అసంతృప్తి ఏర్పడింది అటు తరువాత నేను దూర ప్రాంతాలకు వెళ్ళాను ఆ సమయంలోనే అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడింది నన్ను అందులో చేరమంటే, "అభ్యుదయ రచయితను" అని ప్రకటించుకోవటం రొమ్ము చరుచుకోవటంలాగా కనిపించి, "రచయిత అంటే నాదృష్టిలో అభ్యుదయ రచయితే అలాటి బిరుదు నేను తగిలించుకోను" అనేశాను కాని అది ఒక ఉద్యమమనీ, గురజాడ, కందుకూరి మొదలైన నా అభిమాన రచయితలకు ప్రచారం చేస్తున్నదనీ తెలియగానే నేను కూడా అందులో సభ్యుడనై నాకున్న పరిమితశక్తిని ఆ ఉద్యమానికి అంకితం చేశాను

అభ్యుదయ సాహిత్యోద్యమం విఫలం కాలేదు తరవాత వచ్చిన మంచి సాహిత్యానికి అదిగట్టి పునాది వేసింది దాని మూల సూత్రాలు పురోగామి సాహిత్యానికి మంచి ఆధారం అయాయి కాని అనేక కారణాలవల్ల ఆ ఉద్యమం క్రమంగా చప్పబడిపోయింది ముఖ్యంగా తెలంగాణా పోరాటమూ, కమ్యూనిస్టుల వేటా సాగినప్పుడు వాటి ప్రభావం సాహిత్య రంగంలో కూడా కనబడింది ఉడుకు రక్తం ఉద్రేకించింది నాబోటి రచయితలు కొందరు తిరోగాములుగా విమర్శించబడ్డారు

నిజానికి అభ్యుదయోద్యమం విప్లవానికి దోహదకారి కాదు విప్లవసాహిత్యానికి ఒరవడి నిర్దేశించినది మార్క్స్, ఎంగెల్స్‌లు కారు లెనిన్, మార్క్స్ అభిమాన రచయితలు షేక్స్పియర్, గోథే, బాల్జాక్ మొదలైనవారు ఎంగెల్స్ మంచి సాహిత్యానికి బూర్జువా లక్షణాలు–సందేశం నిగూఢంగా ఉండటం వగైరా– ఉండాలన్నాడు ప్రజాజీవితంలో రచయిత నిమగ్నుడు కావాలన్నవాడు లెనిన్ అటు తరవాత మావో ప్రజాసామ్యాన్ని గురించి రాయాలనీ, ప్రజాసాహిత్యం కావాలనీ అన్నవారున్నారు గాని, అలా రాసేవారు ఉద్యమంలో చాలా కొద్దిమంది ఉండేవారు ఆ దశలో విప్లవ సాహిత్యోద్యమం వచ్చే అవకాశాలు కూడా చాలా తక్కువగానే ఉండేవనుకుంటాను మొత్తం మీద మధ్యతరగతి మనస్తత్వం అభ్యుదయ సాహిత్యాన్ని బలంగా అంటిపెట్టుకుని ఉండింది తెలంగాణా పోరాటం అంతమైన తరువాత అభ్యుదయ రచయితల సంఘం గుంటపూలు పూయ నారంభించింది అభ్యుదయ రచయితలు నిజంగానే తిరోగమించనారంభించారు

నా ఉద్దేశంలో సాహిత్యోద్యమాలు జీవిత సత్యాలను వదిలేసి, సిద్ధాంత సూత్రాలకు ప్రాధాన్యం ఇచ్చినప్పుడు మంచి సాహిత్యం రాలేదు తాత్కాలికంగా గొప్ప సాహిత్యం అని పేరుతెచ్చుకున్నా ఎక్కువ ప్రయోజనకారి కాలేదు

విప్లవ సాహిత్యోద్యమం సరి అయిన తరుణంలోనే వచ్చింది దేశంలో ఒక పాలకవర్గం సుస్థిరంగా ఏర్పడింది పావు శతాబ్దంపాటు దాని పరిపాలన ప్రజా జీవితాన్ని ఊబిలోకి లాగటమేగాక, అది స్వయంగా నైతిక పతనం పొందింది దాని వాగ్దానాలకు విలువలేదు అది చెప్పేమాటలో మెడమీద తల ఉన్నవాడి కెవడికీ నమ్మకము లేదు ప్రజాసమస్యలను పరిష్కరించే శక్తి దానికి లేదని రుజువయింది దాని ఏలుబడిలో దేశం సామ్రాజ్యవాదులకు తాకట్టుపడిపోతున్నది జీవితం అన్ని రంగాలలోనూ అశాంతీ, ఆందోళనా, తిరుగుబాటూ కనిపిస్తున్నాయి పాలకవర్గం ప్రజలను హత్య చెయ్యకుండా ఒక్కరోజు వెళ్ళబుచ్చలేని హీనస్థితికి

దిగజారింది ఈ ప్రభుత్వం బెదురుకు పరాకాష్ట రచయితలను నిర్బంధించటం, వేలాది యువకులను నిరారోపణగా, నిర్విచారణగా ఏళ్ళతరబడి ఖైదుల్లో ఉంచి, చిత్రహింసలు చెయ్యటం ఇది తుమ్మితే ఊడే ముక్కు!

ఇలాంటి పరిస్థితిలో విప్లవ సాహిత్యోద్యమం రాకపోతే రచయితలు షండులన్నమాట! పాలకవర్గీయులకు భజన చేసే రచయితలు ఎంగిలి మెతుకులకు తోకలాడించే కుక్కలకన్నా ఎక్కువ వాళ్ళుకారు సోషలిజం వ్యష్టివాదం కాదు సమష్టివాదం సోషలిజం అంటూ స్వార్థం చూసుకునేవాడు సంఘ ద్రోహి రచయితలు సంఘద్రోహులు కారాదు అందుచేతనే విప్లవ సాహిత్యోద్యమం ఈనాటి ప్రధానావసరం దేశంలో చైతన్యవంతులైన యువకులకు అది ఉత్తేజం కలిగిస్తుంది

మరొకటి కూడా నాకు అనిపిస్తుంది దేశంలో కృతక రాజకీయ చైతన్యం నానాటికి ఎక్కువవుతున్నది ప్రతి చెత్త సమస్యకూ ఒక రాజకీయోద్యమ స్వరూపం వస్తున్నది దీన్ని అరికట్టడానికైనా విప్లవ సాహిత్యం అవసరం ప్రజా బాహుళ్యానికి సంబంధించని సమస్యలమీద సాగే ఉద్యమాలేవీ నిజమైన రాజకీయోద్యమాలు కావు రామాయణాన్ని తగులబెట్టటమో, హిందీ భాషను ప్రతిఘటించటమో, కన్నడ భాషలో మంచి రచయితలు లేరనటమో పెద్ద రాజకీయాలు కావటం అర్థంలేనిది ఈ పరిస్థితిని విప్లవ సాహిత్యం కొంతవరకు సరిచేయవచ్చునని తోస్తుంది అట్టడుగు ప్రజల జీవితాన్ని వాస్తవంగా చిత్రించినకొద్దీ పదవుల కీచులాట రాజకీయాలు ఎంత హేయమైనవో తెలుస్తుంది అలా తెలియటం విప్లవ పరిస్థితిని బలపరచటానికి ఎంతగానో తోడ్పడుతుంది

చిట్టచివరకు ఒక మాట చెప్పాలి రచయితలందరూ అంతో ఇంతో మార్క్సిజం తెలిసివారై ఉండటం అవసరం మార్క్సిజం ఒక శాస్త్రం దాన్ని అవగాహన చేసుకునేటందుకు శాస్త్రీయ దృక్పథం కావాలి మేధావులనిపించుకునే రచయితలు కూడా, "మార్క్సుచెప్పిన దంతా తప్పేనటగా?" అనటం వింటాం ఇది శాస్త్రీయ దృక్పథం లేకపోవటానికి నిదర్శనం

మత విశ్వాసాలలాగా శాస్త్రీయ ప్రతిపాదనలు మార్పు లేనివి కావు శాస్త్ర విజ్ఞాన చరిత్ర ఎరిగిన వారందరికీ ఈ విషయం తెలుసు ఫ్లాజిస్టాన్ సిద్ధాంతమూ, ఈథర్ సిద్ధాంతాలూ లాటి అర్థంలేని సిద్ధాంతాలను శాస్త్రజ్ఞులు చాలా కాలం ఉపయోగించుకున్నారు వాటి అవసరం తీరిపోగానే వదిలేశారు ఏ సిద్ధాంతమైనా అనుభవం తోటీ, పరిస్థితులలో ఏర్పడే పరిణామాలతోటీ సంస్కరించబడుతుంది ఇది తప్ప జ్ఞానం పురోగమించే మార్గం మరొకటి లేదు మార్క్సిజం జడవాదంకాదు, దాన్ని లెనిన్, స్టాలిన్, మావోలు మారిన పరిస్థితులకు అనుగుణంగా సంస్కరిస్తూ వచ్చారు ఐన్‌స్టయిన్ సాపేక్ష సిద్ధాంతం రాగానే న్యూటన్ ప్రతిపాదించిన "గతి సూత్రాలు" అబద్ధం అయిపోలేదు న్యూటన్ సూత్రాలు కొన్ని పరిధులలో సరి అయినవే, వాటిని ఐన్‌స్టయిన్ విస్తరించాడు

శాస్త్రజ్ఞుల దృష్టిలో–మార్క్సిస్టుల దృష్టిలోకూడా– పరమ సత్యాలంటూ లేవు అనుభవాన్ని విశ్లేషించి సిద్ధాంతాలు చెయ్యటమూ, ఆ సిద్ధాంతాలను అధిగమించి అనుభవం పోయినప్పుడు

పాత సిద్ధాంతాలను సంస్కరించటమూ వారి పని  చంటి బిడ్డకు పాలు తప్ప వేరే ఆహారం అవసరం ఉండదు  కొన్ని నెలల అనంతరం ఆ పాలమీదనే బిడ్డ పెరగలేడు  ఇతర ఆహారాలు కావాలి  జ్ఞానం కూడా పరిణామం చెందుతుంది  ఇదే మార్క్సిజంకు కూడా వర్తిస్తుందని గ్రహించని వాళ్ళు మార్క్సిజమును ఆక్షేపిస్తారు  రచయితలు ఇలాటి ఆక్షేపణలకు సమాధానం చెప్పగలిగి ఉండాలి  ముఖ్యంగా విప్లవ రచయితలు మార్క్సిజం తప్ప తమను ముందుకు నడిపించేది మరేదీ లేదని గుర్తించాలి

ఎరుపు, కర్నూలు మహాసభల సంచిక,1974
పునర్ముద్రణ కళలు-శాస్త్రవిజ్ఞానం

# 15. సామాజిక పరిణామం వెంట జనద్రోహం

సామాజిక పరిణామం గురించి ఆలోచించేటప్పుడు రెండు విషయాలు గుర్తుంచుకోవాలి

1  అన్ని దశలలోనూ ప్రజావర్గాలు కొన్నిటికి ద్రోహం జరిగింది

2  సామాజిక ప్రగతిని అడుగడుగునా నిర్ణయించినది ఆర్థికాభివృద్ధే: మరొక నైతిక, ధార్మిక గీటురాయి ఏదీలేదు, మిగిలిన అన్ని అభివృద్ధులూ దానిని పురస్కరించుకున్నవే

ఈ విషయం ప్రత్యేకించి చెప్పుకోవలసిన అవసరం ఎందుకు వచ్చిందంటే, పరిణత సామాజిక మానవుడు కాలానుగతంగా ఆర్థికాభివృద్ధి తనకు చేకూర్చిన వెయ్యిరకాల సదుపాయాల చాటున దాక్కుని, ఆధ్యాత్మిక విలువలగురించీ సాంస్కృతిక విలువల గురించీ ఉపన్యాసాలు దంచుతూ, ఆర్థిక అంశాన్ని చిన్నచూపు చూడటం జరుగుతున్నది  సమాజంలో అనేక విప్లవ పరిణామాలు జరిగాయి  కాలగతిలో వీటన్నిటి వెనకా ఆర్థిక వ్యవస్థలో గుణాత్మకమైన అభివృద్ధి ఉన్నది విప్లవానంతరం ఏర్పడిన వ్యవస్థ విప్లవపూర్వ వ్యవస్థకన్నా ఏ విషయంలో పురోగమించిందంటే ఆర్థిక పునాదిలో మాత్రమే  అందుచేత, కమ్యూనిస్టులు ఆర్థిక విషయాలకు ఎక్కువ ప్రాధాన్యమిస్తారని ఆక్షేపించటంలో అర్థంలేదు

ఇక సామాజిక పురోభివృద్ధికీ, సాంఘిక దురన్యాయానికీ గల సంబంధంగురించి ఆలోచిద్దాం ఇన్నివేల ఏళ్ళ అనంతరం మనం వెనక్కు తిరిగి చూసుకుంటే, ఆటవిక దశలో మనుషులు ఆహారం ఏరుకుంటూ, వేటాడుతూ, ఆహారోత్పత్తి ఎరగని దశలో, ఏర్పరచుకున్న సమాజం అత్యంత ధర్మబద్ధమైనదనిపిస్తుంది  ధర్మం నాలుగుపాదాల నడిచిన దశ ఏదన్నా ఉంటే అదే ననిపిస్తుంది  మనిషి రోజంతా శ్రమించినా వాడి అవసరాలే సరిగ్గా తీరని దశలో  ఒకరి శ్రమశక్తిని మరొకరు దోచుకునే సమస్యేలేదు  వర్గ వ్యత్యాసాలు లేవుగదా, చిన్న పెద్ద తారతమ్యాలూ లేవు  బాల్యదశలోనే ఆహారం గుర్తించి ఏరుకునే శక్తి అప్పటివాళ్ళకు అలవడేది స్త్రీ పురుషుల మధ్య శ్రమ విభజన ఉండినా అందులో ఉచ్చనీచాలు లేవు

ఆ దశలో మానవుడు మన గలిగాడంటే దానికి కారణం సమత్వంతో కూడిన సమష్టి జీవితమే  వేటాడి జీవించే తండాలు చాలా అల్ప సంఖ్య గలవైనా, తండాల మధ్య సహకారమూ, సంస్కృతీ వినిమయమూ ఉండేవి  ఈ దశ సహస్రాబ్దాలపాటు కొనసాగింది  పాత రాతి యుగపు పరికరాలలో అభివృద్ధి అతి నింపాదిగా సాగింది

మానవుడు ధాన్యాన్ని కృషిద్వారా ఉత్పత్తి చెయ్యటమూ జంతువులను మచ్చిక చెయ్యటమూ నేర్వడంతో, సమాజంలో తొలివిప్లవం సాధ్యమయింది మనిషి ఉత్పత్తిశక్తి ఒక్క దెబ్బన పదింతలయేసరికి, పదిమందిలో తొమ్మిదిమందికి ఆహారోత్పత్తినుంచి ఆట విడుపు లభించింది ఒక్కడి శ్రమ ఫలితాన్ని మరి తొమ్మిదిమంది పంచుకోగలిగారు ఇందులో నుంచి రక్షకులు (రాజులు), వైజ్ఞానికులు (పురోహితులు), కుమ్మర్లు, వడ్రంగులు, లోహకారులు, నేతపనివాళ్ళు, ఇంకా అనేక వృత్తులవాళ్ళు బయలుదేరారు వీరందరి కృషి సంఘంలో అందరికీ సమంగా దక్కితే, అందులో దురన్యాయం లేదు కాని అలాదక్కే అవకాశం లేదు ఈ నూతన ఉత్పత్తి అందరికీ సమంగా పంచటం వల్ల లాభంకూడా లేదు రాగి పరికరాలూ, కంచు ఆయుధాలూ, బంగారు ఆభరణాలూ, పరిమితమైన ఇతర వస్తువులూ ఒకరివద్ద కేంద్రీకరించడంలోనే ఎక్కువ ప్రయోజనం ఉన్నది అందరి దగ్గరా తలా ఒక తులం రాగి ఉండి ఏం ప్రయోజనం? అంతకన్న కొద్దికత్తులూ, గొడ్డళ్ళూ తయారుచేస్తే ప్రయోజనం అందరికీ ఉంటుంది

కొత్త ఉత్పత్తి కేంద్రీకరించటానికి రెండు కేంద్రాలు సమాజంలో ఏర్పడ్డాయి– ఒకటి గుడీ, రెండోది నాయకుడి ఖజానా ఇతర ఉత్పత్తులు వికాసం పొందటానికి మూలం అదనపు ఆహారోత్పత్తి కొన్ని జాతులు వ్యావసాయిక దశలో కూడా, కొత్తపంట రాగానే కిందటేడు మిగిలిపోయిన పంట తగల బెట్టేవారట ఇలాంటి జాతులు బహుశా నూతన పరిణామాన్ని సాధించి ఉండవు

నూతనోత్పత్తి ద్వారా పరిణామాన్ని సాధించిన జాతుల విషయం చూద్దాం రెండు విషయాలు స్పష్టంగా కనిపిస్తాయి ఒకడు పది మంధికి సరిపడా తిండి పండించేదశ వచ్చినా, సమాజం ఆర్థికంగా ముందడుగు వేసిందేగాని, ఉత్పత్తి చేసేవాడు శిలాయుగంలోనే ఉన్నాడు లోహ పరికరాలు వచ్చాయి గాని అవి వాడిదాకా రాలేదు ఇతర వృత్తులవారి స్థితికూడా ఏమంత మారలేదు వీరందరి శ్రమఫలితమూ దేవుడి సొత్తుగానో, సమిష్టి సంపద అనే పేరుతో నాయకుడి ఆధీనం లోనో ఉంటున్నది ఇది మొదటి సంగతి

రెండవ సంగతి ఏమంటే, పరిణతి సాధిస్తున్న వేరు వేరు సమాజాల మధ్య వస్తువినిమయమూ, జ్ఞాన వినిమయమూ వర్తకమూ సైతం సాగి, నాగరికత కేవలమూ ఏ సమాజానిది ఆ సమాజానికే పరిమితమై ఉండక వ్యాప్తి చెందుతున్నది ఈ డిఫ్యూజన్ తాలూకు సత్ఫలితాలు నాయకుడికీ, పూజారి పురోహితులకూ మాత్రమే దక్కాయి

సమాజంలో ఎక్కువ తక్కువ వర్గాలు ఏర్పడుతున్నాయి దోపిడీకి మంచి అవకాశం కొంతమంది సామాజిక పరిణామ సత్ఫలితాలు సొంతం చేసుకుని, తమని అపరిణత దశలోనే ఉండనిచ్చి, లాభం పొందుతున్నారని వివిధ వృత్తులవారు గ్రహించినప్పుడు ప్రమాదం ఉన్నది ఈ పరిస్థితి అనివార్యంగానూ, హేతుబద్ధంగానూ జరిగినది గనక దాన్ని నిరోధించటానికిలేదు అయితే తీరా దోపిడీ ఆరంభమయినాక దానిమీద తిరగబడవచ్చు అధిక సంఖ్యాకులు తిరుగుబాటు చెయ్యకుండా చూడటానికి మత ప్రచారాలూ, కర్మకాండా, ధర్మశాస్త్రాలూ, సదాచారాలూ కోకొల్లలుగా సృష్టి అయాయి ఆటవిక సమాజ నియమాలు పోయి, వర్ణ ధర్మం వచ్చింది ఈ మార్పులోనే దురన్యాయం ఉన్నది, ఇందులోనే సామాజిక ప్రగతి కూడా

ఉన్నది నాయకుడి ఆధీనంలో ఉన్న సమష్టి సంపద వాడి సొంత సొత్తు అయింది వాడు రాజు అయ్యాడు నాయకుడి ఎన్నిక పోయి పరిపాలనాధికారానికి వారసత్వం ఏర్పడింది ఇందులో దురన్యాయం లేదని ఎలా అంటాం? ఈ మార్పు సమాజాన్ని ముందుకు తీసుకు పోలేదని మాత్రం ఎలా అనగలం? కాకపోతే 'ముందు' అనేది కేవలమూ ఆర్థిక పునాది మీదనే ఆధారపడింది అధికాహారోత్పత్తి ఇతర వృత్తులకు దారి తీసింది సంపద కేంద్రీకృతం కావటం సర్వతోముఖ సామాజిక విస్తరణకు దారితీసింది ఈనాడు వెయ్యివిధాల సుసంపన్నంగా ఉన్న మానవ సమాజాల రూపు రేఖలను బట్టి 'మనిషికి తిండి మాత్రమే చాలదు సంపదకన్న జ్ఞానం గొప్పది' లాటి ధర్మపన్నాలు చెప్పి లాభంలేదు సంస్కృతీ, మానవ మేధస్సూ మూర్తీభవించినట్టు కనపడేవాళ్ళను తీసుకుపోయి ఒక నిర్జన దీవిలో పడేస్తే, వాళ్ళు ఆటవికదశలోకి రావటానికి ఎంతో కాలం పట్టదు వారి సంస్కృతీ, మతమూ ముందు రాలిపోయి ఆహారోత్పత్తి వారి ప్రప్రథమ కర్తవ్యం అవుతుంది

సామాజిక ప్రగతి సాగుతున్న కొద్దీ ఉత్పత్తి సాధనాలలోనూ, విధానాలలోనూ అపారమైన అభివృద్ధి సాధ్యమయింది ఆహారోత్పత్తికోసం కృషిచేసేవారి శాతం ఎంత తక్కువగా ఉంటే అంతగా సమాజం పురోగమించిందన్న మాట (మనదేశం చాలా వెనకబడి ఉన్నది)ఇతర వృత్తులు కూడా ఇంతే మనిషి తీరిక ఈ విధంగా పెరిగింది ఈ తీరిక సద్వినియోగం కావాలంటే నిరుద్యోగం పెంచటం మార్గంకాదు వైజ్ఞానిక, సాంకేతిక నైపుణ్యమూ, సర్వీసులూ ఎంతగా విస్తరించితే సమష్టికి అంత లాభం వైద్య విద్యాశాఖలు అపారంగా విస్తరించే అవకాశం ఉన్నది

ప్రపంచంలో ప్రతి మనిషికీ ఇల్లూ, తిండీ, బట్టా, చదువూ, పనీ, ఆరోగ్య సౌకర్యాలూ, కళాతృష్ణ తీరే మార్గాలూ లభించటానికి ప్రాతిపదిక ఏనాడో ఏర్పడింది ఇది అమలు జరిగితే ప్రతి మనిషీ సామాజిక పరిణామంలో భాగస్వామి అవుతాడు అలాకావటం లేదంటే కొందరిని అపరిణత దశలో ఉంచుతున్నారన్నమాట వెనుకటికి జానపద కథలో రాజుగారి మంగలి అన్నట్టు, ప్రతిమనిషి దగ్గిరా కోడిగుడ్డంత బంగారం ఉండటం సామాజిక పరిణతికి గీటురాయికాదు రవ్వల కమ్మలూ, ఎంబాసిడర్ కారూ, టీవీ సెట్టూ వగైరాలు జీవితాశయంగా గలవాళ్ళు అందరి అభ్యుదయమూ కోరేవాళ్ళు మాత్రంకారు ఇలాటి ఆశయాలు సామాజిక దురన్యాయం నుంచి పుట్టేవి ఎప్పటికైనా అందరికీ కార్లూ, టీవీసెట్లూ, ఏర్‌కండిషనింగూ రావనికాదు కాని ఈ లోపల సామాజిక విప్లవం పూర్తికావటానికి ఒక ప్రజా విప్లవం జరగాలి

అరుణతార, త్రైమాస పత్రిక, జూన్, నవంబర్-1978

# 1.లెనినిజమా? సోషల్ సామ్రాజ్యవాదమా?

లెనిన్ శతవార్షిక సందర్భంలో మూడు చీనా పత్రికల సంపాదక వర్గాల వారు తయారుచేసిన దీర్ఘవ్యాసాన్ని ఇంగ్లీషులో న్యూబుక్ సెంటర్, కలకత్తా చిన్న పుస్తకంగా ప్రచురించింది

1970 ఏప్రిల్ 22న లెనిన్ శతజయంతి అనేక దేశాలలో జరిగింది బూర్జువాల అధిపత్యాన్ని కూలదోయటానికి మానవ చరిత్రలో జరిగిన తొలి ప్రయత్నం పారిస్ కమ్యూన్ తిరుగుబాటు ఇది జరిగిన నాటికి లెనిన్ వయసు ఏడాది తర్వాత లెనిన్ ప్రొలిటేరియన్ విప్లవానికి నాయకత్వం వహించి ప్రపంచంలో మొట్టమొదటి సోషలిస్టు రాజ్యాన్ని స్థాపించి, ప్రపంచ చరిత్రలో సామ్రాజ్యవాద పతనానికీ, విప్లవయుగానికీ పునాది వేశాడు

అలాటి మహనీయుడి శతజయంతిని దేశదేశాలవారు ఎందుకు జరిపారు? విప్లవ కారుడూ విప్లవ యుగకర్తా అనా? లేక ప్రపంచంలో రెండవస్థానం ఆక్రమించిన సోవియట్ రష్యాకు మూలపురుషుడనా?

లెనిన్ ఒక సందర్భంలో అన్నాడుః పీడిత ప్రజలకు ఆదరణపాత్రులైన విప్లవ నాయకులు చనిపోయిన అనంతరం వారి శత్రువులు పీడిత వర్గాలను మోసగించటానికి వారిపేర్లను సొంతం చేసుకునే ప్రయత్నం చరిత్ర అంతటా జరిగేదే

కనుక మన ప్రభుత్వాలలాటివి లెనిన్ శతజయంతులను లక్షలు ఖర్చుచేసి జరపటంలో వింతలేదు అలాగే లెనిన్ పేరు ఉచ్చరించటానికి అర్హులుగానివారు, బతకనిబిడ్డ బారెడన్న ధోరణిలో లెనిన్‌కు నీరాజనాలిచ్చారు

చిత్రమేమంటే సోవియట్ రష్యాలో కూడా ఇదే ధోరణిలో లెనిన్ భజన సాగటం! లెనిన్ శతజయంతిని ఆర్భాటంగా జరిపిన వర్తమాన సోవియట్ నాయకులు లెనిన్ పేరు ఉచ్చరించటానికి తగిన వారుకారని నిరూపించటమే ఈ పుస్తకం (వ్యాసం) యొక్క ఉద్దేశం ఈ వ్యాసం చెప్పే కారణాలు పరిశీలించుదాం లెనినిజం పతాక ఎగురుతూ ఉంచటంలో చీనా కమ్యూనిస్టులకు ప్రత్యేకమైన ఆసక్తి వున్నది ఎందుచేతనంటే మావో చెప్పినట్టు ఈ ప్రపంచ విప్లవయుగంలో చీనాలో విప్లవం సాధ్యం కావటానికి లెనినిజమే ఆధారమయింది మార్క్సిజం–లెనినిజం సహాయంతోనే మావో అతి “దారుణమూ, కష్టసాధ్యమూ, క్లిష్టమూ అయిన విప్లవ పోరాటాలను” విజయవంతంగా కొనసాగించాడు అంతేగాక ఈనాడు అమెరికను సామ్రాజ్యవాదంతోబాటు సోవియట్ రివిజనిజంను కూడా ప్రపంచ ప్రజలు ప్రతిఘటించవలసి ఉన్నది సోవియట్ విధానాలు లెనినిజమును ఏ విధంగా పెడమార్గం పట్టించాయి?

**1 లెనినిజము తాలూకు ప్రధాన సమస్య ప్రొలిటేరియన్ నియంతృత్వం**

బూర్జువా రాజకీయ యంత్రాన్ని విధ్వంసం చేసి ప్రోలిటేరియన్ నియంతృత్వం నెలకొల్పాలంటే, అధికారాన్ని హస్తగతం చేసుకొనటానికి హింసాచర్యలు అవసరమని లెనిన్ పదే పదే చెప్పాడు ఆ మార్గానే అక్టోబరు విప్లవం సాధ్యమయింది

సోషలిస్టు విప్లవ శకం నడిచినంతకాలమూ సంఘర్షణలు తీవ్రతరమవుతాయనీ, ఈశకం ముగినేదాకా దోపిడీదార్లు యథాస్థితి తిరిగి నెలకొంటుందని ఆశిస్తారనీ, అది తిరిగి రావటానికి

ప్రయత్నాలు సాగిస్తారనీ, ఆ కారణంగా పెట్టుబడి దారీకి వర్గరాహిత్యానికీ (కమ్యూనిజముకూ) మధ్య నడిచే చారిత్రక దశ అంతటా ప్రోలిటేరియన్ నియంతృత్వం అవసరమనీ లెనిన్ స్పష్టం చేశాడు

ఈ ప్రాథమిక సమస్యలపట్లనే సోవియట్ రివిజనిస్టు రెనిగేడ్ కూటమి లెనిన్ సిద్ధాంతాన్ని నీరుగార్చింది అందుకనే మావో "అక్టోబరు విప్లవం యింకా అమలులో వున్నదా? అన్ని దేశాలకూ అది ఇంకా శిరోధార్యంగా వున్నదా? సి పి యస్ యు 20వ కాంగ్రెసులో కృశ్చేవ్ పార్లమెంటరీ పద్ధతిలో అధికారం సంపాదించడం సాధ్యమన్నాడు అంటే అక్టోబరు విప్లవం నుంచి అన్ని దేశాలూ నేర్చుకోవలసింది ఇక ఏమీ లేదన్నమాట ఈ తలుపు తెరిచాక లెనినిజముకు ఉద్వాసన చెప్పినట్టే" అన్నాడు

ప్రపంచంలో మొట్టమొదటి సోషలిస్టు రాజ్యమైన సోవియట్ యూనియన్‌లో పెట్టుబడిదారిని పునఃప్రతిష్ట చెయ్యటం ఎలా సాధ్యమయింది? ఆ దేశం సోషల్ ఇంపీరియలిస్టు దేశంగా పరిణమించటం ఎలా సాధ్యమయింది?

ఇది వర్గపోరాట ఫలితం పెట్టుబడిదారీ విధానం అవలంబించిన కొద్దిమంది పార్టీ సభ్యులు పార్టీనీ, ప్రభుత్వ నాయకత్వాన్నీ, హస్తగతం చేసుకున్నారు అంటే ప్రోలిటేరియన్‌కు చెందిన అధికారం సోవియట్ బూర్జువాల వశమయిందన్నమాట ఇంతేగాక ప్రపంచ సామ్రాజ్యవాదం తన మనుగడకోసం సృష్టించిన "శాంతియుత పరిణామ" నినాదాన్ని సోవియట్ రెనిగేడ్ల ద్వారా సోవియట్ యూనియన్‌కు అంటగట్టింది

"సోషలిస్టు చారిత్రక దశలో కూడా వర్గాలూ, వర్గవైరుధ్యాలూ, వర్గసంఘర్షణా ఉంటాయి సోషలిస్టు, కాపిటలిస్టు పంథాల మధ్య సంఘర్షణ ఉంటుంది, పెట్టుబడి దారీ పునరుద్ధరణ ప్రమాదం కూడా వుంటుంది " అని మావో చెప్పాడు సోషలిస్టు సమాజంలో కూడా అధికారంకోసం వర్గపోరాటం వుంటుంది "పార్టీలోకి, ప్రభుత్వంలోకీ, సైన్యంలోకీ దొంగచాటుగా జొరబడిన బూర్జువాలు అదను చూసుకొని అధికారం ఒడిసి పుచ్చుకుని, ప్రోలిటేరియన్ నియంతృత్వాన్ని బూర్జువా నియంతృత్వంగా మార్చేస్తారు "

అక్టోబరు విప్లవం అనంతరం కూడా స్టాలిన్ బూర్జువా విప్లవ విరోధి వర్గమురాకు చెందిన ట్రాట్‌స్కీ, జినోవీవ్, కామినెవ్, రాదెక్, బుఖారిన్, రీకవ్‌లాటి వారిని తొలగించవలసి వచ్చిందంటే వర్గపోరాటం కొనసాగిందన్నమాట పెట్టుబడిదారీ పంథాను నిరోధించి, నియంతృత్వాన్ని స్థిరీకరించుకొనే అనుభవం సోవియట్ యూనియన్‌కు లేకపోయింది ఆ కారణంచేతనే స్టాలిన్ మరణానంతరం కృశ్చేవ్-కమ్యూనిస్టు పార్టీలో దాగివుండిన పెట్టుబడిదారీ పంథావాడు-స్టాలిన్‌ను అపఖ్యాతి పాలుచేసే 'రహస్య నివేదిక' ఒకటి ప్రకటించి, అనేక కుయుక్తులతో పార్టీనీ, రాజ్యాధికారాన్నీ చేజిక్కించుకున్నాడు ఈ విప్లవ వ్యతిరేక చర్యతో ప్రోలిటేరియన్ నియంతృత్వం బూర్జువా నియంతృత్వంగా మారింది సోషలిజం దెబ్బతిని, పెట్టుబడిదారీ తిరిగి నెలకొన్నది

కృశ్చేవ్ పోయి బ్రెజ్నేవ్ వచ్చాడు కాని ఇద్దరూ తోడు దొంగలే బ్రెజ్నేవ్ రెండవ కృశ్చేవ్ "ఇవాళ సోవియట్ యూనియన్ బూర్జువా, బడా బూర్జువాల నియంతృత్వం కింద, హిట్లరు

మోస్తరు జర్మన్ ఫాసిస్టు నియంతృత్వం కింద వున్నది " అని మావో (1964 మే 11న) అన్నాడు సోవియట్ బూర్జువావర్గంలో పలుకుబడిగల ఒక శ్రేణి తన రాజకీయ, ఆర్థిక, శక్తులను అపారంగా పెంచుకొని పార్టీలోనూ, ప్రభుత్వంలోనూ, సైన్యంలోనూ, ఆర్థిక, సాంస్కృతిక రంగాలలోనూ అగ్రస్థానాలు కైవసం చేసుకున్నారు ఈ శ్రేణినుంచే బ్యూరాక్రాట్ గుత్త పెట్టుబడిదారు వర్గం అవతరించింది వీళ్ళు వొక కొత్తతరహా బడా బూర్జువాలుః మొత్తం రాజకీయ యంత్రాంగమూ, సామాజిక సంపదా వీరి అధీనంలో వున్నాయి వీళ్ళు సామాజిక స్వామ్యాన్ని పెట్టుబడిదారీ గుత్తకింద మార్చేశారు "స్టేట్" పేరు చెప్పి వీరు నిశ్శంకగా ఖజానాను కొల్లగొట్టేస్తున్నారు సోవియట్ ప్రజల శ్రమ ఫలితాలను అన్ని విధాలా దోచేస్తున్నారు భోగలాలసలో మునిగితేలుతూ, ప్రజలను కాలబెట్టి నేలరాస్తున్నారు వీరు "యధాస్థితి కొరకు ఆశించటాన్ని సాధించే ప్రయత్నంగా" మార్చుకున్నవాళ్ళు అక్టోబరు విప్లవవీరుల సంతానాన్ని అణచిపారేశారు సోవియట్ యూనియన్‌లోని వివిధ జాతులమీద పెత్తనం చలాయిస్తూ, ఒక చిన్న విప్లవ విద్రోహక జారిస్టుసభ ఏర్పాటు చేసుకున్నారు ఈ రియాక్షనరీలకు ప్రజలంటే భయమూ, ద్వేషమూనూ

ఈ భ్రష్ట కూటమిలో అంతర్వైరుధ్యాలున్నాయి వీరు అందరూ కలిసి కట్టుగా పనిచేస్తూనే పరస్పర సంఘర్షణలు జరుపుతున్నారు వారి కష్టాలు ముదిరినప్పుడల్లా ఈ సంఘర్షణలు చాటుగానూ, బహిరంగంగానూ తీవ్రతరమవుతూ ఉంటాయి అత్యధిక లాభాలకోసం ఈ కూటమి స్వదేశ ప్రజలను దోపిడీచేసి హింసపెట్టటమే గాక, విస్తృతి కోసమూ, దురాక్రమణ కోసమూ కృషిచేస్తూ, ప్రపంచాన్ని పంచుకోవటానికి ప్రపంచ సామ్రాజ్యవాదంతో చేరుతూ, అతి హేయమైన సోషల్ సామ్రాజ్యవాద విధానాలు అవలంబిస్తున్నది

ప్రస్తుతం ఈ కూటమికి ప్రతినిధి బ్రెజ్నేవ్ పెట్టుబడిదారీ పునరుద్ధరణను సోషల్ ఇంపీరియలిజమ్‌గా మార్చటానికి కృశ్చేవ్ ప్రారంభించిన కృషిని ఈయన కొనసాగిస్తున్నాడు లాభాలు అనే పెట్టుబడిదారీ సూత్రాన్ని చట్టబద్ధం చేసి ఒక కొత్త ఆర్థిక విధానం అనేదాన్ని ఈయన సర్వతోముఖంగా అమలులోకి తెచ్చాడు ఇందువల్ల బ్యూరోక్రాట్ గుత్తదార్లు మరింత బాగా దోచుకోగలరు ప్రజాక్షేమం ప్రసక్తి లేకుండా పన్నుల భారం పెరిగింది "వెన్నకు బదులు తుపాకులు" అన్న హిట్లరుసూత్రం అవలంబించబడుతున్నది ఆయుధోత్పత్తీ, యుద్ధ సన్నాహాలూ సోషల్ సామ్రాజ్యవాదానికి అవసరం గనక ఆర్థిక వ్యవస్థ అందుకు ఒనుగుణంగా మలచబడుతున్నది

సోవియట్ రివిజనిస్టు రెనిగేడ్ల కూటమి అవలంబించిన అపసవ్య చర్య మూలంగా చాలా దుష్ఫలితాలు కలిగాయి పరిశ్రమలు తరిగాయి ధాన్యోత్పత్తీ పశుసంపదా క్షీణించాయి ప్రభుత్వ మార్కెట్లో చిత్రంగా కొనుగోలు వస్తువులు కరువయాయిః శ్రమజీవులకు పేదరికం చుట్టుకున్నది

సోవియట్ రెనిగేడ్లు (తిరోగాములు) సోవియట్ కష్టజీవులు దశాబ్దాల తరబడి కష్టించి కూడబెట్టిన అంతులేని సంపదలు అలాములూ పలాములూ చెయ్యటమే గాక, రెండవ ప్రపంచ యుద్ధంలో ఓడిపోయిన పశ్చిమ జర్మనీ నుంచి దీనంగా అప్పు యాచించారు దేశీయ సహజ

సంపదను అమ్ముకున్నారు, జపాను గుత్తపెట్టుబడిని సైబీరియాకు ఆహ్వానించారు (అదీ రెండో ప్రపంచ యుద్ధంలో మట్టి కరచిన దేశమే)

"లెనినిజముకు జన్మభూమి (అయిన సోవియట్ రష్యా)కి ఇంత వినాశమూ, అపఖ్యాతీ తెచ్చిన సోవియట్ రివిజనిస్టు రెనగేడ్ల మీద చీనా ప్రజలమైన మేము అత్యంత ఆగ్రహం చెందుతున్నాం: ఈ సర్వతోముఖ పెట్టుబడిదారీ పునఃప్రతిష్ట వల్ల బాధపడే సోవియట్ ప్రజాబాహుళ్యం పట్ల సానుభూతి కలిగి ఉన్నాం "

సోవియట్ రష్యాకు ప్రోలేటేరియన్ నియంతృత్వంతో పని తీరిపోయిందని సోవియట్ రెనిగేడ్ ముఠా ఒకప్పుడు అని, ప్రోలిటేరియన్ నియంతృత్వం పని "సమస్త ప్రజల రాజ్యం" చేస్తున్నదన్నారు రెంటికీ తేడాలేదట ఈ రెంటినీ వాళ్ళు ఏకం చెయ్యటం దేనికంటే, ప్రజలను మభ్యపెట్టటానికీ, బూర్జువా నియంతృత్వాన్ని కప్పిపెట్టటానికీనూ

"పార్టీ నాయకత్వాన్ని బలపరచటం", "క్రమశిక్షణను బలపరచటం", "కేంద్రీకరణను బలపరచటం" మొదలైన వాటిని గురించి వారుచేసే ఆర్భాటం అంతరార్థం పార్టీని, ప్రజలనూ సోషల్ ఫాసిస్టు పాలక కూటమి అదుపులో ఉంచటమూ, తమ పరిపాలనతో తృప్తిపడని వారిని అణచటమూ, రాజకీయార్థిక సైనిక అధికారాన్ని వారి చేతిలోకి తీసుకోవటమూనూ తమ ఫాసిస్టు నియంతృత్వాన్ని బలపరచటానికి, దురాక్రమణ యుద్ధాలకు సన్నాహాలు చెయ్యటానికి వారు ఈ నాటకమంతా ఆడుతున్నారు

లెనిన్‌కూ, అక్టోబరు విప్లవానికీ అపచారం చేసే తమ దుష్పరిపాలనను మరింత బలపరుచుకోవటానికి వారు మరింత బాహాటంగా విప్లవ విద్రోహక హింస అవలంబిస్తున్నారు స్పెషల్ ఏజంట్లూ, వేగులవాళ్ళూ మితిమీరారు, విద్రోహక చట్టాలూ, తీర్పులూ మితిమీరుతున్నాయి విప్లవం అన్నది ద్రోహం ఎక్కడబడితేఅక్కడ ప్రజలను అసత్యారోపణలమీద జైళ్ళలోకి తోస్తున్నారు అసంఖ్యాకులైన విప్లవవీరులూ, నిర్దోషులూ జైళ్ళకు పోయారు పిచ్చి ఆసుపత్రులకు పంపబడ్డారు ప్రజా ప్రతిఘటనను ఎదుర్కోవటానికి టాంకులూ, సాయుధ శకటాలు సైతం పంపబడుతున్నాయి

"రష్యాలో అత్యధిక సంఖ్యాక ప్రజల పీడన ఉండినంతగా ప్రపంచంలో మరెక్కడా లేదు రష్యను జాతిగాక ఇతర జాతులు (రష్యాలోనివారు) విజాతీయులుగా చూడబడ్డారు" అన్నాడు లెనిన్ అందుకే, ఎలాంటి హక్కులూలేని ఆజాతులవారు చక్రవర్తులను తీవ్రంగా ద్వేషించారు తిరిగి ఇప్పుడు ఈ కొత్త నయాజార్ చక్రవర్తులు అదే పనిచేసి, రష్యాను వివిధ జాతుల బందిఖానాగా మార్చుతున్నారు

సిద్ధాంత రంగంలో కూడ వీరు పూర్తిగా బూర్జువానియంతృత్వ విధానాన్నే అవలంబించారు శ్రమజీవుల సోషలిస్టు ఆదర్శాలు అణచబడ్డాయి బూర్జువా ఆదర్శాల కుళ్ళూ, సంస్కృతీ ఉప్పెనలాగా వచ్చిపడింది సైనిక తత్వమూ, జాతీయ, జాతి దురహంకారాలూ బోధించబడుతున్నాయి సోషల్ సామ్రాజ్యవాదాన్ని పెంపొందించటానికి కళలు సాధనాలుగా ఉపయోగించబడుతున్నాయి జార్ల పరిపాలనలో చెలరేగిన పోలీసు హింసలూ, దమనకాండా, అవినీతీ చూసి "రాళ్ళు సైతం ఆక్రోశిస్తాయి" అన్నాడు లెనిన్ సోవియట్ రెనిగేడ్ ముఠా పరిపాలనను జారిస్టు పరిపాలనతో పోల్చవచ్చు

"దుర్గాన్ని తేలికగా పట్టాలంటే లోపలనుంచే పట్టాలి" అని స్టాలిన్ అన్నాడు 14 దేశాలవాళ్ళు సాయుధంగా వచ్చిపడినా, వైట్‌గార్డులు తిరగబడినా, అనేక మిలియన్ల హిట్లరు మూకలు వచ్చిపడినా, సామ్రాజ్యవాదులు ఎన్ని ముట్టడులూ, విధ్వంసక చర్యాలూ, చక్రబంధాలూపన్నినా చలించని సోషలిస్టు దుర్గం కృశ్చేవ్ బ్రెజ్నేవ్ రెనగేడ్ ముఠాకు చిక్కిపోయింది అంతర్జాతీయ కమ్యూనిస్టు చరిత్రలో వీరిని మించిన రెనిగేడ్లు లేరు

లెనిన్ రెండవ ఇంటర్‌నేషనల్ రెనిగేడ్లను గురించి చెబుతూ, "మాటలలో సోషలిజం, చేతలలో ఇంపీరియలిజం" అన్నాడు ఈనాటి సోవియట్ రివిజనిస్టులు తిరోగమనవాదాన్ని సోషల్ ఇంపీరియలిజంగా మార్చారు తేడా ఏమిటంటే, ఆనాడు కౌత్‌స్కీలాటి వారికి ప్రభుత్వాధికారం లేదు వాళ్ళు పరాయి ఇంపీరియలిస్టుల దోపిడీకి సాధనాలు రాజ్యాధికారం హస్తగతం చేసుకున్న సోవియట్ రెనిగెడ్లు ఇతర దేశాలను దోచి, వాటి ప్రజలను రాజ్యంలో వుంచగలుగుతున్నారు

"చరిత్ర నేర్పే గుణపాఠమేమిటంటేః సోషలిస్టు రాజ్యంలో రాజకీయాధికారం రివిజనిస్టు ముఠాకు హస్తగతమయిందంటే, సోషలిస్టు రాజ్యం సోవియట్ యూనియన్‌లో లాగా సోషల్ ఇంపీరియలిజంగానన్నా మారుతుందిః జెకోస్లావేకియా, మంగోలియన్ పీపుల్స్ రిపబ్లిక్‌లాగా అస్వతంత్రంగానో, వలసగానో మారుతుంది "

సోవియట్ రివిజనిస్టులు "సోదర దేశాలపట్ల అంతర్జాతీయ" అని తియ్యటి కబుర్లు చెబుతూనే శృంఖలాలమీద శృంఖలాలు తగిలిస్తున్నారు వార్సా ఒప్పందం, పరస్పర ఆర్థిక సహకార సంఘం లాటివి తూర్పుయూరపు దేశాలకు అంటగట్టి, సోషలిస్టు సమాఖ్య అనే దిగ్బంధంలో పెట్టి, "అంతర్జాతీయ శ్రమ విభజన", "విశిష్టోత్పత్తి", "ఆర్థిక సమైక్యత"లో స్వేచ్ఛగా కొల్లగొట్టేస్తున్నారు ,ఆయా దేశాల జాతీయ ఆర్థిక వ్యవస్థలను రివిజనిస్టుల అవసరాలకు అనుగుణంగా మలచి ఆ దేశాలను తమ సరుకులకు విక్రయస్థానాలుగానూ, తమ ఉపకార్ఖానాలుగానూ, తోటలుగానూ, కూరలమళ్ళుగానూ, పశుకొష్టాలుగానూ చేసుకొని, అద్వితీయమైన దోపిడీ కొనసాగిస్తున్నారు ఆ దేశాలను తమ అదుపులో వుంచటానికి తమ సైనిక బలాలను వాటిలో ఉంచి, అతి క్రూరమైన దమన విధానాలు అమలు జరుపుతున్నారు జెకోస్లోవేకియాను తమ చెప్పుకింద వుంచి, తమకు కావలసిన కీలుబొమ్మ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకునేటందుకు లక్షలకొద్దీ సైన్యాన్ని బాహాటంగా పంపకం చేశారు ఇది లెనిన్ గర్హించిన జార్ల ఫ్యూడల్ ప్రత్యేక హక్కుల పద్ధతే

ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలోని అనేక దేశాలను తీవ్ర ప్రభావం కిందికి తెచ్చుకునేటందుకు అమెరికన్ సామ్రాజ్యవాదంతో పోటీకి దిగి సోవియట్ రివిజనిస్టు ముఠా "సహాయం" చేస్తానంటూ, అసమ వ్యాపారం ద్వారా యుద్ధ సామాగ్రినీ, పెట్టుబడినీ, ఎగుమతి చేస్తున్నది ఆ దేశాల అంతరంగిక వ్యవహారాలలో జోక్యం కలిగించుకుంటూ, అక్కడ యుద్ధస్థావరాలను ఏర్పాటు చేసుకోజూస్తున్నది వలస విధానపు ఆశయాలతో "ముడిసరుకుల వనర్లకోసమూ, పెట్టుబడి ఎగుమతి కోసమూ, రాజకీయ ప్రభావం కోసమూ, ఆర్థిక ప్రాంతాల కోసమూ జరిపే సంఘర్షణను" లెనిన్ పేర్కొన్నాడు ఈ విషయంలో "సోషల్ ఇంపీరియలిజం" పెట్టుబడిదారీ సామ్రాజ్యవాదమార్గాన్నే అచ్చంగా అనుసరిస్తున్నది

సోవియట్ రివిజనిస్టులు విప్లవ పోరాటాలను పూర్తిగా బలపరుస్తామంటూనే వివిధ దేశాల విప్లవ పోరాటాలను నీరుగార్చటానికి అతిహేయమైన ప్రతీప శక్తులతో చేతులు కలుపుతున్నారు పెట్టుబడిదారీ దేశాలలోని విప్లవ ప్రజానీకాన్ని, 'తీవ్రవాదులు' అనీ, "మందలు" అనీ నిరసిస్తూ, ప్రజోద్యమాలను విచ్ఛిన్నంచేయ యత్నిస్తున్నారు ఇండియా, ఇండోనేషియాలలాంటి దేశాలలో రియాక్షనరీలకు డబ్బూ, ఆయుధాలు అందిస్తున్నారు అమెరికను సామ్రాజ్యవాదులలాగే ప్రపంచమంతటా కుక్కకాపలా కాస్తున్నారు ప్రపంచాధిపత్యానికి అర్రులుచాచే రెండు పెద్ద ఇంపీరియలిజములు అమెరికావీ, రష్యావీనూ

అమెరికను ఇంపీరియలిజంకు వ్యతిరేకంగా సాగే ప్రజాపోరాటాలకూ, సోవియట్ రష్యాలోని అమెరికా వ్యతిరేకతకూ ఎలాంటి సంబంధమూలేదు రష్యను రివిజనిస్టులు అమెరికాతో ఒకవంక ఘర్షణపడుతూనే చేతులుకూడా కలుపుతున్నారు జర్మనీ, మధ్యప్రాచ్యమూ, ఆగ్నేయాసియా, జపానూ, అణ్వస్త్రాలు లాంటి అతి ముఖ్య సమస్యల గురించి సోవియట్ రివిజనిస్టులు అవలంభించిన విధానమే ఇందుకు నిదర్శనం సోవియట్ రష్యా అమెరికాల మధ్య జరిగే ఒప్పందాలన్నీ ఊళ్ళు పంచుకునే బందిపోటు దొంగల తాత్కాలిక ఒప్పందాలే

బ్రెజ్నేవ్ అధికారంలోకి వచ్చినాక సైనిక విధానాలు మరింత హెచ్చాయి కృశ్చేవ్ అవలంబించిన యుద్ధతంత్రాలూ, అణ్వస్త్రాల బెదిరింపూ, మిసైల్ అణ్వస్త్ర నిర్మాణమూ, సాధారణ ఆయుధోత్పత్తీ, నౌకా, విమాన బలాల పెరుగుదల కొనసాగాయి ఈ ఆయుధోత్పత్తి విజృంభణను కప్పిపెట్టడానికి కృశ్చేవ్ "నిరాయుధమూ నిస్సైనికమూ నిర్యుద్ధమూ" అయిన ప్రపంచం గురించి ప్రతిపాదనలు చేశాడు బ్రెజ్నేవ్ వచ్చాక యుద్ధోన్మాదాన్ని రెచ్చగొట్టే కృషి తీవ్రమయింది, అంతర్జాతీయ పరిస్థితి విషమించిందనీ, మూడో ప్రపంచ యుద్ధం వస్తుందనీ, శత్రువును ముందే నిగ్రహించేశక్తి తమకున్నదనీ, ప్రపంచంలో ఎక్కడ ఉన్న లక్ష్యాన్ని అయినా ఛేదించగలమనీ అంటూ, రక్షణవ్యయాన్ని అపారంగా పెంచేసి, హిట్లరు పద్ధతిలో మెరుపుదాడులకు యెత్తులు వేస్తూ, దురాక్రమణ యుద్ధాలకు తయారవుతున్నారు వాళ్ళు జెకోస్లొవేకియాను ఆక్రమించారు, చీనా ప్రాంతాలమీద దురాక్రమణ చేశారు చీనాను అణ్వస్త్రాలతో బెదిరించారు అమెరికను సామ్రాజ్యవాదులలాగే రష్యను సోషల్ ఇంపీరియలిస్టులు కూడా ప్రపంచయుద్ధం తెచ్చి పెట్టటానికి సిద్ధపడుతున్నారు

**బ్రెజ్నేవ్ సిద్ధాంతం:**

ఇది ఫాసిస్టు సూత్రీకరణలతో కూడుకొని ఉన్నది

1 "పరిమిత ప్రభుత" – సోషలిజమును పరిరక్షించటానికి తమకు సంపూర్ణ ప్రభుతకావాలి ఇతర దేశాల ప్రభుత ఎంతలో ఉండాలో తాము నిర్ణయిస్తారు! సోషలిస్టు వ్యవస్థను కూలదోసి, తూర్పుయూరపు దేశాలలోనూ, మంగోలియా ప్రజారిపబ్లిక్‌లోనూ పెట్టుబడిదారీ పునస్థాపన చేసే మార్గాలను తామే అవలంబించారు ఇంకా సోషలిజమును పరిరక్షించేదేమిటి? ఇతరదేశాలను శాసించే సంపూర్ణాధికారం తమకున్నది తమను కాదనే అధికారం ఆ దేశాలకు లేదు హిట్లరు ఇలాగే తనుపాలించే హక్కును గురించి వదరాడు జాతీయ ప్రభుతకు కాలదోషం పట్టిందన్నాడు డల్లెస్ ఈ బ్రెజ్నేవ్ సూత్రం సామ్రాజ్యవాదులదే

2 "అంతర్జాతీయ నియంతృత్వం" - దీని ప్రకారం సోషలిస్టు వ్యవస్థకు ప్రమాదం రాకుండగలందులకు సోదరదేశాలకు సైనిక సహాయం చేసే హక్కు తమకున్నది ఒకే దేశంలో ఏర్పడిన ప్రోలిటేరియన్ నియంతృత్వం అంతర్జాతీయ నియంతృత్వంగా పరిణమించినప్పుడు ప్రపంచ రాజకీయాలపై దాని ప్రభావం ఉండగలదని లెనిన్ అన్నమాట నిజమే అంతర్జాతీయ ప్రోలిటేరియనిజమునూ, ప్రపంచ ప్రోలిటేరియన్ విప్లవాన్ని ఉద్దేశించి లెనిన్ ఈ మాట అన్నాడు లెనిన్ అన్నమాటను అడ్డం పెట్టుకుని సోవియట్ రివిజనిస్టు మురా తూర్పుయూరపు దేశాలలోనూ, మంగోలియా ప్రజారిపబ్లిక్‌లోనూ సైనికంగా జోక్యం కలిగించుకుని, వాటిని తన ఆధీనంలో వుంచుకోవటాన్ని సమర్థిస్తున్నదిః ఈ సూత్రాన్ని అడ్డం పెట్టుకుని ఒక సమిష్టి జెండాకింద జెకోస్లోవేకియాను ఆక్రమించింది - అమెరికా కొరియాలో చేసినట్టే!

3 "సోషలిస్టు సమాఖ్య అవిభాజ్యం" - సోషలిస్టు సమాఖ్య ఎక్కడ ఉన్నది? సోవియట్ సామ్రాజ్యం తప్ప! మార్క్సిజం-లెనినిజం ప్రకారం చిన్న పెద్ద సోషలిస్టు దేశాలు కలిసి యేర్పడే సమాఖ్యలో అన్నిటికీ సమాన ప్రతిపత్తి ఉండాలి వివిధ దేశాల స్వాతంత్ర్యం పట్లా, సరిహద్దుల పట్లా గౌరవం ఉండాలి పరస్పర జోక్యాలు ఉండరాదు పరస్పర సహకారం అంతర్జాతీయ ప్రోలిటేరియానిజం అనుసరించి జరగాలి తన పరిభాషలో "అవిభాజ్యం" అనేదానికి అర్థం ఇతర దేశాలు తమ కబంధ హస్తం నుంచి బయటపడరాదని

4 "అంతర్జాతీయ శ్రమవిభజన" - ఇది కృశ్చేవ్ పాడిన పాతపాట దీనిని బ్రెజ్నేవ్ మురా చాలా విస్తరింపజేసింది ఆసియా, ఆఫ్రికా, లాటిన్, అమెరికా దేశాలకు కూడా అనువర్తింపజేసింది ఆ దేశాలు సోవియట్ రివిజనిస్టులతో సహకరిస్తే తప్ప వాటికి స్వతంత్ర ఆర్థిక ప్రతిపత్తి ఉండదట ఈ దేశాలు తమ 'సాంప్రదాయిక' సామగ్రిని రష్యాకు అమ్మాలట ఇది సామ్రాజ్యవాదులు ఏనాడో అన్నమాటే, చేసినపనే సోవియట్ రివిజనిస్టుల శ్రమ విభజనకు ఫలితమేమంటే, రష్యా పారిశ్రామికంగా ఉంటుంది ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాలు వ్యవసాయికంగా ఉంటాయి ఈ దేశాలను కొల్లగొట్టే ఉద్దేశం తప్ప ఈ సూత్రంలో మరో అర్థంలేదు

5 "మా ప్రమేయం", సోవియట్ రష్యా విస్తృతమైన అంతర్జాతీయ సంబంధాలుగల ఒక అగ్రదేశం గనక, దూరప్రాంతాలలో జరిగే సంఘటనల విషయంలో కూడా తమ ప్రమేయం ఉండాలి, తమ క్షేమమూ, తమ మిత్రుల క్షేమమూ తాము చూసుకోవాలి సోవియట్ నౌకలు తమ దేశ క్షేమంకోసం అవసరమైన ప్రాంతాలన్నిటా సంచరిస్తాయి అగ్రదేశం అయినంత మాత్రాన ప్రపంచమంతటా తన ప్రమేయం ఉండాలని ఏ దేశంగాని అనగలదా? విస్తృతమైన అంతర్జాతీయ సంబంధాలున్నాయని అన్ని ప్రాంతాలకూ యుద్ధనౌకలను పంపి బెదిరింపు చర్యలు చేయగలదా? జార్లు రష్యా సంక్షేమం పేరనే దురాక్రమణచర్యలు చేశారు అమెరికా వాళ్ళు చేస్తున్నారు సోవియట్ రివిజనిస్టుల ధోరణి అందుకు భిన్నంగాలేదు

**ప్రపంచాధిపత్యం గురించి కలలు**

రష్యన్ జార్ చక్రవర్తులు "శ్లావ్" సామ్రాజ్యం గురించి కలలు కన్నారు ఈ నాటి సోవియట్ జార్లు ఆ కలలు అందిపుచ్చుకున్నారు వీరు జార్లకన్న రెండాకులు ఎక్కువ చదివారు వీరు అనేక తూర్పు యూరపు దేశాలనూ, మంగోలియా ప్రజారిపబ్లికునూ తమ వలసలు

చేసుకున్నారు చీనాకు "పెద్దగోడ" ఉత్తర సరిహద్దని ఆక్రోశిస్తున్నారు తమ కబంధహస్తాలను ఆగ్నేయాసియాకూ, మధ్య ప్రాచ్యానికీ, ఆఫ్రికాకూ, లాటిన్ అమెరికాకు సైతం చాచారు తమ యుద్ధ నౌకలను మధ్యధరాకూ, హిందుమహాసముద్రానికీ, పసిఫిక్, అట్లాంటిక్ సముద్రాలకూపంపి, యూరప్, ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలకు తమ సామ్రాజ్యాన్ని విస్తరింపజూస్తున్నారు ఇది వట్టికల

ఎందుకంటే స్టాలిన్ చెప్పినట్టు సామ్రాజ్యవాదం పరాకాష్ట అందుతూనే విప్లవం ప్రారంభమవుతుంది సామ్రాజ్యవాదంలోవుండే వైరుధ్యాలన్నీ సోవియట్ రివిజనిజముకు కుడా వర్తించి తీరుతాయి

"అమెరికా కాగితపు పులి రివిజనిస్టు సోవియట్ రష్యాకూడా కాగితపు పులే" అన్నాడు మావో

సోషల్ ఇంపీరియలిజం కూడా తన ఆశయ సాఫల్యం బెడిసికొట్టగా, తన పతనానికి అనుకూలించే పరిస్థితులు తానే కలిగించుకుంటుంది ఈనాడు తూర్పు యూరపు పేలటానికి సిద్ధంగా వున్న మందుగిడ్డంగిలా వుంది

ప్రపంచ సామ్రాజ్యవాదంతో సోషల్ సామ్రాజ్యవాదం చేరిపోవటంతో సామ్రాజ్యవాదుల మధ్య వైరుధ్యాలు మరింత అయాయి దీని మూలంగా సామ్రాజ్య వాద విధానమే మరింత శీఘ్రంగా విచ్ఛిత్తి కావటం తప్పనిసరి

"సోవియట్ సోషల్ సామ్రాజ్యవాదులకు ఇంటాబయటా కూడా ప్రతిష్టంభనలు ఎదురవుతూ ఉండటంచేత పెద్ద ఎత్తున యుద్ధ చర్యలకు పాల్పడుతున్నారు మావో అన్నట్టు ప్రపంచ యుద్ధం విషయంలో రెండు పరిణామాలే సాధ్యం: అలాంటి యుద్ధం విప్లవాన్ని తెస్తుంది, లేదా విప్లవం అలాటి యుద్ధాన్ని రాకుండా ఆపుతుంది "

ఈనాటి సావియట్ పాలకవర్గం గురించి చీనా కమ్యూనిస్టుల అంచనా ఇలా ఉన్నది దీనితో మన మితవాద కమ్యూనిస్టులు ఎంతమాత్రమూ ఏకీభవించరు మన మార్క్సిస్టు కమ్యూనిస్టులు కూడా పూర్తిగా ఏకీభవించరు కాని పాశ్చాత్య రాజకీయ విలేఖరుల అంచనాలు ఇంచుమించు ఇదే ధోరణిలో వున్నాయి కాకపోతే అందుకు వారు రష్యను పాలకవర్గాన్ని తప్పుపట్టరు సోవియట్ రష్యా జాతీయ విమోచన పోరాటాలను బలహీనపరుస్తున్నదనటానికి ఇతర అధారాలు మనకు ప్రత్యక్షంగా కనిపిస్తున్నాయి ధనిక దేశంగానూ, సైనిక బలం గల దేశంగానూ రష్యా తన ప్రభావాన్ని ప్రపంచ దేశాలపై చూపుతున్నదేతప్ప, మార్క్సిస్టు-లెనినిస్టు అవగాహనతో ప్రపంచ చరిత్రను రష్యా తీర్చి దిద్దుతున్న జాడలు కానరావు నిన్నగాక మొన్న ఈజిప్టులో రష్యాకు పెద్ద పరాభవమే జరిగింది ప్రపంచాధిపత్యం కోసం రష్యా అమెరికాతో పోటీపడటం కూడా ఏమంత విజయవంతమవుతున్నట్టు కనపడదు

"చీనాలో అయేది మరొక దేశంలో అయేది, నూటికి 90 శాతం ప్రజలు చిట్టచివరకు మార్క్సిజం-లెనినిజమును బలపరుస్తారు ప్రజాబాహుళ్యం చిట్టచివరకు విప్లవం చేసితీరుతారు ప్రపంచ విప్లవం విజయం పొంది తీరుతుంది " ఇది మావో విశ్వాసం ఇలాటి విశ్వాసం ప్రకటించే నాథుడు సోవియట్ రష్యాలో కానరాడు

ముద్రణ: సృజన, మాసపత్రిక, సెప్టెంబరు,1972

# 2. సామ్రాజ్యవాదం: పెట్టుబడిదారీ విధానపు అత్యున్నతదశ

–లెనిన్

ప్రపంచంలోకి మానవుడు అవతరించిన నాటినుంచీ, అతడు తన అవసరాలకు గానూ చేసే శ్రమవిధానానికీ, అతడి సమాజం నిర్మాణం కావటానికీ, అ సమాజం తనను తాను పాలించుకునే నియమాలు రూపొందించటానికీ విడరాని సంబంధం వుంటూ వస్తున్నది మానవులు వేటాడటమూ, ఆహారాన్ని ఏరుకోవటమూ చేసే దశలో చిన్నచిన్న ముఠాలుగా జీవిస్తూ, సంచారజీవితం గడిపారు అప్పట్లో వారి సాధనాలూ, ఆయుధాలూ, పరికరాలూ వ్యక్తిపరంగా వుండేవి వారి 'సంపద' మాత్రం సమష్టిగా వుండేది ఆ చిన్న సంఘాలలో ప్రతి ఒక్కరూ తమ పరికరాలను (రాళ్ళనుంచి) తామే తయారు చేసుకునేవారు (అందుకే పరిశోధకులకు రాతిపనిముట్లు లక్షలసంఖ్యలో లభ్యమవుతున్నప్పటికీ వాటిని తయారుచేసిన వ్యక్తుల అవశేషాలు సంపాదించటం గగనంగా ఉంటున్నది) అయితే ఎవడు ఏ జంతువును కొట్టినా, ఎవరు దుంపలనూ, కాయలనూ ఏరినా అందరూ కలిసి అనుభవించేవారు పెద్ద ఎత్తున వేటాడటానికి–ముఖ్యంగా జడలఏనుగులమందలనూ, అడవి గుర్రాలమందలనూ, భయంకరమైన గుహభల్లూకాలనూ వేటాడటానికి–చిన్న చిన్న ముఠాలు ఏకమై, సహకార పద్ధతి అవలంబించేవి అది ఆదిమ సమ సమాజం

తరవాత పశుపోషణా, వ్యవసాయమూ వచ్చి, మనుషులు సంచారజీవితానికి స్వస్తి చెప్పి, స్థిరనివాసాలు ఏర్పాటు చేసుకుని, గణజీవితాలు ప్రారంభించారు కొన్ని కొత్త సాంఘిక ఆచారాలూ, పెళ్ళి వగైరాలకు సంబంధించిన నియమాలూ, వ్యవసాయానికి సంబంధించిన సమష్టి తంతులూ అమలులోకి వచ్చాయి కొంతకాలంపాటు స్త్రీలకు పూర్వంలేని ఆధిక్యత వచ్చింది స్త్రీల "వ్రతాలు" అమలులోకి వచ్చాయి (ఈనాడు మనవాళ్ళు యీ వ్రతాలను మార్పుచేసి పాటిస్తున్నా, ఆ కాలానివి యీనాడు చాలా అనాగరికంగా కనిపిస్తాయి) సాంఘిక 'పరిపాలన'లో అందరూ పాల్గొనేవారు, వాళ్ళు అప్పుడప్పుడూ ఒక నాయకుణ్ణి ఎన్నుకునేవారు

ఇప్పుడు మనం మానవ సమాజ పరిణామదశల వివరాలలోకి పోనవసరంలేదు గమనించవలసింది ఏమంటే, ఉత్పత్తి సాధనాలలో ఒక మౌలికమైన పరిణామం కలిగినప్పుడల్లా సామాజిక వ్యవస్థలో విప్లవపరిణామాలు కలిగాయి ఆ సమాజాల నిర్వహణ (పరిపాలన)లోకూడా అతి విచిత్రమైన మార్పులు వచ్చాయి "సామాజిక విలువలు" అనేక మార్లు తారుమారయాయి తలకిందులయాయి ఉదాహరణకు స్త్రీ స్వామ్యంపోయి పురుషస్వామ్యం వచ్చింది మనుషుల మధ్య సమానత నశించి అసమానతలు ఏర్పడ్డాయి జాతుల మధ్య వుండే వైరాలు జాతులలో కలిగే, వర్గపీడనరూపంలో, ప్రవేశించాయి ఈవర్గపీడనా, దోపిడీ వీలయినంత 'శాంతంగా' కొనసాగటానికి చిత్రవిచిత్రమైన మతాలు పుట్టుకొచ్చాయి ఒకప్పుడు 'సంస్కృతి' (కల్చర్) అనేది కేవలము మనుష్యులు సంపదను సృష్టించటానికి ఉపయోగించే సాధనాలకూ, వాటితో సృష్టి అయ్యే సంపదకూ పరిమితమై ఉండేది రాను రాను అదే మనుషులు అసమ–దోపిడీ–వర్గ సమాజంలో సృష్టించే విశ్వాసాలకూ, ఆచారాలకూ, కళలకూ విస్తరించింది పల్లెలు (ఒకప్పుడు ఆటవికుల గూడెములు) గ్రామాలుగా

మారాయి వ్యాపారవస్తూత్పత్తి విస్తరించటంలో పట్టణాలు (సముద్రతీరపు రేవులు), నగరాలు (వర్తక కేంద్రాలు) పుట్టుకొచ్చాయి నాగరికత అన్నది సంపన్నుల జీవితాల ఉచ్ఛదశను సూచించటానికి పుట్టింది చిత్రమేమంటే నాగరికతకూ, సంస్కృతికీ మధ్య గండి ఏర్పడింది– ఏ మాత్రమూ సంస్కారంలేని పశుప్రాయులు నాగరికతతో ఓలలాడగలగటం మనం కళ్ళారా చూస్తున్నాం, నాటకాలలో చిత్రిస్తున్నాం!

మనిషి తన అవసరాలకు మించి పదిమందికి సరిపడే సంపదను సృష్టించే ఆర్థిక వ్యవస్థ చరిత్ర పూర్వయుగంలోనే ఏర్పడింది సమాజాన్ని శాసించగలవర్గాలు శ్రామిక వర్గాన్ని, సంపదను సృష్టించటానికి నియోగించి, తాము ఐశ్వర్యంలోనూ, ఐహిక భోగభాగ్యాల లోనూ ఓలలాడాయి మనుషులను బానిసత్వంలో ఉంచారు బానిసల గిరాకీ గ్రహించి కొందరు బానిస వర్తకులుగా తయారయి అంతులేని ధనం సంపాదించారు ఒకనాటి పశుపోషణస్థానంలో మనిషి పోషణ వచ్చింది అరేబియన్ నైట్స్ కథలలో ఖలీఫాల సంపదనూ, వర్తక శ్రేష్ఠుల సంపదనూ, జాతక కథలలో వర్తక శ్రేష్ఠుల సంపదనూ, మార్కోపోలో వర్ణించిన కుబ్లాయిఖాన్ సంపదనూ ఊహిస్తే దిగ్భ్రాంతి కలుగుతుంది కాని ఆ కాలంలో అత్యధిక సంఖ్యాకులు దుర్భర కృత్రిమ దారిద్ర్యానికి గురి అయారు

సామాజిక పరిస్థితిలో విప్లవకరమైన మార్పులు తెచ్చినది పారిశ్రామిక యుగం యంత్ర నిర్మాణం, పెట్టుబడిదారీ విధానం పారిశ్రామిక విప్లవానికి ముందు కూడా వ్యాపార సరుకులూ, పెట్టుబడీ, యంత్రాలూ ఉండేవి కాని కొత్తగా వచ్చిన యంత్రాలు శక్తిచోదిత యంత్రాలు ఈ యంత్రాలు రాకపూర్వం వేరు వేరు వృత్తుల వాళ్ళు, తమ ఉపకరణాలను తామే తయారుచేసుకునేవారు లేదా సొంతం చేసుకునేవాళ్ళు కాని ఈ యంత్రాలు కార్మికుడు సొంతంగా సంపాదించగలవికావు భారీ అయినవి సాంకేతిక ప్రావీణ్యంతో కకూడుకున్నవి వాటిని ఎలా తయారుచేస్తారో కార్మికుడికి తెలియదు వాటిని తయారుచేసే ఇంజనీర్లు సాటి కార్మికులు కారు కార్మిక వర్గానికి చెందిన వారు కూడా కారు ఆ యంత్రాలను నడిపే శక్తి–ఆవిరీ, విద్యుత్తూ వగైరా–యంత్రాలను మరింత క్లిష్టంచేసింది కార్మికుడికి ఆ యంత్రాలు ఎలా పనిచేస్తాయో, వాటిలో తన చేతులూ, కాళ్ళూ పడి తెగిపోకుండా ఎలా జాగ్రత్తపడాలో తెలిసివుంటే చాలు ( అది లేకే యంత్రాలతో అసంఖ్యాకులు వికలాంగులు కావడమూ, బలికావటమూ జరుగుతూ వస్తున్నది )

చేతివృత్తులతో వస్తువులు ఉత్పత్తి అయినకాలంలో పనివాడి నైపుణ్యానికి గణన ఉండేది తాను ఏ వస్తువును తయారు చేస్తున్నదీ మొదటినుంచి చివరిదాకా వాడికి తెలుసును కాని ఇప్పుడు నైపుణ్యం యంత్రంలోకి వెళ్ళిపోయింది కార్మికుడికి తాను చేసే వస్తువు చివరి ఆకారంతో ప్రమేయం లేదు వాడి పని ఆ వస్తువు నిర్మాణంలో ఒక దశకు మాత్రమే సంబంధించి ఉండవచ్చు అది ఏ మోటారు కారులాటి పెద్ద వస్తువుకు చెందిన ఒక చిన్న భాగం కావచ్చు ఆ చిన్నభాగం కూడా రెండుమూడు దశలు దాటితేగాని రూపుదాల్చదు ఈ విధంగా ఉత్పత్తి అయే వస్తువుకూ, దాన్ని ఉత్పత్తి చేసే కార్మికుడికీ మధ్య పెద్ద గండిపడింది ఉత్పత్తి అయిన సరుకు ఎక్కడికి పోతుందో, దానికి ఎంత ధర వస్తుందో కార్మికుడికి తెలీదు పట్టదు

అయినప్పుడు కార్మికుడు ఎందుకు పనిచేస్తాడు? వేతనంకోసం, ఆ వేతనం ఎలా నిర్ణయమవుతుంది? సమాజంలో వాడి స్థాయినిబట్టి వాడి శ్రమశక్తికి విలువకట్టి, పారిశ్రామికులు దాన్ని ఇతర విక్రయవస్తువులను కొన్నట్టే కొంటారు ఈ కారణంగా కార్మికుణ్ణి సాధ్యమైనంత హీనస్థితిలో ఉంచటం పారిశ్రామిక సమాజానికి లాభకరం కార్మికుడి శ్రమను కొని, దాని సహాయంతో సరుకులు ఉత్పత్తి చెయ్యటం చేత పెట్టుబడిదారు- పారిశ్రామికుడికి "అదనపు విలువ" సరుకుల మీద లభిస్తుంది ఈ విషయాన్ని "కేపిటల్"లో మార్క్స్ రుజువుచేశాడు

ఇందులో దురన్యాయమూ, దోపిడీ ఉన్నాయి దీన్ని మొదట పారిశ్రామికులు ఆమోదించలేదు గాని, దాస్తే దాగనిసత్యం కనక, కార్మిక సంఘాలనూ, తమస్థాయి పెంచుకోవటానికి వారు జరిపే పోరాటాలనూ చట్టబద్ధంగా అనుమతించక తప్పలేదు పారిశ్రామికంగా ముందుకు వచ్చిన దేశాలలో కార్మికులు పోరాటాల ద్వారా తమ స్థాయిని పెంచుకున్నారు

ఇతరత్రా యంత్రయుగం సామాజికంగా చాలా మేలుచేసింది వినియోగవస్తువుల సంఖ్యా, నాణ్యమూ అపారంగా పెరిగి, నాగరిక జీవితం శరవేగంతో ముందుకు పోసాగింది రైళ్ళూ, కార్లూ, విమానాలూ, తంతితపాలాలూ, రేడియోలు రోగనిదానపు క్రియలూ లాటివి అసంఖ్యాకంగా వచ్చి, ప్రజల సుఖ సౌభాగ్యాలకూ, దీర్ఘాయువుకూ, మనిషి జ్ఞానం అభివృద్ధి కావటానికీ ఎంతో దోహదం జరిగింది భారీ పరిశ్రమలనూ, భారీ వ్యాపారాన్నీ పురస్కరించుకుని మహానగరాలు వెలిశాయి అంతర్జాతీయ సంబంధాలు పెరిగాయి ఈ నాగరికత మానవ జీవితంలో మూఢవిశ్వాసాలకు ఎక్కువ ఆస్కారంలేకుండా చేసింది

కాని దీనికి రెండోపక్క పెట్టుబడిదారీ అన్నది అనేక వైరుధ్యాలను సృష్టించింది అనేక జీవితపు విలువలను అస్తవ్యస్తం చేసింది అనేక తీవ్ర సమస్యలను తెచ్చిపెట్టింది వాటికి పరిష్కారం కావలసివచ్చింది ఒక్కముక్కలో చెప్పాలంటే, పెట్టుబడిదారీ తెచ్చిపెట్టిన అత్యంత తీవ్ర సమస్య సామ్రాజ్యవాదం, దానికి ఒకే ఒక పరిష్కారం శ్రామిక విప్లవం

సామ్రాజ్యవాదమంటే యాదృచ్ఛికంగా కొన్ని దేశాలు అవలంబించిన ఒకానొక రాజకీయ విధానం కాదనీ, పెట్టుబడిదారీ తన అభివృద్ధిని పురస్కరించుకొని ఆ దశకు చేరుకున్నదనీ లెనిన్, రష్యాలో విప్లవం జరగకముందే రుజువుచేస్తూ యీ గ్రంథం రచించాడు

పెట్టుబడిదార్లు యంత్రాలను కొనగల ధనికులు ఆరంభదశలో వాళ్ళు తాము తలపెట్టిన ఉత్పత్తి శాఖలో సాంకేతిక ప్రావీణ్యం కలవారై కూడా ఉండేవారు ఉత్పత్తి "అరాజకంగా" సాగేది ఎవరికి సాధ్యమైనంత విరివిగా వారు ఉత్పత్తులు తయారుచేసి మార్కెట్టుమీదికి ఎగదోసేవారు ఒకరితో ఒకరు పోటీపడి సరుకులను సాధ్యమైనంత తక్కువ ధరలకు-అంటే కనీస లాభాలకు-అమ్మేవాళ్ళు (ఇది పెట్టుబడిదారీలో ఉండే సుగుణంగా చెప్పుకోబడేది) అలాగే వస్తువుల నాణ్యంలోకూడా పోటాపోటీ ఉండేది ఈ పోటీ ఒకరినుంచి ఒకరు తమ యంత్రపరికరాలను అభివృద్ధిచేసుకోవటంలో కూడ ఉండేది

గతితార్కిక దృష్టి లేని వాళ్ళు భూతల స్వర్గానికి యంత్రాలు పునాదివేశాయని నమ్మారు కాని యీ పోటీ తనను తానే నాశనం చేసుకుంటుందని జోస్యం చెప్పినవాడు మార్క్స్ కొంతవరకు మనం దీన్ని సులువుగానే గ్రహించవచ్చు పోటీ అన్నతరవాత దుర్బలుడు

ఓడిపోవటమూ, బలవంతుడు గెలవటమూ ఉంటుంది పెట్టుబడిదారీ సంస్కృతి దృష్ట్యా బలవంతుడెవరు? ఎక్కువ పెట్టుబడి పెట్టి, ఎక్కువ భారీయంత్రాలు కొని, ఎక్కువ మంది కార్మికులను నియోగించి, వారి శ్రమశక్తిని ఎక్కువగా దోచి బక్కవాళ్ళను దివాలా ఎత్తించగలవాడు ప్రత్యర్థులు చితికిపోయిన దాకా నష్టానికైనా సరే సరుకులమ్మి, చితికిపోయిన పరిశ్రమలను కారు చౌకగా కొనేసి, వాటిని నడిపిన వాళ్ళకు తన ఫ్యాక్టరీలలో ఉద్యోగాలు ఇయ్యగలవాడు ఇది పెట్టుబడి కేంద్రీకరణకు దారితీస్తుందనీ, కాలక్రమాన పారిశ్రామిక సత్తా అంతా కొద్ది మంది గుత్త అవుతుందనీ మార్క్స్ చెప్పాడు

ఇంతేకాదు, పెట్టుబడిదారీ కింద వస్తూత్పణం జరిగి తీరుతుంది ఉత్పత్తిలో ఉన్న అరాజకం వస్తువులను గిరాకీకి మించి తయారు చేస్తుంది అవి అమ్ముడు కావు ఆర్థిక మాంద్యం ఏర్పడుతుంది ఫ్యాక్టరీలు మూస్తారు కార్మికులకు ఉద్యోగాలు ఊడుతాయి వాళ్ళు కఠోర దారిద్ర్యం వాతపడతారు డిప్రెషన్, సరుకులన్నీ, అమ్ముడయిన దాకా ఈ డిప్రెషన్ కొనసాగుతుంది తిరిగి పరిశ్రమలకు కదలిక వస్తుంది ఇలా పెట్టుబడిదారీ కింద పగలూ, రాత్రిలాగా సామాజిక స్తంభనా, కదలికా ఉంటూ వస్తాయి

అయితే దీనికి ఒక విరుగుడు ఉన్నది ప్రపంచంలో పారిశ్రామికంగా వెనకబడి ఉన్న దేశాలు చాలా ఉన్నాయి వాటిని మార్కెట్లుగా చేసుకుంటే, దేశీయ గిరాకీని మించి వస్తుజాలాన్ని ఉత్పత్తి చేయవచ్చు అలాటి దేశాలలో ముడిసరుకులు పుష్కలంగా దొరుకుతాయి వాటిని తీసుకురావచ్చు ఇది వర్తకులతో కూడినపని ఈ విధానాన్ని ముందుగా అవలంబించి, ఎక్కువ లాభం పొందినవారు బ్రిటిషు వర్తకులు, "ప్రతి బ్రిటిషువాడూ వర్తకుడే" అన్నమాట ఇందుకే పుట్టింది

బ్రిటనుతో ఇతర పారిశ్రామిక దేశాలు పోటీచేసి వాటి మార్కెట్లను (వర్తక క్షేత్రాలను) అవి చూసుకున్నాయి ఇలా చూసుకున్న పారిశ్రామిక దేశాల మధ్య సహజంగా ఘర్షణ ఏర్పడింది అంతేగాక, పారిశ్రామిక దేశాలకు మార్కెట్లు అయిన దేశాలలో కొంత సంచలనం ఏర్పడింది వాటికి విదేశీ వర్తకం కొత్త కాకపోయినప్పటికీ, పారిశ్రామిక దేశాలతో వర్తకం అయేసరికి వాటి సామాజిక స్వరూప స్వభావాలలో కొన్ని మార్పులు జరిగాయి విదేశీ వర్తకులకు దళారీలుగా పనిచేసే వర్గం ఒకటి అక్కడ సృష్టి అయింది కొత్త వైరుధ్యాలు తలఎత్తాయి

పారిశ్రామికంగా అభివృద్ధి అయిన దేశాలు వలసలలో తమ పరిపాలన స్థాపించటం అనివార్యమయింది "వర్తకం వెంట జెండా వచ్చింది" పందొమ్మిదో శతాబ్ద అంతానికే ప్రపంచమంతటా తమ వలసలను ఏర్పరచుకున్నాయి ఇక ఆక్రమించుకోవటానికి ఏమీలేదు

కాని కథ అంతటితో ఆగిపోలేదు ఆగిపోయినది ప్రపంచ విభజన మాత్రమే అటు వివిధ సామ్రాజ్య దేశాల మధ్య ప్రపంచ పునర్విభజనకోసం ఘర్షణ సాగింది ఆ ఘర్షణ ఫలితమే మొదటి ప్రపంచ యుద్ధం ముందుగా పారిశ్రామికోన్నతి సాధించిన బ్రిటన్, ఫ్రాన్స్‌లను జర్మనీ ఎలా సవాలు చెయ్యగలిగింది? దీని వెనక ఉన్నది పెట్టుబడిలో కలిగిన గొప్పమార్పు పెట్టుబడి విధానంలో కలిగిన మార్పులు సామ్రాజ్యవాదం రావటంలో కీలకపాత్ర వహించాయి

పారిశ్రామిక యుగపు ఆరంభదశలో ఉండినది పారిశ్రామిక పెట్టుబడి భారీ ఎత్తున విదేశీ వ్యాపారం సాగటానికి మర్కంటైల్ పెట్టుబడి వచ్చింది అటుతరవాత ఫైనాన్స్ పెట్టుబడి వచ్చింది ఈ పరిణామం గుత్త సంస్థల వల్ల సాధ్యమయింది పెద్ద పెద్ద బాంకులు ఈ పరిణామంలో అత్యంత ప్రధాన పాత్ర వహించాయి పెట్టుబడికి అంతర్జాతీయ లక్షణాలను తెచ్చిపెట్టాయి 1916 నాటికి జరిగి ఉన్న, జరుగుతున్న ఈ పరిణామాలను లెనిన్ విపులీకరించుతూ, సామ్రాజ్యవాదం గురించి ప్రచారంలో ఉండిన తప్పుడు అభిప్రాయాలన్నిటినీ ఖండించి, పెట్టుబడిదారీ యొక్క అత్యున్నత దశే సామ్రాజ్యవాదమనీ, అటుతరవాత అది పతనం కావటమేననీ సూచించాడు

1914 ప్రపంచ యుద్ధం నుంచి "ప్రపంచ వ్యాప్తమైన ఒక విప్లవ సంక్షోభం ఉత్పన్నమవుతోంది దీని దశలు ఎంత దీర్ఘంగా, బాధాకరంగా ఉన్నప్పటికీ, అది పారిశ్రామిక వర్గ విప్లవంతో తప్ప, దాని విజయంతోతప్ప, అంతమవదు" అని లెనిన్ చెప్పాడు

పెట్టుబడిదారీ సామ్రాజ్యవాదంగా మారటం ఎలా జరిగినదీ లెనిన్ సాకల్యంగా వివరించాడు అందులో వేరు వేరు దశలు

1 ఉత్పత్తి కేంద్రీకరణ ద్వారా పెట్టుబడి సంస్థలు ఏర్పడ్డాయి

జర్మనీలో 1882-1907 మధ్య కాలంలో పెద్ద పరిశ్రమల సంఖ్య మూడింతలు పెరిగింది మొత్తం కార్మికులలో మూడోవంతు వాటిలో పనిచేశారు ఆ పరిశ్రమలు మొత్తం శక్తిలో ముప్పాతిక భాగం ఉపయోగించాయి మొత్తం పరిశ్రమలలో అవి వెయ్యింట 9 మాత్రమే!

అమెరికాలో యీ కేంద్రీకరణ యింకా బాగా జరిగింది అక్కడ 1890-1909 మధ్య 10 లక్షల డాలర్లను మించిన విలువగల సరుకులను ఉత్పత్తి చేసే పెద్ద సంస్థల సంఖ్య 1900 చిల్లరనుంచి 3000 చిల్లరకు పెరిగింది వాటిలో పనిచేసే కార్మికుల శాతం సుమారు 25 నుంచి 30కి పెరిగింది వాటిలో ఉత్పత్తి అయే సరుకుల విలువ 38శాతం నుంచి దాదాపు 44 శాతం దాకా పెరిగింది 1909 నాటికి యీ పెద్ద సంస్థలు మొత్తం సంస్థలలో నూరోవంతు అవి తయారుచేసిన సంపద మొత్తం సంపదలో సగం!

"ఈవిధంగా పోటీ పద్ధతి గుత్తాధిపత్యంగా మార్పుచెందటం ఆధునిక పెట్టుబడిదారీ విధానం యొక్క అతి ప్రధానమైన పరిణామాల్లో ఒకటి ఇదే అతి ప్రధానమైన పరిణామం అనికూడా చెప్పవచ్చు "

ఈ సందర్భంలో లెనిన్ "ఉత్పత్తి సమ్మిశ్రణ" గురించి కూడా ప్రస్తావించాడు సమ్మిశ్రణమంటే ఒక పరిశ్రమకుచెందిన వివిధ శాఖలూ, అనుబంధ శాఖలూ ఒకే యాజమాన్యం కిందికి రావటం ఇందుకు హెచ్ జి వెల్స్ ఒక మంచి ఉదాహరణ యిచ్చి వున్నాడు ఫోర్డ్ మోటారు కంపెనీ పైవాళ్ళ జోక్యాలనుంచి విముక్తి కావటానికి మోటారు కార్ల తయారీకి కావలసిన ముడి సరుకుల వనరులు-ఇనుమూ, బొగ్గూ వగైరా గనులూ- కలప కోసం అడవులతో సహా సొంతం చేసుకున్నదట "ఆర్థిక మాంద్యం తీవ్రరూపం ధరించినప్పుడు మిశ్రమసంస్థలు (విడి సంస్థలతో) పోటీలో ఎక్కువ బలమైన స్థానం ఆక్రమిస్తాయి ఎందుచేతనంటే, ముడిపదార్థాల ధరలు తయారీ వస్తువుల ధరలతో సమానంగా పడిపోవు" అన్నాడు లెనిన్

ఇలా ఏర్పడిన భారీ పరిశ్రమలకు మద్దతు ఇచ్చేవి పెద్ద బాంకులు ఈ బాంకుల పాత్రను లెనిన్ తరవాత వివరించాడు

గుత్త సంస్థల అభివృద్ధిలో లెనిన్ మూడు చారిత్రక దశలు చెప్పాడు

1860–70 మొదటి దశ ఇది ప్రపంచ ఆర్థిక మాంద్యంతో ప్రారంభమయింది ఈ కాలంలో యూరపుకు సంబంధించినంతవరకు స్వేచ్ఛాయుతమైన పోటీ తారాస్థాయికి వచ్చింది బ్రిటనులో పాతకాలపు పెట్టుబడిదారీ వ్యవస్థ పూర్తి అయింది (1870–80) 1873లో భయంకరమైన అఘాతం కలిగింది ఆ తరవాత ఏర్పడిన మాంద్యం నుంచి 1889–90లో కొంత కోలుకోవటం జరిగింది అప్పుడు కార్టెల్స్ (గుత్త సంస్థలు) విరివిగా పుట్టాయికాని అవి నిలవలేదు ఆ తరవాత 1890–1900 మధ్య కార్టెల్స్ పద్ధతి ఒక స్థిరత్వాన్ని సాధించింది

“ఈ కార్టెల్స్ విక్రయపు షరతులూ, చెల్లింపు తేదీలూ మొదలైన విషయాలపై ఒప్పందాలు కుదుర్చుకుంటాయి మార్కెట్లను తమలో తాము విభజించుకుంటాయి తాము ఉత్పత్తి చేయవలసిన సరుకుల మొత్తాన్నీ, ధరలనూ నిర్ణయించుకుంటాయి లాభాలను పారిశ్రామిక సంస్థల మధ్య పంచుకుంటాయి ఇలాగే అనేక విషయాలపై ఒప్పందం కుదుర్చుకుంటాయి ”

అమెరికాలో 1900లో స్థాపించిన స్టాండర్డ్ ఆయిల్ కంపెనీ దాదాపు 21 కోట్లడాలర్ల పెట్టుబడితో ఏర్పడి, 9 ఏళ్ళ కాలంలో 36కోట్ల 70 లక్షల డాలర్లు లాభాల రూపంలో పంచింది (దీనితో పోటీచేసి చిన్న కంపెనీలు నూనెను తక్కువ ధరకు అమ్మితే ఆ నూనె అంతా తన ఏజెంట్లద్వారానే కొనిపించి, తన ధర పడిపోకుండా కాపాడుకున్నది ఒక రైల్వే కంపెనీ తన నూనె రవాణాలకు ప్రత్యేకమైన రేట్లు ఇయ్యకపోతే ఆ రైల్వేలో సమ్మె తెప్పించి, తనకు ప్రత్యేకరేటు యిచ్చినదాకా సమ్మె సడలకుండా చేసింది గుత్త ఉత్పత్తి సంస్థ ఎన్ని రకాల దుర్మార్గాలకు పూనగలదో దీని చరిత్రచూస్తే తెలుస్తుంది )

విడి పారిశ్రామికుల్లాగాకాక గుత్త సంస్థలు ప్రపంచ ముడిసరుకులను సరిగా అంచనా వెయ్యగలవు మార్కెట్లనూ ధరలనూ నిర్ణయించగలవు పేటెంట్లు కొని వెయ్యగలవు యంత్రాలను ఎప్పటికప్పుడు మెరుగుపరుచుకోగలవు ఎలాటి పోటీనైనా ఎదుర్కోగలవు ఉత్పాదనశక్తిని అత్యున్నత స్థాయిలో ఉంచగలవు సాంకేతిక పరిశోధనలు జరుపగలవు అత్యంత ప్రవీణులైన ఇంజనీర్లనూ, రైల్వేలలాటి రవాణా సాధనాలనూ స్వాధీనంలో ఉంచుకోగలవు

అవి చెయ్యగల వ్యతిరేక చర్యలు కూడా ఉన్నాయిః ముడిపదార్థాల సరఫరాకు అడ్డంతగలటం, కార్మికుల సరఫరాకు అంతరాయమైన ఒప్పందాలు చేసుకోవటం (ట్రేడ్ యూనియన్ సభ్యులు కార్టెల్స్‌కిందనే పనిచెయ్యాలన్న ఒప్పందం), సరుకులను వినియోగదార్లకు అందకుండా బిగించటం, తమకు లొంగిరాని ఉత్పత్తి దార్లను నాశనం చెయ్యటానికి ధరలు పడగొట్టటం వగైరాలు

1912లో డా ఫ్రిట్‌వెస్ట్‌నర్ అన్నాడు “తెలివైన వ్యాపారస్థుడికివి రోజులు కావు చట్టావ్యాపారంలో ఆరితేరినవాడు అతని స్థానం ఆక్రమించాడు “ఎందుచేతనంటే వాడికి పారిశ్రామిక సంస్థలకూ బ్యాంకులకూ మధ్య సంబంధాలూ, వాటికి గల అవకాశాలూ బాగా తెలుసు ద్రవ్యసంబంధమైన ఎత్తు, పై ఎత్తులలో ఆరితేరిన వాళ్ళేలాభం పొందగలుగుతున్నారు

గుత్త సంస్థలు (కార్టెల్స్, ట్రస్టులు, సిండికేట్లు) బలపడటానికి కారణం ముడి పదార్థాలు లభించే ప్రాంతాలు స్వాధీనంలోకి రావటం

ఈ గుత్త సంస్థల నిర్వహణలో బాంకులు కీలక పాత్ర నిర్వహిస్తాయి

డబ్బుచేత పిల్లలు పెట్టించటం బాంకులపని జడంగా వుండే డబ్బు వాటిలో పోగుపడుతుంది బాంకులు ఆ డబ్బును పెట్టుబడిదారులకు అందించి, దానికి చైతన్యం కలిగిస్తాయి పరిశ్రమలు పెరిగి గుత్తపరిశ్రమలు వెలిసినట్టే, బాంకులు కూడా బడా బాంకులకు దారితీశాయి

"అనేక చిన్న చిన్న దళారీ సంస్థలు బహుకొద్ది గుత్త సంస్థలుగా రూపొందుతాయి ఇలా మార్పు చెందేక్రమం, పెట్టుబడిదారీ విధానం సామ్రాజ్యవాదంగా అభివృద్ధి చెందే ప్రధాన పరిణామక్రమాల్లో ఒకటి "

బాంకింగు కేంద్రీకరణకు లెనిన్ ఇచ్చిన ఉదాహరణలు:

1907-8కీ 1912-13కూ మధ్యగల అయిదేళ్ళలో జర్మనీలోని మొత్తం బాంకు డిపాజిట్లలో 47శాతం నుంచి 49శాతం 9 అతిపెద్ద బాంకులలోనూ, 32న్నర శాతం నుంచి 36 శాతం 43 పెద్ద బాంకులలోనూ పెరిగాయి చిన్నబాంకులలో డిపాజిట్ల శాతం 20న్నర నుంచి 15కు తరిగింది అనేక చిన్న బాంకులు పెద్దబాంకుల శాఖలుగా మారాయి 1909నాటికి ఈ తొమ్మిది అతి పెద్ద బాంకుల పెట్టుబడి మొత్తం బాంకుల పెట్టుబడిలో 83శాతం ఉన్నది!

ఆరు పెద్ద బెర్లిన్ బాంకులకు 1895లో 16 బ్రాంచీలుండేవి 1911 కు అవి 104 నాటి డిపాజిట్ బాంకులూ, ఎక్స్‌చేంజి ఆఫీసులూ 14 నుంచి 276కు పెరిగాయి ఇలాటి పరిణామమే బ్రిటను, ఫ్రాన్సులలోకూడా జరిగింది

"జర్మనీని నేడు పాలించే 300 మందీ క్రమంగా 50కీ, 25కీ మరింతగాకూడా తగ్గుతారు కేంద్రీకరణకేసి సాగే ఈ ఆధునాతన ధోరణి బాంకింగుకు మాత్రమే పరిమిత మవుతుందనుకోలేం చివరకు మన కళ్ళ ఎదుట ట్రస్టులు తప్ప మరేదీ కనబడని స్థితి రావచ్చు" అని డై బాంకు వ్యాఖ్యానించింది

" పెట్టుబడుల కేంద్రీకరణనూ, గుత్త సంస్థల నిర్మాణాన్నీ బాంకులు చాలా తీవ్రతరం చేస్తాయి " కేంద్రీకరణఫలితంగా కొద్ది బాంకులు మొత్తం పెట్టుబడిదారీ వ్యవస్థకు అగ్రభాగంగా ఉన్నాయి పెద్ద పెద్ద పరిశ్రమలు కొద్దిపాటి బాంకింగు గ్రూపులమీద ఆధారపడే స్థితి నానాటికీ పెరుగుతోంది

ఇంతేకాదు భారీ పరిశ్రమలకూ, బడాబాంకులకూ మధ్య 'వియ్యం' బలపడింది ఇటు బాంకులలోనూ, అటు గుత్త పరిశ్రమలలోనూ కూడా ఘనమైన పాత్రలు నిర్వహించే వారు వచ్చారు

జర్మనీలో 1910 నాటికే అతిపెద్ద పారిశ్రామిక వేత్తలు 56 మంది 6 పెద్దబాంకులలో సూపర్వయిజరీ బోర్డుడైరెక్టర్లుట 1895 నుంచి 1910 దాకా ఆ ఆరు బాంకులూ షేర్లనూ, బాండ్లనూ కొన్న పారిశ్రామిక సంస్థల సంఖ్య 281 నుంచి 418కి పెరిగిందట "ఈ విధంగా బాంకులు పారిశ్రామిక సంస్థలతోనూ, పారిశ్రామిక సంస్థలు బాంకులతోనూ సంలీనం" అయాయి

బాంకులకు ప్రభుత్వముతో కూడా యిలాటి "వియ్యం" ఉన్నది "హోదాగల వ్యక్తులకూ, మాజీ సివిల్ సర్వెంట్‌లకూ సూపర్వయిజరీ బోర్డులలో ఉచితంగా స్థానాలీయబడ్డాయి వీరు అధికార్లతో సంబంధాలను చక్కబరచుకోడానికి ఎంతగానో కృషిచేయగలవారు సాధారణంగా ఒక పెద్ద బాంకు సూపర్వయిజరీ బోర్డులో ఒక పార్లమెంటు సభ్యుడైనా, ఒక బెర్లిన్ సిటీ కౌన్సిలర్ అయినా సభ్యుడిగా ఉంటాడు " (యుద్ధకాలంలో మనకు వైస్రాయిగావుండి ఇంగ్లండుకు తిరిగి వెళుతూనే లార్డ్ లిన్లిత్‌గో ఇంపీరియల్ కెమికల్ ఇండస్ట్రీకి డైరెక్టరు కావడం మన కళ్ళ ఎదుటనే జరిగింది)

మరొకటి ఏమిటంటే, బాంకుల సంబంధాలు సర్వతోముఖంగా వ్యాప్తి చెందటంతో ఆ పరిణామాన్ని సూచించేవిధంగా, బాంకుడైరెక్టర్లు ఒక్కొక్కడూ ఒక్కొక్క ప్రత్యేకశాఖలో నిపుణుడై ఉంటాడు "ఒక డైరెక్టరు జర్మన్ పరిశ్రమల్లో మాత్రమే నైపుణ్యం చూపుతాడు మిగతావారు విదేశ ప్రభుత్వాలతోనూ, పరిశ్రమలతోనూ గల సంబంధాల్లో నైపుణ్యం సంపాదిస్తారు మరికొందరు పారిశ్రామికవేత్తల, తదితరుల స్వభావాలను గురించి సమాచారం సేకరించడంలోనూ, స్టాక్ ఎక్స్‌చేంజి మొదలైనవాటి విషయంలోనూ ప్రావీణ్యం పొందుతారు అంతేగాక, ఒక్కొక్క బాంకుడైరెక్టరుకు తరచు ఒక్కొక్క ప్రాంతం, లేదా ఒక్కొక్క పారిశ్రామిక శాఖ కేటాయించబడుతుంది "

బాంకుల పెట్టుబడీ, పారిశ్రామిక పెట్టుబడీ సంలీనం అవుతున్నాయంటే, అది శాంతియుతంగానూ, సౌమ్యంగానూ జరుగుతున్నదనుకోనవసరం లేదు "పారిశ్రామిక వ్యాపారవర్గాలు చాలా తరచుగా బాంకుల 'జబర్దస్తీ' గురించి ఫిర్యాదులు చేస్తూ ఉంటారు పెద్ద-బాంకులు 'ఆజ్ఞాపిస్తూ'ఉంటాయి "

బెర్లిన్‌లోని చాలా పెద్దబాంకు 1909 నవంబరు 19న ఒక పెద్ద సిమెంటు సిండికేట్ డైరెక్టర్ల బోర్డుకు ఘాటుగా ఉత్తరం రాసింది డైరెక్టర్లు బాంకుకు సమ్మతంగాని నిర్ణయాలు చేయబోతున్నారట అందుచేత "మేమిదివరలో మీకియ్యడానికి అంగీకరించిన రుణాన్ని ఉపసంహరించుకోవలసి వస్తుందని తెలియజేయుటకెంతో చింతిస్తున్నాం" అలాంటి బెదిరింపులు సిండికేటు అల్పమైనదేమి కాదు కాకపోతే బాంకు మరింత గొప్ప పహిల్వాన్! లెనిన్ చెప్పినట్టు "చిన్న పెద్ద పెట్టుబడుల మధ్య జరుగుతూ వచ్చిన పాతపోరాటం ఒక నూతన అభివృద్ధి దశలో, అత్యున్నతమైన దశలో, తిరిగి ప్రారంభమవుతోంది "

" పెట్టుబడిదారీ విధానం ఉచ్ఛదశకు చేరుకొంది, కొత్త పెట్టుబడిదారీ స్వేచ్ఛాయుత పోటీతో 'సమన్వయపరచడానికి' దృఢమైన సిద్ధాంతాల కొరకూ, నిర్దిష్టమైన లక్ష్యం కొరకూ అన్వేషించడం వృథా "

అవును పాపం! పెట్టుబడిదారీ చాలా కాలంగా ఆత్మసమర్థనకోసం 'వ్యక్తి స్వేచ్ఛ'లాటి గాలికబుర్లు చెప్పటం తప్ప ప్రజలకు పనికివచ్చే ఒక్క సిద్ధాంతాన్ని గాని లక్ష్యాన్ని గాని బయటపెట్టలేని విషాదస్థితిలో ఉంటున్నది

ఇరవయ్యోశతాబ్దం ఆరంభమవుతూనే ఉత్పత్తిలో మామూలు పెట్టుబడి ఆధిపత్యం పోయి ఫైనాన్స్ పెట్టుబడి అవతరించింది దీన్ని కూడా లెనిన్ విపులీకరించాడు

ఒకప్పుడు పారిశ్రామికులు తమ పెట్టుబడితో పరిశ్రమలు నడిపి, తామే యజమానులుగా ఉండేవారు కాని పారిశ్రామిక పెట్టుబడి అధికంగా బాంకుల నుంచి రావటం ప్రారంభమయాక, అధికారం బాంకులకు సంక్రమించింది బాంకర్లు పారిశ్రామిక పెట్టుబడిదార్లయారు పారిశ్రామిక పెట్టుబడిగా రూపొందిన బాంకు పెట్టుబడిని 'ఫైనాన్స్ పెట్టుబడి' అంటారు

ఈ రకం పెట్టుబడిలో చాలా సౌకర్యాలున్నాయి ఒక గుత్త సంస్థ యజమాని ఆ సంస్థను శాసిస్తాడు అది దాని 'పిల్ల' సంస్థలనూ, వాటి పిల్లలనూ శాసిస్తుంది "10 లక్షల (పెట్టుబడి)తో 160 లక్షలనూ, 320 లక్షలనూ, ఇంకా ఎక్కువ మొత్తాలనూ కంట్రోలు చెయ్యవచ్చు ఒక కంపెనీ వ్యవహారాలను నడపడానికి దాని షేర్లలో 40 శాతం ఉంటేచాలు చిన్న చిన్న, చెదురుమదురు షేర్ హోల్డర్లు సర్వసభ్య సమావేశాలకు హాజరు కావడం ఆచరణలో సాధ్యంకాదు " ఇందుకే అమాయకులు చిన్న చిన్న షేర్ల వాళ్ళకు కూడా పరిశ్రమల్లో స్వామ్యం ఉన్నదనీ, అందులో ప్రజాతంత్రం ఉన్నదనీ భ్రమపడతారు కాని "చిన్నస్థాయి ఉత్పత్తి యొక్క పాత్రనూ, ప్రాధాన్యతనూ పటిష్ఠమొనర్చడం మొదలైనవన్నీ ధనస్వామ్యవర్గం యొక్క అధికారాన్ని పెంచేవే "

జర్మనీలో ప్రభుత్వం చిన్న మొత్తాలలో షేర్లను నిషేధించిన సమయంలో బ్రిటన్‌లో ఒక పౌండు (20 జర్మన్ మార్కుల)షేర్లు జారీచేయబడ్డాయి "ఒకపౌండు షేరు బ్రిటిష్ సామ్రాజ్యవాదం యొక్క పునాది" అన్నారు (పెట్టుబడిదారీకి కాలం చెల్లిపోయిన కారణంగా మన యూనిట్లు భారతీయ సామ్రాజ్యవాదానికి పునాదికాలేక, భారతీయ సామ్యవాదపునాది కావటానికి వ్యర్ధ ప్రయత్నం చేస్తున్నాయా?)

ఈ పద్ధతిలో గుత్తాధిపతుల దుర్మార్గాలకు గొప్ప అవకాశంకూడా ఉన్నది గుత్తసంస్థలకు చిన్న సంస్థలపై పెత్తనం ఉన్నదిగాని, బాధ్యతలేదు యుద్ధకాలంలో ఒక సంస్థ యుద్ధ సామగ్రికి కావలసిన ముడిసరుకులను తయారుచేసే ఒక ఫాక్టరీని స్థాపించింది కొద్దికాలంలోనే దానికి పెట్టుబడిని మించిన లాభాలువచ్చాయి అ లాభాలతో అది ఒక 'పిల్ల' ఫాక్టరీని పెట్టింది దానిమీద లాభాలు బాగా వచ్చాయి అప్పుడా సంస్థ 'పిల్ల' ఫాక్టరీ షేర్లలో సగం వాటా పైవాళ్ళకు అమ్మింది అటుపైన యుద్ధ సంబంధమైన ఆర్డర్లు తల్లి సంస్థకు తరలించబడ్డాయి (ఆర్డర్లు వచ్చేది యజమాని సంస్థకుగాని ఫాక్టరీలకు కాదు) 'పిల్ల' సంస్థ ఎండగట్టుకు పోయింది యజమాని సంస్థకు దమ్మిడీ నష్టం కలగలేదు పిల్ల సంస్థలో షేర్లు కొన్నవారు చేతులు కాల్చుకున్నారు అలా క్షీణించిన షేర్లను యజమానులు చవకగా కొనివెయ్యవచ్చుకూడా

పట్టణాల శివార్లలో అభివృద్ధిలోకి వచ్చే భూములనూ, రైలు మార్గాలుపడే ప్రాంతపు భూములనూ, కాలువలు రాబోయేప్రాంతపు భూములనూ, ముందుగానే టోకున చౌకగా కొనేసి, అంతులేని లాభాలు గడించే అవకాశం, సత్తా పెట్టుబడిదార్లకుంటుంది

ఫైనాన్స్ పెట్టుబడి మరొక మెట్టు ముందుకు పోయి, పెట్టుబడిని ఎగుమతిచేయసాగింది ఈ పని 20వ శతాబ్దంలో బాగా సాగింది బ్రిటను 1862లో ఎగుమతి చేసిన పెట్టుబడి 36 కోట్ల ఫ్రాంకులకు సమానమైతే 1914 నాటికి ఇరవై, ముప్ఫైరెట్లు పెరిగింది అలాగే

ఫ్రాన్సు 1893-1914 మధ్యకాలంలో తన పెట్టుబడి ఎగుమతులను మూడింతలు చేసింది ఆలస్యంగా పెట్టుబడిని ఎగుమతి చెయ్యటం ప్రారంభించిన జర్మనీ 1902-14 మధ్య విదేశీ పెట్టుబడులను 125 కోట్ల ఫ్రాంకులనుంచి 440 కోట్లకు పెంచింది

ఎగుమతి అయేది "అదనపు" పెట్టుబడి అన్నమాట దీనితో స్వదేశంలోనే వ్యవసాయం-వెనకబడి ఉండనేఉన్నది-అభివృద్ధిచేసి, తిండికొరతలేకుండాచేసి, ప్రజల జీవిత ప్రమాణాలను ఎందుకు పెంచగూడదు? కాని పెట్టుబడిదారీ యిలాటి పనులు చేస్తే అది పెట్టుబడిదారీ విధానమే కాదంటాడు లెనిన్ అలాకాక, ఈ అదనపు పెట్టుబడిని బడుగుదేశాలకు ఎగుమతి చేస్తే, అక్కడ భూమివిలువా, కార్మిక వేతనాలూ కారుచౌక గనక, స్వదేశంలోకన్న చాలా రెట్లు లాభాలు వస్తాయి లాభాలు తప్ప ప్రజాహితం పెట్టుబడిదారీ లక్ష్యం ఎంతమాత్రంకాదు

పెట్టుబడి ఎగుమతి చేసే దేశాలకు కొన్ని "సౌకర్యాలు" ఉంటాయి అభివృద్ధిలోకి రాగోరే దేశాలు అప్పులకోసం చేతులు చాస్తాయి సాధారణంగా అప్పులు నిరాకరించటం జరగదు ఎందుచేతనంటే ఒక దేశం నిరాకరిస్తే మరొక దేశం ఇయ్యడానికి సిద్ధంగా ఉంటుంది ఫైనాన్స్ పెట్టుబడిలో పోటీ! అయితే అప్పు మంజూరు చేసే ఒప్పందంలో ఇచ్చే దేశానికి లాభించే క్లాజులుంటాయి ఒక రైలు మార్గం నిర్మించాలనుకుందాం, దాని సంబంధమైన కంట్రాక్టులూ, సామగ్రి ఎగుమతులూ, ఇతరలాభాలూ ఇచ్చే దేశానికి ఉండేటట్టు ఒప్పందం జరుగుతుంది లేదా మారణాయుధాలు కొనాలన్న "క్లాజు" కూడా వుండవచ్చు ఇలాటి రుణపత్రాల్లో "రహస్య" క్లాజులుంటాయి ఈ ఒప్పందాలు నామమాత్రంగా ప్రభుత్వాలమధ్య జరిగినప్పటికీ, ప్రభుత్వాల వెనక పెద్ద గుత్త సంస్థలుంటాయి- లెనిన్ ఆ కాలానికి ఇచ్చిన ఉదాహరణలు జర్మనీలో క్రుప్, ఫ్రాన్స్‌లో స్నీడర్, బ్రిటన్‌లో ఆమ్‌స్ట్రాంగ్ వగైరా ప్రభుత్వాలు వీటిని కాదనలేవు

"ఫ్రాన్స్ రష్యాకు రుణాలిచ్చేటప్పుడు 1905 సెప్టెంబరు 16నాటి వర్తకపు ఒడంబడిక ప్రకారం ఆదేశాన్ని 'పీల్చి పిప్పిచేసింది' అలాగే జపాను కూడా 1911లో రష్యాతో ఒక ఒడంబడిక చేసుకుని, రష్యాను దోచింది సామ్రాజ్యవాదం అవలంబించే దేశాలనుంచి రుణాలకోసం గర్భాలు తెరుచుకుని ఉన్న బడుగుదేశాలగతి ఎప్పుడూ ఇంతే

"ఫైనాన్స్ పెట్టుబడి అక్షరాలా ప్రపంచదేశాలన్నిటి మీదా తన కబంధహస్తాల్ని చాచిందని చెప్పవచ్చు " ఈ పని సాధించటానికి వలస దేశాలలో స్థాపించిన బాంకులూ, వాటి శాఖలూ ఎంతగానో తోడ్పడ్డాయి 1904నాటి బ్రిటన్‌కు వలసదేశాల్లో 50 బాంకులుండేవి 1910కి అవి 72 అయాయి వాటి శాఖల సంఖ్య ఈ మధ్యకాలంలో 2279 నుంచి 5449కి పెరిగింది ఫ్రాన్సుకు 20 బాంకులూ, 136 శాఖలు హాలండుకు 16బాంకులూ, 68శాఖలు జర్మనీకి 17 బాంకులూ, 70 శాఖలు 'మాత్రమే' సహజంగా "తమ స్థితిని చాలా 'జయప్రదంగా' చక్కబెట్టుకున్న 'పాత' వలసరాజ్యాల్ని జర్మన్ సామ్రాజ్యవాదులు ఈర్ష్యతో చూస్తున్నారు "

ఇంకోపక్క "అమెరికన్ పెట్టుబడిదార్లు ఇంగ్లీషు, జర్మన్ పెట్టుబడిదార్లంటే ఈర్ష్య పడుతున్నారు అర్జంటీనా, బ్రెజిల్, ఉరుగ్వాయ్‌దేశాల మొత్తం వ్యాపారంలో 46శాతం వాటిచేతుల్లోవుంది " ఇవాళ పరిస్థితులు ఎలా మారిపోయాయో!

ప్రపంచవిభజన జరిగింది "గుత్త పెట్టుబడిదారీ సంస్థలు మొదట తమదేశాల మార్కెట్లను తమలో తాము విభజించుకుని, తమ దేశాల్లోని పరిశ్రమలను ఇంచుమించు పూర్తిగా గుప్పెట్లో పెట్టుకున్నాయి దేశీయమార్కెట్టు అనివార్యంగా విదేశీమార్కెట్టుతో బంధింపబడి ఉంటుంది పెట్టుబడివిధానం ఏనాడో ప్రపంచమార్కెట్టును సృష్టించింది పెట్టుబడి ఎగుమతి పెరిగేకొద్దీ, పెద్ద పెద్ద గుత్త సంస్థల విదేశీ సంబంధాలూ, వలససంబంధాలూ, 'పలుకుబడి ప్రాంతాలు' సర్వవిధాల విస్తరించే కొద్దీ, పరిస్థితులు 'సహజంగా' ఒక అంతర్జాతీయ ఒప్పందం దశలో, అంతర్జాతీయ కార్టెల్స్‌దిశలో మొగ్గుచూపాయి "

19వ శతాబ్దం అంతానికే అమెరికా, జర్మనీలలో విద్యుత్పరిశ్రమ పూర్తిగా కేంద్రీకృతమై, దానికి భారీ ఎత్తున బాంకుల తోడ్పాటు లభించింది 1907లో అమెరికా, జర్మనీల ట్రస్టులు ఒప్పందం కుదుర్చుకున్నాయి అమెరికా కెనడాలు అమెరికన్ ట్రస్టు (జనరల్ ఎలక్ట్రిక్ కంపెనీ) పరమయాయి, జర్మనీ, ఆస్ట్రియా, రష్యా, హాలెండు, డెన్మార్కు, స్విజర్లాండు, టర్కీ, బాల్కన్ దేశాలను జర్మనుట్రస్టు 'సంపాదించింది' ఇలాటి ట్రస్టులు కలిసి పనిచేసినంతకాలమూ వాటిది ప్రపంచాధిపత్యమే వాటితో ఏ సంస్థా పోటీ చేయలేదు

(అయితే ఇలాటి ట్రస్టులు ప్రపంచాన్ని విభజించుకున్నప్పటికీ, 'అసమాన అభివృద్ధీ, యుద్ధమూ' మొదలైన కారణాలవల్ల వాటిమధ్య ఐక్యత చెడవచ్చు అప్పుడేం జరుగుతుంది? ప్రపంచాన్ని పునర్విభజన చేయటం జరుగుతుంది)

విద్యుచ్ఛక్తి విషయంలో లాగే నూనె (పెట్రోలియం), నౌకానిర్మాణం, ఉక్కుమొదలైన పరిశ్రమలలో కార్టెల్స్ ఏర్పడ్డాయి

కార్టెల్స్ అంతర్జాతీయ పెట్టుబడిగలవికావటం చేత వాటి విజృంభణ అంతర్జాతీయ శాంతికి దారితీస్తుందనే దుర్భ్రమను ఖండిస్తూ లెనిన్, "ఈ అభిప్రాయం సిద్ధాంతరీత్యా అర్థరహితమైనది గుత్త పెట్టుబడిసంస్థలు ఏ మేరకు అభివృద్ధి చెందాయో, వివిధ పెట్టుబడిదారీ సంస్థల మధ్య జరిగే పోరాటం యొక్క లక్ష్యమేమిటో అంతర్జాతీయ కార్టెల్స్ తెలియజేస్తాయి వీటిలో రెండవ అంశం జరుగుతున్న ఘటనల చారిత్రక-ఆర్థిక అంతర్యాన్ని చెప్పగలదు ఎందుచేతనంటే, మారుతున్న కారణాల కనుగుణంగా పోరాటరూపాలు ఎల్లప్పుడూ మారవచ్చు ఆ పోరాటం సారాంశం మాత్రం వర్గాలున్నంత కాలం మారటానికి వీల్లేదు" అన్నాడు

పెట్టుబడిదారిలో గుత్త పద్ధతీ, సామ్రాజ్యవాదమూలాటి దశలు అనివార్యంగా ఏర్పడ్డాయనటానికి లెనిన్ ఈ విధంగా చెప్పాడు

"పెట్టుబడిదార్లు ప్రపంచాన్ని పంచుకొంటున్నారంటే, ఏదో దురాలోచనతో వారీ పనిచేస్తున్నారని కాదు, కేంద్రీకరణ నేడు ఏ స్థాయికి చేరుకున్నదంటే, లాభాలు సంపాదించటానికి వారీమార్గం చేపట్టక తప్పదు వారు (ప్రపంచాన్ని )పెట్టుబడి నిష్పత్తిని బట్టీ, బలాబలాల నిష్పత్తిని బట్టీ పంచుకుంటున్నారు వర్తకపు సరుకుల ఉత్పత్తి, అంటే పెట్టుబడిదారీ విధానం అమల్లో ఉండగా యిదితప్ప మరొక పంపకపు పద్ధతి అసంభవం కాని బలాబలాలు ఆర్థిక రాజకీయ అభివృద్ధిస్థాయిని బట్టి మారుతాయి "

"పలుకుబడి ప్రాంతాలకై జరిగే పోరాటం ఆధారం మీద రాజకీయకూటాల మధ్యా, రాజ్యాల మధ్య కూడా కొన్ని సంబంధాలు ఉత్పన్నమవుతాయి "

చూస్తున్నాం కామా!

1900 నాటికి యూరప్‌లోని అగ్రరాజ్యాలు ఆఫ్రికాలో 90 4శాతం, పోలినేసియాలో 98 9శాతం, ఆసియాలో 56 6శాతం, ఆస్ట్రేలియా అంతానూ తమ అధీనంలోకి తెచ్చుకున్నాయి ఇది ప్రపంచపు "అంతిమ విభజన" ఇందులో మార్పులు కలగాలంటే పునర్విభజన రావాలి అంటే వలసలు ఒకరి యాజమాన్యంనుంచి మరొకరి యాజమాన్యం కిందికి రావాలి లేదా-సామ్రాజ్యవాదం చావుదెబ్బతినాలి

లెనిన్ ఈ గ్రంథం రచించిన అనంతరం రెండు ప్రపంచయుద్ధాలు జరిగాయి ప్రపంచంలో చాలా దేశాలు విముక్తి చెందాయి నయావలసవిధానం అమలులోనికి వచ్చింది ప్రపంచ విప్లవం కొనసాగుతున్నది

గుత్త పెట్టుబడిదారీ పురోగమనంలో అనివార్యంగా సామ్రాజ్యవాదం తప్పనిసరి అయేపరిస్థితి ఏర్పడకపూర్వం, 1840-60 మధ్య, బ్రిటిషు పెట్టుబడిదారీ రాజకీయ నాయకులు వలసవిధానాన్ని వ్యతిరేకించారు వలసలు గుదిబండలని భావించారు కాని 19వ శతాబ్ది అంతానికి ఆ సామ్రాజ్యవాదమే గొప్పదయింది "నిజమైన, వివేకవంతమైన, మితవ్యయంతో కూడిన" విధానమయింది

వలసలు ఏర్పడడంతో చాలదు వాటిని 'జయించాలి' "ఏ ప్రయోజనాలకై పెట్టుబడి ఎగుమతి చేయబడుతుందో, ఆ ప్రయోజనాలుకూడా వలసల్ని జయించడానికి ప్రోద్బలమిస్తాయి ఎందుకంటే, వలసల మార్కెట్లో పోటీదార్లను లేకుండా చేయడానికీ, సప్లయిలు లభించేటట్టు చేయడానికీ, అవసర సంబంధాలు సమకూర్చుకోవడానికీ గుత్తపద్ధతులు అవలంబించడం (ఈవిధంగా) సులభం "

వలసవిధానానికి ఆర్థిక కారణాలేగాక సామాజిక కారణాలు కూడా ఉపకరిస్తాయి "ప్రాచీన నాగరికత అభివృద్ధి చెందిన దేశాలన్నిటిలోనూ అసహనం, చికాకు, ద్వేషం పెచ్చుపెరుగుతున్నాయి స్పష్టమైన వర్గమార్గాలలో బయటికి త్రోసివేయబడుతున్న శక్తిని (అంటే, వలసవిధానం అవలంబించే దేశాలలో తీవ్రమవుతున్న వర్గ సంఘర్షణను) ఇతర దేశాల్లో వినియోగించుకోవాలి, ఇలాచేస్తేనే స్వదేశంలో ప్రేలుడు సంభవించకుండా చేసుకోగలం" అన్నాడొక ఫ్రెంచి పెట్టుబడిదారు

సామ్రాజ్యదేశాలూ, వలసదేశాలూ, మాత్రమేగాక "అర్ధవలస దేశాలు" కూడా ఉంటాయి ఉదాహరణకు, పూర్వం చీనా, ఈనాడు భారతదేశం "ఇవి రాజకీయంగా లాంఛనప్రాయమైన స్వతంత్రదేశాలు, కాని వాస్తవానికి ద్రవ్యసంబంధమైన, రాజనీతిపరమైన వలలో చిక్కుకొనిఉంటాయి "

చూస్తూనే ఉన్నాంగద!

పెట్టుబడిదారీ విధానపు ఒక ప్రత్యేక దశ సామ్రాజ్యవాదం-పెట్టుబడిదారీ విధానపు గుత్తాధిపత్యదశ

ఈ దశ రావటానికి పెట్టుబడిదారీ మూలలక్షణాలు అనేకం తలకిందులు కావలసి వచ్చింది స్వేచ్ఛతో కూడిన పోటీ పోయి గుత్తాధిపత్యం నెలకొన్నది వర్తకపు సరుకుల ఎగుమతి స్థానంలో పెట్టుబడి ఎగుమతి వచ్చింది బాంకుల ద్రవ్యమూ, పారిశ్రామిక పెట్టుబడీ ఏకమయాయి వెనుకబడిన ప్రాంతాలు పరాధీనమయాయి ప్రపంచాన్ని సామ్రాజ్యవాద దేశాలు- అంటే గుత్త పెట్టుబడిలో అగ్రగామిదేశాలే-తమలో తాము పంచుకున్నాయి

అయితే ఈ కథ ఇంతటితో ముగియలేదు "అనేక అగ్రరాజ్యాలు ఆధిపత్యం కొరకు, అంటే భూభాగాలను సంపాదించడానికీ, తమలోతాము పోటీపడతాయి ఈభూభాగాలు తమ సొంతానికవసరం లేకపోవచ్చు శత్రువును బలహీనబరచేటందుకు, వాని ఆధిపత్యాన్ని దెబ్బకొట్టేటందుకు అది అవసరం (జర్మనీకి బెల్జియం చాలా అవసరం ఎందుచేతనంటే, బ్రిటనుకు వ్యతిరేకంగా సైనిక చర్యలు జరపడానికి అదొక స్థావరంగా ఉపయోగపడుతుంది అలాగే బ్రిటనుకు బాగ్దాద్ ఎంతో అవసరం ఎందుచేతనంటే, జర్మనీకి వ్యతిరేకంగా పోరాడేటందుకదొక స్థావరంగా ఉపయోగపడుతుంది )"

ఇవాళ మనం సైనిక స్థావరాల కోసం అమెరికాపడే ఆరాటం చూస్తున్నాం ముఖ్యంగా చీనాను చుట్టుముట్టటానికి అమెరికా ఏర్పరచిన స్థావరాలు ఖర్చుతోకూడినవే తప్ప, ఆదాయం తెచ్చేవి కావు కాని గుత్త పెట్టుబడి రాజ్యాధికార విస్తరణకోసమూ, ఇతర రాజ్యాలను దాస్యంలో ఉంచటానికీ ఇలాటి ఖర్చులు భరించే స్థితిలో ఉన్నది వియత్నాంలో ముఖం పగలగొట్టుకుని వెనక్కు తిరిగి రావటానికి ఎన్ని అర్బుదాల డాలర్లు ఖర్చు చెయ్యలేదు?

సామ్రాజ్యవాదం బతుకు జలగ బతుకు, "పరభాగ్యోపజీవనం " గ్రేట్ బ్రిటన్, లెనిన్ ఈ గ్రంథం రచించేనాటికే, "క్రమంగా పారిశ్రామిక రాజ్యంనుంచి రుణాలిచ్చే రాజ్యంగా మారుతోంది ఆ దేశంలో పారిశ్రామికోత్పత్తీ, తయారీవస్తువుల ఎగుమతి యిదివరకు కంటె యిప్పుడు హెచ్చినప్పటికీ వడ్డీలు- లాభాల వల్లా, సెక్యూరిటీలు- కమిషన్ల వల్లా- చట్టావ్యాపారం వల్లా లభించే ఆదాయం ఎక్కువ ప్రాధాన్యత కలిగియుంది సామ్రాజ్యవాదం యొక్క ఆర్థిక పునాది యిదేనని నా అభిప్రాయం" అన్నాడు షుల్ట్జ్ గెవర్నిట్జ్

ఇలాటిది "స్టాక్‌బ్రోకర్" రాజ్యమనీ, పతనమవుతున్న పెట్టుబడిదారీ పెంచి పోషించే రాజ్యమనీ లెనిన్ అన్నాడు ఇలాటి రాజ్యంలో రాజకీయ-సామాజిక పరిస్థితులు మార్పు చెందకమానవు

పెట్టుబడిదారుల "పరభాగ్యోపజీవన" దృక్పథం కార్మికులకు కూడా విస్తరించింది బ్రిటిషు కార్మికుడి వేతనాలలో నాలుగోవంతు వలసలనుంచి వస్తున్నదని, రెండో ప్రపంచ యుద్ధానంతరం రణదివే ఒక అంచనా ఇచ్చాడు రెండవ అంశమేమంటే, పరాధీన జాతుల నుంచి సైనిక దళాలు ఏర్పాటుచేసుకోవటం (బ్రిటిషు సేనలో గూర్ఖారెజిమెంట్లు ఒక ఉదాహరణ) భారతదేశాన్ని జయించటానికి బ్రిటిషువాళ్ళు భారతీయ సైన్యాలనే ఉపయోగించారు ఆఫ్రికాలో కూడా ఇలాగే జరిగింది

మార్క్సిస్టు అవటానికి ఎంతమాత్రమూ వీల్లేని హాబ్సన్ 1902లో సామ్రాజ్యవాదం గురించి రాస్తూ ఇలా అన్నాడు

"ఇప్పటికంటెకూడా విస్తృతమైన పశ్చిమరాజ్యాలకూటమి ఏర్పడే అవకాశం కూడా ఉందని మేముయిదివరకే కనుగొన్నాం ఇది యూరపియన్ అగ్రరాజ్యాల సమాఖ్యగా ఉంటుంది ప్రపంచనాగరికతను అది పెంపొందించదు సరికదా, పశ్చిమ రాజ్యాల పరభాగ్యోపజీవన మహా ప్రమాదాన్ని అది తెచ్చిపెట్టవచ్చు అభివృద్ధి చెందిన పారిశ్రామిక జాతుల మురాకు చెందిన ఉన్నత వర్గాలు ఆసియా, ఆఫ్రికాల నుంచి కప్పం (లూటీ) విపరీతంగా వసూలు చేస్తాయి ఆ ధనంతో వారు అసంఖ్యాకులైన తమ హంగుదార్లను పోషిస్తూ వుంటారు ఈ హంగుదార్లు ప్రధాన వ్యవసాయోత్పత్తిలోగాని పారిశ్రామికోత్పత్తిలో గాని పాల్గొనకుండా వ్యక్తిగత సేవల్లోనో, నూతన ధనస్వామ్య వర్గం కంట్రోలులో ఉండే అప్రధానమైన పారిశ్రామిక సర్వీసుల్లోనో నిమగ్నులై యుంటారు "

(ఇదంతా ఈనాడు మరింత ప్రస్ఫుటంగా మనం చూస్తున్నాం పశ్చిమరాజ్యాల కూటమిమాత్రమేగాక, కామన్ మార్కెటుపేరుతో ధనస్వాముల ట్రేడ్ యూనియన్ కూడా ఏర్పడింది దేశసంపద 84శాతం 7 శాతం వ్యక్తుల అధీనంలోగల బ్రిటన్ లాటి దేశాలను "సర్విస్ స్టేట్స్" అంటున్నారు అసలైన ఉత్పత్తిదార్లు సంపాదించే దానికి అనేక వందలరెట్లు హాబ్సన్ చెప్పిన సేవలవాళ్ళు సంపాదిస్తున్నారు ధరలు పెరగక ఏంచేస్తాయి? ద్రవ్యోల్బణం రాకేమవుతుంది?)

"రచయిత (హాబ్సన్) చెప్పింది పూర్తిగా నిజం" అని ఆనాడు లెనిన్ అన్నట్టే ఈనాడు మనమూ అనాలి దీనికి తార్కాణంగా 1865-98 మధ్య గ్రేట్ బ్రిటన్ జాతీయాదాయం దాదాపు రెట్టింపుఅయితే, విదేశాలనుండి రాబడి తొమ్మిదిరెట్లు పెరిగింది కార్మికుల్లో ఒక అగ్రశ్రేణీ, ఒక నిమ్నశ్రేణీ ఏర్పడింది "కార్మికుల్లో అవకాశవాదాన్ని పటిష్ఠం" చేసి కార్మికోద్యమాన్ని తాత్కాలికంగా కుంగదీసే ధోరణిని సామ్రాజ్యవాదం చేపట్టింది "ఇంగ్లండుకి ప్రపంచ మార్కెట్టుపైనా, వలసదేశాలపైనాగల గుత్తాధిపత్యపు విందులో కార్మికులు కూడా ఉల్లాసంగా పాల్గొంటున్నారు "

"సామ్రాజ్యవాదపు నిర్దిష్ట రాజకీయ లక్షణాలు, ప్రతిచోటా అభివృద్ధి నిరోధకత్వమూ, నానాటికీ పెచ్చుపెరిగే జాతుల పీడనా అందుచేత ఇరవయ్యోశతాబ్దారంభంలోయించు మించు అన్ని సామ్రాజ్యవాద దేశాల్లోనూ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ఒక పెటీబూర్జువా ప్రజాతంత్ర ప్రతిపక్షం బయల్దేరింది "

కాట్స్కీలాటివాళ్ళు స్వేచ్ఛావ్యాపారం తిరిగివస్తేనూ, సామ్రాజ్యవాదంపోతేనూ ఎక్కువ అభివృద్ధి అయేదన్న అపోహను ప్రకటించారు కాట్స్కీ వాదాన్ని లెనిన్ ఈ గ్రంధంలో చాలా బాగా విమర్శించాడు స్వేచ్ఛా వ్యాపారంనుంచే గుత్తవిధానం ఉత్పత్తి అయిందికనక కాట్స్కీలాటి వాళ్ళు కాలచక్రాన్ని వెనక్కు తిప్పాలన్న ధోరణి వ్యక్తం చేశారు, గుత్త వ్యాపారం నుంచి సామ్రాజ్యవాదాన్ని కూడా వేరుచేసి చూశారు

సామ్రాజ్యవాదం పెట్టుబడిదారీ విధానపు పరివర్తన దశఅనీ, చరమదశ అనీ లెనిన్ నిరూపించాడు లెనిన్ యీ గ్రంధాన్ని రచించి చాలాకాలమయింది అటు తరవాత పెట్టుబడిదారీ విధానం సామ్రాజ్యవాదాన్ని మించిన వెర్రితలలే వేసింది మొదటి ప్రపంచ

యుద్ధం అనంతరం రష్యాలో విప్లవం విజయవంతమై, ప్రపంచంలో ఆరోవంతు పెట్టుబడిదారీ విధానానికి స్వస్తి చెప్పటంతో సామ్రాజ్యవాద దేశాలు ఫాసిజముకు పాలుపోసిపెంచాయి హిట్లరు తాము చెయ్యలేనిపని-సోషలిజమును నిర్మూలించటం - చేస్తాడని ఆశించాయి కాని హిట్లరు సామ్రాజ్యవాదాన్ని మరింత ఉన్నతదశకు తీసుకుపోయి ప్రపంచాన్నే కబళించజూశాడు దానితో పెట్టుబడిదారీ విధిలేక, చాలా బద్ధకంగా ఎంతో అయిష్టంగా హిట్లరుతో యుద్ధానికి దిగవలసివచ్చింది ఆ యుద్ధాన్ని ఫాసిస్టు వ్యతిరేక యుద్ధం చేసినది ప్రపంచ ప్రజలు దానికోసం అందరికన్న హెచ్చు త్యాగం చేసినది రష్యా

రెండవ ప్రపంచపు యుద్ధం విప్లవ యుగానికీ, వలస వ్యతిరేక రాజకీయాలకూ చలనం లేని పునాది వేసింది బ్రిటనువంటి సామ్రాజ్యవాద దేశం తన సామ్రాజ్యాన్ని కోల్పోయి దివాలాతీసింది స్వేచ్ఛకోసం వెనుకబడిన దేశాల పోరాటం విజయం సాధించింది పెట్టుబడిదారీని మరికొన్ని దేశాలు శ్రామిక విప్లవాల ఫలితంగానూ మార్క్సిస్టు-లెనినిస్టు, సిద్ధాంతాచరణ ద్వారానూ అంతం చేశాయి

గత యుద్ధం తర్వాత జరిగిన పరిణామాలలో చెప్పుకోదగినవి సామ్రాజ్యాలు చావుదెబ్బ తిన్నప్పటికీ, గుత్త విధానమూ అది తెచ్చిపెట్టే వైరుధ్య, వైషమ్యాలూ ఆయా దేశాలలో తీవ్ర ఆర్థిక-సామాజిక సంక్షోభాలు కలిగించటం, అమెరికా సామ్రాజ్యవాదాన్ని గుత్తతీసుకోవటం లెనిన్ ఆనాడు చెప్పిన పద్ధతులన్నిటినీ యుద్ధానంతర కాలంలో అమెరికా చేపట్టింది- రుణాలివ్వటమూ, సైనిక దురాక్రమణలూ, సైనిక స్థావరాలు ప్రపంచమంతటా ఏర్పాటు చెయ్యటమూ, ఆర్థికంగా వెనుకబడిన దేశాలను లోబరచు కోవటమూ వగైరా అమెరికా అదనంగా చేబట్టినదేమంటే, ప్రపంచంలో వీలయినన్ని దేశాలలో ప్రజావ్యతిరేక, ఫాసిస్టు శక్తులను బలపరచటం నిజానికి ఇది కూడా కొత్త దేమీకాదు సామ్రాజ్యవాదులు తమ పెత్తనం చలాయించటానికి వలసలలోని వెనుకబాటు తనాలన్నిటినీ తమకు అనుకూలంగా బలపరచుకుంటూనే వచ్చారు, ఆ దేశాల పురోభివృద్ధి అరికట్టుతూనే వచ్చారు

దాని ఫలితంగా అమెరికా ఆంతరంగిక సంక్షోభాన్ని ఎదుర్కొంటున్నది పెట్టుబడిదారీ పెత్తనం నిలవటానికి ఎలాటి దుర్మార్గాలూ అవసరమయేదీ అమెరికాలో ఈనాడు జరిగే విచారణలు రుజువుచేస్తున్నాయి మన దేశాన్ని శతాబ్దంపాటు హేయ, హీనస్థితిలో ఉంచిన ఫలితం పెట్టుబడిదారీ నుంచీ, దాని పరిణామం నుంచీ కలిగిందని గ్రహించిన మనం పెట్టుబడిదారీని నమ్ముకున్నందుకు అంతులేని పాలకవర్గ అవినీతినీ, జన సంక్షోభాన్నీ, పెట్టుబడిదారీ విషవృక్షపు ఫలితాలనూ ప్రత్యక్షంగా అనుభవిస్తున్నాం "వెనుకబడిన ప్రాంతాల"కు చెందిన ఒనరులు బిగిస్తే, "అగ్రరాజ్యాలు" పడే పాట్లు అరబ్బుదేశాలు నూనెను స్తంభించి చూపాయి పెట్టుబడిదారీలో దేశాలు "పురోగాములు" ఎలా అయాయో, "శ్రేయోరాజ్యాలు" ఎలా అయాయో మనం ప్రత్యక్షంగా చూస్తున్నాం "బ్రిటన్‌ను పాలించేది ప్రభుత్వమా, కార్మికులా?" అన్నది తేల్చుకుంటానని ఎన్నికలు పెట్టి బ్రిటిషు ప్రధాని హీత్ చెత్తకుప్పలోకెక్కాడు "శ్రామికులు" పాలించే దేశాలలో ఇలాటి సమస్యలుండ నవసరంలేదు ఉత్పత్తి ఏనాడో సమాజపరమూ, అంతర్జాతీయమూ అయింది ఉత్పత్తి సాధనాలుమాత్రం వ్యక్తుల సొంతంగా మిగిలిపోయాయి వీటి మధ్య వైషమ్యం ఇవాళ కట్టి కుదుపుతున్నది

శాంతియుత పోటీ ద్వారా పెట్టుబడిదారీని సోషలిజం జయిస్తుందంటూ సోవియట్ పాలకవర్గం లెనినిజముకు స్వస్తి చెప్పింది ఎందుకంటే, శాంతియుత పోటీద్వారా గుత్త పెట్టుబడీ, అది తెచ్చిపెట్టే వైరుధ్యాలూ ఎలా అంతర్ధానమవుతాయో లెనిన్ ఎక్కడా చెప్పిఉండలేదు చివరకు సోవియట్ యూనియన్ సామ్రాజ్యవాదం లక్షణాలు-దళారీ వ్యాపారమూ, "పలుకుబడి ప్రాంతాల" కోసం పాకులాటలూ, రుణాలిచ్చి వెనుకబడిన ప్రాంతాలను లోబరచుకోవటమూ, ప్రాంతీయ స్పర్థలలో తలదూర్చటమూ- సంపాదించుకుని, అమెరికాతో సామ్రాజ్యవాదంలో పోటీకి దిగింది

పెట్టుబడిదారీ విధానం నిర్మూలన కావటానికి శ్రామికవర్గ విప్లవమూ, శ్రామిక వర్గ నియంతృత్వం ద్వారా పెట్టుబడిదారీ రహిత సమాజ నిర్మాణమూ తప్ప మరోమార్గం లేదు ఇది ఆచరణలో కూడా రుజువవుతున్నది

ఈ సమీక్ష ముగించేముందు ఒక్క విషయం చెప్పాలి ఇక్కడ సమీక్షిస్తున్న పుస్తకంలాటివి తెలుగులోకి అనువదించటం చాలా కష్టం అందుకు తగిన భాషకూడా లేదు మనం ఉపయోగించే భాష ప్రజలలోకి పోయినదికాదు అందుచేత ఇంగ్లీషులో చదవగల వారికే ఈ అనువాదాలు అర్థమవుతాయి ఒక్కొక్కప్పుడు ఇంగ్లీషులోనే బాగా అర్థమవుతాయనిపిస్తుంది అందుచేత యిది చాలాకాలంగా పార్టీకి పనికివచ్చే సాహిత్యంగా ఉంటున్నది అందుచేత నాకేమనిపిస్తుందంటే మార్క్సిస్టు సాహిత్యాన్ని సంగ్రహపరచి, సుగమంగా ప్రజలకు అందించటం చాలా అవసరం

సామ్రాజ్యవాదం : పెట్టుబడిదారీవిధానపు అత్యున్నతదశ - లెనిన్

అనువాదం : కంభంపాటి సత్యనారాయణ- విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్, విజయవాడ

ముద్రణ: సృజన మాసపత్రిక, ఏప్రిల్,1974

## 3. సామ్రాజ్యవాదమూ, సామ్రాజ్యవాదులూ

: వి ఐ లెనిన్

1912 నవంబరు, 1920 డిసెంబరు మధ్యకాలంలో లెనిన్ వేరు వేరు పత్రికలలోనూ, ఉపన్యాసాలలోనూ సామ్రాజ్యవాదం గురించీ, సామ్రాజ్యవాదులను గురించీ మొదటి ప్రపంచ యుద్ధం గురించీ చెప్పిన అనేక విషయాలు ఈ గ్రంథంలో క్రోడీకరించారు మొదటి ప్రపంచయుద్ధం సామ్రాజ్యవాద దేశాలమధ్య వలసల పునఃపంపకం కోసం జరిగింది దరిమిలా మరో ప్రపంచయుద్ధం జరిగింది ఇది నిస్సందేహంగా మొదటి యుద్ధానికి పుట్టిన బిడ్డే: ఆ మొదటి యుద్ధంలో చితికిపోయిన జర్మనీ తాను చావుదెబ్బతిన్న దేశాలనుంచే పుంజుకుని, ఫాసిజం చేపట్టి, ఈసారి ప్రపంచమంతటినీ ఆక్రమించాలనుకున్నది అయితే ప్రపంచ పరిస్థితిలో మధ్యకాలంలో చాలా మార్పు వచ్చింది ఇప్పుడు సామ్రాజ్యవాదాన్ని ప్రతిఘటించటానికి బలమైన సోషలిస్టు రష్యా, ప్రపంచంలో ఆరోభాగం ఆక్రమించి ఉన్నది ఈ రష్యాను అణచటానికే సామ్రాజ్య వాద దేశాలు జర్మనీకి కోరలూ, గోళ్ళూ పెంచాయి అందుచేత ఈ

రెండో ప్రపంచయుద్ధం మొదటిప్రపంచయుద్ధం లాగా కేవలం సామ్రాజ్యవాదుల మధ్య అంతర్యుద్ధంగా కొనసాగలేకపోయింది సామ్రాజ్యవాదం స్వభావం ఏమిటో, దాని లక్ష్యాలు ఏవో లెనిన్ ప్రపంచానికి స్పష్టంగా చెప్పిఉన్నాడు ఈ రెండో ప్రపంచయుద్ధంలో సామ్రాజ్యవాదం నడుము విరిగింది సామ్రాజ్యవాదులు, ఫాసిజంరూపం ధరించిన సామ్రాజ్యవాదాన్ని ప్రతిఘటించటానికి–అయిష్టంగానే కానివ్వండి– సోవియట్ రష్యాతో చేతులు కలపవలసి వచ్చింది ఫాసిస్టువ్యతిరేక యుద్ధభారాన్ని సగం రష్యా భరించింది

రెండవ ప్రపంచ యుద్ధంతో జర్మనీ, జపానులు పూర్తిగా చితికిపోతాయనీ, రష్యాకి కూడా తిరిగి కోలుకోలేని స్థితి ఏర్పడుతుందనీ సామ్రాజ్యవాదులు యుద్ధకాలంలో అంచనావేసి ఉండవచ్చు అలా జరగలేదు తూర్పు యూరపు అంతటా పెట్టుబడిదారీ ఎగిరిపోయింది మరికొద్ది కాలానికి చీనా మరొక సోషలిస్టు భూతంగా ఆవిర్భవించింది చావుదెబ్బతిన్నది వలసవిధానం పోయిన వలసలుపోగా, మిగిలినవి విమోచన యుద్ధాలకు పూనుకున్నాయి ఈ పరిస్థితిలో నయావలసవిధానం అవతరించింది ఇది వెనుకబడిన ప్రాంతాలను ముందుకురాకుండా చూస్తూ, ఆర్థికంగా వాటిని దోస్తూ వాటి మధ్య కలహాలను పెంపొందిస్తూ, మారణాయుధాలు అందిస్తూ, వాటి రాజకీయాలను పరోక్షంగా శాసిస్తూ, వాటిపైన పరభృతాలుగా జీవించే ప్రక్రియ

ప్రపంచం ఇంతగా మారిపోయి, ఇన్ని దశాబ్దాలు గడిచినాక ఆనాడు లెనిన్ అన్న మాటలు ఈనాడు మనకు ఉపకరిస్తాయా? చూతాం

లెనిన్ మాటలు

"జీవనవ్యయం పెరుగుతున్నది వేతనాలు అవసరమైన శ్రమశక్తి వ్యయం కంటె ఎంతో నిదానంగా పెరుగుతున్నాయి దీని పక్కనే పెట్టుబడిదార్ల ఐశ్వర్యం కండ్లు తిరిగే వేగంతో పెరుగుతున్నది తిండీ, బట్టలూ, యింధనమూ, అద్దె అన్నీ ఎక్కువ ఖరీదు అయినాయి కార్మికుడు పరమంగా దరిద్రుడౌతున్నాడు "(1912)

ఇది పెట్టుబడిదారీ వ్యవస్థ యొక్క అవలక్షణమైతే మనం సోషలిజంకేసి పురోగమించటం లేదు

"పెట్టుబడిదారీ ఆటవికత్వం ఏ నాగరికతకంటెనైనా బలీయమైనది "

మనదేశంలో నాగరికత అన్నది అంతంతమాత్రంగనక పెట్టుబడిదారీ ఆటవికత పైశాచికత్వంగా పరిణమించి ప్రజల రక్తాన్ని తాగుతున్నది

"కార్మికవర్గాన్ని మోసగించడానికీ, ఒకేఒక నిజమైన విమోచన యుద్ధంనుండి తమ సొంత దేశం యొక్క పరాయిదేశం యొక్క బూర్జువా వర్గాలకు వ్యతిరేకమైన అంతర్యుద్ధం నుండి–కార్మిక దృష్టిని మరల్చడానికి ప్రతి దేశపు బూర్జువావర్గమూ, దేశభక్తిని గురించిన బూటకపు మాటల సహాయంతో, తన సొంత జాతీయ యుద్ధం యొక్క ప్రాముఖ్యాన్ని ప్రస్తుతించడానికి ప్రయత్నిస్తున్నది "

మన బూర్జువా వర్గానికి పాకిస్తానుతో యుద్ధాలూ, చీనాతో యుద్ధమూ, ఈవిధంగా

తోడ్పడలేదా? మన కార్మిక వర్గం ఈనాటికైనా "విమోచన" యుద్ధానికి ఆయత్తమయిందని చెప్పగలమా?

"సకల దేశాల ప్రభుత్వాలూ, బూర్జువావర్గాలూ, కార్మికులను చైతన్యపరచటానికీ, ఒకరిమీద ఒకరిని ఉసికొల్పడానికీ మరింత తీవ్రంగా ప్రయత్నించే కొద్దీ సకల దేశాలలోని 'దేశభక్తియుత' బూర్జువామురాల అదుపులేని జాతీయ దురహంకారానికి వ్యతిరేకంగా తన వర్గ సంఘీభావాన్నీ, తన అంతర్జాతీయతనూ, తన సోషలిస్టు విశ్వాసాలనూ రక్షించుకోవలసిన బాధ్యత వర్గచైతన్యంగల కార్మిక వర్గం మీద మరింత యెక్కువగా ఉంటుంది "(1914)

విప్లవ పోరాటాలు యుద్ధాలను నివారిస్తాయన్న మావో సిద్ధాంతానికి బీజం ఇందులో ఉన్నది జాతీయ దురహంకారమూ, అంతర్జాతీయ శ్రామిక దృక్పధంలో గండీలూ, యుద్ధాలకు మంచికవచాలు వాటికి నిజమైన విరుగుడు జాతీయవిమోచన విప్లవ పోరాటాలు

"ఫ్యూడలిజమూ, నియంతృత్వమూ, పరాయిపీడనా కూలదోయబడక ముందు, సోషలిజం కొరకు కార్మికవర్గ పోరాటం అనే ప్రశ్న ఉద్భవించదు "

వెనుకబడిన దేశాలలో ఈ ప్రశ్న ఉద్భవించకతప్పదు కాని ఈ పోరాటంలో రైతాంగం పాత్ర ప్రముఖంగా ఉండడమేగాక, ఈ పోరాటం ఫ్యూడలిజమునూ, నియంతృత్వాన్నీ, పరాయి పీడననూకూడా నిర్మూలించేవిధంగా సాగాలి ఈ శక్తులకు కట్టేగోరీలే సమసమాజానికి పునాది

"ఫైనాన్స్ పెట్టుబడియుగంలో పరాయిదేశంలోనైనా పోటీని తొలగించడం ఆర్థికంగా సాధ్యమా? నిశ్చయంగా సాధ్యం పోటీదారుని ఫైనాన్షల్ పరాధీనత ద్వారా అతని ముడిసరుకులనిధులనూ, కాలక్రమాన అతని వ్యాపారసంస్థలన్నిటినీ కొనేయడం ద్వారా అది జరుగుతుంది రాజకీయ పరదేశ స్వాధీనం లేకుండా ఆర్థిక పరదేశ స్వాధీనంపూర్తిగా సాధ్యం "

అందుచేతనే మనదేశం రాజకీయ పరాధీనతనుంచి బయటపడికూడా ఆర్థికంగా ఇతదేశాల వలల్లో చిక్కుకుపోయింది

"ప్రజాస్వామ్య రిపబ్లిక్ పెట్టుబడిదారీ వ్యవస్థను 'తార్కికంగా' వ్యతిరేకిస్తుంది యెందుకంటే, అది ధనికులనూ, బీదలనూ 'అధికారికంగా' సమానంగా పెడుతుంది అది ఆర్థిక వ్యవస్థకూ, రాజకీయ ఉపరినిర్మాణానికీ ఉన్న వైరుధ్యం సామ్రాజ్యవాదానికీ, రిపబ్లిక్‌కూ మధ్య అదేవైరుధ్యం వుంది మరి పెట్టుబడిదారీ వ్యవస్థ ప్రజాస్వామ్యంతో ఎలా రాజీపడుతుంది? పెట్టుబడియొక్క నిరవధిక శక్తిని పరోక్షంగా అమలు పరచడంద్వారా!"

నల్లసొత్తును అంటకపోవటం ద్వారా, ధరలను అదుపుచేసే చర్యలద్వారా వాటిని పెంచటంద్వారా, ధనికులను మరింత ధనికులను కానిచ్చి ప్రజాజీవితం నరకప్రాయం చెయ్యటం ద్వారా అందామా?

"ఫైనాన్స్ పెట్టుబడి యేదేశంలోనైనా, 'స్వతంత్రదేశంలో కూడా పెత్తనం చెయ్యగలదని మార్సిస్టులు చెప్తుతాయి" అన్నాడు లెనిన్ ఆ ఫైనాన్స్ పెట్టుబడిపెత్తనం మనను కట్టి కుదుపుతున్నది

"ఫైనాన్స్ పెట్టుబడి పెత్తనం కొరకు పాటుపడుతుంది స్వేచ్ఛ కొరకు కాదు రాజకీయ ప్రగతి వ్యతిరేకత ఆద్యంతం సామ్రాజ్యవాదంయొక్క విలక్షణగుణం "

అందుకే అమెరికా జాతీయ పరిశ్రమలకు సహాయపడదు, అయుధాలిస్తుంది

"కొద్దిపాటి గొప్పరాజ్యాలచేత వలసల దోపిడీ 'నాగరిక' ప్రపంచాన్ని అంతకంతకూ ఎక్కువ అనాగరిక జాతులలోని కోటానుకోట్ల జనం మీదబతికే పరరక్తోపజీవిగా మారుస్తుంది ఆధునిక సమాజం ఆధునిక నిరాస్తిపరులమీద బతుకుతున్నది "

ఈ సామ్రాజ్యవాదలక్షణం ఈనాటి పెట్టుబడిదారీ సమాజాలన్నిటికీ వర్తిస్తుంది పెట్టుబడిదారీ ఉండేదేశాలన్నిటా ధనికులు నిర్ధనులమీద జీవిస్తున్నారు సామ్రాజ్యవాద దేశాలలోని కార్మికవర్గం "పైపొర" వలసల లోని పేదశ్రామికులమీద పరభృతంగా కొంతవరకు జీవించగలిగింది ఇప్పుడు మనదేశంలోనే అలాంటి కార్మిక వర్గపు "పైపొర" ఏర్పడుతున్నది యూనియన్‌లమధ్య పోటీ, యూనియను నాయకుల హత్యలూ "పైపొర" కోసం పోరాటాన్ని సూచిస్తాయి శ్రామికశక్తులు రాజకీయశక్తులను శాసించే దశపోయి, వాటితో చేతులు కలిపే దశ ఏర్పడుతున్నది

యుద్ధమూ, శాంతి గురించి లెనిన్ ఇలా అన్నాడుః

"యూరప్‌లో శాంతి రాజ్యం చేసిందిః కానీ యిది యెలా సాధ్యమైందంటే వలసల లోని పదుల కోట్ల ప్రజలమీద యూరపియన్‌జాతుల పెత్తనం నిత్య, నిరంతరాయ, అనంత యుద్ధాలద్వారా నిలపబడింది యీ యుద్ధాలను యూరపియన్ జాతులు యుద్ధాలుగా పరిగణించాయి యెందుకంటే తరచుగా యివి యుద్ధాలలాగాగాక, పాశవిక హత్యాకాండలాగా, నిరాయుధ ప్రజల మూకుమ్మడి వధలాగా ఉండినాయి "

రష్యా ఈనాడు చేసే శాంతిజపం లెనిన్ చెప్పిన 'పాశవిక హత్యాకాండనూ', నిరాయుధ ప్రజల 'మూకుమ్మడి వధ'నూ పరిగణిస్తున్నట్టు కనబడదు ఇది శాంతేనా? అణ్వస్త్రాలతో జరిగేదే యుద్ధమా? జాతీయ విమోచన యుద్ధాలూ, విప్లవ పోరాటాలూ సాగుతూ ఉన్నంతకాలమూ సామ్రాజ్యవాదుల మధ్యకొంత ఐక్యత ఉంటుంది ఇప్పుడు అదేదశలో ప్రపంచం ఉన్నదనుకోవచ్చు ఈ విమోచన యుద్ధాలూ, విప్లవ పోరాటాలూ విజయవంతమైన అనంతరం సామ్రాజ్యవాదానికి అవకాశమే ఉండదు రష్యా అంతర్జాతీ య యుద్ధాలు రాకుండా చూడదలిస్తే ఈ విమోచనపోరాటాలనూ, విప్లవ పోరాటాలనూ బలపరచాలి వాటిని అణచే దేశాలకు అయుధాలివ్వరాదు చీనా సరిహద్దున సేనలను మోహరించరాదు తనతో మైత్రీ, వాణిజ్య సంబంధాలూ పెట్టుకున్న దేశాలను దోచుకోరాదు

రష్యా "సోషల్ సామ్రాజ్యవాదం" అనుసరిస్తున్నదని కొందరు ఒప్పుకోవటం లేదు 1917లో లెనిన్ అడిగినట్టు "పరదేశ స్వాధీనానికి జర్మన్‌లకూ, బ్రిటిషువాళ్ళకూ (ఈనాడు అమెరికన్‌లకూ) వర్తించే నిర్వచనం దయయుంచి యివ్వండి" అనిమనం అడగవచ్చు

"విప్లవకరప్రకటనలు రాయడం ద్వారా జనాలను మోసగించే పెట్టుబడిదారీ కళలో మనకంటె ఎక్కువ అనుభవం గల యితర జాతులు ఎప్పుడో ప్రపంచ రికార్డులనన్నిటినీ అధిగమించినారు "

మన పాలకులు ఈనాడు ఈ అడుగుజాడలలో తప్పటడుగులు వెయ్యటానికి చేతగాని ప్రయత్నాలు చేస్తున్నారు

1917లోనే లెనిన్, బ్రిటిషు సామ్రాజ్యవాదులు 1947లో చెయ్యబోయేది చెప్పాడు 'తెలివిగల సామ్రాజ్యవాదులు యిలా అనుకుంటారుః నిజమే, చిన్న జాతుల గొంతు పిసకకుండా మేము మా లక్ష్యాలు సాధించలేము, కానీ ఆ పని చెయ్యటానికి, ఒకోసారి యెక్కువ నమ్మకమైన, లాభదాయకమైన పద్ధతి ఏమిటంటే, రాజకీయంగా స్వతంత్రమైన రాజ్యాలు సృష్టించడం ద్వారా అవి ఫైనాన్షల్‌గా పరాధీనంగా ఉండేటట్లు చూస్తాము "

1918లో లెనిన్ అమెరికన్ కార్మికులకు రాసిన లేఖలో "నా ఎత్తుగడలన్నీ యావత్తు నాగరిక ప్రపంచపు వర్గచైతన్యపూరిత కార్మికవర్గం ఆమోదిస్తుందని నాకు పరమ స్పష్టంగా తెలుసు అమెరికన్ ప్రజలు తమ విప్లవానికి లాభకరంగా ఈ ఎత్తుగడలకు యేనాడో పూనుకున్నారు స్వాతంత్ర్యం కొరకు చేసే తమ కష్టమైన యుద్ధంలో అమెరికన్ ప్రజలు కూడా పీడకులను బలహీనపరచి, పీడనకు వ్యతిరేకంగా విప్లవకరంగా పోరాడేవాళ్ళను బలపరచడానికి, పీడిత ప్రజల ప్రయోజనాలకు ఉపకరించడానికి, కొంతమంది పీడకులకు వ్యతిరేకంగా మరికొందరితో ఒప్పందాలు చేసుకున్నారు అమెరికన్ ప్రజలు ఫ్రెంచి, స్పానిష్, బ్రిటిష్ వాళ్ళమధ్యగల తగాదాలను వినియోగించుకున్నారు" అని జ్ఞాపకం చేశాడు

"పరిశ్రమల విధ్వంసనానికిగానీ, 'టెర్రర్'కుగానీ మమ్మల్ని నిందించడం కపటం విప్లవయుగాలలో వర్గపోరాటం సర్వదా, అనివార్యంగా, ప్రతి దేశంలోనూ అంతర్యుద్ధరూపం ధరించింది మరి అంతర్యుద్ధం అనేది మహా తీవ్రమైన విధ్వంసమూ టెర్రరూ లేకుండా దురూహ్యం" అనికూడా లెనిన్ ఈ లేఖలో తెలిపాడు "బ్రిటిష్ బూర్జువాలు తమ 1649నీ, ఫ్రెంచి బూర్జువాలు తమ 1793నూ మరచిపోయినారు బూర్జువాలు తమ సొంత ప్రయోజనం కొరకు ఫ్యూడలిజంకు వ్యతిరేకంగా టెర్రర్‌కు పూనుకున్నప్పుడు అది న్యాయంగా, చట్టబద్ధంగా ఉండింది కార్మికులూ, బీదరైతులూ బూర్జువాలకు వ్యతిరేకంగా టెర్రర్ ఉపయోగించడానికి సాహసించినప్పుడు అది రాక్షసమూ, నేరమూ అయింది ఒక పీడక మైనారిటీని తొలగించి, దానిస్థానంలో మరొక పీడకమైనారిటీని పెట్టడానికి ఉపయోగించినప్పుడు టెర్రర్ న్యాయంగా, చట్టబద్ధంగా ఉండింది ప్రతి పీడకమైనారిటీనీ కూలదోయడానికి అపారమైన వాస్తవ మెజారిటీ ప్రయోజనాలకొరకు, కార్మికవర్గం యొక్క, బీదరైతులయొక్క ప్రయోజనాలకొరకు ఉపయోగించడం ప్రారంభమైనప్పుడు, టెర్రర్ రాక్షసమూ, నేరమూ అయింది "

ఇదే తేడా ఈనాడు మనదేశంలో విప్లవ కారుల వర్గశత్రువుల నిర్మూలనకూ, పోలీసుల విలయతాండవానికీ పాటించబడుతున్నది

విప్లవాచరణలో జరిగే పొరపాట్లను గురించి లెనిన్ ఇలా స్పష్టంగా చెప్పాడు (ఈ కిందివాక్యంలో 'మన' అని ఉన్నచోటనల్లా 'మా' ఉండటం అవసరం)

"మన విప్లవం చేసే ప్రతి పొరపాటును గురించీ కలుషిత బూర్జువా పత్రికలు యావత్ప్రపంచానికీ కేకలువేయనీ, మన పొరపాట్లకు మనం జడవం విప్లవం ప్రారంభమయింది గనుక ప్రజలు మహర్షులు కాలేరు శతాబ్దాలుగా పీడింపబడి, అణగదొక్కబడి, బలవంతంగా దారిద్ర్యపు, పశుత్వపు, అజ్ఞానపు పంజరంలో బంధింపబడిన శ్రామికవర్గాలు విప్లవం చేసేటప్పుడు పొరపాట్లను పరిహరించలేరు ప్రతి నూరు పొరపాట్లకూ 10,000 గొప్ప వీరోచిత కార్యాలు చేయబడుతున్నాయి మనం చేసిన ప్రతి వంద సరైన చర్యలకు 10,000 పొరపాట్లు చేసినప్పటికీ, అప్పటికీ మన విప్లవం గొప్పదిగా, అజేయంగా వుంటుంది "

ఇదీ నిజమైన విప్లవ విశ్వాసం

"విప్లవాలు కోరికప్రకారంగానీ, ఒప్పందంప్రకారంగానీ జరగవని మాకు తెలుసు పరిస్థితులు సోషలిస్టు కార్మిక వర్గంలోని మా రష్యన్ దళాన్ని ముందుకు తెచ్చింది మా సుగుణాలవల్లకాదనీ, రష్యాయొక్క అసాధారణమైన వెనుకబాటుతనం వల్లననీ, ప్రపంచ విప్లవం ప్రజ్వలించేముందు పలు విడివిడి విప్లవాలు ఓడిపోవచ్చుననీ మాకు తెలుసు"

విప్లవాలకు మూలకారణం విప్లవ పరిస్థితులేగాని, విప్లవ అపజయాలు విప్లవ పురోగమనాన్ని ఆపవు ఓటమినుంచి ఆచరణదృష్ట్యా విప్లవకారులు గొప్ప పాఠాలు నేర్చుకుంటారు మావో చెప్పినట్టు అపజయాలు న్యాయంగా విజయానికి సోపానాలు– విప్లవకారుల దృష్టిలో

"యీనాటి విప్లవ ప్రపంచంలో మనం ఉపయోగించుకోవలసిన మౌలిక వైరుధ్యాలేమైనా ఉన్నాయా?" ఇది విప్లవకారులు అడుగడుగునా వేసుకొనవలసిన ప్రశ్న ఈ మౌలిక వైరుధ్యాలను ఉపేక్షచేసి విప్లవచర్యలు సాగించటం గుడ్డెద్దు చేలోపడినట్టవుతుంది

**అనువాదం**

లెనిన్ రచనలు లోగడ తెలుగులో అనువాదమయాయి విషయం క్లిష్టమైనది కావటంచేత కానివ్వండి, మన భాష ఇలాంటి శాస్త్రీయ విషయాలను వ్యక్తీకరించటానికి అనుకూలంగా పరిణామం చెందిఉండని కారణంచేత కానివ్వండి ఆ అనువాదాలు తృప్తికరంగా ఉండలేదు–అంటే మామూలుమనుషులు కొత్తగా ఈ పుస్తకాలు చదివి, వీటిలోని విషయం గ్రహించటానికి అనుకూలంగా ఉండలేదు

ఇప్పుడు మాస్కోనుంచి వెలువడిన ఈ రచనలోకూడా ఇదేలోపం కనిపిస్తుంది అనువాదకుడికి భాషవచ్చు విషయం తెలుసు కాని దాన్ని ఇతరులు గ్రహించేటట్టు చెయ్యటానికి ప్రయత్నించలేదు

మాస్కోవారు ప్రచురించిన అనువాదాలను గురించి నాకు కొద్దిగా అనుభవం వున్నది స్టాలిన్ కాలంలో రష్యన్ పుస్తకాల ఇంగ్లీషు పుస్తకాల స్వేచ్ఛానువాదాలు వెలువడ్డాయి కాని స్టాలిన్ అనంతరం ఇంగ్లీషునుంచి ఇతరభాషలలోకి జరిగే అనువాదాలు రష్యన్ మూలానికి తూచా తప్పకుండా ఉండేటట్టు చూడాలన్నధోరణివచ్చింది ఇంగ్లీషు స్వేచ్ఛానువాదాలనుంచి, చేసే అనువాదాలు రష్యను మాతృకకు 'ముక్కశ్చ ముక్కః'గా ఉండటం సాధ్యంకాదు అయినా సోవియట్ అధికారులు నా తెలుగు అనువాదాన్ని అలా దిద్దించారు

ఇలాటి యాంత్రిక నియమాలవల్ల అనువాదంలోకి "బైబిల్ భాష" లాటిది ప్రవేశిస్తుంది ("ఆకాశమందున్న ఓ తండ్రీ, నా అనుదినమైన రొట్టెను నాకిమ్ము" "తట్టుడీతెరువబడును") ఈ అనువాదం రష్యను మూలంనుంచి జరిగిందో, ఆంగ్లానువాదంనుంచి జరిగిందోగాని, ఇందులో అనేకచోట్ల వాక్యనిర్మాణం తెలుగేకాదు

"గుత్తాధిపత్యం ఉద్రేకంగా సవాల్ చేయబడుతున్నది", "అర్ధనిర్మిత దాదాపు పార్టీ", "బూర్జువా వర్గంలోకి పారిపోవడం" లాటి ప్రయోగాలు అలా ఉంచి, ఈ కింది వాక్యాల నిర్మాణం చూడండి

"లాయిడ్ జార్జి బూర్జువావర్గానికి అద్భుతంగా సేవచేస్తాడు సరిగ్గా కార్మికుల మధ్య దానికి సేవచేస్తాడు సరిగ్గా కార్మికులమీద దాని ప్రభావం నెరపుతాడు ఎక్కడైతే

బూర్జువావర్గానికీ అది అత్యవసరమో, యెక్కడైతే జనాలను నైతికంగా లోబరచుకోవడం దానకి మహా కష్టంగా ఉంటుందో అక్కడ " (119పేజీ)

"సార్వజనీన వోటు హక్కు, యెనిమిది గంటల పనిదినమూ, రిపబ్లిక్‌కూడానూ సామ్రాజ్యవాదానికి తార్కికంగా అనుగుణమే– సామ్రాజ్యవాదం సుఖంగా ఉండక పోయినప్పటికీ ( ) కనుక వాటిని సాధించటం మహాకష్టమైనప్పటికీ? అని కీయెవ్‌స్కీ రాసినాడు (పూర్తి పేరా 96 పేజీ)

"కీయెవెస్కీ మనమీదికి విసరే 'మంత్రగాడు' అనే కోపపుమాట భయం గొల్పేదిగా ఉన్నప్పటికీ, మనం ఒక విషయం గుర్తుచేయక తప్పదు ఆర్థిక పరిశీలన అంటే యేమిటో అతనికి అర్థంకేలేదని మనం చర్చిస్తున్నది రాజకీయ కాక ఆర్థిక పరిశీలన అయినప్పుడు "

(92 పేజి)

ఇటువంటి భాషకు మనవాళ్ళు ఏనాడో బైబిల్ తెలుగు అని పేరు పెట్టారు మార్క్సిస్టు సిద్ధాంత గ్రంథాల అనువాదం నిర్దుష్టమయిందని చెప్పనుగాని, వాటినైపుణ్యం ఇటీవల చాలా అభివృద్ధి అయింది అయినప్పుడు 1974లో వెలువడిన ఈ అనువాదం ఇంతకన్న చాలా బాగా ఉండి ఉండవలసింది

'సామ్రాజ్యవాదమూ, సామ్రాజ్యవాదులూ' . ప్రగతి ప్రచురణాలయం, మాస్కో
సృజన, మాసపత్రిక, నవంబరు,1974

## 4. వి.ఐ.లెనిన్- ఏరిన రచనలు

**తెలుగు అనువాదం: ప్రగతి ప్రచురణాలయం, మాస్కో**

1973లో వెలువడిన ఈ పుస్తకం లెనినిజం తాలూకు "పాకెట్‌బుక్"గా ఉద్దేశించబడింది ఈ పుస్తకాన్ని గురించి ఇందులోని పీఠిక ఇలా చెబుతున్నది

"లెనినిజం అంతర్జాతీయ బోధ అది కార్మికవర్గం యొక్క, సకల దేశాల ప్రజల విమోచనోద్యమం యొక్క అనుభవాన్ని ప్రతిబింబిస్తుంది అది యే దేశానికైనా, దాని అభివృద్ధి ఏ స్థాయిలో ఉన్నాసరే అన్వయించే మౌలిక సూత్రాలుగల బోధ అది సకల దేశ ప్రజలకూ సంతోషమయ భవిష్యత్తును నిర్మించుకునే మార్గాల గురించీ, సాధనాల గురించీ విస్పష్టమైన చిత్రం యిచ్చి శాంతి, అభ్యుదయాల శక్తులు జయిస్తాయనే విశ్వాసం వాళ్ళకు కలిగిస్తుంది యీ సంపుటంలో ప్రచురించబడిన రచనల అధ్యయనం సమస్త మానవజాతికీ అభివృద్ధి మార్గాన్ని వెలిగించే లెనినిస్టు మౌలిక సూత్రాలను గ్రహించడానికీ, కైవసం చేసుకోడానికీ వీలు కలిగిస్తుంది "

"ఆయన రచనలు విప్లవ మార్క్సిస్టు సిద్ధాంత అభివృద్ధిలోని నూతన లెనినిస్టు దశ అవుతాయి లెనిన్ మార్క్సిస్టు సిద్ధాంతంలోని కీలక సూత్రాలను అభివృద్ధిచేసి కార్మికవర్గం యొక్క, సమస్త యితర శ్రామిక ప్రజలయొక్క విమోచన పోరాటానికి ఈ సిద్ధాంతం ఎంత ముఖ్యమైందీ నిరూపించే రచనలు ఈ సంపుటంలో ఉన్నాయి లెనినిజం అనేది పెట్టుబడిదారీ వ్యవస్థనుండి సోషలిజంకు పరివర్తన జరిగే యుగం యొక్క మార్క్సిజం "

ఇందులో మొదటి వ్యాసం "కారల్ మార్క్స్ సిద్ధాంతం యొక్క చారిత్రక భవితవ్యం " (1913 మార్చి1)

1848లో మార్క్స్, ఏంగెల్స్‌లు "కమ్యూనిస్టు ప్రణాళిక" ప్రచురించిన అనంతరం నడిచిన ప్రపంచ చరిత్రను లెనిన్ మూడు దశలుగా విభజించాడు 1858లో ఫ్రాన్స్, ఇటలీ, జర్మనీ వగైరాలలో జరిగిన బూర్జువా ప్రజాతంత్ర విప్లవాల నుండి 1871 పారిస్ కమ్యూన్ వరకూ మొదటి దశ , పారిస్ కమ్యూన్ నుండి 1905 రష్యా విప్లవం వరకూ రెండో దశ, మూడవ దశ అటు పిమ్మటది

మొదటి దశలో మార్క్సిజం ఇతర సోషలిస్టు సిద్ధాంతాలలాగే ఉండింది దాని ప్రభావం ఏమీలేదు రెండోదశ ఆరంభంలో, 1848జూన్‌లో పారిస్ ప్రభుత్వం కార్మికుల మీద కాల్పులు చెయ్యటం ద్వారా "కార్మికవర్గం ఒక్కటే స్వభావతః సోషలిస్టు అని వెల్లడి" అయింది "వర్గేతర రాజకీయాలకూ, వర్గేతర సోషలిజంకూ సంబంధించిన సిద్ధాంతాలన్నీ వట్టి చెత్త అని రుజువైంది " "రిపబ్లిక్ కేవలం కార్మికవర్గ వీరత్వం మూలంగా దృఢపడింది "

రెండోదశలో "మార్క్సిజం సంపూర్ణ విజయం పొంది, విస్తరించసాగింది సోషలిస్టు పార్టీలు ప్రతిచోటా ఏర్పడి బూర్జువా పార్లమెంటరిజంను ఉపయోగించు కోవడమూ, తమ సొంత దినపత్రికలనూ, తమ విద్యాసంస్థలనూ, తమ ట్రేడ్ యూనియన్‌లనూ, తమ సహకార సంఘాలనూ స్థాపించడమూ నేర్చుకున్నాయి "

మార్క్సిజం విజయం పొందినదనటానికి నిదర్శనంః అది "దాని శత్రువులను మార్క్సిస్టుల వేషం వేసుకునేటట్టు నిర్బంధించింది లోపల కుళ్ళి పోయిన 'ఉదార వాదం' సోషలిస్టు అవకాశవాదంరూపంలో పునరుజ్జీవం పొందడానికి ప్రయత్నించింది గొప్ప యుద్ధాలకు బలాలను సిద్ధం చేసుకునే దశను వాళ్ళు ఈ యుద్ధాల విసర్జనగా వ్యాఖ్యానించారు 'సామాజిక శాంతి', వర్గపోరాట విసర్జన వగైరాలను బోధించినారు "

ఇంతలో "ఆసియాలో గొప్ప ప్రపంచ కల్లోలాల కొత్త మూలం ప్రారంభమైంది రష్యన్ విప్లవం వెంట టర్కీ, పర్షియా, చైనాలలో విప్లవాలు వచ్చినాయి ప్రపంచంలోని ఏ శక్తీ ఆసియాలో పాత ఫ్యూడల్ దాస్యాన్ని పునరుద్ధరించడంగానీ, ఆసియా, అర్ధఆసియాజనాల వీరోచిత ప్రజాస్వామ్యాన్ని తుడిచివెయ్యడంగానీ సాధ్యం కాదు యూరప్, ఆసియాల అనుభవం తర్వాత, వర్గేతర రాజకీయాల గురించీ, వర్గేతర సోషలిజం గురించీ మాట్లాడేవాళ్ళి బోనులో పెట్టి, ఆస్ట్రేలియా కంగారూ పక్కనో, ఆలాంటిదాని పక్కనో ప్రదర్శించాలి "

అలాంటి వాళ్ళను చరిత్ర మాత్రమే గాడిదలను చేస్తూ వస్తున్నది గానీ, భేషైన లెనిన్ సూచనలను మనుషులు అమలు చెయ్యటం లేదు

"రాబోయే చారిత్రక దశలో కార్మిక వర్గ సిద్ధాంతంగా మార్క్సిజంకు యింకా గొప్ప విజయం రాబోతున్నది" అని లెనిన్ చెప్పిన జోస్యం ఎలా రుజువయిందీ మనకు పుష్కలంగా తెలుసు

రెండవ వ్యాసం "మార్క్సిజంయొక్క మూడు మూలాలూ, మూడు భాగాలూ"–కారల్ మార్క్స్ 30 వ వర్ధంతి సందర్భంగా రాసిన వ్యాసం (1913 మార్చి)

మార్క్సిజం మూడు మూలాలూ ఏమంటే, జర్మన్ తత్వశాస్త్రమూ, ఇంగ్లీషు అర్ధశాస్త్రమూ, ఫ్రెంచి సోషలిజమూనూ వీటి మీదనే మార్క్సిజం ఆవిర్భవించి పురోగమించింది

మార్క్సిస్టు తత్వశాస్త్రం భౌతికవాదం 18వ శతాబ్దఅంతంలో "భౌతికవాదం ఒక్కటే స్థిరమైనదీ ప్రకృతి శాస్త్ర బోధనలన్నిటికీ విధేయమైనదీ, మూఢవిశ్వాసాలకు పడికట్టు మాటలూ వగైరాలకు వ్యతిరేకమైనదీ అయిన తత్వశాస్త్రంగా రుజువయింది మార్క్సు, ఎంగెల్సూ తాత్విక భౌతికవాదాన్ని సమర్ధించి యీ ప్రాతిపదిక నుండి వైదొలగిన ప్రతిదీ యెంత తప్పు అయిందీ పదే పదే వివరించినారు మార్క్సు తత్వశాస్త్రాన్ని మరింత ఉన్నతస్థాయికి అభివృద్ధి చేసినాడు ముఖ్యంగా హెగెల్ తాత్విక వ్యవస్థ విజయాలతో సుసంపన్నం చేసినాడు ఆ విజయాలలో ప్రధానమైనది పరస్పరవాదం (డయలెక్టిక్స్)

మార్క్సు చేసిన గొప్ప పని ఏమంటే ప్రకృతిజ్ఞానంలో సమాజ జ్ఞానం అంతర్భాగం చేశాడు "ఆయన చారిత్రక భౌతికవాదం శాస్త్రీయ అంచనాలు గొప్ప విజయం ఉత్పాదకశక్తుల పెరుగుదల ఫలితంగా, ఒక సమాజ జీవిత వ్యవస్థనుండి అంతకంటె ఉన్నతమైన వ్యవస్థ యెలా అభివృద్ధి అయేదీ యీ సిద్ధాంతం చూపింది మానవుని జ్ఞానం, అతని మీద ఆధారపడకుండా ఉన్న ప్రకృతిని ఎలా ప్రతిబింబిస్తుందో, అలాగే మానవుని సామాజిక జ్ఞానం సమాజం యొక్క ఆర్థిక వ్యవస్థను ప్రతిబింబిస్తుంది రాజకీయ సంస్థలు ఆర్థిక పునాదిమీదవున్న ఉపరినిర్మాణం "

మార్క్సు విశిష్టరచన "కాపిటల్" పెట్టుబడిదారీ సమాజపు ఆర్థిక వ్యవస్థను అధ్యయనం చేసింది అంతకు పూర్వం ఇంగ్లండులో ఆడమ్‌స్మిత్, డేవిడ్ రికార్డోలు వస్తువుల విలువ వాటిని తయారు చేయటానికి వినియోగించే శ్రమపై ఆధారపడుతుందనే సిద్ధాంతానికి ('విలువయొక్క శ్రమ సిద్ధాంతానికి') పునాదులు వేశారు మార్క్సు ఈ సిద్ధాంతాన్ని ముందుకు తీసుకుపోయాడు

"బూర్జువా ఆర్థిక వేత్తలు వస్తువుల మధ్య (మారక) సంబంధాన్ని చూసినచోట మార్క్సు మనుష్యుల మధ్య సంబంధాన్ని వెల్లడించినాడు సరుకుల మారకం విడి విడి ఉత్పత్తిదార్ల మధ్య సంబంధాన్ని మార్కెట్ ద్వారా చేస్తుంది విడి విడి ఉత్పత్తిదార్ల ఆర్థిక జీవితమంతటినీ విడదీయరాకుండా ఏకం చేస్తున్నదని డబ్బు సంకేతిస్తుంది పెట్టుబడి యీ సంబంధం యొక్కయితోధిక అభివృద్ధిని సంకేతిస్తుంది మనిషి శ్రమశక్తి సరుకు అవుతుంది కూలి కార్మికుడు తన శ్రమశక్తిని యజమానికి (భూమి, ఫ్యాక్టరీలూ, శ్రమ పరికరాలూ గలవాడికి) అమ్ముతాడు కార్మికుడు తననూ, తనకుటుంబాన్నీ భరించడానికి అయ్యే ఖర్చుకుగాను దినంలో కొంత భాగాన్ని వినియోగిస్తాడు (అంటే అతనికూలికి సమమైన ఉత్పత్తి కొన్ని గంటలు మాత్రమే పనిచేసి, మిగిలిన శ్రమను యజమానికి నైవేద్యంపెడతాడు)" ఈ విధంగా కార్మికుడు పెట్టుబడిదారులకు అదనపు విలువను, పెట్టుబడిదారీ వర్గ సంపదయొక్క మూలాన్ని సృష్టిస్తాడు

"అదనపు విలువ సిద్ధాంతం మార్క్సు ఆర్థిక సిద్ధాంతానికి పునాదిరాయి "

ఈ విధంగా కార్మికుడు తన శ్రమద్వారా సృష్టించిన పెట్టుబడి అతన్నేనలిపేస్తుంది "చిన్న యజమానులను నాశనం చేస్తుంది నిరుద్యోగుల సమూహాన్ని సృష్టిస్తుంది వ్యవసాయంలో కూడా యీ స్థితి గమనించవచ్చు "

సన్నకారు ఉత్పత్తిని ధ్వంసంచేసి, పెట్టుబడి శ్రమయొక్క ఉత్పాదక శక్తిని పెంచుతుంది గుత్తవ్యాపారం ఏర్పడుతుంది ఉత్పత్తి అంతకంతకూ సామాజికం అవుతుంది "లక్షల, దశలక్షల కార్మికులు క్రమబద్ధమైన ఆర్థిక వ్యవస్థలో అనుబంధింపబడతారు కానీ ఈ సమిష్టి శ్రమయొక్క ఉత్పత్తిని కొద్దిమంది పెట్టుబడిదార్లు సొంతపరచుకుంటారు ఉత్పత్తిలో అరాజకత్వమూ, సంక్షోభాలూ, మార్కెట్ల కొరకు తీవ్రమైన వేటా, ప్రజానీకంలో అత్యధిక భాగం యొక్క జీవిత భద్రతారాహిత్యమూ తీవ్రతరమౌతాయి "

పెట్టుబడిమీద ఆధారపడే కార్మికులు తమ సమైక్య శ్రామిక మహాశక్తిని సృష్టించుకుంటారు ఇందుకు పెట్టుబడే కారణభూతమవుతుంది

ఫ్యూడలిజమును పడగొట్టి "స్వేచ్ఛా" పెట్టుబడిదారీ సమాజం అవతరించింది ప్రజాపీడనకూ, దోపిడీకి ఇదొక కొత్తరూపం అన్నది స్పష్టం కాగానే రకరకాల సోషలిస్టు సిద్ధాంతాలు బయలు దేరాయి "తొలికాలపు సోషలిజం ఊహాస్వర్గపు సోషలిజం అది పెట్టుబడిదారీ సమాజాన్నీ విమర్శించింది, అభిశంసించింది, శపించింది, దాని నాశనం గురించి కలలు గన్నది దోపిడీ, అవినీతి అని ధనికులను ఒప్పించడానికి ప్రయత్నించింది " అదోరకమైన గాంధీ తత్వం కాబోలు

కాని నిజమైన పరిష్కారాన్ని చూపటంగానీ, కూలీ బానిసత్వం యొక్క వాస్తవాన్ని నిరూపించటంగాని, పెట్టుబడిదారీ అభివృద్ధి మార్గాలు వ్యక్తం చెయ్యటంగాని, నూతన సమాజాన్ని సృష్టించే సామర్థ్యం ఏ సామాజికశక్తికి ఉన్నదీ చూపించటంగానీ జరగలేదు వర్గపోరాటాలు సమస్త అభివృద్ధికీ మూలమని క్రమంగా స్పష్టమైనది యూరప్ అంతటా, ముఖ్యంగా ఫ్రాన్స్‌లో, ఫ్యూడలిజం పతనం వెంట జరిగిన విప్లవాల ద్వారా

"ఫ్యూడల్ వర్గంమీద 'రాజకీయ స్వేచ్ఛ' యొక్క ఏ ఒక్క విజయమూ భీషణ ప్రతిఘటన లేకుండా సాధించబడలేదు పెట్టుబడిదారీ సమాజంలోని వివిధ వర్గాల మధ్య చావుబ్రతుకుల పోరాటం లేకుండా ఏ ఒక్క పెట్టుబడిదారీ దేశమూ అంతో ఇంతో స్వేచ్ఛాయుతమైన, ప్రజాస్వామిక ప్రాతిపదికమీద అభివృద్ధి కాలేదు "

ప్రపంచ చరిత్రనుంచి గుణపారం లాగి, దాన్ని మినహాయింపులు లేకుండా వర్తింపజేసిన మొదటి మేధావి మార్క్స్ ఆ గుణపారమే వర్గపోరాట సిద్ధాంతం

"రాజకీయాలలో మనుషులు వంచనకూ, ఆత్మవంచనకూ తెలివితక్కువగా గురి అయినారు నైతిక, మత, రాజకీయ, సాంఘిక నుడికారాల ప్రకటనల, వాగ్దానాల వెనుక యేదో ఒక వర్గంయొక్క ప్రయోజనాలను వెదకడం వాళ్ళు నేర్చుకున్న దాకా యెల్లప్పుడూ అలా గురి అవుతుంటారు సంస్కరణల కొరకూ, మెరుగుదల కొరకు పోరాడేవాళ్ళు యెల్లప్పుడూ మోసగించబడతారు ప్రతిపాతసంస్థా యెంత కిరాతకంగా కుళ్ళి పోయినదిగా కనిపించినా, కొన్ని పాలక వర్గాల శక్తులచేత అది నడిపింపబడుతూ ఉందని వాళ్ళు గుర్తించేదాకా ఆవర్గాల ప్రతిఘటనను బద్దలుచేసే మార్గం పాతను మాడ్చిపారవేసి, కొత్తను సృష్టించేశక్తికాగల బలాలను మన చుట్టూ వున్న సమాజంలోనే గుర్తించి వాటిని ప్రబుద్ధంచేసి, పోరాటానికి సంఘటితం చేయడం బానిసత్వంనుండి బయటపడే మార్గాన్ని మార్క్సు తాత్విక భౌతికవాదం

మాత్రమే చూపించింది కార్మికవర్గం తన వర్గ పోరాటం ద్వారా విద్యా విజ్ఞానాలు పొందుతున్నది బూర్జువా సమాజపు దురభిప్రాయాలను తొలగించుకుంటున్నది తన శ్రేణులను మరింత చక్కగా సమీకరిస్తూ, తన విజయాల ఫలితాన్ని కొలవడం నేర్చుకుంటున్నది దుర్నిరోధంగా పెరుగుతున్నది

"మార్క్సిజమూ, రివిజనిజమూ" అన్న వ్యాసంలో లెనిన్ ఇలా చెప్పాడు

మార్క్స్ సిద్ధాంతం అడుగడుగునా పోరాటం సలుపుతూ ముందుకు పోవలసి వచ్చింది బూర్జువా శాస్త్ర విజ్ఞానం మార్క్సిజమును పూర్వపక్షంచేసి, ఓడించేసినట్టు ప్రకటించింది "నిర్మూలించబడిన" ప్రతిసారీ మార్క్సిజం మరింత బలం పుంజుకున్నది 1840 నుంచి ఒక అర్ధ శతాబ్దం ఈ సిద్ధాంత సంఘర్షణల లోనే గడిచింది 60లలో ఈ ఘర్షణ సిద్ధాంత పరిధినుంచి ప్రత్యక్ష కార్మికోద్యమరంగానికి సన్నిహితమయింది కార్మికోద్యమాలలో ఇతర సిద్ధాంతాలను తోసిరాజని, మార్క్సిజం పూర్తి విజయం సంపాదించటం 90లలో పూర్తి అయింది కార్మికోద్యమ అంతర్జాతీయ సంస్థ పునరుద్ధరించబడినప్పటినుంచీ ముఖ్య విషయాలన్నిటి లోనూ మార్క్సిస్టు దృక్పథం అవలంబించింది

అంతటితో మార్క్సిస్టు వ్యతిరేక ధోరణులు ఇతర మార్గాలు అవలంబించాయి కానీ మార్క్సిజంలోనే దాని వ్యతిరేక ధోరణులు తలయెత్తి పోరాటం కొనసాగింది ఇదే రివిజనిజం ఈ రివిజనిజం సారం ఏమిటి?

రివిజనిజం తాత్వికరంగంలో, బూర్జువా ప్రొఫెసర్ల అడుగుజాడలలో తిరోగమించి, "మత గురువులు వెయ్యిసార్లు వర్ణించిన పడికట్టు పదాలను ప్రొఫెసర్లు పునశ్చరణ" చేస్తే భౌతికవాదం పూర్వపక్షం చేయబడిందని గొణిగింది "పరస్పరవాదం" స్థానంలో "సరళపరిణామ" వాదాన్ని తెచ్చిపెట్టింది

ఇక ఆర్థిక విషయాలలో రివిజనిజం మార్క్సిజంలో "సవరణలనూ", కొత్తవాస్తవాలనూ" ప్రవేశపెట్టింది ఏమిటి? వ్యవసాయరంగంలో సాంద్రీకరణా భారీ ఉత్పత్తికి స్వస్తి జరుగవు, పెట్టుబడిదారీ కింద ఆర్థిక సంక్షోభాలు ఇకముందు అరుదుగానూ, దుర్బలంగానూ ఉంటాయి- కార్టెల్లూ, ట్రస్టులూ వాటిని తొలగించను కూడా వచ్చు, వర్గవైరుధ్యాల తీవ్రత తగ్గిపోతుంది, పెట్టుబడిదారీ పతనమవుతుందన్న సిద్ధాంతం తప్పు, మార్క్స్ ప్రతిపాదించిన "విలువ" సిద్ధాంతాన్ని సరిదిద్దటం సబబే!

అంతర్జాతీయ సోషలిజంలో ఈ విషయాలను గురించి రివిజనిస్టులతో పోరాటం సాగింది ఈ రివిజనిస్టు భావాలన్నీ తప్పు అని వాస్తవాలతోనూ, సంఖ్యలతోనూ రుజువు చేయబడింది ఒక్క పార్శ్వానికి సంబంధించిన (పాక్షిక) వాస్తవాలమీద ఆధారపడిన పైపై సాధారణీకరణల ద్వారా రివిజనిస్టులు, శాస్త్రీయ అర్థంలో, పాపం చేసినారు రాజకీయంగా వాళ్ళు చేసిన పాపం యేమిటంటే రైతును విప్లవ కార్మికుని దృక్పథం అవలంబించమని ప్రేరేపించే బదులు ఆస్తిపరుని దృక్పథం అవలంబించమని ఆహ్వానించినారు లేదా ప్రేరేపించినారు "

ఆర్థిక సంక్షోభాలను గురించీ "పీడన సిద్ధాంతం" గురించీ రివిజనిస్టులు మరింత పెద్ద గోతిలో పడ్డట్టు త్వరలోనే రుజువయింది సంక్షోభాలు రానేవచ్చాయి గుత్త సంస్థలు ఒకరకం

ఉత్పత్తి ఏకీకరణసాధిస్తూ, మరొకపక్క ఉత్పత్తిలో అరాజకాన్ని పెంచి, కార్మికుల భద్రతను దెబ్బతీసి, పెట్టుబడి పీడనను తీవ్రంచేసి, వర్గవైరుధ్యాలను ఎప్పటికన్నా ఎక్కువ చేశాయి

రాజకీయరంగంలో రివిజనిజం మార్క్సిజం పునాదిని సవరణ చెయ్యటానికి గట్టి ప్రయత్నం చేసింది రాజకీయ స్వేచ్ఛా, ప్రజాస్వామ్యమూ, సార్వజనీన వోటుహక్కూ వర్గపోరాట కారణాన్ని తొలగిస్తాయనీ, కార్మికులకు స్వదేశమంటూ లేదన్న సూత్రాన్ని, (కమ్యూనిస్టు ప్రణాళికలోది) అబద్ధం చేస్తాయనీ, ప్రజాస్వామ్యంలో అధిక సంఖ్యాకుల నిర్ణయం అమలు జరుగుతుంది గనక రాజ్యం వర్గపరిపాలనగా ఉండదనీ, ప్రగతిశీల సంఘసంస్కరణవాద బూర్జువాలతో పొత్తు (సి పి ఐ కి కాంగ్రెసుతో పొత్తులాంటిది) నిరాకరించకూడదనీ రివిజనిస్టులు వాదించారు ఇవన్నీ “ఉదారవాద” బూర్జువా అభిప్రాయాలను పోలినవే “అలాంటి అభిప్రాయాలు ఎంత అసంబద్ధమైనవీ, పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధంలో మొత్తం, యూరప్ చరిత్ర ఇరవయ్యవ శతాబ్ది తొలిభాగములో మొత్తం రష్యన్ విప్లవ చరిత్ర స్పష్టంగా తెలుపుతాయి ‘ప్రజాతంత్ర’ పెట్టుబడిదారీ యొక్క స్వేచ్ఛలో ఆర్థిక విభేదాలు తగ్గిపోలేదు సరికదా, యింకా తీవ్రమైనాయి ”

బూర్జువా రిపబ్లిక్కులు వర్గపీడన అంగాలన్నది పార్లమెంటరీజం మరింతగా బట్టబయలు చేస్తుందనీ, సంక్షోభాలకూ, విప్లవాలకూ, అంతర్యుద్ధాలకూ దారితీస్తుందని లెనిన్ చెప్పాడు బూర్జువా ప్రజాస్వామ్యాల తత్వం అర్థంచేసుకోలేనివాడు “ఇలాంటి వాదాల (సామూహిక హింసతో తేల్చుకునే వాదాల)లో విజయోపేతంగా పాల్గొనడానికి కార్మికవర్గ జనాలను సిద్ధం చేసే సూత్రబద్ధమైన ప్రచార, ఆందోళనలను ఈ పార్లమెంటరిజంమీద యెన్నడూ కొనసాగించజాలడు పోరాట సామర్థ్యం అతితక్కువగా ఉన్నవాళ్ళు, అత్యంత ఊగిసలాడేవాళ్ళు, ద్రోహులూ అయిన వీళ్ళతో యోధులను లంకించడం ద్వారా ఈ ఒప్పందాలు జనాల చైతన్యాన్ని కేవలం మొద్దుబరుస్తాయి జనాల పోరాటం యొక్క వాస్తవ ప్రాముఖ్యాన్ని బలహీనపరుస్తాయి” అన్నాడాయన

రివిజనిజం యొక్క ఆర్థిక, రాజకీయ ధోరణిని “ఉద్యమమే సర్వమూ, అంతిమలక్ష్యం ఏదీకాదు,” (బెర్న్‌స్టయిన్) అన్నమాట బాగా వ్యక్తం చేస్తుంది ప్రతి కొత్త సమస్యా, ముందు ఊహించని ప్రతి కొత్త పరిస్థితీ ఏదో ఒక రివిజనిజమును ఎప్పుడూ అనివార్యంగా ఉత్పత్తి చేస్తుందని లెనిన్ చెప్పాడు “రివిజనిజం అంతర్జాతీయ ఘటన” అన్నాడు

“దక్షిణ పక్ష” రివిజనిజం గురించి చెబుతూ పెట్టుబడిదారీ సమాజంలో విధిగా ఉంటుందనీ, “పెట్టుబడిదారీ అభివృద్ధి స్థాయిలలో వున్న భేదాలకంటె” అది “గంభీరమైనదీ” అనీ లెనిన్ అన్నాడు

“చిన్న ఉత్పత్తి నుండి పెట్టుబడిదారీ వ్యవస్థ ఉద్భవించింది నిత్యం ఉద్భవిస్తున్నది పెట్టుబడిదారీ వ్యవస్థ మళ్ళీ మళ్ళీ అనివార్యంగా కొన్ని కొన్ని ‘మధ్యపొరలను’ ఉత్పత్తి చేస్తుంది ఈ సన్నకారు ఉత్పత్తిదార్లు మళ్ళీ అంటే అనివార్యంగా కార్మికవర్గశ్రేణులలోకి తోయబడినారు విశాలమైన కార్మికపార్టీలలో పెటీ బూర్జువా దృక్పథం మళ్ళీ మళ్ళీ తలఎత్తడం సహజం

“కార్మిక వర్గవిప్లవంలో అదృష్టాలు మారిందాకా” ఇలాగే ఉంటుందనీ, విప్లవం సాధించడానికి ప్రజానీకంలో మెజారిటీని “సంపూర్ణంగా కార్మిక వర్గీకరణ” చేయడం అత్యవసరమనుకోవడం గొప్ప పొరపాటని లెనిన్ హెచ్చరించాడు ఈ వ్యాసం 1908 నాటిది

1899 అక్టోబరు తరవాత ఎప్పుడో లెనిన్ చేసిన ప్రసంగం "మా కార్యక్రమం " ఇందులో లెనిన్ కొన్ని ముఖ్యవిషయాలు చెప్పాడు అందులో ఒకటి, మార్క్సిజమును పిడివాదంగా భావించేవారికి హెచ్చరిక

"మార్క్సు సిద్ధాంతం పూర్తి చేయబడిందనీ, అనుల్లంఘ్యమైనదనీ మేము నమ్మడంలేదు అది శాస్త్రానికి పునాది మాత్రమే వేసిందనీ, సోషలిస్టులు జీవితంతో సమంగా నడవదలచుకుంటే యీ శాస్త్రాన్ని అన్ని దిశలలోనూ అభివృద్ధి చేయాలనీ మాకు దృఢమైన విశ్వాసం వుంది యీ సిద్ధాంతం సాధారణ మార్గదర్శక సూత్రాలను మాత్రం సమకూర్చుకున్నది యీ సూత్రాలు ఇంగ్లండులోకంటె భిన్నంగా ఫ్రాన్సులోనూ, ఫ్రాన్సుకంటె భిన్నంగా జర్మనీలోనూ, జర్మనీకంటె భిన్నంగా రష్యాలోనూ ప్రయుక్తమవుతాయి "

కార్మికుల ఆర్థిక, రాజకీయ పోరాటాల సంబంధాన్ని లెనిన్ ఇలా వివరించాడుః

"ఆర్థిక పోరాటంకోసం రాజకీయ పోరాటాన్ని విస్మరించడం అంటే అంతర్జాతీయ సోషల్ డెమోక్రసీ యొక్క మౌలిక సూత్రం నుండి వైదొలగడమన్నమాట కార్మికోద్యమం యొక్క యావత్తు చరిత్రా మనకు నేర్పేదానిని విస్మరించడమన్నమాట ఆర్థిక పోరాటం యేదీ కార్మికులకు యే స్థిరమైన మెరుగుదలనూ తీసుకురాలేదు ఆర్థిక పోరాటాన్ని విస్తృత ప్రమాణంలో నడిపించడం కూడా సాధ్యంకాదు ప్రతి ఆర్థిక పోరాటమూ ఆవశ్యకంగా రాజకీయ పోరాటం అవుతుంది (ఇలా కారాదని మన పాలకులు!) సోషల్ డెమోక్రసీ దీనినీ దానినీ అవిచ్ఛేదంగా కలిపి, కార్మికవర్గం యొక్క ఏకైక పోరాటంగా చేయాలి అలాంటి పోరాటం యొక్క ప్రథమ, ప్రధాన లక్ష్యం రాజకీయ హక్కులను గెలుచుకోవడంగా, రాజకీయ స్వేచ్ఛను గెలుచుకోవడంగా వుండాలి " (మన కార్మిక నాయకులు ఇందుకు సిద్ధంగా ఉన్నారా? అలా చేస్తే కాంగ్రెసుతో కొంతమందికి స్నేహభంగం కాదా?)

"ఏం చెయ్యాలి? మన ఉద్యమం యొక్క జరూరు సమస్యలు" అనే పుస్తకాన్ని ప్రచురించేముందు లెనిన్ 1901 మే నెలలో "ఇస్క్రా"లో, "యెలా ప్రారంభించాలి?" అన్న వ్యాసం ప్రచురించాడు ఇది ఆచరణలో విధానానికీ, పనికీ సంబంధించిన ప్రశ్న అనీ, ఇది (అప్పటికి) ఇంకా పరిష్కారం కాలేదనీ, "ఆర్థిక వాదధోరణి" చావలేదనీ, రాజకీయ సంస్థా నిర్మాణానికీ, ఆందోళనకూ సంబంధించిన పని గుంటపూలు పూస్తున్నదనీ, సూత్రరహితమైన "మిశ్రమవాదం" తల ఎత్తుతున్నదనీ ఆయన అన్నాడు

సంస్థా నిర్మాణం గురించి మాట్లాడుతూ ఆయన "యెంత 'నిర్జీవ, శాంతియుత' పరిస్థితిలోనైనా, 'విప్లవతత్వ క్షీణత' యెంతగా ఉన్నా, సమరశీల సంస్థను నిర్మించడమూ, రాజకీయ ఆందోళన సాగించడమూ అత్యవసరం సరిగా అలాంటి దశలలోనే అలాంటి పరిస్థితులలోనే ఇలాంటి పని ప్రత్యేకంగా అవసరం ఎందుకంటే ప్రేలుళ్ళూ, ప్రజ్వలనలూ జరిగేసమయాలలో సంస్థను నిర్మించడం కాలాతీతంగా ఉంటుంది ఎప్పుడు అనుకుంటే అప్పుడు కార్యకలాపాలు ప్రారంభించడానికి పార్టీ సంసిద్ధంగా ఉండాలి సకల పరిస్థితులలోనూ, సకల సమయాలలోనూ రాజకీయ పోరాటం చేసే నేర్పుగల బలమైన సంస్థ లేకుండా, స్థిరమైన సూత్రాలచేత ప్రదీప్తం చేయబడి, పట్టుదలగా నిర్వహించబడే క్రమపద్ధతి గల ఆచరణ పథకం సమస్యేలేదు" అన్నాడు

1901లో రష్యన్ పార్టీ తక్షణ కర్తవ్యం "సకల శక్తులనూ సమీకరించగలిగి పేరుకు మాత్రమేగాక వాస్తవ ఆచరణలో ఉద్యమాన్ని నడిపించగల విప్లవ సంస్థను ప్రతి ప్రజ్వలనానికీ అండదండలు యిచ్చి, నిర్ణయాత్మక పోరాటానికి సిద్ధంగా ఉండే సంస్థను, నిర్మించడానికి పిలుపు ఇవ్వడం" ఈ లక్ష్యాలను లక్ష్యం చెయ్యకపోతే పార్టీ రివిజనిస్టు అవుతుంది

"మనకు అన్నిటికంటె యెక్కువగా అవసరమైంది వార్తాపత్రిక చివరివిషయం, మనకు నిశ్చయంగా కావలసింది ఒక రాజకీయ వార్తాపత్రిక" అన్నాడు లెనిన్ మనదేశంలాంటి సాంస్కృతిక అరణ్యంలో రాజకీయ భావాలు పండించటానికి సాంస్కృతిక వ్యవసాయం కూడా ఎంతో జరగాలి రాజకీయ భావాలకు మన దేశం ఊసర క్షేత్రంగా ఉన్నది అందుకే ఈ దేశ ప్రజలు–అత్యధిక సంఖ్యాకులు–ప్రజాస్వామ్యం ముసుగుకింద పచ్చి ఫాసిజం అమలు జరగనిస్తున్నారు

1901 సెప్టెంబరులో "ఇస్క్రా" పత్రిక ధోరణిని విమర్శిస్తూ "ఒక కామ్రేడ్లబృందం" ఒకలేఖ రాసింది ఈ లేఖతో పాటు, దానికి లెనిన్ సమాధానం "ఆర్థికవాద సమర్థకులతో సంభాషణ" అనే శీర్షికతో ఇందులో ప్రచురించబడింది అందులో లెనిన్ ప్రకటించిన కొన్ని అభిప్రాయాలు

"సిద్ధాంతకారుడు సద్యోజనిత ఉద్యమంకంటె ముందు వుండి, దారి చూపించి, భౌతిక అంశాలు (పరిస్థితులు) యెదుర్కొనే సిద్ధాంత, రాజకీయ సమస్యలకూ, యెత్తుగడలకూ సంస్థా నిర్మాణానికీ సంబంధించిన సమస్యలనూ అందరికంటె ముందు పరిష్కరించగలిగినప్పుడే ఆ పేరుకు అర్హుడు ఉద్యమం యొక్క భౌతిక అంశాలను విమర్శనాత్మకంగా చూడాలి సద్యోజనితత్వం (స్పాంటేనిటీ)లోని ప్రమాదాలనూ, లోపాలనూ చూపించగలిగి, దానిని చైతన్య స్థాయికి యెత్తగలిగి ఉండాలి సోషల్ డెమోక్రట్లు ఉద్యమానికి ముందు నడవగూడదనీ, దాని తోక వెనుక కాళ్ళీడ్చుకుంటూ నడవాలనీ బోధించే వ్యక్తులూ, పత్రికలు ముందుకు వచ్చినారు సోషల్ డెమోక్రట్లు సకల ప్రజాతంత్ర ఉద్యమ నాయకత్వాన్ని తమ సొంత చేతుల్లోకి తీసుకుంటె తప్ప వాళ్ళు నిరంకుశత్వాన్ని యెన్నడూ కూలదోయజాలరని గ్రహించలేకపోవడం– ఈ ధోరణికి వ్యతిరేకంగా మేము రాజీలేని పోరాటం సాగించినాము సాగిస్తూనే ఉంటాము 'ఇస్క్రా' ప్రజానీకంలోని అన్ని పొరలలోనూ రాజకీయ అసంతృప్తిని రేపుతున్నందుకు మేము గర్విస్తున్నాము దీనిని మరింత విసత్తృత స్థాయిలో చేయజాలనందుకు మాత్రమే మేము విచారిస్తున్నాము "

"ప్రజా తంత్ర విప్లవంలో సోషల్ డెమోక్రసీ యొక్క ఎత్తుగడలు" అన్న లెనిన్ రచన, బోల్షెవిక్కులకూ, మెన్షెవిక్కులకూ గల సిద్ధాంత, ఆచరణ విభేదాలను స్పష్టం చెయ్యటానికి అంకితమయింది 1905 మేలో రష్యన్ సోషల్ డెమోక్రటిక్ లేబర్ పార్టీ మూడవ సభ లండన్‌లో జరిగింది అందులో బోల్షెవిక్కులు పాల్గొన్నారు అదే సమయంలో మెన్షెవిక్కులు జెనీవాలో కాన్ఫరెన్సు జరిపారు రెండు సమావేశాల తీర్మానాలనూ తీసుకుని లెనిన్ "కార్మికవర్గ కర్తవ్యాల దృక్పథం నుండి మన బూర్జువా విప్లవాన్ని మొత్తంగా చూసే బోల్షెవిక్ అంచనాకూ, మెన్షెవిక్ అంచనాకూ మధ్యగల మౌలిక అభావాన్ని" నిర్ధారించటానికి ఈ రచన చేశాడు లెనిన్ ప్రముఖ రచనలన్నిటిలాగే ఇందులోకూడా, తాత్కాలిక సమస్యలను విశ్లేషించే

సత్యాలతోపాటు వివిధ దేశాలకూ, కాలాలకూ, పరిస్థితులకూ అన్వయించే పరమ సత్యాలు పుష్కలంగా మనకు లభిస్తాయి అందుచేత ఇది కేవలం చారిత్రక వ్యాసం కాదు ఒక శాస్త్ర గ్రంథం కూడా

"బూర్జువా ప్రజాస్వామ్య దిశలో అవసరమైన మార్పులు మరింత నిదానంగా, మరింత క్రమక్రమంగా, మరింత జాగరూకతతో, తక్కువ కృతనిశ్చయంతో, విప్లవంద్వారా కాక సంస్కరణల ద్వారా జరగటం బూర్జువా వర్గానికి యెక్కువ అనుకూలం యీ మార్పులు సామాన్య ప్రజల స్వతంత్ర విప్లవ కార్యకలాపాలనూ, చొరవనూ, శక్తినీ వీలైనంత తక్కువగా అభివృద్ధిచేయడం బూర్జువావర్గానికి అనుకూలం తద్వ్యతిరేకంగా, బూర్జువా భూస్వామ్య దిశలో అవసరమైన మార్పులు సంస్కరణల రూపంలో కాక, విప్లవరూపంలో జరగడం కార్మిక వర్గానికి ఎక్కువ అనుకూలం "

"బూర్జువా వర్గం యెల్లప్పుడూ అస్థిరంగా ఉంటుంది కార్మికవర్గం మాత్రమే ప్రజాస్వామ్యం కొరకు స్థిరమైన పోరాటం చేసే యోధుడుగా ఉండగలదు దాని విప్లవ పోరాటంలో రైతు జనాలు కలిసినప్పుడు మాత్రమే అది ప్రజాస్వామ్యం కొరకు విజయ వంతమైన పోరాటం చేసే యోధుడు కాగలదు కార్మికవర్గం యీ పోరాటానికి తగినంత బలంగా లేకపోతే, బూర్జువావర్గం ప్రజాతంత్ర విప్లవ అగ్రభాగాన వుండి, దానికి అస్థిర, స్వార్ధపూరిత స్వభావం యిస్తుంది కార్మికవర్గం యొక్క, రైతాంగం యొక్క విప్లవ ప్రజాతంత్ర నియంతృత్వంతప్ప యేదీ దీనిని వారించజాలదు "

"మాటలు ఆచరణ కూడా అవుతాయి, అనే విషయం వెకిలి విప్లవవాదం గమనించదు, ఈ ప్రతిపాదనను దరహంమీద చరిత్రకు వర్తింపజేసినప్పుడు నిర్వివాదంగా ఉంటుంది యే తిరుగుబాటులూ యిలాంటి ఆచరణకు సమానం కావు విప్లవదశ ప్రవేశించినప్పుడు, పాత 'ఉపరినిర్మాణం' పై నుండి కిందిదాకా బీటలువారినప్పుడు, తమకోసం కొత్త ఉపరినిర్మాణం సృష్టించుకొనే వర్గాల యొక్క, జనాల యొక్క బహిరంగ రాజకీయ ఆచరణ వాస్తవమైనప్పుడు, అంతర్యుద్ధం ప్రారంభమైనప్పుడు, ఆచరణకు మారవలసిన అవసరం గురించి సూటి నినాదం యివ్వకుండా పాత పద్ధతిలో 'మాటలకు' పరిమితం కావడమూ, ఆచరణనుంచి తప్పుకోడానికి ప్రయత్నించడమూ అనేది నిరాసక్తతా, నిర్జీవత్వమూ, ఛాందసమూ లేకపోతే విప్లవానికి ద్రోహమూ అవుతాయని తోకవాదపు విప్లవకారులు గ్రహించలేరు "

"మీచుట్టూ చూడండి వీధుల్లో జవాబుకోసం వెదకండి-ప్రతిచోటా శాంతియుత నిరాయుధ ప్రజాసమూహాలను కాల్చివేయడం ద్వారా ప్రభుత్వమే అంతర్యుద్ధం ప్రారంభించలేదా? విప్లవ పక్షపాతులు యిప్పుడు తిరుగుబాటు సమస్యను యెలా ప్రదర్శించాలి అనే విషయం గురించి కన్నులున్న వాళ్ళకు యేమీ సందేహం ఉండదు "

"బూర్జువా వర్గం తన సంకుచిత, స్వార్ధ ప్రయోజనాలు తీరిన వెంటనే అనివార్యంగా ప్రతీఘాత విప్లవం వైపు, నిరంకుశత్వంవైపు, విప్లవానికి వ్యతిరేకంగా, ప్రజలకు వ్యతిరేకంగా మళ్ళుతుంది కార్మిక వర్గం మాత్రమే చివరిదాకా నడుస్తుందని నమ్మగలం "

"పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలమీద ఆధారపడిన రాజకీయస్వేచ్ఛ అంతా బూర్జువా స్వేచ్ఛ స్వేచ్ఛ కొరకు డిమాండు ప్రాథమికంగా బూర్జువావర్గ ప్రయోజనాలను వ్యక్తం చేస్తుంది దాని ప్రతినిధులు యీ డిమాండును మొట్టమొదట లేవనెత్తినవాళ్ళు దాని మద్దతుదార్లు తాము సంపాదించిన స్వేచ్ఛను ప్రతిచోటా యజమానులలాగే ఉపయోగించి, దానిని మితమైన, కచ్చితమైన బూర్జువా మోతాదులకు కుదించి, విప్లవ కార్మికవర్గాన్ని శాంతి కాలంలో నిగూఢ పద్ధతులలో అణచివేయడంతోనూ, కల్లోల కాలంలో కిరాతకంగా అణచివేయడంతోనూ జోడించినారు "

ఈ కొద్ది వాక్యాలలో మనదేశం తాలూకు యాభై చిల్లర ఏళ్ళ రాజకీయ చరిత్ర ఇమిడి ఉన్నది

"విప్లవాలు చరిత్ర యొక్క వాహనాలు, అని మార్క్స్ అన్నాడు విప్లవాలు తాడిత, పీడితుల ఉత్సవాలు విప్లవ సమయంలోలాగ మరెప్పుడూ ప్రజాసముదాయం నూతన సమాజ సృష్టికర్తలుగా అంత చురుకుగా ముందుకువచ్చే స్థితిలో ఉండదు ఆలాంటి సమయాలలో ప్రజలు అద్భుతాలు నిర్వహించగలరు కానీ, అలాంటి సమయంలో విప్లవ పార్టీల నాయకులు కూడా తమ లక్ష్యాలను మరింత సమగ్రంగా, మరింత ధైర్యంగా ముందుకు తీసుకుపోవాలి– తమ నినాదాలు యెల్లప్పుడూ జనాల విప్లవ చొరవకంటె ముందు ఉండేటట్లుగా, దివిటీలాగ ఉపకరించేటట్లుగా "

"ట్రేడ్‌యూనియన్ ఉద్యమాన్ని ఉపేక్షించకుండా, అత్యంత స్వల్పమైన చట్టబద్ధమైన అవకాశాలనైనా (సైతం) వినియోగించుకోడానికి నిరాకరించకుండా విప్లవకాలంలో తిరుగుబాటు యొక్క, విప్లవసైన్య, విప్లవ ప్రభుత్వ నిర్మాణం యొక్క కర్తవ్యాలను ముందుకు తేవాలి

"విప్లవాన్ని గుర్తించడానికి విప్లవకారుడు కానవసరంలేదు సంబంధాలు వాస్తవాలు రూపుదాలుస్తుండగా ఉదార బూర్జువాలు విప్లవాన్ని గుర్తించవలసిన అవసరాన్ని తెలుసుకోవడం ప్రారంభించినారు వాళ్ళు అలా చేసేది విప్లవకారులైనందువల్ల కాదు విధిలేక, తమ ఇష్టానికి వ్యతిరేకంగా, విప్లవవిజయాన్ని కోపంతో చూస్తూ వాళ్ళు పోరాటాన్నీ, విప్లవాన్నీ ద్వేషిస్తారు "

"మాటల దుర్వినియోగం రాజకీయాలలో మామూలు విషయం ఉదాహరణకు 'సోషలిస్టు' అనే పేరును ఇంగ్లీషు బూర్జువా ఉదారవాదపు మద్దతుదార్లూ, బిస్మార్క్ మద్దతుదార్లూ, పోపు 13వ లియో మిత్రులూ తరచుగా సొంతపరుచుకున్నారు 'విప్లవం' అనే పదం కూడా దుర్వినియోగానికి పూర్తిగా లోబడుతుంది ఉద్యమాభివృద్ధి లోని ఒకానొక దశలో అలాంటి దుర్వినియోగం అనివార్యం "

"మార్క్సిస్టు దృక్పథం నుండి విప్లవం అంటే ఏమిటి? కాలం తీరిన రాజకీయ ఉపరి నిర్మాణాన్ని బలవంతంగా ధ్వంసం చేయడం అభివృద్ధి యొక్క ఒకానొక దశలో పాత ఉపరి నిర్మాణపు నిరుపయోగత్వం అందరికీ తేటతెల్లమవుతుంది విప్లవం అందరిచేతా గుర్తింపబడుతుంది "

"వెకిలి బూర్జువా దృక్పధంనుండి నియంతృత్వమనేదీ, ప్రజాస్వామ్య మనేదీ ఒకటి వున్నచోట మరొకటి ఉండజాలని పదాలు "

"కొన్ని సమస్యలు బలంద్వారా మాత్రమే పరిష్కారమౌతాయి మొదట దౌర్జన్యానికీ, అంతర్యుద్ధానికీ మామూలుగా దిగేది ప్రగతి వ్యతిరేకవర్గాలే, 'కార్యక్రమంలో తుపాకి సన్నీని చేర్చడానికి మొదటివాళ్ళు వాళ్ళు నిజంగా విప్లవకరవర్గం ప్రతిపాదించవలసింది సరిగ్గా నియంతృత్వ నినాదమే ప్రతీఘాత విప్లవం నుండి రక్షణా, ప్రజల సర్వసత్తాకతకు విరుద్ధమైన ప్రతిదానినీ వాస్తవంగా తొలగించడమూ విప్లవ ప్రజాతంత్ర నియంతృత్వం తప్ప మరేమీకాదు "

"పరమమైన స్వేచ్ఛను గురించి చెప్పే మాటలు పచ్చి వంచన శ్రామిక ప్రజాసముదాయాలు దారిద్ర్యంలోనూ, కొంతమంది ధనికులు రక్తోపజీవులుగానూ జీవించే సమాజంలో నిజమైన స్వేచ్ఛ ఉండజాలదు ఎవరైనా సమాజంలో జీవిస్తూ సమాజం నుండి స్వేచ్ఛగా ఉండజాలరు బూర్జువా రచయిత, లేక కళాకారుడు, లేక అభినేత్రి యొక్క స్వేచ్ఛ కేవలం ముసుగులో డబ్బుసంచిమీదా, లంచంమీదా, సానివృత్తిమీదా ఆధారపడడం- సోషలిస్టులమైన మేము యీ వంచనను బట్టబయలు చేస్తాము

"సోషలిస్టు విప్లవ మార్గంలో రాజకీయ విప్లవాలు అనివార్యంగా ఉంటాయి, సోషలిస్టు విప్లవాన్ని ఒకే ఒక ఘటనగా కాక, సంక్షుభిత ఆర్థిక రాజకీయ కల్లోలాల యుగంగా, అత్యంత తీవ్రమైన వర్గపోరాటమూ, అంతర్యుద్ధమూ, విప్లవాలూ, ప్రతీఘాత విప్లవాలూ నిండిన యుగంగా గ్రహించవలసి వుంటుంది "

ఈ పుస్తకంలో చిట్టచివరిది "సోషలిస్టు విప్లవమూ, జాతుల స్వయం నిర్ణయ హక్కు" అనే రచన యొక్క "సారాంశం"

ఈ పుస్తకం కూడ మాస్కో 'ప్రగతి' ప్రచురణాలయంవారు ప్రచురించినదే 'సామ్రాజ్యవాదమూ, సామ్రాజ్యవాదులూ' అనువదించినవారే దీనిని కూడా అనువదించినట్లు కనబడుతుంది అయితే ఇది ఒక సంవత్సరం ముందుగా (1973లో) అచ్చయింది ఇందులో కూడా "కంటిన్ సీతను" అన్నట్టుగా వాక్యభాగాలు ముందువి వెనుకగా ఉన్నా, 1974 అనువాదంతో పోల్చితే చాలా సరళంగా ఉన్నది మాస్కో నుంచి వెలువడే సిద్ధాంత గ్రంథాల అనువాదాలు పోను పోను బాగుపడటానికి బదులు క్లిష్టం కావటం శోచనీయం

ముద్రణ సృజన, మాసపత్రిక, నవంబరు-1977

# 1. సంఘర్షణ: రెండు రంగాలు

విప్లవం విందు భోజనం కాదన్నాడు మావో  అది వంట చెయ్యటం కూడా కాదు వంటకాలతో సంఘర్షణకు ఒకటే రంగం  విప్లవ సంఘర్షణకు రెండు రంగాలు  విప్లవం మూలాన తమ అస్తిత్వాన్ని కోల్పోయేవాళ్ళు సహజంగా ప్రతిఘటిస్తారు  తమకు గల గోళ్ళు, కోరలూ, శక్తీ విప్లవ కారులపై ప్రయోగిస్తారు  విప్లవ సంఘర్షణ అత్యధిక సంఖ్యాకుల అభ్యుదయం కొరకు కొనసాగుతుంది గనుకనూ, దాన్ని ప్రతిఘటించేది అత్యల్ప సంఖ్యాక వర్గం గనుకనూ, ఈ అత్యల్ప సంఖ్యాక వర్గం ఎన్ని కోరలూ, గోళ్ళూ, కండబలమూ కలిగిన దైనప్పటికీ,సూటి పోరాటంలో చలి చీమల చేత చిక్కి చచ్చిన సర్పం లాగా అయిపోవటానికి ఎంతో కాలం పట్టదు  విప్లవ పోరాటాన్ని ప్రతిఘటించే పులులు కాగితపు పులులని అవలీలగా రుజువవుతుంది

కాని విప్లవ పోరాటం అలాంటి సూటిపోరాటం కాదు  దానికి మరో రంగం కూడా ఉన్నది  అది జనబాహుళ్యమే  విప్లవ పోరాటం ఏకరంగ సంఘర్షణ అనుకోదలిస్తే, దాని ద్వారా అభ్యుదయం పొందగల ప్రజా బాహుళ్యం విప్లవ సంఘర్షణానుసార జీవితానికి మానసికంగానూ, తాత్వికంగానూ, ఆధ్యాత్మికంగానూ సిద్ధంగా, విందువంట లాగా తయారై ఉన్నదనుకోవలసి వస్తుంది  కాని యిది నిజం కాదు

ఆ మాటకు వస్తే, ప్రతి సామాజిక పరిణామ దశలోనూ రెండు రంగాల పోరాటం వున్నది వీరేశలింగం గారు సంఘ సంస్కరణకు పూనుకుని, తాను ఎవరినైతే సంస్కరణల ద్వారా బాగు చెయ్యదలచుకున్నాడో, వారే తన ఉద్యమానికి అడ్డు పుల్లలు వెయ్యటం చూశాడు

ఎంత వెనుక బడిన జాతులైనా సరే తన అచార విధానాలకోసమూ, విశ్వాసాల కోసమూ ప్రాణాలిస్తారు  కర్ర నాగలితో వ్యవసాయం చేసే ఆటవికులను యినుప నాగలి వాడమంటే లబోమంటారు  అశోకుడు చేసిన కళింగ దండయాత్రలో జరిగిన రక్తపాతం గురించి అందరికీ తెలుసు  అశోకుడు రాజ్యస్థాపనకు సంకల్పించిన వాడు  అతన్ని ప్రతిఘటించిన వారిలో రాజు అనేవాడు మచ్చుకైనా లేడుట  ఆ మారణహోమంలో బలి అయినది జాతులవాళ్ళు  ఒక విధంగా వాళ్ళు తమ జీవితాలు సామాజికంగా పరిణమించటానికి విరుద్ధంగానే పోరాడారు కొన్ని జాతుల వాళ్ళు వర్గ సమాజంలో చేరటానికి ఏ కారణం చేతనో తల ఒగ్గి "బాగు పడ్డారు"  వాళ్ళను జయించిన వాళ్ళు చాక చక్యంగా వారిని తమ జాతి అచారాలను అమలు చేసుకోనిచ్చి, కనపడకుండా వారి కాళ్ళకింద గోతులు తవ్వారు  ఈ పద్ధతిని గురించి అలోచిస్తే యీ నాడు మనలో కొందరు నమ్మే శాంతియుత సోషలిస్టు పరిణామం స్ఫురిస్తుంది

ఈ రెండు రంగాల సంఘర్షణ విప్లవ విజయంతో నిలిచి పోదని  చీనా అనుభవం చెబుతుంది  చీనాలో సోషలిస్టు ప్రభుత్వం ఏర్పడిన పదహారు, పదిహేడేళ్ళ అనంతరం సాంస్కృతిక విప్లవం ఆరంభమై, చాలా కాలం కొనసాగేటట్టు కనబడుతుంది

నిజమే, రెండు రంగాలలోనూ ఒకే రకం పోరాటం జరగదు  కాని రెండో రంగంలోని పోరాటాన్ని విస్మరించటం పెద్దపొరపాటు  ఇది సాయుధ పోరాటం కాదు  దీన్ని నిరాయుధ పోరాటం అనవచ్చు

తమ జీవిత విధానం ఎంత దుర్భరంగా వున్నా, మౌలికంగా అది సరైనదేననీ, అది దుర్భరం కావటానికి గల కారణాలన్నీ బయట ఎక్కడో వున్నాయనీ, వాటిని సంస్కరిస్తే సరిపోతుందనీ అనుకునే వాళ్ళు ఆ జీవితాన్ని ప్రాధమికంగా మార్చుకోవడానికి పోరాడరు వాళ్ళని వర్గ చైతన్యం లేని వాళ్ళంటాం జన బాహుళ్యంలో వర్గ చైతన్యం కలిగించటం అనేది ఒక బృహత్సంఘర్షణ ఇది పూర్తి అయేదాకా సాయుధ సంఘర్షణ ఆరంభం కాదన్నది ఆదర్శవాదం అవుతుంది కాని వర్గ చైతన్యం ఏ దశలో వున్నదనేది సూక్ష్మంగా అవగాహన చేసుకోకుండా సాయుధ సంఘర్షణను ముందుకు తీసుకు పోవటమూ, వివిధ విప్లవ దశలను చేరుకోవటమూ సాధ్యం కాదు అందుకే రెండు రంగాలలోనూ పోరాటం ఒకేసారి సాగాలి

మన ప్రభుత్వం రేడియోలో భక్తి ప్రసారాల ద్వారానూ, సంస్కృత నాటికల ద్వారానూ, దేవాలయాల పెంపుదల ద్వారానూ సోషలిజం తీసుకురావటం ఎంత నిజమో, ప్రజలలో వర్గ చైతన్యం తీవ్రంగా పెంపొందించకుండా యీ దేశంలో విప్లవం రావటం కూడా అంతే నిజం సోషలిజం తీసుకొస్తామనే వాళ్ళకు అది రాకుండా చూసే మార్గాలు క్షుణ్ణంగా తెలుసు విప్లవం తెచ్చే వాళ్ళకు అందుకు జరగవలసిన రెండు రకాల సంఘర్షణ గురించి క్షుణ్ణంగా తెలుసునా? ఇది చాలా ముఖ్యమైన సమస్య విధ్వంసం జరిగితేనే గాని నూతన నిర్మాణం జరగదని మావో చెప్పినది భావరంగానికి కూడా పూర్తిగా వర్తిస్తుంది

భావరంగంలో జరగవలసిన విధ్వంసం ఎంతైనా వున్నది మన దేశంలో ప్రభుత్వం తీసుకునే ప్రతి చర్య ప్రజల పీడనను పెంచేదిగానూ, ధన-భూస్వాములకు లాభం కలిగించేదిగానూ, ఆర్థికంగా దేశాన్ని నయావలస విధానపు వూబిలో మరింత లోతుగా ముంచేదిగానూ వున్నది నానాటికి సోషలిజం, ప్రజాస్వామ్యం లాంటి మాటలు హాస్యాస్పదంగా పరిణమిస్తున్నాయి మనది నిజంగా భావ చైతన్యం గల జాతే అయితే విప్లవ జ్వాలలు దేశమంతటా లేచి వుండేవి పాలక వర్గం ఎక్కడా ఎన్నికల ప్రహసనాలు జరిపి వుండగలిగేది కాదు రాజకీయ రంగంలో నిస్వార్ధపరులు విప్లవ కారులేనని నూటికి 90 మంది ప్రజలు గుర్తించ గలిగేవారు కాని అలా జరుగుతున్నదా? లేదు

అధికసంఖ్యాకులకు విప్లవ కారుల పట్ల వుదాశీన భావమూ, కొందరిలో విద్వేషమూ ఎందుకు వుండాలి? మహా ఘోర హింసా పూరితమైన యీ నాటి వ్యవస్థలో విప్లవకారులు మాత్రమే హింసావాదులన్న అసత్య ప్రచారాన్ని నమ్మే వాళ్ళు వుండవలసిన పనేమిటి?

కొందరో, అందరో విప్లవకారులు తప్పుతోవలో ఉన్నారన్న సిద్ధాంతం ఒకటి వున్నది అది నిజమే అనుకున్నా, తమ కోసం పోరాడే విప్లవ కారులపట్ల-వారి పోరాటాల పట్ల-ప్రజలు ఎన్నడూ విద్వేషం పూనరు విప్లవంలో అనేక పొరపాట్లు జరుగుతాయి అపారమైన నష్టం కూడా జరగవచ్చు కాని ఒకసారి చైతన్యం పొందిన ప్రజలు ఆ చైతన్యాన్ని మళ్ళీ కోల్పోరు గతం లోనే మంచి వున్నదనిపించే అవకాశం శ్రామిక జీవితంలో ఏ మాత్రమూ వుండదు విప్లవ కార్యక్రమంలో ప్రతిచిన్న విజయమూ వారి జీవితాలను ఎంతో కొంత అభివృద్ధిలోకే తెస్తుంది

మన దేశంలో భావ విప్లవాన్ని అశ్రద్ధ చేయటం ఎంత మాత్రమూ తగదు ఆటవిక నాగరికత నుంచి కూడా వదలని భావజాలం మన జీవితాలను పట్టి పీడిస్తున్నది ఎన్నో

మూఢాచారాలూ, మూఢ విశ్వాసాలూ, కులమూ, మతమూ, సంప్రదాయమూ, కాలదోషం పట్టిన నీతి బోధలూ, చివరకు చెత్త సాహిత్యమూ, కళలూ మన ప్రజల మనస్సులకు కనపడని సంకెళ్ళుగా పని చేస్తున్నాయి వీటిని ప్రభుత్వం శాయశక్తులా ఎగ దోస్తున్నది (ప్రభుత్వం పని పెట్టుకుని చేసే ప్రజా వంచనకు ఒక్క రేడియో చాలు-గ్రహించ గలవాడికి)

స్థూలంగా చెప్పాలంటే ఆధ్యాత్మిక వాదం కీకారణ్యంలాగా పెరిగి పోయింది ప్రజల మానసిక చైతన్యంలో, భౌతిక వాదానికి అవసరమైన బాహ్యపరిస్థితులన్నీ యీనాడు జీవితంలో వున్నాయి కాని ఆధ్యాత్మిక వాదాన్ని (భావవాదాన్ని) ముందు నిర్మూలించాలి దాని చాటునే ప్రజాద్రోహం విచ్చలవిడిగా సాగుతున్నది ప్రజల దోపిడీకి దేవుళ్ళు అంగరక్షగా వున్నారు మేధావుల కింద పరిగణించవలసిన వాళ్ళు కూడా ఆధ్యాత్మిక, కృతక ధార్మికమైకం నుంచి బయట పడకుండా వున్నారు చురుకుగా భావ విప్లవం కొనసాగితేనే గాని ప్రజలకు యీ మత్తు వదలదు విప్లవ "నిరాయుధ" పోరాటం కూడా ముమ్మరంగా సాగాలి

జీవనాడి, మాసపత్రిక, ఆగస్టు,1974

## 2. లాంగ్ మార్చ్‌లో చైర్మన్ మావోతో

ఇది చదవటానికి చాలా ఆహ్లాదకరమైన పుస్తకం ఒక విధమైన డాక్యుమెంటరీ చారిత్రక నవలలాంటిది అయితే ఇందులో కల్పనకు తావులేదు దీన్ని నవల అనటానికి రెండు కారణాలు చెప్పవచ్చు సన్నివేశాలన్నీ ఒక పాత్ర దృక్పథంనుంచి వర్ణించబడ్డాయి దీనిలో ఒక నాయకపాత్ర ఉన్నది అది చైర్మన్ మావో కథకుడు రచయితే ఈ పుస్తకంలో లాంగ్ మార్చ్‌కి ఎంత ప్రాముఖ్యం ఉన్నదో, మావోకు అంతప్రాముఖ్యం ఉన్నది-ఇంకా ఎక్కువే ఉన్నదికూడా

1934-36 రెండేళ్ళు జరిగిన లాంగ్ మార్చ్ మానవ చరిత్రలోనే అపూర్వమూ, అనన్యమూ అయినది మావో నాయకత్వం కింద సాగిన ఈ మహాప్రస్థానం ఊహాతీతమైన కష్టాలతోనూ అంతకన్న ఊహాతీతమైన ఎర్రసైనికుల సహనశీలత తోనూ, దృఢనిశ్చయం తోనూ కూడుకున్నది మావో మాటలలో "సామ్రాజ్యవాదులు, వాళ్ళ కావలికుక్కలైన చాంగ్ కై- షేక్ (చియాంగ్ కై-షేక్) ప్రభృతులు నిర్వీర్యులనీ, ఎర్రసైన్యం వీరాగ్రేసరుల సైన్యమనీ లాంగ్ మార్చ్ ప్రపంచానికి చాటింది లాంగ్ మార్చ్ ఒక ప్రచారశక్తికూడా పదకొండు రాష్ట్రాలలో ఇరవైకోట్ల ప్రజానీకానికి ఎర్రసైన్యం మార్గమే విముక్తిమార్గమని వెల్లడిచేసింది ఒక్కమాటలో లాంగ్‌మార్చ్ మన విజయంతో, శత్రుపరాజయంతో ముగిసింది "

లాంగ్ మార్చ్ వివరాలు ఒక ప్రత్యేక గ్రంథం అవుతుంది ఎర్రసైనికులు రెండు సంవత్సరాలపాటు 12,500 కిలోమీటర్లు కాలినడకన, దక్షిణాన కియాంగ్సీరాష్ట్రం నుంచి ఉత్తర షెన్సీకి నడిచారు దారిలో ఇంచుమించు రోజూ సంఘర్షణలు జరిగాయి ఎక్కరాని కొండలు ఎక్కారు దాటరాని లోయలూ, నదులూ దాటారు మానవుడు ఎన్నడూ అడుగుపెట్టని దుర్గమప్రదేశాలమీదుగా ప్రయాణించారు పడరాని అగచాట్లు పడ్డారు తిండికీ, నీటికీ కరువు అనుభవించారు ఉచ్చుతాగారు అయితే అది వేరే కథ

ఆ లాంగ్ మార్చ్‌లో చైర్మన్ మావో చిత్రం ఈ రచనలో ప్రధాన వస్తువు

చాంగ్–ఫెంగ్ (అది అతని పేరు ఇంటి పేరు చెన్) కియాంగ్సీ రాష్ట్రంలో ఒక కుగ్రామానికి చెందిన నిరుపేదవాడు చిన్నతనంలో గొడ్లుకాసాడు చదువులేదు పదమూడో ఏట ఎర్రసైన్యం గురించి విన్నాడు అది కూడా ఏమని? "ఉన్నవాళ్ళ అంతుతేల్చి, వాళ్ళ వెండి బంగారాన్ని పేదవాళ్ళు పంచుకోవటానికి వీలుగా వీధుల్లో విరజిమ్ము తారట!"

చాంగ్–ఫెంగ్‌ను ఆకర్షించటానికి యిది చాలు ఇంతలో ఎర్రసేన ప్యూకిన్ రాష్ట్రంలో చాంగ్‌టింగ్ చేరి, అక్కడి పెత్తందార్లను దించేసి, పేదవాళ్ళకు భూములు పంచినట్టు వార్త తెలిసింది ఆ ఎర్రసైనికులు తమ ఊరు ఎప్పుడు వస్తారా అనుకున్నాడు తానే ఎర్రసైన్యంలో చేరితే బాగుంటుందనిపించింది అందులో చేరిపోయే ఆశతో అతను పెద్దవాళ్ళకు చెప్పకుండా చాంగ్‌టింగ్ వెళ్ళాడు

"రైఫిల్‌మోసే వయసుకూడా లేదు నీకు, మరీ చిన్నవాడివి" అన్నారు వాళ్ళు కాని వాళ్ళు సరేనన్నదాకా చాంగ్–ఫెంగ్ వదల్లేదు అతను రెండేళ్ళ పాటు "కొమ్ము" ఊదేపనిచేసిన అనంతరం బదిలీ అయింది కమిసార్ మావో సెంటుంగ్ అనే ఆయనకు పరిచారకుడుగా ఫ్రంటు కమిటీకి పంపారు "అదృష్టం అంటే నీదే? కమిసార్ మావో అద్భుతమైన వ్యక్తి ఆయన్తో పనిచేశావంటే నీకు గొప్ప భవిష్యత్తు వుంటుంది" అని చెప్పారు

ఫ్రంట్ కమిటీ కోసం ఎక్కడికో పోనవసరంలేదు ఆ ఊళ్ళోనే ఉంది కొద్ది క్షణాల ప్రయాణం "మావో వుండేది ఫక్తు కియాంగ్సీ తరహా కొయ్య ఇల్లు రెండు గదుల యిల్లు ఒకటి పడగ్గది రెండోది ఆఫీసుగది పడగ్గదిలో ఒక సాదా కొయ్యమంచం–దాని మీద నూలుదుప్పటి పరిచిఉంది దిండైనాలేదు కమిసార్ కూడా మా అందరిలాగే అతిసామాన్యంగా జీవిస్తున్నట్టు నాకు తోచింది "

కుర్రాడు యింకా మావోను చూడకుండానే ఆయన్నుగురించి తెలుసుకోవటం ఆరంభించాడు ఆయన్ను చూశాక, "ఆయన వేసుకునే యూనిఫారం మేం వేసుకునే బూడిదరంగు యూనిఫారమే నాకు కనిపించిన తేడా కోటుజేబులు చాలా పెద్దవిగా ఉండటమే బాగా పీలగా ఉన్నట్టున్నాడు కళ్ళు మాత్రం బాగా విశాలంగా, సునిశితంగా వున్నాయి వయసు నలభై వుండవచ్చు చేతుల్తో అభినయిస్తూ మాట్లాడు తున్నాడు స్వరం చాలా మృదువుగా వుంది లేచి నిలబడ్డప్పుడు పొడగరిగా గోచరించాడు "

మావో తనకు పరిచారకుడుగా వచ్చినవాణ్ణి ఊరూ, పేరూ అడిగి ఎర్రసేనలో ఎందుకు చేరావని "బడిపంతులు" ధోరణిలో అడిగాడు

'ఎర్రసైన్యం ఎంతో మంచిది స్థానిక పెత్తందార్లకు వ్యతిరేకంగా పోరాడుతుంది,' అన్నాడు చాంగ్–ఫెంగ్

వాళ్ళ ఊళ్ళో స్థానిక పెత్తందార్లున్నారా? ఉన్నారు చాంగ్–ఫెంగ్ తన కథ అంతా చెప్పాడు మావో తల ఆడిస్తూ, చిరునవ్వు నవ్వుతూ శ్రద్ధగా విన్నాడు ఆయన చాంగ్–ఫెంగ్‌తో "నువ్విక బాగా కష్టపడి పనిచెయ్యాలి కష్టపడి చదువుకోవాలి నీపేరు నువు రాసుకోగలవా? కనీసం నీపేరు, యితర్ల పేర్లు అయినా రాయటం నేర్చుకోవాలి నీకు తెలియందేమైనా వుంటె వాళ్ళనడిగి తెలుసుకో"అంటూ తన మరో పరిచారకుడు 'వూ'ను చూపించాడు

"ఆయనెప్పుడూ రాత్రిపూట చాలా పొద్దు పోయేదాకా పనిచేసుకుంటారు ప్రొద్దునపూట ఆయనకు ఫలహారం మరీ పెందలకాడ యివ్వకు " అన్నాడు వూ

మావోకు పరిచారకుడు అయిన తరవాత ఆయనగురించి తెలుసుకునేవీ, ఆయన నుంచి నేర్చుకునేవీ చాలా ఉంటాయి "మావో జీవితం చాలా నిరాడంబరమైనది ఆయనకున్న సరంజామా అతిస్వల్పం-రెండు గొంగళ్ళు, ఒక నూలుదుప్పటి, బూడిదరంగు యూనిఫారాలు రెండు చాలాకాలం నాటి ఒక ఓవరుకోటు, ఒక వూలు చలిబనీను, విరిగిపోయిన ఒక గొడుగు, అన్నంతినే కంచం, పుస్తకాలు, మ్యాపులు, రకరకాల పత్రాలు పెట్టుకునే ఒకమూట " ప్రయాణాలప్పుడు ఆ మూటనూ, గొడుగునూ మావో మోసేవాడు, మిగిలినవి పరిచారకుడు మోసేవాడు మజిలీచేరగానే "రెండు చెక్కపలకలు జతచేర్చి, దుప్పట్లు పర్చి యూనిఫారాలు దిండుగా అమర్చేవాణ్ణి అదే ఆయనపడక "

"ఆయన అతి తక్కువగా నిద్రపోయేవారు మాదగ్గిర చిన్నలాంతరొకటి వుండేది ప్రయాణంలో అదేమాకు టార్చిలైటు క్యాంపులో అది ఆఫీసుపని చేసుకోడానికి ఉపయోగపడేది రాత్రిపూట భోజనం ముగించుకుని ఆ లాంతరు వెలిగించి, పుస్తకాలు వగైరా, బైటికి తీసి వేకువజాముదాకా ఆయన పనిచేసుకుంటూ కూర్చునేవారు "

చాంగ్-ఫెంగ్ రాత్రిపూట ఆయనపక్కనే కూర్చుని, మేలుకోలేక జోగుతుంటే మావో అతన్ని వెళ్ళి పడుకోమనేవాడు వేసవి రాత్రులు మంచినీరు అడిగేవాడు చల్లటినీటితో టవల్ తడిపి, ముఖమూ, ఒళ్ళూ తుడుచుకునేవాడు ఆకలివేస్తే మధ్యాహ్నం కంచంలో మిగిలిపోయిన ఆహారాన్ని వెచ్చబెట్టించుకుని తినేవాడు

ఒకసారి చాంగ్-ఫెంగ్ మిగిలిపోయిన ఆహారాన్ని బయటపారేశాడు

"ప్రజలు కష్టపడి పండించే ప్రతిగింజకూ పోరాడుతున్నాం ఇకమీదట అట్లా ఎప్పుడూ చెయ్యకు " అని మావో అతన్ని మందలించాడు

పరిచారకుడుగా చాంగ్-ఫెంగ్ మావోను బాగానే కనిపెట్టుకుని ఉన్నట్టు కనబడుతుంది మావోకు అవసరమైనప్పుడు వేడినీరు అందేదికాదు ఎలాగైనా ఒక థర్మాస్ ఫ్లాస్క్ సంపాదించాలని అతను తహతహలాడి, 1931 శీతాకాలంలో, యాంగ్సిరాష్ట్రంలోని చియాన్ ఎర్రసైన్యానికి వశమైనప్పుడు, పారిపోయిన ఒక పెత్తందారు ఇంటదాన్ని సంపాదించాడు కాని, మావోకు తెలిసిందంటే ప్రమాదమని భయపడి, దాన్ని తమవెంటవుండే మరొకడివద్ద ఉంచి, మావోకు కోరినప్పుడుఅందులోంచి వేడినీరు ఇచ్చేవాడు

మరొకటి ఏమిటంటే, మావో భోజనపాత్ర అందులో ఒక్కపూటకు సరిపోయే భోజనమే పడుతుంది 1931 నవంబరులో కమిసార్ మావో, ఛైర్మన్ మావో అయాడు కాని ఆయన భోజనపాత్ర మారలేదు చివరకు, "1934 ఫిబ్రవరిలో మేం చాంగ్‌చే, ఫ్యూకిన్‌లను పట్టుకున్నప్పుడు మూడుగిన్నెల ఎనామిల్ క్యారియరు ఒకటి" సంపాదించాడుచాంగ్-ఫెంగ్

చాంగ్-ఫెంగ్‌కు పోస్టాఫీసు ఏంచేస్తుందో కూడా తెలీదు తను ఉత్తరం రాస్తే అది తమ ఊరిచేరి, తన వాళ్ళకు అందుతుందంటే ఆశ్చర్యపోయాడు ఉత్తరం రాయాలని ఉంది రాయటంరాదు ఏం రాయాలని ఉంది అని మావో అడిగితే, అదికూడా సరిగా చెప్పలేక

పోయాడు  చివరకు మావో స్వయంగా ఆ ఉత్తరం రాసి అతనిచేత పోస్టుచేయించాడు  అప్పటికి చాంగ్–ఫెంగ్ మావోకు కేవలపరిచారకుడుకాడు  అంగరక్షకుడు!

1933 చివరలో ఎర్రసైన్యం చాంగ్–ఫెంగ్ జన్మస్థలం ఉండే జిల్లాకు సమీపంగా వచ్చింది మావో అతన్ని పదిరోజుల సెలవుమీద ఇంటికి పంపుతూ, "వెళ్ళి మీవాళ్ళందరినీ చూసిరా నువ్వు తిరిగొచ్చాక యింకా బాగా పనిచెయ్యగలుగుతావ్  ఇప్పుడు మీ కుటుంబం సోవియట్ ప్రాంతంలో వుంది " అన్నాడు

చాలాకాలానికి ఇంటికి తిరిగొచ్చిన చాంగ్–ఫెంగ్‌ను చూడటానికి చాలామంది వచ్చారు "మాయింటిదగ్గిర ఒక మహాసభ జరుగుతున్నంత సందడిగా వుంది " చైర్మన్ మావోనుగురించి అతను ఊరివాళ్ళకు తెల్లవార్లూ చెప్పాడు  "చైర్మన్ మావో అచ్చం మన మామూలు జనం మోస్తరే!"  అందుకే మామూలు జనం, గ్రామ సోవియట్ అధ్యక్షుడితో సహా, మావోను గురించి ఆసక్తితో  విని ఉంటారు

చాంగ్–ఫెంగ్ తిరిగి వచ్చాక మావో అతన్ని "మీకుటుంబం ఎలా వుంది? మీ గ్రామ సోవియట్ అధ్యక్షుడు శ్రీమంతుడా, పేదవాడా? మీనాన్ననీకు అమ్మను చూసి పెట్టాడా?" అంటూ అడిగాడు  మావో జ్ఞాపకశక్తి! "మూడేళ్ళక్రిందట నేను మొట్టమొదటిసారి ఆయన్ని కలుసుకున్నప్పుడు నాకు చిన్నప్పుడే అమ్మపోయిందని చెప్పాను  ఆయన ఆ విషయం మరచిపోలేదు " అంటాడు చాంగ్–ఫెంగ్

అతని తండ్రి "కొత్త పద్ధతిలో" పెళ్ళిచేసుకున్నాడు  సోవియెట్ పరిపాలన ప్రభావం

లాంగ్‌మార్చ్‌కి ముందు మావో అవిరామంగా పర్యటనలు చేశాడు  తిండీ, నిద్రా లేదు చిక్కిపోయాడు  ఆయన అంగరక్షకులు కలవరపడ్డారు  వాళ్ళు తనను విశ్రాంతి తీసుకోమన్నప్పుడల్లా ఆయన బల్లమీద పేరివున్న కాగితాల గుట్టలు చూపించి, అవన్నీ చూసి విశ్రాంతి తీసుకుంటానని మాట ఇచ్చేవాడు  డాక్టరును ఏర్పాటుచేస్తామంటే, టెంపరేచరుచూసి ఇంజెక్షన్లు ఇవ్వటానికి నర్సు చాలునన్నాడు  "సైన్యానికి డాక్టర్లు కావాలి  మనకున్న డాక్టర్లు బహుకొద్ది  నా ఒక్కడికోసం డాక్టర్ని ఎలా పెట్టుకోను?" అని ఆయనవాదం  చివరకు ఆయనకు ఒక వైద్య పరిచారకుణ్ణి, చుంగ్–ఫ్యు–చాంగ్‌ను ఇచ్చారు

1930 మొదలుకొని చియాంగ్ కై–షేక్ "ఎర్ర"స్థావరాలమీద నాలుగు పెద్ద దాడులు చేశాడు  చివరకు ఎర్రసేన తమ స్థావరాను విడిచివచ్చి–దీర్ఘయాత్రమీద బయలుదేరవలసి వచ్చింది  1934 అక్టోబరు 16న ఎర్రసైన్యం లాంగ్‌మార్చ్ ప్రారంభించింది  మావో మరి రెండురోజుల అనంతరం బయలు దేరినట్టు కనబడుతుంది  "1934 అక్టోబరు 18 చైనా విప్లవచరిత్రలో మరువలేనిదినం  ఆరోజు సాయంత్రం అయిదు దాటాక మేం యిరవైమంది చైర్మన్ మావోతోపాటు యుటూ నుంచి బైల్దేరాం  దీర్ఘయాత్రకు అదే నాంది" అంటాడుచాంగ్–ఫెంగ్  వాళ్ళు బయలుదేరినప్పుడు ఒక్క సిపాయి అయినా అతనికి కనిపించలేదు

మిగిలినదంతా లాంగ్ మార్చ్ సంఘటనలే

చాంగ్–ఫెంగ్ త్వరలోనే అసంఖ్యాకులైన సైనికులను చూసి, "మనకింత సైన్యం ఎట్లా వచ్చింది?" అని చైర్మన్ మావోను అడిగాడు ఇంకా ఎంతోమంది ముందు వెళ్ళి పోయారని మావో చెప్పాడు సైనికులందరూ ఒక నదిని దాటేటప్పుడు మావో స్ట్రెచరుమీద ఉన్న ఒక సైనికుని చూసి "గాయం బలంగా తగిలిందా, కామ్రేడ్?" అని మృదువుగా పలకరించాడు "లేదు నేను యిట్టే మళ్ళీ యుద్ధరంగంలోకి తిరిగివస్తాను" అన్నాడు క్షతగాత్రుడు "స్ట్రెచర్ వెళ్ళిపోయినవేపే చూస్తూ నిలబడిపోయి చైర్మన్ మావో దీర్ఘాలోచనలో మునిగిపోయాడు "

పగటిపూట శత్రువిమానాలదాడి భయం ప్రస్థానం రాత్రివేళ సాగింది నవంబరులో సియాంగ్ నదిని దాటటం మావోలెక్కన ఘనవిజయం క్వాంగ్సీ, హ్యూనాన్ రాష్ట్రాల సరిహద్దు అయిన ఆ నది కొమింటాంగ్ నాలుగోదాడికి సరిహద్దు మావోకు ఒక్కరోజైనా కడుపు నిండా తిండిలేదు

త్వరలోనే వారు మియావో జాతివారుండే ప్రాంతం ప్రవేశించారు అక్కడ ఎలా ప్రవర్తించాలో మావో తన అనుచరులకు చెప్పాడు ఎర్రసైనికులు రాత్రిపూట పడుకునేటందుకు వాకిళ్ళ తలుపులు ఊతకెత్తి, మర్నాడు మళ్ళీ పెట్టేస్తారు కాని ఈ ప్రదేశంలో ఆ పని చెయ్యవద్దని మావో హెచ్చరించాడు

ఒక మజిలీలో మావో బసకు దిగువన ఒక పెద్ద కొలనులో పెద్ద పెద్ద గండు చేపలున్నాయి వాటిని పట్టి చైర్మన్‌కు వండిపెడదామనుకున్నాడు చాంగ్–ఫెంగ్

"నిన్న నేను చెప్పినదంతా ఇంతవేగం మర్చిపోయావన్నమాట!" అన్నారాయన కటువుగా మనదికానిదేదీ ముట్టుకోవద్దని ఆయన ముందే చెప్పాడు

మియావోలు మొరటుమనుషులనీ, వాళ్ళతో మైత్రి సాధ్యం కాదనీ అనుకున్న చాంగ్–ఫెంగ్, తమకు మియావోలలో కామ్రేడ్‌లు ఉన్నట్టు మావో నోటవిని ఆశ్చర్యపడ్డాడు "మనకు కామ్రేడ్స్ ప్రతిచోటా వున్నారు విప్లవాన్ని మనమే గుత్తకుతీసుకున్నామని అనుకుంటున్నావా?" అన్నాడు మావో హాస్యంగా

నూతన సంవత్సరం వచ్చింది అప్పటికి మావో మురా హోచాంగ్ అనే చిన్న బస్తీలో ఉంది మావోకు చాలా చక్కని బసదొరికింది "మేం సోవియట్ ప్రాంతం విడిచిపెట్టి రెండు నెలలు గడిచింది ఈ రెణ్ణెల్లలో చైర్మన్ మావో విరామం అంటూ ఎరగరు విశ్రాంతి తీసుకునే వీలేచిక్కలేదు ప్రయాణంలో ఆయన తన గుర్రాన్ని నడిచే ఓపిక లేనివాళ్ళకో, జబ్బుగా ఉన్నవాళ్ళకో యిచ్చి, తను స్వయంగా నడిచారు మజిలీచేసిన చోట ఎప్పుడూ సమావేశాలే అందరూ హాయిగా నిద్రపోతోంటే ఆయనొక్కరూ రాత్రిపూట మేలుకొని కూర్చుని టెలిగ్రాములు చదువుతూ, నివేదికలు తయారుచేస్తూ, యింకా యితర కార్యభారం వహిస్తూ గడిపారు ఎంతకాలమని యీ విధంగా నెట్టుకు పోగలరు? ఇట్లాంటి చక్కటిచోట ఆయన కొద్దికాలంపాటు ఆగి, కొత్త సంవత్సరం ఉత్సాహంగా గడిపి, కొంత విశ్రాంతి తీసుకుంటే ఎంత బాగుణ్ణు!" అదీ చాంగ్–ఫెంగ్ ఆలోచన కొత్త సంవత్సరం పండగకోసం అతను చాలా ఏర్పాట్లు చేశాడు కాని మావో "మనం యిక్కడ ఆగే అవకాశంలేదు సంబరం చేసుకోవటం కంటే యింకా ముఖ్యమైన పనులెన్నో వున్నాయ్!" అనేశాడు

ముందు జరగవలసిన ముఖ్యమైన పని వాళ్ళు 'వూ' నది దాటటం  చియాంగ్ కై-షేక్ వాళ్ళను వేటాడటానికి పెద్ద సైన్యాలను పంపుతున్నాడు  శత్రువుతో ఖేటీజరగకుండా సాధ్యమైనంతవేగంగా తాము 'వూ'నది దాటాలని మావో అన్నాడు

ఎర్రసైన్యం వూనదిని దాటినాక వాళ్ళకు తగిలిన పెద్దనది "బంగారుయిసుక" నది (చిన్‌షా) అది దాటిన తరవాత చాంగ్-ఫెంగ్ చెయ్యీ, కాలూ ఆడలేదు  ఛైర్మన్‌కు పడకా, తిండీ, నీరూ లాంటివి ఏర్పాటు చెయ్యటం అతనికి చాలా కష్టమయింది  కాని మావో బసకు వచ్చి "నేను పనిచేసుకోవటానికి స్థలం చూశావా?" అని అడిగాడు  లేదు  మావో తీక్షణంగా "ఇటువంటప్పుడు పని అనేది అన్నింటికంటె ముఖ్యం  అన్నం-నీళ్ళు ఇవన్నీ అల్పవిషయాలు, ఇరవై, ముప్ఫై వేలమంది మన కామ్రేడ్స్ నదిని దాటటానికింకా వేచినిలబడి ఉన్నారు  ఇది ముప్ఫైవేలమంది జీవితాలకు సంబంధించిన విషయం" అన్నాడు

"ఫీల్డు టెలిఫోన్ అవిరామంగా సందేశాలు పంపుతోంది  ఆయన తదేకంగా తనపనిలో లీనమై పోయారు  స్వీయ సుఖానికై ఆయన ఒక్కక్షణం కూడా వెచ్చించలేదు  మూడు రోజులపాటు పగలూ రాత్రీ షుమారు 30 వేల మంది సైనికులు బంగారు ఇసుక నది దాటుతూనే ఉన్నారు  ఛైర్మన్ మావో  అన్ని రోజులూ డెస్కువిడిచి పెట్టనేలేదు "

తరవాత ఎర్రసైన్యం 'యీ' జాతి ప్రజలుండే ప్రాంతం చేరింది  'యీ' ప్రజలు అనాగరికులు చాంగ్-ఫెంగ్ భాషలో "యిక్కడ పొలాలన్నీ బీళ్ళుగా వున్నాయ్  వరిపొలాల్లేవు వ్యవసాయదారుల యిళ్ళులేవు  అంతా బోసిగా వుంది  అడవుల్లో అక్కడక్కడా మోటుగా కనిపించే బెత్తెడు పాకలున్నాయ్ "

అయితే మావో భాషలో 'యీ' జాతివాళ్ళను "మనం గౌరవిస్తాం  మన సోదరుల్లాగా భావిస్తాం  తెల్ల (కోమింటాంగ్) సైన్యానికి వ్యతిరేకంగా వాళ్ళతో మనం బుజం బుజం కలిపి పోరాడ్తాం  ఎర్రసైన్యం వాళ్ళ దగ్గరికి వచ్చిందని తెలిస్తే, వాళ్ళు ఎగిరి గంతేస్తారు "

మావో చెప్పినది అక్షరాలా రుజువయింది  అయితే వాళ్ళ భాష అర్థంకావటం లేదనీ, ఆ ప్రాంతం మరో దేశంలాగా ఉన్నదనీ, చాంగ్-ఫెంగ్ నసిగాడు

"నువ్వు కియాంగ్సీ రాష్ట్రం మనిషివి, నేను హ్యూనాన్ రాష్ట్రంవాణ్ణి  నేను మాట్లాడేభాష నువ్వు అర్థంచేసుకోలేవు  యిక, వీళ్ళమాట నీకెలాతెలుస్తుంది చెప్పు " అన్నాడు మావో

ఇక్కడి నుంచి తాతూనది ప్రాంతానికి వెళ్ళేదారి దుర్గమమైనది  "పర్వతాలమయం దోవా డొంకాలేదు  ఒత్తుగా పెరిగిన గడ్డీ, ఒళ్ళుగీసుకుపోయే ముళ్ళ పొదలు  నిట్రంగా ఉన్న కొండపుంత పైకెక్కుతున్నకొద్దీ ప్రయాణం మరింత కష్టమైపోయింది  పోను పోను చెట్టూ చేమా మరీ దట్టంగా అల్లుకుపోయివున్నై  మధ్య మధ్య మేమాగిపోయి మా ఇంజనీరింగు బృందాన్ని కాలిబాట చెక్కటానికి పంపాల్సివచ్చేది "

మావో పరిపూర్ణనాయకుడనాలి  సిద్ధాంత విషయాలలోనే కాదు, కార్యాచరణలోనే కాదు, ప్రవర్తనలో కూడా మావో నాయకుడనిపించుకున్నాడు  చూడండి-"బాటవుండనీ లేకపోనీ, ఛైర్మన్ మావో మాత్రం చురుగ్గా నడిచేవాడు  ఆయన ముఖంలో అణుమాత్రమైనా అలసట కనిపించేది కాదు  దార్లో మధ్య మధ్య మావేపు తిరిగి  కబుర్లు చెపుతూ, కథలు వినిపిస్తూ

ప్రయాణం సాగదీసేవారు ఆ విధంగా ఆయన్ని చూశాక మేమూ ఉత్సాహం పుంజుకున్నాం మా అలసట గాల్లో ఎగిరిపోయింది ”

మునిమాపువేళ ఒక శిఖరాగ్రంచేరి అక్కడ విశ్రమించారు తిండితిని, మిగిలిన వాళ్ళు మాట్లాడుకుంటూండగా హ్వ్యావాంగ్ గురకపెట్టి నిద్రకు పడ్డాడు అతనుకూడా మావో పరిచారకుడే అతని ముఖంమీద నీళ్ళు చల్లటానికి ఎవరో ప్రయత్నిస్తే మావో వారించి, “పాపం బాగా అలిసిపోయాడు అతణ్ణి కాస్సేపు పడుకోనివ్వండి”అని తన గుడ్డల మడత అతని తలకింద దిండుగా పెట్టాడు

మర్నాడు వాళ్ళు ఒక నదిమీదవంతెన దాటేటప్పుడు మావో గుర్రాన్ని దాటించటానికి సైనికులు వెనక్కుతగ్గారు అయితే మావో గుర్రం సకిలించి హంగామా చేసింది మావో దాన్ని వెనక్కుతీసుకురమ్మనీ, సైనికులంతా వంతెనదాటినాక దాన్ని దాటించమనీ అన్నాడు అయితే మావో సామానంతా ఆ గుర్రంమీద ఉన్నది అది అవతలికి పోతేనేగాని చైర్మన్‌కు పడక వగైరాలు ఏర్పాటు చెయ్యటానికుండదు

“ఒక్క విషయం గుర్తు పెట్టుకోండి మన సైనికుల్ని గురించి, ఇంకాయితర్లను గురించి మొదట ఆలోచించాలి ఎక్కడ, ఎప్పుడు అనే ప్రశ్నేలేదు మన ఒక్క గుర్రంకోసం అంతమంది సైనికుల్నీ దాటనీయకుండా ఆపేయటం తప్పుగా ఉండదా?” అన్నాడు మావో

లూటింగ్ వద్ద ఎర్రసైన్యం వంతెనను దాటటం ఒక అద్భుతగాథ దాని వివరాలు ఈ పుస్తకంలో లేవు నదికి రెండు వేపులా ఎత్తు కొండలు నది చాలా లోతున ఉరకలు వేస్తూ ప్రవహిస్తున్నది నది దాటేవంతెనకుగాను 13 బలమైన గొలుసులు రెండు వేపులా ఉన్న కొండలలో తాపటం చేశారు అందులో 9 మాత్రమే వంతెన మిగిలినవి పట్టుకుని నడిచేవి గొలుసులమీద చెక్కలు పరిచి ఉండేవి అవి కొన్ని పోయాయి మిగిలినవాటిని శత్రు సైనికులు ఎర్రసైన్యం దాటేటప్పుడు తగలబెట్టారు లూటింగ్ నది అవతలిగట్టున ఉన్నది అక్కడ శత్రుస్థానం ఉన్నది అయినా ఎర్రసేన నది దాటి, లూటింగ్‌ను వశపరచుకున్నది!

మావో తన బృందానికి ముందుండి గొలుసులమీద “చాలా సహజంగా, నింపాదిగా నడిచిపోతున్నాడు అందరూ వంతెన మధ్యకు వచ్చేసరికి వంతెన ఊగింది చాంగ్-ఫెంగ్ ఆగిపోయాడు మావో ఏదో చెబితే నది రొదలో అతనికి వినిపించలేదు మావో వెనక్కువచ్చి, అతని చెయ్యిపట్టుకుని నడిపించి అవతలి ఒడ్డుకు చేర్చాడు ఇతరకామ్రేడ్స్ గొలుసులమీద బోర్లాపడుకుని పాకివస్తున్నారు

“చైర్మన్, మన ఒక్కజట్టు (ఇరవైమంది) యీ వంతెనని ఎంతకాలమైనా శత్రువశం కానీకుండా పట్టుకుని వుంచగలదు కాని మన శత్రువులు ” అన్నాడు చాంగ్-ఫెంగ్

మావో నవ్వి “శత్రువులు శత్రువులే మన కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన సాగే సైన్యంతో వాళ్ళని పోల్చలేం ఔనా?” అన్నాడు

తరవాత కొన్ని రోజులకు వాళ్ళు ప్రయాణించేదారిలో శత్రువిమానాలు బాంబులు వేశాయి మావో వెంట చాంగ్-ఫెంగ్‌తో బాటు హ్వ్యూ చాంగ్-పో అనే రక్షక బృందం నాయకుడు

కూడా ఉన్నాడు హ్యూ దెబ్బతిన్నాడు "తొందరగా కేసుచూడు" అని మావో వైద్యపరిచారకుణ్ణి ఊదరపెట్టాడు ఆయన హ్యూ తలను నిమురుతూ కూర్చుని "యిదేమంత తీవ్రమైందికాదు, నీకు త్వరగా కులాసా చిక్కుతుంది" అని చంటి పిల్లవాణ్ణి ఊపినట్టు ఊపాడు కాని హ్యూ బతకలేదు

అటుమీదట విప్లవ సైనికులకు ప్రకృతే భయంకర శత్రువయింది చైచిన్ (చియాచిన్) మంచు పర్వత కనుమలను దాటటం ఒక భయంకర సమరంలాటిది తీవ్రమైన చలి చలిబాధకు తట్టుకునేటందుకు అల్లము, మిరపకాయలూ చేర్చిపెట్టుకోమని మావో అందిరికీ చెప్పాడట! దోవంతా మంచు తప్పటడుగు వేస్తే అగాధాలలో పడిపోతారు మంచు పల్చగా వున్న ప్రాంతంలో జారుడు ఒకరినొకరు పట్టుకుంటూ ఉండాలి

"చైర్మన్! మీకిది చాలా ప్రయాసగా వుంది మమ్మల్ని కాస్త చెయ్యందించ నివ్వండి"

"నా అంతగా మీరూ అలిసిఉన్నారు"

మధ్యలో మంచుపడటం ఆరంభమై బీభత్సం చెలరేగింది వడగళ్ళు పడుతున్నాయి నేలమీదమంచు గాలికిలేచి సుడులు తిరుగుతోంది మేం చకచకా గుడ్డపట్టా తెరిచి పైకెత్తిపట్టుకున్నాం మధ్యలో మావో నిలబడ్డారు

మంచుతుఫాను ఎలావచ్చిందో అలాగే అకస్మాత్తుగా పోయింది "ఎవరికైనా దెబ్బలు తగిలాయా?" అని మావో అడిగాడు గుర్రాన్ని నడిపించేవాడికి వడగళ్ళతాకున చెయ్యివాచింది

దారిపొడుగునా మావో తన అనుచరులను హెచ్చరిస్తూనేవచ్చాడు

"శిఖరం పైకి చేరేదాకా మాట్లాట్టం, నవ్వటం వగైరా చెయ్యకండి కొండదేవుడు మీకు ఊపిరి తిరక్కుండా చంపేస్తాడు"

"కామ్రేడ్స్, సత్తువపుంజుకోండి ముందుకు చూడండి ఆగకుండాసాగండి"

"కామ్రేడ్స్ ఇక్కడ మనం విశ్రాంతి తీసుకోటం కుదర్దు కొద్ది ఓపికచేసుకున్నారా దిగువన మన నాలుగోఫ్రంటు ఫౌజుకలుస్తుంది"

వాయువ్య బెడువాన్ ప్రాంతంలో ఒకనాడు వాళ్ళు నిరామయ పర్వత ప్రాంతంలో ప్రయాణిస్తుండగా కనపడని, దారీతెన్నూ తెలియరాని ప్రయాణం మావో బాగా అలిసిపోయాడు ఆగిపోవటానికి ఆయన్ను ఒప్పించి, రెండు చెట్లకు తడిహామక్ తగిలించారు ఆయనకోసం

"కియాంగ్సీ చలువశయ్యమీద పవ్వళించబోతున్నానన్నమాట!" అని మావో ఛలోక్తి విసిరాడు "మేం ఎన్ని విపత్తుల్లో ఉన్నా, ఆయన రెండు చతురోక్తులాడితే వాతావరణం తేలికయ్యేది మాలో కొత్త శక్తి ప్రవహిస్తున్నట్టుగా తోచేది ఎటువంటి కష్టాన్ని ఎదుర్కొనడానికైనా సిద్ధమయేవాళ్ళం" అంటాడుచాంగ్-ఫెంగ్

చాంగ్-ఫెంగ్‌కు ఒకరాత్రి మెడపట్టి, పోటుపుట్టసాగింది "చైర్మన్ మావో మహా సూక్ష్మగ్రాహి ఆయన పరిశీలననుంచి ఏదీ తప్పించుకోలేదు 'చెన్‌చాంగ్ ఫెంగ్, మోరపైకెత్తి పైకే చూస్తున్నావ్! ఏమయింది? విమానాలొస్తున్నాయని చూస్తున్నావా యేం?' నెమ్మదిగా నా మెడనిమిరి, వెంటనే

వైద్య పరిచారకుణ్ణి పిలిచారు  నా చెయ్యిపట్టుకుని నడిపించుకొస్తూ 'గాభరా పడకు అదే తగ్గిపోతుంది' అని ఓదార్చారు  ఆయన్లో నేను పితృప్రేమను చూశాను "

యాత్ర సాగింది  ఆదిమ అరణ్యాలు దాటారు  భయంకరమైన చవిటిపర్రలు ప్రవేశించారు మనిషి ఎత్తు గడ్డి పెరిగినప్రాంతాల మైళ్ళకుమైళ్ళు నడిచారు  కాళ్ళకింద ఊబినేల  "చైర్మన్ మావో ఎన్నో సార్లు కామ్రేడ్స్‌ను తన దృఢమైన హస్తాలతో ఊబిలోంచి బయటికి లాగారు  చైర్మన్ మావో మా అందరికంటే ముందుండి నడుస్తున్నారు  మధ్య మధ్య ఆగి అందరూ వస్తున్నారో లేదో చూసుకుని గాని మళ్ళీ అడుగుముందుకువేసేవారు కారు  మేం బాగా అలిసిపోయి అడుగు ముందుకు వెయ్యలేనిస్థితిలో ఉన్నప్పుడు కథలు చెబుతూ ఛలోక్తులు విసుర్తూ మమ్మల్ని కడుపుబ్బ నవ్వించేవారు  మా అలసట ఎటెగిరిపోయేదో!"

మావో జన్మతః గురువు  దీర్ఘయాత్రలాటి క్లిష్టమైన అనుభవం మధ్య ఆయన తనవెంట ఉన్నవారికి అన్ని రకాల సహాయమూ చెయ్యటమేగాక జీవితానికి పనికివచ్చే ఉపదేశాలు ఎన్నో చేశాడు  విప్లవకారులకు అవి మరింత అమూల్యమైనవి

"కష్టాల్ని గురించి జడిసిపోగూడదు  కష్టాలంటే భయపడితే అవి ఇంకా భయంకర మౌతాయి నువ్వు భయపడకుండా నిబ్బరంగా ఉన్నావో, అవెంతటివైనా నిన్నేం చెయ్యలేవు "

అవతలివాడు నిబ్బరం కనపరిస్తే, "గుడ్ నువ్వు నిజమైన ఎర్రసైనికుడివి"

"మనం కొత్తచోటికి వచ్చినప్పుడు కొత్త పద్ధతుల్లో జీవించటం నేర్చుకోవాలి "

చివరకు దీర్ఘయాత్ర ముగిసింది  ఎర్రసైన్యం ఉత్తర షెన్సీ చేరాక మావో కొందరు కామ్రేడ్స్‌ను "సైనిక ఎకాడమీకి పంపేస్తున్నాను, ఏమంటావ్?" అన్నాడు

ఆరేళ్ళ తరవాత అతనికి మావోను విడిచిపెట్టి వెళ్ళాలనిలేదు  ఆయన అతనితో "చదువుకోడానికి నీకు అవకాశం దొరకలేదు  నీచదువు పూర్తయ్యాక పార్టీకి యింకెంతో మంచిగా పనిచెయ్యగలుగుతావు  అప్పుడు నాకు చాలా సంతోషంగా ఉంటుంది " అన్నాడు

"నేను వెళ్ళిపోతే మిమ్మల్ని ఎవరు కనిపెట్టుకుని ఉంటారు?"

"దానిగురించి నువ్వేమీ బెంగెట్టుకోకు  నీ స్థానంలో మరొకరు వస్తారు "

చాంగ్-ఫెంగ్ బయలుదేరేటప్పుడు మావో అతనికి కాగితాలూ, పెనసళ్ళూ ఇచ్చాడు

చాంగ్-ఫెంగ్ అకాడమీలో కొంతకాలం ఉండి, ఒక భద్రతాదళానికి శిక్షకుడుగా నియమకం పొంది మావోను మళ్ళీ కలుసుకుని, తాను చేస్తున్నపనిచెప్పి, తనకు ఉపన్యాసం ఇయ్యటం చేతకావటంలేదని చెప్పాడు

"నువ్విప్పుడు కేడరువు  చాలా అప్రమత్తంగా ఉండాలి  మాట్లాడేటప్పుడు చెప్పదలచింది స్పష్టంగా చెప్పాలి  వ్యర్థప్రేలాపన చెయ్యకూడదు  డాంబికం తెచ్చిపెట్టుకోకూడదు  నటించటం పనికిరాదు "

1946లో చాంగ్-ఫెంగ్ మావోవద్ద వీడ్కోలు చెప్పి షాన్‌టుంగ్ వెళ్ళిపోయాడు  తిరిగి అతనికి మావోను కలుసుకునే అవకాశం 1958 ఆగస్టులో కలిగింది

"చెన్ చాంగ్-ఫెంగ్ కదూ? ఔనా?" అన్నాడు మావో "మనం విడిపోయి పది సంవత్సరాలుపైగా దాటిందికదూ?"

"పన్నెండేళ్ళయింది చైర్మన్ " చాంగ్-ఫెంగ్ తాను చేసేవని చెప్పాడు

"నువ్విప్పుడు కమాండర్ అన్నమాట ఎప్పడేనా మీ ఊరు వెళ్ళివచ్చావా! నింగ్ టూలో అదే పాతయిల్లా "

ఆయన జ్ఞాపకశక్తి అమోఘం ఇన్నేళ్ళ తరవాత కూడా అతని జన్మస్థలమైన కుగ్రామం ఆయనకు జ్ఞాపకం ఉంది!

ఇది ఉద్గ్రంథం కాకుండానే జనసామాన్యానికి లభించే అపూర్వ గ్రంథాలలో ఒకటి లాంగ్ మార్చ్ కథ చదవాలంటే ఇది చాలదు కాని " లాంగ్ మార్చ్" కథ రాసేవాళ్ళు చెప్పని 'ఇంటిమేట్' వివరాలు ఇందులో ఉన్నాయి చెన్ చాంగ్-ఫెంగ్ అనే సాధారణవ్యక్తి తన అనుభవాలను మనతో అతి సహజంగా పంచుకున్నాడు ఈ పుస్తకం చదివితే మనం కూడా లాంగ్ మార్చ్‌లో మావో వెంట ఉన్న అనుభవమే కల్గుతుంది

అనువాదం కూడా నా బుద్ధికి చాలా సరిగా ఉన్నట్టు తోచింది మూల రచయితకూ, అతని స్థాయికీతగిన నిరాడంబరభాషలో అనువాదం సాగింది చాంగ్-ఫెంగ్ తెలుగులో రాస్తే ఇంచుమించు ఇలాగే రాసేవాడేమోనన్న భ్రమ పాఠకుడికి కలుగుతుంది అందరూ చదవదగిన పుస్తకం

లాంగ్‌మార్చ్‌లో చైర్మన్ మావోతో - చెన్ చాంగ్ ఫెంగ్ జనతా ప్రచురణలు, హైద్రాబాద్,
సృజన, మాసపత్రిక, మే 1974

# 3.కోట్లాది వీరయోధులు

యెనాన్ నగరంలో ఒక గోడమీద ఇలా రాసిఉండేదట

"ఆయన మనసులో లక్షలాది వీరయోధులు "

ఇది ఎవరిని గురించి ఎవరు ఎప్పుడు రాశారోగాని, ఆయన మావో అనుకుంటే ఏమీ ఇబ్బందిలేదు

మావో మనసులో ఉన్న లక్షలాది, కోట్లాది వీరయోధులెవరు? ప్రజలు మావో "ప్రజలు" అన్నమాటను కర్షక-సైనికులు లేక శ్రామిక-సైనికులు అనే అర్థంలోనే వాడాడు చీనాలో అంతర్యుద్ధం ప్రారంభం కావటానికి ఇంచుమించు ఇరవైఏళ్ళు ముందుగానే చింగ్ చాంగ్ పర్వతాలలో మావో రెండు మహత్తరమైన సిద్ధాంత ప్రతిపాదనలను అమలు చేశాడు ఒకటి, రైతాంగం నుంచి శక్తివంతమూ, చైతన్యవంతమూ అయిన పురోగామి సేనలను తయారుచేయటం దీని అనుబంధసూత్రమేమిటంటే, సేన రైతాంగానికి సోదరుడు కర్షక, సైనిక వ్యాపకాల మధ్య అవినాభావ సంబంధం ఏర్పడింది- ఇలా ఉండటం ప్రజాయుద్ధాల విజయాలకు సహాయకారి (ఉదాహరణః దక్షిణ వియత్నాం)

మావో అమలు చేసిన రెండవ సిద్ధాంతం పల్లెపట్లు నగరాలను ముట్టడించాలన్నది ముందుగా పట్టణాలను జయించాలన్నపద్ధతి తప్పని మావో కొట్టి పారేశాడు రాజకీయ

చైతన్యం కలిగి "ధర్మ"యుద్ధం చేసే ప్రజలను ఎంతబలమైన సేనకూడా జయించలేదనీ, ఎన్ని శతాబ్దాలకైనా విజయంలభించి తీరుతుందని మావో నిశ్చితాభిప్రాయం

ఇక్కడ సమీక్షించే పుస్తకం చీనా అంతర్యుద్ధకాలానికి (1946-1949) సంబంధించినది "అంతర్యుద్ధంలో మావోతో" అన్న పేరుకూడా దీనికి సరిపోతుంది అంతర్యుద్ధంలో కూడా యాత్ర ఉన్నది దీని రచయిత మావో బృందానికి చెందిన ఒక యాత్రికుడు కాని అతను మావోకు ఎంత సన్నిహితుడో స్పష్టంగా తెలీదు

అంతర్యుద్ధం గురించి స్థూలంగా చెప్పుకుంటే, 1945 నాటికి ఏత్‌రూట్, న్యూ ఫోర్త్ సేనలకింద పదిలక్షలమంది సైనికులున్నారు కోమింటాంగ్ బలాలు అంతకు నాలుగింతలున్నాయి ఒక ఏడాదిపాటు అంతర్యుద్ధం ముమ్మరంగా సాగినమీదట 1947 మధ్యకాలంలో కొమింటాంగ్ బలాలు ఎర్రసైన్యానికి రెండింతలు మాత్రమే ఉన్నాయి అదే విధంగా శత్రునాశనం జరుగుతూపోతే ఒక ఏడాదికి శత్రుబలాలసంఖ్యకన్న విప్లవ సైన్యం హెచ్చుగా ఉంటుందని మావో అన్నాడు కాని ఆరునెలలు తిరగకుండానే ఉభయపక్షాల సైన్యాలు ఇంచుమించు సమాన ప్రమాణానికి వచ్చాయి అయితే విప్లవ సైనికులకు హెచ్చు దీక్షా, సమర్ధమైన నాయకత్వమూ ఉండటంచేత వారి బలమే హెచ్చుగా వుండింది 1948 ఉత్తరార్ధంలో వారు సాధించిన విజయపరంపరలు యుద్ధ పర్యవసానాన్ని నిర్ణయించాయి వారి విజయానికి తోడ్పడినవి కొమింటాంగ్ చీనాలో పెరిగిపోయిన ద్రవ్యోల్బణమూ, దుర్వ్యయమూ, అవినీతి, చియాంగ్‌కైషేక్ పట్ల సమస్తమైన ప్రజలకూగల క్రోధమూనూ ఇంకొక సంవత్సరంలో యుద్ధం ముగుస్తుందని మావో 1948 నవంబరులో అంచనా వేశాడు కాని అలా అని నెలతిరగక ముందే కమ్యూనిస్టులు ఉత్తర చీనానూ, మంచూరియానూ వశపరచుకున్నారు జనవరిలో టియెన్‌ట్సిన్ వశమయింది పీకింగ్ యుద్ధం అవసరం లేకుండానే లొంగిపోయింది

లాంగ్ మార్చ్‌లాగే అంతర్యుద్ధం కూడా ఒక యాత్ర-విజయయాత్ర ఇందులో కూడా మావోబృందం పడరాని కష్టాలుపడింది అడుగడుగునా మావో యుద్ధ తంత్రమూ వ్యూహనిర్ణయాలూ, అన్నిటినీ మించి ఆయన వ్యక్తిగత శీలమూ విప్లవానికి చరిత్ర ప్రసిద్ధమైన విజయాలు చేకూర్చి పెట్టాయి

"The chinese civil war of 1946-49 is unquestionably one of the most striking examples in history of the victory of a smaller but dedicated and well-organised force enjoying popular support over a larger but unpopular force with poor morale and incompetent leadership" (Stuart Scahram)

ప్రజాభిమానాన్ని చూరగొన్న చిన్న సేన ప్రజాద్వేషాన్ని సంపాదించిన పెద్దసేన పైన విజయం సాధించటమన్నది చీనాలో యాదృచ్ఛికంగా జరగలేదనటానికి వియత్నాం మరింత గొప్ప ఉదాహరణ కొమింటాంగ్ అడుగుజాడలలో ప్రజా ద్రోహం తలపెట్టిన ఏ ప్రభుత్వమూ సరియైన రాజకీయ చైతన్యమూ, నాయకత్వమూగల ప్రజాశక్తి ముందు నిలవలేదు ఇతర దేశాలు ఇలాటి పాపిష్టి ప్రభుత్వాలకు అంతులేని సైనిక సహాయం అందజేస్తాయి- అమెరికా

చియాంగ్ కై–షేక్‌కు చాలా సహాయం చేసింది– కాని అంతా బూడిదలో పోసిన పన్నీరే పులులలాగా గాండ్రించినంత మాత్రాన అవి కాగితపు పులులు కాకపోవు రేపటి శక్తుల ముందు నిన్నటి శక్తులు నిలవటం సాధ్యంకాదు

ఈ పుస్తకం అంతర్యుద్ధకాలంలో మావోను చిత్రిస్తున్నది జైత్రయాత్రలో మావో బృందం సైనిక నాయకత్వంవహిస్తూ ఒకచోటినుంటి ఒకచోటికి కదలుతూండేది శత్రువును తిప్పటమూ, తికమక పెట్టటమూ, తమకు అనుకూలమైన స్థలానికి రప్పించి అక్కడ మట్టుబెట్టటమూ మావో ఎత్తుగడలు ఒక్కొక్కసారి వారు చాలా కొద్దికుటుంబాలు మాత్రమే నివసించే అతి చిన్న గ్రామాలలో మకాం చేసేవారు తమకు తగినంత చోటు లేకపోయినా ఎలాగో సర్దుకునేవారుగాని గ్రామస్తులను ఎంత మాత్రమూ ఇబ్బంది పెట్టేవారుకారు విప్లవ నాయకులు తమ అవసరాలకన్న యితరుల అవసరాల పట్ల శ్రద్ధ వహించేవారు తాము వెళ్ళినచోటనల్లా అక్కడి ప్రజల కష్టసుఖాలు వివరంగా కనుక్కొని, వారికి పనిసహాయం చేసి, శత్రువు వచ్చినప్పుడు ఏం చెయ్యాలో చెప్పేవారు

మావో ప్రత్యేకత ఏమంటే, శత్రువు ఏంచెయ్యాలో ఆయనే నిర్ణయించేవాడు దానికి భిన్నంగా ఎప్పుడూ జరిగేది కాదు "దేన్ని గురించి భయం? ప్రస్తుతం శత్రువు ఈ మార్గానరాడు వారి సాయుధబలాలు ఇటురావు గూఢచారులుకూడా ఇటురావటం అంత తేలికైన పనికాదు ప్రజలంతా మనవైపున ఉన్నారు"ఇలా తన అనుచరులతో అనగల స్థితిలో ఆయన ఉండేవాడు తన సేననూ, శత్రుసేననూ కూడా శాసించగల వాడికి విజయం రాకేంచేస్తుంది?

"ప్రజలయందు నమ్మకం కలిగి ఉండాలి శత్రువును ప్రజలు వెంటనే పసి కట్టగల్గుతారు చుట్టుపక్కలవాళ్ళే అతనిపని పట్టగలుగుతారు మీరు మరింత ఎక్కువగా ప్రజలపనిని చేయాలి" అని మావో ఉద్బోధ ప్రజలను శుష్కంగా స్మరించటంకాదు మావో ప్రజలను త్రికర్మలా కూడగట్టుకున్నాడు ప్రజలే విప్లవయోధులకు పెట్టనికోట

మావో ప్రభృతులు మొదలైనవారు యెనాన్‌లో ఉండగా 1947మార్చిలో వారిపై దాడి చేసిన చియాంగ్‌కై–షేక్ సేనలకు నాయకత్వం వహించినవారిలో ఒకడు హుత్సుంగ్–నాన్ (హుసంగ్‌నాన్ అన్నది తప్పు) మావో విధానాలకు వ్యతిరేకంగా హు సైన్యాలు అడుగుపెట్టిన చోట "ప్రతి పరిసరగ్రామాన్ని తగులబెట్టారు ధ్వంసం చెయ్యకుండా వారు ఒక్క ఇల్లును కూడా వదిలిపెట్టలేదు ప్రతిగృహం (గుహ) నివాసంయొక్క తలుపులు, కిటికీరెక్కలూ కూడా అగ్నిప్రీతి కావించారు నిశ్చయాత్మక యుద్ధానికి తల పడేందులకై మా ప్రధానబలగాన్ని కనుక్కోవాలని, శత్రువు అన్ని దిక్కులా ఆకస్మిక దాడులను తరుచుగా చేశాడు " వీటికితోడు ప్రజలను బాధించి ఎర్రసైన్యం వార్తలు రాబట్టటం నాజూకులుకూడా ఉండేవి– నక్సలైట్లనుంచి గ్రామాలను కాపాడటానికి వచ్చే పోలీసు, సైనిక బలగాల్లాగే! ఇదంతా మావో విజయానికి తోడ్పడలేదని ఎలా అనగలం?

తనకు ప్రత్యర్థి–ప్రజల శత్రువు–హుత్సుంగ్–నాన్ గురించి మావో, "హుత్సుంగ్–నాన్ దాడికి కృతజ్ఞతలు నాకు మంచి వ్యాయామం ఇచ్చింది అది నాశరీరాన్ని బాగా గట్టిపరచింది ఆయనకు నిజంగా నాకృతజ్ఞతలు తెలపాలి!" అనటంలో భేషజం ఏమీలేదు తమ నాయకుడు

శత్రువును గురించి అలా అంటుంటే మిగిలిన వాళ్ళకు ఎంత ఉత్సాహం! అదేధోరణిలో "హుత్సుంగ్-నాన్ శక్తిసామర్థ్యాలున్న వ్యక్తికాదు వాడు విద్రోహి కుటిలుడు మనం ఆయనతో అనేకసార్లు పోట్లాడినప్పటికి ఒక్కసారికూడా ఓడిపోలేదు కేవలం మన ప్రణాళికలు సక్రమంగా నెరవేర్చుటలో ఆయన కడు నేర్పరి!" ఒక్క ముక్కలో కాగితపు పులి! "హుత్సుంగ్-నాన్ ఏ మాత్రమూ చెడ్డవాడుకాడు మాకు అవసరమైనవన్నీ ఆయనమాకు అందించాడు శత్రువులను దెబ్బతీయటానికిది మా సైన్యానికి అపారమైన శక్తి సామర్థ్యాలను కలగజేసింది " ఇవి మావో మాటలుకావు ఎన్ చాంగ్-ఎన్‌వి అయితేనేం? మావో మాటల ప్రతిధ్వనులే

హుత్సుంగ్-నాన్ గురించి యిలాటి అభిప్రాయాలుండటం సమర్థనీయమే ననటానికి, అతను రెండు లక్షలకు పైబడిన సైన్యంతో వాయువ్యప్రాంతాలగల ఎర్రసైన్యం మీద దాడులు చేశాడు ఎర్రసైన్యం బలం ఆ ప్రాంతాల 22 వేల చిల్లర మాత్రమే కాని యుద్ధాలు జరిగినప్పుడు 90శాతం విజయం అల్పసేనదే! కారణం? "మన సైన్యం సంచలన స్వభావంగలది కొత్త పరిస్థితులను తేలికగా మలచుకొనగలది అపాయాలనూ, అవాంతరాలనూ లెక్కచెయ్యకుండా నిరంతర యుద్ధాలను చేయగల్గినది శత్రువుయొక్క బలహీన అంశాలు కనిపెట్టి, వాటిని ఉపయోగించుకొనేది వల (వ్యూహం) నుండి ఒక్క శత్రువునైనా జారిపోనీయకుండా గట్టి చావు దెబ్బలు కొట్టగలది "

"విక్టరీ ఈజ్ ఎ స్పిరిట్" అన్నాడు అనటోల్ ఫ్రాన్స్ విజయం అనేది మనస్సేతర-స్పిరిట్ దాన్ని మావోఎంతో లక్ష్యపెట్టేవాడు దాన్ని తన అనుచరులకు పుష్కలంగా ఇంజెక్షన్ చేసేవాడు ఒకసారి రేడియోలో ఒక ఎనౌన్సర్ ఎంతో ఆవేశంతో, చియాంగ్‌కై-షేక్ తన వాగ్దానాలన్నిటినీ భగ్నంచేసి ఎలా అంతర్యుద్ధం తెచ్చిపెట్టిందీ, ఎర్రసైన్యం తన విజయోత్సాహాన్ని ఎలా జరుపుకుంటున్నదీ చెప్పింది

"ఆ బాలికా కామ్రేడ్ చాలా ఉద్దండురాలు" అన్నాడు మావో మెచ్చుకుంటూ "నిష్కర్షమైన న్యాయంతోనే ఆమె శత్రువును చీల్చి చెండాడుతుంది ద్వేషం, ప్రేమల మధ్య ఎంత విస్పష్టమైన వ్యత్యాసం ఆమెలాంటి ఎనౌన్సర్లకు మరింతమందికి శిక్షణ యిచ్చి మనం తయారుజేసుకోవలసి వుంది "

మావో సహజమైన గురువు బోధించటం ఆయన సహజస్వభావం అందులోనూ ప్రోలిటేరియన్ కగురువు కేంద్రకమిటీకి తన ఇంట్లో భాగం ఇచ్చిన వాంగ్ అనే ముసలాయన రేడియోపెట్టె మాట్లాడటంచూసి, "ఇదేమిటి? దీనిలోపల ఎవరన్నా ఉన్నారా?" అనే సరికి మావో వెంట ఉన్నవాళ్ళు విరగబడి నవ్వారు

"నవ్వకండి, రేడియోపని చేసేవిధానమూ, దాని సూత్రాలూ మీలో ఎవరికన్నా తెలిస్తే ముసలిమామకు వివరించండి," అని మావో మందలించాడు నవ్వారేగాని రేడియో ఎలా పనిచేస్తోందో వారికీ ముసలాయనకు తెలిసిందే తెలుసు! చివరకు రేడియో పనిచేసే పద్ధతి వివరించి చెప్పటం మావో వంతే అయింది

అంతర్యుద్ధం ఆరంభమైనాక మావో మారుపేరుతో (లి తె-షెంగ్) సంచరించాడు కాని ఒక ప్రముఖయుద్ధం జరగబోయేముందు ఆయన యోధులతో వ్యూహతంత్రం గురించి

మాట్లాడుతున్నది మావో త్సె-టుంగ్ అని టెలిఫోన్‌లో అన్నప్పుడు ఆయన అనుచరులు పరిస్థితిలో పెద్ద మార్పు జరిగిందని గ్రహించారు

మావో శత్రుబలాలు వొస్తున్నట్టు తెలిసి ఏ ప్రదేశమైన విడిచి వెళ్ళేటప్పుడు స్థానిక ప్రజలను వారి కర్మానికి వదిలెయ్యక, "క్రమపద్ధతిలో వారిని ఉపసంహరించే బాధ్యతను నిర్వర్తించేవారు తాము ఎటుపోతున్నదీ గ్రామ కార్యకర్తలకు చెప్పాలనీ, అందువల్ల వాళ్ళు వార్తలను పంపగలుగుతారనీ" అనేవాడు కాని అలా చేస్తే తమ రహస్యం శత్రువుకు తెలిసిపోతుందనీ, అందుచేత ప్రజలకు అబద్ధం చెప్పాలనీ కొందరు అభిప్రాయబడ్డారు కాని ఈ అభిప్రాయాన్ని మావో తీవ్రంగా ఖండించారు ప్రజలు తమ సొంతసైన్యం (ఎర్రసైన్యం)తో తరలిపోయే అవకాశం ఇయ్యాలి అందువల్ల వారికష్టాలు తగ్గుతాయి ప్రజలూ, సైన్యమూ ఒకటిగా కలిసిపోవాలి ప్రజలకు చివరంటా "మనం" బాధ్యతవహించాలి అదీ మావో వాదన

అడుగడుగునా మావోనుంచి అనుచరులు నేర్చుకునేది ఏదో ఒకటి ఉండేది

ఓసారి చైర్మన్ అనుచరులు ఆయనతో, "కొంత పెందరాడే మనం బయలు దేరటం మంచిది చైర్మన్, చీకటిలో ఈ బాటవెంట ప్రయాణించటం కష్టం" అన్నారు

చైర్మన్ చిరునవ్వు నవ్వి, "విచారించొద్దు, శత్రువు ఊహించినదెప్పుడూ మనం చెయ్యం పసుపుపచ్చనదికి అడ్డంగా మనల్ని తరమాలని శత్రువు తలుస్తున్నాడు కాని మనం దానికి సరిగా వ్యతిరేకమైనదే చేస్తాం పడమరవైపుగా ప్రయాణం చేస్తాం హుత్సుంగ్-నాన్ ఇక్కడికి దిగినాక, మనం వదిలిపెట్టటానికి ఇంకా కావల్సినంత సమయం ఉంటుంది " అన్నాడు

ఒకసారి వాళ్ళు ప్రయాణం చేస్తుండగా వానపట్టుకున్నది దానికితోడు వారిదారికి దిగువన శత్రువులుండటమూ, వారికి దారిచూపేవాడు దారి మరచిపోవటమూ జరిగి అమిత క్లిష్టపరిస్థితిలో వారు నిలిచిపోవలసి వచ్చింది కాల్పులు వినిపిస్తున్నాయి- ఒకసారి దగ్గరగా ఆ పరిస్థితిలో మావో వ్యాఖ్యానం "ఇది చాలా మంచి వాన ఇంకో రెండు వారాలలో గోధుమపంట కోతకు వస్తుంది"!

"నిశ్చలమైన ఆమాటవినగానే మాగుండె అదురుతగ్గింది " అంటాడు రచయిత

కాంప్‌లో ఉన్నప్పుడు మావోకు క్షణం తీరిక ఉండేదికాదు అందుచేత ఆయన మార్చ్‌చేసేటప్పుడు అందరితోనూ కలివిడిగా ఉండి, వాళ్ళ యోగక్షేమాలు ఆలోచించి, జరుగుతున్న యుద్ధగతి యొక్క విశిష్టతను వాళ్ళు అర్థంచేసుకుంటున్నదీ, లేనిదీ తెలుసుకుంటూ ఉండేవాడు

సరదా కబుర్లుకూడా వ్యక్తులను సంస్కరించటానికి ఉపయోగపడేవి ఒకసారి కొత్త నాలుగోబ్రిగేడ్ ప్రశస్తిని గురించి ప్రసక్తివచ్చింది

"ఎన్ చాంగ్-లిన్ నువు కొత్త నాలుగోబ్రిగేడ్ నుంచి వచ్చావుగదా, అది అంత అప్రతిహతశక్తిగా రూపొందటానికి కారణమేమంటావు?" అని మావో అడిగాడు

"పార్టీ మమ్మల్ని బాగా నడపడమే కారణం" అన్నాడు చాంగ్-లిన్

"అది అత్యంత ప్రాథమికమైన కారణం" అని మావో ఒప్పుకున్నాడు

చాంగ్-లిన్ అంతటితో వదలక, "ఇతర విధాలకూడా కొత్త నాలుగో బ్రిగేడ్ విభిన్నంగా వుంది దాదాపుగా మన మనుషులందరూ హోపైకి చెందినవారు" అన్నాడు

మావోతల అడ్డంగా ఆడించి, "హోపై మనుషులందరూ మంచియోధులని ఎక్కడాలేదు నీకు పోరాడేశక్తి వుందో, లేదో అది నీవే రాష్ట్రానికి చెందినవాడవనే దానిమీద ఆధారపడదు కొమింటాంగ్ సైనికులు అత్యంతహీనమైన యోధులు కాని మనం వారిని విముక్తి చేయడమే తడవుగా వారికి కొంత వర్గవిద్య చెప్పి, సమావేశాలలో పాల్గొనేటట్టు చేస్తే వారెందుకు పోరాడుతున్నదీ, ఎవరికోసం పోరాడుతున్నదీ స్పష్టంగా అర్థమవుతుంది అప్పుడు వారు మంచిగా పోరాడే సైనికులుగా మారుతారు" అన్నాడు

"నా మనసులో యింకా రాష్ట్రీయతత్వం యొక్క అవశేషాలు వున్నాయి" అని చాంగ్-లిన్ గ్రహించుకున్నాడు

"తప్పు విషయాన్ని చెప్తే పర్వాలేదు అదే సరైనదైతే ప్రతివాడూ సమ్మతిస్తాడు ఒకవేళ తప్పు అయితే మేమందరం విశ్లేషించుతాం అప్పుడు నీకర్థమవుతుంది" అని మావో అతన్ని ప్రోత్సహించాడు

ఇలాటి పుస్తకం చదివేటప్పుడు మనం గమనించవలసిందేమంటే, విప్లవం ఆశయం సైనిక విజయం మాత్రమేకాదు రాజ్యాధికారాన్ని తుపాకిగొట్టం ద్వారా సాధించటం మాత్రమే కాదుకూడా, మనుషులను విప్లవానంతర జీవితానికి అనుకూలంగా మార్చటం అదే వారిని గొప్ప యోధులుగా తయారుచేస్తుంది కొత్తరకం రాజ్యాధికారాన్ని నిర్వహించేటందుకు అనుకూలంగా రూపొందిస్తుంది ఈ విషయం మావోకు తెలిసినంత బాగా ఏ విప్లవ నాయకుడికీ తెలీదేమో మనుషులను మార్చటానికీ సమాజాన్ని మార్చటానికీ మధ్య సరిహద్దులు లేవు చీనా అంతర్యుద్ధం గురించి మనం నేర్చుకుని ఆచరించదగినది బహుకొద్ది మాత్రమే ఉండవచ్చు కాని మావో మనుషులను తీర్చిదిద్దే ప్రతి అంశమూ ప్రపంచ ప్రజలందరికీ ఉపయోగిస్తుంది విప్లవ శత్రువులకు ఇందుకు విరుద్ధమైన సూత్రం అయినా నమూనాకు ఇందులో దొరకదు

మనుషులను ఇలా తీర్చిదిద్దుతూనే సైనికంగా ఆయన నిర్వహించిన బాధ్యత ఇంతా అంతాకాదు "దేశవ్యాప్తంగా సకల యుద్ధరంగాలలో కొనసాగుతున్న ప్రజల విప్లవ పోరాటాలకు పథకాన్ని రూపొందించి చిత్రీకరించటమేగాక, చైర్మన్ తన ప్రత్యక్ష సారథ్యంలో వాయువ్య యుద్ధరంగంలో జరుగుతున్న ప్రజావిముక్తి యుద్ధాన్ని నడుపవలసియుంది మేము విశ్రాంతికోసం ఆగినప్పుడుకూడా చైర్మన్ మా వివిధ స్థావరాలనుండి వార్తలను తెలుసుకునేందుకై కమ్యూనికేషన్ మనుషులు వెంటనే రేడియో ఏర్పాటుచేస్తారు మేము మకాం వేసినపుడల్లా గుర్రాలపై నుండి జీనుసంచులను దించకముందే ఆయన తనపని మొదలుపెట్టేవారు "

అంతర్యుద్ధ చరిత్ర అంతా మనకీపుస్తకంలో దొరకదు కాని ఆయుద్ధాన్ని విజయవంతం చేసిన మావో ఆలోచనా విధానమూ, దృక్పథమూ పుష్కలంగా దొరుకుతాయి

"శత్రువే నిద్రాహారాలులేకుండా వెళ్ళగలిగితే మనం కూడా సిద్ధమే "

"సైనికుని ఒకసారి ఉపయోగించుకునేందుకై వెయ్యిరోజులు అతనికి శిక్షణ గరపండి "

"నేడు ప్రపంచం వారిదికాదు, మనది "

"మంచి (అనుకూల) పరిస్థితులకోసం మనం ఉద్యమించి పాటుబడాలి అంతేగాక, ఎంతటి కదుర్విధికైనా, కదుష్పరిణామామాలకైనా తయారుగా ఉండాలి ముఖ్యంగా నాయకత్వం వహించి యుద్ధాలను నడుపుతున్నప్పుడు అనేక ప్రత్యామ్నాయ ప్రణాళికలు సదా తయారు చేసుకోవాలి– విజయవంతంగా పోరాడితే ఏంచెయ్యాలి? జయప్రదంగా పోరాడక పోయినట్లయితే ఏంచేయాలి? పరిస్థితిమారితే ఏం చేయాలి?– అన్ని పరిస్థితులకు తగిన ప్రణాళికలను వేసుకుని సర్వదా సంసిద్ధంగా ఉండాలి మనం తప్పకుండా గెలుస్తామనే విశ్వాసంగల ఈ యుద్ధంలో కూడా ఎలాంటి ఆకస్మికమైన మార్పుకైనా తట్టుకొని, జయప్రదంగా అధిగమించటానికి తయారుగా ఉండాలి "

లాంగ్ మార్చ్‌లో ఎర్రసైన్యం పడిన కష్టాలతో పోల్చితే అంతర్యుద్ధ యాత్రలో కలిగిన కష్టాలు చాలా తక్కువని మావో అన్నప్పటికీ ఇది సుఖప్రయాణం ఎంతమాత్రమూ కాదు విప్లవం అంటే విందు భోజనం కాదన్నది ఈ పుస్తకం చదివితే ఘాటుగా తెలుస్తుంది కాని ఈ కష్టాలతోబాటు విజయాల పరంపరకూడా ఉన్నది వాటివెనక చైర్మన్ మావో "తాయ్‌పర్వతం"లాగా ఉన్నాడు

ఈ అనువాదం ఇంకా బాగుండి ఉండవచ్చుననిపిస్తుంది లేని పక్షంలో ఇది నవలలాగా చదవటానికి అనుకూలంగా ఉండదగిన పుస్తకం అలా ఉండకపోవటానికి ఎన్ చాంగ్–లిన్ కూడా కొంత వరకు కారణమేమో తెలియదు

కోట్లాది వీరయోధులు - ఎన్ చాంగ్-లిన్, అనువాదం : కె కె జ్వలిత్,
ప్రచురణ : భారతచైనా ప్రజల సాంస్కృతిక సంఘటన, హైద్రాబాదు
సృజన మాసపత్రిక, మే 1974

# 4. రేపటి చైనా (క్రీ.శ.2001)

కొద్ది దశాబ్దాల కాలంలో అనేక శతాబ్దాలు ముందుకు వచ్చి, భావిమానవ సమాజాలకు మార్గదర్శకంగా ఉండగల సామాజిక వ్యవస్థకు బలమైన పునాదులు వేసిన ఒకే ఒక దేశం చీనా పాశ్చాత్యదేశాల వాళ్ళు ఇతర దేశాలను తమ వలసలు చేసుకొనటమేగాక, తాము రాకపూర్వం ఆ దేశాలకు చరిత్రా, నాగరికతా లేనట్టు చరిత్రలు సృష్టించారు తమ ఏలుబడిలేకపోతే ఆ దేశాలకు భవిష్యత్తులేనట్టు అక్కడి ప్రజలను నమ్మించారు

అయితే ఆఫ్రికా, ఆసియా దేశాల వాళ్ళు వలస పాలన కింద దుర్భరమైన జీవితం అనుభవించటం చేత దాన్ని దైవదత్తంగా భావించక, పదే పదే తిరుగుబాట్లు చేశారు ఇవి గత శతాబ్దిలో ముమ్మరంగాసాగి, ఈ శతాబ్దిలో అవి మరింత తీవ్రమై విప్లవాలకు, జాతీయ విమోచనాలకూ దారితీశాయి

1949లో విప్లవాన్నీ జాతీయ విమోచననూ విజయవంతంగా సాధించుకున్న చీనా సంపదతోబాటు చరిత్రను కూడా ప్రజల పరం చేసింది "చరిత్రకు తామే సృష్టి కర్తలమనీ, తామే దానిని నడిపించగలమనీ వారిచే (ప్రజలచే) గుర్తింపజేయడం ద్వారా తొలగించడానికి ప్రయత్నిస్తోంది " ఎందుకు? "ప్రపంచంలో నేడు రంగంలో ఉన్న చారిత్రక శక్తులను గురించి

ఒక అవగాహన కల్గించడమే చారిత్రక పరిణామగతిని త్వరితం చేయడం అవుతుంది " ప్రజలు స్వతస్సిద్ధంగా మార్పును కోరరు చరిత్రను అధ్యయనం చెయ్యటం వారి జడత్వాన్ని పోగొట్టుతుంది అప్పుడు గాని ప్రజలు తమ చారిత్రక భవితవ్యాన్ని తామే నిర్ణయించుకునే పనికి పూనుకోరు

ప్రస్తుతం దోపిడీ నుంచి ప్రపంచం విముక్తి పొందటానికి అత్యంత తీవ్రమైన పోరాటాలు సాగుతున్నాయి దోపిడీ వ్యవస్థ ఉక్కిరి బిక్కిరి అవుతున్నది ఈ సందర్భంలో ఇతర ఆసియా దేశాలూ, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాలూ చీనా నుంచి నేర్చుకోదగినది ఎంతైనా ఉన్నది ఎందుచేత–?

"నేషనలిస్టు (జాతీయవాద) సోషలిస్టు–కమ్యూనిస్టు శక్తులు వర్తమాన ప్రపంచంలో ప్రధానమైన చారిత్రక శక్తులుగా అవతరించాయి ఇవి జంటగానో, (మధ్య) కొంత వ్యవధితోనో ప్రతి దేశంలోనూ చారిత్రక పరిణామాన్ని ప్రభావితం చేస్తున్నాయి "జాతీయవాదం బూర్జువా ప్రజాస్వామిక విప్లవం సాధిస్తుంది కాని బడుగు దేశాలలో పెట్టుబడిదారీ విప్లవించే దశకు రావటానికి పాశ్చాత్య సామ్రాజ్య వాద గుత్త పెట్టుబడి రాహువులాగా అడ్డుపడుతుంది!" స్వంత కాళ్ళపై నిలబడ్డాక ఎట్టి పెట్టుబడిదారీ ప్రభుత్వాన్నయినా సరే తనకు దాసోహం చేసుకుంటుంది లేదా కూలదోస్తుంది లేదా కొని వేస్తుంది అందువల్ల, రాజకీయ, ఆర్థిక స్వాతంత్ర్యం కోసం జరిపే పోరాటం అనేది సోషలిస్టు వ్యవస్థ ద్వారా మాత్రమే జయప్రదమవుతుంది "

జాతీయ విమోచన పోరాటాలలోనూ, విప్లవ దశలలోనూ చీనా సాధించిన అపారమైన అనుభవం "ఈ కాలపు మార్క్సిజం లెనినిజంగానూ, లేదా మావో అలోచనా విధానంగానూ," చెప్పబడుతున్నది "తృతీయ ప్రపంచంలో సాగుతున్న, తిరుగుబాట్లకు ఈ మార్గం తప్ప మరో మార్గంలేదు

అయితే "శాంతియుతమైన మార్గం" ద్వారా ఆసియా ప్రజలకు అరిచేతిలో వైకుంఠం చూపే అమెరికా మోసాన్ని అర్థం చేసుకునో, చేసుకోకనో, ఆమోదిస్తున్న వాళ్ళు ఇంకా కొద్దిమంది ఉన్నారు "ప్రపంచంలో ఇతరులెవరికంటే కూడా ఎక్కువ విదేశీ సహాయం పై ఆధారపడుతున్న ఇండియా ఉదాహరణ ఈ సందర్భంలో పేర్కొనదగినది " ఇలాంటి దేశాలలోని పాలక వర్గాలు "దాస్యభావం మూట గట్టుకున్న వాళ్ళు", అందువల్లనే అక్కడి ప్రజలు తిరుగుబాటు ధోరణిని ప్రదర్శిస్తున్నారు

ప్రజానీకం తమ జీవిత విధానాన్ని మారకుండా చూసుకోవటానికి ఎన్ని ఇడుములైనా పడతారు కాని అది దుర్భరమయేటట్టు చేసే ప్రభుత్వమే విప్లవాన్ని అనివార్యం చేస్తుంది అమెరికా అంతర్జాతీయ విధానాలను తమ జాతీయ విధానాలు చేసుకున్న వియత్నాం కాంబోడియాలలాటి దేశాలలోని ప్రభుత్వాలు ఎలా విప్లవాలు తెచ్చిపెట్టాయో మనం చూశాం ఇతర దేశాల గతి ఇంతకు భిన్నంగా ఉండబోదు ప్రజల తిరుగుబాటును మారణాయుధాలు అణచలేవు "తుది ఫలితాన్ని ఆయాదేశాలలోని ప్రజా బాహుళ్యం, వారి చారిత్రక చైతన్యం మాత్రమే నిర్ణయిస్తుందని చైనీయులు అంటారు "

ఇందుకు ఒక్క 'షరా' ఏమిటంటేః "ఇటువంటి పోరాటంలో లక్ష్యానికి అంకితమైన విప్లవ కార్యాచరణగల పార్టీనాయకత్వం అవసరం "

చీనా గురించి మనం తెలుసుకోవలసిన ముఖ్య విషయాలలో ఒకటి ఏమంటే, నేటి చైనా ఫ్యూడలిజం నుంచీ, కలోనియలిజం నుంచీ విముక్తి పొంది 24 ఏళ్ళే అయింది ఫ్యూడల్ రాచరిక వ్యవస్థపోయి పదిహేడు శతాబ్దాలయింది అయితే, ఆ వర్గపు సంస్కృతిని "పండితవర్గం" అంది పుచ్చుకున్నది ఈ పండితులు భూస్వామ్యవర్గం నుంచి వచ్చారు రికార్డులను బట్టి, గడచిన రెండువేల సంవత్సరాల కాలంలో రైతాంగపు తిరుగుబాట్లు 18, చిన్న చిన్న తిరుగుబాట్లు కొన్ని వందలూ జరిగాయి

(ఇంత దీర్ఘకాలం అమలులో ఉండి ఫ్యూడల్ వ్యవస్థ సాధించినదేమంటే చీనాలో సాంస్కృతిక సమైక్యత)

"ఈ రైతాంగ తిరుగుబాట్లు చారిత్రక పరిణామానికి ప్రోత్సాహం కలిగించిన శక్తులనే మావో నిశ్చితాభిప్రాయం ఈ రోజుకీ ఇది వాస్తవమే ఎందు చేతనంటే, రానున్న ప్రపంచ విప్లవానికి ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా ఖండాలలో 'బడుగు' స్థితిలో ఉన్న రైతాంగమే చోదక శక్తులుగా ఉంటారు "

మంగోలుల హయాంలో బీడుపెట్టిన పొలాలు ప్రజలను రెచ్చకొట్టి, ప్రతిఘటనలకు దారితీశాయి మంగోలు రాజవంశం అంతరించింది రైతుకుటుంబానికి చెందిన ఒక "సన్యాసి"మింగ్ రాజవంశం స్థాపించి, వ్యవసాయాన్ని ప్రోత్సహించాడు అయితే తిరిగి భూస్వాములు బలపడ్డారు రైతుపీడన అపారంగా పెరిగింది రైతాంగం ప్రచండంగా తిరుగుబాట్లు సాగించి, ప్రభుత్వాన్ని నిర్వీర్యం చేశారు దాంతో మంచూలు వచ్చి పడ్డారు వాళ్ళు ఈ తిరుగుబాట్లను మహా తీవ్రంగా అణచారు అయినా 40 ఏళ్ళపాటు తిరుగుబాట్లు సాగి, కొన్ని ప్రాంతాలు నిర్జనం కూడా అయిపోయాయి మంచూలు సముద్రయానాలపై ఆంక్షపెట్టారు (మన దేశంలోకూడా వచ్చిన ఈ ఆంక్ష చీనా నుంచి మంచూల కాలంలో దిగుమతి అయిందా?)

ఈలోపుగా యూరపు పారిశ్రామికం కావటంచేత రైతు సమస్య అక్కడ వెనకబడి పోయింది మార్కెట్లకోసం ప్రపంచాన్ని గాలించటం ప్రధాన సమస్య అయింది 1840 నుంచి 1949దాకా సామ్రాజ్యవాదులు చీనాను జలగల్లాగా పీల్చుకు తిన్నారు

ఒక వంక సామ్రాజ్యవాదుల దురాక్రమణా, ఇంకో వంక మంచూ పాలకుల అసామర్థ్యమూ కలిసి చీనాలో వ్యావసాయిక ఆర్థిక వ్యవస్థ ధ్వంసమై, పెట్టుబడిదారీ విధానం అభివృద్ధికి అవకాశం ఏర్పడింది అయితే మావో అన్నట్టు, "చైనాలో బూర్జువా వర్గపు నిరంకుశత్వం కింద పెట్టుబడిదారీ సమాజం ఏర్పడటాన్ని మొట్ట మొదటగా అడ్డుకున్నది సామ్రాజ్యవాదం" చౌక కూలీ, చౌక ముడిసరుకు లభించి, తమ అదనపు పెట్టుబడిని ఎగుమతి చేసే అవకాశాలున్న వలసలలో జాతీయ పెట్టుబడిదారీని సామ్రాజ్యవాదం ఎలా ఎక్కిరానిస్తుంది?

1911లో విప్లవం జరిగింది గాని పశ్చిమ రాజ్యాలు చీనాలోని ఫ్యూడల్ శక్తులకు సహాయపడ్డాయి అదేవిధంగా మొదటి ప్రపంచ యుద్ధమప్పుడు చీనామీద తమ పట్టు సడలిన

కాలంలో, అవి చీనామీదికి జపానును ఎగదోశాయి  పశ్చిమ రాజ్యాలతో కనీసం ఆరు రహస్య ఒప్పందాలు చీనా గురించి జరిగినట్టు వర్సేల్స్ శాంతి మహాసభలో బయట పడింది "మే 4 ఉద్యమం" చీనాలో జరిగింది  1919మే 4 నుంచి 1949 దాకా సాగిన చీనా చరిత్ర అవిచ్ఛిన్నమైనది  ఈ కాలంలో చరిత్ర పురోగతి అతి చురుకుగా సాగింది  ఇంకా సాగుతూనే ఉన్నది

మే 4 ఉద్యమం దేశవ్యాప్తమైనది  18 మాసాలు జరిగింది  200 చిన్న, పెద్ద పట్టణాలలో జరిగిన ప్రదర్శనలలో 2 కోట్లమంది, అన్ని వర్గాలవారు, పాల్గొన్నారు  1921 జులైలో చీనా కమ్యూనిస్టు పార్టీ అవతరించింది  దాని వ్యవస్థాపకులు 12 మందిలో మావో ఒకడు  తిరిగి 1925–27 మధ్య పెద్ద ఎత్తున వ్యవసాయక విప్లవం సాగింది  దీని అనుభవం నుంచే మావో "ప్రజాపంథా" అవగాహన పుట్టుకొచ్చింది  1919–1949 మధ్యగల 30 ఏళ్ళలో నవచీనా నిర్మాణం జరిగింది  ఈ కాలంలో అక్కడి కమ్యూనిస్టుపార్టీ "అత్యంత సమర శీలమైన పార్టీగా, సైనిక, రాజకీయ వ్యవహారాలలో విస్తృతానుభవంగల  రాజకీయ పక్షంగా" రూపొందింది  పోరాట సంక్షోభంలో మునిగి తేలింది  రష్యాలాగా అధికారంలోకి వచ్చినాక అంతర్యుద్ధం సాగించటానికి మారుగా, అంతర్యుద్ధంలో జయించి మరీ అధికారం చేపట్టింది చీనా విప్లవం గ్రామసీమలలో ప్రారంభమై నగరాలను ముంచింది  ప్రజలను కూడగట్టుకున్నది వ్యవసాయరంగంలో ఫ్యూడలిజం కొనసాగుతూ ఉన్న దేశాలకు చీనా విప్లవంలో మంచి పాఠాలు లభిస్తాయి

1949లో చీనాలో విజయవంతమైన విప్లవం అనివార్యంగా కమ్యూనిస్టు విప్లవమయింది ఇక జరగబోయే విప్లవాలన్నీ కమ్యూనిస్టు విప్లవాలు కాక తప్పదని మావో నిశ్చితాభిప్రాయం రష్యాలో జరిగిన విప్లవం ఆధునిక విప్లవ పరంపరకు చెందినది కాదని ఒక అభిప్రాయం ఉన్నది  అది పదవిని హస్తగతం చేసుకోవటానికి "పైనుంచి" జరిగిన విప్లవం  ఆ పని పూర్తి అయినాకనే దాని ఫలితాలు ప్రజలకపరం చేయబడ్డాయి  "పెట్టుబడిదారీ విధానపు సంక్షోభం ఎప్పటికన్నా ఎక్కువ స్పష్టంగా బయటపడి పోతున్నది" ఉన్నపళంగా రాజ్యాంగాన్ని హస్తగతం చేసుకుని ఏమీ ప్రయోజనం ఉండదు  (ఈ విషయం గుర్తించని వామపక్షాలకు ఎన్నికల భ్రమ వదిలినట్టు కనబడదు )

1949లో కమ్యూనిస్టుపార్టీ అధికారంలోకి వచ్చేసరికి చీనా పరిస్థితి 1919లో కన్న చాలా అధ్వాన్నంగా ఉన్నది  1931–45 మధ్యకాలంలో జపానును ప్రతిఘటించటంలో దేశం చాలా దెబ్బతిన్నది  ఈ కాలంలోనే అంతర్యుద్ధం కూడా సాగింది  రైతాంగం దుర్భర కష్టాలకు గురి అయింది  ఎక్కడ చూసినా కరువులూ, వ్యాధులూ తాండవించాయి  ఇలాంటి దేశాన్ని స్వీకరించి పునర్నిర్మాణం సాగించవలసి వచ్చింది  "ప్రపంచంలోకల్లా విలువైనది ఏమిటి? మనిషి" అన్న దృఢవిశ్వాసంతో మావో చీనాను రెండవ మహాప్రస్థానంమీద బయలుదేరదీశాడు

ఈ జైత్రయాత్ర ఎలా జరిగినదీ ఈ పుస్తకం వివరిస్తుంది

1 వ్యవసాయం "ఆహారంలో స్వయం సమృద్ధి సర్వసత్తాక ప్రతిపత్తిగల దేశపు స్వాతంత్ర్యానికి ప్రధానమైన మైలురాయిగా (పునాదిరాయిగా) చైనీస్ నాయకత్వం విశ్వసిస్తోంది  ఈ సందర్భంగా

ఇండియా పరిస్థితిని ఉదహరించుకోవచ్చు ఇండియా ఒక పెద్దదేశం అపారమైన పంట వనరులుకల దేశం అయినా దానికి వ్యావసాయకంగా స్వతంత్రమైన విధానాలు లేనందున దాని అభివృద్ధి కుంటుపడుతూ (అధోగతిలో ఉండి) విదేశాలు విధించే షరతులకు లొంగి ఉండేటట్టు, వత్తిళ్ళకు గురి అవుతోంది సోషలిస్టు పునాది గ్రామీణ ప్రాంతమే కాని, నగరం కాదు ఈ పునాది పైనే చైనా వ్యవస్థ ఏర్పడింది "

1949-52 మధ్య భూసంస్కరణోద్యమం జరిగింది దానితో ప్రజలలో చైతన్యం పెరిగింది ఫ్యూడల్ భూస్వామ్య వ్యవస్థ రద్దయింది సమిష్టి వ్యవసాయానికి దారి ఏర్పడింది రష్యాలాగా ఇది ట్రాక్టర్ల సహాయంతో జరగలేదు 1958లో కమ్యూన్లు ఏర్పడ్డాయి ఈ విషయాలలో చీనీయులు తమ అభివృద్ధిని స్వతంత్రంగానే నిర్ణయించుకున్నారు (చీనాలో కమ్యూన్లు ఏర్పరచటాన్ని కృశ్చేవ్ పూర్తిగా నిరశించాడు) మరొక విశేషమేమంటే, చీనాలోని భూస్వాముల వర్గవిభజన ముందే సరిగా జరిగి ఉండటం చేత, రష్యాలోలాగా, భూసంస్కరణలప్పుడు గుడ్డిగా పెద్ద ఎత్తున భూస్వాములను చంపుకుపోవటం జరగలేదు గ్రామసీమలలో ఉత్పత్తి చైతన్యం పెరిగింది

"భావి కమ్యూనిస్టు సామాజిక వ్యవస్థకు కమ్యూన్ కేంద్రంగా ఉంటుంది ఏక కాలంలో నగరంగానూ, గ్రామీణ ప్రాంతంగానూ ఉంటుంది వాణిజ్యం మార్కెట్‌గా, ఉత్పత్తి కేంద్రంగా ఉంటుంది కమ్యూన్‌లో కమ్యూనిస్టు సమాజపు స్వప్నం నిజమవుతుంది-ఒక శతాబ్దం పట్టినా "

2 పరిశ్రమ చీనా గడ్డలో ముడిసరుకులు- పెట్రోలియం, ఇనుమూ, ఇతర లోహాలూ, బొగ్గూ-పుష్కలంగా ఉన్నాయి వాటిని తవ్వి తీయాలి చీనా బ్రహ్మాండమైన సోషలిస్టు పారిశ్రామిక దేశం కావటానికి ఉపక్రమించింది అయితే రష్యా ధోరణిలో కాదు చీనా ధోరణి "సోషలిస్టు ప్రాపంచిక దృక్పథంపై అధారపడివుంది "

1949 నాటికి చీనాలో భారీ పరిశ్రమ అన్నది దాదాపు లేదు ఉక్కు ఉత్పత్తి కూడా అంతే 1960 నాటికి అక్కడ 120 లక్షల టన్నుల ఉక్కు ఉత్పత్తి అవుతున్నది 1965 ఉత్పత్తి అంచనా 180 లక్షల టన్నులదాకా ఉన్నది ఇటీవలి లెక్కలు ఇంకా హెచ్చుగా ఉంటాయి ఇలాగే రైల్వేలూ, విద్యుచ్ఛక్తీ, పరిశ్రమలూ సాలుకు 14-15 శాతం పెరుగుదలతో అభివృద్ధి చెందాయి

పారిశ్రామికాభివృద్ధికోసం సోషలిస్టు నిర్మాణసూత్రాలను గాలికివదలటం జరగలేదు వ్యావసాయిక పునాది విస్మరించబడలేదు సాంకేతిక నైపుణ్యం స్వతంత్రంగా పెరిగింది నూతన యంత్ర నిర్మాణం చురుకుగా సాగింది 1953-57 మధ్యకాలంలో పారిశ్రామికోత్పత్తి రెండున్నరరెట్లు పెరిగింది ఆ కాలంలో చీనాకు రష్యా సహాయం ఉండేది 1958-62 దాకా మొదటి పంచవర్ష ప్రణాళిక, ఇది ఒడుదుడుకులతో సాగింది 1959, 60, 61 చీనాకు చెడ్డ సంవత్సరాలు

రసాయన ఎరువుల ఉత్పత్తి 1949లో 27 వేల టన్నులయితే, 1967 నాటికి 90 లక్షల టన్నులు "ఈనాడు పారిశ్రామిక, శాస్త్ర సాంకేతిక రంగాలు ఏ దశకు చేరుకున్నాయంటే, తనపైన యితరులు పూర్తిగా ఆర్థిక దిగ్బంధం విధించినప్పటికీ చైనా పారిశ్రామికంగా పురోగమించగల స్థితిలో వుంది "

3 వర్తకం 1949–51 మధ్య చీనా ఎగుమతులు పూర్తిగా రష్యాకూ, తూర్పుయూరపుకూ పరిమితమై ఉండేవి ఈనాడు ఎగుమతులు అన్ని దేశాలకూ పోతున్నాయి దీనివల్ల లాభం పొందుతున్న దేశాలు జపానూ, బ్రిటనూ, ఫ్రాన్సూ, పశ్చిమ జర్మనీ 1956 తరవాత చీనా ఎగుమతులలో లాభం ఎరగదు ఈ గ్రంథంరచించే నాటికి చీనా 40 దేశాలలో జరిగే వస్తు ప్రదర్శనలలో పాల్గొంటున్నది చీనాలో స్వయంగా ప్రదర్శనలు ఏర్పాటుచేసుకున్నది ఆసియా, ఆఫ్రికా దేశాలకు సాంకేతిక నిపుణుల సహాయం అందిస్తున్నది వడ్డీగాని, ఇతర నిబంధనలుగాని లేకుండా సహాయం చేస్తున్నది 1967 నాటికి చీనాకుగల విదేశీమారకం మిగులు 1500 కోట్ల అమెరికన్ డాలర్లు ఇది క్రమంగా హెచ్చుతున్నది చీనా ఎగుమతులలో 80 చిల్లర యంత్రాలూ, 2500 రకాల ఆహారదినుసులూ (ఇప్పుడు పెట్రోలియం) ఉన్నాయి రష్యాతోటి వర్తకమే దిగజారింది

4 జనాభా చీనాకు జనాభా అతిముఖ్యమైనవసరు 1949 తరవాత చీనాలో జనాభా పెరుగుదల చాలా చురుకుగా సాగింది 1953 లెక్కలలో 58 కోట్ల చిల్లర, 1966లో 70 కోట్లు అప్పటికి 21లోపు వయసువాళ్ళు 35 కోట్లు ఉత్పత్తిలో పాల్గొనకుండా అవసరాలు మాత్రం ఉండే ఇంత జనాభాను పోషించటం ఏప్రభుత్వం తరమూ కాదు 1962 నుంచీ చీనాలో కుటుంబ నియంత్రణ దృఢంగా అమలులోకి వచ్చింది అంతేగాక విద్యారంగంకూడా ఉత్పత్తి రంగంతో మిళితమయింది విద్యార్థులందరూ కొంత కాలాన్ని ఉత్పత్తి లోగడపాలి ఇందువల్ల విద్యా, ఉత్పత్తీ కూడా గట్టిపడ్డాయి జాప్యవివాహాల ద్వారానూ, గర్భనిరోధక సాధనాలద్వారానూ చీనా జనాభా ఒకటిన్నర శాతం మించి పెరగకుండా చూస్తున్నారు ఆహారోత్పత్తి పెరుగుదలకూ, జనాభా పెరుగుదలకూ మధ్య పోటీ సాగుతున్నది

5 శాస్త్ర పరిశోధనలూ, విజ్ఞానాభివృద్ధీ మావో ఆలోచనా విధానం ఈ రంగంలో ఎలాటి ఫలితాలిస్తున్నదీ పాశ్చాత్యులు గుర్తించలేదు 1950లో 1200 ఉన్న భూశాస్త్రవేత్తల సంఖ్య 1967కు 10,000కు మించి పెరిగింది థోరియం, యురేనియం నిక్షేపాలు కనుగొనబడ్డాయి పరిశోధనలకూ, ప్రయోగాలకూ పుష్కలంగా డబ్బు కేటాయించబడింది ఎల్లకాలమూ సోవియట్ యూనియన్ సాంకేతిక నైపుణ్యాన్నే అనుకరిస్తూ పోయే ధోరణి తప్పుగా గుర్తించబడింది శాస్త్రవేత్తలకూ, రైతాంగానికి మధ్య సహకార సమన్వయాలు కుదిరాయి శాస్త్రవేత్తలలో ఉచ్చ నీచ విచక్షణలులేవు

అన్నిటికన్న గొప్ప సంగతి, రష్యా అణుశక్తి రహస్యాలను నిరాకరించిన అనంతరం చీనా అతి శీఘ్రంగా వాటిని సాధించటం చీనా జీవితంమీద రాజకీయాలుతిష్ఠ వేసినందు వల్ల కలిగిన అపారమైన లాభాలను గ్రహించనివాళ్ళు దాన్ని "బుర్రలు కడగటం" అనీ "భావనిరోధం" అనీ ఆక్షేపించారు దేశీయ వాణిజ్యంమీద పూర్తి కంట్రోలు ఉండటంతో ఇతరదేశాలలోలాగా స్మగ్లింగూ, ఇతర వ్యాపారదుస్తంత్రాలు దాదాపు అసాధ్యమయాయి సోషలిస్టు ఆర్థిక వ్యవస్థలో ద్రవ్యోల్బణం లేదు ఉత్పత్తి పెరగడంతో కొన్ని వస్తువుల ధరలు కొంత తగ్గాయి వేతనాలు పెరగకుండానే జీవన ప్రమాణాలు పెరిగాయి ఎందుకంటే నిత్యావసరాలు ఉచితంగాగాని, కారు చౌకగానూ, పోయినకొద్దీ అధికంగానూ లభిస్తాయి నిరుద్యోగం లేదు, చిన్నలకూ, పెద్దలకు

భద్రత ఉన్నది ఆదాయపుపన్ను లేదు– అంటే జీతాలలో కోతలు లేవు పొదుపుకూ, మితవ్యయానికీ ప్రోత్సాహం ఉంటున్నది ఇతర దేశాలలోలాగకాక, కార్మిక కర్షకుల మధ్య పూర్తి సమత్వం పాటించబడుతున్నది రష్యాలోలాగ ఆర్థిక ప్రలోభంతో శ్రామికులను ప్రోత్సహించే పద్ధతి చీనాలోలేదు

6 మావో ఆలోచనా విధానం దేశాన్ని మార్చటం ఎంత అవసరమో మనుషులను మార్చటం కూడా అంత అవసరమూననీ, రెండు మార్పులూ ఏకకాలంలోనే జరగాలనీ చీనా నాయకులు నమ్ముతారు సిద్ధాంతాలకు ఆచరణ కావాలి విప్లవ సిద్ధాంత ఆచరణల సముదాయమే "మావో ఆలోచన"గా చలామణి అవుతున్నది ఈనాడు మావో ధోరణిలో 70 కోట్ల చీనీయులు ఆలోచించటానికీ, ప్రవర్తించటానికీ యత్నిస్తున్నారు మావో ఆలోచనా విధానం ఈ కాలపు మార్క్సిజం–లెనినిజం అన్న భావం ఇటీవలికాలంలో ధృవపడింది

"సైద్ధాంతిక పోరాటం సర్వకాల సర్వావస్థలలోనూ సమాజంలో అన్నిస్థాయిలలోనూ వివిధ వర్గాలమధ్యా వ్యక్తులమధ్యా వ్యక్తుల స్థాయిలో ప్రతి వ్యక్తిలోనూ అంతర్గతంగా సాగుతుంది " కారణం, పాతకాలపు ఆలోచనలకూ నూతనావసరాలకూ మధ్య సంఘర్షణ ఉంటుంది దేశవ్యాప్తంగా చూస్తే ఇది పలువిధ, బహుముఖ క్లిష్టసమస్య పునర్నిర్మాణం ఒక్కొక్క అడుగే సాగాలి "రెండడుగులు ముందుకూ, ఒక అడుగు వెనక్కూ" అన్నది ఈనాడు కూడా సోషలిజంలో ప్రవేశించే సూత్రంగానే వున్నది రాజకీయ స్పృహ కొరకు భౌతికలాభాలను కూడా తాత్కాలికంగా త్యాగం చెయ్యవలసి ఉంటుంది

మావో సూత్రాలలో ముఖ్యమైనవి కొన్ని "ప్రోద్బలంతో పనిలేదు ప్రజా బాహుళ్యం తమను తామే ప్రోత్సహించుకుంటారు కమ్యూనిస్టు అయినంత మాత్రాన పొరపాటు చెయ్యడని ఏమీ లేదు శిక్షించటంకన్న తీర్చిదిద్దటం మేలు చర్చల ద్వారా వ్యత్యాసాలు సరిచేసుకోవాలి" ఇత్యాది

1956లోనే చీనా రివిజనిజమును గుర్తించింది (యుగోస్లావియా, హంగరీ, రష్యాలలో) "శ్రామిక వర్గ నియంతృత్వపు చారిత్రకానుభవం" అన్న రచనతో రివిజనిజం గురించి మావో ఆలోచనావిధానం సాగింది 1957లో రష్యాతో విభేదాలు వ్యక్తమయాయి రష్యాలోని కమ్యూనిస్టులలోనూ, సమాజంలోనూ కరప్షన్ ద్యోతకమైంది చీనాలోకూడా అదే జరుగుతుందని పాశ్చాత్య డిప్లొమాట్‌లు ఆశించారు దానికి మారుగా వచ్చినది సాంస్కృతిక విప్లవం ప్రపంచ విప్లవ నాయకత్వ భారాన్ని రెనగేడ్ రష్యన్ నాయకుల నుంచి తన భుజాలమీదికి తీసుకోవటానికి మావో నిశ్చయించాడు విప్లవ లక్ష్యాలకు రష్యా తిలోదకాలివ్వటం చూసి అమెరికా ఆసియాలో తిరిగి కాలుపెట్టటానికి నిశ్చయించినమాట స్పష్టం రష్యాలో జరిగిన యీ పరివర్తన ఫలితాలను గురించి మావో చాలా లోతుగా ఆలోచించాడు

1962లో గడ్డుకాలం వెనకబడిన మీదట చీనా ఆర్థికంగానూ, సైద్ధాంతికంగానూ పుంజుకోసాగింది 1966 దాకా సిద్ధాంత పురోగమనం చాలా బలంగా సాగింది ఈ సమయంలోనే మావోకు విరుద్ధంగా చీనాలో రివిజనిస్టు ముఠా తల ఎత్తింది ఈ ముఠాకు విరుద్ధంగానే ప్రొలిటేరియన్ సాంస్కృతిక మహావిప్లవమూ రెడ్‌గార్డ్‌లూనూ!

చీనా కథ అతివేగంగా నడుస్తున్నది ఏడెనిమిదేళ్ళ క్రితం రచించిన ఈ పుస్తకం ఈనాటి చీనాను సమగ్రంగా చిత్రించదు కాని వర్తమాన ప్రపంచ చరిత్రను మరింత బాగా అర్థం చేసుకునేటందుకు ఈ పుస్తకం చాలా తోడ్పడుతుంది ప్రపంచం ఈనాడు చీనా గురించి చాలా తెలుసుకుంటున్నది చాలా దేశాలు చీనాపట్ల ప్రతికూల వైఖరి మార్చుకుంటున్నాయి అమెరికా చీనాకు పులిగా ఉండటానికి బదులు మేకవన్నె పులిగా ఉండ నిశ్చయించినట్టు కనబడుతుంది పులి పాత్రను రష్యా అందిపుచ్చుకున్నది మానవ చరిత్ర వేగాన్ని హెచ్చించటంలో చీనాపాత్ర ఎంతో ఉన్నది గమ్యం చేరటంలో కూడా ఉండి తీరుతుంది

ఇంగ్లీషు : 'చైనా ఇన్ ది ఇయర్ 2001', హాన్ సుయిన్, అనువాదం: ఎ బి కె ప్రసాద్,
ప్రచురణ. జనసాహితి, విజయవాడ, నవంబర్, 1973
సృజన, మాసపత్రిక ఫిబ్రవరి 1975

# 5. జ్ఞానమూ-ఆచరణా

జ్ఞానమూ, ఆచరణా పరస్పర ప్రభావం కలవనీ, ఒకదాని సహాయం లేకుండా మరొకటి ముందుకు సాగలేదనీ మార్క్సిస్టులు సిద్ధాంతీకరించారు 'ఆచరణ' గురించిన ప్రసంగంలో మావో జ్ఞాన స్వరూప స్వభావాలను సమగ్రంగా చర్చించాడు

మొట్టమొదట జ్ఞానేంద్రియాలు మెదడుకు బాహ్యప్రపంచం గురించి అనుభవం కలిగిస్తాయి ఆ అనుభవం ఆచరణ ద్వారా, పదునెక్కి, భౌతిక ప్రపంచం గురించిన సత్యం, అంతకంతకూ అధికంగా అవగాహనలోకి వస్తుంది ఎందుచేతనంటే ఇంద్రియానుభూతి చాలా అల్పమైనది మాటవరసకు ఒకడు కొత్తగా ఏనుగును చూడవచ్చు దాని కదలికలు గమనించవచ్చు దాని అరుపు వినవచ్చు కాని అంతఃప్రేరణలూ, బహిఃప్రేరణలూ ఆ ఏనుగులో ఎలాంటి మార్పులు తెస్తాయో తెలుసుకుంటేగాని ఏనుగును గురించిన జ్ఞానం ముందుకుపోదు ఆ ఏనుగును మచ్చిక చేసుకోవాలన్నా, దాని చేత పనిచేయించుకోవాలన్నా, ఏనుగును గురించిన జ్ఞానం ఇంకా ముందుకుపోవాలి

సామాజిక విషయాలను గురించిన పరిజ్ఞానం కూడా ఈ అనుభవంతో ముడిపడి ఉన్నదే

అయితే, అనుభవమూ, ఆచరణా రెండూ రెండు వేరు విషయాలన్న భావం ఎవరికన్నా ఉంటే, అది పొరపాటని నా అభిప్రాయం

జ్ఞానాన్నీ, అనుభవాన్నీ ఒకదాని నుంచి మరొకదాన్ని వేరు చెయ్యటం అసంభవం– పదార్థాన్నీ, శక్తినీ వేరు చెయ్యటంలాగే ఒకటి రెండు ఉదాహరణలు దీన్ని స్పష్టం చేస్తాయి

"మాటలు చెప్పటం కాదు, చేసి చూపించు" అన్న సవాలు మనం తరుచు వింటాం మాటలలో వ్యక్తమయే జ్ఞానం ఆచరణలో రుజువుకాకపోతే సందేహాస్పదం అవుతుంది

ఇద్దరు స్త్రీలు ఏ పత్రికలోనో వంట తయారు చేసే పద్ధతి చదువుతారు దినుసులన్నీ తెలిసినవే "ఎలా ఉంటుందంటావు?" అని ఒకామె అడుగుతుంది "చేసి చూస్తేగాని చెప్పలేం!" అంటుంది రెండో ఆమె

జ్ఞానేంద్రియాల కర్తవ్యం పూర్తి అయినాకనే మెదడులో అనుభవానికి సంస్కారం ఆరంభమవుతుందనుకోనవసరం లేదు చంద్రుణ్ణి మామూలు కళ్ళతో చూసిన అనంతరం

టెలిస్కోపులో చూస్తే అనుభవం చాలా మారిపోతుంది అలాగే తాగేనీటిని మైక్రోస్కోపులో చూస్తే అందులో సూక్ష్మప్రాణులు కనబడి, ఆనీటి గురించి మనకున్న అభిప్రాయం పూర్తిగా మారిపోవచ్చు ఇదే విధంగా అనుభవం తాలూకు అన్ని దశలలోనూ ఆచరణ యొక్క పాత్ర ఉండనే ఉంటుంది "అనుభవం" అన్న మాటలోనే జ్ఞానమూ, ఆచరణా ఇమిడి ఉన్నాయి ("చెప్పిలాభంలేదు, అనుభవం కావాలి")

జ్ఞానం అఖండమైనది కొత్త అనుభవాలు పాత అనుభవాలకు ఏదో విధంగా సంబంధించి ఉండకపోతే అవగాహనకావు న్యూయార్క్ జూలో కొత్తగా జిరాఫీని తెచ్చిపెట్టినప్పుడు ఎవడో దానిని చూసి, "అలాంటి జంతువులేదు" అన్నాట్ట! ఒకటో తరగతి విద్యార్థికి డిఫరెన్షల్ కాల్క్యులస్ చెప్పి ఏమీ ప్రయోజనం లేదు జ్ఞానాభివృద్ధి ఒక క్రమంలో మాత్రమే సాధ్యమవుతుంది

మార్క్సిజం ఉన్నత శాస్త్ర ప్రమాణాలతో కూడుకున్నది సామాజిక శాస్త్రాన్ని అది అత్యున్నత స్థానానికి తీసుకుపోతుంది అది వినియోగించుకోలేని శాస్త్రజ్ఞానంలేదు ఆకారణం చేత మార్క్సిజంను ఆచరణ సాధనంగా వినియోగించుకునే సామర్థ్యం లేనివాడు దాన్ని పిడివాదంగా ఉపయోగించుకునే ప్రమాదం ఉన్నది

మనిషి మెదడు ఆరో జ్ఞానేంద్రియం బుద్ధి ఇతర జ్ఞానేంద్రియాలను ఉపయోగించుకున్నట్టే మెదడునూ ఉపయోగించుకుంటుంది కొందరిలో కొన్ని జ్ఞానేంద్రియాలు సూక్ష్మంగా పనిచేస్తాయి మంచిచూపు, శ్రవణశక్తి, స్పర్శజ్ఞానము కల జ్ఞానేంద్రియాల కన్నా సూక్ష్మంగా పనిచేసే మెదడు జ్ఞానాన్ని సంస్కరించటానికి హెచ్చుగా ఉపయోగపడుతుంది ఆచరణలో దానిపాలు విస్మరించరానిది

ఉదాహరణకు, కొత్తగా జ్ఞానేంద్రియాలకు స్పృహ కలిగించిన విషయాలు ప్రాథమిక జ్ఞానం అయినట్టే, పుస్తకాలలో చదివిన ప్రగాఢ జ్ఞానం కూడా మొదట మెదడుకు ప్రాథమిక జ్ఞానమే అవుతుంది మార్క్సిస్టు రచనలు కూడా చదివి తెలుసుకున్న మేరకు, ప్రాథమిక జ్ఞానమే అవుతాయి దానికి మానసికమైన ఆచరణ చాలా జోడించి నప్పుడుగాని అది ఉపయుక్త జ్ఞానంగా తయారుకాదు జ్ఞానేంద్రియాలు తమ అనుభవాన్ని మెదడు సహాయంతో సంస్కరించుకుంటే, మెదడు తాను సంపాదించిన అనుభవాన్ని తానే సంస్కరించుకుంటుంది అది తన వివిధ అనుభవాలను ఏకోన్ముఖం చేసుకోవటానికి వెతుక్కుంటుంది ఈ తడువులాటలో పొరపాట్లు జరుగుతాయి వాటిని జ్ఞానంతోనే సరిచేసుకోవాలి మాటవరసకు మన వ్యవసాయ రంగంలో ఉండే రైతులూ, రైతు కూలీలూ అమెరికా వ్యవసాయరంగంలో ఉండరు అమెరికాలో పాకీ పనిచెయ్యటానికి సొంతకారులో వెళ్ళేవాడు మన పాకీ వాళ్ళలాటి వాడుకాదు

ఆకారణంచేత, మార్క్సిజం సైతం చదివినది చదివినట్లు ఏకరువు పెట్టితే ఆ మనిషి మానసికమైన ఆచరణ కూడా చేయలేడని తెలిసిపోతుంది ఉదాహరణకు, ఉత్పత్తి సాధనాలు సొంతం చేసుకున్న వాళ్ళే దోపిడీ చేసే వర్గం అన్న సత్యాన్ని జీవితం మార్చింది "మా ముడి సరుకు ధనం" అనే అంతర్జాతీయ బాంకర్లు అసలైన దోపిడీవర్గంగా తయారై, యంత్రస్వాములను తమ ఇష్టం వచ్చినట్టు ఆడించగల స్థితిలో ఉన్నారు

ఆచరణ ద్వారా సత్యాన్ని చేరవచ్చునని మార్క్సిజం చెబుతుంది దీన్ని గురించి నాకుకొన్ని అభిప్రాయాలున్నాయి

ఆదర్శవాదం దృష్ట్యా పరమసత్యం అనేదిలేదు ఉండటానికి వీలులేదు పరమ సత్యానికి గీటురాయి ఏవిటి? ఆచరణ ద్వారా మారనిదే పరమసత్యం ఆధ్యాత్మిక వాదులు ఈ పరమ సత్యాన్ని అతి తేలికగా కనిపెట్టారు అది పరబ్రహ్మ దాన్ని నిర్వచించలేం, ఊహించలేం స్పృశించలేం అంటే దానివల్ల కించిత్తుకూడా మనకు ప్రయోజనం ఉండదన్నమాట!

కాని, ఆచరణ ద్వారా మార్పు చెందని సత్యాలు వాస్తవ జీవితంలో మనకు చాలా ఉన్నాయి సాధారణ గణితం రోజువారీ లెక్కలకు పరమసత్యంగానే ఉపయోగపడుతుంది కొనాలన్నా, అమ్మాలన్నా రూపాయికి నూరు పైసలనేది పరమసత్యమే కాంతి కిరణాలు సరళరేఖలలో ప్రసారం అవుతాయన్నది పరమసత్యంగా భావించే, అద్దాలనూ, కెమెరా లెన్స్‌లనూ ఉపయోగిస్తున్నాం సామాజిక సమస్యలను పరిష్కరించుకోవటానికి లోకాంతరాలను గురించిన పరిజ్ఞానం అవసరం లేదు సమిష్టి కృషి ఫలితాలను అంచనా వెయ్యటానికి వ్యక్తుల జాతకాలను చూసే పనిలేదు (నిజంగా జ్యోతిష్యం శాస్త్రం అయితే యుద్ధాలలో లక్షల సంఖ్యలో యువకులు చస్తారు గనక యువకుల జాతకాల అధారంతో యుద్ధాలు ఎప్పుడు వస్తాయో దయచేసి చెప్పమని ప్రొఫెసర్ హాల్డేన్ జ్యోతిష్కులను అడిగాడు )

ఈపైన చెప్పిన 'పరమ' సత్యాలు వేరు పరిస్థితులలో పాక్షిక సత్యాలుగా రుజువవు తాయి అందుచేత, పరమ సత్యాలన్న వాటిని నిర్వచించేటప్పుడు కూడా ఆచరణలో వాటి పాత్రలను పూర్తిగా గ్రహించాలి ఒకవిధంగా జ్ఞానం అనేది ఆచరణ యొక్క అభౌతిక రూపమేననవచ్చునేమో!

ఈ వ్యాసంలో "ఆచరణ" అనే మాటను అచ్చంగా రాజకీయ రంగంలో అర్థం చేసుకున్న విధంగా వాడలేదు కేవలం బుద్ధిని ప్రయె1ాగించి చేసే ఆచరణలున్నాయి భౌతికశాస్త్రంలో గణిత సూత్రాలన్నీ ఇలాంటి ఆచరణ ఫలితాలే మార్క్సిస్టు సాహిత్యమంతా ఇలాటిదే మత గ్రంథాలన్నీ ఈ జాతికే చెందుతాయి సాహిత్యం కూడా ఇంతే చాలా కలలు మేధస్సుకు సంబంధించిన ఆచరణనుంచేపుడతాయి

దీనికి విరుద్ధంగా 'ఆచరణ' అనిపించుకునే అర్హత లేని ఆచరణ కూడా ఉన్నది అది సైన్స్ విద్యార్థులు చేసే ప్రయోగాలు భౌతిక, రసాయనిక, ప్రకృతి, జంతుశాస్త్రాలు అభ్యసించే వారూ, కొత్తగా కనిపెట్టేదేమీ వుండదు కాని ఈ ప్రయోగాలు పుస్తకజ్ఞానాన్ని ధ్రువపరిచి, విద్యార్థుల పాలిటికి ఆచరణవల్ల కలిగే సత్ఫలితాలనే ఇస్తాయి ఇది ఆచరణ కాని ఆచరణ దీని విలువను తగ్గించటానికి లేదు

అరుణతార ఫిబ్రవరి, 1978
పునర్ముద్రణ కళలు-శాస్త్రీయ విజ్ఞానం

# 1. వెండి పండుగ

స్వాతంత్ర్య రజతోత్సవం జరుపుకోవలసిన అవసరం పాలకవర్గానికి ఎంతైనా ఉన్నది! పాతికేళ్ళ స్వాతంత్ర్యాన్ని పీడితుల పక్షాన సమీక్షించే హక్కు మనకూ ఉన్నది

కుట్ర, విరసం బులెటిన్, 15-8-1972

# 2. పద ప్రయోగాలు

1-7-73 పత్రికలో జి యన్ కృష్ణమూర్తి గారి లేఖ చూశాను "లంజకు పిల్ల తగలాటం" అనే సామెత లంజ అనే మాట నాకు తెలిసినంతవరకు ఒక కులాన్నిగాని, వృత్తినిగాని, సూచించదు మార్క్సిస్టు ఆలోచనా విధానానికి జాతీయ నుడికారాలను వదులుకోవాలా? 'ఆ మాట దేవుడెరుగు!" అనగానే ఆస్తికుడై పోవాలా! అవసరం లేదనుకుంటాను

ప్రచార సమస్యలు పక్షపత్రిక 1-8-1973

# 3. పెట్టుబడిదారీ-వర్తమాన దశ

అభ్యుదయకరమైన నినాదాలు మూడు రకాలుగా ఉంటాయి కొన్ని నినాదాలు కేవలము భవిష్యత్తుకోసమే అవుతాయి (జాతీయోద్యమం కాలంలో "బోలో స్వతంత్ర భారత్‌కీ జై" ఈనాడు 'విప్లవం వర్ధిల్లాలి') మరి కొన్ని నినాదాలు వర్తమానానికి హెచ్చరికలు ('క్విట్ ఇండియా', 'ప్రజాశత్రువులను నిర్మూలించండి ' మరికొన్ని నినాదాలు గతంలో ఉన్న చెడును నిరసించేవి ('కులతత్వం నశించాలి', 'వర్గ వ్యవస్థ నిర్మూలన కావాలి')

భవిష్యత్తును ఉద్దేశించి చేసే నినాదాలు తక్షణఫలితా లివ్వవు కాని వాటివల్లకూడా ఒక ప్రయోజనం ఉన్నది అవి అభివృద్ధి నిరోధకుల బలాన్ని హరిస్తాయి ఆనినాదం నిజంగా పరిణమించే మార్గంలో ఉన్న కంటకాలను చాలా వరకు తొలగిస్తాయి (శుష్క నినాదాలు ఈపని చెయ్యలేవు) ఆనినాదాలలో ఉన్న సత్యాన్ని గ్రహించిన ప్రజలు రియాక్షనరీల ప్రవచనాలు విని బేజారెత్తిపోవటం మాని వట్టి నినాదంతోనే ఎంతో మనోవికాసం పొందుతారు ఇది ఈనాటిదికాదు ఈ భవిష్యద్వాణి ప్రభావం ఆటవిక దశలోనే మానవులు గ్రహించారు ఇంకా వర్షాలు రాకముందే వారు వర్షనృత్యాలు చేసి భవిష్యత్తును మానసికంగా అనుభవించనారంభించేవారు ఈనాడు పెళ్ళికి ముందే పెళ్ళివారికి ఉత్సాహ శక్తులు వచ్చేస్తాయి "పునాది" లేకుండా ఇలాంటి భావచైతన్యం సాధ్యమా అని అనుమానం కలుగవచ్చు ఈభావచైతన్యానికి కూడా భౌతికమైన ఆధారం ఉన్నది అది ప్రజలూ, వారి దీక్షా, ఆ దీక్ష కొనసాగించటానికి అనుకూలపడే భౌతిక పరిస్థితులూనూ ఇవి లోపించినచోట ఎంత "మంచి" నినాదమూ ప్రజలను చైతన్యవంతులను చేయదు అది చలికాలంలో మామిడి పళ్ళమీద వాంఛలాగా నిర్జీవంగా ఉండిపోతుంది

రష్యాలో కూడా ఇంకా విప్లవం పూర్తి కాకముందే లెనిన్ ఈ యుగాన్ని ప్రొలిటేరియన్ విప్లవయుగమనీ, పెట్టుబడిదారీ పతన యుగమనీ అన్నాడు ఆమాట క్రమంగా నిజమవుతున్నది

అనేక దేశాలలో విప్లవాలు జరిగి, పెట్టుబడిదారీ అంతమై, వర్గ వ్యవస్థ తొలగిపోవటమేగాక అందువల్ల ఆ దేశాలలో సామాజికజీవితం ఆర్థికంగానూ, సాంస్కృతికం గానూ అన్ని విధాలా పురోగమించి దారిద్ర్యమూ, అనారోగ్యమూ, హీనోత్పత్తీ, సైనిక దౌర్బల్యమూ, నిరక్షరతా మొదలైన అసంఖ్యాకమైన వర్గ సమాజ జాడ్యాలను రద్దుచేసింది

నినాదాలు ఒకరకం నుంచి మరొక రకానికి మారతాయి పసిపిల్లలు యువకులై తరవాత వృద్ధులు కూడా అయిన విధంగా, భవిష్యత్తును ఉద్దేశించిన నినాదాలు వర్తమానానికి పనికివచ్చి, గతానికి సంబంధించినవి అవుతాయి "స్వరాజ్యం నా జన్మహక్కు" అన్న నినాదం ఇందుకు ఒక ఉదాహరణ వర్గరహితమైన దేశాలలో "వర్గపోరాటం కొనసాగాలి" అనే నినాదం "నిన్నటిదే" అవుతుంది ఇవాళ మనం "క్విట్ ఇండియా" అనం (దురదృష్టవశాత్తూ ఈ నినాదంతో ఇంకా మనకు పని ఉన్నది కాని మన పాలకులు దానితో పనితీరినట్టు నటిస్తున్నారు ప్రజలు నమ్ముతున్నారు కూడా!)

చెప్పవచ్చిందేమంటే, మూడు రకాల నినాదాలతోనూ మనకు అవసరం ఉన్నది మొదటి రకం (రేపటి) నినాదాలు భవిష్యత్తును సుగమం చేస్తాయి రెండోరకం నినాదాలు వర్తమానాన్ని పటిష్టం చేస్తాయి మూడోరకం నినాదాలు నిన్నటి పరిస్థితి తిరిగి రాకుండా చూస్తాయి రష్యాలో 'ప్రొలిటేరియన్ డిక్టేటర్‌షిప్' నినాదానికి స్వస్తి చెప్పిన అనంతరం అక్కడి విప్లవం నీరు కారిపోవటం ఆరంభించిందన్నమాట లోకమంతా కోడైకూస్తున్నది సామ్రాజ్యవాదాన్ని అద్భుతంగా శవ పరీక్ష చేసిన లెనిన్ నిర్మించిన సమాజంలో సామ్రాజ్యవాదం పుట్టుకొచ్చింది అందుచేత రేపటికి పనికి వచ్చే నినాదాలను "గాలి" నినాదాలకిందా, నిన్నటి నినాదాలకు కాలదోషం పట్టినట్లు గానూ భావించరాదు భవిష్యత్తును చూడని వారికి భవిష్యత్తు ఉండదు గతాన్ని మరచి పోయేవాళ్ళు గతానికి తిరోగమించే ప్రమాదం ఉన్నది అచ్చగా వర్తమానంలోనే జీవించేవి పశువులు

మనదేశంలో మనం పెట్టుబడిదారీలో అపారమైన విశ్వాసం ఉంచుతున్నాం పెట్టుబడిదార్లను పాలుపోసి పెంచుతున్నాం ప్రతినిధులను శాసనసభలకు పంపుతున్నాం పెట్టుబడిదారీకి విరుద్ధమైన నేషనలైజేషన్‌కూడా వారి శ్రేయస్సుకోరే చేస్తున్నాం వారు కోట్లకొద్దీ పన్నులు బకాయి పడితే, దివాలా ఎత్తినవాడి దగ్గరినుంచి బాకీలు వసూలు చేస్తున్నాం వారికి బంగారు గుడ్ల లాటి లైసెన్సులిచ్చి బంగారు పిచ్చికలు పొదిగింపచేస్తున్నాం దేశం ఆర్థికంగా అధఃపాతాళానికి పోతున్నా వారిని మాత్రం ఆకాశానికి నిచ్చెనలు వేయనిస్తున్నాం, ఇదంతా మనకు పెట్టుబడిదారీలోగల నమ్మకాన్ని గాక, ఏంసూచిస్తుంది? ప్రజలు త్యాగాలు చెయ్యటం తమ భవిష్యత్తుకైతే అందులో దోషం ఏమీలేదు, మనమంతా రేపటి అవసరాలు గుర్తుంచుకుని యీనాడు డొక్కమాడ్చుకుంటూనే ఉంటాం కాని ప్రజలు డొక్కమాడ్చుకుంటున్నది పెట్టుబడిదారీ భవిష్యత్తుకైతే ఆ పెట్టుబడిదారీ వల్ల దేశ భవిష్యత్తుకు లాభిస్తుందని రుజువు చెయ్యాలి

' యీపని ఎవరూ చెయ్యలేరు, " పెట్టుబడిదారీ నశించాలి" అన్నది యీనాటి నినాదం, రేపటి నినాదం కానేకాదు

మన దేశంలోనే పెట్టుబడిదారీ తెచ్చిపెట్టిన అనర్థం ఇంతా అంతాకాదు ఇది ప్రజల దారిద్ర్యాన్ని దారుణంగా పెంచింది ద్రవ్యోల్బణం తెచ్చిపెట్టింది తొలగిపోయిన విదేశీ కబంధ హస్తాలకు పూలమాలలు చుట్టి దొడ్డిదారిన తెచ్చి, దేశాన్ని వారికి తాకట్టుపెట్టేసింది యీనాడు

మనం నానా దేశాలకు వేలకొద్దీ కోట్లు బాకీ ఉండి, వందలకొద్దీ కోట్లు వడ్డీ ఇచ్చుకుంటున్నాం యీ అప్పుతో ప్రజలు తిన్న పప్పుకూడు ఏమిటి? మనం మన దేశాన్ని ఏ దారిన పోనిస్తున్నామో చెప్పేధైర్యం కూడా మనకు ఎందుకు లేదు? "సోషలిజం" నినాదాలేమిటి? నిజమైన సోషలిస్టు దేశాలు మనల్ని చూసి నవ్వుతాయన్న సిగ్గుకూడా మనకెందుకు లేదు? మనం ఎర్ర విప్లవం గురించి తప్ప మిగిలిన అన్ని రంగుల విప్లవాలను గురించీ ఎందుకు మాట్లాడుతున్నాం? అబద్ధపు నినాదాలకన్న ద్రోహం మరొకటి ఉంటుందా?

(యీ పనులన్నీ "మనం చేస్తున్నామంటున్నందుకు కొందరు ఆక్షేపించవచ్చు కాని వీటిని ప్రతిఘటించనివాళ్ళ మందరమూ ఇందులో భాగస్వాములమే మనం ప్రజారాజ్యమనుకుంటే యీ బాధ్యతనుంచి తప్పుకోలేం మనది నియంతృత్వం అనుకుంటే దాన్ని పడగొట్టే కృషి చెయ్యనందుకు మన తప్పు రెండింతలవుతుంది)

పెట్టుబడిదారీ సంస్కృతిని వాటేసుకున్న దేశాలలో మనది ఒక టొంపాయి దేశం అమెరికా, జర్మనీ, ఫ్రాన్సు, బ్రిటను, జపాను మొదలైన హేమాహేమీ దేశాలలో పెట్టుబడిదారీ ఎలాటి సంక్షోభాన్ని జీవితంలో కలిగిస్తున్నదీ శ్రద్ధగా పరిశీలించండి అగ్రదేశాలలో ఉగ్రమైన అమెరికాలో అత్యున్నత పాలకవర్గీయులు కుట్రదార్లో, దొంగలో, దోపిడీగాళ్ళో అని తేలుతున్నది అవినీతి, స్వార్థమూ, అమానుషత్వమూ, పచ్చి దుర్మార్గమూ, పైశాచికత్వమూ, పెట్టుబడిదారీ యీనాడు ప్రపంచ మంతటా పండిస్తున్న పంట రాజకీయాలంటే యీ పంటలను సొంతం చేసుకునేటందుకు కుమ్ములాటకింద దిగిపోయింది "మీరంతా ఇలాటి తుచ్ఛమైన పనులు ఎందుకు చేశారు?" అని అడిగితే, "నిక్సన్‌ను అధ్యక్షుడు చెయ్యటానికి" అని అతని కుడిభుజాలు, ఎడమ భుజాలు చెబుతున్నాయి

యూరప్‌లో అనేక పెట్టుబడిదారీ దేశాలు తమ మనుగడను పటిష్టం చేసుకొనటానికి కూటమిగా ఏర్పడి పెద్ద మేజువాణీ చేస్తున్నాయి వారి ప్రయత్నాలలో ఒకటి తిండిగింజల ధర పెంచటం

పెట్టుబడిదారీ రాజకీయాలంటే పదవీ రాజకీయాలన్నది ప్రపంచమంతటా స్థిర పడిపోయింది కాని ప్రజలకు రాజకీయ చైతన్యం ఉన్నచోట పాలకులకూ, ప్రజలకూ ఘర్షణలుసాగి, సంక్షోభాలు కలుగుతున్నాయి

మనదేశంలో జరిగే సంక్షోభంలో ప్రజల రాజకీయ విజ్ఞతపాలు చాలా తక్కువ వారు తమ నిత్య సమస్యలను పరిష్కరం చేసుకోలేక తిరుగుబాట్లూ, ప్రదర్శనలూ చేస్తున్నారు న్యాయంగా ప్రజాసామాన్యం రాజ్యాధికారంకోసం పోరాటం సాగించాలి అది నిజమైన విప్లవం యీ ప్రదర్శనల నుంచీ, తిరుగుబాట్లనుంచీ విప్లవం పుట్టుతుందని ప్రజలకన్న బాగా గుర్తించిన పాలకులు ప్రతిప్రదర్శననూ రక్తపాతంలో ముంచుతున్నారు అయితే విప్లవాన్ని మరింత సన్నిహితం చెయ్యటానికి ఇదే సరి అయిన మార్గం కాని అందుకు పాలకులు చెయ్యగలిగినదేమీలేదు చరిత్రకు ఎదురీదేవాళ్ళు తమ మెడలకు తామే ఉచ్చులు వేసుకోవటం తప్పనిసరి ప్రతి తిరుగుబాటునూ విప్లవం అని భ్రమ పడే విప్లవ వాదులున్నప్పుడు ప్రతి తిరుగుబాటునూ రక్తంలో ముంచటం ప్రభుత్వం పట్ల సరి అయినదిగానే అమాయక ప్రజలు భావించటం జరుగుతుంది–నక్సల్బరీ శ్రీకాకుళం వగైరా విప్లవాలు దేశవ్యాప్తంగా ప్రజ్వలించేదాకా!

ప్రజాసమస్యలు, పక్షపత్రిక, 1-9-1973

# 4. గొంగట్లో భోజనం

మానవ సమాజ పరిణామం ప్రపంచమంతటా ఏ దశలో ఉన్నదో, వేరు వేరు దేశాలు ఏయే దశలలో ఉన్నాయో చాలామంది ప్రపంచ విఖ్యాత జర్నలిస్టులకూ, రాజకీయ వేత్తలకూ కూడా తెలిసినట్టు కనబడదు

సుమారు ఏడువేల సంవత్సరాలక్రితం జాతి జీవితాల పరిణామం ప్రపంచంలో కొన్ని ప్రత్యేక ప్రాంతాల ఆరంభమైంది అది ఇంకా పూర్తిగా ప్రపంచంలో నుంచి తుడిచిపెట్టుకు పోలేదు అందుకు నిదర్శనంగా అక్కడక్కడా ఆహారం ఏరుకొనే వాళ్ళూ, వేట జీవనాధారంగా గలవాళ్ళూ ఉన్నారు చరిత్ర యుగంలో కూడా గణ జీవితం పరిమితంగా కొనసాగింది జాతి జీవితంలోనూ, గణ జీవితంలోనూ కూడా వ్యక్తులు పాటించవలసిన నైతిక సూత్రాలకూ, సమిష్టిగా జాతి, లేక గణం, పాటించవలసిన నైతిక సూత్రాలకూ తేడా ఉండినట్టు కనబడదు అందుకు నిదర్శనంగా నీతిని ఉల్లంఘించిన వ్యక్తులు సంఘంనుంచి "వెలి" వేయ బడేవారు (జాతి జీవితమూ, గణ జీవితమూ అంతరించిన రెండున్నర వేల ఏళ్ళకు, నా చిన్న తనంలో కూడా "వెలి" ఉండేది పిల్ల చచ్చినా కంపు వదల దన్న సామెత మన సమాజానికి ఎంత బాగా వర్తిస్తుందో దీన్నిబట్టే తెలుసు కోవచ్చు )

కోసల, మగధ రాజ్యాలు ఏర్పడి జాతులు చిత్రవధ అయి సామ్రాజ్య స్థాపనకు అన్ని విధాల–బౌద్ధమత దృక్పథంతో సహా–పునాదులు ఏర్పడిన వెంటనే సమాజానికీ వ్యక్తికీ మధ్య అకాశమంత ఎత్తు గోడలు లేచాయి కౌటిల్యుడి అర్థశాస్త్రం వ్యక్తులనుంచి "స్టేట్" కోరే కఠినమైన నీతిలో సహస్రాంశం కూడా రాజనీతిలో లేదు బ్రాహ్మణులు నెలకొల్పిన చాతుర్వర్ణ వ్యవస్థనూ, బ్రాహ్మణుల ఆధిపత్యాన్ని అర్థశాస్త్రం పాటించదు అది రాజకీయంగా ఎంత అవినీతినైనా సమర్థిస్తుంది (అందుకే బ్రాహ్మలకు కౌటిల్యుడిమీద కోపం వచ్చి, అతగాణ్ణి "కౌటిల్యుడు", లేక కుటిల స్వభావం గల వాడుగా మార్చారు ఈ పేరు అతనికి సార్థక నామమైపోయింది అర్థశాస్త్రంమీద అధికార పూర్వకంగా పత్రికలలో లేఖలు రాసేవాళ్ళు కూడా కౌటిల్యుణ్ణి "కౌటిల్యుడు" అనే పిలుస్తారు )

అర్థశాస్త్రం నాటికి కులవ్యవస్థా, సామాజిక దోపిడీ అమలులోకి వచ్చినప్పటికీ ప్రధాన వైరుధ్యం "స్టేట్"కూ ప్రజలకూ మధ్య ఏర్పడిందేమో ననిపిస్తుంది అర్థశాస్త్రంలో ఇతర దోపిడీలను అరికట్టడం కూడా కొంతవరకు జరిగిందేమో బానిసలకు సైతం అర్థశాస్త్రం హక్కులిచ్చింది స్త్రీలకు కూడా చాలా హక్కులుండేవనుకుంటాను అర్థశాస్త్రం ప్రజల్లో మూఢ విశ్వాసాలను పెంపొందించడమూ, సృష్టించటమూ చేసిన మాట నిజమే కాని అది బ్రాహ్మణుల లాభం కోసం కాదు, బొక్కసం నిండటానికి

తరవాత పెద్ద పరిణామం తెచ్చినవాడు అశోకుడు అతను ధర్మం ప్రాతిపదికమీద రాజ్యాంగాన్ని నడిపాడు అశోకుడికి ముందు "ధర్మం" అన్న భావం సమాజాన్ని ఎంతవరకు నడిపిందో తెలిసినవాళ్ళు చెప్పాలి ఒక ఉపనిషత్తులో ఇంద్రుడు తాను చేసిన దుష్కార్యాలను, తన తండ్రిని చంపటమూ, మునులను పీడించటముతో సహా వివరించి తనను నమ్మినవారు

ఏ పాపం చేసినా పరిహారమైపోతుందంటాడు  తరవాత కృష్ణుడిచేత భగవద్గీత రాసినవాళ్ళు అర్జునుడికి అదేమాట చెప్పించారు

"రాజ్యం కోసం నీ దాయాదులను చంపు  నీ కేమీ పాపం అంటదు " అని కృష్ణుడు అర్జునుడికి భరోసా ఇస్తాడు  రాజకీయ హత్యవేరు, మామూలు హత్యవేరు  యుద్ధంలో ద్రోణుణ్ణి చంపటం బ్రహ్మహత్య కాదు

అర్ధశాస్త్రంలో రాజుకు ఉండే నీతి ఉల్లంఘన హక్కులు మనుస్మృతినాటికి దోపిడీవర్గాలకు కూడా పంచబడ్డాయి  వడ్డీపుచ్చుకునేటప్పుడు బ్రాహ్మడి నుంచి 12శాతం, క్షత్రియుడి నుంచి 24శాతం, వైశ్యుడినుంచి 36శాతం, శూద్రుడినుంచి 48శాతం పుచ్చుకోవచ్చు  ధర్మశాస్త్రాలు బ్రాహ్మణ క్షత్రియులకు వైశ్య శూద్రులను అప్పడాలు తిన్నట్టు తినే హక్కు ఇచ్చాయి! "శూద్రుడు ఆస్తి సంపాదిస్తే బ్రాహ్మడికి కడుపు మండిపోతుంది " ఈ విధంగా వర్గనీతులు ఏర్పడ్డాయి

వర్గసమాజం ఏర్పడిన నాటినుంచీ రాజకీయనీతికీ వ్యక్తినీతికీ తేడాలు ఏర్పడి, వర్గవ్యవస్థ క్లిష్టతరమైన కొద్దీ ఈ తేడాలు కీకారణ్యం లాగా తయారయాయి  ఈ తేడాలు సోషలిస్టు సమాజం నుంచి కూడా పోవటానికి కొన్ని శతాబ్దాలు పట్టేటట్టు కనిపిస్తుంది  కాని కొన్నివేల ఏళ్ళ సామాజిక చరిత్ర తలకిందులు కావాలంటే, అది క్షణాలమీద జరిగేపని కాదు  అయితే, వర్గనిర్మూలనం జరగకుండా రాజనీతి, వ్యక్తినీతీ ఒకటి అయే అవకాశం లేదు

ఇటీవల అనేక దేశాలలో పాలకవర్గాలు అవినీతిని బయటకు లాగి, విచారణలు జరపటం చూస్తున్నాం  అమెరికాలో వాటర్ గేట్, లాక్‌హీడ్ లంచాలు, ఇటీవల బెర్ట్‌లాన్స్ బాంకింగ్ పద్ధతులమీద విమర్శల దుమారం, సి ఐ ఏ  దురంతాల విచారణ, అంతకుముందు మైలాయ్ హత్యాకాండ విచారణ  మన దేశంలో మాజీ కాంగ్రెస్ పాలకుల అవినీతి, అక్రమాలను గురించి ఫిర్యాదులూ విచారణలూ వగైరా, వగైరా వీటిమూలంగా కొందరికి పదవులు పోయాయి కొందరు జైళ్ళకుపోయారు

ఇంతకూ విచారించేవా రెవరు? విచారించబడేవారెవరు? వ్యక్తులు పాటించవలసిన నీతి నియమాలను పాలకవర్గాలు ధన స్వామ్య వ్యవస్థలు ఒక్కనాటికి పాటించవు  ఇది గొంగట్లో భోజనం  ముద్దముద్దలోను బొచ్చుంటుంది  ప్రపంచంలో పెద్ద పారిశ్రామిక సంస్థలన్నీ వ్యాపార రీత్యా అధికారులకు లంచాలు పెడతాయి  అధికారంలో ఉన్నవాళ్ళు తమ అధికారాన్ని తప్పకసొమ్ముచేసుకుంటారు  పరిపాలన కడిగిన ముత్యంలా, నిర్దుష్టంగా ఉండాలంటే సామాజిక వ్యవస్థలో ఉన్న దారుణమైన దోపిడీని అంతం చెయ్యండి  తరవాత ఎన్నివందల ఏళ్ళకు ప్రజాపాలన కడిగిన ముత్యంలా అవుతుందో చూద్దాం  యుద్ధంలో ఓడినవారు యుద్ధ నేరస్థులు ఆలాగే రాజకీయంలో పైచెయ్యి అయిన వాళ్ళు "ధర్మరాజులు" పదవీభ్రష్టులు  నేరస్థులు

ఇలాంటి విచారణలు జరగరాదని నా ఉద్దేశం కాదు! అయితే ఇది వర్గపోరాటమనీ, ఇది పూర్తికాగానే కృత యుగమో, రామరాజ్యమో, యుటోపియావో వస్తుందని ఎవరూ భ్రమపడరాదు అమెరికాలో  రిపబ్లికనులను ఓడించి డెమొక్రాట్‌లు  తమ అధ్యక్షుణ్ణి నెగ్గించగానే ఏం జరిగింది? అధ్యక్షుడు జిమీ కార్టర్ నియమించిన  మొట్ట మొదటి ఉన్నతాధికారి లాన్స్ పత్రికల తాకిడికీ, విచారణల తాకిడికీ తట్టుకోలేక పదవీ విరమణచేసి ఇంటికి వెళ్ళాడు  జనతాపార్టీ కాంగ్రెస్‌ను

కూలదోసిన తరువాత ప్రజాజీవితం ఆర్థికంగా ఏమీ మెరుగు కాలేదన్నమాట జనతా నాయకులే ఒప్పుకుంటున్నారు ఇదంతా అంతర్వర్గ సంఘర్షణ ఒక రకం ముసుగులో గుద్దులాట నిజంగా ప్రజలు కాంగ్రెసుపట్ల మండి ఉన్నప్పుడు, "జనతా నాయకులు కాంగ్రెసు పట్ల మెత్తగా ప్రవర్తిస్తున్నారు," అన్న మాట పడి, జనానికి కాంగ్రెసు తన పాపాలకు శిక్ష అనుభవించిందన్న సానుభూతి ఏర్పడిన సమయంలో ఇందిరాగాంధీని ఎరెస్టు చెయ్యటంలాంటి పనులుచేసి, "రాజకీయ కక్ష సాధిస్తున్నారు " అన్నమాట కూడా పడ్డారు రాజకీయ కక్ష సాధించే వాళ్ళు ముందు "మెతకగా" ఉండరు కాని ఆసంగతి ఎవరికీ పట్టలేదు

ఇందిరాగాంధీ ఎన్నికలముందూ, మళ్ళీ ఇటీవలా చేసే ప్రసంగాలు చూస్తే ఆమెకైనా మతిలేకపోయి ఉండాలి, లేదా వినేవాళ్ళు బదుద్ధాయిలై ఉండాలని ఆమె అభిప్రాయం అయినా కావాలి "నన్ను చూసి వాళ్ళు దడుచుకుంటున్నారు " అంటూ ఇందిరాగాంధీ ఎవరి నెవరినో చూడబోవడమూ, ఎక్క డెక్కడికో వెళ్ళి "ఎందుకు వెళ్ళింది?" అని పాత్రికేయులు ఊహాగానాలు చేసేటట్టు చెయ్యటమూ, ఇదంతా ఏమిటి? తాను పదవీభ్రష్టురాలై కూడా "వాళ్ళను" (ఎవరినో!) హడలగొట్టగలది, సర్వాధికారాలూ తన గుప్పిట్లో పెట్టుకుని దేశాన్ని ఎంతగా హడలగొట్టి ఉండాలి? మతి సరిగా ఉన్న మనిషి తనకు విరుద్ధంగా తానే ఇలా మాట్లాడుతుందా? తనను చూసి ఇతరులు భయపడటం చూసి గొప్పగా భావించే మనిషి అరంగుళం అధికారానికైనా అర్హురాలేనా?

దేశంలో ఒక్కడుకూడా, సైనికాధికారులతో సహా, తాగకుండా శాసించవచ్చుననీ, దొంగబట్టీలను లేకుండా చెయ్యవచ్చునని నమ్మే మురార్జీ దేశాయిని ఏమనాలి? ముందు బట్టీని ఎత్తేయించి, విషం తాగి చచ్చేవారిని కాపాడరాదా? అది సాధ్యమా? ఇది గొంగట్లో భోజనం!

భరణి, మాసపత్రిక, 1973

# 5. ప్రాథమిక ప్రజాస్వామ్యం

దేశంలో ఈనాడున్న పరిస్థితిని ప్రతి ఒక్కరూ సరిగా అవగాహన చేసుకోవటం ఎంతైనా అవసరం సోషలిజం జపించే మన ప్రభుత్వం ప్రాథమిక ప్రజాస్వామ్యాన్ని కూడా ఖాతరు చెయ్యటం లేదు స్వాతంత్ర్యం రాకపూర్వం మనం ప్రజాస్వామ్యానికి నోచుకోలేదు సామాజిక అసమానతలూ, ప్రజల హీనస్థితీ, నిరక్షరతా, వైద్యసదుపాయాలు లేకపోవటమూ, ఉత్పత్తి శక్తులమీద ఆంక్షలు మొదలైనవాటికి వలసప్రభువులు కారకులని అనుకోగలిగాం కాని స్వాతంత్ర్యం వచ్చిన అనంతరం పైపై అభివృద్ధి చెప్పుకొనేటందుకు కనిపించినా, సామాన్యుడి దృక్పథం నుంచి అసమానతలు పెరిగాయి అవినీతి పెరిగింది దీనికి ఎవరు బాధ్యులు? తప్పకుండా ప్రజలే

ప్రభుత్వాన్ని ప్రజలు ఎన్నుకోవచ్చుగాక, కాని ప్రజలు ఎన్నుకున్న ప్రభుత్వం బలీయమైన వర్గాల ఒత్తిడికి లోబడి పని చేస్తుంది ప్రజా స్వామ్యం ఎన్నికలలో ఆరంభమై, అక్కడే అంతమవుతుంది ఈ దేశంలో ఇన్నాళ్ళూ ప్రభుత్వం అనుసరించే విధానాలు ధనికవర్గాలకు మాత్రమే అనుకూలంగా ఉంటున్నాయి ప్రజలకు తమ హక్కులు తెలియనంతకాలమూ

వారికి ఆ హక్కులు దక్కవు  తమకు జరిగే అన్యాయాలేమిటోకూడ తెలియని ప్రజలు తమహక్కులకోసం ప్రభుత్వంమీద ఒత్తిడి ఎట్లా తేగలరు?

ప్రభుత్వానికి బలమైన ప్రతిపక్షం ఉంటే ప్రజాస్వామ్యం ఈ దేశంలో నాలుగు పాదాలా నడిచేదన్న భావం ఒకటున్నది  ఇందులో కొంత నిజం ఉన్నప్పటికీ ఇది ప్రజాదృక్పథం నుంచి నిజంకాదు  ప్రతి పక్షంలో ఉన్న ఏ ప్రజాద్రోహిపక్షమైనా ఈమాట అనవచ్చు  ఈ ప్రతిపక్షాలేవీ ప్రజలను ఉద్ధరించేవికావు  కావటానికి వీలులేదు  ఎందుచేతనంటే ప్రజల మనుషులు లక్షలకు లక్షలు ధారపోసి ఎన్నికలకు నిలబడలేరు  మన దేశంలో ఎన్నికలు డబ్బు కుమ్మరించవలసిన ఎన్నికలు  ఎన్నికలకు పోటీ చేసే ప్రజాపక్షం ఏదన్నా ఉన్నా అది అధికారం చేపట్టలేదు  దారితప్పి చేపట్టగలిగినా దాన్ని కూలదొయ్యటం అతి సులువు  ఇదంతా మన కళ్ళ ఎదట జరుగుతున్నదే

కనక తేలేదేమంటే దేశంలో నిజమైన ప్రజా ప్రభుత్వం లేకపోవటంమాట అటుండగా, ఉండటానికి అవకాశం కూడా లేదన్నది ప్రత్యక్ష సత్యం  ప్రజాస్వామ్యానికి ఏమాత్రం ఆస్కారం ఉన్నా సోషలిజంకేసి పురోగమించవలసిన దేశం అర్ధవలసగా రూపొందదు  ప్రణాళికాబద్ధమైన ఆర్థిక విధానంలో ధనవంతులు మరింత ధనవంతులు కావటమూ, దారిద్ర్యం విస్తరించటమూ ఒక్కనాటికీ జరుగదు

ఇలాంటి పరిస్థితిలో ప్రజలకోసం కృషిచేసే రంగాలు కొన్ని సహజంగా పుట్టుకొచ్చాయి  ప్రజాస్వామ్యం అమలు కావటానికీ, పౌరహక్కులు సక్రమంగా కొనసాగటానికీ కృషి జరుగుతున్నది  ఈ కృషి సాగించే సంస్థలు స్వార్థరహితంగా పనిచేస్తాయి  ఈనాడు ప్రజలకు ఇంతకన్నా సన్నిహితమైన సంస్థలు లేవు  ఇవి ప్రజాస్వామ్యానికి సంబంధించిన వ్యవహారకాండ జరుపుతాయి  ఈ మన దౌర్భాగ్యదేశంలో ప్రజాస్వామ్యం అమలుకావటానికి ఇంతకన్న మంచి సాధనాలు ఏవీలేవు  న్యాయశాఖ ఒకటి ఉన్నది  అది రాజ్యాంగం అనుమతించిన మేరకు ప్రజాస్వామ్య వ్యతిరేకతను అరికట్టవచ్చు  అయితే రాజ్యాంగానికి కూడా ఏదో తూట్లు పెట్టే ప్రయత్నాలను దేశ రక్షణ పేరిట ప్రభుత్వం చేస్తూనే ఉన్నది

సంస్కృతీరంగంలో ప్రజల తరఫున మాట్లాడటానికి రచయితలూ, వారి సంస్థలూ ఉన్నాయి  వీళ్ళ కృషికూడా నిస్వార్థమైనది గానే ఉండవచ్చు  మిగిలిన ప్రజా సంస్థలలాగే రచయితల సంఘాలు కూడా ప్రాథమిక ప్రజాస్వామిక హక్కులమీదనే, వాక్స్వాతంత్ర్యంతో మాత్రమే పనిచెయ్యగలవు, విప్లవ రచయితల సంఘం అలాంటి సంస్థ  ప్రజలు దీన్ని కూడా తమకోసం కృషి చేసే సంస్థగా భావించి కాపాడుకోవాలి

విరసం వాళ్ళు సాయుధ విప్లవాన్ని ప్రబోధిస్తారని ఒక అభ్యంతరం ఉన్నది  ఇది ఎవరి అభ్యంతరమో స్పష్టంగా తెలీదు  సాయుధంగాని విప్లవం ప్రపంచంలో ఎక్కడా లేదు  మన ప్రభుత్వమైనా సాయుధవిప్లవాలకు అభ్యంతరం చెప్పేస్థితిలో లేదు  మనకీనాడు పెద్దదిక్కుగా ఉన్న రష్యాలోని సోవియట్ ప్రభుత్వం సాయుధ విప్లవం ద్వారా వెలిసినదే  అలాటిదే చీనా మనం చీనీ-హిందీ భాయ్ భాయ్ అనటం మానింది  అక్కడ సాయుధ విప్లవం జరిగిందని మటుకుకాదు  సాయుధ విప్లవాలు ప్రపంచంలో మరెక్కడైనా జరగవచ్చుగాని మన దేశంలో

జరగరాదని ఎవరన్నా వాదించదలిస్తే దానికి తగిన కారణాలు చెప్పాలి ఈ దేశంలో ప్రజాస్వామ్యం లేదు ప్రభుత్వం చీటికీ మాటికీ ప్రజలమీద తుపాకులు ప్రయోగించి, వేలాది యువకులను కుంటిసాకులతో ఖైదుచేసి విచారణలుకూడా జరపటం లేదు ఇదంతా ప్రజలను ఎవరినుంచి, ఏ విధంగా కాపాడటానికి? ఇలాంటి ప్రభుత్వ చర్యల వెనక ఉన్న ప్రజాహితం ఏమిటి? పోలీసు దళాలు ప్రజలకు కలిగిస్తున్న భద్రత ఎలాటిదో పత్రికలలో చూస్తూనే ఉన్నామే! పోలీసు అత్యాచారాలూ, హరిజనులపై అత్యాచారాలూ ఈ దేశంలో సాధారణ వార్తలు అయిపోలేదా? కాల్పులు నిత్యకృత్యం అయిపోలేదా? ఈ పరిస్థితిలో ప్రజలపట్ల నిజమైన అభిమానం ఉండే మేధావులు భావవిప్లవాన్ని మించిన ఆశావాదం ప్రజలకు ఏమి ఇయ్యగలరు?

ఈపాటి ఆశావాదాన్నికూడా ప్రజలకు అందనివ్వకుండా ఏదో ఒక కుంటి సాకుపెట్టి ప్రభుత్వం విరసం సభ్యులను అరెస్టుచేస్తూ వస్తున్నది కొందరు విరసం సభ్యులు ప్రభుత్వాన్ని కూలదొయ్యటానికి కుట్ర చేస్తున్నారని ఆరోపణ ఉన్నదని పత్రికలో చదివాను ప్రతి పక్షాలన్నీ కలిసి పడగొట్టలేని ప్రభుత్వాన్ని నలుగురు విరసం సభ్యులు ఎలా పడగొట్టగలరు? ఊహించటం అసాధ్యం విరసం ఆశయం ఒక ప్రత్యేక ప్రభుత్వాన్ని పడగొట్టడం మటుకుకాదు అది ఎన్నికల పోటీ ఆశయం విరసం ఆశయం పూర్తిగా సామాజిక వ్యవస్థను మార్చి, ప్రజలకే సమస్త అధికారమూ దక్కేటట్టుచెయ్యటానికి తగిన భావనాసంచలనం కలిగించటం ఇది ప్రజాస్వామ్యానికి ఎంత మాత్రమూ విరుద్ధం కాదు బూర్జువా ప్రజాస్వామ్యానికి ఎగువమెట్టు విప్లవాలు విజయవంతమైన అనంతరం కూడా రష్యా చైనాలలో కమ్యూనిస్టులు కాని వాళ్ళూ ఇతరపార్టీలవారూ అధికారాన్ని పంచుకోవటం జరిగింది విప్లవంవల్ల ఆ దేశాలు–ఆ దేశాల ప్రజాజీవితం–కొన్నివేల రెట్లు మెరుగుకాలేదని ఆ దేశపు శత్రువులు కూడా అనలేరు

ఇంతకూ నేను చెప్పేదేమిటంటే, రచయితల అరెస్టులు ప్రజలపైన నేరుగా తగిలే దెబ్బ, విరసం రచయితలకన్న ప్రజలమేలు కోరేవారు ఉండబోరు ప్రజలు ఈ సంగతి స్పష్టంగా గ్రహించి, వారి అరస్టుల ద్వారా ప్రాథమిక ప్రజాస్వామ్యం దెబ్బతింటున్నదని తెలుసు కొని, ప్రభుత్వం చీటికీ మాటికీ ఇలాంటి ప్రజా వ్యతిరేక చర్యలకు పూనుకోకుండా చూసుకోవాలి

కుట్ర: విరసం, కాకినాడ యూనిట్ బులెటిన్, 6-6-1974

## 6. ఎన్ని రకాల పడేసినా పిల్లి నాలుగుకాళ్ళమీదే పడుతుంది

రాజకీయ ప్రజా తంత్రం ప్రతిపాదించిన గ్రీకులు, పార్టీలంటూ లేకుండానే దాన్ని అమలు జరిపారు తమ నాయకులను ప్రత్యక్షానుభవంతో నిర్ణయించుకున్నారు నాయకత్వపు మంచిచెడ్డలు ఆచరణలో రుజువయేవి

కాని ఈనాడు అధిక సంఖ్యాకుల అభిప్రాయం పాలకవర్గానికి బలమైన ప్రతిపక్షం ఉండాలని ఎందుకు? పాలకవర్గం విశృంఖలంగా ప్రవర్తించకుండా నిగ్రహించడానికి ఏ ప్రమాణాల ప్రకారం విశృంఖలంగా? ప్రతిపక్షం ప్రమాణాల ప్రకారం ఒక్కోసారి అదికూడా ఉండదు ప్రతిపక్షం పదవిలో ఉంటే చేసే పనులుకూడా పాలకవర్గం చేస్తే ప్రతిపక్షం అభ్యంతరం చెప్పవచ్చు ఈ పరిస్థితిని గురించి ఎవరికీ అభ్యంతరం ఉన్నట్టు కనబడదు అందుకు కారణం ఉన్నది

పార్లమెంటరీ విధానంతో కూడిన పరిపాలనలో ప్రజల పాత్ర చాలా చాలా తక్కువ పరిపాలన ఎలా సాగాలో పాలకవర్గం నిర్ణయిస్తుంది ఎలాగ జరగకూడదో ప్రతిపక్షం నిర్ణయిస్తుంది యీ నిర్ణయాలు ప్రజలవి కాదు అవి ప్రజలను బాధించేవైతే వాళ్ళ ఖర్మ!

ప్రజలేగదా పాలకపక్షం వాళ్ళనూ, ప్రతిపక్షం వాళ్ళనూ ఎన్నుకుంటారని అడగవచ్చు ప్రజలకు ఈ విషయంలో కూడా స్వయం నిర్ణయం లేదు రెండు బలమైన పార్టీలు రాజకీయ రంగంలో ఉన్నప్పుడు నీ ఓటు ఏదో ఒక పార్టీకి వెయ్యక చేసేది లేదు తమ నియోజక వర్గంలో నిలబడే వాణ్ణి ప్రజలు ఎరక్కపోవచ్చు వాణ్ణి ఎన్నుకొనేది వాడిపార్టీ దీన్ని బట్టి పార్లమెంటరీ ప్రజాతంత్రంలో ప్రజల వాటా ఎంత ఉన్నదీ ఎవరైనా అంచనా వేసుకోవచ్చు

ఇక అందరూ కావాలంటున్న రాజకీయ పక్షాల జాతకాలు పరిశీలిద్దాం "ప్రతిపక్షం" అనే నిర్వచనంలో విప్లవపార్టీలకు స్థానంలేదు పాలకపక్షమూ, ప్రతిపక్షమూ కూడా ఒకే వర్గానికి ప్రాతినిధ్యం వహించేవిగా ఉంటేనే అది నిజమైన ప్రతిపక్షం అలాటి ప్రతిపక్షంచేత "పడగొట్టబడటానికి" పాలక పక్షానికి అభ్యంతరం ఉండదు ఆ పని విప్లవ ప్రతిపక్షాలు చేయబూనితే డెమోక్రసీకి తీరని విపత్తు సంభవిస్తుంది దేశ ద్రోహం జరిగి పోతుంది మహా ప్రళయం ఆసన్నమవుతుంది

రాజకీయ ప్రత్యర్థిత్వం అదోరకం ప్రణయ కలహంలా ఉండాలిగాని, ద్వంద్వ యుద్ధ స్థాయికి దిగజారరాదు మన దేశంలో కాంగ్రెసు పార్టీ బ్రిటిష్‌వారితో ప్రణయకలహం లాటి సంఘర్షణే జరిపినప్పటికీ, కాంగ్రెసు వెనక నిజంగా ప్రజలు ఉండిపోయిన కారణంచేత బ్రిటిషు వాళ్ళు కాంగ్రెసు వాళ్ళతో జైళ్ళు నింపారు దేశంలో భావ స్వాతంత్ర్యానికి బేడీలు వేశారు, పుస్తకాలు నిషేధించారు "స్వరాజ్యం" అంటే రాజద్రోహం అని ప్రకటించారు ఇప్పుడు మన పాలకులు విప్లవకారుల పట్ల చేస్తున్నదంతా చేశారు చీటికీ మాటికీ రక్తపాతం చేయించటం మినహాగా

యాతావాతా ఏ రాజకీయ ప్రణయ కలహమైనా ఇబ్బందిలేదు అందులో ప్రజల ప్రమేయం ఉండరాదు ఉంటే పార్లమెంటరీ ప్రజాతంత్రం చచ్చి ఊరుకుంటుంది ప్రజలు వెనక ఉన్న అహంతోనే బ్రిటీషు వాళ్ళ హయాంలో నెహ్రూ, కాంగ్రెసు పక్షాన చీపిరికట్టను నిలబెట్టి గెలిపిస్తానని శపథంచేసి, ఎన్నికల అసలు రంగును బయటపెట్టాడు అయితే ఈ పార్లమెంటరీ విధానంలో పాలక పక్షానికి, ప్రతిపక్షానికీ ఉండే సంబంధం ఒకేసారి రెండు విరుద్ధ పరిణామాలకు దారితీస్తున్నది ప్రజల రక్షణనుంచి రెండు పార్టీలకు తేడా ఏమిటో తెలుసుకొనడం రాను రాను అసంభవమవుతున్నది అమెరికాలో డెమోక్రాట్లూ, రిపబ్లికనులూ ఒకే రకమైన విధానాలు అమలు చేస్తున్నారు బ్రిటన్‌లో లేబరూ, కన్సర్వేటివులూ ఇంచుమించు అదేస్థితిలో ఉన్నారు ఇది పార్టీ పరిపాలనతాలూకు ఒక ముఖం ఇక రెండోముఖం ఏమిటంటే, పాలక వర్గంగా ఉండటానికి పార్టీల మధ్య జరిగే పోటీ అంతులేని అనాచారాలకూ, దుష్కృతాలకూ దారితీస్తున్నది "రెండు పార్టీల విధానం వాషింగ్టన్ అధ్యక్షుడి నుంచి నిక్సన్‌కు దిగజారింది" అన్నాడు యూజీన్ మకార్థీ పాలించే హక్కుకోసం అన్నిరకాల అత్యాచారాలూ జరుగుతున్నాయి కుట్రలూ, కకూహకాలూ, హత్యలూ, లంచగొండి తనాలూ, మనుషులను డబ్బుతో

కొనెయ్యటాలూ వగైరా అందుచేత యూజీన్ మాకార్ధీ ఏంచెయ్య వీలుచూసుకున్నాడు? పార్టీల ప్రమేయం లేకుండా అమెరికా అధ్యక్షుణ్ణి ఎన్నుకునేటందుకు ఒక కమిటీ ప్రారంభించాడు ఏడాదికి 15 వేల డాలర్లు కట్టగలవాడు, రోడ్లు వూడ్చేవాడైనాసరే, ఆ కమిటీలో సభ్యుడిగా ఉండవచ్చు ఇప్పటికీ హెన్రీఫోర్డ్ తమ్ముడిలాటి "సాదా" మనుషులు అందులో సభ్యులు 1976లో జరుగనున్న అధ్యక్షుడి ఎన్నిక సందర్భంలో ఈ కమిటీ పార్టీ ప్రమేయం లేకుండా నామినేషన్ దాఖలు చేసి, వాడికి వెయ్యమని ప్రజలను అడుగుతుంది ప్రస్తుతం వారిదృష్టిలో అభ్యర్ధి ఉన్నాడా? సరిగా గ్రహించారు! అతని పేరు యూజీన్ మకార్ధీ కాని అంతకన్న యోగ్యుడు కూడా దొరకవచ్చు

ప్రజలు పార్టీలను నమ్మి, ఆ పార్టీలు నిలబెట్టిన వాళ్ళకు ఓటు చెయ్యటం పార్టీ ఒప్పుకోదు "నమ్మటం ఏమిటి? ఇదేమన్నా మతమా?" అంటాడతను

నిజంగా మరి "నా మొహంచూసి ఓటివ్వకండి ఆ ఇందిరాగాంధీ మొహం చూసి ఓటెయ్యండి," అని జనాన్ని వేడుకుని చాలా చీపిరికట్టలు ఎన్నికలలో గెలిచాయి కానీ తీరా గెలిచాక ఈ చీపిరి కట్టలు ప్లేటు ఫిరాయించటమూ, కోట్లు తిరగెయ్యటమూ, లేదా ఇతర చీపిరి కట్టలమీద తిరగబడి అంతర్యుద్ధాలు తీసుకురావటమూ, ఒక పార్టీలో అంతస్సంఘర్షణలు అనేకంగా బయలు దేరటమూ జరగవచ్చు దీని కంతటికీ విరుగుడు ఏమిటో పార్లమెంటరీ పరిపాలనా విధానం చెప్పదు అందుచేత ప్రజలు పార్టీలలో విశ్వాసం ఉంచటం "డామ్ నాన్సెన్స్" అని యూజీన్ మాకార్ధీ అంటే మనం అతనితో ఏకీభవించవచ్చు కాని క్రియలో అతను, తన కమిటీలో విశ్వాసం ఉంచమని అడగబోతాడు అదేవచ్చినచిక్కు

ఎన్ని రకాల పడేసినా పిల్లి నాలుగు కాళ్ళమీదే పడుతుంది అలాగే ఎన్నికల తంతును ఎన్నిరకాల సంస్కరించటానికి ప్రయత్నించినా అంతిమ ఫలితం పరిపాలన "కలవాళ్ళ నిరంకుశత్వం" గానే ఉండబోతుంది దారితప్పి ఏపార్టీ ద్వారానైనా విస్తృతమైన ప్రజోద్యమం సాగిందో, దాని నినాదాలు ఏవైనా కానియ్యండి, కలవాళ్ళ పార్టీలన్నీ ఏకమై వాట్ని తుపాకులతో వేటాడతాయి ఇది నిజం!

ఈనాడు దినపత్రిక, 18-9-1974

## 7. తిండి గింజలూ-పెట్రోలూ

ఈనాటి ప్రపంచ రాజకీయాలను సంక్షోభ పెడుతున్న దినుసులలో ఒకటి అహారధాన్యాలూ, రెండోది పెట్రోలూ ఒకటి అసంఖ్యాకులైన ప్రపంచ పేద ప్రజలకు జీవన్మరణ సమస్య రెండోది అల్పసంఖ్యాకులైన ధనిక వర్గాల సమస్య చిత్రమేమిటంటే ఆహార ధాన్యాలకు కీలకం అభివృద్ధి చెందిన దేశాలు, పెట్రోలుకు కీలకం వెనుకబడిన దేశాలు అమెరికా, కెనడాలు పూనుకుంటే ప్రపంచ ప్రజలందరికీ తిండి గింజలు అందించగలవు పొలాలను సాగు చెయ్యకుండా ఉంచినందుకు అమెరికా ప్రభుత్వం భూస్వాములకు డబ్బు ఇస్తుంది కారణం ఏమిటంటే తిండి గింజలు అమెరికా పరిపాలకుల చేతిలో ఒక అస్త్రం లాంటిది ఇది, అందరికీ తెలిసిన విషయమే ఒక వంక ఆహారం ప్రపంచ సమస్యఅయి కూర్చున్నా కూడా అమెరికా

ఆహారాన్ని రాజకీయ అస్త్రంగా ఉపయోగించే ఆలోచన కట్టి పెట్టలేదు కాని అరబ్బు దేశాలవాళ్ళు తమ నూనె ధర పెంచితే అమెరికావాళ్ళు అన్యాయమని ఆక్రోశించారు అరబ్బులు నూనె ద్వారా అమెరికా విదేశాంగ విధానాలను దెబ్బతీస్తుంటే, "నూనె అస్త్రం" అని ఆక్షేపిస్తున్నారు నూనెను రాజకీయ అస్త్రంగా వాడటం కన్నా తిండి గింజలను వాడడం అనేక రెట్లు హీనం కాదా?

నూనె లేకపోతే మానవజీవితం అస్తవ్యస్తం అయిపోదు చవగ్గా లభించే ముడి పదార్థంగా గాక, సంపన్న దేశాలు దాని మీద తమ నాగరికతను నిర్మించుకొని, ఆ ముడి పదార్థాన్ని అందించే "వెనకబడిన" దేశాలను వెటకారంగా చూస్తూ వచ్చాయి ఇప్పుడా దేశాలు మేలు కున్నాయి సంపన్న దేశాల నాగరికతను దెబ్బతీసే శక్తి తమ చేతిలో ఉన్నట్టు అవిగ్రహించాయి ఇందులో అన్యాయమూ, అక్రమమూ ఏమిటి? మానవజాతి "మోటారుకారు" నాగరికత ద్వారా తప్ప పురోగమించదని ఎక్కడా లేదు శక్తి ఉత్పత్తికి నూనె కాక ఇతర సాధనాలున్నాయి మనదేశం లాటి (ఆర్థికంగా) అట్టడుగు దేశాలు ఈ మోటారుకారు నాగరికతను ఎంత దూరంగా ఉంచితే అంత బాగుపడతాయి మన దేశం కన్న పెద్దది చైనా ప్రైవేటుకార్లు లేకుండానే జరుపుకుంటూ నూనెను ఎగుమతి కూడా చేస్తున్నది

నూనె అందుబాటు కాక ప్రజలు లక్షల సంఖ్యలో చావటం ఎక్కడా జరగదు తిండిగింజలు లేక ప్రజలు ప్రపంచంమీద కోట్ల సంఖ్యలో చస్తున్నారు ఆ మాటకు వస్తే మోటారుకారు నాగరికత వేల సంఖ్యలో మనుషులను బలితీసుకుంటున్నది

అసలు అన్ని నాగరికతలకూ మూలమే తిండిగింజలు "తిండికలిగితె కండ గలదోయ్, కండగలవాడేను మనిషోయ్" దోపిడీకి కూడా తిండి గింజలే మూలం తిండిగింజలే పేదరైతు కూలీలను యావజ్జీవ దాస్యంలో వుంచి, వారి శ్రమ ఫలితాన్ని మట్టిపాలు చేసేది అదే గతి తిండి చాలని దేశాలకు కూడా పట్టిస్తున్నది అమెరికా ఒక వంక మనదేశం తిండికోసం బలిసిన దేశాలకు అమ్ముడు పోతూంటే "దేశభక్తి" గల మన వ్యాపారస్థులు తిండిగింజలు మీదే కబంధహస్తాలు చాచి, అంతులేని లాభాలు తీయటానికి ప్రయత్నిస్తున్నారు అయినా ఈ ప్రభుత్వం వాళ్ళ ఆటలు కట్టించలేకుండా ఉన్నది దేశంలోని దోపిడీ గాళ్ళను అదుపు చెయ్యలేని ప్రభుత్వం అమెరికాను ప్రతిఘటించ గలదా?

తిండిగింజలు దిగుమతి చేసుకోవటం వెనక ఒక నైతిక సమస్య ఉన్నది ఆహార ధాన్యాలు దిగుమతి చేసుకోవాలా? ఎరువులు దిగుమతి చేసుకోవాలా? ఇదే సమస్య ఒక టన్ను ఎరువు పదిటన్నుల ఆహారధాన్యాన్ని ఉత్పత్తికి సమానమన్నమాట ఇటువంటిలెక్కలుమన దేశానికి వర్తించవు ఎరువు దిగుమతి చేసుకున్నా అది తిరిగి దొంగల పొలాలకే చేరుతుంది తిండి దొంగల్లాగే ఎరువు దొంగలూ ఉన్నారు దేశంలో బక్కరైతులకు రాబడి పెరిగే మార్గంలేదు పేదవాళ్ళకు తిండి లభించే మార్గంలేదు తలసరి రాబడిలో అయిదు శాతం కూడా ఖర్చుచేయకుండా తిండి పోతులుగా పౌరులు జీవించే అవకాశం గల దేశాలలోసైతం ఆహార పదార్థాలకు ప్రభుత్వాలు సబ్సిడీలు ఇచ్చే స్థితిలో ఉండగా మన దేశంలో లక్షలాది ప్రజలకు తమ ఆదాయం కడుపు నిండా తినటానికే చాలటం లేదు ప్రభుత్వం అందుగురించి ఏమీ

చెయ్యలేదు యంత్ర నాగరికతను పెంపొందించుకునే దేశాలు ప్రజల కనీస అవసరాలను సాధ్యమైనంత తక్కువ ఖరీదులో ఉండేటట్టు చూస్తాయి లేకపోతే యంత్రోత్పత్తికి గిరాకీ ఎలా వస్తోంది?

మనదేశం తలకిందులుగా నిలబడి, వ్యవసాయం పునాది లేకుండా పారిశ్రామికంగా పైకి రాజూస్తున్నది ఇది "అప్పుచేసి పప్పుకూడు" మనస్తత్వం మహా మహా దేశాలే మట్టికొట్టుకు పోతున్నాయి ఆర్థిక సంక్షోభం సంపన్న దేశాలలోనే ఆరంభమయింది ఈ సంక్షోభంలో సోషలిస్టు దేశాలు మాత్రం దెబ్బతినవు వాచా సోషలిస్టు దేశాలు పులి విస్తరాకుల్లాగ కొట్టుకు పోకతప్పదు దిక్కుమాలిన "నూనె నాగరికత" నుంచి బయట పడక పోతే మన దేశానికి మోక్షం లేదు

ఈనాడు దినపత్రిక 29-11-1974

# 8. మేధావి వర్గం

మేధావి అనేది బిరుదుగా కాక ఒక వర్గంగా చూసినట్టయితే, ఆవర్గం సామాజిక పరిణామానికి ఏవిధంగా తోడ్పడుతుంది? ఏ విధంగా తోడ్పడాలి? దాని బాధ్యతలు ఏమిటి? ఇలాంటి ప్రశ్నలు కలుగుతాయి వాటికి సమాధానాలు తెలుసుకోవటం అవసరం ఎందుకంటే ఈ వర్గాన్ని పక్కకు నెట్టటం సాధ్యంకాదు దీన్ని గుడ్డిగా నమ్మటానికీ లేదు

సాధారణంగా ఈ మేధావులు చదువుకున్నవాళ్ళు, స్వానుభవాన్ని మించిన లోకజ్ఞానం సంపాదించే అవకాశాలూ, శక్తీ ఉన్నవాళ్ళు పామరుడికన్న జీవితాన్ని మరింత లోతుగా అవగాహన చేసుకుని దాని అంతరార్థం ఇతరులకు చెప్పగలవాళ్ళు భవిష్యత్తులోకి మరో అంగుళం జాస్తిగా చూసేశక్తిగలవాళ్ళు వీరికి గల ఈ శక్తులను బట్టి వీరిని సమాజానికి దీపాలలాంటి వాళ్ళుగా భావించటంలో తప్పులేదు

కాని నూటికి తొంభైశాతం మేధావులు మధ్యతరగతికి చెంది ఉంటారు ఉన్నత వర్గీయులు సంఖ్యలో లాగే జీవితంలో కూడా చాలా సంకుచితమైన పరిధిలో ఉంటారు జాతి జీవితంలో వారిది చాలా చిన్న అర వారిలో రైలు ప్రయాణపు అసౌకర్యాలూ, బస్సు ప్రయాణపు అసౌకర్యాలూ కూడా తెలియని వాళ్ళు చాలా మంది వుంటారు వారికి వాస్తవ జాతీయ జీవితం తెలీదు

కింది వర్గం వారికి వాస్తవజీవితపు ముళ్ళూ రాళ్ళూ మాత్రమే ఎక్కువగా తెలుస్తాయి కాళ్ళుగాయం కాకుండా వాళ్ళు ఎటూ ఒక అడుగు వెయ్యలేరు వారిది అనుక్షణ పోరాటం, ప్రాథమిక జీవిత సమస్యలన్నీ వారికి పోరాట సమస్యలే అందుచేత ఆ వర్గంనుంచి మేధావులనే వాళ్ళు వచ్చే అవకాశం లేదు వారి అనుక్షణ పోరాటంతో సంబంధం పెట్టుకునేదాకా వారు "మేధావి" అనే వాణ్ణి వర్గ శత్రువుగా చూసినా ఆశ్చర్యంలేదు

మధ్యతరగతి మేధావికి సహజంగా మధ్యతరగతి జబ్బులన్నీ ఉంటాయి వాడి దృష్టి పైవర్గంవారి జీవిత విధానాల మీదనే ఉంటుంది వాడి జీవితంలో కూడా పోరాటం ఉన్నప్పటికీ అది బొత్తిగా నిరాశతో కూడుకున్న పోరాటం కాదు పోరాటం తీవ్రంగా ఉన్నప్పుడు తిరుగుబాటు

మనస్తత్వం కనబరుస్తాడు  అది కొంత శాంతించగానే తాను కూడా శాంతించి, రెక్కలు విదిలించి, పైకి ఎగిరే ఆలోచనలో పడతాడు  తన 'అర్హత' లకు తగిన పనిగాని, జీతంగాని లభించక పోతే, భవిష్యత్తులో నమ్మకం ఉంచి దొరికిన దానితోనే తృప్తిపడి "అది" కూడా లేని వారికన్న నయమేకదా అనుకుంటాడు  అతడి దృష్టి చాలావరకు పైకి పోవటం మీదనే ఉంటుంది

అంతమాత్రానికే అతను భౌతికవాది అని కూడా మనం సంతోషించనవసరంలేదు  ఈ పైకి పోవాలన్న ఆకాంక్ష పేరు ప్రతిష్ఠలలో కావచ్చు  అతనిది కీర్తికండూతిని మించక పోవచ్చు

కీర్తి కండూతి  మేధావిచేత విచిత్రంగా ప్రవర్తింపజేస్తుంది  అది అతన్ని 'అభ్యుదయవాది'గా కూడా మార్చవచ్చు  తాను చెప్పేది ప్రపంచానికి ఎంతవరకు ఉపకరిస్తుందనే దానికన్న, దాని ద్వారా తాను  మేధావిగా ఎంత ఖ్యాతిని పెంచుకోగలుగుతాడన్నది అతని ప్రేరణకావచ్చు కీర్తికోసం అతను పీడితవర్గాల ఆప్తబంధువు వేషం కట్టవచ్చు  వారి భాష అనుకరించవచ్చు వారి సమస్యలను గురించి గంభీరంగా ప్రస్తావించవచ్చు  ఈ విధంగా అతని కీర్తి పెరిగితే పెరగవచ్చు  కాని అతని  మేధావిత్వం పిల్లలు పెట్టదు  అదిగొడ్డుమోతుగానే ఉండిపోతుంది

మధ్యతరగతి  మేధావినిండా మునిగినవాడు కాడు  ఒక్కొక్కప్పుడు అతని పాదాలకు కూడా తడి అంటదు  అందుచేత అతనికి క్షేమం చాలా అవసరం  ఎతసేపూ బోను కటకటాల అవతలే వుంటాడు  ప్రమాదం శంకించినప్పుడు నక్కతో పరిగెత్తటం మానేసి, కుక్కలతో పరిగెత్తి వేటలో ఆవిధంగా పాల్గొంటాడు

మేధావి తన తరగతి నుంచి బహిష్కృతుడు కాకుండా కింది తరగతికి సన్నిహితుడు కాలేడు  వారికిప్రాతినిధ్యమూ నాయకత్వమూ వహించలేడు  అట్లా ప్రాతినిధ్యం వహించినట్టు నటిస్తూ తన మధ్యతరగతి లక్షణాలను వదులుకోని వాడు లోకవంచన చేస్తున్న వాడవుతాడు

మధ్యతరగతి  మేధావికి గల మరొక మధ్యతరగతి లక్షణాన్ని కూడా ఉపేక్ష చెయ్యటానికిలేదు అది సామాజిక లంపటం  ఈ  మేధావి సన్నిహితులలోనూ, ఆప్తులలోనూ ఇద్దరు ఒకవైఖరి గలవాళ్ళుగా ఉండరు  "నా ఆరోగ్యం నా ఆయుస్సు!' అనే వారి దగ్గర నుంచి "ఈ జీవితం మారితీరాలిసిందే కాని–" అనే వాళ్ళదాకా అనేక రకాలుగా ఉంటారు

కింది వర్గంలో ఇలాంటి వైవిధ్యం ఉండదు  వారి జీవితానుభవాలలాగే దృక్పథాలు కూడా ఒకే తీరుగా ఉండే అవకాశం హెచ్చు  వారు జీవితం మీద తిరుగుబాటు చేస్తే అది అంతో ఇంతో సమష్టిగా వుంటుంది  మేధావి తిరుగుబాటు వ్యష్టిగా ఉంటుంది  ఒక తిరుగుబాటు మేధావికి మరొక తిరుగుబాటు  మేధావి రెండు వందలమైళ్ళ కదూరాన తగలవచ్చు  అప్పటికీ ఈ ఇద్దరి మధ్యా సామ్యం అచ్చంగా సిద్ధాంతంలోనే ఉన్నదో, ఆచరణ విషయంలో ఎంతవరకున్నదో చెప్పటం చాలా కష్టం

మనదేశం లాంటి దేశంలో  మేధావుల సమస్య మరింత క్లిష్టమైనది  వీళ్ళు పాశ్చాత్య నాగరికత నుంచి పుట్టిన వాళ్ళు  జీవితాన్ని పైకి వచ్చిన దేశాలవాళ్ళ దృష్టితో చూసేవాళ్ళు వీళ్ళు విప్లవ సిద్ధాంతాన్ని చేపట్టినా కూడా ఇతర దేశాలలో జరిగిన విప్లవాచరణ ప్రమాణాల వ్యామోహాన్ని విడవలేరు  ఈ గడ్డమీద  విప్లవపు ముడి సరుకు ఏది అన్న ప్రశ్నకు సరిఅయిన సమాధానం వెతకరు  చాలామందికి వెదికే ఓపికా, అవకాశమూ కూడా లేవు  ఆఖరుకు

విప్లవ సాహిత్యం ఎట్లా ఉండాలనే విషయంలో కూడా పై వాళ్ళు ఎట్లా ఉండాలన్నారనేదే పరమ ప్రమాణంగా ఉంటుంది

ఈ పరిస్థితిలో మేధావివర్గాన్ని ప్రజలు వదులు కోవాలా? వదులు కోవాలనుకోను ప్రజలకు మేధావుల మీద చాలా ఆశలున్నట్టు నాకు తోస్తుంది తమకోసం ఆలోచిస్తున్నారంటే ప్రజలు, మేధావులు చెప్పేది పూర్తిగా అర్థం కాకపోయినా శ్రద్ధగా వింటున్నారనేది నిర్వివాదం

అదీకాక మేధావుల వల్ల భవిష్యత్తుకు పరిమితమైన ప్రయోజనం ఉన్నది ప్రభుత్వానికి ఊడిగం చేసే మేధావులనూ, గోడమీది పిల్లులను వదిలెయ్యండి కలాలు అవతల పెట్టి కత్తులు పట్టి పోరాటంలోకి ఉరికి ప్రాణాలనే బలిపెట్టిన వారిని కూడా వదిలెయ్యండి ఈ రెండు తరగతుల మధ్యా ఉండి విప్లవసిద్ధాంతాన్ని నిర్ద్వంద్వంగా ఆమోదించిన మేధావులు ప్రజలలో చైతన్యం కలిగించటానికీ, కింది వర్గాలలో మేధావులను సృష్టించటానికీ ఎంతైనా కృషిచేయవచ్చు సామాజిక విప్లవానికి ప్రత్యామ్నాయం లేదన్న విశ్వాసాన్ని బలపరిచే ప్రతిరచనా, ప్రతి ప్రసంగమూ ఎంతో విలువైనది మన జాతిని పట్టి పీడించే ఆటవిక, మూఢ నమ్మకాలు మొదలుకుని, అత్యంత అధునాతనమైన తియ్యని కోయిల పాటలు, ధర్మపన్నాల మత్తుమందును ఏర్పరచబట్టే ప్రతి రచనకూ విలువ ఉన్నది విప్లవాన్ని దగ్గిర నుంచి చూసేవాళ్ళూ, చూపించేవాళ్ళూ అవసరమైనట్టే దూరం నుంచి చూసేవాళ్ళూ, కనుచూపుమేరలో లేనిదాన్ని ప్రచారం చేసే వాళ్ళూ కూడా అవసరమే

ఈపాత్ర నిర్వహించగల మేధావులకోసమే విరసం పుట్టిందని చెప్పాలి "ఈ విరసం వాళ్ళంతా తుపాకులు తీసుకొని అడవుల్లోకి పోరేం?" అని అడిగిన వాళ్ళు విరసం ఆశయం గ్రహించిన వాళ్ళుకారు అంతకన్నా 'విరసం' సాహిత్యాన్ని నిషేధించటానికి పూనుకున్న ప్రభుత్వం 'విరసం' విలువ కాస్తలో బాగానే అర్థంచేసుకున్నదనుకోవాలి ప్రజలకూ, సాంస్కృతిక కార్యకలాపాలకూ మధ్య ఉండే అగాధానికి వంతెన కట్టటానికి తొలిప్రయత్నం విరసం పుట్టటం ఈ విప్లవ సాహిత్యోద్యమం సక్రమంగా కొనసాగితే దేశంలో సామాజిక విప్లవం తీవ్రదశకు వచ్చేనాటికి విప్లవకారులు తమదని చెప్పుకునే సాహిత్యం బోలెడంత ఉంటుంది

పిలుపు, పక్షపత్రిక, 16-10-1972

## 9. అధికారమూ-క్రౌర్యమూ

సృష్టిలో మనిషి పుట్టక పూర్వం క్రూరత్వం అన్నది ప్రాణిలో లేదని ఎవరో ఒకరు ఏనాడో కనిపెట్టే ఉంటారు కొట్టవచ్చినట్టు కనిపించే ఈ సత్యం నేను కనిపెట్టిన దాకా రహస్యంగా ఉండి పోయిందనుకోవటం నాకు సాధ్యం కాలేదు

అయితే జంతువులకు మనిషిలో దుర్గుణాలను అంటగట్టి సింహాలు, పులులూ మొదలైన వాటిని క్రూరమృగాలనీ, పాములూ, తేళ్ళూ మొదలైన వాటిని దుష్టజంతువులనీ అన్నాడు ఇది స్పష్టంగా అన్యాయం తన మనుగడకోసం తనకన్న బలహీనమైన ప్రాణులను తినటం క్రూరత్వం కాదు ఆత్మరక్షణ కోసం భయంకొద్దీ ఇతర ప్రాణులను కాటు వెయ్యటం దుష్టత్వమూకాదు

అదీగాక ఈ పనులు మనిషి నిత్యమూ చేస్తున్నవే మనుషులు తినగలందులకు రోజూ ఎన్ని లక్షల ప్రాణులు, కోళ్ళూ, గొర్రెలూ, మేకలూ, బాతులూ, చేపలూ వగైరాలు చావటం లేదు? ఎన్ని ప్రజాతంత్ర ప్రభుత్వాలు "అతీత వాదులను" తుపాకులతో వేటాడి, చంపటం లేదు? హంతకులను ఉరితీస్తారు, వదిలేస్తే ఇంకా హత్యలు చేస్తాడన్న భయంతో కాదా? దాన్ని దౌష్ట్యం అంటామా?

అరణ్యంలో అన్ని మృగాలూ ఒకచోటకలిసే వుంటాయి తినబడేవి తినేవాటినితప్పుకు తిరగవు, పులులకూ, సింహాలకూ తాము వేటాడే జంతువులపట్ల క్రూరభావం లేకపోగా ఒక విధమైన అనురాగం మంచి తోటకూర కాడలపట్లా, లేత వంకాయలపట్లా మవకుండే భావం లాంటిది-ఉండొచ్చు క్రౌర్యానికీ ఈ భావానికీ ఎలాటి చుట్టరికమూ లేదు

రెండు అంశాలు స్పష్టంగా గ్రహిస్తే విషయం మనకు తేలిగ్గా బోధ పడుతుంది

1 క్రౌర్యమూ, కదుష్టత్వమూ చేతలతో బాటు మనస్సుకి కూడా సంబంధించి ఉంటాయి

2 అధికారానికీ, వాటికి వీడని సంబంధం ఉన్నది

మనిషి ఈ రెండు అంశాల్ని గుర్తించే కాబోలు సింహానికి అధికారాన్ని అంటగట్టి దాన్ని "మృగరాజు" చేశాడు కాని నిజం ఏమిటంటే తాను రాజుననీ తనకు ఇతర జంతువులను శాసించే అధికారం ఉన్నదనీ ఏ సింహానికీ తెలియదు

అధికార దుర్వినియోగం చేసే రాజును బలంతో నశింప జేయడం సాధ్యం కాకపోతే యుక్తితో ఆ పని చెయ్యాలని చెప్పటానికి చెప్పిన "సింహమూ, కుందేలూ" కథలో సింహము కనిపించిన జంతువునల్లా చంపితింటుంది ఏ సింహమూ ఆ పని చెయ్యదు అది తన అధికారానికి పోటీ వచ్చిందని తెలియగానే మతిపోయి బావిలో దూకి చచ్చిపోయింది ఇది మామూలు సింహం కాదు నరసింహం

మనిషికితప్ప మరే జంతువుకూ అధికారం అక్కరలేదు దానికోసం పోటీకూడా అవసరం లేదు (కొన్ని మగ జంతువులు ఆడ జంతువులకోసం పోటీపడతాయి అలాగే కోళ్ళూ, పొటేళ్ళు మొదలయినవి పోటీపడి ఒక దాన్నొకటి చంపుకుంటాయి అధికారం కోసం మటుకు కాదు )

అసలు అధికారం అన్న మాటలోనే క్రౌర్యమూ, దౌష్ట్యమూ మొదలయినవి ఇమిడి ఉన్నాయి అధికారం కావలసినవాడు బలప్రయోగానికి సిద్ధపడాలి, అచ్చంగా బలంతో పని జరగకపోతే దౌష్ట్యానికి దిగాలి అవసరమైతే కొన్ని తలకాయలు తీయాలి కొంత జన నాశనం కలిగించాలి రాజ్యం కోసం అజాతశత్రువు తండ్రికి తిండి పెట్టకుండా మాడ్చి చంపాడట అయినా క్రౌర్యాన్ని అధికారం కోసం ఆలోచించ వచ్చునని గుర్తించి కాబోలు ఉపనిషత్తులు అజాత శత్రువును చాలా గొప్ప వాడుగా గుర్తించాయి ఈ విషయమై ఎలాంటి శషభిషలూ లేకుండా అర్థశాస్త్రం అధికారం కోసం ఏ పనయినా చెయ్యవచ్చునన్నది!

విప్లవం లేకుండానే సోషలిస్టు వ్యవస్థ తీసుకురావచ్చునన్నట్టుగానే, క్రౌర్యం అవసరం లేకుండా అధికారం చలాయించవచ్చు నని అశోకుడు నమ్మి మౌర్యవంశం పెత్తనాన్ని తుడిచిపెట్టుకు పోయేటట్టు చేశాడు

అధికారం క్రౌర్యం కోసమేననీ, క్రౌర్యం అవలంబించని అధికారం వృధా అని సాదా పోలీసువాడికి కూడా తెలుసు వాడి చేతి లాఠీ, తుపాకీ అలంకరణలు కావు వాటిని ఉపయోగించటంలో వాడికి ఆనందం ఉంటుంది ఆ ఆనందాన్ని "శాడిజం" అంటారు

భూస్వాములకు రైతులమీద ఉండే అధికారాన్ని హింసద్వారా సార్థకం చేసుకుంటారు వడ్డీ వ్యాపారస్థులకు తాము కుటుంబాలకు కుటుంబాలను నాశనం చేస్తున్నామని తెలుసు కాని డబ్బుతో వచ్చే అధికారానికి కుటుంబాలను నాశనం చెయ్యటంతప్ప మరోదారి లేదు

పెద్దవాళ్ళు పిల్లలమీదా, మగవాళ్ళు ఆడవాళ్ళమీదా, ధనికులు దరిద్రులమీదా, సమర్థులు అసమర్థుల మీదా హింస చూపకుండాతమ ఆధిక్యం రుజువు చేసుకోలేరు

అలాటి సంబంధాలే దేశాలమధ్య కూడా వుంటాయి ఒకప్పుడు మన ధర్మ శాస్త్రాలు , క్షత్రియ ధర్మాలతో పొరుగు రాజులతో యుద్ధం చేస్తూండటం గురించి చెప్పాయి ఇప్పుడు ఫాషన్ అది కాదు "శాంతి, శాంతి!" అంటూ యుద్ధాలకు సిద్ధం కావటం! అధికారం తుపాకి గొట్టంలోనుంచి వస్తుందంటే, మావోను ఘోరమైన మాట అన్నట్టుగా చూడటం!

ప్రపంచంలో "నాగరికత" అన్నది ఏర్పడినాక మారణాయుధాలు లేని దేశంలేదు పోలీసు బలాలూ, సైనిక బలాలూ ఏర్పాటు చేసుకోని దేశం లేదు ఇదంతా దేవతార్చన సామగ్రి అని ఎవరిని నమ్మించగలం?

రాతియుగపు అనాగరిక దశనుంచి మానవులు ముందుకువచ్చి, నాగరికత దశలోకి అడుగు పెట్టటానికి లోహాలూ, వ్యవసాయమూ పశువులను మచ్చిక చెయ్యటమూ, భాషా అనే నాలుగు బ్రహ్మాస్త్రాలు కనిపెట్టారు దాని ఫలితంగా వేల సంవత్సరాల చిల్లరకాలం నుంచీ ప్రపంచం మీద ఆర్థిక దోపిడీ అనే దానికి అర్థం లేకుండా పోయింది

ఎందుచేత? ఆర్థిక దోపిడీ చెయ్యగలవాళ్ళు ఉన్న డబ్బుతో ఏం చెయ్యాలో తెలియని కోటీశ్వరులు, లేదా కోట్లమీద వ్యవహరించే బ్యాంకులు వగైరా సంస్థలు అవి మరింత డబ్బును ఏం చేసుకుంటాయి? చాలామంది సామాన్యులకు లక్షరూపాయలిస్తే వాటితో ఏం చేసుకోవాలో తెలీదు ఆ రేటును సంపాదించే సినిమాతారల్లాంటివాళ్ళు తాగుడుకూ, అర్థంలేని దుర్వ్యసనాలకు పాల్పడుతున్నారు

అందుకే జాక్ లండన్ ఏనాడో రచించిన "ఐరన్ హీల్" లో ఒక పాత్ర ధనస్వాముల గురించి 'వాళ్ళకు కావలసింది డబ్బుకాదు, అధికారం' అంటాడు జాక్‌లండన్ ఇంకొక్కమెట్టు పైకి వెళ్ళి ఆ అధికారం మానవజాతిని హింసించటానికని చెప్పించి ఉంటే నేనీ వ్యాసం రాసి ఉండకపోదును

అధికారం, హింసలో ఓలలాడటం మనం ప్రత్యక్షంగా చూస్తాం అన్ని దేశాలకన్న శక్తివంతమని ప్రపంచం గుర్తించిన అమెరికా రాజకీయాలు, క్రౌర్యమూ, దౌర్జన్యముతో కూడుకున్నవని వాటర్‌గేట్ అనంతరం వెల్లడయింది సి ఐ ఏ రాజకీయ హత్యాకాండలు చేయిస్తుందని ఆరోపణలు వచ్చాయి ఇది చూసి విస్తుపోయిన వాళ్ళకు అసలు సంగతి–అధికారాన్ని క్రౌర్యంనుంచీ, దౌష్ట్యం నుంచీ వేరు చేయటం సాధ్యంకాదని–తెలుసు!

కనీసం కార్ల్‌మార్క్స్ ఈ రహస్యం తన విస్తృత రచనలో ఎక్కడన్నా బయట పెట్టాడేమో తెలీదు కాని సర్వ సమానత్వం ఏర్పడ్డాక "స్టేట్" అనేది ఉండదని చాలా కరెక్టుగా చెప్పాడు

విప్లవాల క్రౌర్యం మాటేమిటి? అధికారం చేతులు మారినప్పుడల్లా చాలా క్రౌర్యం అమలు జరుగుతుంది ముఖ్యంగా విజయవంతమైన విప్లవాలు పిక్‌నిక్ లాగా ఉండక పోవటానికి కారణం ఏమంటే హెచ్చు బలంగల పక్షానికి ఏ మాత్రమూ అధికారం ఉండదు ఓడిపోతున్న పక్షానికి సర్వాధికారాలూ ఉంటాయి క్రౌర్యం పరాకాష్టనందుకోవటానికి అంతకన్న గొప్ప పరిస్థితి ఏముంటుంది?

అది మార్క్సిజం కానియ్యండి, కాకపోనియ్యండి-క్రౌర్యమూ, దౌష్ట్యమూ ఏవగించు కునేవాళ్ళు అధికారం కోసం ఆశించరాదు వారు తమ జీవితాల్లో లేకుండా పోతాయని మొదటే అనుకోరాదు అలాంటి వాళ్ళే క్రౌర్యాన్ని పాలుపోసి పెంచుతారన్న భావం కొందరు వెలిబుచ్చుతారు నేను చెప్పిన సిద్ధాంతానికి ఆభావం వ్యతిరేకం కాదు

జయశ్రీ మాసపత్రిక సంక్రాంతి సంచిక 1977

## 10. హింస: భీతావహం: విప్లవం

ఈ మూడింటికీ ఉన్న సంబంధం ఏమిటి? వర్గసమాజంలో హింస అంతర్భాగంగా ఉన్నది ఇది వర్గ తారతమ్యాలలో ప్రతిబింబించటమేగాక, చట్టాల ద్వారా ధృవీకరించబడి, పోలీసులు, సైన్యం వగైరాల ద్వారా పోషించబడుతుంది జైల్లో తుపాకులూ, లాఠీలూ, సంకెళ్ళూ వగైరా సాధనాలు హింసకోసంకాక వినోదంకోసం కావుగదా పూర్వంకూడా రాజనీతిలో శిక్షాస్మృతికి ఘనమైన స్థానం ఇచ్చారు మానవ స్వభానికి విరుద్ధమూ, విద్రోహకరమూ అయిన సామాజిక వ్యవస్థను కాపాడాలంటే ప్రతిహింస అవసరం అవుతుంది

శతాబ్దాల, సహస్రాబ్దాలమీద హింసకు ప్రతీకలైన పోలీసులూ, జైళ్ళూ, తుపాకులూ, జనసామాన్యంలో ఒక కండిషన్డ్ రిఫ్లెక్స్ కలిగించాయి అదెలాగంటే ప్రత్యక్షంగా హింస కనిపించకపోయినా భీతావహం (టెర్రర్)కలుగు తుంది "ఎర్రటోపీ" అనగానే పోలీసులంటే భయం తల ఎత్తుతుంది చార్లీచాప్లిన్ తన చిత్రాలలో చాలా చోట్ల పోలీసులను చూపుతాడు వాళ్ళు ఏమీ మాట్లాడరు ఏమీచెయ్యరు కాని వాళ్ళను చూడగానే చాప్లిన్ ధరించే పాత్రకు నరాలు కుంచించుకుపోతాయి చాప్లిన్ చిత్రాలలో "వయొలెన్స్" (హింసా సూచకం) పెట్టుబడిదారీలలోను, రౌడీలలోనూ మాత్రమే కనబడుతుంది

క్రియకు హింస కలిగించే శక్తీ, భీతావహం సృష్టించే శక్తీ పీడకవర్గాలకే ఉన్నాయిగాని పీడిత వర్గాలకు లేవు పీడక వర్గాలమీద విప్లవం సాధించేవారు మొట్టమొదట చేయవలసిన పని జనసామాన్యంలో భీతావహం కలిగించే "కండిషన్డ్ రిఫ్లెక్స్"ను రద్దుచేసి, పీడక హింసకు ప్రజల ప్రతిహింస ఎలా జరగాలో పథకాలు వెయ్యాలి

పీడిత ప్రజానీకం ఎందుకు భీతావహం సృష్టించరాదు? అది అసాధ్యం కాదు గాని జరిగేది కూడా కాదు ఎందుకంటే పీడకవర్గంలాగా సామాన్యప్రజ హింసను ప్రయోగించ కుండా తమ శత్రువులకు భీతావహం కలిగించలేదు అలాటి సాధనాలు ప్రజాస్వామ్యానికి కావాలి

కనక పీడకవర్గానికి భీతావహం కలిగించాలంటే హింసతోనే కలిగించాలి ప్రజలు ప్రతిహింస చేబట్టినాక భీతావహంతో పనేలేదు ప్రజాశక్తే సమస్యను పరిష్కరించగలదు

అదీగాక భీతావహం ఎవరు కలిగించాలి? ఎవరిలో కలిగించాలి? ఈ సమస్య విప్లవం ఆరంభంలోనే తల ఎత్తుతుంది ప్రజానాయకులు ప్రజా శత్రువులను తామే చంపి, పీడకవర్గంలో భీతావహం కలిగించే ప్రయత్నం చెయ్యవచ్చు ఎందుకంటే ప్రజాసామాన్యం తమ శత్రువులను తాము మట్టుబెట్టే చైతన్యం అందుకోని పక్షంలో, వారికి నాయకత్వం వహించిన విప్లవకారులు సాగించే హింసాకాండ ప్రజలలోనే భీతావహం కలిగించి, విప్లవ కార్యక్రమానికి ప్రజలను దూరం చెయ్యవచ్చు

పీడకవర్గాలు భీతావహానికి గురికావటానికి కూడా తగిన కారణం కనబడదు విప్లవం ఆరంభమయాక వారిది చావు బతుకు సమస్య సామాన్య ప్రజలమీద ఉపయోగించటానికి వారి వద్ద అబద్ధ ప్రచారంతో సహా అన్ని ఆయుధాలు ఉన్నాయి అందుచేత వాళ్ళు విప్లవాన్ని యుద్ధంగా మార్చి, చచ్చినదాకా పోరాటం సాగించగలరు అప్పుడు ప్రజలు విప్లవాన్ని యుద్ధ ప్రాతిపదికమీదనే సాగించవలసి ఉంటుంది భీతావహం ఈ పోరాటాన్ని శీఘ్రతరంగాని, తేలికగాని చేయలేదు

అందుచేత విప్లవకారులు భీతావహాన్ని నమ్ముకోవటం అనవసరం వాళ్ళకున్న ఆయుధం హింస-ప్రతిహింస-మాత్రమే ఆరంభదశలో విప్లవకారులు ప్రజానీకాన్ని ఆయత్తం చెయ్యటంలో మొట్టమొదటి దశలో హింసక్కూడా స్థానంలేదు

ప్రజలలో ముందు భీతావహం పోగొట్టి, ఆత్మవిశ్వాసం కలిగించాలి తరవాత ప్రజలకు తమమీద- అంటే విప్లవం నడిపే వాళ్ళమీద-పూర్తి విశ్వాసం కుదిరేటందుకు చేయవలసిందంతా చెయ్యాలి ఆ తరవాత కూడా విప్లవ హింస ప్రజల నుంచి రావాలి ప్రజలను ఉద్ధరించే ఉద్దేశంతో విప్లవకారులు ప్రజా శత్రువులను తామే నిర్మూలించటం ప్రజలకు విప్లవాన్ని రంగరించి పొయ్యటం అవుతుంది ఇది స్పష్టంగా తప్పు

చీనాలో విప్లవ సైనికులు గ్రామాలను ఆక్రమించుకోవటం మొదలుపెట్టినాక, ప్రతి గ్రామంలోనూ ప్రజా శత్రువు ఎవరో, వారు ప్రజలకు చేసిన ద్రోహాలేమిటో జాబితా వేసి, మీటింగు పెట్టి, ప్రజాశత్రువును మీటింగుకు తెచ్చి, ప్రజల నోటిమీదుగా వాడి అక్రమాలు చెప్పించి, వాడికి శిక్షకూడా వాళ్ళచేతనే చెప్పించారు కొన్ని సందర్భాలలో ప్రజలు తమ ప్రబల శత్రువును ఎదురుగా చూసి, పులిని చూసినట్టు భయపడి, ఒక్క ఆరోపణకూడా చెయ్యలేక పోవటమూ, ఎర్రసైనికులు ప్రజాశత్రువును విడిచిపుచ్చటమూ జరిగింది అలా రెండుసార్లు జరిగినాక మూడోసారి ప్రజలు ధైర్యంగా తమ శత్రువుమీద ఆరోపణలు చేసిన సందర్భాలు కూడా ఉన్నాయి ఇలా జరగటానికి కారణం ఏమిటి? గ్రామస్థులకు ఎర్రసైనికులమీద పూర్తి విశ్వాసం కలగకపోవటమే

ప్రజలు భీతావహానికి అతీతులుగా తయారై, వారికి తమ విప్లవ నాయకులలో పూర్తి విశ్వాసం ఏర్పడి అన్ని విప్లవ చర్యలూ తమ ఆత్మ విశ్వాసంతో చేసే పరిస్థితి ఏర్పడినాక విప్లవం వెనక్కు తిరిగి చూడదు కాని ఈ స్థితి రావటానికి హింసాచర్యలకు సంబంధంలేని కృషి చాలా దీక్షగా జరగాలి

అరుణతార, నవంబరు,1977

# 11. స్వాతంత్ర్యానంతరం

మనకు స్వాతంత్ర్యం వచ్చేనాటికి సమాజం గురించీ, దాని భవిష్యత్తు గురించీ భిన్న భిన్న భావాలు తుఫానులాగా వస్తూ ఉన్నాయి స్వాతంత్ర్య పోరాట కాలంలో భారతీయుల మధ్య పెరుగుతూ వచ్చిన సమైక్యత స్వాతంత్ర్యం రావటంతో చప్పున అదృశ్యమయింది కారణం స్వాతంత్ర్య పోరాటంలో అధికార వాంఛలేదు స్వాతంత్ర్యం తెచ్చుకున్న విధానంలో అధికార వాంఛ తప్ప మరొకటి లేదు ఈ అధికారం కోసం దేశాన్ని రెండుగా చీలనిచ్చారు మత ప్రాతిపదికమీద, జాతుల వేర్పాటును ప్రతిపాదించకపోయినా ఆమోదించారు దాచినా దాగని సత్యంలాగా ఉత్తరదేశం దక్షిణ దేశం మీద పెరిగిపోసాగింది వివిధ ప్రాంతాల మధ్య సమత్వం సన్నగిల్లింది ఎంత కూడదనుకున్నా ఉత్తర దక్షిణ భారతాలు వేరు వేరుగా కనిపించసాగాయి కాంగ్రెసుకు కొన్ని ప్రాంతాల పరపతి తగ్గింది స్థానిక పార్టీలు బలం పుంజుకున్నాయి

ఈ పరిస్థితిలో దేశీయ సమైక్యత కోసం హిందీ భాషను ఉపయోగించుకోవాలని ఉత్తరాదివారు చూశారు

ఒకప్పుడు వాంఛనీయమైనది రాను రాను అవాంఛనీయంగా పరిణమించింది ఎందుచేత? ప్రాంతీయ సంస్కృతులు స్వతంత్రంగా అభివృద్ధి కావటంచేత హిందీభాష వెంట ఒక సంస్కృతి ఉండటమూ, దాని వెంబడి దేశీయసమైక్యత బలపడటమూ జరుగుతుందన్న ఆశపోయింది తరువాత, బ్రిటిషువారు మన దేశాన్ని దోచుకోవటానికి ఇంగ్లీషు ఉపయోగించినట్టే ఉత్తర భారతీయులు హిందీ భాషేతర ప్రాంతాలను దోచుకోవటానికి హిందీని జాతీయ భాషగా ఉపయోగించుకో జూస్తున్నారన్న అనుమానానికి అవకాశం ఏర్పడింది మూడో సంగతి, హిందీకి అంతర్జాతీయ భాషగా ఉండదగిన పరిస్థితిలేదు శాసనాలు చెయ్యటానికైతేనేం, వైజ్ఞానికంగా రచనలు చెయ్యటానికైతేనేం అది తగినంతగా పెరగలేదు దాని పదజాలమూ, నుడికారమూ సనాతన సంస్కృతమయం, హిందీభాషా సాహిత్యం ఏ ఇతర భారతీయ భాషా సాహిత్యంతోనూ పోటీచేయగలిగినట్టుగా కనబడదు

అధిక సంఖ్యాకులు హిందీ మాట్లాడతారు గనక హిందీ జాతీయ భాషగా ఉండాలన్న అర్థంలేని వాదం అమలులోకి వచ్చింది ఒకప్పుడు జాతీయ సమైక్యతను సాధించిన సంస్కృత, ఆంగ్లభాషలు ఎవరి మాతృభాషలూ కావు దేశం స్వతంత్రమైనాక ఇంగ్లీషు పీడకుల సాధనం అన్న మచ్చకూడా పోయింది అది ఏ ప్రాంతం వారి ఆధిక్యతకూ దోహదం చెయ్యదు అది అన్ని ప్రయోజనాలకూ పనికి వచ్చే అంతర్జాతీయ భాష అధికార భాషగా వుండటానికి దానికి గల అర్హతలలో ఏ ఒక్కటీ హిందీకి లేదు అంతేకాదు ప్రాంతీయ భాషలలో విద్యాబోధన అన్నది ఎంతో వాంఛనీయమైనప్పటికీ, ఏ ప్రాంతం వాళ్ళు ఆ ప్రాంతంలో కూరుకుపోకుండా వుండాలంటే కనీసం పై తరగతుల వారైనా ఇంగ్లీషు చదువులు చదవక తప్పదు

సాంస్కృతికంగా కూడా హిందీ భాష 40 ఏళ్ళ క్రితం సాధించిన విజయాలు ఈనాడు సాధించలేదు ఇప్పుడు హిందీ సాహిత్య (అనువాద) వ్యామోహం ఎవరినీ పట్టలేదు. తెలుగులో శరత్ వెనకబడి, రచయిత్రులు ముందుకు వచ్చారు

హిందీ భాష తలకిందులుగా తపస్సు చేసినా జాతీయ సంస్కృతిని నిలబెట్టలేదేమో ననిపిస్తుంది

భవిష్యత్తులో ఎప్పటికైనా మళ్ళీ జాతీయ సమైక్యతకు దోహదం జరిగితే అది సోషలిస్టు, కమ్యూనిస్టు ఉద్యమాల ద్వారా మాత్రమే జరుగుతుందని నాకు తోస్తుంది

అరుణతార త్రైమాసిక జూన్ - నవంబరు, 1978
'యుగవాణి' నుంచి పునర్ముద్రితం

# 12. ప్రజాభిప్రాయం

వర్గసమాజంలో జనాన్ని దోచుకొని కొవ్వుతో, అధికారం కూడా చూయించి, ఉన్నత వర్గంగా చలామణి అయేది ఒకటి విధిగా ఉంటుంది అయితే ఈ వర్గం గురించి ప్రజాభిప్రాయం మార్పులు చెందుతూ వస్తుంది

ఒక దశలో ఉన్నతవర్గంగా చలామణి అయేది, అంతకు పూర్వం ఉన్నత వర్గంగా చలామణి అయేదాన్ని పడగొట్టి, "అభ్యుదయ" పందాలో తాను పైకివస్తుంది అప్పటికి పాత ఉన్నతవర్గం ప్రజాభిప్రాయాన్ని పూర్తిగా కోల్పోయి, అది సంఘం యొక్క పురోగమనానికి పెద్ద అంతరాయమని అందరికీ స్పష్టంగా తెలిసిపోయి, సమాజంలో ఇంకా మిగిలిఉన్న చైతన్యమంతా దాని నిర్మూలనానికి ఏకం కాగా, ఆ చైతన్యం సహాయంతో ఒక కొత్త వర్గంపైకి వస్తుంది

యుగధర్మం మారిందంటాం- అంటే ఉత్పత్తి సంబంధాలలో పురోగామి పరివర్తన కలిగిందన్నమాట కొత్తవర్గం పైకిరావటంతో ప్రజా జీవితం పచ్చపచ్చగా కనబడ నారంభిస్తుంది కొత్తవర్గం తాలూకు మేలూ, సంఘం మేలూ అవినాభావ సంబంధం కలవిగా తొలిదశలో కనిపిస్తుంది ఇది యుగధర్మంలో పెరిగే దశ

కొత్త అధికారవర్గం పాత దానికన్నా కూడా భారీ ఎత్తున దోపిడీ కొనసాగించవచ్చు కొనసాగిస్తుంది కూడా అంటే, పాత వర్గం దోపిడీలో పొందిన వైఫల్యాన్ని ఇది జయిస్తుంది కొనసాగిస్తుంది అంటే ప్రజల దగ్గిర దోచుకునేటందుకు ఉండే పరిస్థితులు కల్పిస్తుంది ఈ కారణంచేతనే ప్రజలు, తమ జీవితం కొత్తవర్గం కింద మూడు పూలూ, ఆరు కాయలూ అవుతున్నదనుకుంటారు

ఒక ఉచ్చదశదాకా ఈ భావం ప్రజలలో నిలిచి ఉండి, అటు తరవాత క్షీణదశ ఆరంభమవుతుంది దీనికి కారణం, ఉత్పత్తివిధానాలు ఎప్పుడూ ఉత్పత్తి సంబంధాల కన్నా ఒక అడుగు ముందుంటాయి ఇందువల్ల ఆర్థిక రంగంలో వైరుధ్యాలు ఏర్పడటం తప్పనిసరి అవుతుంది దోపిడీ చేసే "చెయ్యి" (తొంటచెయ్యి) బయటపడ నారంభిస్తుంది ప్రజాభిప్రాయం ఉన్నతవర్గానికి సుముఖంగా ఉండే స్థితిలో మార్పు కలుగుతుంది పాలకవర్గ క్షేమానికీ, ప్రజాక్షేమానికి అవినాభావ సంబంధం లేకపోగా రెంటిమధ్యా అంతో ఇంతో శత్రుత్వం ఉన్నట్టు స్పష్టమవుతుంది దానికి తోడు పాలక వర్గం ప్రజలను సహజ నేరస్థులలాగా శాసనాలు చెయ్యటమూ, దండనీతితో పాలించటమూ అధికం చేస్తుంది

ఈదశ పరాకాష్ట అందుకున్నాక దమన కాండను ప్రజాభిప్రాయం అధిగమించి, ఆచరణలో వ్యక్తమయేదాకా పాలక వర్గానికి ప్రమాదం ఉండదు క్షీణ దశ విషమించటమే నియంతృత్వానికి దారితీస్తుంది నియంతృత్వానికి సరి అయిన సమాధానం సామాజిక విప్లవం

ఇందిరాగాంధీ ఏ ప్రజాభిప్రాయాన్ని చూసి దడుచుకుని ఎమర్జన్సీ తెచ్చిపెట్టినదీ స్పష్టంగా తెలుస్తున్నది రాజకీయ ప్రతిపక్షాలూ, కొంతమంది జర్నలిస్టులూ, కొంతమంది రచయితలూ జైళ్ళకు పోయారు రాజకీయంగా తనకు అడ్డంగా ఉన్నవారినీ, ప్రజాభిప్రాయాన్ని రూపొందించగల వాళ్ళను, విప్లవ రాజకీయాలను ప్రచారంచేసే వాళ్ళను ఆమె నిర్బంధించింది

కాని హిట్లరులాగా, ప్రజలను మభ్యపెట్టి, తన భావదాసులుగా కోట్లాది జనాన్ని కూడా గట్టుకునే ప్రయత్నం ఆమె చెయ్యలేదు ఆమెకు ప్రజల భయం లేనట్టు కనిపిస్తుంది

కాని క్షీణదశలో ప్రవేశించిన దోపిడీ వర్గాలకు ప్రజల భయం ఉండటం అవసరం సామాజిక చైతన్యం గల ప్రజలు దోపిడీ వర్గాలను భయపెట్టగలరు ఇతర దేశాలలో దుష్పరిపాలనపట్ల ప్రజలు ఏవిధంగా తిరుగుబాటు చేసేదీ మనం చూస్తున్నాం ప్రజా శక్తిని మించిన శక్తిలేదని సిద్ధాంత రీత్యా మనకు తెలుసు

అయినా ఏకారణంచేతనో మన ఈ భారతదేశంలో దుష్టపాలకులను ప్రజాశక్తి ఎన్నడూ అదుపులో ఉంచినట్టు కనబడదు 1942లో గాంధీగారు "క్విట్ ఇండియా" ఉద్యమం సాగిస్తానన్నప్పుడు వైస్రాయిగారు తన సలహాదార్లను సలహా అడిగితే, మిడ్నపూర్ కలెక్టరుగారు, ఆ ఉద్యమాన్ని 24 గంటల్లో అణిచివేస్తానన్నాడట!

ఇందిరాగాంధీ లక్షలమందిని జైళ్ళలో కుక్కి, చట్టాలన్నిటినీ ఉల్లంఘిస్తే ప్రజలు మూకుమ్మడిగా ఆమెమీదధ్వజం ఎత్తలేదు ఓడిపోయినాక కూడా ఆమెకు హారతులిచ్చారు ఆమె భారత ప్రధాని కాదని ఇప్పుడిప్పుడే తెలుసు కుంటున్నవారు కూడా ఇంకా ఉన్నారు!

ఇందిరాగాంధీని కాదని అధికారంలోకి వచ్చిన జనతాపార్టీ వారికి, తమ అభ్యుదయమే దేశాభ్యుదయమన్నట్టు నటించే నేర్పు కూడా ఉన్నట్టుకనబడదు వాస్తవ పరిస్థితి చూస్తే నియో ఇంపీరియలిస్టుల అభ్యుదయమే భారతీయుల అభ్యుదయం లాగా కనబడుతుంది ప్రస్తుతం మనదేశంలో అధికారం చలాయించేది ఏ వర్గమో కూడా తెలియటం లేదు అధికార పార్టీలోనే వర్గకలహాలున్నాయి

ఏనాడో మెసొపొటామియాలో తొలిమానవనాగరికత ఆరంభమైనప్పుడు మతమూ, దేవుళ్ళు, బ్రహ్మాండమైన గుళ్ళూ, గోపురాలూ ప్రజలలో బయలు దేరిన సామాజిక చైతన్యానికి ప్రతీకలుగా రాణించాయి ఈనాడు రాంభజనలూ, సంకీర్తనలూ, సుప్రభాతాలూ, దేవుళ్ళ అభ్యుదయమూ, విగ్రహాల చౌర్యమూ, మొక్కుబడుల కైంకర్యమూ, మత రాజకీయాలూ, సినిమా సంస్కృతీ, మానసిక కామప్రకోపనాలూ, భారతీయుల సామాజిక చైతన్యానికి ప్రతీకలుగా పైకి కనబడుతున్నాయి విప్లవ పరిస్థితిని ఎదుర్కోవాలంటే ఇంతకన్న నిరుపయోగమైన సామాజిక చైతన్యాన్ని ఊహించటం ఎవరి తరమూకాదు

దీనికి విరుగుడు ఏమిటి? చీకట్లో ఒంటరిగాడై పోయి, తెరమీద కనిపించేమైథున నృత్యాలు, అర్థనగ్న స్త్రీ శరీరాలూ చూసి తన్మయత్వం చెందేవాడిలో, "నేను సైతం ఒక సామాజికజీవిని!" అన్న స్పృహకలిగించడం ఎలా? ప్రజలలో 40శాతం దారిద్ర్యంలో ఓలలాడే ఈ దేశంలో ప్రభుత్వం జనాన్ని తాగుడునుంచి రక్షించ జూస్తున్నది గాని క్షీణ సంస్కృతి నుంచి రక్షించే ఆలోచన చెయ్యటంలేదు చెయ్యదు ప్రొహిబిషన్‌లో సారాపెట్టుబడి దార్లకు అపారమైన లాభాలున్నాయి క్షీణసంస్కృతిలో కూడా అంతే అందుచేతనే రెంటికీ అధికారుల మద్దతు!

ప్రజాభిప్రాయం ఒక తీవ్ర సమస్య ఇది ఒక ప్రాంతానికి సంబంధించినది కాదు దేశమంతటా, చదువు వున్నవారిలోనూ చదువుకోనివారిలోనూ సామాజిక చైతన్యం పెంపొందించే సాంస్కృతికోద్యమం కావాలి నరకంలో ఉన్నవాడు కూడా చైతన్యం

లోపించినప్పుడు తాను జీవిస్తున్నదే సహజ జీవితమనీ, అందులోనే హెచ్చు ఆధ్యాత్మిక విలువలున్నాయనీ తనను తాను నమ్మించుకోవచ్చు గతచరిత్రను గురించీ, ప్రపంచ వర్తమానస్థితి గురించీ ప్రజలకు వాస్తవం తెలియాలి ఒక బృహత్పథకం అవసరమనిపిస్తుంది కొద్ది పద్యాలూ, సిద్ధాంతాలు నెమరు వెయ్యటమూ లాంటి ప్రక్రియలవల్ల కలిగే ప్రయోజనం చాలా పరిమితమైనది ఆశావాదం మంచిదే నిరాశావాది నిర్మూలన అవుతాడు కాని ఆశావాదం కూడా భౌతికమైన ఆధారాలు చూసుకొని ముందుకు పోవాలి, గాలిలో పల్టీలు కొట్టరాదు

**విప్లవ పరిస్థితులు**

1 విస్తృతంగా అట్టడుగు ప్రజలలో దారిద్ర్యం

2 ఉన్నత వర్గంవారు చేసిన శాసనాలను ఉల్లంఘించి, "నేరస్థులు" కాకుండా అసంఖ్యాకులు తమ కనీసావసరాలు గడుపుకోలేని దశ

3 ఆ వర్గంవారు తమ నాగరికతకు చిహ్నాలుగా చెప్పుకునే సంపదతో అట్టడుగు వర్గానికి ఎలాటి స్పర్శా లేకపోవడం (పత్రికలలో రోజూవచ్చే టెలివిజన్, రేడియో, టేప్‌రికార్డర్, హైక్లాస్ దుస్తులు, యంత్ర పరికరాలు, సౌందర్య సాధనాలు నూటికి 80 మందికి ఏవిధంగానూ పట్టవు )

4 శ్రమ జీవులు తాము తమ శ్రమ శక్తితో ఉత్పత్తి చేసే సంపదలో తమ అవసరాల మేరకు పాలుపంచుకోలేక పోవటం (తిండికి మాడే వ్యవసాయకులూ, ఆకాశసౌధాల నిర్మాణానికి తోడ్పడి పేద కొంపలలో ఉండే తాపీవాళ్ళూ, సిల్కు బట్టలు నేసి నూలు బట్టలు కట్టేనేతవాళ్ళూ వగైరాలు )

5 తమ దేశం అంతర్జాతీయంగా ఎంత కీర్తి సంపాదించినా అట్టడుగు వాళ్ళ స్థితిలో ఎలాటి మార్పూ లేకపోవటం

6 అట్టడుగు వర్గం పట్ల అత్యాచారాలు చెయ్యటం కోసం తమ చట్టాలనూ, నియమాలనూ తామే ఉల్లంఘించి, అదే సమయంలో ఆ నియమాల ప్రయోజనం అట్టడుగు వారికి అందకుండా చెయ్యటం

ఇలాంటి లక్షణాలను మరికొన్నింటిని కూడా చూపవచ్చు కాని ప్రధానమైనది ఈ జాబితాకాదు, ఈ లక్షణాలు ప్రత్యక్షంగా కనిపించే సమాజంలో విప్లవ చైతన్యం కార్చిచ్చులాగా చెలరేగకపోవటం! ఈ పరిస్థితులకు చలించని వారు ఇక దేనికీ చలించరు

చాలా ఏళ్ళక్రితం నన్ను కొందరు విరసం సభ్యులు విప్లవకథలు ఎలా ఉండాలని అడిగితే, జీవితంలో వాస్తవ విప్లవ పరిస్థితులను గురించి రాయమని సలహా ఇచ్చాను నిజానికి అటువంటి రచనల వల్ల రెండు రకాల లాభం ఉన్నది జీవిత సంఘర్షణకు ఎడంగా బతుకుతున్న నాబోటి మధ్య తరగతి వాడికి అట్టడుగు ప్రజల జీవితంతో పరిచయం కలుగుతుంది దానితోబాటు సంఘ దురన్యాయం గురించి, ఆ దురన్యాయానికి గురికాని వాళ్ళు మళ్ళీ మళ్ళీ తెలుసుకుంటూ ఉండవచ్చు పడక గదుల్లో పతాకసన్నివేశాలు చూపించే సాహిత్యం మతం కన్న కూడా ఘాటైన నల్లమందు కద!

ఈ రెండు ప్రయోజనాలనూ తిరస్కరించే మధ్యతరగతి సంస్కృతిలో ఎంతవరకు సామాజిక చైతన్యం ఉన్నదీ సరిగా అంచనావేసి, వారికి ఏ విధమైన సంస్కృతి గాని ఉన్నట్టు నటించడం

మానాలి  ఈ వర్గంలో చైతన్యం కలిగించటానికి విప్లవ సాహిత్యం మార్గాలు చూడటం అవసరమేమో

విప్లవ కళాకారులు కొన్ని పాతరూపాలను ఉపయోగించటం గురించి నాకు సందేహాలున్నాయి  బుర్రకథలూ, ఇతర "జానపద" కళారూపాలూ వాస్తవికతకు ఉత్తమ సాధనాలు కావు  సామాన్య ప్రజలకు సన్నిహితంగా ఉన్నట్టు భావనకలిగించే రూపాలు చాలావరకు ఇతర వర్గాల గత చరిత్రలను, పురాణగాధలను ప్రచారం చెయ్యటానికి ఉపయోగించాయి  నిజానికి వాస్తవికతను బూర్జువా కళలు ఎక్కువగా చిత్రించాయి  విప్లవ కళలు ఎక్కువగా సాధించాలి

సామాన్య ప్రజలకు వాళ్ళ జీవితాన్ని ఈపాత కళారూపాలలో ప్రదర్శించటంలో ప్రయోజనం ఉండదు  వాళ్ళు తమ జీవితం వెనక ఉన్న నిజాన్ని తెలుసుకోవటానికి కళలు ఉపయోగపడాలి మధ్య తరగతి వాళ్ళకు జనసామాన్యం జీవితం గురించి స్థూలంగా తెలుసుకోవటమే ఒక అనుభవం!

రాజకీయ విప్లవాన్ని ప్రతిఘటించ దలచిన వాడు విప్లవ రచయితనని ముందుకు రావటంలో అర్థంలేదు  కాని రాజకీయ విప్లవ పంథాలు అనేకం ఎదుట కనిపించినప్పుడు విప్లవ రచయిత సూటిగా ప్రజల దగ్గిరికి పోకుండా, ఏదో ఒక రాజకీయ విప్లవ రథాన్ని ఎక్కి వీరంగం వేసుకుంటూ ప్రజల దగ్గిరికి పోయేకన్న, కలం అవతల పారేసి తుపాకి పట్టటం మేలు

ఆఖరుకు ఒక్క హెచ్చరిక  విప్లవ పరిస్థితులు సమాజంలో ఎంత ప్రమాణంలో ఉన్నదీ సరిగా అంచనావేసి, అందుకు అనుగుణమైన చైతన్యం ప్రజలలో విప్లవ కళాకారుడు పెంపొందించిన దాకా విప్లవ రాజకీయ కార్యక్రమం ఆచరణకు రాదు  పరిస్థితులకూ, ఆచరణకూ మధ్య చైతన్యం వారధి  వాస్తవ విప్లవాలు ప్రారంభమయేది భావరంగంలోనే  ఆయుధాలు పట్టి విప్లవం చేసేవాళ్ళు కూడా ముందుగా చైతన్యం పొంది ఉండినవారే

సృజన మాసపత్రిక మే 1979

# 13. మధ్య తరగతుల స్వరూపాలు

బహువచనం దేనికని కొందరికి సందేహం కలగవచ్చు  మనిషి ఆరోగ్యానికి ఎంతో అవసరమైన విటమినులలో "బి గ్రూపు" లాగా మధ్య తరగతిలో అనేక పొరలున్నాయి– ఈ తరగతి సమాజం యొక్క ఆరోగ్యానికి అవసరమా, కాదా అన్న విషయంలో అభిప్రాయ భేదాలున్నాయని ఒప్పుకోక తప్పదు

మన పాతకాలపు వాళ్ళు ప్రతిదాన్నీ "ఇది బ్రహ్మసృష్టి, ఇది విశ్వామిత్ర సృష్టి" అని వర్గీకరించేవాళ్ళు  ఇదే మాదిరి సందేహం మధ్యతరగతిని గురించి కూడా కలగవచ్చు ఆదిమ సమాజాలలో మధ్యతరగతి అంటూ లేదు  యాభై ఏళ్ళక్రితం నేను బెనారస్‌లో చదువుకున్నప్పుడు కూడా అక్కడి వాళ్ళకు మధ్యతరగతి అంటూ ఉన్నదని తెలీదు  నన్ను పై తరగతివాణ్ణి అని యు పి  భయ్యాలు అపోహపడ్డారు  అవే రోజుల్లో తెలంగాణాలో కూడా నన్ను పైతరగతివాడని భ్రమపడ్డారు  అక్కడా మధ్యతరగతి అంటూ స్థానికంగా లేదు కాబోలు దీన్ని బట్టి మధ్యతరగతి "విశ్వామిత్ర సృష్టి" అయి ఉండవచ్చు ననిపిస్తుంది  అయినా విశ్వామిత్ర సృష్టికి వచ్చిన న్యూనత ఏమీలేదు  అడవి జాతులకన్న పెంపుడు జాతులు చాలా మెరుగు

వన్య ఫలాల కన్న కృత్రిమంగా తయారైన ఫలాలు చాలా రెట్లు మేలైనవి ఈ విషయంలో కూడా మధ్యతరగతి యొక్క ప్రాశస్త్యం గురించి అభిప్రాయ భేదాలకు అవకాశం ఉన్నది దీన్ని ఒక విధమైన సంకర తరగతి అని కొందరు అంటున్న మాట కూడా కాదనటానికి వీల్లేదు

ఉల్లిపాయ తాలూకు అంతస్సత్యం దాని పొరలన్నీ ఊడదీస్తే బయటపడినట్టు, మధ్యతరగతిని మరీ శ్రద్ధగా విశ్లేషణ చేస్తూ పోతే ప్రతి వ్యక్తీ ఒక ప్రత్యేక మధ్యతరగతి అయే ప్రమాదం ఉన్నది అందుచేత మన రిసర్చి మూడు, నాలుగు మధ్యతరగతి "బొత్తు"లకు పరిమితం చేద్దాం

మధ్యతరగతిలో అట్టడుగు పొర ఇంగువ కట్టిన గుడ్డ అందులో ఇంగువ వాసన తప్ప ఇంగువ ఉండదు దానికున్నదంతా గతమే-వర్తమానమూ, భవిష్యత్తూ అంతగా ఉండవు కాని అది హీనతరగతి స్థాయిని చూస్తూ, చూస్తూ ఒప్పుకోదు ఈ పొరకు చెందిన గృహస్థు తన కొడుకులు శ్రామికులు కావటానికి ఒప్పుకోడు-డబ్బుకోసం వాళ్ళు ఏ అక్రమాలు చేసినా ఒప్పుకుంటాడుగాని అతని దృష్టిలో డబ్బుకోసం అక్రమాలు చెయ్యడం ఉన్నత వర్గ లక్షణంగా కనిపిస్తుంది అందుకనే డబ్బుగల వాళ్ళ అవినీతి చర్యలనూ, అధర్మవర్తననూ అతను పట్టించుకోడు శ్రమచేసి బతకటం గురించే అతనికి నిజంగా తీవ్రమైన అభ్యంతరం శ్రామికులు దోపిడీకి గురి అవుతున్నారన్నది అతనికి తెలియకుండానే తెలుసు! సామాజిక దోపిడీని గురించి నిలదీసి అడిగితే మాత్రం అలాటిది ఉన్నదని ఒప్పుకోడు అది కారల్ మార్క్స్ కల్పన అంటాడేమో!

ఈ శాల్తీకి తన వాస్తవ పరిస్థితి గురించి అంతగా తెలీదు వాళ్ళ తాతలు నేతులు తాగిన స్థితిలోనే తాను కూడా ఉన్నాననుకుంటాడు నేతులు ఏమయాయని ఆశ్చర్యపడతాడు! ఇదేదో తాత్కాలికంగా ఏర్పడిన స్థితేగాని, తిరిగి మళ్ళీ నేతులు తాగే రోజులు వస్తాయని తనను తాను నమ్మించుకోటానికి ప్రయత్నిస్తాడు

ఇతని సమస్యలు ఇతని విశ్వాసాలను నిర్ణయిస్తాయి విప్లవాలు చాలా అసహ్యం శ్రమజీవులే వాటిని సమర్థిస్తారు కాని శాంతియుత సోషలిజం వస్తుంది అప్పుడు కటిక దారిద్ర్యం ఉండనవసరంలేదు కార్మికులు సమ్మెలు చేయనవసరంలేదు నిరుద్యోగం ఉండనవసరంలేదు కట్నాలు చాలా చెడ్డవి లంచాలు కూడా చెడ్డవే సోషలిస్టులు వీటిని సాగనియ్యరు పిల్లలకు బళ్ళలో సీట్లూ, ఆడపిల్లలకు మొగుళ్ళూ డబ్బుకు దొరకటం-అందులోనూ అంతంత మొత్తాలకు! చాలా అన్యాయం

దీనికి పై పొరలో ఉండేవాడి రంగూ, రుచీ వేరు వాడు గతం గురించి లొట్టలు వేయడు వీడి గతానికి వర్తమానానికీ పెద్ద తేడాలేదు వాడి ప్రపంచం సుస్థిరంగా ఉంటూ వొస్తున్నట్టే కనబడుతుంది భవిష్యత్తుగురించి ఆలోచించటానికి వీడు భయపడడు అయినా తన చిన్నతనం నాటి పరిస్థితులు-తనచదువూ, వెచ్చాల ఖర్చులూ, ఇళ్ళ అద్దెలూ వగైరా- ఇంతగా మారకుండా ఉంటే బాగుండేవని అంటూంటాడు మార్పు సహజమని సరిపెట్టుకుంటాడు దేశంలో ద్రవ్యోల్బణం ఏ ప్రమాణంలో ఉంటే తన రాబడి పెరుగుదల కూడ అదే రేటులో

ఉంటుందని ఆశిస్తాడు కాకపోతే, తన చిన్నతనంకంటే ఈనాడు పలుకుబడి గలవాళ్ళ ప్రాపు అధికంగా కావాలి లేకపోతే పనులు జరగవు

రాజకీయంగా వీడిది కాంగ్రెసు రంగు దేశం స్వతంత్రం అయిన నాడు దేశ ప్రజలందరూ స్వతంత్రులైనారని వీడి నమ్మకం "బ్రిటిషు వాళ్ళ కాలంలోనే బాగుండేది1" అని అన్నవాళ్ళందరూ వీడి దృష్టికి దేశ ద్రోహులల్లేనూ, కాంగ్రెసు పట్ల కృతజ్ఞత లేని వాళ్ళ లాగానూ కనబడతారు వీడికూడా కాంగ్రెసు మార్కు సోషలిజంలో నమ్మకం ఉంది సోషలిజం వస్తే తన ఆర్థిక స్థాయి పెరుగుతుందని కాదు, తరగదని! వాడికి అర్థంకానిదల్లా ఒకటే, ఒకప్పుడు తన జాతిగా ఉండిన వాళ్ళలో కొందరు కమ్యూనిజంను ఎలా నమ్ముతున్నారు? వాళ్ళు మానసికంగా పతనం అవుతున్నారనే వీడి నమ్మకం అయినప్పటికీ, కమ్యూనిస్టు పార్టీ చీలినప్పుడు కమ్యూనిస్టు-మార్క్సిస్టుల కన్న మితవాద కమ్యూనిస్టులు ఫరవాలేదనుకున్నాడు మార్క్సిస్టు లెనినిస్టులు అవతరించాక, అబ్బా మార్క్సిస్టులు మరీ అంత చెడ్డవాళ్ళు కాదనుకున్నాడు

తరవాత మధ్య మధ్యతరగతి వాణ్ణి తీసుకుందాం వీడికి తన వర్తమానం గురించి అసంతృప్తి లేదుగాని, ఇది మన్నుతుందన్న నమ్మకం అంతగా లేదు సమాజంలో మార్పులు వీడికి అంతో ఇంతో అర్థమవుతాయి నిజమైన భద్రత కావాలంటే తాను నిలబడి ఉన్నది జారుడు మెట్టు తనకు స్వాతంత్ర్యం ఉన్నదన్న భ్రమ వీడికి లేదు తన జీవితంలో అడుగడుగునా ప్రభుత్వం ఎలా జోక్యం కలిగించుకుంటున్నదో వీడికి తెలుసు అధికారుల అత్తగారి ఆడాలేకుండా వీడు ఏ వ్యాపారమూ చెయ్యలేదు ఏ ఆస్తీ సంపాదించలేదు ఆఖరుకు కావలసిన బియ్యమూ, చక్కెరా కూడా కొనుక్కోలేదు స్వాతంత్ర్యానికి ముందు ఏ అధికారులూ తన జీవితాన్ని ఇలా కెలికి ఎరగరు- స్పష్టంగా తన స్వేచ్ఛ స్వాతంత్ర్యంతో దెబ్బతిన్నది

అయినా వెనక్కు తిరిగి చూడకు ఎందుకంటే, వెనకటి జీవితంలో కదలిక లేదు ఈనాటి జీవితంలో ఉన్నది ప్రవాహాన్ని అందుకో గలిగావంటే ముందుకు సునాయాసంగా పోగలవు ఎదురీదితే ఉన్న చోటుకూడా పోతుంది అందుచేత భవిష్యత్తుకేసి చూడు నీవు కోరే భవిష్యత్తు వర్తమానంగా గల వాళ్ళను చూసి, వాళ్ళను అనుసరించు అందులో శ్రీరంగనీతులు కట్టిపెట్టెయ్యి చట్టాలు, శాసనాలు నీకోసమే అనుకుని, వాటిని పాటించావో అధోగతే! అవి తనకోసం కాదనుకుని, ధిక్కరిస్తున్న వాళ్ళే ముందుకు పోతున్నారు వందల మీద రాబడి పన్ను ఎగగొట్టే వాళ్ళకన్నా కోట్లమీద ఎగగొట్టే వాళ్ళు ఎక్కువ భద్రంగా ఉన్నారు విప్లవాలు చేసే వాళ్ళకన్నా హంతకుల గౌరవం హెచ్చు నీవు ఇల్లు కట్టటానికి ప్లానుసమర్పిస్తే ఆరునెల్లక్కూడా అంతూ, పొంతూ ఉండదు ప్లాను లేకుండా కట్టి, ఇవ్వవలసిన వాళ్ళకు "పార్టీ" ఇచ్చేవాడి పని హాయి లంచాలుగురించి ధర్మపన్నాలు చెప్పకు లంచాలు వచ్చే చోట పుచ్చుకో, ఇచ్చేచోట ఇచ్చుకో! అవతల వాడి అసహాయతే నీ అదృష్టం మత్స్యన్యాయం అంటారు ఈనాడు మత్స్యన్యాయానికి తప్ప ఏ ఇతర న్యాయానికీ చోటులేదు దేశాన్ని పాలిస్తున్నది అశోక మౌర్యచక్రవర్తికాదు, మరిచి పోకు

రాజకీయాలా? నీ పైవాడి రాజకీయాలే నీ రాజకీయాలు ముందుకు చూడాలంటే పైకి చూడాలి- దిక్కులు కొంచెం అస్తవ్యస్తంగా ఉన్నాయి మరి! పైవాడు సోషలిజం అంటే నువూ

అను శ్రామికులూ, కార్మికులూ లోఫర్లు అని పైవాడంటే నువూ అను ప్రతి దరిద్రపు వెధవా పనిచేసినందుకు రెండుపూటలా తినటానికి జీతం కావాలనటం తప్పని ఒప్పుకో దేశంలో సగంమంది కాదుగదా తొంభైశాతం తిండికి మాడినా నీవు మిగిలిన పది శాతంలోనే ఉండు దరిద్రుడి పట్లా, దోచుకోబడే వాడి పట్లా సానుభూతి చూపావో–తథాస్తు దేవతలున్నారు జాగ్రత్త!

వీడి సామాజిక దృష్టి అల్పసంఖ్యకు పరిమితమై ఉంటుంది "నలుగురితోపాటు నారాయణ!" అన్నది వీడికి రుచించదు సంఘ వ్యతిరేకత అనేది వీడి దృష్టిలో తప్పుకాకపోగా, గొప్ప సుగుణం విషయలౌల్యం తప్పుకాదు డబ్బుంటే అనుభవించు, కార్లు కొను, టీవి సెట్లూ, రేడియోలు కొను ఏర్‌కండిషనింగ్ అనుభవించు ఖరీదైన మద్యాలు తాగు సెక్సు కొనుక్కో సెక్సును ప్రేరేపించే మందులు వాడు డబ్బుతో లభించే సుఖాన్ని "సంఘం" కోసం వదులుకోకు నూటికి తొంభైమంది నీ జీవిత విధానం గురించి ఏమని తలుస్తారన్నది అనవసరం

పైకి చూస్తే ఏం కనబడుతుందో అదేనీ ఆదర్శం అన్ని సుఖాలూ అనుభవించేటంత డబ్బు నీకు లేక పోవచ్చు అయినా ఉన్నవాళ్ళనే నువు సమర్థించు కిందికి చూశావో కళ్ళు తిరిగి పడిపోగలవు జీవిత ప్రవాహం నిన్నుకొంత ముందుకు నెట్టుకొచ్చింది పెద్ద కెరటాన్ని అందుకున్నావో నువు కూడా పైకి పోతావు నీ సాటివాళ్ళు అలా పైకి పోవటం నువు కళ్ళారా చూశావు గద!

ఇంక మిగిలి ఉన్నది మధ్యతరగతి పైపొర రాజకీయ శక్తులు చేతిలో ఉంటే ఇది పై తరగతే వాడి శక్తులన్నీ ఆర్థికంగా గట్టెక్కటానికే సరిపోయాయి అయినా వీడికి పై తరగతి అంటే భయంలేదు ఆర్థికంగా తన సహాయం కోరేవారు పైతరగతిలో–అంటే రాజకీయంగా పలుకుబడి కలవారిలో ఉంటారు పై తరగతివాళ్ళు నీ స్నేహమూ, సహాయమూ అప్పుడప్పుడు ఆర్థిస్తారు తమ బంధువర్గంలో ముఖ్యులకు తాము బతుకుతెరువు చూపగలరు, కాన అముఖ్యులకూ, తమను ఆశ్రయించిన వారికీ బతుకు తెరువు చూపే భారం నీమీద వేస్తారు నువు వేసుకుంటావు ఎందుకంటే పై వర్గానికి వెనుక తట్టు–అంటే కిందితట్టు, ఇక్కడా దిక్కులు తారుమారే!– కాచే పూచీ నీది! అవసరం వస్తే వాళ్ళు తమ పాపాలకు నిన్ను బాధ్యుణ్ణి చెయ్యగలరు దాన్ని నువు అర్థం చేసుకోనూ గలవు

మరీ అజాగ్రత్తగా ఉండి, బేహూష్ అయిపోయి, నువే పైతరగతి అనుకొని ప్రవర్తిస్తే తప్ప సాధారణంగా నిన్ను ఏ శాసనమూ బాధించదు అన్ని శాసనాలలోనూ నువు దూరిపోయే పాటితూట్లు ఉన్నాయి చట్టం దగ్గరికి వచ్చే సరికి నువు మహా సూక్ష్మజీవివి! కర్మ చాలక ఒకవేళ నువు న్యాయానికి దొరికి పోయినా, జైళ్ళలో కూడా నీకు రాజోపచారంగా జరిగిపోతుంది నువు బయటికి వచ్చిన మర్నాడు నీ జైలు ప్రవర్తన ఎవరూ ఎత్తరు అందరూ ఏమీ జరగనట్టే నీతో వ్యవహరిస్తారు ఎంతపడ్డా నువు మెత్తల మీద పడతావు తప్ప, నీకు బొప్పికట్టే ప్రమాదం ఉండదు ఒక్క ప్రజావిప్లవానికే నువు భయపడవలసి ఉంటుంది అప్పుడు నీపై తరగతి వాళ్ళే మట్టికొట్టుకుపోవచ్చు గనక, "ముశకానాంతు కాగతిః?" అని సరిపెట్టుకోవచ్చు

యువ, మాసపత్రిక, ఏప్రిల్,1980

# 14. ప్రజా స్వామ్యం అంటే ఏమిటి?

ఈ దేశంలో వోటువేసే హక్కున్న కోట్లాది జనంలో ఎక్కువ మందికి ప్రజాస్వామ్యం అంటే ఎలెక్షన్లు! ప్రజలు తమను తాము పరిపాలించు కోవటం ప్రజాస్వామ్యమైతే అది దేశంలో సాధ్యమని ఎవరూ ఒప్పుకోరు

ఎందుచేత?

ఎలెక్షన్లకు ఎవరు నిలబడాలో ప్రజలు నిర్ణయించరు రాజకీయ పార్టీలు నిర్ణయిస్తాయి కాని ఎన్నికలు అయినాక గెలిచినవాడు పార్టీ ఫిరాయించకుండా ఎవరూ ఆపలేరు

కొంతమంది, తుమ్మి తామే చిరంజీవ అనుకున్నట్టు, "ప్రజల తరఫున" తమను తామే నిలబెట్టుకుంటారు వీళ్ళు స్వతంత్రులు-వీళ్ళలో కొందరు గెలుస్తారు కూడా

ఎటొచ్చీ ప్రజల పాత్ర ఏమిటంటే ఎవరో అభ్యర్థులుగా నిర్ణయించి నిలబెట్టిన వారిలో తమకు తోచినవాడికి వోటు వెయ్యటం!

పోనీ, ఇదైనా ప్రజాస్వామ్యం అవుతుందా అంటే ప్రజాస్వామ్యం ఇంత కన్న కూడా తక్కువ

ఎందుచేతా?

మాటవరసకు ఒక నియోజకవర్గానికి ఇద్దరూ, ముగ్గురూ నిలబడుతున్నారనుకుందాం తీరా ఎన్నికల ముందు వారిలో ఒకడు మిగిలిన వాళ్ళను కొనేసి, పోటీ నుంచి విరమింపజేస్తే, వోటింగు జరగటానికి చాలారోజులు ముందే వాడు "ఎన్నికై" కూర్చుంటాడు వాణ్ణి ప్రజలు ఎన్నుకున్నారని వాదించటం తేలికకాదు

డబ్బుకు అమ్ముడై, అభ్యర్థులు పోటీనుంచి విరమించుకుంటారనటం అన్యాయ మనుకోండి ఆర్థికలాభం కోసం కాకపోతే ఎన్నికలకు నిలబడటం ఎందుకు? దేశభక్తా? ప్రజాభిమానమా?

ఇలాంటి చిల్లరమల్లర కేసులు వదిలేస్తే, హెచ్చుమంది అభ్యర్థులు ఏవో రాజకీయ పక్షాల తరఫున నిలబడతారు గనక, వోట్లు వేసేవాళ్ళు రాజకీయ పక్షాలకు వోటు వెయ్యటం వరకైనా ప్రజాస్వామ్యం అనిపించుకోదా?

దానిక్కూడా పేచీలున్నాయి

ఈనాడు వ్యక్తులు తప్ప పార్టీలు లేవు తానే కాంగ్రెసుననీ, తాను వినా వేరే కాంగ్రెసు అంటూ లేదనీ ఇందిరాగాంధీ చాలాసార్లు నిరూపించింది కాంగ్రెసు ఎవరిని నిలబెట్టినా, కాంగ్రెసుకు వోటువేసేవారు ఇందిరకూ, సంజయగాంధీకి వోటువేస్తారు

ఇది కొత్త పరిణామమేమీ కాదు బ్రిటిషు వాళ్ళు దేశాన్ని ఏలుతున్నప్పుడే నెహ్రూ, "కాంగ్రెసు తరఫున చీపురు కట్టను నిలబెట్టి గెలిపిస్తాను!" అని సవాలు చేశాడు

స్వాతంత్ర్యం వచ్చినాక కూడా ఆంధ్రలో ఎన్నికలకు కాంగ్రెసు అభ్యర్థులుగా నిలబడినవారు, మీటింగులలో, "అయ్యా, నా ముఖం చూసి వోటు వెయ్యొద్దు! ఆ నెహ్రూగారి ముఖంచూసి నాకు వోటు దయచేయించండి!" అని అడిగిన సందర్భాలు పత్రికలలోనే వచ్చాయి

అప్పటికీ ఇప్పటికీ తేడా ఏమంటే బహునాయకత్వం హెచ్చింది "జరగబోయే ఎన్నికలలో ఏ పార్టీ గెలవాలా అని కాదు, ఎవరు ముఖ్యమంత్రి కావాలా అనే నిర్ణయించటానికి!" అని హిందూ విలేఖరి 27మే పత్రికలో రాశాడు

కిందటి లోక్‌సభ ఎన్నికలప్పుడు కూడా "ఎవరు ప్రధాని కావాలి? ఇందిరాగాంధీయా? జగజీవన్‌రామా? దేశాయా? చరణ్‌సింగా?" అన్న "ఇస్స్యూ" మీద ఎన్నికలు జరిగాయి

అందుచేత ఇవి రాజులను ఎన్నుకునే ఎన్నికలు కాకపోతే ఏమిటంటే వారసత్వంగా రావలసిన పరిపాలనా హక్కు ప్రజల వోట్లద్వారా నిర్ణయించటం జరుగుతున్నది ఇది అనవసరమని చాలా మంది రాజకీయవేత్తలే భావిస్తున్నారు దివంగతుడైన రాజకీయవేత్త నెహ్రూకూ, నెహ్రూ కుమార్తెకూ జోహార్లు అర్పిస్తూ ఆవిడ కుమారుడికి అడ్వాన్సుగా జోహార్లు అర్పించారు కొందరు తప్పుపట్టారు కాని ఈ దేశ ప్రజలు వారసత్వం ఆమోదించినంత తేలికగా వ్యక్తుల అర్హత నిర్ణయించలేరు

అందుచేత కేంద్రంతోబాటు ప్రాంతీయంగా కూడా వారసత్వాలు ఏర్పాటైతే మన దేశానికి కావలసిన ఆదర్శ ప్రజాతంత్రం దానంతట అదే ఏర్పడుతుంది ఎమర్జెన్సీని సుస్థిరమూ, శాశ్వతమూచేసి, అడపాదడపా ఎన్నికలంటూ పెట్టటం మానేసి, బోలెడంత పెట్రోలు ఖర్చూ, పోస్టర్లగోడల ఖరాబూ, ఎలెక్షను హత్యాకాండలూ లాంటివి తగ్గించుకోవచ్చు

ఎలెక్షన్లు లేకుండా పోతే కోటీశ్వరులూ, లక్షాధికార్లూ రాజకీయ పార్టీలకు ఆర్థిక సహాయం చెయ్యటమూ, దానికి అనేక రెట్లు రాబట్టటమూ, వస్తువుల ధరలు పెంచటమూ, వోట్లకోసం గడ్డి తిని పార్టీలవాళ్ళు ధరలు తగ్గిస్తామని ప్రజలకు తెలిసి అబద్ధాలు చెప్పటమూ, దేశమంతటా అబద్ధపు బతుకూ, హైరానా బ్రతుకూ అయిపోవటమూ! ఎందుకొచ్చిన ప్రజాస్వామ్యం? ఎందుకొచ్చిన ఎన్నికలు?

రాజకీయాలలో రెండేవాస్తవాలున్నట్టు కనిపిస్తుంది ప్రజల నెత్తురు పాలకులు తాగటమో, పాలకుల నెత్తురు ప్రజలు తాగటమో! ఇటువంటి పరిస్థితి ఎందుకు ఏర్పడిందంటే చెప్పటం తేలిక కాదు, కాని ప్రపంచమంతటా ప్రభుత్వాలు ప్రజావర్గాలను వేటాడటమూ, ప్రజావర్గాలు ఆయుధాలు సంపాదించి తమకు చేతనైన హత్యాకాండ తాము సాగించటమూ కనబడుతున్నది

అందుచేత–ఎలెక్షన్లు ! డౌన్!డౌన్!

యువ, మాసపత్రిక, జులై 1980

పునర్ముద్రణ: కళలు–శాస్త్రీయ విజ్ఞానం–విరసం ప్రచురణ, సెప్టెంబరు, 1980

# 15. బావుటాలు ఎగురుతున్నాయి

మనదేశంలో ఉన్నన్ని పండగలు ప్రపంచంలో మరే దేశంలోనూ లేవుట మనదేశంలో ఉన్నన్ని ఉద్యమాలు ఏ దేశంలోనూ లేవని చెప్పవచ్చు పండగలకు కారణం, పూర్వ శిలాయుగంనుంచి వస్తున్న ఏ అమ్మవారినీ వదులుకోకుండా కొత్త దేవతలను చేర్చుకుంటున్నాం మన దేవతలలో వేటకాలపు దేవతలూ, పశుపోషకుల దేవతలూ, రాజరికపు దేవతలూ, ధనయుగపు దేవతలూ, రానున్న కల్కి, మళ్ళీ పుట్టనున్న బుద్ధుడూ కూడా ఉన్నారు

ఇక ఉద్యమాల మాటకు వస్తే, ఇవి పాపం పెరిగినట్టు, లేదా జనాభా పెరిగినట్టు, ఇదీ కాదంటే నిరుద్యోగులూ, దారిద్ర్యమూ పెరిగినట్టు పెరగడానికి అనేక కారణాలున్నాయి మనం నాగరికతను అరువుతెచ్చుకోవటంలో లాగే ఉద్యమాలను అరువు తెచ్చుకోవటంలో అందెవేసిన చేతులం బీటిల్స్ సంగీతమేమిటి, నైరూప్య చిత్రకళ ఏమిటి, అబ్సర్డ్ డ్రామా ఏమిటి, దాన్ని అరువు తెచ్చుకోవటంలో మనంత శీఘ్రంగా పరిగెత్తేవాళ్ళు ప్రపంచంలో మరెవరూ లేరు (వీటికి కూడా గోల్డ్‌మెడల్స్ ఉంటే బాగుణ్ణు!)

మన ఉద్యమాలు అసంఖ్యాకంగానూ, ప్రజా జీవితంతో ఎలాటి సంబంధం లేనివిగానూ, గమ్యరహితంగానూ, నిష్ప్రయోజనంగానూ ఉండటానికి ఇది –అరువు కొట్టుడు–ఒకటి మాత్రమే

మరొక కారణం, మనం చేపట్టే ఉద్యమాలు చిరంజీవులు వాటికి కాలదోషం పట్టటమంటూ ఉండదు సంస్కరణోద్యమాలు దాదాపు అన్నీ అలాంటివే సిద్ధాంత రీత్యా వీటికి లక్ష్యం ఉంటుంది కాని శతాబ్దాల తరబడి అది సిద్ధించని కారణంచేత, ఉద్యమంతో పని తీరదు

వేదకాలపు సంస్కృతి వెనకబడిన అనంతరం బ్రాహ్మణులు తమ యాజమాన్యం కింద నెలకొల్పబడిన చాతుర్వర్ణ్యం సమాజ పురోభివృద్ధికి గుదిబండగా పరిణమించినది మొదలు వర్ణవ్యవస్థకు విరుద్ధంగా నా తలవెంట్రుకలన్ని ఉద్యమాలు బయలుదేరాయి కాని పని జరగలేదు తిరుగుబాటు చేసిన వారు వేరు వేరు మతాల వారుగా మిగిలారు కొన్ని మతాలు (శైవా, వైష్ణవ లాంటివి) కులవ్యవస్థలను ఆమోదించి హిందూ మతంలోకి సిగ్గుల పెళ్ళికూతుళ్ళలాగా తలలు వంచుకుని తిరిగివచ్చాయి అవి హిందూమతంలోనే అంతశ్శాఖలుగా మిగిలివున్నాయి కొన్ని మతాలు (విశ్వబ్రాహ్మణులలాంటివి) హిందూ సమాజంలో ప్రత్యేక కులాలు అయాయి

లక్ష్యానికి తగలని ఉద్యమానికి చావు ఎందుకుంటుంది? ఈ రహస్యం మన భారతీయులకు తెలిసినట్టు మరేదేశం వారికీ తెలీదు

ఆడవాళ్ళకు సంబంధించిన ఉద్యమాలు చూడండి వాళ్ళు చచ్చిన మొగుళ్ళతోపాటు చితిమీద కాలిపోవటం నిషేధిస్తూ ఉద్యమం నడిచింది ఆ ఉద్యమం నెగ్గినట్టు కనబడింది కారణం స్త్రీలను ఉద్ధరించాలని మనలో కలిగిన జ్ఞానవికాసం కాదు వితంతువులు జీతం అడగని వెట్టివాళ్ళు ఆర్థికంగా దోచుకునేటందుకు పనికివచ్చే శ్రమజీవులు దానికి కోరికలు లేవు కన్నులు లేవు మెట్టినింటి వాళ్ళకు విధవ కోడలు పాడి ఆవు! అమెరికాలో బానిస విధానం అంతంకావటానికి కారణం భూతదయకాదు పెరిగి వస్తున్న పారిశ్రామిక దేశాల్లో బానిసల

కంటె కార్మికులు చాలా చౌక! బానిస అవసరాలకు యజమాని బాధ్యుడు, "స్వేచ్ఛ" గల కార్మికుడి దారిద్ర్యానికి పారిశ్రామికుడు బాధ్యుడు కాడు! సతీ సహగమన నిషేధం కూడా అలాగే జరిగింది

ఆడవాళ్ళకు మొగుళ్ళతో పాటు దహనం చెయ్యటం పోయిన రెండు శతాబ్దాల అవతల కట్నం తేలేదని ఆడవాళ్ళను మొగుళ్ళు బతికుండగానే కాల్చేస్తున్నారు! ఆడవాళ్ళ ఉద్ధరింపు ఉద్యమంలో వచ్చిన పరిణామం అంతా కలిపి ఇంతే!

స్త్రీ పునర్వివాహాలూ, స్త్రీ విద్యా, స్త్రీ స్వాతంత్ర్యమూ మొదలైన ఉద్యమాల సంగతి చెప్పకండి ఇంకో వెయ్యేళ్ళ తరవాత కూడా మనం ఈ ఉద్యమాలను ఉత్సాహంగా నడుపుతూ ఉండవచ్చు

ఇటీవల స్త్రీల సంవత్సరమనీ, బాలల సంవత్సరమనీ అందరూ జరుపుతూంటే మనమూ జరుపుకున్నాం కాని వాటికి లక్ష్యం ఉన్నదంటే మనం వాటి జోలికి పోయి ఉండం సహస్రాబ్దాల పాటు ఉద్యమాలు నడపగల భారతీయులకు ఒక్క ఏడాదిపాటు జరిగేది పేలపిండి అన్న సంగతి అంతర్జాతీయ సమితివారికి తెలీదు

కాని రాజకీయోద్యమాలూ, ప్రజలకూ ప్రజాజీవితానికీ అతిసన్నిహితమైన ఉద్యమాలూ ఉన్నాయి కావా అని అడగవచ్చు ఎందుకు లేవూ? ఉన్నాయి

మన దేశంలో రాజకీయ చైతన్యానికీ, అనేక రాజకీయ పార్టీలకు పుట్ట కుదురైన కాంగ్రెసును తీసుకోండి అది ప్రజా స్వామ్య బావుటానూ, సోషలిజం బావుటానూ ఎగరేసింది అది నిజంగా సోషలిజంకోసం ప్రయత్నించినా, కనీసం ధనికులకూ, దరిద్రులకూ మధ్య ఉండే వ్యత్యాసాన్ని తగ్గించినా, ఇంత కాలం బతికి ఉండునా? అలాగే కాంగ్రెసు పార్టీ యొక్క రాజకీయ పటుత్వమంతా వ్యక్తి ఆరాధన అనే ఒంటి స్తంభం మీద నిలబడి ఉండటం మనం చూస్తున్నాం ఇది ప్రజాస్వామ్యానికి సంబంధం ఎంతమాత్రమూ లేనిసంగతి అయినా సోషలిజం, డెమోక్రసీ నినాదాలు కాంగ్రెసుకు అంతులేని ఆయుర్దాయం పోశాయి ఆ లక్ష్యాలను దూరంగా ఉంచగలిగినంత కాలమూ కాంగ్రెసుకు ఢోకాలేదు కమ్యూనిస్టు పార్టీలైనా అంతే అవి కమ్యూనిజమునూ, విప్లవ భావాలను ప్రజలనుంచి దూరంగా ఉంచగలిగినంత కాలమూ వాటి మన్నిక గ్యారంటే రాజ్యాధికారం ప్రజల పరం కావటం కమ్యూనిస్టు పార్టీల లక్ష్యం ప్రస్తుతం ప్రజలకు గల వోటింగ్ హక్కుతోనే ప్రజలు తృప్తిపడి కమ్యూనిస్టు పార్టీలను బలపరుస్తున్నారు కాకపోతే కమ్యూనిస్టు పార్టీలలో తెగలు ఏర్పడి, వర్గ కలహాల లోనో, విప్లవ సమరాలలోనో ప్రాణాలు అర్పించవలసిన వాళ్ళు వర్గాంతర రాజకీయ విభేదాలకు బలి అయిపోతున్నారు ఇలాంటి చావులు కమ్యూనిస్టు రాజకీయ చైతన్యంలో భాగం అయినంత కాలమూ ప్రజల రాజ్యాధికారం హస్తగతం చేసుకుని లెఫ్టిస్టు ఉద్యమాలు మరో రూపంలోకి పరివర్తన చెందే ప్రమాదం లేదు

కమ్యూనిస్టుల ఉద్యమాల గురించి చెప్పుకున్నప్పుడు మార్క్సిస్టులను గురించి చెప్పుకోవటం విధాయకం అందరికన్నా బాగా చరిత్రను విశ్లేషించి ప్రజాసామాన్యాన్ని భవిష్యత్తుకేసి నడప గలిగే శక్తి మార్క్సిస్టు మేధావులకు ఉండాలి వీళ్ళు ప్రజలలో ఆదర్శ ప్రాయంగా పనిచేస్తే ప్రతి సామాన్య పౌరుడూ ఒక లెనిన్, లేక ఒక మావోలాగా తయారు కావచ్చు కాని అది

మార్క్సిజమును దుర్వ్యయం చెయ్యటం అవుతుంది అందుచేత మా మార్క్సిస్టు మేదావులు మామూలు పౌరులకు ఎంత మాత్రమూ అర్థం కాకుండా సందర్భశుద్ధి లేకుండా మార్క్స్ ఎంగెల్స్, లెనిన్, స్టాలిన్, మావోలు ఎందుకు, ఎప్పుడు అన్నవన్నీ ఏకరువుపెట్టి, మామూలు జనాన్ని అదరగొట్టేస్తారు ఆ తరవాత ఆ అట్టడుగు జనానికి, మా మార్క్సిస్టులలో అంతులేని గురి కుదురుతుంది జనానికీ మా మార్క్సిస్టులకూ ఉండే సంబంధం శంకరాచార్యులవారికీ, వారి భక్తులకూ ఉండే సంబంధం కన్న అటే తేడాగా ఉండదు అన్నీ ప్రవచనాలే! అంతకు తక్కువ ఉంటే మార్క్సిస్టు మేధావికాదు

"లంజకొడుకా" అన్నది తిట్టని రెండు పూటలా కడుపునిండా తిండిలేని ప్రతి నిరక్షరుడికీ తెలుసు వాడు "దొరల"చేత అటువంటి మాట రోజూ పడుతూనే ఉంటాడు కాని ఆ తిట్టిన వాళ్ళ తీరు తల్లిని లంజ అంటున్నారని వాడు కలలో కూడా అనుకోడు "వెధవా" అని తిట్టించుకున్నవాడు తన భర్త పోయాడనుకోన్నట్టుగా! తిట్టుకూ, తీర్పుకూ తెలపటానికి సంస్కృతంలో ఒక విసర్గ ఉపయోగించేది "రండా! పుత్రః" (లంజకొడుకు) తిట్టు, "రండా పుత్రః" అంటే లంజకు వాస్తవంగా పుట్టినవాడని, అది తిట్టుకాదు కాని వీర మార్క్సిస్టులకు తిట్టు ఏదో, తీర్పు ఏదో తెలిసే పనిలేదు అలాంటి మాటలు వాడటం తప్పని మార్క్సిస్టు రంగనాయకమ్మగారు, మార్క్సిస్టు వరవరరావుచేత ఒప్పించారట ప్రజలు రోజూ వాడే తిట్టుమాటలమీద ఆంక్షలు పెట్టి, మార్క్సిస్టు మేధావులు ప్రజలను ఉద్ధరిస్తారన్నమాట!

ప్రజలను ఉద్ధరించటానికీ, ఆడ వాళ్ళను ఉద్ధరించటానికీ, పిల్లలను ఉద్ధరించటానికీ, హరిజనులను ఉద్ధరించటానికీ ఉద్యమాలు నడపండి, బావుటాలు ఎగరెయ్యండి! కాని నిజంగా ఉద్యమం సఫలం కానీకండి అయితే తరవాత శూన్యమే!

తాము ఉద్ధరించ దలచుకున్న వారికి వీలయినంత దూరంగా జరిగే పద్ధతి ఒకటి కొంత కాలంగా నేను గమనిస్తున్నాను మార్క్సిస్టు సోషలిస్టు భావాలు స్త్రీల సమస్యకు పూర్వం ఎవరూ చూపని పరిష్కార మార్గం చూపాయి వర్గరహిత సమాజంలో తప్పస్త్రీకి పురుషుడితో సమాన హక్కులు రావు అయితే ఈ సత్యం బాగా మనసులోపాతుకుపోయిన మహిళలు కొందరు వీర మార్క్సిస్టులైపోయి తమ లాగా ఎన్‌లైటెన్ కాని స్త్రీలపట్ల తూష్ణీం భావం చూపుతున్నారు అత్యధిక సంఖ్యాకులైన స్త్రీలు అజ్ఞానాంధకారంలో ఉండి, తమకు ఎలాగైనా మొగుడు దొరకాలనీ, పిల్లలు కావాలనీ, "అందరి" లాగా బతకాలనీ, అందుకోసం ఎన్ని హింసలైనా పడక తప్పదని నమ్ముతున్నారు మార్క్సిజం మానవత్వానికి పరాకాష్ఠ అయితే మార్క్సిస్టు వీరిని చూసి జాలిపడాలి వీరి జీవితాలు మార్చటానికి తమ సర్వశక్తులూ ధారపోయాలి కాని వీర మార్క్సిస్టు వనిత ఈ అంధకారంలో జీవించేవారిని గడ్డిపోచల కింద చూస్తుంది వాళ్ళ కష్టాలను ఎవరన్నా సానుభూతితో ప్రస్తావిస్తే తమకు స్వయంగా మహా ద్రోహం జరిగినట్టు పత్రికలకు రాస్తుంది

ఆ మాటకు వస్తే ఇంకా విప్లవ పోరాటంలోకి దిగకుండానే మానసికంగా విప్లవాన్ని ఆవాహన చేస్తున్న వీర కమ్యూనిస్టులు దేశంలో అప్పుడే సామ్యవాద వ్యవస్థ ఏర్పడినట్టూ,

శ్రీశ్రీలాంటి వాళ్ళు అజ్ఞానం కొద్దీ చిత్ర నిర్మాతల కొలువు చేస్తున్నట్టూ విమర్శించటం మనకు తెలిసినదే!

ఇలాంటి దేశంలో లేచే బావుటాలే తప్ప దిగే బావుటాలు ఎందుకుండాలీ? అన్నీ దాదాపు విప్లవ బావుటాలే కూడా! విప్లవం వర్ధిల్లాలి– విజయవంతం అయినా, కాకపోయినా

యువ మాసపత్రిక, నవంబరు 1980

# 16. ఈర్ష్య - రాజకీయాలూ

మానవజాతి అన్ని విధాలా సుడిగుండంలో పడి తన్నుకుంటున్నది ఇది రాజకీయ యుగం, అంటే, ఈనాడు మనిషి జీవితాన్ని శాసించేవి మత శక్తులు కావు, సామాజిక శక్తులూ కావు, రాజకీయ శక్తులు కొన్ని ముస్లిము దేశాలలో ఇస్లాము మతానికి రాజకీయ శక్తులు లోబడి ఉండే ఏర్పాట్లు చేస్తున్నామంటున్నారుగాని, అవి జరగవు క్రియకు రాజకీయ శక్తులే మత శక్తులను శాసిస్తాయి

కనక ఈనాటి రాజకీయ శక్తుల దుస్థితి ముందు చూతాం "ప్రజాతంత్ర" దేశాలని చెప్పబడుతున్నవి అన్నీ పోలీసు బలాలను పెంపొందించుకుంటున్నాయి ఈ బలాలు బహిశ్శత్రువులనునిరోధించేవి కావు, ప్రభుత్వాన్నీ, దాని వెనక ఉన్న రాజకీయ శక్తులనూ ప్రజలనుంచి రక్షించేవి! ప్రజలను రాజకీయావసరాల కోసం హింసించటానికీ, శిక్షించటానికీ, ఉరితీయటానికి, తుపాకులతో కాల్చిచంపటానికీ పోలీసు బలాలు ఉపయోగపడతాయి అవి దేశ రక్షణకు ఉపయోగపడవు సామాజిక శక్తుల పరిరక్షణకు కూడా ఉపయోగపడవు దోపిడీలూ, మానభంగాలూ, హత్యలూ జరగకుండా ఆపేశక్తి పోలీసులకు లేదు సామాజిక విద్రోహం జరిగినాక అవి రంగంలోకి వస్తాయి పోలీసులను రక్షకభటులు అనటంలో అర్థం కనబడదు–పోలీసుల కోసం ఆయేటికాయేడు ఖర్చులు పెంచుతున్న ప్రభుత్వాలను ప్రజాతంత్ర ప్రభుత్వాలనటంలో అర్థం కనబడనట్టే

సామాజిక శక్తులను రాజకీయ శక్తులు ఎలా శాసించేదీ కూడా చూడవచ్చు మానవ సమాజాన్ని నడిపిస్తూ వస్తున్నది ఆర్థిక శక్తి అన్నారు ఈ మాట నిరూపించటం కష్టంకాదు గత అయిదారు వేల సంవత్సరాల కాలంలో మానవ సమాజంలో కలిగిన విప్లవ పరిణామాల వెనకా, "పెరుగుదల" వెనకా ఉంటూ వస్తున్నది, ఆర్థిక వ్యవస్థలో అభివృద్ధి మాత్రమే మానవుడి నైతిక, ధార్మిక స్థాయిలలో అభివృద్ధికాదు నాగరికత పెరిగినకొద్దీ మనిషికి మనిషి చేయగల అన్యాయం పెరుగుతున్నది నైతిక దృక్పథం అన్నదానికి రోలీ విలువలేదు మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన కొత్తలో పాలకవర్గంలో అవినీతి, లంచగొండితనమూ ఉన్నట్టు ఒప్పుకోవటానికి నెహ్రూ చాలా సిగ్గుపడ్డాడు కాని ఇవాళ అది నేరం కూడా కాదు అందులో దాపరికం అవసరంలేదు

ఆర్థిక శక్తుల ప్రాబల్యాన్ని పెట్టుబడిదారీ ప్రభుత్వాలు కూడా గుర్తిస్తున్నాయి ఏ రోజు పత్రిక అయినా చూడండి మీ డబ్బుమీద 18 లేక 20 శాతం వడ్డీ ఇస్తామనేవాళ్ళూ, మీ డబ్బు తమకిస్తే దాన్ని మీ అవసరాలకు ముందు ముందు సహాయపడతామనేవాళ్ళూ, బిచ్చగాళ్ళు

సామాజిక ద్వేషానికి నాగరికత అంటూ లేదు నువు హిందువుడివా? ముస్లిములనందరినీ ద్వేషించు వాళ్ళలో నీకన్న ఉత్తములు ఎందరైనా ఉండొచ్చు, కాని ఆమాట తలపెట్టకు!

అలాగే సవర్ణులు అవర్ణులను ద్వేషించటానికీ, దోచుకునేవాళ్ళు దోచుకోబడే వాళ్ళను ద్వేషించటానికి నాగరికత అనేది అడ్డురాదు ఎద్దు పుండు కాకికి రుచి

అయినా కొందరు ప్రబుద్ధులు మానవతావాదం అంటూ ఒకటి చెపుతారు వాళ్ళ ప్రయత్నం కార్మికుడి రక్తంతాగి యజమాని కొవ్వకుండా చెయ్యటం కాదు ఎద్దు పుండుకు కాకి చికిత్స చెయ్యాలని లోకాన్ని నమ్మించటం! కలవాళ్ళనగా ఎవరు? కాయకష్టం చేసుకునేవారి సంరక్షకులు! ఈసంగతి ఆ కలవాళ్ళకూ తెలీదు లేని వాళ్ళకూ తెలీదు మధ్యలో మహాత్మాగాంధీలకు తెలుస్తుంది! వాళ్ళు అనేక కోట్లమందిని నమ్మించగలరు లోక వృత్తమంతా అసూయాద్వేషాలతో నిండి ఉన్నదనీ, వాటిని తుడిచి పెట్టటం లెనిన్‌లకూ, మావోలకూ కూడా ఒకంతట సాధ్యం కాదనీ మహాత్ములు చెప్పరు

చట్టిముక్కు దాస్యులవద్ద వైదికార్యులకు లేని గోధనమో, బంగారమో లేకపోతే వీళ్ళు వాళ్ళని ద్వేషించి, ఈర్ష్య చెందే పనిలేదు బ్రిటిషు వర్తకులు తొలి సారిగా భారతదేశపు సంపదను చూసి ఎంత ఈర్ష్యపడ్డారో హిస్టరీ పుస్తకాలు చెప్పవు వాళ్ళ వర్తకంలోకి రాజకీయాలు ప్రవేశించటానికి అసలు కారణం మన సంపదనూ, వైభవాన్నీ చూసి ఈర్ష్య! ఈర్ష్యలో నుంచి పుట్టిన రాజకీయాలు సర్వత్రా ద్వేషాన్ని రెచ్చగొట్టుతాయి ఉదాహరణకు కులతత్వం బ్రాహ్మణ క్షత్రియ కులాలు వైశ్య శూద్రులను ద్వేషించటంతో ఆరంభమై, చివరకు శూద్ర, అతిశూద్రుల ద్వేషానికి తామే గురికావటంతో అంతమవుతున్నది (క్షత్రియ, వైశ్య కులాలకు చరిత్ర ప్రశస్తి లేకుండా పోయింది )

బ్రాహ్మణ ద్వేషం రాజకీయశక్తిగా పైకి వచ్చిన రోజులకే అది కుహనా రాజకీయం అయింది నిజమైన రాజకీయ విద్వేషం తెల్లవాళ్ళ మధ్యా, నల్లవాళ్ళ మధ్యా అప్పటికే రగులుతున్నది ఇది ఒకందుకు మంచి ఉదాహరణ ఎలాగంటే, రాజకీయాలు ఈర్ష్య నుంచి పుట్టవని భ్రమ కలిగించటానికి నగ్న ప్రదర్శనతో కూడిన ఈర్ష్యను రాజకీయ రంగంలోకాక మరొక రంగంలో ప్రదర్శించటం రాష్ట్రీయ స్వయం సేవకులు తమ మత విద్వేషాన్ని సాంస్కృతిక ప్రదర్శన అంటూ, తమకు రాజకీయాలతో సంబంధం లేదని ప్రకటించినట్టు

ఈనాడు భారత రాజకీయాలన్నీ ఈర్ష్యా ద్వేషాలనూ, కులతత్వాలనూ పురస్కరించుకున్నవే ఎందుకంటే ప్రజాతంత్రంలో వాటికి స్థానం లేదు గనక! ఈ దేశంలో నిజమైన ప్రజాతంత్రం అమలు జరగాలంటే ఉన్న వాళ్ళది ఒక పార్టీ, లేని వాళ్ళది ఒకపార్టీ చేసి, ఎన్నికలు పెట్టి రాజకీయాధికారం ఎవరికి దక్కేదీ చూడాలి, కాని అది ఎన్నటికీ జరగదు అది రాజకీయ పద్ధతి కానేకాదు

కమ్యూనిజం వచ్చినాక రాజకీయాలుండవని మార్క్స్ ఎంతో తెలియ చెప్పాడు రష్యాలోనూ, తూర్పు యూరపులోనూ, చీనాలోనూ ఇంకా రాజకీయాలున్నాయి గనక మార్క్స్ మాట తప్పిపోయిందన్నారు కాని అక్కడ ఉన్న రాజకీయాలు పెట్టుబడిదారీ సంస్కృతికి మాత్రమే చెందినవని కావు ఇంకా సనాతనమైన ఈర్ష్యలతో పుట్టినవి

కొత్తది తెచ్చుకోవటం తేలిక, పాతది వదిలించుకోవటమే కష్టం అమెరికా వంటి దేశం ఫ్యూడలిజమును వదిలించుకున్నా, అంతకన్నా ప్రాచీనమైన జాతి విద్వేషాన్ని వదిలించుకోలేక పోయింది అమెరికా అనుసరించే విదేశీ విధానాలు ప్రజాతంత్రాన్ని బలపరచవు- నియంతృత్వాన్నీ, హత్యారాజకీయాలను బలపరుస్తాయి! గతం జీడిలాగా పట్టుకుని ఒక్కంతటవదలదని ఊహించక పోవటం మాత్రమే మార్క్స్ చేసిన పొరపాటు

మానవుడు సామాజిక జీవి అయినది మొదలుకుని ఆదర్శసమాజం స్థాపించే ప్రయత్నంలో ఉంటున్నాడు చివరకు మిగిలేదీ, మిగలవలసినదీ రాజకీయాలు కాదు సామాజిక స్వరూపమే కాని రాజకీయాల మూలంగా సామాజిక నియమాలూ, శాసనాలూ, చట్టాలూ, ఈర్ష్యను ప్రోత్సహించినవే మనుష్య జాతి ఆస్తి హక్కులతో పుట్టుకురాలేదు కాని సమాజంలో ఆస్తిహక్కులంటూ ఏర్పడింది లగాయతు దొంగతనం నేరమయింది దొంగతనం చేసినవాళ్ళు నరకానికి పోతారని మత ప్రచారకులు ఆస్తి హక్కులకు అండగా నిలబడ్డారు ఆడదాన్ని మొగుడి సొంత ఆస్తి చేసి, అది తన కిష్టమైన పురుషుడికి పిల్లలను కనకుండా చేశారు ఆస్తిహక్కుకు పౌరసత్వం అనేది లేకపోతే ఏ ఆడది ఎవరికి పిల్లల్ని కన్నా ఇబ్బందిలేదు ఆలాంటి వాళ్ళలో భీమార్జునులవంటివారు కూడా ఉండవచ్చు కాని పాండుడికి రాజ్యం ఉంటే కుంతి ఎవరెవరికో పిల్లల్ని కని, వాళ్ళందరూ పాండవులని చెప్పగలిగేది కాదేమో! గుడ్డిముండా కొడుకు నూరుగుర్ని కన్నా, వాళ్ళు తన రాజ్యానికి వారసులని చెప్పుకోగలిగాడు!

బలవంతులకు దుర్బలులపట్ల ద్వేషం, ధనికులకు దరిద్రులపట్ల ద్వేషం, దోచుకునేవాళ్ళకు అనుకూలంగానూ దోచుకోబడే వాళ్ళకు ప్రతికూలంగానూ చట్టాలూ రాజ్యాంగాలూనూ, చివరకు మతాలు కూడా ద్వేషాన్నీ, ఈర్ష్యనూ బలపరిచే విధంగానే ప్రచారం కావటం-ఇదే సహస్రశతాబ్దాల తరబడి రాజకీయంగానూ మతంగానూ, సంస్కృతిగానూ ఉంటూవస్తున్నది

సమసమాజంలో రాజకీయాలు లేకుండా పోవాలంటే ఆర్థిక సంబంధమైన ద్వేషాలూ, ఈర్ష్యలూ మాత్రమేకాదు, సంచితంగా వస్తున్న ఈర్ష్యా ద్వేషాలన్నీ నిర్మూలమయిన దాకా రాజకీయ సుడిగుండం నుంచి మానవజాతి బయట పడదు

ఈ సుడిగుండం అనేక రకాల సంఘర్షణల రూపంలో మనకు కనబడుతున్నది విదేశీ రాయబార కార్యాలయాలపై దాడులూ, విద్యార్థుల తిరుగుబాట్లూ, ఆర్థిక ప్రతిష్ఠంభన చర్యలూ, బాంబుల పేలుళ్ళూ, గెరిల్లా యుద్ధాలూ, సైనిక దురాక్రమణలూ ఇలాంటివన్నీ చూస్తే ప్రజాతంత్రం అనేది ప్రపంచంలో ఏ మూలనన్నా మిగిలి ఉన్నదా అని ఎవరికైనా అనుమానం రాకమానదు

యువ, మాసపత్రిక డిసెంబరు 1980

# 1. దిబ్బలో నక్సలిజమ్

"దిబ్బకు వెళ్ళి చాలారోజులైనట్టుంది ఒకసారి వెళ్ళివస్తావా ఏం?" అన్నాడు మా పత్రికాధిపతి

"ఏమిటి విశేషం?" అన్నాను

"మరేం లేదు – రాజభరణాల రద్దు గురించి కంకార్డ్ చాటుగా ఏమనుకుంటున్నదీ ఆరా తియ్యి మన రికార్డులో వుంటుంది" అన్నాడు మా బాస్

రాజభరణాల గురించి ప్రభువుల అభిప్రాయం నాకు తెలియనిది కాదు అది వారికి ఆర్థిక సమస్య కానేకాదు ఆపాటి డబ్బు వాళ్ళు కళ్ళుమూసుకుని సంపాదించగలరు వాళ్ళకు కావలసింది ఆ భరణాల వెంట వున్న గుర్తింపూ, అధికారాలూనూ సంస్థానాలు రద్దయినా వాళ్ళు ఒక రాజకీయవర్గంగా ఉంటున్నారు అంతకన్న బలహీనమైన రాజకీయపార్టీలెన్నో దేశంలో ఆర్భాటం చేస్తున్నాయి నన్నడిగితే దేశంలో వున్న నిజమైన రాజకీయపార్టీలు ఫ్యూడల్ పోరాటంలోనే ఉన్నాయి రాజులూ, మహారాజులూ ఒక వర్గం పెద్ద పెద్ద భూస్వాములు ఒక వర్గం పంచాయితీబోర్డుల అధ్యక్షులు ఒక వర్గం ఇవన్నీ ప్రజలమీద ఆధారపడని పార్టీలు, ప్రజలమీద ఆధారపడి బతకటానికి ప్రయత్నించే పార్టీలను ఆడించే పార్టీలు బూర్జువా వర్గాలున్నాయనుకోండి వాటికీ యీ ఫ్యూడల్ వర్గాలకు మధ్య రాజకీయ ఘర్షణ ఏమీలేదు రెండుపక్షాలకూ మధ్య లింకులు మన పార్టీలు

ఈ విషయాలన్నీ మా బాస్‌తో చర్చించడం కంఠశోష ఆయన గుర్తించేది ఎన్నికలలో నిలబడే పార్టీలనే రాజకీయాలకూ, వ్యాయామక్రీడపోటీలకూ, గుర్రప్పందాలకూ ఆయన సమమైన విలువ ఇస్తాడు ఏ పార్టీ అధికారంలోకి వొస్తుంది? వింబుల్డన్ కప్పు ఎవరు కొట్టేస్తారు? ఇండియన్ ఓర్బీలో ఏ గుర్రం నెగ్గుతుంది? అదే ఆయనకు కావాలి

* * *

నేను దిబ్బకు బయలుదేరింది రాజభరణాల గురించి కానేకాదు అక్కడ నక్సలైట్లు ఏం చేస్తున్నారో తెలుసుకునేందుకు

అయిదారు నెల్లకింద దిబ్బరాజా వారికి నక్సలైట్లను గురించి అడుగుతూ రాస్తే "దిబ్బలో నక్సలైట్లు లేరు ఇక్కడ కమ్యూనిస్టులే లేరు కమ్యూనిస్టులుంటే గద, ఒకటి రెండవుతుంది అన్న సూత్రం మీద కుడి కమ్యూనిస్టులు, ఎడమ కమ్యూనిస్టులూ, ఎడమ కమ్యూనిస్టుల్లో మితవాదులూ, అమితవాదులూ, అమితవాదుల్లో పరిమితవాదులూ, నక్సలైట్లూ ఏర్పడేది?" అని వారు నాకు రాశారు

అయినా నాకు నమ్మకం కలుగలేదు ప్రపంచంలో బయలుదేరే ప్రతి ఉద్యమానికీ దిబ్బలో ప్రతిధ్వనులు వస్తాయని నా అనుమానం కిందటిసారి నేను దిబ్బ వెళ్ళినపుడు అక్కడ నాకు అమెరికన్ హిపీలు కనిపించారు

దిబ్బకూ మిగతా ప్రపంచానికీ దాదాపు ఏ సంబంధమూ లేకుండా జరుపుకువచ్చినవాడు దిబ్బప్రభువుగారి తాతాగారు దిబ్బకు పక్కారోడ్డు లేదు, ఆయన బొందిలో ఊపిరి

వున్నంతకాలమూను తరవాత కంకరరోడ్డు పడింది దాన్ని ఆవిష్కరించినది గవర్నరుగారి కారు – మన నాటు గవర్నరుగారు కారు కాదు– సిసలైన తెల్ల గవర్నరు ( ఆయన దిబ్బనగరం నడివీధుల్లో కుక్కలనీ, ఊరపందుల్నీ వేటాడానని చెప్పుకున్నారు దిబ్బనగరం ఆయన ప్రాణానికి ఒక అరణ్యంగానూ, దిబ్బ ప్రజలు ఆటవికుల్లాగానూ, వాళ్ళు పెంచుకునే కుక్కలూ, పందులూ వన్యమృగాల్లాగానూ తోచివుండాలి )

"మనకు పనికి వస్తుందా, లేదా? అని ఆలోచించకుండా ప్రపంచంలో ఎక్కడెక్కడ ఏది కొత్తగా వెలిస్తే దాని వెంటపడే మనస్తత్వం భారతీయులకున్న మాట అబద్ధం కాదు

ఇండియన్ హిపీలనే తీసుకోండి వాళ్ళు అమెరికన్ హిపీలను అనుకరిస్తున్నారు ఎందుకూ? అమెరికన్ హిపీలు మన బైరాగులకు అనుకరణ అందరికన్నా ముందుగా హిపీలను సృష్టించింది మనమే– గంజాయీ, నల్లమందూ, చరస్ వగైరాలతో సహా కాని మన హిపీలు బైరాగులు కారు అమెరికన్ హిపీలకు నకళ్ళు

అన్నిట్లోనూ మనది ఇదే వరస ఒక కర్ణాటక కృతి బాణీలో ఒక మహారాష్ట్ర పాట తయారైతే దాన్ని అనుకరిస్తూ ఒక తెలుగుపాట మళ్ళీ వచ్చింది!

పేరు తెచ్చుకుంటున్న ఇంగ్లీషు సాహిత్య ధోరణులను అనుకరిస్తే మన సాహిత్యం అట్లాగే పైకి వచ్చేస్తుందని మనవాళ్ళ నమ్మకం మనదేశంలో చదివేవాళ్ళ ప్రసక్తి ఏమీలేదు

రాజకీయాలూ అంతే ప్రజల గొడవ ఏమీలేదు సిద్ధాంతాలు సరిగా ఉన్నాయా, లేదా? అది చాలు! రాజకీయ విభేదాలు ఎందుకంటే ఒక్కొక్క పార్టీ ఒక్కొక్క అడుగుజాడల్లో నడుస్తుంది ఒక పార్టీకి పనికివచ్చే అడుగుజాడలు మరొక పార్టీకి పనికిరావటం లేదు అదీ ఘర్షణలకు మూలకారణం

దిబ్బ చేరాను కాని రాజావారి దర్శనం కాలేదు వారు రాజస్థాన్ పర్యటనలో ఉన్నారట

దివాన్జీ గారిని రాజభరణాలను గురించి అడిగాను

"మీకు తెలీదా! రాజావారు చాలా బీదవారు ఈ ఇరవైవేలూ రాకపోతే వారికెలా జరుగుబాటు అవుతుందో నాకు అంతుచిక్కటం లేదు గాంధీగారి పార్టీ వాళ్ళే ఆడితప్పితే ఇక కమ్యూనిస్టుల వంటి రాక్షసులు మాట నిలబెట్టుకుంటారా? దేశంలో వుండే నాస్తికులకూ, అధార్మికులకూ కాంగ్రేసువారు చాలా సహాయపడుతున్నారు ఆ సంగతి వారు గుర్తించటంలేదు రాజ్యాంగాన్ని చీటికి మాటికి సవరిస్తుంటే రేపు కమ్యూనిస్టులు మొత్తం రాజ్యాంగానికే ఎసరు పెడతామనరా? వారిని తప్పుపట్టగలమా?" అన్నారు దివాన్జీ రాజభరణాలూ, రాజకీయాలూ కట్టిపెట్టి అసలు సంగతికి వచ్చాను

"దివాన్జీ, మన దిబ్బలో నక్సలైట్ల ఏమంటున్నారు? వాళ్ళను అదుపులో పెట్టటానికి సీఆర్పీని గాని, మిలిటరీని గాని తెప్పించమంటారా?"

"ఎందుకండీ? అదో పితలాటకం! డబ్బు ఖర్చు! మన పొలిమేరలో నక్సలైట్లు లేరు వుండరు కూడా! ఒకవేళ వాళ్ళు దిగుమతి అయితే ఏం చెయ్యాలో తెలీదు ఈ రాజభరణాలు కూడా రద్దు చేస్తే మనం వున్న పోలీసుశాఖను కూడా రద్దుచేసుకోవాలనిపిస్తుంది, చెప్పాను

కానా? దేశంలో దౌర్జన్యాన్ని, అరాచకాన్నీ పెంచే పనులన్నీ మన పాలకులు చేస్తున్నారు చెబితే వినరు అర్థంచేసుకోరు దేశమంతటికీ నిజమైన రాజకీయ విజ్ఞాని ఆ మహానుభావుడు రాజగోపాలాచారి గారు ఒక్కడే కనిపిస్తున్నాడు మిగిలినవాళ్ళంతా అంధకారంలో పడి కొట్టుకుంటున్నవారే! ఆ మధ్య రాజాజీ రాసిన వుత్తరం చూస్తే అంతా మీకే తెలుస్తుంది"

దివాన్జీ రాజాజీ వుత్తరం కోసం వెతకటానికి అయిదు నిమిషాలు టైమిచ్చి "మళ్ళా తమ దర్శనం చేసుకొంటాను" అని బయల్దేరాను

* * *

దిబ్బనగరం దాటగానే ఒక అందమైన మైదానం వున్నది అందులో వున్న రక్కెసలూ, జిల్లేళ్ళూ చూడముచ్చటగా వుంటాయి రక్కెసల్లో నాగుపాములు ఆడుకుంటూంటాయి

మైదానాన్ని అనుకొని ఒక పంటకాలువ వున్నది దాన్ని దిబ్బకార్డులలో 'బుల్లేరు' అని ఉదహరిస్తారు 'బుల్లి ఏరు' అని కాబోలు

దిబ్బరాజు గారి తండ్రి హయాంలో కంకరరోడ్డు పడినప్పుడు బుల్లేరుమీద ఆరడుగుల నిడివిగల వంతెన కట్టి రోడ్డుకు అటూ, ఇటూ విశాలమైన అరుగులు ఏర్పాటుచేశారు

ఆ వంతెనమీద కూర్చుని నాకు ఒక రైతులాటి మనిషి కనిపించాడు అతగాడు కూర్చున్న అరుగుమీదికి సీమచింతచెట్టు నీడ పడుతున్నది

నేను కూడా అతనిపక్కనే కూర్చుని "ఈ యేడు వర్షాలు బాగా పడ్డట్టున్నాయి ఇక్కడ కూడా" అన్నాను

రైతు వెంటనే జవాబియ్యక తన నెత్తిమీద తలగుడ్డలోనుంచి వొక పొగాకుకాడ తీసి, రెండు పాయలు చేసి, వొకపాయ నాకిస్తూ, "కాల్చండి దిబ్బపొగాకు మా ప్రశస్తం" అన్నాడు

మర్యాదకు చుట్ట వెలిగించాను పొగ నసాళానికంటింది దగ్గాను

రైతు నవ్వి "నే జెప్పలా? సిగిరెట్టు దమ్ములాగినట్టు లాగితే ఏమవుతుంది?" అంటూ తాను కూడా చుట్ట నోటబెట్టాడు

"పంటలతో మాకు ఏనాడూ పేచీలేదు బాబూ! దేశమంతటా కరువొచ్చినా దిబ్బకు తిండికొరత వుండబోదు కాని ఇట్టా ఎంతకాలం సాగుతుందీ అని" అన్నాడతను

"అదేం?"

"ఈ నగసలైట్లు మమ్మల్ని పొలాలు జేసుకోనిచ్చేట్టు లేరు!"

గతుక్కుమన్నాను దిబ్బలో కూడా నక్సలైట్లున్నారన్నమాట! నేను అనుమానిస్తున్నదే! కాని ఈ మనిషి పెద్ద భూస్వామిగా కనిపించటం లేదు ఇక్కడి నక్సలైట్లు చిన్నరైతులను కూడా బాధిస్తున్నారా?

"ఏం చేస్తారు మీ నక్సలైట్లు?" అన్నాను

"వాల్లకి చాతనయింది వొకటేగా? పొలాలు లాగేసుకుంటారు"

"భూస్వాముల పొలాలు లాగేసుకుంటే మీబోటి వాళ్ళకేం నష్టం?" అన్నాను

"భూస్వాముల పొలాలు లాగేస్తారా? ఎన్ని గుండెలు? మాబోటి బక్కరైతుల పొలాలు కాజేస్తున్నారు భూస్వాముల పొలాలు లాగేస్తే వారి కోపు కాసేదెవరు?" అన్నాడు రైతు

అతని మాటలు నాకు అయోమయంగా కనిపించాయి భూస్వాములు నక్సలైట్లు కోపు కాయటమేమిటి? ఈ దిబ్బలో ఈ తరగతి మనుషులకు రాజకీయ పరిజ్ఞానం ఏమీ ఉండగు

"పోనీ, నక్సలైట్ల చర్యల వల్ల మరింత భూమి సాగులోకి రావటము, పంటలు జాస్తి కావటమూ జరగాలి గద!" అన్నాను

నీకేమన్నా మతిపోయిందా అన్నట్టు అతను నాకేసి కళ్ళు పెద్దవిచేసి చూశాడు

నక్సలైట్లకు కావలసింది పొలాలు సాగుకావటమా? ఎవరన్నారు?" అన్నాడు

"మరేమిటి? పేదరైతులకు పొలాలు అందటమూ, వారి హక్కులను కాపాడటమూ కూడా నక్సలైట్లు కోరేది" అన్నాను

రైతు గట్టిగా నవ్వాడు

"ఈ దేశంలో నక్సలైట్లు కోరేది పొలాలు ఎండగట్టటం బీదోల్ల పొలాలు కాజేసి భూస్వాములకివ్వటం నక్సలైట్లకు కరణాలు, మునసబులు కుమ్మక్కి పోలీసులు అండ! పెద్ద నగసలైటు అన్నాడు - దిబ్బ ప్రజలు తిండి ఎక్కువై, కొవ్వి, చెప్పినమాట వినకుండా వున్నారట! దిబ్బకు తిండి కరువొస్తే గాని మేమంతా బాగుపడమంట!"

"ఎవరా పెద్ద నక్సలైటు" అన్నాను

"ఇంకెవరు? రాజాగారే! చూస్తూండు మా కుర్రకారు ప్రాణం విసిగున్నారు ఈ నగసలైట్లనందర్నీ పాముల్ని కొట్టినట్టు కొట్టి దిబ్బకు ఈ పీడ విరగడ చేస్తారు ఎంతో దూరంలో లేదు" అన్నాడు రైతు ఆరినచుట్ట అవతల పారేస్తూ

ప్రభంజనం పక్షపత్రిక, 1-10-1970

## 2. దిబ్బ రిపోర్టు

దిబ్బ రాజావారు అమెరికా నుంచి తిరిగిరాగానే వారి దర్శనం చేసుకునే మహాభాగ్యం నాకు లభించలేదు నేనప్పుడు మన ప్రాంతాల జరగనున్న ఎన్నికల సన్నాహాలు కవర్ చేస్తూ ఉంటిని కవర్ చేశానంటే అంతా కప్పిపెట్టాననుకోకండి, కొంతే కప్పెట్టాను కవర్ చేసేది కవర్ చేసి, అన్ కవర్ చెయ్యవలసినది అన్‌కవర్ చేసి, అనేక విషయాలు డిస్కవర్ చేశాను డిస్కవర్ చేసినదాంట్లో చాలా భాగం కవర్ చేసి, బహు కొంచెం అన్‌కవర్ చేసి, మొదట్లో కవర్ చెయ్యలేకపోయినది చివరకు ఎలాగైతేనేం రికవర్ చేసుకున్నాను అదంతా పోనివ్వండి

రాజావారి దర్శనం కోసం దిబ్బ చేరగానే నాకు తెలియవచ్చినది ఎలెక్షన్ వివరాలు దిబ్బకు పదమూడు ఎసెంబ్లీ స్థానాలూ మూడు రాజ్యసభ స్థానాలూ ఉన్న సంగతి అందరికీ తెలిసినదే

ఎసెంబ్లీ స్థానాలకు ఇరవై అయిదు పార్టీల వాళ్ళూ, నలభై అయిదుగురు స్వతంత్రులూ పోటీ చేశారు దిబ్బలో కిందటి ఎలెక్షనుకు పదమూడు పార్టీలే ఉండేవి అందులో రాజావారి పార్టీ తప్ప మిగిలినవన్నీ రెండేసి అయాయి కాని అందరూ పాత ఎలెక్షను చిహ్నలే కావాలని పట్టుపట్టారు అందుచేత చిహ్నాలను చీల్చటం జరిగింది మాటవరసకు తేలు చిహ్నం రెండు చేసి, తోకలేని తేలు ఒకరికీ, కొండు ఉన్న తోక ఒకరికీ ఇచ్చారు అరటిచెట్టు చిహ్నన్ని బోదె కిందా, గెలకిందా ఊడగొట్టారు పెద్దనోరు చిహ్నన్ని బోసినోటి కిందా, కట్టుడు పళ్ళ కిందా విడగొట్టారు

ఉపసంహరించుకున్న అభ్యర్థులందరూ ఇళ్ళు కట్టించుకొంటూ ఉండటమూ, కార్లు కొంటూ ఉండటమూ, పొలాలు కొంటూ ఉండటమూ నేను చూశాను ఒక గెలిచిన వాడింట వారంగా అందరూ పస్తులుంటున్నారుట తనకు మంత్రిపదవి రాకపోతే దిబ్బ చెరువులో దూకెయ్యటం తప్ప మరోదారి లేదని చెప్పుకుని నా దగ్గిర ఏడిచాడు భారతయుద్ధం తరవాత పాండవులకు అదే గతి పట్టిందని చెప్పి అతన్ని ఊరడించాను

అన్నిటికన్న చిత్రమేమిటంటే ఒకే ఒక నియోజకవర్గంలో మూడే మూడు వోట్లు పడ్డాయి రెండు వోట్లు తెచ్చుకున్నా వాడు గెలిచాడు ఒక్కవోటు తెచ్చుకున్నవాడు డిపాజిట్లు పోనందుకు సంతోషించాడు ఈ అపూర్వసంఘటన వెనక నక్సలైట్ అదృశ్యహస్తం ఉండి ఉంటుందని అధికార్లు అనుమానిస్తున్నారు ఆ నియోజకవర్గంలో ఎవరిని అడిగినా వోటు వేశామని చెప్పి సిరాగుర్తులు చూపిస్తున్నారు

సిరాగుర్తు లేనివాడు వోటుచెయ్యలేదని చెప్పవచ్చు గాని, గుర్తు కలవాడు వోటు చేసినట్టు చెప్పలేం గదా! అన్నారు మహా మేధావి అయిన దివాన్జీ గారు గొప్ప సత్యం, బ్రైస్ కూడా ఈ సత్యాన్ని కనిపెట్టలేదు

రాజ్యసభ ఎన్నికల మాట చెప్పనవసరం లేదు రాజాగారి పార్టీ వాళ్ళు గెలవటమే గాక మిగిలిన అందరికీ డిపాజిట్లు పోగొట్టారు

"ప్రతాపం నాది కాదు, ఆ ఇందిరాదేవిది!" అన్నారు రాజావారు మోడెస్ట్‌గా

రాజ్యసభ ఎన్నికల సందర్భంలో రెండు మూడు బూత్‌లలో వోటర్ల సంఖ్యకన్న హెచ్చు వోట్లు పడ్డట్టు పుకారు లేచింది లెక్కించటం తప్పయి ఉంటుందనీ, లెక్కించిన వాళ్ళలో కొందరికి ఒంట్లు కూడా సరిగా రావనీ, అసలు ఎక్కువ వోట్లు పడ్డాయన్నది ప్రతిపక్షాల కల్పన అనీ అధికారవర్గాలు అంటున్నాయి

కొందరు తాగేసి ఆనంద పారవశ్యంలో వోటు వెయ్యటం మరిచారు లేకపోతే ఇంకా ఎక్కువ వోట్లు పడాలిసింది అన్నాడొక ఎల్డీసీ అతన్ని పై అధికార్లు చివాట్లు పెట్టిసట్టు విన్నాను

* * *

వోటర్లలో సగంమంది కూడా వోటు చెయ్యకపోవటానికీ, కొన్నిచోట్ల బొత్తిగా నూటికి అయిదుగురే వోటు చెయ్యటానికి నక్సలైట్ల ప్రభావం కారణమై ఉంటుందా, అని ఒక పెద్ద భూస్వామిని అడిగాను

"ఏమోనండీ, మరీ! అయినా దిబ్బలో విప్లవం రావటమేమిటి లెండి? కల్లో కూడా అనుకోవటానికి వీల్లేదు అయినా మనం ఏమరి ఉండటానికి వీల్లేదు చూశారో లేదో, విప్లవం రావటానికి ముందు విప్లవ సాహిత్యం వస్తుంది – ఉరుముకు ముందు మెరుపొచ్చినట్టు సూర్యుడికి ముందు అరుణోదయం అయినట్టు అందుచేత, నేనే స్వయంగా చిన్న పరిశోధన ఆరంభించాను ఇద్దరు బియ్యేలకు నెలజీతం ఏర్పాటుచేసి, హింసా ప్రచారం గల పుస్తకాలు ఎక్కువున్నదీ చూసి కొనుక్కు రమ్మన్నాను పుస్తకం ఖరీదే గాక ప్రతి ఒక పుస్తకానికీ పదేసి రూపాయల చొప్పున బహుమతి కూడా ఇస్తానన్నాను ఆ పుస్తకాలు రాసినవాళ్ళ పేర్లూ, ఎడ్రసులూ తెస్తే మరో అయిదు రూపాయలిస్తానన్నాను" అన్నాడు భూస్వామి

"మీరు రహస్యంగా చేసే దేశసేవ నేనెరగనా? జాతీయోద్యమం రోజుల్లో మీ పాత్ర గురించి ఎంత అన్వేషించినా నాకు ఒక్క పిసరు సాక్ష్యం దొరికింది కాదు!" అన్నాను

నేను మెచ్చుకోవటం అయిపోయిందని రూఢి చేసుకుని భూస్వామి ఇలా అన్నాడు

"అప్పుడేమయిందనుకున్నారు? పాత పురాణాలన్నీ దిగాయి! రామాయణం! నేనిన్నాళ్ళూ గుర్తించలేదు రాముడెంత హింసాపరుడండీ! సీత హింస మానమంటే చివాట్లేశాడు వాలిని అలా చంపటం పచ్చి గొరిల్లా పద్ధతి! భగవద్గీత! దానిలోనూ హింసే విష్ణుమూర్తీ, ఇంద్రుడూ, పాండవులూ, కృష్ణుడూ వధలు చెయ్యటంలో ఎవరికీ తీసిపోరు శైవగ్రంథాలనిండా హింసే నేను పురాణాలు చదవకపోవటం పొరపాటయింది ఇద్దరు బియ్యేలకు ఒక నెలజీతం ఇచ్చుకోవటమే గాక రెండువందలు బహుమానాల కింద ఇవ్వవలిసొచ్చింది ఆ డబ్బు పోనివ్వనులెండి మన పురాణాలన్నీ అహింసకు అనుకూలంగా తిరగరాయించి పదేసివేల కాపీలు అచ్చువేయించి, దేశంలో ఉన్న లైబ్రరీలన్నిటికీ అమ్మిస్తాను ఎకాడమీ ఎవార్డులూ, అదేదో లక్షరూపాయల బహుమతి ఉందే అదీ కొట్టెయ్యాలి

"ఇంకో చిత్రం చూశారా? ఈ బియ్యేలు నాకన్నా శుం తెలివితక్కువ వాళ్ళు భగవద్గీత తెచ్చినవాడు ఒక స్వాములవారి పేరూ అడ్రసూ తెచ్చాడు దానిమీద ఆయన పేరున్నది మరి అలాగే శివపురాణం తెచ్చినవాడు ఎవరో శాస్త్రులుగారి పేరూ ఎడ్రసూ తెచ్చాడు డబ్బిచ్చుకున్నాను కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుంది"

నేను ఊరుకోక, "పురాణాలను అహింసగా రాయటం కష్టమేమో" అన్నాను

"అదేం లేదు రాముడిచేత చచ్చినవాళ్ళంతా ఆత్మహత్య చేసుకున్న వాళ్ళేనని చెప్పొచ్చు డెత్‌విష్ అనే మాట విన్నారా?" అన్నాడు భూస్వామి

విన్నట్టు జ్ఞాపకం లేదు

అటువంటిది ఉన్నదిలెండి అదికాకపోతే కాలపురుషుడున్నాడు శాపాలున్నాయి మన సంస్కృతిలో దేన్ని సమర్థించటానికైనా మార్గం ఉన్నదండీ భగవద్గీతలో చెప్పాడు గదండీ 'నిమిత్తమాత్రం భవ' చంపేదెవరు? చచ్చేదెవరు?"

"ఇది నక్సలైట్లకు వర్తించదనుకుంటాను" అన్నాను

"వర్తించదు వాళ్ళు భగవద్గీతను నమ్ముతారా? నమ్మరు మరేదో ఎర్రపుస్తకాన్ని నమ్ముతారు దాన్నిండా హింసే మీరు చదివారా ఎర్రపుస్తకాన్ని?"

"లేదు" అన్నాను

"నేనూ చదవలేదు అలాటి పుస్తకాలకేసి చూడను కూడా చూడను" అన్నాడు భూస్వామి

* * *

ఎలాగైతేనేం, అనుకున్న దానికన్న ఆలస్యంగా, రాజావారి దర్శనభాగ్యం లభించింది శ్రీవారికీ ప్రయాణం సుఖంగానే జరిగిందట లేదు, వారు అమెరికా అధ్యక్షుణ్ణి గాని, ఉపాధ్యక్షుణ్ణి గాని కలవలేదు (కలిస్తే పత్రికలలో పెద్దగా వేసి ఉండేవారే గద!)

అమెరికా అంతర్జాతీయ ఖ్యాతి దెబ్బతింటున్నదంటున్నారు నిజమా అని అడిగాను

"ప్రపంచాధిపత్యం కావాలంటే కొంత అపఖ్యాతికి గురికావటానికి తయారుకావాలి ఈమాట చర్చిల్ అమెరికాకు ఏనాడో చెప్పాడు – అనుభవం గల సామ్రాజ్యవాది గద! ఆ సలహా ప్రకారమే అమెరికా పాలకులు నడుచుకుంటున్నారు " అన్నారు రాజాగారు

"అమెరికా ఆర్థికపరిస్థితి అంత బాగా లేదంటున్నారు, నిజమా?"

"ఎవరికి బాగు? ఏ విధమైన బాగు? ద్రవ్యోల్బణం జరుగుతున్నది డబ్బుకు కొనుగోలుశక్తి తగ్గితే పరిమిత ఆదాయాలు గలవాళ్ళు ఇబ్బంది పడవచ్చు కాని అమెరికాకు వెన్నెముకలాగా ఉన్న యుద్ధపరిశ్రమలకు భయం లేదు ద్రవ్యోల్బణం ఉన్నది గనక, సహజంగా ఆ పరిశ్రమలు తమ లాభాలను పెంచుకోవాలని చూస్తాయి పెంచుకుంటాయి ఏమిటి నష్టం? భారీ పరిశ్రమలు నష్టపడనంత కాలమూ దేశానికి నష్టం లేనట్టే" అన్నారు శ్రీవారు

యుద్ధం విషయం అడిగాను "అమెరికాలో యుద్ధవ్యతిరేకత హెచ్చుతున్నదిట గదా?"

"యుద్ధం చేద్దామా, వద్దా అని సైనికుణ్ణి అడిగితే, వాడు వద్దనే అంటాడు చావటం ఎవరికీ ఇష్టం ఉండదు సైన్యంలో చేరవలిసి వచ్చినవాళ్ళూ, చచ్చినవాళ్ళ బంధువులూ యుద్ధవ్యతిరేకులే" అన్నారు శ్రీవారు

"ఆసియాలో అమెరికా చాలా నష్టం కలిగించడమే గాక నష్టపోతున్నట్టు స్పష్టం లక్షలకొద్దీ టన్నుల బాంబులూ, వందలకొద్దీ విమానాలూ కూలిపోవటం ఎంత నష్టం?"

"నువ్వింకా దొడ్డిదారినే ఉన్నావు ఉత్పత్తిదార్లు సరుకు తయారుచేసేది ఖర్చుకావటానికి కాదా? ఎన్ని విమానాలు కూలిపోతే విమానాల కంపెనీలకు అంత గిరాకీ! ఎన్ని బాంబులు పేలిపోతే బాంబులు తయారుచేసే వారికి అంత లాభం బాంబులు వెయ్యటానికి జాగా దొరక్కపోతే వాటిని సముద్రంలో వేసివచ్చిన అమెరికను యుద్ధవిమానాలను గురించి నువు వినలేదా? అమెరికా రక్షణశాఖ ఏమీ పేచీపెట్టలేదే! యుద్ధం పేరుతో ఎన్ని నిర్మాణాలు ప్రారంభించి, కోట్ల కొద్దీ డాలర్లు ఖర్చుచేసి, మధ్యలో విరమించారో నీకేమన్నా ఆడియా ఉన్నదా? యుద్ధపరిశ్రమలకు అదొకరకం లాభం! పంథొమ్మిదో శతాబ్దపు ఆలోచనా ధోరణితో అమెరికాను అర్థం చేసుకోవటం అసంభవం అది అప్ టు డేట్ దేశం!" అన్నారు రాజావారు

"వియత్నాం పౌరులను అకారణంగా కాల్చిచంపినందుకు ఎవరినో విచారణ చేస్తున్నారటగా?"

"వొట్టి చాదస్తం! ఏషియన్ల చేత ఏషియన్లను చంపించటం ఒక పాలసీగా అమెరికాలో ఏనాడో రూపొందింది అమెరికా ఆధిపత్యానికి ఏషియన్లు చావటం ప్రధానం అమెరికన్లు మరీ జాస్తిగా చావకుండా ఉండటం కూడా ప్రధానమే వియత్నాం, కాంబోడియా, లావోస్ యుద్ధాలన్నీ ఈ పంపిణీమీదే గద జరుగుతున్నాయి? నాపాం బాంబులు వేసి చంపితేనేం? డిఫోలియంట్స్ చల్లి చెట్లు చేమలూ తగలబెడితేనేం? ఇళ్ళకు నిప్పంటించి బయటికి పారివచ్చే ముసలీ, ఆడా, పిల్లా పీచులను గుండేసి కొట్టి చంపితేనేం? మైవై హత్యలు చిన్న స్కేలు మీద వియత్నాం యుద్ధాలే! ఈ విచారణలు కేవలమూ ఫార్సు!" అన్నారు శ్రీవారు

"అమెరికా ఆశయం ఆసియాలో కమ్యూనిజమును నిరోధించటం కాదా?"

"నీకు అంతర్జాతీయ రాజకీయాలు బొత్తిగా తెలీవన్నమాట! రష్యాలోనూ, తూర్పు యూరపులోనూ, చీనాలోనూ, ఇంకా ఇతర చోట్లా ఏదోవిధంగా కమ్యూనిజం ఉన్నది కమ్యూనిజమును నాశనం చెయ్యడమే అమెరికా ఆశయమైతే అమెరికా ఈ అన్ని దేశాలమీదా యుద్ధం చెయ్యవచ్చు కమ్యూనిజమును నిర్మూలించటానికన్న నిరోధించటానికి ఎక్కువ ఖర్చవుతుంది అమెరికాలో ధనికులకు కావాలిసింది విడవకుండా ఖర్చుపద్దు పాపం, అమెరికను కోటీశ్వరులు చాలా పెద్ద చిక్కులో ఉన్నారు యుద్ధాలు మానేస్తే వాళ్ళు నాశనం అయిపోతారు!" అంటూ రాజావారు పెద్ద నిట్టూర్పు విడిచారు

వసుధ, మాసపత్రిక మే 1971

# 3. రాజకీయ కేయాస్

ఒంటరిగా కూర్చుని ఆలోచిస్తున్నాను ప్రపంచంలో అత్యాకాండ పెరిగిపోతున్నది ఈ డిటెక్టివ్‌లందరూ ఏం చేస్తున్నట్టు? డిటెక్టివ్‌లో భద్రం వెనకటంత ఉత్సాహంగా లేడు

"లాభంలేదు గురో డిటెక్టివ్‌లకి గిరాకీ పడిపోయింది" అంటాడు భద్రం

అంచేతనే అంతకులు మితిమీరిపోతున్నారు హాశ్చర్యమేం లేదు ఏ పేపరులో విన్నా అత్యల పరంపరే

"అంతకులింతగా మీరిపోవడానికేమిటి కారణమంటావు, భద్రం?" అని ఒకసారి అడిగా

"కలికాలం గదా, గురూ" అన్నాడు భద్రం

"మిడతల దండొస్తే పిల్లులకి నోటినిండా పని గదా, అంతకులు సెలరేగితే డిటెక్టివ్‌లు విజురుంభించరేం?" అని అడిగా

"ఆళ్ళంతా యిప్పుడు క్రయిము సినీమాల్లోకెళ్ళిపోతున్నారుగా" అన్నాడు భద్రం

"అవేం సినిమాలు భద్రం?" అడిగా

"అయేనండీ! డాం డాం ఫిచ్చర్లు!" అన్నాడు భద్రం

"నువ్వాటిల్లో ఎగస్ట్రా యేషాలేస్తున్నావా?"

"మరి జరగాలిగా, గురూ?"

ఆలోచిస్తున్నాను

"డిటెక్టివ్‌లనందర్నీ సినిమాల్లోకి తీసుకునే నిరమాతలు నన్ను అడగనేలేదు ఎందుకంటావు భద్రం"

"మీకు సినిమాలంటే పడదుగా మరీ?"

ఇది జరిగి శాన్నాళ్ళయిందిలే, ఇప్పుడెందుకో ఆమాట గుర్తుకొచ్చి, ఆలోచిస్తున్నా

ఇంతలో భద్రం వచ్చాడు రెండు జేబుల్లోంచీ గుప్పిళ్ళతో చిల్లరడబ్బులు తీసి చాపమీద పోశాడు

"ఏంటిది, భద్రం?" అనడిగా

"డబ్బు గురో! బంగాళాదేశపండు!"

"మనకెట్టా వచ్చిందీ?"

"మనకేటి, గురూ! బంగాళాపండు అడగనాడిది పాపం ఎడడిగినా యిస్తారు "

"పండయితే మాత్రం ఇన్ని డబ్బులా?" అన్నాను హాశ్చర్యంగా

"ఇదేనా? ఇది మన వాటామటుకే గవర్రై మావ ఇంతకి మూడింతలుంచుకున్నాడు కుర్రనాయాళ్ళ వొంతుట "

ఆలోచిస్తున్నాను

"చూశావా, భద్రం!"

"ఏంటి, గురో"

"తిరుపద్దేవుడికన్న కూడా ఈ బంగాళా మోతాదు పెద్దదిగా ఉంది కాదూ?"

"అమ్మమ్మా! అలా అంటానికి లేదు ఆ దేవుడి దెబ్బ ఇంకెవరికీ రాదు ఆయన ముందు లచ్చలకు లచ్చలు రాల్తాయి మనవాటాకు వచ్చేది కొంచమే అంచేత నేవిటంటే నామాలాణ్ణి తగ్గించెయటానికి లేదు అటు సినిమాల్లో, ఇటు రేడియోల్లో, అటు రాజకీయాల్లో, ఇటు పుస్తకాల్లో తిరపద్దేవుడు ఒకటే మోతా! ఆc!" అన్నాడు భద్రం

కొంత నా పొరపాటు కూడా ఉంది భద్రం జేబులు లావుగా ఉంటే అదంతా పండే అనుకున్నా కాదు డబ్బులతో బాటు భద్రం రెండు పొట్లాలు కూడా తీశాడు

"ఏంటవి, భద్రం?"

"పకోడీలు, గురూ! కొత్త వోటలువి! అంటే కొత్త నూనె అన్నమాట ఓవారం రోజులపాటు మా రుచిగా ఉంటాయి తరవాత మళ్ళీ మామూలే "

ఇద్దరమూ పకోడీలు తిన్నాం

భద్రం పొట్లాం కాగితాలిప్పి "ఇద్దరు నక్సలైట్ల కాల్చివేత" అని చదివాడు

నాకామాట వెనక విన్నట్టు గుర్తుకొచ్చింది

ఒకనాడేమయిందంటే, అదేదో కండిషండ్ హాల్లో డాం డాం పిచ్చరుంది చూద్దామన్నాడు వెళ్ళాం టిక్కట్టులు దొరకలా అదే కండిషండ్ హాల్లో ఇంకో సినిమా కూడా ఉంటే దానికి పోయి చూశాం

సినిమా ఏం బాలేదు అసలు కథ ఉండి చస్తేగా కాని అందులో ఒక హత్యాశ్చర్యకరమైన సంగతి చూపించారు మహానగరంలో పబిలికు రోడ్డుమీద ఆగిన కారులోంచి ఒక పెద్దమనిషిని బయటికీడ్చి అత్యచేశారు

నాకు చెడ్డకోపం వచ్చి, "డిటెక్టివ్ నాకొడుకులంతా ఏవైనట్టు? పోలీసోళ్ళేం చేస్తున్నారు?" అని గట్టిగా అన్నా

భద్రం నా నోటికి చెయ్యి అడ్డంపెట్టి, రహస్యంగా, ఆళ్ళు నక్సలైట్లులే, గురూ! ఆళ్ళు అలాటి పనులు పబిలీగ్గానే చేస్తారు" అన్నాడు

ఇంటికి వచ్చినాక, "భద్రం నువు నక్సలైట్ల మాట ఏదో చెప్పావు వాళ్ళను గురించి సవిస్తారంగా చెప్పు డిటెక్టివ్‌గా నిన్ను అడుగుతున్నా" అన్నా

"ఆళ్ళు అంతకులు, గురూ, చంపటవే ఆళ్ళ పని! మన మామూలు అంతకుల్లాగా రహస్యం లేదు క్లూలు లేవు అంతా బట్టబయలే!"

"మన డిటెక్టివ్‌లు ఆళ్ళనెందుకు పట్టరో!"

"రగస్యం లేదు క్లూలు లేవు! డిటెక్టివ్ చేసేదేంది?"

అదీ నిజమే కళ్ళక్కనపడేదానిని భూతద్దం వేసి చూసే పనేంవుందీ? అడుగుల గుర్తులుంటే మాత్రం ఏ లాభం?

"అయితే మరి ఈ నక్సల్ లైట్లను చెయ్యటానికేమీ లేదా? వాళ్ళ అత్యాకాండ అట్లా జరిగి పోవటమేనా?" అడిగాను

"అదంతా రాజకీయాల్లే గురూ! ఆళ్ళది రాజకీయ అత్యాకాండ పారిటీ అన్నమాట మిగతా పారిటీలు చూస్తూ వూరుకోవుగా? ఎద్దుమార్కులు ఎలెక్సనుకు నిలబడితే గడ్డిమేట మార్కోడు ఎదురు నిలబడ్డూ? అంటే అత్యాకాండ పారిటీవాళ్ళను అతర పారిటీలవాళ్ళు చంపేస్తారు దానికీ దానికీ చెల్లూ" అన్నాడు భద్రం

"అయితే, భద్రం! దేశం నిండా అత్యాకాండ పార్టీలేనంటావా యేం? మరందుకే అత్యాకాండ బలిసిపోతున్నది" అన్నాను

భద్రం కొంచెం బుర్ర గోక్కుని – "అంతే అనాలి, గురూ! ఒకడేది చేస్తే అందరూ అదే చెయ్యాల సారా చూడ్రాదూ? ఒకడు వారినీసు తాగి చచ్చాడంటే అదేమైన తొంబైమంది అదే వారినీసు తాగి చస్తారు ఒకడెవడో గొట్టాం పాంటూ, వూలరయికా తొడగేస్తాడు అంతా పొలోమని వూలరైకలతో బస్సులెక్కేస్తారు ఒకడు బియ్యం ధర పెంచుతాడు వెంటనే అందరూ అన్నింటిధరలూ పెంచేస్తారు బంగాళాపండు చూడ్రాదా! ఒకడు డబ్బాలో డబ్బులేస్తాడు ఆడి యెక్కువేటని అందరూ వేసేస్తారు! అందులో మంచీ ఉంది, చెడూ ఉంది గురో!"

ఆలోచిస్తున్నాను

"అయితే, భద్రం? ఈ నస్కల్‌లైట్ల అత్యాకాండలో కూడా మంచీ చెడూ ఉందంటావా ఏంటి?"

"ఏదో ఉండే ఉంటుంది గురూ! మనకు రాజకీయాలు తెలవ్వు మరి"

"మనం రాజకీయాలు తెల్చుకోవాలి భద్రం, చూస్తూ కూచోటం ఏం బాలేదు" అన్నాను

"శంకరం బాబునడిగితే రాజకీయాలు చెప్పేస్తాడు" అన్నాడు భద్రం

* * *

"ఏం కేయాస్, ఇలా వచ్చావ్? ఏవిటి విశేషం" అని అడిగాడు శంకరం బాబు

గురూగారికి రాజకీయాలు కావాలంట – అన్నాడు భద్రం

"చూడు కేయాస్! నువు నీ డిటెక్టివ్ మాలోకంలోనే ఉండు రాజకీయాలలో దిగకు అది సుడిగుండం మహామాహ వాళ్ళు ఔటైపోతున్నారు మేటి వస్తాదులు మట్టి కరుస్తున్నారు నిప్పులు కక్కి చీలిపోయినవాళ్ళు పూలమాలలు చేతబట్టుకుని తిరిగి వస్తున్నారు బీటలుపడిన గోడలు వాటంతట అవే కరుచుకుపోతున్నాయి రాజకీయాలు తెలుసునని ఎవడన్నా అన్నా నువు నమ్మకు మాటవరసకి కాంగ్రెసును తీసుకో–"

"నాకు కాంగిరేసు రాజకీయాలు వద్దండీ ఈ నస్కల్‌లైట్ల రాజకీయాలు కావాలి "– అన్నా

"ఏ లైట్లూ? ఓ అదా! నీకు వాళ్ళతో ఏం పనీ?" అనడిగాడు శంకరం బాబు

"వాళ్ళని పట్టెయ్యాలి బాబు వాళ్ళు దారుణ అత్యాకాండ సాగిస్తూంటే నేను ఏం చెయ్యకుండా కూచోవటం ఏం బాగాలేదు" అన్నా

"వాళ్ళ సంగతి పోలీసులూ, సిపాయిలూ చూచుకుంటున్నారుగా"

"బాబుగారూ! డిటెక్టివ్ అయినవాడు నేరం జరక్కముందే అంతకులను పట్టుకోవాలి అందులోనూ పబిలీగ్గా అత్యాకాండ చేసే నస్కళ్ళను ఏ పోలీసైనా కాల్చి పారెయ్యొచ్చు వీడు నస్కల్‌లైటూ అని ముందుగానే తెలుసుకోవటానికి కులూలు ఏమన్నా ఉంటే చెప్పండి" అన్నాను

"అదా నీ గొడవ?"– అంటూ శంకరంబాబు కాసేపు ఆలోచించి, నక్సలైట్‌లు సాధారణంగా కుర్రవాళ్ళుగా ఉంటారు వాళ్ళు పేదవాళ్ళ పక్షంగా మాట్లాడతారు డబ్బున్నవాళ్ళని సహించరు విప్లవం రావాలంటారు హత్యలు చేస్తారు దోపిడీలు కూడా చేస్తారు అయితే ఆ డబ్బుతో ఇళ్ళు కట్టుకోరు, దాన్ని తమ పేర బాంకుల్లో కూడా వేసుకోరు వాలయితే తుపాకులూ, పిస్తోళ్ళూ సంపాదిస్తారు వాళ్ళని గొరిల్లాలని కూడా అంటారు మనుషులను చంపటమూ, డబ్బు దొంగిలించటమూ, తుపాకులు కాజెయ్యటమూ చెయ్యనప్పుడు వాళ్ళు విప్లవం గురించీ, ప్రజాశత్రువుల గురించీ మాట్లాడుకుంటారు అనుభవం వచ్చిన కొద్దీ వాళ్ళను నువు సులభంగా గుర్తించగలుగుతావు" అన్నాడు శంకరంబాబు

ఎందుకన్నా మంచిదని ఆ బాబుచేత ఆ విషయం మళ్ళీ మళ్ళీ చెప్పించుకున్నాను

చివరకాయన, "చూడు కేయాస్, నక్సలైట్ల జోలికి పోవటం నిప్పుతో చెలగాటం దేంజర్" అన్నాడు

"డిటెక్టివ్‌లకు దేంజరీ లేందెప్పుడు, శంకరం బాబూ?" అన్నాను నిర్లక్ష్యంగా

* * *

బస్సులో సీటులేక సీట్లలో కూర్చున్నవాళ్ళ భుజాలమీద ముడ్డి ఆనించి నేనూ, భద్రమూ నిలబడ్డాం అకస్మాత్తుగా నా చెవులు నిక్కబొడుచుకున్నాయి

గ్రామంలో వాళ్ళందరినీ బయటికి రప్పించి, ముసలాళ్ళనూ, ఆడాళ్ళనూ, పిల్లల్నీ కూడా కాల్చిచంపేసేరట రాక్షసం ముండాకొడుకులు! అంటున్నారెవరో

"నక్సల్‌లైట్లే" అరిచాను

"ఊరుకో, గురూ వాళ్ళు చెప్పుకొనేది వీత్నాంలో అమెరికా సైనికుల మాట " అన్నాడు భద్రం చిన్నగా

"అమెరికాలో నక్సళ్ళుండరా?" అన్నాను

"అమెరికాలో నీగ్రోలుంటారు మనదేశంలో నక్సళ్ళను వేటాడినట్టు అమెరికాలో నీగ్రోలను వేటాడుతారు "

బస్సు దిగగానే మా ముందుగా నడుస్తున్న వాళ్ళిద్దరు మాట్లాడుకుంటున్నారు

'విన్నావుటయ్యా, విప్లవకవుల్ని* అరెస్టు చేశారుట!'

'అట్లాగా? రోగం వదిలింది'

'ఎవరి రోగమయ్యా? కవుల్ని ఎరెస్టు చెయ్యటమేమిటయ్యా? పిచ్చి కుదిరింది రోకలి తలకు చుట్టమన్నట్టూ! మొన్ననేగా ఆర్భాటంగా లెనిన్ శతజయంతి చేశారూ లెనిన్ విప్లవ కవి కూడా కాదే! విప్లవకారుడేనే?'

'ఇంకో దేశంలో విప్లవం చేస్తే మాబాగంటాం గాని, మనదేశంలో విప్లవం రావాలన్న వాళ్ళందర్నీ బొక్కలో తొయ్యాల్సిందే!'

ఇద్దరూ విరగబడి నవ్వారు

"భద్రం, వాళ్ళు నస్కళ్ళయి ఉంటారా?" అని అడిగాను

"కారు గురూ!" అన్నాడు భద్రం తల అడ్డంగా తిప్పి

రాజకీయాలు తెలుసుకోటమంటే మాటలు కాదు శంకరం బాబుతో మాట్లాడిన దగ్గర్నించీ నాకు ఎక్కడబడితే అక్కడ నక్సళ్ళు కనిపిస్తున్నారు కాని వాళ్ళు నస్కళ్ళు కారంటాడు భద్రం

---

* చెరబండరాజు, జ్వాలాముఖి, నిఖిలేశ్వర్లు విరసం కార్యవర్గ సభ్యులు
వీరి ముగ్గురిని ప్రభుత్వం 2-8-1971నాడు అరెస్టు చేసింది

ఒకసారి మీటింగుకు వెళ్ళాం ఒక నల్లని మనిషి అందరిలో మాట్లాడుతున్నాడు ఆయన నక్సల్ అయి ఉంటాడనుకున్నా

ఇంకా నయం! ఆయన పాత కాంగిరేసు, అన్నాడు భద్రం

రోజూ పత్రిక అరువు తెచ్చి భద్రం చేత చదివించుకొని వింటున్నా నేను నక్సళ్ళనుకున్నవాళ్ళు ఏ మార్క్సిస్టులో, సోషలిస్టులో అవుతున్నారు విప్లవం అని ప్రతివాడూ అనటంతో డిటెక్టివ్ అయిన వాడి పని గడ్డవుతున్నది మిగిలిన వాళ్ళంతా విప్లవం అనటం మానేసి ఒక్క నక్సలైట్లనే ఆ మాట అననిస్తే రాజకీయాలు బాగుపడతై అందరికీ అర్థమవుతై కాని ఇదేంటి?

“ఒక్కటే కొండగుర్తు పెట్టుకో, గురూ! ఇంకే రాజకీయపారిటీ వాళ్ళు విప్లవం అన్నా, లేనోళ్ళను వెనకేసుకొచ్చినా, భూమికీ సొరగం రావాలన్నా అవి మనం పట్టించుకోనక్కర్లేదు అవన్నీ కబుర్లు ఆటిని నక్సలైట్లు అంటేనే సీరియస్! అప్పుడాళ్ళు మనకు దొరికిపోతారు” అన్నాడు భద్రం

ఈ కొండగుర్తు బాగానే వుంది

అయితే ఇది కూడా నాకు పనికిరాకుండా పోయింది

భద్రం పత్రిక తిరిగేస్తూ ఓ హాశ్చర్యకరమైన విషయం చదివాడు చోరానగరా, బారా నగరా? అక్కడ పోలీసాళ్ళు పట్టపగలు ఇళ్ళలో జొరబడి ఓ యాభైమంది కుర్రనాయాళ్ళను ఇళ్ళలోంచి వీధుల్లోకి లాగి, పబిలీగ్గా కాల్చిపారేసి, శవాల్ని అక్కడే వొదిలిపోయారట!

“నక్సల్లు పోలీసువేషాల్లో వచ్చి ఆ పని చేసుంటారా భద్రం?” అన్నాను

“అదేంకాదు, గురూ! ఆల్లు అస్సలు పోలీసులే బంగాళంలో పోలీసులు కనిపించిన కుర్రాళ్ళనందరినీ కనిపించినట్టు కాల్చి పారనూకి, ఆ తరవాత ఆల్లు నక్సళ్ళా కారా అని చూస్తారు అంతగా అవసరమైతే డాక్టరు చేత పరీక్ష చేయించి, చచ్చినాల్లు నక్సల్లే అని సరిటిఫికెట్టు తీసుకుంటారు!” అన్నాడు భద్రం

ఇంక డిటెక్టివ్‌లకు మంచినీల్లు పుట్టేదెట్టా? నాకు మండిపోయింది

“భద్రం ఇది చాలా ఘోరం మనం రాజకీయాలు నేర్చుకుని ఏం లాభం? డిటెక్టివ్ జాతికింత అన్యాయం ఎన్నడూ చూడలేదు, నా యెరికలో పోలీసాల్లు డిటెక్టివ్‌ల కాల్లు పట్టుకుంటేనే గాని అంతకులను పట్టలేకపోయేవాల్లు కోర్టులూ, విచారణలూ, సాక్ష్యాలూ, కులాలూ – ఎంతో సరదాగా ఉండేది ఇప్పుడు పోలీసులు మొనగాళ్ళయి కూర్చున్నారన్నమాట! ఏ కులూలు, డిటెక్సనూ లేకుండానే నక్సళ్ళను పట్టుకుని రుజూలు సాక్ష్యాలూ, విచారణలూ లేకుండా, కనీసం సస్పెన్షనన్నా లేకుండా నక్సల్‌లైట్లను కాల్చిపారేస్తున్నారు! ఇది సయించరానిది! మనం చూస్తూ ఊరుకుంటే లాభం లేదు, భద్రం! లాభం లేదు!” అరిచాను

వసుధ మాసపత్రిక దీపావళి ప్రత్యేక సంచిక 1971

## 4. రాజకీయాలు అర్థంకావు

చిత్రం ఏమిటంటే, చాలామంది ఉద్దేశాలు రాజకీయాలు అర్థంకాకపోయినా ఆసక్తికరంగా ఉంటాయన్ని, నైరోప్యచిత్రకళ లాగా ఆలాంటి రాజకీయ ప్రియుల కోసం దిబ్బ రాజీయాలను గురించి క్లుప్తంగా రాస్తున్నాను

దిబ్బలో తొంబైఒక్క పార్టీ ఉన్నది అందులో చాలాభాగం ఏదో ఒక కుగ్రామంలో మాత్రమే కనిపిస్తాయి యావద్దిబ్బ పార్టీగా పరిగణించటానికి కనీసం ఇరవై గ్రామాలలో కార్యాలయాలు ఉండాలి అటువంటివి కూడా పది పదిహేను పార్టీల దాకా ఉన్నాయి అయితే వాటిలో రెండు, మూడు పార్టీలు కోటీశ్వరుల 'జేబు' పార్టీలనీ, ఆ యొక్క కోటీశ్వరులు సొంతచమురుతో ఇరవైయేసి గ్రామాలలో కార్యాలయాలు ఏర్పాటుచేసుకున్నారనీ, వాటికి సభ్యులెవరూ లేరని చెప్పుకుంటారు అయితే దిబ్బ సాంప్రదాయం ప్రకారం చట్టబద్ధముగా చట్టోల్లంఘనం చెయ్యటం నేరం కాదు కనక, ఆ యొక్క కోటేశ్వరుల పార్టీలను యావద్దిబ్బ పార్టీలు కావని ఎవరైనా సాహసించి అంటే, వారు వెంటనే జైలుకు పంపబడతారు రాజకీయాలా? మాటలా?

దిబ్బలో పచ్చపార్టీ, ఆకుపచ్చ పార్టీ, చిన్న పార్టీ, పెద్ద పార్టీ, దుక్క పార్టీ, బక్క పార్టీ, చెత్త పార్టీ, చెదారం పార్టీ ఉన్నాయి ఎర్ర పార్టీ అంటూ ఉన్నది గాని అది రాజకీయపార్టీ అని చెప్పటానికి లేదు ఎందుకంటే దానికి కార్యాలయాలు లేవు దాదాపు ప్రతి కుగ్రామంలోనూ దాని సభ్యులున్నారంటారు కాని వాళ్ళెవరో బయటికి రారు ఎప్పుడన్నా పోలీసులు కారణాంతరాల వల్ల ఎవరినన్నా కాల్చిచంపితే, లేక 'నరక కూపాలలో' (పోలీసు కార్యాలయాలలో ఉండే రహస్య గదులలో) చిత్రహింస చేసిచేసి, అందుకు కారణాలు బయట పెట్టటం సభ్యత కానప్పుడు చచ్చినవారి శవాలను అడవిలో పారేసి అడవుల సంరక్షణను పోలీసులు బలపరిచి నంతగా దిబ్బలో ఇంకెవరూ బలపరచరట వీళ్ళు ఎర్ర పార్టీ వాళ్ళని అడవిలో వేటాడి చంపామనీ చెబుతారు అది అధికార వార్త దిబ్బ పోలీసుల ఆగ్రహానికి గురి అయిన వారిని స్థూలంగా ఎర్రపార్టీ అనుకోవచ్చు ఏమైనా ఎర్ర పార్టీకి మంత్రిత్వాలూ, శాసనసభలూ, ఎన్నికలూ వగైరాలతో పనిలేదు గనక, ఆ పార్టీ రాజకీయరంగంలో లేనట్టే లెక్క మాజీ దిబ్బ ప్రభువు, పదిహేను తరాల రాజరికానికి ఆఖరు వారసుడు, అన్నట్టు, ఎన్నికలు లేని రాజకీయాలేమిటి?

చిక్కేమిటంటే దిబ్బలో ఏ రాజకీయపార్టీకి మెజారిటీ లేదు అందుచేత మాట పరిపాలన అమలులో ఉంటుంది ('మాట' అనే మాట చూసి అపోహ పడకండి) ఏనాడైనా దిబ్బను పాలించే అర్హత 'పెద్దకూటమి'కి ఉంటుంది అది మెజారిటీ పార్టీ ప్రతిపక్ష పార్టీలలో ముఖ్యమైనది ఛిన్నకూటమి ఒక్కోసారి బుల్లి కూటమి ఒంటెత్తు కూటమీ వగైరాలు కూడా ఉంటాయి

కూటములు స్థిరంగా ఉండవు అందులోని ఏ రోజు ఏయే పార్టీలుండేది చెప్పలేం, పచ్చ పార్టీకీ, ఆకుపచ్చ పార్టీకి పచ్చిగడ్డేస్తే భగ్గుమంటుంది ఒక్కోసారి రెండూ పెద్ద కూటమిలో

చేరిపోతాయి అవి రెండూ కలిసినప్పుడల్లా దిబ్బరాజకీయాలు రక్తి కడతాయి ఏకమైన క్షణం నుంచీ ఒకదాన్ని ఒకటి కూటమినుంచి నెట్టెయ్యటానికి విశ్వప్రయత్నాలు సాగిస్తాయి చివరకు ఏమవుతుందా అని జనాలలో గొప్ప సస్పెన్స్ పుట్టుకొచ్చేసి ఆ సమయంలో వరదలొచ్చి దిబ్బ మునిగిపోయినా, జనం ఇళ్ళ కప్పులెక్కి రాజకీయాలు మాట్లాడుకుంటారు గాని వరదలను తలచరు కనీసం దిబ్బ పత్రికలు చదివే వాళ్ళకు అలాటి అభిప్రాయం కలుగుతుంది

బై ఎలక్షన్ జరిగినప్పుడల్లా రాజకీయ తెప్ప తలకిందులు కావటానికి ప్రయత్నిస్తోంది ఒక బక్క పార్టీవాడు ఎక్కడో కూటమి అభ్యర్థిని పడగొట్టుతాడు వెంటనే కూటమి నుంచి దుక్కపార్టీ బక్కపార్టీల వాళ్ళు రాజీనామా ఇచ్చి బక్క పార్టీతో కలిసి ప్రభుత్వం ఏర్పాటుచెయ్యటానికి మంతనాలు ఆరంభిస్తారు వచ్చేపొయ్యే రాజకీయ సారథులతో దిబ్బ బస్సులూ, దిబ్బ రైళ్ళూ కిటకిటలాడిపోతాయి ఈ మంతనాలను గురించి వెలువడే వార్తలు – నిజమైనా, అబద్ధమైనా – గొప్ప రాజకీయ సంచలనాన్ని కలిగిస్తాయి

ఇలాగే ఒకసారి పెద్ద కూటమినుంచి చాలామంది సభ్యులు నిష్క్రమిస్తున్నామని చెప్పి, చిన్నకూటమిలో చేరుతున్నట్లు పత్రికలకు వార్త ఇచ్చారు చిన్న కూటమి పెద్దకూటమిగా మారినట్లు స్పష్టమయింది ఈ సందులో గోడమీది పిల్లి పార్టీగా వ్యవహరిస్తున్న బుల్లి కూటమి చిన్న కూటమితో చేరింది చిన్న కూటమి అధికారంలోకి రావటం ఖాయమన్నారు శాసనసభను సమావేశపరచి పెద్ద కూటమి మీద విశ్వాసరాహిత్య తీర్మానం ప్రతిపాదించారు శాసనసభ్యులు వోటు చెయ్యవచ్చే సరికి పెద్ద కూటమికి వ్యతిరేకంగా నలుగురే నలుగురు వోటు చేశారు

ఏం జరిగింది? పత్రికలలో నెలరోజులపాటు ఊహాగానం అయిపోని పాటకచ్చేరీలాగా సాగింది జనం ఆసక్తితో చదివి, తిండి కరువూ, ఆకలిచావులూ కూడా పట్టించుకోలేదు

ఇంతలో ఇంకో బైఎలక్షన్ వచ్చింది పెద్ద కూటమి అభ్యర్థికి డిపాజిట్టు పోయింది అప్పుడు పెద్దకూటమి నుంచి దుక్క, బక్క, కుక్క, నక్క పార్టీల వాళ్ళు భారా ఎత్తున రాజీనామా ఇచ్చి

ఇట్లా దిబ్బ రాజకీయాలను గురించి ఎంతో ఆసక్తికరమైన విషయాలు గోజులతరబడి చెప్పుకుపోవచ్చు రాజకీయాలు అంటే ఆసక్తిలేని వారికి ఒక్కముక్కలో దిబ్బ రాజకీయాల సారం చెప్పవచ్చు

దిబ్బలో ఏడేళ్ళుగా రాజకీయాలున్నాయి గాని, పరిపాలన లేదు దిబ్బ ప్రజలకు రాజకీయాలు కావాలి గాని, పరిపాలన అవసరం లేదన్న వదంతి ఒకటి ఉన్నది

ప్రభవ మాసపత్రిక డిసెంబర్ 1978

# 5. స్వతంత్రం పాట్లు

చిక్కు ఎక్కడొచ్చిందంటే, వాడు 1930 జనవరి 26న పుట్టాడు వాడి తండ్రి వాడికి తడువుకోకుండా స్వతంత్రం అని పేరు పెట్టాడు

స్వతంత్రుడి తండ్రి రాజకీయరంగ స్వతంత్రం తండ్రికే తెలియదు అతను గర్భదరిద్రుల గర్భాన పుట్టి, మూడెకరాల ఆస్తిగల విధవరాలికి దత్తుపోయాడు వృత్తిచేత ప్లీడరు గుమాస్తా ఇతగాడి అదృష్టం బాగుండి ఆ ప్లీడరు గారికి దశ ఎత్తుకున్నది ప్లీడరుగారు రెండంతస్తుల మేడ కడితే, ఆ మేడను కొనెయ్యగల మొత్తం ప్లీడరు గుమాస్తా తన చెమట వోడ్చి సంపాదించి, దాన్ని తెలివిగా వడ్డీలకిచ్చాడు ఆ కారణంగా స్వతంత్రం పుట్టిన వెంట్రుకలు తీయించుకునే లోపల అతని తండ్రి బాకీదార్ల నుంచి బాకీల రద్దుకింద పదిహేను ఎకరాల మాగాణీ భూమి, ఒక తోటా సంపాదించాడు

ఆ మధ్యకాలంలో ఒక ఎన్నికలు జరిగాయి ఎవరికి వోటెయ్యాలో తెలీక ప్లీడరు గుమాస్తా గారు పదిహేను రూపాయలిచ్చిన వాడికి వోటు వేశాడు

అది స్వతంత్రం బేక్‌గ్రౌండ్

స్వంతంత్రం తండ్రిలా కాదు వాణ్ణి చాలా మంది, వాడి ఈడువాళ్ళు, భారత స్వాతంత్ర్యం ప్రత్యక్షవతారంగా చూసేవాళ్ళు వాడు కూడా తాను ఒక రాజకీయ జాతక పురుషుణ్ణి అనుకునేవాడు వాడు ఒకేసారి విప్లవచర్యల్లో పాల్గొన్నాడు 1942 ఆగస్టులో కాంగ్రెస్ నాయకులు జైల్లో పడ్డ మర్నాడు స్వతంత్రం ఈడువాళ్ళు ఓ ఇరవై మంది ఆవేశంగా ఊరిమీద పడి షాపులూ, హోటళ్ళూ మూయించి, తిన్నగా రైలుస్టేషనుకు వెళ్ళారు రైల్వే పోలీసులు తాము దేశ ద్రోహులమనుకున్నట్టుగా విప్లవవీరులు కోరగానే టోపీలు తీసి కింద పెట్టారు నలుగురితో పాటు స్వతంత్రం కూడా ఒక పోలీసుటోపీని ధైర్యంగా తొక్కాడు తరువాత బుకింగాఫీసులోకి జొరబడి బాలవీరులు కరెన్సీ నోట్లు నేలమీద పోసి తగలబెట్టారు ఆ హడావుడిలో స్వతంత్రం ఒక నోటు జేబులో పెట్టుకున్నాడు ఇంకో నోటు తీస్తుండగా ఎవరో చూసి, వాడి చేతిమీద కొట్టి, నోటు లాక్కుని మంటల్లో వేశారు స్వతంత్రం పైకి తప్పు చేసినవాడి మొహం పెట్టాడే గాని, లక్ష్మీదేవిని తగలెయ్యడంలో దేశభక్తి ఏమున్నదో వాడికి తెలీలేదు

అటు తరవాత స్వతంత్రం జాతీయ, అంతర్జాతీయ రాజకీయ సంఘటనలలో ఆసక్తి కనబరచాడు గాని, రాజకీయ పార్టీలలోనూ వాటి ఆశయాలలోనూ ఆసక్తి యెంతమాత్రమూ కనబరచలేదు

యుద్ధం యెప్పుడు ప్రారంభమైనదీ వాడికి గుర్తురాలేదు వాడి జీవితాన్ని అది యేవిధంగానూ స్పృశించినట్టు కనబడలేదు కాని రష్యా అన్నమాట జనాల నోళ్ళలో నానసాగింది రష్యా గురించి పెద్దలు చాలా నీచంగా చెప్పారు పిన్నలు గొప్పగా చెప్పారు పెద్దవాళ్ళ మాటే వాడికి నిజం కావచ్చుననిపించింది

"అవునండీ, జర్మనీ గెలవాల్సిందే ఆ హిట్లరు గెలిస్తే ఆర్యధర్మం తిరిగి గడ్డమీద నాలుగుపాదాలా నడుస్తుంది " అని ఒక శాస్తుల్లుగారు తన తండ్రితో అనటం వాడు విన్నాడు అదీ నిజమేననిపించింది హిట్లరు ఆర్యుడట! అనార్యులను వేటాడుతున్నాడు శ్రీరామచంద్రులవారు వారిని వేటాడినట్లు! రాక్షసుల్ని వేటాడినట్లు

"ఓ వేళ రాముడే హిట్లరుగా పుట్టలేదు గదా?" అని స్వతంత్రం తాను ఆశ్చర్యపడి కొద్దిమంది ఆంతరంగికులతో అన్నాడు కూడా వాళ్ళు విరగబడి నవ్వేసరికి స్వతంత్రం నిరుత్సాహపడి ఆ ఐడియాను శీఘ్రమే మరిచిపోయాడు రాముడికి మీసాలుండేవా? లేక పేడిమూతివాడా? ఏమో?

హిట్లరు గెలవాలన్న వాళ్ళకీ, వాడు చావాలన్నవాళ్ళకీ ఏదో శత్రుత్వం వున్నట్లు స్వతంత్రం తెలుసుకుని, ఎవరితోనూ విరోధం పెట్టుకోవటం ఇష్టంలేక, తాను తటస్థంగా వుండిపోయాడు

చివరకు హిట్లరు ఆత్మహత్య చేసుకుని – రాముడు ఎలా చచ్చాడు? – యుద్ధంలో రష్యా గొప్పగా గెలిచి, అమెరికా బ్రిటనులు కూడా రష్యాను పొగుడుతున్నట్లు విని, స్వతంత్రం తాను కూడా రష్యాను పొగుడుదామనుకున్నాడు

కాని త్వరలోనే అమెరికా, బ్రిటనులు రష్యాపట్ల ద్వేషమూ, ఓడిన జర్మనీ పట్ల స్నేహమూ చూపుతున్నట్లు తెలిసి స్వతంత్రం 'కూర్మం లాగా' ముడుచుకుపోయాడు

వాడి రాజకీయ ఆదర్శం – 'గెలిచిన వాడి పక్షం వుండు' యుద్ధానంతరకాలం క్రమంగా రూపుదాల్చింది

దేశవిభజన జరిగింది మతకలహాల్లో ఎక్కడో నెత్తురు ఏర్లుకట్టి పారిందన్నారు ఇవేవీ స్వతంత్రాన్ని స్పృశించలేదు

స్వతంత్రమే వచ్చింది 1947 ఆగస్టు 15న కాని మన స్వతత్రం వున్నచోటనే వుండిపోయాడు కమ్యూనిస్టులూ, సోషలిస్టులూ, హిందూమహాసభ వాళ్ళూ, ఇంకెవరెవరో వెనక్కుపోయి కాంగ్రెస్ పైకి తేలింది ఘటనల రీత్యా కాంగ్రెస్ సత్యం, మిగిలిన పార్టీలు మిథ్యా!

మొదటిసారి యెలెక్షన్లు జరిగేనాటికి స్వతంత్రానికి ఓటున్నది దాన్ని కాంగ్రెసుకు వేశాడు

ఎవరో వాక్శుద్ధిగల కవి "ఒక్కసారి మంత్రి చెయ్యి, గణనాథా! నువ్వు ఓడకుంటె ఒట్టుపెట్టు గణనాథా!" అన్నట్టుగా కాంగ్రెసు మంత్రులు కుర్రాళ్ళ రాళ్ళకి చింతకాయలు రాలినట్టు రాలారు

'కమ్యూనిస్టులను బొత్తిగా తోసిపారెయ్యకూడదు లాగుందే' అనుకుని స్వతంత్రం వాళ్ళను గురించి మరీ సలీసుగా మాట్లాడటం తగ్గించాడు

రెండో సాధారణ ఎన్నికలు జరిగి, తాను వోటుచేసిన కాంగ్రెసు అభ్యర్థికి డిపాజిట్టు పోయిన అనంతరం, తాను రాజకీయ మహానాయకుడు ఎప్పటికైనా అయితీరాలనీ, అప్పుడుగాని తన జన్మతారకూ నామ నక్షత్రానికీ సార్థక్యం ఉండదనీ స్వతత్రానికి అనిపించింది

---

కాని ఎలా? రాజకీయాలు కప్పల తక్కెడగా ఉంటున్నాయి గెలిచినవాళ్ళు ఓడుతున్నారు ఓడినవాళ్ళు గెలుస్తున్నారు ఇలా ఎల్లకాలమూ వుంటుందా? బ్రిటిషువాళ్ళ హయాంలో దశాబ్దాలపాటు పరిస్థితులు మారేవికాదుట వాళ్ళ నాన్న ఎన్నోసార్లు అన్నాడు

మళ్ళీ అలాటి పరిస్థితి రావాలి! తాను గద్దె ఎక్కాలి!

"ఆ బ్రిటిషు వెధవలు ఎందుకు వెళ్ళిపోయారు? పోనీ, మళ్ళీ రారాదూ? నాకేమన్నా ఛాన్సుంటుందేమో!" అనుకున్నాడు స్వతంత్రం తన పేరుకు అర్థం కూడా పాటించకుండా కాలక్రమాన దేశాన్ని పాలించేవారంతా వాడికన్న అర్థరహితంగా ఆలోచించసాగారు గనుక మనం మన స్వతంత్రాన్ని తప్పుపట్టరాదు కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుంది

రాను రాను స్వతంత్రానికి ఒకటి స్పష్టమయింది కాంగ్రెసుకు తాను ఊహించినంత గొప్ప భవిష్యత్తు వుండకపోవచ్చు 'రాజాజీ లాంటి వాళ్ళు బయటికి పోయారంటే అంతేగా?' కాని కమ్యూనిస్టులకు భవిష్యత్తు అసలే లేదు వాళ్ళు అండర్‌గ్రౌండ్ పోవటమూ, మళ్ళీ బయటికి రావటమూ, కాస్సేపు విప్లవం అనటమూ ఎన్నికలకు నిలబడటమూ, రెండుగా చీలటమూ, మళ్ళీ మూడుగా చీలటమూ ఇదంతా అభ్యుదయ లక్షణం కాదు

స్వతంత్రం మనస్సులో ఇంకా ఏ మూలనన్నా సందేహం వుంటే, నక్సలైట్ల మూలంగా అది పూర్తిగా పోయింది స్వతంత్రం తండ్రి పోయాడు వాడి తమ్ముడు నక్సలైట్ అయినాడని స్వతంత్రం అనుమానం పెళ్ళి కావలసిన చెల్లెలు యిరవైనాలుగేళ్ళది వున్నది కట్నాలు పొయ్యటం సంఘద్రోహమని స్వతంత్రం నమ్మకం కట్నం లేకుండా ఆమెను పెళ్ళిచేసుకుంటానని వొకడు – ఒకే వొకడు వచ్చాడు వాడు తన తమ్ముడి స్నేహితుడు తప్పక నక్సలైట్ అయి వుంటాడు స్వతంత్రం వొప్పుకోలేదు

ఒక శుభముహూర్తాన ఆ పిల్ల యింటినుంచి లేచిపోయి, వర్ణాంతర వివాహం చేసుకున్నది స్వతంత్రం హాయిగా వూపిరి పీల్చుకున్నాడు

"నాకు సంఘసంస్కారం చాలా ఇష్టం నా చెల్లెలు " అని విన్న వారందరికీ చెప్పాడు వాడు తన చెల్లెల్ని వెలివెయ్యలేదు ఆమెను పెళ్ళాడినవాడు డబ్బున్నవాడు అడపాదడపా స్వతంత్రానికి వడ్డీకి అప్పులిచ్చేవాడు

ఇందిరాగాంధీ ఎమర్జెన్సీ కాలంలో స్వతంత్రం దేశపరిస్థితులను గురించి ఆలోచించటం మాని తన గృహ పరిస్థితులను గురించి ఆలోచించే అవకాశం వచ్చింది తన చెల్లెల్ని కట్నం లేకుండా పెళ్ళాడుతానన్నవాణ్ణి ఇందిరాగాంధీ జైల్లో పెట్టించింది వాణ్ణి నిరాకరించిన తన దూరదృష్టిని స్వతంత్రం ఎంతైనా మెచ్చుకున్నాడు

అతను కాక ఇంకా ఎవరెవరో జైలుకు పోయారుట ఆ వివరాలు తెలుసుకునే అవకాశం వాడికి లేదు పిల్లలకు చదువు సాగటం లేదు బళ్ళలో ప్రవేశపెట్టటమే గగనంగా ఉన్నది వర్ణాంతర బావమరిది ఒక్కొక్క ఎకరమే రాయించుకుని, మళ్ళీ అప్పులిస్తున్నాడు స్వతంత్రం తీసుకుంటున్నాడు లేకపోతే జరగటం లేదే!

ఇప్పుడు స్వతంత్రం ఒక్క విషయం గమనించాడు మంచో, చెడో ఒక్క రాజకీయ పార్టీకి అంటిపెట్టుకున్నవాళ్ళు బాగుపడుతున్నారు ఆ పార్టీవాళ్ళు శాసనసభలోకో, లోక్‌సభలోకో ఎప్పటికైనా రాకపోరు రేసులో ప్రతిసారీ రెండునెంబరు మీద కాసినవాడు ఎప్పుడోప్పుడు డబ్బు కొడతాడు

మరి స్వతంత్రం డబ్బు ఖర్చుచేసి ప్రతి రేసుకూ వెళ్ళి, దేనిమీదా కాయని వాడుగా ఉండిపోతున్నాడు

ఇందిరాగాంధీ శకం ముగియగానే ఏదో పార్టీలో చేరి తీరాలిసిందేనని స్వతంత్రం ఘట్టిగా అనుకున్నాడు జనతాపార్టీ బాగుంది అందులో అమాంబాపతు పార్టీలు చాలా వున్నాయి ఎందులో చేరినా జనతాలో వున్నట్లే

"జనతాపార్టీ గెలుపుచూసి మోసపోకు ఇది ఇందిరాగాంధీ అపజయం! జనతా విజయం కాదు జనతాపార్టీ అంటూ లేదు అందులో చేరిన ఏ రాజకీయ పార్టీ కూడా రద్దుకాలేదు వీళ్ళు తమ గెలుపును పంచుకోవటంలో కొట్టుకుచస్తారు" అని రైలుస్టేషనులో ఎవరో ఇంకెవరితోనో అంటుంటే స్వతంత్రం విన్నాడు

వాడు క్రియకు ఏ పార్టీలోనూ చేరలేదు కాని మానసికంగా తాను జనతాపార్టీ వాణ్ణి అనుకున్నాడు

జనతాపార్టీలో ముసలం పుట్టింది దాని పుట్టుకకు పురుడుపోసినవారిలో ముఖ్య మంత్రసానులను కుర్చీలో నుండి లేపారు కాని అది స్వతంత్రాన్ని బాధించలేదు

కాని జనతాపార్టీయే రెండుగా చీలినప్పుడు స్వతంత్రం నిర్ఘాంతపోయాడు తాను మానసికంగా ఏ పార్టీలో వున్నట్టు? రెండు జనతాపార్టీలూ అధ్యక్షుడికి తమ పార్టీ బలాల జాబితాలు యిచ్చాయి రెండు జాబితాల్లోనూ తన పేరు వున్నట్లు స్వతంత్రం ఊహించుకున్నాడు

అయితే తన పేరు మొరార్జీ జాబితాలో పొరపాటున స్పష్టమయింది! అది చరణ్‌సింగ్ జనతాలోనే ఉన్నది! భయంలేదు తాను జనతా (ఎస్) పార్టీయే

అయితే చరణ్‌సింగ్ స్వతంత్రానికి భయం కలిగించే పనిచేశాడు ఇందిరతో పొత్తు కుదుర్చుకున్నాడు జనతా కేంద్రంలో గద్దె ఎక్కినప్పటినుంచీ తాను మానసికంగా ఇందిరను నానా మాటలూ అన్నట్టు స్వతంత్రానికి గుర్తువచ్చింది

అయినా ఫర్వాలేదు ఇందిర చేత జైల్లో తోయించుకున్న వాళ్ళే ఆవిణ్ణి చంకనెక్కించుకుంటే మధ్య తనకు మొహమాటం దేనికి?

అయితే చరణ్‌సింగ్ చంకనెక్కినట్టు కనబడిన ఇందిర అతన్ని డొక్కలో తన్ని చంక దిగింది రెండో జనతా వాళ్ళు పూలమాలలతో ఇందిర వద్దకు వెళుతున్నారు

అన్ని పార్టీలూ అబద్ధమే- కాంగ్రెసు కూడా! ఇందిర ఒక్కతే సత్యం!

స్వతంత్రం మానసికంగా ఇందిరతో చేరిపోయాడు

ఇంతలో పాత ఎన్నికలు రద్దయి తిరిగి ఎన్నికలు జరుగుతాయంటున్నారు మళ్ళీ అంతా అనుమానంలో పడింది

ఎవరు గెలుస్తారు? ఎవరు గద్దెలెక్కుతారు స్వతంత్రం మానసికంగా యెవరితో చేరాలి?

ఎవరికైనా తెలిస్తే వాడికో కార్డుముక్క రాసి, పుణ్యం కట్టుకోండి వాడి పొలమంతా వర్ణాంతరుడు లాక్కున్నాడు వాడి సొంత చెల్లెలే వర్ణాంతరుడి పక్షమయింది వాడు ఆర్థిక యిబ్బందుల్లో వున్నాడు రాజకీయాలతో డబ్బు గడించటం అన్నిటికన్నా సర్వోత్తమమైన మార్గం రాజకీయ పరిశ్రమ ముందు ఏ పరిశ్రమా నిలవలేదు

స్వతంత్రాన్ని ఆర్థికంగా గట్టెక్కించండి

ఆంధ్రజ్యోతి వారపత్రిక, దీపావళి ప్రత్యేక సంచిక 1979

---

ఈ అయిదు రచనలు కుటుంబరావు సాహిత్యసంపుటాలు (విశాలాంధ్ర ప్రచురణాలయం)లో చోటు చేసుకోలేదు అందుకని ఇక్కడ పొందుపరుస్తున్నాం

\- సంపాదకులు

---

# ఇరవయ్యో శతాబ్దం రాజకీయ చరిత్ర రూపురేఖలు

| | |
|---|---|
| 1900-1915 | మెక్సికోలో విప్లవోద్యమం - జపాటా నాయకత్వాన |
| 1905 | రష్యా, జపాన్ యుద్ధం, రష్యా ఓటమి, తొలి రష్యన్ విప్లవం వైఫల్యం, బెంగాల్ విభజన, వందేమాతరం ఉద్యమం |
| 1907 సెప్టెంబర్ 28 | భగత్‌సింగ్ జననం |
| 1908 | బాలగంగాధర తిలక్ అరెస్టుకి వ్యతిరేకంగా బొంబాయి కార్మికుల జనరల్ సమ్మె |
| 1912 | ఇండియా రాజధాని కలకత్తా నుంచి కొత్త ఢిల్లీకి మార్పు |
| 1913 | అనిబిసెంట్ నాయకత్వాన హోమ్‌రూలు ఉద్యమం |
| 1914 | కోమాగాటామారూ నౌకా తిరుగుబాటు |
| 1914-18 | మొదటి ప్రపంచయుద్ధం |
| 1915, ఫిబ్రవరి 21 | దేశవ్యాప్త విప్లవానికి గదర్ పార్టీ వేసిన పథకం వైఫల్యం |
| 1917 | రష్యా విప్లవం విజయం - పాత కాలెండరు ప్రకారం - అక్టోబరు 25, కొత్త కాలెండరు ప్రకారం - నవంబరు 7 |
| 1919, ఏప్రిల్ 13 | జలియన్‌వాలాబాగ్ హత్యాకాండ |
| 1919, మే 4 | చైనాలో పాత వ్యవస్థ మీద తిరుగుబాటు ఉద్యమం |
| 1919, ఏప్రిల్ 10 | జపాటా హత్య |
| 1919 | వర్సెయిల్స్ ఒప్పందం |
| 1921-22 | మలబారు - మాప్లా తిరుగుబాటు |
| 1920-22 | సహాయ నిరాకరణోద్యమం |
| 1922 | ఇటలీలో ముసోలినీ చేత ఫాసిస్టు ప్రభుత్వ స్థాపన |
| 1922-24 | మన్య విప్లవం  అల్లూరి సీతారామరాజు నాయకత్వం |
| 1924, జనవరి 21 | లెనిన్ మరణం |
| 1924, మే 7 | అల్లూరి సీతారామరాజు కాల్చివేత |
| 1925, ఆగస్టు 9 | కాకోరీ (లక్నో దగ్గర) రైల్వేస్టేషన్ చేరువలో రైలు ఆపి ప్రభుత్వ ఖజానా దోపిడి, కాకోరి కుట్రకేసు బనాయింపు - నలుగురి ఉరితీత |
| 1925 డిశంబర్ | కాన్పూర్‌లో భారత కమ్యూనిస్టు పార్టీ స్థాపన |
| 1928 అక్టోబర్ | సైమన్ కమిషన్ బహిష్కరణ, నిరసన ప్రదర్శనలు |
| 1928 నవంబరు 17 | లాలా లజపతిరాయ్ మరణం |
| 1928 డిసెంబరు 17 | బ్రిటిష్ పోలీసాఫీసరు శాండర్స్ వధ |
| 1929-33 | దిగ్రేట్ డిప్రెషన్ - ఆర్థిక సంక్షోభం |

| | |
|---|---|
| 1956 నవంబరు 4 | హంగరీలో రష్యా సైన్య ప్రవేశం |
| 1956 డిశంబర్ 6 | అంబేద్కర్ మరణం |
| 1957 ఏప్రిల్ 5 | కేరళలో కమ్యూనిస్టు ప్రభుత్వం ఏర్పాటు |
| 1958 జూన్ | ఫ్రాన్స్‌లో రాజకీయ సంక్షోభం - డిగాల్ అధ్యక్షుడు |
| 1959 జనవరి 1 | క్యూబా విప్లవ విజయం |
| 1959 జులై 31 | కేంద్ర ప్రభుత్వం కేరళ కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేయడం |
| 1959 అక్టోబరు | ఇండియా చైనా సరిహద్దు సంఘర్షణ |
| 1961 జనవరి 17 | కాంగోనేత లుముంబా హత్య |
| 1961 ఏప్రిల్ 17 | బే ఆఫ్ పిగ్స్ - క్యూబాలోని కాస్ట్రో ప్రభుత్వాన్ని కూలదోసేందుకు అమెరికా వేసిన పథకం దీని రూపకల్పన (రిపబ్లికన్ పార్టీ) ఐసెన్‌హోవర్ చేస్తే అమలు జరిపింది (డెమోక్రటిక్ పార్టీ) కెనెడీ |
| 1962 అక్టోబరు 2 | ఇండియా చైనా సరిహద్దు యుద్ధం |
| 1963 | రష్యాలో పెట్టుబడిదారి పునరుద్ధరణ |
| 1964 | భారత కమ్యూనిస్టు పార్టీ చీలిక |
| 1964 మే 27 | నెహ్రూ మరణం |
| 1965 అక్టోబరు | ఇండోనేషియాలో 10 లక్షల మంది కమ్యూనిస్టుల ఊచకోత |
| 1965 నవంబరు 6 | గోహత్య నిషేధం కోసం ఢిల్లీ పార్లమెంటు భవనం మీద సాయుధ సాధువుల దాడి |
| 1966-70 | చైనా సాంస్కృతిక విప్లవం |
| 1967 మే 23 | నక్సల్‌బరీ వసంత మేఘగర్జన |
| 1967 అక్టోబరు 6 | చేగువేరా హత్య |
| 1968 జనవరి | సైగాన్ (దక్షిణ వియత్నాం) లోని అమెరికా రాయబార కార్యాలయంపైన ఆత్మాహుతిదళం దాడి, కార్యాలయం విధ్వంసం |
| 1968 మార్చి 22 - మే 30 | ఫ్రాన్స్‌లో రెక్కవిప్పిన రివల్యూషన్ |
| 1968 ఏప్రిల్ 22 | కలకత్తా షహీద్ మినార్‌లో ఎం ఎల్ పార్టీ నిర్మాణం |
| 1968 ఆగస్టు 20 | రష్యాచేత జకోస్లవేకియా ఆక్రమణ |
| 1968 నవంబరు 25 | శ్రీకాకుళ విప్లవాగ్నులు |
| 1970 నవంబరు 4 | చిలీలో అలెండీ అధ్యక్షతన పాపులర్ యూనిటీ ప్రభుత్వ స్థాపన |
| 1971 | సిలన్ (నేటి శ్రీలంక) సాయుధ తిరుగుబాటు బండారు నాయకే ప్రభుత్వం చేత అణచివేత |
| 1971, ఫిబ్రవరి | ఇండో-రష్యన్ ఒడంబడిక |
| 1971 మార్చి 26 | బంగ్లాదేశ్ అవతరణ |



20-9-2001

| | |
|---|---|
| 1972 జులై 28 | చారుమజుందార్ హత్యామరణం |
| 1973 సెప్టెంబరు 11 | అమెరికా మిలటరీ జోక్యంతో అలెండి హత్య, చిలీలో సైనిక పాలన |
| 1975 జూన్ 25 | భారత ప్రధాని ఇందిరాగాంధి ఎమర్జన్సీ విధింపు |
| 1976 జులై 2 | 1957 అమెరికాతో మొదలైన వియత్నాం యుద్ధం ముగిసి, వియత్నాం ఏకీకరణ జరిగింది |
| 1976 సెప్టెంబర్ 9 | మావో మరణం |
| 1977 మార్చి 24 | ఇండియాలో కేంద్రంలో తొలిసారి కాంగ్రెసేతర ప్రభుత్వం (జనతా పార్టీ) స్థాపన |
| 1978 సెప్టెంబరు 9 | సిరిసిల్లా జగిత్యాల జైత్రయాత్ర |
| 1979-80 | రష్యాచే ఆఫ్ఘనిస్థాన్ ఆక్రమణ |
| 1981 ఏప్రిల్ 20 | ఇంద్రవెల్లి (ఆదిలాబాద్ జిల్లా)లో గోండుల మీద పోలీసు కాల్పులు |
| 1984 జూన్ 5 | బ్లూస్టార్ ఆపరేషన్ - అమృతసర్ స్వర్ణదేవాలయం మీద దాడి |
| 1984 అక్టోబరు 31 | ఇందిరాగాంధి హత్య |
| 1986-94 | గాట్ 8వ రౌండ్ సంభాషణలు |
| 1989-90 | తూర్పు యూరపు దేశాల్లో కమ్యూనిస్టు ప్రభుత్వాల పతనం |
| 1989 జూన్ 3 | పెకింగ్ తియన్‌మెన్ స్క్వేర్‌లో తిరుగుబాటు |
| 1989 జూన్ 4 | తిరుగుబాటు దార్ల మీద సైన్యం విచ్చలవిడి కాల్పులు |
| 1990 ఫిబ్రవరి | నెల్సన్ మండేలా (27 ఏళ్ళ నిర్బంధం తర్వాత) విడుదల |
| 1991 జనవరి 16 | గల్ఫ్ యుద్ధం - ఇరాక్ పైన అమెరికా మెరుపుదాడి (కంప్యూటర్ వార్‌ఫేర్) |
| 1991 మే 21 | రాజీవ్‌గాంధి హత్య |
| 1991 | డంకెల్ డ్రాఫ్ట్ |
| 1991 డిసెంబర్ 25 | సోవియట్ యూనియన్ విచ్ఛిన్నం |
| 1992 డిసెంబర్ 6 | బాబ్రీ మసీదు కూల్చివేత |
| 1995 జనవరి | గాట్ ఒప్పందం ఖరారు - WTO అమలులోకి వచ్చింది |
| 1996 మే16-మే28 | వాజ్‌పాయి ప్రధాని - 13 రోజులు |
| 1998 మార్చి19-ఏప్రిల్17 | వాజ్‌పాయి ప్రధాని - 13 నెలల పరిపాలన |
| 1999 అక్టోబరు 13 | వాజ్‌పాయి నాయకత్వాన NDA ప్రభుత్వ స్థాపన |
| 1997 జులై 1 | హాంకాంగ్ చైనాకి అప్పగింత (156 ఏళ్ళ బ్రిటిష్ పాలన తర్వాత) |
| 1999 ఫిబ్రవరి 13 | అమెరికా అధ్యక్షుడు బిల్ క్లింటన్ (మోనీకా లెవిన్‌స్కీ పట్ల అనుచిత ప్రవర్తన గురించి) పైన అభిశంసన ఉపసంహరణ |
| 2000 మార్చి | బిల్‌క్లింటన్ భారతదేశ పర్యటన |
| 2000 మార్చి 24 | బిల్‌క్లింటన్ హైద్రాబాద్ రాక - ''అమ్మకానికి ఆంధ్రప్రదేశ్'' |
| 2001 సెప్టెంబర్ 11 | న్యూయార్క్‌లోని ప్రపంచ వాణిజ్య కేంద్రంపైనా, వాషింగ్టన్‌లోని పెంటగన్‌పైన ఆత్మాహుతి వైమానిక దాడులు, భారీ విధ్వంసం |
| అక్టోబర్ 7, 2001 | ఆఫ్ఘనిస్థాన్‌పై అమెరికా - ఇంగ్లాండ్‌ల యుద్ధం |

| | |
|---|---|
| 1956 నవంబరు 4 | హంగరీలో రష్యా సైన్య ప్రవేశం |
| 1956 డిశంబర్ 6 | అంబేద్కర్ మరణం |
| 1957 ఏప్రిల్ 5 | కేరళలో కమ్యూనిస్టు ప్రభుత్వం ఏర్పాటు |
| 1958 జూన్ | ఫ్రాన్స్‌లో రాజకీయ సంక్షోభం - డిగాల్ అధ్యక్షుడు |
| 1959 జనవరి 1 | క్యూబా విప్లవ విజయం |
| 1959 జులై 31 | కేంద్ర ప్రభుత్వం కేరళ కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేయడం |
| 1959 అక్టోబరు | ఇండియా చైనా సరిహద్దు సంఘర్షణ |
| 1961 జనవరి 17 | కాంగోనేత లుముంబా హత్య |
| 1961 ఏప్రిల్ 17 | బే ఆఫ్ పిగ్స్ - క్యూబాలోని కాస్ట్రో ప్రభుత్వాన్ని కూలదోసేందుకు అమెరికా వేసిన పథకం దీని రూపకల్పన (రిపబ్లికన్ పార్టీ) ఐసెన్‌హోవర్ చేస్తే అమలు జరిపింది (డెమోక్రటిక్ పార్టీ) కెనెడీ |
| 1962 అక్టోబరు 2 | ఇండియా చైనా సరిహద్దు యుద్ధం |
| 1963 | రష్యాలో పెట్టుబడిదారి పునరుద్ధరణ |
| 1964 | భారత కమ్యూనిస్టు పార్టీ చీలిక |
| 1964 మే 27 | నెహ్రూ మరణం |
| 1965 అక్టోబరు | ఇండోనేషియాలో 10 లక్షల మంది కమ్యూనిస్టుల ఊచకోత |
| 1965 నవంబరు 6 | గోహత్య నిషేధం కోసం ఢిల్లీ పార్లమెంటు భవనం మీద సాయుధ సాధువుల దాడి |
| 1966-70 | చైనా సాంస్కృతిక విప్లవం |
| 1967 మే 23 | నక్సల్‌బరీ వసంత మేఘగర్జన |
| 1967 అక్టోబరు 6 | చేగువేరా హత్య |
| 1968 జనవరి | సైగాన్ (దక్షిణ వియత్నాం) లోని అమెరికా రాయబార కార్యాలయంపైన ఆత్మాహుతిదళం దాడి, కార్యాలయం విధ్వంసం |
| 1968 మార్చి 22 - మే 30 | ఫ్రాన్స్‌లో రెక్కవిప్పిన రివల్యూషన్ |
| 1968 ఏప్రిల్ 22 | కలకత్తా షహీద్ మినార్‌లో ఎం ఎల్ పార్టీ నిర్మాణం |
| 1968 ఆగస్టు 20 | రష్యాచేత జకోస్లవేకియా ఆక్రమణ |
| 1968 నవంబరు 25 | శ్రీకాకుళ విప్లవాగ్నులు |
| 1970 నవంబరు 4 | చిలీలో అలెండీ అధ్యక్షతన పాపులర్ యూనిటీ ప్రభుత్వ స్థాపన |
| 1971 | సిలన్ (నేటి శ్రీలంక) సాయుధ తిరుగుబాటు బండారు నాయకే ప్రభుత్వం చేత అణచివేత |
| 1971, ఫిబ్రవరి | ఇండో-రష్యన్ ఒడంబడిక |
| 1971 మార్చి 26 | బంగ్లాదేశ్ అవతరణ |



20-9-2001

| | |
|---|---|
| 1972 జులై 28 | చారుమజుందార్ హత్యామరణం |
| 1973 సెప్టెంబరు 11 | అమెరికా మిలటరీ జోక్యంతో అలెండి హత్య, చిలీలో సైనిక పాలన |
| 1975 జూన్ 25 | భారత ప్రధాని ఇందిరాగాంధి ఎమర్జన్సీ విధింపు |
| 1976 జులై 2 | 1957 అమెరికాతో మొదలైన వియత్నాం యుద్ధం ముగిసి, వియత్నాం ఏకీకరణ జరిగింది |
| 1976 సెప్టెంబర్ 9 | మావో మరణం |
| 1977 మార్చి 24 | ఇండియాలో కేంద్రంలో తొలిసారి కాంగ్రెసేతర ప్రభుత్వం (జనతా పార్టీ) స్థాపన |
| 1978 సెప్టెంబరు 9 | సిరిసిల్లా జగిత్యాల జైత్రయాత్ర |
| 1979-80 | రష్యాచే ఆఫ్ఘనిస్థాన్ ఆక్రమణ |
| 1981 ఏప్రిల్ 20 | ఇంద్రవెల్లి (ఆదిలాబాద్ జిల్లా)లో గోండుల మీద పోలీసు కాల్పులు |
| 1984 జూన్ 5 | బ్లూస్టార్ ఆపరేషన్ - అమృతసర్ స్వర్ణదేవాలయం మీద దాడి |
| 1984 అక్టోబరు 31 | ఇందిరాగాంధి హత్య |
| 1986-94 | గాట్ 8వ రౌండ్ సంభాషణలు |
| 1989-90 | తూర్పు యూరపు దేశాల్లో కమ్యూనిస్టు ప్రభుత్వాల పతనం |
| 1989 జూన్ 3 | పెకింగ్ తియన్‌మెన్ స్క్వేర్‌లో తిరుగుబాటు |
| 1989 జూన్ 4 | తిరుగుబాటు దార్ల మీద సైన్యం విచ్చలవిడి కాల్పులు |
| 1990 ఫిబ్రవరి | నెల్సన్ మండేలా (27 ఏళ్ళ నిర్బంధం తర్వాత) విడుదల |
| 1991 జనవరి 16 | గల్ఫ్ యుద్ధం - ఇరాక్ పైన అమెరికా మెరుపుదాడి (కంప్యూటర్ వార్‌ఫేర్) |
| 1991 మే 21 | రాజీవ్‌గాంధి హత్య |
| 1991 | డంకెల్ డ్రాఫ్ట్ |
| 1991 డిసెంబర్ 25 | సోవియట్ యూనియన్ విచ్ఛిన్నం |
| 1992 డిసెంబర్ 6 | బాబ్రీ మసీదు కూల్చివేత |
| 1995 జనవరి | గాట్ ఒప్పందం ఖరారు - WTO అమలులోకి వచ్చింది |
| 1996 మే16-మే28 | వాజ్‌పాయి ప్రధాని - 13 రోజులు |
| 1998 మార్చి19-ఏప్రిల్17 | వాజ్‌పాయి ప్రధాని - 13 నెలల పరిపాలన |
| 1999 అక్టోబరు 13 | వాజ్‌పాయి నాయకత్వాన NDA ప్రభుత్వ స్థాపన |
| 1997 జులై 1 | హాంకాంగ్ చైనాకి అప్పగింత (156 ఏళ్ళ బ్రిటిష్ పాలన తర్వాత) |
| 1999 ఫిబ్రవరి 13 | అమెరికా అధ్యక్షుడు బిల్ క్లింటన్ (మోనీకా లెవిన్‌స్కీ పట్ల అనుచిత ప్రవర్తన గురించి) పైన అభిశంసన ఉపసంహరణ |
| 2000 మార్చి | బిల్‌క్లింటన్ భారతదేశ పర్యటన |
| 2000 మార్చి 24 | బిల్‌క్లింటన్ హైద్రాబాద్ రాక - "అమ్మకానికి ఆంధ్రప్రదేశ్" |
| 2001 సెప్టెంబర్ 11 | న్యూయార్క్‌లోని ప్రపంచ వాణిజ్య కేంద్రంపైనా, వాషింగ్టన్‌లోని పెంటగన్‌పైన ఆత్మాహుతి వైమానిక దాడులు, భారీ విధ్వంసం |
| అక్టోబర్ 7, 2001 | ఆఫ్ఘనిస్థాన్‌పై అమెరికా - ఇంగ్లాండ్‌ల యుద్ధం |